వ్యాస ప్రపంచం - 4

# సినిమా వ్యాసాలు

ఒకటవ సంపుటం


రచన

కొడవటిగంటి కుటుంబరావు

కూర్పు

కృష్ణాబాయి, ప్రసాద్


విప్లవ రచయితల సంఘం

ఆంధ్రప్రదేశ్

# కృతజ్ఞతలు

సారస్వతనికేతనం, వేటపాలెం ,
గౌతమి గ్రంధాలయం, రాజమండ్రి ,
భ్రమరాంబ గ్రంధాలయం, విజయవాడ ,
ఆంధ్ర మహిళాసభ, మద్రాసు

'విశాలాంధ్ర' సంపాదకవర్గం, 'ప్రజాశక్తి', ' ఆంధ్రపత్రిక', 'తెలుగు విద్యార్థి'
'సృజన', 'అరుణతార', 'ప్రజాసాహితి'

పురాణం సుబ్రహ్మణ్యశర్మ (ఆంధ్రజ్యోతి)
నండూరి రామమోహనరావు (ఆంధ్రజ్యోతి)
లీలావతి రాఘువయ్య (జ్యోతి)
ఆలూరి సుధాకర్,ఆలూరి రంగారావు (యువ)

కె వి ఆర్ , వి సుబ్రహ్మణ్యం-కావలి, వెలగా వెంకటప్పయ్య, డాక్టర్ పి దక్షిణామూర్తి-తెనాలి,
లంకా సుర్యనారాయణ -గుంటూరు, సజ్జా వెంకటేశ్వర్లు -వేటపాలెం,
సన్నిధానం నరసింహశర్మ -రాజమండ్రి, దాసరి సుబ్రహ్మణ్యం -మద్రాసు,
కాత్యాయనీ విద్మహే-వరంగల్లు, సుంకర కనకారావు -విజయవాడ,
కాకరాల -మద్రాసు, చలసాని ప్రసాదరావు, కేతు విశ్వనాధరెడ్డి, ఎన్ వేణుగోపాల్,
శివలక్ష్మి, వసంతలక్ష్మి, బి జగన్, వాసిరెడ్డి వేణుగోపాల్ - హైదరాబాద్,
ఆంధ్ర శేషగిరిరావు, స్థానాపతి రుక్మిణమ్మ, మసూనా, అత్తలూరి నరసింహరావు,
అత్తిలి కృష్ణారావు, టి వేణుగోపాలరావు -విశాఖపట్నం, కొత్తపల్లి రవిబాబు -నగరం
కొడవటిగంటి వరూధిని గారి సహకారం, ప్రోత్సాహం మాకెంతో
ఉత్తేజాన్నిస్తున్నాయి

విరసం

# సినిమా తీరుతెన్నులు

'ఉన్నపళాన సినిమా హాళ్ళన్నీ మూసేస్తే దేశంలో విప్లవం వస్తుంది' అని రాశాడు వి పి సాధే ఈయన పేరుపొందిన ఫిలిమ్ జర్నలిస్టు 'బాబీ' సినిమా బాగా ఆడుతున్న (1973) రోజులవి దీనిని తలదన్నింది 'షోలే' (1975) ఇదిమొత్తం 1000 ప్రింట్లు తీశారు ఏకంగా 90 కేంద్రాల్లో ఇండియాలో 25 వారాల పాటు ఆడింది ఇండియాలో పొద్దుటినించీ , పొద్దుపోయేదాకా లక్షలమంది సినిమాలు చూస్తుంటారు వానలో తడవనివారయినా ఉన్నారేమోగాని సినిమాలు చూడని వారు లేరు ''సినిమాలు భోజనం లాంటివి అప్పుడప్పుడు మంచి భోజనం దొరుకుతుంది కాని రోజూ భోజనం చేయవలసిందే'' అన్నాడు రోజర్‌మాన్‌వెల్ అనే సినీ విమర్శకుడు

అలాగే సినిమాల అంటు, సొంటు సోకని రచయితలు అరుదు కొడవటిగంటి కుటుంబరావు గారు సినిమా జీవి కాకపోయినా ఆయన సినిమా కళాభిమాని అంతేకాదు తారుమారు(1941) సినిమా కథ, కథనం, మాటలు ఆయనవే ఆ చిత్రంలో ఆయన ఆఫీసు మేనేజర్‌గా నటించారు కూడా నవయుగ ప్రొడక్షన్స్ వారి జ్యోతి (1954) సినిమాకి ఆయన మాటలు రాశారు ఇందులో కథానాయిక జి వరలక్ష్మి

అంతకు ముందే ఆయన ప్రసిద్ధ రచయితా, వ్యాసకర్త కూడా ఆమాటకొస్తే ఆయన రాసిన తొలి వ్యాసం పేరు 'సినిమా' ఇది ఇంగ్లీషులో వుంది ఓరియంటల్ వీక్లీ ( కలకత్తా, 1934) లో అచ్చయింది ఎంత వెదికినా అది దొరకలేదు ఆనాటినుంచీ, కన్ను మూసే వరకూ వ్యాసంగం సాగిస్తూనే వున్నారాయన విచిత్రం ఏమిటంటే అన్నింటికన్నా ఆయన సినిమా వ్యాసాలే ఎక్కువ రాశారు అందువలన వీటిని రెండు భాగాల కింద విడగొట్టవలసివచ్చింది

బెజవాడలోని మారుతి టాకీస్(23-10-1921) తెలుగునాట మొదటి సినిమాహాలు ఆ తరువాత పదేళ్లకి తొలి తెలుగు టాకీ భక్త ప్రహ్లాద(1931) విడుదలయింది ఏభైయ్యేళ్ళ (1980) కి సినిమా హాళ్లు 1900కి పెరిగాయి సినిమాలు రెండువేల వరకు వచ్చివుంటాయని ఒక అంచనా

సినిమా కళ ఎలా రూపొందిందో చూద్దాం స్టేజి నాటకాలొచ్చి వీధినాటకాలని కొట్టేసి నట్టుగా, తోలుబొమ్మలాటలని సినిమాలు కొట్టేశాయి తోలుబొమ్మలాట నూటికి అయిదు పాళ్ళు వాస్తవికతని కూడా సాధించలేదు అదే నాటకం అయితే నూటికి పదిపాళ్ళు సాధించగలదు సినిమా సరేసరి నూటికి నూరుపాళ్ళూ సాధించగలదు హరిశ్చంద్ర సినిమా (1935) లో లోహితాస్యుడిని కాటేయడానికి పాము పాకుతుంటే, నేలక్లాసు మనిషి కర్ర తీసుకుని తెరదగ్గరకి పరుగెత్తాట్ట జరిగింది జరిగినట్టు చూపించడం ద్వారా ఒప్పించి, మెప్పించగల శక్తి సినిమాలకే వుంది ఇందుకు బాగా తోడ్పడ్డవి యంత్రాలు, తదితర ఆధునిక వనరులూ పైగా లలిత కళలన్నింటి సమ్మేళనం సినిమా నదులన్నీ సముద్రంలో కలసినట్టుగా లలితకళలన్నీ సినిమాల్లో లీనం అవుతాయి సాహిత్యం సరేసరి- సినిమాలో చాలా చోటే

ఆక్రమించింది

ఇలాటి సినిమా కళారూపం తొలి అయిదేళ్ళపాటు (1931-36) పౌరాణిక చిత్రాలతోనే సరిపెట్టుకుంది ఇంచుమించు 16 పౌరాణిక నాటకాలని ఏకంగా వెండితెరకు ఎక్కించేసింది తెలుగులో తొలి సాంఘిక చిత్రం 'ప్రేమ విజయం'(1936), మాలపిల్ల (1938), రైతుబిడ్డ (1939) విజయవంతమైన తరువాత ధైర్యంగా కొన్ని మంచి సాంఘిక చిత్రాలు తీశారు అవిబాగా ఆదరణ కూడా పొందాయి సాంఘిక చిత్రాల వెల్లువని అరికట్టడానికి మీర్జాపురం రాజావారు పూనుకున్నారు ఫ్యూడల్ విలువలని సంరక్షించడానికి పౌరాణిక , జానపద చిత్రనిర్మాణానికి కంకణం కట్టుకున్నారు 'గృహలక్ష్మి'(1938) పాతకాలపు పాతివ్రత్య ధర్మాలను కొత్త గొంతుకతో బోధించింది ఆరుద్ర అన్నట్టు ''తెలుగు సినిమాలలో ఆడది గడప దాటడానికి నలభై సంవత్సరాలు పట్టింది 'మాంగల్యబలం (1959) నించి ఇంకో మాంగల్యబలం (1987) దాకా తాళిబొట్టు ఉక్కుసంకెలే 'మనసు-మాంగల్యం'(1971) మాత్రం దీనికి భిన్నమైన దారి తొక్కింది అందాకా ఎందుకు? 'చెలికుంకుమమే, పావనమే, నయనమనోమోహనమే' అని 1940 నాటి 'మళ్ళీపెళ్ళి', 'సుమంగళి' సినిమాలు పాడితే, 'ముత్యమంతా పసుపు ముఖమంత ఛాయ, ముత్తైదు కుంకుమా బతుకంత ఛాయ' అని ముత్యాల ముగ్గు (1975) వంత పాడడం పెద్దవింత మంచి చిత్రాలన్నవి విలువలని కాకపోయినా కనీసం ధోరణులను మార్చగలుగుతాయి రాజారావుగారి 'పుట్టిల్లు' సినిమా (1953) ఒక మచ్చు తునక కేవలం వ్యాపార ప్రయోజనాల కోసం తయారయ్యే సరుకును మేధావి వర్గాలు సరకు చెయ్యవు ద్రోహి (48), లైలామజ్ను(49), మానవ విలువలున్న చిత్రాలు బాలరాజు(48), కీలుగుర్రం (50) విజయంతో ఫామిలీ డ్రామా ఎజెండా మీదకు వచ్చి నడిమి తరగతిని ఆకట్టుకుంది

అధికార మార్పిడి (ఆగస్టు 15) తరువాత తొలి అయిదేళ్ళల్లో కొన్ని మార్పులు చకచకా జరిగిపోయాయి తెలంగాణా సాయుధపోరాట విరమణ, ప్రజానాట్యమండలి కళాకారుల సినిమా వలస, తొలి జనరల్ ఎన్నికలు వీటన్నింటినీ మించి అంతర్జాతీయ చలన చిత్ర ఉత్స వాలు మద్రాసుతో సహా పెద్ద నగరాల్లో జరిగాయి సినిమా జీవులు చాలామంది అప్పుడే బైసికిల్ తీవ్సు, రాషోమన్, యుకివారస్ లాంటి సినిమాలు చూడగలిగారు ఆమాటకొస్తే సత్యజిత్‌రే లండన్(1950 ఏప్రిల్)లోనే 'బైసికిల్ తీవ్సు' చూశానన్నాడు 'పథేర్‌పాంచాలి' అప్పుడే అతని మనసులో మొగ్గతొడిగింది అది విడుదలయింది మాత్రం1955లో హిందీలో 'దోభిగా జమీన్'(1953), తెలుగులో 'నిరుపేదలు'(1954) దానికన్నముందువే 'రోజులు మారాయి'(1955) సినిమాని 'రైతుబిడ్డ'(1939)కి కొనసాగింపు అని చెప్పవచ్చు ఒక దశాబ్దం పాటు(1955-65) తెలుగులో మంచి సాంఘిక చిత్రాలు విడుదలయ్యాయి గొప్ప ఇతివృత్తాలు కాకపోయినా మధ్యతరగతి మందహాసాలకి సంబంధించినవి, సాహిత్య, సాంస్కృతిక, కళావిలువలతో నిండి వున్నవి

తెలుగు సినిమాలోకి క్రమంగా కొత్త రూపాయి (65-70)పాకి, గట్టి పునాది (70-80) నేర్పరుచుకుంది డెబ్బై ల్లో 'యమగోల'తో కొత్తమార్గాన పడిన 'అడవిరాముడు'

రాజ మార్గం పట్టి ఏకంగా ఎనభై ల్లో రాజయ్యాడు ఆనాటి నుంచి తెలుగు సినిమాలు సెక్సు, వయిలెన్సు, క్రైమ్, హారర్‌లతో నిండిపోయాయి సినిమాల్లో తెలుగుతనం పూర్తిగా పోయింది సినిమా ఒక భారీ వ్యాపారం మాత్రమే సమాజంలో పెల్లుబుకుతున్న సంఘర్షణలకి కృత్రిమ పరిష్కారాలు చూపెట్టి, ప్రత్యామ్నాయ సినిమాని ఎదగనివ్వలేదు ఇవన్నీ '80 లనాటి మాట అటు తరువాత టి వి ఉప్పెనలా ముంచెత్తింది అయితే అది వేరే కథ

గురజాడ కన్యాశుల్కం నాటకం రాద్దామని సంకల్పించింది 1880 తరువాత ఆనాటి స్టేజి నాటకాల స్థితిగతులని ఆయన రెండో ముద్రణ ముందు మాట (1909) లో వర్ణించాడు – 'కళ్ళు జిగేల్‌మనిపించే దుస్తులు, కైపెక్కించే డాన్సులు, చవకబారు సంగీతం, బూటకపు ఫైటింగులు' ఈనాటి మన సినిమాలలో ఈ అవలక్షణాలు లేవని అనగలమా ? ఈ రెండు దశాబ్దాలు సినిమాకి క్షీణ దశ ఒకప్పుడు సత్యజిత్‌రే అన్నట్టు ఊరూరా ఫిలిమ్ సొసైటీలు స్థాపించాలి ప్రజలని చైతన్యపరచాలి

ఈ శతాబ్దం రెండో దశకంనించే మూకీలు మొదలయ్యాయి మూడో దశకంలో వాటికి మాటలొచ్చాయి వీధివెంట వెళుతుంటే మనల్ని రెక్కపట్టి నిలబెట్టేవి ఇప్పుడు అవి టి వి లద్వారా గృహ ప్రవేశం చేశాయి ఇవాళ ప్రతి ఇల్లు ఒక టూరింగు సినిమా టాకీసు ఈ పరిస్థితి ఇలా కొనసాగవలసిందేనా ? తెల్లవాడి ఏలుబడిలోనే మనకి రేడియో వచ్చింది కాని దాని మీద వ్యక్తి యాజమాన్యం లేదు మరి స్వదేశీ పాలన నామమాత్రంగానయినా సాగుతోంది కదా ! ప్రైవేటు టి వి ఛానళ్ళని ఎందుకు అనుమతించినట్టు ? సామాజిక వ్యవస్థపట్ల ఏ ప్రభుత్వానికయినా ఎంతో కొంత బాధ్యత వుండాలి ప్రజల అదుపులో మనుగడ సాగించడడం ఏ ప్రభుత్వానికయినా తప్పనిసరి ఈ మార్పుల కోసం మనమందరం ఉమ్మడిగా ఉద్యమించవలసి వుంది

కృష్ణాబాయి, ప్రసాద్
15 జూన్, 2000

# వెండి తెర

## I- వెలుగు- నీడ

## II– చార్లీచాప్లిన్

## III- సమీక్షలు

# 1. టాకీకళ

టాల్ స్టాయ్ మహాశయుడు ''What's Art?'' అనే తన ఉద్గ్రంథంలో కళను నిర్వ చించుతూ, నిజమైన కళ అంటువ్యాధిలా పనిచెయాలన్నాడు ఆయన చేసిన నిర్వచనం కొద్దిమార్పుతో టాకీకళకు వర్తించుతుంది టాకీకళ యొక్క ఉత్తమ ఆశయం ప్రేక్షకులను నమ్మించడమే ప్రేక్షకుడు తాను చూస్తున్నది యదార్థం కాదేమోనని సంశయించదగిన స్థితిలో ఉండరాదు కాని యదార్థం ఇంతకన్న భిన్నంగా ఎట్లా ఉంటుంది? అని ప్రేక్షకుడికి అనిపించితేగాని కళ పాకానికి వచ్చినట్టు కాదు

మనం తెరమీద కొన్ని పాత్రలనూ కొన్ని సంఘటనలనూ చూస్తాం అందులో ఒక పాత్ర మాదిరిగా మరొకటి ఉండదు టాకీ కళకూడా అంటువ్యాధిలాగా పని చెయ్యాలంటే మనం చూస్తూన్న పాత్రలలో ప్రతిపాత్రా ఏడిచినప్పుడల్లా మనం ఏడిచి, నవ్వినప్పుడల్లా మనం నవ్వాలనుకోవలిసి వస్తుంది ఇక ప్రేక్షకుల వ్యక్తిత్వాలలో తారతమ్యాలు కూడా ఆలోచించితే టాకీకళ కేవలమూ అసంభవం అవుతుంది ప్రత్యేకంగా ప్రతి ప్రేక్షకుడిలోనూ ఆయా పాత్రలతాలూకు అసలు వ్యక్తులు ఏయే సంఘటనలలో ఎటువంటి వికారాలు పుట్టించగలిగి ఉండేవారో ఆపాత్రలు కూడ అటువంటి వికారాలు పుట్టించగలిగితే – అనగా టాకీ ప్రేక్షకులందరినీ నమ్మించగలిగితే (Convince) చాలు

ఒకరిని నమ్మించగల టాకీ మరొకరిని నమ్మించలేకపోవటానికి తగిన కారణం కనిపించదు అయితే అందరినీ నమ్మించగల టాకీ తీయటం సంభవమా? ఒక టాకీలో కళ సంపూర్ణంగా ఉన్నదీ లేనిదీ ఎవరి మటుకు వారు తేల్చుకోవచ్చునా? ఒకరు ఉద్రేకంతో చూసివచ్చిన టాకీని మరొకడు నిరసించడంలేదా? అభిరుచి భేదాలు లేవా?

అందరూ చూచి ఆనందించగల టాకీ తీయడం సంభవం కాదేమోగాని అందరినీ నమ్మిచంగల టాకీ తీయటం ఎంతమాత్రమూ అసంభవం కాదు అభిరుచులలో భేదాలు, ప్రకృతి సిద్ధంగా వచ్చినవి వాటిని ఏమి చెయ్యటానికీ లేదు కాని కళ వ్యక్తుల అర్థంలేని అభిరుచులకు అతీతమైనది

'' ఒక ప్రదర్శనలో కళ ఉన్నదీ లేనిదీ ఎవరికి వారే గ్రహించగలరు వారికి విమర్శకుడి అవసరం లేదు'' అన్న టాల్‌స్టాయ్ సూత్రం టాకీకళకు వర్తించదు ఎందుచేతనంటే, అనేక మంది ఏదిచూపించినా నమ్ముతారు నీలిరంగు శరీరం నిండా పూసుకుని, పచ్చనిబట్టకట్టుకుని, జుట్టులో రెండు నెమలి ఈకలు గుచ్చుకుని, చేతిలో వేణువు పట్టుకున్న ప్రతి కోతి మొహమూ కృష్ణుడే వారి దృష్టిలో మధ్య కథానాయకుడూ అతనికి అయిదు గజాల దూరంలో వలయంగా అతని విరోధులూ నిలబడి చేతులు పడిపోయేటట్టు కత్తులు తిప్పుతుంటే, అది భయంకరమైన యుద్ధమని విశ్వసించి సంతోషంతో చప్పట్లు కొట్టే ప్రేక్షకవర్గాలను మనం ఇప్పటికీ చూస్తూనే ఉన్నాం వారి అభిరుచి బహు దీనస్థితిలో ఉంది వారు చిన్నపిల్లలతో సమానం వారిని బహుసులభంగా వంచించవచ్చును

ఒకటాకీలో కళ పరిపూర్ణంగా ఉన్నదీ లేనిదీ చెప్పగలవాడు ఆకథలో వచ్చె పాత్రల

గురించీ సంఘటనలను గురించీ పరిపూర్ణంగా తెలిసినవాడై వుండాలి వాడే విమర్శకుడు వాడి మాటే చెల్లుబడి కావాలి ఒక్కొక్కసారి లోకం యావత్తూ మెచ్చుకున్న చిత్రాన్ని ఒకరిద్దరి అభిప్రాయం మీద తీసివెయ్యవలసి వస్తుంది

అజంతా చిత్రాల రోజులలో కన్వెన్షనే కళగా ఉండేదిట అట్లా ఉన్నా అంత చిక్కులేదమో కాని, ఒక చెంప నమ్మించాలని కొంత ప్రయత్నంచేస్తూ మరొక చెంపనించి కన్వెన్షన్ కూడా వినియోగిస్తుంటే సంగీతపు దుఃఖరసంలోకి ఎక్కిళ్ళు ఎక్కించినట్టుంటుంది ఏడవదలచిన మనిషి సహజంగా ఏడవక సప్తస్వరాలలో దుఃఖాన్ని ప్రకటించబూనుకున్న తరవాత మళ్ళీ ఎక్కిళ్ళేమిటి?

మనదేశపు చిత్రాలు కళా దృష్టిలో ఎంత అధోగతిలో ఉన్నవో ఆలోచించుదాం మన కథల నిండా రాజులూ, రాణులూ, దేవతలూ, స్వర్గాలూ, వైకుంఠాలూ, యుద్ధాలూ, యజ్ఞాలూ ఈ చిత్రాలలో నటించేవాళ్ళకు గాని, ఆ చిత్రాలు తీసేవాళ్ళకు గాని వాటిని గురించి ఏమీ తెలియదు అయితే అదృష్టవశాత్తూ చూసేవారికి అంతకన్నా తక్కువ తెలిసి ఉండడం వల్ల పని గడిచిపోతున్నది అసలు రాజులూ, రాణులూ, వైకుంఠాలూ ఎవరికీ తెలియవు కనుక వీటికి కృత్రిమ స్వరూపాలు కల్పించవలసి వచ్చింది అదే కన్వెన్షన్

ఎక్కడైనా ఒకడు రాజులతోనూ రాణులతోనూ పరిచయం ఉన్నవాడు మనం తీసిన చిత్రం నమ్మకపోగా నవ్వుతాడు అతని ఒక్కడి అభిప్రాయమూ పాటించి మన చిత్రంలో కళలేకపోయిందని ఆమోదించవలసి వస్తుంది ఎవరూ చూసి ఉండని విష్ణువూ, వైకుంఠమూ మొదలైనవాటి సంగతి ఏమిటని అడగవచ్చును మనం ఊహించలేనిదాన్ని స్పష్టంగా చూపించటంకన్న బుద్ధి తక్కువ లేదు వైకుంఠం ఎట్లా ఉంటుందంటే నేను చెప్పలేకపోవచ్చును కాని నాకు వైకుంఠమని పేరు పెట్టి ఎంత మంచి దృశ్యం చూపించి కూడా నన్ను నమ్మించలేరు నాకు చూపించిన వైకుంఠంకంటె ఒక్క పిసరు మంచి వైకుంఠం నేను తప్పక ఊహించగలను

ఈ క్రింది నేను చెప్పబోయే విషయాలు ఒకరిద్దరు టాకీ నిర్మాతలు చదివి అర్థం చేసుకున్నా నా శ్రమ సఫలమవుతుంది ఈ పాట్లన్నీ పడటానికి మనవారికి సాధ్యం అవుతుందనికాని, అందుకు సహాయభూతంగా కావలసిన తెలివితేటలు మనదేశంలో విరివిగా వున్నవని కాని నేను ఒక్కనాటికి అనుకోవడంలేదు ఉన్న తెలివితేటలనైనా సరిగా వినియోగించగలగటం లేదనే తప్ప ఈ టాకీ నిర్మాతలను నేను తప్పుపట్టలేను

''నేను ప్రొడ్యూసరును'' అని నడుము కట్టుకున్నవాడికి కనీసం తెలిసి ఉండవలసిందేమిటంటే, మంచి కథలు ఇవ్వగలవారి పేర్లు నాలుగూ, సీనారియో రాయగలవారి పేర్లు కనీసం రెండు మూడు, డైరెక్టు చెయ్యగలవారి పేర్లు ఒక అరడజనూ, ఇవన్నీ ప్రతి పత్రికలోనూ ప్రకటించబడుతున్నవని నేను చెప్పను వాటికోసం కూడా వెతకవలసిందే ఎంతో శ్రమ పడకుండా వీరు కూడా దొరకరు కాని అది పడదగిన శ్రమ ప్రతి

నిముషమూ కొత్త మనుష్యులు సృష్టి అవుతున్నారు ఎవరూ ఎల్లకాలమూ ఉండరు ఆయా పనులు చెయ్యటానికి ఎవరెవరు అర్హత సంపాదించుకున్నారో కనుక్కోవలసిన బాధ్యత తప్పకుండా ప్రతి ప్రొడ్యూసరు మీదా ఉన్నది

మొట్టమొదట కథ వివరంగా రాసుకోవాలి కొంత శ్రమ తీసుకొని ఆ కథలో అవసరమైన

మార్పులు చేయించి, ఈ సంఘటనలన్నీ చిత్రంలోకి ఎక్కిస్తే చిత్రం ఆకర్షవంతంగా ఉంటుందని తేల్చుకున్న తరవాత కథకుడితో పని అయిపోతుంది కథకులు కూడా చాలా రకాలుగా ఉంటారు ఘటనలతో కూడుకున్న కథలు రాసే వాళ్ళే సినాప్సిస్ రాయటానికి పనికివస్తారు సినాప్సిస్ రాయటానికి ఇద్దరు ముగ్గురు కథకులను వినియోగించటం మంచిదని నా అభిప్రాయం వారు రాసిన కథలు కలిపి ఒక మంచికథ తయారు చెయ్యటానికి అవకాశం ఉంటుంది

అట్లా తయారయిన కథను షూటింగుకు వీలుగా ఉండేటట్లు సినారియోగా తయారు చెయ్యాలి దీనికి ఫిలిం టెక్నిక్ తెలిసినవాడూ, అనుభవం ఉన్నవాడూ తప్ప పనికిరాడని వేరే చెప్పనక్కరలేదు సినారియో రాసేటప్పుడు గమనించవలసి విషయాలు చాలా ఉన్నాయి కథ ప్రేక్షకులకు అర్థమయ్యేటట్టు వెలితిలేకుండా నడవాలి ప్రేక్షకులకు విసుగుపుట్టకుండా ఎటువంటి సీను తరువాత ఎటువంటి సీను వస్తే బాగుంటుందో అతనికి తెలిసి ఉండాలి జనసామాన్యానికి ఎటువంటి ఘటనలు ఇష్టమో అందరికీ తెలుసు ' కాని ఏ సీను ఎంత పొడు గుంటే కళకు హాని కలగకుండా ఉంటుందో తెలిసినవాడే చెప్పాలి ఆయా పాత్రలు ఎక్కడ ఎట్లా ప్రవర్తించితే కథకుడు సూచించిన పాత్రపోషణ జరుగుతుందో అదికూడా సినారిస్టు నిర్ణయించాలి కథలో ఉన్న వివిధ రంగాలకు లోకల్ కలర్ లేక వాతావరణం కల్పించటానికి సినారిస్టు పాటుపడాలి సినారిస్టుకు డైరెక్టరూ, ఎడిటరూ తోడ్పడి తాము ఏచిత్రాన్ని తియ్య టానికి ఆశిస్తున్నారో దాన్ని అక్షర రూపంగా కాగితంమీద పెట్టిన తరవాత ఆ సినారియోతో షూటింగు ప్రారంభించవచ్చును

అట్లా తయారయిన సినేరియోకు అవసరమైన సంభాణలు తగిలించిన తరువాత డైరెక్టరు తన స్వంత ఉపయోగం కోసం కొన్ని సూచనలు రాసుకుంటాడు సినేరియోలో సూచించబడిన ఫలితాలు రావటానికి కామెరామాన్ కాని నటుడు కాని విశేషించి ఏమైనా చెయ్యవలసి ఉన్నప్పుడూ, ప్రేక్షకుడి మనస్తత్వానికి అనుకూలంగా ఎడిట్ చెయ్యటానికిగాను విశేషించి కొన్ని సైలెంట్ షాట్స్ తియ్యవలసి ఉన్నప్పుడూ ఏమేమి చెయ్యవలసి ఉంటుందో డైరెక్టరు బాగా యోచించి నోట్సు రాసుకోవాలి

ఇంత యాతన దేనికి? ప్రేక్షకులను నమ్మించటానికి! వట్టి కథ చెప్పటానికైతే ఈ సెట్టింగులూ అక్కర్లేదు, ఇంత శ్రమా అక్కర్లేదు వట్టి సంభాషణతో తెరలతో నాటకం మాదిరిగా టాకీ తీసి పారెయ్యవచ్చును అట్లా తీస్తే కళ లోపిస్తుందనీ, ప్రేక్షకులను నమ్మించలేమని మన టాకీ ప్రొడ్యూసర్లు ఎరుగుదురు కాని ఆ ప్రయత్నం సగంలో విడిచిపెట్టడం ఎందుకు? సొంతంగా ఎందుకు చెయ్యరాదు? ఇది ఎక్కువ భాగం బుర్ర వినియోగించవలసిందే కాని డబ్బుతో గూడినపని కూడా కాదు ఏమేమి చెయ్యాలో తెలియకనే మనవాళ్ళు స్వల్ప విషయాల్లో కూడా వెలితి చేస్తున్నారని నా నమ్మకం

సినేరియో పూర్తి అయిన తరువాత పాత్ర నిర్ణయం దానికి కూడా ఒకటే సూత్రం ''ఈ పాత్ర ఈ నటుడికిస్తే ప్రేక్షకులు విశ్వసించేటట్టు ఉంటుందా?'' ఎంతో శ్రద్ధతో, తెలివితేటలతో చెయ్యవలసిన ఈ పని ఎంత అశ్రద్ధగానూ అజాగ్రత్తగానూ చేస్తున్నారో మనం చూస్తూనే ఉన్నాం '' ఈ మనిషిచేత ఈ వేషం వేయిస్తే డబ్బువస్తుంది'' అనుకుని టాకీ నిర్మాతలు

నటుల వెంట పడటం ఉందికాని '' ఈవేషం ఈ మనిషి వేస్తే తగి ఉంటుంది'' అనుకున్న ప్రొడ్యూసరును నేను ఒక్క మనిషినే చూశాను ఇంకా ఇతరులు ఉండి ఉండవచ్చును వారి ప్రయత్నాలు వారి చిత్రాల్లో ఏమీ ప్రతిఫలించటంలేదు నేను చూసిన ప్రొడ్యూసరు ప్రయత్నాలు ఇంకా ఫలరూపం పొందలేదు

తరవాత షూటింగ్ — షూటింగుతో నటులూ కామెరామాన్ చెయ్యవలసినపని ప్రారంభమవుతుంది టాకీకి వెళ్ళే నటులు కోతికి కొబ్బరికాయ దొరికినట్టు ప్రవర్తించటం మాని డైరెక్టరు చెప్పేది అర్థం చేసుకుని సమర్థులైతే రహస్యంగా డైరెక్టరుకే చెప్పి వప్పించి, తమ శక్తి వంచనలేకుండా ప్రేక్షకులను నమ్మించే కార్యక్రమంలో పాలు తీసుకోవాలి

ఆఖరుకు ఎడిటింగ్ — డైరెక్టరు సప్లయి చేసిన షాట్సుతో ఎడిటరు చిత్రాన్ని నిర్మిస్తాడు సినారిస్టు ఏసీను ఎంత పొడుగుండాలో నిర్ణయించుకుంటే ఎడిటరు ప్రతిషాటు ఎంత పొడుగు ఉంటే సరిగా ఉంటుందో సూక్ష్మనిర్ణయం చెయ్యవలసి వుంటుంది ఎక్కడ ఏమి చూపించాలో, ఏ ముఖ్యమైన షాటుకు సైలెంట్ మెటీరియల్ జతచెయ్యాలో నిర్ణయించేది ఎడిటరు ఇంత ఎందుకు? ఏది ఎప్పుడు ఎంతసేపు తెరమీద ఉండాలో అతనే తెలుసుకోవాలి ఇదికాక 'టెంపో' అని ఒకటి ఉంది ఎక్కడ కథ ఏవేగంతో నడవాలో ఎడిటరు నిర్ణయించుకుని ఆ వేగం లేక టెంపో ఎడిటింగులో తెప్పించాలి వేగంగా కదలటంవల్లా బిగ్గరగా అరవటంవల్లా టెంపోరాదు ఒక చిత్రంలో మొదటి నుంచీ చివరవరకూ గుర్రాలు పరిగెత్తటమూ, కార్లు పరిగెత్తటమూ ఉన్నప్పటికీ దానిలో టెంపోలేదు నిర్జీవ ప్రతిమకైవాసరే ఒకదాని తరవాత ఒకటి చకచకా చూపిస్తే టెంపోరావటానికి అవకాశం ఉన్నది అన్ని ప్రతిమలూ ఒకటే ''Mood'' లో ఉండకపోతే

సంభాషణలో టెంపోకావాలంటే సంభాషణలు చిన్న చిన్న వాక్యాలు చేసి మాట్లాడే వాళ్ళకు తలా ఒకటీ ఇస్తే టెంపో వచ్చేస్తుంది సంభాషణలోకి , బిగ్గరగానూ త్వరగానూ ఒకడే మాట్లాడితే వచ్చే టెంపో అట్టే ఉత్తమ తరగతికి చెందినదికాదు

Action లో కూడా టెంపో ఆవిధంగానే వస్తుంది చిన్నచిన్న షాట్సు కలిపి ఎడిట్ చేస్తే

ఇంతకూ ఈ విషయాలను గురించి ఎన్ని వందల పుస్తకాలు రాసినా ఒక్క అంగుళం ఫిలిం తయారుచెయ్యలేం ఒక్క అడుగు ఫిలిం తెలివిగా తయారు చెయ్యటంలో ఉన్న ఆనందం టాకీకళను గురించి వ్యాసాలు రాయటంలో ఉండబోదు

*ఆంధ్రపత్రిక, 21 4 1934*

*పునర్ముద్రణ చిత్ర సంస్కార, విజయవాడ ఫిలిమ్ సొసైటీ సావనీర్, 1990–91*

# 2. టాకీలు చూసేవారు

నిజమైన కళను ఆనందించటానికి ప్రతి వాడికీ సాధ్యమవునవీ, విమర్శకులు అందులో వున్న గొప్పతనం విప్పిచెబితేనేకాని కళ అందరికీ అవగాహన కాదనుకోవటం పొరపాటనీ టాల్స్టాయ్ వాదించాడు

అయితే మనటాకీలలోనూ మన సంగీతంలోనూ, మన చిత్రలేఖనంలోనూ, మన

గ్రంధాలలోనూ కళకంటే పాండిత్యం జాస్తి కనక అది జనసామాన్యం అర్థం చేసుకోవాలంటే విమర్శకుల సహాయం కొంత అవసరం కాని మన టాకీలు చూడబొయ్యేవారు మన విమర్శకులను పాటిస్తూ ఉన్నట్టు కనపడదు మీదుమిక్కిలి మన విమర్శకులు ప్రజాభిప్రాయాన్ని అండచూసుకుని విమర్శిస్తున్నారా అని కూడా అనిపిస్తున్నది ఎందుచేతనంటే ఈ మధ్య ఎక్కడో ఒక తెలుగుటాకీల జాబితా, వాటిమీద సంగ్రహంగా విమర్శనా చూశాను డబ్బు వచ్చినవన్నీ మంచి టాకీలకింద విమర్శకుడు జమచేసినట్టు కనిపించింది ''చిత్రం బాగా ఉన్నదిగాని డబ్బు అట్టేరాలేదు'' లేక ''డబ్బు జాస్తిగా వచ్చినా అట్టే బాగాలేదు చిత్రం'' అన్న ధోరణి విరివిగా లేదు

ఆ విమర్శ సరి అయినదయితే ప్రజలు చిత్రం యొక్క మంచి చెడ్డలు తమంతట తామే కనుక్కోగలుగుతున్నారన్నమాట ఆంధ్రదేశంలో మంచి చిత్రానికి డబ్బురాకపోవటమూ, చెడ్డదానికి రావటమూ సామాన్యంగా ఉండదన్నమాట ఇది పొరపాటనీ, ఎక్కువ మంది విమర్శకులకు తాము ఏమి చెప్పుతున్నదీ తమకే తెలియదనీ చాలా సులభంగా నిరూపించవచ్చును

అమెరికాలో చలనచిత్ర ప్రదర్శనశాలలో తెరమీద మొదటిసారి ''Close up'' (పెద్దగా చూపబడిన మొహం మాత్రమే) చూపబడినప్పుడు ప్రేక్షకులు కొందరు లేచి, ''ఇది వట్టిదగా వాళ్ల కాళ్లేవీ?'' అని కేకలు పెట్టారట వారికి తరవాత క్రమంగా తెలిసింది ''Close up'' యొక్క అభిప్రాయం ఏమిటో, దానికి అలవాటయిపోయిన తరవాత ఇప్పుడు పెద్దదిగా చూపబడ్డ మొహంలో భావం విస్పష్టంగా ఉండటం మాత్రమే గమనించి ఆక్షణాన ఆ మొహం తాలూకు కాళ్లను గురించి దిగులు పడకుండా ఉండటం నేర్చుకున్నారు ప్రేక్షకులు ఇటువంటివి ఒకసారి తెలుసుకున్న తరవాత వాటికి జనం సులభంగా అలవాటుపడిపోగలరు

టాకీలలో టెక్నిక్ (మన టాకీలలో కాదు) చాలా వేగంగా మారుతున్నందున జనానికి విమర్శకుల సహాయం కొద్దోగొప్పో అవసరం అవుతూనే ఉంటుంది

మరొక విషయం కూడా గమనించండి టాకీ ప్రదర్శన అయిపోయిన తరువాత ప్రేక్షకులు బయటికివస్తూ టాకీని తిట్టటమో, మెచ్చుకోవటమో జరుగుతూ ఉంటుంది ఏకంగా టాకీకి తగిలే దూషణభూషణాలు అట్లా ఉంచితే మిగిలిన వాటికి గురి అయేది ప్రేక్షకుల కళ్లకు కనిపించిన నటీనటులే, పాపం! టాకీ తియ్యటంలో నటీనటులకు ఉన్న బాధ్యత ఎరిగినవాడికి ఆ ప్రేక్షకుల చేత వీరు పొందే మెప్పు చూస్తే నవ్వువస్తుంది, తిట్లువింటే జాలివేస్తుంది

నటుడి లోపాలు ఉండవని కాదు అదినటుడి గొంతులో ఉన్న లోపమో, సౌండ్ రికార్డింగ్‌లో లోపమో, టాకీ ప్రొజెక్టరులో లోపమో చెప్పగలవాళ్లు ప్రేక్షకులలో ఎంత మంది ఉన్నారంటాను

ఆమాటకు వస్తే మన విమర్శకులలో మాత్రం ఎంతమంది ఉన్నారంటాను హరిశ్చంద్రటాకీలో సత్యకీర్తి వేషధారి నాగరాజారావు హరిశ్చంద్రుడు కూర్చున్న పదార్థం మీద కాలుపెట్టినందుకు విమర్శకులాయన మీద విరుచుకొనిపడ్డారు పర్యవసానం, సత్యకీర్తి హరిశ్చంద్రుడి యెడల అట్లా ప్రవర్తించటం తప్పే అయినప్పటికీ నాగరాజారావు తప్పెంతో విమర్శకులేమి గమనించారు? ఆయన కాలు ఎక్కడ ఉన్నదో చూడకుండా ఉన్న డైరక్టరు ఆ సమయంలో ఏం చేస్తున్నాడు? డైరెక్టరే ఆయన్ను కాలు అక్కడ పెట్టమని అడగలేదని

విమర్శకుడికి ఎట్లా తెలుసును? విషాదకరమైన విషయం ఏమిటంటే నాగరాజారావే విమర్శకుడికి అంత పెద్ద సమాధానం ఇచ్చి ఈ రెండు ముక్కలూ క్లుప్తంగా అడగలేక పోయినాడు

డైరెక్టరు తప్పేదో నటుడి అసమర్థత ఏదో, ఎడిటరు అసమర్థత ఏదో, రచయిత లోపమేదో— ఇటువంటి విషయాలు గమనించటం ప్రేక్షకులకు అసంభవం కాని సరి అయిన విమర్శకులకు అటువంటివి విశదంగా తెలిసి ఉండాలి అటువంటివిషయాలు స్పష్టంగా తెలియజేసే విమర్శకులు తయారయేవరకూ, సరదాకు ఆత్మవంచనతో కూడిన పిచ్చివిమర్శలు రాసేవారు వెనక్కు వెళ్లనంతవరకూ కొన్ని అగచాట్లు టాకీ పరిశ్రమకు తప్పవు

ఏ కారణాలవల్ల కానివ్వండి ప్రేక్షకుల ఆదరానికి పాత్రులైన నటులను టాకీలు తీసేవారు పదేపదే ప్రదర్శించవలసి వస్తుంది అటువంటి వారు ఏనలుగురైదుగురుకన్న లేకపోవడం చేతనూ, టాకీ బాగుండటంలో వారి చెయ్యి నిజంగా ఏమీ లేకపోవడంచేతనూ, వారిమీద ఆధారపడి తతిమ్మా విషయాలకు తగిన ప్రాముఖ్యత ఇవ్వక కొందరు చవట టాకీలు తియ్యటం చేతనూ, ఈ చవట టాకీలు ప్రేక్షకులకు తృప్తి కలిగించకపోవటంచేతనూ టాకీ పరిశ్రమ అంతానికి వచ్చే పరిస్థితులు ఏర్పడతవి తమ అభిమానానికి పాత్రులైన నటులను చూడటానికి వెళ్లిన ప్రేక్షకులు టాకీలో ఉండేది నటులు మాత్రమే కాదని కనుక్కుంటున్నారు ఆవిధంగా వారికి నిరుత్సాహం వచ్చేస్తున్నది తెలుగు టాకీలన్న అభిమానం కొద్దీ మొదట్లో చూసి, విసిగి ఇప్పుడు కొత్త తెలుగు టాకీ వచ్చిందంటే ఉత్సాహం చూపటానికి కూడా సత్తువ లేనివారై పోతున్నారు జనం

టాకీలో ఒకసారి నటించిన తరువాత మెప్పే అవుతుందో ముప్పే అవుతుందో అనే భయం చేతనూ, టాకీలు ఎట్లా రక్తి కట్టుతవనే ప్రశ్నకు సమాధానం తెలియదు కనుక, అదీకాక టాకీ రక్తి కట్టించే సదుపాయాలు తమకు తెలిసినా వాటిని చేసిచూడనివ్వరు కనుకనూ పెద్ద జీతాలమీద కాని రాని నటులు కూడా త్వరలో నిరుత్సాహులు కావచ్చును కొంత ఆత్మవంచనకు అవకాశం ఉన్నా ఎవరి అంతరాత్మలలో వారెరగరా — తాము తీసుకుంటున్న జీతాలకూ తాము చేస్తున్న పనికీ ఎక్కడా సంబంధం లేదని?

నటుడి పేరు ప్రఖ్యాతులు చూసి ప్రొడ్యూసర్లు వేలు గుప్పించుతున్నప్పుడు, ఆ నటుడికి అగ్రస్థానం ఇచ్చి తదితరులంతా వంగి సలాములు చేస్తున్నప్పుడు, సదరు నటుడికి తను చెయ్యబోతున్న పనిని గురించి ఒక్క గ్రంథమైనా చూడవలసిన అవసరం కాని, ఎవరో రాసే రాతలు చదవవలసిన అగత్యం కాని ఏముందీ? ఈ మధ్య ఒక ప్రఖ్యాత నటుడు తనకేమీ తెలియదనీ, తను స్వార్థపరుడు కనక ఇతరులంతా తను చెప్పినట్టు వినమనీ సగర్వంగా చెప్పాడట!

ఇంతా చెప్పుకొచ్చిందెందుకంటే టాకీలుతీసే వారు నటుల పేరు ప్రఖ్యాతులమీద ఆధారపడి లక్షలు వెచ్చించటంలోనూ, నటులుకూడా అదే ఆధారంచేసుకొని పెద్దపెద్ద జీతాలు తీసుకొని తమ పేరు పైకివచ్చే ఇతర సదుపాయాలు చూసుకోకుండా ఉండటంతోనూ, విమర్శకులు ప్రేక్షకుల అభిరుచి కనుక్కొని మరీ కలాలు పట్టుకోవటంతోనూ, అన్ని విధాలా టాకీ పరిశ్రమను పైకికాని కిందికికాని తెచ్చేభారం జనసామాన్యం మీద పడుతున్నది ఇదిచాలా అన్యాయం ఈ పరిశ్రమ తన బరువును ఈవిధంగా ప్రేక్షకుడి వీపునవేస్తూవస్తే అందువల్ల పరిశ్రమకూ ప్రేక్షకుడికికూడా ముప్పుతప్పదు ఈపరిశ్రమలో తెలుగువారు పదివన్నెండు లక్షలు

పోగొట్టుకున్నారంటే ఇది నడుము విరిగినదై మరిలేవదు ఆతరవాత అనేక సంవత్సరాలపాటు పెట్టుబడిదారుకు కాని, ప్రేక్షకుడికి కాని టాకీ అంటే వాంతి అవుతుంది

టాకీ పరిశ్రమ ఆంధ్రదేశంలో ప్రారంభమయినవేళ చాలా మంది జనం టాకీలు చూడటానికి ఎంతో ఉబలాటం మీద వచ్చారు హిందీ టాకీలకు కుడిఎడమగా డబ్బు ఆర్జించినై తెలుగుటాకీలు కాని వాటికాలం అయిపోయే సూచనలు కనిపిస్తున్నై ఇతర దేశీయులు ఇటువంటి పరిస్థితులు రాకపూర్వమే – టాకీలంటే జనానికి ఇంకా మోజు చావకపూర్వమే – టాకీ పరిశ్రమ చిరస్థాయి అయ్యే సదుపాయాలన్నీ వారే చూసుకునే బాధ్యత తమనెత్తినే వేసుకున్నారు పెట్టుబడిదార్లు ఇప్పుడా దేశాలలో రకానికి రెండు మూడు చిత్రాలుకూడా రావడం లేదు ప్రేక్షకుడికే ఆ చిత్రాని కాచిత్రం ఎక్కువ బాగుంటున్నదనిపిస్తుంది వెనక తగిన విమర్శలు కూడా ఉండంచేత ఆదేశాలలో ప్రేక్షకులిప్పుడు తమకు తామే విమర్శించుకునే తెలివితేటలు కలవారు కూడా అయినారు టాకీలు తీసేవారు ఈ విషయాలు గమనించకపోతే ముందుముందు సరయిన పద్ధతులలో టాకీలు తియ్యాలని ప్రయత్నించ బోయేవారికి జయం సమకూరే అవకాశాలు చాలా క్షీణించిపోతై

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 23-9-1936*

# 3. శ్రీమతి సురభి కమలాబాయి

''ఎంత డబ్బు కలిసివచ్చినాసరే, ఏమయినా సరే, 'వీర అభిమన్యు' లో సుభద్రవేషానికి నాకు కమలాబాయేకావాలి!'' అన్నాడు డాక్టరు పటేలు నేను వింటూండగానే ఆయన పట్టుదల నాకర్థం కాలేదు, ఇంతలో ఆయనే ఆ రహస్యం వెల్లడించాడు

'' ఆమె రిహార్సల్ చేసిందా, పాటలు నేర్చుకొన్నాదా, స్టూడియోకు వస్తున్నదా ఈ విషయాలను గురించి నేను ఆదుర్దాపడనవసరం లేదు ''

ఒక ఆంధ్రస్త్రీ, అసహాయంగా బొంబాయిలో ఉండి బొంబాయి స్టూడియోలలో చొరగలిగి, తనకు మాతృభాషకాని హిందీ— ఉర్దూభాషలో తీయబడుతున్న టాకీలలో నటించటానికి అవకాశాలు సృష్టించుకుని, అనేక చిత్రాలలో ప్రధాన స్త్రీ పాత్రవేసే ఘనతకూడా సంపాదించి, ఈ నాటికి మొత్తం 35 చిత్రాలలో నటించి, బొంబాయిలో గణనలోకి వచ్చిన నటీమణులలో ఒకర్తె అయిందంటే అందుకు కారణం ఆమె నటనాసామర్థ్యమూ, గాన కౌశలమూ మాత్రమే ననుకున్న వాణ్ణి, డాక్టరు పటేలుగారి మాటలు వినగానే కమలాబాయిని మొదటిసారి అస్పష్టంగా అర్థం చేసుకోవటం మొదలు పెట్టాను

'వీర అభిమన్యు' చిత్రం పూర్తి అయేలోపల కమలాబాయి సాధించగలిగిన విజయం ఆమెను ఎట్లా వరించిందో నాకు పూర్తిగా తెలిసిపోయింది హిందీ టాకీలలో నటించుతున్న నటీమణుల్లో కమలాబాయితో సమానంగా సంగీతం పాడగలవారు అరడజనుమంది ఉన్నారనుకోను, ఆమెవలె పాత్రను అర్థం చేసుకొని నటించేవారు అంత మందికూడా లేరు అయినా ఆమెకందుకు గర్వంగాని తృప్తికాని లేదు ఆమె గర్వమల్లా ఏమిటంటే, ఏదో టాకీపత్రిక యొక్క వార్షిక సంచికల్లో ఆమెను గురించి రెండుసార్లు విమర్శిస్తూ తన ప్రవర్తననూ

తన మంచితనాన్నీ శ్లాఘించారట!

అటువంటి మనిషికి ''నీపాట మనోహరంగా ఉంది నీ నటనాసామర్థ్యం అసామాన్యంగా ఉంది '' అని చెప్పి లాభం మాత్రం ఏముంది?

కాని కమలాబాయి బొంబాయి స్టూడియోల్లో సాధించిన విజయానికి కూడా ఒక వెల్తి ఉంది ఆమెకు వచ్చిన పేరు ప్రతిష్ఠలు చాలా త్వరలో వచ్చేసినై అట్లా కొంతదూరం వెళ్లి కమలాబాయి అక్కడ ఆగిపోయింది దానికి కారణం ఆమె చెప్పింది

''స్టూడియో ప్రొప్రయిటర్లు నాబోటిదాన్ని పైకి వచ్చేందుకు అవకాశాలు మాత్రమే ఇవ్వగలరు నిజంగా పైకితెచ్చేది డైరెక్టర్లు ఇక్కడ డైరెక్టర్లను మీరెరగరు నేనిట్లాగే ఉండి పోవటానికి సిద్ధపడ్డాను!'' అన్నది కమలాబాయి డైరెక్టరు తన కింద పనిచేస్తున్న మనిషి యొక్క శక్తి సామర్థ్యాలకు తగిన అవకాశం ఇస్తేకాని ఆర్టిస్టు పైకిరావటానికి అవకాశం వుండదు ఎంతగొప్ప 'తార' అయినాసరే వరుసని మూడుసార్లు తనకి తగని వేషంలో తెరమీద కనిపించినట్టయితే ఇక ఆతార రాలుడుచుక్కేనన్నాడు ఎక్మన్!

దానికి నిదర్శనంగా మనతారలనే చూడవచ్చు డైరెక్టర్లు అభిమానించిన తెలుగుతారల్లో జుట్టు లేనివాళ్ళు, మొహంలేనివాళ్లు, బీభత్సరసాలకు మాత్రమే అనుకూలించే భయంకరమైన ముఖాలున్న వారున్నారు అయినా వారి శక్తి సామర్థ్యాలకి మించినవేషాలు వారికి లభించడంచేత వారిపని చాలా బాగుంది దాదాపు పాతిక హిందీ టాకీలో వేషం వెయ్యటానికి పనికి వచ్చిన – అయిదారింట్లో ప్రధాన స్త్రీపాత్ర నిర్వహించిన — సురభి కమలాబాయికి తెలుగుటాకీలలో స్థానం లేదు అది ఆమెకు కొరత అవునోకాదో ఆమె అనుకోవటం మీద ఆధారపడి ఉన్న విషయం కాని అది తెనుగు టాకీలకు కొరతేనని నాదృఢవిశ్వాసం

*ఆంధ్రపత్రిక , వారపత్రిక, 30–9–1936*

# 4. నటకులూ, చిత్రాలూ

మొన్న మొన్నటిదాకా వేషాలు వేసుకొని జీవించే వారిని సంఘం ఎంతలోకువగా చూస్తూవచ్చిందో మన అందరికీ తెలుసు ఆ సుదినాలు వెళ్ళిపోయినై మళ్ళీరావు ఈమధ్యనే కొందరు నాట్యకళాపోషకులు బయలుదేరి నటనావృత్తికి అస్పృశ్యత పోగొట్టారు వీరు నాట్యకళకుగాని నటకులకుగాని సంఘానికి గాని ఎటువంటి ఉపకారమూ చెయ్యకపోగా బోలెడంత హాని కలిగించారు ఈ అపకారం చేసినందుకు ఆ నాట్యకళాపోషకులకు సంఘం పేరు ప్రఖ్యాతులిచ్చి గౌరవనీయులనుగా చేసింది మొత్తం మీద వాళ్ళపని ఇవాళ చాలా బాగుంది

మానవతత్వం ఎటువంటిదంటే, మనిషి దాదాపు ఏ ఆచారానికైనా అలవాటుపడిపోతాడు మనం చిన్నతనం నుంచీ చేస్తూవస్తున్న పనులు ఎంత హాస్యాస్పదమైనప్పటికీ వాటిల్లో ఉన్న యేహ్యత మనకు కనిపించదు ఎవడైనా చూడగలిగితే వాణ్ణి రివొల్యూషనరీ అనేస్తాం

అయితే నటకుల విషయం ఒకటి చూడండి, పెద్దమనిషి, గౌరవనియుడైనవాడు, మొహానికి రంగుమెత్తుకుని, నెత్తికి టోపీ పెట్టుకుని, అసహజమైన దుస్తులు ధరించి, ఏడవటమూ, నవ్వటమూ, కోపించటమూ, ప్రేమించటమూ మొదలైనవి చెయ్యటానికి ఒప్పుకుంటాడా? సిగ్గుపడడా? చాటుగా మన ఇంట్లోనూ, అందరూ చూచేటట్టు వీధిలోనూ చెయ్యటానికి

సిగ్గుపడే పని నాటకరంగం మీద ఎందుకు చెయ్యాలి? నాటక రంగం అనగానే సిగ్గు బిడియాలు వదిలి వెయ్యవచ్చునన్నా? ప్రతి నటకుడూ చేస్తున్నపనేమిటి? కొందరు స్త్రీ పాత్రలు కూడా ధరించి, చీరలు కట్టి, పూలు పెట్టుకుని కులకటం కూడా చేస్తున్నారే? ఇటువంటి ప్రవర్తనను సమర్థించటం ఎట్లా? సాటిమానవుణ్ణి తక్కువ చేసి చూడటం నాకూ కష్టంగానే ఉంది అయితే ఉన్న పరిస్థితులు ఇవీ! దేశంలో ఉన్న కళాపోషకులకు గాని విమర్శకులకుగాని ఈ మాత్రం తట్టినట్టు కనపడదు నాకు తట్టినందుకు నన్ను రివొల్యూషనరీ అని తిట్టకుండానూ ఉండదు లోకం

అయితే నాటకాలు ఆడవద్దనీ, నటించ వద్దనీ నా అభిప్రాయం కాదు ఎందుచేతనంటే, ఈ దృష్టితో చూస్తే అన్ని కళలూ ఆడుగంటవలిసే వస్తుంది కధారచన కూడా అంతే ఒక నాయకుణ్ణీ నాయకురాలినీ కల్పించి, వారిద్దరూ ఒకరినొకరు ప్రేమించుకున్నట్టూ, వారిద్దరూ కలిసి కష్టాలపాలయినట్టూ, చిట్ట చివరకు కష్టాలన్నీ గట్టెక్కి అంతా సుఖంగా ఉన్నట్టూ లేనిపోని అబద్ధాలు కల్పించి, సాక్షాత్తూ చూసినట్టే పరమగోప్యమైన విషయాలూ, హృదయాలలో ఉన్న రహస్య భావాలూ వివరంగా వర్ణించటం కూడా సరిఅయిన దృష్టితో చూసేవాడికి హాస్యాస్పదంగానే ఉంటుంది అయితే మనమంతా అట్లా భావించకపోవటానికి కారణం, నేను మొదట చెప్పినట్టు, మనం ఈ నటనకు అలవాటు పడిపోవటమే

ఈ లెక్క ప్రకారం కళలన్నీ నశించిపోవాలని శాసించటం కూడా కుదరదు కనక ఈ ప్రవర్తనను సమర్థించటానికి ఏదైనా ఉందా అని ఆలోచించాలి ఉన్నది, అది నిజమైన కళే! తన నాయికానాయకుల కష్టసుఖాలయందు చదువరికి ఆసక్తి కలుగచేసే కధకుడు లేనిపోని కధలు సృష్టించటానికి హక్కును పొందినవాడవుతాడు అట్లాగే కళాదృష్టికల నటుడు తన నటనయందు మనకు నమ్మకం ( కన్విక్షన్) పుట్టించగలిగితే ఆనటుడు వేషధారణకు అర్హుడవుతాడు అతడి కళాపటిమ యావత్తూ తను నటించుతున్న పాత్రయందూ, ఆ పాత్ర యొక్క సుఖదుఃఖాల యందూ ప్రేక్షకుడి హృదయం తగులుకునేటట్టు చెయ్యటంలో ఉంటుంది

ఏతావాతా నేను స్పష్టీకరించదలుచుకున్న దేమంటే వేషధారణకు పూనుకున్నవాడు సరిఅయిన కళాజ్ఞానమూ కళను ప్రకటించేశక్తీ లేనివాడయినాడో, వెంటనే అతడు వట్టి సిగ్గుమాలినవాడు గానూ, ఆత్మగౌరవం లేనివాడుగానూ పరిణమించటం తప్ప గత్యంతరం లేదు నటకులలో అంత పరిపూర్ణమైన ఆర్టిస్టులు ఎంత మంది ఉన్నారు? మిగిలినవారి సంగతి ఏమిటి? కళా పోషకులకు కళను గురించి ఎంతవరకు జ్ఞానసంపత్తి ఉంది?

మన కళా పోషకులకు ప్రతి నటుణ్ణీ శ్లాఘించటం ఆచారం పాపం, అజ్ఞానం వల్ల, అట్లా శ్లాఘించటమే కళా పోషకత్వానికి నిదర్శనమనుకుంటున్నారు వారు వారట్లా ప్రవర్తించితేనే కాని లోకం కూడా వారిని కళా పోషకులుగా గణించదు మనం చేసే పనులు మనకన్న అజ్ఞానులు ఆమోదించవలసిన గతి మనకు పట్టినప్పుడు మనం అధోగతిపాలుకాక ఏమవుతాం? ఇంతకన్న తారుమారు ఏముంటుంది?

ఆత్మగౌరవం పోగొట్టుకోని నటుడు, నా అభిప్రాయంలో, ఏవేషం పడితే ఆవేషం వెయ్యడు, ఏ నాటకంపడితే ఆనాటకం ఆడడు, ఆడవేషం వెయ్యడు, సంగీతంతో భావప్రకటన చెయ్యడు సంగీతం పాడినా! నాట్యకళను గురించి నా అభిప్రాయాలు తప్పుయి వుండవచ్చును

కాని కళా దృష్టికలవాడు తన ప్రవర్తనకు కొంత వరకు హద్దుపద్దులు పెట్టుకోవాలని మాత్రం అందరూ అంగీకరించితీరాలి

నాటకరంగం మీదికి రావటమే ఎంతో ప్రమాదకరమైనవని అనుకుంటే, తెరమీదికి రావటం మరింత ప్రమాదకరం ఎందుచేతనంటే నటకుడు తన మానాభిమానాలను అనేక మంది చేతుల్లో పెట్టినవాడవుతున్నాడు సినారియో రాసేవాడు తను నటించే పాత్రను నిర్లక్ష్యంతో చిత్రించి ఉండవచ్చును డైరెక్టరు తనచేత ఏహ్యామైన పనులు చేయించవచ్చును ఎడిటరు తను నటించిన దాన్ని తన చిత్తం వచ్చినట్టు ఎడిట్ చెయ్యవచ్చును టాకీలో వేషం వెయ్యబూనుకున్నవాడు ఈ ముగ్గురిలో ఎవరి ప్రవర్తననూ అరికట్టలేడు కాగితం మీద సంతకం చెయ్యకపూర్వం వారి మొహాలు కూడా అతనికి తెలియకపోవచ్చును డైరెక్టరూ, సినారిస్టూ, ఎడిటరూ, వీరుముగ్గురూ అసమాన కళాజ్ఞానం కలవారయితేనే తప్ప ఆత్మగౌరవం కలవాడు తెరమీదికి రాడు

కొందరు పేరు ప్రఖ్యాతులుగల నటులు డబ్బుకోసమో పేరు ప్రతిష్టలకోసమో చిత్రాలలో ఎక్కటానికి వప్పుకొని డైరెక్టరు వగయిరాలను అరికట్టి అదుపు చెయ్యచూడటం టాకీ పరిశ్రమకు హానికరం అంత గొప్పనటులు డైరెక్టరు వగయిరాల మీద ఎంతో భక్తి శ్రద్ధలూ గురీ ఉంటేనే కాని చిత్రాల్లో నటించటానికి రారాదు 'తారలు' పుచ్చుకొనే దానిలో ఎన్నోవంతో గిట్టని డైరెక్టర్లూ తదితరులూ కల మన తెలుగుటాకీ పరిశ్రమ ఏ స్థితిలో ఉన్నదో మనం సులభంగా ఊహించగలం

టాకీలకు కావలసిన నటులు రెండు రకాలు –పాత్రధారులూ, నటకులూ పాత్రధారులు నటకులు కానవసరంలేదు కథకు కావలసిన పాత్రలలో ఎక్కువభాగం పాత్రధారులకే తగి ఉంటై ఆ పాత్రలకు తగినవారినిచూసి కాస్టింగ్ డైరెక్టర్ వేషాలిస్తాడు ఈ పాత్రధారులు తమకు సహజంగా చాతకానివని ఏదీ చెయ్యనక్కర్లేదు హాలీవుడ్‌లో పెద్ద పెద్ద జీతాలు పుచ్చుకుంటూ ఎంతో పేరు ప్రఖ్యాతులు కలవారు చాలా మంది కేవలమూ పాత్రధారులే కాని నటకులు కారు ఇక నటకుడేమంటే, అతను తన సహజ ప్రకృతిని చంపుకుని మరొక మనిషి అయిపోవాలి అయిపోయి తనూ తను నటించుతున్న పాత్రా ఒకటేనని మనల్ని నమ్మించాలి వారి పాత్రలను సృష్టించేవారూ, వారిని డైరెక్టు చేసేవారూ అపరబ్రహ్మలై ఉండాలి

మన ఆంధ్రదేశంలో నటకులున్నారు కాని డైరెక్టర్లు వగయిరాలింకాలేరు టాకీలు తీసేవారు కొన్ని సూక్ష్మాలు తెలుసుకునేదాకా ఆ డైరెక్టర్లు తయారు కారు ఇప్పటి మట్టుకు జరుగుతున్న దేమంటే మంచినటకులను చెడు డైరెక్టర్లు చెడగొట్టుతూ ఉండటమే ఆంధ్రుడికి ఏవిషయంలోనూ సూక్ష్మదృష్టి విచక్షణా లేదు వాడుకభాషలో రాసే చెత్తయావత్తూ నవ్య సాహిత్యమే అట్లాగే తెరమీద ఎక్కేవారంతా నటకులే, ఎక్కువ తక్కువలతో అందువల్ల జరుగుతున్న దేమిటంటే వేషధారణకు కూడా పనికిరానివారు తారలైనారు సామాన్య పాత్రధారులు కూడా ప్రేక్షక లోకానికి వారి మీద గల మోజును బట్టి డబ్బూ పేరు ప్రతిష్టలూ సంపాదించటం అసహజం కాదు కాని ప్రొడ్యూసర్లు నటుల పేరు ప్రతిష్టలనుబట్టి నటకులే ధరించవలసిన వేషాలను పేరు ప్రతిష్టలు గలవారికివ్వటం ఆంధ్రులకే సహజం

*ఆంధ్రభూమి, మాసపత్రిక, మే, 1937*

# 5. టాకీ పరిశ్రమ యొక్క అభివృద్ధికి కొన్ని అవాంతరాలు

అనేక శతాబ్దాల నుంచీ దాస్యంలో ఉన్న కారణానో, ఉగ్గుపాలతో నేర్చుకొని ఉండిన వేదాంతవైరాగ్యంవల్లనో మనదేశీయులు ఏపని ప్రారంభించినా అందులో విశిష్టతా సమగ్రతా సంపాదించలేరు వాటి కొరకై వారు పాటయినాపడరు ప్రకృతి సిద్ధంగా వచ్చిన తెలివితేటలు పాశ్చాత్యుల కంటె మనకు తక్కువగా ఉన్నవనుకోవలసిన అవసరం ఎంతమాత్రమూ కనిపించదు

కాని వట్టి తెలివితేటలతో ఏమవుతుంది? ఆ తెలివితేటలను సరి అయిన మార్గంలో పెట్టే కార్యదీక్షా, పరిశ్రమా, ఉత్సాహమూ, ఊహాకావాలి, ఇవి కూడా మనవారికి కొంతవరకు లేకపోలేదు కానివాటి పరిమాణం'' తద్దినానికి ఎక్కువా, మాసికానికి తక్కువ'' అన్న సామెతగా ఉన్నది ఏ పనీ సరిగా–సొంతంగా–చెయ్యలేం కాని ఇంకొకరి ప్రయత్నాన్ని పరిహసించగలం మన నాట్యసభలూ, సారస్వత సభలూ చక్కని తార్కాణాలు

ఇటువంటి జాతి ప్రారంభించిన టాకీ పరిశ్రమ సహజంగా ఈ జాతియొక్క మంచి చెడ్డలను చక్కగా ప్రతిబింబింపచేస్తున్నది మనవారికి టాకీలు తీసేశక్తి ఉన్నది తీయవలసినరీతిగా తీసేశక్తిలేదు వాటిని దూషించేశక్తి ఉన్నది బాగుచేసే శక్తి లేదు

ఈటాకీ పరిశ్రమ యొక్క భవిష్యత్తు బాగుండాలంటే దీని అభివృద్ధికి ఆటంకం కలిగిస్తున్న విషయాలను కనుక్కొని జాబితా చెయ్యటం అవసరం అటువంటి జాబితా తయారు చెయ్యటానికి పూనుకున్నాను ఈ జాబితాలో చేర్చదగినవీ ఇందులోనించి తీసివెయ్యదగినవీ ఉండవచ్చును ఈపని ఒక్కడివల్లనే కావాలని లేదు

ఈపరిశ్రమకు అర్థబలం చాలదు ఈ పరిశ్రమలో బాంకులు డబ్బు పెట్టుబడిచెయ్యటం లేదనీ గవర్నమెంటు చేయూత ఇవ్వటం లేదనీ వాపోయి లాభం లేదనుకుంటాను అటువంటి సహాయం ఆశించగలస్థితిలోకి ఈ పరిశ్రమ ఇంకా రాలేదు నూటికీ సాలుకు రెండు వంతున నమ్మకంగా గిట్టుతుందనే ఆశతో రిజర్వుబ్యాంకు షేర్లకు ఎగబడే వారు టాకీ పరిశ్రమకు డబ్బు పెట్టరా – దానిలో నమ్మకమైన లాభం ఏమాత్రం ఉందని తెలిసినా? టాకీ పరిశ్రమ పెట్టుబడిదారుకు అటువంటి ధైర్యం ఇవ్వలేకుండా ఉంది అది గుర్తించక లాభం లేదు ఈ టాకీ పరిశ్రమను నమ్మి ఇంగ్లండులో ఈ మధ్యనే కొన్ని బాంకులు దివాలా ఎత్తిన విషయం వినే ఉన్నాం

బాంకులూ ప్రభుత్వమూ సహాయం చెయ్యటంలేదని ఆందోళన చేస్తున్న చిమనలాలు దేశాయి వగయిరా ప్రొడ్యూసర్లే తమ పెట్టుబడి, దాని మీద వచ్చిన లాభనష్టాలూ చూపవలసిన బాధ్యత గలవారై ఉన్నారు మన ప్రొడ్యూసర్ల సంగతి వేరే చెప్పనక్కర్లేదు ఎందుచేతనంటే మనవారు తమ తీట తీర్చుకొనటానికి టాకీలు తీసినవారే కాని పరిశ్రమ కోసం పాటుపడిన వారెవరూ కనిపించరు – ఒకరిద్దరు ప్రొడ్యూసర్లను మినహాయిస్తే, లక్షరూపాయలు పైగా ఖర్చుపెట్టి ఏ 30,40వేల రూపాయలతోనో తీయదగిన టాకీతీస్తే – కళ విషయం అట్లా ఉంచగా ఏబాంకులు పెట్టుబడి పెట్టడానికి అవకాశం ఉందీ? ఆ లక్షరూపాయలూ కొంత లాభంతో కూడా తిరిగిరాకపోతే ఈ పరిశ్రమకు అసలు ముక్తేలేదూ! దగ్గిర డబ్బు ఉంటే దాన్ని

దుర్వినియోగం చేసే అధికారం దాని వెంటనే ఉంది కాని ఎవరి సరదాకొద్దీ వారు డబ్బు తగలవేసుకున్నంత మాత్రానికే వారి ప్రయత్నాలు పరిశ్రమ అనిపించుకోవు

ఆంధ్రులు తీసిన చిత్రాలలో నాలుగింటికిగాను అయిదులక్షలు వదిలినై ఆ అయిదు లక్షలతో ఒక చక్కని స్టూడియో కూడా వచ్చి ఉండును, చిత్రాలేకాక కనక ఈ ఆర్థిక సమస్యను ఇప్పట్లో ఆర్చేవారూ తీర్చేవారూ ఎవరూ లేరు ఈ బాల్య చాపల్యం మానేసి ఇప్పటికైనా ఉన్న కొద్ది డబ్బుతోనే వనిసాగించి, ఆ ఉన్న డబ్బుతోనే చెయ్యదగినంత పనిచేసి లాభాలు చూపిస్తే ఎప్పటికైనా ఈ పరిశ్రమకు అర్థబలం చేకూరకపోదు తరువాత ఈ పరిశ్రమకు ముఖ్యంగా అవసరమైనది అంగబలం పరిశ్రమకు అవసరమైన మనుష్యులు పరిశ్రమలో లేరు బయట కూడా ఉండదగినంతమంది లేరు అందుచేత ఈ కొరత రెండు రకాలుగా ఉంది –ప్రొడ్యూసర్ల కు మెదడు ఉంటే తీరేకొరత కొంతా, ఎట్లాగూ తీరని కొరత కొంతా

మాటవరసకు ఫోటోగ్రాఫర్లను తీసుకుందాం అత్యుత్తమమైన ఫోటోగ్రాఫరు మన దేశంలోనే లేడని భావింతాం ఎవడైనా నాబోటివాడు ఉత్సాహం ఉండి మంచి ఫోటోగ్రాఫరు కావటానికి ధైర్యం చాలదు ఎందుకనీ? ఉన్న మంచి ఫోటోగ్రాఫర్లనే ఎవరూ తీసుకుందామని ఆదుర్దాపడటం లేదు కనకా! ఫోటోగ్రాఫర్లంటే ఫోటోగ్రాఫర్లనే కాదు ఈ పరిశ్రమకు అనేక శాఖలలో ప్రావీణ్యతగల వాళ్ళు అనవసరం ఈ పరిశ్రమలో ఉన్న విశేషమే అది అన్నిరకాల తెలివితేటలనూ విజ్ఞానాన్నీ ఈ పరిశ్రమ వినియోగించుకుంటుంది

### ప్రొడ్యూసరు

పాశ్చాత్య దేశాలలో పెట్టుబడిదారే ప్రొడ్యూసరుగా కూడా ఉండకపోవటానికి కారణం ఏమంటే, ప్రొడ్యూసరుకు ఈ పరిశ్రమను గురించి సమస్తమూ తెలిసివుండాలి అట్లా తెలిసుండి వాడిదగ్గరే ధనంకూడా ఉండాలంటే, అంటే పెట్టుబడిదారే ప్రొడ్యూసరు కాదగి ఉండాలంటే ఎక్కువ మంది ప్రొడ్యూసర్లు దొరకరు ప్రొడ్యూసర్ల సంఖ్య ఆవిధంగా పరిమితం అయిపోవటం పరిశ్రమకు అనర్థం మన పెట్టుబడిదార్లు వేరే ప్రొడ్యూసర్లను చూసుకోరు ఆఖరు పెట్టే డబ్బేదో, తమచేతిమీదుగానే, తమ అభిరుచిని అనుసరించి ఖర్చుపెడితే వారికి తృప్తి!

ప్రొడ్యూసరు యొక్క అజ్ఞానాన్ని సరిచేసేది ఎట్లాగూ? డైరెక్టరు ద్వారా పెట్టుబడిదారు ఖర్చుపెట్టదలచిన లక్షో అరలక్షో 14 లగాయతు 18వేల నిడివిగల సెల్యులాయిడ్‌గా మార్చటానికి ఏమేమి పాట్లుపడాలో ఆ పాట్లన్నీ డైరెక్టరుగారే పడతాడు, అదయినా పెట్టుబడి దారు పడమన్నట్టుగా, ఇందువల్ల టాకీ కళకు కలిగే ప్రమాదం గురించి నేనిక్కడ చర్చించను అయితే మగ్గురిస్తానే ఇద్దరు రావటం వల్ల ఇద్దరి యొక్క బాధ్యత ఎక్కువ కావటమే కాక ఇక్కడ లోపించిన ప్రొడ్యూసరు అనేవాడి బాధ్యతను పెట్టుబడిదారూ డైరెక్టరూ ఏవిధంగా పంచుకోవా లో తెలియదు డైరెక్టరులోపం ఎంతమాత్రమూ లేకపోయినప్పటికి చిత్రానికి ఆదాయ ం రాకపోవచ్చు అప్పుడు తప్పు పెట్టుబడిదారుదా, డైరెక్టరుదా? ప్రొడ్యూసరు అంటూ ఒకడు ఉంటే ఆ తప్పు ప్రొడ్యూసరుదై ఉండును

### సినారియో రైటరు

తెలుగుటాకీ పరిశ్రమలో ముఖ్యంగా లోపించిన మరో వ్యక్తి సినారియో రైటరు షూటింగు ప్రారంభించకపూర్వం పక్కా సినారియో తయారు చేసుకోవటం వల్ల ఏ ఇతర

లాభమూ లేకపోయినప్పటికీ తియ్యబోయే చిత్రం ఇట్లా ఉంటుంది అని ఊహించుకోవటానికైనా మంచి అవకాశం ఉంది ఇప్పుడు తీసే తెలుగు టాకీలకు ఆయోగ్యత అయినా లేదు ప్రస్తుతం మనవాళ్లు, చాలా మంది హిందీవాళ్లు కూడా చేస్తున్నదేమంటే నాటకం రాసి, దాన్ని డైరెక్టరుకు తోచిన రీతిలో షాట్సుగా విభజించి షూటింగు జరపటం, మంచి చిత్రాలు తియ్యవలసిన విధం అదికాదు అందుకనే మనటాకీలు దాదాపు నాటకాల ధోరణిలోనే ఉన్నై స్టేజీమీద నడిచినదానికి ఎన్నోరెట్లు సులువుగా వేగంగా తెరమీద కథను నడపవచ్చును ఈ కదలికకోసం సంవత్సరాలనించి శోధించి పాశ్చాత్యులు పాకానికి తెచ్చారు అదిసాధించే విధానాలు నానాటికీ అభివృద్ధి అవుతున్నై అటువంటప్పుడు తెరమీద కూడా నాటకాలే ఆడటం చాలా అనవసరం–మంచి సినారియో రాతగాళ్లుంటే, వాళ్లను ఈ పరిశ్రమలో అడుగుపెట్టనిస్తే

ఆర్టిస్టు

మన పరిశ్రమలో లోపించిన మరొక వ్యక్తి ఆర్టిస్టు ఆర్టిస్టులేకుండా ఒక్క అంగుళమైనా షూటింగు జరగటానికి వీలులేదు సెటింగును డిజైను చెయ్యటనాకి, వాటికి వేసేరంగులు నిర్ణయించటానికీ, వేషాలు వెయ్యటానికీ, దుస్తులూ ఆర్టిస్టు లేకుండా ఎంతమాత్రమూ వీలులేదు ఆపనులు ఎవరో ఒకరి వదిలిపెడితేకాకపోవు, కాని ఆర్టిస్టులేకుండా అవి జరగవలసిన రీతిగా కావటం అసంభవం ఈ పనులన్నీ ఆర్టిస్టు స్వయంగా చెయ్యకపోయినా ఆయన సలహా లేకుండా జరగటానికి వీలులేదు అనేకసార్లు ఆయన చెయ్యిరంగుకాకనూ వీలులేదు మన దేశంలో ఆర్టిస్టులు లేరనికాదు మేకప్, కలర్‌వాల్యూస్, లైట్‌వాల్యూస్ తెలిసిన ఆర్టిస్టు ఏ తెలుగు చిత్రంలోనూ ఇంతవరకు పని చేసినట్టు కనిపించదు

మనకు మంచి అసిస్టెంటు డైరెక్టర్లు కూడా లేరు మన చిత్రాలకు ఎవరు పడితే వారు అసిస్టు చెయ్యవచ్చును అనగా చెక్క కొట్టటమూ, పుస్తకంలో షాట్సుసంఖ్యా, పుటేజీ, ఓ కే , లేక ఎస్ జీ రాయటమూ చెయ్యవచ్చును నిజంగాపడితే అసిస్టెంటుపని చాలా భారమైనది అతని బుర్రకు పని తక్కువగాని అతనికి పదిమంది కాళ్లూ పదిమంది చేతులూ ఉండాలి డైరెక్టరుకు కావలసిన ఏర్పాట్లన్నీ జరిగేటట్టు చూడవలసిన పని అసిస్టెంటుది కాని ప్రస్తుతం మన డైరెక్టర్లకు కావలసినది అట్టే లేదు కనక అసిస్టెంటు చేతుల CLAP-CAN ఇవ్వటానికీ, అతనికాళ్లు ''ఫ్రేం'' లోనించి బయటికి పరిగెత్తడానికీ మాత్రమే వినియోగపడుతూ ఉన్నై

నటులు

అన్నిటికన్నా గొప్ప చిక్కేమిటంటే మనకు టాకీకి పనికివచ్చే నటులు లేరు

నటులను ఎవరి అభిరుచిని అనుసరించి వారు కొన్ని తరగతులుగా విభజించుకోవచ్చును పెద్దనటులూ, చిన్ననటులూ, కేవలం పాత్రధారులూ, కారెక్టర్ ఆక్టర్సూ, ఫీచర్ ఆక్టర్సూ, సపోర్ట్సూ, ఎక్స్ట్రాసూ— ఈవిధంగా ప్రస్తుతం నేను నటులను రెండు రకాలు చేస్తాను తయారు చేసుకోవలసిన నటులూ, ఉన్నవారు ఉన్నట్టు పనికి వచ్చేనటులూ, ఇందులో పెద్ద చిన్న పాత్రలనే విచక్షణలేదు కొన్ని ముఖ్యపాత్రలకే కావలసిన నటులు అనేక మంది దొరకవచ్చును కాని సామాన్యంగా చిల్లరవేషాలకు చక్కగా అతికినట్లు కుదిరేవారు ఎక్కువగా దొరుకుతారు ఎప్పుడైనా ఒక ప్రత్యేక సందర్భంలో రెండు మూడు విద్యలు నేర్చిన నటులు ఒక పాత్రకు కావలసివస్తే తెలుగువాళ్ళు కాళ్లు పారజాచవలసిందే అందంగా ఉండే మనిషి,

గుర్రపుసవారి చెయ్యగల మనిషి, పాడగలమనిషి ఇరవై ఏళ్లకు మించనిది కావాలంటే తెలుగువాళ్లు ఏం చెయ్యాలి? అట్లా వివిధ ప్రజ్ఞలు గల మనిషిని తెరమీదికి తెచ్చేటందుకు మనవల్లకాదు అటువంటి వాళ్ళను తర్ఫీదు చేసుకునే తాహతుకూడా లేదు మనకు

అంతదూరం వెళ్ళనవసరం లేకుండానే సామాన్య ప్రజ్ఞగల నటులనే మనవాళ్ళు తయారు చేసుకునే సామర్థ్యం లేనివాళ్ళయి ఉన్నారు సౌందర్యమూ, నటనాసామర్థ్యమూ గానశక్తీ, ఉచ్చారణశక్తీ, ఇవి తప్పనిసరిగా పెద్దవేషాలు వేసే నటులందరికీ ఉండి తీరాలి ఇవి కూడా లేని వాళ్లచేత ముఖ్యపాత్రలు ధరింపజేయటం పరిశ్రమకు మంచిదికాదు

ఇది ఇట్లా జరగకపోయి వుండును-ప్రతి కొత్తఫిలిం కంపెనీకూడా ఒక్కటాకీ తియ్యటమే ఆశయంగా పెట్టుకుని దానికే సరిపోయీ సరిపోనిడబ్బుతో గ్రంధం సాగించకపోతే ! ఈ కంపెనీలవారికి కావలసిన పాత్రలకు తగిన వారిని ఏరుకోటానికిగాని, ఉజ్జాయింపున ఏరుకున్న వారిని సానపట్టి తగినట్టు తయారు చేసుకోటానికిగాని వ్యవధి ఉండదు అందుచేత రూపురేఖా విలాసాలూ శీలసంపదా అట్లా ఉంచి పేరుప్రఖ్యాతులు చూసి నటులను స్వీకరించటమూ ఆపేరు ప్రఖ్యాతులకుగాను వారికి ఇవ్వదగిన దానికి పదింతలు ఇవ్వటమూ, అంతడబ్బు తీసుకున్న ఆ నటులు తమ అభిరుచులకు తగినట్టు కధను, సీనారియోనూ మార్చి డైరెక్టర్లు మొదలైనవారితో పోట్లాడి, ప్రొడక్షను రసాభాసం చెయ్యటమూ మొదలైన ఆవాచ్యాలు జరుగుతున్నై

టాకీలు తియ్యటంలో అనుభవంగాని దాన్ని గురించి జ్ఞానంకాని ఉన్నవారెవరూ నటులకు వేలకువేలు ఇవ్వరు టాకీలో నటించినందుకు ఎంత మొనగాడికి కూడా అమితంగా ఇవ్వవలసిన అవసరం లేదు ఇట్లా ఇచ్చేటందుకు ఒకటే కారణం ఉంటుంది అదేమిటంటే తెరమీద ఆ నటుడు సంపాదించుకునే పెద్దపేరు ఏ ఒక నటుడికి కానీ సినిమా రంగంమీద పెద్ద పేరు వచ్చి, అతన్ని చూడటానికి తండోపతండాలుగా జనం వచ్చేటట్టయితే, ఆమనిషి చిల్లి గవ్వకు కొరగానివాడయినాసరే, అతనికి మంచిపాత్రలిచ్చి, అతనికి ఎక్కువ శ్రద్ధ వినియోగించి అతనికి మరింత కీర్తి సంపాదించి పెట్టి వీటికి తోడు అతనికి పెద్దజీతాలు కూడా ఇవ్వటానికీ టాకీ పరిశ్రమ యొక్క ధర్మం ఒప్పుతుంది కాని స్టేజిమీద పెద్ద నటుడు కదా అని అతనికి జీతం ఇచ్చి, ఆయనమాట ప్రకారం డైరెక్టర్లు పెట్టుబడిదార్లు నడుచుకొని ఆయనగారి చాటున తమ అజ్ఞానం మాటుపెట్టుకుందామంటే టాకీ పరిశ్రమ యొక్క ధర్మం ఒప్పదు

ఈ పరిశ్రమలో లేనివాళ్లు లేకపోగా అవసరం లేని ఒక వ్యక్తి ఈ పరిశ్రమకు అనర్థంగా ఉన్నాడు ఆయనగా రెవరంటే విమర్శకుడు "కీచకుడు ద్రౌపది శరీరాన్ని తాకటం ఔచిత్యానికి భంగంగా ఉంది", " సారంగధరుడు చిత్రాంగికి అంతదగ్గిరగా నిలబడటం ఏమి బాగాలేదు " "రాజరాజనరేంద్రుడు గడ్డం పెట్టుకోవటం ఎంతో సహజంగా ఉంది " ఇటువంటి Commonsense criticism సహాయంతో టాకీకళను Patronize చేస్తున్న విమర్శక మహాశయుల సంగతి చెబుతున్నాను వీరు కొన్ని Statistics కూడా సంపాదించి ఉంటారు – ఒక టాకీలో ఒక పిల్లి నటించినందుకు మూడువేల డాలర్లు ఇచ్చారట "ఫలాని సినిమా నటితో ఫలాని ఫిలిములో నటించినవాడు దాని పూర్వపు భర్తలు" – ఈవిధంగా ఇటువంటి వారితో స్వయంగా ప్రసంగించటం తటస్థించితే, వారు ఈ విషయాలు తమకే తెలుసుననీ, అవి

తమకు ఎంత ఆశ్చర్యకరంగా ఉన్నవో వినేవారికి అంత ఆశ్చర్యకరంగా ఉంటవనీ భావిస్తున్నారని స్పష్టమౌతుంది కొత్తగా టాకీ పరిశ్రమలో వేలు పెట్టే పెద్దలే వీరి ఆశీర్వాదాలు పొంది పనిలోకి దిగుతూ ఉంటారల్లే ఉంది వీరివల్ల టాకీ పరిశ్రమకు ఉపయోగం లేకపోగా నష్టం ఉంది

చక్కని ఫిలిం తియ్యాలని ఆదుర్దాపడుతున్నట్టు ఏ పెట్టుబడిదారయినా కనిపిస్తే నాకు ముచ్చటవేస్తుంది ఆ పెట్టుబడిదారే ఒక చచ్చు టాకీ ఆశయాలన్నీ ఫలించినట్టు పొంగడం చూడగానే నాకు కనువిప్పవుతుంది అని అర్థంలేని ఆశయాలు — నాకు లక్ష రూపాయలు సంపాదించుదామని ఉన్నట్టు! — ఎట్లా సంపాదించాలో నాకు తెలీదు!

ఒక్క డైరెక్టరు ఎన్నదగినవాడు లేడు నాలుగుటాకీలు ఒకదాని తరువాత ఒకటి తగలవేసినప్పటికీ, వాటిని డైరెక్టు చేసినవారిని అయిదో చిత్రాన్ని ఉద్ధరించటానికి తీసుకుపోతున్నారంటే — నాలుగు చిత్రాలలో అసహ్యంగా నటించినవాణ్ణి రెట్టింపు రేట్లకు అయిదో దానిలో తీసుకుంటున్నారంటే దేశం గొడ్డుపోయి అయినా ఉండాలి ప్రొడ్యూసర్లు గుడ్డివాళ్లా , మతిలేనివాళ్ళూ అయినా అయి వుండాలి ఏది అనుకోటానికీ నాకు కష్టంగానే ఉంది

ఆంధ్రపత్రిక, వారపత్రిక, 5–5–1937

# 6. సినిమాలకు పనికివచ్చే నటులెవ్వరూ లేరా?

''సినిమాకు పనికివచ్చే నటులెక్కడున్నారు? ఎవరున్నారు?'' అని ప్రొడ్యూసర్లు దీర్ఘనిశ్వాసాలు విడుస్తూ ఉంటారు ఒక్క ప్రొడ్యూసర్లేకాదు, ఈ మాట ఎవరన్నప్పటికీ ఆ అన్నవారి సాహసానికి నాకు చాలా ఆశ్చర్యం వేస్తుంది ''సినిమాకు పనికి వచ్చేనటులెవ్వరూ లేరు!'' అనటంలో వారి అభిప్రాయం ఏమిటి? ఆ అనేవారు అందరినీ చూసివచ్చినట్టా? లేక సినిమాకు పనికి వచ్చే వారుంటే తెలిసినవారిలోనే ఉండాలనా?

మన ఇప్పటి ప్రొడ్యూసర్ల అభిప్రాయాలు — నటులను అన్వేషించడంలో మాట చెప్పుకున్నా— సరి అయినవి అనుకున్నట్టయితే, ఈనాడు తెరమీద మనం మళ్ళీమళ్లీ చూస్తున్న కొద్దిమంది నటులూ ఏకారణం చేతనైనా ఎప్పటికైనా తెరమీద కనపడటం మానుకున్న తరువాత తెలుగుటాకీ పరిశ్రమ కూడా నడుం వాల్చుతుందని అనుకోవాలి ఈ ప్రొడ్యూసర్లు ఎప్పటి కప్పుడు ఆక్షణాన వారికి కావలసిన విషయం మాత్రమే ఆలోచించక ఒక్క సంవత్సరం ముందు చూడగలిగినట్టయితే ఈపాటికి మరో అరడజను కొత్తతారలు ( ఆడ మగా కలిపి) తయారయి ఉండవలసింది అయినా ఒక్కటాకీ తియ్యటానికి మాత్రమే జాయింటు స్టాకు కంపెనీలు లేవదీసే ఆంధ్ర ప్రొడ్యూసర్లకు సంవత్సరానికి వచ్చేదాన్ని గురించిన ఆలోచన ఎట్లా ఉంటుంది? ఈ సినీటోనులన్నీ ఏకసాలుపంటలు చాలాసార్లు వీటి తాలూకు పంట యావత్తూ తప్పాలూ అవుతూండటం వల్ల వీటికోసం వ్యయప్రయాసలు పడటానికి అందులో లాభం కోరినవారు తప్ప మరెవ్వరూ నడుము కట్టుకోకుండా ఉండటం కూడా జరుగుతున్నది

ఇంతకూ నేను చెప్పవచ్చిందేమంటే మన భావితారలంతా మన కళ్లయెదుట తిరిగే కుర్రకారులో ఉండే ఉండాలి తెలుగు టాకీలకు భావి అంటూ ఏదన్నా ఉంటుందనుకుంటే మాట మనవిచేశాను కాని వీరిని గుర్తించేవారెవరూ లేరు ఎందుచేతనంటే అట్లా గుర్తించటానికి

కొన్ని తెలివితేటలు కావాలి అవి ఇప్పటి ప్రొడ్యూసర్లలో– లేవని చెప్పను కాని – ఉండదగినంత లేవు ఒక మట్టిని చూచి ''ఇది మంచి ఇటుక అవుతుంది '' అని కనుక్కోటానికి కొంత జ్ఞానం ఉండాలి అదిలేనివాడు తయారయిన ఇటుకలే కొంటాడు – అట్లాకొన్న ఇటుకలు తనకు అందుబాటులో ఉన్న మట్టితో తయారయే ఇటుకల కంటే చాలా నాసిరకం అయినా సరే మరి! ఫలాని మట్టి మంచి ఇటుక అవుతుందనే తెలివి లేకపోవటం మరొకటీనూ! మన ప్రొడ్యూసర్లను ఈ రెండు బాధలూ పట్టి పీడించుతూ ఉన్నై అందుకనే మనకు కొత్త తారలు లేకపోవటం

అట్లాకాక ఎక్కడైనా కొంత మట్టిదానంతటదే ఏదోవిధంగా ఇటుక స్వరూపం దాల్చినట్టయితే '' ఈనాటికి ఆంధ్రదేశంలో ఒక తార వెలసింది! అని గొల్లున గోలపెట్టటానికి మన ప్రొడ్యూసర్లకు ఏమీ అభ్యంతరం లేదు! నేను చెప్పిన సామ్యం బాగా లేదనుకోవద్దు మట్టిని ఇటుక చెయ్యటంకంటె మనిషిని తార చెయ్యటం చాలా కష్టతరమైనపని

ఇప్పటివరకూ తారల సంగతే చెబుతున్నాను మిగతా చిల్లర నటుల సంగతి విచారించి నట్టయితే మన ప్రొడ్యూసర్లు నటులను మైక్రోస్కోపులోనించి చూచినా గుర్తించలేరని తెలుస్తుంది కాస్టింగు, లేక పాత్ర నిర్దేశం ఒక్కటి తెలుసుకుంటే ఈ రహస్యం అర్థమవుతుంది పాత్రధారులు రెండు రకాలు కొందరు నటులు తమ ప్రకృతులను సంపూర్ణంగా ఏ పాత్ర యొక్క ప్రకృతిచాటున అయినా మాటువరచగలరు వాళ్ళు నటిస్తున్నంతసేపూ ''మరొక మనిషి'' అయిపోగలరు అంతమాత్రం చేత పొట్టివాడు పొడుగుగానూ, లావుపాటివాడు సన్నంగానూ అవుతాడని కాదు (సన్ననివాడు లావుగానూ, పొడుగువాడు పొట్టిగానూ, పడుచువాడు ముసలి గానూ కొంత ప్రయాసపడి కనిపించవచ్చును ) కాని పై ఆకారాన్ని ఇష్టం వచ్చినట్టు మార్చ లేకపోయినా ఈ పాత్ర ధారులు తాము ధరించే పాత్రలకు తమదికాని ప్రకృతి ఒకటి కల్పించి కొంత తాత్కాలిక నూతన సృష్టిచెయ్యగలరు ఇక రెండవ రకంవారు తమ ఆకృతికి, ప్రవృత్తికి తగిన వేషాలు మాత్రమే ధరించి ఆయా పాత్రల భావాలను తమ సహజ ధోరణిలో మాత్రమే ప్రకటించగలవారు మొదటి తరగతి వారిని నటులనీ, మిగిలినవారిని వట్టి పాత్రధారులనీ అనటం ఉచితంగా ఉంటుందని నా స్వతం అభిప్రాయం మనకు పాత్రధారులు దొరికినంత సులభంగా నటులు దొరకరు అదీకాక ఏ 'బాలయోగిని' వంటి విశేషమైన చిత్రంలోనో కాని ప్రతి మగవాడూ కథానాయకుడూ, ప్రతి ఆడదీ కథానాయికా – డవాలీ బంట్రోతులూ, వితంతువులూ మొదలైనవారితో సహా – కావటం ఉండదు సామాన్యమైన చిత్రంలో ఏ ఒకరిద్దరో నటులుంటే చాలు మిగతా పాత్రలన్నీ సామాన్య పాత్రధారుల కివ్వవచ్చును

ఇటువంటి పరిస్థితుల్లో ఈ ''సామాన్యపు పాత్రలు'' ధరించటానికే ఆంధ్రేతరులైన అరవలనూ, తదితరులనూ తీసుకురావటంలో ప్రొడ్యూసర్ల అభిప్రాయం ఏమై ఉంటుందను కోవాలి? విడవకుండా పై దేశాలనించి వేషగాళ్లను తెచ్చుకునే హాలివుడ్ ప్రొడ్యూసర్లు కూడా తారల కోసం పైదేశాలకు పోతారు కాని చిల్లర వేషాలకుగాను తమంతట తాము పైదేశాలకు పోరు

( ప్రతి తారా నేను పైనచెప్పిన నటుల తరగతికి చెంది ఉండాలనుకోవద్దు పెద్దపెద్ద జీతాలు పుచ్చుకుంటున్న తారలు అనేకమంది చాలా సామాన్యపు పాత్రధారులే అమెరికాలో అయినా

తండోపతండాలను ఆకర్షించే శక్తి వారికి ఉండటం కారణంగా వారు తారలుగా వెలిశారు దురదృష్టవశాత్తూ సినిమాకు నిజమైన నటులకంటె కూడా తారలే చాలా అవసరం (ప్రేక్షకులకు కావలసింది నటనాకౌశలం కాక రూపురేఖాదులే అయినప్పుడిట్లా జరగటంలో వింతలేదు )

మన చిత్రాలలో ఉండే పాత్రలకు ఏదైనా ప్రకృతి అంటూ ఉంటే, అది ప్రొడ్యూసర్లకో, కాస్టింగు డైరెక్టర్లకో అర్థం కావటమంటూ ఉంటే, తెలుగు చిత్రానికి చిల్లర పాత్రలు కావాలంటే తెలుగువాళ్లు దొరక్కపోరు ఇప్పటి మట్టుకు మన చిత్రాల్లో సహజమైన మానసిక పరిణామంగల పాత్రలూ, ఆ పాత్రల్లో సహజమైన భాషా మృగ్యంగా ఉండిన కారణం వల్ల మనచుట్టూ కనిపించే వారిలో ఒక్కడు కూడా అనుభవం లేకుండా పాత్రధారణకు పనికి వచ్చేటట్టు కనిపించటం లేదు ఈ నాడు నటించటమంటే కృత్రిమంగా నటించటం అని అర్థమవుతున్నది మన 'తెర' మీద ఎవరైనా సహజంగా మాట్లాడినా, సహజంగా ప్రవర్తించినా అది వెంటనే పట్టిచ్చినట్టుండి ''ఇదేమిటి, వీడు నటించటం లేదు?'' అనిపిస్తున్నది ఇది మన చిత్రాలకు సినారియోలు చేస్తున్న ఉపకారం

సామాన్యంగా సినిమాకథకు – చిన్న కథకు ఉచితమైన పరిణామం ఇవ్వాలి నాటక కథకు ఉచితమైనా పరిణామమైన కనీసం ఉండితీరాలి ఇటువంటప్పుడు మన సినిమా కథలు తయారు చేసేటందుకు ఏ చిన్న కథకులనో, నాటక శిల్పం తెలిసిన నాటకకర్తలనో ఏర్పాటు చెయ్యటం బాగుంటుంది కాని అటువంటిదేమీ జరగటం లేదు సంఘటనలవారీగా కథ తయారు చేసి ఏ డైరెక్టరో కథ ఒకటి కల్పించటమూ, దానికి ఎవరో ఒకరు సంభాషణ అతికించడమూ జరుగుతున్నది అందుచేత మన చిత్రాలు 'కడుపుతో ఉన్న తల్లి కనక మానుతుందా' అన్నట్టు ఎక్కడో ప్రారంభమై ఏదో విధంగా సాగిపోయి ఎప్పటికోప్పటికి ఆఖరు అవుతై నాలుగు ఆధునిక నాటకకర్తల పేర్లుగాని, కథకుల పేర్లుగాని, చిత్రకారుల పేర్లుగాని తెలియని ప్రొడ్యూసర్లున్నారు అయినప్పటికీ వారికి తారల పేర్లూ, వారి రేట్లూ నమ్మకంగా తెలుసు కనక మనకీ చిత్రాలన్నా వస్తున్న వనుకోవాలి

ఇక కానిపోని కబుర్లు కట్టిపెట్టి కర్తవ్యం గురించి ఆలోచింతాం మనకు – కనీసం మన ప్రొడ్యూసర్లకు – తారలు కావాలి అర్జంటూగా కావాలి! మనకు ముసలితారలూ, ముతక తారలూ, ఏడిచేతారలూ, విరగబడి నవ్వే తారలూ, కళ్లుతిప్పే తారలూ, ఇమిటేషన్ తారలూ, చాలా మంది ఉన్నారు కాని వయస్సులో చిన్నదీ, రూపవతీ, మంచి గాత్రం కలదీ, అయిన తారకావాలి ఈ లక్షణాలు గల తార లేకుండా ఇన్ని చిత్రాలు ఎట్లా తియ్యగలిగామా అని మనం వెనక తిరిగిచూసుకుని ఆశ్చర్యపడవలసి ఉంటుంది ఇటువంటి తార ఒకత్తె కాదు పది తారలు కావాలి మనకు

ఈ మధ్యనే ఈ లక్షణాలు గల తార ఒకటి మన సినిమా ఆకాశాన ఉదయించినట్లు ప్రతి కలలో వ్రాయబడింది ఈ నూతన తార కాంచనమాల ( తార అనే పదాన్ని ఈ పిల్లకు వాడాలో అక్కర్లేదో నేను నిర్ణయించలేకుండా ఉన్నాను అది అంత అసహ్యకరమైన మాటగా పరిణమించింది! పైగా కాంచనమాల కోసం ప్రొడ్యూసర్లలో ఏమాత్రమో పోటీ సాగినప్పటికీ ఈమెను చూడటానికి జనం తండోపతండాలుగా వస్తున్నారని చెప్పటానికింకా అవకాశం లేదు )

ప్రొడ్యూసర్లు ఇంతకాలమూ కాంచనమాలవంటి నటికోసం ఎదురుచూస్తూ

ఉండినారంటే ఏమీ ఆశ్చర్యం లేదు ఒక్క వయస్సూ, ఆకర్షవంతమైన రూపమూ, చక్కని గొంతూ మాత్రమే కాక కాంచనమాలకు నటించగల సామర్థ్యమూ, నటించాలనే ఉత్సాహమూ కూడా ఉన్నై ఈకాంచనమాల విషయంలో ప్రొడ్యూసర్లు చూపిన తెలివితేటలు గమనించినట్ట యితే మనకు ముందు ముందు తారలు ఉదయించే అవకాశాలేమాత్రం ఉన్నయ్యో తెలుస్తుంది

కాంచనమాల ఇప్పటికి నాలుగు చిత్రాలలో నటించింది ఆమె మూడు చిత్రాల్లో నటించి నాలుగవ చిత్రంలో పనిచేస్తూ ఉండగా ఆమెను గురించి మన దేశాన ఒక కొత్తతార వెలిసింది అని బహిరంగంగా అన్నారు ఈ మాట నిజమైనప్పటికీ ఇట్లా అనటంలో నిజంగా అర్థంలేదు ఎందుకంటే తార కాదగిన లక్షణాలు కాంచనమాలలో నాలుగేళ్లక్రితం ఏ చిత్రంలోనూ నటించక పూర్వమే ఉండినై ఈనాడు కాంచనమాల తారకాదగిన లక్షణాలుకలది మాత్రమే కాక నిజంగా తారే అయిందనుకుంటే అందుకెవరూ గర్వించవలసిన అవసరం లేదు ఆమె ఈనాడు ఈ స్థితికి కేవలమూ స్వయం కృషివల్లనే వచ్చిందనుకోవాలి చిత్రాల్లో నటించటానికి ఆమెకు నలుగురు ప్రొడ్యూసర్లు అవకాశం ఇచ్చారు కాని ఆమెను తార చెయ్యాలని ఒక్క ప్రొడ్యూసరైనా ప్రయత్నించాడనుకోను ఆమెచేత తమకు కావలసిన పాటలు పాడించుకోవడానికి, తమకు కావలసినట్టు నటింపించుకోటానికి సందర్భానుసారంగా ప్రొడ్యూసర్లు ఆమెకిచ్చిన ప్రాక్టీసు శిక్షణ అనిపించుకోదు అనుభవం శిక్షణకింద రాదు శిక్షణ లేకుండా తారలు ఎట్లా ఉదయించటం? తారలను తయారు చేసే సమర్థులు అవతల లేనిదే తారలు ఎక్కడినించి వసయి? అనుభవం వల్ల కొంతపని అయినా, ఒక్క సంవత్సరం అనుభవం ఒక్క రోజు శిక్షణతో సమానం కాదు ఎదుట ఉన్నవారిలో కొంచెం ప్రత్యేకత ఉన్నవాళ్లను చూసి ''ఈ మనిషి మనకు ఒక తార'' అని అనటం కంటె, నిజంగా తారలను తయారు చెయ్యటం చాలా కష్టమైన పని ఆ తారలను తయారుచేసేవారు రాందీ మనకు తారలు లేవు – మంచి చిత్రాలు తీసే నేర్పున్నవారు లేకుండా మంచి చిత్రాలు రానట్టే!

చిత్రాలు తీసే నేర్పుకలవారు లేరని తెలిసి ఉండి వచ్చే చిత్రాలు బాగా లేవని తిట్టటం ఎంత నిష్ప్రయోజనమో మంచి తారలను తయారు చెయ్యటానికి అవసరమైన జ్ఞానంగాని, ఓపికగాని ఉన్నవారు లేరని తెలిసివుండి మన తారలను గురించి మెచ్చుకోవటం అంత అనవసరం ఉన్న నటీనటులలో చెప్పుకోతగిన వారెవ్వరైనా ఉంటే వారిలో గొప్ప తనమంతా స్వయం కృషివల్ల వచ్చిందికదా అని శ్లాఘించటమూ, ఆ ప్రయత్నంలో వారికి ప్రోత్సాహం ఇవ్వటమూ బాగుంటుంది కాని మనం ఎవరినన్నా పట్టుకుని తార అనేస్తే అంత మాత్రానికే వారు తారలయిపోతారనుకోవటం వట్టి సూపర్‌స్టిషన్, తార అనే పదాన్ని వాడటం మనకు తెలియదని బయటపెట్టుకోవటమూనూ! ఇందువల్ల లోకానికేమీ అపకారమని కాదు ఇటువంటి మాటలు మనం మనస్ఫూర్తిగా అంటే మనకు ముందుకు పొయ్యే యోగం లేదని తెలుస్తుంది మనం మనస్ఫూర్తిగా అనకపోతే ఈ అమాయకపు తారలను మనం వంచన చేసినట్టవుతుంది! అంతే కాక నిజంగా మనకు తారలను గుర్తించే శక్తి సామర్థ్యాలే ఉంటే తీరా తార అయికూర్చున్న వాళ్లను మెచ్చుకోవటమే కాక ఇన్ని లక్షల ఆంధ్రులలోనూ ఇంకా తారలు కాదగినవా రెవరన్నా ఉన్నారేమో చూడకూడదూ?

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 6–4–1938*

# 7. సినిమా కథలు

'నువ్వు చిత్రంగా తియ్యబోయ్యేకథ ఎంత బాగుంటుందో నీ చిత్రం అంతే బాగుంటుంది' అని గోల్డ్విన్ చెప్పాడు ఇది ఆరితేరిన టెక్నీషియన్సు పనిచేసే హాలీవుడ్ వాళ్ళకు వర్తించే మాట ఆ సౌకర్యం లేని మనదేశంలో శామ్ గోల్డ్విన్ సూత్రాన్ని ఈ విధంగా మార్చాలి

''నువ్వు చిత్రంగా తియ్యబోయ్యే కథకన్న నీ చిత్రం ఒక్క పిసరు అధ్వాన్నంగా తగలబడుతుంది ఎంత మంచి కథనైనా ధ్వంసం చెయ్యగల టెక్నీషియనులు నీ దగ్గిర ఉన్నారని మరచిపోవద్దు ''

సినిమాకు కథ రాసేవాడికీ, పత్రికకు కథ రాసేవాడికి ఉన్నబాధలో తారతమ్యం ఉంది పత్రికకు కథ రాసేవాడికి మాటలెంతో సహాయంచేస్తై పూర్వకాలపు నాటకాలకు సూత్రధారుడల్లే సాహిత్య కథకుడు అవసరమైనప్పుడల్లా పాత్రలను పక్కకు పెట్టి తను నోరుచేసుకోవచ్చును పాత్రల మనస్తత్వాన్ని పాత్రల ప్రవర్తనద్వారానూ సంభాషణలద్వారానూ పాఠకుడికి తెలియచేసే శిల్పం లేనప్పుడు వాటిని గురించి తనకున్న అభిప్రాయాలు స్వయంగా తనే పాఠకుడికి చెప్పుకోవచ్చును ఏసంఘటనా అవసరం లేకుండా ఒక పాత్రయొక్క మనస్తత్వంలో పరిణామాన్ని చిత్రించి కథ అల్లవచ్చును ఈ సౌకర్యాలేవీ సినిమాకథకుడికి లేవని వేరేచెప్పనక్కర్లేదు కాకపోతే అతనికి భావనాశక్తి ఉన్నంతగా భాషా పరిజ్ఞానం అవసరం లేదు అంతే!

సినిమా కథలో పాత్రల మనస్తత్వాలు ప్రేక్షలకు సులభగ్రాహ్యాలుగా ఉండగలందులకు స్ఫుటమైనవిగా ఉండాలి పాత్రల మనస్తత్వాలు అసహజంగా ఉన్నప్పుడు కూడా ప్రేక్షకులకు లేని బాధ అస్ఫుటమైన మనస్తత్వం గల పాత్రలవల్ల ఉంది

మన దేశంలో తెలుగు ఫిలిములతోపాటు రెండేసి వారాల చొప్పున ఒకటికి రెండుసార్లు సంచారం చేసి వెళ్లిన 'అమరజ్యోతి' లో పాత్రల మనస్తత్వం ఏమాత్రం సహజంగాలేదు అనేక విషయాల్లో 'అమరజ్యోతి' కన్నా మంచి చిత్రం అనిపించుకోతగిన 'ప్రతిభ' లో పాత్రపోషణ చాలా సహజంగా ఉందికాని 'అమరజ్యోతి' లో పాత్రలు 'ప్రతిభ' లో పాత్రలకంటే స్ఫుటంగా ఉన్నై పాత్రలను సహజంగా పోషిస్తూ స్ఫుటంగా చెయ్యగల సినిమా కథకులు కావాలి

చిత్రం యొక్క ఆశయం – టాకీ కళ యొక్క ఆశయం – ప్రేక్షకులను నమ్మించటం ఊరికే కథ తెలుసుకోవటానికి ప్రేక్షకులు రారు – కనీసం రావలసిన అగత్యం లేదు కథ చెప్పటమే టాకీ యొక్క ఆదర్శమైతే పత్రికలకూ టాకీలకూ పోటీ ఉండనే ఉంది! యదార్థానికి అటువంటి పోటీకి ఎక్కడా అవకాశం లేదు కేవలమూ చదివి విశ్వసించటం కన్న చూసీ వినీ విశ్వసించగలగటం సులభం అందుకనే ప్రతిరోజూ ఇన్ని లక్షల మంది సినిమా చూడటానికి పోతున్నారు – పత్రికలు చదివేవారి సంఖ్య వారిలో పదోవంతు కూడా లేదు

అయితే మన ప్రేక్షకులు దాదాపు దేన్నయినా విశ్వసించేటందుకు సంసిద్ధులై ఉన్నారు ఆడవేషం వేసుకున్న మగవాణ్ణి ఆడదనుకునేవాళ్ళూ, తెరను సందర్భానుసారంగా దర్బారనీ, కీరారణ్యమనీ, యుద్ధభూమి అనీ అనుకునేవాళ్ళూ, శాంతాఆప్టే అందగత్తె అనీ, ఆవిడ కులుకు ముద్దు వస్తుందనీ విశ్వసించే వాళ్ళు దేన్నయినా విశ్వసించగలరు మనం నమ్మించేటట్టు టాకీలు

తియ్యటమంటే మన రాష్ట్రంవాళ్ళూ దేశంవాళ్ళూ నమ్మేటట్టు టాకీలు తియ్యటమని భ్రమపడరాదు మనం టాకీలో చూసే సంఘటనే నిజంగా జరిగి ఉండినట్టయితే ఆసంఘటనను ఎవడుగానీ ఎట్లా చూడగోరుతాడో అట్లా చూపించినట్టయితే అది ప్రేక్షకులను నమ్మించ గలగటమనిపించుకుంటుంది టాకీలు తీసేవారికి ఆమాత్రం చెయ్యటం చాతనయి ఉండాలి

కాని కథకుడికి అంతకంటె మరికొంచెం, చాతనయి ఉండాలి తను కథలో ప్రవేశపెట్టే సంఘటనలు నమ్మించేటట్టు తియ్యటానికి అవకాశాలుండేటట్టు చూడటమేకాక అతను ఏ సంఘటనకు ఎంత ప్రాముఖ్యత ఇస్తే కథా శిల్పానికి భంగం కలగకుండా ఉండేదీ కూడా నిర్ణయించాలి ప్రేక్షకులను నమ్మించే ప్రయత్నంలో కథకు సరిఅయిన వాతావరణం కలిగించే బాధ్యత కూడా సినిమా కథకుడిదే చిత్రంగా తీస్తున్న కథ ప్రత్యేకించి రాయబడినది కాక సాహిత్యంలో నించి ఏరుకున్న దయినట్టయితే సినిమా కథకుడు అవసరమైన మార్పులు చేస్తూ ఆకథను మళ్ళీ రాయవలసి ఉంటుంది

సినిమా కథకూ సామాన్యకథకూ శిల్పంలో మరొక తేడా ఏమంటే సామాన్యకథ వెనకా ముందుగానూ క్రమం లేకుండానూ రాయటానికి సాధ్యం అవుతుంది సినిమా కథకు ఒక క్రమం (Continuity) అవసరం ఒకటవ రంగం నించి కామెరా రెండవ రంగానికి వెళ్ళేటప్పుడు ఆ మార్పుకు ఒక ఆవశ్యకతా, సమర్ధింపూకావాలి సామాన్యపు కథలో పరస్పర సంబంధంలేని అనేక విషయాలు ఒక దాని తరువాత ఒకటి చెప్పి ఆఖరుకు వీటన్నిటినీ ముడిపెట్టటం సాధ్యమవుతుంది అట్లా సినిమాతీస్తే అర్థంచేసుకోవడం బహుకష్టం దీనికి ముఖ్యమైన కారణం ఏమంటే సామాన్యపు కథ చదివేటప్పుడు మనం ప్రతిదానికీ కథకుడి మీద ఆధారపడవచ్చు వెనకటి విషయం స్మరించడానికి పేజీలు వెనక్కు తిప్పవచ్చును సినిమా చూసేటప్పుడు అది సాధ్యంకాదు సినిమాచిత్రం కాలచక్రంలాగా ముందుకు మాత్రమేపోయి జరిగిన క్షణం ప్రేక్షకుడికి మళ్ళా తిరిగిరాదు (సినిమాలలో కూడా Cut back అనేది ఉన్నప్పటికీ అది పాత్ర యొక్క స్ఫురణను సూచించడానికేగాని ప్రేక్షకుడి జ్ఞాపకశక్తికి సహాయార్థం కాదు ప్రేక్షకుడికొరకు అయినప్పుడు కూడా Cut back యొక్క ఉపయోగం పేజీలు వెనక్కు తిప్పటం సామ్యమైనది కాదు ) కనక చిత్రంలో ఒక క్రమం ( లేక Continuity) ఉండేటట్టు చూడటం సినిమా కథకుడి విధి సామాన్య కథయొక్క ఉద్దేశం కథ చెప్పుతూన్న ట్టుండటం, సినిమా కథయొక్క ఆశయం కథ జరుగుతూన్నట్టుండటం

ఈ విషయాలు జాగ్రత్తగా తెలుసుకోకపోవటం మూలాన మనం టాకీలద్వారా చూస్తున్న కథల విషయమై తీరని సమస్య ఒకటి ఏర్పడిపోయింది మన టాకీలలో ఉన్న లక్షా తొంభై పొరపాట్లలో ‘ఇది కథ యొక్క తప్పు’ అని ఏమిటి కనుక్కునేదనే నిస్పృహ చాలా మందికి ఉంది కాని అది పొరపాటు టాకీలను గురించి అవసరమైన పరిజ్ఞానం కలవాడికి కామెరా పొరపాట్లూ, డైరెక్టరు పొరపాట్లూ, కథలో పొరపాట్లూ సంభాషణలో పొరపాట్లూ, ఎడిటింగు పొరపాట్లూ, వేషధారుల అసమర్థతా, దేనికది స్పష్టంగా తెలుస్తూనే ఉంటుంది

సి పుల్లయ్యగారు తీసిన సత్యనారాయణ వ్రతం చూడండి చిత్రం నమ్మించేటట్టు ఉండటానికి ఇది తియ్యటంలో పుల్లయ్యగారు పడ్డ శ్రమ మరి ఏ ఇతర టాకీ తీసినవారూ పడి ఉండలేదు కాని పుల్లయ్యగారు జయించలేదు అందుకు కొంతవరకు పుల్లయ్యగారి

టెక్నీషియనులు కారణం కొంత లోపం కథలోనే ఉంది ఈ రెండు లోపాలనూ స్పష్టంగా విడదీసి చూపవచ్చును

ముందు టెక్నీషినులు చేసిన పొరపాటు విచారింతాం ఆ టాకీలో ఒక్క సత్యనారాయణ మూర్తి తప్ప మిగిలిన వారంతా మనం పరిచయం చేసుకుని సులభంగా అర్థం చేసుకోగల పాత్రలే! వీరి మధ్య సత్యనారాయణస్వామి సాక్షాత్కరించినట్టు మనం నమ్మవలసి ఉంది తీరా చూడవచ్చేసరికి సత్యనారాయణమూర్తి కూడా మనం నిత్యమూ చూచే వ్యక్తే ఆ పాత్ర యితర పాత్రలకు భిన్నమైన పాత్ర అని సూచించటానికి కామెరామాన్ ఏమి శ్రమపడ్డాడూ? ఏమీ లేదు ఆ పాత్రకోసం అసాధారణమైన లైటింగుగాని, చిట్టచివరకు అసామాన్యమైన Perspective గాని ఉపయోగించటం జరగలేదు

ఈ భగవంతుణ్ణి నమ్మలేకపోవటానికి మనకు కథకుడు చేసిన సహాయం కూడా కొంత ఉంది ఈ కథలో పాత్రలు సాక్షాత్తూ సత్యనారాయణమూర్తివారే ప్రత్యక్షమయినా కూడా, స్వాభావికంగా, ఎవరో ఉద్యోగస్తుడిముందు ప్రవర్తించినట్టే, ప్రవర్తించుతారు ! పుల్లయ్యగారి చిత్రం ఇక మనలను నమ్మించటం ఎట్లా!

*మహతి, మాసపత్రిక, ఆగస్టు 1938*

# 8. తెలుగు డైరెక్టర్లు

ఒకరి ప్రశ్నకు "ప్రజామిత్ర" లో సమాధానం రాస్తూ, తెలుగు టాకీ బాధ్యత యావత్తూ డైరెక్టరుదేనని శ్రీ గూడవల్లి రామబ్రహ్మంగారన్నారు

ఇది తప్పనిసరికావచ్చును, అయినా అన్ని విధాలా శోచనీయమైన విషయమే ఎందుకంటే టాకీకి చాలా అంగబలం కావాలి డైరెక్టరు తనే ప్రొడ్యూసరుగానూ, ప్రొడక్షను మానేజరుగానూ, కథకుడుగానూ, సినారియోరైటరుగానూ, కాస్టింగు డైరెక్టరుగానూ వ్యవహరించాలంటే చిక్కులపాలవుతాడు, ఎంతమొనగాడయినాసరే

పైగా మన డైరెక్టర్లలో అంతటి మొనగాళ్ళు కూడా ఎవరూ లేరు టాకీకి పూర్తి సంబంధంగల కథలూ సంగీతమూ మొదలైన వాటిలో మన డైరెక్టర్ల అభిరుచి మన ప్రేక్షకుల అభిరుచికి అట్టే భిన్నంగా ఉన్నదనుకోవటానికి అవకాశం కనిపించదు

పై పెట్టున ఉండి ఇతరులు చేసిన పనికి సమ్మతి ఇవ్వటానికే డైరెక్టరుకు మంచి శాస్త్రీయమైన అభిరుచులుండాలి టాకీ నిర్మాణం యొక్క వివిధ శాఖలలో చెయ్యిపెట్టి పనిచెయ్యటానికి ఎంత ప్రతిభ కావలసిందీ ఎటువంటి శిల్పనైపుణ్యం కావలసిందీ మనం సులభంగా ఊహించుకోవచ్చును

అందుచేత టాకీ నిర్మాణపు ప్రతిశాఖలోనూ ఒక సమర్థుడూ బాధ్యుడూ అయిన వాడుండాలి వీరంతా చేసే ప్రయత్నాన్ని కేంద్రీకరింపచేసి డైర్టక్టరు తనపని నెరవేర్చుకుంటాడు

అటువంటి అంగబలం లేకుండానే చిత్రం తీయ్యటానికి డైరెక్టరును నియోగిస్తే – నియోగించవలసి వస్తే – చిత్రం ఏదో విధంగా బయటికి రాకపోదు కాని అందులో ఉన్న లోపాలకు డైరెక్టరును తప్పుపట్టి లాభం లేదు రాజ్యాంగశాఖా మంత్రులు లేకుండా పరిపాలనా

బాధ్యత యావత్తూ ప్రధానిమీద వేస్తే ఆదర్శపరిపాలన అసంభవం కాని డైరెక్టరుకు తనసహాయులు చేసే పనిని గురించి ఏమీ తెలియక పోయినప్పుడు మాత్రం డైరెక్టరును సమర్థించలేం సినారియో రైటరూ, కామెరామాన్, ఎడిటర్ మొదలైన వాళ్ళు చేసే పొరపాట్లను కనిపెట్టలేని డైరెక్టరు అసమర్థుడు, కానీ అక్కడ కూడా అతన్ని మనం క్షమించవచ్చును

కథను చిత్రంగా మార్చేపని సొంతంగా డైరెక్టరుది ఏ సంఘటనకు Psychological value ఎంతో, ఏ పాత్రయొక్క వ్యక్తిత్వం ఎటువంటిదో, ఏ ఘట్టం ప్రేక్షకులకు ఎట్లా ప్రదర్శించాలో, ఏ పాత్ర ఎప్పుడు ఎంతభావోద్రేకాన్ని ప్రదర్శించాలో సున్నితమైన త్రాసుతో తూచేబాధ్యత డైరెక్టరుది ఈ పనిలో డైరెక్టర్‌కు ఎవరూ సహాయం రారు సరేకదా, ఈ లోపాలను తరవాత సవరణ చేసేవాళ్ళు కూడా ఉండరు – సూక్ష్మంగా ఎడిటరు తప్ప

దురదృష్టవశాత్తూ డైరెక్టరు ఇతరుల మాదిరిగా అనుభవంతో అభివృద్ధి చెందలేడు అతని అనుభవం ఎక్కువభాగం స్టూడియోబయటే ఉంటుందిగాని లోపల ఉండదు ఎన్నివందల చిత్రాలు డైరెక్టు చేసినవాడు కూడా తనకు అనుభవంలో లేని సంఘటననూ పాత్రలనూ డైరెక్టు చెయ్యలేడు అందుచేత నాలుగు చిత్రాలను తగలవేస్తే డైరెక్టరనుకోవటానికి అవకాశం లేదు

పైనచెప్పినవాటికి దృష్టాంతాలు మన టాకీలలో నుంచి ఎత్తి చూపవచ్చును అట్లా చెయ్యటం వల్ల వ్యక్తులకు బాధకలిగించటమే తప్ప మరేమీ ఉండదు కనక వాటిని పరితలకే వదిలి పెడుతున్నాను డైరెక్టర్లు తమ బాధ్యతను నిర్వర్తించనప్పుడల్లా వారి అసమర్థతే అనుకోవలసిన అవసరం లేదు డైరెక్టర్లు బుద్ధిపూర్వకంగా చేసే తప్పులు చాలా ఉంటై అందులో ఎక్కువభాగం పెట్టుబడిదార్లను తృప్తి పరచటానికీ, బాగుచెయ్యటానికీ చేసేవి

పెట్టుబడిదార్లు కళకోసం నశించిపోవాలని నా మతంకాదు కానీ టాకీ ప్రయోజనాలకూ, టాకీ పరిశ్రమ ప్రయోజనాలకూ కించిత్తు తేడా వుండడం వల్ల పెట్టుబడిదార్ల కోసం చెయ్యవలసి వచ్చే త్యాగం ప్రేక్షకులకు రుచించదేమోనని నా భయం

ఇదంతాకూడా కాక టాకీపరిశ్రమ, ముఖ్యంగా మనరాష్ట్రంలో నాథుడులేని పరిశ్రమ దానికి నిదర్శనమేటంటే ఈ పరిశ్రమలో కొన్నికొన్ని పొరపాట్లు వాటంతట అవే జరిగిపోతై వాటికి ప్రత్యేకించి కారకులుగాని నివారకులుగాని ఎవరూ ఉండరు ఇటువంటి పొరపాట్లు హెచ్చుభాగం షూటింగుకు సంబంధించి అయి ఉండటం వల్ల వాటికి డైరెక్టరునే బాధ్యుణ్ణి చెయ్యవలసి వస్తుంది ''తీరా చెయ్యవలసి వచ్చేటప్పటికి ఎంత శ్రమ ఉందో చెప్పేవారికేం తెలుస్తుంది?'' అనే డైరెక్టర్లంతా వాటికవిగా జరిగే పొరపాట్ల చాటున తమ అంతరాత్మలను భద్రపరుస్తూ ఉంటారు

*ప్రబుద్ధాంధ్ర, మాసపత్రిక, ఫిబ్రవరి 1939*

# 9. సాంఘిక చిత్రాలద్వారా ప్రబోధం

పౌరాణిక చిత్రాలు పోయి సాంఘిక చిత్రాలు రావాలని విమర్శకులూ తదితరులూ చేసిన అలజడి మనమంతా ఎరుగుదుము పౌరాణిక చిత్రాలు వాటి ధర్మమా అని వెనకపడిన మీదట ఈ అలజడి తగ్గిపోయింది కాని సాంఘికచిత్రాలమీద జనానికింకా అపారమైన ఆదరాభిమానాలు లేకపోలేదు ఈ ఆదరాభిమానాలతో సానుభూతి లేనందుకు నాకు చాలా

విచారంగా ఉంది

మనం – అంటే తెలుగువాళ్లం – పౌరాణిక చిత్రాలు తియ్యటం చాతకాక సాంఘిక చిత్రాల్లో పడ్డామనటానికి ఎటువంటి సందేహమూ లేదు చూడండి పౌరాణికచిత్రాల్లో పాత్రపోషణా, వాచకమూ, రంగ నిర్మాణమూ నియమితమైన పద్ధతులమీద వెళ్లటమంటూ ఉండటానికి వీలులేదు పురాణ పురుషులను తెరమీద చూపించేటప్పటికి వాళ్లమీద గౌరవం పోయినంత పని జరిగింది వాళ్లు జీవభాషలో మాట్లాడితే హాస్యాస్పదంగా ఉంది (గ్రాంధిక భాషలో నటించటం దాదాపు అసంభం) మంచి సెట్టింగులిచ్చి ప్రజ్ఞ ప్రకటించుకోవటానికైనా సాంఘిక చిత్రాలిచ్చే అవకాశం ఆర్టు డైరెక్టరుకు పౌరాణిక చిత్రం ఇవ్వదు ఈ అసంతృప్తికి కారణాలు చిత్రాలు తీసేవాళ్ల కున్నట్టే చూసేవాళ్లకూనూ అందుచేత నలుగురూ, ''మాకు సాంఘిక చిత్రాలు చూపించండి!'' అని కోరటమూ, ప్రొడ్యూసర్లు సాంఘిక చిత్రాలు తియ్యటమూ జరిగింది – జరుగుతున్నదీ, జరుగుతుంది కూడానూ

## గొర్రెదాటు

బాగానే ఉంది కాని నాకు మొదటించీ ఒకటి అర్థం కాకుండా వచ్చింది – పౌరాణిక చిత్రాలను పాడుగా తీసిన ప్రతి ప్రొడ్యూసరూ సాంఘిక చిత్రమైతే చక్కగా తియ్యగలుగుతాడనే భ్రమకు ఆధారమేమిటి? పైన చెప్పిన విషయాల్లోకాక మిగిలిన అన్ని విషయాల్లోనూ పురాణ చిత్రాలూ సాంఘిక చిత్రాలూ ఒకటే, ఒక విధంగా సాంఘిక చిత్రాలు తీయటమే జాస్తి కష్టం, సహజత్వంలో కళను సాధించాలి

అటువంటి పరిస్థితుల్లో గొర్రెదాటుగా ఒక్కొక్కరే సాంఘిక చిత్రం తియ్యటానికి ఎగబడుతున్నారు పరిశీలించి చూస్తే ఈ సాంఘిక చిత్రాలు ఏ సంఘవాతావరణాన్ని అవలంబనం చేసుకుంటున్నదీ స్పష్టంగా తెలియదు ఇందులో ఉండేది తెలుగువాళ్లందరికీ తెలిసిన తెలుగు వాతావరణం కాదు ఈ చిత్రాలకు సంబంధించిన ఏ విషయంలోనూ తెలుగుతనం మూర్తీభవించదు పైగా కొందరు సాంఘిక చిత్రాలకు పౌరాణిక వాసన తెప్పించటానికి నానా యాతనలూ పడి తమకు నిజంగా సాంఘిక చిత్రాలమీద అభిమానం లేదనీ, నలుగురితో పాటు నారాయణ అన్న ధోరణిలో అటువంటివి తీస్తున్నామని చెప్పక చెప్పుకుంటున్నారు

## పరిష్కారం కాదు

ఇక ఈ సాంఘిక చిత్రాల్లో ఉండే సమస్యలను గురించి చెప్పనే అవసరం లేదు ఈ సమస్యల్లో కొత్తదనం ఏమీలేదు తాగుడంటే, వ్యభిచారమంటే, అస్పృశ్యత అంటే, జమీందార్ల దౌర్జన్యాలంటే, వితంతు వివాహాలంటే —ఇటువంటి సమస్యలను నిజంగా పరిష్కరించటానికి టాకీలు పనికిరావు అందులో కొన్నిటికి సరి అయిన పరిష్కారం సాంఘిక పరిస్థితుల్లో విప్లవం జరిగితే కాని సంభవంకాదు మరికొన్ని గాంధి మహాత్ముడివంటి మహాపురుషుల ప్రబోధంవల్ల క్రమంగా అంతరించుతున్నై పోతే టాకీలు చెయ్యగలిగిందల్లా ఏమిటంటే పరిష్కారం కాకుండా, కావటానికి అవకాశం లేకుండా ఉన్న సాంఘిక దుర్దశకు ప్రచారం ఇవ్వటం వాటిని పరిష్కరించటం కానే కాదు తెరమీద వీటిని పరిష్కరించటం హాస్యాస్పదమే కాక అపాయకరం కూడానూ ఎందుచేతనంటే ప్రేక్షకులకు అంతసులభంగా పరిష్కారమయ్యే సమస్యయందు తగినంత శ్రద్ధ కలక్కపోవచ్చు (తెరమీద ఇటువంటి సమస్యలు బహుసులభంగా

పరిష్కరింపబడతవని నేను వేరే మనవి చేయటం దేనికీ?) సుప్రసిద్ధ- డైరెక్టరు బరువా, ''నా కొక చిన్న సమస్య ఇవ్వండి దాన్ని గురించి నన్నే ఆలోచించుకోనివ్వండి మీరు నాకా సమస్యను పరిష్కరించి పెట్టవద్దు!'' అని ప్రొడ్యూసర్లను ఎప్పుడో వేడుకున్నాడు!

మాటవరసకి

ఈ సాంఘిక చిత్రాలు తీసుకునే సమస్యలను గురించి మరికొంత రాస్తేకాని నా ప్రస్తుత కర్తవ్యం కడతేరదు ఒక సాంఘిక దురాచారం ఉందంటే దాని వేళ్లు ఎంతదూరంగా పాతుకుని ఉన్నవో, ఏ ఆహారంమీద అది జీవించగలుగుతున్నదో ఎనలైజు చేసి తెలుసుకోగలగటం సులభసాధ్యం కాదు (కనీసం సినిమా ప్రొడ్యూసర్లు ఊహించేదానికన్న అనేక వేలరెట్లు విజ్ఞానంతో కూడుకున్నవని ) అది తెలుసుకోవటంలోనే దాన్ని పరిష్కరించటం కూడా ఇమిడి ఉన్నది సంఘంలో ఉన్నకుళ్లును నిర్మూలించటానికి జీవితాలు అర్పించి నడుములు కట్టినవారే విజ్ఞానం చాలక తొందరపడి అడ్డదారులు తొక్కుతూ ఉంటారు ఈ అడ్డదారులు వ్యక్తుల దగ్గరికి పోతూ ఉంటై ప్రతి సాంఘిక దురాగతానికీ కొద్దిమంది వ్యక్తులు కారణభూతులల్లే కనిపిస్తూ ఉంటారు

మాటవరసకు రజస్వలానంతర వివాహం తీసుకోండి ఓర్పు విజ్ఞానమూ లేనివాడికి రజస్వలానంతర వివాహం సులభంగా తెచ్చిపెట్టగల సంస్కారంగా కనిపిస్తుంది ఏముందీ? ప్రతి కాలేజి విద్యార్థి రజస్వల అయిన పిల్లనే పెళ్లాడటానికి తీర్మానించుకుంటే సరి! బాగానే ఉంది, మిగిలిన సంఘం మాట ఏమిటి? ఈ ఆదర్శం కోసం ప్రతి కాలేజీ విద్యార్థీ తన మూఢ బంధువులతో తెగతెంపులు చేసుకోగలడా? అనాదిగా పాతుకు పోయిన సంస్కారాలను ఒక్క చిత్రంతో మార్చి పారెయ్యగలమా? నేను నమ్మను

ఇది దౌర్జన్యం

అటువంటి నమ్మకం, నిజం ఆలోచిస్తే ఎవరికీ లేదు అందుకనే మన సాంఘిక చిత్రాల్లో ఈ సాంఘికసమస్యలను వ్యక్తి సమస్య కింద మార్చుకుంటున్నాం ఒక మాలపిల్ల బుద్ధి తక్కువగా ఒక బ్రాహ్మణ్ణి ప్రేమించటానికి పాటు పడుతుంది లేదూ మరొక వితంతువు పక్క ఇంటి అబ్బాయితో పచ్చిగడ్డిమీద పడుకుని ప్రణయగీతాలు పాడుతుంది దానివల్ల కలిగే చిక్కులన్నీ ఏగుడి ధర్మకర్తగారినో సంస్కరించటమో, ఏ సన్యాసో దొంగముండా కొడుకని నిరూపించటమో అయినంతమాత్రన ఇట్టే విచ్చిపోతై రైతు సమస్యలు సంస్కరించటం కూడా ఇంత సులభసాధ్యమైన పనే - జమీందారు అయిదు నిమిషాల్లో తన విశ్వాసాలన్నీ సంస్కరించు కోగలిగితే నా దృష్టిలో ఇది సాంఘికసేవ కాదు ఇందులో అపచారమూ అన్యాయమూ చాలా ఉంది సాహిత్యంద్వారా ఉపదేశం చెయ్యటమనేది దౌర్జన్యమని పోట్లాడాను చిత్రాలద్వారా ఉపదేశం చెయ్యటం కూడా అటువంటిదే చిత్రాలద్వారా ప్రబోధం తప్పక చెయ్యండి చాతనయితే ఆ దుస్థితికి కారణభూతాలైన విశ్వాసాలను సూచించండి ఈ వేళ్లు ఎంత లోతుగా పాతుకుపోయిందీ చూపించండి ఆ తరవాత ఆ పరిస్థితిని గురించి ఎటువంటి చర్య తీసుకోవాలో సంఘమే నిర్ణయిస్తుంది అట్లా కాకుండా ప్రతి సాంఘిక చిత్రమూ ఒక్కొక్క సమస్యను పరిష్కరిస్తే సంఘంలో పరిష్కరించదగిన సమస్యే లేకుండాపోయి టాకీ

పరిశ్రమ మూలబడే ప్రమాదం ఉంది!

జీవితంలో డ్రామా

అయితే సాంఘిక సమస్యలను శాస్త్రీయంగా ప్రపంచానికి ప్రదర్శించగల ప్రొడ్యూసర్లు మనదేశంలో ఉన్నారనుకోను (మామూలు బిలియర్డ్స్ ఆటను గురించి షార్టు తియ్యగల ప్రొడ్యూసరున్నట్టుకూడా మనకు నిదర్శనం లేదు ) అందుచేత మన ప్రొడ్యూసర్లకు నేనిచ్చే సలహా ఏమంటే, సాహిత్యంలో మన కథకులూ, నాటక కర్తలూ ఏదారి తొక్కారో ఆదారే తొక్కండి

సంఘమంతా ఒకటి అయినమాట యదార్థమే కాని మనం సంఘాన్ని ఒక్క గుక్కను మింగటానికి ప్రయత్నించేస్తే ముందు గొంతు కడ్డుపడుతుంది ఆవెనక జీర్ణానికి రాదు మనం ఎంత చిన్న సమస్యను ఎత్తుకున్నా అది క్రమంగా కులవైషమ్యాలూ, మనం విసర్జించలేని మూఢ మత విశ్వాసాలూ, అనాదిగా వస్తున్న అనర్థాచారాలూ, ఛేదించుకుని ఏ Socio-Biological Problem గానో పరిణమిస్తుంది అందుచేత మనకది ఒద్దనే ఒద్దు! మనం వ్యక్తుల జీవితాలలో ఏ దేవదాసుతోనో- సంతృప్తి పడదాం వ్యక్తి జీవితంలో కావలసినంత డ్రామా ఉంది ఆ జీవితాన్ని ఉన్నదున్నట్టు చిత్రించగలిగితే చాలు, తప్పనిసరిగా అనేక సాంఘిక దురాచారాలు అందులోకి తొంగి చూడనే చూస్తాయి బోనులో పెట్టిన పులికంటె గుహలోనించి తొంగిచూసే పులి మనను ఎక్కువ చలింపచేసినట్టు, సమస్యాచిత్రాలు ఎగ్జిబిషను చేసే సాంఘిక దురాచారాలకంటే వ్యక్తి జీవితంలోనించి తొంగిచూసే సాంఘి దురాచారాలు మనలో ఎక్కువచైతన్యం కలిగించుతై మార్పు చెందవలసినవి మన హృదయాలూ,సంస్కారమూనూ మనకు చిత్రాలివ్వవలసింది అనుభవం కాని ఉపదేశం కాదు

ఇందులో ఉన్న తేడా సులభంగా అర్థమయ్యేటందుకు రెండు మూడు ఉదాహరణ లిస్తాను ఒక మాలపిల్ల ఒక బ్రాహ్మణ కుర్రవాణ్ణి ప్రేమించి బాధపడితే ఎవరి అభ్యంతరమూ లేదు, అందరమూ సానుభూతి కూడా కొంత చూపగలం కాని ఈ ప్రణయంతో హరిజన సమస్యను ముడిపెట్టగానే మనం ఇటు మాలపిల్లతోగాని అటు హరిజన సమస్యతో గాని సానుభూతి పొందలేని దుస్థితిలో పడిపోతాం

ఇటువంటి ఉదాహరణలు చాలా ఇవ్వవచ్చును కాని నేను పైన చెప్పినదాన్నిబట్టి మన సమస్యా చిత్రాలు చేస్తున్న పొరపాటు సులభంగా గ్రహించవచ్చును ఈ విషయంలో నామాదిరిగానే ఇంకా చాలా మంది తెలుగు సోదరులు Feel అవుతున్నారని నా విశ్వాసం దానికి ఒకటే సాక్ష్యం సాధ్యమవుతుంది – ముందు ముందు ఈ సమస్యా చిత్రాలయందు జనబాహుళ్యంలో ఆసక్తి లేకపోవటం కాకపోయినా ఎవరికీ విశ్వాసంలేని సాంఘిక సమస్యలకోసం దేవులాడుతూ తీసిన కథలే మళ్లీమళ్లీ తీస్తూ పరిశ్రమకు అపకారం చేసేకంటే విశాలమైన తెలుగు జీవితం నించి బోలెడన్ని ఘట్టాలు తీసుకుని ఆహ్లాదకరమైన ప్రబోధ పూరితాలైన చిత్రాలు తియ్యమని నా సలహా!

ప్రజామిత్ర, వారపత్రిక 14-4-1940

# 10. తెలుగు చిత్రాలు గిట్టాలంటే...?

చిత్రంమీద ఎంత వ్యయం చెయ్యాలి? ఇది మొదటి ప్రశ్న వ్యయం ఒక సంఖ్యకు మించితే, చిత్రం ఎంతమంచిదైనా, నష్టం వచ్చితీరుతుంది ఒక సంఖ్యకు తగ్గితే చవుకబారు చిత్రం తియ్యటానికికూడా చాలదు చిత్రంయొక్క వ్యయం ఈ రెండు సంఖ్యల మధ్యా ఉంటుంది అయితే, రెండు రకాల ప్రొడ్యూసర్లు టాకీ పరిశ్రమకు అప్రతిష్ఠ తెస్తున్నారు (1) కింది సంఖ్య కంటె తక్కువలో చిత్రం తియ్యగల మనుకునేవాళ్ళూ, (2) పై సంఖ్యను అంటకుండా చిత్రం తియ్యలేనివాళ్ళూ

కింది సంఖ్యగాని, పై సంఖ్యగాని చిత్రాన్ని బట్టి మారుతూ ఉండటం ఉంటుంది మాట వరసకు అతి చవుక చిత్రం విలువ 50వేలనుకోండి, అత్యుత్తమ చిత్రం విలువ 2లక్షల దాకా ఉండవచ్చుననుకోండి అనేక పాత్రలూ, దృశ్యాలూ, దుస్తులూ, రంగపరికరాలూ కోరే చిత్రం అతిచౌక చిత్రంగా తయారు కాదు కథలో సర్వజనామోదకరమైన అంశాలు గాని, పాత్రధారులలో తారలుగాని లేని చిత్రం 2లక్షలు అయితే గిట్టదు

కాబట్టి 50వేలకు తక్కువలో చిత్రం రాదని తెలుసుకున్నంత మాత్రంచేత కొత్త ప్రొడ్యూసరు పొందే అపారమైన లాభం ఏమీలేదు, తనుచిత్రం చెయ్యబొయ్యేకథకు, తను దానిమీద వినియోగపరచబోయ్యే శ్రమకూ తెలివితేటలకూ అనుకూలమైన తక్కువ ఎక్కువ సంఖ్యలను ప్రొడ్యూసరు స్వయంగా నిర్ణయంచుకోవలసి ఉంది ఈవిషయంలో తనకు సహాయపడేవా రెవరూ ఉండరు ఇంతకూ తనేం చెయ్యాలో తెలుసుకున్న ప్రొడ్యూసరు ఎట్లా చెయ్యాలో తెలుసుకో లేకపోడు ఇది రచనలో ఏమిటి, చిత్రలేఖనంలో ఏమిటి – ప్రతికళలోనూ తిరుగులేని సూత్రం

కొత్త ప్రొడ్యూసర్లతో వచ్చే మొదటి చిక్కేమంటే ప్రొడ్యూసరుకు కూడా కొన్ని బాధ్యత లుంటవని తెలియకపోవటం తనకు అభిమానం ఉన్న కథను ఎన్నుకుని, అందులో తన కిష్టమైన తారలను పెట్టటానికి అవకాశం చూసుకొని అదివరకు ఫీల్డులో డైరెక్టరుగా వ్యవహరించబడు తున్న పెద్దమనిషిని కుదుర్చుకోగానే తనపని అయిపోయినట్టు భావిస్తాడీ కొత్త ప్రొడ్యూసరు చిత్రం ఇంతలో అవుతుందనిగాని అంతలో అవుతుందనిగాని ఈ ప్రొడ్యూసరును నమ్మించేది ఈ డైరెక్టరే

మనలో కొత్త ప్రొడ్యూసరంటే పెట్టుబడిదారో, పెట్టుబడిదారు ప్రతినిధో అయి ఉంటారు అతని అజ్ఞానం సంఖ్యలు తెలుసుకున్నంత మాత్రంచేతపోదు సరేకదా వరసగా నాలుగు చెడు చిత్రాల ప్రొడక్షను చూసినా పోదు మీదు మిక్కిలి ఆ దుర్వ్యయపు పద్ధతులే అతనికి అనుభవంకింద లెక్కలోకి వచ్చేసి '' ఇంతకంటె తక్కువలో టాకీరాదు నాకు నాలుగేళ్ల అనుభవం వుంది గిట్టటమా? అది అదృష్టం!'' అంటాడు నాలుగేళ్ల అనుభవం ఉండికూడా ఫలానిరకం చిత్రం తియ్యటానికి ఫలాని డైరెక్టరు పనికివస్తాడని నిర్ణయించగలడా? భావి డైరెక్టరును గుర్తించి అతనికి తను మొదటి అవకాశం ఇవ్వగలడా? ఏమీ చెయ్యలేడు

ఇటువంటి విషయాలలో మనవాళ్లు అల్పసంతోషం కనబరుస్తున్నారు కొంతకాలంగా

ఈ లైనులో పనిచేస్తున్నవాళ్లు వాళ్లు నేర్చుకున్న పద్ధతులతోనూ, పారిభాషక పదాలతోనూ అపారమైన సంతృప్తి కనబరుస్తున్నారు ఇంతకాలమూ వారు సాధించినది ఏమీ లేకపోయినప్పటికీ ఈలైనులో దిగేవారుకూడా లక్షరూపాల చిత్రం తియ్యటానికి పూనుకునేముందు మూడువేలు తగలేసి ప్రొడక్షను వివరాలను నేర్చుకోవటానికి ఎటువంటి ప్రయత్నమూ చెయ్యరు

ఇటీవల మన చిత్రాలతాలూకు ఖర్చులపట్టీ బాగా పెరిగిపోయింది దరిద్రుడికి ధనికుల దురలవాట్లు అబ్బినట్లు, మన టాకీలకు ప్లేబాకు, రీరికార్డింగులూ, కొత్తకొత్త పబ్లిసిటీ విధానాలూ వచ్చిపడినై కళాదృష్టిలోనూ, వ్యాపారదృష్టిలోనూ వీటికి విలువలేదని నా తాత్పర్యం కాదు ఆ కళాదృష్టి మందగించి ఉందని! చిత్రంలో అయే ఖర్చులో ఒకటికి రెండింతలుగా తిరిగివచ్చే ఖర్చూ, వచ్చినదాకా నమ్మకంలేని ఖర్చూ ఉంటుంది ప్రేక్షకులు ఏయే అంశాలను శ్రద్ధతో గమనిస్తారో ఆ అంశాలమీద పెట్టిన డబ్బు మాత్రమే గట్టిగా తిరిగివస్తుంది అప్పటికీ నేనీ ఖర్చును అధిక వ్యయం కిందనే వేస్తున్నాను దుర్వ్యయం కింద వెయ్యటంలేదు ఆ దుర్వ్యయం వేరే వుంది

ప్రొడక్షనుకు షెడ్యూలు లేకపోవటం, ఉంటే దానిప్రకారం నడవకపోవటం – చిత్రం మూడు నెలల్లోగాని, నలభైఅయిదు షూటింగు దినాల్లోకాని పూర్తికాకపోవటం ప్రొడక్షనుకు నాధుడనేవాడుంటే ఇది జరక్కపోవటానికి కారణం ఉండదు – దైవికమైన కారణాలు తప్ప అవయినా ప్రతి చిత్రానికి రమ్మంటే రావు మూడు నెల్లనుకున్నది నాలుగు నెలలయితే పెరిగే ఖర్చులు చూడండి 15 వేలజీతాలు 20 వేలవుతై, 5 వేల లాడ్జిఖర్చులు 6 1/4 వేలవుతై, 5వేల పేపరు పబ్లిసిటీ, 5 వేల సాదరుఖర్చులూ కనీసం ఆరేసి వేలవుతై చిత్రం తియ్యటానికి కనీసపు కాలం 3 నెలలు కాక 4 నెలలనుకోండి అది కాస్తా 5 నెలలుగా పరిణమించి ఖర్చులు దాదాపు పైన చెప్పినంతగానే పెరుగుతై అయిదునెలల్లో మొదటి నుంచి కొసవరకూ పూర్తి అయిన చిత్రం ఈనాడు చాలా వేగంగా బయటపడ్డ చిత్రం అనిపించుకుంటుంది!

ఇటువంటి కారణంవల్ల దుర్వ్యయం జరిగితే ఆ తప్పెవరిది? ఎవరిదో ప్రొడక్షను చరిత్రను బట్టి ప్రతి చిత్రానికి నిర్ణయించవచ్చును కాని పెట్టుబడిదారు నామకహా ప్రొడ్యూసరుగా ఉండి డైరెక్టరే సమస్తమూ చేస్తున్నప్పుడు సామాన్యంగా పొరపాటు డైరెక్టురుదే అవుతుంది అధిక వేతనాలు తీసుకునే స్టార్లను ముందు పనిపూర్తిచేసి పంపిస్తే ప్రొడ్యూసరు – పెట్టుబడిదారైన ప్రొడ్యూసరు – ఎన్నడూ వద్దనడు( ఒకవేళ కారణాంతరాలచేత వద్దనేవాడయితే డైరెక్టరు అతనిచేత ఆమాట అనిపించటం మంచిది)

నిజానికి ప్రొడక్షను త్వరగా పూర్తికాకపోతే డైరెక్టరుకు ఎటువంటి నష్టమూ లేదు అనేకరకాల లాభం ఉందికూడానూ, అయితే ఆత్మాభిమానంగల డైరెక్టరు ఆ లాభాలకి పాల్పడడు చిత్రం త్వరలో పూర్తి కాక పోవటం డైరెక్టరుకు ఏమీ ఖ్యాతికరం కాదు కాని మన డైరెక్టర్లు ఈవిషయంలో చాలా నిర్లక్ష్యంగా ఉన్నారని చెప్పాలి

తారలు కావాలని కోరటంలో ప్రొడ్యూసరూ, డైరెక్టరూ ఒక అభిప్రాయంతో ఉండరు తారలవల్ల తనకు నాలుగుడబ్బులు రాలుతవని సంతోషించేవాడు ప్రొడ్యూసరు కాని డైరెక్టరుకు రాలే డబ్బు ఎప్పుడూ ఒకటే కాకపోతే తను తెరమీద చిత్రించే పాత్రలకు మంచి వ్యక్తిత్వం కలగటం కోసమని ఉత్తమ నటులకోసం దేవులాడతాడు డైరెక్టరు తన శిల్పాన్ని తక్కువ రకం

నటుల మీద వృధా చెయ్యటం ఏమంచి డైరెక్టరుకూ ఇష్టం ఉండదు అందుచేతనే హాలీవుడ్ చిత్రాల్లోకూడా పెద్ద డైరెక్టర్ల చిత్రాలకు తారాబలం చాలా ''బరువుగా'' ఉంటుంది కాని పాత్రపోషణ చెయ్యటంలో ప్రత్యేక ప్రతిభలేని డైరెక్టరు తారలకోసం అడగటంలో ఒకటే అర్థం ఉంటుంది తన అప్రయోజకత్వాన్ని తారల చాటున మరుగువరచటం కాని పైకిమాత్రం పెట్టుబడిదారుమీద అపారమైన అభిమానం ఉన్నట్టు నటించటానికి కావకాశం ఉంటుంది

ఈ తేడా ఎక్కడ కనిపిస్తుందంటే ప్రొడ్యూసరు తారకన్న మంచి పాత్రధారి దొరికినప్పుడు కూడా తారనే కోరతాడు –పాత్రకు తారకాస్తకుడి ఎడమగా ఉన్నాసరే మంచి డైరెక్టరట్లాకాదు తను చిత్రించే పాత్రకు మూడు మూర్తులా తగిన నటుడు దొరికితే ఇక తారకోసం కోరడు అతని చేతికింద ఆ నటుడు ఆకాశపధానవెలిసే అర్హత సంపాదిస్తాడు ఇవాళ చిత్రం రిలీజయితే రేపటికల్లా ఈ కొత్తతారను గురించి అందరూ చెప్పుకుంటుంటారు ఈవిధంగా కొత్తతారలు రాకపోతే పాతతారలు ఎంతకాలం ఉంటారు? కాలక్రమాన ఆకాశం తారారహిత మవుతుంది తన చేతిమీదుగా వందతారలను డైరెక్టు చెయ్యటం కంటే డైరెక్టరుకు ఒక కొత్తతారను సృష్టించటం గొప్పవిషయం

మన తెలుగు తెరమీద అత్యద్భుతంగా పోషించబడిన పాత్రగాని, దానికి కారకుడైన డైరెక్టరుగాని, నటుడుగాని లేడని చెప్పవచ్చు

ఈ పరిస్థితుల్లో మన డైరెక్టర్లు తారలు కావాలని అడావుడి చేసే పక్షంలో ప్రొడ్యూసర్లు ఏమరుపాటున ఉండరాదు తారలకోసం కాస్తాకూస్తో అధికంగా డబ్బు ఖర్చు చెయ్యటం ప్రొడ్యూసరు తనానికి లోపం తీసుకురాదు కాని డైరెక్టరు కీర్తి నిలబెట్టటానికి తారలకోసం ఎంతయినాసరే అంచానా లేకుండా ఖర్చు చెయ్యటం ప్రొడ్యూసరు తనం అనిపించుకోదు

ఇక ప్రస్తుతసమస్య తెలుగుటాకీ పరిశ్రమ లాభదాయకంగా ఉండాలంటే – ఏమిటి? కొత్త ప్రొడ్యూసర్లు చవుక చిత్రాలు తియ్యటానికి అనుభవం లేని ప్రయత్నాలు చేసి దివాలాలు తియ్యకుండా ఉండటమేనా? ఒక్కనాటికీ కాదు

కొత్తకంపెనీలు లక్షకు తక్కువలో చిత్రాలు తియ్యటానికి ప్రయత్నించి ఎన్నడూ దివాలా ఎత్తటం లేదు అందులో చాలా భాగం షేర్లు పోగుకాక దివాలా ఎత్తుతున్నై తీరా చిత్రం తియ్యటమే కలిగితే కొత్త కంపెనీలుకూడా తల తాకట్టు పెట్టి అయినా ఒక లక్ష తెచ్చి చిత్రం పూర్తి చెయ్యగలగుతున్నై కాని ఆ చిత్రాలలో కళాకాంతులు లేక చిత్రాలూ, వాటి వెంట కంపెనీలూ దివాలా తీస్తున్నై

ఇటీవల విడుదల అయి జయించలేకపోయిన 'ఉష' లో పద్మాసాలి గ్రామును పెట్టారు ఆమె తక్కువకు రాలేదు ఆవిడ మన పుష్పవల్లీ, శాంతకుమారీ మొదలైన వారితో సమంగా వేతనం పుచ్చుకుంది కాని చిత్రాన్ని లైనులో అనుభవం ఉన్నడైరెక్టరూ, సినేరియా రైటరూ, అదివరకు చిత్రాలు తీసిన స్టూడియో కలసి చెడగొట్టారు దానికి ప్రొడ్యూసర్ల కొత్తతనం కూడా ఆట్టే సహాయపడలేదు

ఒక్క తారకూడా లేకుండా తీసిన మరాఠీ 'తుకారాం' కళగల చిత్రం కావటంవల్ల దిగ్విజయం చేసివచ్చింది తన సామర్థ్యంలో విశ్వాసం ఉన్నశాంతారాం ' ఆద్మీ' లో ప్రఖ్యాతిగల శాంతాహుబ్లీకరును పెట్టుకున్నాడు అందువల్ల మన టాకీ పరిశ్రమ బాగుపడాలంటే

అందుకుగాను కొత్త ప్రొడ్యూసర్లు చేసేది గాని, చెయవలసిందిగాని ఏమీలేదు ఎవ్వరైనా చిత్రాలు తియ్యటంలో ప్రతిభా సామర్ధ్యాలు సంపాదించాలి - కొత్త ప్రొడ్యూసర్లయేది, పాత ప్రొడ్యూసర్లయేది ఆ ప్రతిభాసామర్ధ్యాలు అబ్బే వరకూ పరిశ్రమకు ముక్తిలేదు

ఆంధ్రపత్రిక, వారపత్రిక, 15-5-1940

# 11. సానుభూతి లేని సినిమా ప్రేక్షకుడు

ఇతనెవడో వింత మృగంఅనుకునేరు ఈ జాతికి చెందినవారిలో ఎంతో విద్యాధికులూ, సంస్కారులూ, మేధావులూ కూడా ఉంటారు ఇన్ని మాటలెందుకు? నేను ప్రత్యక్షంగా అదే జాతివాణ్ణి ఈజాతి వాళ్లు కూడా పుట్టటం మామూలుగానే పుడతారు సినిమా కళ ప్రథమ పరిచయం చేసుకున్నప్పుడు వీళ్లలో సహృదయత ఉండనే ఉంటుంది ఇతరులకన్న కాస్త ఎక్కువే ఉంటుందేమో కూడానూ! కాని క్రమంగా ఈ సహృదయత ఇగిరి పోతుంది కర్కశమైన విమర్శనా కాంక్ష - విమర్శించే విజ్ఞానం, ఉన్నాసరే లేకపోయినా సరే మిగులుతుంది

ఇది ఇల్లా జరగటానికి కారణం? నాకు తెలియదు చాలా కారణాలుండటానికవకాశం ఉంది ఇటువంటి వ్యక్తి సహజంగా విరసుడై ఉండవచ్చును ఇతనికి జన్మతహా ఒక విధమైన Inferiority complex ఉండి, తన్మూలంగా చప్పున అవశుడు కావటానికి అంగీకరించని బాపతుగా పరిణమించి ఉండవచ్చును, కళల విషయంలో ఆదర్శప్రాయుడై ఉండి, compromise సహించలేని పెంకివాడై ఉండవచ్చును, ఈ కళలో మొదట తగిన ఆసక్తి ప్రకటించి తప్పు గ్రహించి, రెండో extremeకు పోయిన reactionary కావచ్చును అతితెలివిగలవాడై ఉండి సామాన్యుల అభిరుచులకు మరీదూరం వెళ్లినవాడై, అందరూ ఆమోదించిన కళ పాలిటి యమకింకరుడుగా తయారయిన వ్యక్తి కావచ్చును

నిజానికి ఈ వ్యక్తుల పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకోవటం కంటె, వీళ్లను గురించి ఏమి చెయ్యవలసిందీ తెలుసుకోగలగటం చాలా అవసరం ఏమంటే, ఈ వ్యక్తులను నిరసించి సినిమా కళ ముందుకు పోతుందనేది కలలో మాట వంద మంది సహృదయుల వల్ల ఈ కళకు కలిగే ఉపకారాన్ని మించిన అపకారం ఈ ఒక్క వ్యక్తే చెయ్యగలడు ఒక కళా ప్రదర్శనాన్ని వందమంది మెచ్చుకోవటంవల్ల రుజావు కానిది, ఒకదాన్ని తిట్టగానే రుజావవుతుంది

ఈ వ్యక్తులు మొదటి చలనచిత్రం పుట్టిననాడే ఉన్నారు వాళ్ళు ఆ మొదటి చలన చిత్రాన్ని చూసినప్పుడే పెదిమ విరిచి, ''బాగానే ఉంది! కాని దీనివల్ల ఏమిటీ ప్రయోజనం?'' అన్నారు వాళ్ల మాటలు విన్న వాళ్లకి ఒళ్లు భగ్గున మండిపోయింది వాళ్ళని ''సహృదయులు'' పురుగుల కింద భావించారు కాని, క్రమంగా చలన చిత్రాలకు ప్రయోజనమంటూ వచ్చింది అదే వీరిలో ఉన్న విశేషం వీరిని ఎవరూ ప్రేమించరు, ఎవరూ సహించరు కాని అభివృద్ధి యావత్తూ వీరి కోసమే జరగవలసి ఉంది

పోనీ, అభివృద్ధి అవుతున్న కొద్దీ వీరి, ఉద్ధృతి తగ్గుతుందా అంటే, తగ్గదు - హెచ్చుతుంది క్రమంగా వీరి సంఖ్య పెరుగుతుంది అభివృద్ధి జాస్తి అయిన కొద్దీ వీరి అసంతృప్తి జాస్తి కావటమే వింత అయిన సంగతి మూకీలు మాట్లాడటం మొదలు పెట్టగానే వీళ్లు, శబ్దంవచ్చి

సినిమా కళను ధ్వంసం చేసిందంటారు వర్ణచిత్రం రాగానే రంగువచ్చి కళను తగలేసిందంటారు వీరట్లా అనకపోతే, ఇంత త్వరగా మనకు సౌండ్ టెంపో, కలర్ కాంపోజిషన్ రాకపోయి ఉండునేమో! వీళ్లు చచ్చుచిత్రాలను తేలికలో పోనిచ్చి ఒక మాదిరి మంచి చిత్రం కనిపించగానే అమాంతం విరుచుకుమీదపడతారు కాని, నిజం ఆలోచిస్తే వీరివల్ల చచ్చు చిత్రాలు పొందలేని సహకారం మంచి చిత్రాలు పొందుతై! వీళ్ల మాటలు సహించటం ఎంత కష్టమో, వీరి మాటలను పాటించటంవల్ల అంత ప్రయోజనం ఉండటానికవకాశం ఉంది

ఇక వీళ్లను గురించి ఏం చెయ్యాలనేది సమస్య వీళ్లను తృప్తి పరచటానికి ప్రయత్నించటం కంటే వేరే మార్గంలేదు అందువల్ల నమ్మకంగా నష్టం ఉందని తోచనప్పుడు తప్ప, మిగతా విషయాలలో వీరిని సంతోషపెట్టటానికి ప్రయత్నించినందువల్ల సినిమా కళ అభివృద్ధి అయే అవకాశాలు చాలా ఉన్నై ఆఖరుకు వీళ్లు తృప్తిపడి సంతోషిస్తారని కాదు వీళ్లని తృప్తి పరిచేప్రయత్నానికి ఫలితం సినిమా కళను అభివృద్ధి చేసుకోవటమే

మాటవరసకు చూడండి – ఒక ఉత్తమ పాత్రను ఆదర్శప్రాయంగా సృష్టించినట్టయితే, ఈ ప్రేక్షకుడు ఆగ్రహంతో చిందులు తొక్కి, అది వట్టి అభూతకల్పన అని కేకవేస్తాడు అందుకని అటువంటి పాత్రలు కల్పించకండి అందువల్ల లాభం ఏమంటే పాత్ర కల్పనలో యాదార్థం జాస్తి అవుతుంది సినిమాకళకు కావలసిందే అదీ! దుష్టపాత్రలను కూడా అసహ్యం పుట్టించేటట్టు కల్పిస్తే ఈ మనిషి అసహ్యించుకుంటాడు వాడికి నచ్చేటట్టు దుష్ట పాత్రలను కల్పిస్తే పాత్ర పోషణ మరింత బాగుంటుందనటానికి సందేహమేమీ లేదు ఇతను అన్నివిధాలా తలకిందు మనిషి కనక నీతిలో, నిస్పృహా, బాధలో ఆనందమూ, ఆనందంలో బాధా, మంచిలో చెడూ, చెడులో మంచీ – ఇటువంటివి కోరుతాడు వాడి కోరికలు తీర్చేటందుకు సినిమాకళ అభివృద్ధి అయితీరాలి హాలీవుడ్ చిత్రాల్లో ఈ వ్యక్తిని తృప్తిపరిచే ప్రయత్నాలు అంతులేకుండా కనిపించుతై కథానాయకుణ్ణి పట్టుకుని అల్లరి చేసినా, కథానాయికను వేళాకోళం చేసినా, రసవంతంగా వెళ్లిపోతున్న ఘట్టాలకు రసాభాసం వాటిల్లినా ఇదంతా సానుభూతిలేని ప్రేక్షకుల కోసమే ననుకోండి ఇటువంటివిలేని చిత్రం దాదాపు కనిపించదు––హాలీవుడ్ చిత్రాల్లో

కళ త్రాసుతూకం వంటిది అది ఏ ఒక్క పక్కకూ చిత్తుగా ఒరిగిపోరాదు ఆ తూకం తప్పితే, అది ఒక కళ కాదు –సెంటిమెంటాలిటీ అవుతుంది, పక్షపాతమవుతుంది అశక్తత అవుతుంది కళను ఈ దుర్దశనించి రక్షించగలవాడు సానుభూతిలేని ప్రేక్షకుడు వీడి అంశ ఆఖరుకు పబ్లిసిటీలో కూడా కనిపిస్తుంది వాళ్లు తారలను గురించి రాసేటప్పుడు ఆతారమీద కించిత్తు కూడా అభిమానం లేనివాణ్ణి మరవరు వాడికోసం రెండు వాక్యాలయినా తగలేసి మరీ వ్యాసం పూర్తిచేస్తారు ఏ తారనూ స్వేచ్ఛగా ఆకాశపధాన ఉండనివ్వరు హాలీవుడ్ పత్రికలు చదివేవారు ఈ విషయం అనేకసార్లు గమనించి ఉండవచ్చు ఒక ముక్కలో చెప్పాలంటే, ఈ సానుభూతిలేని ప్రేక్షకుడు కళాకారుడికి నిగ్రహమనేది ఏమిటో నేర్పుతాడు అది చాలా మంచి పాఠం నిగ్రహం లేకుండా ఉత్తమ కళలేదు మన తెలుగు సినిమా ప్రపంచంలో నిగ్రహమే లేదు మన ప్రొడ్యూసర్లు సానుభూతి చూపే ప్రేక్షకులనే మనస్సులో నిలకడగా ఉంచుకోలేకుండా ఉన్నారు వారికీవ్యాసం ఉపకరిస్తుందని ఎట్లా అనుకుంటాను?

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 20–11–1940*

# 12. సినిమా కథ

బాగా రాసినది మంచికథ బాగా రాయటానికి వీలు లేనిది – అటువంటి దేదైనా వుంటే – అది చెడ్డ కథ శిల్పం తెలిసిన వాడు తగుమాత్రం నిర్బంధాలకు లోనయికూడా తన ప్రజ్ఞ చూపించలేకపోడు –బొత్తిగా కాళ్ళూ చేతులూ అంటగట్టితే ఎవరూ కదలలేరు

మంచి కథలు లేవని దిగులుపడుతున్న ప్రొడ్యూసర్లకీ, బాగా కథలు రాయగలమని నమ్ముతున్న కథకులకూ లంగరందదనే అభిప్రాయం చాలా వరకు పొరపాటే అంటే, మంచి కథకుణ్ణి తీసుకుంటే వాడు తన అభిప్రాయాలు పాటించడేమోనని ప్రొడ్యూసరు భయపడటమూ, ఒక ప్రొడ్యూసరు కిందికి పోగానే అట్లా చెయ్యి, ఇట్లా చెయ్యి' అని తనని శాసిస్తాడేమోనని కథకుడు భయపడటమూ –రెండూ పొరపాటే దురదృష్టవశాత్తూ ఈరెండు రకాల మనస్తత్వమూ నా ఎరుకలోకి వచ్చింది

కథకుడి కళకోసం ఏ ప్రొడ్యూసరూ ఒక లక్షరూపాయిలు గోతిలో పోసుకోడు చిత్రాలు కథా శిల్పానికి ప్రచారం ఇవ్వటానికి ఉద్దేశింపబడినవికావు కథకుడు ఒక్కనాటికీ అటువంటి ఆపోహపోరాదు

ప్రొడ్యూసరుకు తన అభిప్రాయాలు ( కథావస్తువూ, పాత్రలసంఖ్యా, కథయొక్క జాతీ) కథకుడికి తెలిపి, తన అభిప్రాయాలు అతను పాటించేట్టు చూడటానికి అర్హత పొంది ఉన్నాడు కాని, కథాశిల్పం జోలికి రావటానికి ప్రొడ్యూసరున్నూ అర్హుడు కాడు '' ఇక్కడ సంభాషణ పెట్టూ, ఇక్కడ ఇటువంటి నటన సూచించూ!'' ఈవిధంగా ప్రొడ్యూసరు కథకుణ్ణి తగిలితే, నష్టపడేవాడు కథకుడు కాడు ఇటువంటి విషయాలు కథకుడికి చెప్పదగిన సామర్థ్యం వున్న ప్రొడ్యూసరు కథకుడికిచ్చే డబ్బు బూడిదలో పోసిన పన్నీరే

ప్రతి చక్కని కథా చక్కని చిత్రంకాదు కనక కథకులే చిత్రాలని ఉద్ధరించాలని లేదనీ, నవలా కారులూ, నాటకకారులూ, కథలూ ఉన్నట్టు సినారియోలు రాసేవాళ్లు కూడా తయారు కావాలని కొద్దిమంది అభిప్రాయపడుతున్నారు దీన్ని నేను ఘట్టిగా కాదనను కాని, ఈసందర్భంలో గమనించదగిన విశేషం ఒకటుంది ప్రతి చక్కని కథా చక్కని చిత్రం కాదు, నిజమే, కాని ప్రతి చక్కని కథా చిత్రమూ ఉన్నదున్నట్టు చక్కని కథ అవుతుంది, దాన్ని నవల నుంచి తీసుకుని ఉండినాసరే, నాటకం నుండి తీసుకుని ఉండినాసరే అంతే కాదు, చక్కని చిత్రం ఉన్నదున్నట్టుగా చక్కని నవలగాని చక్కని నాటకంగాని కావటం దాదాపు అసంభవం కథా శిల్పం అంత విశాలమైనది

ప్రస్తుతం మనకు సినారియోలు రాయటానికి కథకులకన్నా అర్హులు లేరు వీళ్ళు నేర్చుకోవలసిందల్లా ఏమంటే నిర్బంధాలకు కుంగిపోకుండా ఉండటమూ, అంగుళం జాగా ఇస్తే, అందులోనే వీలయినంత తమ శిల్పసామర్థ్యం ప్రకటించటమూనూ

కథా శిల్పం చిత్రానికెంత ఉపకరించేదీ చూపటానికి ఒక చిన్న ఉదాహరణ ఇస్తాను ''love you again'' అనే చిత్రం ఒకటి తీశారు మెట్రో గోల్డ్విన్‌మేయరు వారు ఇది మహత్తర చిత్రాల శ్రేణికి చెందదు ఇందులో వినోదానికి ప్రాముఖ్యత కాని, ప్రచారంగాని, ఒక నీతిగాని

ఉన్నట్టు పైకికనిపించనైనా కనిపించదు అట్లా కనిపించినట్టయితే మన వినోదం భంగపడుతుంది గూడానూ

సంగ్రహంగా ఈ చిత్రం తాలూకు కథ ఏమిటిటంటే కెర్రీ అనేవాడు కొంత కాలం అనుమానాస్పదమైన జీవితం గడిపాడు జూదాలాడాడు కుట్రలు పన్నాడు, డబ్బు సంపాదించాడు, పోగొట్టుకున్నాడు, వాడికాజీవితం మీద విరక్తి పుట్టింది పెద్దమనిషి అయి నలుగురూ ఆమోదించే దోవతొక్కి, సంఘానికిష్టమైన పనులేచేసి 'గౌరవంగా' బతికితే ఇహమూ పరమూ ఉందని నమ్మి 'పెద్దమనిషి' అయినాడు వాడి కోరిక ఫలించింది చప్పున పైకి వచ్చాడు అన్ని రకాల సంఘ సేవలలోనూ వేలుపెట్టాడు పెద్ద ఎస్టేటు సంపాదించాడు పెద్ద సంస్థలకు అధిపతి అయినాడు ఒక కుండల పరిశ్రమ స్థాపించాడు స్కౌటు వుద్యమంలో పాల్గొని, దాన్ని ప్రోత్సహించాడు పెద్ద పెద్దవాళ్ల జాబితాలో చేరాడు ఒకతెను ఆకర్షించి పెళ్లాడాడు తాగుడు మానేశాడు – ఎన్నడూ తనకభ్యాసం లేనట్టే నటించాడు మద్య నిషేధోద్యమానికి తన ఊతకూడా ఇచ్చాడు తన పేరు విల్సన్ అని మార్చుకున్నాడు

విల్సన్ వింత వ్యక్తి అతని కిప్పుడు మానవ స్వాభావికమైన దౌర్బల్యాలు కొన్ని లేవు అతను ఆడవాళ్ల జోలికిపోడు తన భార్యతోనే అతనికి ప్రసక్తిలేదు తాగడు, డబ్బు దగ్గిర గట్టిపట్టు పడతాడు ఏ వస్తువులైనా, కానీ ఎక్కువ ఇచ్చినట్టు అనుమానం తగిలితే నానా అల్లరీ చేస్తాడు ఏ వస్తువు కొన్నా అతి చౌకగా చూసి కొంటాడు తన భార్యకు వాడుకునేటందుకు అతి మితంగా ఇస్తాడు అతనికాభార్య ఔచిత్యం కోసమే ఆఖరుకు తన ఇనప పెట్టెకు ఒక అలారం కూడా పెట్టుకుని బందోబస్తు చేసుకున్నాడు తన ఆఫీసు పనుల్లో ఎవరిన్నీ నమ్మడు అన్నీ తను స్వయంగా చూడటానికి ప్రయత్నిస్తాడు పన్నెండు సంవత్సరాలుగా పనిచేస్తున్న వాళ్లు కూడా ఏదీ తమకు తాము నిర్ణయించుకోవలసిన అవసరం లేదు అతను ఒకనాడాఫీసుకు రాకపోతే, కొండంత పని పేరుకుంటుంది అతన్ని ఎవరూ ప్రేమించరు అతని భార్య విసర్జించి విడాకులు ఇచ్చి, మరొకణ్ణి పెళ్లాడటానికి సిద్ధంగా ఉంది

ఈ స్థితిలో ఒకనాడు విల్సన్ పడవమీద ప్రయాణం చేస్తుండగా ఒకడు (పూర్వం కెర్రీ జీవించినట్టే జీవిస్తున్నవాడు) తాగి ఉండి సముద్రంలో పడతాడు అతన్ని రక్షించబోయి విల్సను కూడా సముద్రంలో పడిపోతాడు ఆసందర్భంలో అతని తలకు పెద్ద దెబ్బ తగిలి, మతి చెడిపోతుంది జరిగిన తొమ్మిదేళ్లూ అతనికి మరుపొస్తై, విల్సను కాస్తా ఒక్క దెబ్బతో కెర్రీ అయి ఊరుకుంటాడు అతను ఇప్పుడు తన మొహం తానే గుర్తించలేడు తన భార్యను గుర్తించలేడు, తన ఈనాటి జీవితం గురించి అతనికేమీ తెలియదు

ఈతెలియని స్థితిలో కెర్రీ వెళ్లి విల్సను వాతావరణంలో పడతాడు తన భార్య అతన్ని ఆకర్షిస్తుంది ఆమెను చూస్తూనే ప్రేమిస్తాడు ఆమె తన భార్యే అని తెలిసిన ఆనందం కాస్తా, ఆమె తనతో భార్యగా జీవించటం లేదనీ, తనకు విడాకులిచ్చి మరొకణ్ణి పెళ్లాడబోతున్నదనీ తెలిసి తుడిచి పెట్టుకుపోతుంది కే మీది ప్రేమతోపాటు ఆర్థికమైన చిక్కు కూడా వచ్చింది దగ్గిర కొన్ని వేలు లేందీ కెర్రీకి ఊపిరి సలపదు విల్సనుకు డబ్బుతో కంటే పైకివచ్చే ఆశయాలవని జాస్తి అక్రమంగా డబ్బు సంపాదించటానికి ప్లాను వేస్తాడు కెర్రీరూపం ధరించిన విల్సన్, ఇటువంటి కుట్రలు నేర్చిన వాణ్ణి ఒకణ్ణి దగ్గరికి తీసి, తన ఆవరణలో ఉన్న నీళ్ల గుంటలో

కిరసనాయిలు డబ్బాలు పాతిస్తాడు నూనె కొంచెం కొంచెమే పైకుబుకుతుంటే, ఎవరైనా చూసి అస్థలం కొనెయ్యటానికి డబ్బు కుమ్మరిస్తారు అదే కెర్రీ ఆశ

ఈలోపుగా కే తన భర్తలో కలిగిన మార్పుకు కారణం తెలుసుకోదు కాని, మార్పు తెలుసుకుంటుంది అతను తన్ను ఒక్క క్షణం వదిలిపెట్టలేడు విడాకుల విషయం అయిదారు వారాలు ఆగమని అతను తనను బతిమాలుతున్నాడు అయిదారు వారాలలో విల్సను ఏదో ఎలెక్షనుకు అభ్యర్థిగా నిలబడబోతున్నాడు విడాకులు అపజయకారణం కావచ్చునని భయపడుతున్నాడు కాబోలనుకున్నది కే నిజానికి కెర్రీకి విల్సను ఎలక్షను గొడవే తెలీదు తను డబ్బడిగితే రెండు వందలు తీసి చేతిలో పెట్టాడు భర్త తన వెంటవచ్చి తనకవసరంలేని దస్తులు ఎంతో ఖరీదువి కొన్నాడు ఇతని పిసినిగొట్టుతనాన్ని షాపువాళ్లు అవమానపరస్తే పడ్డాడు కేకు ఇదేమీ అర్థం కాలేదు తన భర్త మారాడనీ మారగలడని అనుకోవటం కేకు అసాధ్యమయింది కాని అతని ప్రేమలో ఏమీ వంచనలేదు

తనని భర్త ఈవిధంగా వెన్నంటటానికి కారణం ఊహించింది – అతని వస్తు భ్రాంతి అతనిలో ఈ మార్పు తెచ్చింది తనను వదలటం ఇష్టంలేక ఈ ప్రేమ నటిస్తున్నాడు, పిసినిగొట్టు! అనుకున్నది కే కానిఅట్లాగూ నమ్మకం చిక్కలేదు ఏమంటే అతని చేష్టలు రాయిచేసుకున్న తన మనస్సును చలింపచేస్తున్నై రెండు మూడు సార్లు ఆమెచేత తృణీకరింపబడి, కెర్రీ తన భార్య జోలికి పోవటం మానేశాడు కాని, దూరాన ఉన్నప్పుడు కూడా అతని కామెమీదగల ప్రేమ కనిపిస్తూనే ఉంది దీని అంతేమిటో కనుక్కోవాలనుకున్నదికే అతను తనవెంటపడటం మానేసిన తరవాత తనే అతని వెంట పడసాగింది విడాకుల ఆలోచన ఇప్పుడామె మనస్సులో లేదు

ఈ లోపుగా 'నూనె' ఎత్తు పారింది ముగ్గురు ధనికులు అతని మీద డబ్బు కురిపించటానికి సంసిద్ధులైనారు కాని కే ప్రేమను సంపాదించిన కెర్రీకి తీరా దుర్మార్గం చెయ్యటానికి బుద్ధి పోలేదు ' ఈనూనెతో నాకేమీ ప్రసక్తిలేదు ' అని చెప్పెయ్యటానికి వెళ్లాడు కెర్రీ వాళ్లెవ్వరూ– ముఖ్యంగా అతనితో లాలూచీగా పనిచేస్తున్నవాడు – ఒప్పుకోలేదు పైగా వాడు తనమీద చెయ్యికూడా చేసుకున్నాడు ఒక్క దెబ్బతో కెర్రీ విరుచుకుపడ్డాడు

ఈలోపుగా తన భర్తకు మతి పోయిన సంగతి తెలుసుకున్నది కే ఆమెకిప్పుడు తన భర్తలో కలిగిన మార్పు అర్థమయింది ఆమె అతనున్న చోటికి పరిగెత్తి వచ్చింది కెర్రీ దెబ్బతిని కిందపడేటప్పుడు ఆమె అక్కడే వుంది

మీద నీళ్ళు పొయ్యగా కెర్రీకి స్మృతితెలిసింది కాని అతనికి మరోసారి మతిభ్రమ కలిగినట్టు స్పష్టమయింది అతను చుట్టూ ఉన్నవాళ్లను చూసి''మీరంతా ఎవరు? ఇక్కడేం చేస్తున్నారు?'' అని అడిగాడు నూనె విషయం మాట్లాడటానికి వచ్చామంటే, ఏమి నూనె అని అడిగాడు ఇక చేసేది లేక ఎవరిదారిన వారు వెళ్లిపోయినారు కే మాత్రం మిగిలింది కాని ఆమె దుఃఖం పట్టలేకుండా వుంది ఆమె కెర్రీని ప్రేమించగలిగేటప్పటికి కెర్రీ కాస్తా మళ్లీ విల్సనయినాడు తను మనస్పూర్తిగా ద్వేషించిన విల్సన్, అతని నెత్తినా ఏదన్నా పెట్టిగట్టిగా కొడదామనుకుంది కాని చెయ్యిరాలేదు

నిజానికి అటువంటిదేమీ అవసరం లేదు ఏమంటే కెర్రీ విల్సను అయినట్టు నటించాడే కాని, నిజంగా మారలేదు నటించటం వల్ల నూనె పీడమాత్రం విరగడయింది కే అశ్రువులు

ఆనందాశ్రువులుగా మారినై

ఈ కథను చిత్రంగా తియ్యటంలో అనేక ఇబ్బందులున్నై దీన్ని ఉన్నదున్నట్టు చూపాలంటే నాయకుడి జీవితంలో మూడు ఘట్టాలు చూపాలి ముందు క్రెగ్రీ జీవితం సంగ్రహంగా చూపాలి క్రెగ్రీ సంస్కారంపొంది విల్సన్ అయిన తరవాత విల్సను చరిత్ర చూపాలి అతను ప్రమాదవశాన మళ్ళీ క్రెగ్రీ ప్రకృతి అవలంబించి ఈ కొత్త స్వరూపంతో విల్సను జీవిత వాతావరణంలో పడ్డ పాట్లు చిత్రించాలి ఉపజ్ఞ లేనివాడు అట్లాగే చేస్తాడు కూడానూ

కాని, ఈ చిత్రంలో సరి అయిన కథా శిల్పం వినియోగపరిచి పునరుక్తి లేకుండా చేశారు చిత్రం విల్సను క్రెగ్రీగా మారటం దగ్గిర ప్రారంభించారు మొదటి క్రెగ్రీ జీవితమూ, అటు తరువాత మారిపోయిన విల్సను ప్రవృత్తి రెండూ క్రెగ్రీ జీవితంలో ప్రతి ఫలించేటట్టు చూపారు కామెరా కెదురుగా మనిషిని నిలబెట్టి వాడివెనక అద్దం పెట్టి, ఒకేసారి వాడిముందువెనుకభాగాలు ఫోటో ఎత్తినట్టే క్రెగ్రీ తాగటానికి ప్రయత్నిస్తే విల్సను తాగడని బయటపడుతుంది క్రెగ్రీ భార్యను ప్రేమించబోతే, విల్సను ఆడదాని ప్రేమకు అర్హుడు కాడని తెలుస్తుంది క్రెగ్రీ ఆఫీసులోకి పోయి ఎవరి పనిలోనూ జోక్యం కలిగించుకోలేని స్థితిలో ఉంటే విల్సను అందరిపని తనే చేసేవాడని బయటపడుతుంది క్రెగ్రీ తన ఇనపపెట్టి తానే దొంగిలించబోతే, విల్సను చాలా జాగ్రత్త మనిషి అని రుజువు అవుతుంది క్రెగ్రీ భార్యకు దుస్తులు కొనబోతే అతను వట్టి పిసినిగొట్టని బయట పడుతుంది

కథను ఇట్లా మడవటం వల్ల కథలో ఉన్న పెద్దలోపం ఒకటి మాటుపడింది విల్సను జీవితమంతా చూపి ఒక్క దెబ్బ కారణంగా అతను పూర్తిగా మారినట్టు చూపితే ఎవరు నమ్ముతారు? చూడటానికి విసుగనే మాట అట్లా ఉంచి! ఈ రెండు ఉపయోగాలూకాక మూడోది కూడా సాధ్యమయింది అదేమిటంటే ఈ కథలో ఉన్ననీతి ఒకడు తప్పుడు పనులు చేస్తూ ప్రేమించదగిన వ్యక్తిగా ఉండి, 'పెద్దమనిషి' అయి ప్రేమకు అనర్హుడవుతాడు మంచి పనులు చెయ్యటానికీ మంచి తనానికీ సంబంధం లేదు, ప్రేమ మనిషిని సంస్కరిస్తుంది --సంస్కారం ప్రేమకు దోహదం చెయ్యలేదు అదే ఈచిత్రంలో ఉన్న నీతి కథను ఈ నీతికి సూటిగా నడిపితే ఈ చిత్రం చూడటానికి దుర్భరం అయి ఉండును నీతి గిట్టనివాళ్ల కోసం ఇందులో ఉన్న నీతిని మరుగుపరిచారు

అదీశిల్పం అటువంటి శిల్పం మన చిత్రాల్లో ఉపయోగించాలంటే కథకుణ్ణి నమ్ముకోండి

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 22-1-1941*

# 13.సినిమా పేజీ

ఇటీవల నన్నొక యువక డైరెక్టరుగారు ''జీర్ణం'' కాని విషయాలను తీసుకుని సినిమా వ్యాసాలు రాస్తున్నందుకు మందలించారు అంతకు పూర్వం మరొక డైరెక్టరుగారు నేనూ,నాబోటి రచయితలూ చేసే విమర్శలలో ప్రొడ్యూసరు కష్టసుఖాలు తెలిసిన లక్షణం లేనందుకు ఎదట తప్పుపట్టారు

సినిమా పేజీలు నింపే వాళ్లమీద ఉండే నేరారోపణ ఇదీ ఈ రచయితలకు పుస్తకాలు

చదివిన అనుభవంతప్ప మరో అనుభవం లేదు, అనేక సంవత్సరాల అనుభవం ఉన్నవారికి వీరు తప్పులు దిద్దవస్తారు, తమకు తెలిసీ తెలియని విషయాలను గురించి తెలిసినట్టు రాస్తారు

ఈ నేరారోపణ సక్రమమైనదని మనమంతా అంగీకరించ వలసినదేగాని మరొకటి కాదు ''తెలుగు చిత్రాలు బాగుపడాలంటే?'' ''నిజమైన డైరెక్టరు ఎవరు?'' ''టెంపో అంటే ఏమిటి''? మొదలైన శీర్షికలతో మనవాళ్ళు రాసే అసంఖ్యాక వ్యాసాలు మన సినిమా పరిశ్రమను బాగు చేయలేకుండా ఉన్న సంగతి ప్రత్యక్షంగా కనిపిస్తుంది

ఈ 'అజీర్ణ' విషయాలు గల రచనలను చదివి మన ప్రేక్షకులు చెడిపోతున్నారన్నప్పటికీ కాదని నిరూపించలేని స్థితిలో ఉన్నాం మనం సినిమా కళ యొక్క విలువలు తెలియని వారు మన చిత్రాలను విమర్శించటం వల్ల మన చిత్రాలలో గొప్పతనం అర్థంకాక ప్రేక్షకులు వాటిని తగినంత ఆదరించలేకుండా ఉన్నారన్నా కాదనటానికి లేదు

ఈ సందర్భంలో నేను అనదలచిన ముక్క ఒక్కటే ఉంది అనుభవం ఉండి, 'జీర్ణ' విషయాలు రాయగల మన డైరెక్టర్లూ, ప్రొడ్యూసర్లూ, సినిమా పేజీలు చించి, ప్రేక్షకుల సినీ విజ్ఞానాన్నీ, రస గ్రహణ శక్తినీ పెంపొందించరేం? విమర్శలు సరిగా లేని కారణంచేత తమ చిత్రాలకు నష్టం కలుగుతూంటే నిస్సహాయులై చూస్తూ ఊరుకుంటారేం? పత్రికా పాఠకులకు జ్ఞానోదయం కలిగించే పాడుపని నాబోటి రచయితలకే వదిలేస్తారేం? 'మీరు రాసేది మేం వేసుకోం! మాకు తెలియని వాళ్ళు రాసేదే కావాలి!' అని పత్రికల వాళ్ళున్నారా? అప్పుడు కూడా పత్రికల్లో స్థలం కొనుక్కొని మరీ రాయవచ్చుగా! ఎడ్వర్టయిజుమెంట్లకు మన ప్రొడ్యూసర్లు ఎంత డబ్బు ఖర్చు చెయ్యటం లేదు? తమకు కర్తా కర్మా క్రియలు కూర్చటం కూడా చాతకాదా? అది చాతనయిన వారిని కూడా ఆర్టిస్టులతో పాటు బుక్ చేసి, వారికి చెప్పి రాయించుకోవచ్చుగా!

ఈ సంశయంతోనే చాలా కాలం బాధపడ్డాను –వట్టి అమాయకుణ్ణి గనక, ఆఖరుకు దీని అంతరార్థం నాకు తెలిసింది ఈవిషయంలో నాకు తోచింది బయట పెడతాను

ఒకటి రెండు పిక్చర్లలో పనిచేసి కొంత అనుభవం సంపాదించినంత మాత్రంచేత మన ప్రొడ్యూసర్లకు తెలిసిపోయిన రహస్యాలేమీ లేవు కాస్త తలకాయ ఉండి వారానికి రెండు మూడు మంచి ఇంగ్లీషు చిత్రాలు విమర్శగా చూసేవాడికి తెలిసిన రహస్యాలలో వీరికి సగం కూడా తెలియవు కాకపోతే ఫిలిం ప్రపంచంలో అడుగు పెట్టినవాణ్ణి 'నీకేం తెలుసు' అని సాగదీసి అడగటానికి అర్హత ఒకటి వస్తుంది ఆ అర్హతను దుర్వినియోగపరచకుండా ఉండే పెద్ద మనిషితనం లేని వాళ్ళు చప్పున నోరు చేసుకొని పైన చెప్పిన మాట అనేస్తారు

సినిమా అనుభవం ఉన్నవారు బొత్తిగా వ్యాసాలు రాయకపోలేదు అనుభవం లేనివాళ్ళు రాసిన వ్యాసాలకంటే అవి ఏవిధంగా బాగున్నాయో ఇంకా రుజూవు కాలేదు ఆవ్యాసాల వల్ల ఆటగాడి కంటె చూచేవాడికి ఎక్కువ ఆట బోధపడుతుందని కూడా రుజవయింది

ఒక వేళ మన అనుభవజ్ఞులకు నిజంగా కొన్ని రహస్యాలు తెలిసే ఉన్నప్పటికీ వాటిని బయట పెట్టాలనే కోర్కె వారికేమాత్రమూ లేదు ప్రజలకు విజ్ఞానం లభించాలని కూడా వారికి కాంక్షలేదు ప్రొడ్యూసర్లకు కావలసిందల్లా, తాము తీసే చిత్రాలు పైదేశాల వాళ్ళు తీసే చిత్రాలకే మాత్రమూ తీసిపోవనే విశ్వాసం సినిమా పేజీల ద్వారా కలగటమే ఆ విశ్వాసం కలిగించటానికి

నాపాటి రచయితలు ఎన్ని తెలియని రాతలు రాసినా మన ప్రొడ్యూసర్లు అభ్యంతర పెట్టరు మచ్చుకు ఒక్క ప్రొడ్యూసరైనా, "నా చిత్రాన్ని ఫలానా ఆయన తెలియకుండా మెచ్చుకున్నాడు" అన్న పాపాన పోయినాడా? – ఆ చిత్రం వట్టి చెత్త అనీ, అందులో ఏమీ లేదనీ దానికి వచ్చిన డబ్బును బట్టి రుజువయి నప్పుడైనా! ఇంక పొడ్యూసర్లకు నాపాటి సినిమా పేజీ రచయితల తరఫున రెండు ముక్కలు సలహా ఇస్తాను

'నిజమైన ప్రొడ్యూసరు' లక్షణాలు తెలిస్తే, 'తెలుగు చిత్రాలు బాగుపడాలంటే' ఏం చెయ్యాలో తెలిస్తే, మేం వ్యాసాలు రాస్తూ కూర్చుంటామా? మీలాగే సినిమా లైనులోకిదిగి మీరు చేసిన పనే చేసి చూడటానికి గట్టి ప్రయత్నం చేస్తాం ఒకరి మొహాన్నే పొద్దు పొడవలేదు చాతనయిన ప్రతివాడూ సినిమా లైనులోకి దిగవచ్చు ఆంక్షలేమీ లేవు కనక మేం రాసే రచనలు కేవలము ప్రబోధానికీ ప్రచారానికీ అనుకోనక్కర్లేదు అయినప్పటికీ తెలుగు చిత్రాలు బాగుపడాలనేయావ మీకన్న మాకు ఎన్నో రెట్లున్నది ఆ ఆదుర్దాకొద్దీ, అనుభవం లేకపోయిన్నప్పటికీ మాసూచనలు మీకేమైనా పనికొస్తాయేమోనని రాసి – చూస్తున్నాం పనికిరాకపోతే మిమ్మల్ని తీసుకునేట్టు చేసే శక్తిమాకు లేదు మా తప్పులు సరిచేసే అధికారం మీకు ఉంది – మేము విమర్శించలేని ప్రతిభా, అర్థం చేసుకోలేని శిల్పమూ మీరు ఇంతవరకూ ప్రకటించలేదు దానికి సాక్ష్యం ఏమంటే మమ్మల్ని మీ చిత్రాలు తన్మయత్నంలో ముంచ లేకపోవటమే మీదుమిక్కిలి మాలో ఉన్న విమర్శనా బుద్ధిని మీ చిత్రాలు జాస్తిగా రెచ్చగొట్టుతున్నై విమర్శనకూ తన్మయత్వానికీ ఉన్న సంబంధం అర్థంచేసుకోండి మీమీద మాకు పగలేదుగాని మారాతలు మీకు డబ్బూ దస్కమూ ఇవ్వనక్కర్లేని పబ్లిసిటీగా పనిచేయాలనుకుంటే మాత్రం మీరు చాలా పొరపడుతున్నారు

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 5-2-1941*

# 14. అమాయిక–మాలతి

నటించటం చాత కాదు గాని, చాతయినట్టు నటించదు పాడటంలో ప్రతిభాలేదు, వెర్రీలేదు ఒక విభ్రమ గాని ఒక ఆశ్చర్యం గాని, ఒక జుగుప్సగాని కలిగించకుండా తెరమీద చూస్తున్నంతసేపూ ప్రాణానికి హాయినిస్తూ, అమాయికల్లే ఉంటుంది , ఈ రోజున నా అభిమానతార– మాలతి

*ఆంధ్రపత్రిక వారపత్రిక, 9-4-1941*

# 15. మనలో మంచినటులు లేరా ?

మనలో లేంది మంచి ప్రొడ్యూసర్లు!
పనికిరాని నటులను తెలుసుకోలేని ప్రొడ్యూసరు
పనికొచ్చే వారిని తెలుసుకుంటాడా ?

----------

ఏ హిందీ ఫిలిమో, ఇంగ్లీషుఫిలిమో చూసి వస్తే ఆ ఫీలిములో చక్కగా అందరూ నటించేవాళ్లే అనిపిస్తుంది చిల్లర పాత్రల దగ్గర్నించీ చూడ ముచ్చటగా ఉంటారు, చెప్పిన నాలుగు

ముక్కలూ ఇంపుగా చెప్పినట్టుంటుంది మన చిత్రాల్లో ఎక్కడో ఒక చోట ఎంత మంచి నటుడయిని చిరాకు తెప్పిస్తాడు ఎందువల్ల?

మామూలు ప్రేక్షకుడికి ఇది ఒక సమస్య అతని ప్రాణానికి హిందీఫిలిములకూ, మన ఫిలిములకూ ఉన్న తేడాయే ననిపిస్తుంది

చిత్రాలు తీసేవారిలో కూడా ఇట్లా భావించేవాళ్లున్నారు ''మనలో నిజంగా నటులు లేకపోవడం నుంచే మనం మంచి చిత్రాలు తియ్యాలేకుండా ఉన్నాం'', అనే ప్రొడ్యూసర్లున్నారు మనదేశంలో

ఇదంతా ఆడలేక మద్దెల ఓడన్న సామెతగా ఉంది ఆశోకకుమార్, కిశోర్ సాహూలకన్న ధీరోదాత్తమైన మొహాలు కలవాళ్ళు, సర్దార్ అఖ్తార్, జ్యోతి మొదలైన వారికంటే అందగత్తెలూ మనకు లేకపోయినారా ? జగత్ప్రఖ్యాతి సంపాదించిన అందగత్తె హెడీలామార్ నటించనే లేదు నటించటం బొత్తిగా చాతగాని మరొక సుప్రసిద్ధుడు బింగ్‌క్రాస్‌బీ, ఇక క్లార్క్‌కేబుల్, జేమ్సుష్టూవర్ట్ , వాలస్‌బీరీ, స్పెన్సరుట్రేసి మాదిరి విగ్రహాలను మనవారు చిల్లరవేషాలక్కూడా బుక్ చెయ్యరు

మనకు విగ్రహాలు లేవని కాదు, పాత్రలు అర్థం చేసుకునేవారు కావాలి, అనవచ్చును అట్లా అనుకున్నా మనం ఏమంత తెలివైన పాత్రలు తెరమీద కెక్కించామని? మనం ఇప్పటికే తీసిన డెబ్బై చిల్లర చిత్రాల్లోనూ సంస్కారంతో నటించదగిన పాత్ర మచ్చుకు ఒక్కటుందా ! కోడల్ని పదిహేనువేల అడుగుల పొడుగునా రంపాన పెట్టిరాచే అత్తగారి పాత్రా, తను చేసుకోమన్న పిల్లను చేసుకో లేదనో, తను గీసిన గిరిలో నిలవలేదనో ప్రేక్షకులకసహ్యం కలిగించే దుర్మామలాడి కొడుకును ఇంటోనించి వెళ్లగొట్టే పాత్రా నటించటానికి ఏం తెలివితేటలు కావాలి? మనం ఒక ప్రెసిడెంటుగాని, జిందగీగాని తియ్యటానికి ఎటువంటి ప్రయత్నమూ చేసి ఎరగమే !

ఉన్న నటుల్నే మనవాళ్లెంతబాగా ఉపయోగిస్తున్నారో చూడండి ఏ బళ్లారి రాఘవాచారి గారితోనో, బండరాముడితోనో విడిగా మాట్లాడి చూడండి, వారినే తెరమీద చూడండి , మన ప్రొడ్యూసర్లు నటులను ఎంతగా ఉపయోగపరుస్తున్నదీ అర్థమవుతుంది కల్పించుకునేటందుకు సన్నివేశాలు లేకుండా, చక్కని సంభాషణలిచ్చే కవిగారు లేకుండా అరగంట సేపు మనవి మనం మరిచేటట్టు చెయ్యగల నటుడు – ఒక కవిగారూ, ఒక కథకుడు, ఒక డైరక్టరూ, ఆర్టుడైరక్టరూ, కామెరామాన్ ఇందరి సహాయంతో తెరమీదికి వచ్చి అరనిమిషంపాటు మనకు రక్తికలిగించలేకపోతే ఆ టెక్నీషియన్‌లను గురించీ, వారిని సంపాదించిన ప్రొడ్యూసరును గురించీ ఏమనుకోవాలి?

తెలివితో కూడుకున్న పాత్రలను సృష్టించగలంగాని వాటిని మన ప్రేక్షకులు అర్థం చేసుకో లేరు, అనే ప్రొడ్యూసర్లుండవచ్చును కాని అదీ ఆడలేక ముద్దల ఓడనటంలోనే జమ అవుతుంది క్లిష్టమైన పాత్రను సులభగ్రాహ్యంగా చిత్రించటంలోనే డైరక్టరు ప్రతిభా నటుడి ప్రతిభా ఉంది అర్థం కాని పాత్రలు అర్థం కాకుండా చిత్రించటానికి ఏ తెలివి తేటలూ అవసరం లేదు

ఈ 1941లో కూడా మన ప్రొడ్యూసర్లు మంచినటులు చెట్టున కాస్తారనుకున్నట్టు కనిపించటం హాస్యాస్పదం మంచినటులు రావటానికి మంచి వాతావరణం ఉండాలి వసంత

కాలంలోనేకదా మామిళ్ళ చిగుర్చుతై విద్యాధికులూ, ఏ మాత్రమైనా తెలిసినవాళ్ళూ, ప్రజ్ఞావంతులూ దగ్గిరచేరతారంటే భయం మన ప్రొడ్యూసర్లకు తమని చూసి భయపడేవాళ్ళూ, తమని దేవతిలని భ్రమించేవాళ్లు కావాలి అట్లా చూసేవారిలో అత్యద్భుత నటులుండాలి! వెనకటి కోశి ష్యడు గురువుగారు చెప్పులు వెతకరా అంటే గగనమార్గాన ఎక్కడా లేవన్నాడట

విద్య సమగ్రంగా లేనివాళ్ళూ, ఇంకే విధమైన ప్రఖ్యాతీ లేనివాళ్ళూ సినిమా ప్రపంచం నిండా ఉండటానికీ, నిజమైన తెలివిగల వాళ్లంతా బయట ఉండటానికీ ఆ ప్రొడ్యూసర్లే కారణం తాము తెలుగు సినిమా పరిశ్రమకు ఏమి చెయ్యగలరో అది మాత్రమే చేయబడాలిగాని అంతకన్న తెలివైనదేమీ జరగరాదని వీరి తాత్పర్యం నిజమైన ప్రొడ్యూసరు తన చిత్రనిర్మాణంలో వెలితి యేమిటో తెలుసుకుని దాన్ని పూర్తిచేసే దారేదా అని ఆలో చిస్తాడు, కాని మన ప్రొడ్యూర్లు అలా కాదు , మనవెలితి ఎవడైనా తెలుస్కుకు పోతాడేమోనని వీళ్ల భయం

ఇప్పుడు ఉన్న పరిశ్రమలన్నిటిలోకి సినిమా పరిశ్రమ మహోత్కృష్టమైనదని రుజావు చెయ్యటానికి మన ఆంధ్రులు చేసిందేమంటే ఇంకేపనీ బాగా చేయలేనివారంతా వచ్చి ప్రొడ్యూసర్లయి చుక్కానిపట్టీ, ఇంకెందుకూ పనికిరానిమూకను పడవ లాగించి, పబ్లిసిటీలు మాత్రం అట్టహాసంగా చేసి ఆ మోత వెనక ఏమి జరుగుతున్నదీ తెలియకుండా చెయ్యటం

మనలో నటులు లేరనేవారికి నాసమాధానం ఏమంటే మన చిత్రాల్లో నటించదగిన పాత్రలు లేవని నిత్యజీవనంలో మనని మనుష్యులు ఎందుకాకర్షిస్తారో తెరమీద పాత్రలు కూడా అందుకే అకర్షిస్తాయి గొప్ప అందంగా ఉండటంవల్లా, ఆహ్లాదకరమైన మనఃప్రవృత్తితో ఉన్నట్టు కనిపించడంవల్లా, అపారమైన శక్తితో కూడుకున్నవిగా కనిపించటంవల్లా, ఆందమైన మాటలు మాట్లాడటంవల్లా, ఇటువంటి వ్యక్తులతో నిత్యమూ కాలక్షేపం చేసేవాడు ధన్యుడు బూ ఆ ధన్యత అందరికీ చేకూరదు కాని మంచి ప్రొడ్యూసర్లు ఆ లోపం తీర్చవచ్చును బుద్ధిమంతులైనవాళ్లు మంచి నటులకోసం వెతికే పూర్వం మంచిప్రొడ్యూసరుకోసం-బ్రహ్మసృష్టికి ప్రతిసృష్టిచేసి, విధినికూడా జయించేవాడికోసం – వెతకటం మంచిది

హిందీచిత్రాలూ ఇంగ్లీషు చిత్రాలూ తీసేవాళ్లు విశ్వబ్రహ్మ లైన కారణంచేత వారు తీసిన చిత్రాలు నచ్చుతున్న వనుకోనవసరం లేదు చిల్లరలోపాలు లేకుండా ఉంటే చాలు, చిత్రం ఎంతో బాగున్నట్టుంటుంది అవి లేకుండా చిత్రం తియ్యటం నేర్వనివారు మహత్తర తారలు కావాలనటం హాస్యాస్పదం మన ప్రొడ్యూసర్లలో ఎంత సిద్ధహస్తులున్నారంటే, ఎవరు చెప్పినా వినకుండా ఒక మనిషిని బుక్ చేసి, సినిమాలైనులో లేనివాడుకూడా ఒక్క నిమిషంకాలంలో ఎందుకూ పనికిరాదని కనిపెట్టగల ఆ మనిషికి ఒక ముఖ్యమైన పాత్ర ఇచ్చి, చిత్రం చెడగొట్టుకుని, ఆఖరుకు ఆమెతో తాముపడ్డ పాటులన్నీ నలుగురితోనూ చెప్పి సానుభూతికోసం దేవులాడతారు ఇటువంటి ప్రొడ్యూసర్లు మంచినటులు కావాలనటంలో అర్థం ఉండదు పనికిరాని వాళ్లను గుర్తించలేనివాళ్లు పనికొచ్చేవాళ్లను గుర్తించుతారని ఎక్కడుంది?

*ఆంధ్రపత్రిక వారపత్రిక, 18–6–1941*

# 16. తెలుగులో సినిమా జర్నలిజం

తెలుగులో సినిమా జర్నలిజం తెలుగులో సినిమా పరిశ్రమలాగే ఒకదారీ తెన్నూ లేకుండా వుంది ప్రతి వుద్యమానికీ సరస్వతీ పూజ ఉండాలి అదిలేని ఉద్యమం వైధవ్యలక్షణాలు కలిగి వుంటుంది అసలు తెలుగులో సినిమా జర్నలిజం ఉందని నిరూపించడం కూడా బహుకష్టం రెండు సినిమా పత్రికలూ, మిగిలిన పత్రికల్లో ఉండే సినిమా పేజీలు, మన పత్రికల్లో వచ్చే అర్థంలేని ప్రశ్నోత్తరాలు – ఇవే తెలుగులో సినిమా జర్నలిజం

ఇటువంటి జర్నలిజం ఉండరాదని శాసించటం లేదు అది అర్థంలేని శాసనం దీని స్థానం దీనికుంటుంది తెలుగులో ఉండదగిన జర్నలిజం మాటా, లేని జర్నలిజం మాటా చెబుతున్నాను

అరవలు నడిపే ఇంగ్లీషు సినిమా పత్రికలు చూస్తే అరవ వారికి సినిమా జర్నలిజం గురించి మనకన్న చాలా ఎక్కువ తెలుసుననిపిస్తున్నది అందుచేతనే వాళ్ళ పరిశ్రమ మన సినిమా పరిశ్రమ కంటే బాగుందేమో–వాళ్ల చిత్రాల మాట ఎట్లావున్నా!

ఉద్యమానికి చైతన్యం కలిగించే సాధనాలు జర్నలిస్టు చేతిలో రెండున్నవి – ఒకటి ప్రచారమూ, రెండు ఆందోళనా, ఈ రెంటి నడుమా ఉద్యమం ముందుకి సాగుతుంది కాని ఈ ఆయుధాలను ఎంతో నైపుణ్యంతో వాడాలి ఇవి మంగలి కత్తుల్లాంటివి వాటితో కార్యాలు సాధించవలసిందే గాని ఆటలాడటం మొదలు పెడితే గాయమవుతుంది లేదా కథలో మంగలి మంత్రిలాగా అపహాస్యం పాలు కావటం జరుగుతుంది

ప్రొడ్యూసరు జర్నలిస్టు కలం విదిలింపు సహాయం లేకుండా ఎట్లా బాగుపడలేడో, జర్నలిస్టు మందలింపు లేకుండా అట్లాగే సక్రమమైన మార్గంలో వుండలేడు ప్రొడ్యూసరు తుంటరి అనిగాని, అల్పజ్ఞుడనికాని కాదు, ప్రొడ్యూసరు స్వార్థంలో పరమార్థాన్ని మరిచే అవకాశం వుంది ఒక్కొక్కప్పుడు ప్రొడ్యూసరుకు ఆత్మ విమర్శ చేసుకుని మరో దృష్టిపథం తెలుసుకునే అవకాశం కూడా ఉండదు పైగా సత్తా అనేది ఏర్పడ్డ తర్వాత దాన్ని దుర్వినియోగపరచాలనే ఆసక్తి దాన్ని వెన్నాడుతూనే వుంటుంది

సినిమా జర్నలిస్టుకు సినిమాలకు సంబంధించిన విజ్ఞానమూ, సినిమా వ్యవహారాల యందు ఆసక్తీ ఉండాలి ఇవి రెండూ ఉంటే, ఈ జర్నలిస్టు తన కలం ద్వారా ఈ ఆసక్తినీ నేర్పునూ ప్రపంచానికి పంచి పెట్టగలుగుతాడు

సరి అయిన సినిమా జర్నలిస్టు బాగా సంపాదించగలగాలి కూటికి దేవులాడే సినిమా జర్నలిస్టువల్ల ఉపకారం కన్న అపకారమే ఎక్కువ సినిమా జర్నలిస్టులు బ్రతికేటట్టు చూడవలసిన బాధ్యత కొంత భాగం సినిమాలు తీసేవారి మీదకూడా లేకపోలేదు

మన ప్రొడ్యూసర్లు సినిమా జర్నలిస్టును చూసి ఒకమూల భయపడతారు మరో మూల అసహ్యపడతారు పరోక్షాన వాణ్ణి నిందిస్తారుకూడాను అంతేగాని సినిమా జర్నలిస్టు యొక్క విలువ పరిశ్రమకెంతో తెలుసుకుని తగినంతగా గౌరవించే వాళ్ళున్నట్టు కనిపించదు కొందరు ప్రొడ్యూసర్లు జర్నలిస్టుకు జర్నలిజం నేర్పటానికి ప్రయత్నించటం కూడా కద్దు!

అయితే -- ఏమాట కామాటే! -- కొందరు జర్నలిస్టులు ప్రొడ్యూసరుకు ప్రొడక్షను

విషయం చెప్పటమున్నా కద్దు కాని జర్నలిస్టుకు ప్రొడ్యూసరు చెప్పేకన్న జర్నలిస్టు ప్రొడ్యూసరుకు చెప్పటమే కాస్తనయం ఏమయినా జర్నలిస్టు చేసేది ప్రొడ్యూసరుకు చెప్పటమే ప్రొడ్యూసరుకు చెప్పగలంత జర్నలిస్టు లెవరున్నారనేది వేరే ప్రశ్న లేరనే నేననేది కూడాను

రాగా పోగా మనకు విమర్శకులున్నారు వీరు ఇతర ప్రేక్షకులల్లేనే చిత్రాన్ని చూసి, ఇతర ప్రేక్షకులు చెయ్యలేని పని చేస్తారు చిత్రాన్ని విమర్శిస్తారు ఈ విమర్శకుడు ప్రతిభావంతుడైనప్పుడు విమర్శ న్యాయంగా ఉంటుంది కాని అధర్మంగా ఉంటుంది ఎందుచేతనంటే ప్రతిభావంతుడైన విమర్శకుడికి చిత్రాల్లో లోపాలు తెలుస్తవి, మంచి చిత్రం ఎట్లా ఉండాలో తెలుస్తుంది, అంతేకాని లోపాలు లేని మంచి చిత్రాలు తియ్యటానికనువైన సదుపాయాలీ దేశంలో ఏమాత్రం ఉన్నదీ, మన వాతావరణంలో ఏ లోపాలు గుణాలుగా భావించవలసిందీ తెలియదు అది అట్లావుండగా, చిత్రం చెడ్డదే అయినప్పటికీ దాన్ని, న్యాయంగానే కానివ్వండి, తిట్టామనుకోండి చిత్రం దమ్మిడీకి కొరగాదు, ప్రొడ్యూసరు మట్టికొట్టుకుపోతాడు, అనుభవం మీదనైనా మంచి చిత్రాలు తీసే అవకాశం కాస్తాపోతుంది ఒకటి రెండు చెరిపితే గాని ప్రొడ్యూసరు కాలేడాయెమరి! కాదు, చిత్రాన్ని మెచ్చుకుంటాడా? అదీ జర్నలిస్టుకు ఆత్మహత్య, ఇటువంటి విమర్శలు రెండు మూడు రాసిన తర్వాత ఆ జర్నలిస్టు చిల్లిగవ్వకు కొరగాడు ఆ జర్నలిజం సినిమా పరిశ్రమకు ఏమీ తోడ్పడదు ఎడ్వర్టయిజామెంటు కోసం ఆశపడే వారు చిత్రాన్ని గట్టిగా తిట్టటానిక్కూడా లేదు

పోనీ జర్నలిస్టు సాంకేతిక వ్యాసాలు రాస్తాడనుకుంటే, వాటిని అర్థం చేసుకునే శక్తి జనసామాన్యానికుండదు మరోవంక ప్రొడ్యూసర్లు ఆగ్రహిస్తారు వీడికేం తెలిసి ఇటువంటి వ్యాసాలు రాస్తాడని

అదీకాకపోతే ఇంటర్వ్యూలు రాస్తాడా? అందులో అవతల మనిషికి కాస్త బూజా దులిపి రంగు కొట్టటం అత్యవసరం ఆ బండారం కాస్తా ఎవడో బయట పెట్టేస్తాడు ఈ కొద్దిపాటి ఫిలిం జగత్తులో ఇటువంటి వంచన ఎంతో కాలం దాగదు

ఫిలిం జర్నలిజం ఇన్ని అడ్డంకుల మధ్యా పైకెగబాక లేకుండా వుంది అసలీ మార్గాలు తొక్కి ఉండటమే మన ఫిలిం జర్నలిజం చేసిన పొరపాటు ఇది మనం పై దేశాల వారిని చూసి తెచ్చి పెట్టుకున్న వాత అందుకనే మన జర్నలిజం రాత ఇట్లా వుంది

మన ఫిలిం పరిశ్రమ క్రియకు ప్రేక్షకలోకం మీద ఆధారపడివుంది ప్రేక్షకుడికి జరిమానా విధించి మనం ఫిలిం పరిశ్రమను నడపబోవటంలేదు ప్రేక్షకుడు తనంతట తాను ఈ పరిశ్రమలో ఆసక్తి కనబరిచి పరిశ్రమను పోషించాలి ఆ ఆసక్తిని పెంపొందించదగినదే ఫిలిం జర్నలిజం ప్రేక్షకుడికి అటువంటి ఆసక్తి కలిగించే జర్నలిస్టుగాని, జర్నలిజంగాని తెలుగులో రాలేదు

దీనికి తగ్గట్టుగానే మన ప్రొడ్యూసర్లు కూడా ఫిల్లిం జర్నలిస్టునీ, జర్నలిజాన్నీ ద్వేషభావంతో చూస్తున్నారు జర్నలిజం వల్ల పరిశ్రమకి కలగగల లాభం గురించి వీరికేమీ నమ్మకం లేదు తమని తెగమెచ్చుకున్నవాడు విహితుడు, తప్పుపట్టినవాడు విరోధి, సలహా ఇవ్వటానికి ప్రయత్నించినవాడు దొంగ!

ఇద్దరు జర్నలిస్టుల్లో ఒకడి చేత దీవనలు పొందే కంటే, రెండో వాడిచేత తిట్లు తినటమే మేలనే జ్ఞానం వీరిలో ఒక్కరికీ వున్నట్టు లేదు (అటువంటి జ్ఞానం ఒక్క ప్రొడ్యూసరే నా

ఎదుట నోటి మాటలతోనైనా ప్రకటించాడు) చాతకానివాడి మెప్పు తమని ఎంత హాస్యాస్పదమైన స్థితిలో పెడుతుందో గుర్తించరు తలకాయలేని వారు చేసే ఇంటర్వ్యూ తమని ఎంత పరిహాసానికి గురిచేసేదీ తారలు గుర్తించనట్టే!

పత్రికలు చదివే వారి దృష్టిలో కూడా ఫిలిం జర్నలిస్టు భాయీలంతా ఒకటేనని నా సందేహం ఫలానావాడి రాత కనక చదువుదామనే ఆసక్తి పరితలు ప్రకటిస్తున్నారను కునేటందుకేమీ ఆధారం కనిపించలేదు రాసేవారిలో తేడాలేక కాదు ఎవరు రాసేది కూడా సరి అయిన జర్నలిజం కాదుకనక, ఇది ప్రేక్షక పరితల నెక్కడా అంటదు కనక!

అయినప్పటికీ తెలుగులో ఫిలిం జర్నలిజమంటూ, ఫిలిం జర్నలిస్టుల మంటూ ఉన్నట్టు నటిస్తూ, అందులో తరతమ బేధాలెన్నుతూ తమ తెలివితేటలు బయట పెట్టుకుంటున్నారు కొందరు నాయకులు వారి వ్యాసాలకు స్థానం ఇచ్చి ఘన కార్యం చేస్తున్నట్టు నటిస్తూవున్నవి కొన్ని పత్రికలు ఫిలిం జర్నలిజం మీద బతకలేని జర్నలిస్టు ఫిలిం జర్నలిస్టు కాడు "తెలుగు ఫిలిములు బాగుపడాలంటే?" అని రాసినప్పటికీ ఫిలిం జర్నలిస్టుకాడు

ఫిలిం జర్నలిజం Full time job, hobby కాదు ఇరవై నాలుగ్గంటలూ అందులోనే పడి కొట్టుకోలేనివాడు ఫిలిం జర్నలిజం చెయ్యలేడు ఇతర జర్నలిజంల కంటె ఫిలం జర్నలిజం చాలా కష్టతరమైనదీ, విస్తరించిన తెలివితేటలతో కూడుకున్నదీనూ

ఫిలిం పత్రికలో ప్రత్యేకించి పనిచేసేవాడినే ఫిలిం జర్నలిస్టు అనే అవకాశం వుంది ఫిలిం పరిశ్రమలో బయలుదేరే అమాంబాపతు సమస్యలన్నింటినీ ఫిలిం ప్రొడ్యూసర్ల కంటె బాగా అవగాహన చేసుకుని వాటి నివారణకోసం ఆందోళన చేస్తూ పరిశ్రమను ముందుకు లాక్కుపోగలవాడే ఫిలిం జర్నలిస్ట్ ఆర్థికంగా, రాజకీయంగా, కళాదృష్టిలో, నైతిక దృష్టిలో తెలుగు చిత్రాలకీ ఇతర చిత్రాల వల్ల హాని కలగకుండా కాపాడటం విద్యుక్త ధర్మమనుకున్నవాడే తెలుగు ఫిలిం జర్నలిస్టు ఆదిలో ప్రొడ్యూసర్లంతా ఒకే పంథాలో ఉన్నట్టు కనిపించినప్పటికీ వారిలో సూక్ష్మమైన తేడాలు కనిపెట్టి ఎవరు తన ప్రోత్సాహానికి అర్హులో ఎవరు అనర్హులో, తేల్చుకునే శక్తిగలవాడే ఫిలిం జర్నలిస్టు ఫిలిములను విమర్శల్లో మెచ్చుకున్నా, తిట్టినా ఫిలిం పరిశ్రమ అభివృద్ధి కావటమే ఆశయంగా పెట్టుకున్నవాడే నిజమైన ఫిలిం జర్నలిస్టు తన తెలివి తేటలు లోకానికి తెలియబరచటమే ఆశయంగా పెట్టుకుని, దానికిగాను లక్షరూపాయల చిత్రాలను బలి ఇచ్చేవాడు ఫిలిం జర్నలిస్టు కాడు తెలుగులో ఫిలిం జర్నలిస్టని చెప్పుకోదగినవాడు లేడు ప్రొడ్యూసర్లు వాడివల్ల ప్రయోజనం గుర్తించే వరకూ రాడు కూడానూ!

*పెంకిపిల్ల, మాసపత్రిక, అక్టోబరు–నవంబరు, 1941, దీపావళి సంచిక*

# 17. సినిమా సంభాషణలు

మోషన్ పిక్చర్ మాగజీను డిసెంబరు సంచికలో 'సంభాషణ' గురించి రాసిన సంపాదకీయం ప్రొడ్యూసర్లందరూ గమనించదగినది

సినిమా చిత్రం యొక్క ఆయువుపట్టు సంభాషణ అని చెప్పవచ్చును ఫోటోగ్రఫీగాని, అభినయం గాని, తదితర ఉపాంగాలు ముఖ్యం కాదని కాదు అయితే సంభాషణ గురించి ఒక ప్రత్యేకత ఉంది సంభాషణ ఇతర సినిమా అంగాలతో సంబంధం లేనిది ఫోటోగ్రఫీ

విషయం చెప్పటమున్నా కద్దు కాని జర్నలిస్టుకు ప్రొడ్యూసరు చెప్పేకన్న జర్నలిస్టు ప్రొడ్యూసరుకు చెప్పటమే కాస్తనయం ఏమయినా జర్నలిస్టు చేసేది ప్రొడ్యూసరుకు చెప్పటమే ప్రొడ్యూసరుకు చెప్పగలంత జర్నలిస్టు లెవరున్నారనేది వేరే ప్రశ్న లేరనే నేననేది కూడాను

రాగా పోగా మనకు విమర్శకులున్నారు వీరు ఇతర ప్రేక్షకులల్లేనే చిత్రాన్ని చూసి, ఇతర ప్రేక్షకులు చెయ్యలేని పని చేస్తారు చిత్రాన్ని విమర్శిస్తారు ఈ విమర్శకుడు ప్రతిభావంతుడైనప్పుడు విమర్శ న్యాయంగా ఉంటుంది కాని అధర్మంగా ఉంటుంది ఎందుచేతనంటే ప్రతిభావంతుడైన విమర్శకుడికి చిత్రాల్లో లోపాలు తెలుస్తవి, మంచి చిత్రం ఎట్లా ఉండాలో తెలుస్తుంది, అంతేకాని లోపాలు లేని మంచి చిత్రాలు తియ్యటానికనువైన సదుపాయాలీ దేశంలో ఏమాత్రం ఉన్నదీ, మన వాతావరణంలో ఏ లోపాలు గుణాలుగా భావించవలసిందీ తెలియదు అది అట్లావుండగా, చిత్రం చెడ్డదే అయినప్పటికీ దాన్ని, న్యాయంగానే కానివ్వండి, తిట్టామనుకోండి చిత్రం దమ్మిడీకి కొరగాదు, ప్రొడ్యూసరు మట్టికొట్టుకుపోతాడు, అనుభవం మీదనైనా మంచి చిత్రాలు తీసే అవకాశం కాస్తాపోతుంది ఒకటి రెండు చెరిపితే గాని ప్రొడ్యూసరు కాలేడాయెమరి! కాదు, చిత్రాన్ని మెచ్చుకుంటాడా? అదీ జర్నలిస్టుకు ఆత్మహత్య, ఇటువంటి విమర్శలు రెండు మూడు రాసిన తర్వాత ఆ జర్నలిస్టు చిల్లిగవ్వకు కొరగాడు ఆ జర్నలిజం సినిమా పరిశ్రమకు ఏమీ తోడ్పడదు ఎడ్వర్టయిజామెంటు కోసం ఆశపడే వారు చిత్రాన్ని గట్టిగా తిట్టటానిక్కూడా లేదు

పోనీ జర్నలిస్టు సాంకేతిక వ్యాసాలు రాస్తాడనుకుంటే, వాటిని అర్థం చేసుకునే శక్తి జనసామాన్యానికుండదు మరోవంక ప్రొడ్యూసర్లు ఆగ్రహిస్తారు వీడికేం తెలిసి ఇటువంటి వ్యాసాలు రాస్తాడని

అదీకాకపోతే ఇంటర్వ్యూలు రాస్తాడా? అందులో అవతల మనిషికి కాస్త బూజు దులిపి రంగు కొట్టటం అత్యవసరం ఆ బండారం కాస్తా ఎవడో బయట పెట్టేస్తాడు ఈ కొద్దిపాటి ఫిలిం జగత్తులో ఇటువంటి వంచన ఎంతో కాలం దాగదు

ఫిలిం జర్నలిజం ఇన్ని అడ్డంకుల మధ్యా పైకెగబాక లేకుండా వుంది అసలీ మార్గాలు తొక్కి ఉండటమే మన ఫిలిం జర్నలిజం చేసిన పొరపాటు ఇది మనం పై దేశాల వారిని చూసి తెచ్చి పెట్టుకున్న వాత అందుకనే మన జర్నలిజం రాత ఇట్లా వుంది

మన ఫిలిం పరిశ్రమ క్రియకు ప్రేక్షకలోకం మీద ఆధారపడివుంది ప్రేక్షకుడికి జరిమానా విధించి మనం ఫిలిం పరిశ్రమను నడపబోవటంలేదు ప్రేక్షకుడు తనంతట తాను ఈ పరిశ్రమలో ఆసక్తి కనబరిచి పరిశ్రమను పోషించాలి ఆ ఆసక్తిని పెంపొందించదగినదే ఫిలిం జర్నలిజం ప్రేక్షకుడికి అటువంటి ఆసక్తి కలిగించే జర్నలిస్టుగాని, జర్నలిజంగాని తెలుగులో రాలేదు

దీనికి తగ్గట్టుగానే మన ప్రొడ్యూసర్లు కూడా ఫిల్లిం జర్నలిస్టునీ, జర్నలిజాన్నీ ద్వేషభావంతో చూస్తున్నారు జర్నలిజం వల్ల పరిశ్రమకి కలగగల లాభం గురించి వీరికేమీ నమ్మకం లేదు తమని తెగమెచ్చుకున్నవాడు విహితుడు, తప్పుపట్టినవాడు విరోధి, సలహా ఇవ్వటానికి ప్రయత్నించినవాడు దొంగ!

ఇద్దరు జర్నలిస్టుల్లో ఒకడి చేత దీవనలు పొందే కంటే, రెండో వాడిచేత తిట్లు తినటమే మేలనే జ్ఞానం వీరిలో ఒక్కరికీ వున్నట్టు లేదు (అటువంటి జ్ఞానం ఒక్క ప్రొడ్యూసరే నా

మంచి సంభాషణలు గుర్తించే తెలివితేటలు కూడా ఉన్నట్టు కనిపించదు క్రియకు మంచి మంచి సంభాషణలకోసం సినిమా తారల కిచ్చినంత ఇవ్వవచ్చుననే ఆలోచన కూడా ఎవరికీ తట్టలేదు

మంచి సంభాషణ గురించి మనకు సరి అయిన అభిరుచి లేదని బయటపెట్టే అంశమేమిటంటే మన చిత్రాలలో ఉండే వ్యర్థసంభాషణలు " ఈ వాక్యం ఈ పాత్రచేత అనిపించకపోతే చిత్రం ఏవిధంగా నష్టపడుతుంది?" అని ప్రొడ్యూసరు ప్రతి వాక్యం గురించీ ప్రశ్నించుకున్న లక్షణాలు మచ్చుకు ఒక్క చిత్రంలో కూడా కనిపించవు

ప్రేక్షకుల అభిరుచి

ప్రొడ్యూసర్ల అభిరుచే ఈ విషయంలో అంతంతమాత్రంగా ఉన్నప్పుడు ఇక ప్రేక్షకుల అభిరుచి అడగనక్కర్లేదు చంద్రమోహనూ, సోరాబ్‌మోడీగారూ మన ప్రేక్షకులకు సంభాషణలు ఉచ్ఛరించటంలో (వాచకంలో) ఆదర్శపురుషులు ఎందుకంటే వారు కృత్రిమంగా, గంట మోగించినట్టు మోగుతారు గనక!

ఈ కృత్రిమ వాచకం స్టేజిమీద ఒకప్పుడు చాలా అక్కరకు వచ్చి ఉండింది స్టేజి నాటకాలలో ఆరోజుల్లో ఉండిన పాత్రలన్నీ ఆనాటి సంస్కారానికి భిన్నమైనవే గనక అటువంటి వాచకం ఆ భిన్నత్వం రుజువు చేసింది కాని ఈనాటి సినిమా యుగంలో ఇటువంటి వాచకం ఎందుకూ పనికి రాకుండా వుంది ఐతే ఈ సంగతి మన ప్రేక్షకులు స్పష్టంగా అర్థం చేసుకోలేకుండా ఉన్నారు నిజానికి వారికి మంచి సంభాషణలు రసపుష్టిగా అందించినవారు లేరు

సంభాషణలు రాసేవారు

మన చిత్రాలలో సంభాషణలు రాసేవారిలో ప్రస్తుతం ఎన్నదగినవారు ముగ్గురని చెప్పాలి సముద్రాలవారూ, బలిజేపల్లివారూ, తాపీవారూ సినిమా సంభాషణలు రాయటంలో అగ్రతాంబూలం అవలీలగా సముద్రాలవారికి పోతుంది కాని వాహినీ వారు ఈయన గారి చేత కవిత్వం రాయించి చావగొట్టేస్తున్నారు సంభాషణల్లో కవిత్వం బొత్తిగా కూడనిది పైపెచ్చు వాహినీ చిత్రాలలో సూక్ష్మమైన సంభాషణలకాట్టే అవకాశం లేదు

బలిజేపల్లి వారి సంభాషణలు నిర్దిష్టంగా కథ నడపగలుగుతవే గాని కథయొక్క మెలికలకు అందచందాలాపాదించలేవు అప్పుడప్పుడూ సంభాషణాప్రవాహం కుంటుపడుతుంది కూడాను

తాపీ వారు కూడా క్లాసిసిజంలో ఒకకాలూ, రియలిజంలో ఒకకాలూ పెట్టి ఎటు వెళ్లటానికీ నిశ్చయించుకోని ధోరణిలో సంభాషణలు నడుపుతారు ఆయన హృదయానికి రక్తి కలిగించలేని సన్నివేశాలలో సంభాషణలు మోరాయిస్తై అవి నడవనేనడవవు ఆయనకు నచ్చిన పాత్ర అయితే వెళ్లినంతదూరం జంయిమని మాట్లేడేస్తుంది

మొత్తంమీద మనలో ఉన్న కొద్దిమంది సంభాషణా రచయితలకూ వాతావరణం ఆదర్శప్రాయంగా అమరలేదనే చెప్పాలి పైగా ఇంకా అధమం నలుగురయిదుగురైనా ఈ కారులో చేర్చదగిన సంభాషణా రచయితలు లేకపోతే సినిమా పరిశ్రమ నడవదు ఒక్కొక్క రచయితా సంవత్సరానికి రెండు చిత్రాలకు సంభాషణలు రాయగలడు అంతకన్న ఎక్కువచిత్రాలకు రాయటానికి పూనుకుంటే ఆ సంభాషణలు తిరిగి తిరిగి సంస్కరించ

టానికిగాని, పాత్రధారులను బట్టి మార్చటానికిగాని, అవిషూటింగు సమయాల్లో తృప్తిగా చెప్పబడేటట్టు చూడటానికి గాని అవకాశం ఉండదు సంవత్సరానికి 15,20 చిత్రాలు తీసే మన దేశంలో ముగ్గురు సంభాషణా రచయితలు చెప్పుకోదగ్గ సంఖ్యకాదు

ప్రొడ్యూసర్ల విధి

సంభాషణలు రాయటం పదిరోజుల పని అని ప్రొడ్యూసర్లు ఒక్కనాటి కనుకోరాదు చవుకలో సంభాషణలు రాయించుకుందామని అసలే అనుకోరాదు మిగిలిన అన్ని విషయాలలోనూ ఎంతటికీ తృప్తిపొందని మన ప్రొడ్యూసర్లు సంభాషణలు రాయటానికి మాత్రం ఎవర్నో ఒకర్ని ఏర్పాటు చేసి, తాము ఆదా చేసేదంతా ఈ అయిటములోనే చేద్దామన్నట్టు ప్రవర్తించి అల్పసంతోషం ఎట్లా ప్రకటిస్తారా అని ఆశ్చర్యం వేస్తుంది

సంభాషణలు కాగితం మీదనే ఎంతో దివ్యంగా కనిపిస్తేనే తప్ప తెరమీద సుమారుగా అయినా తేలవు (ముఖ్యంగా వాచకంలో నిపుణులనదగ్గ వాళ్లు సినిమా ప్రపంచంలో దాదాపు ఒక్కరు కూడా లేరుగనక) అందువల్ల సంభాషణలను ఎంత సంస్కరిస్తే అంత లాభం వుంది ఒకసారి రాసుకున్నది శిలాక్షరంగా ఉండి పోనవసరంలేదు

కవిరాసిన సంభాషణలు ప్రొడ్యూసరుకెంత ఆహ్లాదం కలిగించాలో, నటులు రిహార్సలులో చెప్పే సంభాషణలు కవికంత ఆహ్లాదం కలిగించాలి సంభాషణలు రాసినవాడు పక్కన లేకుండా షూటింగు జరపనేరాదు

మంచి ఫోటోగ్రఫీతోనూ, మంచి సంగీతంతోనూ, మంచి మొహాలతోనూ చిత్రం విజయవంతం అవుతుందనే ఆశలేదు కాని ఇంకేమీ లేకుండా మంచి సంభాషణలతో చిత్రం విజయవంతం కావటానికి అనేక అవకాశాలున్నై

మంచి సంభాషణలు మామూలు మనిషిని కూడా ఒక నటుడుగా తయారు చెయ్యగలవు చెడు సంభాషణల చెడు కప్పిపుచ్చటానికి మాత్రమే అనుభవశాలులైన నటులు కావలసి వస్తారు సినిమా పరిశ్రమ కేవలమూ అనుభవశాలులైన నటులమీదే ఆధారపడి ఒక్క అడుగు కూడా ముందుకు వెయ్యలేదు

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 21-1-1942*

# 18. బానిసజాతిలో సినిమా

సినిమా ఎట్లా ఉంది, ఎట్లా ఉండాలి? – అనే సమస్య మీద డైరెక్టరు, పి సి బరువా గారు అమృత బజారు పత్రిక (ఫిబ్రవరి 15) సంచికలో అమూల్యమైన వ్యాసం ప్రచురించారు

''ప్రస్తుతం మనకు సినిమా ఆటవస్తువుగా ఉంది సినిమా చూడటం మనకు వినోదం క్షణికమైన ఇంద్రియ చాపల్యంచేతనో, ఊసుపోకకో సినిమా చూస్తున్నాం రష్యా, జపాను, జర్మనీ దేశాలలో సినిమాను ప్రచారం కోసం వినియోగించి జాతీయత సాధించారు మనం కూడా ఆ పనే చెయ్యాలి''

సంగ్రహంగా బరువాగారి ఉద్దేశం అదీ సినిమా పరిశ్రమను వర్తక దోపిడీ నుంచి ఉద్ధరించి భారత జాతీయోద్యమ ప్రచారానికి వినియోగపరిచి నిద్రమత్తులో ఉన్న కోటానుకోట్ల

భారతీయులలో చైతన్యం కలిగించాలని బరువా గారి ఆశయం తమ వ్యాసం మహాత్మాగాంధీ గారో, జవహర్లాలుగారో చూడాలని బరువాగా రాశిస్తున్నారు

అయితే అమూల్యమైన బరువాగారి ఆశయం ఈ బానిస దేశంలో సఫలం అయ్యే అవకాశం లేదు ఎవరు బరువాగారి వ్యాసం చదివినా ప్రస్తుతం ఒకటే

ప్రస్తుతం సినిమా చూస్తున్నవాళ్లు, సినిమా వినోదం గనకనే చూస్తున్నారు గాని ఇందులో విజ్ఞానం ఉందని తోస్తే ఈ మాత్రమైనా సినిమాలు చూడక పోదురేమో? బానిస జాతికి వినోద వాంఛ ప్రబలం దారిద్ర్యం కూడా మనిషిని అట్లాగే చేస్తుంది నెలకు వంద సంపాదించేవారిలో పాతిక రూపాయలు తాగేవారి కంటే రోజుకు పావలా సంపాదించేవారిలో రోజుకణా తాగే వారు జాస్తి

రష్యాలోనూ, జపానులోనూ, జర్మనీలోనూ సినిమా ద్వారా ప్రచారం జరిగిందంటే, అక్కడ జాతీయభావం ప్రజాసామాన్యంలో అదివరకే తలఎత్తింది మంచివిశ్వాసాలో మూఢవిశ్వాసాలో అక్కడి ప్రజలకొక సామ్యమూ, ఐక్యతా కలిగించినై ఆప్రజలకు వినోదకాంక్ష ఏమీలేదు, లేకుండా చేయబడింది వారికి రాజకీయసమస్యల్లోఉండే ఆసక్తి మన ప్రజాసామాన్యానికి ఏకోశానా లేదు మనవాళ్లు ఎలెక్షన్లలో తన్నుకు చచ్చినా ఆచావులకు రాజకీయ కారణాలకంటె వ్యక్తిగత కారణాలు జాస్తి

గాంధీజీ ప్రారంభించిన జాతీయోద్యమం ఉందిగానీ అందులో ఆధ్యాత్మికదృష్టికంటె భౌతికదృష్టి చాలా తక్కువ మన 40 కోట్ల భారతీయులనూ ఏకంచెయ్యటానికి గాంధీ గారు సూత్రం కనిపెట్టలేదనే చెప్పవచ్చును ఆయన ప్రారంభించిన నిర్మాణకార్యక్రమం బీదల కంటినంతగా భాగ్యవంతుల నంటదు ( అస్పృశ్యతలో గాఢమైన విశ్వాసం ఉన్నవాడు తన జీవితవైఖరి ఎన్ని విధాలనో సంస్కరించుకుంటేగాని గాంధీ గారిని అర్థంచేసుకోలేడు) ఒక్క స్వాతంత్ర్యసమస్యే ప్రస్తుతం అందరినీ అంటేది కాని కాంగ్రెసువారు తెచ్చే స్వాతంత్ర్యంలో ముస్లింలీగుకు నచ్చదు, ధనికులు తెచ్చే స్వాతంత్ర్యం దరిద్రుల ప్రతినిధులకు విశ్వాసంలేదు అదట్లా ఉండగా స్వాతంత్ర్యం కోసం తీవ్రప్రచారం చేస్తే అది ప్రభుత్వానికి రుచిస్తుందనుకునేటందుకు లేదు మనదేశంలో అనేక జాతులు, అనేక తెగలు, అనేక వర్గాలు -- ప్రతి రెంటికీ నడుమ అగడ్తలు బానిసలమై ఉండి మనం డెమోక్రసీలు సంపాదించవలసిన సంస్కారం సంపాదించుకున్నాం డెమోక్రసీలలో పెద్ద విప్లవాల వంటివి సాధ్యం కాదు, ఈనాడు సాగించవలసిన భారత జాతీయోద్యమం మహత్తరమైన ఆర్థిక, రాజకీయ, సాంఘిక విప్లవంకంటె ఏమీ తక్కువ కాదు డెమోక్రసీలు ప్రజా ప్రభుత్వాల ద్వారా చిన్న చిన్న ఆర్థిక, సాంఘిక సంస్కరణలు చేసుకోవటానికి మాత్రమే తగినవి నేటి భారతీయుల శక్తి సామర్థ్యాలు ఆపాటి కూడా లేనేలేవు

మనకివాళ అత్యవసరంగా కావలసింది నాయకత్వం దేశాన్ని అనవసరమైన ఆధ్యాత్మికచింతన నుంచీ, దిగలాగే మత విశ్వాసాలనుంచీ, నల్లమందు మత్తులాటి నిశ్చైతన్యంనుంచీ రక్షించే నాయకత్వం ద్వారా ఒక జాతీయోద్యమమూ, ఒక దృక్పథమూ, ఒక గమ్యస్థానమూ జాతికి ఏర్పడాలి ఆ మీదట సినిమాలు మిగిలిన సాధనాలతో పాటు ప్రచారానికి వినియోగపడకపోవు ఈనాటి సినిమాలేకాదు, ఏ కళలు వినోదానికి మాత్రమే

టానికిగాని, పాత్రధారులను బట్టి మార్చటానికిగాని, అవిషూటింగు సమయాల్లో తృప్తిగా చెప్పబడేటట్టు చూడటానికి గాని అవకాశం ఉండదు సంవత్సరానికి 15,20 చిత్రాలు తీసే మన దేశంలో ముగ్గురు సంభాషణా రచయితలు చెప్పుకోదగ్గ సంఖ్యకాదు

ప్రొడ్యూసర్ల విధి

సంభాషణలు రాయటం పదిరోజుల పని అని ప్రొడ్యూసర్లు ఒక్కనాటి కనుకోరాదు చవుకలో సంభాషణలు రాయించుకుందామని అసలే అనుకోరాదు మిగిలిన అన్ని విషయాలలోనూ ఎంతటికీ తృప్తిపొందని మన ప్రొడ్యూసర్లు సంభాషణలు రాయటానికి మాత్రం ఎవర్నో ఒకర్ని ఏర్పాటు చేసి, తాము ఆదా చేసేదంతా ఈ అయిటములోనే చేద్దామన్నట్టు ప్రవర్తించి అల్పసంతోషం ఎట్లా ప్రకటిస్తారా అని ఆశ్చర్యం వేస్తుంది

సంభాషణలు కాగితం మీదనే ఎంతో దివ్యంగా కనిపిస్తేనే తప్ప తెరమీద సుమారుగా అయినా తేలవు (ముఖ్యంగా వాచకంలో నిపుణులనదగ్గ వాళ్లు సినిమా ప్రపంచంలో దాదాపు ఒక్కరు కూడా లేరుగనక) అందువల్ల సంభాషణలను ఎంత సంస్కరిస్తే అంత లాభం వుంది ఒకసారి రాసుకున్నది శిలాక్షరంగా ఉండి పోనవసరంలేదు

కవిరాసిన సంభాషణలు ప్రొడ్యూసరుకెంత ఆహ్లాదం కలిగించాలో, నటులు రిహార్సలులో చెప్పే సంభాషణలు కవికంత ఆహ్లాదం కలిగించాలి సంభాషణలు రాసినవాడు పక్కన లేకుండా షూటింగు జరపనేరాదు

మంచి ఫోటోగ్రఫీతోనూ, మంచి సంగీతంతోనూ, మంచి మొహాలతోనూ చిత్రం విజయవంతం అవుతుందనే ఆశలేదు కాని ఇంకేమీ లేకుండా మంచి సంభాషణలతో చిత్రం విజయవంతం కావటానికి అనేక అవకాశాలున్నై

మంచి సంభాషణలు మామూలు మనిషిని కూడా ఒక నటుడుగా తయారు చెయ్యగలవు చెడు సంభాషణల చెడు కప్పిపుచ్చటానికి మాత్రమే అనుభవశాలులైన నటులు కావలసి వస్తారు సినిమా పరిశ్రమ కేవలమూ అనుభవశాలులైన నటులమీదే ఆధారపడి ఒక్క అడుగు కూడా ముందుకు వెయ్యలేదు

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 21-1-1942*

# 18. బానిసజాతిలో సినిమా

సినిమా ఎట్లా ఉంది, ఎట్లా ఉండాలి? – అనే సమస్య మీద డైరెక్టరు, పి సి బరువా గారు అమృత బజారు పత్రిక (ఫిబ్రవరి 15) సంచికలో అమూల్యమైన వ్యాసం ప్రచురించారు

''ప్రస్తుతం మనకు సినిమా ఆటవస్తువుగా ఉంది సినిమా చూడటం మనకు వినోదం క్షణికమైన ఇంద్రియ చాపల్యంచేతనో, ఊసుపోకకో సినిమా చూస్తున్నాం రష్యా, జపాను, జర్మనీ దేశాలలో సినిమాను ప్రచారం కోసం వినియోగించి జాతీయత సాధించారు మనం కూడా ఆ పనే చెయ్యాలి''

సంగ్రహంగా బరువాగారి ఉద్దేశం అదీ సినిమా పరిశ్రమను వర్తక దోపిడీ నుంచి ఉద్ధరించి భారత జాతీయోద్యమ ప్రచారానికి వినియోగపరిచి నిద్రమత్తులో ఉన్న కోటానుకోట్ల

భారతీయులలో చైతన్యం కలిగించాలని బరువా గారి ఆశయం తమ వ్యాసం మహాత్మాగాంధీ గారో, జవహర్లాలుగారో చూడాలని బరువాగా రాశిస్తున్నారు

అయితే అమూల్యమైన బరువాగారి ఆశయం ఈ బానిస దేశంలో సఫలం అయ్యే అవకాశం లేదు ఎవరు బరువాగారి వ్యాసం చదివినా ప్రస్తుతం ఒకటే

ప్రస్తుతం సినిమా చూస్తున్నవాళ్లు, సినిమా వినోదం గనకనే చూస్తున్నారు గాని ఇందులో విజ్ఞానం ఉందని తోస్తే ఈ మాత్రమైనా సినిమాలు చూడక పోదురేమో? బానిస జాతికి వినోద వాంఛ ప్రబలం దారిద్ర్యం కూడా మనిషిని అట్లాగే చేస్తుంది నెలకు వంద సంపాదించేవారిలో పాతిక రూపాయలు తాగేవారి కంటే రోజుకు పావలా సంపాదించేవారిలో రోజుకణా తాగే వారు జాస్తి

రష్యాలోనూ, జపానులోనూ, జర్మనీలోనూ సినిమా ద్వారా ప్రచారం జరిగిందంటే, అక్కడ జాతీయభావం ప్రజాసామాన్యంలో అదివరకే తలఎత్తింది మంచివిశ్వాసాలలో మూఢవిశ్వాసాలలో అక్కడి ప్రజలకొక సామ్యమూ, ఐక్యతా కలిగించినై ఆప్రజలకు వినోదకాంక్ష ఏమీలేదు, లేకుండా చేయబడింది వారికి రాజకీయసమస్యల్లోఉండే ఆసక్తి మన ప్రజాసామాన్యానికి ఏకోశానా లేదు మనవాళ్లు ఎలెక్షన్లలో తన్నుకు చచ్చినా ఆచావులకు రాజకీయ కారణాలకంటె వ్యక్తిగత కారణాలు జాస్తి

గాంధీజీ ప్రారంభించిన జాతీయోద్యమం ఉందిగానీ అందులో ఆధ్యాత్మికదృష్టికంటె భౌతికదృష్టి చాలా తక్కువ మన 40 కోట్ల భారతీయులనూ ఏకంచెయ్యటానికి గాంధీ గారు సూత్రం కనిపెట్టలేదనే చెప్పవచ్చును ఆయన ప్రారంభించిన నిర్మాణకార్యక్రమం బీదల కంటినంతగా భాగ్యవంతుల నంటదు (అస్పృశ్యతలో గాఢమైన విశ్వాసం ఉన్నవాడు తన జీవితవైఖరి ఎన్ని విధాలనో సంస్కరించుకుంటేగాని గాంధీ గారిని అర్థంచేసుకోలేడు) ఒక్క స్వాతంత్ర్యసమస్యే ప్రస్తుతం అందరినీ అంటేది కాని కాంగ్రెసువారు తెచ్చే స్వాతంత్ర్యంలో ముస్లింలీగుకు నచ్చదు, ధనికులు తెచ్చే స్వాతంత్ర్యం దరిద్రుల ప్రతినిధులకు విశ్వాసంలేదు అదట్లా ఉండగా స్వాతంత్ర్యం కోసం తీవ్రప్రచారం చేస్తే అది ప్రభుత్వానికి రుచిస్తుందనుకునేటందుకు లేదు మనదేశంలో అనేక జాతులు, అనేక తెగలు, అనేక వర్గాలు -- ప్రతి రెంటికీ నడుమ అగడ్తలు బానిసలమై ఉండి మనం డెమోక్రసీలు సంపాదించవలసిన సంస్కారం సంపాదించుకున్నాం డెమోక్రసీలలో పెద్ద విప్లవాల వంటివి సాధ్యం కాదు, ఈనాడు సాగించవలసిన భారత జాతీయోద్యమం మహత్తరమైన ఆర్థిక, రాజకీయ, సాంఘిక విప్లవంకంటె ఏమీ తక్కువ కాదు డెమోక్రసీలు ప్రజా ప్రభుత్వాల ద్వారా చిన్న చిన్న ఆర్థిక, సాంఘిక సంస్కరణలు చేసుకోవటానికి మాత్రమే తగినవి నేటి భారతీయుల శక్తి సామర్థ్యాలు ఆపాటి కూడా లేనేలేవు

మనకివాళ అత్యవసరంగా కావలసింది నాయకత్వం దేశాన్ని అనవసరమైన ఆధ్యాత్మికచింతన నుంచీ, దిగలాగే మత విశ్వాసాలనుంచీ, నల్లమందు మత్తులాటి నిశ్చైతన్యంనుంచీ రక్షించే నాయకత్వం ద్వారా ఒక జాతీయోద్యమమూ, ఒక దృక్పథమూ, ఒక గమ్యస్థానమూ జాతికి ఏర్పడాలి ఆ మీదట సినిమాలు మిగిలిన సాధనాలతో పాటు ప్రచారానికి వినియోగపడకపోవు ఈనాటి సినిమాలేకాదు, ఏ కళలు వినోదానికి మాత్రమే

తప్ప ఇంకేమీలేదు

సంవత్సరన్నరక్రితం, ''ఫిలిం సంభాషణలు అట్టే బాగుండరాదు'' అని రాసి, కొందరు విజ్ఞుల చేత మాటలు పడ్డాను కాని ఇప్పటికీ ఆ విశ్వాసం నాలో అంతరించలేదు తెలుగులో మనం వాడే కొద్ది మాటలే ఉపయోగించుకోటానికి ఓపికలేని పెద్దలు నన్ను, ''సంభాషణలు అసహ్యంగా వుండాలని నీ అభిప్రాయమా?'' అని అడిగారు కాని నా అభిప్రాయం అప్పటికీ ఇప్పటికీ అది మాత్రం కాదు కళ్ళులేనివాడు హాలులో కూచుంటే సినిమా బాగుందని పించనవసరంలేదు అటువంటి సంభాషణలు రేడియో నాటకాలకు ఉచితం కావచ్చుగాక, సినిమా సంభాషణలు సినిమా దృశ్యంలో ఒక భాగంగా మట్టుకే వుండాలి సంభాషణలమీద వ్యామోహం ఉన్నవాళ్లు చిత్రం తాలూకు ప్రతిభ యావత్తూ సంభాషణల్లో చెప్పించాలనీ పట్టుబడితే మంచి చిత్రాలురావు

చిత్రం తాలూకు సంభాషణలను చిత్రం తాలూకు కథనుంచీ, ట్రీట్మెంటు నుంచీ, డైరెక్షను నుంచి వేరుచేసి చర్చించటం ఫిలింనిర్మాణం గురించి తెలిసినవాళ్ళు చేసేపనికాదు ''వారపత్రిక''లో ఈ చర్చ బయలుదేరదీసిన శిరోమణిగారికీ, దాన్ని సాగదీస్తున్న మిగిలినవారికీ ఒక్క రహస్యం చెబుతాను సినిమా సంభాషణలు రాసేవారు అప్పుడప్పుడూ తాము రాసిన సంభాషణలు బాగాలేవని చిత్రం విడుదల కాకపూర్వమే తమ మిత్రులతో అనటం జరుగుతూ వుంటుంది అందరినీ పడదిట్టిన శిరోమణిగారు సంభాషణలు రాసినవారంతా తమ సంభాషణలు బాగున్న వనుకుంటున్నట్టు భావించి ఉండాలి! ఇది పొరపాటు

నామట్టుకు నేనే – సంభాషణలు రాయటంలో ప్రత్యేకించి ప్రజ్ఞావంతుణ్ణి కానప్పటికీ – ఒక చెడిపోయిన ఫిలింలో రెండు మూడు దృశ్యాలకు సంభాషణలు రాయటానికి ప్రయత్నించి బొత్తిగా అసమర్థుణ్ణయి ఊరుకున్నాను దానికి కారణం ఉంది మాటవరసకు ఒక ఎల్లయ్యగారిని ఒక ఫిలింలో సంభాషణలు రాయటానికి నియమించారనుకుందాం ఈ ఎల్లయ్యగారు కేవలమూ సంభాషణలు రాయటంలోనే నిపుణుడై ఉండి కథా సంవిధానం విషయంలో గాని, పాత్రపోషణలో గాని ఎటువంటి ప్రవేశమూ లేనివాడై ఉండడం అసంభవం సంభాషణలు రాయమని స్క్రిప్టు ఎల్లయ్యగారి చేతిలో పెట్టేవాళ్లుకూడా, సంభాషణలకు మాత్రం జాగా వదిలిపెట్టి మిగిలినదంతా ఆదర్శప్రాయంగా స్క్రిప్టు రూపంలో పెట్టగలవాళ్ళై ఉంటారనేది కూడా అసంభవం

స్క్రిప్టు పూర్తిగా తయారయ్యేవరకూ ఎవరెవరైతే దాని మీద పనిచేస్తారో, వారిలో ప్రతి ఒక్కరూ మిగిలినవాళ్లు చేసేపని మీద గట్టి విమర్శకులై ఉండాలి నా అనుభవమే ఇతరుల అనుభవం కూడా అయితే నటులనుకూడా ఈ జాబితాలోకి తప్పక తీసుకోవాలి ఇట్లా జరుగుతున్నదా? మన ఫిలిముల్లో కథ సంభాషణలనూ, సంభాషణలు ట్రీట్మెంటునూ, ట్రీట్మెంటు సంభాషణలనూ, పాత్రలను సంభాషణలనూ, సంభాషణలు షాట్సునూ నిర్ణయించటమంటూ ఉన్నదా? నేనెరిగినంతవరకూ లేదు

నాచేత ఒక ఫిలింవాళ్ళు హిందీ సంభాషణలను పొల్లులేకుండా గ్రాంథికమైన తెలుగులోకి తర్జుమా చేయించుకున్నారు! నేను పనిచేసిన మరొకంపెనీలో డబ్బు పెట్టిన ఒకానొక పెద్దమనిషి

భారతీయులలో చైతన్యం కలిగించాలని బరువా గారి ఆశయం తమ వ్యాసం మహాత్మాగాంధీ గారో, జవహర్లాలుగారో చూడాలని బరువాగా రాశిస్తున్నారు

అయితే అమూల్యమైన బరువాగారి ఆశయం ఈ బానిస దేశంలో సఫలం అయ్యే అవకాశం లేదు ఎవరు బరువాగారి వ్యాసం చదివినా ప్రస్తుతం ఒకటే

ప్రస్తుతం సినిమా చూస్తున్నవాళ్లు, సినిమా వినోదం గనకనే చూస్తున్నారు గాని ఇందులో విజ్ఞానం ఉందని తోస్తే ఈ మాత్రమైనా సినిమాలు చూడక పోదురేమో? బానిస జాతికి వినోద వాంఛ ప్రబలం దారిద్ర్యం కూడా మనిషిని అట్లాగే చేస్తుంది నెలకు వంద సంపాదించేవారిలో పాతిక రూపాయలు తాగేవారి కంటే రోజుకు పావలా సంపాదించేవారిలో రోజుకణా తాగే వారు జాస్తి

రష్యాలోనూ, జపానులోనూ, జర్మనీలోనూ సినిమా ద్వారా ప్రచారం జరిగిందంటే, అక్కడ జాతీయభావం ప్రజాసామాన్యంలో అదివరకే తలఎత్తింది మంచివిశ్వాసాలో మూఢవిశ్వాసాలో అక్కడి ప్రజలకొక సామ్యమూ, ఐక్యతా కలిగించినై ఆప్రజలకు వినోదకాంక్ష ఏమీలేదు, లేకుండా చేయబడింది వారికి రాజకీయసమస్యల్లోఉండే ఆసక్తి మన ప్రజాసామాన్యానికి ఏకోశానా లేదు మనవాళ్లు ఎలెక్షన్లలో తన్నుకు చచ్చినా ఆచావులకు రాజకీయ కారణాలకంటె వ్యక్తిగత కారణాలు జాస్తి

గాంధీజీ ప్రారంభించిన జాతీయోద్యమం ఉందిగానీ అందులో ఆధ్యాత్మికదృష్టికంటె భౌతికదృష్టి చాలా తక్కువ మన 40 కోట్ల భారతీయులనూ ఏకంచెయ్యటానికి గాంధీ గారు సూత్రం కనిపెట్టలేదనే చెప్పవచ్చును ఆయన ప్రారంభించిన నిర్మాణకార్యక్రమం బీదల కంటినంతగా భాగ్యవంతుల నంటదు ( అస్పృశ్యతలో గాఢమైన విశ్వాసం ఉన్నవాడు తన జీవితవైఖరి ఎన్ని విధాలనో సంస్కరించుకుంటేగాని గాంధీ గారిని అర్థంచేసుకోలేడు) ఒక్క స్వాతంత్ర్యసమస్యే ప్రస్తుతం అందరినీ అంటేది కాని కాంగ్రెసువారు తెచ్చే స్వాతంత్ర్యంలో ముస్లింలీగుకు నచ్చదు, ధనికులు తెచ్చే స్వాతంత్ర్యం దరిద్రుల ప్రతినిధులకు విశ్వాసంలేదు అదట్లా ఉండగా స్వాతంత్ర్యం కోసం తీవ్రప్రచారం చేస్తే అది ప్రభుత్వానికి రుచిస్తుందనుకునేటందుకు లేదు మనదేశంలో అనేక జాతులు, అనేక తెగలు, అనేక వర్గాలు -- ప్రతి రెంటికీ నడుమ అగడ్తలు బానిసలమై ఉండి మనం డెమోక్రసీలు సంపాదించవలసిన సంస్కారం సంపాదించుకున్నాం డెమోక్రసీలలో పెద్ద విప్లవాల వంటివి సాధ్యం కాదు, ఈనాడు సాగించవలసిన భారత జాతీయోద్యమం మహత్తరమైన ఆర్థిక, రాజకీయ, సాంఘిక విప్లవంకంటె ఏమీ తక్కువ కాదు డెమోక్రసీలు ప్రజా ప్రభుత్వాల ద్వారా చిన్న చిన్న ఆర్థిక, సాంఘిక సంస్కరణలు చేసుకోవటానికి మాత్రమే తగినవి నేటి భారతీయుల శక్తి సామర్థ్యాలు ఆపాటి కూడా లేనేలేవు

మనకివాళ అత్యవసరంగా కావలసింది నాయకత్వం దేశాన్ని అనవసరమైన ఆధ్యాత్మికచింతన నుంచీ, దిగలాగే మత విశ్వాసాలనుంచీ, నల్లమందు మత్తులాటి నిశ్చైతన్యంనుంచీ రక్షించే నాయకత్వం ద్వారా ఒక జాతీయోద్యమమూ, ఒక దృక్పథమూ, ఒక గమ్యస్థానమూ జాతికి ఏర్పడాలి ఆ మీదట సినిమాలు మిగిలిన సాధనాలతో పాటు ప్రచారానికి వినియోగపడకపోవు ఈనాటి సినిమాలేకాదు, ఏ కళలు వినోదానికి మాత్రమే

# 21. సినిమా విమర్శలు

సినిమాల రాకతో విమర్శతాలూకు చరిత్రలో ఒక కొత్త అధ్యాయం ప్రారంభమయింది

అంతకు పూర్వం సాహిత్యం మీదా, సంగీతం మీదా, చిత్రకళమీదా, నాట్యకళమీదా ఏవో విమర్శలంటూ ఉండినా, అవి నూటికి తొంభైపాళ్లు ప్రశంసలుగానూ మిగిలిన పదిపాళ్లు తిట్లు గానూ ఉండేవి ఆరోజుల్లో ఏ కళమీద విమర్శరాసేవాళ్లు ఆకళతో సన్నిహిత సంబంధం గలవాళ్లయి ఉండేవాళ్లు విమర్శించబడేవాడూ విమర్శించేవాడూ సమ ఉజీజ్జలుగా ఉండి విమర్శపేరిట ఒకరినొకరు చెక్కేసుకునేవాళ్లు

సినిమాలు రావటంతో అదంతా మారిపోయింది

ఈ సినిమా విమర్శలు దాదాపు ప్రతివారం ప్రతి పత్రికలోనూ కనిపిస్తూ వుంటై

వీటిని రాసేవాళ్లకు సినిమా సృష్టితో ఏమీ సంబంధంలేదు కొందరు విమర్శకులు స్టూడియోలు కూడా చూసి ఎరగరు

ఇదిరాసేది పండితుల కోసంకాక కేవలం పామరులకోసం ఇది ప్రొడ్యూసర్ల మధ్యా విమర్శకుల మధ్యా కుస్తీకాదు సామాన్యంగా వీటి ఉద్దేశం ప్రొడ్యూసరును ఆకాశాని కెత్తటంగాని, అవమానపరచటంగాని కాదు

ఇవి వెనుకటి విమర్శలతో పోలిస్తే చాలా నిష్పక్షపాతమైనవి వెనకటికాలంలో ఇద్దరు కవి దిగ్గజాలు విమర్శపేరుతో ఒకరికొకరు తద్దినాలు పెట్టుకుంటుంటే చూస్తూ ఊరుకునే వారు కాని ఇప్పుడు సినిమా విమర్శ మీద రకరకాల విమర్శలు బయలుదేరుతున్నై

మంచిదే, తెలుగువాళ్లు విమర్శను గురించి Objective గా ఆలోచించటం మొదలు పెట్టారన్నమాట

అవును, ఈ విమర్శించబడే వస్తువు లక్షల కొద్దీ విలవగలది వెనుకటి రోజుల్లో తప్పుడు విమర్శల వల్ల పరువు మాత్రమే బుగ్గి అయేది ఇప్పుడు -- ఇది డబ్బుతో కూడిన విషయం

అయితే ఇప్పుడు సినిమా విమర్శలను గురించి బయల్దేరే ఆక్షేపణలు చాలా వరకు అర్థం లేకుండా ఉన్నై ఏదో విమర్శ పత్రికలో పడుతుంది ''ది ఇట్లా ఉండడం బాగాలేదు అది అట్లా ఉండడం బాగాలేదు'' అని విమర్శకుడు చిత్రాన్ని ఆక్షేపిస్తాడు

''విమర్శ constructiveగా లేదు ఏది ఎట్లా వుంటే బాగుండేదో చెప్పడేం?'' అంటారు

ఒకవేళ, ఇది ఇట్లా ఉంటే బాగుండేది, అది అట్లా వుంటే బాగుండేది'' అని విమర్శకుడు చెబుతాడా, ''ఉన్నదేదో విమర్శించకలేంది చేయ్యమంటాడేం? పది మంది పదిరకాలుగా చెయ్యమంటే ఏదని చెయ్యగలం, చెప్పూ!'' అంటారు మరికొందరు ఫలాని ఎలయ్య విమర్శరాశాడనగానే '' ఫలానా ఎల్లయ్యకు మొదలు సినిమాశిల్పంగురించి ఏం తెలుసోమాకు తేలీంది ఈ విమర్శను మేమెట్లా పాటించం?'' అంటారు అదేముక్క మరి కొందరు ఇంకో విధంగా అంటారు ''సినిమా విమర్శ అంటే ఇదా? మంచి విమర్శ చదివితే అందులో ప్రొడ్యూసరూ టెక్నీషియనులూ నేర్చుకునే అంశాలుండాలి '' అంటే ఏమీ రానివాళ్లు

చిత్రాలు తీసి డబ్బు సంపాదించుతూ ఉంటే, అన్నీ తెలిసినవాళ్లు వాటిని విమర్శిస్తూ కూచోవాలని!

విమర్శలు రాసేవాళ్లకి దురభిప్రాయలు లేవనను

కొందరు విమర్శకులు తాము చిత్రాల్లో ఉండే కళను విమర్శిస్తున్నామనుకుంటారు కళాదృష్టితో చిత్రాలు తియ్యమని ప్రొడ్యూసర్ని హెచ్చరిస్తారు మరి కొందరు జన్మలో గట్టిగా డజను చిత్రాలు విమర్శగా చూసిన పాపాన అయినాపోయి ఉండరు స్థూలంగా విమర్శను గురించీ, ప్రత్యేకించి సినిమా పరిశ్రమను గురించీ తెల్సుకోకపోతే అర్థంలేని అభిప్రాయాలిట్లాగే ప్రచారం అవుతూ ఉంటై

విమర్శ కళ నేవిధంగాను అంటలేదు ద్వారం వెంకటస్వామి నాయుడుగారి ఫిడేలు వాయింపు విని ముగ్ధుడైపోయిన వాడికిగాని, చలించకుండా రాయల్లే కూచున్న వాడికిగాని ఆ వాయింపు గురించి విమర్శ చదివితే కలగగల అధికమైన ఆనందం ఏమీలేదు

విమర్శ ఎప్పుడూ విధ్వంసకంగానే ఉంటుంది అయితే అది శిల్పానికి సంబంధించినంత వరకే

విమర్శయొక్క సర్వోత్కృష్టమైన బాధ్యత ఇదేదీకాదు అదికేవలమూ కళకు జీవితంలో ఉన్నస్థానం నిర్ణయించటమే ఒక సృష్టికి జీవితంలో ఉన్న స్థానం దానిలో వున్న కళ వల్ల నిర్ణయంకాదు సంఘానికి అత్యంతమైన అపకారం చేయ్యగలభావాలు చాలా కళాయుతంగా ప్రచారం కావచ్చు అటువంటిది జరక్కుండా చూడటం విమర్శకుడివిధి

ఇక సినిమా విమర్శ గురించి ప్రత్యేకం తెలుసుకోదగిన అంశాలున్నై సినిమా ద్వితీయ ముద్రణకి వచ్చే పుస్తకం కాదు ఎవరెన్ని విమర్శలు రాసినా చిత్రాన్ని మార్చే అవకాశం లేదు కాకపోతే చిత్రానికి కారణభూతులైన వారి లోపాలు చిత్రం ద్వారా గ్రహించి సమర్థుడైన విమర్శకుడు బయటపెట్టవచ్చును ఇట్లా చెయ్యటం వల్ల విమర్శకుడు నింద నెత్తిని నేసుకున్నవాడు మాత్రమే అవుతాడుగాని వ్యక్తులకు జ్ఞానోదయం ఇవ్వలేడు

సినిమా విమర్శకుడి ప్రథమ కర్తవ్యం జనసామాన్యానికి విజ్ఞానం కలిగించటం కూడా కాదు – వాళ్ల బేడకాసులు దుర్వినియోగపడకుండా చూడటం ఇందువల్ల ఇతరకళా విమర్శకూ సినిమా విమర్శకూ పెద్ద తేడా ఏర్పడుతుంది

ఒక వేళ విమర్శకుడు విజ్ఞాన సంపన్నుడే అనుకున్నప్పటికీ వాడు తన విజ్ఞానమంతా ఒక చిత్రం మీద ప్రయోగించినా ఆ విమర్శవల్ల ప్రయోజనం పొందే వాళ్లకు దాని వల్ల కలిగే లాభం వుండదు

ఒక పుస్తకం మీద విమర్శరాసేవాడు ఆ పుస్తకంలో వున్న సూక్ష్మమైన చమత్కారాలూ అందాలూ విమర్శించి రాయటం వల్ల పాఠకలోకానికి ప్రయోజనం ఉంది వాళ్లు గ్రంథాన్ని విమర్శనీ పక్కపక్కనే ఉంచి చదవగలరు కాని సినిమా విమర్శ అటువంటిదికాదు సినిమా చిత్రాలు తమ యొక్క ఘనతను మరో సహాయం లేకుండా ప్రచారం చేసుకోగలగటం మొదటి పక్షం లేదా ఆ ఘనతను వివరించి రాస్తూ డబ్బిచ్చి పత్రికల్లో ప్రొడ్యూసర్లు ప్రకటించడం రెండో పక్షం కాని ఈ పని విమర్శకుడి ద్వారా జరగాలని ప్రొడూసర్లు ఆశించటం చాదస్తం

పెంకిపిల్ల, మాసపత్రిక, మార్చి 1943

# 22. మన డైరెక్టర్లూ ప్రొడ్యూసర్లూ

పెద్దెత్తున డబ్బు పెట్టగల పెట్టుబడి దార్లు లేని కారణం చేతనైతేనేం, ప్రొడ్యూసర్లుగా రాణించదగిన వాళ్లూ డైరెక్టరు పనిచేయ్యటానికి పాల్పడం వల్లనైతేనేం, మన సినిమా పరిశ్రమకు డైరెక్టరే ఆదిపురుషుడు కావటం తటస్థించింది డైరెక్టరు ప్రయత్నం వల్ల జరిగినదే సినిమా ఉద్యమం అయింది జరగవలసిన రీతిలో పెట్టుబడిదార్లు ఉద్యమించి, ప్రొడ్యూసర్లను నియమించి చిత్రాలు తీస్తే డైరెక్టరు కింత ప్రాముఖ్యం వచ్చి ఉండదు కాని జరిగిందేదో జరిగింది గనక ఈ డైరెక్టర్లు మన సినిమా పరిశ్రమనెంతవరకు ఉద్ధరిస్తారనేది తెలుసుకోదగిన విషయం

రంగంలోకి కొంచెం ఆలస్యంగా దిగినప్పటికీ చిత్ర నిర్మాణానికి వెనకలేని కొత్త హోదా ఇచ్చినవాడు రామబ్రహ్మం తను తీసే చిత్రాలమీద నలుగురి దృష్టిపడేటట్లు చేసుకున్న వాడు ఈ నాటికీ రామబ్రహ్మం ఒకడే

చిత్ర నిర్మాణం రెండు రకాలుగా జరపవచ్చు ఒక ఇల్లు కట్టినట్టు జరపవచ్చు లేక ఒక పెళ్లి చేసినట్టు జరపవచ్చు మిగిలిన ప్రొడ్యూసర్లు ఇల్లు కట్టే ధోరణిలో చిత్రాలు తీస్తే, రామబ్రహ్మం పెళ్లిచేసే ధోరణి చిత్రాలు తీశాడు ఇల్లు పూర్తి అయ్యేదాకా నలుగురూ ఆసక్తి ప్రదర్శించేటందుకేమీ ఉండదు పెళ్లి జరుగుతున్నప్పుడే నలుగురికీ అందులో ఆసక్తి జాస్తి

ఈ రెండు విధానాల్లో ఏది సక్రమమైనదంటే చెప్పలేను పెళ్లి అయిన మర్నాడు కొత్తకాపరం అందరికీ జుగుప్స కలిగించవచ్చు లేదా జనరంజకం కావచ్చు ఇల్లు కూడా ఆ విధంగానే కట్టిన మర్నాడు దుప్పున కూలిపోవచ్చు లేదా వాసయోగ్యం కావచ్చు

శ్రమపడి ప్రొడ్యూసరు హోదాకు అర్హత సంపాదించుకున్నవాడు రామబ్రహ్మం ఆయన ఒక్క రోజులో సొంత చిత్రాలు తీస్తానని రాలేదు చిత్ర నిర్మాణంలో వున్న కష్టసుఖాలలోతు సమగ్రంగా తెలుసుకుని మరీ దిగాడు అటువంటి రామబ్రహ్మం – ఇతరులు శ్రమించి సాధించే విజయాన్ని అరచేతిలో పట్టుకుని పుట్టినట్టు కనిపించిన రామబ్రహ్మం – వరుసదెబ్బలు తిన్నాడు

దీనికి కొంత వరకు ఆయన అనారోగ్యం కారణం కావచ్చు ఇతర కారణాలు కూడా లేకపోలేదు

రామబ్రహ్మం డైరెక్టరయినాడు ఎట్లా చూసినా ఆయన స్రష్ట కాడు స్రష్ట అయినవాడు నాలుగు గీతలు గీస్తే అదే బొమ్మ అవుతుంది నాలుగు స్వరాలు కలిపి అంటే అదే సంగతి అవుతుంది నాలుగు సంచలనాలు చూపితే అదో అభినయం అవుతుంది స్రష్టను దాచలేం అణచలేం వాడు బయటపడి తీరతాడు రామబ్రహ్మంగారి చిత్రాలలో ఎక్కడా 'సృష్టి' అని చెప్పుకోదగినది లేదు

ఆయన తీసిన 'మాలపిల్ల' ఒకందుకు ఉత్తమమైన జాతికి చెందిన కథగల చిత్రం చిత్రానికి పనికొచ్చే కథా శిల్పానికి ఒక్కటే ప్రధాన లక్షణం కథ యొక్క పరిణామానికి మూలకందమైన బీజతుల్యమైన – కథాంశం మొదటి కొద్ది దృశ్యాలలో Establish కావటమూ దాని ఆధారం మీద మిగతా కథ యావత్తూ సమగ్రంగా పరిణామం పొందటమూనూ 'మాలపిల్ల' కథకు ఈ లక్షణం ఉంది ఒక బ్రాహ్మణ కుర్రాడు ఒక మాలపిల్లని ప్రేమించాడు అదే కథకు బీజం ఈ

ఒక్క సంఘటనమీద ఎంత కథయినా అల్లవచ్చు ఎన్ని సంఘటనలయినా సృష్టించవచ్చు ఈ ప్రధాన కథాంశం గల చిత్రంలోకి కాంగ్రెస్ వలంటీర్లనూ, హరిజన దేవాలయ ప్రవేశసమస్యనూ తీసుకువచ్చి సమన్వయించలేకపోయిన డైరెక్టరు ఎటువంటి స్రష్ట అనాలి? మాలపిల్లచేత అష్టపదులు ఆనందింపజేసిన డైరెక్టరు భావనాశక్తి ఎంతపటుత్వం గలదనుకోవాలి?

'మాలపిల్ల' లాగేచక్కని కళా శిల్పం ఉండగల్గిన మరోచిత్రం 'దేవత', అందులో కూడా ఒక పెద్ద కుటుంబీకుడైన కుర్రవాడు తన ఇంట్లో పనిచేసే పిల్లని కామించి చెరుస్తాడు అయితే ఈ చిత్రాన్ని సృష్టించిన బి ఎన్ రెడ్డికి దీని విశిష్టత అర్థమయిందనుకునేటందుకు లేదు మొదటి ఒకటి రెండు స్వీక్వెన్సులలో Establish కాదగిన ఈ అంశం చిత్రంలో ఎప్పటికో గాని జరగదు అన్నకోసం విరహం పడే చెల్లెలి వెన్నెల పాటలూ, రెండెడ్లబండికి కారును కట్టి లాక్కొచ్చే సింబాలిజమూ, కథానాయకుడు ఎడారి ప్రదేశంలో కారు దిగి సోడా అడగటమూ ప్రధాన అంశం కంటే ప్రధానమయినై ఈ పనిచేసే పిల్లయినా ఎక్కడికి పోతున్నావంటే ''అనంతవిశ్వంలోకి'' అంటుంది!

బి ఎన్ రెడ్డికి చిత్రాలు చూడడంలో చెప్పకోదగ్గ అభిరుచిఉంది అని నేను నమ్ముతున్నాను కాని స్రష్టకావటానికి ఒక్క అభిరుచి చాలదు చాలా విమర్శనా జ్ఞానం కూడా ఉండాలి దురదృష్టవశాత్తు రెడ్డిగారికి విమర్శన మీద ఉండదగినంత ఆదరణలేదు వరుసగా ఇరవై పత్రికలు తన చిత్రంలో కథ లోపభూయిష్టంగా వుందని రాసినప్పటికీ ఆయనకు చప్పున నమ్మకం చిక్కదు

అసలు బి ఎన్ రెడ్డి వాహినీ చిత్రానికి స్రష్టగా వ్యవహరిస్తున్న విషయం కూడా చాలా సందేహాస్పదం ఒకడే స్క్రిప్టు రాయటమూ, కామెరా తిప్పటమూ చేస్తూ, చిత్రంలో ఫోటోగ్రఫీకి ప్రాధాన్య జాస్తిగా ఉంటున్నప్పుడు రెండో మనిషి స్క్రిప్టుకూ షూటింగ్‌కు మధ్య నిలబడి స్వంతస్పష్టిచేయ్యడాని కేవిధంగా ప్రయత్నించగలడో నా అల్పబుద్ధికి ఏమాత్రమూ తోచకుండా ఉన్నది బి ఎన్ రెడ్డికి స్రష్టత్వంలో వున్న చాతుర్యం ఇక ముందుగాని రూఢిగా రుజావుకాదు వాహినీ చిత్రాలలో 'సృష్టి' అనేది స్పష్టంగా కనిపిస్తుంది

అయితే బి ఎన్ రెడ్డి సమర్ధుడైన ప్రొడ్యూసరని చెప్పక తప్పదు మంచి మనుష్యులను ఏరుకోవటములోనూ, వారిచేత ఇతర ప్రొడ్యూసర్లు చేయించలేని పని చేయించుకోవటంలోనూ ఆయన ప్రతిభ అపారమని చెప్పాలి రామనాథ్ శేఖర్లు లేని కారణంచేత వాహినీ చిత్రాలు కళా హీనమవుతున్నవనుకునేవాళ్లు చాలా పొరపాటు పడ్డారనుకోవాలి చిత్రానికి మంచి ప్రొడ్యూసరు తీసుకురాగల కళచాలా వుంది రెడ్డిగారు ఆత్మవిశ్వాసంతో, కొందరు వ్యక్తుల మీదనే సొంతం ఆధారపడక తీర్మానంతో ప్రొడ్యూసరు పని నిర్వహించినట్టయితే వాహినీ చిత్రాలకెప్పటికీ చచ్చుండదు కాని వాహినీవారికి రెడ్డిగారి దర్శకత్వం చాలుతుందనేది మాత్రం అనుమానించ వలసిన విషయమే

కళా సృష్టివేదలనతో కూడుకున్నది కావలిస్తే నిజమైన కళా స్రష్ట అనదగిన ఏ కవినిగాని, నటుణ్ణిగాని, చిత్రకారుణ్ణిగాని, కథకుణ్ణిగాని అడగండి తన హృదయంలో కొట్టుకునే ఒక సజీవమైన భావాన్ని పైకి పెకలించి దాన్ని చీల్చి పరీక్షించి దానికి శరీరం ఇవ్వటానికి శిల్పం

నిర్ణయించి, అది తిరిగి ఇతర హృదయాల్లో ప్రవేశించి అక్కడ చైతన్యం కలిగించేవరకూ తన కృషి ఫలించిందీ, లేనిదీ తెలుసుకోలేక తహతహలాడే వాడు స్రష్ట కళాసృష్టలో ఉండే వేదన అనుభవించి ఉండనివాడు కూడా సులభంగా ఊహించుకోవచ్చు

కాని కళలకు ఆదరణలేని తెలుగుదేశంలో ఈ వేదనను గుర్తించేవాళ్లు బహు అరుదు కనుకనే మన దేశంలో నిర్లిప్తులై మంచినీళ్ల ప్రాయంగా కళాసృష్టిచేసేవారికి ఆదరం ఉంది మన డైరెక్టర్లలో కళా నిర్లిప్తుడు వై వి రావు, చిత్ర నిర్మాణం ఆయనకు ఓ ఆటలాంటిది ఆయన చిత్రాల్లో యథార్థమైన కళా సృష్టి ఉండటానికి అవకాశం లేదు అయితే ఆయనకు కొద్ది శ్రమతో ఎక్కువ ఫలితం సాధించటం చాతనవును డైరెక్టర్లందరూ నూతులు తవ్వేవాళ్లను కున్నట్టయితే వై వి రావు చలమల కోసం వెతుకుతాడు ఆయనకవి దొరుకుతై కూడాను దొరకవూ, ఆయన అట్టే విచారించడు కొంచెం దూరం తవ్వి అందులో ఎక్కణ్ణించైనా తెచ్చి ఇన్ని నీళ్ల పోసేసి చేతులు దులుపుకుంటాడు

వై వి రావుకు విమర్శజ్ఞానం తగుమాత్రం ఉందనుకోటానికి వీలులేదు కాని తీక్షమైనణ అభిరుచి తెచ్చుకోవటానికి, ఆయనకి జాస్తి ఓపిక లేదు అచ్చమైన ఆంధ్రుడు కళా సృష్టిని గురించి మధనపడటానికి మెటీరియలిస్టు ప్రొడ్యూసరుగా పైకి రావటానికైనా ఆయన నిర్లిప్తతే అడ్డం వస్తుంది పెద్ద పెద్ద పనులు చెతామనే ఆవేదన ఆయన తత్వానికి సరిపడదు ఆయనకు కావలసింది సూక్ష్మంలో మోక్షం అది ఆయనకు దాదాపు అందుబాటులోనే ఉంటూ ఉంటుంది

అచ్చంగా డైరెక్టరునే నమ్ముకున్న వాడు పి పుల్లయ్య ఆయన తీసిన 'వెంకటేశ్వర మహాత్మ్యం' అంతులేని డబ్బు సంపాదించినప్పటికీ తెలుగు సినిమా పరిశ్రమకు పి పుల్లయ్య ద్వారా పెద్ద మహోపకారం జరుగుతుందనే భావం ఇప్పటి వరకు కలగలేదు ఆ తప్పంతా కేవలమూ పుల్లయ్యది కాదేమో ఆయన తీసిన చిత్రాలన్నిటికీ మూడో తరగతి స్క్రిప్టు తప్ప జతపడలేదు డైరెక్టరుగా పుల్లయ్యలో ఒక సుగుణం వున్నట్టు కనిపిస్తుంది ఆయన ఏ ఇతర డైరెక్టరు కన్నాకూడా సూటి అయిన ఆలోచన చెయ్యగలడు అందువల్ల లేనిపోని ప్రజ్ఞలకుపోడు అట్టేడొంకతిరుగుళ్లు లేని కథ తీసుకుని, కాగితం మీద బందోబస్తు చేసుకున్నట్టయితే ఉన్నది ఉన్నట్టు నేరుగా take చెయ్యటానికి పుల్లయ్య మీద ఆధారపడవచ్చును ఈయన కళాసృష్టిలో ఇతరులతో పోటీ చెయ్యగలగటం అనుమానాస్పదం ఈయన డాంబికాలకు పోయేవాడుకాడు, అవసరమైతే అసిస్టెంట్ లేకుండా కూడా పనిచెయ్యగలడు

ఆవిధంగానే దీక్షతో పనిచెయ్యగలడు జగన్నాథ్ కళాసృష్టిలో స్వల్ప విషయాలకుండే విలువ ఈయనకు తెలిసినట్టు మన మిగిలిన డైరెక్టర్లెవరికీ తెలీదేమో ఏ డైరెక్టరుకూ తీసిపోని అభిరుచీ, విమర్శనా జ్ఞానమూ ఉన్నప్పటికీ జగన్నాథ్ డైరెక్టరు ప్రొడ్యూసరుగా పైకి రావటానికి కొంతకాలం పడుతుంది ఎందుకంటే ఈయన ఇతరుల మాదిరిగా లేని ఆత్మవిశ్వాసాన్ని ప్రకటించలేదు ఒక్క దెబ్బతో పైకి రావాలన్న ఆదుర్దాకూడా లేదు అట్లాపైకి రావటానికి ఇతరులకున్న పోటీ అవకాశాలూ లేవు షూటింగ్ ప్రారంభం నుంచీ చివరవరకూ మొత్తం చిత్రం యావత్తూ మనసులో ఉంచుకొని పనిచెయ్యగల అరుదైన శక్తి జగన్నాథ్‌లో ఉంది ( తడవకు ఒక షాటును గురించి తప్ప ఆలోచించలేని గొప్ప డైరెక్టర్లూ, చిత్రం పూర్తిగా ఎడిట్ చేసుకుని

అందులో నుంచి ఏడువేల అడుగులు కత్తిరించి పారేసిన డైరెక్టర్లూ, ఎడిటింగ్ పూర్తి అయిన తర్వాతగాని తాము ఏమి తీసిందీ తమకే తెలీని డైరెక్టర్లూ మనలో ఉన్నారు! ) ఇటువంటి కొన్ని లక్షణాలను బట్టి జగన్నాథ్ ముందు ముందు కళావంతమైన చిత్రాలు తియ్యగలడని ఆశించటానికి అవకాశం ఉంది

సత్తా ఉన్నవాడు చప్పున పైకి రాలేకపోవటానికి ఒకటే అభ్యంతరం డబ్బు! డబ్బుతో మంచి మ్యూజిక్ డైరెక్టరునూ, తారలనూ, ప్రాపర్టీలనూ, కథలనూ కొనుక్కొని డైరెక్టరు తన శక్తి సామర్ధ్యాలను ఒక్క సారిగా ప్రదర్శించుకోగలడు అది లేనప్పుడు అజ్ఞాతంగా వున్న మంచి పనివాళ్లను వెతుక్కోవలసి వస్తుంది దానికి అంతులేని కాలయాపన జరుగుతుంది ఈ లోపుగా, డబ్బుతో మంచి పనివాళ్లను కొనుక్కోగలిగిన డైరెక్టరు వరసగా చిత్రాలు పాడుచేసినా పెద్ద డైరెక్టరుగానే ఊరేగుతుంటాడు రంగంలో విడి ప్రొడ్యూసర్లు లేని కారణం చేత మంచి డైరెక్టర్లు కాదగిన వాళ్లు అష్టకష్టాలు పడి తామే ప్రొడ్యూసర్లుగా వ్యవహరించవలసి రావటంతో మరింత కాలయాపన అవుతుంది

డైరెక్టరు ప్రమేయం లేకుండా కేవలమూ ప్రొడ్యూసరుగా పనిచెయ్యటానికి కార్య రంగంలో దిగినవాడు నాగయ్య కాని నాగయ్యచాలా మంచివాడు అయితే ఆయన అమాయకుడు కూడా, చాలా గ్రహణశక్తిగలవాడు విమర్శనను ఆహ్వానించేవాడే నను కుంటాను ఈయనకు త్వరలో ఆత్మవిమర్శ సమగ్రంగా అలవడి, ఇతరుల అభిప్రాయాలు స్వీకరించే పూర్వం వాటి విలువ కట్టటం సత్తా ఏర్పడినట్టయితే సినిమా రంగంలో ఈయన ఎంతపైకి వచ్చినారావచ్చు తను పేరుగడించిన నటుడూ, సంగీత దర్శకుడూ అయివుండటం ఈయనకు మరింత లాభం ప్రొడ్యూసరుకు ముఖ్యంగా కావలసింది తాను నియమించే వారికి విలువ కట్టే దక్షత నాగయ్యకిది అలవడినట్టయితే ఆయన తెలుగులో అత్యుత్తమ చిత్రాలు తీయగలుగుతాడు ఈయన తీసిన మొదటి చిత్రం 'భాగ్యలక్ష్మి' కాదగినంత విజయవంతం కాకపోయినా ఒకసారి జరిగే పొరపాట్లు మరోసారి జరగకుండా చూసుకుంటే నాగయ్యగారెంత మంచి చిత్రాలయినా తీయవచ్చును

ఇంకా ఇతరడైరెక్టర్లూ, ప్రొడ్యూసర్లూ తెలుగుసినిమా ప్రపంచంలో పాటు పడుతున్నారు సినిమా వృత్తిలో వారు అంతో ఇంతో బాగుపడటమే పదివేలు

*పెంకిపిల్ల, మాసపత్రిక, అక్టోబరు 1943*

# 23. దేశీయ సాహిత్యం

నవ్యసాహిత్యమనీ, అభ్యుదయ సాహిత్యమనీ, ప్రజాసాహిత్యమనీ గొడవచేసే వాళ్లే గాని, నిజంగా మనకి కావలసింది దేశీయ సాహిత్యమని నేనీమధ్య ఓ రోజు సాయంకాలం అకస్మాత్తుగా కనిపెట్టాను ఇవాళ జరుగుతున్న అద్భుత భయంకర ఫాసిస్టు వ్యతిరేక సంగ్రామంలో భారతీయులు తగినంతగా పాల్గొనకపోవటానిక్కారణం భారతీయులకు ఆత్మజ్ఞానం లేకపోవటం 'నాదేశం', 'నాహక్కులు'', 'నాక్షేమం', 'నా సంచితం' అనేది కలిగించే సాహిత్యం అర్జంటుగా కావాలి

ఈ సాహిత్యానికి పునాదిగా ఉండగలందులకూ, నమూనాగా ఉండగలందులకూ ప్రస్తుతం భారతీయ సినిమా పరిశ్రమగురించి సంగ్రహంగా రాస్తున్నాను ఈనాటి మన దేశీయ సంస్కారంలో సినిమాకన్న ముఖ్యమైన విషయంలేదని మనకందరికీ తెలిసిన విషయమే పూజ్యులలో సినిమా తారలకంటే, సాంఘిక సమస్యలు పరిష్కారం చేసి పారెయ్యటంలో సినిమా ప్రొడ్యూసర్లకంటే లేరని ఎరుగుదుం ఆఖరుకు యుద్ధం మూలంగా దెబ్బతింటానిక్కూడా సినిమా ప్రొడ్యూసర్లకి బెంగాలు వాళ్లు కూడా చాలరు అందుకని భారతీయ సినిమా పరిశ్రమ గురించి ఎవరకీ తెలీని విషయాలన్నీ రాసేస్తున్నాను ఇది రాయడంలో నా ఉద్దేశం దేశకల్యాణమూ, ప్రపంచ కళ్యాణమూ అయినప్పటికీ, నాకిష్టం లేని వాళ్లందర్నీ ఏకెయ్యటానికీ సదవకాశం వినియోగపరుస్తున్నాను నేను చెప్పబోయే విషయాలను ఆమోదించక ప్రతికూలో పాఖ్యానం చేసేవాళ్ల సంగతి తరువాత చెబుతాను

1915లో హాలివుడ్‌లో సినిమా పరిశ్రమ ప్రారంభమయింది సినిమాలని ప్రఖ్యాతిలోకి తెచ్చిన తార గ్రేటాగార్బ్‌ (ఈవిణ్ణే కొందరు గ్రీటాగార్బ్ అని కూడా అంటారు) ఈవిడ 1919లో పుట్టింది ఈవిడ ఎత్తు 5 అడుగుల నాలుగంగుళాలు ఈవిడ చుట్టు కొలతలు 36,24,32, అంగుళాలు ఈవిడ ఇటీవల నటించిన 'మాతాహరి,' 'క్వీన్ క్రిస్టినా' చిత్రాలు చాలా గొప్పవి గ్రే (లేక, గ్రీ) టాగార్బ్ వారానికి రెండు వేల డాలర్లు సంపాదించి, అందులో కొంత ఖర్చుచేసి మిగతాది వెనకేస్తుంది ఈవిడకు పెళ్ళి కాలేదు

నా స్నేహితుడొకడు గ్రేటాగార్బ్‌కన్న కాథీరీన్ హెప్ బర్న్ (లేక కెథారెయిను హేపబర్ను) గొప్పనటి అంటాడు ఈవిడ చుట్టుకొలతలు 24,22,24 అంగుళాలు ఎత్తు తెలీదు ఈవిడిని నేనెన్నడు చూడలేదు ఈవిడకన్న గార్బ్ ప్రఖ్యాత నటీమణి అనటానికి సందేహం లేదు గ్రేటాగార్బ్ యొక్క ముద్దు పేరు గార్బ్ మొట్టమొదట సినిమాలు తీసినాయన గ్రిఫిత్సు ఈయన చాలా గొప్పవాడు ఇప్పుడు హాలివుడ్ ప్రఖ్యాత డైరెక్టరు సెసిల్‌బీడీ మిల్లీ (లేక, మిల్) సినిమాలు ఫిలిముల మీద తీస్తారు ఫిలుముతీసే యంత్రాన్ని కామెరా అంటారు సినిమాలు తియ్యటాన్ని షూటింగు అంటారు శబ్దగ్రహణం చేసే యంత్రాన్ని ట్రక్కు అంటారు బయటినుంచి చూడటానికి బస్సు మాదిరిగా ఉంటుంది శబ్దగ్రహణంచేసే ఆయన్ను రికార్డిస్టు అంటారు మనదేశపు ముఖ్య పరిశ్రమలో సినిమా పరిశ్రమ చెప్పుకోదగినది

*ఆనందవాణి, వారపత్రిక, 23-1-1944*

# 24. మన సినిమా కళ

ఇటీవల మన చిత్రాలు శిల్పంలో చాలావరకు పున్నతస్థితికి వచ్చినమాట నిజమే ఈనాడు మనదేశపు చిత్రాలలో అందమైన ఫోటోగ్రఫీ, ఇంపయిన రికార్డింగూ, తెలివైన ఎడిటింగూ కనిపించటం జరుగుతున్నది ఈకారణం చేత యిప్పుడిప్పుడు మనయువకుల్లో చాలా మంది వీటిని ఆదరిస్తూ అమెరికను చిత్రాలకోసం తహతహ లాడేవాళ్లని విమర్శించటం ప్రారంభిస్తున్నారు

'మన పిక్చర్సులో లేనిదేముంది అమెరికన్ పిక్చర్సులో? వాటిల్లోనూ తుక్కు సరుకెంతో

వుంది' అని కొందరు వాదిస్తున్నారు కావచ్చు మన చిత్రాల్లో చాలా మంచి సరుకు కూడా కొంత వుండవచ్చు కాని మొత్తం మీద చూస్తే, కళలను సేవించే వాళ్ళ మనస్తత్వం గురించి అమెరికన్ ప్రొడ్యూసర్లకు తెలిసిన దానిలో మనవాళ్ళకి యెన్నో వంతో కూడా తెలీదు

కళ ఒక అనుభవం

ఒక పుస్తకం చదివినా, ఒక సినిమా చూసినా, ఒక పాటవిన్నా అదొక అనుభవం కింద జమ కావాలి అమాయకులు చిల్లర అనుభవాలతో తృప్తి పడవచ్చు విమానం చూసి సంతోషించే వాళ్ళున్నారు ఇంగ్లీషు చిత్రాల్లో ముద్దులు చూసి పరవశమయ్యే వాళ్ళున్నారు 'కంటికింపుగా చెవికి శ్రావ్యంగా' వుంటే చాలనేవాళ్లున్నారు కాని జాతి మొత్తం గురించి ఆలోచించేటప్పుడు స్వల్పవిషయాలకి విలువలేదు

నిజమైన అనుభవం ఏది?

అనుభవంలో చాలారకాలున్నై కొందరు దేశాలు చూసి వస్తారు మరి కొందరు టెలిస్కోపులు పెట్టికోటాను కోట్ల మైళ్ల దూరంలో వున్న చుక్కలకేసి చూస్తారు మరి కొందరు మైక్రోస్కోపులతో అణువుల గర్భాలు పరీక్షిస్తారు అన్ని రకాల అనుభవాల వెంటా ఏదో కొంత జ్ఞానం అంటి తీరుతుంది కాని నిజమైన జ్ఞానం మనుష్యసంపర్కంవల్ల తప్పరాదు మనిషికి నిజమైన అనుభవం మనుషులను తెలుసుకోవటం సాహిత్యమంతా సంఘటనలే అయితే కాశీమజిలీలు మించిన సాహిత్యం లేదు సాహిత్యం చదవటమంటే సంఘటనలకీ మనుషులకీ గల సంబంధం తెలుసుకోవటమైతే పాత్రల పరిచయం అమూల్యమైన అనుభవమే పుస్తకాల ద్వారా గ్రంథకర్తల పరిచయం చేసుకోగల వాళ్ళు వుత్తమ శ్రేణికి చెందిన పరితలు

దేశ సంచారం చెయ్యటంలోనూ, అందమైన దృశ్యాలు చూడటంలోనూ, అందమైన దుస్తులు ధరించటంలోనూ, చక్కని ఇళ్లలో నివసించటంలోనూ ఆనందం లేకపోలేదు కాని యిది విజ్ఞానాన్ని పెంపుచేయలేదు అందుకనే అద్భుతమైన సంచారసాహిత్యమూ, సంఘటనలతో కిక్కిరిసివుండే డిటెక్టివు సాహిత్యమూ, ఆధునిక చరిత్రా వగైరాలు ఎంత విరివిగా ప్రచారం అయినా, ఎన్ని ప్రయోజనాలు సాధించగలిగినా సాహిత్యకళ యొక్క వుత్కృష్ట ఆశయాన్ని నెరవేర్చలేవు ఆ ఆశయం మనిషికి మనుషులతో పరిచయం చెయ్యటం

సినిమా కళ యొక్క ఉత్తమ ఆశయం కూడా అదే

నిజానికి పాత్రల పరిచయం యివ్వటంలో సినిమా పరిశ్రమకున్న అవకాశాలు మరిదేనికీ లేవు పుస్తకాలలో పాత్రలను గురించి తెలుసుకోవటానికి కొంత శ్రమవున్నది మనం వాళ్ళని చూడలేం వారిని గురించి రచయిత మధ్యమధ్య మనకి వర్ణనలిస్తూ వుండాలి ఎంత మేటి రచయిత అయినా అంతా వివరంగా వర్ణించలేడు కనక కొంత మనం వూహించగలగాలి

నాటకంలో ఈ ఇబ్బందులు కొన్ని వుండవు పాత్రకనబడుతుంది వినపడుతుంది మన భావనాశక్తి అట్టే అవసరం లేకుండానే పాత్రయొక్క కష్టసుఖాలూ, వాటిని గురించి పాత్ర యొక్క వైఖరీ తెలిసిపోతుంది కాని నాటకాలలో కూడా లేని అవకాశాలు సినిమాలో వున్నై సినిమా పాత్రకు అవసరమైనప్పుడల్లా క్లోజప్‌ద్వారా ప్రత్యేకత లభిస్తుంది ప్రదర్శన చూస్తున్నంత సేపూ మన దృష్టిని ఆకర్షించటానికి ఒక పాత్రతో మరొకటి పోటీ చెయ్యటమనేది వుండదు

అదీకాక రెండు గంటల కాలంలో సినిమా దృశ్యం చూపే సన్నివేశాలూ సంఘటనలూ

నాలుగు గంటలకాలంలో కూడా నాటకం ప్రదర్శించలేదు

కొద్ది ఫిలిములు తప్పిస్తే మన దేశపు చిత్రాలలో పరిచయం చేసుకోదగిన పాత్రలు కనిపించవు మనం చూసేదల్లా వారికి జరిగే సంఘటనలు మనకి జరిగే సంఘటనలవల్లకాదు మనకి వ్యక్తిత్వం ఏర్పడేది, ఆ సంఘటనలకి మనం రియాక్టు అయే విధానం వల్ల

పాత్రల యొక్క మనః ప్రవృత్తులు

అందులో కూడా అసామాన్యమైన సంఘటనలు వ్యక్తిత్వం నిరూపించటానికి పనికిరావు అసలు సాధారణ సంఘటనలు వ్యక్తిత్వాన్ని అణగదొక్కుతై పెద్ద ఆపద చుట్టుకున్నప్పు డందరమూ ఒక రీతిగానే ప్రవర్తిస్తాం ఏడవటంలోగానీ, నవ్వటంలోగాని మనిషికీ మనిషికీ ఆంట్టే తారతమ్యంలేదు

అందుకని చిత్రాల్లో పెద్ద సంఘటన లుండరాదనటంలేదు పాత్ర పోషణకి అవి సాధనాలు కావంటున్నాను చిత్రాలు తియ్యటంలో ఆరితేరినవాళ్ళు అటువంటి సంఘటనలు తప్పనిసరిగా పెట్టవలసివస్తే వాటిని చాలా క్లుప్తంగా చూపించి కథనడుపుతారు పాత్రలు చావటమూ మిగతా పాత్రలు ఏడవటమూ చూపించవలసివస్తే వందలకొద్ది అడుగుల ఫిలిం తగలెయ్యటం చౌకబారు ప్రొడ్యూసర్ల లక్షణం

అయితే ఒకటి వుంది ఈ అసాధారణ సంఘటనల్లో కూడా అసాధారణ పాత్రలు అసాధారణంగా ప్రవర్తించటం వుంటుంది అటువంటప్పుడా పాత్ర వ్యక్తిత్వం నిలబెట్టు కుంటుంది అప్తులు చచ్చిపోయినప్పుడు ఏడవని పాత్రను చూపించటానికి కొంత ఫిలిం ఖర్చు చెయ్యవచ్చును కాని యిందువల్ల ఫిలిందండగ వుండదు వైనవైనాలుగా ఏడవటాన్ని చూపటానికి పట్టినంత ఫిలిం, నిశ్చలంగా వున్న మనిషిని చూపటానికి పట్టదు మీదు మిక్కిలి అంత పొడుగు ఏడుపువల్ల రాని ప్రయోజనం యీ కాస్తవల్లాకలుగుతుంది

భావం ముఖ్యం

ఉద్రేకం సంస్కారహీనమైనది దాన్ని జయవంతంగా ప్రకటించినంత మాత్రాన ఎవడూ ఉత్తమనటుడు కాలేడు (హాలీవుడ్‌లో కొత్తనటుల్ని దుష్టపాత్రలకి నియోగించేవాళ్ళు) బొత్తిగా పొడిముక్కలు చెప్పటానికి నటుడు అవసరం లేదు (మునీశ్వరుల వేషాలు ఎవరు వేసినా వెయ్యొచ్చు) ఈనాటి దృశ్యకళలో భావప్రకటన ప్రధానమైనది భావం (Feeling) అనేది జ్ఞానానికీ ఉద్రేకానికీ గల కలయిక జ్ఞానం చేత సంస్కరించిన ఉద్రేకమూ, ఉద్రేకం ప్రాణం పోసిన జ్ఞానమూ భావం అవుతుంది ఇది అస్తమానమూ పాత్రచేసే ప్రతిపనిలోనూ, ఆడే ప్రతిమాటలోనూ ద్యోతకమవుతూ వుంటుంది భావం ప్రకటించటం దగ్గిర నటుడి సామర్థ్యమూ, అనుభవమూ కూడా బయటపడతై క్షుద్రపాత్రలు ధరించి అనుభవం లేని వాడూ, సామర్థ్యం లేనివాడూ కూడా ఒక్కసారిగా గొప్పవాడై పోవచ్చు కాని విమర్శకుడు అటువంటి విజయాన్ని పాటించడు

రాసేవాడుండాలి

భావం ప్రకటించగల నటులు మన దేశంలో లేరని చెప్పను భావపుష్టి గల పాత్రలను సృష్టించే వాడొక్కడుంటే వాటిని ప్రదర్శించ గలవాళ్ళు పదిమంది అయినా దొరుకుతారు పాత్రలను సృష్టించేవాళ్ళు లేకపోయినారనుకోవటానికీలేదు వాళ్ళని ప్రొడ్యూసర్లు

నియోగించరు నియోగించినా చివరకు ఏ డైరెక్టరో తన సొంత అభిప్రాయం ప్రయోగించి చిత్రాన్ని ధ్వంసం చెయ్యవచ్చు

పర్యవసానం ఏమంటే పాత్రల పరిచయం చెయ్యటానికి సినిమా కెంత అవకాశాలున్నాయో, అది సాగకపోవటానికీ అంత అవకాశాలున్నై ఇందుకు ఒకరిని తప్పుపట్టి లాభం లేదు పెద్ద సంఘటనలకీ, వుద్రేకాలకీ ప్రాముఖ్యం యివ్వటం ఆచారంగా వస్తున్నది ఈ ఆచారం అమలులో వున్నన్నాళ్ళూ మన చిత్రాలింకా హీనంగానే వుంటై ఎంత అందమైన ఫోటోగ్రఫీగాని, రికార్డింగుగాని, సెట్టింగులుగాని, పాటలుగాని యీ లోపం పూడ్చలేవు

అమెరికను చిత్రలు

అమెరికను చిత్రాల్లో యీ ఆచారం క్రమంగా వచ్చేసింది (Human interest) అనే సూత్రం పేర వాళ్ళెన్ని అవకతవకలు చేసినా అటువంటి సూత్రం ఒకటి వాళ్ళు సమగ్రంగా అమల్లోకి తెచ్చారు ఇది రష్యను చిత్రాల్లో కూడా కనిపిస్తుంది ఈవిషయంలో బ్రిటిషు చిత్రాలు మన చిత్రాలకి దగ్గిరగానే వున్నై

అమెరికను చిత్రాలు చూడటంలో అనుభవంవంటిది లేకపోలేదు ఈచిత్రాల్లో రకరకాల పాత్రలు అనేకరకాల దౌర్బల్యాలతో కూడుకున్నవి ఒక ఆదర్శం నిరూపించటానికని చిత్రించ బడినవి --మనకి సంతోషం కలిగించేవీ, అసహ్యం పుట్టించేవీ కూడా వుంటై ఒక్కొక్కప్పుడీ పాత్రలని మనం కొన్ని ఏళ్ళ పర్యంతం, యధార్ధ వ్యక్తులని మరిచిపోయినప్పుడు కూడా, జ్ఞాపకం వుంచుకుంటాం కొన్నికొన్ని పాత్రల పరిచయం చేసుకున్నప్పుడు మనలో అసహనమూ, అతిశయమూ కొంత సంస్కారం పొందుతై మన చిత్రాలు ప్రదర్శించినంతగా వుద్రేకమూ, వుపన్యాసాలూ లేకుండానే యీ చిత్రాలు సంస్కారం ప్రచారం చేస్తున్నట్టు కనిపిస్తుంది

మన చిత్రాల్లో పాత్రలు

పాత్రలకి ఆకారం యివ్వటం తెలిసినవాడికి శ్రమతో కూడుకున్నపని పాత్రయొక్క ఔన్నత్యాన్ని బట్టి రచయితా, డైరెక్టరూ, నటుడు కూడా శ్రమపడవలసి వుంటుంది

అయితే మన చిత్రాల్లో ఏ శ్రమాలేదు రాముడి పాత్ర అయ్యేది, భీముడి పాత్ర అయ్యేది, సీత అయ్యేది, చెంచు అయ్యేది ఆపాత్రకు జరిగే సంఘటనలేవో, ఆపాత్ర చూపించవలసిన వుద్రేక మేమిటో తెలిస్తే మిగిలిన విషయాలను గురించి మన డైరెక్టర్లకే విచారమూలేదు ఆ పాత్రలను ఎవడు చిత్రించినా సరే,ఎవరు ధరించినా సరే, రాసేవాడికీ వేషం వేసేవాడికీ యింత పేరు ప్రతిష్టలుంటే చాలు!

*పెంకిపిల్ల, మాసపత్రిక, జనవరి 1945*

# 25. పాపం! ప్రొడ్యూసర్లని తిట్టకండి

సినిమా ఎట్లా ఉండాలి, టెంపో అంటే ఏమిటి, రీరికార్డింగు వల్ల ప్రయోజనం ఏమిటి వగైరా వైజ్ఞానిక సమస్యల్ని గురించి తప్పకుండా రాయండి, అచ్చెయ్యండి, తీరిక ఉంటే చదవను కూడా చదవండి నాలుగారాళ్లు, ఓ అసిస్టెంటు డైరెక్టరు ఛాన్సు, ఆడతారల మీద తీరని తీపో ఉంటే వాళ్లని పైకెత్తి వ్యాసాలు రాయండి అచ్చెయ్యండి, ఒకటికి పది సార్లు చదవండి

చెప్పొచ్చిందేమిటంటే, ఏమైనాచెయ్యండి. కాని, పాపం, ప్రొడూసర్లని మట్టుకు తిట్టకండి. మంచి చిత్రాలు తియ్యనివ్వండి, చెడ్డ చిత్రాలు తీయ్యనివ్వండి, మిమ్మల్ని కొట్టి తారలకి పెట్టనివ్వండి వాటాదార్లనీ కంపెనీనీ ముంచి మరో కంపెనీ లేవనెత్త నివ్వండి తెలుగు పిక్చర్లు మానేసి అరవ పిక్చర్లు తియ్యనియ్యండి, ఏమైనా కానివ్వండి ప్రొడ్యూసర్లని మట్టుకు తిట్టకండి

సంఘంలో ప్రొడ్యూసరు స్థానం ఏమిటో తెలిస్తే మీరు వాళ్లని తిట్టరని ఘట్టిగా చెప్పియగల్ను వాళ్లెందుకు చిత్రాలు తీస్తున్నారో తెలిసినా సులభంగా వాళ్లని క్షమించెయ్యగల్రు

ఈముచ్చట్లు తరవాత ముచ్చటిద్దాం ముందు ప్రొడ్యూసర్లని తిట్టేవాళ్ల దృక్పధం ఏమిటో ఆలోచిస్తాం తనకు ఛాన్సు ఇవ్వలేదని తిట్టేవాళ్లని ఈ చర్చలోంచి వదిలేద్దాం

మనం ప్రొడ్యూసర్లని సామాన్యంగా ఎందుకు తిడతాం వాళ్ళు మంచిచిత్రాలు తియ్యకుండానే లక్షలకు లక్షలు చేసుకుంటున్నారనీ, వాళ్ళు తీసే చిత్రాల్లో ''కళ'' లేదనీ, వాళ్ళు తీసే చిత్రాలు సంఘానికి నిజంగా ఉపకరించడం లేదనీ, ఇత్యాది కారణాలు పెట్టుకుని వాళ్లని తిడతాం అంతవరకు బాగానే ఉంది కాని నిజంగా మనకి సంఘం యొక్క బాగుగాని, కళాభక్తిగాని పట్టిందా?

రాజకీయ నాయకులు తమ మొండి పట్టుదలలు నెగ్గాలని రాజకీయ ప్రతిష్టంభనలు పరిష్కారానికి రాకుండా మొండికేసి కూచుంటే లక్షోపలక్షలు అల్లాడి పోతున్నారే దాన్ని గురించి మనం ఆందోళన ఏం చేస్తున్నాం?

పైగా మనకిప్పుడొక కొత్తరకం తర్కం Dialectics కూడా వచ్చిపడింది! అదేమిటంటే ఎవడన్నా సంఘం కోసం నడుంకడితే, '' ఒరే వీడు నిజంగా సంఘంకోసం ముందుకొస్తున్నాడో, కీర్తికోసమో చూడండి''! అంటాం అంటే ఏమిటన్నమాటా? నువ్వు ఎంతగొప్పపని అయినా చెయ్యటానికి ఉపక్రమించు, దాని వల్ల నీకు ఇంత కీర్తిగాని, డబ్బుగాని వస్తుందంటే నిన్ను కిందికి దింపేస్తాం నువ్వు మంత్రివిగా, సంతర్పణలు చెయ్యి, కవిత్వంరాయి, చిత్రాలు తియ్యి – నీకేమన్నా దక్కుతుందని తోచిందో నీకడ్డం పడ్డామే

కాంగ్రెసు సంస్థ కాలు శతాబ్దంగా ''త్యాగం, త్యాగం'' అని చేసిన ఆందోళన మనకివాళ ఈ Dialectics ప్రసాదించింది మంత్రసాని తనం ఒప్పుకున్నాక ఏమొచ్చినా పట్టాలి

ఈ వాతావరణంలో సంఘం యొక్క బాగుగురించి నిజమైన ఆదుర్దా ఉండి మనం ప్రొడ్యూసర్లని తిడుతున్నామంటే కొంచెం అనుమానాస్పదమని మాత్రమే మనవి చేస్తున్నాను

మరయితే ఈ రచనలన్నీ ఎందుకూ అని అడగ్గల్రు ఏదో మన పేరూ పత్రికల్లో పడ్డానికీ, తృణం ఆశించకుండా లోకహితం కోరే కొద్ది మందిలో మనమూ ఒకళ్ళమని నిరూపించ టానికీనూ

పాతేమరి ప్రొడ్యూసర్లెందుకు చిత్రాలు తీస్తున్నారూ? సంఘాన్ని ఉద్ధరించటానికి మట్టుకుకాదు అంతంత లాభాలూ, కీర్తి ఆర్జించటమే కాక ప్రొడ్యూసరు లోకం మరమ్మతు కూడా ప్రారంభిస్తే బతగ్గలమా? మరెందుకు తీస్తున్నారు? కాంతా కనకాలందామా? అందాం!

ఇప్పుడు మనకి బోధపడుతుంది సంఘంలో ప్రొడ్యూసరు రోల్ ఏమిటో? వెనకటికి మనకి రాజాధిరాజులుండేవారు, వాళ్ళకి కోర్టియర్లుండేవారు మామూలు ప్రజలకి ఈ రాజాధిరాజుల్ని వాళ్ళ ఊరేగింపుల్నీ, ఉంపుడుగత్తెల్నీ, నగల్నీ, భవనాలనీ, వైభవాన్నీ చూస్తే

తమ జీవితాల్లోని కొరతంతా తీరినట్టుండేది ఈ నడమంత్రపు రైళ్ళూ అవీ వచ్చి మనదేశం బానిసత్వం అవలంబించాక మహరాజులు మట్టి గొట్టుకుపోయి డబ్బులేని జమీందార్లు మిగిలారు ఈ జమీందార్లు కూడా వైభవం ఒదిలేసి ప్రతి గుర్రపందాల్లోనూ, స్పెన్సరు పానీయ దుకాణాల్లోనూ, సినిమాతారల పరిసరాల్లోనూ కనిపిస్తుంటే మనకి ఒక సంస్థ పడిపోయి నట్టయింది

ఈలోటు తీర్చగలవాడు మన ప్రొడ్యూసరు చూడండి ప్రొడ్యూసరు వైభవం అతని యాజమాన్యం కింద ఎట్లా అన్నదానం జరిగేదీ, రకరకాల అందగత్తెలు అతన్ని ఎట్లా పరివేష్టించి ఉండేది, రకరకాల కళలు – నృత్య, వాద్య, గాన, శిల్ప, సారస్వతాది కళలు – అతన్ని నిత్యమూ ఎట్లా ఆరాధించేదీ, అతని అజ్ఞానుసారం స్టూడియో ఆవరణలో దివ్యతరమైన భవనాలు నిర్మించబడి మరుక్షణం నిర్మూలించబడేదీ, అతని ఆజ్ఞను శిరసావహించి మేటి నటులు ఏ విధంగా ఏడవటమూ, నవ్వటమూ, పళ్ళు కొరకటమూ మొదలైనవి చేసేదీ, ఇతని పరివారాన్ని వెండి తెరలమీద లక్షలాది ప్రజలు ఎంత సంతోషంతో, డబ్బు కూడా చెల్లించి – అదే సీన్ను అనుకోండి – ఎట్లా తిలకించేదీ చూస్తేనే చెప్పేది బోధపడుతుంది

ఇదంతా – ఈ స్టూడియో భవనాలూ, తారలమెళ్లో మణిహారాలూ, ఈ ఏడుపులూ, నవ్వులూ, ఆఖరుకు ఈ వెండి తెరలో వెండీ – కృత్రిమం అనగల్రు, అవుగాక! అందువల్ల మన ఆనందం తగ్గుతున్నదా? చిత్రాలు చూసే వాళ్లకిది తెలీదా? తమ కళలని ప్రొడ్యూసర్ల దగ్గిర వ్యభిచరింపజేసే కళాకారులు మూఢులా? మిగిలిన వ్యాపకాలన్నీ మానుకొని ఒక్క ఛాన్సు కోసం సినిమా లాడ్జిల బయట నిద్రాహారాలు లేకుండా తారట్లాడే అసంఖ్యాకులు ప్రొడ్యూసర్ల మీద లేవిడీవేసి ఉపాధ్యాయ వృత్తులు చూసుకుంటున్నారా? లేదే!

ఇలాంటి మహోన్నత సాంఘిక విగ్రహాన్ని తూలనాడటం రాజకీయంగా కూడా ఎంత అపచారమో చూడండి, ప్రోడ్యూసర్లని తిట్టటంలో సామ్యవాదం ఉందని ఎప్పుడో లోకం గ్రహించకపోదు భారతదేశాన్ని అధోగతిలోనైనా ఉండనివ్వండిగాని సామ్యవాదం జోలికి మట్టుకు పోవద్దని నా సలహా మరెందుకూ కాకపోతే ఇందుకైనా ప్రొడ్యూసరుని తిట్టటం మానుకోండి మరి!

*పెంకిపిల్ల, మాసపత్రిక, అక్టోబరు 1945*
*పునర్ముద్రణ పెంకిపిల్ల, మాసపత్రిక, ఏప్రిల్ 1948*

# 26. సినిమా లోకం

సినిమా ప్రపంచం వేరూ, సినిమాలోకం వేరూ ప్రొడ్యూసర్లూ, డైరెక్టర్లూ, స్టార్లూ, వాళ్ళకి తమకలాలు కైంకర్యం చేసిన వ్యాసకర్తలూ, సినిమా పెద్దల్ని కాకాపట్టే భద్రాజాతుల్యులూ ఉండేది సినిమా ప్రపంచం – సినిమాలోకం కాదు

సినిమాలోకం సినిమా ప్రపంచానికో విధమైన అనుబంధం అనుకోవచ్చు సినిమాలోకానికి స్వరూపం మనకు వెండితెరమీదగాని ద్యోతకం కాదు

గుళ్ళోకీ, పాఠశాలలోకీ, వెలయాలు కొంపలలోకీ, ఉపన్యాసవేదిక మీదికీ అడుగుపెట్టే

వాడిలాగ సినిమాల్లోకి అడుగు పెట్టేటప్పుడూ, షూటింగుచేసే ఆవరణలోకి అడుగు పెట్టేటప్పుడూ మనం ఈలోకం వదిలేసి మరో లోకంలోకి పోతాం

ఈ సినిమాలోకంలో ఒకదారీ, తెన్నూ, ఒక అర్థమూ, అంతూ ఉండదని కొందరు నస పెడతారుగాని, సృష్టే భగవంతుడు అయినప్పుడు, జీవితమే ప్రమాదాల పరంపర అని మనం నమ్ముతున్నప్పుడు, ప్రతి మనిషీ ఏక్షణాన పడితే ఆక్షణాన ఏదిపడితే అది చెయ్యొచ్చునని అందరికీ అనుమానమునప్పుడు ఏ క్షణాన ఏం జరుగుతుందో ఎవరూ చెప్పలేనప్పుడు, సినిమాలోకం ఇట్లా ఉందేమని అడగటానికి కెవరికీ అధికారం లేదు

అంత మాత్రం చేత సినిమాలోకం మనలోకాలకి నకలు అనుకోరాదు ఈ సినిమా లోకంలో ఇళ్లు మన ఇళ్లల్లే ఉండవు మనుషులు మనం వేసుకునే దుస్తులు వేసుకోరు ఇక్కడ మధ్యతరగతి లేదు చాలా మంచి వాళ్ళూ, చాలా చెడ్డవాళ్ళూ ఉంటారు మనలాంటి వాళ్లుండరు చాలా భాగ్యవంతులూ చాలాబీదవాళ్ళూ ఉంటారు మనంటి వాళ్లుండరు అద్భుతమైన భవనా లుంటై పూరి గుడిసెలుంటై హీరో నైట్ గౌన్లు వేసుకుని పైపు కాలుస్తాడు, లేదా గడ్డం పెంచు కుని కూలిచేస్తాడు, లేదా అడుక్కుంటాడు, ఒక్కోసారి రెండూ చేస్తాడు ఈ లోకంలోమార్పులు కూడా కప్పదాటుగా ఉంటై పరస్త్రీ పరాన్ముఖుడైనవాడు అకస్మాత్తుగా ముండల మురాఖోరయి పోతాడు రాజసౌధాల్లో సోఫాలమీద ఉండేవాళ్లు ఒక్క గంతులో పూరిగుడిసెల్లోకి వస్తారు ఈ కప్పదాటు అట్నుంచి ఇటుకూడా ఉంటుంది పూరి గుడిసెల్లో నుంచి మేడలమీదికి కూడా ఒకటే అంగ సినిమాలోకంలోడబ్బు కూడాకప్పదాటుగానే కనిపిస్తుంది ఉంటే లక్షలకు లక్షలుం టుంది లేకపోతే అణాకూ కానీ తక్కువుంటుంది ఇర్వై రెండు , ముప్పైనాలుగు రూపాయలూ సినిమాలోకంలో ఉండవు అటువంటి మొత్తాలకు సినిమా లోకంలో స్థానం లేదు

ఏవిషయంలోగాని సినిమాలోకం మనలోకానికి తీసిపోతుందనుకోవటానికిలేదు మనలోకంలో లేని మహాపతివ్రతలూ, మహామునీశ్వరులూ, మంత్ర సిద్ధులూ సినిమా లోకంలో వుంటారు మనకాలేజీ విద్యార్థినులెవరూ చెయ్యలేని ఘోరాలు సినిమా లోకంలో చదువుకున్న అమ్మాయిలు చేస్తారు సినిమాలోకంలో ఎక్కడన్నా మొగుడు పెళ్ళాన్ని కొట్టటం చూశారూ?

పరిణామం మాటకొస్తే సినిమాలోకం మనలోకం కంటే చాలావేగంగా పరిణామం చెందుతున్నది మొన్నమొన్నటి వరకూ సినిమాల్లో కత్తులూ, తుపాకులూ స్వేచ్ఛగా ఉపయోగించుకునేవారు, పట్టపగలే దురాత్ములు కథానాయికల్ని చెరచటానికి ప్రయత్నం చేసేవారు ఒకరి నొకరు కుర్చీలతోటి ఖాళీ బ్రాందీ సీసాలతోటి కొట్టుకునే వాళ్ళు, అదంతా ఇప్పుడు పోయింది ఇప్పుడు సినిమాపాత్రలకి కోపం వస్తే ఇల్లొదిలిపెట్టి పారిపోతారు అష్టకష్టాలూ పడతారు గాంధీ మహాత్ముడి అహింసాసిద్ధాంతం మనకన్నా సినిమా పాత్రలనే చక్కగా సంస్కరించిందని చెప్పాలి

సినిమాలోకంలో కూడా నీతి జాస్తిగా ఉంటుంది అవినీతికి పరాభవం జరిగితీరుతుంది నీతి లేకపోవటం తలుచుకుంటే మనం చక్కగా సినిమాలోకం లోనైనా పుట్టకపోతే అనిపిస్తుంది మనం మనసమస్యల్ని ఇంతకాలమై తీర్చుకోలేకుండా అప్రయోజనులల్లే ఉన్నాంగాని సినిమాలోకంలో అన్ని సమస్యలూ అదివరకే పరిష్కారం పొందినై ఒక్క తాగుడేమిటి, అత్తగార్లేమిటి అన్ని సమస్యలూ ఎన్నడో పరిష్కారం అయినై ఆడవాళ్ళు మగవాళ్ళమీద

దౌర్జన్యం చేస్తేకలిగే సమస్యనెట్లా పరిష్కరించాలో అదికూడా సినిమాలోకంలో తెలిపోయింది మనమింకా ఇట్లాగే ఏడుస్తున్నాం ఇన్ని ప్రత్యేకతలు గల సినిమాలోకం మనలోకాన్ని అనుకరించి మనదగ్గరికి వస్తుందనేది కలలోవార్త పోతే మనలోకాన్ని సినిమాలోకం దగ్గరికి చేరవెయ్యటం ఎట్లాగా అనేదాన్ని గూర్చి ఆలోచించటమే మనచేతుల్లో ఉన్నపని

దీనికిగాను నేను చాలా సూచనలు చెయ్యగలను ముందు సంగతి మనలోకంలో ఉన్న మధ్యతరగతి ఆత్మహత్యచేసుకోవటం ఈ తరగతికి సినిమాలోకంలో చెప్పుకోదగ్గస్థానం లేదు పెంకుటిళ్లు పీకేసి భవంతులో పూరిగుడిసెలో వెయ్యటం అత్యవసరం

ఆడవాళ్లలో కాస్తచదువుకున్నవాళ్లు కొంపలు తీసేవాలకం నేర్చుకోవాలి మగకుర్రాళ్లంతా అదోరకంగా నవ్వటమూ, ఒయ్యారంగా నడవటమూ, కొద్దిపాటి ఆడతనం అభ్యసించటమూ చెయ్యాలి

ప్రవర్తన విషయంలో ముఖ్యంగా మనం నేర్చుకోవలిసింది చాలా ఉంది మన మాటలూ, అంగవిన్యాసమూ, మన మధ్యతరగతి వేషాలూ మానేసెయ్యాలి మొహం చిట్లించటమూ, నసపెట్టడమూ, నీళ్లు నమలటమూ, బిడియపడటమూ, మానేసి, కోపం వచ్చినప్పుడు రుద్రులమైపోవాలి, శాంతం వచ్చినప్పుడు బుద్ధ విగ్రహాలల్లే అయిపోవాలి, ప్రేమవచ్చినప్పుడు శిడిపోతులల్లే అయిపోవాలి ప్రబోధం చేసేటప్పుడు రాజకీయనాయకులల్లే ఉండాలి నోటవచ్చే ప్రతి మాటా సూటిగా, సమగ్రంగా ఉండేట్టు చూసుకోవాలి మనకు ఉద్రేకాలే తప్ప భావనలుండరాదు

ఇటువంటి మార్పేదో మనలోకంలో జరగని పక్షంలో ఒక పెద్ద చిక్కు సంప్రాప్తించటం తథ్యం అదేమిటంటే, మనం రోజుకు నాలుగు గంటలు మాత్రమే సినిమా లోకంలో విహరించే వాళ్లం (యుద్ధం మూలంగా 20వేల అడుగుల చిత్రాలు 11 వేలకు తగ్గినాయనుకోండి) ముందు ముందు 60వేల అడుగుల సినిమాలు తీయించుకొని రోజుకు పదేసి, పన్నెండేసి గంటలు సినిమాలోకంలో ఉండిపోవాలిసొస్తుంది ఈవిషయంలో పాశ్చాత్యులు చాలా బుద్ధిమంతులు, వాళ్లు తమ జీవితాలని సినిమాలోకానికి సమీపంగా ఉంచుకుని 56వేల అడుగుల చిత్రాలతో సంతృప్తిపడటం నేర్చుకున్నారు వాళ్లక్కూడా, యుద్ధం వచ్చి జీవితం పాడయిపోవటంవల్ల 11,12 వేల అడుగుల చిత్రాలు చూసే ఆవశ్యకత కలిగింది గాని, దీన్నుంచి వాళ్లు విముక్తి అయి మళ్లీ 6వేల అడుగుల చిత్రాలకు పోతారు మనం పెందలాడే మేలుకోకపోతే మనకు 60వేల అడుగుల చిత్రాలు తప్పవు మన ఖర్మకాలా!

*నవోదయ, వారపత్రిక, 10-3-1946*

# 27. తెలుగు సినిమా పరిశ్రమ

అసలే మనది పారిశ్రామికంగా వెనకపడివున్న దేశం అందులో ప్రత్యేకించి మన తెలుగు బిడ్డ మరీ అధోగతిలో పడి ఉన్నది పరిశ్రమలు స్థాపితమై విస్తరించే సమయంలో వాటి విస్తరణను అరికట్టడానికి పెట్టుబడిదార్లు ఎట్లాగూ రకరకాల యుక్తులు పన్నుతారు, కాని పరిశ్రమలు స్థాపితమయ్యేవరకూ వాటి సక్రమ స్థాపనకుగాను ఆందోళన చెయ్యటం ప్రజలవిధి సక్రమంగా స్థాపించబడిన పారిశ్రామిక సంస్థలు సంపదను సృష్టిచేసి దేశానికి స్థూలంగా

ఉపకరించడమేకాక కొంత మందికి జీవనోపాధులు కల్పించి ఆర్థికంగా ఉపకరించుతై

తెలుగువాళ్ళకు చెప్పుకోదగ్గ పరిశ్రమలు లేవు అయితే ఇతర పరిశ్రమలుంటే వున్నవని చెప్పుకోవచ్చు లేకపోతే లేవని చెప్పుకోవచ్చు ఉండీ లేనట్టున్న పరిశ్రమ తెలుగు సినిమా పరిశ్రమ సైనికుల గుడారాలవతుగా ఇది పునాదిలేకుండానూ, నిలకడలేకుండానూ ఉన్నది 1930 నుంచీ తెలుగు సినిమా చిత్రపరిశ్రమ జరుగుతూనే ఉన్నది కాని ఈ పరిశ్రమకు చెందిన సంస్థలు, చెప్పుకోదగ్గవి లేవు

పారిశ్రామిక సంస్థకు వుండదగ్గ లక్షణాలేవో మనం సులభంగా నిర్వచించుకోవచ్చు పారిశ్రామిక సంస్థ అన్నది నిలకడగా పరిశ్రమసాగిస్తూ అందులో పనిచేసే వారికి నెలకు పాతికరోజులూ, ఏడాదికి పన్నెండు నెలలూ వ్యాపకం ఇచ్చి జీవనోపాధి కల్పించాలి, పరిశ్రమ తాలూకు వ్యాపారపు ఒడుదుడుకుల మూలంగా సంస్థకు శాశ్వతమైన విఘ్నాలు రాకూడదు కాలం గడిచినకొద్దీ, పరిశ్రమ ఫలితాలకి బయట చలామణీ హెచ్చినకొద్దీ, సంస్థ అభివృద్ధి చెంది విస్తరించాలి

ఈ లక్షణాలు కలిగిన తెలుగు చిత్రనిర్మాణ సంస్థ నేటివరకూ లేదు మీర్జాపురం రాజావారి స్టూడియో మినహాయిస్తే తెలుగువారికి స్టూడియో లేదు నెల జీతాలమీద ప్రొడ్యూసర్లనూ, డైరెక్టర్లనూ నటీనటులనూ, కథకులనూ, కవులనూ, సంగీత చిత్ర కళా దర్శకులనూ పెట్టుకొని, ఒక చిత్రం మీద పెట్టిన డబ్బు తిరిగిరాక పూర్వమే మరో చిత్రం ప్రారంభించగల సినిమా కంపెనీ తెలుగు దేశంలో లేదు

ఒక సుప్రసిద్ధ సినిమా ప్రొడ్యూసరు – డైరెక్టరు చెప్పినట్టు సినిమా చిత్రాలు తీయడం జూదంగా వుంది తీసే చిత్రం మీద లాభం వచ్చినా నష్టం వచ్చినా కూడా పెట్టుబడిదారు మరి కనిపించడు తను ఒక సంస్థ నిర్మించబోతున్నాడన్న విచారంలేదు గనక ప్రస్తుతానికి ఎంత డబ్బయినా పోసి అవసరమైన మనుష్యులను తెచ్చుకుంటాడు తనపని గడుపుకుంటాడు, దాటిపోతాడు అందరి రేట్లూ పెంచడంవల్ల బాధపడేది ఇతను కాదు ఇతని తరవాత వచ్చేవాడు

ఈ జూదబుద్ధికి ఫలితమేమంటే మనకీనాడు ఛాయాచిత్రగ్రహణంలోనూ, శబ్ద గ్రహణం లోనూ నిపుణులైన వారు తగినంతమంది లేరు సినిమా అనేక కళల కేంద్రీకరణం వల్లగాని సాధ్యంకాదు ఈ కళలోనూ విద్యలలోనూ దక్షత గడించేవారు సంస్థల అండలేకరారు అదీ కాక ఈ జూదపు వాతావరణంలో సంస్థలను నిర్మించగల పట్టుదలగలవారికి కూడా ఊపిరి సలపడం లేదు సమర్థుడైన ప్రొడ్యూసరు పైకితెచ్చే తారలను జూదగాళ్ళు మూడింతల జీతం ఇచ్చి ఎగరగొట్టుకు పోతారు తుక్కు చిత్రాల నిర్మాణం పెరిగిపోతుంది మంచి చిత్రాల ఆయుర్దాయం క్షీణించిపోతుంది తారల ఆదాయం పెరిగినంతగా వారి ప్రతిభ క్రమాభివృద్ధి చెందదు చిత్రనిర్మాణ కౌశలం ఒక్క అడుగూ ముందుకు వెళ్లక స్థంభించిపోతుంది

చిత్ర నిర్మాణ కౌశలం ఒక రోజున అలవడేదికాదు స్వతహాగా ఎంత తెలివైన ప్రొడ్యూసరు గానివ్వండి, డైరెక్టరు గానివ్వండి, అనుభవం మీదగాని మంచి చిత్రాలు నిర్మించలేడు ఎప్పటికప్పుడు కొత్త టెక్నీషియనులతోనూ, కొత్త నటీనటులతోనూ రచయితలతోనూ, కళా స్రష్టలతోనూ పనిచేసేవాడికి నిత్యాన్వేషణే తప్ప నికరమైన జ్ఞానార్జనలేదు సమర్థుడి మాటే

ఇట్లా వుంటే ఇక అసమర్థుడిమాట చెప్పేదేమిటి? సమర్థుడు సృష్టించే తారలను రెట్టింపు ప్రతిఫలం యిచ్చి అసమర్థుడు కొట్టుకుని పోతూండడంవల్ల తానుసృష్టించే తారద్వారా మరింత మంచి చిత్రంతీసి ఇటు చిత్రాలనూ అటు తారలనూ క్రమాభివృద్ధికి తీసుకువచ్చే అవకాశం సమర్థుడికి లేదు ఆ తారను మరింత వృద్ధికి తెచ్చే శక్తిగాని సమర్థుడికి కన్నా మంచి చిత్రం తీసే శక్తిగాని అసమర్థుడి కెట్లాగోలేదు ఉంటే తాను తారలను సృష్టించి ఉండును అసమర్థు డనిపించుకోకపోను

ఈ అసమర్థులు తీసే చిత్రాలు సగంలో ఆగిపోయి బయటికిరాని పక్షంలో పెట్టుబడి దారుకుతప్ప, పరిశ్రమకు గాని ప్రజకుగాని ఏమంత అపకారం వుండదు కాని తుక్కు చిత్రాలు విడు దలైన పిమ్మట వీటివల్ల దేశానికి అనర్థం చాలా వుంది దేశంలో సినిమా సంస్థలు నెలకొల్పి కలకత్తాలో న్యూథియేటర్సు వారిలాగా ఒక తరగతికి చెందిన చిత్రాలు తీసే కంపెనీ లేని కారణంచేత విడుదల అయిన చిత్రాన్ని చూసి కొంతైనా దుఃఖపడేవరకూ చిత్రంతాలూకు మంచి చెడ్డలు ప్రజలకి తెలీవు పబ్లిసిటీ అన్ని చిత్రాలకీ ఒకలాగే వుంటుంది తారల పేర్లుగాని, డైరెక్టరు పేరుగాని కవిపేరుగాని, సంగీత కళాదర్శకుల పేర్లుగాని, చిత్రం విలవకు గ్యారంటీ ఇవ్వవు అందుచేత చిత్రాలమీద ప్రజలకు విశ్వాసం ప్రేరేపించే పై లక్షణాలు లేవు దీనికి తగ్గట్టుగానే అధిక సంఖ్యాకులైన ప్రజలు ఎంతోరూఢి చేసుకునిగాని చిత్రంయొక్క విలువను విశ్వసించరు ఇది మంచి తరగతి చిత్రాలకూ దెబ్బే

మన దేశంలో బహుకొద్ది థియేటర్లున్నై ప్రత్యేకించి ఆంధ్రలో సినిమా థియేటర్ల సంఖ్య బహు తక్కువ ఈ థియేటర్ల సంఖ్య కనీసం రెట్టింపయి పదివేల జన సంఖ్య గల ప్రతి బస్తీలోనూ ఒక థియేటరేర్పడితేనేగాని తెలుగు సినిమాలు నిర్మించటం వృథా అని మన ప్రొడ్యూసర్లు చెబుతారు కాని మన థియేటర్ల సమస్య హాలుల నిర్మాణంతో తేలేదికాదు

యుద్ధకాలం మినహాయిస్తే మన తెలుగుదేశంలో విడుదల అయే తెలుగు చిత్రాలసంఖ్య ఏడాదికి పదిపన్నెండు మించి వుండదు ఇందులో ఏ ఒకటి రెండో ఏడెనిమిది వారాలు వెళ్లినా ఒకవారం రెండువారాల కంటెవెళ్లని చిత్రాలు అధికంగా ఉంటై సినిమాహాలు కట్టినతరువాత అందులో ఏడాది పొడుగునా చిత్రాలు ప్రదర్శించబడాలి అట్లా ప్రదర్శించడానికి తగినన్ని చిత్రాలు ఉండాలి చిన్నచిన్న కేంద్రాలలో హిందీ, అరవ చిత్రాలు చూసే అవకాశం తక్కువగనక అక్కడ సినిమాహాలు కట్టడం మరింత ఆపత్కరమైన విషయం చిన్న కేంద్రాలలో పన్నెండు చిత్రాలను సంవత్సరం పొడుగునా ప్రదర్శించాలంటే అవి బెజవాడలాంటి కేంద్రంలో కనీసం 3, 4 నెలలు పోగల చిత్రాలై వుండాలి ఈ తరగతి చిత్రాలు ఏటా పన్నెండు తయారు చేయాలంటే ఇప్పటి పరిస్థితులలో, అనగా తెలుగు స్టూడియోలు లేకుండా, ఏడాదికి ఒకటికన్న తెలుగు చిత్రాలుతీసే సంస్థలు లేకుండా సినిమా తారలకూ కథకులకూ తదితరులకూ ఒన నిలకలడలేకుండా అసంభవమని చెప్పాలి

అరవ చిత్రాలు బహిష్కరించమనీ, హిందీ చిత్రాలు బహిష్కరించమనీ అట్లాచేస్తే తెలుగు సినిమా పరిశ్రమ బాగుపడుతుందనీ చెప్పేవారున్నారు, వీరు థియేటర్ల సమస్య ఆలోచించడంలేదు తెలుగు చిత్రాలుతప్ప వెయ్యమని భీష్మించుకున్నట్టయితే ఉన్నథియేటర్ల సంఖ్య పెరక్కపోగా తగ్గుతుంది థియేటర్లు పెరిగినట్టయితే హిందీ చిత్రాలూ, అరవ చిత్రాలూ

కాక ఇంగ్లీషు చిత్రాలుకూడా ఏదోకాడికి నడుపుకోవలసి వస్తుంది సినిమా చిత్ర నిర్మాణ సంస్థలు థియేటర్లను చూసుకేనే పుట్టలేదు చిత్రనిర్మాణం అభివృద్ధి అయినకొద్దీ థియేటర్లసంఖ్య తప్పనిసరిగా పెరుగుతుంది

అనుభవంగాని ప్రతిభగాని లేకుండా చిత్రనిర్మాణంలో జూదం ఆడడానికి ముందుకొచ్చే మూడోతరగతి ప్రొడ్యూసర్లకు, ''మీరు చిత్రాలు తీయకండి,'' అని బోధించి లాభంలేదు, జూదగాళ్ళు హితబోధలు వినరు సినిమా పరిశ్రమలో పనిచేస్తున్న తారలనుగాని తదితరులనుగాని ''మీరు డబ్బుకాశించి తక్కు చిత్రాల్లో పాల్గొనకండి,'' అని చెప్పి లాభంలేదు ఒక వృత్తిలో గిట్టుబాటు కాదగినంత కావటం న్యాయం వారికి విడవకుండా పనిఇవ్వగల ప్రొడ్యూసర్లు లేనప్పుడు, ఏనాడు వారికి చలామణీ లేకుండా పోతుందో ఊహించ రానప్పుడు, వారు డబ్బయినా చూసుకోక ఏంచేస్తారూ?

కనక ఈ పరిశ్రమకు ముక్తిరావాలంటే కేవలమూ హితబోధలవల్ల రాదు దానికి సహజమైన మార్గం ఒకటే వుంది అది సంస్థల నిర్మాణంద్వారా మాత్రమే సాధ్యమవుతుంది అరడజను ఉత్తమతరగతి సినిమా నిర్మాణ సంస్థల నిర్మాణంద్వారా మాత్రమే సాధ్యమవుతుంది అరడజను ఉత్తమతరగతి సినిమా నిర్మాణ సంస్థలు నెలకొల్పడానికి 30 మొదలు 50 లక్షల రూపాయల పెట్టుబడి అవసరం ప్రతిసంస్థా తన స్వంత నటీనటవర్గంతో సంవత్సరానికిఅధమం నాలుగు ఉత్తమ శిల్పంగల చిత్రాలూ, అనేకవైజ్ఞానిక, వార్తాచిత్రాలూ నిర్మించగలిగి ఉండాలి సినిమాకి సంబంధించిన విద్యలలో అనేక మంది శిక్షణ ఇవ్వడమూ, తారలను సృష్టించడమూ మొదలైనవి చెయ్యగలగాలి, బెజవాడలాంటి కేంద్రంలో అధమం మూడేసి నెలలు వెళ్ళగల చిత్రాలు ఏటా పన్నెండు తక్కువకు లేకుండా తయారయినట్టయితే తెలుగుదేశంలో వున్న సినిమా థియేటర్ల సంఖ్య నాలుగింతలవుతుంది, కేంద్రాల సంఖ్య అధమం రెట్టింపవుతుంది నామరూపాలు లేకుండావున్న కేంద్రాలలో సహితం చక్కని సినిమాథియేటర్లు ఏర్పాటు కాగలవు

పారిశ్రామిక కృషియందు ఆసక్తీ వ్యాపారదక్షతా కలవాళ్ళు చిత్రనిర్మాణంలోకిదిగి ఉత్తమ తరగతి సంస్థలు నిర్మిస్తేనేతప్ప దొంగ మార్కెటు లాభాలు తిన్నవారు ఈ పరిశ్రమలో తమ జూదాన్ని కట్టిపెట్టరు ఏటానిర్మాణమయే తెలుగు చిత్రాలమీద అయ్యే ఖర్చుచూస్తే అది ఒక ఉత్తమ తరగతి సంస్థకు సరిపోయే పెట్టుబడి అవుతుంది కాని అటువంటి సంస్థ నాలుగు చిత్రాలు నిర్మించి వాటిమీద సంపాదించే డబ్బుగాని పరపతిగాని ప్రజోపకారం గాని ఇన్ని చిత్రాలూ కలసినా సాధించ లేకుండా ఉన్నాయి ఒక దానికంటె మరొకటి హీనంగా వెలువడుతున్న ఈ చిత్రాలు ప్రజల కళాభిరుచిని ఏ మాత్రమూ పెంపొందించలేవు వీటిద్వారా సినిమాకళ ఎటువంటి ప్రజాహితం గాని సాధించలేదు, ప్రజల జీవితాలను సమీపించనైనా లేదు చిత్రనిర్మాణానికి ఉత్తమ సంస్థలు ఏర్పడ్డనాడే నిజమైన ప్రజాభిప్రాయానికి కూడా విలువ ఏర్పడుతుంది ఎందుచేతనంటే జూదగాడు ప్రజాద్రోహి. సాంఘికజీవనంలో పాల్గొనేవాడే ప్రజాభిప్రాయాన్ని ఏనాడైనా పాటిస్తాడు నూటికి యాభైమొదలు ఎనభైవరకూ వడ్డీ ఇచ్చి డబ్బు అప్పుతెచ్చేవాళ్ళూ, చిత్రంమాట ఏమయినా కమిషన్లమీద దక్కేదే చాలుననుకునేవాళ్ళూ పారిశ్రామికులుకారు, గౌరవనీయులైన బందిపోటుదొంగలు

ఇతర పరిశ్రమలలోలాగే నూటికి ఆరువంతున గిట్టుబాటైతే చాలుననుకునే

పారిశ్రామికులు సినిమారంగంలో తగిన ప్రమాణంలో పెట్టుబడిచేసిన రోజున చిత్రం మీద వెచ్చించే ప్రతి ఏగానికీ విలువ చిత్రంలో కనిపించి తీరడమేకాక, చిత్రాల ఖరీదులుతగ్గి రాబడి హెచ్చుతుంది, చిత్రాలకు ప్రజాదరణ హెచ్చుతుంది, పరిశ్రమలో పనిచేసే పదిమందికీ ఇంత నిలకడా, అభివృద్ధీ కనిపిస్తుంది, ఎవరితోనూ చెప్పకుండానే చచ్చు ప్రొడ్యూసర్లు శలవు పుచ్చుకుంటారు ఆనాడే మనకు సినిమా పరిశ్రమ ఏర్పడిన తృప్తికూడా దక్కుతుంది

*నవోదయ, వారపత్రిక, సంక్రాంతి, 1947, పారిశ్రామిక ప్రత్యేక సంచిక*

# 28. సినిమా స్క్రిప్టు

సినిమా ప్రొడ్యూసర్లు సినిమా కథకుడికి ప్రత్యేకాదరం చూపరు కదాఅని సినిమా కథలను గురించి వారికి శ్రద్ధలేదనుకోవటం పొరపాటు అనేక కథలను గురించి ఆలోచించకుండా సినిమా ప్రొడ్యూసరు తానుతీసే చిత్రానికి కథ ఎన్నుకోడు చిత్రానికి ఖర్చుచేసే లక్షలన్నీ కథమీద చేస్తున్న ఖర్చేననే జ్ఞానం సినిమా ప్రొడ్యూసరుకు లేకపోలేదు

అంటే ప్రొడ్యూసరు కొన్ని కథలనుగురించి ఆలోచించి అందులో ఒకటి ఎన్నుకుని మిగిలినవి పనికిరావని విసర్జించేస్తాడు అంతమాత్రం చేత అవి చిత్రనిర్మాణానికి ఉపకరించవని ఎక్కడాలేదు కాని కారణాంతరాలవల్ల ప్రొడ్యూసరు వాటిని ఉపయోగపరుచుకునే స్థితిలో ఉండడు కొన్ని కథలకు దుస్తులఖర్చు జాస్తి, కొన్నిటికి మంచి నటీనటులు కావలసి వస్తుంది మరి కొన్నింటిలో సంగీతానికి అధికమైన ప్రాముఖ్యం వుంటుంది ఇంకొన్ని కథలకోసరం విరివిగా చారిత్రకపరిశోధనలు చెయ్యవలసి ఉంటుంది

ప్రస్తుత సినిమా పరిశ్రమలో కథకుడి స్థానం తెలుసుకోవటానికి ఈవిషయాలు తెలుసుకోవటం అవసరం సాహిత్యదృష్టిలో కథకుడు అనబడే వాడికీ సినిమా కథకుడికీ ఈనాడున్న సంబంధం సంబంధమే కోర్టు దస్తావేజులు రాసేవాడికీ కథకుడు అనబడే వాడికిర్నలిస్టుకూ కేఏపాటి సంభంధం ఉంటుందో , సినిమా కథకుడికీ సాహిత్యకథకుడికీ ఆపాటి సంబంధమే ఉంటోంది ఈనాడు

ఎటువంటి కథతీస్తే లాభసాటిగా ఉంటుందనే విషయం ప్రొడ్యూసరు, డైరెక్టర్ల మధ్య నిర్ణయమైపోతుంది ఆకథలో ఉండే ముఖ్యపాత్రలుకూడా కుడి ఎడమగా నిర్ణయమైపోతాయి ఆ పాత్రలు ఎట్లా ప్రవర్తించాలి, వాటి కారెక్టరైజేషను ఏ విధంగా ఉండాలి కథతాలూకు సన్నివేశాలు ఏవిధంగా చిత్రించాలి, ఎక్కడ పాటలుండాలి, ఎక్కడ డ్యూయెట్లుండాలి, ఎక్కడ హాస్యం ఉండాలి, ఈ హాస్యానికి మామూలు చిత్రంలో ఎటువంటి సంబంధం ఉండాలి -- ఇత్యాది విషయాలన్నింటిని గురించీ సినిమా సంప్రదాయాలు వుండనే వున్నాయి, వాటిని గురించి డైరెక్టరు దగ్గిర్నుంచి క్లాప్‌బాయ్ వరకూ అందరూ ఎరుగుదురు ఈ విషయాలను గురించి సాహిత్య కథకుడికి మరోవిధమైన అభిప్రాయాలుంటే అది అతడి ప్రారబ్దం అదీగాక తీయబోయే చిత్రంలో అంతకుముందు జయప్రదంగా నడిచిన చిత్రాలలో నుంచి ఎంత తస్కరించి పెట్టాలో కూడా ప్రొడ్యూసరు, డైరెక్టర్లే నిర్ణయిస్తారు

ఈ పరిస్థితులలో సినిమా పరిశ్రమకు సాహిత్యకథకులవసరం లేకపోవటం

ఆశ్చర్యకరంకాదు

అయితే సినిమా కథకుడి ప్రత్యేకతలేమిటి? ప్రొడ్యూసరూ, డైరెక్టరూ వారి సన్నిహితులూ చెప్పే విషయాలను 'సినిమా స్క్రిప్టు అని గుర్తించదగిన స్వరూపంలో పెట్టే అభ్యాసం సినిమా కథకుడికీ ఉండాలి ఈ విషయంలో దస్తావేజుల మతలబు తెలిసిన ప్రైవేటుకూ సినిమా కథకుడికి చాలాసామ్యం ఉంది అది చారిత్రక చిత్రమయేది, భక్తి చిత్రమయేది, పౌరాణికి చిత్రమయేది, దీన్ని రాయటానికి – ఈ పాత్రలను నిర్వహించటానికి –మనసినిమా కథకుడు సమర్థుడా? అనే ప్రశ్న ఎవరకీ ఎన్నడూరాదు ఎందుకంటే సినిమా కథల్లో ఉండే వ్యత్యాసాలన్నీ సెట్టింగుల్లోనూ, ఆహార్యంలోను, సంఘటనల్లోనూ, ఉండవలసిందేగాని పాత్ర పోషణలోనూ కథనంలోనూ ఉండటం మన సినిమా పరిశ్రమ కింకా అలవాటు లేదు

ఈ పరిస్థితులు సాహిత్య కళారాధకుల కాశ్చర్యం కలిగించవచ్చు వాళ్ళు సినిమా ప్రొడ్యూసర్లకు కళాజ్ఞానం లేదనవచ్చు కాని ఈ ఏర్పాటు సినిమా ప్రొడ్యూసర్లకెంత నచ్చిందో, సినిమా ప్రేక్షకులకీ అంత నచ్చిందనే చెప్పాలి వాళ్ళు మనసినిమా చిత్రాలతాలుకు కథల్లో పాత్రపోషణగాని కథనంగాని కళాయుతంగా లేదని తప్పుపట్టటం లేదు అంతేకాదు ఉత్తమ కథకులుగా భావించబడే వారిచేత సినిమా కథలు రాయించి వాటితో సినిమా చిత్రాలు తీయించినట్టయితే ఆ చిత్రాలలో మామూలు చిత్రాలలో లేని విశేషం ఏదో ఉందని గుర్తించే ప్రేక్షకుల సంఖ్య బహుస్వల్పంగా ఉంటుంది ఈ విషయంలో కథకులకు ఎటువంటి సందేహమూ వుండనవసరం లేదు

ఈవిషయాన్నే మరొక విధంగాకూడా రుజువు చెయ్యవచ్చును సినిమా చిత్రాలు తెలుగు భాషలోనిర్మాణం అయిన కొత్తలో కనపడి వినపడిన ప్రతీ టాకికీ కూడా డబ్బు వచ్చింది అటుతరువాత కొంతకాలం ప్రజాదరణ ఉన్నతారలుగల టాకీలకు నమ్మకంగా విజయం లభించింది తారల విలవగుర్తించబడి, ప్రొడ్యూసర్లు తారలకోసం వేలంపాడి దాదాపు ప్రతిచిత్రంలోనూ తారలే వుండే పరిస్థితి వచ్చేసరికి –ఇదైనా ఇటీవలనే – కథలకు ప్రాముఖ్యం వచ్చింది (కథలకు ప్రాముఖ్యం వచ్చిందనగానే కథకులకు వచ్చిందనికాదు) కథలో కొంత సారమూ బిగీలేనిదే ప్రజలు విరివిగా వచ్చిచూడరనేది రూఢీ అయిపోయింది

పై వాదన యావత్తు కథకుడికి చిత్రనిర్మాణంలో ప్రముఖ స్థానం లేదని రుజువు చేయటానికి చెప్పినదే కాని ఇప్పుడున్న సినిమాకథకులు అసమర్థులని చెప్పటానికి కాదు నిజానికి సినిమాలకు కథలు రాసినవారిలో కథలు రాయటానికి అర్హతకలవారూ, లేనివారూ కూడా వున్నారు అయితే పరిపాటిగా స్క్రిప్టు రాస్తున్న వారంతా డైరెక్టరు సహాయంతో ఏదోవిధమైన స్క్రిప్టు రాయటంలో ఆరితేరినవారే ఇందుకే వారికి డబ్బివ్వబడుతున్నది ప్రొడ్యూసరు సినిమా కథకుడిచేత చేయించుకునే పనినిబట్టి సినిమా కథకుడు పొందే ప్రతిఫలం తక్కువైనదనటానికి వీల్లేదు

ఈ పరిస్థితులలో నేటి సినిమా కథకులుగాని భావిసినిమా కథకులుగాని తృప్తిపడి ఊరుకోవచ్చునా అంటే నా అభిప్రాయంలో ఊరుకోరాదు ఉత్తమ కథకులకు సినిమా పరిశ్రమలో స్థానం ఏర్పడాలి సరి అయిన పాత్రపోషణకూ, చక్కని కథనానికీ ప్రాముఖ్యం ఇవ్వటం సినిమా ప్రేక్షకులు నేర్చుకోవాలి ఈవిషయం విదేశాలవారు నేర్చుకున్నారు, మనవాళ్ళూ

నేర్చుకుంటారు అప్పుడు స్క్రిప్టు రచనలో దస్తావేజుల మతలబు అంత మవుతుంది స్క్రిప్టు కూడా ఒక కళాసృష్టి అవుతుంది సాహిత్య కథకులు సినిమా కథకులు కాలేరనే అభిప్రాయం దురభిప్రాయం సాహిత్య కథకులకు కలంతో కథనడపటం చాతనవును కెమెరాతో కథ ఎట్లా నడుపుతారో వారికి తెలియకపోవచ్చు ఈ ప్రత్యేక విద్య కథకుడికి అబ్బుదనీ, కథకుడు కానివాడికే అబ్బుతుందనీ విశ్వసించడం మూఢవిశ్వాసం అయితే ఇప్పటికథకులు ఇప్పటి సినిమాలు చూసి అందులో లోపాలు చూస్తూతాము అంతకంటే బాగా కథలు రాయగలమని మాత్రమే తెలుసుకుంటున్నారుగాని తాము రాసే పద్ధతిలో కథ తెరమీద కెక్కదనీ, దానికి వేరే పద్ధతి ఉందనీ తెలుసుకునే ఓపిక లేనివారై ఉన్నారు కాని అవకాశందొరికి అవసరం కలిగితే ఒక పద్ధతిలో చక్కగా కథ చెప్పగలవాడు ఆ కథనే మరో పద్ధతిలో చెప్పటం నేర్చుకోవటానికి వెనకాడడు సినిమాస్క్రిప్టురైటింగ్ రాయటం కోసం హెచ్ జి వెల్స్ పద్దెనిమిది మాసాలు స్క్రిప్టు రైటింగ్ అభ్యసించాడట

సినిమా కథకుడికి ఇప్పుడు ముట్టేది అతనుచేసే పనికితగిన మొత్తమే నన్నానుగాని అది మంచి సినిమా కథకుడి కివ్వదగిన మొత్తంలో ఎన్నో వంతో కూడా లేదు ఈ మాట నాబోటి కథకుడు అంటే నమ్మనవసరం ఉండకపోవచ్చు కాని ఒక విద్యాధికుడైన ప్రోడ్యూసరు సాక్ష్యం ఉంది ఈ విషయంలో కథావస్తువు నిర్ణయించుకున్నాక ఇక ఎవరి ప్రమేయమూ లేకుండా తన సొంతాన సమగ్రంగా స్క్రిప్టురాసి ఇచ్చినట్టయతే అతడికి ఇరవైవేలిస్తే ఏమీ నష్టంలేదని ఈ ప్రొడ్యూసరు అభిప్రాయం ఈ అభిప్రాయానికి ఆధారం లేకపోలేదు సినిమా స్క్రిప్టు అనేది పూర్తి అయే లోపుగా అనేక సమస్యలు పరిష్కారమై అనేక భిన్నపరిస్థితులు సమన్వయించబడాలి అటువంటి స్క్రిప్టు రాయటంలో దక్షుడైనాడు అనేక విషయాలలో ఆరితేరినవాడై ఉండాలి ఏమిటి ఈ సమస్యలు?

చిత్రం మీదవెచ్చించే డబ్బుకు పరిమితి ఉంటుంది ఆచిత్రం ఇంతకాలంలో పూర్తికావాలనే పరిధి ఉంటుంది అందులో నటించటానికి ఈఫలాని నటవర్గం మాత్రమే అందుబాటులో ఉంటుంది, స్టూడియో ఇంతకు మించిన సెట్టింగు లివ్వలేరనే నియమం ఒకటి ఉంటుంది బయిటికి షూటింగుకు వెళ్ళేటప్పుడు ప్రొడ్యూసరు వెళ్ళగల దూరంలో ఇటువంటి దృశ్యాలు మట్టుకే లభ్యమవుతాయనేది ఉంటుంది ఈ విధంగా చిత్ర నిర్మాణానికి సవాలక్ష నిర్బంధాలు ఈ గిరులేవీ దాటకుండా ప్రొడ్యూసరూ, డైరెక్టరూ సినిమా కథకుడిచేత పనిచేయించు కుంటారు వారి సమస్యలను సమగ్రంగా గ్రహించి వారికి ఉపయోగపడే స్క్రిప్టును వారిని శ్ర మపెట్టకుండా ఇవ్వగల కథకుడు తగిన ప్రతిఫలానికి తప్పక అర్హుడవుతాడు, ఈ ఇబ్బందులు పరిష్కారంకాని కారణంచేత చిత్రాల ఖరీదు ఎంతగా పెరిగిపోతున్నదీ, అవి ఎంత లోపభూయిష్టంగా తయారవుతున్నదీ పైవాళ్ళూహించుకోవటం సాధ్యం కాదు కొందరు ప్రొడ్యూసర్లు ఈ సమస్యలను ముందుగా దాటలేక చిత్రనిర్మాణమప్పుడు ఇవి ఎదురుపడగానే ఒక్క ప్రదక్షిణం చుట్టి డబ్బు నీరల్లే ఖర్చు చేసేస్తారు బ్రిటిషు చిత్రాల్లో 'థింగ్స్ టు కమ్', 'సీజర్ అండ్ క్లీయో పాట్రా' అనే చిత్రాలు అంతులేని ఖర్చుకు లోనయినాయి అమెరికా చిత్రాలకుకూడా అప్పుడప్పుడు ఈగతి పడుతుంది కాని ఈసమస్యలను సామాన్యంగా స్క్రిప్టు దశలోనే పరిష్కరించుకునే అవకాశాలు జాస్తి సినిమా కథకుడు ఏదో కథరాసి

డైరెక్టరు మొహన పారెయ్యటం కాకుండా చిత్ర నిర్మాణానికి తోడ్పడి వారి సమస్యలన్నీ అర్థం చేసుకుని వాటి పరిష్కారానికి సంపూర్ణ సహకారం చేయటం నేర్చిననాడు చిత్ర నిర్మాణంలో ఉన్నత స్థానం సంపాదించి అధికమైన ప్రతి ఫలానికి అర్హుడవుతాడు

తెలుగు సినిమా, సావనీర్, జూలై 1947

# 29. సినిమాలకు కథలు వ్రాయటం

బేడా చిల్లరో, పావలా చిల్లరో – పై చిల్లర ప్రభుత్వం వారి అనుగ్రహాన్ని బట్టి – చెల్లించుకుని సినిమా చూసేవాడు సినిమా అంతా చూసి, పెదిమ విరిచేసి, ''మిగిలిందంతా ఏదో ఉందిగాని కథమట్టుకు బోకుగా ఉంది '' అని అవలీలగా అనేస్తాడు సినిమా కథ రాయటంలో ఎన్ని కష్టసుఖాలున్నదీ, ఏయే లొౌతు పాతులున్నదీ తెలిస్తే సామాన్య సినిమా ప్రేక్షకుడు సినిమా కథను గురించి ఇంత చులకనచేసి మాట్లాడటం జరక్కపోను

అడుగులోనే హంసపాదన్నట్టు సినిమా కథ రాసేవాణ్ణి ఎన్నుకోవటంలోనే అనేక ఇబ్బందులున్నై ఎప్పటికప్పుడు సినిమా రంగంలో పరిపాటిగా కథలురాస్తూ ఉన్నవారు కొందరుంటారు వారిలో ఎవరోఒకర్ని మన సినిమా కథ రాయటానికి నియమించటం ఉత్తమ మార్గం అయితే కారణాంతరాలచేత ఇది ఒక్కోసారి పడదు అటువంటప్పుడు ప్రొడ్యూసరు మార్గంతరం చూసుకోవాలి, పొడ్యూసరు టైపిస్టు సహాయంతో తానే కథరాసేసుకోవటం మధ్యమమార్గం ఒక్కోసారి ఇదికూడా పడదు (ఇన్‌స్పిరేషన్ వచ్చి నప్పుడల్లా ప్రొడ్యూసరుకు సమయానికి టైపిస్టు అందడే అనుకోండి) అటువంటప్పుడు సినిమా కథ రాయడానికి ఎవణన్నా పట్టుకు రావడం తప్పనిసరి అవుతుంది ఇది కూడా సినిమా కథలు రాయటానికి ఒక మార్గమే అనుకోవచ్చు

కథకుడు కాకుండా ఉండి, సినిమా సంగతి తెలీని వాడెవడైనా సినిమా కథ రాయటానికి పనికొస్తాడు కథడైతే ఇబ్బంది ఏమిటంటే, కథారచన తాలూకు నియమాలన్నీ తెచ్చి ప్రొడ్యూసరు మీద రుద్దుతాడు సినిమా నియమాలతోనే ఇదయిపోతున్న ప్రొడ్యూసరుకిది తెచ్చిపెట్టుకున్న తద్దినమవుతుంది సినిమా సంగతి బాగా తెలిసినవాడైతే చిక్కే మిటంటే, వాడు కలం పట్టుకుంటూనే ఫేడిన్, కట్, డిసాల్వ్, కట్, వైప్, ఫేడౌట్, మిడ్‌షాట్, క్లోజ్‌లాంగ్ షాట్, లాంగ్ మిడ్‌షాట్ అంటూ కథ వెంటపడతాడు న్యాయంగా ఇదంతా ప్రొడ్యూసరూ డైరక్టరూ చేసుకోవలసినపని కథ రాసేవాడే ఈముక్కలన్నీ అంటే మధ్యడైరెక్టరేం చేసేటట్టూ?

అయితే సినిమా సంగతీ, కథ సంగతీ తెలీనివాళ్లని పెట్టుకుని సినిమా కథ ఎట్లా రాస్తారూ? అందులోనే ఉంది కష్టమంతా దానికే కాలయాపనంతా అదే కృత్యాద్యవస్థంతా

సినిమా కథ రాసుకోవటానికి స్టోరీ కాన్ఫరెన్సులు పెడతారు ఈ కథా సమావేశాలు రెండు మూడు వందలు జరిగితే చాలు కథ నిర్ణయమవుతుంది కథ రాసేవాడూ, డైరెక్టరూ, ప్రొడ్యూసరూ, ప్రొడ్యూసరు స్నేహితులూ, కథ రాసేవాడి మిత్రులూ, డైరెక్టరుతో పని ఉండి వచ్చేవారూ, టైపిస్టూ, కారు డ్రైవరూ టీ అందిచ్చే కుర్రాడూ మొదలైన వాళ్లిందులో పాల్గొంటారు

స్టోరీ కాన్ఫరెన్సు దాదాపు రెండున్నరగంటలకు తక్కువుండదు ఇందులో మొదటి అరగంట కొందరు రాక వృధా అయిపోతుంది కొందరు మధ్యలో అవసరమైనవని ఉండి వెళ్లిపోవటం వల్ల చివర అరగంట వృధా అయిపోతుంది కాఫీకోసం ఎదురు చూడటంలోనూ, దాన్ని సేవించటంలోనూ మరో అరగంట అయిపోతుంది ఇదంతా పోగా ఖచ్చితంగా ఒక గంట సినిమా కథను గురించి చర్చించటంలో గడుస్తుంది ఇది ఏమాత్రమూ వృధా కాదు

''అందరూ ఉన్నారా? అయితే కథకు వద్దాం ఓపెనింగ్ సీక్వెన్సు తేలినట్టేగా?'' అంటాడు ప్రొడ్యూసరు

''అది ఇప్పుడే తేలేది కాదు లెండి మనం రెండో సీక్వెన్సు తేల్చుకోవటం మంచిది,'' అంటాడు డైరెక్టరు

''జిన్నా స్టేట్మెంటు చదివారా?'' అంటాడు కథకుడు

ఓ పావుగంట అయినాక, '' ఇంతకూ మనం మొదటి సీక్వెన్సు తేల్చుకోకుండా రెండో సీక్వెన్సుకు వచ్చి ఏం లాభం?'' అంటాడు ప్రొడ్యూసరు

''మొదటి సీక్వెన్సులో ఏముంది? ఏమీలేదు దాన్ని ఎట్లా షూట్‌చెయ్యాలో ఇంకా నేను నిర్ధారణ చెయ్యలేదు,'' అంటాడు డైరెక్టరు ''అది కెమెరా మాన్‌తో కూచుని నేను రాసుకుంటాలెండి ''

''రెండో సీక్వెన్సులో కూడా ఏమీ లేదులెండి మన హీరోయిన్ మూడో సీక్వెన్సులో గాని రాదు ,'' అంటాడు కథకుడి స్నేహితుడు

''అదేం?'' అంటాడు ప్రొడ్యూసరు తనకు జరుగుతున్న అత్యాచారం గ్రహించి,'' ఓపెనింగ్ షాట్ హీరోయిన్ అనుకున్నాం కాదుటయ్యా, నీబండబడా!''

డైరక్టరుకు ప్రొడ్యూసరు అజ్ఞానం చూసి కోపం వస్తుంది ''మీరు బుల్ ఫైటర్స్ చూశారూ? అందులో మూడువేల అడుగులవరకూ హీరోయిన్ రానేరాదు,'' అంటాడు

''బుల్ ఫైటర్సంటే జ్ఞాపకం వచ్చింది 'బేదింగ్ బ్యూటీ' లో చూడండి వాడక్కడ ఆ టిల్టింగ్ షాట్ వేసి పాన్ చేశాడూ'' అని ప్రొడ్యూసరు స్నేహితుడంటాడు

టీ అందిచ్చే కుర్రాడు 'బేదింగ్ బ్యూటీ' పదహారుసార్లు చూశాడు అందులో అటువంటి షాట్ లేదంటాడు

'బేదింగ్ బ్యూటీ' చూడనివాళ్లు కాన్ఫరెన్సులో ఇద్దరున్నట్టు తెలుస్తుంది డైరెక్టరు వాళ్లకు 'బేదింగ్ బ్యూటీ' చిత్రం షాట్సువారీగా చెప్పేస్తాడు

''అదంతా బాగానే వుంది నా హీరోయిన్ మాటేమిటి?'' ప్రొడ్యూసరు గడియారం చూసుకుని తేలుకుట్టినవాడల్లే

''హీరోయినంటే జ్ఞాపకం వచ్చింది ఇవాళ రేస్ రిజల్టు వచ్చినయ్యా?'' అంటాడు కథకుడు

'' ఎందుకు రావూ?'' అంటాడు డైరెక్టరు

'' ఏమేం గుర్రాలు విన్‌చేశాయో?'' అంటాడు కథకుడు

'' ఎవరు చూశారూ?'' అంటాడు డైరెక్టరు

''రేసింగంటే బొంబాయిలో బ్రిట్‌గాడు గోల్డెన్ ఫాన్ మీద రైడ్ చెయ్యటం చూడాలి,''

అంటాడు డైరక్టరుతో పని ఉండి వచ్చినాయన, అందరూ ఏమిటేమిటంటారు

''అది వరెగెత్తదే! నడుస్తుంది! ఫోర్ లెంగ్తుముందుంటుంది పదిరూపాయిలేస్తే పదిన్నర ఇచ్చింది! గొప్ప రేస్! టోట్ ఆరువేలు కూడా లేదు''

''పోనీ రెండో సీక్వెన్స్ సంగతన్నా ఆలోచించండి'' అంటాడు ప్రొడ్యూసరు,

''కాఫీ కానిచ్చి ఏకంగా కూచుందాం,'' అంటారు మిగతావాళ్లు ఏకగ్రీవంగా

కాఫీ అనంతరం మళ్లీ కూచుంటారు

''మనకీ ఇబ్బంది ఎందుకొస్తున్నదో మీరెవరన్నా గమనించారా?'' అంటాడు డైరెక్టరు

'' ఏ ఇబ్బంది?'' అంటాడు ప్రొడ్యూసరు డైరెక్టరుకేసి అనుమానంగా చూస్తూ ఖాళీ కాఫీ గ్లాసుకేసి చూపించి,''ఈ ఇబ్బందే,'' అంటాడు డైరెక్టరు

''నువ్వు చెప్పుపోనీ,'' అంటారు డైరెక్టర్ను మిగతా వాళ్లంతా

''మనం ఈ బూమింగ్ స్టోరీని ఎట్లా ఎండ్ చెయ్యబోతున్నామో ఎవరికైనా తట్టిందీ?'' అంటాడు డైరెక్టరు, అంతమంది దొంగతనమూ ఒక్కసారి కనుక్కున్నట్టుగా

'' ఇంకా మొదట్లోనే కదాఉన్నాం?'' అంటాడు ప్రొడ్యూసరు

''అదే పొరపాటు, మనం కథ వెనక నించి రాసుకొస్తే ఈ ఇబ్బంది ఉండదు మన హీరోయిన్ ఆఖరుకు చావబోతున్నదా, పిల్లల తల్లి కాబోతున్నదా? కథ కిటుకంతా ఆఖరు సీక్వెన్సులో ఉంది ఒక హాలీవుడ్ డైరెక్టరు కథ తల్లకిందులుగా రాస్తాడు ఆ మాటకొస్తే ఏ హాలివుడ్ కథ అయినా చూడండి దాన్ని తల్లకిందులుగా చూస్తేగాని దానిలో ఉన్న టెక్నిక్ అసలర్ధంకాదు మనకది తెలీకనే ఇంత చచ్చుపిక్చర్లు తీస్తున్నాం,'' అంటాడు డైరెక్టరు

'' ఈ సంగతి మొదటే అనుకుంటే ఈ పాటికి బోలెడంతపని జరుగుండునుగా!'' అంటాడు ప్రొడ్యూసరు

'' ఇప్పుడేం మించిపోయిందీ?'' అంటాడు డైరెక్టరు 'ఎలెన్ ఇన్ ది హిల్స్' అనే పిక్చరు చూసుకోండి అది వెనకనించి రాసిన కథ లంఙ్డీకొడుక్కు ముందుగానే కథ ఎట్లా ఆఖరయేదీ తెలుసు, చచ్చేట్టు ప్రతి సీక్వెన్సులోనూ చివర జరగబోయ్యేదానికి పునాది వేసుకుంటూ వచ్చాడు

ఇంకా ఇతర హాలీవుడ్ చిత్రాలని గురించి ఇతరులు చెప్పి అన్నీ తల్లకిందులుగా రాసిన కథలే అని రుజావు చేస్తారు

''రేపు కూచుని ఈ విధంగా రాసుకుందాం,'' అంటాడు కథకుడు

★ ★ ★

''మొదట వొట్టి సోదా మనిషల్లే ఉన్న జమీందారుగారు చివరికి పత్తిత్తల్లే మాట్లాడతాడేంరా?'' అంటాడో సినిమా ప్రేక్షకుడు

'' ఇంత గొప్ప య్యాక్టర్లను! తెచ్చి నోటిమాటకూడా లేకుండా చేశారేం?'' అంటాడు మరో ప్రేక్షకుడు

'' ఈ పిక్చరుకు ఫలానా ఆవిణ్ణిబుక్కు చేశారుట ఆవిడెక్కడా కనిపించదే?'' అంటాడు మరో ప్రేక్షకుడు

సినిమా కథ రాసుకోకమునుపే నటులను బుక్ చెయ్యటమూ, ఒక్కోసారి సినిమా

తియ్యటమూ కూడా పూర్తి అయిపోతుందనీ, ఒకచెంప షూటింగు జరుగుతుంటే మరో చెంప పాత్రలూ, కథా మార్పులు చెందుతూంటాయనీ, పాపం, ప్రేక్షకులకేం తెలుస్తుందీ సినిమా కథ రాయటమంటే వాళ్ల మాటలనుకుంటారు!

*తెలుగు సినిమా, మాసపత్రిక, నవంబరు 1947*

# 30. సినిమాకథలు

యంత్రయుగానికి చెందినవైనందుకు సినిమా కథలకూ పారిశ్రామిక వస్తువులకూ కొంత పోలిక వుండటం గమనించదగ్గ విషయం అవి కడపటి కొనుగోలుదారుకు –వాడు కునేవాడికి – చౌకగా అందుతాయి వాటిలో కొన్ని నమూనా లక్షణాలు వుంటాయి అంటే కొన్నికొన్ని ఒక పంపిణీమీద తయారవుతూ వుంటాయి, వీటి నిర్మాణంలో అమ్మకానికి కావలసిన ఆకర్షణవున్నంతగా 'గట్టి' వుండదు ఇవి 'మంది' కోసం తయారవుతాయి కొన్నవాడికి ''ఇది నా ఉపయోగార్థమే సృష్టించారు'' అనే భ్రమ కలగదు

పైన చెప్పిన లక్షణాలలో చివరి రెండూ తీసుకుందాం అభ్యుదయ రచయితల దృష్టిలో కళ సర్వజనోపయుక్తంగా వుండటం తప్పుకాదు కాని అభ్యుదయకళను ఆస్వాదించే వాడికి ''ఇది నాకోసమే సృష్టించారు'' అనే భావం కలగకపోవటం చాలా తప్పు ఈ ముఖ్య విషయం గమనించనివారు అభ్యుదయ సాహిత్యాన్ని చౌకబారు సాహిత్యంతో సమంచేసి చూస్తూనే వున్నారు, అభ్యుదయ సాహిత్యం వ్యక్తి విశిష్టతను వాశనం చేస్తుందని కూడా వాదిస్తున్నారు అభ్యుదయ సాహిత్యం వ్యక్తి యొక్క విశిష్టతను గుర్తించగలదని 'ముందడుగు', 'మాభూమి' నాటకాలు రుజావు చేశాయి అవి చూసినవాళ్ళెవ్వరూ, '' ఇది నాకోసం రాసింది కాదు'' అనుకోనవసరం లేదు – ప్రజా సామాన్యం మాట చెబుతున్నాను

సినిమా కథల సంగతి మాట్లాడుకుంటున్నాం వీటిలో సామాన్యంగా వుంటూన్న లోపాలు చూస్తే అవి ప్రమాదవశంచేత కలుగుతున్నవి కావనీ, వాటి వెనక వ్యక్తంగానో, అవ్యక్తంగానో ఒక మనస్తత్వం వుందనీ, ఆ మనస్తత్వానికి లాభాలతో సంబంధం వుందనీ, అది ప్రజా శ్రేయస్సుకు తోడ్పడదనీ సులభంగా తెలుసుకోవచ్చు

1 ప్రజా సామాన్యంలో వుండే మూఢ విశ్వాసాలను బలపరచటం –పెద్దవాళ్ళు చెడ్డవాళ్లు కారు, నమ్మిన వాళ్లు చెడిపోరు, తిరుగుబాటలో సౌజన్యం లేదు, ఆడదయేది, మగవాడయేది కష్టాలకు తల ఒగ్గితే చివరకు బాగుపడతారు, మంచి ఆడది పతిసేవ చేస్తుంది, భర్త ఫోటోలకి దండలు వేస్తుంది, భర్త పాదాలు కడిగి నెత్తిన చల్లుకుంటుంది, మొగుడు చెడుతిరుగుళ్ళు తిరిగినా కంటనీరు పెట్టి భరిస్తుంది, అటువంటి ఆడదాని కష్టాలు గట్టెక్కి తీరుతాయి, చదువుకున్న ఆడవాళ్లు మంచి వాళ్లు కారు, ఇత్యాది

ఇట్లా ప్రజల మూఢవిశ్వాసాలను బలపరచటం వల్ల ఆర్థికంగా చిత్ర నిర్మాతలకి లాభం వుంది ఎవరి మూఢవిశ్వాలసానూ వారు ఏవగించుకోరు ఆ మూఢవిశ్వాసాలను విమర్శించటం వల్ల కొందరికైనా కోపం రావచ్చు అదీకాక మూఢవిశ్వాసాలకు సనాతన విజ్ఞానానికుండే గౌరవం వుంటుంది వాటిని బలపరచటం వల్ల ప్రజలలో చిత్రాలకు కొంత గౌరవం కూడా

కలగవచ్చు ఈవిధంగా ప్రజల మూఢవిశ్వాసాలను బలపరచటం వల్ల వారిలో చైతన్యం ఎట్లా కలుగుతుంది? వారిలో అభ్యుదయ కరమైన మార్పు ఎట్లా వస్తుంది? ఈవిషయాలు చిత్ర నిర్మాతలను బాధించవు

2 వ్యక్తిని సంఘం నుంచి వేరు చెయ్యటం –మంచి వాళ్ళని భగవంతుడు కనిపెట్టివుంటాడు కష్టసమయంలో భగవంతుణ్ణి తలుచుకుని నమ్ముకున్నవాడికి సుఖం కలిగి తీరుతుంది, సంఘం నీచమైనది అది ఆపదలో వున్నవాణ్ణి ఎన్నటికీ ఆదుకోదు, పై పెచ్చు రాళ్ళ రువ్వుతుంది భగవంతుడు గారడీచేసి అయినాసరే సంఘం చెయ్యలేని ఉపకారం చేస్తాడు

జీవితాన్ని ఇట్లా చిత్రించటంవల్ల అనేక చిత్రాలలో కధాశిల్పం కూడా దెబ్బతిని సన్నివేశాలలో రసలోపం కూడా జరుగుతుంది ముఖ్యపాత్రలకు కష్టాలు భగవంతుడి పరీక్షగా రావటంవల్ల ప్రేక్షకుడికి వాటిని గురించి మరోవిధమైన భావం కలుగుతుంది భగవంతుడు వెంట వుండటం మూలాన కష్టాలు తొలగటంలో వింత ఏమీవుండదు ఇందువల్ల రసం చెడుతుంది అయినా నిర్మాతలు ఇటువంటి విధానం మార్చుకోరు ఎందుకంటే ఇట్లా చెయ్యని పక్షంలో యదార్థ జీవితానికి దగ్గరగా రావలసివస్తుంది వ్యక్తుల కష్టాలకు మూల కారణమైన శక్తులను బయటపెట్టవలసి వస్తుంది అట్లా బయట పెట్టటం వల్ల ''విప్లవం'' జరగటానికి తోడ్పడటం జరగవచ్చు అది కొన్ని వర్గాలకు రుచించకపోవచ్చు

3 అభ్యుదయ నినాదాలు అరువు పుచ్చుకుని దుర్వినియోగపరచటం – 'ప్రజా స్వామ్యం', 'అభ్యుదయం', 'రాజు ప్రజాభిప్రాయాన్ని పాటించాలి', 'సంఘంలో అందరికీ సమాన హక్కులుండాలి', 'ప్రతివాడూ దేశం కోసం ఆత్మార్పణం చేసుకోవాలి', 'దేశం అవిభాజ్యం' ఇత్యాది

సామాన్యంగా ఈ నినాదాలు శుష్క ప్రియాలుగానే వుంటాయి వాటివెనక సాంఘిక సత్యం ఏమీ చిత్రంలో వుండదు అయితే ఈ నినాదాలెందుకంటే వేటికి ''గల్లా పెట్టె'' మహత్యం వుంది అవి జీవితంలో ప్రజలను బలంగా ఆకర్షిస్తున్నప్పుడు చిత్రంకూడా ఆకర్షించవచ్చు చిత్రం అభ్యుదయకరమైనదని కొందరు నమ్మవచ్చు

ఈ లక్షణాలతో బాధపడుతున్న సినిమా కథ ఉత్తమజాతి సాహిత్యం కాకుండా పోవటమే కాక అభ్యుదయ పంథాకు విద్రోహకారిగా కూడా ఉంటున్నది ఈ లక్షణాలు పోవాలంటే కేవలమూ చిత్ర నిర్మాతల దృష్టి మాత్రమే మారితే చాలుననుకోవటం పొరపాటు ప్రేక్షకులు కూడా కొంత విజ్ఞానం పొందినప్పుడే వీటికి మోక్షం వుంది ప్రజల దృష్టి పధంలో మార్పు కలగాలంటే అనేక పత్రికలు కొంతకాలంపాటు అభ్యుదయ దృష్టితో సినిమా చిత్రాలను విమర్శించి ప్రజలలో చైతన్యం పుట్టుకురావాలి ఇది అసాధ్యం మట్టుకు కాదు సామెత చెప్పినట్టు చీమలు పాకితే రాళ్ళరుగుతాయి

*తెలుగు సినిమా, మాసపత్రిక, జనవరి 1948*

# 31. ప్రజల అభిప్రాయాల మీద సినిమా ప్రభావం

పదహారు పదిహేడేళ్ళ నుంచీ ప్రజల అభిప్రాయాలకు సినిమా మీదగల ప్రభావం చూస్తూ వస్తున్నాను ఇంతకాలమూ, సినిమా మీద ప్రజల ప్రభావం గురించే ఆలోచిస్తున్నాను ప్రొడ్యూసర్లతోనూ, డైరెక్టర్లతోనూ, నాకున్న మిత్రులతోనూ సంభాషించేటప్పుడు, ప్రజల మీద ప్రభావంగల చిత్రాలు తీయరాదా అని నడిగితే ''నీకేం, నువ్వు కబుర్లు చెబుతావు మాకు కావలసింది పెట్టిన డబ్బు తిరిగివచ్చి నాలుగు రాళ్ళు మిగలటం ప్రజలకు ఏం కావాలో తెలుసుకోలేక మేము చస్తూ వుంటే నువు ప్రజల అభిప్రాయాలను మార్చే పిక్చర్లు తియ్య మంటావా? చాల్చాల్లే!'' అంటున్నారు ఇట్లా అనని వారిని నేనింకా చూడలేదు వాళ్ళని నేను తప్పుపడుతున్నా ననుకునేరు పిక్చరు తియ్యటానికి ఉపక్రమించే ప్రతి ప్రొడ్యూసరూ ఒక యోధుడే అనుకోండి అతడి ప్రాణాలు పీచుపీచుమంటూనే ఉంటై ఖర్చులు అనుకున్నంతలో ఎన్నడూ ఇమడవు రాబడి అనుకున్నంత ఎన్నడూ రాదు ఏ సినిమాతారో పాతికవేల రూపా యల కారులో పోతుంటే చూసి, రెండిళ్లు కొనుక్కొన్నదని వినీ, మన సినిమా పరిశ్రమ చాలా ఉచ్చదశలో వుందనుకుని లాభం లేదు సినిమా తారలు కొనేనగలూ, చీరెలూ, కార్లూ, ఇళ్లూ సాధారణంగా చిత్రనిర్మాతల నష్టాలలో నుంచేననుకోండి అటువంటప్పుడు, ప్రజాభిప్రాయల కనుగుణంగా ప్రొడ్యూసర్లు చిత్రాలు తీస్తున్నారంటే మనం తప్పుపట్టవలసిన పనేలేదు

సినిమాలకు ప్రజల మీదకంటే కూడా, ప్రజలకే సినిమా మీద ఎక్కువ ప్రభావం వుంటూ వచ్చిందని చెప్పటానికి చెప్పాను ఇది మొదటి నుంచీ కూడా యిట్లాగే వస్తున్నది

ఏ 30 ఏళ్ళ క్రితమో మనకు మూకీలు వచ్చినై ఆమూకీ చిత్రాలన్నీ దాదాపు పురాణం కథలే కొద్ది చిత్రాలుమటుకు మహాభక్తుల జీవితాలకు చెందినవి అంటే ఆరోజుల్లో సినిమాకు వెళ్లటమంటే నిశ్శబ్దంగా హరికథా కాలక్షేమపమూ, పురాణ శ్రవణమూ చెయ్యటమన్నమాట

16, 17 ఏళ్ళనుంచీ టాకీలు వచ్చినై, మొదట్లో ఈ టాకీ చిత్రాలు స్టేజినాటకాలే ప్రహ్లాద, పాదుకా, శకుంతలా, హరిశ్చంద్రా, కనకతారా, ద్రౌపదీ వస్త్రాపహరణం, ఇత్యాది అప్పట్లో వీటిలో పాత్రధారణ చేసినవారు కూడా అప్పటి స్టేజి నటకులే నాటకరంగంతో అంతోఇంతో సంబంధంవున్న స్త్రీలచేత స్త్రీ పాత్రలు ధరింపజేశారు అయితే అటువంటి స్త్రీలు అప్పట్లో తగినంత మంది లేని కారణంచేత కొత్త స్త్రీలను సినిమాలోకి తప్పనిసరిగా తీసుకురావలసి వచ్చింది (అంతకు పూర్వం స్త్రీలు నాటకరంగం మీదికివస్తే వింతగా చూసిన ప్రజలు రానురాను స్త్రీలను నాటరంగం మీద ఆమోదించటం మట్టుకు తప్పక సినిమా ప్రభావమే) స్టేజినాటకాలు టాకీ చిత్రాలుగా తీస్తూ వచ్చిన ప్రొడ్యూసర్లు నాటకాలయి పోయేసరికి ప్రజలకు కావలసింది పురాణగాధలని అంచనాకట్టి పురాణ చిత్రాలు ప్రారంభించారు కనీవినసీ పురాణ కథలన్నీ పైకి వచ్చినై, ఒక్కొక్క కథనీ యిద్దరిద్దరు ప్రొడ్యూసర్లు తీయటానికి కూడా పోటీలుపడ్డారు చివరకు ప్రజలు పురాణ చిత్రాలతో విసిగిపోయినారు

ప్రజలకు కావలసింది పురాణ చిత్రాలు కానేకావనీ, సాంఘిక సమస్యలకు చెందిన సాంఘిక చిత్రాలనీ అకస్మాత్తుగా ప్రొడ్యూసర్లకి పొడగట్టింది. ఇంకేముందీ, అందరూ సాంఘిక చిత్రాలు తీసి సాంఘిక సమస్యలన్నిటినీ తెరమీద పరిష్కరింపసాగారు తాగుడూ, కట్నాలూ,

అస్పృశ్యతా, జమీందారీ, స్త్రీ పునర్వివాహమూ మొదలైన సమస్యలన్నీ పరిష్కారమై పోయినై

ప్రజలకు సాంఘిక చిత్రాలు కావాలని అంచనా వెయ్యటంలో మన ప్రొడ్యూసర్లు అట్టే పొరబాటుపడలేదు ఒక్క రోజుకూడా హాలు నిండకుండా మొదటి వారంలోనే ఎత్తిపారేసిన పురాణ చిత్రాలున్నైగాని సాంఘిక చిత్రాలు లేవు మన తారలుకూడా పురాణ చిత్రాలద్వారా కంటే సాంఘిక చిత్రాలద్వారానే ఎక్కువ కీర్తి, డబ్బూ చేసుకున్నారు. అయితే మన ప్రజల ప్రభావం సినిమా మీద పడటానికి ఏడెనిమిదేళ్లు పట్టింది. ఈ లోపుగా మనవారు కలకత్తా, బొంబాయి పట్టణాల నుంచి దిగుమతి అయే హిందీ, మరాఠీ సాంఘిక చిత్రాలను ఆదరిస్తూనే వచ్చారు

అయితే రానురాను సాంఘిక చిత్రాలు తీయటం కూడా ఒక సమస్యే అయింది ఆ సమస్య ఏమిటంటే సినిమా ద్వారా పరిష్కరించే సాంఘిక సమస్యలు లేకపోవటం సమస్యల ప్రసక్తి లేకుండా సాంఘిక చిత్రాలు తీయటానికి సాంఘిక కథలు రెండో మూడో మట్టుకే మన ప్రొడ్యూసర్లకు దొరికినై వాటితోనే తీయటానికి వీలైనన్ని చిత్రాలు తీసేశారు అవి కూడా అయిపోయినై

1939 ఆ ప్రాంతాల మన ప్రొడ్యూసర్లు మళ్లీ ప్రజల ప్రభావం కోసం అంజలి ఘటించారు బాలనాగమ్మ సాక్షాత్కరించింది. ప్రజలకు జానపదగాథలిష్టమని ప్రొడ్యూసర్లకు వార్త వచ్చింది యుద్ధంతో పాటు జానపద చిత్రాలారంభమైనై అయితే యుద్ధంతో కూడా ఇంకా చాలా కొత్త విషయాలారంభమయినై ప్రజలలో కొన్ని పదాలకు పలుకుబడి హెచ్చింది ''ప్రజలూ'', ''ప్రజా క్షేమం'', ''ప్రజాహక్కులూ'', ''ప్రజా విప్లవం'', ''ప్రజా స్వామ్యం'' ఇత్యాది ఈ మాటల ప్రభావానికి తలవొగ్గి ప్రొడ్యూసర్లు తమ జానపద చిత్రాల నిండా ఈ పదజాలమూ, దీనికి చెందిన భావాలూ ఇరికించారు ఒక చిత్రంలో నాయికచేత రాట్నం తిప్పించారు. కత్తికూడా తిప్పించారు మరో చిత్రంలో స్వర్గానికే ఎసరుపెట్టారు ఇంద్రుడు ఫాసిస్టు విధానం అవలంభించి దేవతా పౌరహక్కులు అణచివేస్తాడు ఇద్దరు విప్లవకాముకులు ఇంద్రుణ్ణి ప్రతిఘటించి శాపాల ఆర్డినెన్సులకు గురిఅవుతారు మొత్తం మీద స్వర్గంలో జరీతోచేసిన అరుణ పతాకం ఎగురుతుంది దానికి విప్లవ యక్షకుమారులు అభివందనాలు చేస్తారు ఇదంతా సినిమా మీద ప్రజాభిప్రాయాల ప్రభావం కాదూ!

సినిమా చిత్ర నిర్మాణం వెనక కొందరు మేధావులుండి, కొన్ని సిద్ధాంతాలనూ, విశ్వాసాలనూ సినిమా చిత్రాలలో ప్రచారం సాగించి ఆ సిద్ధాంతాలకూ, విశ్వాసాలకూ ప్రజలలో వ్యాప్తి కలిగించిననాడు ప్రజాభిప్రాయం మీద సినిమా ప్రభావం గురించి చెప్పుకునేటందు కుంటుంది నేటి వరకూ మన చిత్ర నిర్మాణంలో అటువంటి ప్రయత్నమేలేదు అభిప్రాయాల మాట దేవుడెరుగు అభిరుచుల విషయంలో కూడా ప్రజాస్వామ్యానికి దగ్గరగా పోదామని ప్రొడ్యూసర్లు తమకున్న అభిరుచులనూ, సంస్కారాన్నీ కూడా చంపేసుకుని సినిమా చిత్రాలు తీస్తున్నారు ఈ జానపదగాథలకు కూడా ప్రజలు పలకటం మానివేస్తే ఏం చెయ్యాలో ఏ ప్రొడ్యూసరుకూ స్పష్టంగా తెలియదు

ఇటువంటి పరిస్థితులలో కూడా సినిమాలకు ప్రజల మీద ప్రభావం వున్నదంటే దానికి కారణం వుంది సృష్టిలో ప్రభావమనేది అచ్చుగా ఒక వేపుకే పారదు ప్రజల ప్రభావం పాలకుల

మీదా, పాలకుల ప్రభావం పాలితుల మీదా కూడా వుంటుంది బడిపంతులు ప్రభావం పిల్లల మీదా, పిల్లల ప్రభావం బడిపంతులు మీదా వుంటుంది ఆవిధంగానే సినిమా ప్రభావం కూడా ప్రజాభిప్రాయాలమీద అంతో ఇంతో వుంది సినిమాలు వచ్చి ప్రజలను తాత్వికంగానూ, మత సంబంధంగానూ, రాజకీయంగానూ, మార్చి వుండక పోవచ్చును కాని కళలను గురించి ప్రజల అభిప్రాయాలలో పెద్ద పరివర్తన సినిమా ద్వారా కలిగింది సినీమాలు రాకపూర్వం ప్రజాసామాన్యానికి నిత్యజీవితంలో కళా ప్రదర్శనాలకు స్థానం వుండేదికాదు నూటికీ కోటికీ ఒక నాటకమో, ఒక భాగోతమో, ఒక తోలుబొమ్మలాటో లభించేది, పాటకచేరీలు ఇంకా అరుదు. చిత్రకళా ప్రదర్శనాలు లేనేలేవు

కళా ప్రదర్శనం లభ్యం కావడమే ఒక పెద్ద పర్వం అయినప్పుడు దాన్ని యథాశక్తి ఆనందించడమే గాని, దాని లోతుపాతులు తెలుసుకోవటమూ, తమ కళాభిరుచిని పెంపొందించు కోవటమూ వుండనే వుండదు అందుచేత అప్పట్లో సామాన్య ప్రజలు ఈ కళలకు దూరం నుంచి దణ్ణం పెట్టుకుని తమ నిత్యజీవితంలో వేరు సంగీతమూ, సాహిత్యమూ, చిత్రకళా ఆరాధించేవారు ప్రజలు ఆరాధించే కళలకేమో శిష్టుల ఆదరం ఉండేదికాదు సినిమాల రాకతో ఇదంతా తలక్రిందులయింది సినిమా నిత్యజీవితంలోకి వచ్చేసింది పైగా అది సర్వకళా ప్రదర్శనం దాన్లో సంగీతముంది, సాహిత్యముంది, నృత్యముంది, నటన వుంది, అన్ని రకాల శిల్పాలూ ఉన్నై తమకోసమే నిర్దేశింపబడినై

వెనకటి కళాకారులల్లే ఈ సినిమా నటులూ, గాయకులూ, చిత్రకారులూ సంఘంలో అతకని వాళ్ళుకారు వీరు వేలకువేలు వేతనాలు పుచ్చుకుంటారు వీళ్ళ బొమ్మలు పత్రికల్లోనూ, పోస్టర్ల మీదా ఘనంగా కనిపించుతై గొప్పవాళ్ళుకూడా వీళ్ళని ఆదరంతో చూస్తారు సినిమా నటుడు కావటానికి అసాధారణ సామర్ధ్యాలు అవసరం లేదు అదృష్టంమట్టుకు కావాలి సినిమా సంగీతం కూడా ఏళ్ల తరబడి సాధనచేసిన పండితులకు మాత్రమే అర్థమయేదికాదు దాన్ని ఎవరుపడితే వారే పాడవచ్చు మంచి కంఠం మట్టుకు కావాలి ఈ సంగీతం కేవలమూ తెరమీదనే వినిపించి ఇతరత్రా వినపించకపోతే ఏమయేదో తెలియదు గ్రామఫోను రికార్డులన్నీ ఇదే సంగీతం కావటమూ, రేడియోలో కూడా తరుచూ యీ సంగీతం వినిపించటమూ ప్రజలకు ఉపకరించింది. ఈవిధంగానే సినిమానటుల మొహాలు కూడా అచ్చుగా తెరమీదనేగాక పత్రికల్లోనూ, గోడల మీదా కూడా కనిపించడంవల్ల సినిమాకు సంబంధించిన కళలు ప్రజల జీవితంలోకి గాఢంగా ఎక్కిపోయినై అదివరకు స్టేజి సంగీతం హాలులో మాత్రమే వినిపించేది. స్టేజి నటులు స్టేజిమీద మాత్రమే కనిపించేవారు హాలుదాటి బయటికి వచ్చినాక అదంతా కలమాదిరిగా అయిపోయేది సినిమా అటువంటిది కాదు తెరమీద మనం చూసే చిత్రం మనలో రేకెత్తించే మనోభావాలను అనేకవిధాలుగా మిగతా సమయాల్లో ఊరవేసుకుని ఆస్వాదించవచ్చు

ఉన్నత సంస్కారులు సినిమాల వల్ల కళాపతనం జరిగిందని భావించవచ్చు అభ్యుదయవాదులు ఇదంతా ప్రజాకళలు కావని నిరసించవచ్చు కాని సాంఘిక దృష్ట్యా చూస్తే ప్రజా సామాన్యం యొక్క నిత్యజీవితంలోకి కళలు ప్రవేశించటమే ఒకగొప్ప విషయం ఇందువల్ల వారి జీవితాలలోకి కూడా యింత వెలుగంటూ ప్రవేశించింది వారి అభిరుచులకు కొంత

విశిష్టత కలిగింది వారిలో విమర్శనాదృష్టి విచక్షణా జ్ఞానమూ తలెత్తినై చవిటిపర్రలుగావున్న వారి జీవితాలలో ఒక కళాకృషిసాగింది సినిమా పత్రికలద్వారా వారు ప్రకటించే విశ్వాసాలన్నీ సరిఅయినవి కాకపోవచ్చు కాని వాటిని ప్రకటించే అధికారాన్ని వారు వినియోగపరుస్తున్నారు అయినా అది చెప్పుకోదగ్గ విషయమే

సినిమా ప్రభావం వల్ల ప్రజలకు అందుబాటులో వుండే కళలకు ప్రచారం రావటమేకాక, యువకులలో కళాభిలాషకూడా పెరిగింది. ఇదివరలో సంగీతం గురించి ఒక మంచి ముక్క వినేవాళ్ళం కాము ''బంగారువంటి కోమటి సంగీతముచేత బేరసారములుడిగెన్'' అని సామెతే వుండేది ఎవరకన్నా కుర్రాళ్ళు సరదాకి పాడుకోవాలనిచూస్తే, పెద్దవాళ్ళు ''కూటికా గుడ్డకా'' అని అడిగేవాళ్ళు ఈ కాలంలో సినిమాలు పాడగలవాళ్ళకి కూడూగుడ్డా కాక పేరూ ప్రతిష్ఠా కూడా ఇస్తున్నై తీరా అవకాశం దొరికినాదొరక్కపోయినా కాస్తబాగా పాడగలమనుకునే కుర్రవాళ్ళందరికీ సినిమాలో నటించాలనీ, అదే వృత్తి చేసుకోవాలనీ కాంక్ష కలుగుతున్నది పెద్దవాళ్ళు కూడా కుర్రవాళ్ళను పూర్తిగా నిరుత్సాహపరచటం లేదు

అయితే ఈ సినిమా వ్యామోహంవల్ల కొంత మంది కుర్రవాళ్ళు ఎందుకూ పనికిరాకుండా పోతున్నమాట నిజమే వాళ్ళకు సినిమాల్లో నటించే అవకాశమూరాదు, వాళ్ళింకోపని చూసుకోనూలేరు డాక్టరీ చదివిన ప్రతివాడూ దానిమీద చక్కగా బతకటంలేదు ఏవృత్తి తీసుకున్నా ఒకడు లోపలవుంటే, నలుగురు వీధిలో వుంటున్నారు ఇందుకు సినిమాను తప్పుపట్టి లాభం లేదు ఇదొక ఆర్థిక సాంఘిక విషమ సమస్య నిర్దిష్ట ఆర్థిక రాజకీయ ప్రణాళికల ద్వారా మనపాలకులు దీన్ని పరిష్కరించాలి

నూరు మతాలతోను, వెయ్యి కులాలతోను విభజించబడివున్న మన సమాజంలోకి సినిమా మంచి చేస్తూ ప్రవేశించింది కులతత్వాలకీ, మతతత్వాలకీ కళారంగంలో స్థానం లేదు సినిమా చిత్ర నిర్మాణంలో పనిచేసేవారి మధ్య వ్యక్తిగతమైన ఈర్ష్య లెన్నివున్నా కులతత్వాలు, మత తత్వాలు లేవు, సినిమా చిత్రాలమీద అభిరుచికూడా ప్రజాసామాన్యంలో యీ తేడాలు కొంతవరకు లేకుండా చేస్తున్నది నా చిన్నతనంలో ఒక గ్రామంలో ఒక వేశ్య అభినయంతో సహా ఆధ్యాత్మరామాయణం ప్రదర్శిస్తే శిష్టులనుకున్న వారెవరూ వెళ్లారుకారు ఈనాడు మన తారలను ఆరాధించే అసంఖ్యాక ప్రజలకు వారి కులాలతోను, మతాలతోను ప్రసక్తిలేదు ఎవ్వరైనా అటువంటి విషయాలు తెలుసుకుందామని ప్రయత్నించినప్పుడు మన సినిమా పత్రికలు తీవ్రంగా నిరుత్సాహపరచినై. దీనికి పత్రికలను తప్పక అభినందించాలి

ప్రపంచాన్ని ఏకంచేసే ప్రభావం ఏదన్నా మంచిదే ప్రపంచాన్ని ఏకం చెయ్యటానికి రైళ్లు, రేడియో, పత్రికలు కృషిచేసినట్లుగానే సినిమా కూడా కృషిచేసింది సినిమా రాకపూర్వం ప్రపంచ వ్యక్తులందరూ వూహకు అతీతంగానూ, కొంతవరకే యదార్థంగానూ తోస్తూ వుండేవారు. వార్తా చిత్రాల ధర్మాన గత సంగ్రామం మనకళ్ళయెదుట ప్రత్యక్షమయింది. ప్రపంచ నాయకులంతా యదార్థవ్యక్తులుగా మనఎదుట ప్రత్యక్షమయ్యారు ఈ పరిణామం ప్రజలలో చాలా భావ పరివర్తన కలిగించింది నడిచేవారినీ నడిపించేవారినీ దగ్గరకు తెచ్చింది నెపోలియనుకాలంలో సినిమాలుంటే నెపోలియను అమానుష వ్యక్తి అనే అభిప్రాయం, పచ్చి నెత్తురు తాగే రాక్షసుడనిగానీ, దైవాంశ సంభూతుడనిగాని ప్రజలకు కలిగివుండేది కాదు

ఈమార్పువల్ల జనసామాన్యం ప్రపంచ నాటకంలో ముఖ్యపాత్ర నిర్వహించడానికి మార్గాలు ఏర్పడ్డాయి ఈ వార్తా చిత్రాలను చూస్తుంటే ప్రపంచ సంఘటనలను గురించి మనం ఉదాసీనంగా వుండలేం పత్రికా వార్తలకూ, రేడియో వార్తలకూ లేని ప్రభావం వార్తా చిత్రాలకున్నది

ఇంగ్లీషు చిత్రాలు ప్రజా సామాన్యానికి అందుబాటులో లేవు అయినా వాటి ప్రభావం గురించి చెప్పుకోక తప్పదు ఈ ఇంగ్లీషు చిత్రాలు చూచే వాళ్ళలో చదువుకున్న యువకులూ, మన కథకులూ, యితర రచయితలూ, సంగీతజ్ఞులూ, ఉన్నారు వీరిమీద ఈ చిత్రాల ప్రభావం అంతో ఇంతో ఉండి స్త్రీని గురించీ, వ్యక్తి విశిష్టతను గురించీ, నీతిని గురించీ విశాలదృష్టి ఏర్పడింది ఈ చిత్రాలు చూచి సాహిత్యం సృష్టించే రచయితలు ఈ ప్రభావాన్ని ప్రజలకు అందచేస్తున్నారు హార్మొనైజు చేసిన సంగీతంతో మన సంగీత వేత్తలకు పరిచయం కలిగింది ఈ ఫలితం మన చిత్రాల ద్వారానూ, రేడియో ద్వారాను కొద్దిగా ప్రజలకు అందుతున్నది మనకన్న హెచ్చు జీవన ప్రమాణమూ, హెచ్చు సంస్కారమూ ఉండే ప్రజల కోసం నిర్మించిన ఈ చిత్రాలు మనకు బాగా ఉపకరిస్తున్న వనటానికి సందేహం లేదు అయితే వీటితో ఒకటే చిక్కు. ఇవి మన జాతీయతను పెంచలేవు ఇతరత్రా జాతీయతను సాధించుకోలేని విద్యావంతులు ఈ చిత్రాల ప్రభావం వల్ల, ఆంగ్లమానస పుత్రులూ, వింత వ్యక్తులూ అయిపోవడం జరుగుతున్నది

ఈసందర్భంలో మనం సినిమావల్ల ప్రజల అభిప్రాయాలలో రాదగిన మార్పు గురించి కూడా ఒక్క ముక్క చెప్పుకోవచ్చు సినిమాను మించిన ప్రచారసాధనం లేదు ఉత్కృష్ట కళాకారులకూ, నాయకులకూ, మంత్రులకూ లేనిప్రచారం మన సినిమా తారలకు జరుగుతున్నదంటే అది సినిమా ప్రభావంకాక మరేమిటి? మన నాయకులూ, పారకులూ ఈ రహస్యం గుర్తించిననాడు వందశాసనాలద్వారా సాధ్యంగాని ఫలితాలు సినిమాద్వారా పొందగలుగుతారు.

*తెలుగు సినిమా, మాసపత్రిక, ఏప్రిల్ 1948*

# 32. ప్రశ్నలు

యినగంటి పాండురంగారావు, బందరు

ప్రశ్న వింధ్యరాణి, రాధిక మొదలైన చిత్రాలవల్ల తెలుగు సినిమాకు తీరని కళంకం వాటిల్లుతుందని చెప్తాను మీరు మన స్ఫూర్తిగా అంగీకరిస్తారా? లేదా?

సమా కొందరు మానవులు అప్రయోజకులైనంత మాత్రాన మనజాతికి కళంకం వాటిల్లుతున్నదా?

కె కొండలరావు, బందరు

ప్రశ్న గత సంచికలో సాంఘిక చిత్రాలు తీయుటవల్ల డబ్బురాదని చిత్రపు నారాయణ మూర్తిగారు శెలవిచ్చారు అటువంటప్పుడు గృహప్రవేశము, స్వర్గసీమ, దేవత మొదలగు సాంఘిక చిత్రాలు ఎందువల్ల ప్రజానురాగమును సంపాదించి సొమ్ము చేసుకున్నవి?

సమా  ఎవరు తీసినా సాంఘిక చిత్రానికి  డబ్బురాదని  చిత్రపువారి అభిప్రాయం అయివుండదు
ఎస్ కె కుమార్, ఏలూరు

ప్రశ్న  ఈనాడు మన తెలుగు ఫిలిం కంపెనీలు మధ్యతరగతి ప్రజల్లోను, పేదరైతులలోను చైతన్యము కలిగించే సోషలిస్టు భావములు కలిగే చిత్రములు  తీయకుండుటకు అంత శక్తి సామర్థ్యములు  గల డైరెక్టర్లు లేకనా, మరి వారికి చేతగాకనా?

సమా  సోషలిస్టు విధానం అమలులోకి వచ్చేసినతరవాతగాని మనప్రొడ్యూసర్లు ప్రజల్లో సోషలిస్టు భావాలను ప్రచారం చెయ్యరు ఒకటి రెండు శతాబ్దాలు వెనకగా ఉండటం క్షేమమని వారి విశ్వాసం
ఎ ఎస్ రావు, మండపేట

ప్రశ్న  టాకీ పరిశ్రమలో  స్క్రిప్టు రైటరుకు గల బాధ్యత ఎంతవరకో సెలవిస్తారా?

సమా  డైరెక్టరు రాయమన్న ముక్కలు కాగితం మీదికెక్కించే వరకూనూ
పి ఎస్ మూర్తి, పెంటపాడు

ప్రశ్న  జనవరి తెలుగు సినిమా సంచికలో ''సినిమాకథలు'' అనే వ్యాసంలో అభ్యుదయ కళను  ఆస్వాదించేవాడికి, '' ఇది నా కోసమే సృష్టించారు'',  అనే భావం కలగకపోవటం చాలా తప్పు అన్నారు  తన కోసం కాదు అనుకునేవారు ఎవరో తెలియజేస్తారా?

సమా  చూస్తున్న చిత్రంలో తన సంస్కారానికి అవమానం జరుగుతూంటే '' ఈ చిత్రం నాకోసమే తీశారు'' అని ఎవరనుకోగలరు?

ప్రశ్న  సినిమాకు కథలు రాసినవారిలో ''కథలు రాయటానికి అర్హత కలవారూ లేనివారూ కూడా వున్నారు  అని తెలుగు సినిమా జన్మదిన సంచిక జులై 1947లో ''సినిమా స్క్రిప్టు'' హెడ్డింగు క్రింద స్టేటుమెంటులో  అన్నారు  అంటే సినిమాకు స్క్రిప్టు వ్రాయడమా? లేక స్టోరీలు రాయడమా?  రెండింటిలో ఏది అయినప్పటికీ అర్హత లేనివారిని తెలియబరచగలరా?

సమా  స్క్రిప్టు రాయటానికైనా స్టోరీ ఒకటి ఉండాలి  అందుచేత నేను చెప్పినది స్టోరీ రాసే అర్హతే  ఆ అర్హతలేని వారెవరో సినిమాలు చూస్తుంటే మీకే తెలుస్తుంది
అక్కల ఆంజనేయులు, తెనాలి

ప్రశ్న  సినిమా ఏ దృష్టితో నిర్మాణం చేయవలయును?

సమా  సంఘాన్ని ఉన్నతికి తెచ్చేందుకు

ప్రశ్న  ఆధునిక యుగములో ప్రేమ చిత్రములు కావలయునా? లేక వీరోచిత చిత్రములు కావలయునా?

సమా  జాతిని బలపరిచే చిత్రాలు ఏ తరగతికి చెందినా ఇబ్బంది లేదు

ప్రశ్న  ఇంతవరకు తయారైన ఏచిత్రమైనా ప్రయోజనకారిగా యున్నదా?

సమా  'గృహలక్ష్మి', 'మళ్ళీపెళ్ళి', 'మాలపిల్ల', 'రైతు బిడ్డ', 'పల్నాటి యుద్ధం' – ఇటువంటి చిత్రాలు నిష్ప్రయోజనమైనవా?
ఎం శంకరరావు, మద్రాసు

ప్రశ్న  ఒక ఫిల్ము బాగుపడడానికిగాని చెడిపోవడానికిగాని, కవి ఎంతవరకు

బాధ్యుడవుతాడు

సమా అతనికి బాధ్యత ఇచ్చినంతవరకు – ఆచరణలో ఇది చాలా స్వల్పం

ప్రశ్న సినీమా రంగమును నమ్ముకొని ఎల్లకాలము ఒక నటిగాని నటుడుగాని జీవించడానికి అవకాశముందా? వీరి యొక్క ప్రభావము రమారమి ఎంతకాలముంటుంది?

సమా లేదు ప్రజల నాకర్షించటం మానగానే తారాపతనమే

బి సూర్యనారాయణ, సామర్లకోట

ప్రశ్న ప్రస్తుత పరిస్థితులను బట్టి వాస్తవిక జీవితాలను గూర్చి ఫిల్ములు తీయరు ఎందుచేత?

సమా వాస్తవిక జీవితం గురించి తెలియక

బడిశెట్టి సాంబశివరావు, ఏలూరు

ప్రశ్న మన తెలుగు చిత్ర నిర్మాతలు చెత్త ఫిల్ములు తీయటంమాని ప్రస్తుత ప్రజాలోకానికి అవసరమయ్యే ఉత్తమ చిత్రాలు తీయుటకు తగిన మార్గమేమిటి మహాశయా?

సమా చెత్త చిత్రాలను ప్రజలు బహిష్కరించటమే

తుమ్మల వెంకటేశ్వరరావు, బెజవాడ

ప్రశ్న చిత్ర విమర్శ అనగా ఎట్లా వుండాలి? ఏవిధమైన చిత్రమును విమర్శించాలి?

సమా చిత్రాన్ని చూసిన ప్రేక్షకులు తమంతట తాము గ్రహించలేకపోయిన మంచిచెడ్డలను విమర్శకుడు తెలియజేయాలి వెలయాలిలాగా పై మెరుపులతో ప్రేక్షకులను భ్రమింపజేసే చిత్రంలో కుళ్లు ఉన్నట్టయితే విమర్శకుడు దాన్ని చూపించాలి మహా విద్వాంసుడి లాగా చిత్రంలో ఉన్న గొప్పతనం ప్రేక్షకుడికి అందనట్టయితే విమర్శకుడు ఆ గొప్పతనాన్ని అందించాలి చిత్రంలో ఉండే మంచి చెడ్డలు అందరికీ స్పష్టంగా తెలిసిపోతున్నప్పుడు విమర్శకుడు చేసేదేమీ లేదు

బి టి వసంతకుమార్, విశాఖపట్నం

ప్రశ్న మీబోటి అభ్యుదయ రచయితలచేత చక్కని కథలు వ్రాయించి దేశానికి ఉపకరించే చిత్రాలు తీయడం మన డైరెక్టర్లకు చాతకాదా అండీ?

సమా అది వారి దృష్టిలో చాతకానితనం కాదేమో

ప్రశ్న హిందీ నిర్మాతలవలె మన డైరెక్టర్లు నూతన యువకులకు ఫిల్ములో స్థానం ఇవ్వకపోవటానికి కారణం? సమర్థులైనవారు లేరనా? లేక వారిని వుపయోగించడం చాతకాదనా?

సమా ప్రజాభిప్రాయానికి వెనకగా ఉండటం మంచిదని, కొత్త నటులను గురించి ప్రజాభిప్రాయం ఎట్లా వుండబోతుందో తెలియదు గనక మన నిర్మాతలు వారిని తీసుకోరు చాతకాని తనమంటే వారు ఒప్పుకుంటారా?

మండవ శ్రీనివాసరావు, తెనాలి

ప్రశ్న . ప్రస్తుత భారత ప్రజానీకానికి ఎక్కువ తోడ్పడే సమస్య ఏది?

సమా కొద్దిమంది లాభాల కొరకూ, కేవలమూ ఎగుమతి కొరకూ కాకుండా ఉత్పత్తి పెంచేదెట్లా? మానవత్వాన్ని కోల్పోకుండా మతాభిమానం కలిగి ఉండేదెట్లా? పెట్టుబడిదారీని

బలపరుస్తూ సోషలిస్టు వ్యవస్థ తెచ్చేదెట్లా? ప్రజలకు ఎటువంటి స్వేచ్ఛా ఇవ్వకుండా ప్రజా స్వామ్యం అమలు పరిచే దెట్లా? ఇటువంటి విషమసమస్యలు ఎన్నయినా ఉన్నాయి

ప్రశ్న అలాంటి సమస్యలు ఏవిధంగా పరిష్కరింప బడతాయి? సినిమాల వల్లా పత్రికలవల్లా లేక మీరు వ్రాసే రచనల వల్లా?

సమా కొద్దిమంది రాజకీయ వేత్తలు పెత్తనం తమ మీదే వేసుకుని జీవిత సమస్యలు పరిష్కరించే భారం గుత్తకుపుచ్చుకుని ఇతరులను నోరెత్తనివ్వనంత కాలమూ మీరు చెప్పే పద్ధతులెందుకూ కొరగావు

ఎస్. పేర్రాజు, విజయనగరం

ప్రశ్న చిత్రాలను గురించి తీవ్రముగా విమర్శ చేయుటవలన చిత్రానికి ఏవిధమైన దెబ్బ అయినా తగులుతుందా? అలా విమర్శించడము మంచిదా?

సమా విమర్శవల్ల ప్రజలలో చిత్రంమీద విముఖత్వం మాత్రమేకలిగి నిర్మాతకు నష్టం కలిగితే అటువంటి విమర్శ నిష్ప్రయోజనం, కానితీవ్ర విమర్శవల్ల ప్రజల అభిరుచి పెరిగి అటువంటి చిత్రాలకు విజయం అసాధ్యమైనట్టయితే ఒక నిర్మాత నష్టపడ్డప్పటికీ అటువంటి విమర్శ చాలా ప్రయోజనకారిగా ఉంటుంది

ఎస్ పరంజ్యోతి, తుమ్మపూడి

ప్రశ్న సాధారణంగా చిత్రం ఫెయిల్ కావడం అంటే మీ ఉద్దేశం ఏమిటండీ?

సమా చిత్రానికి నష్టం రావటం, నష్టం రాకపోయినా చూసిన ప్రజలకు తృప్తి కలగక పోవటం అసంఖ్యాకులు చూసీ, లక్షలు లాభం వచ్చీకూడా సమాజానికి చిత్రం ద్వారా కించిత్తయినా ప్రయోజనం లేకపోవటం ఇవన్నీ అపజయానికి అంతస్తులు

ప్రశ్న రాధిక, బ్రహ్మరథం మొదలగు చిత్రాలు ప్రెస్ షో చేయకుండా విడుదల చేయుటకు కారణం?

సమా అనవసరమనో, అపాయకరమనో

ఎం వి ఎస్ ప్రకాశరావు పిఠాపురం

ప్రశ్న . బాలవిజ్ఞానానికి తోడ్పడే తెలుగు చిత్రాలు తీయుట మన నిర్మాతలకు యిష్టములేదా? వారిచే అట్టి ఫిల్ములు తీయించవలెనన్న ఏమి చేయవలెను?

సమా బూతులు మినహాయిస్తే మనఫిల్ములు బాల విజ్ఞానమే మీరు అనుకునేటువంటి చిత్రాలు తీయాలంటే అటువంటి చిత్రాలు తీయటం వల్ల అంతులేని లాభాలు వస్తాయని నిరూపించాలి

ఆర్లగడ్డ మురలీరెడ్డి, ఆర్లగడ్డ

ప్రశ్న సినిమా స్క్రిప్టు అనగానేమి?

సమా కాగితం మీద సినిమా చిత్రం

ప్రశ్న సినిమా కథకుడికి వుండవలసిన ప్రత్యేకత లేమిటి?

సమా డైరెక్టరు కంటే కూడా తెలివితక్కువవాడల్లే నటించటమూ, ఏవిషయమైగాని వాగ్వాదంలోకి దిగక పోవటమూనూ

*తెలుగు సినిమా, మాసపత్రిక, ఏప్రిల్ 1948*

# 33. చిత్ర నిర్మాణ సమస్య

1948లో చిత్ర నిర్మాణ సమస్య స్వరూపం మారుతున్నది యుద్ధం మూలంగా సినిమా చిత్రాల కెత్తుకున్న సద్యోగం 1947తో అంతమయిపోయింది గడిచిన ఆరు సంవత్సరాలలోనూ కొద్ది చిత్రాలు విజయం పొందలేకపోయినప్పటికీ మొత్తంమీద సినిమా పరిశ్రమ మంచిదశే అనుభవించింది అన్నివైపులా ఉత్సాహమూ లాభాలు కనిపించినై స్టూడియోలు రెండు చేతులా డబ్బు చేసుకున్నై తారలకు కంట్రాక్టుల మీద కంట్రాక్టులు లభించినై తీయని చిత్రాల మీద కూడా అడ్వాన్సుల కింది తారలకు బాగా ముట్టింది డిస్ట్రిబ్యూటర్లు అంతులేని లాభాలు చేసుకున్నారు.

ఇదంతా ఎండుగడ్డి మంటలాగా చప్పున చల్లారిపోయింది ఇంకా కొత్త కంపెనీలు వస్తూనే ఉన్నై పాత ప్రొడ్యూసర్లు ఏదో ఒక విధమైన ప్రయత్నం చేస్తున్నారు కాని వెనకటివేడిలేదు ఎవరి మొహానా వెనకటి ఉత్సాహం లేదు అంతా పెదవులు విరిచి చప్పరిస్తూనే ఉన్నారు చౌకలో చిత్రం పూర్తి చేసుకోవాలనే ఆదుర్దా అందరిలోనూ కనిపిస్తుంది ఒకరిద్దరు డిస్ట్రిబ్యూటర్లు బాగా దెబ్బతిన్నారు ఈ సంవత్సరం యిప్పటికి విడుదలయిన ఆరు చిత్రాల్లో నాలుగుచిత్రాలు టపాకాయలు పేలినట్టు పేలిపోయినై. పెద్ద వేషాలు వేసేవారిలోనే కొద్ది మందికి నిరుద్యోగస్థితి పట్టింది తెలుగు చిత్రాలకు దక్షిణ దేశం అత్తవారిల్లయి కూచుంది

ఈపరిస్థితుల్లో తెలుగు సినిమా చిత్రాల భావిగతి ఏమిటనే సమస్య అందరినీ – ముఖ్యంగా చిత్రనిర్మాతలను – వేధిస్తున్నది ఉత్తమ చిత్రమనదగినది లక్షన్నర మించకుండా తియ్యగలిగితేగాని ఈ పరిశ్రమకు మోక్షం లేదంటున్నారు కాని ఇదిఎట్లా సాధ్యమవుతుందో ఏ ప్రొడ్యూసరుకు స్పష్టంగా తెలియదు కొందరింకా ఆదర్శప్రాయమైన సినిమా కథకోసం అన్వేషిస్తూనే ఉన్నారు నోరుగల ప్రేక్షకులు కొత్త మొహాలు చూపించమని అడుగుతున్నారు ( పాత చిత్రాలు బాగా లేకపోవటానికి పాతమొహాలే కారణమని వారి దృఢవిశ్వాసం ) నిజానికి చిత్రాల ఖర్చు తగ్గించు కోవటం ఒక పద్ధతి కాని ఇది ప్రమాదకరమైన కత్తిసాము కొత్త మొహాలను పెట్టి చౌకగాతీస్తే ఆ కాసిని డబ్బులు కూడా రాకపోవచ్చు

మూలిగేనక్క మీద తాటిపండు పడ్డట్టుగా ప్రభుత్వంవారు అదను చూసి వినోదపన్ను హెచ్చించారు బంగారు గుడ్లు పెట్టే బాతు పొట్ట చీల్చినట్లయింది నిజంగా ఈ వినోదపన్ను హెచ్చింపు సమర్థించరానిది దీన్ని స్థానిక పరిపాలనాశాఖల కిస్తున్నారు. అసలే స్థానిక పరిపాలనలో ఎంతో దగా ఉన్నది ఎలెక్షనులకు పోటీదార్లు ఎన్నేసివేలు ఖర్చుచేసేదీ అందరికీ తెలిసిన విషయమే ప్రజల సొమ్ము లంచాలకిందనే ఖర్చయిపోతున్నది ఈస్థానిక పరిపాలనా శాఖలకు మరింత డబ్బు చూపటం లంచగొండితనాన్ని మరింత రెచ్చగొట్టటమే అవుతుంది పోనీ సినిమా పరిశ్రమ మంచి స్థితిలో వున్నా అంత అనుకోవలసిన పని వుండదు కానిఅదీ లేదు. ఇప్పటిస్థితిలో ప్రభుత్వంవారు రాఫిలింమీద దిగుమతి సుంకాలు తగ్గించీ, సినిమాద్వారా ప్రభుత్వ ప్రచారం సాగించీ, ప్రచార చిత్రాలు తీసినవారికి ధన సహాయంచేసి, ఈ పరిశ్రమను నిలబెట్టవలసి వుండగా వినోదపన్ను పెంచి ఊరుకున్నారు

సినిమా సమస్య ఒక్క ప్రొడ్యూసరుకు మాత్రమే సంబంధించినదికాదు ఇందులో

నటులున్నారు. డిస్ట్రిబ్యూటర్లున్నారు టెక్నీషియనులున్నారు ఎగ్జిబిటర్లున్నారు కాని చిత్రం దెబ్బతింటే ఒక్క ప్రొడ్యూసరే నష్టపడుతున్నాడు అయితే ప్రొడ్యూసరును కనికరించటం చాలా మంది ఒప్పుకోరు ఎందుచేతనంటే లాభనష్టాల భారం ప్రొడ్యూసరు తననెత్తినే వేసుకుంటున్నాడు లాభాలు పొందుదామనే ఆశతోనే సాటి ప్రొడ్యూసర్లతో పోటీపడి తారలకు వేలకు వేలిస్తున్నాడు. లాభాలు వచ్చినప్పుడు అంతా తనకే ఉంచుకుంటున్నాడు. ప్రొడ్యూసరు ఈ వైఖరి మార్పుకు తీరాలి ప్రొడ్యూసరుకు లాభాలనేవి ఇంచుమించు గగనకుసుమాలై పోయినాక ప్రొడ్యూసర్లతో పాటు పరిశ్రమ నడిసముద్రంలో ఇంకకుండా ఉండాలంటే ఈ పరిశ్రమలో గలవారంతా తమ బాధ్యతలను పునర్వ్యమర్శించుకోవాలి

నటులున్నారు ఆదివారం అందలమూ, సోమవారం జోలే అయి ఉన్నది వారిపని అదృష్టమున్న కొద్దిమంది నటులు తప్పిస్తే అసంఖ్యాకులు బుకింగు అయిపోయిన అయిదారు మాసాలలోపుగా నడివీధిలో ఉండవలసినవారే విడవకుండా ఉద్యోగం ఉంటుందనే ఖాయిదా ఉంటే వీరు సంసారపక్షమైన వేతనాల మీద సినిమా పరిశ్రమను సేవించగలరు వారు చవుకగా వచ్చేటట్టయితే ఇప్పుడు ఖర్చు చేసే డబ్బుతోనే ప్రొడ్యూసర్లు ఆ నటులకు ఏడాదికి పదమూడు నెల్లజీతం ముట్టచెప్పగలగుతారు ఇక్కడ విషమసమస్య అనేది లేనేలేదు

తరువాత డిస్ట్రిబ్యూటర్లు కేవలం డిస్ట్రిబ్యూటర్లుగానే ఉంటే వారికి నష్టమనేది వుండదు కాని డిస్ట్రిబ్యూటర్లు మరింత గణింతామనే ఆశకొద్దీ ప్రొడ్యూసర్లు తినవలసిన దెబ్బలు తామే తింటున్నారు ఇది కేవలమూ అనవసరంగా కొరివితో తల గోక్కోవటం చెడిపోయే చిత్రాలు నాలుగింటిలో నాలుగు లక్షలు యిరికించుకుని నూటికి యాభైవంతులు కమీషను రాసుకుని అంతా క్షవరం చేసుకునేకన్న, చవుకలో పూర్తి అయిన చిత్రాలను పదింటిని తీసుకొని నూటికి 5వంతులే కమిషను తీసుకుని హెచ్చు లాభాలు గడించుకోవచ్చు అలా చేసినట్లయితే చిత్రాలు దివాలా తీయకుండా వుండటానికి డిస్ట్రిబ్యూటర్లు కూడా తోడ్పడ్డవారవుతారు

పోతే ఎగ్జిబిటర్లున్నారు ఏ పరిస్థితిలోనూ నష్టానికి గురికానివారిలో ఎగ్జిబిటరు కూడా ఉన్నాడు. పన్ను పోగా చిత్రం మీద వచ్చేదానిలో సగం ఇతడే పుచ్చుకుంటాడు వరసగా పది చిత్రాలు దివాలా ఎత్తవచ్చు. ఇతను కానీ కూడా నష్టపడడు ఈపరిస్థితులలో ఎగ్జిబిటరు చిత్రం మీద నూటికి 25 వంతులే తీసుకుని తన వంతు ఇంతకు తగ్గితే పిక్చరు ఎత్తేస్తానని పెట్టుకుని పరిశ్రమకు చాలా ఉపయోగం చెయ్యగలడు ఇందువల్ల అతనికి వచ్చే లాభాలు తగ్గవచ్చు నష్టం ఏమాత్రమూ రాదు

అందరికీ పైగా ప్రభుత్వం వుండనే వుంది ప్రభుత్వం సినిమా పరిశ్రమకు చెయ్యగల ఉపకారం మొదటనే మనవి చేశాను

వీరందరూ తెలుగు సినిమా పరిశ్రమతో సంబంధం వున్నవాళ్లే. దాని మీద జీవిస్తున్నవాళ్లే ఈ పరిశ్రమ మంచి లాభాలు తీస్తుంటే ఆలాభాలలో భాగం కోసం ఆశించే అధికారం వీరందరికీ వుంది మాటవరసకు డిస్ట్రిబ్యూటరు చిత్రం మీద కమిషను తీసుకునేటప్పుడు మొదట లక్షమీద కంటె రెండో లక్షమీదా, మూడో లక్షమీదా హెచ్చు కమిషను తీసకుంటూ పోవచ్చు అల్లాగే ఎగ్జిబిటరు మొదటి పదివేల మీదకన్న రెండో పదివేల మీదా, మూడో పదివేల మీదా హెచ్చుభాగం అడగవచ్చును. నటులు ప్రొడ్యూసరు లాభాలలో నుంచి బోనసులు పొందవచ్చును

లాభాలంటూ ఏర్పడేస్థితి కలిగిన మీదట వాటికోసం అందరూ ఆశించవచ్చు కాని పరిశ్రమ నష్టపడుతూండగా అందులో చేరివున్న వారు తమ స్వలాభాలు మాత్రమే చూసుకోవటం కంటే దారుణమైన విషయం వుండబోదు ప్రొడ్యూసర్లు కూడా తమ వైఖరి మార్చుకోవాలని మొదటనే చెప్పాను తాము సర్వసమర్థులన్నట్టు ప్రవర్తించి లాభం లేదు మూడు నాలుగు లక్షలు ఖర్చు చేసి చిత్రం తీసి మూడేళ్ళ అనంతరం రెండు లక్షలు చేతికి తెచ్చుకోవటంలో సర్వసమర్థత్వం ఏమీలేదు ఒక చిత్రంమీద ఒకటి రెండు లక్షలు లాభం తెచ్చుకున్న వాళ్ళు సహితం, మళ్ళీ ఇంకో లాభం వచ్చే చిత్రం తియ్యగలమా అని ఆత్మపరిశోదన చేసుకోవాలి. ఎంత హీనమైన పరిస్థితుల్లో కూడా ఒకటిరెండు చిత్రాలు ప్రతి ఏడూ కొంత లాభం చేసుకుంటై. అవి తీసినవాళ్లు తాత్కాలికంగా తాము పొడిచేసినవాళ్ళమని విర్రవీగి లాభంలేదు.

సినిమా పరిశ్రమ ప్రతి అంగంలోనూ పరివర్తన రావాలి ఈ పరివర్తన ఫలితంగా ఏటా కనీసం పాతిక చిత్రాలు తయారై అన్నిటికీ డబ్బు తిరిగి రావటానికి మార్గం ఏర్పడాలి ఈ పరిశ్రమను నమ్ముకుని కొన్నివేల మంది ఒడుదుడుకులు లేకుండా జీవించే అవకాశం యేర్పడాలి బాగుపడితే అందరూకలసి బాగుపడాలిగాని, ఒకరి నష్టాల మీద మరొకరు లాభాలు తీయరాదు ఇప్పుడున్న నటులూ, ప్రొడ్యూసర్లూ, డిస్ట్రిబ్యూటర్లూ, ఎగ్జిబిటర్లూ ఈవిషయంలో తగిన ఆసక్తి కనబరచని పక్షంలో కొత్తవారు రంగంలోకి దిగి పాతవారితో పోటీ చేసి వారిని గుర్రాలమీది నుంచి దించాలి ఇది జరగనంతవరకూ ఈ పరిశ్రమకు మోక్షం లేదు

మన ప్రొడ్యూసర్లు బ్రహ్మాండ నాయకులమనుకుని లాభంలేదు మనపరిశ్రమలో ప్రొడ్యూసర్లు ప్రొడ్యూసరుగా రాణించటంలేదు అందుకనే బొత్తిగా అనుభవంలేని వాళ్లు సహితం చిత్రాలు తియ్యటానికి ముందుకు రావటం జరుగుతోంది ఒక చిత్రం దివాలా తీస్తే దానితోపాటు దివాలా తీయవలసిన స్థితిలో వున్నారు యెక్కువమంది ప్రొడ్యూసర్లు ఏడాదికి మూడు నాలుగు చిత్రాలు తీసేవారికీగతి వుండదు అటువంటి ప్రొడ్యూసర్లున్న పరిశ్రమలోకి గుడ్డిగా కొత్తవాళ్లు రారు

డిస్ట్రిబ్యూటరు డిస్ట్రిబ్యూటరుగా కూడా రాణించటంలేదు డిస్ట్రిబ్యూటరంటే ప్రొడ్యూసర్లనెత్తిన చెయ్యిపెట్టే మార్వాడీగా వున్నాడు పది మంచి థియేటర్లుకూడా పట్టుకోలేని డిస్ట్రిబ్యూటర్లు ఏ యాభైవేలకో లక్షకో చిత్రాలను దివాలా యెత్తించేస్తున్నారు విడుదలయిన రోజునే ఆగిపోదగిన చిత్రాల మీదకూడా వీరు డబ్బు పెడుతున్నారంటే వీరికి చిత్రాలను గురించి ఏపాటి తెలుసునో, యెటువంటి స్వార్థంతో కూడిన ఏర్పాట్లమీద వీరు వ్యాపారం సాగిస్తున్నారో మనం వూహించవచ్చు ఇదంతా మనసినిమా పరిశ్రమ సరిగా పాదుకోలేదనటానికి తార్కాణం స్వలాభాపేక్ష వంచనా, ఇతరుల కష్టసుఖాల గురించి నిర్లక్ష్యమూ ఈ పరిశ్రమలో యెంతగా పెచ్చుపెరిగిపోయివున్నాయో యిందులో తిరిగేవాడికిగాని తెలియదు ఇదంతాపోయి సినిమా పరిశ్రమ ఒక ఉద్యమంగా సాగితేనేగాని దీనికి భావిలేదు నేను సూచించిన పద్ధతుల మీద పరస్పర సహకారం చేసుకునే యిచ్ఛగల ప్రొడ్యూసర్లూ, ఎగ్జిబిటర్లూ, నటులూ రావాలి లాభాలను ఉమ్మడిగా పంచుకోవటానికి తగిన యేర్పాట్లమీద వీరు పరిశ్రమను నడపాలి అప్పుడే నష్టాలనేవి లేకుండా పోతాయి

*తెలుగు సినిమా, మాసపత్రిక, జూలై 1948*

# 34. పిల్లల కోసం ప్రత్యేకంగా చలన చిత్రాలు

పిల్లల కోసం ప్రత్యేకంగా నిర్మాతలు కొన్ని చిత్రాలు తయారు చెయ్యాలని కొన్ని సంవత్సరాల నుంచి ఆందోళన జరుగుతున్నది అయితే ఈ ఆందోళనను ఒక్క బ్రిటన్, అమెరికాలలో తప్ప ఇతర దేశాలలోని చలన చిత్ర నిర్మాతలు అంతగా గమనించినట్లు కనిపించదు

పిల్లల కోసం ప్రత్యేకంగా చిత్రాలు తయారుచేస్తూ కూర్చుంటే – వాటివల్ల నిర్మాణాని కయ్యే వ్యయం కిట్టుతుందా అని కొందరు, మరి పెద్దల మాటేమిటని కొందరు ప్రశ్నిస్తూ వచ్చారు

పిల్లలు ఏదేశానికైనా భావికాలపు పౌరులు కాగా దేశ భవితవ్యాన్ని తీర్చిదిద్దుకోడానికి తగిన సామర్థ్యం, ప్రతిభ నైతిక శక్తి, ధైర్యాలు, ఆత్మవిశ్వాసం పెంపొందడానికి దోహదమిచ్చే చిత్రాలను నిర్మించడం నిర్మాతలకు ధర్మం లేదా పిల్లలు నిరాక్షేపణీయంగా చూడదగు చిత్రాలను తయారు చెయ్యడం ఉచితం అంతేగాని పిల్లల మనస్తత్వాలను వక్రపథంలో పెట్టడానికి దారితీసే చిత్రాలను తయారు చెయ్యడం మట్టుకు పూర్తిగా అక్రమం

'కిస్మత్' వంటి చిత్రాలు బాలుర మనస్సులను త్వరితంగా దుష్పథానికి గొనిపోతాయి అపరాధాలపట్ల ఆసక్తిని రేకెత్తిస్తాయి ప్రణయమంటే ఏమో తెలియని నవయౌవన వయస్సంధిపథంలో అవినీతి, అర్ధనగ్న దృశ్యాలుగల చిత్రాలు చూస్తే వారి మనస్సులు సులభంగా చెడుత్రోవను పడతాయి

హాలీవుడ్‌లో 'Boys Town' చిత్రం తయారయింది అది పిల్లలకు ఉపకరిస్తుంది అలాగే వాల్ట్ డిస్నీ తయారు చేసే కార్టూన్ చిత్రాలు పిల్లల హృదయాలను ఆనంద వికసితం చేస్తాయి

''ఏ చిత్రమైన ఒక ప్రయోజనాన్ని నిరూపించకపోతే అది నిరర్థకమే కాగలదు సకుటుంబంగా చూసి ఆనందించడానికి హాలీవుడ్‌లో ఇటీవల కొన్ని చిత్రాలు తయారైనాయి

'ది బెస్ట్ ఇయర్స్ ఆఫ్ అవర్ లైవ్స్,' 'క్రాస్‌ఫైర్', 'జంటిల్ మాన్స్ అగ్రిమెంట్' లను ఈసందర్భంలో పేర్కొనవచ్చు ఇటువంటి చిత్రాలు పిల్లలు చూసినా ఫరవాలేదు

పిల్లలు చూసినా ఫరవాలేదనిపించే చిత్రాలను మటుకే నిర్మించి సమాధాన పడడంకంటే వ్యక్తిగతంగా సాలుకు ఏ ఒక చిత్రమో రెండు చిత్రాలో తయారు చేసే నిర్మాతల మాట ఎలావున్నా మన దేశంలోని రాజకమల్ కాళామందిర్, రంజిత్ మూవీటోన్, వాహినీ, జెమినీ వంటి సంస్థలు తమ సాలుసరి చిత్ర నిర్మాణ కార్యక్రమంలో కనీసం ఒకటి రెండు చిత్రాలైనా ముఖ్యంగా పిల్లలకు పనికివచ్చే వాటిని తయారు చెయ్యడం న్యాయం

పిల్లలలో విద్యాప్రబోధానికి ఈ నాడు దేశంలోని వేర్వేరు భాషలలో పిల్లల పత్రికలు వెలువడు తున్నవి పిల్లల పత్రికలు బహుళంగా ఆదరణ పొందినపుడు పిల్లల చిత్రాలు మాత్రం ఎందుకు ఆదరణ పొందవు? పిల్లలు చూడదగు ప్రత్యేక చిత్రం ప్రదర్శించబడితే దానిని చూడడానికి తన కుమారులను, కుమార్తెలను తీసుకువెళ్లని తండ్రి వుంటాడా?

ఏమైనా పిల్లల చిత్రాల విషయంలో మట్టుకు హాలీవుడ్ కంటె బ్రిటన్ ముందంజ వేసింది

పిల్లల చిత్రాలను ప్రదర్శించడానికి బ్రిటన్‌లో ప్రత్యేకంగా కొన్ని వందల థియేటర్లున్నాయి పిల్లల చిత్రాలకు ఉపకరించే కథలను ఎన్నుకొని నిర్మాతలకు సూచించటానికి కొన్ని సలహా సంఘాలున్నాయి ఆర్థర్ రాంక్ కంపెనీలో పిల్లల చిత్రాల నిర్మాణం ఒక శాఖ ఈశాఖలో విద్యాశాఖాధికారులు కూడా సభ్యులుగా వున్నారు దేశంలోని ఉపాధ్యాయులు చేసే సూచనలననుసరించి - కొన్నికొన్ని కంపెనీలకు నిర్మాణాన్ని కాంట్రాక్టు యిచ్చి, రాంక్ కంపెనీ కొన్ని చిత్రాలను తయారు చేయిస్తూవుంటుంది

ఇటీవల పిల్లలకు పనికివచ్చే చిత్రాలెన్నో బ్రిటన్‌లో తయారైనాయి వీటి నిర్మాణంలో ప్రదర్శనలో బ్రిటిష్ ప్రభుత్వం అధిక శ్రద్ధాసక్తులు వహిస్తున్నది అలాగే మనదేశంలో కూడా కేంద్రరాష్ట్రీయ ప్రభుత్వాలు పిల్లల చిత్రాల నిర్మాణం విషయంలో శ్రద్ధవహించడం అవసరం

జెమినీ వారు ఇటీవల 'మిస్ మాలిని' చిత్రంతోపాటు 'సినిమా కదంబం' అని ఒక కార్టూన్ చిత్రం తయారు చేశారు దానిలో ఇంకా విశిష్టత కొంత లోపించినప్పటికీ ప్రయత్నం శ్లాఘనీయమనక తప్పదు అటువంటి సమగ్రసాధన సంపద్విలసితములైన స్టూడియోల సహకారంతో బాలబాలికల మనస్తత్వ మెరిగిన శ్రీ చింతా దీక్షితులు మొదలైన ప్రముఖ ఉపాధ్యాయుల సహకారంతో రాష్ట్రీయ ప్రభుత్వ విద్యాశాఖా మంత్రి వర్గం తగు కృషి చెయ్యడం అవసరం ఇది రాష్ట్ర ప్రభుత్వానికీ కేంద్ర ప్రభుత్వానికీ కూడా విధి విహితం

*ఆంధ్ర మహిళ, మాసపత్రిక, జూలై, 1948*

# 35. అమెరికన్ సినిమా పరిశ్రమ

అమెరికన్ సినిమా పరిశ్రమ జగత్ప్రసిద్ధమైనది వ్యాపారపద్ధతులలో గాని, శిల్ప చాతుర్యంలో గాని దానికి ప్రపంచంలో సాటిలేదు చిత్ర నిర్మాణానికి అవసరమయ్యే సమస్త ముడి పదార్థాలు, పరికర సామాగ్రి, యంత్రాలు అమెరికాలోనే వుత్పత్తి కావటం అమెరికా సినిమా పరిశ్రమకు ఎంత ఉపకరించిందో, అంగబలాన్ని ఇతర దేశాల నుండి డబ్బును లెక్కచెయ్యకుండా తెచ్చుకోవటం కూడా అంత ఉపకరించింది

మనము నిత్యమూ వినే ప్రఖ్యాత హాలీవుడ్ డైరెక్టర్ల, తారల పేర్లలో సగానికిపైగా విదేశీయులవే వ్యాపార దృష్టితో సాగించిన యీ విధానం వల్ల హాలీవుడ్ చిత్రాలలో అంతర్జాతీయ దృష్టివిశేషంగా ఏర్పడి ఆ చిత్రాలు ప్రపంచ మంతటా కీర్తి గడించుకొనటానికి ఉపయోగపడింది

హాలీవుడ్ చిత్ర నిర్మాణ పరిణామంలో గమనించదగిన ప్రధానాంశాలు కొన్ని వున్నాయి ఇది వస్తుతహా విపరీతమైన లాభాలనిచ్చే పరిశ్రమ యంత్రోత్పత్తి సరుకుల ఖరీదుకూ ధరకూ కొద్ది వ్యత్యాసముంటుంది వాటిలో విశిష్టత అనేదానికి ఎక్కువ ప్రాధాన్యం వుండదు సినిమా చిత్రాలు అట్లాకాదు ప్రతి చిత్రానికీ దాని ప్రత్యేకత విశిష్టత ఉంటుంది దాని నిర్మాణానికి అయ్యే ఖర్చు పరిమితమేగాని దాని మీద తిరిగి వచ్చే డబ్బుకు పరిమితిలేదు పెట్టుబడికి పదింతలుగా సొమ్ము తిరిగి రావటం హాలీవుడ్ చిత్రపరిశ్రమలో అపూర్వ విషయంగాదు ఇంత విరివిగా తిరిగివచ్చే డబ్బును తిరిగి పరిశ్రమ మీదే పెట్టుబడి చేసి హాలీవుడ్ చిత్ర నిర్మాతలు ఇంకా ఖరీదైన చిత్రాలు, ఇంకా శిల్ప సౌష్టవంగల చిత్రాలు తయారు చేయసాగారు

పెట్టుబడిదారీ వ్యవస్థలో ప్రజావసరాలకు ఉత్పత్తి అయే వస్తుసామాగ్రి ప్రజల అవసరాలకు కొంచె తీసికట్టుగా ఉండటం రివాజు హాలీవుడ్ సినిమా చిత్రాలు మట్టుకు ఎప్పటికప్పుడు ప్రజల అభిరుచులకు ఒక మెట్టుపైగా వుండి, వారి కోరికలను వెర్రిగా రేకెత్తిస్తూ, రేకెత్తిన కోరికలను మించిన సంతృప్తి ఇస్తూ ముందుకు సాగాయి

ఇంత లాభసాటియైన పరిశ్రమ ఇంత ముందుకు వచ్చి పెట్టుబడిదారీ కేంద్రీకరణకు దారితీయకుండా ఉండటం అసంభవం

హాలీవుడ్ సినిమా పరిశ్రమలో ఇదే జరిగింది గుత్త వ్యాపారస్తులు అమెరికా సినిమా పరిశ్రమను ఆక్రమించుకున్నారు అమెరికన్ సినిమాచిత్రాలమీద వచ్చే ఆదాయంలో నూటికి 95 వంతులు 18 కంపెనీలు మాత్రమే పుచ్చుకుంటాయి అమెరికాలో స్వతంత్ర నిర్మాతలు ఎంతమందయినా ఉన్నారు కాని వాళ్ళ మెతుకులు ఏరుకునే వాళ్లే

ఈ 18 కంపెనీలకున్నూ పెట్టుబడి చేసేవి రెండే సంస్థలు – ఒకటి రాక్‌ఫెలరుది రెండవది ఫోర్డుది ఈపరిణామపు ఫలితం హాలీవుడ్ చిత్రాలలో స్ఫుటంగా కనుపించసాగింది అమెరికను పెట్టుబడిదార్లకు అనుకూలించే ప్రచారం యావత్తు 'వినోదం' పేర హాలీవుడ్ చిత్రాల నుంచి ప్రపంచ ప్రజలకి అందసాగింది రష్యా, ఇండియా, చైనా మొదలయిన దేశాలను అవహేళన చెయ్యటమూ, యూరపు దేశాల ప్రజలను వెర్రి వెధవలల్లే చిత్రించటమూ, గత అమెరికన్ చరిత్రను పెట్టుబడిదారీకి అనుకూలముగా చిత్రించటమూ మొదలయిన ప్రచారం సాగింది ప్రచారంలో అమెరికన్ పద్ధతులు అమాయకుల మీద అత్యద్భుతంగా పనిచేస్తాయిగాని సంస్కారం గల వారికి వెకిలిగా కనుపిస్తాయి అమెరికను చిత్రాలలో ఈ వెకిలితనం చాలాకాలంగా వుంటూనే వుంది

ఈదశలో కూడా హాలీవుడ్ నుంచి కొన్ని అపూర్వమైన చిత్రాలు వచ్చాయి వాటిల్లో ప్రగతి వుంటూ వచ్చింది ఇవి గుత్తదార్ల అనుమతితో తయారవుతున్నట్టుగా కనబడలేదు ఇవి ఎట్లా వచ్చాయి? ఎందుకు వచ్చాయి?

ప్రపంచాన్ని జయించటానికి ఈ హాలీవుడ్ చిత్ర నిర్మాతలు అనేక దేశాల నుండి గొప్పగొప్ప రచయితలనూ, డైరెక్టర్లను, చిత్రకారులను తెచ్చుకున్నారు చిత్ర నిర్మాణం పదిహేను వీసాలు వీరి మీదనే ఆధారపడివుంది హాలీవుడ్ చిత్రాలలోని కళా కౌశలము శిల్ప స్థావము పూర్తిగా వీరి మీదనే ఆధారపడివుంది వీరిలో అధిక సంఖ్యాకులు నిజమైన కళాభిరుచి, సత్యప్రియత్వము కలవారు, డబ్బుకు అమ్ముడుపోని అభిమానులు, కాకపోయినా, హాలీవుడ్‌లోనే బాగా డబ్బు సంపాదించుకుంటున్నవారు వీరికీ అమెరికను గుత్తదార్లకూ ఎట్టి వర్గసానుభూతీ ఆశయసామ్యమూ లేదు యదార్థ జీవిత చిత్రణమూ, కళారాధన వీరికి ప్రధానాశయాలు అందుచేత వీరు సాధ్యపడినప్పుడల్లా గుత్తదార్లనీ వారి ఏజంట్లనీ తోసిరాజని ఉత్తమ తరగతి చిత్రాలు తీసి ప్రపంచంలో హాలీవుడ్ ఖ్యాతిని పెంపొందించారు

దురదృష్టవశాత్తు గుత్తదార్లకి కావలసింది ఇదికాదు గడిచిన యుద్ధంలో ఈ గుత్తదార్ల బలం హెచ్చింది 1930లో వచ్చిన కాటకంలో వారుకోల్పోయిన రాజకీయ పలుకుబడిని యుద్ధంలో తిరిగి పుంజుకున్నారు ప్రపంచ యుద్ధాన్ని గెలిపించింది వీళ్ళు కారా? ఇంగ్లండులో చర్చిలు మురా అనుకున్నట్టే అమెరికాలో గుత్తదార్లు ఇక ప్రపంచం తమరొట్టేననుకున్నారు

అమెరికా రాజకీయాలిక ప్రపంచ రాజకీయాలేనని, ప్రపంచ రాజకీయాలు తమ రాజకీయాలేనని అనుకున్నారు ప్రణాళికలు వేశారు అన్ని సాంఘిక శక్తులూ ఇక తమ ప్రచారానికే వినియోగపడాలని నిశ్చయించారు హాలీవుడ్ కేసి చూసేసరికి వాళ్ళ గుండెలు పగిలిపోయాయి ఏ కళాకారులయితే ఇదివరలో తమ కళాకౌశలం చేత ఈ గుత్తదార్లకు బోలెడంత డబ్బు గడించి పెట్టడమేగాక, అమెరికా చిత్రాలకు ప్రపంచం మీద అఖండ ప్రచారం సాధించి పెట్టారో వారే ఈవేళ గుత్తదార్ల ప్రచారానికి అడ్డంగా నిలబడి ఇంకా కళారాధనే అంటున్నారు పరిశ్రమ యావత్తూ వారి చేతుల్లో వుంది వారా డబ్బుకు అమ్ముడు పోరు వీరిని వదిలించుకోవటం ఎట్లాగు?

గుత్తదార్లు మంచి మార్గం కనిపెట్టారు కమ్యూనిస్టు భూతాన్ని లేవదీశారు హాలీవుడ్ నిండా కమ్యూనిస్టులు లుకలుక లాడుతున్నారని పత్రికలు బొబ్బలు పెట్టసాగాయి అంతకు పూర్వం కమ్యూనిస్టుల వూసేలేదు యుద్ధం అయిపోగానే హాలీవుడ్‌లో ప్రతి కుర్చీకిందా తలుపు వెనకా కమ్యూనిస్టులే కొందరు రిపబ్లిక్‌ను రాజకీయవేత్తలు వీరిని ముద్దాయిలను చేసి విచారణలు ఆరంభించారు అనమెరికన్ చర్యల సంఘం ఏర్పాటయివుంది అనేక డజన్లమంది రచయితలనూ, ప్రొడ్యూసర్లనూ తారలను విచారించారు

ఈవిచారణలో హాస్యాస్పదమైన విషయం యేమిటంటే ఇవి విచారణలు కావు, శిక్షలులేవు విచారించబడ్డవాళ్లు ముద్దాయిలు కారు వారు కమ్యూనిస్టులని ఆవగింజంత సాక్ష్యంలేదు ఈ భాగ్యానికే వందల కొద్దీ సాక్షులు వచ్చి సాక్ష్యం ఇచ్చారు

గమనించవలసిన విశేషమేమిటంటే ఒకప్పుడు జాతీయవాదాలనన్నిటినీ వొదిలేసి, అంతర్జాతీయ దృష్టితో చిత్రాలు తీసిన హాలీవుడ్‌కు జాతీయత పట్టుకుంది చార్లీ చాప్లిన్‌లో అమెరికను జాతీయతలేదు ఇంకా డజను మంది ప్రసిద్ధ రచయితలలోను తారలలోను అకస్మాత్తుగా జాతీయత లోపించిపోయింది

ఈవిచారణలతోపాటు హాలీవుడ్ చిత్ర నిర్మాణం కుళ్ళుకంపు కొట్టసాగింది హేయమైన మనస్తత్వాలు గల నాయకులతోనూ నాయికలతోనూ చిత్రాలు తీసి హాలీవుడ్‌వారు ప్రజలమీద రుద్దసాగారు అమెరికా పెట్టుబడిదార్ల అనుకూల ప్రచారం హెచ్చిపోయింది ఫలితం వరుసగా రెండు అంతర్జాతీయ చిత్ర ప్రదర్శనలలో అమెరికా పేరు మట్టికొట్టుకు పోయింది అమెరికా చిత్రాల్లోని దుష్ప్రచారానికి అసహ్యించుకొని అనేక దేశాలవారు అమెరికా చిత్రాలను బహిష్కరించసాగారు

అమెరికను గుత్తదార్ల పగటి కలలు ఫలించలేదు వాళ్ళ ప్రతినిధి డ్యూయీ ఓడాడు అమెరికన్ ప్రచార సంస్థలన్నీ చేసిన ప్రచారం యెందుకూ కొరగా లేదు ఇంటగెలవలేని అమెరికను ప్రచారం రచ్చగెలుస్తుందా అని హాలీవుడ్ తారల మీద విచారణలు జరిపిన రిపబ్లిక్‌ను రాజకీయ వేత్తను అరెస్టు చేశారు ఆయన మీద విచారణ జరగబోతూంది

ఈ పరిణామం హాలీవుడ్ చిత్ర నిర్మాణానికి మేలు కొంత కాలం పాటు హాలీవుడ్ నుంచి కొన్నయినా ఉత్తమ తరగతి చిత్రాలు వచ్చే అవకాశం తిరిగి లభించింది

*అరుణరేఖ, మాసపత్రిక, మే / జూన్ 1949*

# 36. కాంచనమాల తొలిచిత్రం

1935లో బాపట్ల నుంచి ఇద్దరు కుర్రాళ్లు బెంగుళూరు వెళ్లారు సెలెక్టు పిక్చరు సర్క్యూటు అధిపతి అయిన డాక్టరు అంబాలాల్ ఎం పటేల్‌ను కలుసుకున్నారు సాగర్ మూవీటోను స్టూడియోలో పటేలు రెండు తెలుగు పిక్చర్లు తీసేటట్టూ, వాటికి కావలసిన నటులూ, స్క్రిప్టురైటరూ, సంగీత దర్శకుడూ మొదలైనవారిని ఈ కుర్రవాళ్లు తెచ్చేటట్టూ, డా॥పటేలు వీరికి 13,500 ఇచ్చేటట్టూ ఖరారు చేసుకున్నారు సాగర్ మూవీటోనులో డా॥పటేలకు పన్నెండణాల వాటా వుంది

1936 జనవరిలో నాకు బొంబాయి రమ్మని కబురు వచ్చింది నేను బొంబాయి వెళ్లేటప్పటికి ఇంకా ఏమీ నిర్ధారణ కాలేదు మొదటి చిత్రం 'వీరాభిమన్యు' అవుతుందని మాత్రం తెలిసింది అంతకు పూర్వం సాగర్ వాళ్లు హిందీలో ఆచిత్రం తీశారు ఆ చిత్రానికి 'మున్షీ', ఎవడో సంభాషణలు రాశాడు ఆ సంభాషణలు తెలుగుచేసి 'వీరాభిమన్యు' తెలుగు చిత్రం తయారు చేస్తామన్నారు

కాంట్రాక్టర్లయిన ఇద్దరు స్నేహితులూ, నేనూ నిత్యమూ వెల్‌కమ్ హోటలు నుంచి ట్రాము మీదపడి లామింగ్టన్ రోడ్డులో వున్న అంబాలాల్ పటేల్ ఇంటికి పొయ్యేవాళ్లం డా॥పటేల్ సందర్శనం మాకు సులభంగా లభించేది కాదు సబితాదేవి చిత్రాలను డైరెక్టు చేసే సర్వోత్తమ చాదామీ, హైదరాబాదు సెలెక్టు టాకీసుకు యజమాని అయిన వజ్రభాయి డి. అమీన్‌లు మాతో కబుర్లు చెబుతూ ఉండేవాళ్లు అప్పుడప్పుడు స్టూడియోకు తీసుకుపోతూ ఉండేవాళ్ళు

పూర్తిగా రెండు నెల్లు గడిస్తేగాని వ్యవహారాలు కదల్లేదు అమీన్ చిత్రం డైరెక్టు చెయ్యటం రూఢి అయింది ఆయనా, నేను కూర్చుని 'వీరాభిమన్యు' హిందీ సంభాషణలు తెలుగు చేయటం మొదలు పెట్టాం

''ఈస్క్రిప్టు నీకెట్లా ఉంది? మేము ఈ సంభాషణలు చాలా గొప్పగా ఉన్నట్టు భావిస్తాం'' అన్నాడు నా కేమీ నచ్చలేదని చెప్పాను అమీను నాతో వాదించలేదు

నాస్నేహితులు ఉత్తర, అభిమన్యుల పాత్రలకు తెచ్చే మనుష్యులు తనకు నచ్చితే, మిగతా పాత్రలకు ఎవరిని తెచ్చినా తనకు పట్టింపులేదని డా॥పటేల్ అన్నాడు మా స్నేహితులు ఉత్తర పాత్రకు కాంచనమాలను నిర్ణయించారు అప్పటికి కాంచనమాల 'తులాభారం' చిత్రంలో అప్రధాన పాత్ర ధరించి, సినిమాలు తనకు గిట్టుబాటు కావని నిర్ణయించుకొని ఉన్నది

కంట్రాక్టు దారులైన ఇద్దరు కుర్రాళ్లలోనూ ఒకడైన జోగారావు బంధువులలో ఒకరు, గాలి వెంకయ్యకు స్నేహితుడు ఆ కారణంచేత గాలి వెంకయ్య, కాంచనమాల ఈచిత్రంలో నటించటానికి ఒప్పుకొన్నాడు కాని కాంచనమాలను డా॥ పటేలు ఆమోదించవలసి ఉన్నది కాంచనమాలను బొంబాయి రప్పించాం డా॥పటేల్ ఆమెను చూడనన్నాచూడలేదు టెస్టు తీయటానికి ఏర్పాటు చేయించాడు

టెస్టు తీసిన అనంతరమైనా పటేలు కాంచనమాలకేసి చూడలేదు ఈ టెస్టు ఇంపీరియల్ సినిమాలో వేసిచూచినప్పుడు అక్కడ బాయీ జద్దన్ బాయి ఉండటం తటస్థించింది ఆవిడ ఆరోజుల్లో చిత్రాలు తీస్తూ ఉండేది ఆవిడ కంచనమాల ముఖం తెరమీద చూడగానే చాలా

ముగ్గురాలైంది కాంచనమాలకి హిందీ వస్తే తన చిత్రాల్లో వేషం వేయించుకొంటాానన్నది కాంచనమాల తనకు నచ్చిందని డా॥పటేల్ మాతో అనలేదు మిగిలిన వాళ్లను తెచ్చే ఏర్పాటు చేయమన్నాడు అభిమన్యుడి పాత్ర ధరించటానికి పులిపాటి ఒప్పుకొన్నాడు మలబారు హిల్ మీద వాల్కేశ్వరు రోడ్డులో తీన్‌బత్తీ సమీపంలో మాకు చక్కని లాడ్జి దొరికింది

'వీరాభిమన్యు' చిత్రానికి గాను వచ్చిన వారిని చూసి తీరవలసింది దానికి పాటలు రాసినది కవికాదు మ్యూజిక్ డైరెక్షన్‌కు నియోగించబడిన వాడు మ్యూజిక్ డైరెక్టరు కాడు పాత్రధారులలో ఎక్కువ భాగం నటులు కారు కంట్రాక్టు పుచ్చుకొన్న వారిద్దరూ కృష్ణ, దుర్యోధన పాత్రలు ధరించి దాదాపు బాగా చేశారనిపించుకున్నారు!

సురభికమల సుభద్రవేషం వేయటం చిత్రానికి చాలా సాయపడింది కొన్ని పంతాలు వచ్చి, అమీన్ నాచేత కూడా ఒక వేషం వేయించాడు నాకు ఒక్క వాక్యమే ఉంది అది ఉచ్చరించేటప్పుడు, నేను సంభాషణలు రాసినవాణ్ణి హృదయపూర్వకంగా శపించాను! సంభాషణలన్నీ పచ్చి గ్రాంధికంగా రాయించారు

ఉత్తర గర్భాదానంనాటి సీనుతో షూటింగు ఆరంభమయింది మొట్టమొదటి షూటింగ్ నాడే కాంచనమాల తనకిచ్చిన డ్రెస్సు వేసుకోనన్నది ఎవరు చెప్పినా ఒప్పుకొనేటట్టు కనిపించలేదు ఆమెకోసం డ్రెస్సులో కొద్ది మార్పులు చేశారు కాని ఈ సీనులే కొంతకాలానికి మళ్లీ షూట్ చెయ్యవలసి వచ్చేటప్పటికి కాంచనమాల తాను మొదట వద్దన్న డ్రెస్సు వేసుకోవటానికి ఒప్పుకొంది ఈ డ్రెస్సులో ఆనాడు కాంచనమాల కనిపించినంత అందంగా తెలుగుతెర మీద అప్పటికీ ఇప్పటికీ ఎవరూ కనిపించలేదంటే అతిశయోక్తి కాదు

సాగర్ మూవీటోన్ స్టూడియోలో కాంచనమాల చాలా మంచి ఇంప్రెషన్ కలిగించింది ఆమె రిహార్సల్సు చూడటానికి మోతీలాలూ, సురేంద్రా అప్పుడప్పుడు వచ్చేవాళ్లు సెట్టుమీద ఆమె శరీరం వంచి కష్టపడి పనిచేసేది అందుచేత టెక్నీషియనులు ఆమె మీద చాలా అభిమానంగా ఉండేవాళ్లు మెహబూబు ఆమెకు హిందీ నేర్పి తన చిత్రాల్లో నటింపచేస్తానని అడిగాడు కాంచనమాల ఒప్పుకుంటే తెలుగు సినిమా చరిత్రలో ఒకతార లోపించేది

'వీరాభిమన్యు' ఇంకా పూర్తికాక పూర్వమే పటేలుకున్న పన్నెండణాల వాటాను నాలుగణాల వాటాగల చిమన్‌లాల్ దేశాయి కొనేశాడు చాలా చిక్కులతో చిత్రం ఏదో విధంగా పూర్తి అయింది 'వీరాభిమన్యు' కొద్దిచోట్ల తప్ప బాగా పోలేదు కాని, డా॥పటేలు ఆచిత్రానికి ఖర్చు చేసిన రొక్కం 28వేలని ఆయన వాళ్లే చెప్పారు! ఏం రోజులు!

*తెలుగు సినిమా, మాసపత్రిక, ఆగస్టు 1949*

# 37. కమల్ అమ్రోహి

12వ యేట రచయితగా, 19 యేట సంపాదకుడుగా, 20 యేట గ్రంధకర్తగా– క్లుప్తంగా చెప్పాలంటే ఈనాడు ఉన్నతస్థానాన్ని అధిష్టించిన యువదర్శకుడుగా కమల్ అమ్రోహిని పరిచయం చేయడం అవసరం 'పుకార్' చిత్ర రచనలో వెలుగులోకి వచ్చిన కమల్ అమ్రోహి ఈనాడు బాంబేటాకీస్ వారి 'మహల్' చిత్రానికి రచయితగా, దర్శకుడుగా మరింత వెలుగులోకి

వచ్చాడు.

వెండి తెరమీద ప్రత్యక్షమవ్వాలని అమ్‌రోహి తలుచుకుంటే ఈపాటికి అగ్రశ్రేణికిచెందిన నాయకుడు కాగలిగేవాడే దర్శకత్వం నిర్వహించడంచేత నాయకునిగా నటించ టానికి అట్టే శ్రమపడవసరంలేని మాట నిజం కండ్లకు మిరుమిట్లు గొల్పే అతని ముగ్ధ సౌందర్యం, వీనులకింపుగావుండే అతని కంఠస్వరం, నటులకుండవలసిన సర్వ హంగులూ అతనికివున్నా తెరవెనుకనే వుండిపోవడం గమనించవలసిన విషయం అందుచేతనే అమ్‌రోహి చిత్రానికి మూలస్థంభాలైన రచనలు, సంభాషణలు మొదలైనవాటితో ఎల్లప్పుడూ కుస్తీ పడుతుంటాడు అమ్‌రోహిని సినీ రచయితగా ప్రధమంగా ప్రపంచానికి పరిచయం చేసిన చిత్రం మినర్వామూవిటోన్ వారి 'జైలర్' సాంఘికచిత్ర రంగంలో ఉత్కృష్ట స్థానాన్ని సంపాదించిన ఆ చిత్రంలో అమ్‌రోహి పరిపూర్ణోత్సాహితుడయ్యాడు తరువాత సొరాబ్‌మోడీ తయారుచేసిన అసమాన చారిత్రాత్మక చిత్రమైన 'పుకార్' తో అతని కలం పదునెక్కింది కళావిశిష్టత దృష్ట్యా ఉత్తమ చిత్రంగా పొగడబడుతున్న 'మహల్' చిత్రానికి రచయిత, దర్శకుడు అయిన అమ్‌రోహి తన ప్రధమ దర్శకత్వంలోనే ప్రతిభావిశేషాలను ప్రదర్శించాడంటే అందుకు కారణం అతను చిత్రపరిశ్రమలో 'జైలర్' నుండి నేటివరకు చేస్తున్న అవిరామ కృషేనని చెప్పాలి నూతన పంధాలో నడచిన మహల్ చిత్రం ఎవరికీ అర్థం కాదంటే అందులోనే ప్రత్యేక విశిష్టతవుందంటాడు మిస్టర్ అమ్‌రోహి బాంబేటాకీస్‌లో రచయితగా, దర్శకుడుగా కాంట్రాక్టు వ్రాసుకునేవరకు అతను కెమెరా ముఖం తొంగి చూసి యెరుగడు అయినప్పటికి చిరకాలానుభవం గలవాని వలె 1948వ సంవత్సరం నవంబరు నెలలో తన ప్రధమ చిత్రాన్ని సెట్స్‌మీదకి తీసుకువెళ్లాడు 1949వ సంవత్సరం ఆగస్టు మాసంలో పూర్తిగాబడ్డ చిత్రం (మహల్) సెప్టెంబరులో సెన్సారై దేశమంతా విడుదలైంది

బాంబేటాకీస్ వారికి అధిక లాభాన్ని చేకూర్చిన 'మహల్' చిత్రం 5,6500లకు నిర్మించబడి పది లక్షల రూపాయలకు అమ్మబడింది మధుబాలను తారాపధానికి తెచ్చిన ఈ చిత్రం విడుదలైన ప్రతిచోటా విజయఢంకా మ్రోగించింది చిత్రపరిశ్రమలో ఈనాడు మధుబాలకు డిమాండ్ హెచ్చిందంటే అదంతా 'మహల్' మహత్యమే

పంజాబ్‌లోని అమ్‌రోహి జమీందారు కుటుంబానికి చెందిన ఈయన 1946లో మతకలహాల మారణహోమానికి తీవ్రంగా గురైనాడు చిత్రపరిశ్రమంతా ఊపివేసిన ఆ మతకలహాల రోజుల్లో అమ్‌రోహి కొండకొనల్లో ఏకాంతంగా సంచరిస్తుండేవాడు ఆ పర్యటనల కాలంలోనే 'మహల్' గాధను అత్యంత రమణీయంగా వెలువరించాడు

6వ యేట బడిలో ప్రవేశించిన అమ్‌రోహి 16వ సంవత్సరానికి పర్షియా అరబిక్, ఉర్దూ భాషలలో ప్రావీణ్యత సంపాదించాడు ఉర్దూ సాహిత్యంలో ఇతనికి గాఢమైన పరిచయంవుంది పర్షియన్ ఆనర్స్ ఉత్తీర్ణుడైన తరువాత లాహోర్‌లో ప్రచురించే ఉర్దూ దినపత్రిక 'మిలాప్' సంపాదక వర్గంలో చేరాడు అంతటితో ఆగక 'అలంగీర్' అనే మాసపత్రికకు కొన్నాళ్లు సంపాదకత్వం నిర్వహించాడు పిదప పర్షియన్, ఉర్దూ సాహిత్యంలో పంజాబ్ టెక్స్టుబుక్ కమిటీ మెంబరుగా చాలకాలం పనిచేశాడు

అమ్‌రోహి వ్రాసిన ప్రధమ గ్రంధం 'పరదేశి' ఆ పుస్తకాన్ని బెంగాలీ భాషలో తర్జుమా

చేయబడిన తరువాత మదన్ పిక్చర్స్‌వారు(కలకత్తా) రూ 1000లతో ఆ గ్రంథపు సర్వహక్కులూ కొనడానికీ, అతనిని శాశ్వత జీతపు పద్ధతిపై తెరవెనుక కథలు వ్రాయటానికి నియమించాలని విశ్వ ప్రయత్నాలు చేశారు కాని అతని 'పరదేశి' ఎప్పటికీ చిత్రరూపంలో బయటపడలేదు యువకరక్తంతో ఉరకలు పెడుతున్న అమ్‌రోహి కవిత్వాన్ని గ్రహించిన హిచ్ యం వి గ్రామఫోన్ కంపెనీ మేనేజర్ అభ్యర్ధనపై రికార్డులకు పాటలు వ్రాయటం మొదలు పెట్టాడు మీరాబాయ్ భజన గీతాలతోసహా 150 పాటలు వ్రాసిన తరువాత కలకత్తాలోని హెచ్ యం వి గ్రామఫోన్ కంపెనీకి ఒక సలాం కొట్టి 1938లో బొంబాయి చేరుకున్నాడు

అమ్‌రోహిని చిత్రసీమలోకి తెచ్చినవాడు హిమాంసురాయ్ ఈ నాటికీ బ్రహ్మాండమైన చారిత్రాత్మక చిత్రంగా పరిగణింపబడుతున్న 'పుకార్' తో చిత్ర రచయితగా స్థానాన్ని కల్పించినవాడు సొరాబ్‌మోడీ తరువాత యితని రచనా విశేషాలు కర్దార్ తీసిన 'షాజహాన్' తో బయటపడ్డాయి నిన్న మొన్నటిదాక కోర్టు తగాదాలతో విడుదలకాని 'బైరంఖాన్' చిత్రానికి యితని వాడికలం పదును పెట్టింది అమ్‌రోహి, కథ, సంభాషణలు వ్రాసిన 'మొగల్ – యి – అజామ్' చిత్రం యింకాపూర్తికాలేదు మధుబాల, అశోక్‌కుమార్‌లతో 'మెహబూబా' అనే చిత్రాన్ని తన సొంత ప్రొడక్షన్ క్రింద తీయడానికి ప్రస్తుతం ఈయన సర్వసన్నాహాలు పూర్తి చేసుకుంటున్నాడు భారత సినీ రంగంలో సంచలనం కలిగించడానికి ఈ చిత్రాన్ని బొంబాయి, పారిస్, లండన్, జ్యూరిచ్, మిలాన్ మొదలైన నగరాలలో షూటింగ్ జరపడానికి త్వరలోనే యూరప్ ప్రయాణం కానున్నాడు

అమ్‌రోహి వ్రాసిన చిత్రాలు పొందిన విజయాన్ని బట్టి ఈనాడు చిత్రపరిశ్రమలో అతనికున్న విలువను యిట్టే గుర్తించవచ్చు చిత్రసీమలో దూకబోయే యువ రచయితలకు కమల్ అమ్‌రోహి పొందిన అనుభవాలు నెమరవేసుకోవడం అవసరం

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 25 10 50*

# 38. సినిమా చిత్రాల విభజనకు అర్థం లేదు

దక్షిణదేశంలో తయారయే చిత్రాలను గురించి, అందులోనూ, తెలుగు చిత్రాలగురించి, ఇవి పౌరాణిక చిత్రాలు, ఇవి సాంఘిక చిత్రాలు, ఇవి జానపదచిత్రాలు, ఇవి చారిత్రక చిత్రాలు అనుకోవటం కొంతవరకు హాస్యాస్పదంగా కనిపిస్తుంది

మనకిప్పుడు వాడుకలో ఉండే విభజన కేవలం ఇతివృత్తానికి చెందినది ఇంకా అనేక విధాలుగా చిత్రాలను విభజించవచ్చు చిత్రాలమీద ఖర్చు చేసే డబ్బునుబట్టి, ఆర్డినరీ, సూపర్, సూపర్ – చిత్రాలని విభజన చేయవచ్చు కథా శిల్పాన్ని బట్టి డ్రామా, మ్యూజికల్, కామెడీ, ఫార్స్ అని విభజించవచ్చు సెట్టింగులూ, దుస్తులూ వగైరాలను బట్టి, పీరియడ్ కాస్ట్యూమ్స్ చిత్రాలని విభజించవచ్చు సెల్యులాయిడ్‌ను బట్టి కలర్, బ్లాక్ అండ్ వైట్ అనవచ్చు

ఏవిధమైన విభజనచేసినా ఆ విభజనకు సార్థకత అంటూ ఉండాలి ప్రస్తుతం వాడుకలో ఉన్న విభజనలో ఆ సార్థకతే లోపిస్తున్నది

భారతదేశంలో సినిమాలు, మూకీలు–పౌరాణిక చిత్రాలుగానే ప్రారంభమైనాయి కాని

అప్పటికి వాటికి పౌరాణిక చిత్రాలన్న నామధేయం లేదు వాటితోబాటే కొన్ని స్టంటు చిత్రాలు కూడా వచ్చాయి ''అనార్కలీ'' మొదలైన చారిత్రిక చిత్రాలు కూడా వచ్చాయి అప్పట్లో సోషల్ చిత్రాలంటే అది అంతోఇంతో స్టంటుతో కూడుకుని ఉండేది అందులో రాజులూ, మంత్రులూ, గజదొంగలూ, కథనాయికలను విలన్ నుంచి రక్షించే కథానాయకులూ, గుర్రాలు పరిగెత్తటాలూ, కత్తిపోట్లాటలూను సోషల్ చిత్రాల్లో ఉండేవి వీటికే ఈనాడు మనం జానపద చిత్రాలన్న మాట ఉపయోగిస్తున్నాం మూకీల యుగంలో ఏ తరగతి చిత్రానికి డబ్బు హెచ్చు వస్తుందన్న సమస్యే ఉండేది కాదు ఆ చిత్రాలలో ''వినేది'' లేదుకనక ''చూసేది'' ఏమన్నా ఉందా అన్న సమస్య ఒక్కటే ప్రేక్షకులకుండేది కథకు- కనీసం సంఘటనలకు పూర్తి విలువ ఉండేది

ఇవాళ మనం చిత్రాలను పౌరాణికాలనీ, సాంఘికాలనీ, జానపదాలనీ అనుకుంటున్నాం పౌరాణికాల యుగం అయిపోయిందనే చెప్పవచ్చు ఇవాళ మనం వెనక్కు తిరిగి చూసుకుంటే మన పౌరాణిక చిత్రాలలో నిజమైన పౌరాణిక చిత్రం అనదగినది ఒక్కటైనా ఉందా ? కథలు పౌరాణిక కథలన్నది మినహాయిస్తే చిత్రాలలో పౌరాణిక చిత్రాలు తియ్యటంలో పెద్ద చిక్కు, ఆయా పురాణ పురుషుల పాత్రలు ధరించడానికి సరిఅయిన పాత్రధారులను తేవడం రాముడు, కృష్ణుడు, మహావిష్ణువు, ఇంద్రుడు, విశ్వామిత్రుడు, సీత, రుక్మిణి, సత్యభామ, సావిత్రి – ఇటువంటి పాత్రలకు ఎటువంటి ముఖాలు, ఆకారాలూ నియోగించబడ్డాయో మనలో చాలామందికింకా జ్ఞాపకం ఉన్నది వేషధారణలో కూడా పురాణయుగమన్న భ్రమ కలిగించటానికి చిత్రనిర్మాతలు ఎట్టి ప్రయత్నమూ చేయలేదు ముఖ్యంగా స్త్రీపాత్రలు సాంఘిక చిత్రాలకు ధరించే వేషాలే ధరించారు చిన్నచిన్న కిరీటాలు మినహాగా అనేక చిత్రాలలో పాత్రలవయసుకూడా పాటించబడలేదు

సెట్టింగుల విషయంలో పురాణ చిత్రాలలో ప్రత్యేకత చూపబడలేదు అంతకు పూర్వం ''సోషల్'' చిత్రాలలో కనిపించిన రాజ దర్బారువంటివే జనకుడు మొదలైన పురాణరాజుల దర్బార్లుగా చూపబడ్డాయి

పురాణచిత్రాల యుగం 1937,38 ప్రాంతాల వెనకబడి సాంఘికచిత్రాల యుగం వచ్చింది ఇది సాంఘికచిత్రాల యుగం కావటానికి ప్రధానకారణం ఆర్థిక కాటకం ఇదే చౌకచిత్రాలయుగం కూడానూ పెద్ద పెద్ద డ్రెస్సులతోనూ, సెట్టింగులతోనూ, పనిలేకుండా, ప్రజాదరణ సంపాదించటానికి సాంఘిక సమస్యలు అడ్డంపెట్టుకుని, ఆర్థిక కాటకం ప్రజలలో తెచ్చిపెట్టిన సాంఘికచైతన్యాన్ని ధనార్జనకు వినియోగపరుచుకుంటూ చిత్ర నిర్మాతలు సాంఘిక చిత్రాలు తీశారు వీటిలో కొంత అట్టహాసం ఉన్నా నిజమైన సాంఘిక వాస్తవికత లేదు మాలపిల్లగా చూపబడ్డ పాత్ర మాలపిల్ల కాదు రైతుగా చూపబడ్డవాడు రైతూ కాడు కాని ప్రేక్షకుల ఖరీదైన డాన్సులు గాని, దుస్తులుగాని, సెట్టింగులుగాని అడగకుండా చిత్రం చూసి ఆనందించటానికి సాంఘిక సమస్యలన్నవి తోడ్పడ్డాయి

ఆర్థిక కారణాలవల్ల చిత్రనిర్మాణంలో సాంఘిక చిత్రాలయుగం ఏర్పడిందనుకున్నాం అంటే ఈ యుగంలో చిత్ర నిర్మాణం ఖర్చు పూర్వంకన్న తగ్గిందని కాదు అది క్రమంగా – తారల వేతనాలతో బాటు – పాముకాటులాగా హెచ్చుతూనేవచ్చింది కాని ఈ కాలంలో చిత్ర

నిర్మాణంలో కలిగే అభివృద్ధి యావత్తూ పౌరాణికచిత్రాలలో ప్రదర్శించవలసి వచ్చినట్లయితే అట్టి పౌరాణిక చిత్రం సాంఘిక చిత్రం కంటే చాలా హెచ్చు ఖరీదు అయి ఉండేది ''నలదమయంతి'' చిత్రం ఈ విధంగా అయిందికూడానూ, ఈసంగతి ఆ రోజుల్లో అందరు చిత్ర నిర్మాతలూ బహిరంగంగా ఒప్పుకున్నారు యుగధర్మం ప్రభావమేగాని చిత్ర విభజనకు మరొక ఆధారం నిజంగా లేదనటానికి మరొక ఉదాహరణ కూడా చూపవచ్చు ''నలదమయంతి'' చిత్రంతో బాటు దేశంలో విడుదల అయిన సి పుల్లయ్యగారి ''సత్య నారాయణవ్రతం'' అన్న చిత్రం, ఇతి వృత్తాన్ని బట్టి, పౌరాణిక చిత్రంకింద జమచేయవలసినా అది అచ్చు సాంఘిక చిత్రంగా తీయబడింది ఇంతకంటే కూడా మంచి నిదర్శనం దీని తరువాత తీయబడిన ''భస్మాసుర' ఇందులో భస్మాసురుడూ, శివుడూ, మోహినీ మొదలైన పాత్రలు ఎటూగాని వ్యావహారికం కూడా మాట్లాడారు దీని ఖర్చు సాంఘిక చిత్రానికి అయినంతే అయింది ఇతిహాసంకింద జమకట్టదగిన ''చింతామణి'' కథ సాంఘిక చిత్రంగా తీయబడటం కూడా ఆ యుగప్రభావమే పురాణచిత్రాల కాలంలో దాని నెవరూ తీయటానికి ప్రయత్నించలేదు ఇదే ''జయదేవ'' చిత్రానికీ వర్తిస్తుంది

సినిమా చిత్రనిర్మాణంలో– శిల్పంలో కలిగిన కొన్ని పరిణామాలు జానపద చిత్రాలనే వాటికి దారితీశాయి ప్లేబాక్ వచ్చాక పాటపాడగల తారల అవసరం తీరిపోయి అందమైన ముఖాలకు ప్రాముఖ్యం హెచ్చింది బ్రహ్మాండమైన సెట్టింగులూ, చక్కని ఛాయాచిత్రగ్రహణమూ, నిర్దుష్టమైన రికార్డింగూ, అంతులేని స్టూడియో సౌకర్యాలు ఏర్పడ్డాయి బ్రహ్మాండమైన సెట్టింగులకు అవకాశం దొరికింది రకరకాల దుస్తులను అతిచక్కగా ఫొటోగ్రాఫు చేయవచ్చు ఇన్ఫ్లేషన్ పెరిగిందేమో చిత్రాలఖర్చు పెంచే అవకాశం దొరికింది ఇంతడబ్బూ, ఇన్నిసదుపాయాలూ వృధా చేసి ఏ సాంఘిక సమస్యతోనో ప్రేక్షకుల నలరించవలసిన ఖర్మమేం ? జానపద చిత్రాలయుగం ప్రారంభమయింది ఇవే మన కాస్ట్యూమ్ చిత్రాలు, సంగీత చిత్రాలూ !

యుగప్రభావాన్ని దాటటం ఎట్లా సాధ్యమవుతుంది ? అందుచేతనే ఈ యుగంలో తీసిన ''పల్నాటి యుద్ధం'' అన్న చారిత్రక చిత్రమూ, ''ధర్మాంగద'' అన్న పౌరాణిక చిత్రమూ జానపదచిత్రాలలో జమఅయినాయి దీని ప్రభావం ఈనాడు తీసే సాంఘిక చిత్రాలపైనకూడా ఉండితీరుతుంది ''స్వర్గసీమ'' లోను, ''ద్రోహి'' లోనూ చూసిన సెట్టింగులూ, దుస్తులూ జ్ఞాపకం తెచ్చుకోండి అవి జానపద యుగం నాటివి – సాంఘికవాస్తవికత వాటిలో ఏమీ లేదు పర్యవసానమేమంటే ·

చిత్రనిర్మాతలు ఏచిత్రాలు తీయాలి? ఏ చిత్రాలు తీయటం మంచిది! ఏ చిత్రాలు తీస్తే ఎక్కువ గిట్టుబాటు అవుతుంది ? ఈ సమస్యలకు సరి అయిన సమాధానాలిచ్చే శక్తులు వేరే ఉన్నాయి ఆ శక్తులను ప్రతిఘటించి ఎవరూ జయించలేరు వాటిని అర్థం చేసుకొని వాటికి తల ఒగ్గినవారు ఇవాళ పౌరాణిక చిత్రం తీయవచ్చు, చారిత్రిక చిత్రంకూడా తీయవచ్చు కాని అంత మాత్రం చేత ఇది జానపదచిత్రాలయుగం కాదని రుజావుచేశామని మాత్రం ప్రగల్భాలు కొట్టరాదు ఇది జానపదచిత్రాల యుగం– అంటే, పాటల, డాన్సుల, యుగం!!

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 1 11 50*

# 39. పటేల్ శాంతారాంల దుమ్ములాట

ఇండియా నుంచి వెలువడే సినిమా పత్రికలలో మొట్టమొదటిదిగా భావించదగిన 'ఫిల్మిండియా' సంపాదకుడు బాబూరావ్ పటేల్ తన పత్రికయొక్క ఫిబ్రవరి సంచికలో సుప్రసిద్ధ చిత్ర నిర్మాతా, దర్శకుడూ, ఫిలిమ్ సలహా సంఘం సభ్యుడూ వగైరా అయిన వి శాంతారాంను తూర్పారబట్టాడు కారణం బాబూరావ్ పటేల్ 'బ్లాక్‌మెయిల్' చేశాడని శాంతారాం మరో సినిమా పత్రికలో బహిరంగంగా ప్రకటించాడు

అవతలి వాడి రహస్యం ఏదైనా బయటపెడతానని బెదిరించి వాడి దగ్గర డబ్బు గుంజటం 'బ్లాక్‌మెయిల్'

చిత్ర నిర్మాతలకూ, సినిమా పరిశ్రమకూ మధ్య ఎల్లప్పుడూ ప్రచ్ఛన్నంగా సాగే సంఘర్షణ శాంతారాం పటేల్‌ల విషయంలో ఒక నూతన పరిణామ దశను అందుకున్నది

బాబూరావ్ పటేల్ చిత్ర నిర్మాతలను 'బ్లాక్‌మెయిల్‌చేశాడా అన్నది అట్టే ముఖ్యవిషయం కాదు తాను 'బ్లాక్ మెయిల్' చేసినట్టు ఎవరన్నా రుజావు చేస్తే 10వేల రూపాయలు బహుమాన మిస్తానని అదివరకే బాబూరావ్ పటేల్ బహిరంగంగా ప్రకటించివున్నాడు, ఇప్పుడా మొత్తాన్ని 25వేలు చేశాడు బాబూరావ్ పటేల్ 'బ్లాక్‌మెయిల్' చేసినట్టు బహుశా ఎవరూ నిరూపించలేరు బాబూరావ్ పటేల్ ఉట్టి పుణ్యానికి 25వేలు పోగొట్టుకునేవాడు కాదు అదీకాక బాబూరావ్ పటేల్ చాలా పెద్దమనిషి అని 41 మంది చిత్ర నిర్మాతలు వగైరా అదివరకే రాసిచ్చారట

ఆఖరుకు శాంతారం కూడా ఈ 25వేలు సంపాదించుకునేట్టు కనపడదు శాంతారం ఆరోపణల్లో బాబూరావు మీద నాలుగురాళ్ళు వేద్దామనే ఆవేదనే తప్ప ఆత్మవిమర్శ ఏమీ ఉన్నట్టు కనపడదు శాంతారం మీద బాబురావు నల్లేరు మీద బండి నడిచినట్టు నడిచాడు

మనదేశంలో చిత్ర నిర్మాతలకూ సినిమా పత్రికలకూ గల సంఘర్షణే మనం ముఖ్యంగా గమనించదగినది బ్రహ్మని తిమ్మి, తిమ్మిని బ్రహ్మ చేసే శక్తి ప్రతి సినిమా పత్రికకూ – ఎంతో చచ్చుపత్రికకు కూడా – అంతో ఇంతో ఉంటుంది 'ఫిల్మిండియా' వంటి పత్రికకు ఈ శక్తి హెచ్చుగా ఉంటుంది బాబురావు 'బ్లాక్‌మెయిల్' చేసినట్టు ఎవరూ నిరూపించకపోయినప్పటికీ, అతన్ని మనస్ఫూర్తిగా ద్వేషించే చిత్ర నిర్మాతలు చాలామంది ఉన్నట్లయితే ఆశ్చర్యంలేదు 'ఫిల్మిండియా' చాలా మందికి లేని కీర్తిని తెచ్చింది ఉన్నకీర్తిని ధ్వంసం చేసింది దీనికి శాంతారామే ఉదాహరణ శాంతారాంకు 'చదువు సంస్కారమూ, వికాసమూ, విచక్షణా' లేవని ఇప్పుడు మనకు తెలియజెప్పే ఈ 'ఫిల్మిండియా' చాలా మందికి లేని కీర్తిని తెచ్చింది ఉన్న కీర్తిని ధ్వంసం చేసింది దీనికి శాంతారామే ఉదాహరణ శాంతారాంకు 'చదువు' సంస్కారమూ, వికాసమూ, విచక్షణా' లేవని ఇప్పుడు మనకు తెలియజెప్పే ఈ 'ఫిల్మిండియా' పత్రికే 1935లో ప్రారంభమైన నాటి నుండీ శాంతారం 'ప్రభాత్' లో ఉన్నంతకాలమూ ఆకాశానికెత్తేసింది అటు తర్వాత క్రమంగా ఈ పత్రిక శాంతారాంను విమర్శించటం, వెటకారం చెయ్యటం, 'బయట పెట్టడం' మొదలైనవి చేస్తూ వస్తున్నది

సినిమా పత్రికలు ఎవరినీ 'బ్లాక్ మెయిల్' చెయ్యనక్కరలేదు ఎవరి రహస్యాలూ

తెలుసుకోనక్కర్లేదు సినిమా పత్రికా సంపాదకుడు విమర్శించటంలోనూ, ప్రచారంలోనూ నేర్పరిఅయి పరితలను ఆకర్షించగలిగితే ప్రకటలద్వారా 'సక్రమంగానే' బోలెడంత ఆర్జించుకుంటూ, పైపెచ్చు సినిమా రంగంలో నాలుగురాళ్ళు సంపాదించుకునే వ్యక్తులపై అదృశ్యంగా కొరడా ఝుళిపించవచ్చు సినిమా చిత్ర నిర్మాణం ఎంత సక్రమ వ్యాపారమో, సినిమా పత్రికలు నడపటం కూడా అంత సక్రమవ్యాపారమే ప్రపంచాన్నీ, ప్రజలనీ ఉద్ధరించే పరమాశయం సినిమా చిత్రాల కెంత ఉన్నదో, సినిమా పత్రికలకూ అంతే వుంటుంది కాకపోతే సినిమా పరిశ్రమలో గల అంతులేని లాభాలు ప్రజలకుగల 'భ్రమ' ల మీద పూర్తిగా ఆధారపడి ఉంటున్నది ఈ 'భ్రమ' లను పెంపొందించటానికి తెలివైన ప్రచారం ఎంతబాగా ఉపయోగపడుతోందో, కటువైన విమర్శ అంత బాగా ఆ 'భ్రమ' లను తొలగించగలదు అందుచేత, కడవంత గుమ్మడికాయా కత్తిపీటకు లోకువైనట్టు, ఇంత పెద్ద సినిమా పరిశ్రమ బతుకూ సినిమా పత్రికలను నడిపేవారి చేతిలో ఉన్నది

సినిమా చిత్రాలు నిజంగా ప్రజలను ఉత్తేజపరచటానికే తీయటం జరిగితే, అవి మన సాంఘిక చరిత్రలో ఒక విశిష్టస్థానం ఆక్రమించటానికి కృషి జరిగితే, ప్రజలే వాటికి నిజమైన విమర్శకులనే పరిస్థితి ఏర్పడితే సినిమా పత్రికలు ఈ 'కత్తిపీట' ధర్మం నెరవేర్చలేకపోను

కాని మనపరిశ్రమలో అటువంటి వాంఛనీయ పరిస్థితులు లేవు ప్రస్తుతం మన చిత్రనిర్మాతలూ, నటులూ కేవలం సంస్కార శూన్యులు కావటమో, సంస్కార మాన్యులవలె నటిస్తూ, చిత్రాలు తీయటమో జరుగుతున్నది సినిమా చిత్ర నిర్మాణానికి మార్గదర్శకంగా ఉండి ఒరవడి దిద్దుతున్నది ప్రజలలో గల క్షుద్రాతి క్షుద్రమైన అభిరుచులు కాస్త సంస్కారంగల నిర్మాతలూ, నటులూ పొరపాటున ఈ పరిశ్రమలోకి అడుగుపెడితే వారు అడుగడుగునా తమ సంస్కారంతో సంఘర్షణ పడుతున్నారు గాని ఈ సంస్కారాన్ని ఊతగా మాత్రం తీసుకోవటం లేదు ఎక్కడన్నా ఒకరు దారితప్పి సంస్కారాన్ని నమ్ముతూ వుంటే వారు త్వరలోనే అడుగుకి దిగిపోతున్నారు బలీయమైన సాంఘిక నియమం ఒకటి ఈ పరిస్థితులకు ఆధారభూతంగా ఉన్నది ఈ నియమాన్ని ధ్వంసం చెయ్యగల ప్రయత్నం ఎక్కడా కనబడదు

ఇటువంటి పరిస్థితిలో సినిమా పత్రికలు రబ్బరు బెలూనుల వంటి తారలకు గాలికొట్టి ఆకర్షవంతం చెయ్యటానికీ, వాటికి చిల్లిపొడిచి వికృతంగా చెయ్యటానికీ, స్వయంగా చిత్రాలను గురించి మంచి చెడ్డలు తెలుసుకోలేని అసంఖ్యాకులైన సినిమా ప్రేక్షకులకు అభిరుచులూ, అభిప్రాయాలూ అందించటానికీ మాత్రమే పనికి వస్తున్నాయి ( ఒక్క ఉదాహరణ చాలు, 'ఫిల్మిండియా' పత్రిక ఖరీదు మూడు రూపాయలు అందులో నాలుగైదు చిత్రాలను గురించి విమర్శ వుంటుంది ఈ డబ్బు ఖర్చు పెట్టి ఎవరైనా ఆ చిత్రాలను చూసి తమ స్వంత అభిప్రాయాలు ఏర్పరచుకోవచ్చు కాని 'ఫిల్మిండియా' లో వెలువడే విమర్శలను బట్టి చిత్రాలు చూసేవాళ్లు దేశంలో అనేక వేల మంది ఉన్నారు!)

సినిమా పత్రికలు అచ్చుగా సినిమా కళాభివృద్ధికోసమే కృషిచేస్తాయనీ, నటులను గురించీ, చిత్రాలను గురించీ పచ్చి సత్యమే రాస్తాయనీ, సినిమా పత్రికలు కొనేవారు భ్రమపడరు ఏ సినిమా పత్రిక అయినా కొన్ని నెలలపాటు విడవకుండా చదివినట్టయితే ఆ పత్రిక కొన్ని నెలలపాటు కొందరు కొందర్ని అభిమానించటం, ఆదరించడం, ఆకాశానికెత్తటం కనిపిస్తుంది

మామూలు పరితలు దీనికి అభ్యంతరం చెప్పరు తెరమీద సినిమా కెమెరా ఎవరిని క్లోజప్‌లో చూపితే ప్రేక్షకులు వారినే చూస్తారు సినిమా పత్రికాధిపతులూ అంతే ఎవరిని గురించి ప్రచారం తమ బుర్రల్లో కెక్కితే వారికి అగ్రస్థానం ఇస్తారు సినిమా పత్రికల ఈ అలవాటు గురించి కోపతాపాలెవరికంటే ఆ పత్రికచేత తాత్కాలికంగా దూరంగా ఉంచబడినవారికి

'ఫిల్మిండియా' వంటి పదునైన పత్రికలో కూడా ఇదే కనిపిస్తుంది ఈపత్రిక విడవకుండా చదివేవారి అభిమానాలు ఒక్కొక్క కాలమందు కొందరు తారలపైనా, చిత్రాలపైనా కేంద్రీకరించబడి వుంటాయి అదే సమయంలో వారికి మరికొందరు తారలమీదా, చిత్ర నిర్మాతల మీదా, చిత్రాల మీదా ఏవగింపు కూడా పెరుగుతూ వుంటుంది

సినిమా పత్రికలకు గల ఈ అద్భుతశక్తిని నిందించాలంటే ముందుగా సినిమా పరిశ్రమను నిందించాలి సినిమా పరిశ్రమ ప్రజలను బాగుపరచటానికి కాక, మభ్యపరచటానికి సాగుతున్నది అందుకనే సినిమా పత్రికల కింత శక్తి అందుకనే సినిమా పత్రికలను మనస్ఫూర్తిగా ద్వేషించే నిర్మాతలే వాటి ఆదరం కోసం పోటీ చేస్తారు వీళ్ళు గత్యంతరం లేని పరిస్థితులలో ఒకటి రెండు ప్రబలమై పత్రికలకు అడుగులకు మడుగులొత్తుతున్న సమయంలో ఆ పత్రికలను తిడుతూ కొత్త పత్రిక ఏదైనా వెలిసినట్టయితే చిత్ర నిర్మాతలు కొందరు గబగబా వెళ్ళి దాన్ని ఆశ్రయించటం కూడా జరుగుతుంది ఆ పత్రికది పైచేయి అయిందా దాని బారి నుండి తప్పించుకోవటానికి బహుశా మరో పత్రిక కోసం ఎదురు చూస్తారు అది పైకి రాలేకపోతుందా, మళ్ళీ వెనకటి పత్రిక దగ్గరికే మొహాలు వేలవేసుకు పోతారు గడిచిన 15, 16 ఏళ్ళ కాలంలో బొంబాయి సినిమా ప్రొడ్యూసర్లు 'ఫిల్మిండియా' మీద పోటీగా వచ్చిన ఎన్నో పత్రికలపై అభిమానం చూపయత్నించిన సంగతి అందరూ ఎరిగినదే కాని ఏ పత్రికా 'ఫిల్మిండియా'ను దిగలాగలేదు సినిమా పత్రికలకూ సినిమా చిత్ర నిర్మాతలకూ మధ్య నిత్యమూగోప్యంగా జరిగే గింజు లాట శాంతారాం బాబూరావుల మధ్య దుమ్ములాటగా పరిణమించింది ఇందులో శాంతారం చాలా నష్టపడవచ్చు శాంతారం విద్యాసంస్కారాలతోగాక, అనుభవంతో పైకి వచ్చినవాడు చిత్ర నిర్మాతగా అతడు గడించిన గొప్ప పేరుకు తగినంత సరుకు అతనిలోగాని అతని చిత్రాలలో గాని ఎన్నడూలేదు ప్రచారమూ, పత్రికలూ అతన్ని పైకి నెట్టాయి భావాలంటే ఏమిటో, ఉన్నత భావాలంటే ఏమిటో తెలియని అమాయక ప్రజలకు అతనిచిత్రాలలో మహోన్నత భావాలు కనిపించాయి అతను కష్టించి ఆర్జించిన శిల్పసౌష్టవం వారికి కళాసృష్టిగా గోచరించింది పత్రికల ద్వారాను, ప్రచారం ద్వారానూ తెచ్చుకున్న కీర్తిని వాటిద్వారానే పోగొట్టుకోవటం అసాధ్యం కాదు

అనామకులను సినిమా ఆకాశానికెత్తటం ఈదేశంలోనేకాక అమెరికా వంటి దేశాలలో కూడా ఉన్నదే హాలీవుడ్ చిత్ర నిర్మాతల మట్టి బుర్రలనూ, నిశరతనూ వేళాకోళం చేస్తూ ఎన్నో నాటకాలూ, కథలూ, అంతులేని ట్రిమీలూ ప్రకటితమైనాయి ప్రస్తుతం మనదేశంలో ఉన్నటువంటి చిత్రనిర్మాణంలో — అనగా చిత్ర వ్యాపారంలో—మేధావులకు ఎటువంటి స్థానమూ ఉండదనుకోనవసం లేదు ఒకప్పుడు నాటకాలూ ఇట్లాగే ఉండేవి అయితే నాటక ప్రదర్శనం ఒక పెద్ద పరిశ్రమగా పరిణామం చెందని కారణంచేత అది ప్రజల అభిరుచులను అభివృద్ధిచేస్తూ తానుకూడా పైకి వచ్చింది నాటకాలలోకి పెద్ద కళా పిపాసువులూ, మేధావులూ

ప్రవేశించే అవకాశం కలిగింది సినిమా పరిశ్రమ పుడుతూనే పారిశ్రామికుల చేతిలోకీ, ధనికులైన పెట్టుబడిదారుల చేతిలోకీ పాకింది ఇతర వ్యాపార సరుకులలాగే చిత్ర నిర్మాతలూ, నటులూ, చిత్రాలు కూడా ప్రచారం ద్వారా గిరాకీ సంపాదించుకుంటున్నాయి ఈ ప్రచారం కోసమే సినిమా పత్రికలు పుట్టాయి ఇవి తమకు ఉపయోగించాలని ఆశించే చిత్ర నిర్మాతలు అవి తమకు అపకారం చెయ్యగలవని కూడా గుర్తించాలి లేదా, ఇటువంటి పరిస్థితుల నుంచి సినిమా పరిశ్రమను తప్పించి సినిమా చిత్రాలు కేవలం ప్రజలను మభ్యపెట్టేటందుకూ, వారి డబ్బు దోచేటందుకూ కాక, వారిలో సాంఘిక చైతన్యం పెంచేటందుకూ, వారికి ఉత్తేజం కలిగించే టందుకూ నిర్మాణ మయేటట్టుచూడాలి శాంతారం, బాబూరావుల తర్జన భర్జనలవల్ల బయటపడే కుళ్లు ఆయా వ్యక్తులకు చెందినది కానేకాదు సినిమా చిత్ర నిర్మాణంలో అంతర్భూతమై ఉన్నటువంటిదే

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 21-2-1951*

# 40. 'ఆక్షేపణ' కి సమాధానం

శ్రీ మోహనరాయ్‌గారు నా వ్యాసంలోని ఉద్దేశాన్ని సరిగా గ్రహించలేదు ప్రస్తుతం సినిమా చిత్ర నిర్మాణం జరిగే విధానాన్ని బట్టే సినిమా పత్రికలు చిత్ర నిర్మాతల మీద చాలా ప్రభావం కలిగి ఉన్నాయనీ, ''సినిమా చిత్రాలు నిజంగా ప్రజలను ఉత్తేజపరచటానికే నిర్మాణం జరిగితే, అవి మన సాంఘిక చరిత్రలో ఒక విశిష్టస్థానం ఆక్రమించటానికి కృషి జరిగితే, ప్రజలే వాటికి నిజమైన విమర్శకులనే పరిస్థితి ఏర్పడితే'' పత్రికలకీ ప్రభావం ఉండదని నా అభిప్రాయం సినిమా పత్రికాధిపతిగా పటేల్‌కున్న పలుకుబడిని గురించిగాని, చిత్రనిర్మాతగా శాంతారం సంపాదించుకున్న ఖ్యాతిని గురించిగాని నాకు ఆక్షేపణలేదు కాని పటేల్ విమర్శలను నేను మన్నించలేదు నాకా పెద్దమనిషిమీద ఎటువంటి ప్రత్యేకాభిమానమూలేదు శాంతారాం మీద ప్రత్యేకమైన అగౌరవమూ లేదు కాని శాంతారాం ఆర్జించుకున్న కీర్తికి ఆయన చిత్రాలే ఆధారమని నేను నమ్మను ఆయన చిత్రాలను గురించి నాకు గలభావాన్ని నేను రుజావు చేసుకోగలననుకుంటాను శ్రీ మోహనరాయ్‌గారికి ఆ చిత్రాలమీద గొప్ప అభిప్రాయం వుంటే నాకభ్యంతరమూ లేదు పటేల్ శాంతారాంల దుమ్ములాటకు వెనకవుండే చిత్ర నిర్మాణ పరిస్థితులు నాకు ప్రధానంగాని పటేల్ శాంతారాంల వ్యక్తిగత వివరాలూ, గొప్పతనాలూ కావు

'బ్లాక్‌మెయిల్' గురించి నేనిచ్చిన నిర్వచనం గురించి సందేహం ఉంటే శ్రీ మోహనరాయ్‌గారు లాయర్లను విచారించవచ్చు

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 7-3-1951*

# 41. ఫిలిం విచారణ సంఘం నివేదిక

ఎన్నో మాసాలపాటు ఎన్నో చోట్లకు వెళ్లి ఎంతో మందిని కలుసుకుని ఎన్నోసార్లు సమావేశాలు జరిపి ఫిలిం విచారణ సంఘం ప్రభుత్వానికి ఒక నివేదిక సమర్పించింది ఇది జరిగి చాలా వారాలయింది ఇంకా ఈ భామ వేషం తెర తొలగించుకుని ప్రేక్షకుల ఎదట పడలేదు ప్రభుత్వం ఈ నివేదికలోని సిఫార్సులను అమలు జరిపితే దేశీయ సినిమా పరిశ్రమలో గొప్ప

పరివర్తనా, విప్లవమూ కలుగుతుందని మాత్రం ఫిలిం విచారణ సంఘా ధ్యక్షుడు ఎస్ కె పాటిల్ పత్రికా విలేఖరులతో అని ఉన్నాడు

ఇప్పుడు తెర వెనుక నుంచి నివేదిక గురించి కొన్ని వివరాలు కొత్తవి తెలుస్తున్నాయి చట్టరీత్యా ఫిల్ము వ్యవహార మండలి ఒకటి ఏర్పరచాలని నివేదికలో సిఫార్సు జరిగిందట ఈ మండలి కర్తవ్యాలేవంటే చలన చిత్ర పరిశ్రమను క్రమబద్ధం చెయ్యటమూ, చిత్ర నిర్మాణ చిత్ర ప్రదర్శనలను గురించి కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు సలహాలివ్వటమూనూ, ఇందులో సినిమా పరిశ్రమలో పాల్గొనే వివిధ వర్గాలవారికి ప్రాతినిధ్యం ఉండాలన్నారు ఈ మండలి ప్రొడక్షన్ కోడ్ అమలు చేసే పనినీ, సెన్సారు బోర్డు పనినీ, తానే నిర్వహిస్తూ చిత్ర నిర్మాణం, చిత్ర ప్రదర్శనం, డిస్ట్రిబ్యూషన్ షిప్ మొదలైనవాటిని గురించి చూడడానికి వర్గాలను ఏర్పాటు చేయాలట

ఈ ఏర్పాట్లన్నీ ప్రభుత్వ ఖర్చును ఏ విధంగా వృద్ధి చేసేదీ ఊహించటం సులభమే గాని చిత్ర నిర్మాణాన్ని ఎట్లా క్రమబద్ధం చేసేదీ ఊహించటం సులభం కాదు కావాలంటే ప్రభుత్వం సినిమా పరిశ్రమకు తోడ్పడలేదని కాదు ప్రభుత్వం చిత్ర నిర్మాతలకు ధన సహాయం చేసి చిత్రాలు తీయించవచ్చు కాని గొప్ప చిత్ర నిర్మాత అయి ఉండి చిత్రాలు తీసే పెట్టుబడి లేకపోయిన నిర్మాతలు చాలా అరుదు బాగా లాభాలు గడించగల చిత్రాలు తీసేవారికి పెట్టుబడిదార్లలో చాలా పలుకుబడి ఉంటున్నది చిత్ర నిర్మాణానికి అవసరమైన పెట్టుబడి దేశంలో లేదనుకోవటానికికూడా ఆధారం లేదు నెలనెలా కొత్త చిత్రాలు తీసేవారు ముందుకు వస్తూనే ఉన్నారు తెలుగు దేశంలోనే ఏడాదికి అయిదారు చిత్రాలకు తక్కువ లేకుండా దివాలా తీస్తున్నాయి వీటి మీద ఏటా ఏ 20 లక్షలో దుర్వ్యయం అవుతూనే ఉన్నది, లాభాలు గడించేవారు మళ్లీ చిత్రాలు తీయటానికి కొత్త పెట్టుబడి అవసరం లేదుగాని ఈ 20 లక్షలూ ఏ ఏడాదికా ఏడాది కొత్త పెట్టుబడే అనుకోవాలి

గడచిన 20 ఏళ్లలో భారతీయ ఫిలిం పరిశ్రమ ఎటువంటి ప్రభుత్వ సహాయం అవసరం లేకుండానే పెద్ద పరిశ్రమగా అభివృద్ధి అయింది ఇంకా అభివృద్ధి అవుతున్నది ఒక వంక అభివృద్ధి చెందే పరిశ్రమను ఇంకా అభివృద్ధి చేయాలంటే ఈ పరిశ్రమకు గల అంతరాయాలేమున్నాయో వివరించి వాటిని ఈ మండలులూ, వర్గాలూ ఏవిధంగా నివారణ చేస్తాయో నిర్ణయించాలి లేని పక్షాన ప్రభుత్వ జోక్యం పాక్షిక విధానాలకు దారితీయవచ్చు సినిమా పరిశ్రమ ప్రస్తుతం మద్రాసు, బొంబాయి, కలకత్తా రాష్ట్రాలలో మాత్రమే కేంద్రీకరించుకుని ఉన్నదని, ఒక భాషలో తీసే చిత్రాల ప్రమాణాలు గాని మార్కెటు గాని మరొక భాషలో తీసేవాటికి ఉండదనీ గుర్తుంచుకోవాలి మద్రాసు రాష్ట్రంలో తయారయే తెలుగు తమిళ చిత్రాలకే ఈ వ్యత్యాసమున్నది తమిళ దేశంలో ఉన్న నగరాలు తెలుగు దేశంలో లేకపోవటం చేత ఒక మాదిరి తమిళ చిత్రాలు తమ సొమ్ము తాము తెచ్చుకుంటుంటే ఎంతో మంచి తెలుగు చిత్రాలు తప్ప ఆ పని చెయ్యలేకుండా ఉన్నాయి. అటువంటి పరిశ్రమపై కేంద్రానికి అంతులేని అధికారాలిచ్చి ప్రతి విషయంలోనూ పరిశ్రమకంతటికీ ఒకే ప్రమాణాలు నెలకొల్పటంవల్ల స్థానిక పరిశ్రమలకూ, నిర్మాతలకూ నష్టం ఉండవచ్చు

చిత్ర పరిశ్రమకు ప్రొడక్షన్‌కోడ్ ఉండాలన్నారు ఇది సబబైనదే అమెరికా చిత్ర నిర్మాణంలో ఈ విధమైన కోడ్ చాలా ఉపయుక్తమైన పాత్ర నిర్వహించి ఉన్నది ప్రొడక్షన్ కోడ్ ఉండి ఫిలిం సెన్సారింగు ఉన్నప్పుడు స్క్రిప్టులను ముందుగా తనిఖీకి పెట్టవలసిన అగత్యం ఏమిటో తెలియదు ముందుగా స్క్రిప్టులు సమర్పించటంలో చాలా చిక్కులుండవచ్చు, చాలామంది నిర్మాతలు స్క్రిప్టును మార్చుకుంటూపోతారు కొందరు తమ స్క్రిప్టులు బయటపెట్టటానికి ఒప్పుకోరు, వారి భయాలకు ఆధారాలు లేకపోలేదు కూడాను

అన్నిటికన్న గమనించదగిన సిఫార్సు ఫిల్ముల పొడవుపై నిర్బంధం అవసరం లేదన్నది ఈ నిర్ణయాని సమపిస్తూ విచారణ సంఘంవారు చెప్పిన కారణాలన్నీ కిందటేడు జెమినీ అధిపతి వాసన్‌చెప్పినదే, ఆయన వాదనలకు విచారణ సంఘంవారు పూర్తిగా ఆమోదించడం ఆశ్చర్యకరం, ఎందుకంటే వాటిలో కొన్ని కేవలం ఊహాజనితాలు ఈ కిందివి అటువంటివి ''చిత్రాలు పొడవు పరిమితం చెయ్యడంవల్ల వాటి నాణ్యత పెరగదు, ఖర్చులు తరగవు, ముడిఫిలిం వాడకంలో తరుగుదల ఉండదు''

ఇవి మూడూ అబద్ధాలే, మనం ప్రతి ఏడూ ఎన్ని చిత్రాలు చూసి అందులో కొన్ని భాగాలు కత్తిరించి వేస్తే కథలో కాస్త వడి కలిగి అంతగా విసుగెత్తేది కాదనుకోలేదు చిత్రాలు దీర్ఘంగా ఉండాలన్నదానికి ఇతర ఆధారాలుంటే ఉండవచ్చు గాని ఇప్పుడు పొడవుగా ఉన్న చిత్రాలలో నుంచి కొన్ని భాగాలు తీసేస్తే అవి బాగుపడవనుకోవటం కేవలమూ అసత్యం హిందీ చిత్రాలమాట ఏమైనా దక్షణాది చిత్రాలను గురించి ఈ ముక్క ఎవరూ నమ్మరు

చిత్రానికయే ఖర్చులకూ చిత్రం పొడవుకూ సంబంధంలేదని వాసన్‌గారి వాదం, పదహారువేల అడుగుల చిత్రానికి ఒకరు వాడిన ఫిలింకన్నా మరొకరు 20 వేల అడుగుల చిత్రానికి తక్కువ ముడిఫిలిం వాడవచ్చు, మొదటి ఫిలిం 100 కాల్‌షీట్స్‌తో పూర్తి అయితే రెండవది 80 కాల్‌షీట్స్‌తో పూర్తికావచ్చు ఇది ఎవరూ కాదనరు, కాని ఒకే కథతో ఒకే ప్రొడ్యూసరు 16 వేల అడుగుల చిత్రానికి అంచనాలు వెయ్యటంలోనూ 20 వేల అడుగుల చిత్రానికి అంచనాలు వెయ్యటంలోనూ తేడా ఉండదంటే ఎవరు నమ్మగలరు ! చిత్ర నిర్మాతలు తాము షూట్ చేసే నెగెటివ్ ఎడిట్ చేసిన తరువాత ఎంత అయేదీ బొత్తిగా అంచనా కట్టలేకపోతే వాళ్లు పరమ అసమర్థులనుకోవాలి, ఒకవేళ నెగెటివ్‌లోగాని సౌండ్‌లో గాని, కాల్‌షీట్స్‌లోగాని ఆదా లేదని అనుకున్నా, పాజిటివ్‌లో బోలెడంత ఆదా ఉండటం స్పష్టం దక్షిణ దేశంలో ఒక్కొక్క చిత్రానికి 15 నుంచి 20 కాపీలవరకూ తీస్తున్నారు ఎక్కువ చిత్రాలు 17, 18 వేల మధ్య పొడవు ఉంటున్నాయి మాటవరసకు ఈ పొడవు 14-15 వేల మధ్య ఉండాలని నిర్బంధం ఉన్నట్టయితే పాజిటివ్ ఒకొక్క చిత్రంమీదా దాదాపు అర లక్ష అడుగులు ఆదా అవుతున్నది, ప్రింటింగు ఖర్చులూ, టిన్నుల రవాణా ఖర్చులూ కూడా అంతవరకు ఆదా అవుతాయి దక్షిణ దేశంలో ఏటా 40 చిత్రాలు తీస్తున్నారనుకుంటే దాదాపు 20 లక్షల అడుగుల పాజిటివ్ ఆదా చెయ్యవచ్చునన్నమాట దేశమంతటా చిత్రాలపొడవు పరిమితం చేసినప్పటికీ చిత్రాలకయే ఖర్చు తగ్గదని ఫిలిం విచారణసంఘం నమ్మటం అతి విచిత్ర

మరొకవాదం - ఇదీ వాసన్ గారిదే - చిత్రాలపొడవు పరిమితం చెయ్యటంచేత కళాకారుడికి - అంటే చిత్ర నిర్మాణ వ్యాపారం చేసే నిర్మాతలకు - సృష్టిస్వాతంత్ర్యం పోతుంది

। మన చిత్రనిర్మాతలు కళాదృష్టితోనే చిత్రాలు తీస్తున్నారన్న విపరీతవాదాన్ని ఆమోదించినా ఆ కళాదృష్టి ఫలితంగా పొరపాటున అయినా 10 వేల అడుగుల చిత్రాలూ, 30 వేల అడుగుల చిత్రాలూ, ఎందుకు రావో ఎవరూ చెప్పటంలేదు పైపెచ్చు కొందరు చిత్రనిర్మాతలు – ముందుగా అంచనావేసుకునే శక్తి చాలని వాళ్లు – తాము తీసిన చిత్రం పొడవు చాలక కొత్త సన్నివేశాలు తయారుచేసుకుని షూట్ చెయ్యటమూ, తీసిన చిత్రం ఏ 22, 23 వేలకో పెరిగి చిత్రంలో ఉండాలని కళాదృష్టితోనే అందాం– నిర్ణయించిన సన్నివేశాలను కత్తిరించి పారెయ్యటమూ జరుగుతున్నట్టు వింటున్నాం దీన్ని ఎట్లా సమర్థించటం చిత్రం పొడువు కథను బట్టి ఉండాలన్నది కళాదృష్టితో చూస్తే చాలా సబబైనదే ఎవరూ కాదనరు కాని అవతల సంఘటనలు హెచ్చుగా ఉన్న చిత్రం దీర్ఘంగా ఉండి బాగా నడుస్తుంటే ఇవతల సంఘటనలు తక్కువగా ఉన్న చిత్రం తీసినవాడు తక్కువ పొడుగు చిత్రాన్ని తీసి విడుదల చేస్తాడా ? చెయ్యడు అది వ్యాపార పద్ధతి కాదు చిత్రాల పొడవు నిర్ణయించేది వేరే ఉన్నది, కానిఅది కళాకారుడి స్వాతంత్ర్యంమటుకు కాదు వ్యాపార పోటీ

మరొక వాదం – ఇదీ వాసన్‌గారిదే ! దేశీభాషలకూ, మన నటీనటుల ఉచ్చారణకూ, కదలికకూ, సంబంధించినది పాశ్చాత్య చిత్రాలలో నటీనటులు మాట్లాడినంత వేగంగా మన నటీనటులు మాట్లాడలేరు కదలలేరు అని ! '' ఇంగ్లీషు చిత్రాలలో చెప్పే సంభాషణలే మన నటులు మన భాషల్లో చెబితే ఇంకా ఎక్కువ పుటేజ్ మింగుతుంది'' అని ఫిలిం విచారణసంఘం వారు వాసన్‌కు ప్రతిధ్వనిగా అంటున్నారు కాని ఈ సమస్య ఎక్కడ ఉదయిస్తున్నాదో తెలియదు మన నిర్మాతలు ఇంగ్లీషు చిత్రాలను తమిళంలోకీ, తెలుగులోకీ తర్జుమా చెయ్యటంలేదు ఇంగ్లీషు చిత్రాలలో ఉన్న సంభాషణలన్నీ మన చిత్రంలో ఉండటంలేదు కామెరా ఎదట పాశ్చాత్య నటులు కదలినంత మన నటులు కదలటమూలేదు, ఇదివరకే ''బ్లూ లెగూన్'' ''తీఫ్ ఆఫ్ బాగ్దాద్'', ''స్టోన్ ఫ్లవర్'' వగైరా విదేశీ చిత్రాలు దేశ భాషలలో డబ్ చేయబడ్డాయి ఇతర చిత్రాలు కూడా ఇలాగే డబ్ చేస్తారనే భయాందోళనలు మన చిత్ర నిర్మాతలను బాధిస్తున్నాయి కూడానూ ఈ డబ్బింగ్ విజయవంతంగా అయి ఉండటాన్నిబట్టే ఈ వాదం సరికాదని రుజువవుతున్నది

వాసన్‌వంటి చిత్రనిర్మాతలు తమ స్వలాభంకొరకు చేసిన ఈ కుంటివాదనలను ఫిలిం విచారణసంఘంవారు తమ వాదాలుగా ప్రభుత్వానికి నివేదించటం చాలా హాస్యాస్పదం

మిగిలిన విషయాలమాల ఎట్లా ఉన్నా చిత్రాల పొడవు 14,15 వేలకు మధ్యగా ఉండాలని నిర్ణయించటం వల్ల లాభం ఉంటుంది గాని నష్టం ఉండదు

ఇంటర్వల్‌తో సహా 3 గంటలు మించి ఉండే చిత్రాలు ప్రదర్శించడంవల్ల రోజుకు 3 ఆటలు సుఖంగా ఆడుకునే అవకాశం ఉండదు సింగిల్ ప్రాజెక్టర్లు మాత్రమే ఉన్న థియేటర్ల సంగతి వేరే చెప్పనవసరంలేదు ప్రతి థియేటరూ రోజుకు 3 ఆటలు సుఖంగా ఆడగలిగినట్టయితే థియేటర్ల సంఖ్య పెరిగిన ఫలితం ఏర్పడుతుంది ఆఖరు ఆట చూసే జనానికి ఆరోగ్యం చెడదు దక్షిణ దేశంలో తయారయే మంచి చిత్రాలలో కూడా 15 వేల అడుగులలోపల తీయటానికి అవకాశం లేని చిత్రాలు లేవు

ఇంకొక విషయమేమంటే హాలీవుడ్ చిత్ర నిర్మాతలు ప్రసిద్ధమైన నవలలను చిత్రాలుగా పొడవు కొద్దిగా పెరగనిస్తారు అప్పటికీ నవలలో ఉండే అనేక విషయాలను చిత్రంలో

వదిలేస్తారు తమ పుక్కిటి పురాణ గాథలను తామే రచించుకుని, కలగూరగంపలాగ అందులోకి కొత్తగా వెలువడే చిత్రాలలోని సంఘటనలను ఎప్పటికప్పుడు ఇరికిస్తూవెళ్లేమన నిర్మాతలు తమ చిత్రాల పొడవుపై తమకుగాని ఇతరులకుగాని ఎట్టి అదుపూలేదనీ, ఉండరాదనీ అనటం హాస్యాస్పదం, ఆ వాదాన్ని ఫిలిం విచారణ సంఘం ప్రతిధ్వనించటం మరింత హాస్యాస్పదం

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 16-4-51*

# 42. విమర్శకుల దృష్టిలో సినిమా చిత్రాలు

చిత్రనిర్మాణంలో విమర్శకు ఎటువంటి స్థానం ఉండేదీ ఇంతవరకు నిర్ణయం కాలేదు ''విమర్శకులకోసం చిత్రాలు తీయవలసివస్తే దుకాణం కట్టి పెట్టవచ్చు'' అని ప్రసిద్ధ కార్టూన్ చిత్రనిర్మాతలూ అదే వైఖరిలో ఉన్నారనుకోవచ్చు హాలీవుడ్ చిత్ర నిర్మాతలు విమర్శకు తావివ్వకుండా చూస్తారని ఒక ప్రతీతి, మూవీల కాలంలో ''హాంట్ బాక్ ఆఫ్ నోటర్ డామ్'' తయారు చేసిన చిత్ర నిర్మాతలు ఆ చిత్రంకోసం తయారుచేసిన సెట్టింగులలో పూర్తిగా కథా కాలం నాటి శిల్పం నిర్దుష్టంగా ప్రవేశపెట్టబడిందని చెప్పుకున్నారు అటువంటి హాలీవుడ్ చిత్రనిర్మాతలే''ప్రొఫెషనల్ సోల్జర్'' అనే చిత్రం తీస్తే, ఆ చిత్రంలో, విక్టర్ మాక్లాగెన్ ధరించిన సైనిక దుస్తులలో 17 తప్పులు కాబోలు ఉన్నట్టు విమర్శకులు నిరూపించారు!

జనబాహుళ్యం కోసం తీయబడే ఈ చిత్రాలను అచ్చుగా పామరజనమే గాక వివేచనాశక్తిగల వాళ్లు కూడా చూడడంతో విమర్శన అనేది అంతో ఇంతో కలగటమూ, ఒక్కొక్కప్పుడు అది అచ్చులో ప్రవేశించటమూ కూడా జరుగుతున్నది అయితే, ఇట్లా వెలువడే విమర్శ సినిమా సాహిత్యం కింద ఉండిపోతున్నదేగాని చిత్ర నిర్మాణం మీద ఈ విమర్శకు గల ప్రభావం దాదాపు ఏమీ లేదని చెప్పవచ్చు పత్రికలలో వెలువడే విమర్శలైనా, చిత్రంలో తగినంత వినోదం లేదన్నంతవరకే చిత్ర నిర్మాతలను బాధిస్తాయి గాని, కథ సరిగా లేదన్నా, పాత్ర పోషణ లేదన్నా కూడా బాధించవు

ఇతర కళలలో మభ్య పెట్టటాలు చాలా తక్కువ పండిత సభలో ఎవడన్నా లేని పాండిత్యం ప్రదర్శించబోయినట్లయితే పరాభవం చెందుతాడు గాన కచేరీలో గాయకుడు తనకు రాని రాగం పాడ సాహసించలేడు కళలలో దక్షతా, ప్రావీణ్యమూ కంటె ప్రజారంజకత్వానికి ప్రాముఖ్యం హెచ్చినకొద్దీ కళాకారులు తమకు తెలియని విషయాలు తెలిసినట్లు నటించటం పరిపాటి అయిపోవటమే గాక ఒక్కొక్కప్పుడు అది తప్పని సరి అవుతుంది

దీనికి అతి సామాన్యమైన ఉదాహరణ చిత్రాలలోని పాత్రలు జంత్రవాద్యాలు వాయించటం, అత నవీనమైన సాంఘిక చిత్రంలో అయితే కథానాయిక పియానో వాయిస్తుంది, జానపద చిత్రాలలో అయితే వీణ వాయిస్తుంది పియానో, వీణ వాద్యాలను గురించి తెలిసిన అభాగ్యుడు చిత్రం చూస్తూ ఉంటే నాయికా పాత్ర ధరించిన తారామణికి ఆ వాద్యం వాయించటం రాదనీ, తప్పు వాయిస్తున్నదనీ తెలిసిపోతుంది ఈ తెలుసుకునే పెద్దమనిషి గానకళే ప్రాణ కళ అయినవాడైతే చాలా నొచ్చుకుంటాడు, అందరితోనూ చెబుతాడు, చిత్రనిర్మాతలనూ, దర్శకులన, పాత్రధారులనూ తిట్టేస్తాడు కూడానూ అతని విమర్శ ఎంత సక్రమమైనదైనప్పటికీ

చిత్రం చూసేవారి ఆనందానికి భంగం కలిగించేది కాదు తారామణి అందచందాలూ, నటనా మాత్రమే వారికి ముఖ్యం ఆవిడకు వీణ వాయించటం చేత కాదన్నంత మాత్రాన వారికేమీ సంతాపం లేదు ఆవిడ పెదవులు కదిలిస్తే నిజంగా పాడేది మరొకరని తెలిసినా వారు బాధపడరు అంతే చిత్ర నిర్మాతలకు కూడా కావలిసింది

''నిపుణుల'' విమర్శ ఏ విధంగా ఉంటుందో నిరూపించే లేఖ ఒకటి మా కార్యాలయానికి వచ్చింది అది రాసినవారు జ్యోతిషంలో గట్టివారే అయి ఉండవచ్చు ఆయన చెప్పే విషయాలలోని సత్యాసత్యాలు''దైవజ్ఞులకు'' వదలి ఆయన తెలిపే విషయాలను మాత్రం ఇక్కడ చెప్పుకుందాం ఈ లేఖను శ్రీ కె పార్థనాద శర్మ అనేవారు బళ్లారినుండి 16 ఏప్రిల్‌న రాశారు ఆయన ఈ విధంగా అంటున్నారు

('' పాతాళభైరవి'' లో) పండితులు రాజకుమార్తె జాతకమును గురించి చెప్పుచూ, 12వ ఇంటిలో నీచంలో రవి, 8వ ఇంటిలో ఇంద్రుడు, ఉన్నట్టు ఉచ్ఛరించిరి రవికి నీచరాశి, తుల ఈ రాశి 12వ ఇల్లు కావలయునన్న రాజకుమార్తె లగ్నము వృశ్చిక రాశి అయి ఉండవలయును 7వ ఇంటి నుంచి 8వ ఇల్లు మిధునమవును మిధు(న) ములో ఇంద్రుడు 1900 సంవత్సరము, అంతకు కొంచెము ముందుగను ఉన్నట్లు పంచాంగమునుండి తెలియును

'' కథ ప్రారంభము రాజకుమార్తెకు సుమారు 18సంవత్సరములు ఉండునప్పుడు చేశి ఉందురు అనగా ఇంచుమించుగా 1914-18 సంవత్సరములలో, అప్పుడు, ఉజ్జ(యి) నీలో కథలో చూసిన పరిస్థితులన్నియు ఉండినవా? అప్పుడే మొదటి ప్రపంచ యుద్ధము జరిగినది మన దేశపు రాజులందరు బ్రిటిష్‌చక్రవర్తి గారికి తోడ్పడక తప్పియుండదు కథలో చూపబడిన వైభవములకు అది సమయమేనా!'' అని ఈ విలేఖరి అడుగుతున్నారు ఇప్పటికే విమర్శ జానపద చిత్రానికీ, అందులో భూగర్భస్త పాతాళ భైరవికీ, మాంత్రికుడికీ చాలా ఎడమైపోయిందని మనం భావించవచ్చు కాని ఇంకా ఉంది

'' రాజకుమార్తె మొహము చూడగా వృశ్చిక రాశి గుణము లేమియు కనపడవు ఆమె నడవడిక కూడా ఏమీనరాశియో లేక కటక రాశియో కావచ్చునని తోచు చున్నది (1) రాజుగారి జ్యోతిషులు 2వ ఇంటిలో శని ఉన్నాడని కూడా చెప్పిరి అనగా ధనుస్సులో, అట్లయిన, మిధునములో ఉండు ఇంద్రునిలో ఈ శనికి సమ సమ సప్తికవేధ కల్గును రాజకుమార్తె ఇందువలన అష్ట దరిద్రురాలు కావలయును(!!!)

ఇంతదాకా వచ్చిన తరవాత ఇటువంటి విమర్శలను గురించి సినిమా ప్రేక్షకులూ, చిత్రనిర్మాతలూ ఏం చెయ్యాలన్న సమస్య ఏర్పడక తప్పదు ''కథా కల్పకులు ఇట్టి తప్పులు జాగ్రత్తగా గమనించిరేని జ్యోతిష శాస్త్రమునకు గౌరవము కల్గును ఇష్టములేదేని, ఆ శాస్త్రములోనికి ప్రవేశమే పెట్టగూడదని నా మనవి'', అని లేఖకులు సలహా ఇస్తున్నారు

ఈ విమర్శ సంపూర్ణంగా మనం ఆమోదించనవసరం లేదు మాటవరసకు ఇంద్రుడు మిధునరాశిలోకి 1900 కు పూర్వం ఎన్నిసార్లయినా వచ్చి ఉండవచ్చు అయినప్పటికీ ఈ విమర్శలో చూసిన అన్ని లోపాలనూ కొట్టివేయటానికి లేదు

ఇటువంటి లోపాలు రాకుండా చూసుకోవటం అసాధ్యం కాదు సాధ్యమైనచోట వాటికి ఎడంగా ఉండటంకూడా అసాధ్యం కాదు ఉదాహరణకు వీణ వాయించినట్టు నటించదలిచిన

మనిషి తాను వాయించినట్లు నటించే పాటకు చెయ్యి ఎక్కడ పైకి కదపాలో, ఎక్కడ కిందికి కదపాలో, ఎక్కడ తీగెలను గబగబా మీటాలో అయినా తెలుసుకున్నందువల్ల బాధలేదు ఇది సరిగా జరిగేటట్టు చూడటానికి పక్కన నిజంగా వీణ వాయించే మనిషి ఉండనే ఉంటాడు గనక ఆయన సమాయాన్ని డైరెక్టరు పొందవచ్చు అప్పటికీ తప్పులు వస్తే ఏదో ఇన్‌సర్షన్ వేసి ఆ భాగాలు కప్పవచ్చు

జ్యోతిషం అంత సులువైనది కాదు అటువంటప్పుడు అతిగా వివరాలకు పోకుండా ఉంటే మంచిది

చిత్రాలు ఎంత పామరులకోసం తీసేవైనా విచక్షణా జ్ఞానం కల వాళ్లకు లోపాలు దొరికిపోవటం అంత మంచిది కాదు కళ కల్పన అయినప్పటికీ చాతగాని కల్పన కావలిసిన అవసరంలేదు, నటనే అయినా చాతగాని నటన అనిపించుకోవలసిన అవసరం కూడా లేదు చిత్ర నిర్మాతలు సాధ్యమైనంతవరకు ''ప్రవీణులకు'' దొరకకుండా చూసుకోవటం మంచిది దొరికిపోయినప్పుడు వారి విమర్శలను పాటించటం కూడా మంచిది. ''ప్రవీణులు'' ఎన్నో లోపాలను సరిచేసుకోవటం వల్ల చిత్రాలకు డబ్బు హెచ్చు రాకపోయినా ఖ్యాతి రావచ్చు

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 25-4-51*

# 43. కొత్తముఖాలు

సినిమాలలోకి కొత్త ముఖాలు రావాలని పత్రికలలో కొంత కాలం క్రితం ఆందోళన జరిగింది చాలామంది చిత్ర నిర్మాతలు ఈ ఆందోళను పాటించనట్టు నటించారుగాని సినిమా రంగంలోకి చాలా కొత్తముఖాలు రానే వచ్చాయి

కొత్త ముఖాలు కావాలన్న ఆందోళన సామాన్య సినిమా ప్రేక్షకులనుంచి రాదనీ, కొద్దిమంది ఊసుపోనివాళ్లు పత్రికల్లో ప్రవేశించి ఈ ఆందోళన సాగిస్తారనీ కొందరి వాదం ఈ వాదం నిజమే కావచ్చు అయినా కొత్త ముఖాలవల్ల సినిమా పరిశ్రమకూ కళకూ కూడా కొంత లాభం లేకపోలేదు

మొదటి సంగతి, మన సినిమా చిత్రాలలో వ్యక్తిత్వం గల పాత్రలు అరుదు కావటంచేత ఆ పాత్రలు ధరించే నటీ నటులకుండే వ్యక్తిత్వమే పాత్రల వ్యక్తిత్వం కింద గణనకు వస్తుంది అంజలీదేవి నటించే పాత్రలన్నీ అంజలీదేవే, శివరావు అన్ని చిత్రాలలోనూ శివరావే! తెరమీద కనిపించే పాత్రలకు కథకుడివ్వలేని ప్రత్యేకతా, వ్యక్తిత్వమూ తారలిస్తున్నారు గనకనే ఈ తారలకు ఇంతంత పెద్ద వేతనాలు ముట్టుతున్నాయనుకోవలసి ఉంది

పురాణ చిత్రాలలో పాత్రల వ్యక్తిత్వం ప్రేక్షకులకు తెలుసు పాత్రకూ పాత్ర ధరించే మనిషికీ గల తేడా చాలా జాస్తి అయితే, నటించే మనిషికి ఎంత నటనా సామర్థ్యం ఉన్నా విమర్శకు అవకాశం ఉండేది సాంఘిక చిత్రాలలో ఎంత లేదన్నా పాత్రలకు కనీస ప్రమాణంలో వ్యక్తిత్వం ఉండితీరుతుంది అది నటుల వ్యక్తిత్వానికి అనుగుణంగా ఉండాలి ఈ బాధ జానపద చిత్రాలకు చాలా తక్కువ అందుకే జానపద చిత్రాలు కూడా తారల గిరాకీతోబాటు విజృంభించి ఉండవచ్చు

ఈ పరిస్థితులలో కొత్త ముఖాన్ని తెరమీదికి తేవటమంటే కొత్త పాత్రను సృష్టించటంతో

సమానమన్నమాట చూసిన పాత్రనే మళ్లీ మళ్లీ చూడడానికీ కొత్త పాత్రను చూడటానికీ ప్రేక్షకుల దృష్టిలో ఏ వ్యత్యాసమైతే ఉంటుందో పాత తారలను చూడటానికీ కొత్త తారలను చూడటానికీ అంత వ్యత్యాసం ఉంటుంది అంజలీదేవి నాగేశ్వరరావు, ఎన్ టి రామారావు, జూనియర్ శ్రీరంజని, జి వరలక్ష్మి, శివరావు, రేలంగి, రామమూర్తి వగైరా నటులు తెరమీదికి వచ్చిన ఈ కొద్ది ఏళ్లకాలంలో సినిమా చిత్రాలు పాత బాక్సాఫీసు రికార్డులను ఏ విధంగా చించి చెండాడినదీ మనం చూస్తూనే ఉన్నాం ఇది కేవలం కాకతాళీయమని మనం భావించనవసరంలేదు ఎందుకంటే ఈ కొత్త ముఖాలను విసర్జించి ఇంకా సినిమా రంగంలో ఉన్న పాత ముఖాలతోనే ఏదైనా చిత్రం పూర్తిగా పాత రికార్డుల ప్రకారమే ఉంటుంది ఈ సంగతి ప్రతి ప్రొడ్యూసరుకూ తెలుసు

కొత్త ముఖాలను తీసుకురావటంలో ఇంకో సౌకర్యం కూడా ఉంది సినిమాలు మన దేశానికి వచ్చి ఇరవై ఏళ్లు మాత్రమే అయింది కాని ఒక్కసారి వెనక్కు తిరిగి చూసుకుంటే సినిమా సంగీతమూ, సినిమా సంభాషణలూ, సినిమా నటనా ఎన్ని రెట్లు అభివృద్ధి అయిందో ఎటువంటి కృత్రిమత్వం నుంచి ఎటువంటి సహజత్వానికి పరిణతి చెందిందో మనం సులభంగా తెలుసుకోవచ్చు ఇప్పుడు పుట్టేవాళ్లంతా గొప్ప నటులూ, పాటకులూ అని కాదు కాని ఒకతరం మీద ఒకతరం సులభంగా అభివృద్ధి చూపిస్తుంది మన తొలి సినిమా తారలు స్టేజి నటనా, స్టేజి సంగీతమూ మాత్రమే ఎరిగినవారు వారిని చూసిన అనంతరం వచ్చినవారు వారికన్న కొంచెం ముందుకు వెళ్లారు మన సినిమా నటులు నాలుగైదు దశలలో అభివృద్ధి సూచిస్తూ ముందుకు వచ్చారు ఈనాటి తారలను చిన్నతనం నుంచీ చూసి, వారి పాట వినే పిల్లలో నుంచి మరో పదేళ్లలో వీరి తలదన్నిన వాళ్లు తప్పక వస్తారు అందుచేత నాలుగైదేళ్ల కొకసారి కొందరు కొత్త నటీనటులు సినిమాలోకి అధిక సంఖ్యలో ప్రవేశిస్తూ ఉండటం సినిమా పరిశ్రమకూ కళకూ కూడా చాలా మంచిది దీనికి తార్కాణంగా మనం రంగారావునూ, జానకినీ, జోగారావునూ, మరికొంతమందినీ చెప్పుకోవచ్చును కిందటేడే సినిమాలోకి వచ్చిన ఈ నటులలో పాత నటులలో లేని శక్తులు కొన్ని చూశాం వీళ్లు కేవలం తన వ్యక్తిత్వాన్ని పాత్రల వ్యక్తిత్వం కింద ప్రదర్శించటమేకాక తమదికాని వ్యక్తిత్వాన్ని పాత్రలకు ఇవ్వగలిగారు ఈ విషయం రంగారావు విషయంలో పూర్తిగా రుజువయింది కూడానూ, అతను ''షావుకారు'' లో వేసిన రౌడీ పాత్రా, ''పాతాళ భైరవి'' లో వేసిన మాంత్రికుడి పాత్రా ఒకదానికొకటి భిన్నమైనవి నిలబడటం మొదలు, వాలకమూ, భాషా, యాసా, మనస్తత్వమూ అన్నీ వేరే ఒకడు పిరికివాడూ, తేలూనూ రెండోవాడు, ధీరుడూ, భయంకరుడూ, సింహమూనూ జానకికూడా ''షావుకారు'' లో సుబ్బులు పాత్రకు పూర్తిగా భిన్నమైన పాత్రలను, తెరమీద కాకపోతే రేడియోలో, అనేక పర్యాయాలు నిర్వహించి ఉన్నది దీనినిబట్టి ఈశక్తిగల నటులు ఒక్కొక్కరూ అనేక భిన్న పాత్రలను ప్రదర్శించి సినిమా తెరకు అపారమైన కొత్తదనం చేకూర్చగలరు

కొత్త ముఖాలవల్ల మూడో ప్రయోజనం కూడా అతి ముఖ్యమైనది చిత్ర నిర్మాణం అపారంగా పెరుగుతున్నది నిర్మాణమైన చిత్రాలలో సగానికిపైగా దెబ్బ తినటం చూస్తూకూడా సాహసవంతుడైన ధనికులు చిత్ర నిర్మాణంలోకి ప్రవేశిస్తూనే ఉన్నారు బాక్సాఫీసులు ''పగలగొట్టే'' తారలు కొద్ది మందే కావటంవల్లా, చాలామంది కొత్త నిర్మాతలకు కొత్తముఖాలను తెచ్చే ధైర్య సాహసాలు లేనందువల్లా ఉన్న తారల రేటు విపరీతంగా పెరిగి

పోవటమే గాక, ఒక్కొక్క తారా అనేక చిత్రాలలో బుక్కు కావటం జరిగి ఏ రేటుకూ కూడా వారిని మరికొన్ని చిత్రాలలో బుక్ చెయ్యటం కూడని పనిగా పరిణమిస్తున్నది అందుచేత సాహసవంతులైన కొద్దిమంది, చిత్రనిర్మాతలయినా కొత్త ముఖాలను తీసుకురావటం తప్పనిసరి అవుతున్నది ఈ కొత్త ముఖాలతో తీసే చిత్రాలు అంతో ఇంతో చౌకగా పూర్తి కావటమే గాక పాత ముఖాలతో తీసిన చిత్రాలకన్న ఇవే ప్రేక్షకులను ఆకర్షిస్తున్నాయి ఇటీవల విడుదలైన ఒక చిత్రంలో చాలా కొత్త ముఖాలుండి కూడా అది గొప్పగా విజయం పొందటమే గాక అందులోని పాతముఖాలకన్న కొత్త ముఖాలే ప్రేక్షకులను చాలా బలంగా ఆకర్షించినట్లు కూడా స్పష్టమవుతున్నది

మరొక్క విషయం, కొత్త ముఖాలు అచ్చుగా తెరమీద కనిపించే నటులవే కానవసరంలేదు తెర వెనకనుండి చిత్రానికి ప్రాణం పోసేవారినేనైనా మనం హర్షించవలసిందే ఉదాహరణ కింద చాలామందిని పేర్కొనవచ్చును 1920లో చిత్రనిర్మాతలుగా వచ్చిన వారిలో బి ఏ సుబ్బరావూ, నాగిరెడ్డి చక్రపాణీ ద్వయమూ కూడా ప్రజలకు కొత్తరకం చిత్రాలిచ్చి ప్రజాదరణ సంపాదించారు స్క్రిప్టు రచయితగా చక్రపాణి ''షావుకారు'' లో కొత్త రకం సృష్టిచూపాడు తెలుగు తెరమీద ఎన్నడూ లేని పాత్రరచనా, సంభాషణలూ, వాతావరణమూ ఆ చిత్రం చూసింది మొటమొదటిసారిగా సంగీత దర్శకత్వం ''ద్రోహి'' తో ప్రారంభించిన పెండ్యాల నాగేశ్వరరావు సినిమా ప్రేక్షకులను కొత్తరకం సంగీతంతో ఆనందపరిచాడు అట్లాగే ''పాతాళభైరవి'' కి ఆర్టు డైరెక్షను చేసిన గోఖలే తన శిల్ప ప్రభావంతో మామూలు ప్రేక్షకులను కూడా బలంగా ఆకర్షించాడు కొత్తదనం మాటకు వస్తే ప్లేబాక్ పాటలలో కొత్త మాధుర్యం తెచ్చి పెట్టిన పి లీలను కూడా పేర్కొనవలిసిందే

రాజకీయాలలోనే గాక కళారంగంలో కూడా ఈనాటి ప్రజాజీవితం పరుగులు తీస్తోంది జీవితం కోరే శీఘ్రపరిణామాలు సినిమా కళలో కూడా జరగాలంటే కొత్త ముఖాల అవశ్యకత నానాటికీ హెచ్చుతుంది గాని తగ్గదు

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 9-5-51*

# 44. సినిమాకథలు

విడుదలయ్యే ప్రతి చిత్రాన్నీ పోనివ్వకుండా చూసేవారిలో విమర్శనా దృష్టికాస్త తక్కువగా కలవారికి ''చూసిన కథే మళ్లీ చూస్తున్నట్టుంటుంది'' అనిపిస్తుంది కాస్త విచక్షణ కలవారికి ప్రతి చిత్ర నిర్మాతా ఇతర చిత్రాలలో నుంచి పాటలతో బాటు పాత్రలూ, సన్నివేశాలూ కూడా కాజేస్తున్నారా అనిపిస్తుంది మొత్తంమీద సినిమా ప్రేక్షకుల కందరికీ కలిగే భావం ఏమంటే సినిమా చిత్రాలకు పనికివచ్చే పాత్రలూ, సన్నివేశాలూ చాలా పరిమితంగా ఉన్నాయనీ, ఎవరు ఏ చిత్రం తీసినా వాటినే చీట్లపేక కలిపినట్టు కలిపి పంచాలనీనూ

నిజానికి ఈ తప్పు సినిమా కళది కాదు గడచిన 20 ఏళ్లలో సినిమా కథలలో ఎన్నో మార్పులు వచ్చాయి ఎన్నో కొత్త రకాల సన్నివేశాలూ, పాత్రలూ తెర ఎక్కాయి అయినప్పటికీ ఎప్పటికప్పుడీ భావం సినిమా చిత్ర నిర్మాతలు కథలకోసం తడువుకుంటున్నారన్న భావం

ప్రేక్షకులకు కలుగుతూనే వస్తున్నది కొత్త తారలను సృష్టించడానికీ, కొత్త కథలు తీసుకోవడానికీ, కొత్తపంథా తొక్కడానికీ సాహసం చాలిన నిర్మాతలు కొద్దిమందే ఉండడమూ, మిగిలిన వారు ఆ సాహసవంతులను అనుసరించడమూ దీనికి కారణం

అయినప్పటికీ

ప్రొడ్యూసర్లంతా సాహసవంతులే అనుకున్నా, సినిమా చిత్రాలకు ఏ కథ అయినా పనికివస్తుందని ఎవరూ అనలేరు ఎట్టి సంఘటనలూ లేకుండా కేవలం మానసిక సంగర్షణతో గాని, సంభాషణలతో గాని కథలు రాయవచ్చు అటువంటి కథలు సినిమాకు పనికిరావు అచ్చగా పిల్లలకేగాని, ఆడవాళ్లకేగాని, మగవాళ్లకేగాని సంబంధించిన కథలు కూడా పనికిరావు

అయితే సినిమా చిత్రాలకు పనికివచ్చే కథలకు గల అర్హతలేవి ?'' ఈ కథ సినిమా చిత్రం తీయడానికి పనికివస్తుంది,'' అని చిత్ర నిర్మాతలుగాని, పైవాళ్లుగాని తెలుసుకోవడం ఎలాగు ?

సినిమా కథ యొక్క మంచిచెడ్డలను రెండు భిన్న దృక్పధాలనుంచి అంచనా కట్టవచ్చు ఒకటి చిత్రనిర్మాత యొక్క దృక్పధం, రెండవది సినిమా ప్రేక్షకుల దృక్పధం, ఈ రెండు దృక్పధాలూ కొంత వరకు ఒక దానితో ఒకటి కలవడానికి అవకాశం ఉంది కాని పూర్తిగా కలవడం సాధ్యం కాదు అయితే ఈ రెండు దృక్పధాలూ సమన్వయం అయి తీరాలి లేకపోతే చాలా చిక్కున్నది

ముందు చిత్ర నిర్మాత దృక్పధం తీసుకుందాం చిత్రనిర్మాతకు ప్రధానంగా ఉండే ఆశయం వ్యాపారం, సంఘసేవా, కళాసేవా మొదలైనవి అప్రధానంగా ఉంటే ఉండవచ్చు ప్రధాన ఆశయానికీ, అప్రధాన ఆశయాలకూ సమన్వయం కుదిరితేమంచిదే, కుదరకపోతే ప్రధానాశయాన్ని పాటించి అప్రధాన ఆశయాలు వదులుకోవలసి వస్తుంది అందుచేత మనం వాటిని పాటించనవసరం లేదు

సినిమా కథను కేవలం వ్యాపార వస్తువుగా చూసినట్లయితే దానిలో ఉండవలసిన ముఖ్యమైన లక్షణం విరివిగా అమ్ముడుపోవడం అమ్ముడుపోయే కథలన్న గ్యారంటీ ఉన్నప్పుడు చిత్ర నిర్మాత కథను స్తనశల్య పరీక్ష చేయనవసరం లేదు

కాని చిత్ర నిర్మాణంలో రెండు వ్యాపార ఘట్టాలున్నాయి ఇది మామూలు వర్తకంలోలాగా కొన్న సరుకులు కొన్నట్టే విక్రయించి మధ్య లాభం పొందడం కాదు చిత్ర నిర్మాత తాను విక్రయించే సరుకు తానే అమ్ముకోవాలి చిత్రాన్ని విక్రయించి పెట్టే డిస్ట్రిబ్యూటరుంటాడు గాని అతగాడు కేవలం కమిషను ఏజెంటు, దాని మీద లాభ నష్టాలకు పూచీపడడు

ఇది జ్ఞాపకం ఉంచుకుంటే చిత్ర నిర్మాత సినిమా కతను ఉత్పత్తికి పనికివచ్చే ముడి పదార్ధంగా భావించి దాని బాగోగులు పరిశీలించాలి ఏమిటి బాగోగులు ?

చిత్రం తయారుచేయడానికయే ఖర్చు, ఋణం నిర్మాత దృష్టిలో ప్రధాన విషయం ఏ మూడు లక్షలతోనో ఖర్చు సంక్షేపించుకుందామనే నిర్మాత ఏరుకొనే కథలకూ, ఏడెనిమిది లక్షలు పెట్టి ఇతర చిత్రాలతో పోటీ చేద్దామనే నిర్మాత ఏరుకొనే కథలకూ వ్యత్యాసం ఉంటుంది డబ్బు హెచ్చుగా ఖర్చు చేయదలచిన చిత్ర నిర్మాత, పేరువడ్డ నటీనటులను బుక్ చేసి వారికి

పనికివచ్చే పాత్రలుగల కథను తీసుకొంటాడు కథలో మంచి మంచి సెట్టింగులకూ, పాటలకూ, నృత్యాలకూ, దుస్తులకూ అవకాశాలుండేలాగు చూసుకుంటాడు ఖర్చు సాధ్యమైనంత తేలికలో పోనివ్వదలచినవాడు ఎన్నుకొనే కథలోని వాతావరణంలో పెద్ద సెట్టింగులు గాని, దుస్తులుగాని, పెద్ద ఎత్తున పాటలు గాని అవసరం లేకుండా చూసుకుంటాడు కథలోని పాత్రలు వస్తుతహా ఆకర్షణ కలవై ఉండి, ఒక మాదిరి నటులు నటించినా సన్నివేశాలు సులభంగా రక్తికట్టేలాగు ఉండేటట్టు చూసుకుంటాడు

చిత్ర నిర్మాత, సహజంగా, ప్రేక్షకుల అభిరుచులను పాటించకుండా ఉండలేడు ఇంతకు ముందు చెప్పిన విషయాలు అచ్చుగా చిత్రనిర్మాణానికి సంబంధించినవి. ఇది చిత్రం యొక్క విజయానికి–అమ్మకానికి–సంబంధించినది, అయినా చిత్రనిర్మాణాన్ని నిర్ణయించేది ఉదాహరణకు ఒక చిత్రనిర్మాత కేవలం స్త్రీలను ఆకర్షించే చిత్రం తీసి తద్వారా డబ్బు సంపాదించయత్నించవచ్చు, మరొక చిత్ర నిర్మాత ఆబాలగోపాలాన్నీ ఆకర్షించే జానపద గాథ తీయవచ్చు ! ఇంకొక చిత్రనిర్మాత పల్లెటూళ్ల వారిని ఆకర్షించే చిత్రం తీసి ''డేరా'' లలో కూడా చాలా డబ్బు చేసుకుందామని ఆశించవచ్చు ''అందరు చిత్రనిర్మాతలూ అన్ని రకాల సినిమా ప్రేక్షకులనూ ఆకర్షించడానికి ప్రయత్నించరా ?'' అని అడగవచ్చు, అటువంటి ప్రయత్నం ఎప్పుడో తప్ప సఫలం కాదు ''గుణ సుందరి'' లాగా స్త్రీలకొరకే ఉద్దేశించిన చిత్రమూ, ''పాతాళభైరవి'' లాగా చిన్న పిల్లలకొరకు ఉద్దేశించిన చిత్రమూ, ''పల్లెటూరి పిల్ల'' లాగా పల్లెటూళ్ల ప్రజలనే ఆకర్షించడానికి తీసిన చిత్రమూ కూడా విజయం సాధించగలవని మనం చూశాం ఇవిగాక ఇంకొక నాలుగో పద్ధతి కూడా ఉన్నది చిత్ర నిర్మాణం చౌకలో తేలిపోతే కేవలం మంచి అభిరుచులు గల ప్రేక్షకులకొరకు కూడా చిత్రం తీయవచ్చు ఇటువంటి చిత్రం పెద్ద లాభాలు గడించకపోయినా చిత్ర నిర్మాతకు కీర్తి తెచ్చిపెట్టడంతో బాటు ప్రేక్షకుల అభిరుచులను ముందుకు తీసుకుపోతుంది ''షావుకారు'' ఇటువంటి చిత్రం ఇది గల్లా పెట్టెలు పగల గొట్టిన చిత్రం కాదు కాని అనేక చోట్ల ఈ చిత్రం నడిచినప్పుడు పై తరగతులు నిండి, కింది తరగతులు ఖాళీగా ఉండడం జరిగింది అందుచేత ఈ చిత్రం తన డబ్బు తాను ఎట్టి ఆర్భాటమూ లేకుండా తెచ్చుకొని, 1950 ఉత్తమచిత్రం అని కూడా అనిపించుకుంది అయితే ఈ చిత్రం తీసినవారు సొంత స్టూడియోగలవారు అందరికీ ఇటువంటి చిత్రాలు తీసే అవకాశం లేదు

ఒక్క విషయం స్పష్టమవుతున్నది, ''ఫలానికథ మనకు పనికివస్తుందా, లేదా?'' అన్న విషయాన్ని చిత్ర నిర్మాత ''సినాప్సిస్'' దశలోనే తేల్చుకోగలడు సినాప్సిస్ అంటే కథా సంగ్రహం సినిమా కథకు ఇది అండదశ ఈ దశలోనే దీన్ని తీయడానికి ఎంత ఖర్చయేదీ, దీనికి ఎటువంటి సెట్టింగులూ, హంగులూ, అట్టహాసమూ కావలసి వచ్చేదీ, అది ఏ రకం ప్రేక్షకులను ఆకర్షించేదీ, అందులోకి ఎటువంటి నటీనటులు కావలసివచ్చేదీ మొదలైన విషయాలు సులువుగా తేలిపోతాయి. ఆ తరవాత కథలో జరిగే పరిణామాలు తత్సంబంధమైన నిపుణులకు వదిలివేసి చిత్ర నిర్మాత తనపని తాను చూసుకోవచ్చును

అనుభవమూ, ఆలోచనా లేని చిత్ర నిర్మాతలు ఈ విషయం గ్రహించక ఒకేసారి నాలుగైదు కథలకు పూర్తిగా ట్రీట్మెంటు తయారు చేయించి ఏది తియ్యాలో తెలియక తికమక పడతారు

ఒక్కొక్కదాన్లో ఒక్కొక్క ఆకర్షణ కనపడితే తామే ఆ ఆకర్షణలలో చిక్కుకుపోయి వ్యాపార దృష్టి కోల్పోయి నష్టపడతారు కొందరు అన్ని రకాల ఆకర్షణలనూ ఒకే కథలోకి చేర్చడానికి ప్రయత్నించి అంటే తాము చూసే ప్రతి చిత్రంనుంచీ ఏదో ఒక 'ఐడియా' తెచ్చి చిత్రంలో చేర్చి ఎందుకూ పనికిరాని, ఏ నిపుణుడూ ఆమోదించలేని 'చెత్త' తయారు చేసి ప్రేక్షకులముందు పెడతారు ఇటువంటి 'చెత్త' మనం చాలా చూసి ఉన్నాం గనక ఉదాహరణలు అనవసరం

ఇక ప్రేక్షకుడి దృష్టినుంచి మంచి సినిమాకథ ఇట్లా ఉండాలన్న సమస్య మిగిలి ఉంది ''ఇటువంటి కథ మాకు కావాలి'' అని సినిమా ప్రేక్షకులు ఎప్పుడూ అడగరు ''ప్రేక్షకులు ఇటువంటి కథలే గాని చూడరు'' అన్న భావం చిత్రనిర్మాతల ఊహలో మాత్రమే జనిస్తుంది నిర్మాతల ఊహలు తమ సన్నిహితానుభవంలో ఏర్పడి, ఆ అనుభవాన్నిబట్టే మారుతూంటాయి నాలుగు పురాణ చిత్రాలు వరుసగా విజయం సంపాదించి, ఒకటి రెండు సాంఘిక చిత్రాలు దెబ్బతిన్న రోజుల్లో ప్రేక్షకులు పురాణ చిత్రాలు తప్ప చూడరన్న ఊహ అమలులోకి వచ్చింది ఇది జరిగి ఎంతో కాలం కానప్పటికీ ఇటీవల పురాణ చిత్రం తీసినవాడే లేదు జానపద చిత్రాలు వరుసగా లాభాలు గడించేసరికి నిర్మాతలు, ప్రేక్షకులకు జానపద చిత్రాలే కావాలని ఊహించారు మళ్లీ జానపద చిత్రాలు నాలుగైదు దెబ్బతిని ''జీవితం'', ''సంసారం'' విజయం సాధించేసరికి, గబగబా నాలుగు సాంఘిక చిత్రాలకు ప్రారంభోత్సవాలు జరిగాయి ఇంతలో ''పాతాళభైరవి'' వచ్చి బాగా నడిచేసరికి చిత్రనిర్మాతలు సంకటంలో పడ్డారు

ఈ ఊహాగానాలు వదిలివేస్తే సినిమా ప్రేక్షకుడు తనను ఆకర్షించి ఆనందమిచ్చే ఏ చిత్రాన్నయినా చూస్తాడు అండ దశలో సినాప్సిస్ దశలో, సినిమా కథకుడై సినిమా ప్రేక్షకుడికి ఎట్టి సంబంధమూ లేదన్నది స్పష్టంగా గుర్తించాలి సినిమా ప్రేక్షకుణ్ణి ఆకర్షించి ఆనందపరిచే లక్షణాలన్నీ సినిమా కథకు పరిణామ దశలలోనే ఏర్పడతాయి ఈ లక్షణాలేమిటి ?

సినిమా చిత్రం తాలూకు కథ తన జీవితానికి విలక్షణమైనదైతే ప్రేక్షకుడు ఆ చిత్రంలో వినోదమూ, వింత అనుభవాలూ, కృత్రిమానందమూ ఆశిస్తాడు అటువంటి చిత్రంలో పాత్రలు గానీ, సన్నివేశాలు గాని స్వాభావికంగా ఉండనవసరంలేదు అయినప్పటికీ ఆ కథ తనకు ఒక అనుభూతిగా ఉండాలి ఆ అనుభూతి తనలో ఉన్న చైతన్యాన్ని స్పందించాలి ఆ స్పందన ఎంత దూరంగానైనా తన నిత్య జీవితానికి అంతో ఇంతో వికాసం కలగజేయాలి

అట్లాకాక సినిమాకత తన వాస్తవ జీవితానికి ప్రతిబింబమైనట్టయితే అది తన అనుభవాన్ని ఖండించరాదు, అవమానించరాదు, తన ఆశయాలను గౌరవించి వాటి విజయాన్నీ, దానితో బాటు తన జీవితాన్నీ ఒక అడుగు ముందుకు తీసుకుపోయే ఆలోచన రేకెత్తించి తనలో వాస్తవమైన ఆనందం చేకూర్చాలి ఈ సినిమా కథ తన ఆశలను రేపి, తన నిత్య జీవిత పోరాటాన్ని బలపరిచి తాను కోరే సాంఘిక న్యాయాన్ని పూర్తిగా సమర్థించి, తన చైతన్యాన్ని పెంచాలి ఈరకం కథలో వాస్తవికత లోపించరాదు కథ తాలూకు పాత్రలూ, సన్నివేశాలూ, సంభాషణలూ, మనస్తత్వాలూ వాస్తవికంగా ఉండాలి వాస్తవ జీవితంలో ప్రచ్ఛన్నంగా ఉండే సాంఘికాభ్యుదయ వ్యక్తులు సినిమా కళా వాస్తవికత ద్వారా ప్రత్యక్షం చేయబడాలి

సినిమా కథలో ఈ ధర్మం లోపించకుండా ఉంటే ప్రేక్షకులు చిత్రాన్ని ఆరాధిస్తారు

ఈ సందర్భంలో గమనించదగిన విషయమేమంటే, ప్రేక్షకుడు సినిమాకథలో కోరే

అంశాలన్నీ కథా పరిణామానికి చెందినవే గాని మూలకథకు సంబంధించినవి కావు సినిమాకథ జీవితానికి విలక్షణంగా ఉంటుందా, ప్రతిబింబంగా ఉంటుందా అన్న విషయం మటుకే ''అండ'' దశలో నిర్ధారణ అవుతుంది ఎట్లా ఉన్నా ప్రేక్షకుడికి ఒకటే కాని ఇతర పరిణామాలు మటుకు ఈ రెండు పద్ధతులలో దేనికి తగినట్టు దానికుండాలి

ఇక్కడే సరిఅయిన సినిమాకథకుడి ప్రాముఖ్యం బయటపడేది ప్రేక్షకులు జానపద చిత్రాలు కోరుతారా సాంఘిక చిత్రాలు కోరుతారా అన్న తత్వ విచారంలో పడ్డవాడు సినాప్సిస్ దశలోనే సినిమాకథ యొక్క ''గీత'' తేలిపోతుందనే భ్రమలో కూడా పడతాడు అటువంటి భ్రమే సినిమా రంగంలో సరిఅయిన సినిమా కథకులు లేకుండా చేస్తున్నది అనేక చిత్రాలు, మంచి నటులూ, ఇతర హంగులూ ఉండికూడా, దెబ్బతినడానికి సాయపడుతున్నది కూడా ఈ భ్రమే

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 30-5-51*

# 45. సినిమా స్క్రిప్టు : దాని పరిణామం

తెలుగులో టాకీలు పుట్టే నాటికే పాశ్చాత్య దేశాలలో సినిమా కళ చాలా అభివృద్ధి చెంది ఉన్నది టాకీలు ఆ దేశాలకూ కొత్తే అయినప్పటికీ సినిమా కళను ''మూవీ''ల ద్వారా పాశ్చాత్యులు చాలా ఉన్నత స్థాయికి తెచ్చి ఉన్నారు సినిమా చిత్రం తాలూకు సినారియో, ఫొటోగ్రఫీ, ఎడిటింగు మొదలైన అంగాలను వివరిస్తూ బోలెడన్ని గ్రంథాకూడా ఇంగ్లీషులో వెలువడి ఉన్నాయి ముఖ్యంగా పుడోవ్కిన్ రాసిన ''ఫిల్మ్ టెక్నిక్'', ''ఫిల్మ్ ఆక్టింగ్'' అనే పుస్తకాలు మూవీ సినిమా కళకు చెందిన అనేక రహస్యాలను బయటపెట్టాయి

అయినప్పటికీ పాశ్చాత్యులు సినిమా రంగంలో సాధించిన శిల్ప విశేషాలను భారతీయ చిత్ర నిర్మాతలు చిత్ర నిర్మాణంలో ఏ మాత్రమూ వినియోగపరచుకోలేదు ముఖ్యంగా సినిమా స్క్రిప్టు విషయంలో ఇది సుస్పష్టమయింది అనేక మంది హిందీ చిత్ర నిర్మాతలూ, చాలామంది తెలుగు చిత్ర నిర్మాతలూ కూడా స్క్రిప్టు అనదగినది లేకుండానే సినిమా చిత్రాలు తీశారు

చిత్రానికి కథ అనుకున్నాక ఆ కథను అనేక రంగాలుగా- నాటకంలోని రంగాలకంటె చాలా చిన్నవిగా- విభజించి, ప్రతిరంగంలోనూ చేసే సంభాషణను ఏ ''కవి''గారి చేతనో రచించటమూ, ఆ సంభాషణలను''షాట్స్''గా విభజించటమూ, దాన్నే స్క్రిప్టు అని కామెరా వాడి మొహాన పారెయ్యటమూ ఆచారంగా ఉండేది ఈ సంభాషణలు రాసే ఆయనను ''కవిగారు'' అని పిలిచే వాళ్ళు, నిజానికి ఆయనవల్ల ప్రొడ్యూసర్లు ఆశించేది కవిత్వమే, పాటల్లోనూ, మాటల్లోనూ కూడా ''కవిత్వం'' ఉండాలి పాత్రోచిత సంభాషణలూ, సహజ సంభాషణలూ అన్నవి ఊహించరానివిగా ఉండేవి సంభాషణలు గ్రాంధిక భాషలో ఉండేవని వేరే చెప్పనక్కర్లేదు

దీనికి తగ్గట్టే ఆనాటి రికార్డింగు తరుచు ఫిడెలిటోన్, బ్లూబర్ట్ మొదలైలన సాధనాలతో జరిగేది నటులు తమ సంభాషణలను పట్టిపట్టి చదవాలి గొంతు ఆటే తగ్గించరాదు చివర ''డ్రాప్'' వచ్చిందంటే రికార్డిస్టు ''ఓకే'' చేసేవాడు కాడు అయితే ఈ బెడద ఆర్ సి ఏ ,

వెస్టర్న్ ఎలెక్ట్రిక్ వగైరా రికార్డింగు యంత్రాలు వచ్చాక తీరిపోయింది ఇవాళ రహస్యాన్ని కూడా అవలీలగా రికార్డు చేసేస్తున్నారు

తొలిదశలో మన చిత్ర నిర్మాతలు స్క్రిప్టును గురించి పాశ్చాత్యుల పద్ధతులు నెరవకపోవటానికి కారణం ఆనాడు తీసిన పౌరాణిక చిత్రాలే కావచ్చు పౌరాణిక చిత్రాలలో పాత్రలనుగాని కథనుగాని ప్రత్యేకించి ప్రేక్షకులకు పరిచయం చేయనవసరంలేదు

క్రమేణా సినిమా స్క్రిప్టులో మార్పు రాసాగింది పౌరాణిక చిత్రాలు పోయి సాంఘిక చిత్రాలు రాసాగిన తరవాత ప్రేక్షకులు ముఖ్యంగా విమర్శకులకు కథలోని లోపాలు కొట్టవచ్చినట్టు కనపడసాగాయి స్క్రిప్టు రచయితలుగా కథకులు రావాలన్న ఆందోళన బయలుదేరింది ఈ ఆందోళన ఫలించలేదనే చెప్పాలి ఎందుకంటే ఈ దశల్లో కొత్తగా స్క్రిప్టు రాయటానికి తీసుకురాబడ్డవాళ్ళు కథనంలో ఆరితేరినవారు కారు సంభాషణలు రాయటంలో కొంత సామర్థ్యంకలవాళ్ళు సాంఘిక చిత్రాలు ముందుకు వచ్చినాక సినిమా సంభాషణలలో పరిణామం కలిగింది గ్రాంధిక భాషస్థానే వ్యావహారిక భాష వచ్చింది సంభాషణలు చాలావరకు పాత్రోచితంగా ఉండసాగాయి

కాని సంభాషణలు మాత్రమే స్క్రిప్టు అనిపించుకోవు స్క్రిప్టులో సంభాషణలది ఆఖరు తాంబూలం, ముఖ్యమైన కథకు డైరెక్టర్లు కథనంలో సిద్ధహస్తులయినా కాకపోయినా, వీరికి చిత్రనిర్మాణానికి చెందిన పరిజ్ఞానం ఉండటం చేత కథను వ్యక్తపరచటంలో కామెరామెన్ నిర్వహించగల పాత్రకు కొంత ప్రాముఖ్యం ఇవ్వగలిగారు సినిమా చిత్రనిర్మాణానుభవం లేని కథకులకు ఇది సాధ్యం కాదు ఈ మార్పు ఫలితంగా సినిమా చిత్ర నిర్మాణంలోకి కథకులు దిగని లోపం అట్టే ఉండిపోయినా సినిమా కథలు ప్రదర్శించటంలో కామెరా యొక్క పనితనానికి ప్రాముఖ్యం మటుకు తప్పక ఏర్పడింది

ఇటువంటి పరిస్థితిలో చిత్ర నిర్మాణానికి సిద్ధహస్తుడైన కథకుడు అవసరమే లేకుండా చేస్తూ జానపద చిత్రాలు వచ్చాయి వాయిల్, జార్జెట్, క్రేప్ వగైరా తానులనుంచి ముక్కలు చించీ రకరకాల అద్దకాలూ, అంచులూ ఏర్పాటు చేసి చీరెలు చెయ్యటం లాటిదే జానపద కథలు తయారు చెయ్యటం ఎటువంటి పాత్రలనైనా అందులో పెట్టవచ్చు, ఎటువంటి సన్నివేశాలైనా కథలో ఇరికించవచ్చు, మనస్తత్వాన్ని కూడా అట్టే పాటించనవసరం లేదు ( ఉదాహరణకు నిత్యజీవితంలో మనకు జాలిగాని, అసహ్యంగాని పుట్టించే పాత్రలు జానపద చిత్రాలలో ముఖ్య పాత్రలుగా ఉంటాయి )

ఇప్పుడు విశేషంగా వెలువడే జానపద చిత్రాలు వెనుకపడ్డాక చిత్రనిర్మాతలు తిరిగి సాంఘిక చిత్రాలకు వచ్చి తీరాలి ఇక ముందు తీయబోయే సాంఘిక చిత్రాలకూ కొంతకాలం క్రితం వచ్చిపోయిన సాంఘిక చిత్రాలకూ ఒక పెద్ద తేడా ఉండబోతుంది ''మాలపిల్ల,'' ''రైతుబిడ్డ'',''మళ్ళీ పెళ్ళి'', ''సుమంగళి'', ''దేవత'' మొదలైన చిత్రాలలో లాగ వ్యక్తి సమస్యలకు ప్రాధాన్యం ఇచ్చి చిత్రాలు తీస్తే అవి నెగ్గవు ఇక ముందు ఎత్తుకొనే సమస్యలు విస్తృత సమాజానికి చెందినవై ఉండాలి జీవితం తెరమీద వాస్తవికంగా చిత్రించబడాలి వినోదం కలిగించే చిత్రాలు ఎట్లా ఉన్నా ఇబ్బంది లేదు గాని, భావోద్రేకంతో కూడాన చిత్రాలు కృత్రిమజీవితాన్ని చిత్రిస్తే ప్రజలు ఆదరించకపోవచ్చు ఇటువంటి మార్పు సాహిత్యంలో బాగా వచ్చేస్తున్నది

సినిమాలలోకి వస్తుందనుకోవటానికి అవకాశం లేకపోలేదు ఇటువంటి పరిణామంతో బాటు కథకులు చిరిత నిర్మాణంలో ప్రవేశించక తప్పదు

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 20-6-51*

# 46. సినిమాలలో అనుకరణ

''గొంతుకలు కొద్ది, ప్రతిధ్వనులు చాలా'' అన్నది ఇతర కళలకు వర్తించినట్టే సినిమాకూ వర్తిస్తుంది సినిమా చిత్ర నిర్మాణంలో అనుకరణ ఒక జాడ్యంగా ఉన్నదనుకోవటం కూడా పాతబడింది ఇప్పుడు అనుకరణ తప్పనిసరి అయింది

మొదట కథలు తీసుకుందాం, ఏటా భారతదేశంలో తయారయే చిత్రాల సంఖ్య ప్రపంచంలోకల్లా రెండోది ఈ దేశంలో ఏటా దాదాపు 200 చిత్రాలు తయారవుతున్నాయి ఇన్నిటికీ కథలు కావాలి చిత్ర నిర్మాణంలో అన్ని దేశాలనూ తలదన్నే హాలీవుడ్ వారు కథలకు తడుపుకోనవసరంలేదు వారు ప్రపంచంలోగల అన్ని దేశాలకూ సంబంధించిన కథలు తీసుకుంటారు చారిత్రక చిత్రాలూ, సంగీత చిత్రాలూ, సాంఘిక చిత్రాలూ తీస్తారు ప్రసిద్ధ నవలలనూ, నాటకాలనూ, కథలనూ, చిత్రాలుగా తీసుకుంటారు విశ్వ సాహిత్యం వారికి అందుబాటులో ఉంటుంది కథలకోసం వారు లక్షలు ఖర్చు చేస్తారు

ఈ సౌకర్యాలేవీ మనకు లేవు నిరక్షరులైన మన ప్రేక్షకులను చరిత్ర ఆకర్షిస్తుందన్న నమ్మకం లేదు వారికి సంగీతం లేని చిత్రాలు పనికిరావు ఏదో కథ అడ్డం పెట్టుకుని అచ్చుగా సంగీత చిత్రాలు తీసినా వారు చూడకపోవచ్చు అన్ని చిత్రాలలోనూ అన్ని లక్షణాలూ రసవంతమైన కథా, పాటలూ, డాన్సులూ, దుఃఖాలూ, ఆనందమూ, సాంఘిక లక్ష్యమూ ఉండాలి సాహిత్యం చూసినట్టయితే పండిత పామరులనూ, యావద్భారతాన్నీ కదిలించే సాహిత్యం సృష్టించిన రచయితలు, శరత్‌వంటివారు ఏ ఒకరిద్దరో ఉన్నారు డబ్బు పారేసి కొనటానికైనా ప్రజలను బలంగా ఆకర్షించే సాహిత్యం, సినిమా చిత్రాలకు కూడా పనికి వచ్చేది, దాదాపు లేనే లేదు

ఈ పరిస్థితిలో మన దక్షిణ దేశపు చిత్ర నిర్మాతలు తమ కథా సమస్యను ''జానపద చిత్రాలు'' అన్న అభూత కల్పనలతో పరిష్కరించుకున్నారు మన చిత్రాలను ఎక్కువగా పల్లె ప్రజలుచూస్తారు కనుక ఇది సాధ్యమయింది బొంబాయి కలకత్తా ఢిల్లీ, లక్నో, అలహాబాద్ మొదలైన నగరాలలో ఈ జానపద చిత్రాల పరంపర ప్రదర్శించడానికి అంత అవకాశం లేదు అందుచేత హిందీ చిత్ర నిర్మాతల సమస్య అనుకరణతోగాని తీరదు హిందీ చిత్రనిర్మాతలు టాకీలు వచ్చిననాటినుండీ పాశ్చాత్య సాహిత్యం నుంచి ఇతివృత్తాలు తీసుకోవటమూ చేస్తూనే ఉన్నారు ఇటీవల వచ్చిన చిత్రాలు చూసినట్టయితే ''దాస్తాన్'' కు మాతృక ' ఎంబాంట్మెంట్'', ''జాదూ'' కు మాతృక ''లవ్స్ ఆఫ్ కార్మెన్''

దక్షిణదేశంలో జానపద చిత్రాలు ఏవిధంగా ఉపయోగపడుతున్నాయో, ఉత్తర దేశంలో ఈ అనుకరణ చిత్రాలు అదేవిధంగా ఉపయోగపడుతూ, జీవితానికి విలక్షణంగా ఉండే వాతావరణంతో కూడిన కథల ద్వారా ప్రజలకు ''నందం'' ఇస్తున్నాయి ఇందువల్ల కలిగే కష్టనష్టాలను గురించి ఇంకొకసారి ఆలోచించుకుందాం 1

జానపద చిత్రాలన్నీ విజయవంతం కాకపోవటంతో అనుకరణావశ్యకత దక్షిణ దేశంలో కూడా అంతో ఇంతో ఏర్పడుతున్నది ''బాచిలర్ మదర్'' కు అనుకరణ అయిన ''కువారా బాప్'' ను అనుకరించి ''జీవితం'' చిత్రం వచ్చింది ''లెస్ మిసెరబుల్స్‌కు'' కు అనుకరణంగా ''బీదలపాట్లు'' వచ్చింది ''గోల్డెన్ ఇయర్ రింగ్స్'' చిత్రాన్ని అనుకరించాలని ఒకరిద్దరు ప్రయత్నించిన మీదట ఆ చిత్రం తాలూకు కథ ''మాయలమారి'' లో అంతర్భాగంగా వెలువడింది సినిమా చిత్రాలకు పనికివచ్చే కథలు విరివిగా రాకపోవటమే ఈ అనుకరణకు అధికంగా దారితీస్తున్నది

సంగీతంలోనూ, పాటలలోనూ కూడా ఇదే కనిపిస్తుంది ఏటా హిందీలో తయారయే నూటయ్యాభై చిత్రాలకు గాని, దక్షణ భాషలలో తయారయే 50 చిత్రాలకు గాని స్వతంత్రంగా మట్లు అవీ కుదర్చాలంటే మాటలు కాదు ఒక నౌషద్ లాటివాడులేక అనిల్ బిస్వాస్‌లాటివాడు సంగీతంతో అపార విజయం చేకూర్చుకోగానే చిత్ర నిర్మాతలందరూ అతనిపైన పడతారు మన తెలుగు చిత్రాల విషయంలో కూడా సాధ్యమైతే అందరూ ఘంటసాల వెంకటేశ్వరరావు చేత మట్టు పెట్టించుకోవాలని చూస్తారు ఇటువంటి పరిస్థితిలో సంగీత దర్శకుడు తనను తానే అనుకరించుకోవటమో, ఇతరులను అనుకరించటమో తప్పనిసరి అవుతుంది

సంగీతం విషయంలో మనకు ఇంకొక చిక్కు ఏర్పడి ఉన్నది ఇతర దేశాలలో ముఖ్యంగా అమెరికాలో ప్రజారంజకమయిన సంగీతం సినిమా స్టూడియోలలో ఉత్పత్తి కావాలన్న అగత్యంలేదు వారి జీవితంలోనే రకరకాల సంగీత పద్ధతులు అమలులో ఉన్నాయి ప్రజలందరికీ తెలిసిన పాటలూ, బాణీలూ ఉన్నాయి వాటిని మెరుగు పెట్టటమూ తెరమీదికి తీసుకురావటమూ మాత్రమే చిత్ర సంగీత దర్శకులు చేయవలిసినది అంతేకాక వారి చిత్రాలలో చాలా భాగం పాటలు లేని చిత్రాలు

మనకట్లా కాదు మన ప్రతి చిత్రంలోనూ పదేసి పాటలుండాలి మనకు సినిమాలు తప్ప ప్రజాసంగీతం సృష్టించే సాధనమే లేదు అదివరలో నాటకాలు ప్రజా సంగీతాన్ని ఉత్పత్తి చేస్తూ ఉండేవి. ఆ పాటలు రాసేవారైనా చాలా కొద్దిమంది ఉండేవారు వారు పోయిన తరువాత కొత్తగా పాటలు రాలేదు ఉన్న పాటలు అప్పటికే ఒకటి రెండు పుష్కరాలు పాటు ప్రజలలో ప్రచారమై ఉన్నాయి మహారాష్ట్రపు పాటల బాణీలు గ్రామ ఫోను రికార్డుల ద్వారా నాటకరంగాన్ని కొంత వరకు జయించాయి గాని ఈ లోగా పద్యాలు వచ్చి పాటలను కొట్టేశాయి పాటను మించి పద్యం రంగస్థలాన్ని ఆక్రమించసాగింది

ఈ పద్యాలు సినిమాకు నప్పలేదు ప్రజలను ఆకర్షించే పాటలు అవసరమయేసరికి ఆ పాటలు సృష్టించే ఇతర సాధనం ఏమీ లేకుండాపోయింది ఈలోగా హిందీ ఫిల్ములలో పాటలు సినిమా చిత్రాల ద్వారానూ, గ్రామఫోను రికార్డుల ద్వారానూ దేశాన్ని ముంచి ఎత్తడంచేత వాటి ప్రభావానికి దక్షిణ దేశపు సినిమా చిత్రాలు తల ఒగ్గక తప్పింది కాదు

మనం హిందూస్థానీబాణీలు నెమరు వేస్తుంటే హిందీ చిత్రాలవారు పాశ్చాత్య సంగీతాన్ని కొంచెం కొంచెం నెమరు వెయ్యటం నేర్చుకుంటున్నారు ఒకరిద్దరు సంగీత దర్శకులు మనవాళ్లు కూడా పాశ్చాత్య సంగీత ఛాయలు అప్పుడప్పుడూ కనబరుస్తూనే ఉన్నారు

అనుకరణ నృత్యంలో కూడా ఉన్నది సంప్రదాయసిద్ధమైన భరతనాట్యాన్ని సినిమాలు

ఆదరించనందుకు చాలామంది చింతిస్తున్నారు ప్రజారంజకమైన నృత్యానికి కూడా సినిమాకళే ఏకైక ఆధారంగా పరిణమించింది ఏనాడో స్తంభించిపోయిన భరతనాట్యం ఈనాడు ప్రజలకు సన్నిహితంగా లేదు ఆ భరతనాట్యాన్ని ప్రజలకు అందుబాటులోకి తేవటానికి ప్రయత్నమైనా జరగాలి, లేదా మన సాంప్రదాయాలకు విలక్షణమైన నృత్యాన్ని తీసుకు వచ్చి తద్వారా ప్రజలను, సంతృప్తి పరచనైనా పరచాలి మన సినిమా నాట్యగత్తెలు చేసే భరతనాట్యంకన్న అమెరికన్ చిత్రాల నుంచి అనుకరించే విజాతీయ నాట్యాన్నే ప్రజలు ఎక్కువ ఆదరిస్తున్నట్టు కనిపిస్తుంది నాట్య భంగిమల్లో ఉండే భావాలు సంప్రదాయం తెలిసినవారికి మాత్రమే అర్థమయేవి వాటిలోని సౌందర్యం అందరికీ ప్రత్యక్షంగా గోచరమయేది విదేశీ నృత్య నృత్యాలు ప్రజలను ఆకర్షించ టానికి ఇదే కారణం

ఆఖరుకు నటనలో – భావ ప్రకటనలో కూడా విజాతీయత అంతో ఇంతో ప్రవేశిస్తోంది భావప్రకటనలో కూడా జాతీయత ఉంటుందా అని సందేహం కలగవచ్చు అటువంటి శంక అనవసరం బ్రిటిషు చిత్రాలలో నటనకూ అమెరికన్ చిత్రాలలో నటనకూ కొంత తేడా ఉంటుంది మనదేశంలోనే తీసుకున్నప్పటికీ నగరవాసుల భావ ప్రకటనకూ, గ్రామీణుల భావ ప్రకటనకూ, కార్మికుల భావ ప్రకటనకూ, కర్షకుల భావ ప్రకటనకూ బోలెడంత వ్యత్యాసం ఉంది కాని మన చిత్రాలలోని కథలే అరువు సొమ్మయినప్పుడు నటనావిధానం కూడా అరువు తెచ్చుకోవలసివస్తోంది, అనుకరించవలసివస్తోంది

ఇన్ని రకాల అనుకరణలతో సినిమాకళ జాతీయ స్వరూపాని బొత్తిగా కోల్పోతోంది ఇది కేవలం భావదాస్యంవల్ల ఏర్పడినది కాకపోయినప్పటికీ భావదాస్యానికి దారితీయక తప్పదు అనుకరణల అవసరాన్నుండి మన సినిమా కళ ఎప్పటికైనా బయటపడి తీరాలి లేకపోతే చాలా నష్టాలున్నాయి అనుకరణలనుండి తప్పించుకోవటానికి ఒకటే మార్గం చిత్రనిర్మాతలు కొద్దిమందిపైన మాత్రమే ఆధారపడక అనేకమంది కథకులనూ, సంగీత స్రష్టలనూ తదితరులనూ ప్రోత్సహించాలి వీరంతా ఎక్కడున్నారనవచ్చును సముద్రగర్భంలో ఏ రత్నాలున్నదీ ఎవరూ చెప్పలేరు ఇవాళ తారఅయి అందరికీ పరిచయం అయిన మనిషి నిన్న ఎక్కడ ఉన్నదీ ఎవరూ ఎరుగరు అవకాశాలుంటాయనే ఆశ కలిగితే చాలామంది ముందుకు రాగలరు

దీనితోబాటు ప్రజలను ఆకర్షించే సంగీతమూ, నృత్యమూ మొదలైనవి ఇతర జీవిత రంగాలలోకూడా విరివిగా ఉత్పత్తి కావాలి కర్నాటక సంగీతంలోనూ, భరతనాట్యంలోనూ ఉత్తీర్ణులైనవారినుంచే కొత్త కళాస్వరూపాలు సృష్టి కావాలి వారిద్వారానే ప్రచారం కావాలి ఇప్పటికీ మన ఆడపిల్లలు సంగీతం పేర అవే కృతులూ, నాట్యం పేర అవే భంగిమలూ నేర్చుకోవటం శోచనీయం గతానికి భావదాస్యం చెయ్యటం చేతనే కర్నాటక సంగీతమూ, భరతనాట్యమూ కూడా చచ్చిపోయి శుష్క సంప్రదాయాలై ప్రజాభిరుచులకు దూరమైనాయి

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 27–6–51*

# 47. సినిమాలలో మేకప్ కళ

సినిమాకు సంబంధించిన ఉపకళలలో మేకప్ ఒకటి ప్రతిసినిమా చిత్రంలోనూ మిదటగా మనం చూసే ''క్రెడిట్ టైటిల్స్''లో మేకప్ చేసిన ఆయన ఎవరో ఆయన సహాయకులెవరో తెలుపబడుతుంది సామాన్య ప్రేక్షకులు డైరెక్టర్లను గురించీ, మ్యూజిక్ డైరెక్టర్లను గురించీ, ఆర్టు డైరెక్టర్లను గురించీ, ఫొటోగ్రాఫర్లను గురించీ తెలుసుకున్నంత శ్రద్ధగా మేకప్ చేసేవారిని గురించి తెలుసుకోకపోయినప్పటికీ మంగయ్య, హరిబాబు, గోపాలరావు మొదలైన పేర్లు ప్రసిద్ధంగానే ఉన్నాయి

సినిమా చిత్రమన్న తరవాత ఫొటోగ్రఫీ, లైట్లూ ఎంతవిధిగా ఉంటాయో మేకప్ కూడా అంతట విధిగానూ ఉండి తీరుతుంది నటీనటుల మొహాలకు రంగులు వెయ్యాలి జుట్టు అమర్చాలి దుస్తులు తొడగాలి అందంగా కనిపించవలసిన పాత్రలను అందంగా తయారుచేయడమూ, ప్రతిపాత్రకూ దానికి తగిన ''వయసు,'' ముఖలక్షణాలూ, శరీర లక్షణాలూ కలిగించడమూ మేకప్‌మాన్ పని అంటే మామూలు మేకప్ రెండు అంశాలను పరిగణించాలి ఒకటి పాత్ర ధారణ చేసిన వ్యక్తి, రెండవది పాత్ర

ఎంత అందగత్తె అయినా అందగాడైనా మేకప్ సహాయంతో ఇంకా అందంగా కనపడేలాగు చేసే అవకాశం ఉంటుంది అంత ఆదర్శప్రాయమైన అందగాళ్లూ, అందగత్తెలూ ఉండరుగనక నటుల ముఖాలలో ఉండే కొద్దికొద్ది లోపాలను మేకప్‌తో సరిచేయవచ్చు ముక్కు కొంచెం పెద్దదయినా, పెదవులు మరీ పలచన అయినా, కనుబొమలు మరీ కురుచ అయినా, ఇటువంటి లోపాలను మేకప్‌మాన్ సాధ్యమైనంతవరకు సరిచెయ్యగలడు

అట్లాగే, ఒక పాత్ర కోపిష్టిగా కనపడాలన్నా, క్రూరంగా కనపడాలన్నా, అమాయకంగా కనపడాలన్నా మేకప్ సహాయపడుతుంది మేకప్‌తో పాత్రకు ఎంతవయసు కావాలంటే అంత వయసు ఇప్పించవచ్చు వేమనలో నాగయ్యా, లింగమూర్తీ కూడా మొదట చిన్నవయసులో కనిపించి ఆఖరుకు పండిపోయిన ముసలాళ్ళులాగా కనిపిస్తారు

మేకప్‌లో జుట్టుకూ, కట్టుకూ ఉన్న ప్రాముఖ్యం మనకందరికీ తెలిసినదే పల్లెటూరి వాతావరణంలో ఎవరన్నా సూటూ బూటూ, హాటూ పెట్టుకుంటే ఏమిటి వీడు బొత్తిగా కిరస్తానీ వేషం వేశాడు, అంటారు ఆడది ఒకరకంగా జుట్టు దువ్వి చీర గట్టితే ''పచ్చిబోగంది'' లాతయారయిందంటారు కనక పాత్ర పోషణన్నది జుట్టూ, కట్టూ, బొట్టూ దగ్గిరే ఆరంభమవుతుంది మేకప్ పాత్రపోషణకు అనుకూలంగా ఉండేటట్టు చూసే బాధ్యత మేకప్‌మాన్‌ది

ఇదిగాక సినిమాలలో ఒక్కొక్క సారి ప్రత్యేకమైన మేకప్ కూడా అవసరమవుతుంది విడ్డూరమైన పాత్రలు సృష్టించవలసివస్తే ఇటువంటి మేకప్ అవసరం ''నోస్టర్‌డేమ్'' చిత్రంలో గూనివాడు పాత్ర ప్రత్యేకమైన మేకప్ కోరేది అయితే ఇటువంటి పాత్రలు అరుదు

మన సినిమా చిత్రాలలో మేకప్‌కు ఉండదగినంత ప్రాముఖ్యంలేదని చెప్పాలి దీనికి సగం కారణం పాత్రపోషణకు నేటి సినిమాలలో ప్రాముఖ్యం లేకపోవటమే ఈనాడు వెలువడేవి జానపద

చిత్రాలు, జానపద చిత్రాలలో ''సాంఘిక విలువలు'' అన్నది మేకప్ ద్వారా ఎట్లా వ్యక్తమయేదీ ఎవరూ చెప్పలేరు నాయిక సమర్థురాలు కానివ్వండి, అమాయకురాలు కానివ్వండి దర్పంగలదీ మొండిపట్టుగలదీ కానివ్వండి ఆమె వేషధారణ కేవలం ఆమె అవయవ సౌందర్యాన్ని ప్రదర్శించడానికి అనువుగా మాత్రమే ఉంటుంది జానపద చిత్రాలలో వేషభాషలకు సాంఘిక నియమాలుండక పోవడం ఆధారం చేసుకుని కొందరు చిత్ర నిర్మాతలు తమ తారలకు పాశ్చాత్య దుస్తులు తగిలించడం కూడా చేశారు

కొద్ది జానపద చిత్రాలలో మటుకు పాత్రధారణ సాంఘిక చిత్రాలలోలాగే ఉండడం కూడా జరిగింది అటువంటి చిత్రాలలో కథానాయిక మామూలు స్త్రీలవలె చీరెలు కట్టుకుంటే కథానాయకుడు మాత్రం చిత్ర విచిత్రమైన దుస్తులు ధరించడం జరిగింది

చిత్రమేమిటంటే విడ్డూరమైన పాత్రలు సాంఘిక చిత్రాలలో కంటే జానపద చిత్రాలలోనే ఎక్కువగా వచ్చే అవకాశం ఉన్నది అయినా మన చిత్రనిర్మాతలు ప్రత్యేకమైన మేకప్ చేయించ ప్రయత్నించడంలేదు దీనికి కారణం వారికి మేకప్ గురించి ప్రత్యేక శ్రద్ధలేకపోవడమే కొన్ని చిత్రాలలో భూతాలను కూడా చూశాం అయితే ఇవి స్టేజి భూతాలకన్న ఎక్కువ శ్రద్ధగా తయారుచేసినవికావు వాటికి తగినంత ప్రాముఖ్యంకూడా ఇవ్వబడటంలేదు

మేకప్‌లో కూడా వాస్తవికత ఉంటుంది అయితే తారలమీద ప్రజలకుగల మోజు మీద ప్రొడ్యూసర్లకుగల మోజుకొద్దీ వాస్తవికతను పాటించకపోవడం జరుగుతున్నది ఇరవై ఏళ్లపాటు నడిచేకథ తీసుకున్నప్పటికీ కథానాయిక మొదట ఉన్నట్లే చివరా ఉంటుంది ఆమెకు ఆమె ఈడు కుమారుడున్నా మేకప్‌లో మార్పుండదు

''గొల్లభామ'' చిత్రంలో నాయికా నాయకులకు అమృతం తాగించి అజరామరులుగా తయారుచేసి వారి యవ్వనాన్ని సమర్థించుకున్నారు మరికొందరు నిర్మాతలు ఇంత బాధ కూడా పడటంలేదు తమ తారలను ''ముసలి'' గా తయారుచేస్తే ప్రేక్షకులు సహించరేమోనని నిర్మాతల భయం !

మిగిలిన అన్నికళల విషయంలోలాగే మేకప్ కళకు కూడా వాస్తవికతే జీవం మన సినిమాకథలలోనే వాస్తవికత మృగ్యమైనప్పుడు ఉపకళలో ద్యోతకమవుతుందనుకోవడం భ్రమ, ఒకవేళ ద్యోతకమైనా రాణించదు

మేకప్‌లో వాస్తవికత లేకపోవడంతోబాటు సహజత్వం కూడా లోపిస్తున్నాది ఈ క్షణంలో రాజకుమార్తె వేషంలో ఉన్న నాయిక మరుక్షణంలో మొహం ఎండిపోయి, జుత్తు రేగిపోయి బికారీవేషం ధరించి, మాసిపోయిన '' ఇంకో'' చీరెతో కనిపిస్తుంది ఈ పాత్రయొక్క దుస్థితిని ఏదో రీతిగా మేకప్‌లో ప్రతిబింబించాలనే ఆదుర్దాలో మేకప్ చేసేవాడు ఈమెకు నట్టడవిలో ఇంకోచీరె ఎట్లా దొరుకుతుందన్న విషయం కూడా ఆలోచించడు కథానాయకుడి పాత్రను మేకప్ చెయ్యడంలో కూడా ఇటువంటి పొరపాట్లే జరుగుతాయి ఈ కథానాయకుడు నెలలతరబడి నిద్రాహారాలు లేకుండా అరణ్యంలో తిరుగాడినా గడ్డం మొలవకపోవడం జరుగుతుంది ! ఇటువంటి సామాన్యపు పొరపాట్లు మనం సినిమా చిత్రాలలో చూస్తున్నాం ఇవి కేవలం మేకప్ చేసేవాడి తెలివితక్కువే అయితే మనం సరిపెట్టుకుని విమర్శించనక్కరలేదు కాని ఈ పొరపాట్లు ప్రస్తుత సినిమాకళలో విధిలేక జరుగుతున్నవి మన సినిమా చిత్రాలలో

వాస్తవికతా, సహజత్వమూ లోపించడంవల్లా, ప్రజలకు సినిమా తారలపైల వ్యామోహం ఆధారంతో ఈ చిత్రాలు డబ్బు చేసుకోవలసి వుండడంవల్లా ఇటువంటి పొరపాట్లను మేకప్‌మాన్ చెయ్యవలసిన వాడవుతున్నాడు

ప్రస్తుతం మన సినిమాలలో మేకప్ ఒకందుకే పనికొస్తున్నట్టు కనిపిస్తుంది సినిమా తారలను సాధ్యమైనంత ఆకర్షవంతంగా ప్రదర్శించేటందుకు, ఇటువంటి ఆశయాలు ఉండదగినవేగాని మేకప్ యొక్క ఏకైక ఆశయం ఇదే అయే పక్షాన ఈకళ సినిమాకళ అభివృద్ధికి తోడ్పడజాలదు, అమాయకులైన కుర్రవాళ్లకు తారలపై వెర్రివ్యామోహం కలిగించడానికీ, సినిమా చిత్రాలు తీసేవారికి డబ్బు చేసి పెట్టడానికీ మాత్రమే ఉపయోగపడుతుంది

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 28-3-51*

# 48. అనుకరణవల్ల నష్టాలు

రష్యనులు విప్లవానంతర దుష్ఫలితాలనుండి బయటపడి జాతీయ పునర్నిర్మాణానికి కళలను సంఘటితపరిచినప్పుడు, కళల బాహ్య స్వరూపంలో జాతీయతా, స్వభావంలో సోషలిజమూ ప్రతిబింబించాలన్న నినాదం సాగదీశారు రష్యాలో వలసలుగా ఉండిన జాతులు కూడా తమతమ జాతీయతలను కళలద్వారా ప్రతిబింబించుకోసాగాయి అంతకు పూర్వం జారు పరిపాలనలో రష్యాలో జాతీయ వికాసం అడుగంటి ఉండటమేగాక ఇతర దేశాల ప్రభావం కూడా హెచ్చుగా ఉండేదని ఇప్పటి రష్యనులారోపిస్తారు

మొత్తం మీద చైనా జాతీయ పునర్నిర్మాణంతోబాటు చైనాలోని కళలలో కూడా జాతీయవికాసం ప్రారంభమయింది చాంగ్‌కైషేక్ దుష్పరిపాలనలో చైనాలో కళలు వివిధ దేశాల ప్రభావాలకు గురి అవుతూ ఉండేవట

ఇందులో ఆశ్చర్యం ఏమీ లేదు ఏనాడైతే రాజకీయంగానూ, ఆర్థికంగానూ నిజమైన జాతీయ పునర్నిర్మాణం ఆరంభమవుతుందో ఆనాడే సాంఘికంగానూ, కళలలోనూ కూడా జాతీయత ప్రతిబింబించటం ప్రారంభమవుతుంది ఏ జాతియొక్క కళలలో జాతీయత ఆక్రమించవలసిన స్థానంలో అరువుతెచ్చుకున్న విజాతీయత పీఠం వేసుకొని ఉంటుందో ఆ జాతి ఇంకా భావదాస్యం విసర్జించలేదనీ, జాతీయ పునర్నిర్మాణం ఆరంభించలేదనీ తెలుసుకోవచ్చు ప్రస్తుతం మన సినిమాకళ అటువంటి దుర్దశలో ఉంది తండోపతండాలుగా వచ్చే హిందీ, తెలుగు, తమిళ చిత్రాలను చూస్తూ ఉంటే ఇందులో జాతీయతా, సంఘమూ, వాస్తవిక జీవితమూ, దానికి సంబంధించిన సమస్యలూ, ఎక్కడా కనబడవు ఈ చిత్రాలను తీసేవారు, పొరపాటున ఎక్కడైనా యదార్థ జీవితచ్ఛాయలు సినిమాచిత్రాలలోకి ప్రవేశిస్తాయేమోనని వెయ్యి కళ్లతో కనిపెడుతున్నారా అనిపిస్తుంది ఎటువంటి చిత్రం తియ్యాలి అన్న ప్రశ్నకు వేర్వేరు చిత్ర నిర్మాతలు వేర్వేరు సమాధానాలు చెప్పవచ్చునుగాని, చిత్రంలో జాతీయతా, వాస్తవికతా ఉండరాదన్న విషయమై చిత్రనిర్మాతలు అందరికీ ఏకాభిప్రాయం ఉన్నట్టు కనిపిస్తుంది, అందుచేతనే, ఈనాడు మనం తీసే చిత్రాలకు కనకవర్షం కురిస్తే కురవవచ్చు గాని, ఏ దేశీయ నాయకుడు గాని, గొప్ప కళాకారుడుగాని, మేధావి గాని మన చిత్రాలను బహిరంగంగా

ఎన్నికచేయలేడు "ఈ చిత్రం మన జాతీయ పునర్నిర్మాణానికి తోడ్పడుతుంది," అని సిఫార్సు చెయ్యలేడు

నాలుగేళ్ల క్రితం మనం పరిపాలననుండి బయటికి వచ్చినా మనపైనుండి "జైలు నీడలు" తొలగిపోలేదు ఆ భావదాస్యం ఇంకా అట్లాగే ఉంది మన రాజకీయ – ఆర్థిక – సాంఘిక పరిస్థితులు మనలనింకా భావదాస్యంలోనే ఉంచుతున్నాయి అందుకే మనం జాతీయ వికాసం అన్వేషించటంలేదు జీవితానికి సాధ్యమైనంత దూరంగా వెళ్లి సినిమా చిత్రాలు తీస్తున్నాం

ఈ విషయంలో మనకు "జానపద" గాథలు ఉపయోగిస్తున్నట్టే తమిళులకూ, హిందీ చిత్రనిర్మాతలకూ అనుకరణలు ఉపయోగపడుతున్నాయి తెలుగు జానపదచిత్రాలలో "జానపద" లక్షణాలు ఎంత ఉన్నాయో, హిందీ సాంఘిక చిత్రాలలో సాంఘిక లక్షణాలూ అంతే ఉన్నాయి

"వినోదం" కోసం తీయబడే ఈ ఇమిటేషన్ చిత్రాలు ఊరికే పోతున్నాయనుకోరాదు ఇవి అసంఖ్యాకులైన సినిమా ప్రేక్షకులకు కొన్ని అభిరుచులు కలిగిస్తున్నాయి ఈ అభిరుచులు వాస్తవిక జీవితానికి ఏవిధంగానూ ఉపకరించేవి కావు ప్రేమగురించీ, ఆనందాన్ని గురించీ, వ్యక్తి ప్రవర్తన గురించీ, ఆఖరుకు దారిద్ర్యాన్ని గురించీ అభూతకల్పనలు చెప్పే ఈ చిత్రాలపై అభిరుచి కలిగినవాడు వాస్తవిక జీవితాన్ని ఆమోదించటానికి గాని, వాస్తవిక జీవిత సమస్యల నెదుర్కొనటానికి గాని పనికిరాకుండా పోతున్నాడు ఈ చిత్రాలు జీవితం మీద ఒక విధమైన రోత పుట్టిస్తాయి, జీవిత సత్యాలను మరుగుపరుస్తాయి, కృత్రిమ జీవిత ప్రమాణాలను ప్రచారం చేస్తాయి సంఘ క్షేమం కోరే వాడికిది జాతీయ విద్రోహకర పంథాగా కనబడక తప్పదు

ఈ పరిస్థితి కేవలం ఒక జానపద చిత్రాలద్వారానే గాని, హాలీవుడ్ చిత్రాల అనుకరణవల్లనేగాని ఏర్పడుతుందనుకోనవసరంలేదు అభిరుచుల విషయంలో జనసామాన్యానికి వీలయినంత దగ్గరగా వెళ్లే చిత్రనిర్మాతలు ఏ మాత్రం అవకాశం ఉన్నా కథల విషయంలోనూ, పాత్రల విషయంలోనూ ప్రజాజీవితానికి సన్నిహితంగా వెళ్లడానికి సంశయించరు వారికి అటువంటి అవకాశాలు లేకపోవటం పూర్తిగా వారి తప్పుకాదేమో

సంఘంలోని బహు సంఖ్యాకులైన కార్మికులూ, కర్షకులూ, వారి బాధలూ, కృషీ, సమస్యలూ సినిమాలో స్థానం సంపాదించజాలవని మనం సులభంగా ఊహించుకోవచ్చు అటువంటి అంశాలతో గూడిన కథలు చిత్రాలుగా తీసినట్టయితే మన జాతీయ ప్రజా ప్రభుత్వమే సహించదన్న భావం దాదాపు ప్రతి చిత్రనిర్మాతకూ ఉంది ఇది నిజం కావచ్చు, కాకపోవచ్చు ఇదివరలో కొన్ని చిత్రాలకూ, నాటకాలకూ కలిగిన అనుభవాన్ని బట్టి చిత్రనిర్మాతలు భయపడటానికి ఆధారం ఉంది వాస్తవ జీవిత పరిస్థితులను చిత్రించే నాటకాలను కొన్నిటిని మన రాష్ట్ర ప్రజా ప్రభుత్వం నిషేధించింది "ద్రోహి" చిత్రంలో జీవిత వాస్తవికత ఏమైనా ఉందేమోనన్న భయంతో ఆ చిత్రాన్ని మూడుసార్లు సెన్సారు చేశారు! అది అభ్యుదయ చిత్రం కూడా కాదు అందులో ఉన్న సంఘర్షణ కూలీలకూ కామందులకూ మధ్య జరిగేది కాదు మధ్య తరగతిని వంచించే ధనికుడికీ, అడుక్కుతినే వాళ్లకూ మధ్య, వ్యక్తిగతమైన సంబంధాల వల్ల జరిగినది ఇందులో జీవితవాస్తవికత ఏమీలేదు అయినా సెన్సారువారు మూడుసార్లు స్తనశల్యపరీక్షచేసి "పదండి!" అన్న ముక్క కాబోలు కత్తిరించారు!

ప్రభుత్వ వర్గాలు ప్రదర్శించే ఈ మనస్తత్వం పూర్వపు విజాతీయ పరిపాలనలో ఉండిన ధోరణిలోనే ఉండటం అల్లా ఉంచి, చిత్రాలద్వారా జాతీయవికాసం తీసుకురావటానికి కనపడని అంతరాయంగా కూడా ఉంది సాంఘిక దుస్థితిని ప్రభుత్వం తొలగించలేదు చిత్రాలద్వారా నిరూపించనీదు ఈ పరిస్థితులలో ఉన్న ప్రభుత్వంమీద ధ్వజమెత్తకుండా చిత్ర నిర్మాతలు జాతీయవికాసంతో కూడుకున్న చిత్రాలు తీయలేరనిపిస్తుంది

కాని సామెత చెప్పినట్టు మనసుంటే మార్గం ఉండకపోదు చిత్రనిర్మాతలు జాతీయ పునర్నిర్మాణానికి పూనుకున్నట్టయితే జాతీయవికాసంతో కూడుకున్న సంఘటనలు పూర్వ చరిత్రలో బోలెడన్ని దొరుకుతాయి, జాతీయవికాసాన్ని ప్రతిబింబించే ''పేదరాసి పెద్దమ్మ'' కథలు ఎన్నయినా రాసుకోవచ్చు, నినాదాలతో పనిలేకుండా, సమస్యలను పరిష్కరించే భారం మీద వేసుకోకుండా జీవితాన్ని ఉన్నదున్నట్టు చాలావరకు చిత్రించుకుపోవచ్చు ఇటువంటి జీవిత చిత్రణంలో వర్గ సంఘర్షణా, సాంఘిక పీడనమూ అట్టే ప్రతిబింబించదు, నిజమే కాని ఇప్పుడు మనం చూసే అభూతకల్పనకన్నా, తుచ్ఛమైన అనుకరణలకన్నా ప్రజలదృష్టి జాతిమీదా, జీవితంమీదా బాగా కేంద్రీకరించబడుతుంది

మన జాతీయాచార వ్యవహారాలకూ, మన జీవితసమస్యలకూ, సంఘానికీ చెందని ఎటువంటి చిత్రాన్నయినా ఈ దేశంలో తీయవచ్చు మన ప్రభుత్వం అభ్యంతరం పెట్టదు ఇది చాలా శోచనీయమైన పరిస్థితి దీన్ని మార్చటానికి సినిమా ప్రేక్షక సంఘాలు, ఇతర సినిమా సంస్థలూ దీక్షగా కృషిచేయాలి ఇది జాతీయ దురభిమానం పెంచటానికి అంటున్న మాటకాదు తన జాతీయతను ఆదరించలేని జాతి ఇతరుల జాతీయతలనూ ఆదరించలేదు ఏ అమెరికను చిత్రాన్నో కాపీకొట్టి భారతీయుల పేర్లుపెట్టి వాతావరణమూ, పాత్రలూ, సంఘటనలూ, ఆఖరుకు దుస్తులూ కూడా మాతృకలోలాగే ఉంచటం అమెరికాపై అభిమాన మనిపించుకోదు అది భావదాస్యం అనిపించుకుంటుంది భావదాస్యం ఎన్నడూ గొప్పకళలను సృష్టించలేదు ఇతరుల ఆచారవ్యవహారాలు మనకు అనుకరణయోగ్యం అయినట్టయితే వాటివల్ల తప్పక జాతీయ ప్రయోజనం ఉండి తీరుతుంది వాటినెవరూ కాదనరు ఈనాటి సినిమా చిత్రాలలో జాతీయ ప్రయోజనం మృగ్యంగా ఉండటమే ప్రథమ అసంతృప్తికి కారణం

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 4-7-1951*

# 49. సినిమా పరిశ్రమ : కళా స్రష్టలు

సినిమాకూడా కావటానికి పరిశ్రమే అయినా, సినిమా పరిశ్రమకూ తదితర పరిశ్రమలకూ చాలా వ్యత్యాసాలున్నాయి ఉదాహరణకు సినిమా చిత్రానికుపయోగించు ముడిసరుకు ధరకూ సినిమా చిత్రం ఖరీదుకూ పొంతన ఏమీ లేదు ఇతర వస్తువుల నిర్మాణంలో లోపాలు జరిగితే కూడా సరుకు ఏదోకాడికి అమ్ముడు పోతుంది చెడిపోయిన సినిమాచిత్రం ఏ కాడికీ అమ్మదు

ఇంతకన్న ముఖ్యమైన విషయమేమంటే ఇతర పారిశ్రామిక ఉత్పత్తులను అనేక ప్రక్రియలుగా విభజించి, వాటిని చూపేవారిలో ఎక్కువ భాగం చదువూ సంధ్యాలేని

శ్రామికులుండేటట్టూ, మొత్తం ఉత్పత్తి ఏ ఒకరిద్దరు నిపుణులమీదనో మాత్రమే, ఆధారపడేటట్టూ చూస్తారు అంటే ఇతర పరిశ్రమల్లో ''బండపని'' జాస్తి సినిమా చిత్రనిర్మాణంలో నిపుణుల సంఖ్య చాలా హెచ్చు మంచి సినిమా చిత్రం తీయాలంటే కనీసం ఒక గట్టి కధకుడూ, ఒక గట్టి కవీ, ఒక గట్టి కళాకారుడూ, ఒక గట్టి సంగీత వేత్తా, ఒక గట్టి కామెరావాడూ ఉండాలి ఇంకా నాట్యాలు నేర్పేవాళ్ళూ, కత్తిసాములు నేర్పేవాళ్ళూ కూడా ఉంటే ఉండనూ వచ్చు వీరందర్నీ మించిన డైరెక్టరుండాలి ఆపైన సమర్థులైన నటులూ, పాటగాళ్ళూ, నాట్యగాళ్ళూ ఉండాలి

ఇంతమంది చేసే పనులలో ఏ ఒకడిదీ ''బండపని'' అనిపించుకోదు వీళ్లంతా తాము చేసే పనులలో మనసులు లగ్నంచేసి ఆత్మ సంతృప్తి సాధించుకుంటూ పనిచేయాలి అప్పుడే మంచిచిత్రం వెలువడుతుంది ఇంతమంది ఆత సంతృప్తితో బాటు చిత్ర నిర్మాతకూ, డబ్బు పెట్టేవాడికీ కూడా తృప్తి కలగాలి అంటే చిత్రానికి బాగా డబ్బు రావాలి

చిత్ర నిర్మాతలు తమ లాభాలే ప్రధానంగా ఎంచుకుని మిగిలినవారి సంతృప్తిని లక్ష్యపెట్టకుండా జనాన్ని రంజింపచేయటానికి చిత్రంలో దొరికీ దొరకని బూతులు నాలుగూ, అతికీ అతకని నీతులు నాలుగూ పెట్టి కొద్ది చిత్రాలు తీయవచ్చు, సఫలులు కూడా కావచ్చు కాని అటువంటి పరిస్థితులు కాలక్రమాన సినిమా పరిశ్రమకే అపాయం కలిగిస్తాయి

అటువంటపప్పుడు ఇంతమంది ''నిపుణుల'' ఆత్మసంతృప్తి సాధించడం ఎట్లా ? అది సాధ్యమవుతుందా ? వీళ్ళ తమ ''కళా స్వాతంత్ర్యాన్ని '' ఎంతవరకు కోల్పోవాలి ? అటువంటి ప్రశ్నలు కలిగి తీరుతాయి ఇది మన సినిమా పరిశ్రమను ఎదుర్కొంటూ ఉన్న పెద్ద క్లిష్ట సమస్య దీన్ని మాత్రం మన ప్రొడ్యూసర్లు తప్పించుకు తిరుగుతున్నారు ప్రస్తుతం మన చిత్రాలలో కలిగిన అభివృద్ధి కేవలం అనుభవం ద్వారా లభ్యమైనదే గాని, నైపుణ్యం ద్వారా లభ్యమైనది కాదు నిజంగా నిపుణుడైనవాడు దారి తప్పి ఏ సినిమా శాఖలోకిగాని ప్రవేశిస్తే వాడితో మిగిలినవాళ్లు వేగలేరు వాడు చిత్రనిర్మాణకర్మకాండను తారుమారు చేసాడతడు ఉదాహరణకు సమర్థుడైన కధకుణ్ని తెచ్చి వాడిచేత కధరాయిస్తే, వాడు రాసిన కధను రాసినట్టు అమోదించినప్పటికీ కూడా డైరెక్షనులో గాని, నటనలో గాని వాడు అనుకోని వ్యత్యాసాలు వచ్చి, తాను సృష్టించిన సంఘటనలకు గాని పాత్రలకు గాని తభావతు ఏర్పడితే వాడు ఊరుకోడు , ఊరుకోలేడు సంభాషణలో ఒక్కమాట ఉచ్చరించటంలో కొద్ది మార్పు జరిగినందువల్ల పాత్ర ఎంతగా మారిపోయే అవకాశం ఉందో కధకుడికి తెలిసినంతగా డైర్క్టరుకు తెలియకపోవచ్చు-- డైర్క్టరు కూడా పాత్రల విషయంలో కధకుడంత సూక్ష్మదృష్టికలవాడైతే తప్ప ! అంటే డైర్క్టరు కధకుడంతవాడైనా కావాలని తేలుతున్నది

నిపుణుడైన డైర్క్టరు దృష్టినుంచి కధకుడు కూడా అంతే ఈ కధకుడు సమర్థుడై మంచి సన్నివేశాలూ, పాత్రలూ సృష్టిచేస్తేనే తప్ప తాను దర్శకుడుగా ఏమీూ చేయలేడు. దర్శకుడూ, కధకుడూ కూడా సమాన నైపుణ్యం కలవాళ్లుగా చూసి ఏరుకోంటంకన్న రెండు పనులూ చేతనయినవాణ్ని పెట్టుకోవటం చాలా సులభం అందుకనే మన సినిమారంగంలో చాలా మంది డైరెక్టర్లు తమ కధలను తామే రాసుకోటం జరుగుతూవచ్చింది ఇందులో తప్పేమి లేదు

కధకుడికీ డైరక్టరుకూ మధ్య ఉండే సంబంధంలాంటిదే ప్రొడ్యూసరుకూ, డైరెక్టరుకూ

ఉండే సంబంధంకూడా అందుకనే పేరు కెక్కిన డైరెక్టర్లలో చాలామంది తమ చిత్రాలను తామే నిర్మించుకుంటారు

నిజం ఆలోచించినా అంతే నుంచి స్క్రీన్‌ప్లే రాయగలవాడు కొంతవరకు డైరెక్టరుపనీ, కొంతవరకు కెమెరాపనీ తానే చెయ్యాలి సినిమా చిత్రనిర్మాణంలో పాల్గొనే ప్రతీనిపుణుని ఇతర నిపుణుల సంఖ్య చిత్రనిర్మాణంలో ఎంత తక్కువగా ఉంటే అంత మంచిది చిత్ర నిర్మాతగానూ, నటుడుగానూ జగద్విఖ్యాతి గడించిన చార్లీచాప్లిన్ ప్రజలకు ప్రదర్శించే సినిమా కళలో ఏకత్వం సమగ్రత్వం ఉంటుంది

కళాదృష్టిలో ఉత్తమ చిత్రాలుగా నిర్ణయించి ఎకాడమీ ఎవార్డులిచ్చినప్పుడు ఒకే చిత్రానికి మూడు నాలుగు బహూకృతులు రావటంలో కూడా ఇదే అర్థం చిత్రం బాగుండి, ఫోటోగ్రఫీ బాగుండక పోవటమూ, ఫోటోగ్రఫీ బాగుండకుండా దర్శకత్వం మటుకు అద్భుతంగా ఉండటవమూ సాధారణంగా జరగదు హాలీవుడ్‌లో గొప్ప డైరెక్టర్లందరూ, ప్రొడ్యూసర్లుకూడానూ, అందులో కొద్దిమంది తమస్క్రిప్టు తామే రాసుకుంటారు మన దేశంలో కూడా ఇటువంటి ఏర్పాటున్నది నితిన్‌బోస్ డైరెక్టరు కామెరామాన్, స్క్రిప్టురైటరు

మన సినిమా చిత్రాల భావిఅభివృద్ధి సర్వతోముఖమైన నైపుణ్యంగల వారిపై ఆధారపడి ఉన్నది ఇటువంటివారే ఇక ముందు సినిమా చిత్రనిర్మాణాన్ని నడుపుతారు లేదా, ఒక ప్రొడ్యూసరుకొక డైరెక్టరూ, ఒక డైరెక్టరుకొక స్క్రిప్టురైటరూ ఖాయమైపోయి చిత్రనిర్మాణం సాగించాలి అంతేగాని కొంతకాలం కిందట కిరాయి నాటకాల వతుగా కొంతమంది పేరున్న నటులనూ, ఒక పేరున్న డైరెక్టరునూ, ఒక పేరున్న స్క్రిప్టురైటర్నూ చేర్చి గొప్ప చిత్రాలు తీసే ఆశలేదు

సినిమా చిత్ర నిర్మాణంలో ఒక క్రమాభ్యుదయం కనపడాలంటే చిత్ర నిర్మాణానికిగాను పాటుపడే నిపుణులలో ఐక్యతేగాక వారిమధ్య సమలక్షణాలుకూడా ఏర్పడాలి సినిమా కళకు వారు ముందుగానే కొన్ని ఆశయాలు తమలోతాము నిర్ణయించుకుని వాటికొరకు కలిసి పనిచెయ్యాలి ఎవడిమటుకు వాడు తన జీతభత్యాలను గురించే, తన లాభంగురించే ఆలోచిస్తూన్నప్పటికీ పరిశ్రమ ముందరికి పోతుందనుకునే ఆశ ఇతర పరిశ్రమలలో ఉండవచ్చుగాని సినిమాలో లేదు ఇతర పరిశ్రమలకూ సినిమాపరిశ్రమకూ గల ముఖ్య భేదాలలో ఇది కూడా ఒకటి

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 11-7-51*

# 50. సినిమా శిల్పం : జాతీయత

సినిమా కళ మనకు ఇతర దేశాలనుండి దిగుమతి అయిన సంగతి అందరికీ తెలిసిన విషయమే అది మన కళా సాధనం కాదు ఈనాడు కూడా మన జాతీయ సినిమా పరిశ్రమ యావత్తూ ఎన్నో దిగుమతి వస్తువులపై ఆధారపడి వున్నది స్టూడియోలో ఉండే కామెరాలూ, వెన్స్యులూ, రికార్డింగ్ యంత్రాలూ, లైట్లూ, మైకులూ, మానియోలాలూ, ప్రొజెక్టర్లూ, ముడి ఫిలిమూ, చిత్రనిర్మాతలు తప్పనిసరిగా ఉపయోగించే మోటార్లూ, వ్యాన్‌లూ, పెట్రోలూ, సినిమా ప్రచారానికి కావలసిన కాగితాలూ, రంగులూ, అచ్చుయంత్రాలూ, స్టిల్ కామెరాలూ,

ప్రోసెస్ ప్లేట్లూ, రసాయనాలూ ఒక్కటేమిటి ? కచ్రసామగ్రీ, తడికలూ, మట్టీ మొదలైనవి కొద్దిగా మినహాయిస్తే సమస్తమూ దిగుమతి సరుకే, దిగుమతి సుంకాలిచ్చుకునేవే

ఇన్ని రకాల దిగుమతి సరుకులతో తయారయే భారతీయ చిత్రాలలోని శిల్పం జాతీయ వాసనలు కలిగి ఉండటంలో ఆశ్చర్యపడవలసిన పనిలేదు అయినప్పటికీ మన దేశంలో ఫాల్కే మూవీ చిత్రాలు తీయడం ప్రారంభించినపుడే ఒక జాతీయ సినిమా శిల్పం అమలులోకి వచ్చింది అయితే అప్పట్లో కామెరా కేవలం సాక్షీభూతంగా ఉండేది కనక చెప్పుకోతగిన సినిమా శిల్పం లేదనవచ్చును అయినా ఉన్నంతలోనే ఆకాశంలో నారదుణ్ణి చూపటానికీ, సముద్రంలో శేషశాయిని చూపటానికీ, ఓవర్ ప్రింటింగ్ పద్ధతి వినియోగించబడింది మలిపుల్ ప్రిజంతో ఒక రాక్షసుడు అనేకమంది రాక్షసులైనట్టు చూపటం జరిగింది సాధనాలన్నీ విదేశీ సరుకే అయినప్పటికీ, అప్పట్లో తీసిన పురాణ చిత్రాలకు ఉపకరించే జాతీయ సాధనాలు చాలావరకు సినిమా తెరమీదకు తీసుకురాబడ్డాయి ఇవన్నీ అంతకు పూర్వం రంగస్థలాన చేసిన ప్రయోగాలు కాకపోవడం చేత సరికొత్త సృష్టికూడా అయినాయి ఆ కాలంలో ''శ్రీకృష్ణ లీల'' చిత్రంలో నీటి అడుగున కృష్ణుడికీ కాళీయుడికీ జరిగినట్టు చూపబడిన పోరాటమూ, ''లంకా దహనం'' చిత్రంలో హనుమంతుడి పాత్రా, ఆ హనుమంతుడు అంతలో చిన్నవాడూ, పెద్దవాడూ కావటమూ మొదలైన దృశ్యాలు ఆనాటి అమాయక ప్రేక్షకులకు ఊహించలేనంత అద్భుతం గానూ అపూర్వంగానూ గోచరించాయి అంతకు పూర్వం వారు ఈ పురాణ కథలను విన్నా, నాటకరంగాన చూసినా కూడా కలగని ఆనందం ఫాల్కేగారి చిత్రాల ద్వారా ప్రేక్షకులకు లభించింది ఆ రోజులలోని సినిమా శిల్పం విజాతీయ వాసనలను కలిగి ఉన్నట్టు ఆనాటి ప్రేక్షకులు భావించనేలేదు

ఆనాడవి పురాణ చిత్రాలు, యావద్భారత చిత్రాలు కూడానూ, ఈనాడుపురాణ చిత్రాలు లేనేలేవు, మీదు మిక్కిలి తెలుగువారికి తెలుగు చిత్రాలూ, తమిళులకు తమిళ చిత్రాలూ ఉన్నాయి ఈనాడు మనం తయారుచేసుకునేవి ముఖ్యంగా జానపద చిత్రాలూ, సాంఘిక చిత్రాలూనూ ఈ జానపద చిత్రాలు మన ప్రజల అభిరుచులకు చాలా సన్నిహితంగా ఉన్నవనీ, సాంఘిక చిత్రాలు ప్రజా జీవితానికి సన్నిహితంగా ఉన్నవనీ, ఈ రెండు విధాలా ఇవి పురాణ చిత్రాలకంటె ప్రజలకు సన్నిహితమైనవనీ వాదించే అవకాశం ఉన్నది

కాని మన సినిమా శిల్పం చూసినట్టయితే ఫాల్కేగారి నాటికి అందులో ఉండిన జాతీయతలో ఈనాడు నూరో వంతు లేదనిపిస్తుంది ఈ జానపద చిత్రాలు మన పాత సంప్రదాయాలను గాని, సాంఘిక చిత్రాలు ప్రస్తుతాచారాలను గాని ప్రతిబింబించవు జానపద చిత్రాలలో కనీసం మన పూర్వకాలపు శిల్పాలైనా కనపడవు, చరిత్ర స్ఫురించదు సాంఘిక చిత్రాలలో అధమం ఒక తెలుగువాడి ఇల్లయినా కంటపడదు అన్నింటికంటే ఘోరమేమిటంటే జానపద చిత్రాలకూ, సాంఘిక చిత్రాలకూ కూడా మాతృకలు దిగుమతి సరుకే !

ఈ కాలంలో శిల్పంలో చాలా గొప్ప పరిణామాలు జరిగిన మాట నిజమే ఈ పరిణామంతో బాటు ప్రజాసామాన్యంలో సినిమాలపై ఆదరణ అనేక రెట్లు పెరిగినమాటా నిజమే కాని సినిమా శిల్పంలో జరిగిన పరిణామం జాతీయతనూ, జాతీయ భావాలనూ తృణీకరించి జరిగింది, వాటిని పురస్కరించుకుని జరగలేదు అందుచేతనే అధిక సంఖ్యాకులకు

సినిమా వ్యామోహం పాలు అధికం అయినప్పటికీ వారు కొన్ని రకాల అభిరుచులు తెచ్చిపెట్టుకుంటే గాని సినిమాలపై ఆదరం పెంచుకోలేక పోయినారు అదే ఇంకో విధంగా చెప్పాలంటే సినిమాలు చూసి ఆనందించటం మన ప్రజలు నేర్చుకోవలసివచ్చింది

అటువంటి పరిస్థితిలో ప్రజలు సినిమాలకు దూరంగా ఉండిపోలేక పోయారా అనవచ్చు ప్రజలలో సినిమా అభిరుచి వ్యాపించటానికి చాలా విషయాలు తోడ్పడ్డాయి

1 సినిమాల రాకతో ముఖ్యంగా టాకీల రాకతో ప్రతి ఊళ్లోనూ స్థావర సినిమా థియేటర్లు ఏర్పడి ప్రజలకు నిత్య వినోదం ఒకటి అమలులోకి వచ్చింది అంతకుపూర్వం నూటికో కోటికో ఒక నాటకం చూసే అవకాశం మాత్రమే ఉండేది అదీకాక నాటకాలకన్న సినిమాలు చవుక అందుచేత ప్రతిచోటా ఉండిన నాటకాలహాళ్లు సినిమా థియేటర్లుగా మారిపోయాయి దానితో నాటక ప్రదర్శనాలు మరింత అరుదైపోయాయి ప్రజలు సినిమాలవేపు మళ్లారు

2 ప్రఖ్యాత స్టేజి నటులలో కొందరు సినిమాలకు ఎగబడ్డారు మంచి నటులు తక్కువ కాలంలో ఎక్కువ డబ్బు సంపాదించుకొనే అవకాశాలు సినిమాల ద్వారా లభించాయి స్త్రీ పాత్రలు స్త్రీలే వెయ్యాలన్న నియమం స్టేజిమీద పూర్తిగా అమలు కానేలేదుగాని సినిమాలలో మొదటినుంచీ అమలు జరిగింది కాలక్రమాన సినిమాలలో కూడా ప్రసిద్ధనటులంటూ తయ్యారై స్టేజి తారలకన్న ఎక్కువగా ప్రజలను తమ ప్రతిభద్వారా ఆకర్షించసాగారు

3 రానురాను సినిమా కామెరాకు కాళ్లూ, నోరూ లభించాయి సినిమా కామెరా సినిమా ప్రేక్షకులను స్టేజి ప్రేక్షకులు పోలేని చోట్లకు తీసుకుపోసాగింది నటుల వాచకాభినయాలతో కథ నడిచినట్టే కామెరాతో కూడా కథ నడవటం ఆరంభమయింది సినిమాకళ తన ప్రత్యేకతను ప్రతిష్ఠించుకున్నది

4 అద్భుతమైన ఫోటోగ్రఫీ, అతి స్పష్టమైన శబ్దగ్రహణమూ, అత్యంత రమణీయమైన సెట్టింగులూ, దుస్తులూ, అలంకరణలు, సహజత్వమూ సినిమా దృశ్యాలకు శోభ చేకూర్చాయి

5 చిత్ర నిర్మాణ వ్యయం నానాటికీ పెరుగుతున్న కొద్దీ సినిమా వినోదం ఖర్చు పెరగలేదు గడచిన పదేళ్లలో అనేక వస్తువుల ధరలు నాలుగింతలూ, అయిదింతలూ పెరిగినా సినిమా టిక్కెట్ల మూల్యం దానితోపాటు పెరగలేదు ద్రవ్యోల్బణం దృష్ట్యా చూస్తే సినిమా టిక్కెట్ల ఖరీదు అంతో ఇంతో తగ్గింది కూడానూ ఆ కారణంచేత ప్రజలలో సినిమాకు ఆదరం మరింత హెచ్చింది

6 సినిమాపట్ల ప్రజలలో వ్యాప్తి చెందిన ఆదరాన్ని గ్రామఫోను రికార్డులూ, పత్రికలూ, రేడియో మరింత బలపరచి విరివిగా ప్రచారం చేశాయి

ఈ కారణాలన్నీ చూసినట్టయితే సినిమా దశకు ప్రజలలో విస్తరించిన ఆదరణకు జాతీయ భావాలతో ఏమీ సంబంధం లేదని తెలిసిపోతుంది "ఇది పదహారణాల తెలుగు జీవితాన్ని ప్రతిబింబించే చిత్రం" అని చెప్పదగిన చిత్రం ఈ పది పన్నెండేళ్ళలో ఒక్కటి కూడా వెలువడలేదని చెప్పవచ్చు " ఇది పదహారణాల భారతీయ వాతావరణం గల చిత్రం" అని చెప్పటానికి వీలైన చిత్రాలుకూడా మొత్తం మీద అరుదుగానే ఉన్నాయి

ఫాల్కేగారి పురాణ చిత్రాలు వెనకపడగానే మూవీలకు " ఎంగిలి" సోకింది బొంబాయిలో బయలుదేరిన కొన్ని కంపెనీలు స్టంటు చిత్రాలు తీయనారంభించాయి

భారతీయులలో ఎడ్డీ పోలోలూ, డగ్లస్ ఫెయిర బాంకులూ, చార్లీ చాప్లిన్‌లూ తయారయారు కలకత్తాలో మదన్ థియేటర్, పూనాలో బాబూరావు పెయింటర్ మొదలైనవారు మటుకు చాలాకాలంపాటు జాతీయతను కోల్పోలేదు

అయినా కాలక్రమాన దేశాన్ని జయించినది '' ఎంగిలి'' భావాలే, ఈ పరిణామంలో మన చరిత్ర నిర్వహించిన పాత్రకూడా కొంత లేకపోలేదు ఏ కళగాని ప్రజలకు సన్నిహితం కావటం ఆ కళను సృష్టిచేసే పారిశ్రామికులకు లాభదాయకం అయితే అది వారి జీవితాలకు సన్నిహితంగావటం మటుకు వారి ఆర్థిక – సాంఘిక సిద్ధాంతాలకు క్షేమం కాదు అందుచేత కళాహృదయం ప్రజలకు వీలయినంత దూరంలో ఉండి తన బాహ్యాకర్షణలతో ప్రజల్ని వశం చేసుకోవటం పారిశ్రామికుల ఆశయం మన సినిమా పరిశ్రమ ఆ మార్గంలోనే నడిచింది దీనికి విజాతీయ భావాలూ, అభిరుచులూ ఎక్కువగా తోడ్పడ్డాయి మన సినిమా చిత్రాలలో ప్రతిబింబించటానికి జాతీయ జీవితమే లేనట్టు మన చిత్ర నిర్మాతలు పాశ్చాత్య చిత్రాల తాలూకు కథలలోని అంశాలనూ, పాశ్యాత్యుల దుస్తులనూ, పాటలనూ, డాన్సులనూ ఆత్మాభిమానం ఆవగింజంత కూడా లేకుండా అనుకరించసాగారు

మనం బ్రిటిషువారి నిరంకుశ పరిపాలన కింద ఉండగా మన జీవిత వాస్తవికతను కళలలో ప్రతిబింబించటానికి రాజకీయ పారతంత్ర్యం పెద్ద అడ్డంకిగా ఉన్నదన్న సాకు ఒకటి ఉండేది స్వాతంత్ర్యం రాకతో జాతీయాభిమానమూ, జాతీయభావాలూ వికాసం పొందకపోగా ఇతరులను అనుకరించే భావదాస్యం, ప్రత్యేకించి సినిమా రంగంలో, మరింత హెచ్చింది

జాతీయభావాలనూ, జాతీయతనూ మన చిత్రాలలో ప్రతిబింబించటానికి మరొక అడ్డం కూడా ఉన్నది అది వ్యాపార సంబంధమైనది ఇప్పుడిప్పుడు దక్షణదేశంలో తయారయే చిత్రాలలో చాలా భాగం ఉభయభాషలలో( తెలుగు తమిళాలలో) తయారవుతున్నాయి ' ఇది పచ్చి తెలుగు చిత్రం' అని తమిళులుగాని, 'పచ్చి తమిళ చిత్రం, అని తెలుగువాళ్లుగాని భావించటం ఆర్థికంగా చిత్ర నిర్మాతలకు లాభించదు హిందీ చిత్రాలకూ ఇదే బాధ ఉన్నది అవి దేశమంతటా చలామణీ కావాలి అందుచేతనే తెలుగు చిత్రాలలో తెలుగు జీవితం లేదు తమిళ చిత్రాలలో ఎవరి జీవితమూ లేదు

'కళకు జాతీయ సంకుచితత్వం ఉండాలా ? అంతకన్న విశ్వజనీనత ఎక్కువ అవసరం కాదా ? ' అనవచ్చు, ఇది పైకి చాలా విశాల హృదయం గల వాదంగా కనిపించినా చివరకు కళ కోసమే అన్న సిద్ధాంతానికి దారితీస్తుంది జాతీయ సంకుచితత్వం తప్పే అది సమిష్టి జీవితం నుంచి నిష్క్రమించాలి కాని కళలలో దాన్ని లేకుండా చేసిన మాత్రాన అది పోదు అదీ కాక, అచ్చగా తెలుగు వాళ్లు ఆనందించే కళలలో తెలుగు జీవితాన్ని ప్రతిబింబించటం జాతీయ సభ్యత్వం కాదు ''మనం తెలుగువాళ్లం మన చిత్రాలలో ఇతర జాతులకు సంబంధించిన విషయాలూ, ఇతర జాతుల మతాలూ ఉండరాదు,'' అనటం సముచితత్వమే జాతీయాభిమానం విజాతిద్వేషం ఎన్నిటికీ కారాదు కాని చిత్రనిర్మాతలు ఇతరులను గురించి చిత్రాలు తీయటంలేదు. ఇతరులకు చెందిన వ్యవహారాలకు చెందిన అరాచవ్యవస్థలను మనవిగా చూపించి చిత్రాలు తీస్తున్నారు చివరకు మన చిత్రాలలో ప్రతిబింబించేది ఎవరి జీవితమూ కాకుండా పోతున్నది ఇది హృదయ వైశాల్య లక్ష్యం కాదు

అచ్చుగా సంస్కారం దృష్ట్యా మాత్రమేకాక ఇతర కారణాలను బట్టికూడా మన సినిమా కళలో జాతీయ శిల్పం సృష్టించుకోవలసి ఉన్నది ఈ శిల్పాన్ని శాసించవలసినది ప్రేక్షక సామాన్యం తాలూకు కళాగ్రహణ శక్తి, చిత్రం తాలూకు, చిత్రం యొక్క స్వరూపమూ, చిత్ర నిర్మాత ఆర్థిక పరిస్థితులు వగైరా, అంతేగాని హాలీవుడ్ చిత్ర నిర్మాణ ప్రమాణాలూ, హిచ్‌కాక్ డైరెక్షను నైపుణ్యమూ మొదలైనవి కావు

మన చిత్రనిర్మాతలు సెట్టింగ్‌లను గురించీ టేకింగుగురించీ, పాటలనుగురించీ పాత్ర ఆహార్యాన్ని గురించీ ఆలోచించేటప్పుడు కథను మనసులో ఉంచుకోరని మన చిత్రాలలో చాలా భాగం రుజావు చేస్తున్నాయి జానపద చిత్రాలనేసరికి దుస్తులకిందా సెటింగులకిందా, రంగాలంకరణలకిందా లక్షకుపైగా అయిపోతుంది బిచ్చగత్తెతో పాడించే పాటకు కూడా అయిదువేల రూపాయలు ఖర్చు చెయ్యటం జరుగుతుంది మహారాజులు కూడా నివసించని ఇళ్ళు సాంఘిక చిత్రాల కథానాయకులకు కల్పించటం జరుగుతుంది మన చిత్రాలలో జాతీయతా, వాస్తవికతా ఉన్నట్టయితే ఇదంతా దుర్వ్యయమే ప్రేక్షకులను మభ్యపెట్టడమే చిత్ర నిర్మాతల ఆశయమూ, వ్యాపార లక్ష్యమూ కావటాన ఇదంతా తప్పనిసరి అయింది

ప్రస్తుతం మన చిత్రాలలో దాదాపు 800 షాట్లు ఉంటాయి ఇవి తీయటానికి 80 రోజులు పట్టవచ్చు ఇదే చిత్రాన్ని 80 షాట్లలో తీసి 20 రోజుల్లో షూటింగ్ ముగించినా మన ప్రేక్షకులు ఇంత తృప్తిగానూ చూడవచ్చు కాని అట్లా చేస్తే పాశ్చాత్య సినిమా శిల్పం అనిపించుకోదని మన ప్రొడ్యూసర్ల భయం! కాని మనం హాలీవుడ్‌ను అనుకరిస్తామనుకుంటున్నామో ఆ హాలీవుడ్ లోనే ఒక్కొక్క సన్నివేశమూ ఒకటే షాట్‌గానూ, చిత్రమంతా ఒకే సన్నివేశంగానూ టేక్ చేసిన చిత్రాలూ తయారయాయి

ఫేడిన్ లగాయతు మళ్లీ మిక్స్‌దాకా, లేక ఫేడౌట్ దాకా ఒకే షాట్‌గా ఎందుకు తియ్యరాదంటే మనవాళ్లు చెప్పే అభ్యంతరాలలో ఒకటి ఏమంటే మన సినిమా నటులు సరిగా సంభాషణలు చెప్పలేరనీ, అభినయంలోనూ, కదలికలోనూ తప్పులు చేస్తారనీనూ ఈ విషయం సినిమా ప్రపంచంలోని వారికి ఆశ్చర్యం కలిగించకపోయినా పైవారికి ఆశ్చర్యం కలిగించవచ్చు ఎందుచేతనంటే మన స్టేజినటులలో ప్రతి ఒకడూ తెరలేచి, పడేదాకా తన పాత్రను తాను నిర్వహిస్తాడు సినిమా దృశ్యాలు స్టేజి దృశ్యాలంత పొడవుండవు సినిమా సంభాషణలు స్టేజి సంభాషణఅంత దీర్ఘంగా ఉండవు నాటక ప్రేక్షకులలాగా కాకుండా సినిమా కామెరా కదులుతుంది అందుచేత ఆ దృశ్యంలో ఉన్న ప్రతీ మనిషీ దృశ్యం పూర్తి అయేదాకా కామెరా ఎదురుగా ఉండనవసరంలేదు అందుచేత కామెరా ఎదటలేని విరామంలో తన అభి నయాన్ని గురించీ, సంభాషణ గురించీ ఆలోచించుకోవచ్చు కాని మన చిత్రనిర్మాతలు చెప్పేది నిజమైతే సినిమా నటులు నాలుగైదు నిమిషాలపాటు కూడా కామెరా ఎదట నిలబడటానికి శక్తిలేనివారని తేలుతున్నది అట్లా అయితే వారు పుచ్చుకుంటున్న పెద్ద మొత్తాలు వృథా అనాలి

ఆర్థిక సమస్య చాలా ముఖ్యమైనది నాలుగులక్షలు పెట్టి చిత్రం తీస్తే 12 లక్షల రూపాయలు ప్రేక్షకులిస్తేగాని పెట్టుబడి తిరిగిరాదు దాదాపు 50 లక్షలమంది ప్రజలు చూస్తేనే గాని సినిమా చిత్రం గిట్టింపు కాదనుకోవాలి మన సినిమా శిల్పం ఆర్థిక దృష్టిలో ఖర్చుతో కూడుకున్నది కాకుండా ప్రజల దృష్టిలో సముచితమైనదిగా ఉండేటట్టు చూసుకున్నట్టయితే

ఇంత దుస్థితి ఉండదు  కాని అటువంటి శిల్పం వ్యాప్తిలోకి తీసుకువచ్చే ప్రయత్నం ఎక్కడా కనిపించదు

ఆంధ్రపత్రిక, వారపత్రిక, 18-7-51

# 51. యోగ్యుడైన డైరెక్టర్

ఈనాడు డైరెక్టర్లకు కళాగౌరవం లేదు  ఎక్కువగా డబ్బువచ్చే పిక్చరు తీసినవాడు మేటి డైరెక్టరు  ఏ డైరెక్టరుతో అధికంగా కళాసృష్టి జరుగుతుందన్న ప్రశ్న చిత్రనిర్మాతలకు లేనేలేదు  సినిమా ప్రేక్షకులకూ అట్టే ఉన్నట్టులేదు  ముందు ముందు సినిమా ప్రేక్షక సంఘాల ప్రతినిధుల ద్వారా గాని, సినీ టెక్నీషియనుల ద్వారాగాని ఈ లోపం తీరవచ్చునేమో

ప్రస్తుతానికి మటుకు డైరెక్టరంటే చిత్ర నిర్మాతలకు డబ్బు వచ్చే చిత్రాలు తీసిపెట్టే సామర్థ్యాలుగల వాడన్న భావం ప్రచారంలో ఉంది  సినిమా చిత్రాలకు డబ్బు బాగా రావాలంటే ప్రజలను అమితంగా ఆకర్షించాలి గనక, అటువంటి ఆకర్షణతో కూడుకున్న చిత్రాలు తీసే నేర్పరితనం ఈ డైరెక్టరుకున్నట్టే భావించాలి  ఈయన కళాకారుడనుకున్నట్టయితే ప్రజలను అపారంగా ఆకర్షించే శక్తే సినిమా కళ అనిపించుకోవలసి వస్తుంది

ఈ నిర్వచనం తప్పని వేరే చెప్పనవసరంలేదు  శరీరానికి ఆహారం పుష్టినిచ్చి తద్వారా శక్తి చేకూరుస్తుంది  మద్యం తాత్కాలికంగా ఇచ్చే ఉత్సాహోత్సాహాలు మంచి ఆహారంద్వారా ఎన్నడూ లభించవు  అయినా మద్యం ఆహారమని ఒప్పుకోలేం  మద్యం తాత్కాలికంగా ఉద్రేకమిస్తుందో, కాలక్రమాన అంత ఆనందపరుస్తుంది  ఇటువంటి శక్తి సినిమా చిత్రాలకున్నట్టయితే వాటిని కళ అని ఎవరూ అనరు  కళ అన్నది భావస్యాన్ని కలిగించి సమిష్టిమీద విధిగా జాతీయ వికాసానికి తోడ్పడాలి  అది శక్తులను వమురాలుగా వమురాలను మామూలుగానూ, సంఘాలను జాతిగానూ మార్చాలి  ఎవరి ఏకాంతంలో వారు తన్మయత్వం చెందాలంటే కళ అవసరం లేదు  బూతుకథలే చాలు

అయితే డైరెక్టరు కళా స్రష్టకుడన్న పదం కూడా అనేకమందిలో ప్రచారంలో ఉంది  పిక్చరు తీయవలసిన కథను స్క్రిప్టు రచయిత రాస్తాడు  నటులు నటిస్తారు, కేమెరామాన్ ఫోటో చేస్తాడు, ఎడిటర్ ఎడిట్ చేస్తాడు, మధ్యలో డైరెక్టరు చేసేదేమిటని చాలామంది అభిప్రాయం  ఇది సరిఅయిన అభిప్రాయం కాదని సులభంగానే నిరూపించవచ్చు  మాట వరసకి ఒకే స్క్రిప్టును నలుగురైదుగురు డైరెక్టుచేసినట్లయితే అన్ని చిత్రాలూ ఒకటిగా ఉండవు  స్క్రిప్టులోని అంశాలు ప్రవేశపెట్టకపోయినప్పటికీ ఈ వ్యత్యాసం ఉండనే ఉంటుంది  డైరెక్టరుకూ డైరెక్టరుకూ ఉండే ఈ తేడాలు కేవలం ''టేకింగు''కు సంబంధించినవి  దృశ్యాన్ని ఖండాలుగా షాట్స్‌గా విభజించటం దగ్గిరనుంచి షాట్స్ వెంబడి కేమెరాను జతచేయటం వరకూ డైరెక్టరుకూ డైరెక్టరుకూ తేడా ఉంటుంది  ఇందులో ఏ డైరెక్టరు ఏ ఇతర డైరెక్టర్లకన్న గొప్ప అన్న సమస్యజోలికి పోనే అవసరం లేదు  నలుగురు డైరెక్టర్లూ ప్రతిభగలవారే కావచ్చు నలుగురూ దృశ్యంలో ఉన్న ప్రధాన రసాన్ని సమంగానే పోషించవచ్చు, కాని ఆ ప్రధానరసం వెంట ఒక్కొక్కరు ఒక్కొక్క ఉపరసాన్ని సృష్టించవచ్చు, లేదా ఉన్న రసాన్నే కథకుడుగాని, నటులుగాని బలపరచలేని విధంగా డైరెక్టరు

టేకింగులో బలపరచవచ్చు అందులో కళాసృష్టి ఉన్నది

మరెవ్వరూ చేయలేని పని మరొకటి డైరెక్టరు చేస్తాడు అదేమిటంటే ''మోతాదు''లు నిర్ణయించటం ఏ పాత్ర ఏ ఘట్టంలో ఏ రసాన్ని తీసుకు రావలిసిందీ నటుడికి కూడా సులభంగా తెలియవచ్చు కాని ఎక్కడ ఎంత మోతాదులో చెయ్యాలన్నది కేవలం నటుడికి వదలటానికి వీల్లేదు ఎందుకంటే నటుడు తనకు ప్రాముఖ్యం రావటంకోసం మోతాదు హెచ్చించవచ్చు అదీకాక నటులు అనేకమంది ఉంటారు అందరూ వెళ్లి కథకుణ్ణి అడిగి కథకుడి అభిప్రాయం తెలుసుకోవటమూ, అన్ని దృశ్యాలలోనూ, అన్ని షాట్లలోనూ ఎంతెంత మోతాదులో ఏయే రసం సృష్టిచేయాలో తెలుసుకుని జ్ఞాపకం ఉంచుకోవటమూ సాధ్యమైనపని కాదు ఆపని డైరెక్టరు నిర్వహించి ఏ ఫిలింముక్కలో ఏయే సంభాషణా, నటనా భావప్రకటనా ఉండాలో దానికితగ్గట్టు తుంపులు దేనికదిగా నిర్మించి అన్నీ అంటించేసరికి కళాఖండం తయారయేటట్టు చూస్తాడు ఏ తుంపు(షాట్)లోనూ ఒక సమగ్రభావంగాని, రసరేఖగాని లేకపోవచ్చు మొత్తంమీద సమగ్రభావాలూ రసాలూ రావాలంటే డైరెక్టరు రసాన్ని కూడా ఖండాలుగా చిత్రించి అతికించి జీవంపోయగలవాడై ఉండాలి ఇది సామాన్య నటులకందరికీ వదిలిపెట్టదగిన పనికాదు

ఈ సందర్భంలోనే గమనించదగిన కళాసృష్టి రహస్యం ఒకటుంది రసయుతమైన సంగీతం తీసుకుంటే అందులో అచ్చుగా స్వరాలు సంగీతం సాధించలేవు స్వరాల మధ్యగల జాగాలు కూడా సంగీతానిక ప్రాణమే, చాతగానివాడు ఆ జాగాలకు సరిగా వాయించక, స్వరాలను సరిగా వాడికూడా జుగుప్స కలిగించవచ్చు, చిత్రనిర్మాణంలో కూడా ఇటువంటిదే ఉన్నది చిత్రంలో వినిపించేవి సంభాషణలు, పాటలు, బాక్ గ్రౌండ్ మ్యూజిక్ ఇవి కాక ఇంకొకటి కూడా వినిపిస్తుంది – నిశ్శబ్దం మాటలకూ, పాటలకూ, సంగీతానికీ ఎంత రసస్ఫురణాశక్తి ఉందో నిశ్శబ్దానికీ అంత ఉంది ఇంకా ఎక్కువే ఉంటుంది కూడానూ తెరమీది పాత్రల వాగ్వాదంగాని, సంఘర్షణగాని ఒక స్థాయికి వచ్చి మొండిబడిన జాగాలో చిత్రం కొంతసేపు నిశ్శబ్దంగా నడిచినట్టయితే 'సస్పెన్స్' పుడుతుంది అట్లాగే ఒక సంభాషణ అనంతరం మరొక సంభాషణ ప్రారంభించకముందు ఎంత జాగా నిశ్శబ్దంగా ఉంచాలో సరిగా తూచినట్టయితే మొదటి సంభాషణ యొక్క ప్రాముఖ్యం బాగా పెరుగుతుంది అట్లాగే ఒక పాత్ర ఒకమాట అన్న తరువాత, దాని ఫలితంగా ఇంకో పాత్రగాని ఆ పాత్రే గాని ఏదైనా చైతన్యం ప్రదర్శించాలంటే మధ్య ఎంత జాగా ఇవ్వాలో సరిగా నిర్ణయించాలి ఇటువంటి సమస్యలన్నిటినీ కలిపి స్థూలంగా ''టైమింగ్'' అనవచ్చు ఒకే షాట్‌లో నటుడు 'టైమింగ్' పొరపాటు చేస్తేగాని, రెండు షాట్ల మధ్య ఎడిటరు పొరబాటు చేస్తేగాని అది సరిచేయవలసిన భారం డైరెక్టరుది

డైరెక్టరు చేతిలో ఉన్న 'మోతాదు','టైమింగ్' నిర్ణయాలు రెండూ రసోత్పత్తికి ప్రాణంలాటివి, స్టేజి నాటకాలుకూడా వీటి ఆధారంతోనే రక్తికడతాయి అందుచేత వాటికి కూడా సరిఅయిన డైరెక్టరంటూ న్యాయంగా ఉండాలి అయితే స్టేజిమీద నడిచే నాటకంలో ఈ అసలు రిహార్సల్సులో భద్రపడతాయి నాటక ప్రదర్శనంలో డైరెక్టరు స్వయంగా జోక్యం కలిగించుకోలేడు కనక డైరెక్టరు నిర్ణయాలను అమలుచేసే భారం పూర్తిగా నటుడిపై ఉంటుంది సినిమాలో అట్లా కాదు నాటక ప్రదర్శనంలో సరికావలిసిందే సినిమాలో తప్పులు జరగటానికే వీలు లేదు ప్రతి షాటూ సరిగా వస్తేనే మరొక షాటుకు పోవటం

డైరెక్టరు చేతిలో ఉండే ఈ శిల్పం సద్వినియోగమవుతుందా, దుర్వినియోగమవు తుందా అన్నది డైరెక్టరు కళాభిమానంపై ఆధారపడుతుంది డైరెక్టర్ హిచ్‌కాక్‌ను ''మాస్టర్ ఆఫ్ సస్పెన్స్'' అంటారు కథలో ఉన్న ''సస్పెన్స్'' కన్న పదిరెట్లు ''టేకింగు'' లో తీసుకురా గలడు హిచ్‌కాక్ ఈ విషయంలో ఆయన ఔచిత్యాన్ని కూడా దాటి చాలా దూరం వెళ్ళి ప్రేక్షకుల నరాలకు అవసరమైన పని కల్పిస్తాడు ఇది నిజమైన కళాకారుడి లక్షణం కాదు హిచ్‌కాక్ ఆరాధించేది బజారుకు పనికివచ్చే శిల్పం

కళాభిమానం గల డైరెక్టరు తన శిల్పాన్ని అభ్యుదయ భావాలను ప్రేక్షకులపై పంపకం చేయడానికీ, జీవితం తాలూకు సరిఅయిన విలువలు ప్రేక్షకులకు అందజేస్తాడు మానవ జీవితంలో ఉన్న క్రౌర్యమూ, దైన్యమూ, కుట్రా, కుళ్ళూ, ఔదార్యమూ ప్రేమా, ఆగ్రహమూ, ఆవేశమూ మొదలలైనవి సినిమా కథకు పాత్రల సంభాషణల ద్వారానూ, చేతల ద్వారానూ చిత్రిస్తే యోగ్యతగల డైరెక్టరు వాటిని తన శిల్పం ద్వారా ఎంతో మెరుగుపెట్టే అవకాశం ఉంది అటువంటి అవకాశాన్ని వినియోగపరచుకొని సినిమా ప్రేక్షకుల ఆదరాభిమానాలను చూరగొన్నవాడే సరిఅయిన డైరెక్టరు

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 1–8–51*

# 52. పాత్ర నిర్దేశం

పాస్కల్ ప్రొడక్షన్స్‌వారు తీయనున్న గాంధీ చిత్రానికి ఇంకా గాంధీ పాత్ర ధరించేవారు నిర్ణయం కాలేదు ఇది నిర్ణయం అయేనాటికి ఈ పాత్రకు సరిఅయినవాణ్ణే పట్టుకొస్తారని మనం విశ్వసించవచ్చు హాలీవుడ్ చిత్రనిర్మాతలు చారిత్రక చిత్రాలు తీయబూనినప్పుడల్లా ప్రఖ్యాత పురుషుల పాత్రలు ధరించటానికిగాను నటులను అతి శ్రద్ధగా ఎన్నుకొంటారు అనేకసార్లు వారు కొత్త వ్యక్తులను తీసుకురావటమూ, విదేశాలనుంచి నటులను తెచ్చుకోవ టమూ కూడా కద్దు హాలీవుడ్ చిత్రనిర్మాతలు ఇంత శ్రమపడినా ఒక్కొక్కసారి ఫలితం అంత తృప్తికరంగా ఉండదు అయినప్పటికీ ఆ నిర్మాతలు ఉన్నంతలో చాలావరకు సరి అయిన వ్యక్తినే ఏరారని మనం విశ్వసించవచ్చు

ఎందుచేతనంటే చారిత్రక పాత్రను ధరించే నటుడిలో పాత్రపోలిక ఉండటం చాలా ముఖ్యమే అయినప్పటికీ అది ఒకటే ప్రధానం కాదు ఆ పాత్రయొక్క భావ స్వరూపాన్ని నటుడు విజయవంతంగా చిత్రించగలిగి ఉండాలి లేని పక్షంలో విగ్రహపుష్టి, నైవేద్యనష్టి అవుతుంది

చారిత్రక పురుషుల పాత్రల విషయంలో ఉన్నంతగా కాకపోయినా మామూలు చిత్రాలలో కూడా పాత్రనిర్దేశం అనేక సమస్యలతో కూడుకున్న విషయం అందులో నైపుణ్యం ఉంది పాత్ర నిర్దేశానికి కూడా ప్రవీణులుండాలి దానిపై చిత్రం విజయం కొంతవరకు ఆధారపడి ఉంటుంది

మన చిత్రాలలో పాత్ర నిర్దేశం బొత్తిగా గుడ్డిగా జరగకపోయినా నైపుణ్యంతో ఎంత మాత్రమూ జరగటంలేదు దీనికి అనేక కారణాలుంటూవచ్చాయి మొట్టమొదట టాకీలు వచ్చినప్పుడు తెలుగు చిత్రాలు తీసినవారికి నటీనటులను ఎన్నుకొనే అవకాశమే లేకపోయింది

''పాదుక'' లో పధ్నాలుగేళ్ల శ్రీరాముడి పాత్రను 40 ఏళ్ల వయసుగల యడవల్లి సూర్యనారాయణ ధరించాడు అట్లాగే ఈస్టిండియావారి ''సావిత్రి'' లో నాయిక పాత్ర ధరించటానికి రామతిలకాన్ని ఎన్నుకోవటంలోనూ, వేల్ పిక్చర్సువారి ''సీతాకళ్యాణం'' లో రాముడి పాత్రకు మాష్టరు కళ్యాణిని ఎన్నుకోవటంలోనూ ఆ చిత్రాలు నిర్మించినవారు నటుల అందచందాలు పాటించలేదు

''లవకుశ'' లో సీత పాత్రకు సి పుల్లయ్యగారు శ్రీరంజనిని తెచ్చినప్పుడు సినిమా ప్రపంచానికొక పెన్నిధి దొరికినట్టయింది శ్రీరంజని వయసులో ప్రౌఢే అయినా పూర్వపు తారలకన్న కాస్త అందంగా ఉండి, అంతో ఇంతో పాడి, నటించగలననిపించుకున్నది, శ్రీరంజని చాలా చిత్రాలకు భిక్ష పెట్టింది అదేవిధంగా ''మాయా బజారు'' లో శాంతకుమారిరాక కూడా ఒక కొత్త ''ఆశ'' రేకెత్తించింది అటు తరవాత కాంచనమాల చడీచప్పుడూ లేకుండా సినిమా ఆకాశాన ఉదయించి పైకి రావటమూ మళ్ళీ చడీచప్పుడూ లేకుండా దిగిపోవటమూ తెలుగు సినిమా చరిత్రలో ఒక ప్రత్యేక అధ్యాయమన్నమాట

నటులకూ పాత్రలకూ గల సంబంధం ఎంత సన్నిహితమైనదంటే శాంతకుమారి, కాంచనమాల, పుష్పవల్లి, భానుమతి మొదలైన ఆడతారలూ, సి యస్ ఆర్ , వై వి రావు, సి హెచ్ నారాయణరావు, నాగయ్య మొదలైన మగతారలూ లేకుండా తెలుగులో సాంఘిక చిత్రాలు తీయటం సాధ్యమైవుండేది కాదు పురాణ చిత్రాలలో విజయవంతంగా నటించిన మాధవపెద్ది, అద్దంకి, జగ్గయ్య మొదలైన నటులు సాంఘిక చిత్రాలరాకతో పూర్తిగా సినిమారంగంనుండి విరమించటమే దీనికి నిదర్శనం

జానపద చిత్రాలలో సంగీతానికి ఎక్కువ ప్రాముఖ్యం ఉంటున్నది పురాణ చిత్రాలుగాని, సాంఘిక చిత్రాలుగాని జానపద చిత్రాలంతగా సంగీతంపై ఆధారపడలేదు జానపద చిత్రాలు రాకపూర్వం సంగీత దర్శకుడు పెద్దవారిలో జమకాదు కాంచనమాల, పుష్పవల్లి, కుమారి, మాలతి మొదలైనవాళ్లు పెద్దపాటగత్తెలు కాకపోయినా తమపాటలు తామే పాడుకొనేవారు బాగా పాడగల భానుమతి, శాంత కుమారి, బాలసరస్వతి, ఎస్, వరలక్ష్మి మొదలైనవారికి తారలుగా ప్రత్యేకాధిక్యత ఉండేది కాదు కాని జానపద చిత్రాలూ, వాటి వెంట పాటలూ ప్రాముఖ్యానికి రావటంతో స్వంతాన పాడగల వారికి ప్రత్యేక ప్రాముఖ్యం వచ్చింది, దానితోబాటు అందచందాలు తక్కువై పాడేశక్తి మెచ్చుగాగల వాళ్లకి నేపధ్యాన ప్రాముఖ్యం హెచ్చింది ప్లేబాక్ ధర్మాన అంజలీదేవి వంటి అందగత్తెలూ, నటనా సామర్థ్యంగల వాళ్లూ జానపద చిత్రాలలో ప్రత్యేకస్థానం సంపాదించుకున్నారు ఒక వంక పాటకు ప్రాముఖ్యత హెచ్చుతున్నా మరోవంక పాడేశక్తి తారయొక్క ప్రధాన లక్షణాలలోనుంచి పూర్తిగా తొలగిపోయింది

పాత్రనిర్దేశానికిగల అవకాశాలు ఈ విధంగా మారుతూ, పెరుగుతూ వచ్చాయి యువక పాత్రలు ధరించటానికి నాగేశ్వరరావు, ఎన్ టి రామారావు, శ్రీరామమూర్తి, రామశర్మ, జగ్గయ్య మొదలైనవారు రంగంలోకి వచ్చినారు ఇంకా కొత్తవారు రాగలరు, మధు, శుందు, రామగోపాల్, కుమారి గిరిజ, మల్లిక మొదలైన బాలబాలికలు సినిమా రంగంలోకి వచ్చి ఉన్నారు రేలంగి, శివరావు, నల్ల రామ్మూర్తి, జోగారావు, సి యస్ ఆర్ మొదలైన హాస్య

టులున్నారు చిత్రాల సంఖ్య నానాటికీ మెచ్చుతున్నది ఇంకా కొత్త నటులు వస్తున్నారు అందుచేత ఈనాడు పాత్రకు తగ్గనటుల్ని ఏరుకొనే అవకాశం పూర్వం ఎన్నడూ లేనంతగా ఉన్నది దీనికి తోడు నటులలో చాలామంది స్వతంత్రంగా ఒక్కొక్క పిక్చరుకే కాంట్రాక్టులు వ్రాసుకుంటూ, అందరు ప్రొడ్యూసర్లకూ అందుబాటులో ఉంటున్నవారు

ఇటువంటి పరిస్థితులలో కూడా పాత్ర నిర్దేశంలో లోపాలు జరుగుతున్నాయంటే అది కేవలం చిత్ర నిర్మాతల పొరపాటేననాలి అనేక చిత్రాలలో సరి అయిన పాత్ర చిత్రణే లేకపోయినప్పటికీ పొరపాట్లు కనిపిస్తూ ఉన్నాయి ఇట్లా జరగటానికిగల కారణాలలో ప్రధానమైనది బాక్సాఫీసును మనసులో ఉంచుకుని ప్రసిద్ధ స్త్రీ పురుష తారలను బుక్‌చెయ్యటమూ ఉన్న కథలో ప్రధాన పాత్రలు వారికి తగిలించటమూనూ రెండవ కారణం ప్రొడ్యూసర్లకు కొంతమంది నటీనటులపైగల ప్రత్యేకాభిమానాలు మూడో కారణం చిత్రనిర్మాణం కళ అన్న భావం నిర్మాతలకు లేక, ప్రేక్షకులభావం పట్ల నీరసభావం ఉండటం నటీనటులే చిత్రనిర్మాణానికి పూనుకోవటంలో పాత్ర నిర్దేశం తాలూకు పొరపాట్లు మరింత హెచ్చుతున్నాయి దీని ఫలితంగా మంచినటులుగా రాణించవలసిన కొద్దిమంది నటులు అప్పుడప్పుడూ దెబ్బతింటున్నారు ఉదాహరణకు సి యస్ ఆర్ చేత ''విలన్'' వేషాలు వేయిస్తున్నారు సి యస్ ఆర్ నిండైన నటుడే ఒకవిధమైన హాస్యాన్ని కూడా ఒప్పిస్తాడు కాని ''విలన్'' పాత్రలకు సరిపోతాడు అటువంటి పాత్రలు అతనికి తాత్కాలికంగా డబ్బు చేసి పెట్టినా కాలక్రమాన నష్టం కలిగిస్తాయి

నాగేశ్వరరావుకు సినిమా ఆయుర్దాయం చాలావుంది ప్రస్తుతం మగ నటులలో చిటారుకొమ్మన ఉన్నప్పటికీ అతను ఎన్నేళ్లపాటయినా సినిమా రంగాన నిలబడి ఉండదగిన నటుడు ప్రస్తుతం మటుకు అతన్ని ''జూవెనైల్'' గా భావించాలి ఇంకా కొంతకాలం రాటు తేలిన తరవాత ''కారెక్టర్ పార్ట్స్'' వేయటానికి తయారవుతాడు అతను ధరించిన పాత్రలలో ''పల్నాటియుద్ధం'' లో బాలచంద్రుడూ, ''బాలరాజు'' లో బాలరాజూ, ''సంసారం'' లో వేణూ లాటి పాత్రలలో అతను బాగా రాణించగలిగాడు చిత్రనిర్మాతలు అటువంటి పాత్రలనే అతనికిస్తూ వచ్చినట్టయితే అతనికింకా ప్రజాదరణ లభించి ఉండేదనటానికి సందేహం లేదు

చిత్తూరు నాగయ్యకూ నాగేశ్వరరావుకూ కొద్దిపోలిక లేకపోలేదు నాగయ్యకు కూడా మొదటినుంచీ చాలా మంచి పేరు వచ్చింది కాని నాగయ్య తొలిచిత్రాలలో చూపిన నటనలో కొంత వెలితి ఉండేది ముఖ్యంగా బరువైన ఘట్టాలలో ఆయన అభినయం తెచ్చిపెట్టుకున్నట్టుండేది నాగయ్య నటుడు కాకకాదు ఆయన అప్పుడు ధరించిన పాత్రలు ఆయన శక్తికి ఏమాత్రమో మించి ఉండాలి ఆ నాగయ్యే ''భక్త పోతన'' లో నటించేనాటికి బాగా తయారైనాడు రానురాను ఆయన నటనా, పాటా కూడా సినిమాకు చాలాబాగా సరిపోయాయి ఈ పరిణామం అందుకున్నాకనే ఆయన ''త్యాగయ్య,'' ''వేమన'' లాంటి చిరస్థాయిగల పాత్రలు ధరించే అవకాశం లభించింది నాగేశ్వరావు ఇంకా అటువంటి పరాణామం అందుకోలేదు అందుకుంటాడని రూఢిగా చెప్పవచ్చు అంతదాకా అతను ''జూవనైల్'' పాత్రలు ధరించటం సబబుగా ఉంటుంది

ప్రతిచిత్రంలోనూ చిల్లర పాత్రధారులలో రామ్మూర్తి, సీతారాం, సురభి బాల సరస్వతి,

కనకం మొదలైనవారిని కొందరిని ఉంచటం ఒక రివాజుగా పరిణమించింది రామ్మూర్తి సీతారాంలు అన్ని చిత్రాలలోనూ సమానమైన హాస్యం ఇవ్వటం లేదు ''స్త్రీ సాహసం''లో వీరు ధరించిన పాత్రలు ఎవరు ధరించినా సరిపోయేదే హాస్యనటులుగా పేరుపడ్డవారిలో ఒక్క రేలంగి తప్ప మిగిలిన వారంతా ఎప్పుడో ఒకప్పుడు హాస్య రహితమైన పాత్రలకు ధరించినట్టే కనిపిస్తుంది ఎన్ని చిత్రాలలో నటించినప్పటికీ కనకం ''షావుకారు'' చిత్రంలోనూ, బాలసరస్వతి ''మాయలమారి''లోనూ నటించిన పాత్రలే సినిమా ప్రేక్షకుల హృదయాలలో నికరంగా నిలిచేవి

ఇంకో వెయ్యిమంది, నటీనటులు సినిమా రంగంలో ప్రవేశించినా, సినిమా చిత్ర నిర్మాతలపైనా, నటీనటులపైనా డబ్బు శివతాండవం ఆడుతున్నంత కాలమూ పాత్ర నిర్దేశంలో ఏవో పొరపాట్లు జరుగుతూ ఉంటాయనే భావించాలి సరి అయిన పాత్రలకు సరి అయిన నటులను జతపరచటానికున్న మార్గాలు రెండే రెండు, కథ రాసుకుని అందులోని పాత్రలకు సరిపోయిన నటులను ఎక్కడినుండి అయినా సరే తీసుకురావటం, లేదా, ఉన్న నటులకు పనికి వచ్చే పాత్రలలో కథ తయారుచేసుకోవటం మన నిర్మాతలకు మొదటిది సమ్మతం కాదు, రెండవది సాధ్యం కాదు

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 22-8-51*

# 53. సృష్టి అనుకరణ

మద్రాసులో ఇటీవల జరిగిన ఆలిండియా సినీ టెక్నీషియన్స్ కాన్ఫరెన్స్‌లో మాట్లాడిన వారిలో దేవకీబోసు మొదలుకొని అనేకమంది మళ్ళీమళ్ళీ చెప్పిన విషయాలలో ఒకటి మన చిత్ర నిర్మాతలు జాతీయమైన సినిమా కళ సృష్టించుకోవాలని, గుడ్డిగా పాశ్చాత్య సినిమా పద్ధతులను అనుకరించకూడదనీనూ ఈ అనుకరణల దౌర్భాగ్యం గురించి అనేకమంది బాధపడుతూ ఉండటమూ, కొద్దిమంది రాయటమూ కూడా జరుగుతూనే ఉన్నది అయితే ఇతరులు ప్రకటించటం కన్న ఈ భావాన్ని దేవకీబోసులాటి అనుభవజ్ఞులూ, అనేక దశాబ్దాల పాటు సినిమా రంగంలో కృషిచేసినవారూ అనటంలో కొంత ప్రాముఖ్యం ఉన్నది టెక్నీషియనుల సమావేశంలో అనటంలో మరింత ప్రాముఖ్యం ఉన్నది

ఈ అనుకరణ తల్లి పురుగేమిటో తేల్చుకున్నట్టయితే అది నూటికి తొంభైతొమ్మిదిసార్లు చిత్ర నిర్మాతే అవుతూ ఉంటాడు పాశ్చాత్య అనుకరణ ఒక్క కథ విషయంలోనే కాక వేషధారణ విషయంలోనూ, ఆచార వ్యవహార విషయంలోనూ, సెటింగుల నిర్మాణంలో నూ, ఆఖరుకు పాటలలోనూ, వినోదాలలోనూకూడా కనిపిస్తుంది మన దేశంలో హోటళ్ళలో భోజనాల దగ్గిర ఆర్కెస్ట్రాలూ, అక్కడ ఆడవాళ్ళువచ్చి పాడి భోక్తలను రంజింప జెయ్యడమూ ఎక్కడైనా ఉందా ? ఉన్నట్టు సినిమా చిత్రాలు తీశారు పులిని చూసి నక్క వాతలు పెట్టుకోవటం మన దేశీయ చిత్రాలలో అనేక వాటిల్లో జరుగుతున్నది మక్కీకి మక్కీ హాలీవుడ్ చిత్రాలను కాపీ కొట్టిన చిత్రాలలోనే కాక, కాస్తోకూస్తో స్వతంత్రంగా తీసిన చిత్రాలలో కూడా పాశ్చాత్య అనుకరణలు సంగీతంలోనో, దుస్తుల్లోనో, సెటింగులలోనో, సంభాషణలలోనో కనిపిస్తూనే

ఉంటున్నాయి

టెక్నీషియనులకు కల్పనా శక్తి చాలక అనుకరిస్తున్నారనుకోవటానికి ఇన్ని రకాల టెక్నీషియనులూ కల్పనా శక్తి చాలని వారేనా? క్షుద్రమైన అర్ధరహితమైన ఈ అనుకరణకు మూలకారణం చిత్ర నిర్మాతలేననటానికి నాకే సందేహం లేదు టెక్నీషియనులందరూ గొప్ప కళోపాసకులని ఆకాశానికెత్తకుండానే, సాధారణంగా టెక్నీషియన్ అయిన వాడికి సృష్ట్యానందం కొంత ఉంటుంది స్వతహాగా ఈ ఆనందాన్ని పొందటానికే టెక్నీషియన్ కృషి తలపెడతాడు ఆ ప్రయత్నం రెండు కారణాల చేత చెడవచ్చు స్వతహాగా సృష్టిచేసే శక్తి చాలక అనుకరణకు పాల్పడటమో, స్వంత కల్పనకు ప్రోత్సాహం లేని కారణం చేత డబ్బు కాశపడి అనుకరణకు పూనుకోవటమో, మూడో కారణం ఉండదు తగిన సామర్ధ్యం లేకుండానే సినిమా రంగంలోకి ఎట్లాగో జొరబడి తిష్ట వేసుకున్నవారి విషయంలో మొదటి కారణం ఉండవచ్చు కాని ఎంతో సమర్థులనిపించుకుంటూ, విశేషానుభవంగల టెక్నీషియ నులు అనుకరిస్తున్నారంటే వారిచేత ఆ పని చేయించే శక్తులు వెనక ఉండి తీరుతాయి

అనుకరణ కళాకారుడి ఆత్మ గౌరవాన్ని భంగపరుస్తుంది దాని ద్వారా వాడికి కృత్రిమమయిన ఆనందం కూడా చేకూరదు కాని కేవలం వ్యాపారదృష్టి గలవాడికి అదే పట్టుకొమ్మ, దేనికి ''మార్కెటు'' ఉన్నదంటే దానికే ఎగబడతాడు వ్యాపారస్తుడు 'మార్కెటు' కు తప్ప వాడి దృష్టిలో మరి దేనికీ విలువలేదు అందుచేతనే అనుకరణ, అనుక రణకు కళాకారుడు అవసరం లేదు ''మార్కెటు'' విషయంలో అనుమానాలు అవసరం లేదు ''కళాసృష్టి'' అన్నమాట వ్యాపార దృష్టి గలవాడికి భయంకరమైనది దాని వెనక వట్టి కీర్తే ఉండవచ్చు, మార్కెటు ఉండకపోవచ్చు పదిమందీ తిట్టినా నాలుగు డబ్బులు లాభం చేసుకుంటేనే వ్యాపారం వ్యాపారంలో మానాభిమానాలకు ఆటే తావులేదు అవి లెక్కల పుస్తకాల్లోకెక్కేవి కావు అందుచేత ప్రొడ్యూసరు నిర్విచారంగా అనుకరణ చెయ్యగలడు, కాపీలు కొట్టగలడు

చిత్ర నిర్మాణం ఇంత ఖర్చుతో కూడివుండక, ఏ 80 వేలకో చిత్రం తయారవుతూ ఉండిన రోజుల్లో పిక్చర్లు తీసిన నిర్మాతలు ఇంతగా వ్యాపారస్తులు కారు వారు కళాకారులే, చిత్ర నిర్మాణం గురించి వారికి మానాభిమానాలుండేవి, వారు పాశ్చాత్యులనుంచి శిల్ప సంబంధమైన విషయాలు ఎన్ని నేర్చుకున్నా కళాసృష్టి విషయం దగ్గిర తమ వ్యక్తిత్వాన్ని పోగొట్టుకునే వారు కారు ఆనాడింతగా టెక్నీషియనులు లేకపోయినప్పటికీ, వారురోజుకు పన్నెండు గంటలు పైగా వెట్టి చాకిరీ చేసినప్పటికీ వారికి కళాకారుల కుండదగిన గౌరవం ప్రొడ్యూసరులనుంచి లభించేది సినిమా చిత్రనిర్మాణం అభివృద్ధి అయి పెద్ద పరిశ్రమలలో ఒకటిగా పరిణమించటంవల్ల జరిగిన మార్పేమిటంటే డబ్బు పెట్టుబడి చేసే తాహతు గలవాళ్ళు చిత్రాలు తీసేటందుకు ముందుకు వచ్చి ప్రొడ్యూసర్లు కావటమూ సినిమా చిత్రాలు అమ్మకపు సరుకు కింద కావటమూ, టెక్నీషియనులు నిజమైన కళాకారులు గుమాస్తాల హోదాలకూ, కూలీల హోదాలకూ దిగి, కళాభిమానాన్నీ, కళాసృష్టిలోగల ఆనందాన్ని చంపుకుని సినిమా దుకాణదార్ల అవసరాలకూ అప్పుడప్పుడూ అభిరుచులకూ అనుగుణమైన చిత్రాలు తీయట మూనూ వ్యాపారస్తులు సర్వాధికారులై, సినిమా కళా స్రష్టలు కూలీలు కావటంతో సినిమా

కళ ముందమోస్తున్నది

ఈనాడు సినిమాలకు ఎన్నడూలేని గిరాకీ ఉన్నదంటే సినిమా వ్యాపారం పూర్వం కన్న జోరుగా ఉన్నదని రుజువవుతున్నదేగాని సినిమా కళ అభివృద్ధి అవుతున్నదని రుజువు కావటం లేదు పారిశ్రామిక పెట్టుబడిదారి సినిమా చిత్ర నిర్మాణంలోకి వ్యాపించిందేమో, చిత్ర నిర్మాణ పరికరాలలో చాలా అభివృద్ధి కలిగింది ఫోటోగ్రఫీ, శబ్దగ్రహణమూ, సెటింగులూ, దుస్తులూ, ఆర్కెస్ట్రా మొదలైనవి పూర్వంకన్న చాలా ఆడంబరంగా ఉండి, అమ్మకపు వస్తువుగా సినిమా చిత్రం పూర్వం కన్న వస్తువుగా ఆకర్షవంతంగా ఉన్నది కాని జాతీయ కళగా దీన్నిచూసి మనం తలలు వంచుకోవాలి మన చిత్రాలను ఇతర దేశాలకు పంపి, '' ఇందులో మా జాతీయ జీవితం, మా సంస్కృతీ వికాసాలు ప్రతిబింబిస్తున్నాయి చూడండి'' అని అనటానికి మనం నోచుకోలేదు ఈ చిత్రాలద్వారా మనం జాతీయపు నరుజ్జీవనం సాధించలేం ఇవి మన జాతిలోని గుణాలను బలపరచలేదు, లోపాలను సంస్కరించలేవు ఇవి మన వాస్తవిక జీవితానికీ, జాతీయ మనస్థితికీ, జాతీయాదర్శాలకు నూరుమైళ్ల లోకి కూడా రాలేవు

దుకాణదార్ల ఆధ్వర్యమూ, వ్యాపార దృష్టీ మన సినిమా కళకు పెట్టిన భిక్ష ఇదే అనుకరణ మన సినిమా చిత్రాలను ఈ దశకు తెచ్చింది సహజంగా సమర్థతగల టెక్నీషియన్లకిది ఎంత ఏవగింపైనా కలిగించవచ్చు అందుచేతనే టెక్నీషియన్ల సమావేశంలో దీన్ని గురించి అంతమంది ప్రస్తావించటం జరిగింది ఈ అనుకరణను నిరసించుతూ మాట్లాడినవారే, మన టెక్నీషియనులు విదేశాలకుపోయి అక్కడి ఉత్తమ శిల్పాన్ని అలవరుచుకు రావాలని అన్నారు వారికి ఇతర దేశ విజ్ఞానంపై ద్వేషంలేదు ఇతర దేశ సంస్కృతిపై అంతకన్నా విద్వేషంలేదు వారు సహించలేనిదల్లా కళాసృష్టికి బదులు అనుకరణ సాగుతూ ఉండటం మాత్రమే

ఈ విషయమై పత్రికలలో తగినంత ఆందోళన జరగాలి అటువంటి ఆందోళన కొంతమంది సినిమా వ్యాపారస్తులకు తాత్కాలిక నష్టం కలిగించినా, సినిమా ప్రేక్షకులలో అక్షరాస్యులలో ఆరోగ్యవంతమైన సంచలనం తీసుకురాగలుగుతుంది ఈనాడు సినిమా చిత్రాలు చూసే అసంఖ్యాకులు సినిమాచిత్రం ఒక కళావస్తువుగా చూడటంలేదన్నది నిర్వివాదాంశం ఏ సర్కసునో, గారడీనో చూసే మనస్తత్వంతో వారు సినిమా చిత్రాలను చూస్తున్నారు పైనుండి చిత్రనిర్మాతలు టెక్నీషియనులకూ, నటులకూ ఎంత కళా గౌరవం ఇస్తున్నారో, కిందనుండి ప్రేక్షకులు కూడా అంతే ఇస్తున్నారు అందమైన తారలను నాలుగణాల డబ్బులతో తమ ఎదుట మూడు గంటలసేపు ''ఆడించు''కున్న సంతృప్తే వారికి లభిస్తున్నది సినిమా చిత్రాలు తమ కళద్వారా ప్రజలను ఉత్తేజపరచినట్లయితే ఇటువంటి హేయమైన పరిస్థితి ఉండదు

ఇది మార్చరాని పరిస్థితి అని చేతులు కట్టుకుకూర్చోనవసరంలేదు పత్రికలు పూనుకుని ఆందోళన సాగించినట్టయితే ఈ పరిస్థితి త్వరలోనే మారుతుంది సినిమా కళ యొక్క వాస్తవాభివృద్ధిని గురించి ఎవరూ ఆందోళన చెందకుండా, దానియందు ఎవరికీ విశ్వాసం లేకుండా, సినిమా కళ దానంతట అదే ఒక సుముహూర్తాన పైకి రావటం ప్రారంభిస్తుందనుకోవటం పొరపాటు అనేక రంగాలలోనుంచి సినిమాకళపై ఆదరం బయలుదేరి అది యథార్థ స్వరూపం తీసుకోవాలి అప్పుడుగాని సరిఅయిన చిత్రాలు వెలువడవు మన జాతినీ, జీవితాన్నీ, సంస్కృతినీ, ఆశయాలనూ ప్రతిబింబించే చిత్రాల నిర్మాణం

సాగిననాడు ప్రేక్షకులు సినిమాతారల కృత్రిమ సౌందర్యాన్ని ఆరాధించటం మాని సినిమా కళ సహాయంతో నూతన చైతన్యం సాధించగలుగుతారు

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 12-9-51*

# 54. సినిమా పెట్టుబడి

ఏ పరిశ్రమలో పెట్టుబడికైనా కొన్ని తిరుగుళ్లుంటాయి రష్యాలోలాగ అన్ని పరిశ్రమలనూ, వాటికి కావలసిన పెట్టుబడులనూ ప్రభుత్వమే చూస్తే తప్ప పారిశ్రామికులు స్వయంగా తమ పెట్టుబడి సమస్యలను తామే ఎదుర్కోవాలి లేదా కొన్ని షరతులమీద పెట్టుబడి ద్రవ్యాన్ని బాంకులనుంచీ, ధనికులనుంచీ తెచ్చి వారికి సమ్మతమైన విధంగా దానిని పెట్టుబడి చేసి పరిశ్రమలు సాగించాలి

స్థూలంగా ఒకటి చెప్పుకోవచ్చు ఈ కాలంలో ఏ పెద్ద పరిశ్రమ తలపెట్టినా భారీగా పెట్టుబడి జరిగినప్పుడే పరిశ్రమ ముందడుగు వేయగలుగుతుంది అందుచేత నిజమైన పారిశ్రామికులు అంటే, పరిశ్రమలకు పెట్టుబడి చేసేవారు కాదు పరిశ్రమలు నడిపే అర్హత గలవారు కేవలం లాభాలకొరకు మాత్రమే పెట్టుబడి చేసే ధనికులకు లోబడి ఉంటారు దీని కెన్ని ఉదాహరణలైనా చెప్పుకోవచ్చు ఎవరైనా ఒక పత్రిక పెట్టాలంటే అచ్చాఫీసు సహాయం కావాలి అచ్చుగా ఒక పత్రిక మాత్రమే అచ్చు వేయటానికి తగిన ప్రెస్సు ఏర్పాటు చేసుకోవటం అసాధ్యం కాకపోయినా, అటువంటి ప్రెస్సుకు అన్ని హంగులూ ఉండవు నిజంగా మంచి ప్రెస్సు పెట్టుకున్నట్టయితే అది ఒక పత్రిక కాక నాలుగైదు పత్రికలూ, అనేక చిల్లర అచ్చుపను లూ, బైండింగు పనులూ, పుస్తక ప్రచురణా చెయ్యగలదై ఉంటుంది అటువంటి మంచి ప్రెస్సులో అచ్చయే పత్రికతో సొంత ప్రెస్సులో అచ్చయే పత్రికతో ఎన్నడూ పోటీ చెయ్యలేదు దానికి కళా కాంతీ ఉండవు దినదిన గండంగా ఉంటుంది ఆఖరుకు అది చవుకగానైనా తయారు కాదు

''అచ్చాఫీసు పెద్ద పరిశ్రమ; పత్రికా నిర్వహణ చిన్న పరిశ్రమ పెద్దదానికి చిన్నది లోకువై ఉండటంలో ఆశ్చర్యమేమిటి ?'' అనవచ్చు కాని అది సరికాదు అచ్చాఫీసు పెద్ద వ్యాపారం, పత్రికా ప్రచురణ చిన్న వ్యాపారం పరిశ్రమగా చూసినట్లయితే పత్రికా ప్రచురణు పెద్ద పరిశ్రమ ప్రజల సాంఘిక, సాస్కృతిక అవసరాలను ఆదుకొనేది పత్రిక, అచ్చాఫీసు కాదు అచ్చాఫీసుకు కరపత్రాలైనా ఒకటే, వాల్మీకి రామాయణమైనా ఒకటే రెంటినీ ఒకే దృష్టితో లాబ కాంక్షతో అచ్చు వేస్తుంది రిక్షాబళ్లు లాగేవాళ్లకన్న రిక్షాబళ్లు గలవాడు పెద్ద వ్యాపారం చేస్తున్నాడు గనక ఎక్కువ పరిశ్రమిస్తున్నాడనిగాని, ప్రజలకు ఎక్కువగా ఉపయోగపడుతున్నాడని గాని అనుకోటం పొరపాటు

చిత్ర నిర్మాణంలో కూడా ఇటువంటి వ్యత్యాసం ఉంది సినిమా చిత్రాలు స్టూడియోలలోనే తప్ప తయారుకావు ఈనాడు మంచి సినిమాస్టూడియో అంటే ఎన్నో హంగులు కలదై ఉండాలి ఉత్తమ తరగతి కామెరాలూ, సౌండు రికార్డింగు ఎక్విప్మెంటూ, లాబొరేటరీ, కార్ఖానాలూ, కార్పెంటరీ యార్డ్లూ, మోల్డింగ్ డిపార్ట్మెంటూ, లైట్లూ, ప్రవీణులూ, ప్రొజెక్షన్ రూములూ, ప్లేబాక్, మిక్సింగ్, రీ రికార్డింగ్ పరికరాలూ, బాక్ ప్రొజెక్షనూ, ఆప్టికల్ ప్రింటరూ ఏమేమిటో ఉండాలి ఇదంతా చేరి భారీ పరిశ్రమ కిందకి వస్తుంది

ఇన్ని హంగులతోనూ స్టూడియో కట్టిన తర్వాత అది చిత్రనిర్మాతలకు అరువిచ్చే వ్యాపారానికి పనికొస్తుంది తప్ప చిత్రనిర్మాణ పారిశ్రామికుల స్వంత అవసరాలకు చాలా ఎక్కువవుతుంది చెప్పవచ్చిందేమంటే తడవకు ఒక చిత్రం మాత్రమే తియ్యటానికి తగిన ఆధునిక స్టూడియో అంటూ లేదు స్టూడియో వ్యాపారం అభివృద్ధి అయి చిత్ర నిర్మాణపరిశ్రమను మింగే దశ వచ్చేసింది కాలంలో కలిగిన పరిణామాన్ని గుర్తించని అమాయకులు కిరాయి స్టూడియోలతో విసిగి, చిత్ర నిర్మాణంలో తమకు లభించిన కొద్ది లాభాలకు మరికొంత అప్పు జతచేసి, ఒక చిన్న ఫ్లోర్ వేసి, ఒక పాత రికార్డింగ్ సెట్టూ, కామెరా సంపాదించి, ఒకరిద్దరు వడ్రంగులనూ, పెయింటర్లనూ, కొద్ది లైట్లనూ, లైట్ బాయిస్‌నూ చేర్చి స్టూడియో ఏర్పాటు చేసుకుని, రషెస్ ఒకచోట ప్రింటు చేయించుకుని, ప్రొజెక్షన్ మరొకచోట వేసుకుని, ఒక చిన్న ఎడిటింగ్ టేబిల్ ఏర్పాటు చేసుకొని ఇంతా శ్రమ పడటంవల్ల వారి స్వాతంత్ర్యం హెచ్చునూ హెచ్చుదు, ఖర్చా తడిసి మోపెడవుతుంది చేతికి వచ్చిన లాభం పోగా, చేసినప్పు మిగులుతుంది వీరి 'కలలను' అర్థం చేసుకోవచ్చు వాటితో సానుభూతి కూడా ఉంచవచ్చు, కాని అది అపాయకరమన్నమాట మాత్రం దాచి లాభంలేదు !

ఇది సమర్థించదగిన పరిస్థితి కాకపోవచ్చు– సామాన్యుడి సానుభూతి, రెండుకేసుల టైపూ, ట్రెడిలూ పెట్టుకొని ఆదర్శాలకోసం పత్రిక నడిపేవాడివైపే ఉంటుంది కాని ఆ పత్రిక సర్వాంగ సుందరంగా లేక ప్రజాదరణ పొందలేక నష్టపడుతుంటే సామాన్యుడి సానుభూతి ఎందుకూ పనికిరాదు దినపత్రికలు నడిపే వారిలో కూడా కేవలం పత్రికా పారిశ్రామికులు గుత్త వ్యాపారస్థులతో పోటీ చెయ్యలేని పరిస్థితులు ఏర్పడుతున్నాయి పారిశ్రామికుడై ఉండి గుత్త పద్ధతులు అవలంబించేవారు హెన్రీఫోర్డులాగా ఎక్కడో ఒకరుంటారు ఫోర్డు తన కార్లకోసం లోహ పరిశ్రమలూ, కొయ్యకోసం సొంత అడవులూ, సొంత కాగిత పరిశ్రమా కూడా ఏర్పాటు చేశాడని ప్రతీతి అయినా ఫోర్డ్ సంస్థను వాల్ స్ట్రీట్ గుత్తదార్లు పారిశ్రామికులనే మారుపేరు పెట్టుకున్న ధనిక వర్గంవారు ఒక ఊపు ఊపారు ఫోర్డ్ వారసులు ఈ పోటీకి తట్టుకోలేక కొత్తమార్గాలు తొక్కవలసి వచ్చింది

కేవలం చిత్ర నిర్మాతలై ఉండి స్టూడియోలు కట్టటానికి ఉద్యమించేవారు అందులోని కష్టసుఖాలు తెలియనివారనుకోవటానికి కూడా వీల్లేదు ఇందులో కొందరు కేవలం ''స్వేచ్ఛా శాంతుల'' కొరకు స్టూడియో నిర్మాణానికి ఉద్యమించి ఉండవచ్చు మరికొందరు పారిశ్రామికులు తమ పారిశ్రామిక తత్వానికీ, స్టూడియోదార్ల వ్యాపార తత్వానికీ పడక సొంత స్టూడియోలు ప్రారంభించి ఉండవచ్చు కొందరు కేవలం ఖర్చు తగ్గించటానికే ప్రారంభించి ఉండవచ్చు చిత్ర నిర్మాతలు స్టూడియో నిర్మాణానికి పూనుకోవటంలో ఏ ఆశయం ఉన్నప్పటికీ కాలక్రమాన వారి ఆశయం ఫలించదని చెప్పాలి

ప్రస్తుతం మనకున్న చిత్రనిర్మాణంతో పోలిస్తే తగినన్ని స్టూడియోలు లేవు నిజమే, కాని అతుకులబొంత స్టూడియోలవల్ల ఈ లోటు తీరదు సరి అయిన హంగు లేకుండా చిత్రాలు తీయటంవల్ల చిత్రాల నాణ్యం పడిపోతుంది లాభం గూబల్లో తీస్తుంది కొత్తగా వచ్చిన స్టూడియోలేవైతే ఉన్నాయో, అవి మంచివిగానే ఉండాలి ఇప్పుడున్న వాటితో పోటీ చెయ్యగలవిగా కూడా ఉండాలి కాని ఈనాడు పెద్ద స్టూడియోల నిర్మాణం మామూలు

సాగిననాడు ప్రేక్షకులు సినిమాతారల కృత్రిమ సౌందర్యాన్ని ఆరాధించటం మాని సినిమా కళ సహాయంతో నూతన చైతన్యం సాధించగలుగుతారు

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 12-9-51*

# 54. సినిమా పెట్టుబడి

ఏ పరిశ్రమలో పెట్టుబడికైనా కొన్ని తిరుగుళ్లుంటాయి రష్యాలోలాగ అన్ని పరిశ్రమలనూ, వాటికి కావలసిన పెట్టుబడులనూ ప్రభుత్వమే చూస్తే తప్ప పారిశ్రామికులు స్వయంగా తమ పెట్టుబడి సమస్యలను తామే ఎదుర్కోవాలి లేదా కొన్ని షరతులమీద పెట్టుబడి ద్రవ్యాన్ని బాంకులనుంచీ, ధనికులనుంచీ తెచ్చి వారికి సమ్మతమైన విధంగా దానిని పెట్టుబడి చేసి పరిశ్రమలు సాగించాలి

స్థూలంగా ఒకటి చెప్పుకోవచ్చు ఈ కాలంలో ఏ పెద్ద పరిశ్రమ తలపెట్టినా భారీగా పెట్టుబడి జరిగినప్పుడే పరిశ్రమ ముందడుగు వేయగలుగుతుంది అందుచేత నిజమైన పారిశ్రామికులు అంటే, పరిశ్రమలకు పెట్టుబడి చేసేవారు కాదు పరిశ్రమలు నడిపే అర్హత గలవారు కేవలం లాభాలకొరకు మాత్రమే పెట్టుబడి చేసే ధనికులకు లోబడి ఉంటారు దీని కెన్ని ఉదాహరణలైనా చెప్పుకోవచ్చు ఎవరైనా ఒక పత్రిక పెట్టాలంటే అచ్చాఫీసు సహాయం కావాలి అచ్చుగా ఒక పత్రిక మాత్రమే అచ్చు వేయటానికి తగిన ప్రెస్సు ఏర్పాటు చేసుకోవటం అసాధ్యం కాకపోయినా, అటువంటి ప్రెస్సుకు అన్ని హంగులూ ఉండవు నిజంగా మంచి ప్రెస్సు పెట్టుకున్నట్టయితే అది ఒక పత్రిక కాక నాలుగైదు పత్రికలూ, అనేక చిల్లర అచ్చుపను లూ, బైండింగు పనులూ, పుస్తక ప్రచురణా చెయ్యగలదై ఉంటుంది అటువంటి మంచి ప్రెస్సులో అచ్చయే పత్రికతో సొంత ప్రెస్సులో అచ్చయే పత్రికతో ఎన్నడూ పోటీ చెయ్యలేదు దానికి కళా కాంతీ ఉండవు దినదిన గండంగా ఉంటుంది ఆఖరుకు అది చవుకగానైనా తయారు కాదు

''అచ్చాఫీసు పెద్ద పరిశ్రమ; పత్రికా నిర్వహణ చిన్న పరిశ్రమ పెద్దదానికి చిన్నది లోకువై ఉండటంలో ఆశ్చర్యమేమిటి ?'' అనవచ్చు కాని అది సరికాదు అచ్చాఫీసు పెద్ద వ్యాపారం, పత్రికా ప్రచురణ చిన్న వ్యాపారం పరిశ్రమగా చూసినట్లయితే పత్రికా ప్రచురణు పెద్ద పరిశ్రమ ప్రజల సాంఘిక, సాస్కృతిక అవసరాలను ఆదుకొనేది పత్రిక, అచ్చాఫీసు కాదు అచ్చాఫీసుకు కరపత్రాలైనా ఒకటే, వాల్మీకి రామాయణమైనా ఒకటే రెంటినీ ఒకే దృష్టితో లాబ కాంక్షతో అచ్చు వేస్తుంది రిక్షాబళ్లు లాగేవాళ్లకన్న రిక్షాబళ్లు గలవాడు పెద్ద వ్యాపారం చేస్తున్నాడు గనక ఎక్కువ పరిశ్రమిస్తున్నాడనిగాని, ప్రజలకు ఎక్కువగా ఉపయోగపడుతున్నాడని గాని అనుకోటం పొరపాటు

చిత్ర నిర్మాణంలో కూడా ఇటువంటి వ్యత్యాసం ఉంది సినివూ చిత్రాలు స్టూడియోలలోనే తప్ప తయారుకావు ఈనాడు మంచి సినిమాస్టూడియో అంటే ఎన్నో హంగులు కలదై ఉండాలి ఉత్తమ తరగతి కామెరాలూ, సౌండు రికార్డింగు ఎక్విప్మెంటూ, లాబొరేటరీ, కార్ఖానాలూ, కార్పెంటరీ యార్డ్లూ, మోల్డింగ్ డిపార్ట్మెంటూ, లైట్లూ, ప్రవీణులూ, ప్రొజెక్షన్ రూములూ, ప్లేబాక్, మిక్సింగ్, రీ రికార్డింగ్ పరికరాలూ, బాక్ ప్రొజెక్షనూ, ఆప్టికల్ ప్రింటరూ ఏమేమిటో ఉండాలి ఇదంతా చేరి భారీ పరిశ్రమ కిందకి వస్తుంది

అదనపు ధనం ఏ స్టూడియో నిర్మాణానికో, థియేటర్ల నిర్మాణానికో వ్యయం అయినట్టయితే తెలుగు సినిమా పరిశ్రమకు మరింత మంచి ఆధారం ఏర్పడుతుంది పెట్టిన డబ్బు అదృశ్యమైపోదు వ్యాపార దృష్టిలో అది సరిఅయిన పెట్టుబడి, ఒకవేళ అదనపు సొమ్ము అయిపోయిననాటికి స్టూడియోలు అవసరమైన దానికన్న ఒకటి, రెండు ఎక్కువగా తయారై ఉన్నప్పటికీ అందువల్ల అంత బాధ లేదు చిత్రనిర్మాణం పడిపోయే పరిస్థితే వస్తే దానికయే ఖర్చుకూడా దిగిరాక తప్పదు స్టూడియోలు తగినన్ని ఉన్న పక్షంలో వాటి మధ్య పోటీ ఉండి చిత్రనిర్మాతలకు సరి అయిన సౌకర్యాలు సాధ్యమైనంత చవుకగాలభిస్తాయి స్టూడియోల వారికి కూడా ఏదో లెక్కన ప్రతిఫలం ముట్టుతూ ఉంటుంది అదీకాక స్టూడియోదారులు ఆనాడే చిత్ర నిర్మాణానికి మరింత ధైర్యంగా పూనుకోవచ్చును ఇతరత్రా అదనపు సొమ్ము చేజిక్కించుకుని అనుభవంగాని, అనుభవ జ్ఞుల సహాయంగాని లేకుండా చిత్రనిర్మాణానికి ముందుకు వచ్చేవారు గమనించదగిన విషయం

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 31-10-51*

# 55. సినిమాలు : ప్రజాభిప్రాయం

ఈ కాలపు పరిశ్రమలన్నిటిలోకీ సినిమాలకు ప్రజలపైగల ప్రభావం మరి దేనికీ లేదు పత్రికల ప్రభావమే ఎంతో గొప్పగా చెప్పుకోదగినది, కాని సినిమాతో పోలిస్తే పత్రికల ప్రభావం సహస్రాంశం ఉండదనిపిస్తుంది అయితే ప్రజలపై సినిమాలకుండే ప్రభావం రకరకాలుగా ఉంటుంది అన్ని రకాల ప్రభాన్నీ ఆదరించటానికి లేదు ఆమోదించటానికీ లేదు

తరుచు చూసేవారికి సినిమాలొక నల్లమందులాటి దురలవాటుగా పరిణమించ గలవన్నది అందరికీ తెలిసిన సంగతే జీవితంలో లభించని, జీవితంతో సంబంధంలేని కృత్రిమానందమూ, ఉద్రేకాలూ, సౌందర్యవతుల సన్నిహిత సందర్శనమూ జీవితంలోని కొన్ని లోట్లను తీరుస్తాయనే భ్రమకు సినిమా ప్రేక్షకులు క్రమంగా లోనవుతారు కొంతకాలం సినిమాలు చూడకుండా చేసినట్టయితే వీరు బాధపడతారు వీరిలో కొందరికి సినిమా వ్యామోహం వ్యసనమైపోయి సినిమాకు సంబంధించిన వార్తలను ఆసక్తితో పోగుచెయ్యటమూ, ఆలకించటమూ, చర్చించటమూ మొదలైన పనులు చేస్తారు మరికొందరు సినిమా తారలకు సినిమా పత్రికలకూ రాస్తారు ఇంకా కొందరు సినిమా ప్రపంచంలోకి ఏవిధంగానైనా అడుగుపెట్టటానికీ, సినిమాగాలి ఊపిరితిత్తుల్లో పోసుకోవటానికీ వ్యర్థయత్నాలు చేసి తమ కాలాన్నీ, జీవితాలనూ, అవకాశాలనూ కూడా ధ్వంసం చేసుకుంటున్నారు

ఇదంతా సినిమాల ప్రభావమేగాని వాంఛనీయమైన ప్రభావం కాదు ఇంకొక రకమైన ప్రభావంకూడా కనిపిస్తున్నది ఈ రకమైన ప్రభావంకూడా కనిపిస్తున్నది ఈ రకం ప్రభావం అనేక కళలకు ఉంటుంది చాలామంది సినిమా ప్రేక్షకులు తమ అభిమాన చిత్రాలలోని కథాంశాలనుంచి జీవిత ప్రమాణాలు ఏర్పరుచుకుంటూ, తమను బలంగా ఆకర్షించిన సంభాషణలు నిత్య జీవితంలో వాడేస్తున్నారు ఇటువంటి ప్రభావాన్ని పూర్తిగా కొట్టివెయ్యటానికి గాని ఆమోదించటానికిగాని లేదు ఎందుచేతనంటే ఇది ప్రతికలకూ ఉండదగిన ప్రభావమే అయితే ఈ ప్రభావం ప్రజలకు మంచికి ఉపకరిస్తుందా, చెడ్డకు ఉపకరిస్తుందా అన్నది ఆయా

కళలయొక్క మంచి చెడ్డలనుబట్టి నిర్ణయించవలసివస్తుంది నలుగురు విద్యార్థికులు కూర్చుని లౌకిక సంభాషణ జరుపుతూ ఏ కాళిదాసు రచనలనుంచో, ఏ షేక్స్పియర్ రచనలనుంచో వాక్యాలు చెప్పుకుంటుంటే వినేవారికి చాలా గౌరవం ఏర్పడుతుంది సినిమా సంభాషణలు ఏకరువు పెట్టేవారిని చూస్తే అంత గౌరవం ఏర్పడదు కాళిదాసు సంస్కృతికీ సినిమా చిత్రాల సంస్కృతికీ గల వ్యత్యాసమే దీనికి కారణం సంస్కృతి అన్నదాని విలువను మార్చలేం గనక దీనిని గురించి మనం కొంత ఆందోళన చెందటం సినిమా చిత్రాలను చిన్న చూపుచూడటం ఎన్నటికీ కాదు సినిమా చిత్రాలలో కూడా ఉత్తమ సంస్కృతి ప్రతిబింబించాలనే మనసంతా కోరాలి బాగా సంస్కృతి గలవారు చిత్రాల ప్రభావాన్ని ఆమోదించే రోజు రావాలని కోరుకోవటం ఎన్నటికీ తప్పుకాదు

ఏ కళకైనా ప్రజలమీద సరి అయిన ప్రభావం ఉండాలంటే అది ప్రజల సజీవభావాల పైన అభ్యుదయకరంగా– అంటే జీవితాన్ని అభివృద్ధికి తీసుకుపోయేదిగా ఉండాలి ఏ భావా లైతే ప్రజలను సరిఅయిన చైతన్యం కలిగిస్తాయో, ప్రజలను ముందడుగు వేయటానికి ప్రేరే పిస్తాయో, ప్రజల విజ్ఞానాన్ని బలపరుస్తాయో ఆ భావాలు కళలద్వారా ప్రజలకు అందాలి చిత్రాల మంచి చెడ్డలనుఅంచనా వెయ్యటంలో ఇదొక ప్రమాణం–సర్వోత్తమమైన ప్రమాణం కూడానూ

అయితే కళలకు ఈ ప్రభావం శాసనాల ద్వారానూ, కళాకారుల ఆదర్శవాదం ద్వారానూ రాదన్నది నిర్వివాదం ఇవ్వాళ ఎవరో కొందరు ఆదర్శ ప్రియులు ప్రజలకు మంచి చేసే భావాలను కొన్నిటిని జాబితావేసి వాటి ఆధారంపై కొన్ని సినిమా చిత్రాలు తీస్తే అవి చూడటానికి ప్రజలు ముందుకు రాక అభ్యుదయవాదం అపహాస్యంపాలై అసలుకే ముప్పు జరుగవచ్చు (''అభ్యుదయ చిత్రాలెందుకు తీయు''రని కొందరు అమాయకులు చిత్రనిర్మాతలను ప్రశ్నించటమూ, ''వాటికయే ఖర్చు మీరిచ్చుకుంటే అట్లాగే తీస్తాము మీరు అభ్యుదయ చిత్రాలనుకునేవి తీస్తే ఒక్క కానీ రాదని మా దృఢ విశ్వాసం'' అని చిత్రనిర్మాతలఁటమూ అదివరకే జరిగింది )

అభ్యుదయసాహిత్యం విషయంలో ఇటువంటి అభాసు కొంత అనుభవంలోకి వచ్చింది అభ్యుదయ రచనలని ఏరి ప్రచురించినవి కొన్ని ప్రజల ఆమోదం పొందలేదు ప్రజలపై ఏ భావాలకు ప్రభావం ఉండటం అత్యంత వాంఛనీయమో అటువంటి భావాలు ప్రజల ఆదరణకు అధికంగా పాత్రం కావటం కూడా అత్యవసరం కదా? ప్రజలు అధికంగా పాత్రం కావటం కూడా అత్యవసరం కదా ? ప్రజలు అధికంగా చూసే చిత్రాలు ప్రజలకు ఉపకరించేవి కాక, ప్రజలకు ఉపకరించే చిత్రాలను ప్రజలకు ఉపకరించే చిత్రాలను ప్రజలు చూడక ఈ సమస్య పరిష్కారమయేదెట్లా ?

ఇది పరిష్కారం కాని సమస్య అందామా అనుకుంటే రష్యాలో ఒక చిత్రానికి మొదటి వారంలోనే కొన్ని కోట్ల రూబుళ్లు ఎట్లా లాభం వస్తున్నది ? చైనాలో ఒక చిత్రాన్ని మొదటి వారంలోనే కొన్ని కోట్ల మంది ఎట్లా చూడటం జరుగుతున్నది ?

ఇందులో ఒక రహస్యం ఉన్నది కేవలం వ్యాపార దృష్టితో సినిమా చిత్రాలు తీసేవారు ప్రజలపై సినిమాలకు ఒకరకం ప్రభావం ఉండాలని చూస్తే, ఆదర్శ అభ్యుదయవాదులు

మరొకరకం ప్రభావం ఉండాలని ఆదుర్దాపడతారు ప్రజలకూ చిత్రాలకూ పరస్పర ప్రభావం ఉండాలన్నది సరి అయిన దృక్పథం

సినిమా చిత్రాలకు ప్రజలపై సరిఅయిన ప్రభావం ఉండే పరిస్థితి ఏర్పడాలంటే ప్రజాభిప్రాయం యొక్క ప్రభావంకూడా సినిమా చిత్రాలమీద పూర్తిగా ఉండాలి

ఇప్పుడు కూడా సినిమా చిత్రాలమీద ప్రజల ప్రభావం ఉంటూనే ఉన్నది జనం ఏ రకం చిత్రాన్ని ఎక్కువగా చూస్తారని తోస్తే చిత్రనిర్మాతలు ఆరకం చిత్రాలనే తీయటానికి ఆదుర్దాగా ఉంటున్నారు ఏ తారలు అధికంగా ప్రజామోదాన్ని చూరగొంటే ఆ తారలనే బుక్‌చెయ్యటానికి చిత్రనిర్మాతలు ఎగబడుతున్నారు కాని సినిమా చిత్రాలకు ఈనాడు ప్రజలపైగల ప్రభావం ఎంత హేయంగా ఉంటున్నదో, ప్రజలకు సినిమాలపైగల ప్రభావం కూడా అంత హేయంగానే ఉంటున్నది

ప్రజలకు సినిమాలపైగల ప్రభావం అభ్యుదయకరంగా ఉండాలంటే అది కూడా సాంఘికభావాల రూపంలోనే ఉండాలి ప్రజలు తలచుకున్నట్లయితే ఇటువంటి ప్రభావాన్ని వారు చిత్రాలపై ప్రసరింపజేయగలరు కాని దానికికూడా సాధానాలు కావాలి మామూలు ప్రేక్షకుడు తనకు వచ్చిన చిత్రాన్ని మరొకసారి చూడగలడు, నచ్చని చిత్రాన్ని నలుగురి ఎదటా తిట్టి ఇతరుల చూడకుండా చేయటానికి తోడ్పడగలడు ప్రేక్షకుల సమిష్టి సాంఘిక భావాల ప్రభావం చిత్రనిర్మాణాన్ని సోకాలంటే పత్రికలూ, సినిమా ప్రేక్షక సంఘాలూ చురుకుగా పనిచెయ్యాలి మంచికిగాని చెడుకుగాని, అమెరికాలో కొన్ని సాంస్కృతిక సంఘాలు తమకు సమ్మతంగాని చిత్రాలు నడవకుండా చెయ్యగల స్థితిలో ఉన్నాయి ( కొన్ని అభ్యుదయకరమైన చిత్రాలను కూడా నడవనివ్వటంలేదన్నది గమనించాలి ) మన దేశంలో ప్రేక్షకులకు సినిమా చిత్రాలమీద ఎటువంటి ప్రభావమూ లేకపోవటం మటుకు శోచనీయం

దీనివల్ల ఒక చిత్రమైన చిక్కొకటి కూడా ఏర్పడుతున్నది ఇటీవల సినిమా రంగంలోకి వచ్చిన చిత్రనిర్మాతలలో జీవిత వాస్తవికతను చిత్రాలలో ప్రతిబింబించాలన్న కాంక్షగలవారు కొద్దిమంది ఉన్నారు కాని బోలెడంత డబ్బు ఖర్చు చేసి అటువంటి చిత్రాలు తీస్తే ప్రభుత్వం వాటిని బహిష్కరిస్తుందని వారికి భయం ( అది నిరాధారమైనభయం కావచ్చు కాని ఇప్పుడున్న ప్రభుత్వం వారికి అభ్యుదయ చిత్రాలు తీసే ధైర్యం ఇవ్వకపోవటం ప్రభుత్వం తప్పు కాకపోయినా, ప్రజాదరణ పొందిన అభ్యుదయ నాటకాలను బహిష్కరించిన ప్రభుత్వం అభ్యుదయ చిత్రాలను సహిస్తుందన్నమాట అనుమానాస్పదమే) కాని ప్రేక్షక ప్రజానీకం తమకు నచ్చిన చిత్రాలను గట్టిగా బలపరుస్తుందన్న ధైర్యం ఉంటే ఈనాటి చిత్రనిర్మాతలలో ఏ ఒకరిద్దరైనా, కేవల వ్యాపార దృష్టితో గాక, అభ్యుదయయుతమైన సాంఘిక దృష్టితో చిత్రాలు తీయవచ్చు ప్రజలకూ సినిమా కళకూ మధ్య ఇటువంటి సంబంధ బాంధవ్యాలు ఏర్పడేదాకా ఆకలవల్ల జాతికీ, దేశానికీ, సంఘానికీ ఏమో ఒరుగుతుందనుకోవటం శుష్కభ్రమ

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 7–11–51*

# 56. కథా దారిద్ర్యం

మన దక్షిణ దేశంలో సినిమా పరిశ్రమ పుట్టి దాదాపు రెండు దశాబ్దాలయింది కనీసం రెండు తరాల టెక్నీషియనులూ, నటులూ ఇందులో పనిచేశారు ఆనాటి కానాడు సినిమా శిల్పమూ, పరికరాలూ, నటనా, స్టూడియో సౌకర్యాలూ అభివృద్ధి చెందుతున్నాయి గాని ఎంత మాత్రమూ దిగనాసిల్లటంలేదు ఒకనాడు 50వేలకు తయారైన చిత్రాలు ఈనాడు మూడు లక్షలలో తెమలటంలేదు ఇదంతా ద్రవ్యోల్బణం అనటానికి లేదు, ఎందుకంటే యుద్ధపూర్వంనాటి ధరలతో పోలిస్తే ఈనాటి ధరలు అయిదింతలు మాత్రమే పెరిగింది వెనక 30 మొదలు 40 కాల్ షీట్స్‌తో పూర్తి అయిన చిత్రాలు ఈనాడు 80నుంచి 90 కాల్షీట్లు తీసుకుంటున్నాయి దానికి తగ్గట్టు పూర్వం రోజుకు 20 షాట్స్ తీసిన చోట ఈనాడు 10 కూడా కావడం లేదు

దీన్నిబట్టి పూర్వంకంటె ఇప్పుడు చిత్రనిర్మాతలు సినిమా చిత్రాలను రెట్టింపు శ్రద్ధతో, రెట్టింపు ఖర్చుతో, రెట్టింపు సమర్థతతో తీస్తున్నారన్నది నిర్వివాదాంశం పూర్వం తారలు సహితం తడవకు ఒక చిత్రంలోనే బుక్ అయేవారు ఆ చిత్రం పూర్తి అయి, రిలీజు పుచ్చుకొంటే గాని ఇంకొక బుకింగు ఉండేది కాదు ఈనాడు ఉపపాత్రలు ధరించేవారు కూడా ఒకేసారి నాలుగైదు చిత్రాలలో బుక్ అయి ఉంటున్నారు ఏమంటే ఈనాడు చిత్రనిర్మాతలు చిల్లర పాత్రలకు కూడా ప్రసిద్ధులైన నటులనే బుక్ చేస్తున్నారు

ఇటువంటి పరిస్థితిలో కొన్ని సినిమా చిత్రాలు దెబ్బతింటున్నాయంటే దానికి కారణం కేవలం కథా దారిద్ర్యమే యుద్ధానంతరం తయారై, విడుదలై, దెబ్బతిన్న చిత్రాలలో నటుల హంగు చాలకగాని, శిల్పం లోపించిగాని దెబ్బతిన్న చిత్రం చాలా అరుదు దాదాపు అన్నీ కథ సరిగా లేక దెబ్బతిన్నవే కథ చాలాబాగుండి మిగిలిన హంగులు అంటే, సమర్థులైన నటులూ, తగిన సెటింగులూ, ఫొటోగ్రఫీ, రికార్డింగు పాటలూ, సంగీతమూ, దర్శకత్వమూ వగైరాలు లేక దెబ్బతిన్న చిత్రం మచ్చుకు కూడా కనబడదు

ఇందులో వింత ఏమీలేదు కారణం చిత్రనిర్మాత వ్యయం చేసే ఇన్ని లక్షల రూపాయలకూ, నటుల నటనా సామర్థ్యానికీ, సెట్టింగులకూ, సంగీతానికీ, ఫొటోగ్రఫీకీ, దర్శకత్వానికి పునాది కథ సినిమా కథలో సన్నివేశాల పటుత్వమూ, సరిఅయిన పాత్ర పోషణ ఉన్న పక్షంలో ఒక మాదిరి నటులు కూడా దానికి ఆకారం ఇవ్వగలరుగాని పాత్రలో లేని పస నటనతో భర్తీ చేయడం ఎవరితరమూ కాదు అట్లా సాధ్యమవుతుందనుకునేవారు పరమానందయ్య శిష్యులు దేనికేది ఆధారమో వారికి తెలియదన్నమాట

చెడిపోయిన చిత్రాలను ఒక్కసారి స్మరించినట్టయితే వాటిలో రెండురకాలు కనిపిస్తాయి కొన్నిటి కథలు వస్తుతః సినిమాకు పనికి రానివి వాటితో సినిమా చిత్రాలు తీయాలన్న సంకల్పమే నష్టదాయకమైనది అయితే ఇటువంటి కథలు గల చిత్రాలు చాలాకొద్ది హెచ్చు చిత్రాలలో మంచి కథకు అవకాశం ఉండి కూడా కథ ఖూనీ అయిపోయినట్టు మనకు కనిపిస్తుంది ఈ చిత్రాలు మంచి కథలేక చెడిపోయినవి కావు మంచి కథకుల సహాయం లేక చెడిపోయినవి ! ఇటువంటి చిత్రాలు తయారయేటప్పుడు ఏపాటి కథాజ్ఞానం గలవాడు ఆ

ఛాయల ఉండినా మంచి చిత్రం తయారయేదేమో ననిపిస్తుంది ఇంతకన్నా శోచనీయమైన పరిస్థితి ఉండబోదు ఈ మధ్య విడుదల అయిన చిత్రాలలో 'స్వప్న సుందరి', 'చంద్రవంక', 'అగ్నిపరీక్ష', 'మంత్రదండం' వగైరా చిత్రాలు, మంచి కథలుండి కూడా కథనం సరిగాలేక దెబ్బతిన్న చిత్రాలు దీనికంతకూ మూలకారణం ఒకటి కనిపిస్తుంది కథకుడికి చిత్రనిర్మా ణంలో ఉండదగినంత ప్రాముఖ్యం లేకపోవటం ఇరవై ఏళ్ల చిత్రనిర్మాణానుభవం ఉన్నవారు కూడా సినిమాకథ ఎవరైనారాయవచ్చున్న అపోహతో బాధపడుతున్నారు ముఖ్యంగా తమ స్క్రిప్టు తామే రాసుకోగల డైరెక్టర్లలో ఈ భ్రమ హెచ్చుగా ఉంటున్నది దీనికి ఆధారమేమీ కనిపించదు స్క్రిప్టు రచన వేరే కళ అయిన మాట నిజమే, చాలామంది కథకులకు ఆ విద్య తెలియని మాటా నిజమే అయినప్పటికీ ఎంతమంచి స్క్రిప్టు కూడా మొట్టమొదట కథ ఆకారం తీసుకోవాలి ఆ స్వరూపం లోనే పాత్రలకూ, సన్నివేశాలకూ ప్రాణం ఏర్పడాలి ఆ ప్రాణం స్క్రిప్టులోనూ, షూటింగు లోనూ హరించుకుపోకుండా కనిపెట్టి ఉండగల కథకుడు చిత్రంవెంట చివరదాకా ఉండాలి

చాలా చిత్రాల కథలు మొదట్లో నిర్దుష్టంగా ఉంటున్నాయనీ, సెల్యులాయిడ్ మీదికి ఎక్కే విధానంలోనే వాటిని పురుగు ముట్టుకుంటున్నదనీ సినిమా లైనులో అనుభవంగల కథకులు చెబుతున్నారు ఇది వాస్తవం కావచ్చు సినిమా చిత్ర నిర్మాణంలో చాలా దురాచారా లు ప్రవేశించాయి వీటిని ప్రవేశపెట్టినవారు కథాజ్ఞాన శూన్యులు వీరికి చిత్రనిర్మాణంలో చాలాకాలంగా అనుభవం ఉండటం చేత కొంత పలుకుబడి ఉండి తమ పాతపద్ధతులను అమలు జరపగలుగుతున్నారు వీరి బాల్యంలో గొప్ప చిత్రాలకు కొన్ని వొరవళ్లుండేవి వాటికి చలామణీ ఇవ్వడం కోసమని వీరు కథనూ పాత్రలనూ నిశ్చితంగా ఖూనీ చెయ్యగలరు ఒక్క అపశబ్దంతో పాత్ర ధ్వంసమయిపోతుందనీ ఒక్క సంభాషణ దర్పంగా వినిపించటా నికో, ప్రేక్షకులను నవ్వించటానికో ఆలోచించి పాత్ర చేత దానికి తగని మాట మాట్లాడించి నట్లయితే అందువల్ల ఆ పాత్ర దెబ్బ తింటుందనీ, పాత్ర పోషణ అతి సున్నితమైన విషయమనీ గుర్తించినవారు సినిమా రంగంలో ఈనాడు కూడా అరుదుగానే ఉన్నారు కొందరు చిత్రనిర్మాతల దృష్టిలో సినిమా కథ రాసేటందుకు అర్హత గలవాడు కవి ! వారి దృష్టిలో, ఈనాడు కూడా, కథ కన్నా, పాత్రపోషణ కన్నా, సంభాషణల కన్నా పాటలు ప్రధానం ''సంగీతం బాగుంటే చిత్రం దెబ్బతినదు'' అన్నది ఒక సిద్ధాంతం మంచి సంగీతానికి మూలం పాటలు అందుచేత పాటలు ముఖ్యం ఇవాళ సినిమాలకు కథలు రాసి సంపాదించేదానికన్నా పాటలు రాసి ఎక్కువ సంపాదించవచ్చు

మరికొందరు చిత్రనిర్మాతలు స్క్రిప్టు తయారుచేయటానికి ఒకరిని మించి నియోగిం చటం వృథా అనుకుంటారు ఆ ఒకరూ దీర్ఘానుభవంగలవాళ్లుగా ఉండేటట్టు చూసుకుంటా రు కథ రాయడమూ, సంభాషణలు రాయటమూ, పాటలు రాయటమూ, స్క్రిప్టు(ట్రీట్మెం ట్) రాయటమూ వేరు వేరు విద్యలనీ, వీటికి తగినవారిని వేరు వేరుగా వినియోగించవచ్చుననీ వీరికి తట్టదు చిత్రానికంతకూ పునాది అయిన స్క్రిప్టు తయారయేవరకూ సాధ్యమైనంత తక్కువ ఖర్చుచేసి, ఆ స్క్రిప్టులో లేని రక్తి చిత్రంలోకి తీసుకురావటానికి చిత్రనిర్మాతలు లక్షలకు లక్షలు తగలెయ్యటం చూస్తే భయంకరంగా కనపడుతుంది

మన సినిమారంగంలో కథకుల ప్రభావం ప్రతిఒక్కరిమీదా ప్రబలంగా ప్రసరించవలసి వున్నది ఇప్పట్లో మన డైరెక్టర్లుగాని, నటులుగాని చాలావరకు మొరటు పనితోనే తృప్తి

పడుతున్నారు వారి పనితనంలో నాజూకు రావాలంటే, సాహిత్యానికుండే గౌరవం సినిమాకు కూడా దక్కాలంటే, వారికి సహాయపడగలవాడు కథకుడు తప్ప మరొకడు లేదు స్క్రిప్టు రచనలో కథకుడికి సరిఅయిన స్థానం ఇవ్వటమే గాక, చిత్రనిర్మాత వర్గంలో కథకుణ్ణి బాధ్యతగల స్థానంలో ఉంచినట్టయితే ఇన్ని చిత్రాలు దెబ్బ తినవలసిన అవసరం లేదు

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 26-12-51*

# 57. రెండు చిత్రాలు

1951లో వెలువడిన చిత్రాలు విజయావారి ''పాతాళభైరవి'', వాహినీ వారి ''మల్లీశ్వరి'' కొన్ని విషయాలలో పోల్చదగినవి వీటిని తయారు చేసిన కె వి రెడ్డి, బి యన్ రెడ్డిగార్లిద్దరూ వాహినీ సంస్థకు చెందిన నిర్మాతలు ఒకరు జానపద చిత్రాలు తీయటంలోనూ మరొకరు సాంఘిక చిత్రాలు తీయటంలోనూ ఘనత కెక్కిన వారు

''పాతాళభైరవి''కీ ''మల్లీశ్వరి''కీ కొన్ని పోలికల, కొన్ని తేడాలూ ఉన్నాయి ముందు పోలికలు గమనించుదాం రెండూ జానపద చిత్రాల తరగతికి చెందినవే రెంటిలోనూ కథానాయకుడు అంతఃపురంలోని స్త్రీని ప్రేమించి ఆమె కోసం అంతఃపుర ప్రవేశం చేస్తాడు పట్టుబడతాడు చివరకు తన ప్రేమ సఫలం చేసుకుంటాడు (ఈ పాత్రలు రెండు ఎన్ టి రామారావు ధరించడం ఒక పోలిక అనుకోనవసరం లేదు ) ఈ నాయికా నాయకులు డ్యూయెట్లు పాడటమూ, నాయికకు ఎవరో ఒకరు జోస్యం చెప్పటమూ, నాయకుడు తన ప్రియురాలి కోసం వెర్రివాడై తిరగటమూ– లేకపోలేదు

అయితే ఈ చిత్రాలలోని ఈ పోలికలను మించిన వ్యత్యాసాలున్నాయి అందులో కొన్ని కథకు సంబంధించినవి మరికొన్ని చిత్రనిర్మాణంలో ఏర్పడినవి ''పాతాళభైరవి'' నాయకుడు తోటరాముడు అచ్చగా ప్రేమికుడు కాదు, సాహసి కూడానూ, ''మల్లీశ్వరి'' నాయకుడు నాగరాజు కేవలం ప్రేమికుడు తోట రాముడి లాగా అతను మాయశక్తులనూ, మాంత్రికులనూ ఎదుర్కోనవసరంలేదు ఈ వ్యత్యాసం కథలోనే వున్నది దానికెవరూ ఏమీచెయ్యలేరు కాని ''మల్లీశ్వరి''లో నాగరాజు, ''పాతాళభైరవి''లో తోటరాముడి కన్న ఎక్కువ సాహసం చూపించే అవకాశం లేకపోలేదు ''కనుగొనగలనో లేదో'' అని తోటరాముడు విలపించటంలో కారణం ఉంది మాంత్రికుడు తన ప్రియురాలిని ఎక్కడ పెట్టినదీ తోటరాముడెరగడు కాని నాగరాజుకు తన ప్రియురాలి జాడ తెలుసు అతను రాళ్ళ మధ్యన కూచుని '' ఔనా నిజమేనా! మమతలన్నీ కలలేనా''! అని విలపించనవసరం లేదు తాను శిల్పి గనక తన విద్య ఆధారంగా అంతఃపురం ప్రవేశించటానికి యత్నం చెయ్యవచ్చు ఆ ప్రయత్నం సాగకపోతే ప్రాకారం దూకనూ వచ్చు అందుచేత నాగరాజు సాహసి కాకపోవటమన్నది కథకు సంబంధించిన విషయం కాదు రచనకు సంబంధించిన విషయం అయినప్పటికీ తోటరాముడి సాహసానికి దైవికంగా సహాయం లభించటం కన్న, నాగరాజు బేలతనమే ఎక్కువ స్వాభావికంగా ఉంది

మరొక విషయమేమంటే తోట రాముడి ప్రవర్తన అంతో ఎంతో గర్వంగానే ఉంటూ వచ్చింది. తానే శాసకుడల్లే రాజుగారి బావమరిదిని కొడతాడు రాజకుమార్తె తనను

ప్రేమిస్తున్నదీ లేనిదీ రూఢి చేసుకోడానికీ రాజసౌధం ప్రవేశిస్తాడు మాంత్రికుడి చేతిలోని మంత్రదండాన్ని దొంగిలించి పారిపోతాడు అతను రాజకుమార్తెను పెళ్ళాడే అర్హత సంపాదించటానికి చేసిన సాహసం, స్నేహితుడిని వెంటబెట్టుకుని బయల్దేరడంలోనూ, నాగరాజు మల్లి కుటుంబంలో సరియనిపించుకోటానికై ధనార్జన చేయటానికి విద్య వెంట పెట్టుకు బయల్దేరటంలోనూ బోలెడంత వ్యత్యాసం వుంది ఏ ఉపాయం చేతనైనా సరే తన ప్రేమ సఫలం చేసుకో జూచేవాడు తోటరాముడు ఉదాత్తంగా ప్రేమించి ప్రేమ మీదనే దృష్టినిలిపి దాని మూలంగా బాధపడటం కూడా చరితార్థతేనని నమ్మేవాడు నాగరాజు

తోటరాముడు అంతఃపుర ప్రవేశం చెయ్యటంలోనూ, నాగరాజు అంతఃపురం ప్రవేశం చెయ్యటంలోనూ కూడా చాలా తేడావుంది కేవలం తన ప్రియురాలిని చూడటానికి తోటరాముడు అంతఃపురం ప్రవేశించటం శుష్కదండగ, ఆమెను రోజూ అతను తోటలో చూస్తూనే ఉన్నాడు ఆమెను చూసి మాట్లాడం తప్ప అతను అంతఃపురంలో చేసిందీలేదు, తన సాహసం ప్రేక్షకులకు చూపించడానికే తోటరాముడు అంతఃపురంలో చొరపడ్డాడనుకోవాలి రాజభటులూ, రాజు బావమరిదీ వెంటపడ్డప్పుడు అతని చర్య కూడా ఈవిషయాన్ని రుజావు చేస్తుంది తోటరాముడి పరాక్రమాన్నీ, అతని అంతఃపుర ప్రవేశాన్ని కూడా సమర్థించటానికి జోస్యం ఒకటి పెట్టారు రాజకుమార్తె అంతఃపురంలోనే ఉండాలని జోస్యులు చెప్పినది అంతయుక్తి యుక్తంగాలేదు నాగరాజు విషయంలో ఇటువంటి యుక్తి ఏమీలేదు అతను ఆ పరిస్థితిలో అంతఃపురం ప్రవేశించి తన ప్రియురాలి రహస్యం బయట పడిందేమో, ఆమెకు ఆపద మూడిందేమో తెలుసుకోవటం తప్పనిసరి రాజభటులు వెంటపడినప్పుడు నాగరాజు వారిని కవ్వించడు, తాను తప్పించుకోవటానికి మాత్రమే చూస్తాడు ఇందులో కూడా నాగరాజు ప్రవర్తనే స్వాభావికంగా ఉంది

కథానాయికలను తీసుకుంటే ''ఇందూ''కూ, ''మల్లి''కీ పోలికే లేదు ఇందూ ఇంచుమించు జడపదార్థం దీనికి కారణం లేకపోలేదు మల్లి నాగరాజుతో ఆటలూ, పాటలూ, జీవితమూ పంచుకుంటుంది ఇందు తోటరాముడి జీవితం పంచుకోదు పంచుకోలేదు కూడా ఇందు పక్షం నుంచి ఆమె ప్రేమకు ఆధారం తోటరాముడి చక్కదనం, సాహసం మాత్రమే – జీవితసామ్యం కాదు

ఇద్దరు నాయికలూ తమ ప్రియులకు ఎడమై ''బంగారు పంజరాల్లో'' బంధింపబడతారు రాయలవారి అంతఃపురం ఎంత నేత్రపర్వంగా ఉంటుందో, మాయా మహల్ కూడా అంత నేత్ర పర్వంగానూ ఉంటుంది అయితే మల్లి ''భావం''లో బందీ అయితే, ఇందూ వాస్తవంగా బందీ, అందుచేత వాతావరణానికీ, నాయిక యొక్క బాధకూ గల వ్యత్యాసం మనకు ''మల్లీశ్వరి''లో స్ఫురించినట్టుగా ''పాతాళభైరవి''లో స్ఫురింపదు కాకపోతే నేపాళ మాంత్రికుడు ఇందూను కామిస్తాడు రాయలవారు మల్లిని కామించడు ఆకారణం చేత ఇందూ పాత్రకన్న మల్లి పాత్ర కొంత నీరసంగా ఉండవలసింది అట్లా లేక పోవటం విశేషం

''భావించటంలో'' బి యన్ రెడ్డి ఊహలు కె వి రెడ్డి ఊహలు కన్న చాలా ఉన్నతంగా పోతాయి కాని ''నిర్మించటం''లో కె వి రెడ్డిది స్పష్టంగా పై చెయ్యి ''పాతాళభైరవి''

చూసినట్టయితే అది ఒక నిర్దుష్ట ప్రణాళికతో నిర్మించబడినట్టు స్పష్టమవుతుంది పూర్వాపరాలు సమన్వయించి, కథలో లోపాలను జాగ్రత్తగా అతికి, ఏ సన్నివేశానికి ఏపాటి ప్రాముఖ్యం ఇవ్వాలో ముందుగానే తూచి, ప్రతి సన్నివేశంలోనూ ప్రేక్షకుడి సంతృప్తికి కావలసినది సమకూర్చిన మీదట చిత్ర నిర్మాణం జరిగినట్టుగా ఉంటుంది కథనూ, పాత్రలనూ రచించినమీదట కె వి కేవలం ప్రేక్షకులను మనసులో ఉంచుకొని స్క్రిప్టూ, షూటింగ్ సాగించినట్టు తోస్తుంది బి యన్ షూటింగు చేసేటప్పుడు కూడా తన భావాలను గురించే ఆలోచిస్తున్నట్టుంటుంది అందుకే ''మల్లీశ్వరి''లో అంత నిర్దుష్టమైన నిర్మాణం లేదు కొన్ని చోట్ల డైరెక్టరు తడువుకోవటం కనిపిస్తుంది కొన్ని సన్నివేశాల మీద డైరెక్టరు తగినంత శ్రద్ధ చూపనట్టు అనిపిస్తుంది కథలో కొన్ని అంశాలు జారవిడిచినట్టు తోస్తుంది పూర్వాపరాల సమన్వయం అక్కడక్కడా సంతృప్తిగా లేనట్టు తోస్తుంది కొన్ని సన్నివేశాలకు ఇవ్వదగిన దాని కంటె తక్కువ ప్రాముఖ్యమో, ఎక్కువ ప్రాముఖ్యమో ఇచ్చారన్న భావం కలుగుతుంది

చిత్రనిర్మాణం వంటలాటిది పదార్థాల బాగుకన్న కూడా వంట నేర్పు ఎక్కువ అవసరం ఈ విషయం బి యన్ రెడ్డికి తెలియదనటానికి లేదుగాని ఆచరణలో కె వి రెడ్డి ఈ సూత్రాన్ని ఎక్కువ బాగా అమలు చేస్తున్నట్టున్నది ఆయన చిత్రాలు నేరుగా ప్రజల వద్దకు పోతాయి ప్రేక్షకులకు భాష్యకారుల సహాయం అవసరం లేదు మొదటిసారే వారికి కథా, పాత్రలూ కూడా పూర్తిగా అవగాహన అయిపోతాయి విమర్శనాజ్ఞానం గల ప్రేక్షకులు మళ్ళీమళ్ళీ చిత్రాన్ని చూడకపోయినా ''వినోదం'' కావలసిన అసంఖ్యాకులు ''పాతాళభైరవి''ని ఎన్ని సార్లయినా చూడగలరు, చూశారు కూడానూ

బి యన్ రెడ్డి, కె వి రెడ్డి కూడా బలమైన వ్యక్తిత్వం గల నిర్మాతలే ఆకారణం చేత ఇద్దరూ కలిసి చిత్రం తీయటమనేది పొసగదు కాని అది ఒనగూడిననాడు గొప్ప భావాలతో కూడిన ప్రజారంజక చిత్రం తయారు కావచ్చు, లేదా ఈ పనిని మరెవరైనా సాధించవలసి వుంటుంది

*ఆంధ్రపత్రిక వార పత్రిక, 2-1-1952*

# 58. సంక్రాంతి సినిమా ఉత్సవం

మొన్నటి సంక్రాంతినాడు మద్రాసు వాహినీ స్టూడియోస్‌లో సంక్రాంతి సినిమా ఉత్సవం జరిగింది ఈ నగరంలో సినిమా రంగానికి చెందిన పలువురు ప్రముఖులు ఉత్సవంలో పాల్గొన్నారు ఆహుతులైన రెండు మూడు వేలమంది పురజనులతో, రకరకాల రంగు రంగుల దుస్తులు ధరించిన సినీ జనంతో స్టూడియో ఆవరణం కలకలలాడింది విజయావారు నేత్ర పర్వమైన అలంకారాలు చేశారు

ఉత్సవంలో ముఖ్యమైనదీ, చెప్పుకోదగినదీ అయిన అంశం ఏమిటంటే, నటీనటులు, డైరెక్టర్లు, ప్రొడ్యూసర్లు, గాయకులు, ఒకరేమిటి సినిమా రంగానికి చెందిన యావన్మందీ వినోద వేషాలు(ఫాన్సీ డ్రెస్) ధరించి స్టూడియో వీధుల్లో విచ్చల విడిగా విశృంఖలంగా విహరించటం, చలన చిత్ర ఆకాశంలోని తారాబలం అంతా కండ్ల ఎదుట సాక్షాత్కరించిం

దంటే అతిశయోక్తి కాదు

అందాల తార అంజలీదేవి జిప్సీ నాట్యగత్తె వేషంవేసి నాట్యం చేసింది భానుమతి దొరసాని వేషంవేసి కిళ్లీలు, చాకలెట్లు అమ్మింది అంజలీ, భానుమతి చేయీ చేయీ కలిపి నాట్యం కూడా చేశారు శాంతకుమారి జిప్సీదాని వేషం వేసి మువ్వల డప్పు మోగించింది రంగారావు రంగుల బొంగరాలు అమ్ముతూ తిరిగాడు నాగేశ్వరరావు కోటప్ప కొండ యాత్రి కుడి వేషంవేసి కొందరు భక్తులను వెంటపెట్టుకుని ''గోహిందా గోహిందా'' అంటూ అడుగడుక్కీ మూర్ఛపోవటం మొదలెట్టాడు డైరెక్టర్ ప్రసాద్ జూదగాడి వేషంలో జోగారావు ను మొగవేషంలో సావిత్రిని వెంట వేసుకుని ''కాయ్‌రాజా కాయ్‌రాజా'' అంటూ (''మోసం లేదు, అంతాదగా'') తిరిగాడు రేలంగి పాకీవాడి వేషంవేసి, చీపురుకట్ట పట్టుకుని ''బీదోణ్ణి బాబూ'' అని ప్రేక్షకులను నవ్వించాడు లింగమూర్తి శరగోపం పెట్టి బఫూన్‌చేష్టలు చేశాడు ముక్కామల మార్వాడీ వేషం, విజయా అధిపతి నాగిరెడ్డి మాజీ సిపాయి వేషం, చక్రపాణి నైజాం దేశ్‌ముఖ్ వేషం వేశారు. డైరెక్టరు రామకృష్ణ, పి పుల్లయ్య ''ప్రొహిబిషన్ గిహిబిషన్ నై, ఆవోపీవో'' అని షరబతు పంచిపెట్టారు గోవిందరాజుల సుబ్బారావు వంటినిండా వంగనామాలతో హరిదాసులా తయారయ్యాడు ఘంటసాల వెంకటేశ్వరరావు భజన బృందం వెంటేసుకుని తిరిగాడు తమిళ హాస్య నటులు రామచంద్రన్, సారంగపాణి కోయ దంపతుల వేషాలు వేశారు ఎన్ టి రామారావు ఎలుగుబంటి నాడించా డు పాపం రామారావు ''బోడెమ్మ'' వేషంతో వెంటబడిన గంగారత్నం నుండి తప్పించుకోడా నికి చాలా శ్రమపడ్డాడు వంగర వెంకట సుబ్బయ్య చైనావాడిలాగ తయారై బెలూన్‌లమ్మాడు బాలకృష్ణ ఆంగ్లో ఇండియన్ లేడీ వేషం వేసి ప్రేక్షకులను కడుపుబ్బ నవ్వించాడు. కథా రచయిత కొడవటిగంటి కుటుంబరావు పోలీసు వేషం, విజయావారి ఆర్టు డైరెక్టరు గోఖలే ఫ్రెంచి డాక్టరు వేషం వేశారు

జానకి, కన్నాంబ, జయమ్మ, పుష్పవల్లి వసుంధర ఉత్సవానికి వచ్చారుగాని వేషాలు వెయలేదు జి వరలక్ష్మి, ఎస్ వరలక్ష్మి, కృష్ణవేణి మొదలగు కొందరు ఎక్కడా కనిపించలేదు శ్రీరంజని 'గుణసుందరి కథ' లో మల్లే ఎలుగుబంటితో కొంతసేపు తిరిగింది

సాయంకాలం 6-30 కల్లా స్టూడియో యావత్తూ రంగు రంగుల విద్యుద్దీపాలతో దేదీప్యమానంగా ప్రకాశించింది ప్రేక్షకులంతా ఒక చివరగల వేదిక వద్దకు చేరారు అక్కడ ''లారాలప్పా'' మొదలైన హిందీ పాటలకు అనుగుణంగా అంజలి, భానుమతి, శాంత కుమారి, సావిత్రి మొదలైన కొందరు హాస్య నృత్యం చేశారు తరవాత రేణుకావారి తరపున గిడుతూరి, వెంపటి ''మానవుడు చిరంజీవి'' అనే నాటకం ప్రదర్శించారు తరవాత నల్ల రామ్మూర్తి రచించిన ''తూర్పు సావిత్రి'' అనే ఫార్సు ప్రదర్శించబడింది ఇందులో రేలంగి ''సత్తెమంతుడు'' గాను, లక్ష్మిరాజ్యం ''సావిత్తిరి'' గాను నల్ల రామ్మూర్తి ''యమదరమ రాజా'' గాను తాపీ చాణక్యారావు ప్రాంప్టర్ గాను నటించారు చివరికి రేలంగి ''నాకు తక్కువ ఫార్స్ నిచ్చావు, నీ కెక్కువుంచుకున్నావు'' అని రామ్మూర్తితో దెబ్బలాడాడు తరవాత సరస్వతీగాన నిలయం బాలికలు చేసిన నృత్య ప్రదర్శనంతో ఉత్సవం ముగిసింది

వినోద వేషాల్లో ప్రతి ఒక్కటీ ఆకర్షణీయంగా వున్నది ముఖ్యంగా అంజలి భానుమతి, రేలంగి, ప్రసాద్ వేషాలు బాగున్నాయి ఉత్సవంలో విజయా వాహిని, రేణుక, అవర్ ఇండియా,

యువా నారాయణన్ కంపెనీ, భరణీ, అంజలీ, రాగిణీ, అసోసియేటెడ్ ప్రొడక్షన్సు, ప్రసాద్ ఆర్ట్సు పిక్చర్సు, రాధాకృష్ణ ఫిలిమ్సు మొదలైన సినీ కంపెనీలవారు పాల్గొన్నారు దక్షిణ భారత చలన చిత్ర చరిత్రలో మొట్టమొదటి సారిగా జరిగిన ఈ సంక్రాంతి ఉత్సవం ఏర్పాటు చేసింది విజయావారే పండుగ వేడుకలనన్నిటినీ మూడువేల అడుగుల చిల్లరదాకా ఫిలిమ్ తీశారు

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 23-1-52*

# 59. ఇటాలియన్ చిత్రాలు

ప్రపంచంలోకెల్లా ఇటాలియన్ చిత్రాలు అత్యుత్తమమైనవని మొన్నటి అంతర్జాతీయ చలన చిత్రప్రదర్శనం నిరూపించింది కథలను ఎంచడంలోనూ, ఆ కథలను సినిమాకు అవసరమైన రీతిని చిత్రించడంలోనూ ఇటాలియన్లలో ఒక ప్రత్యేకత కనబడుతుంది రెండో ప్రపంచయుద్ధంలో అన్ని విధాలా భంగపడిన దేశం ఇటలీ యుద్ధం అనంతరం దుర్భర దారిద్ర్య స్థితిలో ప్రజలు రోజులు గుడుపుతున్నారు నేటి దారిద్ర్య స్థితికి హేతువేదో అందరికీ తెలుసును జాతి గర్వం యుద్ధ కాలంలో దెబ్బతిన్నది ఆ పైన రెండు రకాల రాజకీయవాదుల మధ్య పెనుగులాట ప్రారంభమయింది ఈ స్థితిలో తమ జాతీయజీవన విధానాన్ని, ప్రజల దారిద్ర్యాన్నీ, మానవ స్వభావంలోని మంచి చెడ్డలను తరిచి చూసుకోవడం ఆరంభమయింది ఇదే వారి చిత్రాలలో బహుముఖాల గోచరమౌతుంది

మద్రాసులో ప్రదర్శించబడిన ఇటాలియన్ చిత్రాలు అయిదు 1. Miracle of Milan 2 Naple's Millionaires 3 Opean City 4 Bycicle Thief 5 Girl of the Marshes ఈ అయిదింటిలోనూ (సైకిల్ దొంగ) అందరినీ అధికంగా ఆకర్షించింది

వీనిలో ప్రతి చిత్రంలోనూ వాస్తవ జీవనాన్ని ప్రతిబింబించడంలో అద్వితీయమైన ప్రతిభ కనబడుతుంది ఏ కావ్యం కంటే కూడా వాస్తవ జీవితమే రసభరితమైనదని గోర్కీ అన్నాడు ఈ సత్యాన్ని గోర్కీ తన ఆత్మకథలో నిరూపించాడు ఇప్పుడు ఇటాలియన్ చిత్రాలు అదే సత్యాన్ని చాటుతున్నాయి

'సైకిల్ దొంగ' అనే చిత్రంలో కథ అట్టే లేదు ప్రభుత్వమిచ్చే భత్యంలో బ్రతుకుతున్న అంతోనియోకి దొరక్కదొరక్క రెండేళ్ల అనంతరం పనిదొరుకుతుంది అది గోడలకి పోస్టర్లు అంటించే పని అయితే స్వంత సైకిల్ లేకపోతే ఆపని కూడా ఇవ్వరు అందువల్ల ఇంట్లో గుడ్డలమ్మి వచ్చిన డబ్బుతో తాకట్టు తీర్చి తన సైకిల్ తెచ్చుకుంటాడు మర్నాడు పనికి వెళ్లి ఒకచోట పోస్టర్ అంటిస్తున్న సమయంలో ఒక దొంగ అతని సైకిల్ తీసుకుని పారిపోతాడు అంతోనియో వెంటబడినా దొంగ ఇట్టే మాయమైపోతాడు పోలీసులకు రిపోర్టిస్తే దొంగని సైకిల్తో సహా పట్టుకొని తీసుకొస్తే సైకిలిప్పించగలరని ఆఫీసర్ చెప్తాడు!

దొంగసొత్తులు అమ్మే బజారుకి మర్నాడు ఆదివారం మిత్రులతో సహా వెళ్లి గాలిస్తాడు సైకిల్ దొరకదు వాన రాగా ఎనిమిదేళ్ల కొడుకుతో కలిసి తలతడియకుండా ఒక చోట నిలబడతారు వాన వెలిసిపోగానే అంతదూరంలో దొంగ సైకిల్ నిలిపి ఒక ముసలి దానితో మాట్లాడ్డం చూస్తాడు అంతోనియో పరిగెత్తి పట్టుకోబోతే దొంగ మళ్లీ పారిపోతాడు వెనక్కి

వచ్చి ఆచోటంతా వెతికి ముసలివాణ్ని పట్టుకుంటాడు దొంగ పేరు నివాసం చెప్పకుండానే ముసలివాడు తప్పించుకుంటాడు చివరికి దొంగ కనబడినా పోలీసుని తీసుకు వచ్చి అతని ఇల్లు వెతికించినా సైకిలు మాత్రం దొరకదు పేటలో జనం మాత్రం దొంగకి దొంగతనం కట్టినందుకు ఇతన్నే నిందిస్తారు! జరిగిన వంచన దిగమ్రింగుకుని సమీపంలో ఉన్న ఒక సైకిల్ని ఆంతోనియో దొంగలించబోయి పట్టుబడతాడు అందరూ ఇతన్ని దూషించి విడిచిపెట్టేస్తారు

కథ అట్టే లేకపోయినా నిత్యజీవితంలో సహజంగా అందరికీ తటస్థపడే సన్నివేశాల సహాయంతో మానవహృదయాన్ని, దౌర్బల్యాన్ని, సుఖదుఃఖాలను దర్శకుడు మరచిపోలేని విధంగా చిత్రించాడు కష్టంలో ఉన్నప్పుడు, విప్పలేని చిక్కులో పడినప్పుడు, వంచనలమధ్య పరాభవం చెందినప్పుడు, ఆశ అల్లంతదూరంలో అందీఅందకుండా పరిభ్రమింపచేసి నప్పుడు మనస్సు ఏ రీతిగా ఉంటుందో, పరిపరి విధాల ఎలా భ్రమిస్తుందో బహు కొద్ది మాటలలో, అదీ సహజంగా చిత్రించబడినది అంతోనియోకి తన జీవనోపాధికి సైకిల్ ఎంత అవసరమో తెలుసును ఉద్యోగంలో చేరబోతూ మేనేజర్ దగ్గరికి వెళ్ళేటప్పుడు ఆంతోనియో సైకిల్ని భుజానికి తగిలించుకుని వెడతాడు నేలమీద దించడానికి మనసొప్పనట్టు ప్రవర్తిస్తాడు

వివిధ సన్నివేశాలను సృష్టించి నిర్వహించడంలోనూ, ముఖ్యంగా ఆంతోనియోని అంటిపెట్టుకుని తిరుగుతూ సైకిల్ కోసం వెతికిన ఎనిమిదేళ్ల కొడుకు బ్రూనోతో జరిగిన సంఘటనలలోనూ దర్శకుని అసమానమైన ప్రతిభ కనబడుతుంది జీవనమంతా సంగ్రామమైనప్పుడు వ్యక్తుల ప్రవర్తన, పసి బాలుర అమాయకత్వం క్షణిక సుఖాల భ్రమకు లోనయ్యే నాటి చిత్తవృత్తి, సమాజం వంచనకు లోనైనవారెలా దుర్వర్తనకు మొగ్గుతారో వాస్తవంగా చిత్రించబడింది కరుణ రసాత్మకమైన ఈ చిత్రం మన నిర్మాతలకు ఒక తెన్ను చూపుతోంది

ఈ చిత్రంలో ఇంకొక ముఖ్యమైన అంశం ఏమిటంటే మొదటినుంచి చివరివరకు ప్రతీ దృశ్యంలో కనబడే నాయకుడు, అంతోనియో పాత్రను ధరించినవాడు సినిమాల వృత్తికి సంబంధించనివాడు ఒక కార్మికుని తెచ్చి దర్శకుడు ఆంతోనియో పాత్రను ఇచ్చాడు అయితే ఏ నటకునికంటే తీసిపోని ప్రతిభనతడు ప్రదర్శించాడు తండ్రీకొడుకులును ముఖ్యపాత్రలుగా తెచ్చి చిత్రానికీ, కథకు జీవం పోసిన దర్శకుని ప్రతిభ అసమానం

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 27-2-52*

# 60. సినిమా పరిశ్రమ ప్రగతి దుర్గతులు

మొన్నటి సంక్రాంతి శుభ సమయంలో ఇద్దరు ప్రముఖ సినిమా వ్యక్తులు శ్రీ బి ఎన్ రెడ్డి, శ్రీమతి పి భానుమతిగార్లు వెనక్కుతిరిగి చూసుకుని ఈ రోజులుకన్న ఆ రోజులే మంచివని నిర్ణయానికి వచ్చారు వారిద్దరి కంటే కూడా అంతో ఇంతో ముందుగా సినిమా రంగంలోకి జొరబడిన వాణ్ణి అయినప్పటికీ, వారిలాగా నేను సినిమా పరిశ్రమకు అంటుకుపోలేదు గనుకనూ వారిద్దరూ విడావిడిగానూ, సమిష్టిగానూ కూడా సినిమా చరిత్రలో కొత్త అధ్యాయాలు రచించిన వారు గనుకనూ, వారన్నది కాదనటం భావ్యంగా ఉండదు

అందుచేత వారు అనుకునే దానికి ప్రబలమైన కారణాలు ఉంటాయని చెప్పుకుంటూ పై నుంచి అటుచూసి వాటి పుకృతి నుంచి అప్పటి విషయాలు, ఇప్పటి విషయాలు కొన్ని చర్చిస్తాను

అప్పటికీ ఇప్పటికీ సినిమాల విషయంలో మార్పున్నమాట ఎవరూ కాదనలేరు కాని ఆ మార్పు సినిమా చిత్రాలలో కన్నా ప్రేక్షకులలో చాలా ఎక్కువ అని నా అంతరాత్మ చెబుతున్నది అప్పటి ప్రేక్షకులు తయారైన ప్రతి చిత్రాన్ని కొంత శ్రద్ధాభక్తులతో చూసేవారు సినిమాలలో నటించేవారు, వాటిని తయారు చేసేవారు వేరొక ప్రపంచానికి చెందినవారని ఆనాటి ప్రేక్షకుల అభిప్రాయం అది అటే ఆకర్షవంతమైన ప్రపంచమని కూడా ప్రజలకు నమ్మకం లేదు ఆ ఆకర్షణ పత్రికల పబ్లిసిటీ మూలంగా రగుల్తున్నది

ఆ రోజుల్లో నటులు లేరు– స్టేజి నుంచి అరువు తెచ్చుకున్న కొద్దిమందిని తప్పిస్తే నిర్మాతలంటూ ఎవరూ లేరు ఊళ్ళూళ్లు తిరిగి సినిమాకు కావలసిన వారిని వెతికి తెచ్చిన వారే అనాటి నిర్మాతలు కాస్త పాడగలరనీ, కొంచెం బాగుంటుందనీ పేరున్న ప్రతి స్త్రీ చుట్టూ కాంట్రాక్టరు తిరిగేవారు ఆ స్త్రీలు తమ శరీరాలమ్ముకుని జీవించేవాళ్లే అయినా సినిమాలలోకి రావటానికి భయపడేవారు (''అయ్యా, నామీద ఏడు ప్రాణాలు ఆధారపడి బతుకుతున్నాయి నా వృత్తి చెడగొట్టకండి'' అని ఒక స్త్రీ కంట్రాక్టరును బతిమిలాడింది) ఆనాటి చిత్రాలలో పేరు వేయించుకున్న నిర్మాతలు ఎవరంటే స్టూడియో దార్లు కలకత్తా, బొంబాయి నగరాలలో స్టూడియోలు కట్టినవారు, లేదా దివాలా ఎత్తిన స్టూడియోలు కొన్నవారు

ఆనాటి కళా తృష్ణకుగల భౌతికాధారాలు ఇవే ఆనాటి నిర్మాతలకు వ్యాపార దృష్టి లేదనటం ఉత్ప్రేక్షాది అలంకారాలలో ఒకటి అనిపించుకుంటుంది వాస్తవానికి ఆనాటి నిర్మాతలకుగల అత్యున్నతాశయం వ్యాపారం మిగిలినవి దానికన్న హీనమైనవి

నాకు తెలిసిన ఈ తొలి రోజులను గురించి నేను ఘనంగా భావించలేనని వేరే మనవి చేయనవసరం లేదు కాని వాటిని ఖండించడం కూడా నా ఆశయం కాదు ఎంత పవిత్రమైన ఉద్యమంలోనైనా తొలి దశలు ఇలాగే ఉంటాయి అటువంటి పునాదులపైనే మహత్తర సౌధాలు నిర్మాణమౌతాయి అది ప్రకృతి నిర్ణయంలాగా కనిపిస్తుంది

ఆ తరువాత మంచి రోజులు వచ్చాయి అది సహజం సినిమా చిత్రాలు నిర్మించటం వృత్తిగా కిట్టుబాటవుతుందని తెలియగానే కళా దృష్టి గలవారు సినిమా కళను ఉద్ధరించటానికి ముందుకు వచ్చారు అంతకు పూర్వం నిర్మాతలకన్నా వీరు ఎక్కువ విచక్షణతో వృత్తాలు ఎన్నుకున్నారు నటీనటులనుతీసుకున్నారు సాంకేతిక ప్రవీణులను మరింత ప్రోత్సహించారు

ఈ మార్పుల వెనక ఉండే ఆర్థిక విషయాలు మనం అర్థం చేసుకుంటేనేగాని మనం నిర్మాత దృష్టికి సినిమా రంగంలో లభించిన స్థానాన్ని అర్థం చేసుకోలేం నేను తొలి రోజులనుకునే కాలం సినిమా చిత్రమైనా సుమారు 25 వేలలో పూర్తి అయ్యేది స్టూడియోదార్లకు 20 వేలు దాటేది కాదు కాని కళాకారులు రంగంలోకి అడుగుపెట్టే నాటికి సాధారణంగా ఒకమాదిరి చిత్రానికి కనీసం 50,60 వేలు రాబడి ఉంటున్నది చిత్ర నిర్మాణ వ్యయానికీ, రాబడికీ మధ్య ఉండే వ్యత్యాసాన్ని కొంతవరకు 'కళ' కోసం వినియోగించటంలో అటే ప్రమాదం ఉండబోదనీ, 'కళ' వల్ల తమకు నిర్మాతలలో పై అంతస్తు దక్కుతుందనీ ఈ కొత్త నిర్మాతలు అంచనా వేశారు

ఇందులో కూడా తప్పేమీ లేదు ఈ నిర్మాతలు రాకపోతే మన సినిమా పరిశ్రమ అనామకమైన పురాణ చిత్రాలతో ఎదుగు బొదుగూ లేకుండా అలాగే ఉండిపోయేది కాని ఈ పురోగతికి కావలిసిన ప్రోత్సాహం ఆర్థికంగా ప్రేక్షకుల నుంచి లభించే పరిస్థితి ఏర్పడింది

ఇందులో వ్యాపార ఆర్థిక దృష్టి లేకపోలేదు

ఈ కొత్త నిర్మాతలు సినిమా పరిశ్రమకు చేసిన మేలును ఎవరూ కాదనలేరు వీరి వెంట సాంఘిక చిత్రాలు వచ్చాయి సినిమా నటులలో తారలు అనేవాళ్లు ఏర్పాటయ్యారు స్టుడియోదార్లు కాని నిర్మాతల సంఖ్య బాగా పెరిగింది సినిమా పరిశ్రమ చరరాశినుంచి స్థిరరాశికి మారింది

కాని వీరే పెట్టుబడిదారీతో కూడిన పోటీ కూడా పరిశ్రమలోకి తెచ్చారు ఒకరికన్న ఒకరు ఎక్కువ 'కళ' గల చిత్రాలు తీయాలనే పోటీలో ఎక్కువ 'ఖరీదైన' చిత్రాలు కూడా తీశారు ఆ రోజుల్లో కళ బొత్తిగా డబ్బుపై ఆధారపడి ఉండేదని చెప్పటానికి చాలా చింతిస్తున్నాను ఇదంతా సద్వ్యయమని కూడా అనటానికి లేదు ఎందుకంటే సినిమా నటులు అడగకుండానే వారికి నిర్మాతలు పోటీపడి ఎక్కువ వేతనాలిచ్చామన్నారు తారల వేతనాలకూ, వారి నటనకూ సంబంధం లేకుండాపోయింది ఈ దశలోనే పబ్లిసిటీ ద్వారా జనాన్ని చిత్రాలకేసి ఆకర్షించటం ప్రారంభమయింది కూడా ఇదే దశలో వీటికి కళతో సన్నిహిత సంబంధం ఉండవచ్చు గాని వ్యాపార దృష్టితో కూడా చాలా సంబంధం ఉన్నది

ఈ విషయం ఇంత గుచ్చి ఎందుకు చెబుతున్నానంటే, ప్రేక్షకులలో తగినంత పరిణామం రాక పూర్వమే, వ్యాపార దృష్టి అంతగా లేక సంభాషణతో ముందుగానే సాంఘిక చిత్రం తీసిన కీ శే కృత్తివెంటి నాగేశ్వరరావుగారు లాంటివాళ్లు చేతులు కాల్చుకుని శాశ్వతంగా సినిమా ప్రపంచానికి ఎడంగా ఉండిపోవలిసి వచ్చింది కళా దృష్టినిబట్టి వారిని కీర్తించినవారు కూడా లేదు! కాని అలాంటి వారు అప్పుగా కళా దృష్టి వెంటపడిపోక మరి రెండు మూడేళ్లాగి సాంఘిక చిత్రాలు తీస్తే వారు కూడా సినిమా చరిత్రలో ఏదో ఒక పుటను అలంకరించే వారే

వ్యాపార ధర్మంలో కూడా పరిణామ దశలున్నాయి అమెరికాలో తొలి పరిశ్రమలు సాగించిన వారు సాంకేతిక ప్రవీణులు ఆ దశపోయి గుత్త పెట్టుబడిదార్లు వచ్చారు ఇనుము ఉక్కు ఎలా అవుతుందో తెలియనవసరం లేకుండానే కోటీశ్వరులు అగ్ర ఉక్కు పారిశ్రామికులు కాగలిగారు ఇంచుమించు అలాటి పరిణామమే సినిమా పరిశ్రమలోనూ కలిగింది కళను గురించి ఏమీ మాట్లాడకుండానే డబ్బు వెచ్చించి ఉన్న తారను ఏ రైటుకైనా కంట్రాక్టు చేసి, స్టూడియో అద్దె పారేసి, బ్రహ్మాండమైన సెట్టింగులు, దుస్తులతో, పాటలూ, డాన్సులూ, యుద్ధాలు మొదలైన ప్రజాకర్షణలతో చిత్రాలు తీసి పారెయ్యగలవారికి దారి– రహదారి –పడింది

జనాన్ని ఆకర్షించటంలో ఈ చిత్రాలకున్న శక్తిలో పాత చిత్రాలకు నూరోవంతు ఉండినట్లు కనపడదు ఈ చిత్రాలలో కళ లేదంటారా అనండి! ఒకప్పుడు కళ పేరు చెప్పుకుని ప్రేక్షకులను ఆకర్షించటానికి నిర్మాతలు ఏ వ్యాపార పద్ధతులు అవలంబించారో వాటినే ఈనాటి నిర్మాతలు ఇంకా ముందుకు తీసుకుపోయి అశేష జనాన్ని ఆకర్షించగలుగుతున్నారు వీళ్ళు తారలను తయారు చేయలేదు తారలంటూ ఏర్పడింది వీరి ముందుతరంలోనే వ్యాపార పోటీ వీరి కొరకు తెచ్చి పెట్టలేదు ఒక నిర్మాత ఆరువేలకు బుక్ చేసిన తారకు ఇంకొక నిర్మాత ఎనిమిదివేలు ఇస్తానని ముందుకు రావటంలో కళ ఏమీ ఉన్నదీ తెలీదు కాని వ్యాపార పోటీ ఉన్నది

నా మిత్రులు గూడవల్లి రామబ్రహ్మం పనిగట్టుకుని సినిమా చిత్రనిర్మాణ వ్యయాన్ని లక్షకు పెంచినప్పుడు నాకూ ఆయనకూ పద్ధతులలో కొంతరంధి జరిగింది "ఇది వ్యాపార

లక్షణంలే' అని వారు ఒప్పుకుంటే నాకూ ఆయనకు పేచీ ఉండేది కాదు కాని ఆయనా కళాప్రియులు మరి పోటీ ఆయనకు నిజానికి హాని చేసింది ఈ మేరకు ఈయన కళా దృష్టికి స్వస్తి చెప్పి ''మాంత్రికుడు'' తీయవలసి వచ్చింది దాన్ని నాకు చూపించమని అడిగితే, ''నువ్వు చూసే పిక్చరు కాదులే సార్'' అన్నారాయన నేనాయనతో సానుభూతి చూపాను ఆయన కళా దృష్టిని శకించలేదు కూడా ఆయన పల్నాటి యుద్ధం ప్రారంభోత్సవానికి నేను కూడా ఉన్నాను నాగయ్యగారు ''త్యాగయ్య'' తీస్తే ఆయన పొందిన ఆనందాన్ని నేను కళ్ళారా చూసాను అందుచేత ఆయన కళాభిమానాన్ని శంకించే అధికారం నాకు లేదు కానీ వ్యాపారపు రథ చక్రాలకింద ఈ కళా దృష్టి నలిగిపోకతప్పదని నాకు ఆనాడూ తెలుసు, ఈనాడూ తెలుసు

ఇదంతా శోచనీయం కాదా? అవును కాని దాన్ని గురించి ఎవరూ ఏమీ చేయగల్గినది లేదు ప్రజలు తమకు కావలసిన చిత్రాలు చూస్తారు వారి అభిరుచిలో లోటుంటే దాన్ని సరిదిద్దటానికి కళాత్మక చిత్రాలు ఎవరైనా తీయదలిస్తే చట్టం ఒప్పుతుంది సత్యజిత్ రాయ్‌లాగా వ్యాపార కుస్తీ నుంచి ఎడంగా వెళ్ళి అంతర్జాతీయ బహుమానాలు అందుకునే చిత్రాలు తీయగలవారికి ఆటంకమూ ఆక్షేపణా ఏమీ లేదు స్టార్ వాల్యూ కావాలి ప్రొడక్షన్ వాల్యూస్‌కు లోపం ఉండరాదు వ్యాపార పోటీ వ్యాపార పోటీగానే ఉండాలి తక్కువ జనాన్ని ఆకర్షించగల చిత్రానికి ఎక్కువ డబ్బు రావాలి అంటే అది ఈశ్వరుడివల్ల కూడా కాదు

ప్రపంచం గొడ్డుపోలేదనీ, దేశం నిండా నటించడానికి యువతీ యువకులు – తారత్వం సిద్ధించిన వాళ్ళు కారు నిజంగా నటించగలవాళ్ళు – ఉన్నారని అందరికీ తెలుసు గొప్ప కళాకారులివ్వగల అతి గొప్ప సెట్టింగులను మించిన నైసర్గిక రమణీయత ప్రకృతి ఉచితంగా ఇస్తున్నది కాని కళకు ఇవన్నీ సాధనాలు కాకపోవటం ఆశ్చర్యకరం

పాత రోజులు మంచివన్నదీ, పాత చిత్రాలు కళగలవన్నదీ ఆ చిత్రాలను విడుదల చేస్తేగాని రుజూవు కాదు చార్లీ చాప్లిన్ వంటి కళాకారుడు తన పాత రోజులను గురించి మెచ్చుకున్నట్టు కనబడడు కాని అతని ''సిటీలైట్స్'' చిత్రం 30 ఏళ్ళ అనంతరం విడుదల చేస్తే పెద్ద ''హిట్'' అయికూచున్నది మన పాత చిత్రాలలో ఉండే కళా వైవిధ్యానికి కూడా అటువంటి రుజూవు ఉంటే తప్ప అది రుజూవు కావటానికి మార్గం లేదు

క్రియకు ఒక్క మాట చెబితే సరిపోతుందనిపిస్తుంది వుట్ట గొడుగుల్లాంటి చిత్రాలను ఆదరించి ఈ పరిశ్రమను ఇంతగా పెంచినవారు ప్రేక్షకులు దీనికి కళాకాంతు లిచ్చే సామర్థ్యం కూడా వారిలోనే గుప్తంగా ఉన్నది చేతనయితే దాన్ని ఎవరన్నా మేల్కొలపండి

ఆంధ్రప్రభ , వారపత్రిక , 11-2-52

# 61. 'పెళ్లిచేసి చూడు' శతదినోత్సవం

జూన్‌రిన విజయవాడలో విజయావారి 'పెళ్లి చేసి చూడు' శతదినోత్సవం ఏర్పాటయింది 7వ తేదీ రాత్రి కలకత్తా మెయిలులో మేమందరమూ విజయవాడకు బయలుదేరాం విజయ పబ్లిసిటీ మాన్ కేశవపాయ్, ప్రొడక్షన్ మేనేజరు మద్దూరి శేషాచలపతిరావూ కలిసి ప్రయాణ సన్నాహాలన్నీ చేశారు టిక్కెట్లు వారం రోజులు ముందుగానే కొనటమూ, కంపార్ట్‌మెంట్‌లు

రిజర్వు చెయ్యటమూ, ప్రయాణ సౌకర్యాలు ఏర్పాటు చెయ్యటమూ పాయ్ చేశాడు విజయనిర్మాతలు నాగిరెడ్డి, చక్రపాణిగార్లూ, డైరెక్టర్ ప్రసాద్‌గారూ, ఫోటోగ్రఫీ డైరెక్టరు మిస్టర్ బార్ట్లీ మొదటి తరగతిలో ప్రయాణించారు మిగిలిన వారందరికీ రెండవ తరగతి కంపార్ట్‌మెంట్‌లు రిజర్వు చేయబడ్డాయి

మా కంపార్ట్‌మెంట్‌లో కవి పింగళి నాగేంద్రరావుగారూ, డైరెక్టరు కామేశ్వరరావుగారూ, మ్యూజిక్ డైరెక్టరు ఘంటసాలగారూ, ఆర్ట్ డైరెక్టరు గోఖలే, ఎస్ వి రంగారావూ,నేనూ వున్నాం సావిత్రీ, చౌదరిగారూ,సూర్యకాంతం, దొరస్వామి, డాక్టరు శివరామకృష్ణయ్య, జోగారావు, వెంకయ్య,పద్మనాభం, బాలకృష్ణ, మాస్టర్ కుందు, కేశవరాం ఇతర కంపార్ట్‌మెంట్‌లో సర్దుకున్నారు

మెయిలు సెంట్రల్ స్టేషన్ నుంచి బయలుదేరకముందు మా పెట్టెలోకి ఇద్దరు పోలీసులు వచ్చి సూళ్లూరు పేటదాకా వస్తామని చెప్పారు వారి వద్ద ఒక తుపాకీ, తూటాలూ కూడా వున్నాయి ఏమిటి విశేషమని అడిగితే పక్కనున్న మొదటి తరగతిలో ఎవరో మంత్రిగారు ప్రయాణిస్తున్నారని చెప్పారు మంత్రిగారెవరో వారికే తెలీదు తీరా బయలుదేరే సమయానికి ఇద్దరు పోలీసులు ముగ్గురైనారు పోలీసులతో స్నేహం చేసుకొని వారి తుపాకీ, తూటాలు పరీక్షించిన మీదట వారి కోసం ఘంటసాల ''పంచదార వంటి పోలిసెంకటసామి'' పాటపాడారు కాని ఒక్క పోలీసుకూ తెలుగురాని కారణంచేత వారికాపాట అర్థంకాలేదు అందులో ఒకడికి తమిళ భాషకూడా రాదు, వాడు మళయాళీ ఈ మాట తెలియగానే రంగారావు వాణ్ణి మళయాళంలో పలకరించారు వెంటనే వాడి ముఖం వికసించింది

మళయాళీ పోలీసుకోసమని చెప్పి ఘంటసాల ఒక మళయాళం పాట జ్ఞాపకం తెచ్చుకొనిపాడారు (ఘంటసాల అనేక మళయాళ చిత్రాలకు ప్లేబాక్ పాటలు పాడారు) అయితే ఈ ప్రయత్నం కూడా వృధా అయింది ఎందుకంటే ఘంటసాల పాడిన మళయాళం పాట మాకందరికీ అర్థమయిందిగాని మళయాళ పోలీసుకు అర్థం కాలేదు దాన్నిండా సంస్కృతపదాలే

పోలీసులతో మరి కాస్సేపు బాతాఖానీ కొట్టిన పిమ్మట వారంతా 'పాతాళభైరవి' చూశారన్నది బయటపడింది వారిలో కనీసం ఒకడు 'షావుకారు' కూడా చూశాడు సరే,యికనేం? 'పాతాళభైరవి' రచయితగా పింగళి వారినీ, సంగీత దర్శకుడిగా ఘంటసాల వారినీ మాంత్రికుడు పాత్రధారిగా రంగారావునూ, కళాదర్శకుడుగా గోఖలేనూ వారికి పరిచయం చేశాం వారు చాలా సంతోషించారు 'పెళ్లిచేసి చూడు' త్వరలోనే తమిళంలో వస్తున్నదని చెప్పాం పోలీసులు ఆ చిత్రాన్ని తప్పక చూస్తామన్నారు

తరువాత మేం కబుర్లలో పడ్డాం ఘంటసాలా నేనూ సంగీతం గొడవలో పడ్డాం శాస్త్ర సంగీతం విషయంలో ఘంటసాలకీ ఇతర పండితులకీ కొంత అభిప్రాయభేదం వచ్చింది కృతులు భావయుక్తంగా ఎట్లా పాడవచ్చునో ఘంటసాల పాడి వినిపించారు తమ సొంతచిత్రానికి తయారు చేసిన పాటలు కూడా వినిపించి, ఏయే దృశ్యాలకు అనుగుణంగా ఏయే ఆర్కెస్ట్రా స్వరాలు ఏర్పాటు చేసిందీ తెలియజేశారు నిజానికి సంగీత దర్శకుడు తీయని దృశ్యాలను ముందుగా తన మనస్సులో చూసుకొని దానికి తగినట్టు వాద్యాల వాయింపు అమర్చుకోవాలి

ఏవో జాగాలలో ఏవేవో నోట్స్ వేసుకుపోయినంతమాత్రాన పనిజరగదు (ఘంటసాల వారి సొంత చిత్రం షూటింగు కొద్ది రోజుల క్రితమే వాహినీ స్టూడియోలో ప్రారంభమై ఉండింది ) మేమీ సంగీత ప్రపంచంలో ఉండగానే సూళ్ళూరుపేట వచ్చింది రైలు ఆగింది

తినటానికేమైనా దొరుకుతుందేమోనని నేనూ, గోఖలే రైలు దిగివెళ్ళాం ఏవో అన్నం పొట్లాలూ అవీ ఉన్నాయి గాని తినటానికి లాయకీగా కనిపించలేదు మేమిద్దరమూ అయిదు నిముషాలకల్లా తిరిగివచ్చి మా పెట్టెలు ఎక్కాం రంగారావు ఒక్కడే ఇంకా ప్లాట్‌ఫారం మీద ఉన్నట్టు తెలుసుకున్నాను బండి బయలు దేరటానికింకా చాలా టైముంది ఇంతలోనే రంగారావు గాలికి కొట్టుకొచ్చేవాడల్లే వచ్చి మా పెట్టెలోపడ్డాడు అతని వాలకం చూస్తే అతన్ని తోడేళ్ళ మంద ఏదో తరిమిందా అనిపించింది ఇంతలోనే పెద్ద పశువులమంద పరిగెత్తుతున్నట్టు చప్పుడైంది మరుక్షణం తోడేళ్లు మాపెట్టిదగ్గిరమూగి అరవసాగాయి

ఆదృశ్యం వర్ణనాతీతం వాళ్లంతా కలిసి యాభైమంది ఉంటారేమో వాళ్లు మాట్లాడేది మానవభాషేగాని వారి భావప్రకటనలో మానవత ఏమీగోచరించలేదు వారు రంగారావును పలకరించటంలేదు ప్రశ్నించటంలేదు తమకూ, రంగారావుకూ మధ్య భగవంతుడిచ్చిన భాష ఏదీ లేనట్టు ప్రవర్తించారు ఒకరి తరవాత ఒకరు 'పాతాళభైరవి' లో మాంత్రికుడి సంభాషణలు వల్లె పెట్టసాగారు ''సంజీవి సిద్ధం వాయరా, డింగరీ,'' ''నాకేసి చూడవో, బుల్‌బుల్!'' ఈ విధంగా ఒకరిద్దరు మాంత్రికుడి శిష్యుడితో తాదాత్మ్యం సాధించి, ''మోసంగురో'' అని కూడా ఆక్రోశించారు

రంగారావు మాత్రం ఇది చూసి ఆనందిస్తున్నట్టు కనిపించలేదు అతను మా పెట్టెలో వాళ్లకే సరిగా కనిపించనట్టుగా నీడలో కూర్చుని తాను అక్కడలేనట్టు నటించడానికి ప్రయత్నం చేస్తూ, ఇప్పుడు తనదంతా అలవాటయిపోయిందని మమ్మల్ని మధ్య మధ్య నమ్మిస్తున్నాడు

బయట తోడేళ్ళ అరుపులు సాగుతూనే ఉన్నాయి వారిలో ఒకడు కొత్త పంథాతొక్కి, 'పెళ్లి చేసిచూడు' లో వియ్యన్న సంభాషణలు — ఉన్నవి, లేనివీ కూడా — ఏకరువు పెట్టనారంభించాడు మరికొంతమంది అందుకున్నారు ఇదంతా వాళ్లకే విసుగ్గా తోచింది కాబోలు మళ్లీ ఎవడో 'పాతాళభైరవి' కి మారాడు మిగిలినవాళ్లు కూడా తమ కూత మార్చారు ఇంతలోకి చల్లగా రైలు కదిలింది కాని తోడేళ్లకు సామ్మింకా గిట్టబాటు అయినట్టు తోచలేదు వాళ్లు రైలుతో పాటు మాపెట్టవెంబడే నడవసాగారు, తరవాత పరిగెత్తారు కూడానూ, మాది చిట్టచివరపెట్టేమో, వాళ్లు మమ్మల్ని ప్లాట్‌ఫారం ఒక చివర నుంచిదాదాపు రెండో చివరదాకా సాగనంపారు

ఏం జరిగిందీ రంగారావు చెప్పాడు, అతను కాఫీ తాగుతుండగా ఎవరో, దొంగను పట్టుకున్నట్టు, ''అడుగోరా!'' అన్నాట్ట వెంటనే తోడేళ్ల గుంపు అప్పటికప్పుడు తయారయింది రంగారవు ప్రమాదం గుర్తించి ''శ్రీఘ్రబుద్ధే పలాయనం'' అనుకుని ఉండాలి మిగిలింది మేము చూడనే చూశాం ఆ తండాయావత్తూ తన వెంట రాలేదనీ అందులో ఒక ''దళం'' చీలి సావిత్రి వగైరాలున్న పెట్టెకేసి వెళ్లిందనీ రంగారావు చెప్పాడు

సావిత్రీ వాళ్ళ పెట్టె దగ్గిర జరిగిన సంఘటనలు స్వయంగా చూడలేకపోయినందుకు చాలా చింతించాను సావిత్రిని ఏం జరిగిందని అడిగితే, ''ఎబ్బే, ఏం జరగలేదు మా పెట్టెలో

దీపాలార్పేశాం!'' అని చెప్పింది ఈ తోడేళ్లను చూసి సావిత్రి ఎంతమాత్రం జంకివుండదు! ఆమె నిండా ముసుగుతన్ని పడుకున్నదని చూచాయగా విన్నాను బహుశా సావిత్రికి చలివేసి ఉంటుంది నిద్రకూడా వచ్చి ఉంటుంది! సూళ్ళూరుపేట దగ్గిర రైల్వే పోలీసులు తుపాకి, తూటాలతో సహా నిష్క్రమించాడు మళ్లీ మాకు వారు కనిపించలేదు సూళ్ళూరుపేట దాటగానే లైట్లార్పేసిమేము కూడా నిద్రకుపడ్డాం

అమిత ఉక్క, ఉన్న మూడు ఫానులలో ఒకటి పనిచేయ్యటంలేదు రైలుపెట్టె కుదుపు దుర్భరంగా వుంది మాకెవరికీ ఆరాత్రి సరిగా నిద్రపట్టలేదు కాస్త నిద్రపట్టే సమయానికి విజయవాడరానేవచ్చేసింది

విజయవాడలో మాకంపార్టుమెంటు దగ్గిర ఎవరూ మూగలేదు రెండో కంపార్ట్‌మెంట్ దగ్గర మూగారేమో మాకు తెలీదు కాని, విజయ డిస్ట్రిబ్యూటర్లు తయారుగా ఉంచిన కార్లలో మేము దేశోద్ధారకుని దుర్గా విలాసం చేరేసరికి -- అదేమా విడిది -- ఆ ఇంటిముందు గుంపులు చేరి ఉన్నారు మేడపైకి వెళ్లేసరికి నాకు మరొక వింత దృశ్యం కనిపించింది దుర్గావిలాసానికి దక్షిణంగా వున్న ఆవరణలో చక్రాలు లేని మోటారు బస్సొకటి వుంది దాని నిండా లుకలుకలాడుతూ కుర్రాళ్లు నిలబడి వున్నారు దక్షిణపు బాల్కనీలోకి సినిమా తారాలువస్తే చూద్దామని!

విజయడిస్ట్రిబ్యూటర్లు, ముఖ్యంగా కాజవెంకటరామయ్యగారు, పూర్ణచంద్రరావుగారు, సత్యంగారు మాకు అనేక విధాల చక్కని సౌకర్యాలు ఏర్పాటు చేశారు ప్రతి చిన్నదానికీ మేము వారిమీదే ఆధారపడ్డాం భోజనాదికాలు స్థానిక మోడరన్ కఫేవారు చూశారు

క్షణక్షణానికీ దుర్గావిలాసం ముందువీధి జనంతో కిక్కిరిసిపోతున్నది వారు ''పెళ్లి చేసి చూడు'' తారలను చూడాలని తహతహలాడిపోతున్నారు మా తారలందరూ బాల్కనీ మీదికి వచ్చి జనానికి కనిపించారు జనంలో హర్షధ్వానాలు బయలుదేరాయి అందులో కొందరు 'పెళ్లి చేసిచూడు' లో సంభాషణలు ఏకరవు పెట్టారు వారు ఆ చిత్రాన్ని ఎన్నోసార్లు చూసి వుండాలి ముఖ్యంగా కుందూ ఎన్నోసార్లు వచ్చి వారికి కనపడవలసివచ్చింది రంగారావూ, వెంకయ్యా, జోగారావు, బాలకృష్ణకూడా ఈ ప్రజలకు ఎంతో ఆప్తులైపోయారు జోగారావు, తనను చూసి జనం గొల్లునగోలపెట్టగానే, రాజాపాత్ర అభినయిస్తూ బయపడ్డట్టు నటించి ఇవతలికి వచ్చేశారు జనం ఆనందానికి మేరలేదు బాలకృష్ణ విషయం చెప్పనక్కర్లేదు అతను ఏంచేసినా జనం విరగబడి నవ్వారు కొందరు '' ఎన్ టి రామారావుగారిని పిలవండి'' అని కేకలు పెట్టారు షూటింగు తొందరవల్ల రామారావు రాలేకపోవటం వారికి చాలా ఆశాభంగం కలిగించి వుంటుంది

మేము కూడా 'పెళ్లి చేసి చూడు' మైకంలోనే ఉండిపోయినాం అందులో నటించిన వారిని వారి పాత్రల పేర్లు పెట్టే పిలవటం! మేమే అవకాశం దొరికినప్పుడల్లా ఆ చిత్రంలో సంభాషణలు వప్పచెప్పటం! అటువంటప్పుడు బయటమూగిన జనం వెర్రివాళ్లనే అర్హత మాకు మాత్రం ఎక్కడిది?

భోజనం చేసేదాకా కాలక్షేపం కావాలి ఎవరో రెండు పేకలు సంపాదించారు జోగారావూ, డాక్టరూ, రంగారావూ, దొరస్వామీ, గోఖలే మొదలైన వారు ఆటకు కూర్చు

న్నారు జోగారావు డాక్టర్నూ, రంగారావునూ, దొరస్వామినీ కూడా ''మామంగారు, మామంగారు'' అంటూ ఉండటం చూసినప్పుడు నాకు స్ఫురించింది, జోగారావుకు 'పెళ్లిచేసిచూడు'లో ముగ్గురు మామలున్నారనీ, అందులో ఇద్దరు పిల్లనివ్వజూపారనీ, ! ఆఖరుకు చీట్ల పేకదగ్గిరకూడా 'పెళ్లి చేసిచూడు' హాస్యాలే రంగారావు డబ్బు పోతుంటే ''వియ్యన్న ఇట్లాగే దివాలా తీశాడు'' అన్నాం డాక్టరు డబ్బుపోతే ''అంతజాగ్రత్తగల వెంకటపతిరాజా డబ్బు పోగొట్టుకోవటమేమిటి?'' అన్నాం దొరస్వామికి డబ్బు వస్తుంటే, ''గోవిందయ్య తలలు మార్చేవాడు దుష్టుడికి దూరంగా ఉండండి'' అని మిగిలినవాళ్లకి సలహాయిచ్చాం

భోజనాలయ్యేవరకూ భరించలేని ఉక్కగా ఉండి, తరువాత వాన ప్రారంభమయింది పెద్దవాన కాకపోయినా కాస్త చల్లబడింది విజయవారు మళ్ళీ వానపట్టుకొచ్చారన్నారు కిందటేడు వీరు 'పాతాళభైరవి' శతదినోత్సవాలకు వెళ్లినచోటల్లావానేట కిందటిసారి ప్రతి థియేటరు వారూ ఈ ఉత్సవాలు తమ స్వస్థలంలో జరిపారు కాని ఈసారి 11 థియేటర్లవారూ బెజవాడకే వచ్చి దుర్గాకళామందిరంలో ఉత్సవం జరిపారు దానికి జిల్లా కలెక్టరు శ్రీనివాసన్ అధ్యక్షత వహించటానికి ఒప్పుకున్నారు

శ్రీనివాసన్‌గారికి మధ్యాహ్నం రెండుగంటలకు మాతోబాటు టీ ఏర్పాటు చేశారు ఆయన ఆసందర్భంలో విడిదికివచ్చి అందరి పరిచయమూ చేసుకున్నారు ఆయన యువకుడే, ఉత్సాహవంతుడు సినిమాలను గురించి ఆయనకు చాలా అభిప్రాయాలు కూడా ఉన్నాయి ఆయన వస్తుతహా తమిళుడైనా తెలుగూ, ఇతర దేశభాషలూ ఆయనకు వచ్చును ఆయన 'మల్లీశ్వరి' చూశారట, చారిత్రక వాతావరణంగల అలాంటి చిత్రాలు తీయ్యాలని ఆయన అన్నారు మన చిత్రాలు చాలా పొడవుగా వుంటున్నాయనీ, దక్షిణ దేశ చిత్రాలలో హిందీ, విదేశీ సంగీతాలు ప్రవేశపెడుతున్నారనీ ఆయన ఆక్షేపించారు నాగిరెడ్డిగారు ఈ రెండు ఆక్షేపణలనూ ఆమోదిస్తూ చిత్రాల పొడవు విషయం మనకు చిక్కులున్నాయన్నారు హిందీ చిత్రాలను పట్టణవాసులు అధికంగా చూస్తారు బొంబాయి, కలకత్తా, ఢిల్లీలాటి నగర వాసులకు దీర్ఘచిత్రాలు అవసరం లేదు కాని మనకా సౌకర్యం లేదు మద్రాసులో కూడా తమిళ చిత్రం ఖర్చుగాని, తెలుగు చిత్రం ఖర్చుగాని యెత్తదు మన చిత్రాలు అధికంగా 'సి' క్లాసు సెంటర్ల రాబడిపై ఆధారపడతాయి అక్కడి ప్రేక్షకులకు దీర్ఘప్రదర్శనలు కావాలి 'చంద్రహారం' లో జాస్తిగా కర్నాటక సంగీతం ఉంటుందని కూడా నాగిరెడ్డిగారన్నారు దుర్గాకళామందిరానికి బయలుదేరేవేళ అయింది ముఖద్వారాన్ని జనం ముట్టడించి ఉన్నారు అదృష్టవశాత్తు కార్లు లోపలికిరావటానికి దొడ్డి మార్గం ఉన్నది స్త్రీలను ఈ మార్గంగా పంపేసి మగవాళ్లం కార్లలో ఎక్కి బయలుదేరాం కాకపోయినా విజయవాడ పోలీసులు మాకు చక్కని రక్షణ కల్పించారు జనం వల్ల మాకు ఏబాధా కలగలేదు

ఉత్సవం కొద్దిసేపే జరిగినా చాలా వైభవంగా జరిగింది దుర్గాకళామందిరం ఆహ్వానితులతో కిటకిటలాడుతున్నది బెజవాడలోగల ప్రముఖులంతా అక్కడే వున్నారు స్టేజిమీద నిర్మాతలకూ, తారలకూ, టెక్నీషియనులకూ కూర్చునే ఏర్పాట్లు చేశారు స్టేజికి దిగువగా రిపోర్టర్లు కూర్చున్నారు వారిలోచాలా మంది పాత మిత్రులు కనిపించారు నేను వారి మధ్యనే కూర్చున్నాను

కార్యక్రమం ఘంటసాలవారి ''జయ జననీ పరమపావనీ'' ప్రార్థనతో ప్రారంభమయింది ప్రార్థనానంతరం డిస్ట్రిబ్యూటర్లు విజయబృందానికి పూలదండలు వేశారు అధ్యక్షుడు తన తొలి పలుకులలో 'పెళ్లిచేసి చూడు' గురించీ, దాని నిర్మాతలను గురించీ ప్రశంసాపూర్వకంగా మాట్లాడారు విజయనిర్మాతలకూ, తారలకూ, టెక్నీషియనులకూ ఆహ్వానాలు తెలుపుతూ సన్మాన పత్రాలు ఇంగ్లీషు, తెలుగుభాషలలో సమర్పించబడ్డాయి

డైరెక్టర్ ప్రసాద్, ఘంటసాల, ఎస్ వి రంగారావు, డాక్టరు శివరామకృష్ణయ్యగార్లు సంగ్రహంగా మాట్లాడారు అందరి ప్రసంగాలలోనూ ప్రధానవిషయమేమంటే, 'పెళ్ళి చేసి చూడు' విజయం ప్రధానంగా చక్రపాణిగారిదన్నది ప్రసంగాల అనంతరం బహూకరణలు ప్రారంభమయినాయి ఈసందర్భంలో నాగిరెడ్డిగారు చక్కని ప్రసంగం చేశారు ఆయన చిత్ర నిర్మాతను పిల్లతండ్రితో పోల్చారు తండ్రి తన బిడ్డను ఒకరిచేతిలో పెట్టేస్తాడు కాని ఆ పిల్ల తన జీవితం విజయవంతం చేసుకుంటుందా, నలుగురి ఆదరణా సంపాదించుకుంటుందా అన్నవేధ ఉంటుంది తండ్రికి నాగిరెడ్డిగారు నిష్కపటంగా తన సినిమా అనుభవాన్ని ఏమాత్రం దాపరికం లేకుండా, ప్రజలెదట పెట్టారు, తనకు ఎవరెవరు ఎట్లా సహాయం చేశారో, ఏవిధంగా విజయం సాధించారో, ప్రత్యేకించి చక్రపాణి తన భాగస్వామికావటం ఎంతగా ఉపకరించిందో, విజయ డిస్ట్రిబ్యూటర్లెంతగా తోడ్పడ్డారో చెప్పారు, తనకింద పనిచేసే వారిని మించినవారు సినిమా రంగంలో లేరన్నారు ( ఇది నాగిరెడ్డి గారి జీవితంలో తొలి బహిరంగ ప్రసంగమని తెలిసి నేను నమ్మలేకపోయాను ) తన ప్రసంగం ముగిశాక నాగిరెడ్డిగారు, తమ చిత్రాలన్నీ నూరురోజులు విజయవంతంగా ప్రదర్శించిన 11 థియేటర్ల వారికీ ''ప్లేక్'' లు బహూకరించారు ఇది ఒక్కొక్కటి రు 800లు పైగా వుంటుందని విన్నాను వీటిని అతిరమ్యంగా వెండితో బాస్‌రిలీఫ్‌లో తయారుచేసి బంగారుపూతా, పసుపు, ఆకుపచ్చ ఎనామెల్ వేశారు అనంతరం డిస్ట్రిబ్యూటర్లు నటులకు బహుమతులిచ్చారు ఒక్కొక్కరికీ అర్థచంద్రాకారంగల నగిషీ వెండిపళ్లెమూ, నగిషీవెండిగ్లాసులూ, కప్పులూ ఇచ్చారు

అధ్యక్షుడు తమ అంత్యోపన్యాసంలో సినిమా పరిశ్రమ గురించీ చిత్రాల పొడవుగురించీ, ట్యూనులు తస్కరించటంగురించీ మాట్లాడారు డిస్ట్రిబ్యూటర్ల ధన్యవాదాలతో ఉత్సవం ముగిసింది

లాడ్జిలో బ్రహ్మాండమైన టీ పార్టీ ఉత్సవానికి ఆహ్వానించబడిన వారందరూ ఈ పార్టీకి ఆహ్వానించబడ్డారు ఈ పార్టీతో న్యాయంగా 'పెళ్ళిచేసిచూడు' శతదినోత్సవం ముగిసింది కాని దుర్గాకళామందిరంలో ఆరోజు ప్రదర్శనలు చూసేవారికి ముగియలేదు రెండు ఆటల మధ్యా విరామాలలో మా నటులు వారికి పరిచయం చేయబడ్డారు రెండో ఆటవారికి కొంచెం అన్యాయం జరిగినదనుకుంటాను ఎందుకంటే, మర్నాడు కాల్‌షీట్ ఉండటం వల్ల దొరస్వామి 9 గంటలకు బయలుదేరి మెయిలులో మద్రాసు వెళ్ళిపోయినాడు

మేము మర్నాడు, అంటే 9వ తేదీ సోమవారం రాత్రి మెయిల్లో గాని బెజవాడ వదలేదు, అయినా మా కారోజు ''నాగవల్లి మర్నాడు'' కాలేదు ఏమంటే మారుతీ సినిమా ప్రొప్రయిటరు శ్రీనివాసరావుగారు మాకు తమహాలులో శాంతారాంగారి ''అమర్ భూపాలీ'' వేసి చూపారు అంతకు పూర్వమే ఆ హాలు సీటింగంతా మార్చేశారట మద్రాసులో చాలా హాలులకన్న ఇప్పుడా

హాలు అందంగా ఉన్నది  సాయంకాలం నవయుగ డిస్ట్రిబ్యూటర్లు మాకు చిన్న విందు చేశారు ఈ విందుకాగానే మేము ఆరాత్రి మెయిలుకు బయలుదేరటానికి సిద్ధంగా ఉండాలని కబురు వచ్చింది  ఇది తలవని తలంపుగా జరిగింది  ఏమంటే ఆ మధ్యాన్నానికి కూడా రిజర్వేషను దొరకలేదు  కాని విజయ డిస్ట్రిబ్యూటర్లు ఎట్లాగో ఒక బోగీ సంపాదించగలిగారు  దీపాలు పెట్టేసమయానికి మాకు తేలికగా వీడ్కోలు విందు జరిగింది అప్పటికదే కొందరికి ఉదాత్తమయి కూచుంది

మా సామానులు ముందే వెళ్ళిపోయాయి  ఒక్కొక్క కారులోనూ పట్టినంతమంది ఎక్కిపోదామని అందరమూ కిందికి దిగివచ్చాం  యధాప్రకారం ముఖద్వారం దగ్గిర జనం కాపేసి ఉన్నారు  ఈ సమయంలో తలవని తలంపుగా 'పెళ్ళి చేసిచూడు' సంభాషణ మరొకటి వినవడింది  సూర్యకాంతం మా దగ్గిరికి వచ్చి, ముఖద్వారం కేసి చూపుతూ '' ఆ ముదనష్టపాళ్లతో మీకెందుకుగాని దొడ్డిదారిని పదండి, నాయనా!'' అనేసింది.

అన్నిటికన్న ఆశ్చర్యమేమంటే తిరిగివచ్చేటప్పుడు ఎలా ప్రవేశించారో ఒక పురుగుకు కూడా తెలియదు  రిజర్వు చేసిన బోగీరైలు చివర తగలించేదాకా మేమే వాళ్లజాడ తెలుసుకో లేకపోయినాం  అప్పటికి జనం పోగైనారుగాని అందువల్ల మాకేమీ ఇబ్బందికలగలేదు  విజయ డిస్ట్రిబ్యూటర్లకు ధన్యవాదాలు చెప్పి వారికీ, 'పెళ్లి చూసిచూడు' శతదినోత్సవానికీ కూడా వీడ్కోలు కూడా నాగిరెడ్డిగారి ఉపమానం ప్రకారం విజయావారి మూడవ పుత్రిక విజయం చూశాము  ఆమెగౌరవార్థం ఉత్సవంకూడా చేసుకున్నామేగాని ఆమెకు అదేషణంలో వీడ్కోలుకూడా ఇచ్చాం  ఇక ఈవిడ గురించి మేము చేయబోయేదేమీలేదు  ముందు ముందు ఇతర విజయపుత్రికలు వచ్చి ఈమెస్థానం ఆక్రమిస్తారు

*కినిమా, మాసపత్రిక, డిశంబరు 1952*

# 62. లేఖ

'కినిమా' డిసెబరు సంచికలో 'పెళ్ళిచేసి చూడు' శతదినోత్సవం గురించిన అనుభవం ప్రకటిస్తూ సూళ్ళూరుపేటలో మా కంపార్ట్‌మెంట్ వద్దకు వచ్చినవారిని ''తోడేళ్ళు'' అని వర్ణించినందుకు చాలా పశ్చాత్తాప పడుతున్నాను  ఈవిషయమై 'కినిమా' సంపాదకుడికి లేఖలు వ్రాసినవారు నాకు, 'కినిమా' సంచాలకునికి చాలా హేయమైన ఉద్దేశాలు ఆపాదించారు  అటువంటి ఆపాదనలకు ఎట్టి అవకాశమూ లేదనీ, యింకొకరిని విమర్శించే సమయంలోనే వారు విమర్శనీయమైన ఆపాదనలు చేసి ఉండటం శోచనీయమనీ మనవి చేస్తున్నాను

*కినిమా, మాసపత్రిక, జనవరి 1953*

# 63. తెలుగు సినిమా విశిష్ట చరిత్రలో కొన్ని మైలు రాళ్ళు

1936లో తలవని తలంపుగా నేను  సినిమా రంగంలో అడుగుపెట్టే నాటికి భారతీయసినిమా పరిశ్రమ అప్పుడప్పుడే శైశవావస్థ నుంచి బయటపడుతూ ఉంది  అప్పటికే కలకత్తాలో న్యూథియేటర్స్ వారూ, పునాలో ప్రభాత్ వారూ సినిమానొక కళాసాధనంగా

ఉపయోగించటానికి యత్నాలు చేస్తున్నారు బాబూరావు పెయింటర్, శాంతారాం, నితిన్‌బోస్, దేవకీబోస్ మొదలైన కొందరి పేర్లు అప్పటికే ప్రసిద్ధికి వచ్చాయి మద్రాస్ వేల్ పిక్చర్స్ స్థాపితమయింది 'కృష్ణలీలలు' చిత్రం అప్పుడే వెలువడి జైత్రయాత్ర ప్రారంభించింది

అయినా సినిమా పరిశ్రమ ఇంకా శైశవాన్ని పూర్తిగా దాటలేదు నేను అడుగుపెట్టిన సాగర్ మూవీటోన్ (బొంబాయి) స్టూడియో అప్పట్లో తక్కువది కాదు అయినా అక్కడ ఫిడెలిటోన్ రికార్డింగ్ సెట్టు మాత్రమే ఉండేది ప్లేబాక్ పద్ధతి ఇంకా అమలులోకి రాలేదు సంగీతానికి నాలుగైదు వాద్యాలే ఉండేవి ఎవరి పాటలువాళ్లు సెట్టుమీద పాడటమూ, పిక్చరుతోపాటూ పాట రికార్డింగ్ కావటమునూ, కాకపోతేపాట చలాకీ పాట అయినా, పాడేది ముఖ్యపాత్ర అయినా, రెండు కెమెరాలు ఉపయోగించేవారు అప్పటికి సినిమా పాటలకు రాగాలంటూ ఉండేవి అయితే రాగాలు లేకుండా పోయే ఛాయలు కనిపించి సంగీత వాద్యగాళ్లు విచారం వెలిబుచ్చేవారు ఆ రోజులలో శాస్త్ర సంగీతం వెనుకబడటానికి కారణం కొత్తబాణీల రాకమట్టుకు కాదు ఆ కాలంలో వివిధ స్టూడియోలలో వెలసిన సంగీత దర్శకులకు శాస్త్ర సంగీతం కన్న ''ఉప్పా'' సంగీతం ఎక్కువగా తెలిసి వుండటమే (మా సంగీత దర్శకుడు హిందూస్థానీ రాగాలలో దానీ అనే రాగం ఉందని కూడా ఎరుగడు!) శాస్త్ర సంగీత యుగం తరువాత చాలా కాలానికిగాని అయిపోలేదు మాష్టారు కృష్ణారావు లాంటి సంగీత విద్వాంసులు అప్పుడప్పుడే సినిమా రంగంలోకి వస్తున్నారు కూడాను

ఆ రోజుల్లో కళా దర్శకత్వమంటూ ఉన్నట్టు నాకెక్కడా స్ఫురించలేదు స్టూడియోలో సెటింగ్ మాష్టార్లుండేవారు వారు స్థూలంగా కథను బట్టి, సోషల్ పిక్చర్లకు ఒక రకం సెటింగ్‌లూ, పురాణం చిత్రాలకు ఒక రకం సెటింగ్‌లూ ఇస్తుండేవారు పిక్చర్లో మూడో వంతో అయిదోవంతో ఔట్‌డోర్ వుండేది ఔట్‌డోర్ వున్నదంటే డక్కూడవాలీ వేసుకొని నిర్మొహమాటంగా ఔట్‌డోర్ వెళ్ళేవారు

ఆ రోజుల్లో స్టూడియో చిత్రం 30 వేలకు మించితే ఏదో దుర్వ్యయం అయినట్టే లెక్క ఒకపిక్చర్లో నటించే మనిషి రిలీజ్ ఆర్డరు పుచుకుంటే తప్ప ఇంకో చిత్రంలో బుక్ కావటానికి లేదు (మరో అయిదారు సంవత్సరాల కల్లా ఈ పద్ధతి పూర్తిగా తారుమారైపోయింది )

వీటన్నిటికన్నా ఆ రోజుల్లో నన్ను ఆశ్చర్యపరచినది ఆనాటి సినిమా స్క్రిప్టులు అవి చౌకబారు నాటకాలులాగా, పదాడంబరంతోనూ, అర్థరహితంగానూ ఉండేవి ఆనాటి చిత్రనిర్మాతలు ఆ రచనలను సినిమా స్క్రిప్టుల క్రింద ఆమోదించారంటే వాటిని రచించినవారు ఎక్కువ అజ్ఞానులో, వాటిని ఆమోదించినవారు ఎక్కువ అజ్ఞానంలో కూడా నిర్ణయించడం కష్టంగా వుండేది

ఒక్క రచయితలేగాక, టెక్నీషియనులలోనూ, నటనలోనూ, డైరెక్టర్లలోనూ కూడా కనీసం కొందరు, ఎట్టి అర్హతా లేకుండా ప్రమాదవశానో, దారితప్పో సినిమా రంగంలోకి ప్రవేశించినట్టుగా నాకు భావన కలిగింది ఈ నా అభిప్రాయాన్ని రుజువు చేసుకొనేటందుకు నాకు ఇతర సాక్ష్యం ఏమీ అవసరం లేకపోయింది ఎందుచేతనంటే నేను కూడా ప్రమాదవశాన, సినిమా గురించి ఏమీ తెలియకుండా, ఆరంగంలోకి ప్రవేశించిన వాణ్ణే అయినాకూడా, నాకన్న ముందు సినిమా రంగంలో ప్రవేశించిన వాళ్ళే రచన విషయంలోనూ, సెట్టు మీదా కూడా

నాసలహాలు తీసుకున్నారు నాతో సంప్రదించారు! ఇదంతా పదహారేళ్లనాటిమాట ఈ మధ్యకాలంలో తెలుగు వాళ్ళకు సమగ్రమైన సినిమా పరిశ్రమ ఏర్పడటమూ, ప్రసిద్ధులైన తెలుగు సినిమా చిత్ర నిర్మాతలూ, డైరెక్టర్లూ, స్క్రిప్టు రచయితలూ, టెక్నీషియన్‌లూ, నటులూ పాటగాళ్ళూ, ఆర్టు డైరెక్టర్లూ, సంగీత దర్శకులూ తయారు కావటమూ జరిగాయి అంతేగాక చిత్ర నిర్మాణంలోనూ, చిత్రాల ప్రచారంలోనూ, ప్రేక్షకుల అభిరుచులలోనూ ఎన్నోపరిణామాలు జరిగాయి ఈ పరిణామాలలో చెప్పుకోదగ్గ ఘట్టాలున్నాయి ఈ ఘట్టాల వెనుక కొందరు వ్యక్తులు కూడా ఉన్నారు

తెలుగు సినిమా పరిశ్రమకు తొలిపునాదులు వేసిన వ్యక్తులు సి పుల్లయ్య, పి వి దాసుగార్లు పురాణ చిత్రాల కాలంలోనే సినిమా రంగంలో అడుగుపెట్టిన వీరిద్దరూ చెరొక గొప్ప పురాణ చిత్రాన్ని ఆంధ్రులకు సమర్పించారు సి పుల్లయ్యగారు 'లవకుశ తీయించారు దాసుగారు 'కృష్ణలీలలు' తీశారు దాసుగారు చిత్ర నిర్మాణాన్ని పూర్తిగా దక్షిణ దేశీయుల ఆధీనంలోకి తీసుకొచ్చిన ఖ్యాతి కూడా దక్కించుకున్నారు పుల్లయ్యగారు ఈనాటి వరకూ కూడా సినిమా రంగంలో నిలబడి వున్నప్పటికీ ఆయన ఒక సంప్రదాయాన్ని నెలకొల్పారనటానికి లేదు కాని దాసుగారి ద్వారా కొంతవరకు కొనసాగింది

కాని రామబ్రహ్మంగారింకా స్వతంత్ర వ్యక్తిగా సినిమా రంగాన నిలబడకపూర్వమే సినిమా ప్రపంచంలోకి అడుగుపెట్టి ఒక పరిణామా దశకు తోడ్పడిన వ్యక్తి కాంచనమాల ఆనాటి కాంచనమాల సినిమా చిత్రాలలో ఒక నూతనాధ్యాయం ప్రారంభించింది కాంచనమాల అపూర్వ సౌందర్యంగాని, పాటగాని, నటనాశక్తిగాని దానికి ప్రధాన కారణంకాదు అనాటి సినిమా నాయికలతోసాధ్యం కాని వాస్తవికత కాంచనమాల ద్వారా సాధ్యమయింది వయసులో చిన్నదీ అందమైనదీ ప్రేక్షకుల సానుభూతిని అతిసుభంగా సంపాదించుకునేది, జనాకర్షణగల యదార్థవ్యక్తి అనదగినదీ అయిన సినిమా తార కాంచనమాలకు పూర్వం తెలుగు సినిమా రంగంలోలేదు ఆమె తరువాత కూడా ఈ లక్షణాలలో ఆమెతో పోటీచెయ్యగల వ్యక్తిరాలేదేమో, ఏమైనా కాంచనమాల లేకుంటే సాంఘిక చిత్రాలు సాధ్యమై ఉండేవికావు పురాణ చిత్రాల యుగానికి మంగళంపాడి, సినిమా ప్రేక్షకలోకాన్ని జయించిన మొదటి తెలుగుసాంఘిక చిత్రాలు, 'గృహలక్ష్మి' 'మాలపిల్ల', 'మళ్లీపెళ్లి', 'వందేమాతరం' చిత్రాలలో కాంచనమాల తారత్వం నిర్వహించింది

తెలుగు సినిమా చరిత్రలో పురాణ చిత్రాలు వెనుకబడి సాంఘిక చిత్రాలు ముందుకు రావటం ఒక గొప్ప పరిణామం ఈదశలో గొప్ప పాత్ర నిర్వహించిన వారు గూడవల్లి రామబ్రహ్మం, బి ఎన్ రెడ్డిగార్లు, 'గృహలక్ష్మి' నిర్మాణానికి అంతకు పూర్వం 'ప్రహ్లాద' నిర్మాణానికి, కారకులైన హెచ్ ఎం రెడ్డిగారిని కూడా ఈ సందర్భంలో పేర్కొనవచ్చునుగాని ఆయనకు తెలుగు సినిమా చరిత్రలో ప్రాముఖ్యం దక్కలేదు కారణం -- ఆయన ఒక సంప్రదాయాన్ని నెలకొల్పలేదు ఏ ఒక్క పరిణామం ఆయన చేతిమీదుగా పూర్తికాలేదు రామబ్రహ్మం, బి యన్ రెడ్డి గార్లిద్దరూ సాంఘిక చిత్రాల పరిణామానికి చెరొక విధంగానూ తోడ్పడ్డారు రామబ్రహ్మంగారు సాంఘిక చిత్రాలలో ప్రయోజనమూ, జాతీయతా సాధించారు రెడ్డిగారు శిల్పకళయొక్క ఆరంభదశకు ముందు నడిచిన కాలం తీసుకుంటే, తెలుగు వారిలో

చైతన్యాన్ని కలిగించే చిత్రాలు తీయటంలో రామబ్రహ్మంగారినీ, వికాసం కలిగించే చిత్రాలు తీయటంలో రెడ్డిగారినీ మించిన చిత్రనిర్మాతలు లేరు

అయితే ఆ రోజులు సాంఘిక వాస్తవికతకు అనుకూలమైనవిగా లేవు పరాధీనదేశం, బానిస బ్రతుకు జీవిత వాస్తవికతను నగ్నంగా ప్రదర్శించటానికి ప్రభుత్వం వారి అంకుశం అడ్డుగా ఉంది వాస్తవ సమస్యలను ఎత్తుకోడానికి లేదు ఎత్తుకుంటే వాటి పరిష్కారమార్గాన్ని చూపించటానికిలేదు జీవిత సమరం వేడెక్కుతున్నకొద్దీ సాంఘిక చిత్రాలలోని వాస్తవికత జీవిత వాస్తవికత ముందు తేలిపోసాగింది ('గృహలక్ష్మి' లో తాగుడు సమస్యనూ, 'మళ్లీ పెళ్లి' లోనూ, 'సుమంగళి' లోనూ వితంతు పునర్వివాహ సమస్యనూ చిత్రించటం జరిగింది! జమీన్ రైతు సమస్యను ఎత్తుకున్న 'రైతుబిడ్డ' జమీందార్లతో రాజీపడినా నిషేధానికి గురికావలసివచ్చింది !)

ఈ సందిగ్ధదశలో యుద్ధమే వచ్చి జీవితాన్ని ఒక్కసారిగా తారుమారు చేసేసింది ఈ దశలో బయలుదేరాయి జానపద చిత్రాలు జానపద చిత్రాల నిర్మాణానికి పురోగాములుగా వ్యక్తులను పేర్కొనటం సాధ్యంకాదు దానికి ప్రధాన కారణం జానపద చిత్రాల నిర్మాణంతో పాటు చిత్ర నిర్మాణం కూడా విశృంఖలంగా పెరిగింది అదీగాక ఈ జానపద చిత్రాలకు అనేక మంది అనేక విధాలుగా జీవం పోశారు ఈ చిత్రాలు మరేమీ సాధించలేక పోయాయను కున్నప్పటికీ దేశంలో సినిమా ప్రేక్షకుల సంఖ్య పెంచాయి, అనేక మంది కొత్తనటీనటుల్ని, నిర్మాతలనూ, డైరెక్టర్లనూ, పాటగాళ్లనూ, కొత్త రకం బాణీలనూ, నాట్యాలను సినిమా రంగంలోకి దిగుమతిచేశాయి కళా దర్శకులకూ, సంగీత దర్శకులకూ, నాట్య దర్శకులకూ పూర్వం ఎన్నడూలేని ప్రాముఖ్యాన్ని కలిగించాయి

జానపద చిత్ర నిర్మాణంలో అగ్రస్థానాన్ని అందుకున్న వారిలో పేర్కొనదగిన వారు పలువురున్నారు ప్రత్యేక చిత్రాలు కూడా కొన్ని వున్నాయి నిర్మాతలలో కె వి రెడ్డిగారిని చెప్పాలి ఆయన నిర్మించిన 'పాతాళభైరవి' జానపద చిత్రాలకు ఉత్తమమైన నమూనా అని చెప్పవచ్చు దీని మాతృక విజాతీయమైనప్పటికీ చిత్రంలో బోలెడంత జాతీయ సంప్రదాయం అవతరించింది ప్రాచీన సాహిత్య ఛాయలు కూడా ( ఉదా-- స్యాలక పాత్ర) చాలా చక్కగా ప్రవేశపెట్టబడ్డాయి దీని శిల్పం చాలా ఉన్నత స్థాయికి చెందినది దీన్ని ఇటీవల అంతర్జాతీయ ప్రదర్శనంలో చేర్చిన సంగతి కూడా అందరికీ తెలిసిందే

జానపద చిత్రాల ద్వారా ఉన్నత స్థాయినందుకున్న రచయితలలో పింగళి వారిని పేర్కోవాలి 'గుణసుందరి', 'పాతాళభైరవి' చిత్రాలకు ఈయన కథలను తయారు చేయటమేకాక వాటిలోని విలక్షణమైన వాతావరణానికి నప్పేలాగు చిత్రవిచిత్ర పాత్రలను కూడా ఈయన సృష్టించిపోషించారు

జానపద నాయికలలో అగ్రతాంబూలం అంజలీదేవిది మామూలు సాంఘిక చిత్రాల నాయికల వలెగాక ఒక వింత సౌరభం ప్రదర్శించేజానపద నాయిక యొక్క గాలి అంజలీదేవీ మీద నుంచి ఆంధ్ర ప్రేక్షకలోకం మీద బలంగా వీచింది చాలా చిత్రాలలో ఈమె అప్సరసగా నటించి చివరకు సినిమా అప్సరస అనే పేరు సార్థకత సంపాదించుకున్నారు

జానపద చిత్రాలలో పూర్తిగా కొత్తదారి తొక్కిన చిత్రం 'మల్లీశ్వరి' ('మల్లీశ్వరి' జనపద చిత్రం కాదన్న భావాన్ని దాని నిర్మాతా, దర్శకులూ అయిన బి యన్ రెడ్డిగారు ఒక పత్రికలో

ప్రకటించారు దీనికి కారణం బోధపడదు 'మలీశ్వరి' ఉపోద్ఘాతం చూసినవారికి అదిజానపద చిత్రమనే అర్ధమౌతుంది పుక్కిటి పురాణాల ఆధారంలో తీసిన చిత్రాన్ని జానపద చిత్రమనే అనాలి ) 'మల్లీశ్వరి' ప్రత్యేకత ఏమంటే దాని ఇతివృత్తం నేటి సాంఘిక వాతావరణానికి ఎంతో భిన్నంగా ఉండి కూడా సాంఘిక చిత్రంలో వాస్తవికతను ప్రదర్శిస్తుంది ఇందులో మాంత్రికులూ, మహత్తులూ, గారడీలు ఏమాత్రంలేవు

చారిత్రక గాథలై ఉండికూడా ఇంచుమించు జానపద చిత్రాల ధోరణిగా తయారైన చిత్రాలు 'భక్తపోతన,' 'యోగివేమన', 'పల్నాటి యుద్ధం', 'త్యాగయ్య', ఈనాలుగింటిలోనూ చారిత్రక వాస్తవికత ఒకపాలుజాస్తిగా ఉండి మంత్రాలూ, మహత్తులూ ఉన్నాయి చారిత్రక చిత్రం ''పల్నాటి యుద్ధం'' ఒకటే తెలుగు చిత్రాలన్నింటిలోనూ భారీగా సంగీతం ఉంటూ వస్తున్నది కాని కథను సంగీతంతో నడిపించి సంగీతగాథ అన్న పేరు సార్థకత చేసుకున్న మొట్టమొదటి తెలుగు చిత్రం ''త్యాగయ్య'' ఇందుకు గానూ ఈ చిత్రమూ ఈ చిత్రాన్ని నిర్మించి, దర్శకత్వం వహించిన చిత్తూరు వి నాగయ్యగారు తెలుగు సినిమా చరిత్రలో శాశ్వతంగా ఉండిపోతారు

తెలుగులో మొట్టమొదటి మ్యూజికల్ కామెడీ అనిపించుకోదగిన చిత్రం 'పెళ్లి చేసి చూడు' ఇటీవలె విడుదల ఆంధ్ర దేశంలోనూ తదితర ప్రాంతాలలోనూ విజయం సాధిస్తూ నడుస్తోంది దీని నిర్మాతలలో ఒకరై వుండి, దీనికిస్క్రిప్టు రాసిన చక్రపాణిగారు కథా సంవిధానంలోనూ, ఒక అపూర్వ పరిణామం తెచ్చిపెట్టుకున్నట్టు కనిపిస్తుంది ఈయన పెళ్లి చేసిచూడు లోనేగాక, ఇంతకుపూర్వం 'షావుకారు' లో కూడా సాంఘిక వాస్తవికతకు అత్యవసరమైన సజీవ పాత్రలు సృష్టించారు ఇందువల్ల సినిమా రచనలో పూర్వం ఎన్నడూలేని వాస్తవికత సాధించబడింది ఈ కొత్త పంథా నూతనపరిణామానికి దారితీసినట్టయితే సినిమా రచనలో కొత్త అధ్యాయం ప్రారంభించిన కీర్తి చక్రపాణిగారికి దక్కుతుంది

*కృష్ణపత్రిక, వారపత్రిక, 22-3-1952*

## 64. నానాటికీ పెరుగుతున్న అభ్యుదయ చిత్రనిర్మాణ ఆవశ్యకత

సాధారణంగా సినిమాలు చేసేవాళ్ళు తారలనూ, ఇతర నటులనూ తప్పగణించరు అంతకన్న కాస్తవివక్షత గలవాళ్ళుడైరెక్టరునూ, తదితర టెక్నీషియనులనూ కూడా దృష్టిలో పెట్టుకుని వారివారి విశిష్టతను గ్రహించగలుగుతారు సినిమాలు చూసి ఆనందించటానికే అయితే ఇంతకన్న దూరం వెళ్ళనవసరం లేదు కాని సినిమా పరిశ్రమను గురించి ఏమాత్రం ఆలోచించలదలచినా ప్రొడ్యూసరు ప్రాముఖ్యాన్ని గుర్తించక తప్పదు

మన తెలుగు సినిమా రంగంలో ప్రస్తుతం ఏర్పడిన దుస్థితిని అర్థం చేసుకోవాలంటే అన్నిటికన్నా ముందు ప్రొడ్యూసరు సమస్యను అర్థం చేసుకోవాలి ఈ సమస్య రెండు విధాలుగా ఉంది గడిచిన రెండేళ్ళలోనూ మనకు ఏటా ఇరవైకి పైగా చిత్రాలు వచ్చాయి కాని మనదేశంలో 20 కాదుగదా పదిమందయినా నిజమైన చిత్ర నిర్మాతలు లేరు అందుచేత ఈచిత్రాలను నిర్మించిన వారిలో అధిక సంఖ్యాకులకు నిర్మాతలనిపించుకునే అర్హతలేదు ప్రొడ్యూసరు లేకుండానే వెలువడ్డ చిత్రాలు దెబ్బతిన్నాయి అసలు రహస్యం తెలియక ఈచిత్రాలతో మొహం

మొత్తిన సినిమా ప్రేక్షకులు మొదట్లో కొత్తముఖాలు కావాలన్నారు ఇటీవల మంచి కథలు కావాలన్న ఆందోళన ప్రారంభమయింది ఈచిత్రాలు ఇంత ఘోరంగా తయారు కావటానికి మూలకారణం ప్రొడ్యూసర్లన్న అనుమానం చాలామందికి లేదు

అంతదాకా కూడా పోనవసరంలేదు అనుభవంలేని డైరెక్టరు గాని, నటులుగానీ టెక్నీషియనులుగాని సినిమా రంగంలోనికి దిగి చిత్రానికి పనిచెయ్యటం ఎవ్వరూ ఒప్పుకోరు కాని సినిమా మొహం తెలియనివారు చిత్ర నిర్మాణానికి పూనుకున్న నిదర్శనాలు చాలా ఉన్నాయి చిత్రనిర్మాణం ఒక విద్య అనిగాని, దానికి కొంత అనుభవం ఉండాలనిగాని కొందరికి తెలియనేతెలియదు వారి దృష్టిలో చిత్రనిర్మాత బాధ్యతలు రమారమి ఈవిధంగా ఉంటాయి ప్రొడ్యూసరైనవాడు ఏదోవిధంగా 50వేలో, లక్షో సమకూర్చుకుని మద్రాసు చేరతాడు వాళ్ళ వాళ్ళందరితోనూ కూచుని ఒక కథ ఆలోచిస్తాడు లేదా ఏహిందీ చిత్రం కథనో తీసుకుంటాడు అదీలేదా రెండు మూడు సినిమా కథలు తీసుకుని ఒక కథ పేనుతాడు ఆతర్వాత డైరెక్టరును, అథమం మంచి చిత్రాలలో పనిచేసిన ఒక అసిస్టెంటు డైరెక్టరును బుక్ చేస్తారు అతణ్ణి డైరెక్టరుగా పెట్టుకుని మళ్ళీ కథ చర్చిస్తారు కథ తెలిసినాక సినిమా రచయిత నొకణ్ని బుక్‌చేస్తారు స్క్రిప్ట్ డైరెక్టర్ రాస్తాడు సినిమా రచయిత పాటలూ, మాటలూ రాస్తాడు ప్రొడ్యూసరుకున్న ధైరాన్ని బట్టి తారలను బుక్ చేస్తారు సంగీత దర్శకుణ్ణి బుక్ చేస్తారు స్టూడియో మాట్లాడుకుంటారు ప్లేబాక్ పాటగాళ్ళను మాట్లాడిపాటలు రికార్డు చేస్తారు తెచ్చిన డబ్బు అయిపోయేలోగా డిస్ట్రిబ్యూషన్ మాట్లాడుకుంటారు డిస్ట్రిబ్యూటర్ కొంత డబ్బిస్తాడు దాంతో కొంత గ్రంథం నడుస్తుంది దాంతో కూడా పిక్చరు పూర్తికాకపోతే మిగిలిన ఏరియాలకు డిస్ట్రిబ్యూషన్ చూడడమో, అమ్మటమో చేస్తారు ఇంకా చాలకపోతే పిక్చరు రిలీజు అనంతరం ఇస్తామని నలుగురివద్దా అప్పుచేస్తారు ఇందులో ప్రొడ్యూసరు చేసేదేముందీ — ముందు అరలక్షా, లక్ష తీసుకురావడం తప?

ఇదంతా బాగానే ఉంది ఏదోలా పిక్చరు తీసి బయట వెయ్యటం మాత్రం ప్రొడ్యూసరు బాధ్యత అయితే ఆపని చేస్తున్నవారు ఏటా ఇరవైకిపైగా ఉంటూనే ఉన్నారు కాని ప్రొడ్యూసరు బాధ్యత అది కానేకాదు డబ్బు తక్కువైన పెట్టుబడిదార్లు చేసేపనే ఈ ప్రొడ్యూసర్లూ చేస్తున్నారు పెట్టుబడిదారుకూ ప్రొడ్యూసరకూ చాలా పెద్దతేడా వుంది

లాభం కోసం ఏదో ఒక వ్యాపారంలోగాని, పరిశ్రమలోగాని డబ్బు మదుపు పెట్టేవాడు పెట్టుబడిదారు వాడికి సినిమా నిర్మించటం ఒక వృత్తికాదు సినిమాలలో కన్నా సిమెంటులో ఎక్కువ డబ్బు వస్తుందంటే వాడు సిమెంటులోనే పెడతాడు సినిమాద్వారా లాభాలు చేద్దామని సంకల్పించుకున్న తరవాత కూడా ఆ సినిమాలో మట్టే వుందో బంగారమే వుందో, తమ డబ్బుతో తీసే చిత్రం ప్రజలను చైతన్యవంతులను చేస్తుందో, తాగిన కోతులను చేస్తుందో వాడికనవసరం తన చిత్రం సినిమా చరిత్రలో ఒక నూతనాధ్యాయం సృష్టించిందంటే వాడు ఖాతరు చెయ్యడు, దాని మీద రెండు లక్షలు లాభం వచ్చిందంటే అదే వాడికి నిజమైన ఆనందం

ప్రొడ్యూసరైనవాడు అట్లాకాదు చిత్రాలు తయారు చేయడం వాడి వృత్తి ఆవృత్తి చేసుకునే అవకాశంపోతే మళ్ళీ వాడెందుకూ పనికిరాడు పెట్టుబడిదారులాగా ఈ దుకాణం మూసి మరొకటి తెరవలేడు తన చిత్రానికి పేరురావటం కూడా ఇతడికి డబ్బురావటమంత

ముఖ్యమే తన చిత్రాలకి రెండు మూడింటికి బాగా డబ్బొస్తే తనకు వ్యాపారంలో స్థాయి చిక్కుతుంది, పెట్టుబడి సులభంగా లభిస్తుంది చిత్రానికి పేరువస్తే తాను రేపు అధికంగా ప్రేక్షకులను ఆకర్షించగలుగుతాడు మంచినటులూ, టెక్నీషియనులూ తనకు మరింత అందుబాటులోకి వస్తారు తాను ఇంకా మంచి చిత్రాలు తీయగలుగుతాడు పెట్టుబడి దారులాగా కాకుండా ఈ ప్రొడ్యూసరు తన సంస్కృతిని తాను తీసే చిత్రంలో ప్రతిబింబించగలడు తాను కళా ప్రియుడైతే చిత్ర నిర్మాణాన్ని ఒక కళగా ఆరాధించి, సినిమా కళను మరింత బాగా ప్రదర్శించటానికి ఉపకరించేవారిని చేరదీసి కళాఖండాలు నిర్మించగలడు తాను వాస్తవికతను ఆరాధించే వాడైనా, ఇంకే సాంస్కృతిక దృక్పథం కలవాడైనా తన సంస్కృతిని ప్రతిబింబించే కథను తీసుకుంటాడు దానికి న్యాయం జరిగేటట్లు డైరెక్టరునూ, టెక్నీషియనులనూ, నటీనటులనూ ఎన్నుకుంటాడు కథను సినిమాకు అనుకూలంగా రాసుకునేటప్పుడు తాను చిత్రంలో ప్రతిబింబించదలచిన సంస్కృతికి భగ్నం రాకుండా చూసుకుంటాడు

నిజానికి ప్రొడ్యూసరు స్వయంగా కళాకారుల, శిల్పుల శ్రేణిలోకిరాడు కాని సినిమా కళాకారుల శిల్పుల పనితనానికి గమ్యం ఈ ప్రొడ్యూసరే చూపుతాడు ఇతనికి వ్యాపారదృష్టి కూడా వుంటుంది తానుతీసే చిత్రం సాధ్యమైనంత మంది ప్రేక్షకులు చూడాలన్న ఆరాటం అతనికీ ఉంటుంది అయితే అది కేవలం లాభాల కోసంపడే ఆరాటం మట్టుకు కాదు చిత్ర ప్రపంచంలో సినిమా వ్యాపారానికీ, సినిమా కళకూ మధ్య వుండే గొప్ప అగాధం మీదుగా వంతెనలాగా ఉంటాడు ప్రొడ్యూసరు అతను ప్రతిభావంతుడైతే చిత్ర నిర్మాణాన్ని ఒక కొత్త మెట్టు ఎక్కించి మిగిలినవారంతా అంతకు పూర్వపు దృక్పథాలను మార్చుకుని తనను అనుసరించేటట్టు కూడా చేయగలడు ఈవిధంగా ఇదివరలో ఒక్కొక్క ప్రముఖ చిత్రనిర్మాత సినిమారంగంలోకి వచ్చినపుడల్లా చిత్రనిర్మాణ పోకడలో ఒక్కొక్క మార్పు వచ్చింది. కొందరు సార్థకమైన కథలు తీసుకున్నారు. కొందరు శిల్పాన్ని అభివృద్ధిచేశారు మరికొందరు 'షోమన్‌షిప్' ప్రదర్శించారు మొత్తంమీద అందరూ చేరి 'కాకమ్మ' కథల్లాగా ఉండే సినిమా చిత్రాలను సాహిత్యానికీ, ఇతర కళలకూ సన్నిహితంగా తెచ్చారు ఒక వింతగానూ, వేలం వెర్రిగానూ వుండిన సినిమా రానురాను ఒక కళ అయింది

దురదృష్టవశాత్తు ఈ పరిణామం వెంబడే ప్రొడ్యూసర్లుగాని ప్రొడ్యూసర్లు కూడా పుట్టుకొచ్చారు తయారయే చిత్రాలలో తుక్కూ దూగరా జాస్తి అయింది 1936 నాటికి – తెలుగులో టాకీలు ప్రారంభమైన మూడేళ్ళకు —— కూడా ఉత్తమ చిత్రానికీ అధమ చిత్రానికీ పెద్ద వ్యత్యాసం వుండేది కాదు 1936 తరువాత నిజమైన ప్రొడ్యూసర్లు బయలుదేరారు యుద్ధం ప్రారంభమైనది మొదలు మంచి చిత్రాలకూ చెడ్డ చిత్రాలకూ మధ్యగలతేడా తెలిసిరాసాగింది 1952లో శతదినోత్సవాలను చేసుకున్న చిత్రంతోబాటు దశదినోత్సవం ఎరుగని చిత్రం కూడా వెలువడింది

దీనిని బట్టి ఒక విషయం స్పష్టంగా తెలుసుకోవచ్చు ఇకముందు మన చిత్ర నిర్మాణంలో ఏదైనా చెప్పుకోదగిన పరిణామం రావాలీ అంటే దాన్నిసాధించగల ప్రొడ్యూసరు ముందుకు రావాలి లేదా యిప్పుడున్న గొప్ప నిర్మాతలు ఎవరో ఒకరు ఆపరిణామం సాధించడానికి

పూనుకోవాలి సమర్థుడైన డైరెక్టరు వల్ల ఈ పనికాదా అని అడగవచ్చు ఏ ప్రొడ్యూసరుకైనా డైరెక్టర్ తోడ్పాటు ఉండి తీరాలి ఒక్క డైరెక్టరే కాదు, ఇంకా అనేకమంది టెక్నీషియన్లతోడ్పాటూ, నటుల తోడ్పాటూ ఉండితీరాలి కాని అచ్చంగా డైరెక్టర్ వల్ల ప్రొడ్యూసరు పని సాధ్యంకాదు చిత్ర నిర్మాణంలో కొత్త పరిణామం తెచ్చేశక్తి ఉండి, ప్రొడ్యూసరుగిరీ నిర్వహించగల డైరెక్టరు తానుతప్పక ప్రొడ్యూసరై పోతాడు కొంతకాలం క్రితం ప్రొడ్యూసర్లుగా వచ్చినవారు తమ ఆశయాలకు చిత్రరూపం ఇచ్చే డైరెక్టర్లు లేరనే భావంతో తామే డైరెక్టర్లు కూడా అయినారు ఈనాడు అనుభవం లేకుండా చిత్రాలు తీయడానికి వచ్చే మూకడైరెక్టర్లను ఉన్నంతలో అనుభవం గలవారిని నియోగించి వారికి ప్రొడ్యూసరు బాధ్యతలు వప్పజెప్పుతున్నారు ఐతే ఫలితాలు ఆశాజనకంగా ఉండడంలేదు మంచి ప్రొడ్యూసరు కింద సమర్థతతో చిత్రాలను డైరెక్టు చేసినవారే ఈచిత్రాలు డైరెక్టు చెయ్యటంలో దెబ్బతినటం మనం చూస్తున్నాం

చిత్ర నిర్మాతకు కొంత సహజ ప్రతిభా, అనుభవమూ కూడా ఉండాలి అచ్చగా అనుభవం చాలదు, ఇరవై ఏళ్ళ నుంచీ చిత్ర నిర్మాణంలో ఉన్నవాళ్ళున్నారు వారంతా చిత్ర నిర్మాతలు కాలేరు. ప్రతిభ ఉండికూడా, అనుభవంలేనిదే రాణించడు గొప్పచిత్రాలు తీసినవారంతా తమలాగే ఏమీ అనుభవం లేకుండానూ, ప్రతిభ లేకుండాను చిత్రనిర్మాణంలోకి వచ్చి అదృష్టవశాత్తూ పైకివచ్చారని కొత్తగా సినిమాలు తీయటానికి వచ్చినవారు అనుకుంటే అది చాలా భ్రమ ఎంతో తెలివి తేటలూ కొంత అనుభవమూ లేకుండా ప్రొడ్యూసర్లయి గొప్ప చిత్రాలు తీసినవారు ఎవరూ లేరు

చిత్ర నిర్మాతకు సినిమా చిత్రం అచ్చగా వ్యాపారసరుకూ కాదు, అచ్చగా కళాఖండమూ కాదు రెండూను ఈ రెండు దృక్పథాలనూ ప్రొడ్యూసరు సమన్వయించకపోతే మరెవ్వరూ ఆపని చేసేవారుండరు డైరెక్టరుకు సినిమాచిత్రం కళాఖండం మాత్రమే మిగిలిన టెక్నీషియనులకూ అంతే వీరందరూ చేరి తమ శిల్ప ప్రదర్శనం నిమిత్తం చిత్రం యొక్క లక్ష్యాన్ని ధ్వంసం చేయకుండానూ, తాను పెట్టుకున్న పరిమితిలో వారి శిల్పం పూర్తిగా రాణించేటట్టూ ప్రొడ్యూసరు చూసుకుంటాడు ఈరెంటిలో ఏది దెబ్బతిన్నా చిత్రం దెబ్బతింటుంది ఇవాళ జరుగుతున్నదీ అదే అనేక మంది లాభాలకోసం చిత్రనిర్మాణం చేస్తున్నారు వారి లక్ష్యం లాభం గనక ప్రజలను ఏది బలంగా ఆకర్షిస్తుందని తోస్తే దానికోసం డబ్బు తగలేసి మిగిలినవి తృణీకరించి చిత్రాలు తీసేస్తున్నారు ఒక్కొక్క నిర్మాత ఒక్కొక్క సూత్రాన్ని పట్టుకుంటాడు ఒకరికి పెద్ద తారల్లో విశ్వాసం మరొకరికి డైరెక్టర్‌లో విశ్వాసం వారికి మిగిలినవి లెక్కలోనికిరావు కథ ఏమైనాసరే, సినిమా శిల్పం ఏమైనాసరే కళాప్రమేయం లేనేలేదు అందుచేత ఒట్టి తుక్కుచిత్రం తయారై దెబ్బ తింటుంది

మరొకరు చిత్ర నిర్మాణం వ్యాపారమన్న విషయమూ, అది ఒక కళ అన్న విషయమూ మరిచిపోయి చిత్రాల ద్వారా ప్రజలకొక సందేశం యిచ్చే మహదాశయంతో వస్తారు మిగిలినవన్నీ గాలికి వదిలేసి ఆ ఆశయం గట్టిగా చాటటానికి చిత్రం తీస్తారు అందులో శిల్పం ఉండదు, కథ ఉండదు అదీ దెబ్బ తింటుంది ఏ వ్యాసం రాసి పత్రికలకిస్తేనో సరిపోయేదానికి లక్షలు ధారపోసి కష్టపడి చిత్రం తీసి దివాలా తీయటం అనవసరమని అటువంటి వారికి తట్టదు

మామూలుగా మంచిచిత్రం తీయాలంటేనే ప్రొడ్యూసరు చిత్ర నిర్మాణంలో ఎంతో నిపుణుడై ఉండాలి ఇక సినిమాలను కొత్తదారి పట్టించాలంటే ఈనైపుణ్యానికితోడు కొత్తమార్గం అన్వేషించే దీక్షకూడా ఉండాలి అంతేగాని కొత్త మార్గం అవలంబించే హడావుడిలో మామూలు చిత్ర నిర్మాణ శిల్పాన్ని కూడా ఏమరటం అపజయానికి దారితీస్తుంది

సినిమాచిత్ర నిర్మాణంలో అభ్యుదయపంథా ఏర్పాటు చెయ్యటానికై జరిగిన యత్నాలు ఈవిధంగానే దెబ్బతిన్నాయి అభ్యుదయ చిత్రాలు తీయటానికి పూనుకున్న ప్రొడ్యూసర్లకు అనుభవం లేదు రచయితలూ, నటులూ, తదితరులూ గట్టివాళ్ళే అయినా వారికి సరి అయిన నాయకత్వం లేదు డైరెక్టరు అనుభవశాలి కావడం చేత 'పల్లెటూరు' లో ఎన్ని లోపాలు జరిగినా, కొంతవరకు జయించుకొచ్చింది

చిత్రనిర్మాణం యజ్ఞంలాంటిది సమిష్టికృషికి ప్రొడ్యూసరు ఋత్వికుడు, డైరెక్టరు సూత్రధారుడు వ్యాపార చిత్ర నిర్మాణం అరాచకంగా సాగుతుందని మనం విమర్శిస్తాం ఈ అరాజకత్వం కళారంగంలో ఉంటుందిగాని కార్యరంగంలో ఉండదు సరి అయిన ప్రొడ్యూసరు లేనప్పుడు అరాజకత్వం కార్యరంగంలోనే ప్రవేశిస్తుంది నిర్మాత యొక్క అభ్యుదయవాదం ఏమాత్రం సహాయపడబోదు వివిధ వర్గాలకు వేరువేరు భాషలుండాలన్న భావాన్ని స్టాలినే తీవ్రంగా విమర్శించాడు అదే విధంగా అభ్యుదయ చిత్రాలలో శిల్పం అవసరం లేదనీ, వ్యాపార చిత్రాలను విజయవంతం చేసే అంశాలకు తావులేదనీ అనుకునే మనస్తత్వాన్ని తీవ్రంగా విమర్శించాలి వ్యావహారిక భాషకు వ్యాకరణ నియమాలుండవనటంలో ఎంత అర్థం వుందో అభ్యుదయ చిత్రాలకు శిల్పం అవసరం లేదన్న దానికి కూడా అంతే అర్థం

అభ్యుదయ చిత్రాల ఆవశ్యకత నానాటికీ పెరుగుతోందిగాని తరగడంలేదు వీరేశలింగం వంటి మహనీయుడి జీవితం ఇంతవరకు చిత్రంగా వెలువడలేదు మన చరిత్ర, జాతీయ సమరమూ వాస్తవరూపంలో తెర కెక్కలేదు వ్యాపార చిత్ర నిర్మాతలు ఇటువంటి కథా వస్తువులను చిత్ర నిర్మాణానికి ఉపయోగించరు ఒకవేళ ఉపయోగించుకున్నా ఆవిషయాలకు న్యాయం జరగదు అందుచేత అభ్యుదయ చిత్ర నిర్మాణం జయప్రదంగా కొనసాగాలంటే అనుభవమూ, దక్షతాగల ప్రొడ్యూసరు ఏర్పడి మిగిలిన బృందాన్ని తయారుచేసి క్రమ శిక్షణతో చిత్ర నిర్మాణం సాగించాలి

*విశాలాంధ్ర, దినపత్రిక 16-3-1953*

# 65. వివిధ దశల్లో సినిమా కళాప్రచారం

భారత దేశంలో టాకీల యుగంప్రారంభమవుతూండగానే మొట్టమెదటి తెలుగు టాకీ 'భక్తప్రహ్లాద' వెలువడింది. తదాదిగా ఏటా తెలుగులో టాకీలు వెలువడుతూనే ఉన్నాయి ఆనాటి సినిమా కళను గురించి చెప్పుకోవలసినది అంతగాలేదు టాకీలు నిర్మాణం టాకీలు తీసిన వారికే సరికొత్త విద్య పరికరాలు కూడా కొత్తవే, అంతనైపుణ్యంతో కూడుకున్నవికూడా కావు దేశంలో బహుకొద్ది స్టూడియోలు, కొద్ది మంది టెక్నీషియనులు వారిలో దాదాపు తెలుగు వారు లేనేలేరు టాకీలకనుకూలంగా రచన చేయగలవారు తయారుకాలేదు టాకీ ప్రొజెక్టర్లుగల థియేటర్లు కూడా దేశంలో అప్పుడప్పుడే వెలుస్తున్నాయి

కాని ఈ సమయంలో తెలుగు నాటక రంగం దేదీప్యమానంగా ఉంది బళ్ళారి రాఘవాచార్యులు, స్థానంనరసింహారావు, యడవల్లి సూర్యనారాయణ, మాధవపెద్ది వెంకటరామయ్య, డాక్టరు గోవిందరాజుల సుబ్బారావు, అద్దంకి శ్రీరామమూర్తి మొదలైన ప్రసిద్ధ నటులెందరో తెలుగు నాటక రంగం యొక్క ఖ్యాతిని ఇతర ప్రాంతాలకు కూడా ప్రసరింప జేశారు ఇటువంటి నాటకరంగంతో పోటీ చెయ్యటం అప్పట్లో వెండితెరకు సాధ్యంగా కనిపించలేదు అయినా తొలి టాకీచిత్రాలకు స్టేజినటులను వినియోగించక తప్పలేదు అయినా ఈ నటులు టాకీల అభివృద్ధికి అంతగా తోడ్పడలేకపోయారు దీనికి కారణాలు చాలా ఉన్నాయి సినిమా శిల్పం అపరిణతం టెక్నీషియనులు నిపుణులు కారు నాటక కర్తలే తొలి సినిమా రచయితలు కానివారు మరొకరి శాసనానికిలోబడి వారు చెప్పినట్టు రచన చెయవలసి వచ్చింది ఈ నటులకు రంగ స్థలాన ప్రేక్షకుల ఎదుట నిలబడి స్వేచ్ఛగా నటించే అలవాటు అటువంటి నటులకు కామెరా, మైక్‌లకు లోబడి చిన్నచిన్న ఖండాలుగా నటించటం అయోమయమైంది అదీగాక సినిమా నటనకు పెద్దపెద్ద నటులు సులువుగా ఒప్పుకోలేదు ఏమంటే తెలుగు చిత్రాలు ఎక్కడో దూర ప్రాంతాలలో తయారయేవి అంత దూరంవెళ్ళి లాడ్జిలలో నానా అగచాట్లు పడి సినిమా చిత్రాలలో నటించి చివరకు కీర్తి వస్తుందన్న మాట అనుమానాస్పదం కావటం మన గొప్ప స్టేజినటులను ఆకర్షించలేదు

అయితే త్వరలోనే ఈ పరిస్థితులు మారాయి 'లవకుశ', 'కృష్ణలీలలు', 'వెంకటేశ్వర మహాత్యం,' వంటి కొన్ని చిత్రాలు అఖండమైన ఆర్థిక విజయాన్ని సంపాదించి టాకీలకు కొంత యశస్సు చేకూర్చాయి వేల్ పిక్చర్స్ సంస్థ ఏడాదికొక తెలుగు చిత్రం చొప్పున మాత్రమే తీసి కూడా వాటా దార్లకు మంచి డివిడెండ్లు పంచింది ఇతర విషయాలలో సినిమా కళ ఇంకా స్టేజి కళకు వెనకబడి ఉన్నప్పటికీ ఒక్కవిషయంలో స్టేజి కన్నా ముందడుగేవేసింది. స్టేజీమీద లాగకాక సినిమాలో స్త్రీలు స్త్రీ పాత్రలు ధరించారు టాకీలు వచ్చేనాటికి నాటకరంగంపై నటిస్తూ ఉండిన స్త్రీలు సినిమాలలోకి ప్రవేశించడమేకాక ఎన్నడూ స్టేజీ ఎక్కిన పాపానపోని స్త్రీలు కూడా సినిమాలలోకి ప్రవేశించి చక్కగా రాణించసాగారు స్టేజి అనుభవం ఉంటేనేగాని సినిమా నటనకు పనికిరారన్న భ్రమకు ఎట్టి ఆస్కారమూ లేకుండా పోయింది

అయినప్పటికీ పేరుగల స్టేజి నటులను సినిమాకు ఉపయోగించుకునే అభిప్రాయాన్ని చిత్ర నిర్మాతలు విడవలేదు మద్రాసు నగరం తెలుగు చిత్రాల నిర్మాణానికి స్థావరంగా పరిణమించిన అనంతరం ప్రసిద్ధ తెలుగు నటులకు, అప్రసిద్ధులకు కూడా సినిమా అవకాశాలు లభించాయి.

భారతదేశంలో టాకీలయుగం ప్రారంభం కాకపూర్వము మూకీల యుగంలో తయారైన చిత్రాలు నూటికి తొంభైపురాణ కథలు గలవి టాకీలు ఈ సంప్రదాయంలోనే పురోగమించాయి పురాణ కథలు తీయటంలో సౌలభ్యం లేకపోలేదు ఈ కథలు భారతదేశం అంతటా తెలసినవి ఆకథను ఏ భాషలో, ఏ ప్రాంతంలో తీసినా, ఎవరు కామెరామాన్ అయినా, డైరెక్టరైనా, అట్టే ఇబ్బంది లేకుండా చిత్రం తయారు చేసుకోవచ్చు ప్రేక్షకుల దృష్టినుంచికూడా పురాణ కథలు చూడడం సులభం కథ పరిచితమయినది గనుక పాత్రలను నిరూపించనవసరం లేదు కథ కొంచెం అవకతవకగా సాగినా అర్థమౌతూనే ఉంటుంది అదీకాక ఇతర కథలు చూడడానికి

బయలుదేరి రానిజనం పురాణ కథలు చూడడానికైతే వస్తారు

పురాణ కథల యుగం ఏడెనిమిది సంవత్సరాలు నడిచింది ఈ యుగంలో సినిమా కళ గొప్పగా అభివృద్ధి అయిందని చెప్పటానికి లేదుగాని ఈ కళకు కొంత గట్టి పునాది ఏర్పడింది కొత్త ఒక వింత అన్న కుతూహలంతో అయితేనేం, పురాణ కథలను ప్రత్యక్షంగా చూసి ఆనందించే ఉద్దేశంతో నైతేనేం, పుణ్యం సంపాదించుకునే ఆశతోనైతేనేం, ముసలి ముతకా దగ్గర్నుంచీ వచ్చి సినిమాలు చూశారు పురాణ చిత్రాలు ప్రజలకు సినిమా చూసే అలవాటు నేర్పాయి ఈ తొలి చిత్రాలు సాధించిన విజయం ఇంకా మంచి నటులనూ, నిపుణులనూ సినిమా పరిశ్రమకేసి ఆకర్షించింది దీని మూలంగా చిత్రాల రచనా, చిత్రాలలో నటనా అభివృద్ధి అయినాయి ఇదంతా వేలంవెర్రి కింద పోతుందని భయపడిన ధనికులు క్రమంగా ధైర్యం తెచ్చుకొని ఈ పరిశ్రమలోకి ప్రవేశించారు ఎక్కడో కలకత్తా, బొంబాయి వంటి నగరాలలో తయారవుతూ ఉండిన తెలుగు చిత్రాలు మద్రాసులో తయారు కావటానికీ, మద్రాసులో స్టూడియోలు ఏర్పడి, కొందరు తెలుగు యువకులు టెక్నీషియనులు కావటానికి ప్రోత్సాహం లభించింది

పురాణ కథల చిత్రాలలో సినిమా రచనగాని, డైరెక్షన్‌గాని, చెప్పుకోదగినంతగా అభివృద్ధి కాలేదు అయినప్పటికీ ఈ చిత్రాలే భావి డైరెక్టర్లకూ, రచయితలకూ మార్గం చూపాయి డైరెక్టరు కావటానికి ఎక్కడా 'కోర్సులు' లేవు పౌరాణిక చిత్రాల యుగంలో చిత్ర నిర్మాణంతో సన్నిహిత సంబంధం కలిగినవారు ఆ అనుభవంతో భావి డైరెక్టర్లు కావటానికే అవకాశం సంపాదించారు వీరిలో కేవలం కాంట్రాక్టర్లూ, ఎగ్జిబిషన్‌లో అనుభవం గలవారూ, మూకీ చిత్రాలకు కథలు చెప్పిన వారూ, ఆడ తారలకు 'ఎస్కార్ట్‌గా' వెళ్లినవారూ, ఇంకా ఇతర విధాల సినిమా స్టూడియోలలోకి అడుగుపెట్టిన వారూ ఉన్నారు ఎవరు ఎట్లా డైరెక్టరయినారన్నది ఎన్నడూ గణనలోకి రాలేదు, వారికి డైరెక్టు చేసే దక్షత ఉన్నదా అన్నాది మాత్రమే కాలక్రమాన గణనలోకి వచ్చింది డైరెక్షన్‌లో ప్రతిభ అనేది పురాణ కథల చిత్రాలు వెనుకబడి సాంఘిక చిత్రాల యుగం ప్రారంభం కాగానే గణనలోకి రాసాగింది సాంఘిక చిత్రాలలో గొప్ప డైరెక్టర్లుగా పైకి వచ్చిన వారిలో హెచ్ ఎం రెడ్డి, మొట్టమొదటి తెలుగుటాకీ 'భక్త ప్రహ్లాద' కు కారకుడు, చలనచిత్ర పితామహుడుగా గుర్తించబడ్డాడు గూడవల్లి రామబ్రహ్మం, వై వి రావు, చిత్రపు నరసింహారావు, చిత్రపు నారాయణమూర్తి మొదలైన వారందరూ తమ శక్తులను పౌరాణిక చిత్రాల ద్వారా పెంపొందించుకున్నవారే

సాంఘిక చిత్రాలు ప్రారంభం కావడంతో సినిమాకళ చాలా మార్పు చెందింది ముందు రచనలో జరిగిన మార్పులు చూద్దాం

పౌరాణిక చిత్రాలలో సంభాషణలు వాస్తవంగా ఉండేవికావు అవి పాతకాలపు నాటకాల్లో లాగే, భాషలోనూ, భావంలోనూ కూడా కృతంగా ఉండేవి ఆ చిత్రాలలో పద్యాలుండేవి సాంఘిక చిత్రాలు విధిగా సహజత్వాన్ని అవలంబించవలసి వచ్చింది సంభాషణలు మారిపోయాయి పద్యాలు దాదాపు పోయాయి ఈ చిత్రాలలోని కథలు ప్రేక్షకులకు పరిచితమైనవికావు అందుచేత ప్రతి పాత్రనూ సవ్యంగా ప్రేక్షకుడికి పరిచయం చెయ్యవలసి వచ్చింది కథనం కూడా సాఫీగా సాగవలసిన అవసరం ఏర్పడింది

పాత్రధారణలో కూడా పెద్ద పరివర్తన వచ్చింది పౌరాణిక చిత్రాలలో ఏకోతిమొహాన్ని తెచ్చి నెత్తిన నెమలిపింఛం పెట్టి చేతికి ఫ్లూట్ ఇచ్చినా ప్రేక్షకులకామనిషి శ్రీకృష్ణ పరమాత్మ అయిపోయేవాడు పౌరాణిక చిత్రాలలోని పాత్రధారణలో ఏ మాత్రమూ వాస్తవికతలేదు అది లేకపోవడం అంతగా బాధించనూలేదు కాని సాంఘిక చిత్రాలలో అలాకుదరదు ఏదో కోతిమొహాన్ని తెచ్చి ఆమె అపురూప సౌందర్యవతి అని చెప్పి ఆమె కోసం కథానాయకుడు తన వారినీ, తన సర్వస్వాన్నీ త్యాగం చేశాడంటే ప్రేక్షకులు నమ్మరు వారు చూసే చిత్రంలో కథ తాలూకు వివరాలన్నీ విశ్వసనీయంగా చిత్రంలోనే వారికి లభించాలి సాంఘిక చిత్రాలలో గొప్ప నటనకన్న 'పర్సనాలిటీ' కి యెక్కువ ప్రాముఖ్యత వచ్చింది అందుచేతనే ఈ చిత్రాల రాకతో పెద్ద స్టేజి నటులకు చాలా వరకు సినిమాలో స్థానం లేకుండా పోయింది

ఇక డైరెక్టర్ల ప్రతిభకుకూడా వెనకలేని ప్రాముఖ్యం వచ్చింది ఎందుకంటే పౌరాణిక చిత్రాలలో లాగా కాకుండా ఈ సాంఘిక చిత్రదర్శకుడు కథను చిత్రించటంలోనూ, పాత్రల స్వభావాలను నటుల నటన ద్వారా చక్కగా నిరూపించటంలోనూ, ప్రతి సన్నివేశానికీ తగిన వాతావరణం సమకూర్చటంలోనూ ప్రతిభాశాలి కాకపోతే సాంఘిక చిత్రం రాణించదు

ఈ మార్పుల ఆంతర్యం బాగా అవగాహన చేసుకుని, లోగడ పౌరాణిక చిత్రాలు చూసి ఆనందించిన వారిని సాంఘిక చిత్రాలతో ఆకర్షించగల వారే విజయవంతంగా సాంఘిక చిత్రాలు తీశారు

సాంఘిక చిత్రాలు తెలుగు చిత్రకళకు కొంత స్థిరత్వాన్ని ప్రసాదించాయి విద్యాధికులూ కళాభిజ్ఞులూ దీని మీద ఆధిపత్యం వహించసాగారు పౌరాణిక యుగంలో కేవలం వింతగా మాత్రమే ఉండిన సినిమాలు ఇప్పుడు కొంత వినోదాన్నీ, కొంత విజ్ఞానాన్నీ ఇవ్వసాగాయి సినిమ నటులకు కొంత వ్యక్తిత్వం ఏర్పడింది సినిమా చిత్రాలకూ ప్రేక్షకులకూ మధ్య ఈ తారలు ఒక వంతెనగా పరిణమించారు వారి ప్రాముఖ్యం వెంబడే సినిమా పత్రికలూ, సినీ జర్నలిజం పుట్టుకొచ్చాయి

న్యాయంగా సాంఘిక కథలు పురాణ కథలంత వ్యాప్తిగలవికాక పోయినప్పటికీ, పౌరాణిక చిత్రాల యుగంలోకన్న సాంఘిక చిత్రాల యుగంలోనే సినిమా ప్రేక్షకుల సంఖ్య పెరిగింది తారలు పుచ్చుకునే హెచ్చు వేతనాల వల్లా, షూటింగ్ విషయంలో సాంఘిక చిత్రనిర్మాతలు తీసుకున్న హెచ్చు శ్రద్ధవల్లా, ఈ కాలంలోచిత్ర నిర్మాణ వ్యయం పూర్వం కంటే రెట్టింపు అయింది ఏటా తయారైయ్యే చిత్రాల సంఖ్య కూడా హెచ్చింది అయినప్పటికీ ఈ సాంఘిక చిత్రాలు బాగానే డబ్బు చేయసాగాయి

ప్రపంచ యుద్ధం ఆరంభమైనాక కూడా జపాను యుద్ధంలో ప్రవేశించేదాక ఈ సాంఘిక చిత్రాల యుగం జోరుగానే సాగింది 1943 నుంచి యుద్ధం అంతమయ్యేదాకా చిత్రనిర్మాణం అయోమయ స్థితిలో పడింది ఈ కాలంలో తయారైన చిత్రాలే బహుకొద్ది అవికూడా యుద్ధకాల వాతావరణంలో తయారయ్యాయి వాటిని శాసించిన కళను గురించి స్పష్టంగా ఏమీ చెప్పటానికి లేదు

1946లో తొమ్మిది పది చిత్రాలు విడుదల అయ్యాయిగాని ఆ తరువాత మరి మూడేళ్లపాటు నిర్మాణమైన చిత్రాల సంఖ్య తగ్గిపోయింది చిత్ర నిర్మాణంలో మరో యుగం

అంతమైనట్టు స్పష్టమైంది

దీనికి కారణంలేకపోలేదు యుద్ధం సాంఘిక వ్యవస్థను తారుమారు చేసింది ఈ యుద్ధానంతరం సమాజంలో ఒక 'మాలపిల్ల' చిత్రాన్నిగాని, 'మళ్లీ పెళ్లి' చిత్రాన్నిగాని తయారు చేయడం కేవలం అసంభావ్యమయింది యుద్ధానికి పూర్వం ఉండిన సాంఘిక సంబంధాలే యుద్ధానంతర కాలంలో తారుమారు అయినట్టయింది పూర్వం కమ్యూనిస్టులెవరో, ఎక్కడున్నారో, ఏమంటున్నారో బహు కొద్దిమందికి మాత్రమే పట్టేది యుద్ధం అయిపోయేనాటికి వారొక బలమైన రాజకీయ పక్షంలో అయికూర్చున్నారు వారు పూర్వంచేసిన నినాదాలు సంఘంలో కొందరు ధనికులనోటకూడా వినిపించసాగాయి యుద్ధ కారణంగా కొత్త ధనిక వర్గం ఏర్పడింది యుద్ధకాలపు ఉద్యోగాలలో అనేక మంది పూర్వం ఎన్నడూ ఎరుగని విచిత్రలోకానుభవాలు సంపాదించారు ఈ యుద్ధానంతర కాలపు సాంఘిక స్వరూపాన్ని అర్థం చేసుకొని దానికనుకూలంగా చిత్రాలు తీసేవారెవరూ కనిపించలేదు కాని చిత్రనిర్మాణానికి కొత్తపెట్టుబడి భారీ యెత్తున కొత్తమూలల నుంచి లభించింది యుద్ధానికి పూర్వం ఉండిన 6 స్టూడియోలకన్నా పెద్దస్టూడియోలు వెలిశాయి కొత్త స్టూడియో పరికరాలూ, సినిమా శిల్పంలో కొత్త పోకడలూ రాసాగాయి 'కనబడని ఫోటోగ్రఫీ, వినిబడని శబ్దగ్రహణం! రోజులు దాటిపోయాయి ప్లేబాక్ పద్ధతి అమలులోకి వచ్చింది పాడలేని అందగత్తెలకూ, అందగాళ్లకూ మధురమైన రాగాన్ని జత పరచగలపాటగత్తెలూ, పాటగాళ్లూ బయలుదేరారు బ్రహ్మాండమయిన సెట్టింగులు వేసి, అద్భుతమయిన లైటింగ్‌లు అమర్చి, అత్యంత మధురమైన గానంతోసహా చిత్రాలుతీసి ప్రేక్షకుడికి అంతులేని ఆనందం కలిగించే సమర్ధతగల నిర్మాతలు బయలుదేరారు ఇంత శిల్ప సంపదను వినియోగించుకోగల చిత్రాలు జానపద చిత్రాలే ఇక జానపద చిత్రాల యుగం ప్రారంభమయింది

జానపద చిత్రాలు తియ్యడంలో నిర్మాతలు చాలా సౌకర్యాలు గమనించారు అసలే రోజులు బాగాలేవు చిత్రంద్వారా సందేశం ఇవ్వటం ప్రమాదకరం — ఏ సందేశం ఏ వర్గానికి విషమవుతోందో! జానపద చిత్రాలు సందేశం లేనివి సాంఘిక వాస్తవికతకు అవి అతీతంగా ఉంటాయి జానపద కథలు వ్రాయటం సాంఘిక కథల కంటే తేలిక సంఘనటలు సృష్టించటంలో ఎంత అయోమయంగా వెళ్ళినా అడిగే వారుండరు పాటలు పాడించటానికీ, పెద్ద సెట్టింగులు వెయ్యడానికీ అంతులేని అవకాశాలుంటై సాంఘిక చిత్రాలలో లాగా సందేశాలు, ఉండవు గనక నూటికి నూరుపాళ్ళూ వినోదం చొప్పించవచ్చు

ఈ అంచనాలన్నీ అక్షరాల రుజువయ్యాయి జానపద చిత్రాలరాకతో పూర్వం ఎన్నడూ కనీవినీ ఎరుగని బాక్సాఫీస్ రికార్డులు ఏర్పడ్డాయి యుద్ధకాలంలో జెమినీ వారి 'బాలనాగమ్మ' రికార్డు చూసి గుండెలు బాదుకున్న వారు ఇప్పుడు దానిని స్మరించటం మానేశారు ఈ జానపద చిత్రాలలో కళకన్న శిల్ప విశిష్టతకూ, ప్రయోజనం కంటే వినోదానికీ ఎక్కువ ప్రాధాన్యం ఉంటుందని స్పష్టమయింది

అయితే ఈ జానపద చిత్రాలలో ఒకటే చిక్కువచ్చింది ఇందులో నిర్మాతలు ప్రవేశపెట్టే ప్రొడక్షన్ వాల్యూస్‌కు అంతంటూ ఉండనవసరం లేదు వాటినిబట్టికూడా ఖర్చు హనుమంతుడి వాలగంగా ఎంతైనా పెరిగిపోవచ్చు కాని చిత్రం మీద వచ్చేరాబడికి ఒక పరిమితి అంటూ ఉంది

ఈ రెంటిని ఎట్లా సమన్వయించాలో, చిత్రం మీద పెట్టే డబ్బుకు ఎక్కడ పరిధి నిర్మించాలో నిర్మాతలకు తెలియలేదు పైగా అంత ఖరీదైన చిత్రాలు తీసే దక్షత స్టూడియో దార్లకుంటుంది గానీ పైవారికి లేదు

1949-50లో మన నిర్మాతలు తమ రాబడిని పెంచుకునే కీలకం కనిపెట్టారు ఆ కీలకం కూడా జానపద చిత్రాల స్వభావంలో ఇమిడి ఉన్నదే — భాషమారితే ఏ ప్రాంతానికైనా ఆమోదకరంగా ఉండేశక్తి సాంఘిక వాస్తవికతకు అతీతంగా ఉండటమే వాటి ప్రత్యేకత అయినప్పుడు వాటి సొమ్ము ఒక ప్రాంతం నుంచే రావాలని ఏముంది? చిత్ర నిర్మాతలు జానపద చిత్రాలను బహుభాషలలో తయారు చేయసాగారు జానపద చిత్రాల చరిత్రలో 'స్వర్ణ యుగం' ప్రారంభమైంది 'పాతాళభైరవి' మూడు భాషలలో విడుదలై నిర్మాతలకు 30 లక్షలు తెచ్చింది

1950 నుంచీ సాగిన ఈ స్వర్ణయుగం సినిమా కళకు ఏమిచేసిందీ ఆలోచించటం అవసరం జానపద చిత్రాలయుగంలోనే అనేక మంది తారలు చిత్రనిర్మాణంలోకి దిగారు ఈ స్వర్ణదినాలలో వీరు కొందరు స్వంత స్టూడియోలు కూడా నిర్మించారు చిత్రనిర్మాణంలో కలిగే లోపాలు తెలుసుకుని అనుభవం గడించటానికి ఈ కాలం బాగా వినియోగించింది

కళకు శిల్పం అప్రధానంకాదు జానపద చిత్రాలలో అభివృద్ధి అయిన శిల్పం కొంతవరకూ దుర్వినియోగ పడిందన్న మాటేగాని గణనీయం కాకపోదు

ఒకప్పుడు పౌరాణిక చిత్రాలు చేసినవనే తిరిగి ఈ జానపద చిత్రాలూ చేశాయి ప్రజలలో సినిమా అభిరుచిని మరింత ప్రజ్వలింపచేశాయి ఈ జానపద చిత్రాల కారణంగా జనసామాన్యానికి సినిమా ఒక దైనికావసరం కింద జమ అయిపోయింది

అయితే ఇప్పుడిప్పుడే తెలుగుచిత్రాలకు మరొక పరిణామ దశ ఆరంభమవుతున్నది రానురాను జనానికి జానపద చిత్రాల మీద మోజు తగ్గుతున్నట్టు కనిపిస్తుంది ఇందులో ఆశ్చర్యం ఏమీ లేదు సినిమా చిత్రాలు కళాఖండాలుగా దేనిప్రత్యేకత ప్రయోజనం దానికుండవచ్చు కాని శిల్ప ప్రదర్శనమయ్యేసరికి ఒక మంచి చిత్రం మిగిలిన వాటిని కొట్టేస్తుంది అదే జానపద చిత్రాలకు జరుగుతున్నది

జానపద చిత్రాల విజయం ఇంకొకపని కూడా సాధించింది అదేమంటే, ఆంధ్రప్రదేశ్ లో ఉన్న అనేక మంది రచయితలనూ, కవులనూ, గాయకులనూ, ఎమెచ్యూర్ నటులనూ సినిమాలోకి దింపింది వీరి ప్రభావం కొంతవరకు చిత్ర నిర్మాణం మీద కనిపిస్తుంది ఇటీవల అనేక సాంఘిక చిత్రాలు మళ్ళీ తయారు కాసాగాయి ఈసారి తయారయ్యే సాంఘిక చిత్రాలకూ యుద్ధానికి పూర్వం వచ్చిన చిత్రాలకూ కొంత తేడా ఉంది ఈ చిత్రాలలో యుద్ధానంతర సాంఘిక సత్యాల ప్రభావం కొంత గోచరిస్తుంది ప్రయోజనాన్ని సొంతం సాధించినా సాధించకపోయినా, ప్రయత్నం మట్టుకు అంతో ఇంతో అభ్యుదయ భావాలతో సాంఘిక చిత్రాలు తయారు చేయాలనే ఈ ప్రయత్నం వెంటనే విజయవంతం కాకపోయినా కాలక్రమాన జయించి తీరుతుంది ఈ ప్రయత్నంలోనే ఆంధ్రుల జాతీయ సంస్కృతిని ప్రతిబింబించే చిత్రాల నిర్మాణం కూడా జరగవచ్చు ఆంధ్రరాష్ట్రావతరణ తెలుగు చిత్రాల నిర్మాణంలోకి కొత్త ఆవేశాన్ని ప్రవేశపెడుతుందని ఆశిద్దాం

*కృష్ణాపత్రిక, వారపత్రిక, ఆంధ్ర రాష్ట్రావతరణ సంచిక, అక్టోబరు 1953*

# 66. తెలుగు చిత్రాలు-సింహావలోకనం

మొట్టమొదటి తెలుగుటాకీ 'ప్రహ్లాద' 1931లో వెలువడింది అది మొదలు 1953 ఆగస్టు ఆఖరులోగా 224 తెలుగు చిత్రాలు వెలువడ్డాయి (ఈ లెక్కలో, ఒక ప్రదర్శనంగా వెలువడిన చిత్రాలు ఒకే చిత్రంగా భావించబడింది) ఇందులో సుమారు నాలుగోవంతు ఆంధ్రేతరులు తయారు చేసినవి తెలుగు గడ్డమీద తయారైనవి ఐదు మాత్రమే!

చిత్రనిర్మాణానికి స్టూడియోలు అవసరం ఈ స్టూడియోలు ముందుగా బొంబాయి, కొల్హాపూరు, పూనా, కలకత్తా మొదలైన చోట్ల ఏర్పడ్డాయి 1936 దాకా ఆంధ్రలో స్టూడియో నిర్మాణానికి యత్నం జరగలేదు మొదటి యత్నం ఫలితంగా రాజమండ్రిలో దుర్గాసినీటోన్ ఏర్పడింది ఈ స్టూడియోలో 'సంపూర్ణ రామాయణం' తయారయింది అనంతరం సి పుల్లయ్యగారు ఈ స్టూడియోకు ఆంధ్రాటాకీస్ అని పేరుపెట్టి ఇందులో 'సత్యనారాయణ వ్రతం' ('చల్‌మోహనరంగా,' 'కాసులపేరు' తోసహా), 'మోహినీ భస్మాసుర' తీశారు ఇదే కాలంలో విశాఖపట్నంలో ఆంధ్రా సినీటోన్ అనే పేరుతో మరొక స్టూడియో ఏర్పడి అందులో 'జయదేవ, 'పాశుపతాస్త్రం' చిత్రాలు తయారయ్యాయి అంతటితో ఆ రెండు స్టూడియోలూ అస్తమించాయి ఈ నాటి వరకూ ఆంధ్రలో మళ్ళీస్టూడియో నిర్మాణయత్నం జరగలేదు

గత 22 సంవత్సరాల ఆంధ్ర చిత్ర నిర్మాణ చరిత్రను స్థూలంగా మూడు భాగాలు చేయవచ్చు

1931-38 పౌరాణిక చిత్రాలయుగం

1938-46 సాంఘిక చిత్రాలయుగం

1946 నుంచి జానపద చిత్రాల యుగం

ఈ విభజనను బట్టి1938కి పూర్వం సాంఘిక చిత్రాలు లేవనీ, 1947కి పూర్వం జానపద చిత్రాలు లేవనీ అనుకోనవసరం లేదు 1933లోనే 'చింతామణి' చిత్రమూ, రెండు 'రామదాసు' చిత్రాలూ వెలువడ్డాయి 'చింతామణి' కథ సగం సాంఘికం, సగం జానపదం రామదాసు కథ సగం చారిత్రకం, సగం జానపదం, 1936లోనే పూర్తి సాంఘిక చిత్రం 'ప్రేమవిజయం' వెలువడింది 1937లోనే పూర్తి జానపద గాథ 'కనకతార' వెలువడింది అదే విధంగా 1940లో సాంఘిక కథలు కానివి నాలుగు చిత్రాలు 'భోజకాళిదాస', 'చండిక', 'కాలచక్రం', 'మీరాబాయి' వెలువడ్డాయి.

అయినప్పటికీ పైన చెప్పిన విభజనకు కొంత అర్థమున్నది దానిని వివరంగా పరిశీలించుదాం

టాకీల తొలిదశలో పౌరాణిక యుగంలో తెలుగు చిత్రాలు, ఎవరు నిర్మించినవైనా కానివ్వండి, భారత దేశపు అన్ని ప్రాంతాల్లో తయారయ్యాయి తెలుగువాడైన పి వి దాసుగారి నిర్వహణ కింద మద్రాసులో వేల్ పిక్చర్స్ స్టూడియో ఏర్పాటై 1934లో 'సీతాకల్యాణం' వెలువడేదాకా ఒక్క తెలుగుచిత్రం కూడా మద్రాసులో తయారుకాలేదు 1937 దాకా తెలుగు చిత్రాలను నిర్మించిన మద్రాసు స్టూడియో ఇది ఒకటే ఇందులో కూడా కొద్ది తెలుగు చిత్రాలు 'సీతాకళ్యాణం', 'కృష్ణలీలలు', 'మాయాబజార్', 'కనకతార', మాత్రమే తయారు

కావడంచేత తెలుగుచిత్రాల నిర్మాణం మద్రాసులో కేంద్రీకృతం కాకపోయింది 'మాయాబజార్ కాలంలో పి వి దాసుగారు కాలధర్మం చెందారు తరువాత వేల్ పిక్చర్స్ తరఫున తెలుగు చిత్రం వెలువడనే లేదు

తెలుగు చిత్రనిర్మాణం ఆంధ్రకు దగ్గరగా మద్రాసులో కేంద్రీకృతమయ్యేదాకా పౌరాణిక చిత్రాలయుగం సాగడంతప్పని సరి అయింది తెలుగు చిత్రాల నిర్మాణంలో పాల్గొన్న నిర్మాతలు, దర్శకులు, టెక్నీషియనులు చాలావరకు ఆంధ్రేతరులు వీరైనా వివిధ ప్రాంతాలవారు భారతదేశమంతటా తెలిసిన కథలు తీసుకుంటేతప్ప చిత్ర నిర్మాణం సులభంగా జరిగే అవకాశం లేదు భారత దేశమంతటా తెలిసిన కథలు పౌరాణిక కథలు మాత్రమే

1938 నుంచి ఈ పరిస్థితి మారింది ఈ సంవత్సరమే మీర్జాపురం రాజాగారి జయా ఫిలిమ్స్ స్టూడియో తన తొలి చిత్రం 'జరాసంధ' విడుదల చేసింది వేల్ పిక్చర్స్ అనంతరం మళ్ళీ ఒక తెలుగు స్టూడియో మద్రాసులో వెలిసింది 1931లో మొట్టమొదటి తెలుగు టాకీ చిత్రం తయారు చేసిన హెచ్ ఎం రెడ్డిగారు బొంబాయి రాష్ట్రాన్ని వదిలేసి మద్రాసుకు వచ్చివేసి రోహిణీ పిక్చర్స్ సంస్థ స్థాపించారు తొలి చిత్రం 'గృహలక్ష్మి' ఈ సంవత్సరమే విడుదల చేశారు అలాగే వేల్ పిక్చర్స్ నాటి నుంచి చిత్ర నిర్మాణంలో అనుభవం గడించిన గూడవల్లి రామబ్రహ్మం 'మాలపిల్ల' ఈ ఏడు విడుదల చేశారు 1938లో వెలువడిన చిత్రాలలో 'గృహలక్ష్మి', 'మాలపిల్ల' సద్విజయాన్ని సాధించడం సాంఘిక చిత్రాల యుగానికి నాంది అయింది దీనికి నిదర్శనంగా 1939లో మద్రాసులో మరి రెండు ప్రముఖ తెలుగు సంస్థలు ఏర్పడి సాంఘిక చిత్రాలు విడుదల చేశాయి ఇందులో ఒకటి బి ఎన్ రెడ్డిగారి వాహినీ సంస్థ, రెండవది వై వి రంగాగారి జగదీశ్ ఫిలిమ్స్ రావుగారు ఆంధ్రుడై వుండి కూడా చాలా ఏళ్ళపాటు తెలుగుచిత్రాలు నిర్మించలేదు అలాంటివాడు 1939లో స్వంతాన చిత్రనిర్మాణ సంస్థ ఏర్పరచి తెలుగులో 'మళ్లీ పెళ్లి' అన్న సాంఘిక చిత్రాన్ని విడుదల చేశారు బి ఎన్ రెడ్డి గారికి 'గృహలక్ష్మి' తో చాలా దగ్గర సంబంధం ఉండింది ఆయన కూడా వాహినీ సంస్థ తరవున తమ తొలి సాంఘిక చిత్రం 'వందేమాతరం' 1939లో వెలువరించారు 1939లో అయిదు సాంఘిక చిత్రాలు వెలువడ్డాయి (1931 నుంచి 1939 దాకా వెలువడ్డ సాంఘిక చిత్రాలన్నీ కలిపి 5 లేవు!) ఇంతేగాక, లోగడ ఈస్టిండియా ఫిలిం కంపెనీ తరవున పౌరాణిక చిత్రాలు తీసిన సి పుల్లయ్యగారు ఈసారి అదే కంపెనీ తరవున ఒక సాంఘిక చిత్రం 'వరవిక్రయం' తీసి 1939లోనే దానిని విడుదల చేశారు 1940లో మీర్జాపురం రాజాగారు కూడా 'జీవన జ్యోతి' అనే సాంఘిక చిత్రం తీయడంతో అప్పటికున్న ప్రముఖ తెలుగు సంస్థలన్నీ సాంఘిక చిత్రాలు తీసినట్టయింది

ఆనాటి ప్రముఖ చిత్రనిర్మాతలు విద్యాధికులు, సంస్కారులు, కళాభిమానులు వీరంతా మద్రాసులో స్థిరపడిపోయారు ఇక పౌరాణిక చిత్రాలు తీయవలసిన అవసరం లేదు ఈనాటి సంఘానికి పౌరాణిక చిత్రాలు ఏమీ సందేశం ఇవ్వలేవు వాటిని తీయడం వ్యయప్రయాసలతో కూడుకున్నపని పౌరాణిక పాత్రలు ధరించటానికి ఆజానుబాహులూ, అపురూప సౌందర్యవతులూ కావాలి సాంఘిక చిత్రాలకీ బాధలేవీలేవు వాటిని చౌకగాకూడా తీయవచ్చు ఆ చిత్రాలకు కావలసిన వాతావరణం సృష్టించే దక్షత ఈ నిర్మాతలకున్నది

సాంఘిక చిత్రాలరాకతో చిత్ర నిర్మాణంలో చాలా మార్పులు జరిగాయి అనేకమంది

కొత్త తారలు ముందుకు వచ్చారు ప్రేక్షకులకు కొత్త అభిరుచులు అలవడ్డాయి ఏటా నిర్మాణమయ్యే తెలుగు చిత్రాల సంఖ్య బాగా పెరిగింది చిత్ర నిర్మాణంతో పాటు డిస్ట్రిబ్యూషన్, ఎగ్జిబిషన్ కూడా వ్యాప్తి చెందాయి సినిమా ప్రేక్షకుల సంఖ్యబాగా పెరిగింది పౌరాణిక చిత్రాలలో నటులకూ, వారుధరించే పాత్రలకూ మధ్యవుండే పెద్ద అగాధం, నటులకూ ప్రేక్షకులకు మధ్య కూడా ఉండేది సాంఘిక చిత్రాలు సినిమా నటులను అటు పాత్రలకూ, ఇటు ప్రేక్షకులకు కూడా సన్నిహితం చేశాయి

1942 దాకా యుద్ధ పరిస్థి తీవ్రతరమైనది ఏటా పన్నెండు తెలుగు చిత్రాల చొప్పున ఈ సాంఘిక చిత్రాల యుగంలో వెలువడ్డాయి కాని 1942 నుంచి చిత్రనిర్మాణ పరిస్థితులలో గొప్ప మార్పు జరిగింది ముడి ఫిలిం పరిమితం కావడం చేత పర్మిట్ల పద్ధతి అమలు జరిగింది చిత్రాల సంఖ్య మూడో వంతుకు పడిపోయింది చిత్ర నిర్మాణవ్యయం బాగా పెరగసాగింది అయితే సకాలంలోనే ప్రేక్షకులకు సినిమా అతి ప్రధానమైన వినోదమైంది దానికి తోడు చిత్ర నిర్మాణం పడిపోవడంతో తయారైన కొద్ది చిత్రాలే విపరీతంగా లాభాలు చేసుకున్నాయి

1945లో యుద్ధం అయిపోవడంతో చిత్ర నిర్మాణానికి గల అడ్డంకులు తొలగిపోయాయి 1944,45 సంవత్సరాలలో ఏటా నాలుగేసి తెలుగు చిత్రాలు మాత్రమే వెలువడ్డాయి కానీ, 1946లో 10 తెలుగు చిత్రాలు వెలువడ్డాయి అయితే ఈ ఉత్సాహం దక్కలేదు సినిమా పరిశ్రమలో మరొక పెద్ద మార్పు జరిగింది సాంఘిక చిత్రాల యుగం అయిపోయింది యుద్ధం నుంచి బయటపడిన మన సంఘానికి సందేశం ఏమీ ఇవ్వాలో ఎవ్వరికీ తెలియలేదు

ఈ సంగతి ఆనాటి చిత్ర నిర్మాతలు గ్రహించి వుండాలి 1946 లో మూడు సాంఘిక చిత్రాలు వెలువడ్డాయి 1947, 48,49 లలో విడుదలైన 20 చిత్రాలలో మూడే సాంఘిక చిత్రాలు అందులో ఒకటి 'మనదేశం', సాంఘికం అనడం కంటే రాజకీయమనడం ధర్మం రెండవది 'గీతాంజలి' విడుదలౌతూనే చావుదెబ్బతిన్నది మూడవది 'ద్రోహి' సుమారుగా పోయింది

ఈ మూడు సంవత్సరాల కాలంలో విడుదలైన చిత్రాలలో గమనించదగిన మరొక విషయం ఏమిటంటే చిత్రాల సంఖ్య తిరిగి ఆరు లేక ఏడుకి తగ్గడం ఈ సారి చిత్రాల సంఖ్యను తగ్గించినది యుద్ధం కాదు పర్మిట్లు కావు చిత్ర నిర్మాణ వ్యయంలో పెరుగుదల

సాంఘిక చిత్రాల యుగంలో తెలుగు చిత్రాలకు ఉపకారాలెన్ని జరిగినా, ఒక అపకారం కూడా జరిగింది తెలుగు చిత్రాలకు తమిళ మార్కెట్ లేకుండా పోయింది సాంఘిక చిత్రాలు చౌకగా తయారైన కాలంలో ఇది మన చిత్రనిర్మాతలను బాధించలేదు కానీ, చిత్ర నిర్మాణ వ్యయం పెరగటంలో ఇదొక పెద్ద సమస్య అయింది జానపద చిత్రాలుతీయవచ్చు నిజమే 'గొల్లభామ' 'రత్నమాల', 'బాలరాజు', 'కీలుగుర్రం', లైలామజ్ను అయితే జానపద చిత్రాలు తీయడానికి మరింత ఖర్చు అవుతుంది జానపద చిత్రమనేసరికి అందమైన నాయికా నాయకులు, బ్రహ్మాండమైన సెట్టింగులు, జనరంజకమైన పాటలు, ఇతర ప్రొడక్షన్ వాల్యూస్ విధిగా కావాలి తడిసి మోపెడవుతుంది ఈ క్లిష్టపరిస్థితి నుంచి బయటపడడానికి ఒకే మార్గం వుంది కాని, 1950 దాకా మన చిత్ర నిర్మాతలు దానిని కనుక్కోలేకపోయారు ఆ మార్గమేమంటే ఉభయ

భాషలలో– తెలుగు, తమిళ భాషలలో – జానపద చిత్రాలు తీయడం

ఈ ఉపాయం అమలు జరగడంతో ఆరిపోయే దీపానికి చమురు అందించినట్టయింది 1949లో ఏడు చిత్రాలు తయారయితే 1950 లో 16 చిత్రాలు తెలుగులో తయారయ్యాయి ఇందులో మూడు చిత్రాలు ఇతర భాషా చిత్రాలకు తెలుగు తర్జుమాలు, రెండు తెలుగు చిత్రాలు ఇతర భాషలలోకి కూడా తర్జుమా అయాయి తెలుగు సినిమా చరిత్రలోనే కాకుండా తమిళ సినిమా చరిత్రలోకూడా 'బూమ్' ప్రారంభమయింది

1949 దాకా ఒక్క తెలుగులోనే చిత్రాలు తీయసాగారు చిత్ర నిర్మాణంలో నూతన వికాసం ఏర్పడింది మీర్జాపురం రాజాగారి శోభనాచల స్టూడియో ఒక్కటే తెలుగు స్టూడియోగా ఉన్న మద్రాసులో వాహినీ, భరణీ, రోహిణీ, ప్రకాష్ స్టూడియోలు వెలిశాయి కొత్త తారలకు గిరాకీ ఏర్ప డింది వీరిప్పుడు ఉభయభాషా చిత్రాలలోనూ రాణించసాగారు తెలుగు, తమిళ చిత్ర పరిశ్రమల మధ్య దృఢమైన బంధం ఏర్పడినట్టు కనిపించింది 1951లో విడుదలైన తెలుగు చిత్రాల సంఖ్య 22కి పెరిగింది '52లో ఈ సంఖ్య 25 అయింది '53 ఆఖరులోగా 35 చిత్రాలకు పైగా విడుదల కావచ్చు

*ఆంధ్రప్రభ, దినపత్రిక, ఆంధ్రరాష్ట్ర అవతరణ సంచిక 1-10-1953*

# 67. జీవితసత్యాన్ని వ్యక్తంచేసే వాస్తవిక చలన చిత్రాలు

గడచిన రెండు దశాబ్దాల కాలంలో ప్రజలకూ, సినిమాలకూ ఉండే సంబంధం చాలా రకాల పరిణామాలను పొందింది మొదట్లో అత్యధిక సంఖ్యాకులు సినిమాలను ఏదో అనుమానంతో చూసేవారు సినిమా చూడట మనేది సద్వర్తనా, దుర్వర్తనా అనేది కూడా అనుమానంగా ఉండేది యువకులు ఉత్సాహపడి చూసేవాళ్ళుగాని, పెద్దవాళ్ళు కోప్పడేవాళ్ళు కాని త్వరలోనే పెద్దవాళ్ళు కూడా ''పుణ్యం'' కోసం ఆనాటి పౌరాణిక చిత్రాలు చూడనారంభించారు అప్పుడు కూడా చదువుకున్న వాళ్ళూ, సంస్కారులూ సినిమాలను చవుకబారు కళగానే చూసేవారు

సాంఘిక చిత్రాల రాకతో ప్రజలకూ సినిమాలకూగల సంబంధాలు కొంత బలపడ్డాయి పురాణ పాత్రలను చూసి తరించడానికి ఆశించే వర్గం వెనక్కి తగ్గినా సినిమా చిత్రాలకు సాంఘిక చిత్రాలతో కొంత కళాగౌరవం లభించి, యువకులూ, చదువుకున్న వారూ కూడా వాటిని పూర్వం కన్నా బాగా ఆదరిస్తూ వచ్చారు ఈదశలో సినిమా వ్యక్తులకు కొంత కీర్తీ డబ్బూ రాసాగింది

జానపద చిత్రాలు . ఆకర్షణ

ఆ తరువాత జానపద చిత్రాలు వచ్చాయి పౌరాణిక చిత్రాలను లక్ష్యపెట్టని వర్గాలు, సాంఘిక చిత్రాలను లక్ష్యపెట్టని వర్గాలు కూడా జానపద చిత్రాల చేత ఆకర్షించబడ్డాయి వీటిలో టెక్నీషియనుల పనితనం పూర్వం ఎన్నడూ లేనంత బాగా రాణించింది, సినిమా కళకూడా ఈ చిత్రాలలో విశేషంగా వ్యక్తమయింది ఎట్టి సంస్కారంగాని ఏ ఇతర కళాతోనూ పరిచయంగాని లేని క్షుద్ర జీవితాలకు కూడా సినిమా చిత్రాలు ఒక కళానుభూతినిచ్చాయి ఈ దశలో

వినోదవుపన్ను విపరీతంగా పెరిగిపోయినాకూడ జానపదాలు ప్రజాదరణ పొందినవి పూర్వం ఎన్నడూ ఎవరూ ఊహించనంతగా డబ్బు చేసుకోసాగాయి సినిమా తారలు సంఘంలో అత్యున్నత స్థానం— రాజకీయ నాయకులు సైతం పోటీ చెయ్యలేని స్థానం— అందుకున్నారు వారి సంపాదనలు గవర్నర్ల వేతనాలను మించేశాయి ఈ దశలో సినిమా వ్యాపకానికి అనుబంధ వ్యాపకాలేర్పడ్డాయి సినిమా పత్రికలూ ఇతర పత్రికల్లో సినిమా శీర్షికలూ, పత్రికల ముఖచిత్రాలలో సినిమా తారల బొమ్మలూ వెలిశాయి సినిమా ప్రేక్షక సంఘాలేర్పడ్డాయి

ఈ దశ ఇటీవలిదాకసాగింది ఇది సినిమా వ్యాపారపు పతనదశ ఈ పతనానికి బాహ్యకారణంగా ఇప్పుడిప్పుడే ప్రారంభమవుతున్న ఆర్థిక కాటకం ఉంటే ఉన్నదేమో, కాని ప్రధాన కారణం చిత్రనిర్మాణంలో పోటీ జానపద చిత్రాల నిర్మాణంలో పోటీ చాలా పెద్ద పాత్ర వహించింది పదిహేను, ఇరవై లక్షల ఖరీదుతో, అద్భుతమైన సెట్టింగులతో, దుస్తులతో నేత్రపర్వంగా ఫోటోగ్రాఫ్ చేసిన చిత్రాన్ని చూసిన ప్రేక్షకుడు, నాలుగైదు లక్షలతో ' కొట్టేసిన' జానపద చిత్రాన్ని చూడమంటే చూడడు అచ్చగా ప్రొడక్షన్ విలువల విషయంలోనే గాక, కథనంలోనూ, పాత్రరచనలోనూ కూడా సామర్థ్యం చూపిన వారు పోటీలో నెగ్గారు 'చంద్రహారం' చూసిన ప్రేక్షకులు మరో సాధారణ జానపద చిత్రాన్ని చూడటానికి ఎగబడటం అసంభావ్యం

పైగా, జానపద చిత్రాల నిర్మాణం విపరీతమైన ఖర్చుతో కూడుకున్నది ఇంత ఖరీదైన చిత్రాలు పోటీలో నెగ్గగలవారే తీయాలి నెగ్గగల వారు ఐదారుగురున్నప్పటికీ అయిదారు భారీ చిత్రాలను ప్రజలు పోషించలేరు ఏడాదికి ఒకటి రెండు భారీ చిత్రాలకన్న విడుదలచేసి లాభంలేదు మిగిలినవి పోటీకి తట్టుకోలేకనైనా దెబ్బతింటాయి ఈ విషయం ఏడాది క్రితమే నిర్మాతలకు స్పష్టమయింది 1953లో విడుదల అయిన చిత్రాలలో జానపద చిత్రాలని చెప్పదగినవి ఆరు మాత్రమే అందులో మూడు ఘోర పరాజయం పాలై తలుచుకునే వాళ్ళు లేకుండా పోయాయి మిగిలిన మూడింటిలో కూడా చెప్పుకోదగిన ప్రజాదరణ పొందలేదు ఇక ముందు జానపద చిత్రాల నిర్మాణం మరింత ప్రమాదకరమవుతుంది పూర్వం వచ్చిన జానపద చిత్రాల కంటె అన్ని విధాలా బాగున్నది తయారు చేసే తాహతు కలవాళ్ళే జానపద చిత్రాల నిర్మాణానికి పూనుకొని, అంతులేని లక్షలు వ్యయం చేయాలిగాని మామూలు నిర్మాత వాటి జోలికిపోరాదు

ఇక మామూలు నిర్మాతలకు మిగిలినవి చవుక చిత్రాలు. వీటిలో ప్రొడక్షన్ విలువలకు అవకాశం లేదు. ఇది ప్రజలకు సన్నిహితంగా వెళ్ళాలంటే ఒకటే సాధనం – వాస్తవికత జానపద చిత్రాలలో ప్రజలకు లభించనిది కూడా ఈ వాస్తవికతే ఉదారమైన ఆశయలూ, మహోన్నతమైన సందేశాలూ జానపద చిత్రాలో కూడా ఉండవచ్చు కాని ఉదాత్తమైన సాంఘిక పాత్ర నిర్వహించగలవి వాస్తవిక చిత్రాలే

వాస్తవిక చిత్రాల నిర్మాణంలో దక్షత సాధించిన వారు రేపటి సినిమా వ్యాపారానికి వెన్నెముకలు ఈనాడు ఇటువంటి చిత్రాలు అనేకం నిర్మాణంలో ఉన్నాయి అంతా మనవాళ్ళే', 'నిరుపేదలు', 'తోడు దొంగలు', 'జ్యోతి', 'పల్లెపడుచు', 'పరివర్తన' మొదలగునవి ఇటువంటి చిత్రాలకు మార్గదర్శి 'షావుకారు', దాని తరువాత 'పల్లెటూరు', 'పుట్టిల్లు',

'పిచ్చిపుల్లయ్య' మొదలైనవి

వాస్తవిక చిత్ర నిర్మాణం ఇంకా పరిపక్వదశకు రాలేదు ఇందులో చూపదగిన ప్రతిభను ఇంకా ఎవరూ కరతలామలకం చేసుకున్నట్టు లేదు యుద్ధం ముగిసిన కాలంలో నిర్మాతలకు జానపద చిత్రాలలో కథా సౌలభ్యం కనిపించిన విధంగా ఈనాటి నిర్మాతలకు వాస్తవిక చిత్రాలలో నిర్మాణ సౌలభ్యం కనిపిస్తోంది కాని ఇది భ్రాంతి వాస్తవిక చిత్ర నిర్మాణానికి కళా దక్షత చాలా హెచ్చుగా ఉండాలి ఒకటి రెండు ఉత్తమ తరగతి చిత్రాలు వెలువడే దాకా ఈ విషయం స్పష్టంగా రుజువుకాదు జానపద చిత్రాలలో కన్న వాస్తవిక చిత్రాలలో పాత్రపోషణ, కథా సంవిధానం, పాత్రల ప్రేరేపణలూ, వర్గసంబంధాలూ, కథా పరిణామమూ ఎన్నో రెట్లు నిర్దుష్టంగా ఉండాలి ఈ చిత్రాలు వాస్తవ జీవితాన్ని ప్రతిబింబించడమే గాక, జీవిత సత్యాన్ని వ్యక్త పరచాలి ఈ ప్రయత్నం ఎంత విజయవంతంగా జరిగితే ప్రజలు అంతగా ఈ చిత్రాలను ఆదరిస్తారు

చిత్రనిర్మాణాన్ని వ్యాపారంగా చూసినప్పటికీ ఈ రకం చిత్రాలకు ఎక్కువ మన్నిక ఉంటుంది రెండు లక్షలలో చిత్ర నిర్మాణ వ్యయం ముగిసినట్టయితే సమర్థులు తీసిన చిత్రం అపజయం పొందనవసరంలేదు సమర్థత లేని నిర్మాతకు నష్టం వచ్చినా ఒక్క చిత్రంతో 'పరారీ' కానవసరం లేదు తన అనుభం ద్వారా నేర్చుకున్న పాఠాన్ని రెండో చిత్రంలో అమలు చేసుకోవచ్చు 'పిచ్చిపుల్లయ్య' చిత్రాన్ని క్రిందటి జూలైలో విడుదల చేసిన నేషనల్ ఆర్టు వారు రేపు మార్చిలో 'తోడుదొంగలు' విడుదలచేయనున్నారు వచ్చే ఆగస్టుకు మూడో చిత్రం విడుదల చేసినా ఆశ్చర్యం లేదు ఇది జానపద చిత్ర నిర్మాతలకు సాధ్యమయ్యేది కాదు

ఆంధ్రలో స్టూడియో

వాస్తవిక చిత్రాల నిర్మాణంతోపాటు మరొక పరిణామం కూడా జరగవలసి ఉంది ఆంధ్రాలో స్టూడియోలు నిర్మాణం కావాలి మద్రాసులో తయారయే చిత్రాలనే ఆంధ్రాలో చాలా తక్కువ ఖర్చుతో తీయవచ్చు పాత్రలకు తగిన వ్యక్తులు అక్కడ దొరుకుతారు సరి అయిన ఔట్‌డోర్ లొకేషన్లు దొరుకుతాయి 'పల్లెటూరు' చిత్రంలో వాతావరణం బాగా ఉండటానికి కారణం సరిఅయిన ఔట్ డోర్ దృశ్యాలు అయితే ఏడాదికి నాలుగైదు చిత్రాలు నిర్మించనిదే ఎంత చిన్న స్టూడియో నిర్మించినా గిట్టుబాటు కాదు కాని ముందుముందు చిత్రాల సంఖ్య హెచ్చుతుందనే విశ్వాసం కలవాళ్ళు ఆంధ్రలో స్టూడియో నిర్మించినట్టయితే తప్పక గిట్టుబాటు అవుతుంది సినిమాచిత్రాలు ప్రజలకు సన్నిహితం కావటంలో ఒక పెద్ద ముందడుగు ఆంధ్రలో స్టూడియోలు నిర్మాణం కావటం

*విశాలాంధ్ర, దినపత్రిక, 14-1-1954*

# 68. భావసంఘర్షణలో సినిమా నిర్వహించే పాత్ర

1950 ఆరంభంలో ''సాటర్ డే రివ్యూ'' అనే పత్రికలో యునైటెడ్ స్టేట్స్‌లో వైదేశిక విధానాన్ని బలపరచటంలో సినిమా చిత్రాలు నిర్వహించదగిన పాత్ర గురించి చర్చలు జరిగాయి అమెరికా ప్రభుత్వ యుద్ధవిధానాలను ప్రచారం చేసేవారు ఎదుర్కొనే చిక్కులను గురించీ, హాలీవుడ్ బాధ్యతలను గురించీ నాలుగు సంచికలలో సంపాదకీయాలూ, వ్యాసాలు

వెలువడ్డాయి

''ప్రపంచ ప్రజలకు అమెరికా గురించి తెలిసేదంతా చాలావరకు సినిమా చిత్రాల ద్వారా మాత్రమే'' అని నార్మన్ కజిన్స్ రాశాడు ఈ సినిమా చిత్రాలు అమెరికాను ''హంతకులూ, గూండాలూ, సోమరిపోతులూ, తాగుబోతులూ, తార్పుడుగాళ్లు, మోసగాళ్లూ నిండిన దేశంగా'' చిత్రించటం గురించి ఆయన విచారం వెలిబుచ్చాడు

సినిమా చిత్రాలు ప్రజలలో న్యాయం పైనా, ప్రజాప్రభుత్వం విధానంపైనా గురి కలిగించాలన్నాడు కజిన్స్, మోషన్ పిక్చర్ ప్రొడ్యూసర్స్ అసోసియేషన్ సభ్యుడైన ఎరిక్ జాన్‌స్టన్ కజిన్స్‌కు సమాధానం చెబుతూ ''ఆదర్శాలను గురించిన ఉపన్యాసాలూ, బోధనలూలేని వినోదం''తో కూడిన చిత్రాలను తయారుచేయటంలో హాలీవుడ్ సమర్థత చూపుతోందన్నాడు హాలీవుడ్ చిత్రాలలో, ''తేలికైన, నురుగులాటి సంగీత చిత్రాలూ, హాస్యచిత్రాలూ, కొన్ని ఢాం—ఢాం చిత్రాలూ'' ఉన్నాయన్నాడు వాటిల్లో ''హాస్యమూ, జీవితంనుంచి పలాయనమూ'' ఉంటుందన్నాడు ఈ చిత్రాలు అమెరికాను చిత్రిస్తున్నాయని తాము విశ్వసిస్తున్నామనీ, అవి 'స్వతంత్రదేశపు రాయబారులుగా ఉన్నాయని'' తన విశ్వాసమనీ జాన్‌స్టన్ అన్నాడు

మార్చి 4న వెలువడిన ఆఖరు వ్యాసంలో కజిన్స్ ఎరిక్ జాన్‌స్టన్‌ను ఖండిస్తూ, అమెరికా, చిత్ర ప్రభావం అమెరికన్ ప్రేక్షకులపైనా, విదేశీ ప్రేక్షకులపైనా ఒక విధంగా ఉండదన్నాడు

''ఈనాటి భావ సంఘర్షణలో అమెరికా వైఖరిని విదేశీయుల ముందుంచటంలో సినిమాతో తులతూగగల సాధనం మరొకటిలేదు'' అన్నాడాయన

సినిమా వైదేశిక విధాన సాధనంగా పనిచేయాలన్న విషయంలో ఇద్దరూ ఏకీభవించారు ఇతరదేశాలకు వెళ్ళే చిత్రాలు ప్రభుత్వ ప్రచారాన్ని కొనసాగించాలనటంలో వారికి అభిప్రాయ భేదంలేదు ప్రచారావశ్యకత ఎంత బలవత్తరంగా ఉన్నదంటే, ఈ చర్చలో ఎక్కడా జీవితమూ, కళా, సత్యమూ, సౌందర్యమూ మొదలైన వాటి ప్రస్తావనే లేదు

''వదరుబోతులనూ, తాగుబోతులనూ, హంతకులనూ, కామోద్రేకులనూ'' చిత్రించే చిత్రాల ప్రభావం అమెరికనులపై ఎలా ఉంటుందన్న విషయంలో కజిన్స్‌కు ఎట్టి విచారమూలేదు ఆయన విచారమల్లా ఇతర దేశాలవారేమనుకుంటారు అనే ఈ చిత్రాలలో అమెరికా చిత్రణం వాస్తవంగా ఉన్నట్టు అమెరికనులు భావిస్తారనే ఆయన నమ్మి నట్టు కనబడుతుంది జాన్‌స్టన్‌కుకూడా ఈ చిత్రాలను గురించి ఏ ఆక్షేపణాలేదు

అయితే వారిద్దరికీ తేడా ఎందులో ఉన్నదంటే, సాంస్కృతిక ''నిపుణుడైన'' కజిన్స్ యుద్ధవిధానాలకు ''స్వాతంత్ర్యం'', ''ప్రజాస్వామికం'' బురఖాలు తొడగాలంటాడు జాన్‌స్టన్‌కు ఈ నినాదాల్లో నమ్మకం లేదు ఆ మాటలకు అర్థమేమిటో కూడా బాగా తెలియదు, ధనిక వర్గానికి ప్రజలమీదా, వారి ఆశయాల మీదా ఉండే తూష్ణీభావాన్ని ఆయన వ్యక్తం చేశాడు జపానీయులను మార్చటంలో హాలీవుడ్ చిత్రాలు అద్భుతంగా పనిచేశాయని జనరల్ మెకార్థర్ అన్న మాటలను ఆయన ఉదాహరించుతూ అమెరికన్ పౌరులు వాడే తళతళా మెరిసే పరికరాలను విదేశీయులకు చూపాలన్నాడు

ఇద్దరిమధ్యా ఒక విధమైన ''శ్రమ విభజన'' జరిగింది ఒకరు ''ఆదర్శాలు'' మాట్లాడితే, ఇంకొకరు ''వ్యాపార వినోదం'' గురించీ, కామోద్రేకాలూ, హత్యలూ మొదలైన ''వినోదాలు''

గురించీ మాట్లాడతారు హాలీవుడ్ చిత్రాలు ఈరెండు దృక్పథాలనూ ప్రతిబింబిస్తూనే వస్తున్నాయి కాగా, ఈ చర్చ కొరియా యుద్ధారంభానికి ముందుగా జరగటమే గమనించదగిన విషయం ప్రపంచాన్ని దిగమింగే కార్యక్రమంలో అమెరికా పాలకులు ముందడుగువేసే తరుణంలో రెండురకాల ప్రచారాన్నీ సాధించటమూ, వాటిని ఏదోవిధంగా పరస్పరం సమన్వయించటమూ, అవసరమయింది దురాశాపూరితమైన యుద్ధాన్ని ''ధర్మయుద్ధం'' గా ప్రచారం చెయ్యాలి, ఈ ''ధర్మయుద్ధం'' ఫలితంగా ఎక్కువ లాభాలూ, అధికమైన దోపిడీ, విశేష జననాశమూ జరగటం సమర్థించబడాలి

ఈ సమన్వయం గురించే కజిన్స్‌కూ, జాన్స్టన్‌కూ మధ్య వాగ్వివాదం జరిగింది అమెరికా కొరియాలో జోక్యం కలిగించుకునే ముందు నడిచిన నెలల్లో అన్ని రంగాల ప్రచారాలలోనూ వైషమ్యం గోచరించింది కొరియా యుద్ధంతో ఈ వైషమ్యం మరింత తీవ్రమయింది ''వ్యాపార' ప్రకటనలు రాసేవారి నైపుణ్యమూ, తత్వవేత్తలజ్ఞానమూ, సునిశితమైన రాజనీతిజ్ఞతా, యోగులకుండే దివ్యదృష్టి కలవారిని మాత్రమే ప్రభుత్వ ప్రచారానికి నియోగించాలి '' అని 1950 జులైలో ''ఈవినింగ్ స్టార్'' పత్రిక రాసింది అయితే అమెరికా సామ్రాజ్యవాదానికి పట్టుకొమ్మలుగా ఉన్నవారిలో యీ లక్షణాలెవరికీ లేనందున ప్రచారంలో ఏర్పడినవైషమ్యాలను తొలగించటం జరుగలేదు

వాల్‌స్ట్రీట్ వారి కార్యక్రమాలను సమర్థించేవారు ఎదుర్కొనే చిక్కులే ఆ కార్యక్రమాన్ని అమలుచేయటంలో కూడా ఎదురవుతాయి రెండవ ప్రపంచ యుద్ధంలో ఫాసిజం దెబ్బతినడంతో ప్రపంచమంతటా గల శక్తుల మధ్య కొత్త సంబంధాలు వెలిశాయి యుద్ధం ఫలితంగా సోవియట్ యూనియన్ కొత్త బలాన్ని చేకూర్చుకుని, ఆబలాన్ని శాంతియుత నిర్మాణాలకూ, ప్రజల సాంస్కృతిక వికాసానికి అంకితం చేసింది. చైనాలోనూ, తూర్పు యూరప్ దేశాలలోనూ ప్రజాప్రభుత్వాలు ఏర్పడి, దోపిడీ విధానాలను అంతం చేసి, అభ్యుదయానికి దోహదం కలిగించాయి ఈదేశాలలో కోట్ల ప్రజలు— ప్రపంచ జనాభాలో మూడోవంతు— ఉన్నారు వీరిని చూచి, ఇతర ప్రజాకోటి— దారిద్ర్యంలో మునిగి ఆకలితో అలమటించేవారు— చైతన్యం పొందుతున్నారు చైనాను చూసి ఆసియా యావత్తు కదిలింది పశ్చిమ యూరపులో అశాంతి అలముకొంది

సామ్రాజ్యవాదం విచ్ఛిత్తిపొందటం వల్లా, శాంతి సమత్వాల శిబిరం బలపడటం వల్లా తమకు ప్రతిబంధకాలు హెచ్చాయన్న విషయం గుర్తించటం యిష్టంలేక వాల్‌స్ట్రీట్ గుత్తదార్లు ''పాశ్చాత్య జాగరికత'' ను కాపాడటానికి నడుములు విదిలించారు— ప్రపంచ ప్రజానీకంపై మూకయుద్ధం తలపెట్టారు ఈ ఉన్మాదకార్యక్రమాన్ని సాగించటానికి అమెరికా లోపల ఉండే ప్రతిపక్షాన్ని నిర్మూలించి ఫాసిజంలను నెలకొల్పాలి

వాల్‌స్ట్రీట్‌కు సాంస్కృతిక సేవ జేసే, ''తత్వవేత్తలూ'', పబ్లిసిటీ వాళ్ళూ, హాస్యగాళ్లూ చేయవలసిన పనేమిటంటే, ఈ కార్యక్రమాన్ని ఆమోదకరంగా చేయటం, అందులోని అంతర్వైరుధ్యాల మీద ఎవరిదృష్టీ పడకుండాచూడటం, ఈ కార్యక్రమం వెనువెంట ఉండే అమానుషత్వం నైతికంగా అవసర మైనట్టూ, చారిత్రకంగా తప్పనిసరి అయినట్టూ చిత్రించటమూనూ ప్రచారం జరిగేది యుద్ధంకోసమూ, ఫాసిజం కోసమూ గనక

ప్రజాసామాన్యం కోరే శాంతికీ, సూత్రాలకూ ఇది విరుద్ధంగా ఉండి తీరుతుంది

అందుచేత ప్రచారకులు ఆశయాలను గురించి అబద్ధాలు చెప్పాలి అవి అబద్ధాలని రుజావు కాగానే ఇంకా పెద్ద అబద్ధాలు చెప్పాలి ఇతర దేశాల వారి శాంతియుత ఆశయాలూ, విజయాలూ దుమ్మెత్తి పోయబడ్డాయి వారు తమ హక్కులను సమర్థించ యత్నించటమూ, ఎక్కువ జీతాలడగడమూ, హెచ్చు జీవిత సౌకర్యాలు కోరటమూ, భవిష్యత్తు శాంతియుతంగా ఉంటుందని హామీకోరటమూ ''ద్రోహం'' అని స్పష్టం చేయబడింది ''బూర్జువా ప్రజాతంత్రం'' లోని మంచి యావత్తూ నిరూపించబడింది దానిస్థానే యుద్ధోన్మాదమూ, జాత్యహంకారమూ వెలిశాయి

శాంతి కోసమూ, ప్రజాతంత్రం కోసమూ జరిగే పోరాటం కొరకు సాంస్కృతిక రంగాలలోతీవ్రమైన సంఘర్షణ అవసరం సామ్రాజ్యవాద ప్రచారకులు ప్రజలను మభ్యపెట్టటానికి చేసే యత్నాలను బట్టబయలు చేయాలి

భావ సంఘర్షణలో హాలీవుడ్ ప్రముఖ పాత్ర నిర్వహిస్తుంది అనేక రకాల సాంస్కృతిక శాఖలలో గోప్యంగా జరిగే ప్రచారం ఎలాంటిదో తెలుసుకోవాలంటే ఇటీవలి హాలీవుడ్ చిత్రాలు పరిశీలిస్తే తెలిసిపోతుంది (ఈ రచన జరిగినది 1952 నవంబరులో)

**హాలీవుడ్‌లో 'అనమెరికనులు'**

వర్గ వ్యవస్థలో సంస్కృతి యావత్తూ వర్గ స్వభావం కలిగి ఉంటుంది పాలక వర్గం విద్యమీదా, మతం మీదా, శాస్త్రం మీదా, కళల మీదా ఆధిపత్యం వహించి వాటిని అన్ని విధాలా తన ఆధిపత్యం కొనసాగించుకోవటానికి వినియోగించుకుంటుంది పరిపాలన నిర్వహించేదీ సాంస్కృతిక వ్యాపారం సాగించేదీ ఒకే వర్గం గనకనూ, ప్రత్యేకించి హాలీవుడ్ పరిశ్రమ నేరుగా వాల్‌స్ట్రీట్ గుత్తదార్ల అజమాయిషీ కింద ఉన్నది గనకనూ, ప్రభుత్వానికీ సాంస్కృతిక వ్యాపారస్తుల మధ్యా ఘర్షణ ఉండనవసరం లేదనుకుంటాం కాని ఇటీవల సినిమా పరిశ్రమలో ప్రభుత్వం హెచ్చుగా జోక్యం కలిగించుకోవటమూ , ఇందుకు సినిమా పరిశ్రమ నాయకులు అభ్యంతరం చెప్పటమూ, అధికారులు పరిశ్రమ తాలుకు చిత్ర నిర్మాణ విధానాలలోనూ అందులో జరిగే నియామకాలలోనూ మార్పులు చెయ్యాలని ఉత్తరువులు జారీ చెయ్యటమూ జరిగాయి

హాలీవుడ్‌పై రాజకీయ సెన్సార్ అమలు చెయ్యటానికి 'అనమెరికనుల' విచారణలు దీర్ఘంగా జరిగాయి ఈ విచారణల ఉద్దేశ్యం మళ్ళీ మళ్ళీ స్పష్టం చేయబడింది అనమెరికన్ కమిటీ అధ్యక్షుడు జె పార్నల్ థామస్ (ఈయన దరిమిలా దొంగగా పట్టుబడి ఖైదు శిక్ష పొందాడు) తన తొలి ప్రసంగంలో జన బాహుళ్యంపై సినిమాలకు గల అద్భుత ప్రభావం గురించి చెప్పాడు

అనమెరికన్ కమిటీ చేత ప్రోత్సహించబడిన కూట సాక్షులు సినిమాలలో కమ్యూనిస్టు భావాలు ప్రక్షిప్తమయాయని గట్టిగా చెప్పాడు జాక్ ఎల్ వార్నర్ అనుమానితులైన రచయితలను గురించి సాక్ష్యం చెబుతూ, '' కొన్ని సంభాషణలు ద్వర్థిగానూ, గూడార్థాలుగలవి గానూ ఉన్నాయనీ, వాటి అంతరార్థం తెలుసుకోవాలంటే హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో కొంత కాలంపాటు చదువుకోవాలనీ'' అన్నాడు వార్నర్ బ్రదర్స్ ఉపాధ్యక్షుడు తన సంస్థ నిర్మించే చిత్రాలలోని సంభాషణలు అర్థం చేసుకోలేకపోతే మనం జాలి పడవచ్చు ఆయన సహాయార్థం

అనమెరికన్ కమిటీ వారు '' కమ్యూనిస్టు ఆదర్శాన్ని'' కనీసం ఎనిమిది సార్లు నిర్వచించి, అది ధనికులను దుర్మార్గులుగా చిత్రించటమని తెలిపారు కాంగ్రెస్ సభ్యులను విమర్శించటమూ, సైన్యంలో నుంచి బర్తరపు అయినవాడు తన జీవితంతో సంతృప్తి చెందనట్టు చూపటమూ కూడా కమ్యూనిజమేనని వారు ఉద్ఘాటించారు

1951లో జరిగిన విచారణలలో సినిమా చిత్రాల ఇతివృత్తాలను గురించి కమిటీ వారు ప్రత్యేక శ్రద్ధ కనబరిచారు ఇతివృత్తాలపైన కమ్యూనిస్టుల ప్రభావం ఉన్నట్టు తనకు నమ్మకంలేదని ఒక దర్శకుడు అంటే, సినిమా రంగంలో జొరబడమని 1925లోనే కమ్యూనిస్ట్ ఇంటర్నేషనల్ వారు అమెరికన్ కమ్యూనిస్టులను ఆదేశించారనీ, ఆనాటి నుంచీ సినిమా చిత్రాలపై వారి ప్రభావం ఉన్నదనీ ఫ్రాంక్ ఎల్ టావెనర్ జూనియర్ నొక్కివక్కాణించాడు ఇటువంటి వెర్రి ఆపాదనలను బలపరచటానికి కొందరు కూట సాక్షులు తోడ్పడ్డారు

భావ ప్రపంచంలో ఒక బలమైన కుట్ర ఉన్నదని '' నిరూపించటమూ'', శాంతి అభ్యుదయ ప్రజా తంత్రాలను సమర్థించటం ''నేరంగా'' చెయ్యటమూ ఈ కమిటీ విచారణల ఆశయం ఇది చాలా అపాయకరమనీ, అక్రమమనీ 1947లోనే రచయితల సంఘం వారన్నారు

ఇలాటి ఆశయంతో పనిచెయ్యటం వల్లనే ఈ కమిటీ విచారణలు ఏళ్ల తరబడి సాగాయి ఒక వంక కమిటీ విచారణల సహాయమూ, రెండో వంక ప్రచారం ఊదరా లేకపోతే సినిమా కంపెనీలు ప్రజా స్వామ్యాల మీదా ఇంత తీవ్రమైన దాడి చెయ్యటం సాధ్యమై ఉండేది కాదు ప్రభుత్వ అధికారంతో రాజ్యాంగంలో ఉదహరించిన ప్రజా స్వామ్యాలను నిర్మూలించటం ఒక ఫాసిస్టు చర్య దీని ద్వారా పెట్టుబడిదారీ దుష్ట శక్తులు విజృంభించటానికీ, ప్రభుత్వం బహిరంగంగా జోక్యం కలిగించుకుని అమానుషమైన దౌర్జన్య విధానాలను అమలు చేయటానికి దారి ఏర్పడుతుంది

అనమెరికన్ కమిటీకీ , చిత్ర నిర్మాతలకూ మధ్య ఉన్న దాన్ని సఖ్యత అనటానికీ లేదు, సంఘర్షణ అనటానికీ లేదు కమిటీవారి రాజకీయ వైఖరితో చిత్ర నిర్మాతలు ఏకీభవిస్తారు కాని ఆవిధానం వల్ల తమ వ్యాపారానికి దెబ్బ తగలటం వారిని ఆందోళనపరుస్తుంది రాజకీయ కారణాల మూలాన తమ కింద పనిచేసే వారిని బర్తరఫు చేసే అవకాశం సినిమా కంపెనీల వారికి ఆమోదకరమే, అందువల్ల ట్రేడ్ యూనియనిస్టులలో బలవంతులను తొలగించి, ట్రేడ్ యూనియనులను నిర్వీర్యం చేయవచ్చు కాని ఈ అవకాశం యిచ్చే పంథాలో కమిటీ వారు అనేక వందల మంది నటులను కంపెనీలకు లేకుండా చేసి చిత్ర నిర్మాణాన్ని తారుమారు చేశారు

విచారణల వల్ల జరిగిన పబ్లిసిటీ సినిమా కంపెనీలకు హానికరమయింది వారు తమ పబ్లిసిటీని అతి జాగ్రత్తగా చేసుకుంటారు రాజకీయమైన సెన్సారు హాలీవుడ్‌కు నష్టదాయకం అందుచేత చిత్ర నిర్మాతలు తమ చిత్రాలలో విచ్ఛిన్నకరమైన భావాలున్నాయనే మతిమాలిన ఆపాదనను ప్రతిఘటించారు

కమిటీ చేయబూనుకున్న పనిలో చిత్రాలలోని విషయాన్ని విమర్శించటం అత్యంత ప్రాధాన్యత గలది అందుచేత అందులోనే ఎక్కువ అంతర్వైరుధ్యాలు ఏర్పడ్డాయి ఒక వంక దాని వల్ల స్వేచ్ఛా వ్యాపార సూత్రం భగ్నమై ఆరితేరిన నిర్మాతల అభిప్రాయాలస్థానే అజ్ఞానులైన రాజకీయ వేత్తల అభిప్రాయాలకు అగ్రస్థానం ఏర్పడింది మరొక వంక చిత్ర నిర్మాతలు తమ

ఇతివృత్తాలు యుద్ధోన్మాదానికీ, ప్రజాస్వామ్యాల ప్రతిఘటనకూ అనుకూలంగా మార్చుకోవాలంటే కమిటీవారి రాజకీయ జోక్యం విధిగా కావలసివచ్చింది

అభ్యుదయ నిరోధక చిత్రాలు తీయటం హాలీవుడ్ వారికొక సమస్య కానే కాదు పాతిక సంవత్సరాలుగా సామ్రాజ్యవాదంతో బాటే సినిమా పరిశ్రమ అభివృద్ధిచెంది గుత్తదార్లకు అనుకూలంగా ఉండే ''సంస్కృతి''నే ఈ పరిశ్రమ కూడా అనుసరించింది యుద్ధానికీ, దురాక్రమణకూ, శ్వేత జాతుల ఆధిపత్యానికీ, వలస ప్రజలపై పెత్తనానికీ అనుకూలంగా ప్రచారం చేస్తూ 1898 (''టేరింగ్ డౌన్ ది స్పానిష్ ఫ్లాగ్'') నుంచీ చిత్రాలు వెలువడుతూనే ఉన్నాయి

అయితే ఈ కాలంలో బూర్జువా విధానాలు మారాయి సాంఘిక, ఆర్థిక శక్తులలో మార్పులు జరిగాయి ఈ మార్పులను సినిమా చిత్రాలు ప్రతిబింబించాయి రూజ్ వెల్ట్ హయాంలో కలిగినఅద్భుత ప్రజా చైతన్యాన్నీ, పురోగమనాన్ని సినిమా చిత్రాలు కొంత వరకైనా చిత్రించాయి

రెండవ ప్రపంచ యుద్ధం అనంతరం అమెరికా ప్రపంచాధిపత్యానికి పథకం వెయ్యగానే సాంస్కృతిక భావాలలో ఆకస్మికమైన పరివర్తన అవసరమయింది సోవియట్ యూనియన్ పట్ల అమెరికా వైఖరి ఒక్క క్షణంలో పూర్తిగా మారిపోయింది యుద్ధంలో ఆ దేశం చేసిన మహత్తర త్యాగాలు తుడిచిపెట్టుకు పోయాయి మన శత్రువులను ఓడించటంలో యావచ్ఛక్తిని ధారపోసిన సోవియట్ ప్రజలు ''శత్రువు'' లయారు

ఇలాంటి మార్పులే సాంఘిక, రాజకీయ రంగాలలోకూడా జరిగాయి ప్రచ్ఛన్న యుద్ధం ప్రత్యక్ష యుద్ధమయ్యే వేళకు దేశీయ రంగంలో విమర్శనలుండరాదు, ప్రశాంతత ఉండాలి రూజావెల్ట్ కాలంలో శ్రామిక వర్గం సాధించిన లాభాలను నిర్మూలించకుండా, ప్రజలలో పెరిగిన చైతన్యాన్ని నాశనంచెయ్యకుండా ఇది సాధ్యం కాదు ఇందుకుగాను వీటికి ఆధారభూతంగా ఉన్న ''భావాలను'' నాశనం చెయ్యాలి

హాలీవుడ్‌ను ఈ మార్పుకు అనుగుణంగా సంఘటితం చెయ్యటానికిగాను 1945,1946 సంవత్సరాలలో ఇక్కడి ట్రేడ్ యూనియన్‌లపై దాడి జరిగింది కాని సినిమా చిత్రాలలోని ఇతివృత్తాలలో మార్పు పాలక వర్గాలు కోరినంత వేగంగా జరగలేదు సినిమా ప్రేక్షకుల అభిరుచులనూ, అలవాట్లనూ ఒక్కసారిగా మార్చటం చిత్ర నిర్మాతలకు సాధ్యం కాదు విచారణలు జరగక పూర్వమే ఈనాటి చిత్రాలు విడుదల అయి ఉంటే ఏం జరిగేదో మనం ఊహించవచ్చు నాజీ జనరల్ (రోమెల్) ను చిత్రించే ''దిడిజర్ట్ ఫాక్స్'' చిత్రంగాని, స్త్రీలనూ, పిల్లలనూ ఆ కారణంగా హత్య చెయ్యటాన్ని చిత్రించే ''వన్ మినిట్ టు జీరో'' చిత్రంగాని 1947లో విడుదల అయి ఉంటే ప్రజలు ఆగ్రహావేశం చెంది ఉండేవారే

ఇవాళ ఈ చిత్రాలను ప్రజలు భరిస్తున్నారు, సహిస్తున్నారు ఇందుకు అనమెరికన్ కమిటీవారు తమను తాము శ్లాఘించుకోవచ్చు

### వర్గ సమాజంలో సినిమా

సాంఘిక ఆర్థిక వ్యవస్థ పునాదిగా పెట్టుకుని సాంస్కృతిక భావాలూ, సంస్థలూ వెలుస్తాయని కార్ల్ మార్క్స్ చెప్పాడు అన్నిరకాల ప్రచారమూ, కళలూ, శాస్త్రాలూ, భావాలూ తమ క్షేమానికి అనుకూలంగా ఉండేటట్టు బూర్జువా వర్గం చూసుకుంటుంది అయితే

అనేకమంది మేధావులు సంస్కృతి గురించి భ్రమలు కలిగి ఉంటారు తమ సృష్టి కేవలం కళకే అంకితమయిందని వారి ఉద్దేశం సాంఘికంగా, రాజకీయంగా అభ్యుదయ భావాలు కలవారు సయితం ఈ భ్రమలను ఆశ్రయించి ఉత్పన్నమైన కళారూపాలను ఆరాధిస్తారు

వర్గ వ్యవస్థలో కూడా కళ " స్వతంత్రంగా" ఉంటుందన్న విశ్వాసం సాంస్కృతిక జీవులకు నచ్చుతుంది ఈ భ్రమకు గురిఅయే కళాకారులు తమ మనోభావాలకూ, కృషికీ బాధ్యతలను పూర్తిగా తోసివేసి తమ సృష్టిలో వర్గలక్షణాలను కనబడకుండా చేయగలుగుతున్నారు ప్రభుత్వం సాంస్కృతిక కార్యకలాపాలపైన వత్తిడి తెచ్చి, మేధావులు తమ చెప్పు చేతలలో లేనట్టయితే వారిని వృత్తుల నుంచి తొలగించి ఖైదు కూడా చేస్తామని బెదిరిస్తున్నది ఈ పరిస్థితిలో కళాకారులు సంఘర్షణకు సాధ్యమైనంత దూరంగా ఉండి తమ బాధ్యతలను సాధ్యమైనంత తక్కువగా ఉండే లాగా చేసుకుంటున్నారు

ఈ పరిస్థితిలో సినిమాలు ప్రజాస్వామిక సంస్కృతికి ప్రాతినిధ్యం వహిస్తున్నాయన్న సిద్ధాంతం అమలులో ఉండటంలో ఆశ్చర్యంలేదు ఏమంటే వర్గ సంస్కృతిలో సినిమాల పాత్ర చాలా ప్రముఖంగా ఉంటున్నది దాన్ని పాలకవర్గం శ్రద్ధగా వినియోగించుకుంటున్నది పాలకవర్గం ఒత్తిడి దీనిపై ఉంటున్నట్టు మరే రంగంలోనూ లేదు ఇదే సమయంలో మార్పును నిరోధించేవారు హాలీవుడ్ చిత్రాలు కల్తీలేని వినోదాన్ని యిస్తాయని ప్రచారం చేస్తున్నారు ఇతి వృత్తాలు కేవలం ప్రజల అభిరుచులను బట్టే నిర్ణయమవుతున్నాయనీ, సినిమా చిత్రాలలో వెలువడే వినోదానికి అంతిమ నిర్ణాయకులు ప్రజలేనని కూడా చెబుతున్నారు

సంస్కృతి నిర్వహించే పాత్రను మార్క్సిస్టు దృక్పథంతో హాలీవుడ్ చిత్రాలను విమర్శించే వి జె జిరోం, "హాలీవుడ్ చిత్రాలలో నీగ్రో" అన్న కరపత్రం ప్రచురించాడు "హోమ్ ఆఫ్ ది బ్రేవ్", " లాస్ట్ బౌండరీస్ ", " పింకీ" , " ఇన్‌ట్రూడర్ ఇన్ ది డస్ట్" చిత్రాలు నీగ్రో ప్రాముఖ్యంతో కూడినవి ఈ చిత్రాలను ఆయన సునిశితంగా పరిశీలన చేసి, హాలీవుడ్ చిత్రాలు గుత్తదార్ల లాభాలు అపారంగా చేసుకోవటానికే గాక ఆకట్టుకోవటానికి ఎలా ఉపకరిస్తాయో చూపాడు

సినిమా ఒక విక్రయ వస్తువనీ, లాభాలు తప్ప నిర్మాతలకు ఇంకొక ఆశయం ఉండదనీ అనుకోవటం పాక్షిక దృష్టి అంటాడు జిరోం సినిమా ప్రచార సాధనం కూడా వాల్ స్ట్రీట్ వాళ్ళకు లాభాలు అక్కర్లేదని కాదు ఇది గుత్త వ్యాపారం, అందుచేత లాభాలు ఎక్కడికీ పోవు ఇందులో వ్యాపార పోటీ బహుకొద్ది పెద్ద నిర్మాతలు చిన్న నిర్మాతలను పిండెయ్యగలరు ప్రేక్షకులు తమకు కావలసినటువంటి చిత్రాలు చూడకుండా చెయ్యగలరు

పైన చెప్పిన నాలుగు చిత్రాలలోనూ హాలీవుడ్ నీగ్రో సమస్య విషయంలో కొత్త పంథా తొక్కిన మాట నిజమే చప్పున చూడటానికీ మార్పు విప్లవ పరిణామంలాగా కనబడుతుంది ఈ నాలుగు చిత్రాలలోనూ ప్రధాన పాత్రలు నీగ్రోలు నీగ్రోల ఉద్యమం ఒక వంక గుర్తించబడుతూ, రెండో వంక తెల్లవాళ్ల ఆధిపత్యాన్ని స్థిరపరుచుకునేటందుకు భావబీజాలు వీటిలో ప్రవేశపెట్టబడ్డాయి ఈ చిత్రాలు నీగ్రో ఉద్యమాన్ని బలపరుస్తున్నట్టు కనబడుతూ కనబడకుండా అందులో గోతులు తవ్వుతున్నాయి నీగ్రోలకూ తెల్లవాళ్ళకూ మధ్య ఉండే విభేదాలు మరింత చేస్తున్నాయి వీటిలో తెల్లవాళ్ల దృక్పథమే ఉన్నది నీగ్రో హింసలు "నైతిక "

సమస్యగా చిత్రించబడ్డాయి నీగ్రోలను తెల్లవాళ్లు ''అదృష్టహీనులు'' గా భావించి, వారి పట్ల ''సహనం'' వహించాలని ఈ చిత్రాలు బోధిస్తాయి నీగ్రో ఉద్యమం యొక్క వాస్తవ స్వరూపం మరుగుపరచబడింది ఇటువంటి చిత్రాలను సరిగా విమర్శించి కుళ్ళు బయట పెట్టినట్టయితే హాలీవుడ్ చిత్రాలు నీగ్రో ఉద్యమానికి మరింత తల ఒగ్గవలసి రాక తప్పదు

''సినిమాలు అభ్యుదయ స్వభావం గలవి'', ''అవి అభ్యుదయ దృక్పథంలో పురోగమించటానికి అవసరమైన శక్తులు వాటిలోనే ఉన్నాయి'' అనే సిద్ధాంతాలను జీరోం ఖండించాడు ప్రజల ఆధిపత్యం కింద ఉండి, ప్రజా శ్రేయస్సుకు పనిచేసినప్పుడే సినిమా చిత్రాలు ప్రజా కళగాశక్తి చూపగలవు కాని పెట్టుబడిదారీ విధానం కింద సినిమాలు ప్రజల పరమయ్యే అవకాశం లేదు

హాలీవుడ్ చిత్రాలు ప్రజాబాహుళ్యం కోసం తయారవుతాయే గాని వాటిలోని రాజకీయ సందేశం వేరు ప్రజల అభిరుచి మూలాన సినిమాలు ప్రజాకళ కావటానికి మారుగా ప్రజలకు ఎరగా ఉపయోగపడుతున్నాయని జిరోం నిరూపించాడు

సినిమాల భవిష్యత్తును గురించి మాక్సిం గోర్కీ 1896లో ఇలా రాశాడు

''జ్ఞానాన్ని అభివృద్ధి పరచి, మానవుడు సమగ్రం కావటానికి తోడ్పడటానికి బదులు (సినిమా) నీజ్ని నొవొగొరోసంతకు (వాల్ స్ట్రీట్ అని కూడా చదువుకోవచ్చు— అనువాదకుడు) దాస్యం చేస్తూ వ్యభిచారాన్ని ప్రచారం చేస్తుంది ప్రపంచంలో ఎంత గొప్ప దాన్నయినా, అందమైన దాన్నయినా మానవుడు కలుషితం జేయగలడు ఒకప్పుడు కళలూ ఆదర్శాలూ వెలిసిన మేఘమండలంలో ప్రకటనలు అంటిస్తున్నారు ''

గోర్కీ ఏనాడో చెప్పిన ఈ మాటలు జోస్యంలాగా అక్షరాల రుజువయాయన్న విషయం కూడా గుర్తించబడింది '' డెయిలీ పీపుల్స్ వరల్డు'' పత్రిక సినిమా విలేఖరి కొంతమంది సినిమాలను గురించి ఏమీ తెలియకుండా దానిపై అభాండాలు వేస్తారని చూపటానికి గోర్కీ వాక్యాలు ఉదహరించాడు!

''హాలీవుడ్ ఫిలిం కార్ఖానాల చెత్త పోగులలో యివాళ కళాకారుడు పట్టగల సృజనాత్మక ఆయుధం ఒకటి ఉన్నట్టు లేశమైనా సాక్ష్యం ఉన్నదా? ఆయుధమైతే ఉన్నది— కాని అది సృజనాత్మకమూ కాదు, అది కళాకారుడి చేతిలోనూ లేదు అది విధ్వంసకరమైనది, గుత్తదార్ల చేతిలో ఉన్నది,'' అంటాడు జిరోం

*అభ్యుదయ, మాసపత్రిక, జనవరి 1958*

# 69. హాలీవుడ్ చిత్రాలలో సంఘ చిత్రణ

గత అయిదు సంవత్సరాలుగా హాలీవుడ్ చిత్రాలలో సెక్సుకూ, హత్యలకూ సంబంధించిన ఇతి వృత్తాలు హెచ్చుగా ఉంటున్నాయి టెలివిజన్‌లోనూ, పుస్తకాలలోనూ, పత్రికలలోనూ, కామిక్ స్ట్రిప్‌లలోనూ ఇదే ధోరణి కనబడుతుంది బూతులతోనూ, బంది పోటులతోనూ నిండిన ఇవి అమెరికాను సరిగా ప్రతిబింబించవు కాని ప్రజల నైతిక భావాలను ''మొద్దు పరచటానికి'' తోడ్పడతాయి మొదట సెక్సుగానూ, హత్యలుగానూ ప్రారంభమయినది క్రమంగా యుద్ధ ప్రచారంగా పరిణమించింది

సైనికుడుగామారే బందిపోటు

1942లో తీసిన 'వైట్ హీట్'' అన్న చిత్రంలో హత్యలు కేవలం చిత్రంగా వినోదంగా చిత్రించ బడ్డాయి ఇందులో జేమ్స్ వాగ్నీ ఒక ఉన్మాద హంతకుడి పాత్ర ధరించి అర డజనుకు పైగా హత్యలు చేస్తాడు ఈ హత్యలకు కారణమంటూ లేదు ''కిస్ ఆఫ్ డెత్'' కూడా ఇలాంటి చిత్రమే

''వైట్ హీట్'' చిత్రంలో ''అరణ్య న్యాయం (లా ఆఫ్ ది జంగిల్) ఒక జీవిత విధానంగా చిత్రించబడింది దాన్ని అవలంబించని వ్యక్తి అడుగున పడిపోతాడు అందులోని కథానాయకుడు ''ఆత్మ రక్షణ'' చేసుకోగల ''ధీరుడు'' గా చిత్రించబడ్డాడు

మనిషి ఒక వన్యమృగం! సాంఘిక సహనమంటూ ఏమీలేదు! మనిషిలో ఉండే ఈ క్రౌర్యం క్రమ శిక్షణకు లొంగి, యుద్ధావసరాలకు వినియోగపడినప్పుడు ''పవిత్రమూ'', ''ఉదాత్తమూ'' అవుతుంది

నాజీ సిద్ధాంతం ప్రకారం ''తక్కువ వర్గం'' వారు, '' ఉన్నత వర్గం'' వారి ఆజ్ఞలను శిరసావహించి యుద్ధానికి ఆయత్తం కావటం వారి ఉత్తమ ధర్మం ఈ ధర్మం ''ట్వెల్వ్ ఓ క్లాక్'' (1949)లో వివరించబడింది ఈ చిత్రంలోని కథానాయకుడికీ, ''వైట్ హీట్''లోని ఉన్మాద హంతకుడికీ హస్తి మశకాంతరం ఉన్నట్టు కనిపిస్తుంది కాని ఇద్దరిదీ క్రౌర్యమే ఇందులో నాయకుడు ఒక వైమానిక శాఖాధికారి తన మనుష్యులను చావమనీ, చచ్చేముందు వీలయినంత విధ్వంసం చెయ్యమనీ ఉద్బోధిస్తాడు యుద్ధ ప్రయోజనాల ప్రసక్తి ఏమీలేదు చావటమో, చంపటమో తప్ప మనిషికి మూడోమార్గం లేదు

ఈ చిత్రాన్ని తీసిన 20 సెంచరీ ఫాక్స్ వారే రెండేళ్ళ అనంతరం ''డెజర్ట్ ఫాక్స్'' అనే చిత్రం తీశారు ఇందులో నాయకుడు నాజీ జనరల్ రోయెల్ ఈ చిత్రం చూసి ప్రపంచం నిర్ఘాంత పోయింది ఈ చిత్రం హిట్లరును ఖండించినప్పటికీ మనిషి ప్రస్తుతం హంతకుడనీ, హత్యలు చేయాలన్న ప్రేరణ ఉన్నత వర్గాల చెప్పుచేతలలో ఉండాలని చెబుతుంది హిట్లరు హంతకుడే గాని, తనను నియోగించిన వర్గం చెప్పుచేతల్లో ఉండక విజృభించాడు యుద్ధం ద్వారా కమ్యూనిజమును నిగ్రహించదలచిన '' మంచి'' నాజీలకు, ఈ వెర్రివాడికీ తేడా ఉన్నది

ఈ చిత్రంలో రోమెల్ గొప్ప యుద్ధ నిపుణుడుగానేగాక ఆదర్శప్రాయుడైన మధ్య తరగతి గృహస్థుగాకూడా చిత్రించబడ్డాడు అతనికి భార్య మీదా, కొడుకు మీదా వల్ల మాలిన ప్రేమ 60లక్షల మంది యూదులను చంపిన ఈ రోమెల్ పైనా, ఇతని మిత్రులపైనా ప్రేక్షకులకు సానుభూతి కలిగించటానికి ప్రయత్నం జరిగింది వీరు తమ వర్గక్షేమం వాల్‌స్ట్రీట్‌తో ముడిపడి ఉన్నదని తెలిసిన దాకా హిట్లరునే నమ్మారు యుద్ధం చిత్రించటంలో పదేళ్ళలో జరిగిన పరివర్తన గమనించదగినది ''న్యూయార్క్ టైమ్స్ (1951 అక్టోబరు 28 సంచిక) లో క్రౌథర్ రాస్తూ, '' డెజెర్ట్ విక్టర్'' చిత్రానికీ ''డెజెర్ట్ ఫాక్స్''కూ మధ్య నిండా తొమ్మిదేళ్ళ వ్యవధికూడా లేదన్న విషయం చాలా ఆశ్చర్యం కలిగిస్తుందన్నాడు ''ఆనాటి నైతిక నిర్ణయాలు ఇప్పుడెలా తారుమారయాయి''? అని ఆయన ఆశ్చర్యం వెలిబుచ్చాడు

ఈమార్పుకు బీజాలు 1941–1945 మధ్య వెలువడిన చిత్రాలలోనే ఉన్నాయి ఫాసిస్టు వ్యతిరేక సంగ్రామంలో అమెరికా పరిపాలకుల ఆశయాలేవో ఈ చిత్రాలలో వాస్తవంగానే

చిత్రించబడింది జర్మనీ, జపానూ ఓడి తీరాలి కాని రాజకీయ యుద్ధతంత్ర విధానాలు సామ్రాజ్య వాదాన్నిబలపరుస్తూ, సోవియట్ యూనియన్‌తో పరిమితమైన సహకారం అవలంబించి, శాశ్వత శాంతికి అనుకూలించే అంశాలను భగ్నపరచాలి

అయితే ఈ ఫాసిస్టు వ్యతిరేక యుద్ధమూ, యుద్ధానంతర కాలంలో అంతర్జాతీయ సామరస్యానికి ఏర్పడిన అవకాశాలూ అమెరికా ప్రజలకు అవగాహన అయాయి ఈ మార్పును ప్రతిబింబించే చిత్రాలను కొద్ది సంఖ్యలో హాలీవుడ్ తయారు చేసింది కాని హెచ్చు చిత్రాలలో మార్పు ఏమీ లేదు

రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో వెలువడిన చిత్రాలకూ, కొరియా యుద్ధాన్ని చిత్రించిన నాటికీ ఏమీ పోలిక లేదు కొరియా యుద్ధం ఆరంభదశలోనే శామ్యూల్ ఫుల్లర్ ''ది స్టీల్ హెల్మెట్'' అనే చిత్రాన్ని తయారు చేశాడు ఇందులో ఒక ఉత్తర కొరియను మేజర్ పట్టుబడతాడు యుద్ధ ప్రయోజనం గురించి చర్చ జరుగుతుంది పట్టుబడిన జనరల్ కమ్యూనిస్టు కావటం చేత అమెరికాలో నీగ్రోల నీచ స్థితి గురించి ప్రస్తావించుతాడు దానికి సమాధానంగా నీగ్రో సైనికుడు అభివృద్ధి రావటానికి కాలం పడుతుందనీ, మరొక ఇరవై ఏళ్ళకు నీగ్రోల స్థితి ఇంకా మెరుగుగా ఉండవచ్చుననీ అంటాడు ఈ చిత్రంలో, యుద్ధకాలపు చిత్రంలోలాగా సౌభ్రాతృత్వం గురించీ, మానవ హక్కులను గురించీ మాట్లాడే అవకాశం లేదు చిట్టచివరకు పట్టుబడిన జనరల్‌ను ఉన్నపాటునే కాల్చి చంపేస్తారు ఈముగింపుతో హాలీవుడ్ చరిత్రలో ఒక అధ్యాయం ముగిసింది మానవుల ఆశయాలను గురించీ, జాతీయ, సాంఘిక ఆదర్శాల గురించీ ఇక చర్చలుండవు ''ఉన్మాద హంతకులకు'' కొరియా యుద్ధరంగంలో పని దొరికింది వారి ఉన్మాదం దేశాభిమానమై కూర్చున్నది!

శామ్ ఫుల్లర్ తిరిగి 1951లో ''ఫిక్స్‌డ్ బాయొనెట్స్'' తీశాడు చంపటమంటే ఇష్టంలేని ఒక యువకుడి పరివర్తన ఈ చిత్రంలో చిత్రించబడింది

యుద్ధ హంతకుడు ప్రజా సామాన్యాన్ని కూడా చంపటానికి సంసిద్ధుడై ఉండాలి అందుచేత ''వన్ మినిట్ టు జీరో'' లో ఒక కర్నల్ కొరియన్ శరణార్థులైన స్త్రీలూ, పిల్లలూ బార్లు తీరి వస్తుంటే కమ్యూనిస్టులు ఆ బారులలో చొరబడ్డారని, వారిని నిర్మూలించటానికి ఉత్తరువిస్తాడు ఈ దారుణ హత్యాకాండను చిత్రించి హాలీవుడ్ వారు హిట్లరు అవలంబించిన అకారణ హత్యా కాండలను తొలిసారిగా బలపరిచారు

ఈ విధానమే ''థండర్ ఇన్ ది ఈస్ట్'' లో మరి కొంచెం ముందుకు పోయింది గాంధేయ అహింసావాది అయిన భారతీయుడొకడు నాజీ హంతక విధానానికి పరివర్తనం పొందటం చిత్రించబడింది చిత్రం ఆఖరులో ఈ మాజీ అహింసావాది, ముందుకు వచ్చే ''విప్లవవాదుల'' గుంపు మీద మర తుపాకితో కాలుస్తాడు ఆఖరు దృశ్యంలో ఈ కాల్పులు ప్రేక్షకులపై జరుగుతున్నట్టు చూపబడింది నిజానికి ప్రేక్షకులే అసలు గురి ఈ అమానుష ప్రచారమంతా వారి విధ్వంసనానికే!

## హాలీవుడ్ చరిత్ర చిత్రణ

''ది రెడ్ బాడ్జ్ ఆఫ్ కరేజ్'' అనే చిత్రం విడుదల చేసేటప్పుడు పబ్లిసిటీలో దీనిని ''బర్త్ ఆఫ్ ఎ నేషన్'' తోనూ, ''గాన్ విత్ ది విండ్'' తోనూ పోల్చారు ఈ రెండు చిత్రాలూ బాగా

డబ్బు గడించినవి కావటమే గాక, చరిత్రను చిత్రించటంలో మూడింటికీ పోలిక ఉన్నది

''రెడ్ బాడ్జ్'' లోని ఇతివృత్తం కొరియను చిత్రాలలాటిదే — హంతకులను తయారు చేయటం కొత్తగా చేరిన యువక సైనికుడు మొదట భయకంపితుడై తరవాత యుద్ధంలో అసాధారణ సాహసం ప్రదర్శిస్తాడు తాత్కాలికంగా ''క్రోధోన్మత్తత'' వాణ్ణి ఆవహించి శత్రు నాశనం చెయ్య ప్రేరేపిస్తుంది తరవాత మళ్లీ వాడు మామూలు మనిషి అవుతాడు

ఇది అమెరికన్ అంతర్యుద్ధానికి సంబంధించిన చిత్రమైనా ఈ ఇతివృత్తంగల చిత్రాలలో ఉండే కొన్ని అంశాలు— నీగ్రోలను హేయంగా చూపటమూ, బానిసత్వాన్ని బలపరిచే వారిని పైకెత్తటమూ, తెల్లవాడి గొప్పతనాన్ని ఉద్ఘాటించటమూ– ఇందులో లేవు

అయినప్పటికీ ఈ చిత్రంలో ఈనాటి యుద్ధ కాముకులకు కావలసినటువంటి చరిత్ర చిత్రణ ఉన్నది అంతర్యుద్ధ కథలో హంతకుల తయారీని ప్రవేశపెట్టి, అమెరికన్ సమాఖ్యను కాపాడటానికి జరిగిన యుద్ధం కూడా కొరియా యుద్ధంలాగే మూర్ఖమైనదన్నట్టు నిర్మాతలు వ్యక్తం చేశారు

ఈ విధంగా చరిత్రను తారుమారు చేయటంలో రెండు అశయాలున్నాయి (1) ప్రజా స్వామ్యాన్ని భగ్నం చేయటం, (2) కొరియా యుద్ధం ఇతర యుద్ధాల లాంటిదేనని చూపటం

ఈ చిత్రంలో ఒక్క యువకుడి అనుభవమే, అదికూడా ఆనాటి వాతావరణానికి సంబంధం లేకుండా చిత్రించబడింది ఆ యువకుడికి యుద్ధ కారణాలను గురించిన జ్ఞానం లేదు వాడు చరిత్ర చేతిలోని కీలుబొమ్మ ఈ చిత్రంలో వచ్చే సైనికులకు కూడా రాజకీయ జ్ఞానం శూన్యమే వారికి ఆఖరుకు పేర్లు కూడా లేవు ఒకడు ''యువకుడు'' ఇంకొకడు ''పొడుగుపాటివాడు''

ఈ సైనికుల చుట్టూ ఉన్న వాస్తవ విషయం చావు, రక్తపాతం మాత్రమే ఉత్తర రాష్ట్ర సైనికులు యుద్ధంలోకి రావటానికి కారణాలు లేవనీ, యుద్ధ కారణాలు వారికి తెలియవనీ సూచించటానికే ఇలాంటి చిత్రణ జరిగింది నీగ్రోల స్వాతంత్ర్యోద్యమమూ, ఫ్రెడరిక్ డగ్లస్, జాన్ బ్రౌన్ మొదలైన వారి నాయకత్వమూ, ప్రజా సంఘటన ద్వారా బానిసత్వ నిర్మూలన ప్రకటన మొదలైన వాటితో సంబంధం లేనట్టుగా ఈ అంతర్యుద్ధం చిత్రించబడింది ఈ చిత్రంలో ఉన్న ఒకే ఒక అంశమేమిటంటే ఒక వ్యక్తి తన పిరికి తనాన్ని ''హత్యాకాంక్ష'' తో జయించటం!

ఈ చిత్రంలో నీగ్రో యజమానులు గొప్పవారుగా చిత్రించబడకపోయినా, వారిపట్ల ప్రేక్షకులకు సానుభూతి కలిగే అంశాలు చూపబడ్డాయి చిత్రం ఆరంభంలోనే కథానాయకుడు వెన్నెలలో ఒక నది సమీపంలో నడుస్తూండగా, నది అవతల ఒడ్డునుంచి ఒక గొంతు అతన్ని వెనకకు వెళ్లిపొమ్మని హెచ్చరిస్తుంది అంతేగాని ''ఆ నిహితశత్రువు'' అతనిపై కాల్చడు

ఉత్తర రాష్ట్రాలకు విజయం చేకూరినాక కూడా చిత్రం ఆఖరులో ఉభయపక్షాల జెండాలూ, ''ప్రమాదవశాన'' ఒకదాని పక్కన ఒకటి నడవటం చూపబడింది

ఈ చిత్రంలో నీగ్రో పాత్రలు లేవు! దానికి మాతృక అయిన స్టీఫెన్ క్రేన్ నవలలో కూడా నీగ్రో పాత్రలు లేవని నిర్మాతలు వాదించవచ్చుకాని ఈ చిత్రంలో యుద్ధదృశ్యాలు చూపిన ప్రాంతాలు హెచ్చుగా నీగ్రోలు నివసించేవి జాన్ హ్యూస్టన్ (చిత్ర దర్శకుడు) మొదట్లో వర్జీనియా, టెనెసీ రాష్ట్రాలలో షూటింగు జరుపుదామనుకున్నాడు ఈ రాష్ట్రాలలో నీగ్రోలు అంతర్యుద్ధానికి

గొప్పగా సహాయపడ్డారు అయితే ఈ చిత్రంలో నీగ్రో పాత్రలు కనిపించటానికి నిర్మాతలు ఒప్పుకోలేదు తెరమీద ఊరికే ఒక్క నీగ్రోముఖం కనిపించి ఉన్నట్టయితే ఇతి వృత్తం వెనక ఉన్న కారణాలు స్ఫురించి, దాని చిత్రణంలో జరిగిన మోసం వెంటనే బయటపడి ఉండేది

క్రేన్ నవలకూ, ఈ చిత్రానికీ అంతర్గతంగా ఒక సంబంధం ఉన్నది క్రేన్ ఈనవలను 1894లో, అమెరికా తన సామ్రాజ్యాన్ని విస్తరించనున్న కాలంలో రాశాడు ఆనాటి రాజకీయ వాతావరణం ఆయనకు భవితవ్యంలో విశ్వాసం లేకుండా చేసింది పెట్టుబడిదారీ ''స్వర్ణయుగం'' సాగటం వల్ల దక్షిణ రాష్ట్రాలలో తోటలు తిరిగి ప్రారంభమయాయి నీగ్రోలు తక్కువ జాతి వారనీ, విదేశీయులను ద్వేషించాలనీ, ఆంగ్లోసాగ్జనులు ఉత్తమజాతివారనీ, ప్రపంచంలోని నల్లజాతులపై అధికారం చలాయించటం అమెరికా జన్మహక్కనీ ప్రచారం జరిగింది

యువకుడైన క్రేన్ భవిష్యత్తును చూచి కంగారు పడ్డాడు ధనిక వర్గం వారి దుష్టశక్తి అజేయంగా ఆయనకు కనబడింది అందుచేత ఆయన రచనలలో నిస్పృహ, నిరాశలను ప్రతిబింబింప జేశాడు ఆయన తన 21వ ఏట '' మ్యాగీ'' అనే రచనలో మురికిపేటలలో వుండే నిరర్థక జీవితాన్నీ, నికృష్టమైన చావులనూ చిత్రించాడు

ఆ తరువాత గడచిన మూడేళ్ళలో జీవితం మరింత అశాంతికి గురైంది 1892లో బ్రహ్మాండమైన సమ్మెలు జరిగాయి 1893లో నిరుద్యోగం ప్రబలి జీవితం దుర్భరమయింది 1894లో పుల్మన్ సమ్మె దేశాన్నంతా కలవర పరచింది దక్షిణ రాష్ట్రాలలో కుక్లక్స్ క్లాన్ (నీగ్రోలను నిర్మూలించే సంస్థ) విజృంభించి, నీగ్రోలకూ తెల్ల రైతులకూ మధ్య పాప్యులిస్టు పార్టీ ద్వారా ఏర్పడిన ఐకమత్యాన్ని విచ్ఛిన్నం చేసింది పోల్ టాక్సు ద్వారా నీగ్రోలు వోటు చెయ్యటానికి అవాంతరాలు సృష్టించబడ్డాయి

ఈ వాతావరణంలో క్రేన్ ''ది రెడ్ బాడ్జ్ ఆఫ్ కరేజ్'' రాశాడు తాను చదివిన చరిత్ర దృష్ట్యా, తనచుట్టూ వున్న ఉద్రిక్త పరిస్థితుల ప్రభావానికి లోబడి ఆయన ఆ నవల రచించాడు ఒక వంక నీగ్రోల వేట ముమ్మరంగా సాగుతుండటం చూసి ఆయన తన నవలలో నీగ్రో పాత్రలను ప్రవేశపెట్టబూనాడు ఆయనకు అంతర్యుద్ధం వ్యర్థంగా కనబడింది 19వ శతాబ్దం చివరలో సామ్రాజ్యవాదుల మధ్య ఏర్పడిన పోటీలు ఆయనకు సరిగా అర్థం కాలేదు

ఈ నవలను చిత్రీకరించటంలో జాన్ హ్యూస్టన్ నిర్వహించిన పాత్ర పరిశీలించదగినది యుద్ధమంటేనూ, యుద్ధాలను పురికొల్పే శక్తులంటేనూ తనకు గల ద్వేషం మూలంగా హ్యూస్టన్ ఈనవల చేత ఆకర్షించబడ్డాడు చివరకు ఈ శక్తులే ఆయన ఆశయాలను ఓడించాయి

హ్యూస్టన్ ఈ నవలను చిత్రీకరించాలనుకున్నది మొదలు ఇది చిత్రంగా తయారై విడుదల అయే వరకూ నడిచిన కథను లిలియన్ రాస్ అనే ఆమె విపులంగా బయట పెట్టింది ఈ చిత్రానికి ప్రొడ్యూసరు రైన్ హార్ట్! స్టూడియో అధిపతి డోరీ షారీ స్టూడియో పెత్తనం కోసం ఎల్ బి మేయర్‌కూ డోరీ షారీకీ పెద్ద ఘర్షణ జరిగింది కాని ఈ కాట్ల కుక్కలకు నిజమైన యజమాని నికొలాస్ షెన్క్, కంపెనీ అధ్యక్షుడు ఆయన చివరకు షారీ పక్షం కావటానికి కారణం సినిమా చిత్రాలు ప్రచార సాధనాలుగా ఉండాలన్న నిశ్చయమే ఈ విషయంలో మేయర్‌కూ, షారీకి అభిప్రాయభేదాలు వచ్చాయి

మేయర్ సినిమా ఇతి వృత్తాల విషయంలోనూ, స్టూడియో ఉద్యోగులతో వ్యవహరించటం విషయంలోనూ చాలా కఠినుడు ఆయనను చూస్తే అందరికీ భయమూ, ద్వేషమునూ ఆయనకు ప్రజలంటే చాలా హీన భావం వారు వట్టి గొర్రెలనీ, వారి చేత ఏదైనా నమ్మించవచ్చుననీ ఆయన నమ్మకం కావలసినదల్లా గ్లామర్, సెంటిమెంట్!

ఎం జి ఎం స్టూడియోకు మేయర్ అధిపతిగా ఉన్న 26 ఏళ్ళ కాలంలోనూ ఆయన నమ్మకాలు బాగానే విజయం పొందాయి రెండవ ప్రపంచ యుద్ధకాలంలోకూడా ఆయన వాల్‌స్ట్రీట్‌కు చాలా ఉపయోగపడ్డాడు ఫాసిస్టు వ్యతిరేక పోరాటం తాలూకు వాస్తవాన్ని తరచకుండా ఆయన ప్రజలలో దేశాభిమానం రేకెత్తించే చిత్రాలు తీశాడు

కాని అమెరికన్ సామ్రాజ్య వాదంలో నేటి నూతన దశను ఆయన అవగాహన చేసుకోలేకపోయాడు ఆయన చిత్రాలకు రాబడి కూడా తగ్గసాగింది వాల్ స్ట్రీట్‌కు లాభాలు పెంచుకునే సమస్యతో పాటు, తమ యుద్ధ ప్రయత్నాలకు పబ్లిసిటీ జరిగే కొత్త మార్గాలను అన్వేషించే సమస్య కూడా ఎదురయింది హాలీవుడ్ చిత్రాలకు ఒక ''కొత్త వన్నె'' అవసరమయింది ఇందుకే షారీ హాలీవుడ్‌కు వచ్చాడు

మేయర్‌కు '' ఐడియా'' లంటే చిరాకు, ప్రజలు గొర్రెలని నమ్మకం ఆయనకు షారీ తెచ్చిన కృతక మేధావిత్వమూ కృత్రిమ ''విశాలదృష్టి'' నచ్చలేదు '' రెడ్ బాడ్జ్ '' చిత్రం మీద ఇద్దరికీ రంధి పడింది

యుద్ధంలో మనుషులు ఆహుతి కావటం వ్యర్థమని నిరూపించటానికి హ్యూస్టన్ ఈ చిత్రాన్ని తయారు చేశాడు హ్యూస్టన్ ఆశయం మేయర్‌ను కంగారు పెట్టింది యుద్ధానికి అనుకూలంగా ఆయన లోగడ చాలా చిత్రాలు విడుదల చేసి ఉన్నాడు హ్యూస్టన్ ఆశయం షారీని ఏ మాత్రమూ బాధించలేదు ఈ చిత్రం విలువ చరిత్రను తారు మారు చేయటంలోనే ఉన్నదని ఆయన యెరుగును. మేయర్ మాత్రం ఈ చిత్రం విడుదలను తీవ్రంగా ప్రతిఘటించాడు ఆయనను కంపెనీ నుంచి పంపించేసే దాకా చిత్రాన్ని విడుదల చేయటం సాధ్యం కాలేదు

హ్యూస్టన్ గత చరిత్రను గురించి తెలిసినవాడుకాడు, దాని అంతరార్థం వ్యక్తం కావాలని పట్టుదల కలవాడు కూడా కాడు చిత్రీకరణ విషయంలో స్టూడియో పెట్టిన నిబంధనలన్నింటినీ ఆయన ఆమోదించాడు చిత్రంలో యుద్ధం ఉత్తర దక్షిణ రాష్ట్రాల మధ్య జరిగినట్టు చిత్రించరాదు దాన్ని అంతర్యుద్ధమని పిలవరాదు అంతర్యుద్ధ కారణాల ప్రస్తావన వుండరాదు

ఈ నిబంధనలను ఆమోదించటం వల్ల హ్యూస్టన్ తన దృష్టిని పూర్తిగా యువకుడి అంతరంగిక భావ సంఘర్షణపై కేంద్రీకరించాడు వాడి ధైర్యం నిరుపయోగమన్నదే ప్రధాన విషయం ఇందుచేత కథలో పటుత్వం లేకుండా పోయింది

ఈ చిత్రం మొదటి సారి ''ప్రివ్యూ'' అయినప్పుడు ప్రేక్షకులు అసంతృప్తి చెందారు దానితో కొద్ది మార్పులు చేసి తిరిగి ''ప్రివ్యూ'' చేశారు కాని అది కూడా విఫలమే అయింది

ఈ స్థితిలో షారీ జోక్యం కలిగించుకొన్నాడు యువకుడి ప్రవర్తనను వివరించటానికి కామెంటరీ కథనం రూపంలో పెట్టినట్టయితే ఇతివృత్తానికి తగిన జిగిబిగువులు వస్తాయన్నాడు షారీ ఆ చిత్రంలో ఇరికించదలచిన రాజకీయ పరమార్థం ఆ కథనంలో ఉంటుందన్నమాట షారీ ఈ పని అవిఘ్నంగా సాగించటానికి హ్యూస్టన్ అడ్డం కూడా లేదు ఆయన ఇంకో చిత్రం

తీయటానికి ఆఫ్రికా వెళ్ళాడు (ఆయన ఉంటే షారీ తన ప్రయత్నాన్ని మానేసుకునేవాడని కాదు )

షారీ ఈ చిత్రానికి ఒక ఉపోద్ఘాతం రాశాడు దానితో ఇతివృత్తమే మారి పోయింది ''క్రేన్ ఈ గ్రంధాన్ని తన ఇరవై రెండవ ఏట రాశాడు దాని ప్రచురణ ఆయనకు ఘనత చేకూర్చింది ఈ కథలో ఒక యువకుడు భయపడుతూ యుద్ధ రంగంలోకి వెళ్లి మ/ ధీరుడుగా బయటకి వస్తాడు ''

హంతకుల తయారీకి నవలయొక్క కీర్తి వినియోగించబడింది షారీ తయారు చేసిన ఉపోద్ఘాతంలో హంతకుడుగా తయారు కావటం గ్రంధ రచన చెయ్యటం లాంటిదిగా వర్ణించబడింది ధైర్యం కూడా పిరికితనంలాగే హేతు రహిత మైనది అన్న హ్యూస్టన్ నమ్మకం ఈ ఉపోద్ఘాతంలో ఎక్కడా లేదు జూన్ 1951లో మేయరు తన పదవిని వదులుకున్నాడు తరవాత కొద్ది మాసాలకు ఈ చిత్రం విడుదల అయింది ఇది చెప్పుకోతగిన ఆర్థిక విజయం సాధించలేదు కాని ప్రచార సాధనంగా విజయం సాధించింది విమర్శకులూ, మేధావులూ ఈ చిత్రాన్ని ఉగ్గడించారు

మానసిక ఉద్రిక్తతను చల్లార్చటానికి రక్త పాతమూ క్రౌర్యమూ తోడ్పడతాయి గనక, మనుషులు యుద్ధాలు చేస్తారు ఈ భావాన్ని '' కళాన్వితంగా'' ప్రదర్శించటానికి ప్రయత్నం జరిగింది ప్రజలకు ప్రజాతంత్రంలో విశ్వాసం లేకుండా చేయటానికీ, అమెరికా చరిత్రలోని ఒక ప్రముఖ ఘట్టాన్ని గురించి ప్రజలకు ''కనువిప్పు'' కలిగించటానికీ చరిత్రను ''జిమ్ క్రో'' దృష్టితో చిత్రించటానికి ఈచిత్రం తగు మాత్రం తోడ్పడింది

హ్యూస్టన్ అమెరికాకు తిరిగి వచ్చాక నిర్లిప్తత నటించాడు ఆయన రైన్ హార్ట్‌కు రాస్తూ, షారీతో ''అబద్ధం ఆడాను ఆయన చేసిన మార్పులు నాకు సమ్మతమేనన్నాను!'' అన్నాడు

*అభ్యుదయ, మాసపత్రిక , ఫిబ్రవరి 1958*

# 70. సినిమా విప్లవం

1952లో '' వివా జపాటా!'' విడుదల కావటంతో, ప్రముఖ సాంఘిక ఇతి వృత్తాలకు హాలీవుడ్ న్యాయం చెయ్యగలదా అన్న సమస్యపై మరొక సారి తర్జనభర్జన సాగింది, ఈసారి చర్చలో మరింత అయోమయం కూడా ప్రవేశించింది ఎందు చేతనంటే ఈ చిత్రం తాలూకు ఇతివృత్తం చాలా గొప్పదన్నది నిస్సందేహం

ఈ శతాబ్దపు రెండవ దశాబ్దంలో మెక్సికోలోని రైతులు ఎమిలియానో జపాటా నాయకత్వాన సాగించిన విప్లవం ఈ చిత్రంలో చిత్రించబడినది మెక్సికో చరిత్రలోనూ, ఉభయ అమెరికాల చరిత్రలోనూ జపాటా ఒక విశిష్టవ్యక్తి మెక్సికన్ విప్లవానికి అతను ఏకైక నాయకుడు, దూర దృష్టి గల వాడు, పశ్చిమార్ధ గోళంలోని సాంస్కృతిక, రాజకీయ జీవితపు సాంప్రదాయాలకు ఒరవడిని పెట్టిన వాడు ఈచిత్రంలో జపాటా పాత్ర వాస్తవంగా, సానుభూతిసహితంగా చిత్రించబడిందనీ, భూమికోసమూ, స్వేచ్ఛ కోసమూ రైతులు సాగించిన ఉద్యమం బలంగా చూపబడిందని కొందరు భావించారు అందులో కొన్ని లోపాలున్నప్పటికీ,

ఈ చిత్రం ఒక ముందడుగనీ, ప్రజా ఉద్యమాలలోని శక్తిని అవగాహన చేసుకోవటానికి తోడ్పడుతుందనీ కొందరు అభ్యుదయ వాదులు భావించారు

ఈ ప్రశంస సమర్థనీయమే అయిన పక్షంలో, మనం హాలీవుడ్ చిత్ర పరిశ్రమ గురించి చెప్పిన విమర్శలను ''వివా జపాటా!'' అబద్ధం చేస్తుందన్న మాట జపాటా సాగించిన రైతు విప్లవం సామ్రాజ్య వాద వ్యతిరేకస్వభావం గలది ఈనాడు కూడా దాని ఫలితాల ప్రభావం ఉన్నది అటువంటి తిరుగుబాటును హాలీవుడ్ వారు సానుభూతితోనూ, ఆదరభావంతోనూ చిత్రించారంటే వారు అమెరికా వైదేశిక విధానాలను తిరస్కరించారన్నమాట ఒక వంక పాలకులు కొరియను గ్రామాలు తగలబెడుతూ, ఇండోచైనా, మలయాలలో రైతు ఉద్యమాలను అణచటానికి సహాయం చేస్తూ, ప్రపంచ మంతటా ప్రజా వ్యతిరేక ప్రభుత్వాలను బలపరుస్తూ, దక్షిణ అమెరికా ప్రజలపై యాంకీ సామ్రాజ్యం వేసిన భారాన్ని పెంచుతూ ఉండగా, హాలీవుడ్ భూమిపై రైతులకు గల హక్కులనూ, వారి స్వాతంత్ర్యాన్నీ, బలపరచి అడుగున పడివున్న ప్రజల తిరుగుబాటును ఆదరంతో చూస్తున్న దన్నమాట!

''వివా జపాటా!'' చిత్రాన్ని విమర్శించాలంటే తెరమీద కనిపించేదీ, వినిపించేది మాత్రమే చూడాలి కాని ఆ చిత్రం నిర్మాణానికి పూర్వం నడిచిన కొన్ని విషయాలకు ఈ చిత్రం యొక్క స్వరూపంతో సంబంధం ఉన్నది ఇది ఏమిటంటే, ఈ చిత్ర నిర్మాణం అయిన పరిస్థితులు, నిర్మాతల ఆశయం, సినిమా పరిశ్రమ యొక్క ప్రస్తుత విధానాలకూ ఈ చిత్రానికీ గల సంబంధం— వీటిని గురించి తెలుసుకోవాలి

''వివా జపాటా!'' రచయిత స్టయిన్ బెక్, దర్శకుడు ఇలియా కజాన్, దీన్ని డారిక్ జనూక్ 20వసెంచరీ ఫాక్స్ సంస్థ తరపున నిర్మించాడు

ఈ చిత్రం నిర్మించడంలో గల రాజకీయ ప్రయోజనాన్ని గురించి కజాన్ ''శాటర్ డే రివ్యూ''లో రెండు లేఖలు వ్రాశాడు అనమెరికన్ విచారణలలో కూడా వాఙ్మూలం ఇచ్చాడు ఆ వాఙ్మూలంలో, ''ఇది కమ్యూనిస్టు వ్యతిరేక చిత్రం'' అన్నాడు

''జపాటా జీవితంలో ఒక విచిత్రమైన సన్నివేశం మమ్మల్ని బలంగా ఆకర్షించింది విజయం చేజిక్కిన క్షణంలోనే అతను అధికార త్యాగం చేశాడు ఆ క్షణంలో అతను దేశానికి నియంత అయి ఉండవచ్చు అధ్యక్షుడు అయి ఉండవచ్చు కాని అతివిచిత్రంగా, అకారణంగా, అతను తన గ్రామానికి తిరిగి వెళ్ళి పోయాడు అతని ఈ త్యాగం కథకు ఆయువుపట్టు , అతని శీలానికి గీటురాయి'' అని కజాన్ పత్రికలో రాశాడు మొదటి సమస్య, చారిత్రకంగా ఇది వాస్తవమా? అయితే దీన్ని జపాటా జీవితానికి ఆయువుపట్టుగా ఎందుకు నిర్ణయించారు? కజాన్‌నూ, స్టయిన్ బెక్‌నూ, జనూక్‌నూముగ్ధులను చేసిన ఈ సన్నివేశం శుద్ధ కల్పన జపాటా రాజధాని వదిలిపోవటంలో త్యాగం గాని, అర్థంగానిది గాని ఏమీలేదు ప్రబలమైన శక్తులు ఎదిరించి ఉండటం వల్ల అతను అధికారాన్ని అమలు చేయలేకపోయాడు అతన్ని ఎదిరించిన శక్తులలో అమెరికను సైనిక శక్తి కూడా ఉన్నది కార్లటన్ బీల్స్ ''శాటర్డే రివ్యూ''లో రాస్తూ, మెక్సికోనుంచి తిరోగమనాన్ని కజాన్ చిత్రించిన పద్ధతి లోపభూయిష్టమన్నాడు '' జపాటా తన అనుచరుల పట్ల అలాటి నమ్మక ద్రోహం చేయలేదు అతన్ని బలమైన సైన్యాలు చుట్టుముట్టాయి అతని బలాలకు పదింతల బలాలు అతన్ని ఎదిర్చాయి అతను ఆఖరు

సారి మెక్సికో నగరాన్ని విడిచివెళ్ళేటప్పుడు ఆ నగరంలో ఫిరంగులు మారు మోగుతున్నాయి ''

బీవ్స్ విమర్శకు సమాధానం రాస్తూ కజాన్, ఈ చిత్రం కోసం విరివిగా పరిశోధనలు జరిగాయనీ, అయినా బీవ్స్ బయట పెట్టిన విషయాలు తానెక్కడా వినలేదనీ అన్నాడు దీన్ని బట్టి సినిమా వాళ్ళ పరిశోధనలు ఎంత దీనస్థితిలో ఉన్నాయో తెలుస్తుంది ఎందుచేతనంటే ఆ కాలపు చరిత్రను గురించి ఏ పుస్తకం తీసినా, మెక్సికోలో జపాటాకు వ్యతిరేకంగా తూర్పున కరంజాసేనా, దక్షిణాన గోన్జాలెస్ బలాలు, అమెరికా ప్రభుత్వపు ఆశీర్వాదంతో ప్యూబ్లావద్ద ఓబ్రిగాన్ సేనలూ దెబ్బతియటానికి సిద్ధంగా ఉండిన సంగతి స్పష్టమవుతుంది ఫ్రాంక్ టెనెన్బామ్ అనే బూర్జువా పండితుడు ''విప్లవం ద్వారా శాంతి'' అనే గ్రంధాన్ని రాశాడు అందులో, ''తిరుగుబాటు సాగించినది మొదలు హత్య అయే వరకూ జపాటా ఎన్నడూ లొంగలేదు ఎన్నడూ ఓడ లేదు, ఎన్నడూ యుద్ధం ఆపలేదు '' అని రాశాడు అది నిజమైన జపాటా అతను అజేయుడైన విప్లవ వీరుడు దక్షిణ మెక్సికోలో అతని సమాధిని పవిత్ర దేవళంగా భావిస్తారు

కజాన్ గాని, స్టయిన్ బెక్ గాని, జనూక్ గాని చరిత్రాంశాలను చూడక కళ్ళు మూసుకున్నారు ఎందుకంటే అవి వారి ఆశయానికి విరుద్ధంగా ఉన్నాయి వారికి లొంగిపోయిన నాయకుడు '' అధికారం అవినీతికి దారి తీస్తుందని అకస్మాత్తుగా జపాటాకు తోచి ఉండాలి అందుకే అతను దాన్ని విసర్జించాడు!'' అని కజాన్ ఊహించాడు ఈ మాటలోనే చిత్ర నిర్మాతల రాజకీయాశయం వ్యక్తమవుతున్నది మానవ హక్కుల కోసం జరిగే ప్రతి సంఘర్షణ వెంటా అధికారం సమస్య ఉండి తీరుతుంది అధికారాన్ని సవ్యంగానూ, ప్రజాహితానికి అనుకూలంగానూ వినియోగించే అవకాశం లేదని ''వివా జపాటా!'' ద్వారా బోధించటానికి ప్రయత్నం జరిగింది

ప్రపంచ ప్రజలు తమ శృంఖలాలనూ, దారిద్ర్యాన్నీ తెంచుకుని బయట పడటానికి సామ్రాజ్యవాద శక్తులతో సంఘర్షణ పడుతున్నారు కనుక ఈ ప్రజా ఉద్యమాలు లేవనటం సాధ్యం కాదు అయితే ''సానుభూతి'' పూర్వకంగా ఈ ఉద్యమాలు నిరుపయోగమని చెప్పేటందుకు అవకాశం ఉన్నది విప్లవ నాయకులే ప్రజల నోట దుమ్ము కొట్టి తిరుగుబాటును వృధాచేస్తారని చెప్పవచ్చు సామ్రాజ్య వాదానికి ఈ రూపంలో సేవ చేస్తున్న వారు సాంఘిక, ఆర్థిక, రాజకీయ, చారిత్రక రంగాలలో అసంఖ్యాకులున్నారు

ప్రజాఉద్యమాల నిరుపయోగత నిరూపించటానికి హాలీవుడ్ వారు మెక్సికో చరిత్రలో ఒక ఘట్టం తీసుకున్నారు ఇది బుద్ధిపూర్వకంగా జరిగినదే. స్థలమూ, కాలమూ కూడా హాలీవుడ్‌కు పనికి వచ్చాయి ఈ సంఘటనలు జరిగి తగినంత కాలమయింది వాటిలో ఈనాటి రాజకీయాలు ప్రతిబింబించవు అయినప్పటికీ, వలస విధానానికి గురి అయిన ఈ కాలపు ఆసియా ప్రజల స్థితికీ, మెక్సికోలో రైతు కూలీ స్థితికీ కొన్ని పోలికలు లేకపోలేదు మెక్సికోలో విప్లవమప్పుడు అమెరికా సామ్రాజ్య వాదం, ఆసియా మొదలయిన ప్రాంతాల విషయంలో లాగా, బహిరంగ జోక్యం కలిగించుకున్నట్టు బయటపడలేదు

అమెరికాకు వ్యతిరేకంగా నడిచిన ఒక మహా ప్రజా ఉద్యమంలో ఒక తిరుగుబాటుకు జపాటా నాయకత్వం వహించాడన్నది కప్పిపుచ్చటం చరిత్రను తారుమారు చేయటమే కాని ఈ చిత్రంలో రాజకీయవాదుల, సైనికాధికారుల అవినీతి మాత్రమే చూపబడింది వారికి

విదేశీయుల ప్రాబల్యం ఉన్నట్టు చూపబడలేదు మెస్టిజోస్, మోరెయిస్‌లోని పేదలయిన ఇండియనుల తిరుగుబాటు ఒక ప్రత్యేక ఉద్యమంగా చూపబడింది అది ధర్మమైన తిరుగుబాటే అయినా, రైతులు ''అమాయకులూ, ''అజ్ఞానులూ'' కావటం చేత వారి తిరుగుబాటు సఫలమయే అవకాశం ఏనాడూ లేనట్టు చూపబడింది ఈ చిత్రంలో శ్వేత జాత్యహంకారమూ, వర్ణ, జాతులపట్ల నిరసన ఉన్నది చిత్రంలో దర్శకత్వమూ, లైటింగూ, పాత్రల కదలికా మొదలైన వన్నీ, మెరెలోస్ పౌరులు ఆకర్షవంతంగా ఉన్నప్పటికీ సమిష్టి చర్యకు తగిన వారు కారని సూచించటానికి సహకరించాయి జపాటా సోదరుడు తాగుబోతుగా చిత్రించబడ్డాడు

జపాటాను మేధావిగా చిత్రించలేదు అతను మేధావి అనటానికి సందేహంలేదు ఈ విషయాన్ని అతను సృష్టించిన అయాలా పథకమూ, దాని ద్వారా అతను సాధించదలచిన భూ సంస్కరణలూ, జాతీయ సమైక్యతా నిరూపిస్తాయి ఇది ఉభయ అమెరికాల చరిత్రలో ఒక మహత్తరమైన స్థానం సంపాదించిన పథకం దీన్ని నిర్మించిన వాడి పాత్రను మార్లన్ బ్రాండో నిర్వహించి, జపాటాను సంస్కృతిగాని, రాజకీయ జ్ఞానంగాని లేని వ్యక్తిగా ప్రదర్శించాడు ''ఎ స్ట్రీట్ కార్ నేమ్డ్ డిజైర్'' అనే చిత్రంలో మానవత్వం లేని శ్రామికుడి పాత్ర ధరించి ఈ నటుడు ఏయే అభినయాలు చేశాడో, వాటినే జపాటా పాత్ర పోషణకూ వినియోగించాడు

జపాటాను గురించి ఇంకొక వింత విషయం కూడా కజాన్ సంపాదించాడు— మెక్సికో నగరాన్ని పట్టుకుని, శత్రువులను జయించి, ప్రభుత్వం స్వాధీనం చేసుకున్న జపాటా ప్రభుత్వ కార్యాలయాలలో ఆధునిక సంస్కృతీ చిహ్నమైన టైప్ రైటర్లను చూసి అక్కడి నుండి నిష్క్రమించాడట! ఈ విషయం కజాన్‌తో ఒక స్త్రీ చెప్పిందట! జపాటా పొలాలు దున్నుకునే వాడు, మూఢుడు— అందుచేత అతను అధికార త్యాగం చేశాడని కజాన్ ఉద్దేశమన్నమాట! అయితే అందుకని కజాన్ జపాటాను ద్వేషించటం లేదు అధికారత్యాగం చేసినందుకు అతన్ని ప్రేమిస్తున్నాడు

అసలు ఈ చిత్రంలో మేధావి విద్వేషం అంతటా ఉన్నది మేధావులకు చిహ్నంగా ఒక పాత్ర సృష్టించబడింది ఈ వ్యక్తి చేతిలో టైప్ రైటర్ పట్టుకుని కనిపిస్తూ ఉంటాడు అధికార త్యాగం చేసేదాకా ఈ వ్యక్తి జపాటాను బలపరిచి ఆ తరవాత గర్హిస్తాడు ఈపాత్రకు ''హేతువాదం'' ఇష్టం ఈ పాత్రను ఎందుకు ప్రవేశపెట్టినదీ కజాన్ వివరించాడు

'' కమ్యూనిస్టు మనస్తత్వం అంటూ ఒకటి ఉన్నది ఈ మనస్తత్వానికి ప్రతినిధిగా ఫెర్నాండో అనే పాత్రను సృష్టించాం ప్రేక్షకులకు ఇతను టైప్‌రైటర్ పట్టుకుతిరిగే వ్యక్తిగా పరిచయమవుతాడు ఇతను ప్రజల న్యాయమైన కోర్కెలను స్వార్థానికి వినియోగపరచుకునే బాపతు ''

కేవలం కమ్యూనిస్టు వ్యతిరేకతను చాటుకునేటందుకే కజాన్ ఈ చిన్న పాత్రను ప్రవేశ పెట్టలేదు ప్రజాతంత్రాన్ని విధ్వంసం చేయటానికి కమ్యూనిస్టు వ్యతిరేకత సాకుగా చిత్రంలో ఉపయోగ పరుచుకోబడింది ఫెర్నాండో చాలా అర్థంలేని పాత్ర ఈ పాత్రను సృష్టించటంలోనూ, పోషించటంలోనూ కాస్తయినా ఉపజ్ఞ లేదు రాజకీయావసరాల కోసం సృష్టి అయిన ఈ పాత్రను సృష్టించక మానటం ఎంత దుస్సాధ్యమో, పోషించటమూ అంత దుస్సాధ్యమే అయింది కమ్యూనిస్టు వ్యతిరేకతలో ఉండే బుద్ధి మాంద్యం ఈ పాత్రలో మూర్తీభవించింది

జపాటా త్యాగానికీ ఈ పాత్రకూ సంబంధం ఉన్నది చిత్రంలో సంఘర్షణ ఉండాలి

కనీసం ఉన్నట్లు నటించాలి కథానాయకుడు అధికార త్యాగం చెయ్యకుండా అనుసరించదగిన ఇంకో విధానం చూపి, ఆ విధానానికీ ఈ త్యాగానికీ ఘర్షణ ప్రదర్శించాలి ఆ రెండో విధానం భూమి కోసం పోరాటం కాగూడదు అటువంటి పోరాటం ఫలించదని చిత్రం రుజువు చేస్తోంది ప్రజల న్యాయమైన హక్కులకూ, అవినీతికరమైన పదవిని జపాటా త్యాగం చెయ్యటానికి మధ్య ఘర్షణ పెట్టటం సాధ్యం కాదు అలా చేస్తే జపాటా త్యాగంలోని బండారం బయటపడుతుంది కనుక త్యాగం కన్న హేయమైనది ఒకటి సృష్టించాలి అదేమిటంటే సోషలిజం, లేదా కమ్యూనిజం, లేక వర్గ సంబంధాలలోనూ, ప్రభుత్వ యంత్రాంగంలోనూ నిజమైన మార్పు సాధించేది మరేదైనా సరే

అసలు కమ్యూనిస్టు వ్యతిరేకత ప్రచారంలో ఉన్న రహస్యమే ఇది తనకు పూర్వం ఉండిన విశాల భావాలను కజాన్ ఊరికే విడిచిపుచ్చితే ప్రపంచం అతన్ని మూఢుడి కింద జమకడుతుంది కాని అంతకన్న దారుణమైన రాజకీయ దుర్మార్గం నుంచి బయటపడటానికి తానా పని చేశానని కజాన్ వాదం సోవియట్ యూనియన్ పుట్టక పూర్వమే, మార్క్స్, ఎంగెల్స్‌లు తమ రచనలు చేయక పూర్వమే పీడిత ప్రజలు తమ హక్కుల కోసం జరిపే పోరాటాల మీద దుమ్మెత్తి పోయటం అమలులో ఉంది

''వివా జపాటా!''లో మెక్సికో చరిత్రను తారుమారు చేయటానికి కమ్యూనిస్టు వ్యతిరేకత ఒక సాకుగా ఉపయోగపడింది '' కమ్యూనిస్టులు కష్టపడి సృష్టించిన జపాటా బొమ్మను ఈ చిత్రంలోని పాత్ర పాడుచేసిందని'' కజాన్ గర్వంగా చెప్పుకున్నాడు కాని ప్రజలు ప్రేమించినది ఆ బొమ్మలోని జపాటాను మాత్రమే దీన్ని చూసి మెక్సికన్లు తమ చరిత్రకూ సంప్రదాయాలకూ అన్యాయం జరిగినట్టు భావిస్తారని ముందుగానే తనకూ, స్టయిన్ బెక్‌కూ హెచ్చరిక జరిగిందని కజాన్, సామ్రాజ్య వాదులకు సహజమైన అహంకారంతో చెప్పాడు మెక్సికను సినిమారంగంలో ఇద్దరు ప్రముఖ వ్యక్తులకు ముందుగా చిత్రం తాలూకు స్క్రిప్ట్ చూపిస్తే వారు తీవ్రంగా విమర్శించి, ఈ స్క్రిప్టు ''అసంభవం'' అన్నారట జపాటా అధికార త్యాగం చెయ్యటం విషయమై ప్రాముఖ్యం ఇచ్చినందుకు అవహేళనతో బాటు ఆగ్రహం ప్రదర్శించారు

ఈ విమర్శ చూసి స్టయిన్ బెక్,'' నాకు పార్టీ ధోరణి వాసన కొడుతున్నది,'' అన్నాడట ''నాకూనూ'', అన్నాడట కజాన్ కజాన్ ఆడిన ఇంకొక అబద్ధం ఇక్కడ రుజువవుతున్నది జపాటా మెక్సికో నగరం నుంచి వెళ్ళిపోవటం గురించి నిజమైన వివరాలు తాను వినలేదని కజాన్ అన్నాడు కాని ఆ వివరాలను ఆయనకు మెక్సికన్ సినిమా రంగంలోని బాధ్యతగల వ్యక్తులు చెప్పారు వాటిని ఆయన పుస్తకాలలో కూడా చదివి ఉండాలి తన యజమానులూ, అమెరికన్‌లు కూడా ప్రజావ్యతిరేక చిత్రం తయారు చేయమని ఆదేశించటం వల్ల ఆయన ఆ వివరాలను ఉపేక్షించాడు ఈ చిత్రాన్ని విమర్శించిన వారిలో గడుసువాళ్ళు కొందరు ఈ చిత్రం యధాతథత్వాన్ని సమర్థిస్తున్నదన్నారు గ్వార్న్ సీ జూనియర్ హెరాల్డ్ ట్రిబ్యూన్‌లో ఇలా రాశాడు '' మెక్సికో స్వాతంత్ర్యానికి జపాటా చేసిన సేవ పరోక్షమైనదిగా ఈ చిత్రం చూపుతున్నది చెడ్డ నాయకుల స్థానే మంచి నాయకులు ( తాను సహితం) రావటం చేత శాంతి భద్రతలు ఏర్పడవని జపాటా భావించుతున్నాడు ఉద్యమానికి అసలు కారణమైన

భూసంస్కరణలు చివరకు లభ్యం కానేలేదు జపాటా పాత్ర పోషణలో బ్రాండో పశులక్షణాలు భారీగా ప్రదర్శించాడు ''

''మోరావెస్ ప్రజలు మెక్సికో కంతటికీ ఆత్మ గౌరవమూ, స్వేచ్ఛా ప్రియత్వమూ గలవారు వారి ప్రవర్తనను బట్టి, వారిని గోతిలోకి తొయ్యకుండా దాస్యంనుంచి విముక్త పరచిన నాయకుడు ఎలాంటి వాడో ఊహించవచ్చు ఇక్కడ రాజకీయాలకూ, మానవ శీలానికిగల సంబంధం కూడా వ్యక్తమవుతున్నదనుకుంటాను'' అని కజాన్ రాశాడు ఇందులో అసలు రహస్యం ఇమిడి ఉన్నది మోరావెస్ ప్రజలు ప్రస్తుతం పేదగా ఉన్నారన్నది ఈ దర్శకుడికి పట్టలేదు వారిని దాస్యం నుంచి బయటకి లాగడం గురించి ఆయన తియ్యగా మాట్లాడతాడు జపాటా నిజంగా వారికి విజయం చేకూర్చిపెట్టి ఉంటే వారు గోతిలోకి తోయబడిఉండేవారన్నమాట! ఆకలి భరించి సంఘర్షణ పడకపోతే వారికి ఆత్మ గౌరవం ఉన్నట్టు కజాన్ ఒప్పుకుంటాడు

తాను తయారు చేసిన చిత్రాన్ని సమర్థించుకుంటూ కజాన్ ఒక లేఖలో ఇలా రాశాడు ''మెక్సికో కమ్యూనిస్టులు జపాటా పట్ల ప్రజలకుగల ఆదర భావాన్ని తమ ప్రచారం నిమిత్తం వినియోగించు కుంటున్నారని మాకు తెలుసు— ఇక్కడి కమ్యూనిస్టులు లింకన్ ప్రవచనాలను ఉదహరించినట్టే ''

కజాన్, స్టయిన్ బెక్‌లు లింకన్ బొమ్మను కూడా కమ్యూనిస్టుల నుంచి రక్షిస్తారేమో చూడవలసి ఉంది. అధికారం అవినీతికి దారితీస్తుందన్న సత్యాన్ని లింకన్‌కు కూడా వర్తింపజేయవచ్చు బానిసత్వ వ్యతిరేక ప్రకటనపై సంతకం చెయ్యటంలో లింకన్ గొప్ప, తప్పటడుగు వేసినట్టు చిత్రించవచ్చు బానిసత్వం నిర్మూలించే విషయంలో లింకన్ కమ్యూనిస్టు ప్రభావాలకు గురి అయినాడని తోస్తే కజాన్, స్టయిన్ బెక్, జనూక్‌లు చరిత్రను ఈ విధంగా తారుమారు చేయగోరవచ్చు!

*అభ్యుదయ, మాసపత్రిక, మార్చి, 1958*

# 71. మూక మనిషి

చిత్రాలలో హంతకులనూ, యుద్ధహంతకులనూ గొప్పగా చిత్రించే హాలీవుడ్, ''వివాజపాటా! విషయంలో రైతుల పట్ల సానుభూతి నటిస్తూ విప్లవాన్ని ప్రమాదకరంగా చిత్రించింది విప్లవం వల్ల జన సామాన్యానికి హాని కలుగుతుందని హాలీవుడ్ సూచించిందనటానికి కారణమేమంటే హాలీవుడ్ దృష్టిలో సామాన్య మానవులది పశుబలం వారు సరిఅయిన విప్లవాలు చెయ్యలేరు వారికి కలిగే ప్రేరణలు హీనమైనవి

మూక మనిషి (మాస్ మాన్) ''ప్రమాదకరమైన'' వాడనీ, అతన్ని బూర్జువా వర్గం అంకుశంతో అదుపులో ఉంచాలనీ సూచించే చారిత్రక, తాత్విక, సాంఘిక సిద్ధాంతాలు హాలీవుడ్ కంటె ముందే పుట్టాయి ఈ సిద్ధాంతాలను ప్రచారం చెయ్యటంలో హిట్లరు కింది ప్రచారకులకు యూరప్, అమెరికాలలోని విద్వాంసులు ఏమాత్రమూ తగ్గలేదు

''మనిషి మూకలో ఒకడు కాగానే తన వ్యక్తిత్వాన్ని, వివేచననూ పూర్తిగా కోల్పోతాడు

నాగరికత చాలా మెట్లు దిగిపోతాడు విడిగా సంస్కారంగల వాడే అయినా మందలో చేరినాక ముందుండే'' అని సిగ్మండ్ ఫ్రాయిడ్ ''గ్రూపు సైకాలజీ'' లో చెప్పాడు ఇలా అయిపోయిన ''మంద'' నాయకుడు ఎలా చెబితే అలా వింటుందని ఆయన సిద్ధాంతం ఆ మంద నాయకుడి ప్రేమ కాంక్షిస్తుంది అతని ఆజ్ఞలు పాటించ గోరుతుంది ఆ మందను ఫ్రాయిడ్ పశుమందతో పోల్చాడు

1921లో ప్రచురించబడిన ఈ పుస్తకం, రష్యా విప్లవం అనంతరం యూరపులోని బూర్జువా వర్గాన్ని పట్టుకున్న భయాలను ప్రతిబింబిస్తుంది ''విడి'' మనిషి యొక్క మేధస్సుకు ఫ్రాయిడ్ ఎక్కువ గౌరవం ఇచ్చినప్పటికీ ఆయన బూర్జువా వర్గ మూక మనస్తత్వాన్ని ప్రతిబింబిస్తూనే ఇలా రాశాడు రష్యన్ విప్లవ విజయం బూర్జువా వర్గంలో కలిగించిన చైతన్యమే ఫ్రాయిడ్‌నూ కదిలించింది ఇటలీలో ప్రారంభమైన ఫాసిజమూ, మరికొంత కాలానికి జర్మనీలో సాగిన నాజీ దారుణ కాండ కూడా ఆయనను కలవరపరిచాయి ఇవి చూస్తున్న కొద్దీ ఫ్రాయిడ్‌కు మానవ మూకలంటే చెడ్డ భయం పట్టుకున్నది నాజీల బలం హెచ్చిన కొద్దీ ఈ భయం ఆయనలో మరింత హెచ్చింది మనిషి వస్తుతహా పశుప్రాయుడనీ, అతనిలో దురాక్రమణ వాంఛ స్వతస్సిద్ధమనీ, తొలి మానవులలో పరస్పర ద్వేషం సహజంగా ఉండేదనీ, ఈ ప్రేరణ అణిచిపెట్టుకోవటం చేతనే నాగరికత సాధ్యమయిందనీ ఫ్రాయిడ్ సిద్ధాంతీకరించాడు.

ఈ ఫ్రాయిడ్ సిద్ధాంతాన్ని వ్యక్తీకరిస్తూ కొన్ని వందల నాటకాలూ, నవలలూ, కథలూ, పద్యాలూ రచించబడ్డాయి ఈ సిద్ధాంతం ఇతర కళలలో కూడా ప్రతిబింబించింది కళాకారులు ఇలా చేయటానికి కారణమేమంటే, వారు సాంఘిక చర్యలకు దూరంగా ఉండి నిరుత్సాహాన్ని ఆశ్రయించటానికి ఫ్రాయిడ్ సిద్ధాంతాలు ఒక ''శాస్త్రీయమైన'' సాకుగా ఉపయోగపడ్డాయి కాని ఫ్రాయిడ్ సిద్ధాంతాలలో నిజమైన శాస్త్రం ఏమీలేదు వెనుకబడిన జాతులు వలసవిధానాలకు విరుద్ధంగా సంఘటితమై స్వాతంత్ర్యం కోసం చేసిన పోరాటం ''అనాగరికం'' అని సామ్రాజ్యవాదులు చేస్తూ వచ్చిన ప్రచారమే ఫ్రాయిడ్ సిద్ధాంతాలలోనూ ప్రత్యక్షమయింది ఇది బూర్జువా వర్గ దృక్పధం గనక ఈ సిద్ధాంతం తక్కువ వర్గాల వారికీ, దోపిడీని ప్రతిఘటించటానికి గాను వారు చేసే కృషికీ మాత్రమే వర్తిస్తుంది

''మూకమనిషి'' అంటే హాలీవుడ్‌కు గల బెదురు ఆసియా, ఆఫ్రికాలకు సంబంధించిన చిత్రాలలోనూ, నీగ్రో ఎర్ర ఇండియను జాతులను గురించిన చిత్రాలలోనూ దారుణంగా వ్యక్తమవుతుంది నీగ్రో ''మూకలు'' చాలా పశుతుల్యంగా చిత్రించబడ్డాయి 1949లో తయారైన నీగ్రో చిత్రాలన్నింటిలోనూ ఫ్రాయిడ్ సిద్ధాంతాలు ప్రవేశపెట్టి, నీగ్రోలు హీన స్థితిలో ఉండటానికి కారణం వారిలో సహజంగా ఉండే ''దౌర్జన్య ప్రేరణ'' అనీ ''దోషబుద్ధి'' (గిల్టీఫీలింగ్) అనీ స్పష్టం చేశారు హాలీవుడ్, నీగ్రోలకు చేసిన అన్యాయాలు జాబితా చేస్తే ఒక గ్రంథం అవుతుంది

ఫ్రాయిడ్ నిర్వచించిన ''మూక మనిషి'', సమ్మెలు, కొట్లాటలూ మొదలైన వాటికి సంబంధించిన అనేక చిత్రాలలో ప్రధాన పాత్రగా ఉపయోగపడ్డాడు 1936లో ఫ్రిడ్జ్‌లాంగ్ చేసిన ''ఫ్యూరీ'' అనే చిత్రం ఒక ఉదాహరణ. ఒక నిరపరాధి అయిన వ్యక్తిని బుద్ధిలేని ఒక

గుంపు చిత్ర హింస చెయ్యటానికి చేసే ప్రయత్నం ఈచిత్రంలో కథావస్తువు చిత్ర హింసకు గురి అయే వాడు తెల్లవాడు ఈ చిత్రం విడుదల అయే సమయానికి ఒక రాజకీయ తీవ్ర పరిస్థితి దేశంలో నెలకొని ఉన్నది ఫ్రాంక్లిన్ డి రూజువెల్టు తిరిగి అమెరికా అధ్యక్షుడుగా నిలబడ్డాడు ఆయన ప్రతిపాదించిన ''న్యూ డీల్''ను భగ్నం చెయ్యటానికి గాను ఒక పలుకుబడి గల రిపబ్లికను అభ్యర్థి ఆయనతో పోటీచేస్తున్నాడు రబ్బరు పరిశ్రమలో ప్రారంభమైన సమ్మెలు ఇతర పరిశ్రమలకు వ్యాపించాయి ఈ కార్మిక దైన్యాన్ని ఖండిస్తూ రూజువెల్టుకు వ్యతిరేక ప్రచారం సాగించే నిమిత్తమై హాలీవుడ్ ఈచిత్రం తీసింది ఈ చిత్రంలో జనసమూహాలకు బుద్ధి లేనట్టుగానూ, సాంఘిక సమస్యలకు సంబంధం లేకుండానూ చూపబడ్డాయి చిట్టచివరకు కథానాయకుడు ఆ జనసమూహాల నాయకులను క్షమించమని వేడుకుంటాడు సహనం బోధిస్తాడు

ఇదే సూత్రంమీద ఇటీవల ''ది వెల్'' (బావి) అనే చిత్రం తీయబడింది ఇందులో నీగ్రోలు ప్రముఖ పాత్ర నిర్వహిస్తారు తెల్లవాళ్ళ మధ్యా, నీగ్రోల మధ్యా జాతి కలహాలు రావటానికి కారణం మనిషిలో ప్రకృతిసిద్ధంగా ఉండే హింసాతత్వమని ఈ చిత్రం బోధిస్తుంది అయితే ఈ హింసాతత్వం నీగ్రోలలో ఒక పిసరు హెచ్చుగా ఉన్నట్టు చూపబడింది ఈ చిత్రంలో చూపించిన జాతికలహాలలో పాల్గొనే తెల్లవాళ్ళు నాసిరకం వాళ్ళు, నీగ్రోలు మాత్రం సాధారణ వ్యక్తులు ఒక తెల్లవాడు ఒక నీగ్రో శిశువును ఏదో చేశాడని నీగ్రోలు ''ఉన్మాదం'' చెందుతారు ఈ శిశువు పొలానికి అడ్డం పడి నడుస్తూ ఒక బావిలో తనంతట తానే పడుతుంది ఈ సంగతి ప్రేక్షకులకు ముందు చూపబడింది

ఈ చిత్రంలో గమనించదగిన విశేష మేమంటే నీగ్రోల ఉన్మాదం ఒక పొరపాటు మూలంగా ప్రారంభమవుతుంది చివరకు నీగ్రో శిశువు బావి అడుగున సజీవంగా ఉన్నదని తెలిసినప్పుడు ఆ శిశువును రక్షించటానికి తెల్లవాళ్ళే సాహసిస్తారు నీగ్రోలు ఉన్మాదం దిగిపోయి మతులుపోయిన వారిలాగా అయిపోతారు

ఈ మూకమానవులను నడిపించటానికి ఒక ధీరోదత్తుడు అవసరమన్న విషయం కొరియను చిత్రాలలో చూపబడింది ఆ నాయకుడు ఈ నర పశువుల మందలో ఉండే | కౌర్యాన్ని ప్రజాహితులపైకీ, శాంతికాముకులపైకీ పంపకం చేస్తాడు

అమెరికాలో చాలామంది సైకో ఎనలిస్టులు (ఫ్రాయిడ్ సిద్ధాంతాలను అవలంబించేవారు) ఫ్రాయిడ్ సూత్రాలే రాజకీయాలకు అన్వయించి అతి విచిత్రమైన సత్యాలు తెలుసుకుంటున్నారు 1949లో పిక్ స్కిల్ వద్ద పాల్ రోబ్సన్ పాట వినటానికి వచ్చిన వారికీ, పాటకచేరీ భగ్నంచెయ్యటానికి వచ్చి దౌర్జన్యాలు ప్రారంభించిన వారికి మధ్య యుద్ధంజరిగింది ఈ రెండు పక్షాలలోనూ చేరి ఉండిన ఇద్దరు యువకులు ఒక వైద్యుడివద్ద చికిత్స పొందారు వారిని గురించి ఆవైద్యుడు ఈ విధంగా చెప్పాడు

''పీక్ స్కిల్ వద్ద తమలో ఉన్న పైశాచికి ప్రేరణలను విజృంభింప జేసుకునే అవకాశం ఈ ఇద్దరికీ చిక్కింది వారి ఆదర్శాలు నిరుద్ధమైనవైనా హత్య చెయ్యాలన్న ప్రేరణ ఇద్దరిలోనూ ఒకటే . వారు ఏయేపక్షాల తరపున పోరాడారన్నది కేవలం దైవికం వారిలో ఏ ఒకడైనా ఏపక్షాన్నైనా పోరాడటానికి సమర్థుడే ఈ సంఘటనకు ప్రజాస్వామ్యం కారణంకాదు ఒక

సాకు మాత్రమే ''

శాంతంగా పాట వినటానికి వచ్చిన వారినీ, వారిపై దౌర్జన్యం చెయ్యటానికి వచ్చినవారిని ఈ మనస్తత్వ వేత్త ఒకటి చేశాడు ఈ దృక్పథం నుంచి ఆయన తీసిన నీతి ఏమంటే ''ఈ దేశంలోసంఘర్షణలు జరిగాయంటే ఆతప్పు పెట్టుబడి దార్ల స్వార్థానిది కాదు రాజకీయ వేత్తల అధికార వాంఛదీకాదు, అమెరికాలోని ప్రజా సామాన్యంలో ఉన్న వైకల్యానిది,'' అని!

ఇదే ధోరణిలో 1943లో డిట్రాయిట్ లో జరిగిన జాతి కలహాలు కూడా వర్ణించబడ్డాయి అక్కడి ఫాసిస్టులు నీగ్రో ప్రజలపైన అకారణ హింసాకాండ సాగదీశారు కాని ఈ సంఘటనలు హాలీవుడ్ చిత్రంలో చూపినప్పుడు తెల్లవారిలోనూ, నీగ్రోలలోనూ ఉన్న పైశాచిక శక్తులు కలహాలకు సమంగా కారణమైనట్టూ, ఈ శక్తులను కమ్యూ నిస్టులు రెచ్చగొట్టినట్టూ వివరించారు

అయితే హాలీవుడ్ వారు ఫ్రాయిడ్ సిద్ధాంతాలను ఇంకా పూర్తి గా వినియోగపరచటం లేదు చరిత్రను తారువమారు చెయ్యటానికి ఈ సిద్ధాంతాలు ఎలా వినియోగపరచ వచ్చో ''సైకోఎనాలిసిస్'' పత్రిక చూపింది ఈ పత్రికల బ్రాన్సన్ ఫెల్డ్‌మన్ అనే ఆయన అమెరికా అంతర్యుద్ధాన్ని ''సైకో ఎన్‌లైజ్'' చేసి, అధ్యక్షుడు లింకన్ పితృమూర్తి అనీ, ఆమూర్తిలో మూర్తీభవించే నిరకుంశత్వం పై దక్షిణ రాష్ట్రాలు తిరుగుబాటు చేసాయనీ, లింకన్ హత్య ఉత్తర దక్షిణ రాష్ట్రాలకు రెంటికీ అవ్యక్తానందాన్ని చేకూర్చిందనీ, అది ఆయన త్యాగమైనట్టు భావించి ఆ ఆనందాన్ని రిపబ్లికనులు వ్యక్త పరిచారనీ వ్యాఖానించాడు

అందుచేత ఈ ఫ్రాయిడ్ శిష్యుల నుంచి హాలీవుడ్ నేర్చుకోవలసింది చాలా ఉన్నది!

స్త్రీల హీనస్థితి

సంఘంలో స్త్రీల స్థితి హీనంగా ఉండటానికి రాజకీయ ఆర్థిక వ్యూల కారణాలుంటాయి స్త్రీ ఎదుర్కొనే నైరాశ్యం ఆమె ఇంట్లో ఉత్పన్నమయేది కాదు స్త్రీసమస్య తాలూకు వేళ్ళు ఉత్పత్తి విధానంలో ఉన్నాయి (అమెరికాలో) కార్మికులలో స్త్రీ పురుషుల వేతనాల మధ్య ఉండే తేడామూలంగా పరిశ్రమలకు ఏటా 500 కోట్ల డాలర్ల ఆదా అవుతున్నాయి స్త్రీకి జరిగే అన్యాయాలను గురించి ప్రత్యేకంగా సెక్సు సంబంధాలనూ, అచార వ్యవహారాలనూ తరచవలసిన అవసరం లేదు

హాలీవుడ్‌కు స్త్రీల వేతనాలతో సంబంధంలేదు హాలీవుడ్ చిత్రాలు స్త్రీలో ఉండే ''గ్లామర్''నూ, ''సెక్సుఅపీలు''నూ చిత్రిస్తాయి స్త్రీలచిత్రణలో కూడా హలీవుడ్ తనకు కావలసిన సాంఘిక ప్రచారాన్ని సాధిస్తుంది ఈ చిత్రణలో స్త్రీలలో హేతువాదం తక్కువ, ''ఇన్‌స్టింక్టు''పై ఎక్కువ ఆధారపడతారు, తమ ''పశుప్రేరణలు'' ఆట్టే అదుపులో ఉంచుకోలేరు సామ్రాజ్యవాదులు వలస ప్రజీనీకాలను గురించి ఎలాంటి ప్రచారం చేస్తారో, హాలీవుడ్, స్త్రీలను గురించి అలాంటి ప్రచారమే చేస్తుంది అణగిమణగి పడి ఉన్నంతకాలమే వారు ''ముచ్చట గొలుపుతారు''

''రానురాను నాగరికత పురుషుల బాధ్యతగా పరిణమిస్తున్నది ఇందుకుగాను పురుషుడు తన ఇన్‌స్టింక్టు''లను అధిగమించినట్టుగా స్త్రీఅధిగమించలేకపోతున్నది స్త్రీ తన

పురోగమనంలో వెనక పడటమేకాక నాగరికత పట్ల శత్రువైఖరి గూడా అలంబిస్తున్నది! అని ఫ్రాయిడ్ ప్రవచనం

హాలీవుడ్ చిత్రాలలో స్త్రీ ఎంత మాత్రమూ వెనుకపడి ఉండటంలేదు ముందే ఉంటున్నది కాని ఇలా ఉండటానికి ఫ్రాయిడ్ ప్రవచనమే కారణం పురుషుడిలోని క్రౌర్యాన్ని రెచ్చగొట్టేది స్త్రీగా చిత్రంచబడుతున్నది

హాలీవుడ్ చిత్రాలలో స్థూలంగా మూడు రకాల స్త్రీలు కనిపిస్తారు (1) దుష్టస్త్రీలూ, దుర్మార్గాన్ని ప్రేరేపించేవారూ, (2) మగవాడిమీద కత్తిగట్టి, పోరాటం సాగించి, చిట్టచివరకు(విధిగా) ఓడిపోయే స్త్రీలూ, (3) పురుషుడికి లోబడి కీలుబొమ్మలాగా ఉండి, ఆనందం చేకూర్చే స్త్రీలూనూ కొన్ని పాత్రలు రెండు రకాల కిందికి రావచ్చు, ఉదాహరణకు ''లీవ్ హర్ టు హెవెన్'' లో నాయిక హంతకీ, ఆనందం చేకూర్చేదీ కూడా

గాంగ్‌స్టర్ చిత్రాలలో రెండురకాల స్త్రీలు కనిపిస్తారు— విద్రోహ చర్యలు చేసేవారూ, అలాటి చర్యలకు గురి అయ్యేవారూ అయినా ఈ రెండు రకాలమధ్య వ్యత్యాసం స్పష్టంగా తెలియదు ఎందుచేతనంటే రెండోరకం స్త్రీలు కూడా గూండాలను దుర్మార్గం చెయ్యటానికే ప్రేరేపిస్తారు ''వితౌట్ వార్నింగ్'' అనే చిత్రం పోస్టరుపైన ఇలా రాసి ఉంది ''హత్య! హత్య! హత్య! వాడి చేతిలోలేదు వాళ్ళు (స్త్రీలు) ముద్దుపెట్టుకున్నప్పుడు వాడికి వశం తప్పుతుంది హత్య చేసి తీరాలి! ''

కామ వికారం దురంతాలకు దారి తీసేటట్టు చూపటంలో హాలీవుడ్ చిత్రాలు దుర్మార్గాన్ని సమర్థించటమేకాక, దాన్ని ఆకర్షవంతంగా ఉండేటట్టు చేస్తున్నాయి హాలీవుడ్ వాళ్ళూ, వాళ్ళ యజమానులైన వాల్ స్ట్రీట్ వాళ్ళు పని పెట్టుకుని నేరాలను ప్రోత్సహించటానికీ వయసులో ఉన్న స్త్రీ పురుషులకు నైతిక విలువలు లేకుండా చెయ్యటానికి ప్రయత్నిస్తారని కొందరు నమ్మలేక పోవచ్చు కాని స్టూడియోలలో కథా చర్చలలో పాల్గొనే వారికి, బూతులలోనూ, రక్తపాతంలోనూ ఉండే ఆకర్షణ డబ్బుకంటే కూడా ఎంత జాగ్రత్తగా గణించబడుతుందో తెలుసు నిజానికి అది డబ్బే కూడానూ

జర్మనీలో హిట్లరు ప్రచారంలో చాలా బూతు ఉండేది హిట్లరు అధికారానికి మద్దతు ఇచ్చిన వాళ్ళు గాంగ్‌స్టర్‌లు— ''మగ సిరి'' గల క్రూరులూ, అసహజమైన ఉద్రేకాలు గలవారూ, దొంగలూ, నిషా వస్తువులకు బానిసలైనవారూ వీరికి స్త్రీ పట్ల చాలా హీనభావాలుంటాయి

అనేకమంది హాలీవుడ్ తారలకు తాము ధరించే హీన పాత్రల ద్వారా జరిగే రాజకీయ ప్రచారం ఏమిటో తెలియదు స్టేజిపైన ఇటీవల ''జూలియట్'', ''కార్డిడా'' లాంటి ఉత్తమ పాత్రలు ధరించిన ఒలివియా డి హావిలాండ్ ''రేచెక్'' చిత్రంలో తాను ధరించిన హీనపాత్రను గురించి ఒక ఇంటర్వ్యూలో ఇలా గొప్పగా చెప్పుకున్నది!

జీవితపు పోటీలో ఆడది నెగ్గితే అందుకు కారణాలు మోసమూ, వంచనా, ''సెక్స్ అపీల్'' అని హాలీవుడ్ ఉద్దేశం ''ఆల్ ఎబౌట్ ఈవ్'' అనే చిత్రం ఈ విషయాన్ని స్పష్టం చేస్తుంది ఈ చిత్రంలో నాయిక నటిగా పైకి రావడానికి గాను అన్నిరకాల సాంఘిక

మర్యాదలనూ అతిక్రమిస్తుంది నిస్సంకోచంగా అబద్ధాలాడుతుంది

హాలీవుడ్ చిత్రాలలో అకర్షవంతంగా చిత్రించబడే స్త్రీ పాత్రలు మగవాడికి లొంగి ఉండి, అతనికి కామ సంతృప్తినిచ్చేవారు ఆత్మత్యాగం చేసుకుని తమ జీవితాలను ఇతరుల సేవకు వినియోగించే స్త్రీ పాత్రలు ఉదాత్తంగా చూపబడతాయి ఇతరుల బలాత్కారానికి లొంగిపోవటానికి బదులు ఈ పాత్రలు తమకు తామై ఆత్మత్యాగం చేసుకుంటాయి ''బ్లూ వెయిల్'' అనే చిత్రం ఇందుకు ఉదాహరణ

''అమెరికన్ ఇన్ పారిస్'' చిత్రానికి 1951లో ఎకాడమి ఎవార్డ్ వచ్చింది ఈ చిత్రంలో కథానాయికా, ఆమెను పెళ్ళాడనున్న యువకుడూ కూడా యుద్ధకాలమప్పుడు ప్రతిఘటనలో పాల్గొన్నవారని చెప్ప బడింది కాని వారిలో అలాటి లక్షణాలులేనట్లు చూపబడుతుంది కథానాయిక ఒక అమెరికన్ చిత్రకారుడి చేత ఆకర్షించబడుతుంది ఈ చిత్రంలో ప్రేమ ఒక బలవత్తరమైన శక్తిగా చూపబడింది దేశం కోసం పోరాడిన ఒక ఫ్రెంచి యువతి, ఆక్రమణదార్లలాగా వచ్చి ఫ్రాన్సులో తిష్ఠవేసిన అమెరికన్ల వైపు ఆకర్షించబడటం విచిత్రం ఈ కథానాయిక అమాయకత్వంతో నిండిన ఒక పసిపిల్లలాగా చిత్రించబడింది ఈ మెలో చూపబడిన ముగ్ధత్వం వాస్తవికంగా లేదు ఈ చిత్రం తాలూకు ఆఖరు దృశ్యాలు ఆనందాన్ని ప్రతిరూపించేవి ఈ దృశ్యాలలో మనకు 19వ శతాబ్దపు ఫ్రాన్సు స్ఫురిస్తుంది వర్తమాన వాస్తవాన్ని విదిలించి గతంలోకి పలాయనం చేసినట్టయితే మనిషికి సుఖం ఉన్నదని ఈ చిత్రం సూచిస్తుంది

హాలీవుడ్ చిత్రాలు వర్తమాన వాస్తవాన్ని చిత్రించడానికి పూనుకుంటే అది ఫ్రాయిడ్ సిద్ధాంతాలపై నిర్మించిన పీడకలలాగా తయారవుతుందనటానికి ఉదాహరణ ''ఎ స్ట్రీట్ కార్ నేమ్డ్ డిజైర్'' ఈ చిత్రంలో కథానాయిక ఉన్మాది కూడానూ ఈమెకు తన వర్గం తాలూకు లక్షణాలు లేవు పశు ప్రేరణలతో సుడిగుండంలాగా తయారైన భయంకర జీవితంలో చిక్కి తన బావగారి చేత చెరచబడి చివరకు వెర్రి ఆస్పత్రికి చేరుకుంటుంది ఉద్రేకపూరితమైన సన్నివేశాల వెంట ఈ చిత్రం ఏర్పాటు చేసిన నేపథ్యసంగీతం నీగ్రోసంగీతం కథానాయకుడి కుటుంబం విదేశీయులు ఈ విధంగా ఈ చిత్రం మనిషి పై ఉద్రేకాలకు గల ప్రభావం అనివార్యమైనదని ప్రచారం చెయ్యటమేకాక, అమెరికనులు, తెల్లవాళ్ళు—కానివాళ్ళని పశుప్రాయులుగాకూడా ప్రచారం చేస్తున్నది

ఈ ''స్ట్రీట్ కార్'' చిత్రంలో కథానాయకుడు తన భార్యను చావగొట్టి తన మరదలిని చెరిచినా కూడా ఎంతో సానుభూతితో చిత్రించబడ్డాడు కాని హాలీవుడ్ చిత్రాలలో క్షమించరాని దుర్మార్గులుగా చిత్రించినబడిన వ్యక్తులు ఎవరంటే, సాంఘిక పరిస్థితులతో అసంతృప్తి చెందినవాళ్ళు, ''కమ్యూనిస్టు భావాల'' వైపు మొగ్గినవాళ్ళు ''మైసన్ జాన్'' అనే చిత్రంలో జాన్ పాత్ర కమ్యూనిస్టుకాడు కమ్యూనిస్టు గూఢ చారిణి అని చెప్పబడే ఒక యువతి ఇంటి తాళం చెవి అతని వద్ద ఉంటుంది ఆ ఇద్దరుఅన్యోన్యంగా ఉన్నట్టు అది రుజావు ఆ తాళం గూఢచారిణీ, జాన్ కలిసి ఏం చేశారో చిత్రం చెప్పదు కాని తన కొడుకును బాగు చేసే సదుద్దేశంతో అతని తల్లి ఫెడరల్ బ్యూరో అఫ్ ఇన్వెస్టిగేషన్ వాళ్ళకు కొడుకు పై ఆరోపణలు చేస్తుంది చివరకు జాన్ ''బాగు'' పడతాడు కాని అతను చేసిన ''పాపాలకు'' పరిహారంగా

అతను ప్రాణాలు వదలక తప్పదు  కొడుకుకు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పేటప్పుడు తల్లి దాదాపు ఉన్మాదినిలాగా అయిపోతుంది

ఫ్రాయిడ్ నిర్వచనాల ప్రకారం చిత్రించిన మానవ మనస్తత్వంలాగే అభ్యుదయ భావాలుకూడా జీవితాన్ని భయంకరమైన పీడ కలలాగా తయారు చేశాయని హాలీవుడ్ చిత్రాల తాత్పర్యం ''మైసన్ జాన్'' చిత్రానికి డబ్బు రాదు  ఇదే ధోరణితో తీసిన ''ఐవాంట్‌యూ'' చిత్రానికి కూడా ఇదే గతిపట్టింది

*అభ్యుదయ, మాసపత్రిక, ఏప్రిల్, మే, 1958*

# 72. ప్రజా సినిమా కళ

అభ్యుదయచిత్రాలు ఎలా ఉండాలి? సోవియట్ రష్యా, చైనా, తూర్పు యూరపు దేశాలలోని సినిమా చిత్రాలను చూసినట్లయితే అక్కడ ప్రజాసినిమా కళ ఏ ధోరణిలో అభివృద్ధి చెందుతున్నదీ తెలుస్తుంది  ఇవి శాంతి కాముక దేశాలు కావటం చేత వీటిలో తయారయే చిత్రాలలో యుద్ధప్రేరణగాని, ఘాతుకత్వంగాని,  బూతు శృంగారంగాని మచ్చుకైనా దొరకవు ఈ చిత్రాలలో కనిపించే వ్యక్తినీతీ, సంఘనీతీ హాలీవుడ్ చిత్రాలలో దానికి పూర్తి విరుద్ధంగా ఉన్నవి  హాలీవుడ్ చిత్రాలు మృత్యువును ప్రచారం చేస్తుంటే ఇవి జీవితాన్ని ప్రచారం చేస్తున్నాయి హాలీవుడ్ చిత్రాలలో నాయకులు దోపిడిగాళ్ళయితే  రష్యన్ చిత్రాలలో మౌసోర్గ్‌స్కీలాటి వాగ్గేయకారులూ, తారాస్ షెవ్‌చెంకోలాటి కవులూనూ, హాలీవుడ్ చిత్రాలలో శ్రామికులు పశువులుగా చిత్రించబడితే, రష్యన్ చిత్రాలలో శ్రామికులు  తమ జీవితాల్ని ఎలా నిర్మించుకుంటున్నదీ చిత్రించబడుతున్నది

రష్యాలోకూడా అనేక యుద్ధ చిత్రాలు తయారు చేయబడ్డాయి  కాని వాటిలో ఎక్కడా యుద్ధంలోని పశుత్వాన్ని  గొప్ప చేయటం జరుగలేదు  యుద్ధ అనుభూతి ప్రజలపై ఎలా పనిచేస్తుందో, వారు శత్రువును ప్రతిఘటించే శక్తులను తమలో ఏ విధంగా ఉత్పన్నం చేసుకున్నారో చిత్రించబడింది  ''యంగ్ గార్డ్'' లాంటి చిత్రాలలో దురాక్రమణ చేసిన శత్రువు నెదుర్కోవటానికి ఒకే దేశం ఎలా సన్నద్ధమయిందో, దేశాభిమానానికి వ్యక్తుల మధ్యగల భ్రాతృభావం ఎలా దోహదం చేసిందో, ఈ ప్రతిఘటనలో స్త్రీల కృషిఎంత గౌరవించబడిందో కనిపిస్తుంది  హాలీవుడ్ చిత్రాలలో ఇలాకాక,  తాము ఎందుకు యుద్ధం చేస్తున్నదీ తెలియని సైనికులూ, సైన్యంలో ఉండే కులతత్వమూ, సైన్యం వెంట స్త్రీలు నిర్వహించే నీచపాత్ర కనిపిస్తుంది, సైనికుల పరాక్రమం అర్థంలేని ఆవేశంగా చిత్రించబడింది విదేశీయులపట్ల వారికి గల అసహ్యం చిత్రించబడింది రష్యా యుద్ధచిత్రాలు తీయటం మానినా అమెరికాలో ఇంకా వాటినే తీస్తూ, యుద్ధానికి ఇంకా ఇంకా ఆకాశానికి ఎత్తుతున్నారు

జీవిత చరిత్రలు చిత్రీకరించటంలో కూడా హాలీవుడ్‌కూ, సోవియెట్ రష్యాకు తేడా ఉన్నది  జీవితం కళాకారుడి దృష్టికి అర్థరహితమైనదిగానూ దాని క్రౌర్యాన్ని సహించలేక గొప్ప కళాకారుడు సయితం తాగుడుతోనూ, ముండలతోనూ, జీవితం వెళ్ళబుచ్చినట్టు హాలీవుడ్ చిత్రాలలో కనిపిస్తుంది  సోవియట్ చిత్రాలలో మౌసోర్గ్‌స్కీలాంటి తాగుబోతు

కళాకారుణ్ణి చిత్రించినా, కళాకారుడుగా అతని ప్రభావం ప్రజలపై ఏవిధంగా పనిచేసిందీ, అతని కళ ఆనాటి సంస్కృతికి ఎంతగా తోడ్పడిందీ కనిపిస్తుంది

సోవియట్ చిత్రాలలోలాగే చైనా తదితర సోషలిస్టు దేశాలలో తయ్యారయే చిత్రాలు భవిష్యత్తును ఆశాజనకంగా చిత్రిస్తాయి సోవియట్ చిత్రాలతో పోల్చితే హాలీవుడ్ చిత్రాలలో మానవత్వమే లోపించినట్టు తోస్తుంది అందుచేతనే సోవియట్ చిత్రాలు పెట్టుబడిదారీ దేశాల ప్రజలనుకూడా బలంగా ఆకర్షిస్తున్నాయి

మార్షల్ పథకం కింద అమెరికా నుంచి సహాయం పొందిన ఫ్రాన్స్, ఇటలీ, ఇంగ్లండు, పశ్చిమ జర్మనీ మొదలైన దేశాలలో జాతీయ సినిమా కళలపై ''వాల్‌స్ట్రీట్'' (అమెరికా గుత్తపెట్టుబడిదార్ల) ప్రభావం సాగింది హాలీవుడ్‌కు అమెరికాలోని జాతీయ జీవితంపైననే ఆదరం లేదు అందుచేత అక్కడ తయారయ్యే చిత్రాలలో సంచిత సంస్కారం కనబడదు విలాసాలకోసం బతికే యంత్రాల్లాంటి వ్యక్తులు కనబడతారు ఈ చిత్రాలు ఇతర దేశాల వారితోబాటు అమెరికా ప్రజలని కూడా అవమానిస్తున్నాయి.

హాలీవుడ్ తయారుచేసే ప్రజావ్యతిరేక, అవినీతికర చిత్రాలను ఖండిస్తూ ప్రేక్షకులు ఉద్యమం సాగించకపోవటం ఎంతో శోచనీయం శ్రామికవర్గం ఆధ్వర్యాన అలాటి ఉద్యమం సాగటం అవసరం అప్పుడు ప్రజల యోగక్షేమాలకు అనుగుణమైన చిత్రాలు తయారయే అవకాశం ఉంది ఐతే అనేక మంది అభ్యుదయవాదులు సయితం అలాటి ఉద్యమం అసంభవమని నిస్పృహ చెందుతున్నారు

ఈ నిస్పృహకు కారణం ప్రజలలో తగినంత విశ్వాసం లేకపోవటమే హాలీవుడ్ సాగించే ఫాసిస్టు ప్రచారం, యుద్ధ ప్రచారం ఆర్థిక రాజకీయ సంబంధాలు గలది దానిని ప్రతిఘటించి తీరాలి ఉద్యమం నడిచినంత మాత్రంచేత హాలీవుడ్ ను గుత్తదార్లు విడిచిపుచ్చుతారని కాదు— డరిక్ జనూక్, సెసిల్ బి డిమిల్ లు ప్రజాతంత్ర వాదులుగా మారటము కల్ల కాని ప్రజల నుంచి ఒత్తిడి వస్తే సినిమా చిత్రాలలోని విషయం మార్పుచెందవచ్చు జనసామాన్యానికి ఎక్కని బూర్జువా ప్రచారం నిరర్థకం ప్రజలు తమ అదర్శ బంధాలను తెంచుకొని తిరుగబడకుండా ముందే జాగ్రత్త పడే ప్రయత్నంలో వాల్ స్ట్రీట్, వాషింగ్టన్‌లు భావస్వాతంత్ర్యాన్ని (అమెరికన్ విచారణల ద్వారా) అరికట్ట యత్నిస్తున్నాయి వ్యాపార చిత్రాల దుష్ప్రభావానికి వ్యతిరేకంగా పోరాటం జరగటంతోబాటు, స్వతంత్ర సినిమా చిత్రాల నిర్మాణానికి గూడా పోరాటం సాగాలి ఈ రెండు పోరాటాల సందున హాలీవుడ్ చిత్రాలలోని విషయం బోధపడుతుంది స్వతంత్రంగా తయారయిన చిత్రాలు ఇతర దేశాలలో విమర్శకుల మన్నలను అందుకోగలిగినట్లయితే హాలీవుడ్ అలాంటి చిత్రాలను అనుకరిస్తుంది వాస్తవికతనూ, ఉన్నత కళా ప్రమాణా లనూ సాధించి శాంతికోసం ప్రజాస్వామాన్యంలోగల తృష్ణను వ్యక్తీకరించే చిత్రాలు ప్రజలలో ప్రచారమైతే హాలీవుడ్ చిత్రాలు ఎంత విషపూరితమైనవో సులువుగా రుజువవుతుంది

''వినోదం'' అన్న పేరుతో హాలీవుడ్ తయారుచేసే విషాన్ని ప్రతిఘటించటానికి అన్ని రకాలవారూ ముందుకు రావలిసి ఉంటుంది శాంతి పోరాటంలో చేరేవారంతా కమ్యూనిస్టులు కారు వారిలో చాలామంది అమెరికా సామ్రాజ్యవాదాన్ని [illegible]లు

పరుస్తున్నదనికూడా ఒప్పుకోరు అలాగే సంస్కృతిలో వర్గ లక్షణా లున్నాయని ఆమోదించనివారు సయితం హాలీవుడ్ చిత్రాలలో కనిపించే యుద్ధ ప్రచారాన్నీ నేర ప్రచారాన్ని ప్రతిఘటించవచ్చు

అయితే సంస్కృతిలో ప్రతిబింబించే వర్గతత్వాన్ని అర్థం చేసుకోగలవారు ప్రతిఘటనకు మరింత ఆత్రంగా పూనుకుంటారు ఆజ్ఞానం లేని వారికి సంస్కృతి యొక్క ప్రాముఖ్యం తెలియదు వర్గసంఘర్షణ, దాని పాత్ర బోధపడదు దాని ద్వారా బూర్జువా వర్గం పొందే లాభాలను వారు అలక్ష్యంతో చూస్తారు ప్రజాక్షేమానికిగాను సంస్కృతి నిర్వహించగల పాత్రను తృణీకర్తిస్తారు

ప్రజలు అమాయకులనుకోవటం భ్రమ హాలీవుడ్ చిత్రాలను రాజకీయ ప్రచారానికి ఉపయోగించటం ఆరంభించాక, వాటిపై రాబడి తగ్గింది. అనమెరికన్‌వేటతో రాబడి బొత్తిగా పడిపోయింది 1950లో ఫిలడల్ఫియాలో 100 సినిమాథియేటర్లూ, క్లీవ్ లాండ్‌లో 30, కాలిఫోర్నియాలో 134, అమెరికా మొత్తం మీద 3000 థియేటర్లు దివాలా తీసాయి ప్రజలను తిరిగి ఆకర్షించటానికి హాలీవుడ్ వారు 3 డి, సినిమా, సినిమా స్కోప్ మొదలైన మార్పులు తెచ్చిపెట్టారు అంతులేని డబ్బును కుమ్మరించి కొత్తరకం యాంత్రిక పరికరాలు తయారు చేయించారు హాలీవుడ్ చిత్రాల పతనం వాల్ స్ట్రీట్ ను ఆర్థికంగా దెబ్బతీయటమేగాక ప్రచారం దృష్ట్యా కూడా అపజయమే అయింది

లోగడ అమెరికాలో కొన్నిచిత్రాలకు విరుద్ధంగా కొన్ని వర్గాలు ఆందోళన చేయటం జరిగింది ఈ అందోళన దేశమంతటా వ్యాపించిన సమయాలు కూడా ఉన్నాయి ''బర్త్ అఫ్ ఎ నేషన్ ''లో నీగ్రోలకు ఘోర మైన అన్యాయం జరిగింది ఇందుగురించి అందోళన జరిగినప్పటికీ దానికి డబ్బు బాగానే వచ్చింది అయితే ఆ చిత్రాన్ని ఇటీవలే పునః ప్రదర్శించటానికి చేసిన యత్నాలు పూర్తిగా విజయం పొందలేదు నాజీలను ఆకాశానికెత్తే ''డెజర్ట్ ఫాక్స్'' చిత్రం విడుదల కాకుండా చెయ్యటానికి ఆందోళన జరిగింది చిత్రమయితే విడుదల అయింది గాని అలాటి చిత్రాలు మరికొన్ని తీయాలనుకున్న ఉద్దేశ్యాన్ని నిర్మాతలు సంక్షేపించుకున్నారు అలాగే చార్లీచాప్లిన్ చిత్రం ''లైమ్ లైట్'' ప్రదర్శించకుండా ఉండడానికి జరిగిన ప్రయత్నాలు ప్రేక్షక వర్గం సాగించిన ఆందోళన మూలంగా విఫలమయ్యాయి

హాలీవుడ్ చిత్రాలకు విరుద్ధంగా సాగవలసిన అందోళనలో కార్మిక వర్గం ప్రముఖపాత్ర నిర్వహించవలసి ఉన్నది హాలీవుడ్ చిత్రాలలో ఎప్పుడూ కార్మికులను హీనపాత్రలుగానే సృష్టిస్తారు కార్మికోద్యమాలకు ఈ చిత్రాలు వ్యతిరేకంగా ఉంటాయి సమ్మెలు చిత్రించటం జరిగితే అసహ్యంగా ''సెంటిమెంటల్''గా ఉంటాయి

అయినప్పటికీ కార్మికవర్గ నాయకులు సంస్కృతికి సంబంధించిన విషయాలలో శ్రద్ధ ఏమీ చూపటం లేదు కార్మికులకు హాలీవుడ్ తయారుచేసే చెత్తచిత్రాలే కావాలని కొందరు వాదిస్తారు దురదృష్టవశాత్తు ఇది కొంతవరకూ నిజమే కూడా పైకారణం చేతనే కార్మికుల అభిరుచిని అభివృద్ధి పరచవలసిన అవసరం మరింత ప్రబలం అవుతున్నది కార్మికులు తమ వర్గశత్రువులు తమపైచేసే దుష్ప్రచారాన్ని ఆమోదించి ఆ వర్గంవారి అభిరుచులతో సంతృప్తిపడటం చాలా దారుణమైన సంగతి ఇటీవల హాలీవుడ్ వారు దేశాన్ని ఫాసిజానికీ, యుద్ధానికి సుముఖం

చేసే ప్రయత్నంలో కమ్యూనిస్టు వ్యతిరేక చిత్రాలు తీస్తున్నారు కాని ఈ సంగతి కూడా కార్మిక నాయకులు గుర్తించటంలేదు

ఆందోళనలో చేరాలిసిన మరొక వర్గం నీగ్రోలు హాలీవుడ్‌లో నీగ్రో విద్వేషం చాలా ఉన్నది అక్కడ తయారయ్యే చిత్రాలలో నూరింట తొంభై తొమ్మిదిలో నీగ్రో అన్నవాడు కనబడడు ఆఖరుకు వీధి జనంలోనూ, వాద్యబృందాలలోనూకూడా మచ్చుకు ఒక్క నీగ్రో కనిపించడు తమ నీగ్రో విద్వేషాన్ని దాచుకోటానికిగాను హాలీవుడ్ వారు కొద్ది నీగ్రో చిత్రాలను తీశారు, వాటిని చూసి కొందరుఅమాయకులు మురిసిపోయారుకూడా అయితే ఆ చిత్రాలలోకూడా నీగ్రోపాత్రల పోషణలో నీగ్రో విద్వేషం తొంగి చూస్తూనే ఉన్నది హాలీవుడ్ వారి నీగ్రో విద్వేషానికి వేరే తార్కాణం అవసరంలేదు 1919లో హాలీవుడ్‌లో గంటకింత అన్న లెక్కన పని చేసేవారు 3,681 మంది ఉంటే అందులో 175 మంది మాత్రమే నీగ్రోలు, వారిలోకూడా 165 మంది కేవలం నౌకర్లు

ఇంకొక వర్గం స్త్రీలు హాలీవుడ్ చిత్రాలలో స్త్రీలకు చాలా అవమానం జరుగుతుంది స్త్రీలను భోగ్యవస్తువులుగా చిత్రించటమూ, వారి మూలాన పురుషులు ఘోరాలు చేసేలాగు చిత్రించటమూ అవమానకరమైన విషయాలు ఇలాంటి చిత్రణయొక్క దుష్ప్రభావం యువతీ యువకులపైనా సాంసారిక జీవితంపైనా, నీతి వర్తనపైనా, సాంఘిక బాధ్యతలపైనా ఉంటుంది ఈ సంగతి స్త్రీ సమాజాలలో పనిచేసే లక్షలాది స్త్రీలను ఆందోళనపరచాలి స్త్రీలను కించపరచటంలో రాజకీయ ఆంతర్యం ఉన్న సంగతి గ్రహించలేని వారు మాత్రమే ఇలాటి స్త్రీ చిత్రం గురించి ఉదాసీనంగా ఉండగలరు

హాలీవుడ్ చిత్రాలలో సాగే ప్రచారం ముఖ్యంగా యువక వర్గం కోసం యుద్ధం కోరే సైనికాధికారులకూ, గుత్తదార్లకూ ఆయుద్ధంలో ఆహుతి కావలసిన యువకలోకానికీ మధ్య సారథ్యం జరిపేది హాలీవుడ్ చిత్రం అలాటి పరిస్థితిలో ఈ సినిమాలలో ఎదురయ్యే సమస్యను గురించి అభ్యుదయ యువక సంస్థలు సయితం నోరెత్తక పోవటం ఆశ్చర్యకరం

సినిమా తెరల మీద అమెరికను ప్రేక్షకులకు కనబడేదీ, వినబడేదీ ఫాసిజమూ, దాని కంఠమూనూ ఈ సంగతి వారికి బోధపడే లాగు ఒక్కసారి రుజువు చేసినట్టయితే తాము చూసి ఆనందించేది ''వినోదం'' అన్న భ్రమ మరి వుండదు

*అభ్యుదయ, మాసపత్రిక, జూన్,1958*

# 73. సినిమాలలో వింత అభ్యుదయ వాదం

సాధారణంగా మన చిత్ర నిర్మాతలు అభ్యుదయ భావాల ఛాయలకుపోరు వాళ్ళ కవి అర్థంకావు అర్థమైతే రుచించవు ఒక వేళ దారితప్పి రుచించినా వాటిని చిత్రాలలో ప్రవేశ పెడితే లాభించవని వారి నమ్మకం కొందరికి అభ్యుదయ వాదం గురించి చాలా అస్పష్టమైన భావాలుండటం వింత విషయం కాదు పేదవాళ్ళకష్టాలు చూపిస్తే అభ్యుదయ చిత్రమవు తుందని, చిట్ట చివరిలో ధనిక భూస్వామినో, పెట్టుబడిదారునో జైలుకు పంపితే (లేక చంపేస్తే) అభ్యుదయ చిత్రమవుతుందని అనుకునే వారున్నారు వీరికి వర్గసంఘర్షణ స్వరూపం గురించీ, స్వభావం గురించి బొత్తిగా తెలియక పోవటం కూడా కద్దు అజ్ఞానం లోపం కావచ్చు గాని నేరం కాదు

కాని కొద్దిమంది చిత్ర నిర్మాతలు— మిగిలిన వాళ్ళ కంటే గడుసు వాళ్ళు— అభ్యుదయ వాదాన్ని స్వలాభం కోసం వినియోగ పరచుకొని చిత్రాలు తయారు చేస్తున్నారు వీరు సరి అయిన అభ్యుదయ భావాలను తమ చిత్రాలలో ప్రవేశ పెట్టే పక్షంలో వారి ఆశయం స్వలాభమే అయినా ఎవరికీ పేచీ ఉండదు బూర్జువా పబ్లిషర్లు మార్క్సిస్టు సాహిత్యం అచ్చు వేస్తేఎవరూ కాదనరు! కాని మార్క్సిస్టు సాహిత్యం బురఖాతో మార్క్సిష్టు వ్యతిరేక భావాలు ప్రచారం చెయ్యటం జరిగినట్లయితే అది కేవలం స్వలాభాపేక్షతో చేసిన పనిగా కాక, సంఘదురన్యాయ నేరంగా పరిగణించి తీవ్రంగా విమర్శించవలసి వస్తుంది

సినిమా చిత్రాల విషయంలో ఇటువంటి దురన్యాయం జరుగుతున్నది అభ్యుదయ భావాల బురఖాచాటున ఇలాటి చిత్రాలు విషభావాలను ప్రజలలో వ్యాప్తి చేస్తున్నాయి దీనికి ఇటీవల విడుదల అయిన ''ముందడుగు'' మంచి నిదర్శనం ఈ చిత్రం పేరులోనే గాక సంభాషణలలో కూడా ''అభ్యుదయపు మసాలా'' విరివిగా వాడాడు కాని ఈ చిత్రంలో ఉన్న అభ్యుదయ భావాలన్నిటినీ తీసి పోగుచేస్తే వట్టి చెత్త తయారవుతుంది ఈ చిత్రంలో కార్మికుల దుస్థితి ఒక వంకా , వారి ఐక్యత మరొక వంకా చూపబడింది కాని వీరి సంభాషణలలో సమ్మెచేసే ప్రసక్తి రాదు ఇందుకు ప్రబలమైన కారణం ఉన్నది అదేమిటంటే ఈ కార్మికుల శత్రువు పెటుబడిదారీ వర్గం కాదు, పెట్టుబడిదారు కూడా కాదు— ఫ్యాక్టరీ మేనేజరు ఈ మేనేజరు చాలా చెడ్డవాడు, వర్గరీత్యాకాదు వ్యక్తిగతంగా ఇతను కార్మికులను నష్టపరుస్తాడు, హింసిస్తాడు, అయితే ఇది స్వలాభానికి మాత్రమే ఇతను ఒక వంక కార్మికులనూ, ఇంకొక వంక ఫ్యాక్టరీ ఖామందును కూడా దోస్తాడు (ఈ దోపిడీ ఫలితంగా ఫ్యాక్టరీయజమాని కార్మికుల మధ్య ఒక సామ్యం ఏర్పరిచే అవకాశం కథకుడికి లభించింది! ) దురాత్ముడైన ఈ మేనేజరు కార్మికులకు మూడు నెలల బోనసు లేకుండా చేస్తాడు ఫ్యాక్టరీ నౌకర్లను తన స్వంతానికి ఉపయోగించుకుంటాడు పనిచేసే ఒక అమ్మాయిని అందంకోసం ప్రేమిస్తాడు ఫ్యాక్టరీ ఖామందును పెళ్ళాడనున్న మరొక అమ్మాయిని డబ్బుకోసం ప్రేమిస్తాడు ఇదే మనం ఈ చిత్రంలో చూసే సాంఘిక దోపిడి!

అమెరికాలో అభ్యుదయ భావాలు అలవరుచుకు వచ్చిన ఫ్యాక్టరీ ఖామందు కార్మికుల కష్టాలను స్వయంగా తెలుసుకునేందుకై తాను ఒకకూలీలాగా నటిస్తూ వచ్చి తన ఫ్యాక్టరీలోనే ప్రవేశిస్తాడు కార్మికుల ఆర్థికబాధలు చూసి వారికి ఎడాపెడా డబ్బు పంచేస్తాడు ఇన్ని కష్టాలు పడుతూ కూడా కార్మికులు స్వాతి ముత్యపు చిప్పలు వాన చినుకు కోసం చూసినట్టు ''చినబాబుగారి'' రాకకోసం ఎదురు చూస్తూంటారు ''చినబాబు గారు'' వస్తే తమకష్టాలు గట్టెక్కి కార్మిక స్వర్ణయుగం ప్రారంభమవుతుందని వారికి తెలుసు ( వారి తప్పులేదు, ఈ చిత్రంలో వారు అనుకున్నంతా జరుగుతుంది! )

తనకూ కార్మికులకూ మధ్య వర్గవ్యత్యాసాలు లేవని రుజువుచేసుకునేందుకు ''చిన్నబాబు'' ఒక కార్మికస్త్రీని ప్రేమించి పెళ్ళాడేస్తాడు కార్మికులకు ఈ చినబాబు అభ్యుదయ మార్గం కూడా బోధిస్తాడు అతను చెప్పేవి ముచ్చటగా మూడే మాటలు (1) యజమానులు లేకపోతే కార్మికులులేరు కార్మికులు లేకపోతే యజమానులు లేరు (2)ఈ రెండు వర్గాల మధ్య సామరస్యం ఉంటే గాని దేశం బాగుపడదు (3) ఈ రెండు వర్గాల మధ్య భేదాలు కల్పించేవారి

మాటలు నమ్మరాదు

ఇదే ఈ చిత్రం ఇచ్చే కుళ్ళు సందేశం పారిశ్రామికులూ శ్రామికులూ అన్న రెండు వర్గాలూ విధిగా ఉండితీరాలని ఎక్కడా లేదు సోషలిస్టు ఆర్థిక విధానాన్ని అవలంబించిన దేశాలలో యజమానుల వర్గం లేదు కాని శ్రామికవర్గం ఉన్నది మనదేశంలోనే జాతీయం చేయబడిన పరిశ్రమలున్నాయి రెండు వర్గాలూ ఉన్నచోట ఈ రెండు వర్గాలకూ ''సామరస్యం'' ఉన్నట్టు కనబడినప్పుడల్లా రెండు విషయాలు అమలు జరుగుతున్నాయి ఒకటి కార్మికులు దోపిడీ విధానానికి తల ఒగ్గటం, రెండు యజమానులకు తగినంత లాభాలు వస్తూండటం ఈ రెంటిలో ఏది అమలు జరుగకపోయినా సమ్మెలూ, లాకౌట్లూ, ఫ్యాక్టరీల మూసివేతలూ జరిగి ''సామరస్యం'' భగ్నమవుతున్నది

ఫ్యాక్టరీ యజమాని ఎంత సజ్జనుడైనప్పటికి కార్మికులకు వర్గశత్రువే అన్న విషయాన్ని కప్పిపుచ్చటానికి ఈ చిత్రం ప్రయత్నిస్తున్నది యజమాని తీసే లాభాలు శ్రామికుల శ్రమశక్తి నుంచి రావలసి ఉండటం చేత ఈ వర్గ శత్రుత్వం ఏర్పడుతుంది ఆ సంగతి గుర్తించి అంతఃకరణ చేత పీడించబడే యజమాని తన లాభాలలో కొంత భాగాన్ని కార్మికులతో పంచుకోవచ్చు కాని అప్పుడుకూడా వర్గ వ్యత్యాసం పోవటంలేదు ఏ పరిస్థితుల్లోను రెండు వర్గాలు ఒకటి కాజాలవు వీటి మధ్య పరిమితమైన ఆ సామరస్యం కూడా సాధ్యమే ఆ సామరస్యం దేశీయ పరిస్థితిని అనుసరించి బయటి శత్రువుల వల్ల భయం కలిగినప్పుడూ, కార్మికులకు అనుకూల మైన చట్టాలు ఏర్పడటం చేతా సాధ్యపడుతుంది

వర్గ సంఘర్షణను గురించి చెప్పేవారు కార్మిక వర్గానికి శత్రువులని ఈ చిత్రం చేసే సూచన చాలా హేయమైనది వర్గసంఘర్షణ ఒకరు సృష్టించ నవసరంలేదు వర్గనిర్మాణం వెంటనే వర్గసంఘర్షణకూడా ఉన్నది అయితే పీడిత వర్గంలొంగిపడి వుండి, ఆత్మరక్షణ చేసుకోనంత కాలమూ గుడ్డివాళ్లకు సంఘంలో వర్గపోరాటం లేనట్టే కనిపిస్తుంది వర్ణస్తులు అవర్ణులను అస్పృశ్యులుగా ఉంచటంలో వర్గపోరాటం లేదా? అస్పృశ్యులు అణిగి మణిగి పడి ఉండి తమ అస్పృశ్యతను అమోదించినంత కాలమూ సంఘంలో ''శాంతి'' ఉన్నట్టు భావన కలుగుతుంది కాని అది శాంతి కాదు, అస్పృశ్యత నిర్మూలమైనాక ఏర్పడేదే సరి అయిన శాంతి

మన భారతదేశం వర్గ రాహిత్యాన్ని గమ్యంగా పెట్టుకున్నది ఈసంగతి ''ముందడుగు'' నిర్మాతలకు స్పష్టంగా తెలిసినట్టు లేదు వర్గ రాహిత్యం అమలు జరిగిన నాటికి శ్రామిక వర్గం ఉంటుంది, యజమానుల వర్గం ఉండదు చరిత్ర యొక్క గమనం తెలుసుకోలేని వాళ్ళు ''అభ్యుదయ'' భావాలను తాము తెలుసుకోలేరు, ఇతరులకు చెప్పనూ లేరు ఈనాడున్న వర్గాలలో ఏ వర్గం ఉండేదో, ఏ వర్గం ఊడేదో కూడా గ్రహించలేని వాళ్ల అభ్యుదయ చిత్రాలు తియ్యటం హాస్యాస్పదం

''ముందడుగు'' లాటి చిత్రాలు అదివరకు వెలువడ్డాయి ఇక ముందు వెలువడతాయి కాని ప్రజలు వీటిలో ఉండే కుళ్ళును చూసి అదంతా అభ్యుదయమని భ్రమించరాదు

*ముద్రణ అభ్యుదయ మాసపత్రిక , ఆగస్టు 1958*

*పునర్ముద్రణ సాహిత్య ప్రయోజనం, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, అక్టోబరు 1969*

# 74. శాఖోపశాఖలుగా విస్తరిస్తున్న అధునాతన కళా వైవిధ్యానికీ సంప్రదాయ కళా సంస్కృతికీ ఎట్టి సంబంధమూ లేదు

కళను గురించి ఈనాడు చర్చించే వారు పాత ప్రమాణాలను ఉపయోగిస్తూ ఉండటం చూసినప్పుడల్లా, పిడుగుకూ, బియ్యానికీ ఒకే మంత్రమా అన్న లోకోక్తి స్ఫురిస్తూ ఉంటుంది ఒకప్పుడు సంగీతమన్నా, సాహిత్యమన్నా, చిత్ర లేఖనమన్నా, నటన అన్నా ఒకే దినుసు మనసున మెదిలేది ఆ పరిస్థితి ఏనాడో పోయింది సంగీతమంటే కచ్చేరీ సంగీతమూ కావచ్చు సినిమా సంగీతమూ కావచ్చు, స్టేజి సంగీతమూ కావచ్చు రేడియోలో వినిపించే లలిత సంగీతం కూడా కావచ్చు వీటిలో మళ్ళీ ప్రాంతీయ బేధాలున్నాయి

అదేవిధంగా సాహిత్యమంటే పురాణాలు పునర్లేఖన కావచ్చు కొద్ది మందికి మాత్రమే అర్థమయ్యే ''విశిష్ట'' రచన కావచ్చు, పత్రికలలో పుష్కలంగా వెలువడే కథా, సీరియల్ సాహిత్యం కావచ్చు సినిమా సాహిత్యమూ, రేడియో సాహిత్యమూ కావచ్చు డిటెక్టివ్— అద్భుత రస ప్రధాన మిస్టరీ సాహిత్యం కూడా కావచ్చు

చిత్ర లేఖనంలో ఆధునిక పాశ్చాత్య పద్ధతుల పంపిణీ, అజంతా పంపిణీ, ఓరియంటల్ ఆర్ట్, పోర్ట్రేట్ పెయింటింగ్, రేఖా చిత్రాలూ సినిమా తారలను పత్రికల కవరు పేజీలకు అనుగుణంగా చేసే ఆర్టు, కథలకు బొమ్మలు వేసే ఆర్టు, సినిమా చిత్రాలలో మేకప్, గెటప్, సెట్లూ, సెట్ డైరెక్షన్ మొదలైనవి చేసే ఆర్టూ, కార్టూన్ బొమ్మలు వేసే ఆర్టూ మొదలైనవి సవాలక్ష ఉన్నాయి

నటన తీసుకుంటే—

ఈవిషయాన్ని కొంచెం తాపీగా తీసుకుందాం నటనలో అది వరకే చాలా రకాలు ఎరుగుదుము నృత్యం చేసే వారి అభినయం ఒక రకమైన నటన వీధి నాటకాలలో మరింత స్వేచ్ఛ కనిపిస్తుంది ఇదే స్వేచ్ఛ స్టేజి నాటకాలలో ఇంకా చాలా హెచ్చుగా కనిపిస్తుంది నర్తకి చేసే అభినయానికీ, స్టేజీ నటుడు చేసే నటనకూ ఉండే తేడా మనందరికి తెలుసు నర్తకి ఎంత నేర్పుగా అభినయించినా పారం వొప్పగిస్తున్నట్టే ఉంటుంది స్టేజీ నటుడు తన నటన ద్వారా తాను ధరించిన పాత్ర యొక్క మనోభావాలను వాస్తవంగా ప్రేక్షకులకు ప్రత్యక్షం చేస్తున్న వాడిలాగా కనిపిస్తాడు అతను కట్టుబడి ఉండేదల్లా నాటక రచయిత రాసిన సంభాషణలకు మాత్రమే అందుచేత, ప్రేక్షకుడు కేవలం నాటకం చదివినందువల్ల పొందలేక ప్రదర్శన ద్వారా పొందే రసానుభూతి కంతకూ క్రెడిట్ నటుడిదే

నాటకానికి కూడా డైరెక్టరు ఉండవచ్చు ఉన్నప్పటికీ స్టేజీ మీద ఉన్న నటుడు తాను చేసే ప్రతి పనికి తానే బాధ్యుడై ఉంటాడు

సినిమా నటన దగ్గరికి వచ్చేసరికి నటన అనేది చాలా మారిపోతుంది ఇక్కడ నటనలో వాస్తవికత మరింత హెచ్చు స్టేజి పైన ''సహజంగా'' ఉన్నవనిపించుకునే ముఖ భంగిమా, ఉచ్చారణా, పోజూ వగైరాలు సినిమాలో ఎంతో కృత్రిమంగానూ, అసహజంగానూ కనిపిస్తాయి

సినిమాలో నటుడి కృషికి సార్థక్యం సాధించిపెట్టే వాళ్ళు చాలా మంది ఉన్నారు డైరెక్టరూ, కామెరా మన్, మేకప్ మన్, ఎడిటర్ మొదలైన వారు స్టేజి నటుడితో పోలిస్తే, సినిమా నటుడి బాధ్యత తక్కువేనని చెప్పాలి ఎందుకంటే నటుడి భావ ప్రకటన ఎంత మోతాదులో ఉండాలో, ఎప్పటికప్పుడు డైరెక్టరు నిర్ణయిస్తాడు రిహార్సలు చేసే వేడితోనే ''టేక్'' జరిగిపోతుంది షాట్ నిర్దుష్టంగా వచ్చిన దాకా టేక్‌లు తీస్తూపోవచ్చు

నటనకూ మీడియం (ఇక్కడి సినిమా) కూ గల సంబంధాన్ని మాత్రమే పైన అనుకున్నాం మీడియమ్‌కూ ప్రేక్షకులకూ గల సంబంధం కూడా సినిమా నటనను చాలా భాగం శాసిస్తుంది

నాటకం కంటే సినిమా సామాన్య ప్రజలకు అత్యంత సన్నిహితమైన మీడియం ఆమాటకు వస్తే అంతకన్న ప్రజాస్వామాన్యానికి సన్నిహితమైన మీడియం మరొకటి లేదు సామాన్య ప్రజలు అనే సరికి వారి ప్రమాణాలు వేరుగా ఉంటాయి వారిలో కళా విమర్శనా శక్తి దాదాపు ఏమీ ఉండదు వారి సెంటిమెంట్స్ వేరుగా ఉంటాయి వారి దృష్టిలో తెల్లనివి పాలు నల్లనివి నీళ్ళు అందమైన ముఖంగల అమ్మాయి స్వభావం కూడా అందంగానే ఉంటుందనుకుంటారు నాయికా నాయకులు చిలకా గోరింక ల్లాగా ఉండాలి హీరో, విలన్ వేషాలు వేయకూడదు! విలన్ అందంగా ఉండనక్కర్లేదు నటుడికి నటుడు ధరించే పాత్రకూ వాళ్ళు వ్యత్యాసం చూడలేరు

అత్యాధిక సంఖ్యాకులైన సాధారణ ప్రేక్షకుల మనస్తత్వం ఈ విధంగా ఉండబట్టే స్టార్ సిస్టమ్ అనేది సాధ్యమయింది వారు పాత్రలను చూడటానికి రారు తమకు చూడ ముచ్చటైన ఆడ మగ నటులను—తారలను—చూడటానికి వస్తారు అంజలి ముసలి వేషంలో కనిపిస్తే వారి గుండె కాస్తా అవిసిపోతుంది వాళ్ళు ''దేవదాసు'' చూసి సావిత్రి కోసం నాగేశ్వర్రావే అంతగా పతనమైనట్టు భావించి సానుభూతి చూపుతారు

ఇదంతా ప్రజాసామాన్యం యొక్క అజ్ఞానమనీ, వాళ్ళు వెర్రి వాళ్ళనీ అనుకోనవసరం లేదు వారికీ కళకూ ఉండే స్థాయి ఒక దశలో ఇటువంటి అమాయకత్వాన్ని ఆశ్రయించి ఉంటుంది మేధావులన దగిన వారికి కృత్రిమంగా ఉండే సన్నివేశాలు వారికి సహజంగా ఉంటాయి (లేకపోతే జానపద చిత్రాలు ఎట్లా డబ్బు చేసుకునేటట్టు?)

సినిమా నటనపై డబ్బిచ్చే, అధిక సంఖ్యాకులైన ప్రేక్షకుల అభిరుచి యొక్క ప్రభావం యేవిధంగా వుంటున్నదీ మనం చూడవచ్చు

తాను ధరించే పాత్రలో లీనమైపోయి తన వ్యక్తిత్వాన్ని పూర్తిగాగాని, చాలావరకు గాని మరుగుపరచగల నటులను 'కారెక్టర్ ఆక్టర్ ' అంటారు ఈ రకం నటులకు రంగ స్థలాన మోయలేనంత ఖ్యాతి లభిస్తుంది సినిమాలలో కూడా మనం అరుదుగా కారెక్టర్ ఆక్టింగ్ చూస్తాం నేపాళ మాంత్రికుడూ, సున్నం రంగడూ, వియ్యన్న పాత్రలు ధరించినప్పుడు ఎస్ వి రంగారావు కారెక్టర్ ఆక్టర్ గుమ్మడి దాదాపు ప్రతి చిత్రంలోనూ ఒక్కొక్క కొత్త రకం పాత్రను సృష్టిస్తున్నాడు.

అయితే నటుడిలో ఇలాటి అసాధారణ నటనా సామర్థ్యం ఉన్నందుకు సినిమా ప్రేక్షకులు హర్షించరు వారు చూడ గోరేది నటుడి వ్యక్తిత్వమైనపుడు, తాను వ్యక్తిత్వాన్ని మరుగు పరిచి మరొక మనిషి అయిపోయే నటుడితో వారికేం పని? స్టేజి పైనా, సినిమాలలోనూ కూడా

మంచి అనుభవం గల రాబర్ట్ డోనట్ సినిమా నటన గురించి ఆదర్శప్రాయుడైన సినిమా నటుడు అంత మంచి నటుడు కాకూడదు అన్నాడు అమితమైన అనుభవమూ, కీర్తి గడించిన హాలీవుడ్ నిర్మాత, దర్శకుడు, ఫ్రాంక్ కాప్రా, తనకు కారెక్టర్ ఆక్టింగ్‌లో నమ్మకం లేదన్నాడు నటుడు తన పాత్రనే తెర మీద చూపినప్పుడు ఆ నటన రక్తి కడుతుందన్నాడు ఇదే అభిప్రాయాన్ని ఒక అనుభవం గల తెలుగు చిత్ర నిర్మాత మరొక రకంగా చెప్పారు ఆయన అన్నమాట ఏమిటంటే, పిక్చర్లో కారెక్టర్ ఆక్టింగ్‌కు అవకాశమిస్తే తప్పక పిక్చరు దెబ్బతింటుందనీ ఇది అక్షరాల నిజమైనా, కాకపోయినా తెర మీద కారెక్టర్ ఆక్టింగ్ ఆవశ్యకత ఏమీ లేదంటానికి సందేహం ఏమీ లేదు

ఈ విషయం ఈనాడు ప్రత్యేకించి రుజువు చేయనవసరం లేదు సినిమా చిత్రాలలో స్టేజి నటులే నటించాలన్న నియమం వెనకబడిన నాటినుండీ ఈ విషయం రుజువవుతూనే ఉన్నది ఎందరో నటులు స్టేజి అనుభవం లేకుండానే సినిమా నటనకు పూనుకున్నారు స్టేజి నటులుగా అనుభవం పొంది వచ్చిన వారు కూడా తమ స్టేజి అనుభవాలను అవతల పెట్టి కామెరా ముందు నిలబడుతున్నారు ఆ పని చెయ్యటం చేతకాని బళ్ళారి రాఘవాచారి గారి వంటి నటులకు సినిమాలో స్థానం లభించలేదు

సినిమా కళకు కాక పోయినా సినిమా పరిశ్రమకు మక్కాలాంటి హాలీవుడ్‌లో కూడా బహుకొద్ది మంది నటులే స్టేజి పైన విజయం సాధించి మరీ వస్తారు ''టాలెంట్ స్కౌట్''లు కొత్త నటుల కోసం ఫ్యాక్టరీలలోనూ, కాలేజీలలోనూ సయితం వెతుకుతారు ఒక సుప్రసిద్ధ హాలీవుడ్ నటుడు లారీ డ్రైవరు ఈ విధంగా తెచ్చిన వాళ్ళను సినిమా నటులుగా తయారు చెయ్యటానికి హాలీవుడ్ సినిమా కంపెనీల వాళ్ళు కొన్ని శ్రమదమాలు పడతారు డబ్బు ఖర్చు చేస్తారు ఇవాళ కాకపోతే రేపైనా మన నిర్మాతలు అదేపని చేసితీరాలి

సినిమా నటులు— మరొక రంగంలో స్టేజిపైన సయితం—రెడీమేడ్‌గా దొరకరు సినిమా కళ సామాన్య ప్రజానీకానికి అత్యంత సన్నిహితమైన కళ కావటమూ, దానితో పాటు భారీ పెట్టుబడితో కూడిన వ్యాపారం కావటమూ ఇందుకు ప్రధాన కారణాలు

ఒక్క సినిమాయే కాదు, శాఖోపశాఖలుగా విస్తరించి ప్రజా సామాన్యానికి సన్నిహితంగా వెళ్ళిన ఏ కళకూ పూర్వ కాలపు కళా ప్రమాణాలు వర్తించవు ప్లే బాక్ పాడటానికి విద్వాన్ డిప్లొమో దేనికి? రాగలక్షణజ్ఞానం దేనికి? గొంతులు కమ్మగా ఉండాలి, ఏడుపు పాటలైతే పాట మధ్యనే ఎక్కిళ్ళు, గాద్గదికమూ తెప్పించటం చాతకావాలి తాగుబోతు పాటలైతే తాగిన వాడిలాగా పాడటం చాతకావాలి

అదే రీతిగా డిటెక్టివ్ సాహిత్యం రాయటానికి భాషా పరిజ్ఞానం అవసరంలేదు ''ఈ డిటెక్టివ్ రచయితకు తెలుగు మాటలే తెలియవే!'' అని విమర్శించిన వాడు వెర్రి కుట్టె ఏ కళ అయేది గాక, దాన్ని సృష్టించే వాని తెలివి తేటలు దాన్ని ఆస్వాదించే వాళ్ళ తెలివితేటలకు ఒక్కపిసరుపైగా ఉంటే పని వెళ్ళ మారటమే గాక, అంతకంటే ఎక్కువ తెలివి తేటలు లేకుండా ఉండటం ఆర్థికంగా క్షేమం, వ్యాపార ధర్మంలో!

*కృష్ణా పత్రిక, వారపత్రిక, 16–7–1960*

# 75. సినిమాలో కళాకారుల స్థానం

సినిమా కళ అమెరికాలో పుట్టి ఇతర దేశాలకు వలస వెళ్ళింది ఈ దేశాలు సినిమా కళకు న్యాయంగా స్వక్షేత్రాలు కావు అందుచేతనే ఈ కళ వివిధ దేశాలలో పొందిన పరిణామం ఆయా దేశాల పరిస్థితులను అనుసరించి వివిధంగా ఉన్నది

సాంకేతికంగా సినిమా చిత్రం ఉత్తమ యంత్రాలు ఉత్పత్తి చేసే సరుకు, వ్యాపార రీత్యా దాని ఉత్పత్తికీ, వ్యాప్తికీ (ప్రదర్శనకు) అవసరమైన వ్యవస్థాపన సమర్థంగా జరిగి ఉన్నది సాంఘికంగా ప్రతి ఒక్కరికీ కూడా అది అందుబాటులో ఉండి, చవుకగా కూడా లభించే కళా రూపం కళా దృష్ట్యా అందులో ప్రతిబింబించని సాంఘిక కళ లేదు

ఈ కారణం చేత కళాకారుడైన ప్రతి ఒక్కడు సినిమాలో స్థానం దొరకాలని ఆశిస్తాడు కళాకారులలో కేవలం ప్రఖ్యాతి కావలసిన వాళ్ళూ, కేవలం డబ్బే ప్రధానంగాగల వాళ్లూ, తమ కళ యొక్క ప్రభావం ప్రజలపైన పడి ఆ కళ సఫలం కావాలనుకునే వాళ్ళూ ఉండటం మనకు తెలుసు అయితే కళాకారుడి ఆశయం పైవాటిలో ఏది అయినప్పటికీ అతనికి సినిమా కన్న మంచి సాధనం దొరకదు ఎందుకంటే సినిమాలలో కీర్తీ, డబ్బూ ఉండటమే గాక, అత్యధిక సంఖ్యాకులు దాన్ని ఆదరిస్తారు

అయితే మన దేశంలో సినిమా అవతరించే నాటికి ప్రజలకు సన్నిహితంగా ఉండిన కళాకారులంటూ లేరు— ఒక్క నటులను మినహాయిస్తే అభివృద్ధిలోకి వచ్చిన ''వ్యాపార కళలు'' కూడా లేవు అది ఒక అరణ్యంలో అవతరించింది అందుచేత తొలికాలంలో సినిమా పురోభివృద్ధికి అవసరమైన కళాకారులు సినిమా రంగంలోనే శిక్షణ పొందటం జరిగింది

చిత్రమేమిటంటే, దాదాపు అర్ధ శతాబ్దంగా దేశీయ సినిమా కళ పరిణామం చెందుతూ వస్తున్నప్పటికీ, కళాకారులకు సినిమాకు మధ్య ఉండే ఈ అగాధం మీద సరిఅయిన వంతెన ఏర్పడలేదు

'' దేశంలో ఉండే ప్రతిభావంతులైన కళాకారులలో హెచ్చుమంది సినిమా రంగంలో ఉన్నారు భావి కళాకారులకు సినిమా ద్వారాలు తెరచి ఉన్నాయి '' అని ఎవరూ సాహసించి అనలేరు

సినిమా పరిశ్రమ ప్రధానంగా వ్యాపారం గనకనూ, చిత్ర నిర్మాణానికి అవసరమైన మొత్తాలు పెద్దవి గనకనూ కళా దృష్టికి ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వబడటంలేదని కొందరు అనవచ్చును

కాని ఈ ''వ్యాపార దృష్టి'' అన్నది చాలా మంది కళ్ళకు శుక్లంలాగా అడ్డు తగిలి, వారిని అంధులను చేస్తున్నట్టు కనబడుతుంది ఎందుకంటే

ఒకటి వ్యాపార దృష్టికీ, కళా దృష్టికీ స్వభావ సిద్ధమైన వైరుధ్యం ఏమీలేదు సినిమాలు రసాత్మకంగా ఉండే ఉద్దేశంతోనే తీసేవాళ్ళు తీస్తున్నారు, చూసేవాళ్ళు చూస్తున్నారు అంటే తీసే వాళ్ళ దృష్టిలోనూ, చూసే వాళ్ళ దృష్టిలోనూ కూడా సినిమా కళే

రెండు సినిమా చిత్రాలన్నిటినీ వ్యాపార దక్షులైనవారు వ్యాపార దృష్టితోనే తీస్తున్నట్టయితే

ఏటా అన్ని ''పిక్చర్లు'' దెబ్బతిననవసరం లేదు

మూడు చిత్ర నిర్మాతలు వ్యాపార దక్షులే అయినట్టయితే సినిమా కళను ప్రజలకు మరింతఆదరణీయంగానూ, మరింత సన్నిహితంగానూ ఉండేటట్టు చూడటానికి తీవ్రమైన పోటీ జరిగి ఉండేది

ఈనాడు సినిమా రంగంలో వ్యాపార దృష్టి ముఖ్యంగా ఉన్నదనటానికి బోలెడన్ని నిదర్శనాలు చూపవచ్చు పోటీ కంటే అనుకరణ జాస్తిగా ఉంటున్నది కొత్త ''టాలెంటు'' కోసం అన్వేషణ లేక పోవటం, విడుదలకు సిద్ధంగా ఉన్న చిత్రం గురించి కూడా నిర్మాత దాని గతి ఏమి కానున్నదో, రెండు మూడు లక్షలు అటూ ఇటూగా చెప్పలేక పోవటం, ఏటా పదిహేను చిత్రాలలో కనిపించే నటీ నటులకు తారలని పేరుపెట్టి విపరీతంగా డబ్బిచ్చుకోవటం — నటులకు బుకింగులు జాస్తి అయిన కొద్దీ రేటు కూడా పెరగటం, అనుభవం గల నిర్మాతా, లేని నిర్మాతా, అన్ని హంగులూ కలవాడూ, కొత్తగా వచ్చినవాడూ ఒకే రకం చిత్రాలు తయారు చేయటం, వగైరా

ఇవేవీ వ్యాపార లక్షణాలు కావు

ఈనాడు మన సినిమా ఉన్న పరిస్థితికి ఒకే ఒక కారణం ఉన్నది — ఈ పరిశ్రమకు నాథులు లేరు

సినిమా వ్యాపారాన్ని కొత్తమార్గాల నడిపించి, దాని ఆర్థిక విజయానికి, పురోభివృద్ధికి పునాది వెయ్యగలవారు నిర్మాతలు

సినిమా కళను నిత్యనూతనంగా ఉంచుతూ, ప్రజలకు రసానుభూతిలో కొత్తచవులు సృష్టించగలవాళ్లు దర్శకులు

రానురాను తెలుగు సినిమా రంగంలో ఈ రెండు తరగతులూ క్షీణించి పోతున్నాయి ఈనాడు హెచ్చుమంది నిర్మాతలు కాంట్రాక్టర్లనిపించుకుంటారు సినిమా రంగంలో ఉన్నతాసనాలు వేసుకుని కూచుని ఉన్న నటీనటులెవరో, రచయితలెవరో, పాటలు రాసే వాళ్ళెవరో, మ్యూజిక్, ఆర్టు, డ్యాన్సు డైరెక్టర్లెవరో, కెమెరామెన్ వగైరాలెవరో అందరికీ తెలుసు వారిని బుక్ చెయ్యటానికి తాహతు గల వాడెవడైనా నిర్మాతగా సినిమా రంగంలో అడుగుపెట్టవచ్చు అనుభవంగాని, ఇతర అర్హతలుగాని, ఆఖరుకు వ్యాపార దక్షత గాని అవసరంలేదు ఇటువంటి నిర్మాత కాకతాళీయంగా ఒక డబ్బు వచ్చే పిక్చరు తీశాడో, ఆయనకు ఉన్నతాసనం కూడా లభిస్తుంది

ఒకప్పుడు డైరెక్టర్లకు నిజమైన ఆదరణ ఉండేది చిత్రానికి రూపురేఖలు ఇవ్వటంలో డైరెక్టరు కృషి ఉండేది ఈనాడు అదంతా లేదు ఎవరైనా డైరెక్టరు కావచ్చు రాను రాను డైరెక్ను కూర్గిఖేరిర్యబీ ర్మామూఖగా పరిణమిస్తున్నట్టు కనిపిస్తుంది

కొత్త డైరెక్టర్లు విరివిగా రావటమే అవలక్షణమని నేను అన్నాను అసలైన అవలక్షణం చిత్రాలలో ''డైరెక్షను'' అన్నది ఉండకపోవటం, ఏ షాట్ చూసినా, 'దీన్ని తీయటానికి ఒక డైరెక్టర్ ఎందుకు?'' అనిపించటం

అందరూ ''కొత్తమొహాలు'' కావాలని తరచు అంటూంటారు కొత్తరకం ప్రొడ్యూసర్లు రావాలన్న నినాదం ఎక్కడా వినలేదు కాని అది స్వయంగా నా నినాదం ఒక్కొక్క కొత్త

నిర్మాత వచ్చి చిత్ర నిర్మాణంలో కొత్త పోకడలు ఏ విధంగా ప్రవేశపెట్టినదీ దాదాపు 30 ఏళ్ళుగా నేను చూస్తున్నాను

చరిత్ర దృష్టి గలవారికి కొత్త నిర్మాతల విలువ బాగా తెలుస్తుంది ఇటీవల కాలంలో సత్యజిత్‌రాయ్ వంటి నిర్మాత సినిమా రంగంలోకి వచ్చి సినిమా కళకూ, భారతీయ సినిమా పరిశ్రమకూ ఎంత మేలు చేశాడో మనకందరికీ తెలుసు నిర్మాతయొక్క దృక్పథం గుర్తించలేని వాళ్లు ''అందరూ సత్యజిత్ రాయ్ లాగా ఎందుకు చిత్రాలు తీయరాదు?'' అని అడుగుతారు అలా చెయ్యటం అనుకరణే అవుతుంది సత్యజిత్ రాయ్ వంటి వాడే రానవసరంలేదు కొత్త అవకాశాలు సృష్టించగల ఏ నిర్మాత వచ్చినా పరిశ్రమకు మంచిదే

కొత్త రకం నిర్మాతల అవతరణం మరొకందుకుకూడా అవసరం మనదేశంలో నిర్మాతలు త్వరగా వట్టిపోతున్నారు శాంతారాం వంటి అత్యల్ప సంఖ్యాకులను మినహాయిస్తే వాళ్ళ స్థానంలో కంట్రాక్టర్లు రావటం పరిశ్రమకు ఏవిధంగానూ మంచిది కాదు

ఒకే చిత్రం దృష్ట్యా చూసేవారికి మంచి డైరెక్టరు విలువ తెలుస్తుంది అందుకే మిత్రుడు అక్కినేని తరుచు మంచి డైరెక్టర్ల ఆవశ్యకత గురించి మరీ మరీ చెప్పటం! ప్రతీ నటుడికీ, నటికి మంచి డైరెక్టరు చేతిలో పడి శోభించాలని ఉంటుంది తారత్వాన్ని అమ్ముకుని, తండులాలు పోగు చేసుకోవటమే ఆదర్శం గల వాళ్ళకి తప్ప

కళా శక్తిలేని డైరెక్టరు నటుడి శక్తులను పూర్తిగా బయటికి లాగలేడు నటుడి ప్రతి చిన్న కదలికను భావగర్భితంగా ఉండేటట్టు చెయ్యాలంటే డైరెక్టరులో చాలా దక్షత ఉండాలి అవసర నైవేద్యంగా డైరెక్టరులవుతున్నవారు ఈ పని ఏ మాత్రమూ సాధించలేకుండా ఉంటున్నారు

ఇదంతా ఇలా ఉండగా సినిమా రంగంలో ఒక చిత్రమైన డయలెక్టిక్స్ కనిపిస్తున్నాయి మామూలు డైరెక్టర్లు ఏడాదికి ఒకటి, రెండు పిక్చర్లు తీస్తుంటే మామూలు నటులు కనీసం ఏడెనిమిది పిక్చర్లలో నటించి చిత్ర నిర్మాణం గురించి ఎక్కువ అనుభవం సంపాదిస్తున్నారు ఈ కారణం చేత ఎంతో మంది డైరెక్టర్లు 'ఐడియాల'ను నటులకే వదిలి వెయ్యటం జరుగుతోంది

ఇంత కంటె కూడా శీఘ్రంగా జ్ఞానం సంపాదిస్తున్న వాళ్లు ఏడాదికి 30 తెలుగు చిత్రాలు, ఇతర హిందీ వగైరా చిత్రాలూ చూస్తున్న ప్రేక్షకులు ఈ అనుభవం ఫలితంగా వారికినిన్న రసభూయిష్టంగా కనిపించిన సన్నివేశం ఇవాళ రసహీనంగా తోస్తున్నది సామాన్యంగా ప్రేక్షకులను అమిత గ్రహణ శక్తిలేని వాళ్లుగా పరిగణించే నిర్మాతలు చాలాసార్లు పొరపాటు పడుతుండాలి ఈ పొరపాట్లను మనం విడివిడిగా రుజువు చెయ్యలేక పోవచ్చుగాని మంచి ''ఫార్ములా'' అనుకున్నది బాక్సాఫీసులో దెబ్బతినటం మనం చూస్తూనే ఉన్నాం

ప్రేక్షకులు హెచ్చు విమర్శనాజ్ఞానం కలవారు కారన్నంతవరకు నిజమేగాని చూసిన లోపాలనే మళ్ళీమళ్ళీ చూడటంతో వారికి కొన్ని రకాల లోపాలను గురించే శక్తి అలవడుతున్నది

ప్రస్తుతం సినిమా పరిశ్రమ సుడి గుండంలో పడి తిరుగుతున్నది అందరూ అసహాయస్థితిలో ఉన్నట్టే కనిపిస్తారు ఎవరికీ ఈ పరిశమను తాము నిర్ణయించిన దారిన నడిపించే శక్తి ఉన్నట్టు కనబడదు కొత్త భావాలతో, కొత్త రకం కథలతో, కొత్త నిర్మాణ విధానాలతో చిత్రాలు తీసేవారికి ఇది మంచి తరుణం

*కృష్ణా పత్రిక, వారపత్రిక, 26-1-1961, భారత రిపబ్లిక్ సంచిక*

# 76. సినిమా కథ

కథానాయిక పాటపాడుతూ ఫేడిన్ అయి, క్లోజప్‌లో పాడుతూ మనకేసి చూచి నవ్వుతూ గదంతా డాన్స్ చేస్తున్నది "ఎంత హాయి! ఎంత హాయి!" అనే పల్లవిని బట్టి ఆమెకు హాయిగా ఉన్నట్టూ, అందుకే డాన్సు చేస్తున్నట్టుగా మనకు తెలుస్తున్నది

ఇంతలో కాఫీ పట్టుకుని కూతురి పాటకు లయగా అడుగులు వేస్తూ వచ్చి, పాటా భజంత్రీలూ ఆగిపోయిన దాకా నిలబడి కూతురికి కాఫీ అందిస్తూ, "ఎటువంటివాడు రావలిసున్నాడో!" అన్నది తల్లి

కథానాయక ప్రణయ కోపం మొహం పెట్టి, "పోమ్మా!" అన్నది

"ఏవేం? మంచి డాక్టరు మొగుడై, ఇద్దరూ ప్రాక్టీసు పెడితే ఎంత బాగుంటుంది?" అన్నది తల్లి

కూతురు నోటి నుంచి కాఫీ కప్పు దించి—లిప్ స్టిక్ పెదవులకు కాఫీ తడిలేదు— "నువ్వెప్పుడూ యిట్లానే అంటావు!" అనిదెప్పింది, మొహం చిట్లించి మూతితో మాత్రమే నవ్వుతూ

మన కథానాయికకు తండ్రి లేడు గాని ఆయన పటం గోడకు వేళ్ళాడుతున్నది ఇంత బూజు గాని, దుమ్ముగాని లేకుండా దానికి ఒక దండ కూడా వేసి ఉన్నది

తల్లి ఏడుపు గొంతు పెట్టి ఆ ఫొటో దగ్గరికి వెళ్లి "ఆయన ఉంటే మనకిన్ని ఇబ్బందులు రాకపోను గదా!" అన్నది

కూతురు "హాయిహాయి" పాట మరిచిపోయిన దానల్లే నిట్టూర్చింది

ఈ తల్లి కూతుళ్ళు పడే కష్టాలు మనం తెలుసుకోవటం అవసరం కూతురు ఫైనల్ యియర్ మెడిసన్ చదువుతున్నది నూటికి నూరేసి మార్కులు తెచ్చుకుంటున్నది తల్లి అంట్లు తోమి కూతుర్ని చదివిస్తున్నట్టు నిదర్శనాలేమీలేవు అయినా వాళ్లకు డబ్బు లేదు, రాబడి లేదు అందుకని తల్లి జార్జెట్ చీరెలు కట్టుతున్నది, కూతురు సాదా నైలాన్ దుస్తులు మాత్రమే ధరిస్తున్నది డబ్బుంటే ఇంకా ఎంత పెద్ద ఇంట్లో ఉండి, ఎంత బాగా బతికే వాళ్ళు, పాపం!

అయితే కథానాయిక గనక, మెడికల్ కాలేజీలో సహాధ్యాయినులందరూ చెలికత్తెల్లాగా ఉండి, కణ్వాశ్రమం శకుంతలకు అనసూయ ప్రియంవద ఎలా ఉండేవారో అలా ఉండి, ఆమె ఆకలే ఆకలిగా, ఆమె ప్రణయమే తమప్ర కాదు, పరమాదర్శంగా ప్రవర్తిస్తున్నారు

ఇప్పుడు మనం హీరోను కలుసుకోవాలి ఇతను కూడా మెడికల్ కాలేజి స్టూడెంటే నాయికా నాయకులిద్దరూ ఒకటే క్లాసు వాళ్ళిద్దరికీ మధ్య ప్రేమబంధం వున్నదని క్లాసులో అందరికీ తెలుసు మగ స్టూడెంట్లు దుష్యంతుడి వేడుక చెలికాళ్ళలాగా ప్రవర్తిస్తారు వాళ్ల క్లాసులో ఇంకా ఆడపిల్లలున్నా వాళ్ళను గురించి మగ స్టూడెంట్లు పట్టించుకోరు

హీరో ఎప్పుడూ ప్రపంచాన్ని ఉద్ధరించే పనులే చేస్తూంటాడు గనుకనూ, హీరోయిన్ "ఎంతహాయి!" పాడి చాలాసేపయింది గనకనూ, అతను హీరోయిన్ దగ్గిరి కొచ్చి, "బిచ్చగాళ్ళ కోసం, ఒక నాటకం వేద్దామనుకుంటున్నాం, అందులో మీరు భారత మాత వేషం వేసి డాన్సు

చెయ్యాలి'' అంటాడు

''మీరడిగితే ఏదైనా చేస్తాను,'' అంటుంది కథానాయిక , ఆమె అతన్ని ప్రేమిస్తున్నట్టు స్పష్టం కాగలందులకు

హీరో ఆ మాటలు అర్థం చేసుకోకనో, చేసుకునో, ''మీరలా అంటారని నాకు ముందే తెలుసు,'' అని మొహం చిట్లిస్తాడు, తీవ్రమైన ఆలోచనలు ఉన్నట్టు

అక్కడి నుంచి పాట అందుకుని హీరోయిన్ వీధి వెంట పాడుకుంటూ మధ్య మధ్య భాగవతారుగారల్లే అడుగేస్తూ, వీధుల వెంటా, ఒక చేనుపక్కగా, ఒక మోట బావి చుట్టూ తిరిగి, ఒక కొండ ఎక్కిదిగి, పాటా భజంత్రీలు ఆగే సమయానికి ఇంటికి వచ్చేసింది

ఆమె లోపలికి అడుగుపెడుతుండగానే ఆర్కెస్ట్రా కెవ్వున అరిచింది ఎందుకంటే హీరోయిన్ ఇంటలేనప్పుడు ఆమె మేనమామ వచ్చి ఉన్నాడు అతన్ని చూడగానే హీరోయిన్ మోహం ముడుచుకు పోయింది ఎందుకంటే ఈ మేనమామ విలన్ అందుకనే హీరోయిన్‌ను చూచి నవ్వి, ''డాక్టర్ వచ్చిందే! ఇతర్ల రోగాలు నయం చెయ్యటం కాదు, నా హృదయంలో జబ్బు నయం చేస్తే నువు నిజమైన డాక్టర్ అని ఒప్పుకుంటాను''

హీరోయిన్ ప్రణయ కోపం మొహం పెట్టి అతనికి ఎడంగా తప్పుకుని లోపలికి పోతుంది విలన్ ఎందుకో గట్టిగా నవ్వుతాడు

హీరోయిన్ ''అమ్మా, అమ్మా'' అంటూ తల్లి దగ్గరికి వచ్చే ముందే వ్యాస పీట మీద భాగవతం లాంటి పుస్తకం కొద్ది పాటి ఆర్కెస్ట్రా సహాయంతో ''నల్లనివాడు పద్మనయనంబుల వాడు'' అనే పద్యం పన్నెండేళ్ల పిల్ల గొంతుతో మాల్కోస్ రాగంలో సంగతులు వేసి పాడుతున్నది పద్యమూ భజంత్రీలూ అయిపోగానే హీరోయిన్ లోపలకి వచ్చి,''అమ్మా, అమ్మా'' అన్నది

తల్లి అంతలోనే గొంతుమార్చి ''మామయ్యొచ్చాడు, తల్లీ'' అన్నది

''ఆ దుర్మార్గుణ్ణెందుకు రానిచ్చావు మనింటికి?'' అన్నది హీరోయిన్ పళ్లు కొంచెంగా కొరికి మొహం చిట్లించి ముక్కులెగరేస్తూ

తన కూతురికి విలనంటే కోపమని అర్థమై తల్లి ఆశ్చర్యంతో, ''అదేమిటే?'' అన్నది

''నీకు తెలీదులే, అమ్మా ,'' అన్నది కథానాయిక, విలన్ చేత అనేకసార్లు బలాత్కరించబడిన దానిలాగా,

'' నిన్ను తనకిచ్చి పెళ్ళి చెయ్యమంటున్నాడు బాగానే ఉంటుంది కూడాను అయిన సంబంధం బోలెడంత సంపాదిస్తున్నాడు ఫ్యాక్టరీకి మేనేజరయ్యాట్ట మూడొందలు జీతమిస్తారు బీచ్‌లో పెద్ద బంగాళా ముప్పై వేలు చేసే కారు కొన్నాట్ట నూరు రూపాయలకు తక్కువ ఖరీదుగల ప్యాంటు వెయ్యడు క్లబ్బు కెళ్ళి రోజుకు నూరు రూపాయల బుడ్డీ సారా తాగుతాట్ట నిన్ను పువ్వుల్లో పెట్టి పూజిస్తాడమ్మా నాకీమధ్య ఒంటో బాగోటం లేదు కూడానూ'' అంటూ తల్లి దగ్గటం మొదలు పెట్టింది

అంతదాకా కళ్ళు మూసుకుని హీరోను జ్ఞాపకం తెచ్చుకుంటున్న హీరోయిన్ కళ్ళు చాలా పెద్దవి చేసి, ఆదుర్దాగా, ''ఏమిటమ్మా? ఏమిటమ్మా?'' అంటూ తల్లి మీద అమ్మ శక్తి లాగా పడింది

ఆ బొమ్మలోంచే ఇంకో బొమ్మ వచ్చేటప్పటికి తల్లి మంచం మీద పడుకుని దగ్గుతున్నది

ముందు డాక్టరూ, అతని బ్యాగ్ పట్టుకుని హీరో వచ్చారు తల్లికి తల పిసుకుతున్న హీరోయిన్ లేచి, ''రండి, డాక్టర్'' (రండి డాక్టరు గారూ, అనటం పల్లెటూరు గమార్ల లక్షణం!) అంటూ హీరో చేతిలో ఉన్న బ్యాగ్ తీసుకొని, రెడీగా ఉన్న స్టూలు మీద పెట్టింది

హీరో ఆమె కేసి రేసుల్లో డబ్బు పొగొట్టుకున్నట్టు చూశాడు ''విన్నాను, విన్నాను'' అన్నట్టుగా తల పైకీ కిందకీ ఆడించింది

డాక్టరు స్టెతాస్కోపు తీసి రోగి గుండెల మీద పెట్టి, పెద్ద నిట్టూర్పు విడిచి, మూలిగి, ''క్షయ! సీరియస్! బోత్ లంగ్స్ యఫెక్టెడ్!'' అన్నాడు

త్వరలో తాను కూడా డాక్టరు కాబోతున్నది గనుక, ''నయమవుతుందా, డాక్టర్?'' అని కొట్ట వచ్చినట్టుగా అడిగింది

డాక్టరు చప్పరించి, ''ఈ రీలు దాటదు,'' అనేశాడు

హీరో, ఊరికే ఉండట మెందుకని, 'శానిటోరియంకు పంపిస్తేను, డాక్టర్?'' అన్నాడు

డాక్టరు దీర్ఘంగా ఆలోచించి, ''అలా చెయ్యవచ్చు'' అన్నాడు అతను బరువుగా వెళ్ళిపోతుంటే భజంత్రీలు విషాదంగా వాయించారు

పరీక్షలకు ముందు మెడికల్ విద్యార్థులందరూ ఒక చోటకీ, విద్యార్థినులందరూ ఇంకో చోటకి పిక్నిక్ వెళ్ళారు ఆడవాళ్ళ పిక్నిక్ బాగుంది ఎవరూ ఏమీ అనకుండానే వాళ్లు విరగబడి నవ్వుతున్నారు దాన్నిబట్టి వాళ్ళు చాలా సంతోషంలో ఉన్నారని మనకు తెలుస్తుంది

అదృష్టవశాత్తూ ఒక మర్రి చెట్టుకు పెద్ద ఉయ్యాలవేసి ఉంది ఆ ఉయ్యాల మీద ఎక్కి కథానాయిక ''ఓ లలలా! ఓహో లలలా!'' పాట పాడుతున్నది ఆమె సఖురాండ్రు సోల్పుగా నిలబడి కవాతు చేస్తున్నారు డ్రిల్ సార్జంటు ఉండి చెప్పినట్టుగా వాళ్ళు స్టెతాస్కోపులను ఒకేసారి మెడకు వేసుకుని, ఒకేసారి పైకెత్తి, ఒకేసారి గుండ్రంగా తిప్పి, ఒకేసారి చెవులకు పెట్టుకుని, ఒకేసారి తమ గుండెలు పరీక్ష చేసుకుని చాలా గమ్మత్తులు చేస్తున్నారు

వేయేల? పరీక్షలకు ముందు లేడీ మెడికోలు పిక్నిక్ వెళ్లి ఏమేం చేస్తే ఆదర్శ ప్రాయంగా ఉన్నట్టు పావలా క్లాసువాళ్ళకు తోస్తుందో అవన్నీ చేస్తున్నారు

ఇంకో లొకేషన్‌లో మెడికల్ విద్యార్థులు, అందరూ సైకిళ్లెక్కి ఫార్మేషన్ రైడింగ్ చేస్తున్నారు అన్నీ ఒకేసారి కొన్న సైకిళ్ళు సరికొత్తవి హరిదాసు వెంట భక్తులు పాడినట్టుగా హీరో అన్న ప్రతి పంక్తిని అంటూ అందరూ కోరస్ పాడుతూ వస్తున్నారు అదృష్ట వశాత్తూ రోడ్డు నిర్మానుష్యంగా ఉంది

అక్కడ అమ్మాయిలు దాగుడు మూతలాడుతున్నారు హీరోయిన్ కళ్ళకు గంతలు కట్టుకుని తన స్నేహితురాళ్లను దొంగ చెయ్యటానికి చూస్తూ ఉంటుంది అంతలో హీరో అక్కడికి ఒంటరిగా వస్తాడు చెలికత్తెలంతా పారిపోయి చెట్ల చాటున దాక్కుంటారు హీరోయిన్ గాలిలో ఈదుతూ వచ్చి హీరోను తాకి, ''ఆఁ, దొరికావులే!'' అంటుంది ( కవిగారూ ఆ మాట పసందుగా వేశారు! )

హీరోయిన్ గంతలు తీసి పారేసి, కళ్ళూ నోరూ పెద్దవి చేసి, ''మీరా ?'' అంటుంది అనుమానం ఉంచడం మంచిది కాదని హీరో బరువుగా నిట్టూర్చి ''అవును నేనే!'' అన్నాడు

చెట్లచాటు నుంచి వెకిలిగా నవ్వులు వినిపిస్తాయి హీరోయిన్ ప్రణయ కోపం మొహం

పెట్టి,'' ''ఊరుకోండి వాళ్ళంతా మనని ఏడిపిస్తారు!'' అంటుంది

''నేనేమీ చెయ్యలేదే!'' అన్నట్టుగా హీరో తన చేతులను అటూ ఇటూ తిప్పి చూసుకుంటాడు

''రేపే కదూ మన ప్రదర్శనం?'' అంటుంది హీరోయిన్ హీరో పక్కనే నడుస్తూ

''అవును'' హీరో నిట్టూరుస్తాడు

కర్టెన్ పైకి లేస్తుంది హీరోయిన్ భరతమాతగా ప్రేక్షకులకు కనిపిస్తుంది ''లేవండీ! దీక్షలు పట్టండీ! లంచాలు—'' అంటూ పాడుతూ హీరో ప్రవేశిస్తాడు అనేక మంది ఆడవాళ్ళ అజంతా డ్రెస్సులు వేసుకుని సాము గరిడీలు చేస్తారు ఆ గరిడీలకూ పాటకూ ఏమీ సంబంధం ఉండదు కామెరా ఒక పక్కకు ఒరిగిపోతుంది తరువాత రెండో పక్కకి ఒరుగుతుంది ఆఖరుకు చేసేది లేక తల్ల క్రిందులై పోతుంది ప్రేక్షకుల్లో ఒకాయిన జేబులో నుంచి చిన్న పొట్లం తీసి భావన అల్లం ఇంత నోట వేసుకుని అమ్మాయిల అజంతా డ్రెస్సుల కేసి శ్రద్ధగా చూస్తాడు

ప్రదర్శనమైనాక అందరూ హీరోను, హీరోయిన్‌నూ అభినందిస్తారు హీరోయిన్ భరత మాతగా బాగా నిలబడినందుకూ, హీరో ''పట్టండీ, కొట్టండీ, కట్టండీ,'' అన్న మాటలకు సరిగా చేతులు ఊపినందుకూనూ సాము గరిడీలు చేసి, వెనక్కు మొగ్గలు వేసి వక్ష ప్రదర్శనాలు చేసిన అమ్మాయిలను గ్రూప్ ఫోటోలో వాళ్ళు అభినందించారు

(ఈ ప్రదర్శనంలో మనం చూసే మొదటి గ్రూప్ ఫోటో ఈ ప్రదర్శనంలోనే )

హీరో ఆపరేషన్ థియేటర్‌లో ఉన్నాడు పెద్ద సర్జను ఆపరేషన్ చేస్తున్నాడు హీరో, హీరోయిన్ ఇద్దరూ ఆయన పక్కన ఉండి నేర్చుకుంటున్నారు అందరికీ మొహాలకు అడ్డంగా జేబురుమాళ్ళున్నాయి, నెత్తిన గాంధీ టోపీలున్నాయి సర్జన్ హీరో కేసి కుడి చెయ్యి చాస్తాడు హీరో గబుక్కున ఒక పట్కారు సర్జన్ చేతిలో పెడతాడు ఆ తరువాత సర్జన్ ఎడమ చెయ్యి చాస్తాడు హీరోయిన్ ఒక స్పానర్ అందిస్తుంది సర్జను ఊపిరి సలపకుండా రెండు చేతులతోనూ కటింగు ప్లయర్సూ, రెంచీలూ, ఆకురాళ్ళూ, చిన్న సుత్తెలూ, పిన్సర్లూ, పెనసళ్ళు చెక్కే మరలూ మొదలైనవి అందుకుంటూ చిట్టచివరకు మొహానికి అడ్డం ఉన్న చేతి రుమాలు తీసేసి దానితో నుదురు తుడుచుకుని చిన్న చిరునవ్వు నవ్వుతాడు.

హీరో కూడా చేతిరుమాలు లాగేసి ఆపరేషన్ టేబిల్ మీద పడేసి చెయ్యి పిడికిలి బిగించి పైకెత్తి, '' జై, డాక్టరు గారికీ జై!'' అంటాడు నర్సులూ, అసిస్టెంటు సర్జన్‌లూ ఒక్కసారి ''జై'' అనిపెడబొబ్బ పెడతారు సర్జన్‌ఎందుకో హీరోను భుజం మీద తట్టి వీపుతిప్పి వెళ్ళిపోతాడు

హీరో అటూ ఇటూ చూస్తాడు హీరోయిన్ లేదు ఆమెను వెతుక్కుంటూ వార్డుల వెంట బయలుదేరుతాడు ఆమె ఒక చోట బల్ల ముందు కూచుని ఏడుస్తున్నది ఆమె పక్కనే ఒక టెలిగ్రాం హీరో దాన్ని ఎత్తి చూసీ చూడకుండానే, '' డెడ్!'' అని చదువుతాడు.

హీరోయిన్ తల్లి చావు కారణంగా లిప్ స్టిక్, మొహాన బొట్టు, తలకు చమురూ మానేసి, మాసికలు వేసిన చీరె (నైలాన్ జార్జెట్ నేతచీరె) కట్టుకుని దరిద్ర శోకదేవతలాగా ఉంది

''ఇంక నాకు భవిష్యత్తు లేదు నా చదువు మంట గలిసిపోయింది నేను కన్న కలలు కరిగి పోయాయి. నా బ్– రతుకు అనాథ బ్– రతు కయి పోయింది'' అంటూ ఏడుపు బాగా రావటానికి క్రింది పెదవి గట్టిగా కొరుక్కుంటుంది

''మనం పెళ్లాడేసి సుఖంగా ఉండాలి!'' అంటాడు హీరో

''నీకేం మతి పోయిందా ఏమిటి? ఇంకా ఏడో రీలు పూర్తి కాలేదు విలన్ సీక్వెన్సులన్నీ ముందే ఉన్నాయి పైగా మనం ప్రేమించుకున్నాం మనకు పెళ్ళి ఎలా అవుతుంది?'' అని హీరోయిన్ మందలిస్తుంది హీరో నిట్టూర్చి కనుబొమ్మలూ, తల ఎగరేసి, ''అవును! మన పెళ్ళికి ఫార్ములా ఒప్పదు!'' అంటాడు

హీరోయిన్ పెళ్లాడిందా, లేక అవివాహిత వితంతువుగా ఉండిపోయి తన పాతివ్రత్యాన్ని కాపాడుకుందా? విలన్ ఏమయినట్టు? హీరో ఏమవుతాడు? అసలు ఇదేం కథ? ఈ వివరాలన్నీ దయచేసి, మరోలా అనుకోకుండా, తెర్పైన చూడండి జైహింద్!

*ముద్రణ పుస్తక ప్రపంచం, మాసపత్రిక, మార్చి, 1961*
*పునర్ముద్రణ విజయవాడ ఫిలింసొసైటీ సావనీరు, 1975*

# 77. విలువలు

జీవితపు విలువలు మన కళ్ళెదుటే మారుతుండటం చూస్తే ''మన పిల్లలకు ఏవిధమైన పాఠాలు నేర్పాలి?'' అన్న సందేహం కలిగి సమాధానం తెలుసుకోలేక పోతాం

హేయమైన జీవిత విధానాలు అవలంబించి బాగుపడిన వాళ్ళు ఏ కాలంలోనైనా ఉన్నారు ఇద్దరు ముగ్గురు అప్ప చెల్లెళ్ళు తలా ఒక సంపన్నుడికి ఉంపుడు కత్తెలుగా ఉండి తలా ఒక మిద్దె సంపాదిస్తే అంత మాత్రం చేత జీవితపు విలువలు తారుమారు కాలేదు మనుషుల్లో ఘరానా మనుషులు అంటూ ఉన్నారు ప్రపంచంలో సభ్య ప్రపంచమంటూ ఉన్నది సభ్యసమాజానికి చెందిన ఘరానా మనుషులు జీవితపు విలువలను తారు మారు చేసినప్పుడే సమస్యలు పుట్టుకొచ్చేది

చిత్ర నిర్మాతలు ఘరానా మనుషులు వారిది సభ్య ప్రపంచం అయితే నా కళ్ళ ఎదుటనే కళ కోసం ప్రాకు లాడిన నిర్మాతలు పోయి, ''మాది వ్యాపారం లాభాలు తీయటం తప్ప వేరే ఆశయం లేదు'' అని ఎలుగెత్తి చాటే నిర్మాతలు వచ్చారు

సమస్య సినిమారంగంలో చేరి నాలుగు డబ్బులు చేర్చుకునే సదవకాశం వచ్చిననాడు కళకు అశ్రుతర్పణం విడిచి, కళా దృష్టీ, కళా ప్రమేయమూ కళా వైఖరిని విసర్జించటమా? లేక ముష్టెత్తుతూ, అప్రయోజకుల జాబితాలోనూ, పిచ్చివాళ్ళ జాబితాలోనూ, చేరిపోవటమా? సులువుగా తేలే సమస్య ఎంత మాత్రమూ కాదు

ఈనాడు డబ్బు చేసుకోవటంలో పోటీ ఉంది ఒకనాడు డబ్బు చేసుకునే పద్ధతులకు ఎక్కువ ఆదరం ఉండేది కాదు ఈనాడు అదంతా పోయింది ఒక పడుచు పడుచుకుని మిద్దె సంపాదిస్తే పదిమంది పడుచులు అదే మార్గాన ఎగబడి రావచ్చు అది వివేకం అనిపించుకుంటుంది కూడానూ

డబ్బు సర్వోత్తమైన జీవితపు విలువ కాదనుకొనడం మూఢ విశ్వాసంగా పరిణమిస్తుంది డబ్బు కోసం ఏదైనా చేయటానికి సిద్ధ పడటం ''వాస్తవిక దృష్టి'' అవుతుంది

ఒకప్పుడు హరిశ్చంద్రుడు మాట కోసం రాజ్యాన్నీ, భార్యనీ, కొడుకునూ, తన

స్వాతంత్ర్యాన్నీ పోగొట్టుకున్నాడంటే, నాకే ''వీడేం మనిషిరా? అనిపించేది కాని డబ్బు దగ్గరికి వచ్చేసరికి కిందటి శతాబ్దం మనుషులు కూడా సత్యహరిశ్చంద్రుడి వంటి విడ్డూరపు వ్యక్తులుగా కనిపిస్తున్నారు

రాబర్టు బ్రౌనింగు అనే 19వ శతాబ్దపు బ్రిటిషు కవి తన పద్యాలను ఏ పత్రికలలో ప్రకటనకు ఇచ్చేవాడు కాడట! ఒక సారి ఒక పత్రికాధిపతి ఆయనకు 50 పౌనులు ( ఆరువందల రూపాయల చిల్లర) చెక్కు పంపి ఒక పద్యం పంపమన్నాట్ట బ్రౌనింగ్ ఆచెక్కును తిప్పి పంపుతూ, '' పత్రికలకు పద్యాలు పంపటం నాకు అలవాటు లేదు కావలిస్తే నాభార్యను కోరండి'' అని వ్రాశాట్ట (ఆయన భార్య ఎలిజిబెత్ బారెట్ బ్రౌనింగ్ కూడా కవిత్వం రాసేది) పత్రికాధిపతి ఈసారి 500 పౌనులు చెక్కు పంపుతూ, '' గుమస్తా పొరపాటు వల్ల చెక్కుమీద 500 అంకెకు బదులుగా 50 పడిందనీ, పద్యం జరూరుగా కావాలనీ మళ్ళీ కోరాట్ట'' బ్రౌనింగు ఆ చెక్కును కూడా తిప్పి పంపాడు చివరకు ప్రాణం విసిగి పత్రికాధిపతి కాళీ చెక్కును పంపుతూ, దాని మీద ''మీ యిష్టం'' అని రాశాట్ట మన దేశంలో ఒక మంత్రి పదవికి గానీ, కనీసం సెక్రటరీ పదవికిగానీ, పనికిరాని బ్రౌనింగు ఆ చెక్కును కూడా తిప్పి పంపాట్ట

ఏనాడో మరో దేశంలో ఉండినవాడు అందులోనూ కవి, తిక్కగాడు, అటువంటి పని చేస్తే చేశాడు మనదేశంలోనే మొన్న మొన్ననే పది పదిహేనేళ్ళ క్రితం ఒక దొంగ మార్కెటు ఆసామి లక్ష రూపాయల చెక్కు ఇస్తానంటే నిరాకరించిన అధికారి— బొంబాయివాడు బొత్తిగా ''వాస్తవిక'' దృష్టిలేని వాడుగా కనబడుతాడు

రానురాను యిటువంటి అవాస్తవిక దృష్టిగల వారి సంఖ్య సభ్యప్రపంచంలో తగ్గిపోయిందనటానికి సందేహం లేదు కానీ వీళ్ళ సంఖ్య జనసామాన్యంలో ముఖ్యంగా పేదసాదలలో పెరిగిపోతున్నట్టు కనిపిస్తుంది

ఏదో మనకు సహాయం చేసి చేతిలో అణో, బేడో పెట్టజూస్తే నిరాకరించిన ''నౌకర్ల''ను చాలా మందిని చూస్తున్నాను వీళ్ళను బజారుకు పంపిస్తే చిన్న చిన్న అబద్ధాలాడి నయాపైసలు కైంకర్యం చెయ్యకుండా ఉన్నారు

సభ్య ప్రపంచం పాటించే విలువలు వీళ్ళకు తెలియటమేలేదో, తెలిసికూడా వాటిని తృణీకరిస్తున్నారో నాకు సరిగ్గా బోధపడకుండా ఉన్నది

దురదృష్టవశాత్తు నేను చిన్నతనంలో నేర్చుకున్న విలువలను ఈ ''నీతి'' మనుషులు పాటించటం చూస్తే ఒకందుకు వాళ్ళ మీద అభిమానంగానూ ఉన్నది, ఇంకొకందుకు భయంగానూ ఉన్నది భయం దేనికంటే భవిష్యత్తు మాటేమిటి? ముందుతరాల వాళ్ళు మంత్రులూ, సెక్రటరీలూ, నాయకులూ, అయితే బాగానే ఉండును కాని జీవిత విలువల మాటేమిటి? వాళ్ళతో మనం ''అబ్బాయిలూ, అమ్మాయిలూ! కళలూ, గాడిద గుడ్డూ, ఆత్మాభిమానమూ, దీక్షా, న్యాయమూ, సంఘ ప్రీతీ మొదలైనవి బడుద్దాయిలు పరిగణించే విలువలు మీరు అయిన కాడికి డబ్బుకు అమ్ముకుపోండి కీర్తీ, ప్రతిష్ఠా, సంఘ గౌరవమూ, డబ్బేసి కొనుక్కోండి! మిగిలిందంతా మిధ్య— డబ్బోహటే నిత్యం!'' అని చెప్పటమా అని!

*విశాలాంధ్ర, దిన పత్రిక, 28-5-1961*

# 78. సత్య చిత్ర రాయ్

చిత్రజగత్తులో సినిమాల విషయం లేకపోవడమేమిటని కొందరు ఆక్షేపిస్తున్నారు అందుచేత ఈ వారం సినిమాలను గురించి రాస్తాను

సినిమాలు రెండు రకాలు సత్యజిత్ రాయ్ తీసే సినిమాలూ, ఇతర సినిమాలూ సత్యజిత్ రాయ్ తీసే సినిమాలకు మామూలు సినిమాల నిబంధనలు వర్తించవు మామూలు సినిమాలలో స్టార్లుండాలి, మోతగా పాటలుండాలి, బ్రహ్మాండంగా సెట్టింగులు ఉండాలి, డాన్సులుండాలి, కథ ఉంటే ఉండొచ్చు పాత్ర పోషణ ఉండక్కర్లేదు – తారలు ఎవరి పాత్రలను వారు ఉజ్జాయింపుగా నిర్వహించేస్తారు ( షరా కవిగాడు రచించిన పాత్రనే పోషిస్తాను అని కంకణం కట్టుకునే వాడికి తారత్వం లేదు తారలు స్వయంప్రకాశం గలవి, పైనుంచి వచ్చే ప్రకాశంలో వెలిగేవి విగ్రహాలూ, ఉపగ్రహాలును వాటి కళలు ఒకప్పుడు క్షీణిస్తాయి )

సత్యజిత్ రాయ్ వంటివాడికి విధిగా కథ ఉండాలి కథ అంటే పాత్రలుంటాయి వాటికి మనస్తత్వాలుంటాయి ప్రేక్షకులకు పాత్రలు కనిపించాలే గాని నటులు కన్పించరాదు అందుకని పాత్రోచితంగా ఉండేటట్టుగానే నటులను ఎన్నుకోవాలి వారి నటనానుభవం గురించిగాని, నటనా సామర్థ్యం గురించి గాని రాయ్‌కి విచారం ఉన్నట్టు కనబడదు నటుడు గాని, నటిగాని తాను ధరించే పాత్రకి సరిపోయినాక మిగిలినదంతా డైరెక్టరు చేతిలో ఉందని రాయ్‌నమ్మకం లాగుంది

రాయ్‌కి సన్నివేశాలు సాగదియ్యటం కూడా తెలీదు మామూలు డైరెక్టర్లు వాడినంత సంభాషణలు వాడడు ఇతరులు వందలేసి అడుగులలో చెప్పే దాన్ని అతను కొద్ది అడుగులలో చెప్పేస్తాడు ఉదాహరణకు 'అపరాజిత' లో తన తల్లి చనిపోయిందని అపూ తెలుసుకోవటానికి ఘటా శ్రాద్ధం చేయించి వస్తున్న మనిషి కనిపించటం మాత్రమే వుంది

మామూలు సినిమా వ్యాపారస్తుల దృష్టిలో రాయ్ ఇంకో పెద్ద పొరపాటు చేస్తున్నాడు అతను తన ప్రేక్షకుడికి బుర్రా, గ్రహణశక్తి వున్నాయనుకుంటాడు ఇది వ్యాపారరీత్యా అనుచితం నాలుగు రాళ్ళు తెచ్చుకోదలచిన వాడు గిరీశమల్లే ''మనవాళ్ళుత్తి వెధవాయిలోయ్'' అనుకోవాలి

''ఈమధ్య ఎటువంటి కథలకు డబ్బుబాగా వస్తున్నదీ, ఏ రచయిత హస్తవాసి బాగున్నట్టుంది?'' ఇటువంటి సమస్యలు రాయ్‌కి వున్నట్టులేదు చిత్రీకరణకు అనువైన కథ తీసుకోవటమూ, సాధ్యమైనంత తెలివిగా స్క్రిప్టు రాసుకోవటమూ, దానికి తగ్గట్టు ఫొటోగ్రఫీ, నేపథ్య సంగీతమూ అమర్చుకోవటమూ – ప్రతి విషయమూ టెక్నీషియన్ల ఉపజ్ఞతోనే సాగిపోతుంది బాక్సాఫీసు గొడవే లేదు చిత్రాలలో ప్రేక్షకుల నరాలను తెంచే అరుపులూ ఏడుపులూ పెడబొబ్బలూ, వాయిద్యాల శోకాలూ భయంకరమైన చప్పుళ్ళు ఉండవు ఎవరూ ఆర్కెస్ట్రాతో సహా పాడరు అపూ తన భార్యతో ఒక్క డ్యూయెట్టు కూడా పాడలేదు – అయితే పక్క మీద వెల్లకిలా పడుకుని తన భార్య తలపిన్ను కేసి చాలాసేపు చూసాడు

సత్యజిత్ రాయ్ వంటి వాళ్ళు చాలా మంది లేకపోవటం మనం అర్థం చేసుకోవచ్చు అతను కమ్యూనిస్టు చిత్రాలు తీయకపోయినా అతని చిత్రాలు వ్యాపారదృష్టికీ, పెట్టుబడిదారీ

విధానానికీ ఒక సవాలుగా ఉన్నాయి, వ్యాపార కళలో డబ్బుతో కొనరానిదేమీ ఉండరాదు మార్కెట్టును బట్టి రూపాయిదానికి కావలిస్తే నూరురూపాయలు పారేస్తారు అంతేగాని కేవలం బుద్ధిబలంతో మాత్రమే తయారయ్యే సరుకును ఏవిధంగాను ఆమోదించరాదు దాన్ని ప్రోత్సహించరాదు

సత్యజిత్‌రాయ్‌కి మన దేశంలో అంత ప్రోత్సాహం రాలేదు పై దేశాలలో వచ్చింది ఇందులో ఆశ్చర్యం లేదు పెట్టుబడిదారీ విధానం కింద ఒకదేశపు 'కళ' లను ఇంకో దేశంలో ప్రోత్సహించవచ్చు ఎందుకంటే అవి మన పరిశ్రమతో పోటీ చెయ్యవు మద్రాసులో 6 వారాలు కాబోలు ఆడిన 'యుకివారిసు' జపాన్‌లో విజయవంతంగా నడవలేదుట 'పథేర్ పాంచాలి' అమెరికాలో బాగానే నడిచింది కొన్ని ఇటాలియన్ చిత్రాలు తారలు లేనివి కూడా, అమెరికాలో పెద్దపేరు తెచ్చుకున్నాయట జాతీయమార్కెట్లలో 'కళ' కు ఆరాధన లేక పోయినా అంతర్జాతీయ మార్కెట్లోనైనా ఉన్నందుకు సంతోషించాలి

*విశాలాంధ్ర, దినపత్రిక, 11-06-1961*

# 79. రేడియో సంగీతం - సినిమా సంగీతం

ఇటీవలికాలంలో అభివృద్ధిలోకి వచ్చిన కళలన్నిటిలోకి బాగా ముందుకు వచ్చింది సంగీతం న్యాయంగా లలితకళలన్నింటిలోకీ సార్వజనీనమైనది సంగీతమే ''శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణిః'' అన్నారు సాహిత్యం అక్షరాస్యులకే పరిమితమైవుంటుంది చిత్రకళకు ప్రదర్శన అవసరం నాట్యకళ అనేక రంగులుగలది ఒక్క గాన తృష్ణే ఎవరికి వారు ఒక కూనిరాగంతో తృప్తి పరుచుకోదగినది

ఒకప్పుడు సంగీతానికి చాలా అరలుండేవి ఒక చివర సంప్రదాయ సంగీతం, ఇంకో చివరను ముసలమ్మలు తెల్లవారుజామునలేచి పాడుకునే పాటలూ, వీధిభాగోతాల పాటలూ, స్త్రీల వేడుక పాటలూ, మంగళహారతి పాటలూ, దిమ్మసపాటలూ, ఊడ్పు పాటలూ అనేక రకాలుండేవి ఆనాటి పెళ్లిపందిళ్ళూ భోజనాల పంక్తులూ పాటలతో మారుమోగిపోయేవి చంటిపిల్లల తొట్టెల్లో తల్లి పాడే జోల పాటలు మొదలుకుని ఏదో రూపంలో జీవితమంతా ఏదో ఒకరకంగా పాటలు వింటూనే ఉంటారు

తమతమ అభిరుచులను బట్టిఒక్కొక్కరు ఒక్కొక్కరకం సంగీతం మీద ప్రత్యేకాభిమానం చూపుతారు

ఇది ప్రతి తరంలోనూ ఉన్నదే అయినప్పటికీ, పాతిక సంవత్సరాల క్రితంతో పోలిస్తే ఈనాడు మనం వంద రెట్లు ఎక్కువ సంగీతం వింటున్నాం ఇది చాలావరకు రేడియోలవల్లా సినిమాలవల్లా కలిగిన మార్పు రేడియో స్వయంగా కొంత సంగీతాన్ని సృష్టించటమే కాక రూపు మాసిపోయిన సినిమా చిత్రాల తాలూకు మంచి సంగీతాన్ని సజీవంగా వుంచుతున్నది దీనితో పాటు సంప్రదాయ సంగీతాన్ని వెనకటి కంటే చాలాహెచ్చు సంఖ్యల వారికి రేడియో అందిస్తున్నది సంప్రదాయ సంగీతం విని ఆనందించే వారు పూర్వం కన్న ఈనాడు చాలా ఎక్కువగా ఉన్నారంటే అందుకు ప్రధానకారణం రేడియో అనటానికి సందేహం లేదు

అయితే రేడియోలో ఉత్పత్తి అయ్యే సంగీతం గురించి ప్రత్యేకంగా చెప్పుకునేటందుకు ఏమీలేదు రేడియోలో సృష్టి అయే సంగీతం సినిమా సంగీతంతో ఏనాడూ పోటీ చెయ్యలేదు అందుకు ప్రధాన కారణం సినిమా కంపెనీలలాగా రేడియోవారు ఒక్కొక్క పాటకే కొన్ని వందల రూపాయలివ్వలేరు రేడియో సంగీత స్రష్టలు సినిమా పాటలతో పోటీ చెయ్యగల సంగీతం సృష్టించగలిగితే వారు రేడియోలలో ఉండడం మానేసి సినిమాల్లో మ్యూజిక్ డైరెక్టర్లయే పోతారు తక్కువ రకం సంగీత విద్వాంసులే రేడియోలో పనిచేస్తారనే ఉద్దేశంతో ఈమాట అనటంలేదు, రేడియో సంగీతంతో సినిమా సంగీతం పోటీ చెయ్యటంమాటే చెబుతున్నాను

రేడియోకు సంప్రదాయ సంగీతంలో నిపుణులైన విద్వాంసులు అండ లభిస్తూనే ఉంది అయినా ప్రజలకు ఆనందం చేకూర్చే సంగీతం సినిమాలలోనే హెచ్చుగా వెలువడుతున్నది దీనికి చాలా కారణాలున్నాయి

సినిమా సంగీతంలో ఎమోషన్‌కు ప్రాముఖ్యత ఉంటుంది అందులో నవరసాలకూ స్థానం ఉన్నది

సినిమా సంగీతమంటూ ఒక సంగీత విభాగంలేదు అందులో ఉత్తమమైన సంప్రదాయ సంగీతం దగ్గర నుంచి అతిచౌకరకం పాశ్చాత్య సంగీతపు అనుకరణలూ, అన్ని రకాల వెకిలి పాటలూ కూడా ఉంటున్నాయి

సినిమా సంగీతం సృష్టించే అవకాశం సంగీత విద్వాంసులకే కాక శ్రావ్యమైన సంగీతం సృష్టించగల వారందరికీ కూడా లభిస్తుంది అట్లాగే సినిమా పాటగాళ్ళకు కూడా చక్కని కంఠమూ, భావయుక్తంగా పాడేశక్తి ప్రధానంగాని రాగజ్ఞానమూ, స్వరజ్ఞానమూ ప్రధానం కాదు వినేవాళ్ళకూ అంతే!

సినిమా సంగీతం నిర్దుష్టంగా రికార్డు అయినాకనే శ్రోతల చెవుల పడుతుంది సినిమా కంపెనీల వాళ్ళు తమ పాటలను అవసరమైతే పదిసార్లు రికార్డు చేసుకుంటారు రేడియో గాయకులు మైక్ ముందు నిలబడి ఒక వంక పాడుతుంటే మరొక వంక శ్రోతలు వింటూంటారు అందుచేత ఆ సంగీతం అంత నిర్దుష్టంగా ఉండదు రేడియో సంగీతం ముందుగా రికార్డు అయినప్పుడు కూడా సినిమా వాళ్ళు తీసుకునేటంత శ్రద్ధతో రికార్డు కాదు — అయే అవసరం తక్కువ

అయినా రేడియో సినిమా సంగీతం యొక్క అభివృద్ధికి కనపడని సేవ ఒకటి చేస్తున్నది రేపటి సినిమా పాటగాళ్ళను ఇవాళే రేడియో ప్రజలకు పరిచయం చేస్తున్నది ఈనాటి ప్లేబాక్ తారలలో చాలా మంది ముందు రేడియోలో వినిపించి తరువాత సినిమా రంగంలోకి వచ్చిన వారే ఈ విధంగా రేడియో సినిమా సంగీతానికి ద్వివిధమైన సేవ చేస్తున్నది

సినిమా సంగీతం దేశాన్ని ఏకం చేసిందనవచ్చు లతా, ఆశా, రఫీ, తలాత్, ముఖేశ్ వంటి గాయకులూ నౌషాద్, బర్మన్, రవీ, శంకర్, జైకిషన్ వంటి మ్యూజిక్ డైరెక్టర్లూ దేశం నాలుగు మూలలకూ తమ ప్రభావాన్ని పంపకం చేశారు సినిమా సంగీతం వివిధ సంగీత విభాగాల మధ్య ఉండిన గోడలను రద్దుచేసినట్లే ఉత్తర దక్షిణ సంగీతాల మధ్య ఉండిన గోడలను కూడా కూలద్రోసింది

ఇక్కడ కూడా సినిమా కృషికి రేడియో చాలా సహాయం చేసింది రేడియో ఇంకొకటి

కూడా చేసింది— ఉత్తర దక్షిణ శాస్త్రీయ సంగీతాల మధ్య ఉండే వ్యత్యాసాన్ని రద్దుచేసింది రేడియో ధర్మమా అంటూ గొప్ప హిందుస్థానీ గాయకులతో దేశంలో అన్ని ప్రాంతాల వారికి పరిచయం లభించింది ఈ సందర్భంలో రేడియో ఏర్పాటుచేసే సంగీత జాతీయ కార్యక్రమాలు ఎంతైనా ప్రశంసించదగినవి రేడియోప్రసారాల్లో విమర్శించదగినది ఎంతైనా ఉన్నది కాని జాతీయ సంగీతకార్యక్రమాలు సంగీతాభిమానులకు నిజంగా అమూల్యమైనవని ఒప్పుకు తీరాలి

*విశాలాంధ్ర, దిన పత్రిక 13-08-1961*

# 80. స్వతంత్ర భారతంలో తెలుగు సినిమాలు

1947 ఆగస్టు 15 అర్ధరాత్రి నుంచి కొద్ది మంది భారతీయుల జీవితాలలో గొప్ప పరిణామం జరిగి ఉండవచ్చుగాని అధిక సంఖ్యాకులైన భారతీయ ప్రజలకు మర్నాడు మామూలు సూర్యుడే ఉదయించాడు సినిమా పరిశ్రమకు కూడా అంతే కొత్తగా వచ్చిన స్వాతంత్ర్యాన్ని వ్యాపార దక్షులైన చిత్రనిర్మాతలు సయితం సొమ్ము చేసుకోవటానికి యత్నించలేదు ('నా దేశం' అన్న చిత్రం ఒకటి వచ్చింది గాని అది అంతగా జనాదరణ పొందలేదు )

అంటే చిత్రనిర్మాణంలో మార్పేమీ రాలేదనుకోరాదు చాలా మార్పులు చెప్పకోదగిన మార్పులే వచ్చాయి అంతకు పూర్వం చిత్రనిర్మాతలు ప్రజలు అదరించదగినవనే ఉద్దేశంతో పౌరాణిక చిత్రాలుతీసారు, ప్రజలు బాగుపడతారు అనే ఉద్దేశంతో సాంఘిక సమస్యలతో కూడిన కథలు తీసుకుని చిత్రాలుగా తీశారు గృహలక్ష్మి, మాలపిల్ల, రైతుబిడ్డ, మళ్ళీపెళ్ళి, వందేమాతరం, సుమంగళి, స్వర్గసీమ మొదలైన చిత్రాలు ఇలాంటి సాంఘిక చిత్రాలు

స్వాతంత్ర్యం వచ్చాక ఈ పద్ధతి మారిపోయింది ''కొత్తదనం'' అనే అంశం ఒకటి సినిమా చిత్రాలలోకి ప్రవేశించింది పౌరాణిక చిత్రాలలో తెలియని కథగాని, సాంఘిక చిత్రాలలో తెలియని సమస్యగాని లేదు, కాని జానపద చిత్రాలలో అంతా కొత్తే వాటి లోని కథా, పాత్రలూ, సంఘటనలూ, సన్నివేశాలు జీవితానికి విలక్షణంగా ఉంటాయి జనం ఈ చిత్రాలను ఎగబడి చూడసాగారు పూర్వం ఎన్నడూ సినిమా చిత్రాలు చూసి ఎరగని సరికొత్త ప్రేక్షకులను ఈ కొత్తరకం జానపద చిత్రాలు ఆకర్షించాయి

జానపద చిత్రాల నిర్మాణానికి అవధులంటూలేవు అది సముద్రంలాగా వెళ్ళిన కొద్దీ లోతు సముద్రంలోకి ఒకరు మైలు వెళితే మరొకరు పదిమైళ్ళు వెళ్లిపోటీచేసారు సాహసమూ, ధైర్యమూగల కొత్త నిర్మాతలు వచ్చారు కొత్తనటులూ, గాయకులూ, చిత్రాకారులూ, రచయితలూ రంగంలోకి దూసుకువచ్చారు సినిమా పరిశ్రమలో ఒక కొత్తశకం ఆరంభమయింది

ఇది వ్యాపారంతో చెలగాటం పెట్టుబడి హెచ్చిన కొద్దీ లాభాలు తీసే అవకాశం మరింత స్పష్టంగా ఉండాలి క్రమేణా అదే లేకుండా పోయింది, ఇతర పరిశ్రమలలో తయారైన సరుకుకు ఒకటోతరగతి ధర పలక్కపోతే రెండోతరగతి ధరో, మూడోతరగతిధరో పలుకుతుంది సినిమా చిత్రాలకు ఆ అవకాశంలేదు థియేటర్లలో గాని, ప్రవేశరుసుముల్లోగాని ఏబీసీ గ్రేడ్లు లేవు ప్రేక్షకులు మంచి పిక్చరైతే లక్షలు కుమ్మరిస్తారు తమకు బాగుండని పిక్చరుకు కానీ

ఇవ్వరు

ఈ పరిస్థితి వల్ల జానపదచిత్రాలు దెబ్బతిన్నాయి ఏ ధైర్యసాహసాలూ కొత్తదనమూ వాటి సృష్టికి కారణభూతాలయాయో ఆ రెండూ సినిమా రంగస్థలం నుంచి నిష్క్రమించాయి అందరికీ ''తారలు''( అంటే పాతనటులు ) కావాలి ! ప్రతివాడు విజయవంతంగా నడిచిన చిత్రాల కథలనే అనుసరిస్తాడు, ఈనాడు ఇంకా ఇదే పరిస్థితి వున్నది అయితే ఈ పరిస్థితిలో కూడా జానపద చిత్రాలన్నీ దెబ్బతినటం లేదు 'మల్లీశ్వరి' వంటివి కొన్ని కీర్తి తెచ్చుకున్నాయి మరికొన్ని డబ్బుకూడా తెచ్చుకుంటున్నాయి కాని ఏ పిక్చరుకు ఎందుచేత డబ్బు వస్తున్నది ఎవరికీ స్పష్టంగా తెలిసినట్టు కనబడదు

సాంఘిక చిత్ర నిర్మాణం మొదట జానపద చిత్రాల తాకిడికి తట్టుకోలేక పోయింది గాని తరువాత మళ్ళీ తెప్పరిల్లుకుని తన మానాన తాను నడుస్తున్నది అయితే ఈ సాంఘిక చిత్రాలు అంతగా సమస్యా ప్రధానమైనవి కావు జానపద చిత్రాలలో వుండేటంత తీవ్రమైన పోటి ఇందులో లేదు గనక, నిర్మాతలు వీటిని తీస్తున్నారు అయితే ఇవి కూడా తారలనూ, పాటలనూ, నృత్యాలనూ, ఆశ్రయించి బతుకుతున్నాయి ఎక్కువ భాగం అమ్మాయి అబ్బాయి, కథలు, ప్రేమ సమస్యలు పాతివ్రత్యంతోనో అత్మ త్యాగంతోనో ముడిబెట్టి, ఇతివృత్తాలూ సన్నివేశాలు సాధ్యమైనంత వరకు నిత్యజీవితానికి దూరంగా ఉండేటట్టుగా చిత్రిస్తున్నారు హీరో పేదవాడైనా నైల్లాన్లకు తక్కువ వేసుకోడు హీరోయిన్ మాటచెప్పనే అక్కర్లేదు మధ్యతరగతి వాళ్ళ ఇల్లూ, ఇంట్లో ఫర్నిచరూ, విద్యుద్దీపాల వైభవమూ మహారాజుల ఇళ్ళను తలదన్నుతూ వుంటుంది హీరో హీరోయిన్ పాత్రలు తమ తరగతికి చెందిన ఇతర పాత్రలతో సరిసమానంగా ఉండక కష్టాలు పడేటప్పుడు కూడా ''పెట్టిపుట్టినట్టే'' ఉంటాయి వాస్తవానికి ఈ సాంఘిక చిత్రాలలో చాలా భాగం సాంఘిక చిత్రాలే కావు

అభ్యుదయ సిద్ధాంతం సినిమా పరిశ్రమ మీదికి దాడిచేసింది కాని ఈ దాడి అంతగా ఫలించలేదు షావుకారు, పల్లెటూరు, అంతామనవాళ్ళే, రోజులు మారాయి , నాఇల్లు, జ్యోతి, మొదలైన చిత్రాలలో సాంఘిక సత్యాలను నిరూపించటానికి కృషి జరిగింది, కలవారికీ లేని వారికీ మధ్య ఉండే సంబంధాలు వాస్తవంగా చిత్రించబడ్డాయి వీటిలో 'రోజులు మారాయి' బాగా డబ్బు చేసుకున్నది 'షావుకారు' మంచి ఖ్యాతి తెచ్చుకున్నది మిగిలినవి రెండు విధాలా చెడ్డాయంటే అది ప్రేక్షకుల తప్పుకాదు

ఈనాడు తెలుగు చిత్రాల నిర్మాణం గందరగోళంగా వుంది చిత్ర నిర్మాణ వ్యయం హెచ్చిపోయిందని నిర్మాతలు గొడవపెడుతున్నారు చిత్ర నిర్మాణపు ఖర్చు పెరగటానికి ప్రభుత్వం కొంతవరకు కారణమే గాని నిర్మాతలు చేజేతులా చేసుకున్నదే హెచ్చు తారలందరూ వెనక తీసుకున్నదానికి పది, పదిహేనింతలు తీసుకుని నెలకు నాలుగైదు రోజులు మాత్రమేపనిలోకి వస్తున్నారు ప్రభుత్వం హెచ్చించే పన్నులు చిత్రాల ఆకర్షణను పెంచవు తారలు పెంచుతారు అన్న నమ్మకంతో నిర్మాతలు తారలకు అడిగినంత ఇచ్చుకుని ప్రభుత్వ పన్నులను గురించి మొరెత్తుతున్నారు

డబ్బింగ్ చిత్రాల సంఖ్య హెచ్చుతున్నది చిత్రాలలో జాతీయత అన్నది ఏ కోశానా లేదు గనక ఒక భాషలో తీసి విజయవంతమైన చిత్రాన్ని ఇంకో భాషలోకి డబ్ చేసుకోవడం వల్ల జరిగే

నష్టం లేదు అయితే ప్రేక్షకుల అభిరుచులలో జాతీయమైన వ్యత్యాసాలుండటంచేత ఈ డబ్బింగ్ చిత్రాలు చౌకలో తాయరై కూడా దెబ్బతినటం అప్పుడప్పుడూ జరుగుతున్నది ప్రేక్షకుల అభిరుచులను చౌడు సున్నంలో ఉడకబెట్టి ''బీచ్'' చేసిననాడు డబ్బింగ్ చిత్రాలూ, మామూలు చిత్రాలూ ఒకే విధంగా నడవొచ్చు

ఈ 14 ఏళ్ళ కాలంలోను నిజంగా అభివృద్ధి అయినవి సినిమా సంగీతమూ, రికార్డింగూ, ఫొటోగ్రఫీ మొదలైనవి మాత్రమే అయితే ఇవి అన్నిచిత్రాలలోనూ కనిపించేవి కనక విశిష్టత లేకుండా పోయింది అన్ని చిత్రాలలోనూ కనిపిస్తూ విశిష్టత దక్కించుకున్నవారు తారలు మాత్రమే

ఏమైనా చిత్రాల నిర్మాణం తగ్గుతున్నది సినిమా వివిధ శాఖలలో పనిచేసినవారు నిర్మాతలు గా ముందుకొస్తున్నారు చిత్రనిర్మాణంలో 20 ఏళ్ళ అనుభవం వున్నవాడికీ కొత్తగా నిర్మాణంలోకి దిగిన స్టూడియో వడ్రంగికీ తేడా ఏమీలేని పరిస్థితి ఏర్పడడమే ఈనాడు చిత్రనిర్మాణంలోని గొప్ప విశేషం ఈ స్థితి మారకుండా ఎంతో కాలం ఉండదు కాని రాబోయే మార్పు ఏమిటో చెప్పటం కష్టం తారలు లేని చిత్రాలు సాహిత్యానికీ , జీవితానికీ సన్నిహితంగా ఉండే చిత్రాలూ, సినిమా కళను గౌరవించే చిత్రాలూ వస్తేరావచ్చు అటువంటి చిత్రాలు వచ్చినట్టయితే ఈ పరిశ్రమకు చాలాకాలంగా లేని స్థిరత్వం ఒకటి చేకూరుతుంది

*యువజన, మాసపత్రిక, 15-8-1961*

# 81. రచయితల కర్తవ్యం

రాకెట్ అంచెలలాంటి ఆర్థిక ప్రణాళికలద్వారా రష్యా కమ్యూనిజం కేసి పురోగమిస్తోంది మనం సోషలిస్టు రాజ్యంవైపు పురోగమిస్తున్నాం సోవియట్ సమాజం మరో 20 సంవత్సరాలకు కమ్యునిజంను అందుకుంటుందట మనం సోషలిజంను ఎప్పుడు అందుకుంటామో సరిగా తెలియటంలేదు మూడో పంచవర్షప్రణాళిక పూర్తయ్యేసరికి సోషలిస్టు వ్యవస్థకు పునాది ఏర్పడుతుందంటున్నారు అంటే అది మొదలు పరిశ్రమలన్నీ జాతీయమవ్వటం ప్రారంభ మవుతుంది కాబోలు నిరుద్యోగమూ, నిరక్షరాశ్యతా, విద్యా, వైద్యాది అసౌకార్యాలు నిలిచిపోతాయన్నమాట అయిదేళ్ళు జాతియొక్క చరిత్రలో చాలాకొద్ది కాలం ప్రాజక్ట్‌ల నిర్మాణం విషయంలో నైతేనేమి, ప్రభుత్వ పరిశ్రమలు కేటాయించటంలో అయితేనేమి, రైళ్ళ ఎడారిలా రైల్వేమాప్‌లో కనిపించే ఆంధ్రకు కొత్తరైలు మార్గాలు వెయ్యటంలోనైతేనేమి , ఆంధ్రను కేంద్రం అన్ని రాష్ట్రాలతో సమంగా చూడనారంభిస్తుందన్నమాట!

''బంగారు కాలం'' ఇంత సమీపంలో పెట్టుకుని ఆంధ్రులు ఇంకా మేలుకోక పోవటం ఏమీబాగాలేదు ముఖ్యంగా మన యువరచయితలు తాము రాసే కథలు వగైరాలలో రానున్న రామరాజ్యం గురించి ఆలోచిస్తున్నట్టే కనబడదు ఒక కథలో ఒక నిరుద్యోగి యువకుడు తనకు ఉద్యోగం ఇచ్చిన పెద్దమనిషి కాళ్ళకు నమస్కారం చేస్తాడు ఇలా రాసినందుకు కథకుడుని నేను తప్పుపట్టను ఆ అబ్బికి నిరుద్యోగంలో ఉండే బాధా, నరకం తెలుసు తనచుట్టూ ఘనీభవించి వున్న ఫ్యూడల్ వ్యవస్థను కూడా అర్థంచేసుకున్నాడు ఈ వ్యవస్థలో ఉద్యోగాలు

ఇవ్వగలిగిన స్థితిలో వున్న ఆసామి తనవాళ్ళకో, తనకులం వాళ్ళకో ఆ ఉద్యోగం తగలేస్తాడు గాని, ఎవరో కుర్రాడు పాపం కష్టపడుతున్నాడు అని ఇస్తాడా? ఇస్తే అటువంటి వాళ్ళ కాళ్ళకు దండం పెట్టాలా వద్దా ? తప్పక పెట్టాలి

ఈనాడు మన సమాజంలో ఉద్యోగాలు కావలిసినవాళ్ళెంత మంది? వాళ్లలో ఎంతమందికి ప్రభుత్వం ఉద్యోగాలు ఇస్తున్నది? అని అలోచిస్తే ఎంత హీనమైన ఉద్యోగం సంపాదించు కున్నవాడు కూడా ''పూరా ప్రయోజకుడేననీ'', కులమత విచక్షణ లేకుండా ఉద్యోగాలు ఇచ్చేవాళ్లంతా ధర్మరాజు లేనని ఒప్పుకోవాలి ఒప్పుకుంటాను కాని సోషలిస్టు వ్యవస్థ ఇంకెంతో దూరంలో లేదే? మరి దాని మాట ఏమిటి? మరో 5ఏళ్లకి ఈకథ ''పాత చింతకాయ పచ్చడి'' అయిపోవలసిందేగా, పాపం! ఈ యువకుడు డింకొక్క 5 ఏళ్ళ బూట్లు పాలిష్ చేసో, రాళ్ళుకొట్టో, రైల్వేపోర్టర్‌గా పొట్టపోసుకునో ప్రాణాలు నిలబెట్టుకుంటే ఆ తరవాత ఎంప్లాయింమెంట్ ఎక్స్‌చేంజికి ఒకదరఖాస్తు పారెయ్యటమూ, మర్నాటి కల్లా ఉద్యోగం రావటమూ, వెళ్ళికూర్చొని పని ప్రారంభించడమునూ! ఎవరి పాదాలకూ దండాలు పెట్టనవసరం లేదు

ఇదే విధంగా రోగాలు వస్తే మందు ఇచ్చుకోలేక చచ్చిపోయే భార్యలను , పిల్లలను , చూసి కుమిలిపోయే వాళ్ల కథలన్నీ పురాణాలు అయిపోతాయి అందరికీ వైద్యసౌకర్యాలు, ఎక్కడపడితే అక్కడ ఆస్పత్రులు, బిచ్చగాళ్ళ కథలు, వడ్డీ వ్యాపారాలు చేసి అందరి కొంపలూ గుండం చేసే వాళ్ళ కథలూ, హరిజన యువకుడిని పెళ్ళడతానన్నందుకు ఏ పాపము ఎరగని ఆడపిల్లని , చిత్రవధచేసే వాళ్ళ కథలూ, ఫ్రీ ఎంటర్ ప్రైజ్ – దరిద్రులైన అల్లుళ్ళకు తనకూతుళ్ళను ఇచ్చి ఉద్ధరించే ఫ్రీ ఎంటర్ ప్రైజ్ మామగార్ల కథలూ, త్వరలోనే కాలదోషం పట్టిపోనున్నాయి ఈ కథలు యీనాటి వాస్తవాన్ని ప్రతిబింబించొచ్చు గాక, కాని వర్గరహిత రామరాజ్యవ్యవస్థ ఎంత దగ్గరలో వున్నదీ మనం మరిచిపోరాదు

ఇదే సినిమా వాళ్ళకు కూడా హెచ్చరిక సినిమా వాళ్ళుజీవితాన్ని ప్రతి ఫలిస్తున్నారని కాదు వాళ్ళు ఒక్కొక్కసారి మరీముందుంటున్నారు కొన్ని సినిమాలు చూస్తుంటే 1990 నాటివో, 1999 నాటివోఅనిపిస్తున్నవి సినిమాలలో సత్యమూ, ధర్మమూ తెగ గెలిచి పోతున్నాయి అందులో తప్పేమీ లేదు రామరాజ్యంలో అచ్చుగా అదే జరుగుతుంది ఇవాళ ఇంకా అసత్యమూ, అధర్మమూ, అవినీతీ జయిస్తున్నాయంటే దానికి కారణం ప్రీసోషలిస్టు ప్రణాళికలు ముగియక పోవడమే మనదేశంలలో ప్రణాళికలు '' ఓవర్ ఫుల్ ఫిల్ '' కావటం లేదని అందరికీ తెలిసినదే దానికి కారణంకూడా మనకు తెలుసు— మన ప్రభుత్వం ప్రణాళికా లక్ష్యలకోసం ఎవరిమీద ఎలాంటి హింసా చర్యలు తలపెట్టలేదు అందుకే కొంతడబ్బు కైంకర్యం కావటమూ, నిర్మాణాలు ఓడోడుగా ఉండటమూ మొదలైన అవకతవకలు జరగడం

సినిమా కథలు అప్పుడే రామరాజ్యం పొలిమేరలో అడుగుపెట్టి సత్యాన్నీ ధర్మాన్నీ ఎడా పెడా నెగ్గించెయ్యటం కొనియాడ దగినదే కాని ఒక రాజా గారి కథ ఆఖరులో ఒక కాపు పిల్లను – ఆవేషం ఏ రాజసులోచనో వేసింది కదా అని – పెళ్లాడెయ్యటం 'టూమచ్' రామ రాజ్యంలో రాజులుంటే ఉండొచ్చు గాని వాళ్ళు రాజ్యాలేలరు ప్రజా మంత్రులు – రామరాజ్య నియమావళి ననుసరించి ధర్మబద్ధంగా ఆయాపార్టీలతో ఎలెక్షన్ ఒప్పందాలు చేసుకొని

ఎన్నికలలో ప్రజాద్రోహపక్షాల వారిని ఓడించి గెలిచిన వాళ్ళు – రాజ్యాలేలుతారు అదే విధంగా కోటీశ్వరుడైన పెట్టుబడిదారు కార్మిక యువతిని పెళ్ళాడటంలో కూడా రామరాజ్యానికి అవమానం ఉన్నది రామరాజ్యంలో పెట్టుబడిదార్లు కార్మికులకు వాళ్ళు సంపాదించి పెట్టిన లాభాలనుంచి బోనస్‌లు డిక్లేర్ చేసి 'జై' లు కొట్టించుకోవటం ఎక్కడ ఉంటుంది?

ఒక విధంగా చూస్తే ఈ సినిమాలు తీసేవాళ్ళు రాబోయే రామరాజ్యాన్ని వెటకారం చెయ్యటానికే ఇటువంటి కథలు తీస్తున్నట్టు కనిపిస్తున్నది ''మీరు జీవితాన్ని చూసి ప్రపంచంలో మంచితనానికీ, నిజాయితీకీ, ధర్మానికీ స్థానం లేదనుకుంటూన్నారా? దానికోసం రామరాజ్య సోషలిస్టు వ్యవస్థ కోరుకుంటున్నారా? వద్దు! రాచరికంలోనూ సత్యమూ, ధర్మమూ జయిస్తాయి మళ్ళీ మాట్లాడితే పెట్టుబడిదారీ కింద శ్రామికులు పొందేసుఖం సోషలిజంలో లేదు సోషలిజం వస్తే మీకు బోనసులిస్తామని ప్లాట్‌ఫారం మీది నుంచి చెప్పేదెవరు? మీ ఆడపిల్లలు ఏ కోటేశ్వరుణ్ణి పెళ్ళాడతారు?'' మీరెవరికి 'జై' లు కొడతారు? అన్నట్టుంది నిర్మాతల వైఖరి ఇది ''ఫిఫ్త్ కాలం'' వైఖరి అయినా మనం సినిమాలను గురించి అంతగా విచారించవలసిన అవసరంలేదు ఎందుకంటే రానురాను సినిమా చిత్రాల ఆయుర్దాయం క్షీణిస్తున్నది మహత్తర చిత్రాలు కూడా త్వరలోనే మరుగున పడుతున్నాయి

మామూలు కథలు అట్లాకాదు ఇవి అచ్చయ్యాయంటే ఏళ్ళ తరబడి వాటిని ప్రచురించిన పత్రికలు చేతికి అడ్డుతగులుతూనే ఉంటై పుస్తకాలుగా అచ్చయితే లైబ్రరీల్లో చేరతాయి మూర్ మార్కెట్ చేరతాయి ఏదో ఒక విధంగా అవి చేతులు మారతాయి కాని సినిమాల్లాగా అయిపులేకుండా పోవు అందుచేత రచయితలు రానున్న రామరాజ్యాన్ని తమ కథల్లో ప్రతిబింబించటానికి యిప్పటి నుంచి ఆయత్తం కావటం ఎంతైనా అవసరం

*విశాలాంధ్ర, దినపత్రిక, 8-10-1961*

# 82. చిన్నదైపోతున్న సినిమా ప్రపంచం

ప్రపంచం చిన్నదైపోతున్నదంటారు విమానాలూ, రేడియోలూ, పత్రికలూ మొదలైనవి ప్రపంచం నాలుగు మూలలనూ సన్నిహితం చేశాయి ఇవాళ ప్రపంచంలో ఏ మూల ఏ ముఖ్యసంఘటన జరిగినా, సమావేశం జరిగినా దాన్ని గురించి ఒక గంటలో రేడియో ద్వారా పత్రికలకు తెలుస్తుంది మర్నాటికల్లా దాన్ని గురించి పత్రికలలో చదువుతాం ఆవారంలోనే వార్తా చిత్రాలలో ఆ సంఘటనను చూస్తాం కూడా ఇదే ప్రపంచం చిన్నది కావటమంటే

న్యాయంగా ప్రపంచం చిన్నదవుతున్నకొద్దీ కళా ప్రపంచం విశాలం కావాలి నన్నయ భట్టు మొదలు కొని పింగళి సూరన్న దాకా పాత పురాణాలే తిరగదోడి, వాటికే చిలవలూ పలవలూ చెక్కి, చిన్నెలూ వన్నెలూ జతచేసి అతిచిన్న సాహిత్య ప్రపంచంలో విహరించారు శిల్పులు ఆ పురాణపురుషులనే మళ్ళీ మళ్ళీ చెక్కారు బౌద్ధులూ, జైనులూ, క్రైస్తవులూ మొదలైన వారు తమ మతాలు గీసినగిరులు దాటకుండా కళారాధన చేశారు చిత్ర కారులూ, నాటక కర్తలూ, కవులూ మొదలైన కళాకారులు కూడా బుల్లి బుల్లి కళా ప్రపంచాలను యథాశక్తి రచించుకున్నారు

మనదేశంలోనే నేమో అనుకుంటే పాశ్చాత్య దేశాల్లోనూ ఇదే జరిగింది తన నవలలతో గొప్ప ఖ్యాతి సంపాదించుకున్న జేన్ ఆస్టెన్ అనే ఇంగ్లీషు రచయిత్రి తన నిత్యజీవితమూ, సాంఘిక

వాతావరణమూ దాటిపోకుండానే ''గొప్ప'' నవలలు రాసింది తమ దేశాన్ని ఆనుకుని ఉన్న ఫ్రాన్సులో చారిత్రాత్మకమైన విప్లవం జరిగితే, ఆమె దాన్ని గురించి మాట వరస కన్నా ప్రస్తావించలేదు దీని కంతకూ కారణం ఆనాటి ప్రపంచం అపారమైనది ఆనాటి రాజ్యాలు మన తాలూకాలకన్న చిన్నవి సామ్రాజ్యాలు రెండు మూడు జిల్లాలంత ఉండేవేమో అసలు ఆనాటిది ఒక ప్రపంచం కాదు—అనేక ప్రపంచాలు ఎవరి ప్రపంచంలో వాళ్ళుండి అదే ప్రపంచమన్నట్టుగా నడుచుకునే వాళ్ళు

ప్రపంచం ఏకమైనాక అదంతా పోయింది కళలలో వుండే ప్రపంచం చాలా విశాలమయింది కథకులూ, చిత్రకారులూ, కవులూ, ఇతర కళాకారులూ ఎప్పటికప్పుడే కొత్త కొత్త ప్రాపంచిక విషయాలను తమ కళా ప్రపంచంలో వెలయింప చేస్తున్నారు స్ఫూత్నిక్‌ల మీదా, లుముంబా హత్య గురించీ, అణువు బాంబులను గురించీ, ఇంకా అనేక విషయాలను గురించి పద్యాలు చదివాం

మన ప్రభుత్వం మన జీవితాలను మరీ హెచ్చు శ్రద్ధాసక్తులతో తీర్చి దిద్దుతూ, సాధ్యమైనంత వరకు మనం పై దేశాలకు పోయి అక్కడి అల్లరిపిల్లకాయలను చూసి చెడిపోకుండా కాపాడుతూ, మనలో చొరవ అనేది లేకుండా చెయ్యటం చేత మనం బొత్తిగా తల్లి చాటు పిల్లల్లాగా అయినాం గాని, ఈనాడు ఇతర దేశాల వారు సృష్టించే కళల్లో ప్రపంచంలోని అన్ని ప్రాంతాల విషయాలకూ స్థానం వుంటున్నది గ్రహామ్ గ్రీన్ అనే నవలాకారుడు తన స్వదేశమైన ఇంగ్లండులోనే కాక క్యూబా, కాంగో, ఆస్ట్రేలియా మొదలైన దేశాలన్నిటిలోనూ జరిగే సంఘటనలు గురించి నవలలు రాశాడు హాలీవుడ్ వాళ్ళు తయారు చేసే చిత్రాల కథలు అనేక దేశాలకు సంబంధించినవి

ముఖ్యంగా ఇతర కళలలోకన్న సినిమాలలో విశాలమైన జీవితం కనిపించటం అవసరం ఎందుకంటే అన్నిటికన్నా సినిమా చిత్రాలు సార్వజనీనమైనవి చదువుకొన్న వాళ్ళూ, చదువురాని వాళ్ళూ, బస్తీల వాళ్ళూ, పల్లె ప్రజలూ, చిన్నా, పెద్దా, ఆడా, మగా అందరూ వాటిని చూసి అర్థం చేసుకోగలరు వాటి ద్వారా అనేక విషయాలు తెలుసుకోగలరు

అటువంటి పరిస్థితిలో మనసినిమా చిత్రాలలో జీవితం కంబళి పురుగులాగా ముడుచుకు పోనారంభించింది ఒకనాటి సినిమాలు వాస్తవ జీవితాన్ని జ్ఞాపకం చేసేవిగానైనా ఉండేవి పురాణ చిత్రాల బుల్లి ప్రపంచం నుంచి బయట పడగానే మనకు 'మాలపిల్ల', 'రైతు బిడ్డ', 'మళ్ళీ పెళ్ళి' 'వందేమాతరం' వంటి సాంఘిక చిత్రాలూ, 'పల్నాటి యుద్ధం' వంటి చారిత్రక గాథా, 'వేమన' 'త్యాగయ్య' వంటి జీవిత చిత్రాలూ వచ్చాయి

రెండవ ప్రపంచ యుద్ధం అయినాక సినిమాలను పురుగు ముట్టింది అవాస్తవమైన ధార్మిక సమస్యలూ, పాత్ర పోషణలూ, కేవలం ఊహాజనితమైన ''జానపద'' గాథలూ సినిమా తెర లెక్కసాగాయి ఈ పరిణామం తారల విజృంభణతో పరాకాష్ఠ అందుకున్నది ఇప్పుడు సినిమాలలో పాత్రలే లేవు నాగేశ్వరరావూ, రామారావూ, సావిత్రీ, శివాజీ గణేశన్, రామచంద్రన్, జమునా, సూర్యకాంతం, రంగారావూ, రేలంగి, రమణారెడ్డి వీళ్ళే పాత్రలు వీళ్ళందరూ వేరు వేరు పాత్రలిస్తే నటించరని కాదు అవకాశం దొరికితే నటిస్తున్నారు కూడా కాని ఆ అవకాశాలివ్వటానికి అవకాశాలు సన్నగిలిపోతున్నాయి

చిక్కేమిటంటే వాస్తవ పాత్రలు వాస్తవమైన సన్నివేశాలు కోరుతాయి వాస్తవ సన్నివేశాలు కథ యొక్క వాస్తవికతకు దారి తీస్తాయి అది బాక్సాఫీసుకు అనుకూలం కాదు నటులు తమ పాత్రలను కాక కథకుడు రాసిన పాత్రలు ధరించటం మొదలు పెడితే వాళ్లకిచ్చే పెద్ద మొత్తాలు గిట్టుబాటు కావు.

చిత్ర నిర్మాతలకుగల ఈ ఆదుర్దాలో ఒక వంతైనా తారలకున్నది ప్రేక్షకుడు చూసి రోతపడే పాత్రను ధరించమంటే చాలా మంది తారలు నిరాకరిస్తారు అందరూ నిరాకరించే దశ వస్తే జనం రోసే పాత్రలకు 'వెండితెర'పైన స్థానం లేకుండా పోతుంది తారల స్వార్థం మన కథలను నిర్ణయిస్తుందనటానికి ఇది చాలు ఇటువంటిదే మరొక విషయం కూడా ఈ మధ్య వినవచ్చింది తెరదంపతులుగా అనేక చిత్రాలలో నటించిన జంటను అన్నా చెల్లెలు పాత్రలు ధరించమంటే నిరాకరిస్తున్నారట!

ఈ పరిస్థితిలో సినిమా చిత్రాలలో మనం చూసే ప్రపంచం ముడుచుకుపోక ఏం చేస్తుంది! మన ఊహకు అతీతమైన జానపద చిత్రాలను వదిలేసి కేవలం ''సాంఘిక'' చిత్రాలనే తీసుకున్నా అందులో పాత్రలకు ఎదురయ్యే సమస్యలుగాని, ఆ పాత్రలు చేసే త్యాగాలుగాని మన ప్రపంచాన్నీ, మన సాంఘిక చింతననూ ఎక్కడా అంటవు

ఇందులోఅనుకరణలు '' జిస్ దేశ్ మే గంగా బహతీ''ని కొద్దిగా మారిస్తే ''గంగా జమునా'' అయినట్టుగా మన సాంఘిక చిత్రాలు కూడా ఒక దాన్ని కొంచెం పొర్లిస్తే మరొకటి అవుతుంది ప్రజా యుగోదయానికి పూర్వం ఉండిన జమీందారీ అంధకార యుగంలో జన సామాన్యానికి వేరే కళలుండేవి కావనీ, పై తరగతుల వారి కళలనే సామాన్య ప్రజలు కూడా ఆస్వాదించవలసి వచ్చేదని, అని మనం జాలి పడతాం కాని ఆరోజులే మంచివి జానపద కళలే ఉండేవి ఈనాడు ప్రజల పేర డబ్బు కోసం వెలసిన సినిమా కళ న్యాయంగా ఏ వర్గానికి చెందిన వాస్తవ కళా కాదు ఇంత హీనమైన కళ పూర్వం లేదు ఇక ముందుకూడా ఉండబోదు అని ఆశింతాం

*సవ్యసాచి, వారపత్రిక, 28-12-1961*

# 83. తెలుగు సినిమాలు

తెలుగు సినిమాలు ప్రస్తుతం సగటున పక్షానికి ఒకటి వంతున విడుదల అవుతున్నాయి వాటికి తోడు ఇతర భాషల చిత్రాలు తెలుగులోకి డబ్బింగ్ అవుతున్నాయి తెలుగులోనే నిర్మాణమయ్యే చిత్రాల కన్నా ఈ డబ్బింగ్ చిత్రాల సంఖ్య తక్కువగానే వుంటుంది కాని 1961లో అసలైన తెలుగు చిత్రాలకన్నా డబ్బింగ్ చిత్రాల సంఖ్య ఎక్కువ తెలుగు చిత్రాలలో తొమ్మిదికి ఒకటి వంతున శతదినోత్సవాలు జరుపుకొంటాయి డబ్బింగ్ చిత్రాల విషయంలో ఎంతో కొంత కాలంపాటు నడిచినా సంతృప్తి చెందుతారు

టెలివిజన్ బాగా ప్రజాదరణ పొంది వ్యాప్తిలోకి వచ్చేవరకు కూడా, చలన చిత్రాలే ప్రజానీకానికి వినోద సాధనంగా వున్నాయి కళలో వాస్తవికత సాధించటానికి ఉత్తమ సాధనంగా తెలుగు సినిమా స్థాయి చాలా వరకు మెరుగుగానే వున్నా వాస్తవికతా చిత్రాలకు సాధనంగా లెక్కలోకి రాజాలదు ఈ రెండు రకాల విద్యుక్తధర్మాల నిర్వహణ తెలుగులో చిత్రానికి సాధ్యం

కావడం లేదనేది స్పష్టం తెలుగు సినిమా ప్రేక్షకులకు తగిన వాస్తవికత లభిస్తున్నదని ఎవరైనా వాదించవచ్చు

చిత్రీకరణకు ఎంచుకొన్న కథావస్తువు విషయంలోనే కాక, పాత్రల రూపకల్పన, సన్నివేశాలు, సమస్యల ట్రీట్‌మెంట్, దుస్తులు, చిత్ర నిర్మాణంలో నెలకొల్పే సెట్స్‌తో సహా అన్నింటిలో వాస్తవికత మృగ్యమని స్పష్టంగా కనిపిస్తుంది గృహాంతర్భాగాలు ఇంజనీర్లకు నివ్వెరపాటు కలిగిస్తాయి లైటింగ్ రీతులు ఊహాతీతమైనవి పగటి వేళను చిత్రీకరించే సన్నివేశాలలో సైతం, ఇంటిలోని వ్యక్తులనీడలు బహుళ సంఖ్యలో కనిపిస్తాయి వస్త్రాలు, ఫర్నిచర్, లైట్లు ఆ గృహస్తు స్తోమతకు మించే వుంటాయి

దాదాపుగా చిత్రాలన్నిటిలో కథా వస్తువు ప్రేమ, వివాహం చుట్టూ అల్లుకొని వుంటుంది సదరు ప్రేమ, వివాహాలకి ఏర్పడే అవరోధాలు నాటకీయతకి ఆధారంగా వుంటాయి అసలు నాయకీ, నాయకుల మధ్య ప్రేమ ఎలా జనించిందనేది పట్టించుకోనక్కరలేదనే ధోరణి వ్యక్తమవుతోంది ఆ ప్రేమికుల జంటగా ప్రఖ్యాత నటీ నటులుంటే ప్రేమ గురించి ప్రశ్నలే రావు ఈ ధోరణికి భిన్నమైన ఉదాహరణగా విజయావారి 'మిస్సమ్మ' ను పేర్కొనవచ్చు ఆ చిత్రంలో ప్రేమ ఆవిర్భావం నెమ్మదిగా వస్తుంది చిత్రం ముగిసే సమయానికి పరిణతి చెందుతుంది 'సూత్రం' వారిని భార్యా భర్తలుగా చేసినట్టే, ఒకే ఒక యుగళ గీతం వారి మధ్య ప్రేమ కలిగిస్తుంది ప్రేమిస్తున్నట్టు వారు ఒకరితో ఒకరు చెప్పుకోరు కూడా కథానాయకుడు ముద్దుగా సిగ్గుపడతాడు

చిత్రాలలోని ప్రేమ కాల్పనిక సాహిత్యానికి భిన్నంగా వుంటుంది 'పాతివ్రత్యం' స్త్రీకి మహోన్నత ఆదర్శంగా చిత్రాలు ఉద్ఘోషిస్తాయి పౌరాణిక గాథలలోని దమయంతి, చంద్రమతులవలె సినిమాలలో కథానాయిక తన భర్తని దేవుడుగా భావించి, ప్రాతఃకాలంలో పాదాలకు మొక్కుతుంది వాడెంతటి నీచుడు, దుష్టుడు అయినా ఆ దేవుడి కోసం సర్వ త్యాగాలు చేస్తుంది చివరకు జన్మజన్మాలకు అతడే తన భర్త కావాలని ప్రార్థిస్తూ ప్రాణాలర్పించటానికి సిద్ధపడుతుంది

ఇదేదో ప్రేమకు మరో మంచి గుణం కల్పించడం కాదనీ, ప్రేమించిన వ్యక్తితో వివాహం ఒన గూడినప్పుడు స్త్రీత్వపు ఆదర్శం కోసం ఆ ప్రేమను సైతం త్యాగం చేయించటంతో స్పష్టపడుతుంది

ప్రేమకు, పెళ్ళికి అవరోధాలు జీవితంపై తీవ్ర వ్యాఖ్యలుగా చిత్రిస్తారు ధనికులకు, పేదలకు మధ్య పాత, కొత్త భావాల మధ్య విద్యుక్త ధర్మాలు, వ్యక్తిగత సౌఖ్యం మధ్య వైరుధ్యాలను గట్టిగా నొక్కిచెప్పటం జరుగుతుంది అయితే ఈ వైరుధ్యాలను చిత్రీకరించటంలో వాటి ప్రాధాన్యం అంతా పోయేట్టుగా చేసే రాజీలు, ఉద్వేగాలను ఉత్ప్రేక్షించడం జరుగుతుంది తేలికగా నివారించగల అపోహలు, అవతలి వ్యక్తి చెప్పినది వినటానికి మూర్ఖంగా నిరాకరించడం కొట్ట వచ్చినట్టు కనిపిస్తాయి ప్రేక్షకులకు అందులో నాటకీయత కనిపించదు కొన్ని పాత్రలకు ఏమాత్రం జ్ఞానం లేకపోవటం, మిగిలిన పాత్రలు దానిని సహించడం ఎందుకు అని సంశయం కలుగుతుంది

ఇటువంటి తీవ్రమైన లోపాలు, చిత్ర వైఫల్యాలకు తప్పక దారి తీస్తాయనే నిర్ణయానికి

రానవసరం లేదు  ఒక చిత్రంలో నాయిక  చిల్లరమల్లర పనులు చేసి తమ్ముడిని కాలేజీలో చదివించింది  మరో చిత్రంలో సోదరి ఫ్యాక్టరీ కూలీగా పనిచేసి డబ్బుకూడబెట్టి తమ్ముడిని ధనికుడుగాను, పెట్టుబడిదారుగాను చేసింది  కొన్ని చిత్రాలలో అప్రధానమైన పాత్రలు నాయికా నాయకుల జీవితాలను నాశనం చేసి, వీధుల్లో ఏడుస్తూ బిచ్చమెత్తుకునేటట్టు చేస్తాయి  కథ ట్రీట్‌మెంటు అంత అసంబద్ధంగా వున్న చిత్రాలు విజయవంతమైనాయి

చిత్రాలలో కొన్ని నియమాలను ప్రేక్షకులు ఆశించడం, మరి కొన్ని లోపించినా సహించటం అలవరచుకున్నారనేది వాస్తవం  వారు చిత్రంలో ఆశించే వాటిలో తారలకు అత్యధిక ప్రాముఖ్యం ఉన్నది  ప్రఖ్యాత తారాగణంలేని చిత్రం వైఫల్యం తథ్యం  అందుచేత సహజంగానే కథా వస్తువనేది తారలను శారీరకంగా, ఉద్వేగాల పరంగా బాగా ప్రదర్శించడానికి సాధనం మినహా మరేమీ కాదు  ఈ తారలు సామాన్య మానవులుగా కనిపించడం అంటే వాస్తవికతకే అపచారమవుతుంది

తారలకు నటనా సామర్థ్యం అంటూ ఉంటే వారు దానిని ప్రదర్శించవచ్చు  కాని దానివల్ల ఆ తార స్వరూపం పరివర్తనం చెందితే సహించరు  అందుకే తెలుగు చిత్రాలలో ఉత్తమ నటన సహాయ పాత్రధారులైన నటీనటులలో పరిమితంగా ఉంటున్నది  ఇక ఆకర్షణ ఆధారంగా వున్న యువతీ యువకులు అటువంటి ఆకర్షణాయుతులుగా వుండడంతోనే సంతృప్తి పడవచ్చు

మనకు అత్యంత ప్రతిభావంతులైన సినీనటీనటుల సుదీర్ఘమైన జాబితాలో ప్రముఖులు నాగేశ్వరరావు, ఎన్ టి రామారావు, గుమ్మడి, జగ్గయ్య, రేలంగి, రమణారెడ్డి, భానుమతి, సావిత్రి, జమున, దేవిక, కృష్ణకుమారి, అంజలీదేవి, జానకి, సూర్యకాంతం వంటి వారున్నారు  అందులో నాగేశ్వరరావుకు మజ్ను, దేవదాసు, తెనాలి రాముడు, విప్రనారాయణుడు, కాళిదాసు వంటి వైవిధ్యంగల పాత్రలు ధరించిన ఘనత దక్కింది  అలాగే రామారావు కూడా అనేక విఖ్యాతపాత్రలు ధరించాడు  మన అగ్రశ్రేణి నటీనటులు పలువురు తమిళ చిత్రాలలో నటించడం ఆంధ్రులు గర్వించదగిన విషయం  అగ్రశ్రేణి తెలుగు నటీమణులంతా అత్యుత్తమ తమిళ నటీమణులుగా పరిగణన పొందిన సందర్భాలున్నాయి  వారిలో కొందరు అనేక పర్యాయాలు అలాంటి ప్రశంసలందుకున్నారు  అయితే సుప్రసిద్ధ తమిళ నటీనటులు అదేవిధంగా తెలుగు సినిమా రంగంలో కళాకారులుగా నిలదొక్కుకోలేదు  అంటే తమిళ కళాకారుల ప్రతిభ తెలుగు వారి కంటె తక్కువ అనుకోనవసరం లేదు  స్థూలంగా చెప్పాలంటే తెలుగు చిత్ర నిర్మాతలు తమిళ నిర్మాతలతో పోటీకి నిలవలేరు  తమిళ తారలు తెలుగు నిర్మాతల ఆర్థిక స్థోమతకు అందుబాటులో లేరు  అయినా కూడా శివాజీగణేశన్, ఎం ఆర్ రాధ, బాలయ్య, జెమినీ గణేశన్ వంటి తమిళ నటులు తెలుగు ప్రేక్షకులకు డబ్బింగ్ చిత్రాల ద్వారా పరిచితులై ఆదరాభిమానాలు పొందారు

చలన చిత్ర రంగంతో సంబంధంగల ఇతర కళలలో, ప్రతిభావంతులైన వారికి సముచిత స్థానం లభించకపోలేదు  తాపీ ధర్మారావు, సముద్రాల రాఘవాచార్యులు వంటి సాహితీ వేత్తలు దశాబ్దాల తరబడి ఈ రంగంలో రాణించారు  ఆచార్య ఆత్రేయ, జూనియర్ సముద్రాల, పాలగుమ్మి పద్మరాజు, డి.నరసరాజు వంటి రచయితలు శ్రీశ్రీ, అనిసెట్టి, ఆరుద్ర, కొసరాజు, దాశరథి, నారాయణరెడ్డి వంటి కవులు చిత్రాలకు మాటలు, పాటలు సమకూర్చుతూ వచ్చారు

శేఖర్, గోఖ్లే, కృష్ణారావు వంటి ఉత్తమ కళాకారుల కళాదర్శకత్వం మన చిత్రాలకు శోభ చేకూర్చుతున్నది అలాగే రాజేశ్వరరావు,ఘంటసాల పి నాగేశ్వరరావు, పి బి శ్రీనివాస్, సత్యం మొదలైన పలువురు సంగీత కళాకారులు మనకున్నారు

తెలుగు చిత్రాల అత్యున్నత ప్రమాణాలకు ''బయట వారు'' అంటే ఆంధ్రేతరుల దోహదాన్ని మనం విస్మరించరాదు తెలుగు చిత్రాలకు సుస్థిర స్థానం ఏర్పడిందని గత ప్రపంచ యుద్ధానికి ముందు గుర్తించడం జరిగింది తెలుగు చిత్రాల నిర్మాణానికి మద్రాసు కేంద్ర మయింది అప్పటి నుండి ఎన్నో ఉత్తమ తెలుగు చిత్రాలు తమిళ, కన్నడ నిర్మాతల నుంచి వచ్చాయి. ఆంధ్రేతరులైన ఛాయా గ్రాహకులు, రికార్డిస్టులు, మేకప్‌మెన్ వంటి వారే కాక కళా దర్శకులు, సంగీత దర్శకులు, నృత్య దర్శకులు సైతం మన చిత్ర నిర్మాణానికి తోడ్పడ్డారు ప్రఖ్యాతి గాంచిన మన నేపథ్యగాయని లీల మళయాళీ యువతి

మనచలన చిత్ర ప్రముఖులలో పలువురు ప్రతిభావంతులైన దర్శకులు, నిర్మాతలు ఉన్నారు ఒక పావుశతాబ్దంగా ఈ రంగంలో ఉన్న బి ఎన్ రెడ్డి చలన చిత్రాలను కళా ఖండాలుగా పరిగణించిన నిర్మాతలలో ప్రప్రథములు ఆయన 'మల్లీశ్వరి' ని (1951) సంస్కారవంతులు, కళా ప్రియులు ప్రశంసించారు అదే కోవకు చెందిన 'పోతన', 'వేమన' వంటి జిజ్ఞాసాత్మక చిత్రాలు నిర్మించిన కె వి రెడ్డి కాలానుగుణంగా 'గుణసుందరి కథ' ' పాతాళభైరవి' ,'మాయా బజార్' ,'జగదేక వీరుని కథ' వంటి లాభార్జన చిత్రాలు నిర్మించారు

నటుడుగా ఖ్యాతి గాంచిన వి నాగయ్య నిర్మాతగావారి 'త్యాగయ్య' వంటి గణనీయమైన చిత్రాన్ని నిర్మించారు చిత్ర నిర్మాణానికి ఆయన యాతనలు పడ్డారు

నాగిరెడ్డి, చక్రపాణి సారథ్యాన విజయా ప్రొడక్షన్స్ సంస్థ అవతరణ యుద్ధానంతర కాలంలోని చిత్ర నిర్మాణ రంగంలో పెద్ద మలుపు వాహిని స్టూడియో వంటి అపూర్వమైన స్టూడియో వారి ఆధ్వర్యాన వుండడం, వారి చిత్రాలు నాణ్యమైనవిగా ఉండటానికే కాక, ఇతర నిర్మాతలు కూడా మేలి రకపు చిత్రాలు నిర్మించటానికి తోడ్పడింది పైన పేర్కొన్న కె వి రెడ్డి చిత్రాలలో చివరి మూడు విజయాప్రొడక్షన్ వారివే 'గుండమ్మ కథ' పేరు ఎలా వున్నా సాంఘిక చిత్రమే తెలుగు చిత్రాల రాబడి విషయంలో పూర్వపు రికార్డులన్నిటినీ అధిగమించింది ఇది కూడా విజయా ప్రొడక్షన్స్ వారి చిత్రమే

టాకీలకన్నా ముందునుంచే చలనచిత్రరంగంలో వున్న ఎల్ వి ప్రసాద్ తెలుగు చిత్రాలలో దర్శకత్వానికి విశిష్టతను కలిగించటమే కాక, తాతినేని ప్రకాశరావు, యోగానంద్, రజనీకాంత్, తిలక్ లాంటి పలువురు ప్రస్తుత దర్శకులకు తర్ఫీదు నిచ్చారు అంతేకాక 'శారద', 'ఛోటీబహెన్', 'ససురాల్', 'హమ్‌రాహీ' వంటి విజయవంతమైన చిత్రాలను సమర్పించిన ఖ్యాతి కూడా ఆయనదే ఆచిత్రాలన్నిటికీ తెలుగు చిత్రాలే మూలం

1934 నుండి చిత్ర రంగంలో వున్న అనుభవజ్ఞులైన దర్శక నిర్మాతలలో పి పుల్లయ్య మరొకరు ఏదో ఒకటి రెండు మినహాయిస్తే ఆయన చిత్రాలన్నీ దశాబ్దాల తరబడి ప్రేక్షకుల ఆదరణ పొందాయి

సంస్థాపకులైన గూడవల్లి రామబ్రహ్మం మృతితో సారథి ఫిలిం సంస్థ కొంత కాలం పాటు మరుగున పడినా వాస్తవిక జీవితాన్ని గురించిన అభ్యుదయకర చిత్రాలతో తిరిగి ప్రముఖంగా ఆవిర్భవించింది అయినా ఈ తదుపరి చిత్రాలు తొలిదశ నాటి చిత్రాల వలె విజయం

సాధించలేదు

ప్రముఖ నటీనటుల మద్దతుతో ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం పెక్కు నిర్మాణ సంస్థలు ఆవిర్భవించాయి వాటిలో పలు సంస్థలు ఇంకా చురుగ్గా రంగంలో వున్నాయి అంజలీ పిక్చర్స్ సంస్థ హిందీ రంగంలో ప్రవేశానికి సాహసించింది ఎన్ టి రామారావుకి చెందిన ఎన్ ఎ టి సంస్థ అవిచ్ఛిన్నంగా చిత్రాలు నిర్మిస్తూ వచ్చింది వారి 'సీతారామ కల్యాణం' అత్యంత జయప్రదమైనది భానుమతికి చెందిన భరణీ పిక్చర్సులో ఆమె భర్త రామకృష్ణ దర్శకుడుగా, నిర్మాతగా ప్రముఖ పాత్ర వహించారు విజయవంతమైన మేలిరకం చిత్రాలు నిర్మించిన అన్నపూర్ణా పిక్చర్స్ నాగేశ్వర్రావు కున్నది

ఒకటి రెండు విజయవంతమైన చిత్రాలను నిర్మించిన సంస్థలు మరి కొన్ని వున్నాయి అయితే చిత్రాల విజయం చాలావరకు అనిశ్చితమని విజయవంతమైన చిత్రాల నిర్మాతలు సైతం భావిస్తున్నారు కొత్తచిత్రనిర్మాణం ప్రారంభించినప్పుడల్లా నిర్మాత అటువంటి అనూహ్య స్థితిలోకి అడుగుపెడుతున్నాడు అద్భుతమైన స్టూడియో పరికరాలు, సమర్థులైన నటీనటులు, ప్రతిభావంతులైన రచయితలు ఉన్నప్పటికీ ఫలితాలు చాలావరకు అనిశ్చితంగానే ఉంటూ వస్తున్నాయి మిగిలిన విషయాలన్నీ అట్లా వుండగా కథ అనేది ఒక్కటే ఎల్లప్పుడూ మారుతుండే అంశం అందుచేత 'మంచి కథ' ల కోసం ఆరాటం ప్రారంభమైంది అయితే ఇంతకూ మంచి కథంటే ఏమిటి? మంచి కథకు కావల్సిన అంశాలను గురించి స్పష్టమైన అభిప్రాయాలు ఎవరికీ ఉన్నట్టు కనిపించదు

మన నిర్మాతలు ఈ కథల సమస్యనెలా వీక్షిస్తారు? పి వి రాజ మన్నార్ ఈ ప్రశ్నకు ఇలా సమాధానం చెప్పారు—'' పోటీ ఎదురై త్వరితగతిన లాభార్జనవల్ల ప్రేరితులైన మన చిత్ర నిర్మాతలు మరింతగా విజ్ఞతాయుతమైన సృజనాత్మకమైన రీతిలో చిత్ర నిర్మాణానికి వినూత్న కథా వస్తువులు, విషయాలకై అన్వేషించటానికి మారుగా, ప్రజాదరణ పొందే పాటలు, కొట్టిన పిండైన సెంటిమెంటల్ సన్నివేశాలు చిత్రాల్లో గుప్పించడానికి పాల్పడతారు దానికి అతీతులైన వారుండవచ్చు గాని, అట్టివారు బహు అరుదు ''

భారతీయ చలన చిత్ర నిర్మాతలను గురించి రాజమన్నార్ గారు చెబుతున్నది కొంతవరకు తెలుగు చిత్ర నిర్మాతలకు కూడా వర్తిస్తుంది వాటిలో కథాంశం మినహా అన్నీ వుంటాయి కారణం ఏమిటో కాని తెలుగు సాహిత్యంలో సినిమాకి పనికివచ్చే కథలంతగా లేవు గురజాడ అప్పారావు గారి మహత్తర నాటకం 'కన్యాశుల్కం' సినిమా తీశారు ఫలితం దయనీయం అయితే అదృష్టవశాత్తు బెంగాలీ సాహిత్యం, కొంతవరకు మరాఠీ సాహిత్యంలో మంచి చిత్రాలుగా నిర్మించడానికి తగిన కథలు అమితంగా వున్నాయి నిర్మాతలు వాటికి ఎగబడ్డారు హిందీ, బెంగాలీ, తమిళ భాషలలో విజయవంతమైన చిత్రాల కథలు వారు కొనేస్తున్నారు హాలీవుడ్ చిత్రాలను అనుకరించడానికి తెలుగు నిర్మాతలు చేసిన యత్నాలే బహు స్వల్పం అవైనా చాలా నిరాశాజనకంగా వున్నాయి

తెలుగు చిత్రాల కథలకు ఇదీ మూలాధారం సహజత్వాన్ని నశింపచేసేటట్టుగా వాటిని మార్చడం జరుగుతుంది తెలుగు సినిమా కథ అచ్చంగా తెలుగుదనంతోనే ఉండనవసరం లేదు అయితే దేశంలోని ఏదో ప్రాంతపు సహజత్వం దానిలో వుండాలి తెలివిగా కొన్ని మార్పులు చేస్తే సరిపోతుంది

మొత్తం మీద దీనంతటి సారాంశం ఏమిటి? సంస్కృతి, ఉత్తమ కళాభిరుచులు తెలిసిన తెలుగు వాడికి ఇప్పటి తెలుగు సినిమా పోకడలు సంతృప్తి కలిగించవు అలాగే ఉత్తమాభిరుచులుగల ప్రేక్షకుల కోసం తెలుగు నిర్మాత సినిమాలు తీయలేడు దీనికి అనేక కారణాలున్నాయి మార్కెట్ పరిమితమైనది చిత్ర నిర్మాణ వ్యయం అపరిమితంగా పెరిగిపోయింది ఒక పది లక్షలు వచ్చినా పోయినా ఫరవాలేదని చిత్ర నిర్మాణానికి తలపడగలంతటి సంపన్న నిర్మాతలు లేరు అంతకు ముందు విజయవంతమైన మూడు చిత్రాలు నిర్మించిన నిర్మాత అయినా ఒక్క వైఫల్యంతో దెబ్బతిని పోతాడు నిర్మాతలు చాలా వరకు డిస్ట్రిబ్యూటర్ల 'సహకారం'పై ఆధారపడతారు వారు చిత్రాలలో కోరే విలువలు, ఖర్చు మరింత పెంచేవిగా వుంటాయి ఇక చిత్ర నిర్మాణ వ్యయాన్ని తగ్గించడానికి 'తారాగణం' ప్రసక్తి వదిలేయటం, సంగీతం ఏదో వుందనిపించటం, చచ్చుగా, త్వరగా షూటింగ్ ముగించటమే మార్గం ఈ పద్ధతుల వల్ల ఏదో ఒక లక్షరూపాయలు ఆదా అయినా ఆ చిత్రం చివరకు విడుదల అయినప్పుడు నిర్మాతకు సర్వనాశనం తథ్యం

తొందరగా లాభాలు చేసుకుందామనే కాంక్షే కాకపోయినా పోటీ అనేది ఒక పెద్ద మలుపు తెచ్చింది తత్ఫలితంగా ఒక మోస్తరుగా విజయవంతం అయ్యే చిత్రం నిర్మించడానికి పడికట్టు సూత్రాలు ఏర్పడ్డాయి దానితో మంచి, చెడు నిర్మాతలు, అనుభవజ్ఞులు, కొత్తవారు అంతా ఒకే స్థాయికి వచ్చారు

నటీ నటులు, సంగీత దర్శకులు, గాయకులు, టెక్నీషియన్ల ఎంపిక బహు పరిమితమైపోయింది క్రెడిట్ టైటిల్స్‌లో కేవలం చిత్రం పేరు , నిర్మాత పేరు మారిస్తే అనేక చిత్రాలకు సరిపోతాయంటే ఆశ్చర్యపోనక్కర్లేదు తాము ఏవిధంగా నటిస్తే అభిమానులకు నచ్చుతుందో శాసించి చెప్పగల నటీ నటులున్నారు దర్శకులు సవినయంగా తలొగ్గుతారు

చిత్ర నిర్మాతల దృష్ట్యా నైనా ఈ పరిస్థితి ఏ మాత్రం సంతృప్తికరం కాదు ప్రేక్షకులకు ఏమి కావాలో అని ఎప్పుడూ వూహిస్తుంటారు వారి వూహలు తరుచు తప్పుతుంటాయి ప్రేక్షకుల అభిరుచిని పెంచడమనేదే ఈ సమస్య కంతటికీ కీలకమనడంలో సంశయం లేదు చిత్రాల సవ్యమైన విమర్శ ప్రేక్షకుల అభిరుచులను పెంపొందించడానికి చాలా తోడ్పుతుంది ప్రేక్షకులు మినహా మిగిలినవారందరి విమర్శలను నిర్మాతలు ఏవగించుకుంటారు వారు తమ పెట్టుబడిని రాబట్టుకోవడానికి, లేక లాభాలార్జించుకోవడానికి ఈ విమర్శల వల్ల హాని కలగవచ్చు అందుచేత సహేతుకమైన విమర్శలను సైతం అణిచివేయడానికి వారు సర్వవిధాలా ప్రయత్నిస్తారు ఆర్థికంగా విఫలమైనవైనా, ఉత్తమ తరగతి చిత్రాలను ప్రోత్సహించడానికై ప్రభుత్వం బహుమతుల పద్ధతిని ప్రవేశపెట్టింది అయితే మంచి చిత్రాల కంటే లాభదాయకమైన చిత్రాలను నిర్మించాలనే నిర్మాతలు ఆశిస్తారు గనక ఈ బహుమతుల వల్ల ప్రయోజనం వుండదు

ప్రస్తుతం చలన చిత్ర నిర్మాణం వ్యాపారమే తప్ప కళకాదు సామాన్య ప్రజలకు అది వినోదం కలిగిస్తుంది ప్రజల్లో వ్యాప్తిలోకి వచ్చే సంగీతానికి అది మూలాధారం నేడు సామాన్య ప్రజలు ఆనందించే సంగీతం ఇంతగా ఉన్నదంటే చిత్రాలు, రేడియోనే దానికి కారణం చిత్రాలలో విషయం అంటే వాస్తవికతకు అది పూర్తిగా వక్రీకరణ దానిలోని సెంటిమెంట్లు, త్యాగాలు పూర్తిగా అసంబద్ధం ప్రేక్షకులలో ఏమాత్రం తెలివిలేని వారు సైతం వాటివల్ల జీవితం గురించి అపోహ ఏర్పరుచుకునే అవకాశం లేదు పాశ్చాత్య చిత్రాలు ఎంత సహజంగా నిర్మిస్తున్నారంటే

వాటినిచూచి జీవితం గురించి, సెక్స్ గురించి అనేక మంది యువకులకు అపోహలు కలుగుతున్నాయి గనుక నేను పై విషయం అంతగట్టిగా చెప్పగలను అదృష్ట వశాత్తూ మన ప్రేక్షకులకు అలాంటి ప్రమాదం మాత్రం లేదు రచనా కాలం 1962(?)

ముద్రణ 'తెలుగు సంస్కృతీ తరంగాలు' అనే పుస్తకం
ప్రచురణ డైరెక్టర్, సమాచార పౌరసంబంధశాఖ, హైదరాబాద్, 1983

# 84. 'డబ్బింగ్' చిత్రాలు

1961లో 54 చిత్రాలు తెలుగులో విడుదల అయ్యాయట వీటిలో తెలుగు చిత్రాలకన్న తెలుగులో 'డబ్' చేసిన చిత్రాలు ఎక్కువట వీటిలో నేను స్వయంగా చూసినవి బహుకొద్ది వాటిలో డబ్ చేసినవీ, అచ్చతెలుగువీ కూడా ఉన్నాయి

డబ్బింగ్ చిత్రాలకేమీ న్యూనత ఉండనవసరం లేదనుకుంటాను అచ్చతెలుగు చిత్రాలలో తెలుగు జీవితమూ, తెలుగు సంస్కృతీఅంటూ ఏమీ ఉండటం లేదు గనకా, తెలుగు చిత్రాలలో కొంత శాతం బెంగాలీ వగైరా రాష్ట్రేతర కథల ఆధారంతో తీస్తున్నవే గనకా, మన ప్రేక్షకులు అచ్చగా తెలుగు సినిమాలే చూస్తామని భీష్మించుకోక అవకాశం దొరికితే హిందీ వగైరా ఇతర భాషల చిత్రాలు కూడా చూసి ఆనందిస్తూనే ఉన్నారు గనకా, డబ్బింగ్ చిత్రాలను తక్కువ చేయనవసరం లేదు వ్యాపార దృష్టితో తయారు చేసే సినిమా చిత్రాలన్నింటిలోనూ ''సినిమాత్వం'' ఒకటిగానే ఉంటుంది

ఇందుకు అనేక కారణాలున్నాయి మానవుల మనో వికారాలలో వైవిధ్యం చూపగలంత సృజనాత్మక శక్తి రచయితలలోనూ, నటులలోనూ, డైరెక్టర్లలోనూ లోపించటం వల్ల సినిమా ప్రేమా, సినిమా దుఃఖం, సినిమా క్రౌర్యం, సినిమా మాతృత్వం, సినిమా పాతివ్రత్యం వగైరాలు కొంత 'స్టాండరైజేషన్' పొందాయనుకోవచ్చు ఇందుకు మనం సినిమా కళాకారులెవ్వరినీ తప్పు పట్టి లాభం లేదు సాహిత్యంలో అది వరకే ఉన్న కథలలో ఏదో ఒకటి ఏరుకుని దాన్ని స్క్రిప్టుగా చేసే అవకాశం స్క్రిప్టు రాసేవాడికి ఉండదు చిత్ర నిర్మాత సినిమా చిత్రం తీద్దామనుకున్నాక అతగాడే కథ కోసం వేటాడతాడు కథ దగ్గిర నుంచీ ఎడిటింగ్ దాకా ఎప్పటికప్పుడు వంట తయారైనట్టు కావాలి అందుచేత సినిమా చిత్రం యొక్క పిండోత్పత్తి దగ్గిర నుంచీ సినిమా వాతావరణం తప్ప మరొకటి ఉండదు సినిమా చిత్రాన్ని కొలవటానికి సినిమా ప్రమాణాలు తప్ప మరేవీ వుండవు

పైన చెప్పిన స్టాండర్ డైజేషన్‌కు మరొక కారణం సెన్సార్ వారు నిర్మించిన చట్రం కూడా అయివుండవచ్చు ఈ భావాలను ఈ విధంగానే ప్రదర్శించాలని సెన్సార్ కోడ్‌లో ఉండక పోవచ్చు కాని ఎటు అడుగువేస్తే ఏం ముప్పు వస్తుందోనని నిర్మాతలు '' ఒకరు తప్పించుకున్న మార్గాన మరొకరుగా వెళ్ళటం ఆరంభించే సరికి '', '' సినిమా తత్వానికి'' బాటలు కొన్ని ఏర్పడ్డాయి ఉదాహరణకి, ప్రేమ ఘట్టాలలో నాయకుడు నాయికను వెనకనుంచి ఆలింగనం చేసుకోవచ్చు ఎదురుగా ఆలింగనం చేసుకుంటే నాయిక రొమ్ములకు చేతులు అడ్డం పెట్టుకోవాలి! హిందీ, తమిళ, తెలుగు వగైరా పిక్చర్లంతటిలోనూ ఇదే చూసినాక ఇది సెన్సార్ ఫలితంగా ఏర్పడిన మార్గమని నాకు అర్థమయింది

డబ్బింగ్ చిత్రాలు మన ప్రేక్షకుల రస పిపాసను చెప్పుకోదగినంతగా విస్తరింపక పోయినా,

తారార్చనకు మరింత విపులమైన అవకాశాలిచ్చాయి అనేక మంది తమిళ తారల నటనా ప్రాభవాన్ని మన ప్రేక్షకులు ఆనందించ గలుగుతున్నారు

డబ్బింగువిద్యలో మన రచయితలూ, ఆర్టిస్టులూ గొప్ప నైపుణ్యం సంపాదించారు శివాజీ గణేశన్ చేత తెలుగుమాట్లాడిస్తున్న చంద్రూ, తంగవేలు చేత తెలుగు మాట్లాడిస్తున్న సత్యం, సావిత్రినీ రంగారావునూ అరవం నుంచి తెలుగులోకి తర్జుమా చేస్తున్న డబ్బింగు ఆర్టిస్టులూ ప్రతిభావంతులని ఒప్పుకోక తప్పదు ఎం ఆర్ రాధాను ' పావమన్నిప్పు' నుంచి ' పాప పరిహారం' లోకి దించిన డాక్టర్ రాజారావుకు అకాడమీఅవార్డు ఇవ్వవచ్చు వీరందరి వెనకా ఉండి, అందరికన్న శ్రమపడి డబ్బింగ్ చిత్రాల విజయానికి హెచ్చుగా దోహదం చేసేవాడు రచయిత ఈ పనిలో దక్షత చూపిన శ్రీశ్రీ, అనిసెట్టి మొదలైన వారు కూడా ప్రశంసార్హులు శ్రీశ్రీ డబ్ చేసిన చిత్రాలు నేను చూడటం పడలేదు గాని అనిసెట్టివి చూశాను ఆయన కృషి ప్రశంసనీయంగా కనబడింది

చిత్రాలకు డబ్ చెయ్యటం రెండోరకం నిర్మాతల పని అనుకునో, ఒక భాషలో జయప్రదంగా నడిచిన చిత్రాన్ని మరొక భాషలో తీసేటప్పుడు ఆ భాషకు చెందిన ప్రేక్షకుల ఆదరాభిమానాలు సంపాదించుకొన్న తారలుంటే వ్యాపార రీత్యా తమకు హెచ్చు లాభమనో కొందరు నిర్మాతలు ఇతర భాషా చిత్రాలను 'రీమేక్' చేస్తున్నారు ఇటువంటి ప్రయత్నాన్ని చట్టరీత్యా అరికట్టటం సాధ్యం కాదు గాని, ప్రస్తుత దేశీయ, పారిశ్రామిక, ఆర్థిక పరిస్థితులలో ఇది అంత వాంఛనీయమైన పని కాదు రష్యాలో నిర్దుష్టంగా చిత్రాలను డబ్ చేసే సాంకేతిక విధానాలు అవలంబిస్తూ వస్తున్నారు అమెరికా, ఇంగ్లండు మొదలైన దేశాలలో విదేశీ చిత్రాలకు ఇంగ్లీషు 'సబ్ టైటిల్స్' వాడుతున్నారు మనదేశంలో నిరక్షరాస్యులు కూడా చిత్రాలు చూస్తారు గనక 'సబ్ టైటిల్స్' కన్న డబ్బింగే ఉపయుక్తమైన పద్ధతి

ఈనాడు మనదేశంలో ఉన్న వివిధ భాషలలో ప్రజలు మెచ్చే చిత్రాలు కొన్ని తయారవుతున్నాయి వాటిలో కొన్నిటికి ప్రభుత్వం బహుమానాలు కూడా ఇస్తున్నది ఈ మంచి మంచిచిత్రాలను అన్ని భాషల్లోకీ డబ్ చెయ్యటానికి ప్రయత్నాలు జరిగితే అందువల్ల కొన్ని విధాల లాభముంటుంది దేశంలో అన్ని ప్రాంతాల వారికి ఇతర ప్రాంతాల కళాకారులు పరిచయమవుతారు. ఒకరు సాధించే కళా విజయాలు మరొకరికి తెలుస్తాయి ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతం నేర్చుకోదగిన విషయాలుండవచ్చు మొత్తం మీద దేశం ఐక్యత పొందటానికి సినిమా చిత్రాలు కూడా తోడ్పడాలంటే డబ్బింగ్ చిత్రాలు ప్రస్తుతానికి కొంతవరకైనా ఉపయోగపడవచ్చు

*విశాలాంధ్ర, దిన పత్రిక , 14-1-1962*

# 85. కళాకారుడి స్వార్థం

మానవసమాజంలో ప్రతి ఒక్కడూ సమాజానికి తాను ఇవ్వగలిగినంత ఇచ్చి దానినుంచి తాను పొందగలిగినంత పొందటానికి ప్రయత్నిస్తాడు ఇది వ్యక్తికీ సంఘానికీ ఉండే సంబంధాలలో ఒకటి హెన్రీ ఫోర్డ్ తాను ప్రపంచానికి చేసినసేవకు తాను ఆర్జించిన కోట్లే కొలబద్ద అన్నాట్ట ఇది నిజమైతే బాగానే ఉండును కాని, దురదృష్టవశాత్తు, నిజంకాదు వర్గ సమాజంలో మనిషి సంఘానికి చేసే సేవకూ, అతడు పొందే ప్రతిఫలానికీ సంబంధం ఉండదు ఉండిన పక్షంలో పారిశ్రామిక కూలీజనం ప్రపంచానికి దాదాపు ఏమీ ఇవ్వటం లేదని అనుకోవాలి

ధనికవాద ప్రజాస్వామ్యంలో కూడా రాజెక్కే పల్లకే అది మోసే బోయీలకన్న గొప్పది
సంఘంలో అనేక వృత్తులవారు తాము ఫలానా వృత్తుల వాళ్లమని చెప్పుకుని తమతమ వృత్తులవారికి ముట్టే సగటు వేతనానికి కొంచెం హెచ్చుగానో తక్కువగానో సంపాదిస్తున్నారు దాదాపు అన్ని వృత్తుల వాళ్ళూ కొంత ప్రత్యేక శిక్షణ పొందుతారు కాని కళాకారుడు ఇతర వృత్తులవారికి కొంచెం భిన్నంగా ఉంటాడు

కళాకారులు శిక్షణ పొందరనికాదు సంగీతమూ, చిత్రలేఖనమూ, భాషాజ్ఞానమూ కూడా అభ్యసిస్తేగానిరావు కాని కళాకారుడు కేవలం తాను పొందిన శిక్షణనుబట్టే తన వృత్తిలో పైకి రాలేడు (సంగీతం మాష్టర్లూ, డ్రాయింగు మాష్టర్లూ మొదలైన ఉద్యోగాలు అలా ఉంచండి ఈనాడు వాటికి కళతో సంబంధంలేదు అవి కేవలం వృత్తి విద్యలు ) కళలలో శిక్షణ పొందినవాడు స్వయం ప్రతిభచేత కళాకారుడౌతాడు ఒక డాక్టరుతోనో, ప్లీడరుతోనో, కుర్చీలు తయారు చేసేవాడితోనో పనిబడ్డట్లు ఒక కళాకారుడితో మనకు పనిబడదు పదిమందికీ తన అవసరం కలిగేటట్లు చేసుకునే బాధ్యత కళాకారుడిదే మనం ప్రసిద్ధ కళాకారులుగా పరిగణించే వారంతా ఈ బాధ్యతను విజయవంతంగా నిర్వర్తించినవారే

సాధారణంగా ''కళారాధన'', ''కళాతపస్సు'' అన్న మాటలు విన్నప్పుడు మనకు ఆదర్శవాదుల గొంతు స్ఫురిస్తుంది కాని కళాకారుడికీ ఒక గడ్డు దశ ఉన్నదనీ, ఆర్థిక స్తోమతా, ఇతర జీవనోపాధి లేని వాళ్ళు తమ కళా ప్రతిభను లోకానికి వెల్లడి చేయటానికి నానాయాతన పడేవారనీ మనం నమ్మవచ్చు కొందరు ఈ మెట్టు ఎక్కలేక వెనక్కు తగ్గి అజ్ఞాతంగా ఉండిపోయినా ఆశ్చర్యంలేదు

ఈ కారణంచేత కళాకారులు హెచ్చుగా మధ్యతరగతినుంచి రావటం జరుగుతుంది పై తరగతివారికి కళలను సృష్టించే ఓపిక ఉండదు కావలిస్తే డబ్బు పారేసి ఆనందిస్తారు కింది తరగతివాళ్ళు కళలు సాధన చెయ్యటానికి తగిన విశ్రాంతీ, జరుగుబాటూ కలిగి ఉండరు అందుచేత వర్గ సమాజంలో కళలంటే నూటికి తొంభైపాళ్ళు మధ్య తరగతి దృక్పథం కలిగి ఉంటాయి అది అలావుంచుదాం

గండం గడిచి పిండం బయటపడిందన్నట్టు ఒక కళాకారుడు నలుగురూ ఆమోదించిన కళాకారుడుగా రూపొందిననాడు అతని స్థితి ఏమిటి? అప్పుడతనికి కళాకారుడిగా జీవించే హక్కూ, అవకాశమూ లభిస్తాయి కళావ్యాపారులు అతణ్ణి రెండు చేతులా ఆహ్వానిస్తారు నాటకాలూ, పత్రికలూ, ఇప్పుడు సినిమా –డబ్బు చేసుకునే కళలు అంతకు ముందు కాకపోయినా, 1925 ప్రాంతాల నుంచీ స్టేజినటులూ, స్టేజిగాయకులూ కళలను వృత్తిగా పెట్టుకుని పరువుగా బ్రతికే పరిస్థితి ఏర్పడింది దాదాపు ఆ రోజులలోనే తెలుగులో దేశోద్ధారకుడు స్థాపించిన 'భారతి' ఆధునిక రచయితలకూ, చిత్రకారులకూ కొంత ముట్టచెప్పే పద్ధతి ప్రారంభించింది దాని వెనకగా ఇంకా కొన్ని పత్రికలు కూడా తృణమోపణమో ఇస్తూవచ్చాయి ఇవాళకూడా లోకసంగ్రహం కోసమూ, సంపాదకుల భుక్తికోసమూ రచయితలను ''త్యాగం'' చేస్తున్న పత్రికలు కొన్ని ఉన్నప్పటికీ ప్రచురించే దానికి డబ్బిచ్చే పత్రికలంటూ ఏర్పడ్డాయి ఇవే ఎక్కువస్తాయికూడా

సినిమా సంగతి చెప్పనే అక్కర్లేదు ఇది ప్రధానంగా పెట్టుబడితో కూడిన పరిశ్రమ ఇందులో అత్యుత్తమ కళాకారులకే స్థానం ఉన్నది వారి రాబడి కూడా బాగుంటుంది పేరుగన్న

సినీ రచయితలూ, మ్యూజిక్ డైరెక్టర్లూ, ప్లేబాక్ పాటగాళ్ళూ, డైరెక్టర్లూ, తారలూ, ఉపతారలూ, డాన్స్ డైరెక్టర్లూ, స్టిల్ కెమెరా వాళ్ళూ కార్లూ ఇళ్ళూ మొదలైనవి సంపాదించుకునే ఆవకాశాలున్నాయి

వ్యాపార కళల ద్వారా కళను వృత్తిగా పెట్టుకున్నవాడు మొట్టమొదటనే తెలుసుకునే అంశమేమంటే పారిశ్రామిక కూలీలు చేసే పనే తనూ పెద్ద ఎత్తునే అయినప్పటికీ చేయాలని పారిశ్రామికులు కళాకారులను వారి ప్రతిభను చూసే చేరదీసినప్పటికీ వారికి కావలసింది కళాకారుడి స్వయంప్రతిభకాదు, కళాకారుడుగా అతడికి కళాశక్తి దానితో వ్యాపార సరుకు ఏవిధంగా తయారు చేయాలో, దాన్ని ఎట్లా ప్రజలకు అమ్మాలో పెట్టుబడిదార్లు ( లేకవారి మనుషులు) నిర్ణయిస్తారు

కళాకారుడు ఈ పరిస్థితిలో తాను సంఘానికి ఏమివ్వాలి సంఘంనుంచి తాను ఏమి పొందాలి అన్న సమస్యను తానై తేల్చుకోలేడు అతడు సంఘానికి ఏమి ఇవ్వాలో తేల్చేవాడు అనికి డబ్బు ఇచ్చేవాడు సమాజానికీ కళాకారుడికీ మధ్య అతను పెట్టనిగోడ ఈ కళాకారుడు తన కళద్వారా సమాజంతో ఎటువంటి సంబంధం పెట్టుకోదలుచుకుంటాడో అది లెక్కలోకి రాదు, కళాప్రయోజనం నిర్ణయించే హక్కు పెట్టుబడిదారునిది

ఈ పరిస్థితిలో కళాకారుడు చిత్రమైన పరిణామం పొందుతాడు! అతని కళా ప్రతిభను మొదట గుర్తించి అతనికి ఉన్నతస్థానం ఇచ్చిన వారి అభిరుచికన్న కూడా కళాకారుడు దిగజారి పోవచ్చు! ''ఐశ్వర్యం పెరుగుతుంది, మనుషులు నశిస్తారు'' అని గోల్డ్‌స్మిత్ చెప్పినది కళాకారుడి విషయంలో అక్షరాలా నిజమవుతుంది

ఈ వ్యాపార కళలు మధ్యతరగతి సంస్కారాన్ని ప్రతిబింబిస్తే కళాకారుడి స్థితి అంతగా అధ్వాన్నం కాకపోను కాని సామాన్యంగా ఈ కళలు కలవారి సంస్కారాన్ని లేనివారికి మింగుడు పడేటట్టుగా తీర్చిదిద్ది డబ్బు చేసుకుంటాయి అటువంటి కళలు జీవితాన్ని ప్రతిబింబించలేవు, వాస్తవాన్ని దూరంగా ఉంచుతాయి, కృత్రిమంగా తయారవుతాయి

ఇందుకు కళాకారుడు సమ్మతించాడా తన అంతరాత్మను చంపుకుని నాలుగు డబ్బులు చేసుకుంటాడు లేదా కనబడని భూతాలతో కుస్తీపట్టి చివరకు తనకు కళావృత్తే లేకుండా చేసుకుంటాడు

మన ప్రభుత్వం వర్గ రహిత సమాజం లక్ష్యంగా పెట్టుకున్నప్పటికీ, మనం పెట్టుబడిదారీ సంస్కృతీ యుగపు ప్రథమ పాదంలోనే ఉన్నాం కృతకమైన కళలు ఇప్పుడే మనకు ఆరంభమయాయి అనేక కళా రంగాలలో మనకున్న చెప్పుకోదగిన కళాకారులు ఎమెచ్యూర్లు వారికి కళలు వృత్తి కాదు

కాని బూర్జువా సంస్కృతి ప్రబలమై ఉండే దేశాలలో ఇటువంటిది సాధ్యం కాదు కళా వ్యాపారుల మధ్య పోటీ ఫలితంగా అనేకవందల మంది కళాకారులు ప్రతి రంగంలోనూ తమ కళలను వృత్తిగా పెట్టుకుని బతకగలుగుతారు ప్రజాస్వామ్యంలో సాంఘికచైతన్యం హెచ్చుగా ఉంటుంది ప్రజలకూ, కళాకారుడికీ మధ్య పెట్టుబడిదారు కొంచెం అడ్డంకిగా ఉన్నప్పటికీ కేవలం గోడపెట్టినట్టుగా ఉండలేడు అందుకే బ్రిటన్, అమెరికా, జర్మనీ, ఫ్రాన్స్ మొదలైన దేశాలలో గొప్ప కళాకారులు తమకళలతో జీవనోపాధి కలిగించుకున్నారు వారిలో కొందరు తమ కళల ద్వారా ప్రజలలో విప్లవచైతన్యం కూడా తీసుకురాగలిగారు

వర్గ రహిత సామాజిక వ్యవస్థ స్థాపించటమన్నది శుష్క ప్రియం కాని పక్షంలో మన ప్రభుత్వం ఈ పాటికి కళాకారులు ముందుకు రావటానికి నిజమైన కృషిచేసి ఉండేది ''అకాడమీ''లు అర్థ శతాబ్దం క్రితం నాటి కళలకు బూజు దులుపుతున్నాయి రేడియోలు కూడా కళాకారులను ఒక విధంగా పోషిస్తున్నాయి గాని వాటిమీద ఎవరూ బతకకుండా చాలా శ్రద్ధ తీసుకుంటున్నాయి ఒక ప్రసంగం చదివిన మనిషిగాని, నాటకం రాసినవాడు గాని, పాడినవాడు గాని మరి మూడు నెలల దాకా రేడియో మైక్ ముందు తలపెట్టరాదు

ఇదే ఇంకో విధంగా చెప్పాలంటే కళాకారులకు బతుకు తెరువులు చూపించటంలో ప్రభుత్వం ఏ కళా వ్యాపారస్తుడితోనూ పోలిక పెట్టుకునేటట్టు నటించటం కూడా లేదు ఇది చాలా గొప్ప అవలక్షణం

*విశాలాంధ్ర, దినపత్రిక, 17-2-1962*

# 86. ప్రజలూ-సినిమాలూ

సినిమాలను గురించి ఇదివరకే ఎన్నో పర్యాయాలు నా అభిప్రాయాలను పత్రికలలో ప్రకటించి ఉన్నాను వాటిని మార్చుకోదగినంత విచిత్ర పరిణామాలేవీ సినిమా రంగంలో కలగలేదు

ప్రజలకు అత్యంత సన్నిహితంగా ఉండదగిన సినిమా గురించి ముఖ్యంగా చెప్పుకోదగిన అంశమేమంటే, సినిమాలు ప్రజలకు సన్నిహితం కావటానికి జరిగే కృషికన్నా, ప్రజలను తమ కేసి లాక్కోవటానికి చేసే కృషి హెచ్చుగా ఉన్నది ఈ కృషి ఫలితమే సినిమా చిత్రాలలో స్టార్ వాల్యూలూ, ప్రొడక్షన్ వాల్యూలూ, హిట్ పిక్చర్ ఈక్వేషనులూ వగైరావగైరా

సినిమాలు ఏ ఆకర్షణను తమ ముందుంచినా దానికి గురికావటానికి ప్రేక్షకులు సర్వ సంసిద్ధులుగానే ఉన్నారు ఏ ఆకర్షణా లేనప్పుడే వారు చిత్రాలను దివాలా ఎత్తించేస్తున్నారు

ఒక విధంగా చూస్తే ఈనాడు మనదేశంలో సినిమాకు చాలా అనుకూలమైన పరిస్థితులున్నాయనాలి జన బాహుళ్యానికి వినోదం కలిగించటంలో సినిమాతో పోటీ చెయ్యగలవి ఇంకేవీ లేవు, ఇతర దేశాలలో సినిమాకు అనేక వినోదాలతో తీవ్రమైన పోటీ ఉన్నది

ఇంకొక అనుకూలమైన విషయమేమిటంటే ప్రజల అభిరుచులు జాతీయ గుణాన్ని పోగొట్టుకోలేదు అదే జరిగి ఉన్నట్టయితే ఏ పాశ్చాత్య సంస్థలో మనదేశంలో తిష్టవేసి మనకొక జాతీయ సినిమా పరిశ్రమ లేకుండా ఏనాడో చేసి ఉండేవి

ఈ రెండు సౌకర్యాలూ ఉండికూడా మన సినిమా పరిశ్రమ దినదినగండం వెయ్యేళ్ళు ఆయుషు గా ఉన్నదంటే దానికి కారణం మన నిర్మాతలు సినిమా కళ విషయంలో కాకపోయినా సినిమా వ్యాపారం విషయంలో పాశ్చాత్యులను అనుసరించటం జరిగింది అందుచేత మన సినిమా వ్యాపారానికి పట్టిన తెగుళ్ళు కొన్ని అంతర్జాతీయ స్వభావం గలవిగా కనిపిస్తున్నాయి అందుకే గడిచిన 30 ఏళ్ళ కాలంలోనూ సినిమా మకుటం ఒక సంస్థ నుంచి ఇంకో సంస్థకు రోలింగ్ కప్పులాగా మారుతున్నది ముందుగా రంగంలోకివచ్చి అనుభవం గడించిన వారికి దక్కిన దేమిటంటే వాళ్ళు సినిమాలు తియ్యటానికే పనికిరారనిపించుకోవటం!

సినిమాకు పాతకాపులైన సి పుల్లయ్య, బి ఎన్ రెడ్డి, వై వి రావు లాంటి వారు పాక్షిక అజ్ఞాత వాసం చేస్తున్నారు దేవుడు మేలు చేసి పుల్లయ్య ప్రభ ఇంకా వెలుగుతున్నది బలం చేకూర్చుకుని పాదుకోవలసిన నిర్మాతలు వెనుకబడి పోతుంటే, మెరుపు మాయవలసిన సినిమా

తారలు చక్కగా పాదుకుపోయి ఈనాడు పరిశ్రమకు వాళ్ళే ఆధారంగా ఉంటున్నారు

అయితే మనం ముఖ్యంగా విచారించవలసింది సినిమా వ్యాపారం గురించి కాదు, సినిమా కళ గురించి ఇది జనబాహుళ్యానికి ఎంతో ఉపయోగం చేసి ఉండవచ్చును కాని దాదాపు ఏమీ చెయ్యలేదు

మన నిర్మాతలు డాక్యుమెంటరీలు, విద్యాచిత్రాలూ, వైజ్ఞానిక చిత్రాలూ తియ్యటానికి ప్రత్నించలేదన్న సంగతి అలా ఉంచుదాం ఈ చిత్రాలు తియ్యటానికి యత్నించే సంస్కారమూ, అంగబలమూ కలవాళ్ళు సినిమా రంగంలోకి రాకపోతే అందుకు ఎవరినని తప్పుపట్టగలం? అదీకాక ఈ లోపాన్ని చక్కబరచటానికి ప్రభుత్వమే ప్రజల డబ్బు ఖర్చు చేస్తున్నది

మనవాళ్ళు కథాచిత్రాలు తీయటంలో ప్రేక్షకుల జ్ఞానాన్ని పెంపొందించటానికి ఏం ప్రయత్నించారు? ముప్ఫయి ఏళ్ళుగా సినిమా చిత్రాలు చూసేవారికి కూడా నిజమైన అడవి ఎట్లా ఉంటుందో, నిజమైన కొండలు ఎట్లా ఉంటాయో, నిజమైన గుడిసెలూ, మధ్య తరగతి ఇళ్ళూ , ధనికుల భవనాలూ, కచేరీలు ఎట్లా ఉండేదీ సినిమాల ద్వారా తెలుసుకునే అవకాశం లేదు

నిత్య జీవితంలో అనుభవం లేనివాళ్ళు సినిమాలు చూసి, డాక్టర్లు తమ పేషెంట్లకు జబ్బు జాస్తిగా ఉంటే నిట్టూర్పులు పుచ్చి బుసలు కొడతారనీ, ముద్దాయిలను అరెస్టు చెయ్యటానికి వచ్చిన పోలీసు ఆఫీసర్లు ముద్దాయీలను ఉపన్యాసాలివ్వనిస్తారనీ, పెళ్ళిగాని మగపిల్లలూ ఆడపిల్లలూ తోటల్లో డ్యూయెట్లు పాడుతూ దోబూచులాడి ఒకళ్ళు మీద ఒకళ్ళు పడిపోతారనీ అనుకుంటే అది వాళ్ళ తప్పా?

మొత్తం మీద చిత్రాలు జీవితం ఎట్లా ఉండదో చూపటానికి పనికి వస్తున్నాయనటంలో అతిశయోక్తి ఏమీ ఉండదు

ప్రతి సినిమా చిత్రంలోనూ తట్టెడన్ని పాటలున్నప్పటికీ సంప్రదాయ సంగీతంలో ఉండే మాధుర్యాన్ని జనబహుళ్యానికి మప్పటానికి జరిగిన కృషి బహుఅల్పం సినిమాలలో అనుకరణ సంగీతం జాస్తిగా ఉంటున్నందుకు తప్పుపట్టే వారున్నారుగాని, నేనందుకు తప్పు పట్టను జానపదమయేది, దేశవాళీ సంగీతమయేది, సంప్రదాయ సంగీతమయేది నిజమైన అందంగల సంగీతం చాలా కొద్ది దాన్ని ఎన్ని సార్లు విన్నా విసుగు పుట్టదు కాని సినిమాల వాళ్ళు సంగీతం గొడ్డుపోయినట్టు నీరసమైన చచ్చు సంగీతాన్ని ఎందుకు అనుకరిస్తుంటారో తెలియడం లేదు

సినిమా పాటలు తీసుకుంటే అవి పోకిరీ పిల్ల కాయలు దారిన పొయ్యే ఆడవాళ్ళ మీద పాడి చచ్చురకంతృప్తి పొందటానికి అనుకూలంగా ఉంటున్నాయి అనేక పాటలలో పాత్రల స్థాయీ, మనస్తత్వమూ కూడా సరిగా ప్రతిబింబించవు

ఇన్నేళ్ళ సినిమాల విజృంభణ ఫలితంగా ప్రజల అభిరుచులలో ఒక పరిణామం కలిగిన లక్షణాలు లేకపోగా, ఒక అరాజక పరిస్థితి ఏర్పడిన లక్షణాలు కోకొల్లలుగా ఉన్నాయి జనం ఒకప్పుడు పురాణ చిత్రాలతో విసుగెత్తినట్టు కనబడి సాంఘిక చిత్రాలను ఆదరించారు వాటి నుండి వారి అభిరుచి జానపద చిత్రాల మీదికి మళ్ళినట్లు కనబడింది

ఈనాడు అన్ని రకాల చిత్రాలూ, ఒకేసారి, ఒకరకానికీ ఇంకొక రకానికీ పోటీ లేకుండా , తయారవుతున్నాయి ఇతివృత్తాలలో కూడా తేడా లేకుండా పోతున్నది సాంఘిక చిత్రాలలోని పాత్రలకూ పూరాణ చిత్రాలలోని పాత్రలకూ తేడా ఏమీ ఉండటం లేదు నాయికా నాయకుల ప్రణయ, యుగళ గీతాలు అన్ని రకాల చిత్రాలల్లోనూ ప్రబంధ ఫక్కీలోనే

ఉంటున్నాయి ఈవిధంగా ఈ కాలపు సినిమా కళ ఒకేసారి అన్ని యుగాలకూ ప్రాతినిధ్యం వహిస్తున్నది ఈ ఒక్క కళపై యుగ ప్రభావం లాంటిదేదీ ఉన్నట్టు కనపడదు ఏ ఒక్క చిత్రనిర్మాణ సంస్థ కూడా రొమ్ము మీద చెయ్యి వేసుకుని మేము ఈరకం సంస్కృతికి ప్రాతినిధ్యంవహిస్తున్నాము అనగల స్థితిలో లేదని చెప్పాలి

ఇటువంటి కారణాలన్నీ ఉండటం చేత మన సినిమాకళ సర్కసుతోనూ, వీధి గారడీతోనూ పోటీ చేస్తున్న లక్షణాలు రాను రాను జాస్తి అవుతున్నాయి వీటి ప్రభావం నాటకాలలోనూ, యువకులైన స్త్రీ పురుషులలోనూ, వారి బహిరంగ ప్రవర్తనలో కనిపించే వెకిలితనంలోనూ ప్రతిబింబిస్తున్నది *విశాలాంధ్ర, దినపత్రిక, 21-5-1962*

# 87. సినిమాలలో సంఘర్షణ

కథల్లోనూ నవలల్లోనూ సంఘర్షణ ఉంటే ఉంటుంది లేక పోతేలేదు కాని నాటకాలలోనూ, సినిమాలలోనూ సంఘర్షణ లేకుండా జరగదు సంఘర్షణ లేకపోతే క్లయిమాక్స్ ఉండదు అదిలేకపోతే సినిమా రక్తి కట్టదు ఆ కారణం చేతనే సినిమా కథలలో సంఘర్షణ ప్రవేశపెడుతున్నారు అది ఎటువంటి సంఘర్షణ, ఎలాంటి సాంఘిక వాతావరణంలో అదిసాగుతుంది, అందులోగల రెండు పక్షాలకు గల ఆదర్శాలేవీ, వాటికి గల తారతమ్యాలేమిటి— ఇత్యాది ప్రశ్నలు చిత్రనిర్మాతలను అంతగా బాధించవు

నూటికి తొంభై సార్లు సినిమా సంస్కరణ అన్నది నాయికా నాయకుల వివాహ సమస్యను ఆశ్రయించి ఉంటుంది సినిమాలలో ప్రేమ వివాహాలకు తప్ప, ఇతర వివాహాలకు గణ్యతలేకపోవటం గమనించతగినది కారణాంతరాలవల్లో విధివశానో ధర్మానికి కట్టుబడో, పెద్దల మాట తీసివెయ్యలేకనో నాయికీ నాయకులలో ఒకరు ప్రేమేతర వివాహం చేసుకున్నప్పటికీ అది పూర్తిగా తృప్తికరమైన వివాహంగా చిత్రించబడదు ప్రేమేతర వివాహం చేసుకున్నది నాయకుడైతే, వాడి పెళ్ళాం చస్తుంది చివరకు నాయికా నాయకుల మధ్య ''మాంగల్యం తంతునా నేన'' అయితీరుతుంది కర్మ జాలక ప్రేమేతర వివాహం చేసుకున్నది నాయిక అయిన పక్షంలోదానికి విమోచనం అంటూ ఉండదు ఒక వేళ మొగుడు పోయినా కథానాయిక వితంతువుగానే ఉండిపోతుందిగాని నాయికుణ్ణి పెళ్ళాడదు

అయితే మనం ఒకటి జ్ఞాపకం పెట్టుకోవాలి ప్రేమ నిత్యం, అది నశించదు పెళ్ళికి దారితీసినా తీయక పోయినా అది బత్తీ, చమురులేని దీపంలాగా వెలుగులోనే ఉంటుంది

చారిత్రక దృష్టితో చూస్తే ఈ పరిస్థితి మనకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది సినిమాలో ప్రతిబింబించే సాంఘిక సంస్కృతిలో ప్రేమకూ, ప్రేమ వివాహాలకూ అగ్రస్థానం ఉండటమూ, వితంతు వివాహాలకు స్థానం లేకపోవటమూ ఆశ్చర్యకరం ప్రేమ వివాహాలు భవిష్యత్తుకు సంబంధించినవి అవి మన సమాజంలో ఇంకా పరిపాటిగా జరగటం లేదు వితంతు వివాహాలు ఏనాడో ఆరంభమై పరిపాటిగా జరుగుతున్నాయి ఈ భూత భవిష్యత్తులను సినిమా నిపుణులు ఎలా సమన్వయించ గలిగారు?

దీనికి కీలకం సినిమా ప్రేమలో ఉన్నది సినిమా ప్రేమ మామూలు ప్రేమ లాంటిది కాదు జంకూ, గొంకూ, అనుమానమూ ఏమీలేదు ధన, ఋణ విద్యుత్తులను మోసే మేఘాల మధ్య కొట్టే మెరుపులాగా అది నాయికానాయకుల మధ్య బ్రహ్మాస్త్రం లాగా

ప్రయోగితమైపోతుంది సినిమా ప్రేమికులు ఒకరి నొకరు చూసి ప్రేమించుకుంటారా, ఒకరి కంఠధ్వని ఒకరు విని ప్రేమించుకుంటారా, ఈ ప్రేమ ఎలా ఏర్పడుతున్నది అని నేను చాలా పరిశోధించాను నాకు సమాధానం దొరకలేదు ఒకరి గుణశీలాన్ని ఒకరు ప్రేమిస్తున్నట్టు దాఖలా దొరుకుతుందేమోనని కూడా పరిశీలించాను అటువంటిది ఒకటి ఉన్నదని నిర్ధారణగా రుజువు కావటంలేదు నేను గ్రహించగలిగినంతవరకు సినిమా ప్రేమకూ తారల స్థాయికీ మాత్రమే సంబంధం ఉంటున్నది చిత్రంలోని ప్రముఖ స్త్రీతార ప్రముఖ పురుషతారకు ప్రియురాలు కాని పక్షంలో చెల్లెలవుతోంది అంతకన్నా రహస్యం ఏమీ లేదు

కథానాయకుడు తాను ప్రేమించలేని పిల్లను గురించి తండ్రితో ఘర్షణపడి, ''నాన్నగారూ, నా ప్రాణాలైనా వదిలేస్తాను గాని మీరు చెప్పే అమ్మాయిని వివాహం చేసుకోలేను, నన్నుపార్థం చేసుకోకండి'' అంటుంటే ప్రేక్షకుడికి '' ఈ అబ్బాయికి ఆ చిన్న నటిని ప్రేమించటం ఇష్టంలేదు కాబోలు'' అనిపిస్తుంది నాగేశ్వర్రావు, రామారావు, జగ్గయ్యలు, సావిత్రి, జమున, కృష్ణకుమారిలను నిరాకరించటం మనం తెరమీద చూడమని రూఢిగా చెప్పవచ్చు

ఇది ప్రబంధాలనాటి ప్రేమ, శకుంతలా దుష్యంతుల ప్రేమ, వరూధునీ ప్రవరాఖ్యుల ప్రేమ — కనీసం వరూధుని ప్రేమ— మనం నిత్యజీవితంలో ప్రేమ అనుకునేది మాత్రం కాదు కణ్వాశ్రమంలో తార శకుంతల చెంత వున్న అనసూయా ప్రియంవదలు అందంగా ఉంటే దుష్యంతుడు వాళ్ళ వెంట పడేవాడు కాని అనసూయ ప్రియంవదలు బొత్తిగా ''సపోర్టింగ్ ఆర్టిస్టులు '' ఇంకొకందుకుక్కూడా సినిమా సంఘర్షణ మనకు అభ్యుదయ మార్గంలో, ముందు చూపు కలిగి ఉన్నట్లు, భ్రమ కలిగిస్తుంది సినిమా నాయికీ నాయకులు ప్రేమించటంలో కులగోత్రాలనూ, తమ కుటుంబ పరువు ప్రతిష్టలనూ తృణీకరించినట్టు కనబడతారు ప్రేమ కోసం వాటితో ఘర్షణ పడతారు స్త్రీ పునర్వివాహాలు చిత్రించటానికి గుండె ధైర్యం లేని నిర్మాతలు యింత ''విప్లవం'' ఎలా చేస్తున్నారా అని మనం విస్తుపోతాం

నిజానికి యిందులో విస్తుపోవటానికేమీ లేదు సినిమా తెర మీద కులాలేమీ లేవు ఈ సంగతి మనం 'మాలపిల్ల' నాడే చూశాం అందులో మాల పిల్లలేదు— కాంచనమాల మాత్రమే ఉన్నది ఈ మాలపిల్ల పాత్ర తెరమీదికి వస్తూనే బసవరాజు అప్పారావు గారి గేయం ''లల్లాయి పదం'' కింద పాడేస్తుంది అయిదు నిమిషాలు తిరిగే లోపుగా అష్టపదివిని, అర్థం చేసుకుని, ఆనందిస్తుంది! 'మాలపిల్ల' చిత్రంలో నిజమయిన, వాస్తవమైన మాలపిల్లనే నాయికగా చేసి ఉంటే ఆ చిత్రం ఊరూపేరూ లేకుండా పోయి ఉండేది

నిన్నమొన్న విడుదలయిన 'కుల గోత్రాలు' చిత్రంలో నాయిక కృష్ణకుమారి అయి, మంచి మంచి నైలాను లు కట్టి, ఆకర్షవంతంగా కనపడటం మాట అటుంచి, ఆ నాయికకు కుల గోత్రాలున్నాయి! ఆమె కోసం నాగేశ్వరరావు తన వారిని 'త్యాగం' చేసినా, అది విధిలేక చేసిన త్యాగమని అడుగడుగునా చిత్రం రుజువు చేస్తునే వుంది తండ్రిని మరిచిపోనని నాయకుడు మాట యిచ్చాడు తల్లి మీదా, చెల్లెలి మీదా ప్రాణాలు వుంచనే వుంచాడు చిత్రం పూర్తి అయ్యేసరికి సంఘర్షణ అంతా అపోహలపై నడిచినట్టు తేలిపోయింది!

ఈ విధంగా పచ్చి అబద్ధాలతో కృత్రిమ సంఘర్షణలు సృష్టించి, వాటికి అభ్యుదయ రంగులు పూసి చిత్ర నిర్మాతలు ఆంధ్రదేశపు జనబాహుళ్యాన్ని రంజింప జేస్తున్నారు జనబాహుళ్యం రంజిస్తున్నది

*విశాలాంధ్ర, దినపత్రిక, 23-9-1962*

ంచంలో మొట్టమొదటిసారిగా ప్రేక్షకులకు ప్రదర్శించిన చలనచిత్రం ఇదే. 1895 డిసెంబరు 25న పారిస్‌లో ఈ
న జరిగింది 1896 ఫిబ్రవరి 20న లండన్ పాలిటెక్నిక్‌లో మళ్ళీ కొద్ది మందికోసం ప్రదర్శించారు ఇదే చిత్రాన్ని అదే
సంవత్సరం మరి ఆరునెలలకు బొంబాయిలో కొద్దిమందికోసం ప్రదర్శించారు

'బైస్కిల్ థీవ్స్'

ఐజెనిస్టీన్ తీసిన బ్యాటిల్ షిప్ 'పొటెంకిన్' చిత్రం

**సెర్జీ ఐజెనిస్టీన్**-(1898-1948) సినిమాని ఒక ఆయుధంగా చేసుకొని ఆ కళకే అంకితం అయినవాడు 'పొటెంకిన్', 'అక్టోబర్', 'ఇవాన్ ది టెర్రిబుల్' చిత్రత్రయం ఈ నాటికీ పాఠాలు నేర్పేవిగానే మిగులున్నాయి

**డబ్ల్యు డి గ్రిఫిత్**-మూకీ సినిమాలకు సూత్రాలు ఏర్పరచినవాడు 1907లో నటుడిగా ప్రారంభమై దర్శకుడిగా మారి 'ది బర్త్ ఆఫ్ ఎ నేషన్' (1915), 'ఇంటోలరెన్స్' (1916) చిత్రాలతో ప్రపంచ ప్రసిద్ధుడయ్యాడు

**జార్జెస్ మిల్లిస్**-1896 లో పారిస్‌లో చిత్రనిర్మాణం ప్రారంభించి తొలిసారి ట్రిక్ ఫోటోగ్రాఫీతో చిత్రాలు తీసి ప్రపంచాన్ని అబ్బురపరిచినవాడు గొప్ప సృజనాత్మక ఆలోచనలకు పేరుగాంచిన మిల్లిస్ 1938లో చనిపోయాడు

**వి ఐ పుడోవ్‌కిన్**-చిత్రరంగాన్ని ప్రభావితం చేసిన తొలితరం రష్యన్ దర్శకులలో ముఖ్యుడు చిత్రాల 'టెక్నిక్'ని తొలిసారిగా వివరించాడు గ్రిఫిత్ వదిలినచోట సినిమా కళను అందుకొని ముందుకు నడిపించాడు 'మదర్', 'ద ఎండ్ ఆఫ్ సెంట్‌పీటర్స్ బర్గ్' చిత్రాల ద్వారా ప్రసిద్ధుడు

'ప్రపంచాన్ని కుదిపేసిన 10 రోజులు' ఆధారంగా
నిర్మించిన 'అక్టోబర్'

గోర్కి 'అమ్మ' ఆధారంగా నిర్మించిన
'మదర్' చిత్రంలో వర్నోవ్‌స్కియా

అమెరికా చిత్రం 'గ్రీడ్' (1923)

ద మాస్క్ ఆఫ్ జొర్రో (1920)లో
డగ్లస్ ఫెయిర్ బాంక్స్

సోవియట్ రష్యా చిత్రం
'మై యూనివర్సిటీస్' (1940)

ది స్ట్రయిక్

జి.డబ్ల్యు పెబస్ట్ నిర్మించిన జర్మనీ చిత్రం 'కామెరాడ్‌స్కాఫ్ట్' (1932)

జీన్‌రినోయర్-ఫ్రాన్స్ చిత్రం 'లా గ్రాన్డ్ ఇల్యూషన్' (1939)

పాట్ జాక్సన్-బ్రిటన్ చిత్రం 'వెస్టర్న్ అప్రోచెస్' (1944)

# 88. సినిమా ప్రపంచం

సినిమా ప్రపంచం అంటే వెండితెరపై ప్రేక్షకులు చూసే ప్రపంచం ప్రేక్షకుల వినోదం కోసం సినిమా కథకులూ, ఆర్టు డైరెక్టర్లూ, కామెరామెన్, మేకప్ ఆర్టిస్టులూ కృషిచేసి సృష్టిస్తున్న ప్రపంచం

ఈ సినిమా ప్రపంచం మామూలు ప్రపంచానికి ప్రతిబింబమని చిత్ర నిర్మాతలు కూడా అనటం లేదు ఆ మాటకు వస్తే ఏ కళలోనైనా ప్రపంచం ఉన్నది ఉన్నట్టుగా చిత్రించటం జరగదు అయితే ఉత్తమ కళలలో చిత్రించబడే ప్రపంచానికీ, వాస్తవ ప్రపంచానికీ కొన్ని సజీవ సంబంధాలుంటాయి ఈ సంబంధాలే లేకపోతే కళకు ప్రయోజనం ఉండే అవకాశం కాస్తా పోతుంది దానికి జీవితంలో ఆదరణీయమైన స్థానం ఉండదు

జీవితానికీ కళకూ మధ్య ఉండే సజీవమైన సంబంధాలు ప్రధానంగా రెండు ఒకటి వాస్తవికత, ఇది కళ యొక్క బాహ్యరూపానికి చెందినది, రెండోది జీవిత సత్యం ఇది కళ యొక్క అంతస్సుకు సంబంధించి ఉండేది

సినిమా ప్రపంచానికి వాస్తవ ప్రపంచానికీ మధ్య ఈ రెండు రకాల సంబంధాలూ కనవడవు సాధారణంగా మనం సినిమాలలోమధ్యతరగతి ఇళ్ళు చూడం చూడటానికి బాగుంటాయిగాని వాటిని మనం నిత్యజీవితంలో భరించలేం ఆ సోఫాలూ, ఫర్నిచరూ, బీరువాలూ, ఆ కిటికీలూ, ఆ తివాసీలూ, ఆ దీపాలూ, వాటిషేడ్‌లూ, ఆ మంచాలూ, ఆ మెట్లూ (చోటు దండుగ!) ఇవన్నీ మామూలు వాళ్ళు నిభాయించలేరు ఈ మధ్య నేనుచూసిన ఒక తమిళ చిత్రంలో పోలీసువాడి ఇల్లు చూపించారు దివ్యంగా ఉంది అహోరాత్రులు దీపాలు వెలిగిపోతున్నాయి వాడి ఎలక్ట్రిసిటీ బిల్లు తలచుకుంటే నాకు గాభరా ఎత్తింది

సినిమాల మేకప్, దుస్తులూ, వగైరాలన్నీ జీవితానికి భిన్నంగానే వుంటాయి సినిమా పాత్రలన్నీ లిప్‌స్టిక్ చేసుకుంటాయి ఖరీదైన దుస్తులు ధరిస్తాయి మగ పాత్రలు బూట్లు గాని, చెప్పులుగాని ధరిస్తే అవి సరికొత్తగా ఉంటాయి అంతా ''బ్రాండ్ న్యూ!'' పాత్రల హోదాతోనూ, ఆర్థిక పరిస్థితితోనూ ఏమీ సంబంధం లేదు ఇళ్ళ విషయంలో లాగే! కార్లు కనిపిస్తే అవి ప్రొడ్యూసర్లు కొనే సరికొత్త మోడల్స్‌లాగా ఉంటాయి ఒక్కటే నాకర్థం కాదు ఇంత మంచి ఇళ్ళూ, కార్లూ, కరెంటు దండుగ దీపాలూ, కొత్త చెప్పులూ, షూలూ ఉండి కూడా, వీళ్ళ ఇళ్ళలో సీలింగ్ ఫాన్‌లుగాని, ఆఖరుకు టేబిల్ ఫాన్‌లుగాని ఎందుకు పెట్టుకోరు!

ఆఖరుకు సినిమా ప్రకృతే వేరుగా ఉంటుంది సినిమా చెట్ల మీద పక్షులుండవు ఎప్పుడన్నా పావురాలుంటాయి ఎందుకుంటాయంటే, మనం మామూలు చెట్ల మీద వాటిని చూడం గనక అయుంటుంది సిన్మా చంద్రుడు— చంద్రుణ్ణి పై నుంచి చూస్తే భూమి కనబడే ప్రమాణంలో వుంటాడు చంద్రుడికి వీపుపెట్టి నిలబడిన నాయకీ, నాయకుల ముఖాలపై ఆ చంద్రుడి కాంతి పడుతూంటుంది (ఇందులో ఐన్‌స్టయిన్ సిద్ధాంతం యొక్క పారడీ ఏమైనా ఉందేమో!)

ముస్తైత్తుకునే వాళ్ళయేది, అంట్లు తోముకునే వాళ్ళయేది, డాక్టర్లయేది ,

విద్యార్థులయేది, ఉద్యోగాన్వేషులయేది— నాయికా నాయక పాత్రలు విధిగా పాడి తీరాలి ఈ పాత్రలు డాన్సు చెయ్యటం చేతకాని వాళ్ళు హీరో వేషాలకి పనికి రాని పరిస్థితి కూడా ఏర్పడవచ్చు

ఇదంతా ఏమిటి? సినిమాలలో వాస్తవికతకుండే అవకాశం మరే ఇతర కళలోనూ లేదే! ఇంత మంది నిర్మాతలూ, కళాకారులూ, కవులూ, గాయకులూ చేరి ఇంత అవాస్తవికమైన సినిమా ప్రపంచాన్ని లక్షలూ, కోట్లూ ధారపోసి ఎందుకు సృష్టిచేస్తున్నట్టు?

దీనికి ఒకటే కారణం సినిమా ఇంకా చౌచౌభాగోతంగానే ఉన్నది కళగా దానికి ఏకత్వం లభించలేదే సిద్ధాంతరీత్యా సినిమా కళ అనేక కళల సమ్మేళనమే కావచ్చు కాని పరిణామరీత్యా సినిమా ఇంకా బహుకళల మిశ్రమంగానే ఉన్నది ఒక్క సినిమా ప్రదర్శనలో ప్రేక్షకుడు బహు ప్రదర్శనకు గురి అవుతున్నాడు అందమైన వ్యక్తులు, అందమైనసెట్టింగులు, నేత్ర పర్వమైన ఫోటోగ్రఫీ, కర్ణపేయమైన సంగీతం, ఉత్సాహజనకమైన నృత్యాలు (ఎవరో అన్నట్టు) వీటితో బాటు కొంత కథా, దాని అవసరాలకు గాను ఏడుపులూ, పెడబొబ్బలూ, రంకెలూ, వికవికలూ వగైరా

సినిమాల బహిస్స్వరూపం ఇలాంటి నానాత్వం పాలైనప్పుడు దాని అంతస్సులోకి వాస్తవికత ప్రవేశించలేదు వాస్తవికమైన కథల్లో పాత్రలు అందంగా ఉండి, రమ్యంగా పాడి, రమణీయమైన పరిసరాల్లో నివసించాలంటే అది సాధ్యమయేది కాదు జీవితంలో భజనలు చేస్తారుగాని డ్యూయెట్లు పాడరు ఒక్క డ్యూయెట్లు మానేస్తే చాలు సినిమాలకు అడుగు ఊడిపోతుంది— అని నిర్మాతల భయం ఒక ఆర్టు డైరెక్టరు అన్నట్లు మన సినిమాలలో ఒక్క నిజమైన గుడిసె కనిపించలేదు అదేవిధంగా సహజమైన సన్నివేశాలుగాని, వాస్తవమైన సమస్యలుగాని సినిమాలలోకి ఒకంతట ప్రవేశించలేకుండా ఉన్నాయి

ఈ పరిస్థితిలో కళల 'ఇంటిగ్రేషన్' జరగడమో, లేక ఈ చౌచౌ భాగోతానికి అనుకూలమైన కథలు మాత్రమే రాసుకోటమో జరిగితే గాని సినిమా కళకు ముక్తిలేదు ఈ కాలానికి చెందిన కథలే ఎందుకు తీసుకోవాలి? ఇతర కాలాలున్నాయి, దేశాలున్నాయి, ఇతర గ్రహాలు కూడా ఉన్నాయి సినిమా కథలు అక్కడికి వెళ్లిపోతే మంచిది సాంఘికంగా ఉండటానికి ప్రయత్నించే కథలే మరింత బాధాకరంగా ఉంటున్నాయి

*విశాలాంధ్ర, దినపత్రిక, 8-10-1962*

# 89. నేనూ-సినిమాలు

ఈ శీర్షికలో, సినిమాలలో మనకు కనిపించే సంఘర్షణ వాస్తవికంగా ఉండటం లేదంటూ నేను రాసిన దానిపై శ్రీ సి ప్రసాద్ గారు విమర్శ చేశారు. ఈ సందర్భంలో ఒక విషయం స్పష్టం చేస్తే అపోహలకు తావుండదు సినిమాలంటే నాకు ద్వేషం లేదు చిత్ర నిర్మాతలలోనూ, సినిమా తారలలోనూ నాకు విరోధులు లేరు సినిమా రంగంలో నేను జీవనోపాధి కల్పించుకోపోయినా సినిమాకారులు నన్ను ''బయటి'' వాడిగా చూడరు విడుదల అవుతున్న ప్రతి చిత్రమూ హిట్ కావాలనే నేను మనస్ఫూర్తిగా కోరతాను చిత్ర నిర్మాతలకు గల ప్రతిబంధకాలు నాకు బాగాతెలుసు

అయితే నేను అచ్చంగా సినిమా రంగంలో ఉండే మనిషిలాగా ఆలోచించను సినిమా వాతావరణమూ, సినిమా అవసరాలూ, నియమాలూ నన్ను 'కండిషన్' చెయ్యవు నాకొక సామాజికుడి దృష్టి ఉంది సినిమా కళకూ, సినిమా పరిశ్రమకూ, సమాజానికీ ఉండవలసిన సంబంధాలలోనూ గల వ్యత్యాసం నాకు అనుక్షణం కనిపిస్తూ ఉంటుంది దాన్ని వ్యక్తం చెయ్యటానికి ప్రయత్నిస్తాను అంతేగాని సినిమా చిత్రాలని మార్చెయ్యటానికి నేను ఉద్యమం సాగించటం లేదు అటువంటి ఉద్యమం ఏదన్నా వస్తే ప్రేక్షకుల పక్షం నుంచి రావాలి లేదా నిర్మాతల పక్షంనుంచి రావాలి 'చిత్ర జగత్తు' శీర్షిక నుంచి రాదు

'కులగోత్రాలు' చిత్రాన్ని నేను ఉదాహరణగా తీసుకున్నానుగాని దాని మీద విరుచుకు పడలేదు ఇది ఇటీవల విడుదలైన చిత్రం, బాగా నడిచిన చిత్రం నాలాంటి అభిరుచులుగలవారు మెచ్చుకున్న చిత్రం ఈ కారణంచేత ఆ చిత్రాన్ని ఉదాహరణగా తీసుకున్నాను

ప్రేమ పెళ్ళిళ్ళు ఉన్నాయంటున్నారు ప్రసాద్ గారు పురాణకాలం నుంచీ ప్రేమ పెళ్ళిళ్ళు ఉండవచ్చు కాని సామాజిక దృష్టితో చూస్తే ఇవి భవిష్యత్తుకు చెందినవి గాని వర్తమానానికి చెందినవి కావు ఈతవచ్చిన దాకా నీటిలోకి దిగనన్నట్టుగా, పెళ్ళి అయితేనేగాని యువతీ, యువకులు స్నేహంగా ఉండరాదన్న నియమం ఉన్నంత కాలమూ సామాజికంగా ప్రేమ పెళ్ళిళ్ళు నిషిద్ధాలేనని నేననుకుంటున్నాను ''కాలాతీత వ్యక్తులు'' ఏ సమాజంలోనైనా ఉంటారు ఈ వ్యక్తులను గురించే చిత్రాలు తీస్తున్నామనుకోమంటే కళలో ఉండదగిన సార్వజనీనత దెబ్బతినవచ్చు

ఏ సామాజిక సమస్యా కాగితం మీద పరిష్కారం కాదు ఇందుకు ఉదాహరణ ఇక్కడే ఇచ్చేస్తాను సిద్ధాంత రీత్యా పెద్దలు చేయించే పెళ్ళిళ్ళ కన్న ప్రేమ పెళ్ళిళ్ళు మంచివి పెళ్ళికానిఆడ పిల్లలతో మగ పిల్లలు స్వేచ్ఛగా తిరిగితే గాని ప్రేమ పెళ్ళిళ్ళు జరగవు గనక , ''కుటుంబరావు ఆడపిల్లల్నీ మగపిల్లల్నీ విచ్చలవిడిగా తిరగమంటున్నాడు!'' అంటే అందులో అర్థం ఏముంటుంది?

మన సినిమా చిత్రాలలో ఉండే సంఘర్షణ సహజంగా ఉండాలన్నది సిద్ధాంతం ఆ సిద్ధాంతం తప్పయితే, తప్పని ఎవరన్నా రుజువు చేస్తే నేను ఈ సిద్ధాంతం గురించి పునరాలోచించగలను ఆ సిద్ధాంతం అమలు కావటం చాలా అరుదుగా వుందని నేననుకుంటున్నాను అమలు అవుతూనే ఉందని శ్రీ ప్రసాద్ గారంటున్నారు ఇద్దరిలోనూ ఎవరో ఒకరు పొరబడి వుండాలి పొరపాటు నాదే అయినా ఫరవాలేదు— కాదూ, మరీ మంచిది, ఎందుచేతనంటే మన సినిమాల్లో సంఘర్షణ చాలా వాస్తవంగా ఉంటున్నది గనక!

ఇదే విధంగా కిందటి వారం 'చిత్ర జగత్తు' లో సినిమా ప్రపంచం అవాస్తవికంగా ఉందని రాశాను అవాస్తవికంగా ఉండరాదన్న సిద్ధాంతాన్ని నలుగురూ ఒప్పుకుంటే చాలు— అందులో నే చెప్పిన ఉదాహరణలన్నీ తప్పయినా ఫర్వాలేదు ''జనం చూసి నాలుగు డబ్బులివ్వాలి గనుక నువ్వు ఆమాట అనటం అక్రమం'' అని మాత్రం అనవద్దు ఎందుకంటే, నాకు డబ్బు విషయం కూడా తెలుసు నేను జర్నలిజం వదిలేసి సినిమాలు తీయటానికి పూనుకుంటే ఇలాంటి చిత్రాలే తీయనని కూడా మాటివ్వ లేను ఆ మాటకు వస్తే జర్నలిజంను నేను అభ్యుదయ పథంలో సూటిగా నడిపిస్తున్నానని కూడా చెప్పను కాలానికీ కర్మానికీ కట్టుబడి అనేక సాంస్కృతిక

రంగాలలో పనిచేసే వాళ్ళుం తప్పని సరి అయ్యో, బుద్ధి పూర్వకంగానో, తెలియకనో అనేక అవకతవకలు చేస్తాం వీటిని సామాజికులు తెలియ జెప్పవచ్చు అందులో తప్పేమీలేదు ముందే చెప్పినట్లు, ఉదాహరణలు తప్పయినా సిద్ధాంతం సరిగా ఉంటే చాలు

మన సాంస్కృతిక జీవితానికి మూల సూత్రాలే లేకుండా పోతున్నాయని ఆందోళన చెందుతున్న వారిలో నేనొకణ్ణి ఒక్కొక్కసారి నాలో ఆశావాదం బొత్తిగా అడుగంటి, పరిస్థితి నానాటికీ దిగజారి పోతున్నదా అని కూడా అనిపిస్తుంది ఈ ఆందోళనే నన్ను రాయటానికి పురికొల్పింది

విమర్శించటంలో కూడా చాలా రకాలున్నాయి సంగీతమంటనే అసహ్యమైన వాడు సంగీతాన్ని విమర్శిస్తాడు ఇది అన్యాయం, సాహిత్యం యొక్క భవిష్యత్తును గురించి ఏ ఆందోళనా లేనివాడు దాన్ని ఉద్ధరించే వాడులాగా విమర్శిస్తాడు ఇది అక్రమం, నేను సినిమా విమర్శకుడిగా ఆ రెండు తరగతుల కిందకీరాను నాకు సినిమా కళ అంటే అభిమానం ప్రజాకళా వాదిని కావటం చేత ప్రజలకు సినిమా కన్న సన్నిహితమైన కళ లేదని ఏనాడో గుర్తించాను సినిమా చిత్రాలను పాక్షికంగా ఆనందించటం కూడా నాకు చేతనవును స్క్రిప్టు బాగున్నా( ఇల్లరికం, పెళ్ళి కానుక) నటన బాగున్నా ( మా ఇంటి మహలక్ష్మిలో గుమ్మడి, జమున), డైరెక్షన్ బాగున్నా ( సిరి సంపదలు), ఆర్టు డైరెక్షన్ బాగున్నా ( తిమ్మరుసు) నాకు ఆనందం కలుగుతోంది శ్రీ ప్రసాద్‌గారు గాని, ఇతరులు గాని నన్ను తప్పుగా సైకోఎనలైజు చేయకుండా ఉండగలందులకు ఆటు వారికీ ( మున్షీమొదలైన ఛాందసులకు), ఇటు వీరికీ ( కుటుంబరావు వంటి ఆధునికులకు) కూడా సినిమాల మీద ఈషణ్మాత్రమూ సానుభూతి ఉన్నట్టు కనబడదు'' ఓ ఈ మాటలు చెప్పవలసి వచ్చింది

*విశాలాంధ్ర, దినపత్రిక, 14-10-1962*

# 90. అన్వేషణ

నిరుద్యోగులు ఉద్యోగాలను, ఉద్యోగులు ప్రమోషన్లను అన్వేషిస్తారు, శాస్త్ర వేత్తలు ప్రకృతి రహస్యాలనూ, భక్తులు భగవంతుణ్ణీ, అపోజిషన్ పార్టీల వారు ఐక్య సంఘటననూ అన్వేషిస్తారు!

అమెరికా దేశాంతరాలలో స్థావరాలను అన్వేషిస్తుంది బడుగు దేశాలు విదేశీపెట్టుబడినీ, ''స్వతంత్ర'' రాజ్యాలు చీకిపోయిన నియంతలనూ అన్వేషిస్తాయి పోలీసులు నేరస్తులను— దానికేం?— అన్వేషిస్తారు అసంఖ్యాకులు కాపుసారాను అన్వేషిస్తారు బస్తీలలో బడితెల్లాంటి అబ్బాయిలు డిటో ల్లాంటి అమ్మాయిల కోసం అన్వేషిస్తారు సినిమా ప్రొడ్యూసర్లు కథల కోసమూ, అధికారులు లంచాల కోసమూ, కొత్త రచయితలు తమ రచనలు అచ్చువేసే పత్రికల కోసం అన్వేషిస్తారు ఆడపిల్లల తండ్రులు వరుల కోసం అన్వేషిస్తారు పరీక్షలకు కూచున్న విద్యార్థులు కొందరు ప్యాస్ మార్కుల కోసం అన్వేషిస్తారు ఈ సోదంతా ఏమిటి? అనుక్షణమూ ఎవరో ఒకరు దేనికో దానికి గానూ అన్వేషణ చేస్తూనే ఉంటారు ఈ అన్వేషణ లేకపోతే జీవితమే లేదు

అయితే ఈ అన్వేషణ మాట కేసి మనం కొంచెం కన్నార్పకుండా చూస్తే దీని వెనక మనిషి యొక్క అసహాయతా, తడువులాటా, అయోమయమూ ఉన్నట్టు పొడగట్టుతుంది ''మనకు కావలసినది ఏమిటి? అది ఎక్కడ ఉంటుంది? దాన్ని ఏవిధంగా సాధించాలి?'' ఈ మూడు ప్రశ్నలలో ఏ కొన్నింటికో, అన్నింటికో సమాధానాలు తెలియనప్పుడే అన్వేషణ, జేబులో సిగరెట్టుపెట్టే నిప్పుపెట్టే ఉన్నవాడు అన్వేషణ చేసే కర్మేం ? నిక్షేపంగా సిగరెట్టు పెట్టెలోంచి సిగరెట్టు తీసి నోట పెట్టుకుని, అగ్గిపుల్ల వెలిగించి అంటించుకుంటాడు నాకో స్నేహితుడుండేవాడు అతను జేబులో నిప్పు పెట్టి వేసుకుని తిరుగుతూ, సిగరెట్టుగల వాళ్ళ కోసం అన్వేషణ చేసేవాడు

మొదటి ప్రశ్న— అనగా , మనకేం కావాలి? అన్నదానికి సమాధానం తెలిసి మిగిలిన ప్రశ్నలకు తెలియని కారణంచేత చెయ్యవలసి వచ్చే అన్వేషణలు దేశవాళీ అన్వేషణలు ఒక కుర్రాడు ఎగ్జిబిషన్‌కు వెళ్ళినప్పుడు తల్లిదండ్రులకు ఎడమైపోయి, ఆఫీసుకు వెళ్ళి ''మాఅమ్మానాన్నా తప్పిపోయారు '' అని రిపోర్టు చేశాట్ట ఇది దేశవాళీ అన్వేషణ పిల్లలు కూడా అన్వేషణ చెయ్యవచ్చు అన్వేషణకు కీలకమైన ప్రశ్న ''అది ఎక్కడ ఉన్నది?'' అనేది ''దాన్ని ఎట్లా సాధించాలి''? అన్నది ఒక ప్రశ్న క్రింద అన్వేషకులు ఒకంతట ఒప్పుకోరు అది తెలియదని ఒప్పుకుంటే తాము అన్వేషణకు పనికి రామని ఒప్పేసుకోవాలిసొస్తుంది అలా ఒప్పుకోవటం ఎవరి కిష్టముంటుందీ?

నం1 ప్రశ్నా , నం 2 ప్రశ్నా ఏర్పడ్డ అన్వేషణలు సిసలైన అన్వేషణలు అదేమిటో తెలియదు అది ఎక్కడ ఉన్నదో తెలీదు ఈ విషయాన్ని లౌక్యంగా అన్వేషకులు ఒప్పుకుంటారు ''అమ్మాయికి మొగుడా? ఎక్కడో పుట్టి పెరుగుతూనే ఉన్నాడు '' అంటారు పిల్లల తల్లి దండ్రులు ''రాసుకుపోతుంటే ఆ వివరాలు వాటంతట అవే వచ్చేస్తాయి'' అంటాడు సినిమా రచయిత

ఇటువంటి అన్వేషణ ''పీటముడి'' పడ్డప్పుడు అన్వేషకుడు ''ఏ రూపంబునదీనిగెల్తు,'' ఇక మీదే వేల్పు చింతించు, ఎవ్వారిందూరుదు, ఎవ్వరడ్డయిన?'' అని తనను తాను ప్రశ్నలతో మంచెత్తుకుంటాడు ఇలాంటి అన్వేషణలో కృతార్థుడైనవాడు తరించిపోయి తత్వం అరటిపండు వొలిచిపెట్టినట్టుగా చెప్పేస్తాడు 'అందుగల డిందులేడని సందేహం వలదు, చక్రి సర్వోపగతుండు, ఎందెందు వెదకి జూచిన అందందే గలడు'', అంటాడు ''ఉద్యోగం కావాలి, బాబాయ్'' అంటే సీతప్పగారు ''ఉద్యోగాలకేవిట్రా? లక్షలు, లక్షలు'' అన్నట్టు, సినిమా కథలో కొత్తదనం రావటానికి గిరీశంగారు సూక్ష్మోపాయాలు చెప్పినట్టు

కాకపోతే ఈ తరించిన వాళ్లతో చిక్కేమిటంటే, వీళ్ల అనుభవం అన్వేషణ సముద్రంలో బుటకలు వేసేవాళ్లకి కొంచెం కూడా అక్కరకురాదు కూతురికి పెళ్ళి చెయ్యవలసి ఉన్న అసామీ, ఆఫీటు చేసేసిన ఆయనతో తనగోడు మొర పెట్టుకుంటే, ''ఇదుగో చూడండీ. మీరు హైరానా పడి కొంచెము కూడా ప్రయోజనం లేదు మీరు రాయిలా కూచుండిపొండి, ఆ ఘడియ రాగానే ఆ సంబంధం మిమ్మల్నే వెతుక్కుంటూ వస్తుంది నేను మా చలిమిడి ముద్దకి అలాగే చేసేశాను '' అంటాడు కుడిచికూచున్న వాడి మాటలు ఆకలితో చెవులు దిబ్బెళ్ళుపడ్డవాడి తలకెక్కుతాయా? అనుమానించవలసిన విషయం చద్దెన్నం తిన్న సుబ్బి మొగుడాకలే మెరుగు

అనుకున్నట్టు

అది అలా ఉంచి, ఈ తరించిన వాళ్ళుందే వీళ్ళు అన్వేషణకు పరమార్థముంటుందని మరచిపోతారు దేవుణ్ణి ఎక్కడ చూసినా చాలుననుకునే వాడితో ''ఎందెందు వెదకి చూచిన అందందే గలడు'', అని చెప్పటం నిష్ప్రయోజనం అలాగే ఒక్క ఉద్యోగంతో తృప్తి పడేవాడికి లక్షల కొద్దీ ఉండే ఉద్యోగాలను గురించి చెప్పి ఏం లాభం? '' ఒరే నాయినా, ఫలాని ఆఫీసులో నీకు పనికి వచ్చే ఉద్యోగం ఉంది '' అనేస్తే అన్వేషకుడి అన్వేషణ పూర్తి అయిపోతుంది కాని తరించిన వాళ్ల ఇతరుల అన్వేషణకు, చూస్తూ, చూస్తూ , ఫుల్ స్టాప్ పెట్టరు

అన్వేషణలో నవరసాలకూ అవకాశం ఉంది ''చంకలో బిడ్డను పెట్టుకుని ఊరంతా వెతికింది,'' అన్న సామెత ఉండనే ఉంది అది హాస్యం వెతకబోయిన తీగ కాళ్ళకు తగలటం అద్భుతరసం దేశవాళీ అన్వేషణల్లోనే రసోత్పత్తికి గాని (రసాభాసకు గాని) అవకాశాలు హెచ్చు ఒక ఉదాహరణ మనవిజేస్తా

ఒకనాడు ఒక పెద్ద మనిషి అదుర్దాగా ఇల్లంతా వెతకటం గమనించాను ఆయన వెతికిన చోట్లను బట్టీ, వెతికే పద్ధతిని బట్టీ ఆయనకు కావలసిందేదో డిటెక్టు చేద్దామని చాలా సేపు చూశాను ఆయన గూళ్ళన్నీ వెతికాడు పెట్టలన్నీ వెతికాడు బట్టల మడతలన్నీ విప్పి మరీ వెతికాడు దండెం మీద బట్టలన్నీ అటూ ఇటూ జరిపి చూశాడు చాప ఎత్తి చూశాడు జేబులన్నీ వెతికాడు చిన్న పాకెట్ బుక్ తీసి పేజీ పేజీ మధ్యా వెతికాడు ఇంకేముంది దొరికిపోయారు గదా అనుకుని, ''రూపాయి నోటా ఏమిటి, వెతుకుతున్నారు?'' అన్నాను

''కాదోయ్ కళ్ళజోడు'' అన్నాడాయన

అన్వేషణ వెంట అయోమయం ఉంటుందనే పరమ సత్యం అలా ఉండగా అన్వేషణ మూలంగా ఉన్న అయోమయం మరింత అవుతుందన్నది మనకందరికీ అనుభవం ద్వారా తెలిసిన సంగతే ఇది మొదట్లో అంత తీవ్రంగా ఉండదు కాని రానురాను విశ్వరూపం దాల్చుతుంది మన మిత్రుడెవడైనా పోయిన ఫౌంటెన్ పెన్ కోసం పోపుల పెట్టెలో వెతకటం మన కంట పడ్డట్టాయెనా, అతగాడు ఆ ఫౌంటెన్ పెన్ను కోసం చాలా సేపట్నుంచి వెతుకుతున్నాడని రూఢిచేసుకోవచ్చు వెతికినచోటనే వెతకటమూ, ఇంపాసిబుల్ స్థలాల్లో వెతకటమూ, పోయిన వస్తువు యొక్క రూపమూ, రంగూ, ప్రమాణమూ పూర్తిగా మరిచిపోవటమూ అన్వేషణయొక్క చరమ దశను సూచిస్తాయి దీన్ని నేతి నేతి దశ అనవచ్చునా?

సినిమాలలో, ముఖ్యంగా యుగళగాన ఘట్టాలలో, ప్రేయసీ, ప్రియుల యూనిలేటరల్ , లేక బైలేటర్ అన్వేషణలో శృంగార, అద్భుత, హాస్యరసాలు ఇమిడి ఉంటాయి 1963లో తీయబోయే సినిమాలోని ఈ ఘట్టం చూడండి, రేలంగి గిరిజా డ్యూయెట్ ఇద్దరూ హీరో ఇంటి పెరట్లో దాగుడుమూత లాడుతూ పాడతారు ''ఎంత చక్కనిదానివే పిల్లా'' అంటూ గిరిజను పట్టుకోబోతాడు గిరిజ మాయమై పోతుంది రేలంగి చేతికి పాదున వేళ్ళాడే పొట్లకాయ చిక్కుతుంది దాన్ని విరిచి తింటూ రేలంగి పొట్లమాను చుట్టూ తిరిగి గిరిజ ఎక్కడన్నా దాక్కుందేమోనని చూస్తాడు ఇంతలో గిరిజ గొంతు ''ఎంతటక్ హరివాడో? బహవా,'' అని వినిపిస్తుంది రేలంగి 360 డిగ్రీలూ కలయ జూసినాక గిరిజ కొండపక్కన మర్రి చెట్టు ఊడలు ఉయ్యాలగా వేసి ఉంటే అందులో ఊగుతూ కనిపిస్తుంది రేలంగి అను పల్లవి పూర్తి చేసే సరికి

గిరిజ నదిలో బేతింగ్ డ్రెస్‌లో ఈదుతూ ఉంటుంది చరణం పూర్తి అయే సరికి ఇద్దరూ సాతనూర్ డామ్ దగ్గిర కారు దిగుతూ ఉంటారు పాట ఆఖరయే సరికి గిరిజ భరత నాట్యం డ్రెస్‌లోనూ, రేలంగి నైట్‌క్లబ్ డ్రెస్‌లోనూ ఉంటారు (షరా మా ఉమ్మడి అనుమతి లేనిదే ఈ అయిడియాను ఎవరన్నా పిక్చరులో పెట్టేస్తే వారు నిర్దాక్షిణ్యంగా కోర్టుకు లాగబడుదురు )

చెప్పవచ్చేదేమిటంటే సాంగ్ పిక్చరైజేషన్ అన్వేషణ అనేది వచ్చేసరికి అన్ని రకాల కంటిన్యూటీల తాలూకా నియమాలూ తిరపతెళ్ళి పోతాయి అది సినిమా వాళ్ళ తప్పుకాదు అన్వేషణలోనే ఆ తప్పున్నది అందుచేతనే మనం మామూలు అన్వేషణలను చూసి జాలిపడతాం గాని, రంధ్రాన్వేషణ చేసే వారిని చూసి మండిపడతాం అసలు అన్వేషణలోనే తప్పుండగా తప్పులను అన్వేషించటం డబుల్ తప్పుకాదా?

జాలి పడటం మాటకొస్తే అందరికన్నా జాలి పడవలసింది అన్వేషణలో నష్టపోయిన వారిని చూసి స్మగ్‌ల్ చేసిన వస్తువులు చాలా చవుక అని అందరికీ తెలుసు వాటిలో చాలా భాగం నకిలీసరుకన్నది చాలా మందికి తెలీదు ఈ చవుక బారు గడియారాలు, రేడియో సెట్లూ అవీ కొనటానికి అంతులేని అన్వేషణ జరిపి, చివరకు నష్టపోయే అమాయకులను చూసి మనం జాలి పడాలి

అదేవిధంగా సినిమా కథలు , సినిమాలకు పనికివచ్చే మంచి మంచి కథలన్నీ బెంగాలీ భాషలో రాసి ఉన్న సంగతి ప్రతి లైట్ బోయ్‌కి తెలిసిపోతుంది కాని బెంగాలీలు రాసిన ప్రతికథా అంత మోతగా ఉండదన్న సంగతి చాలా మంది ప్రొడ్యూసర్లకు తెలీదు ఈ పరిస్థితుల్లో ఏ సినిమా కంపెనీవాళ్ళయినా తెలుగు సాహిత్యం నుంచి చేతివాటు వేస్తే పని వెళ్ళ మారిపోయే కథలు వేలకు వేలు పెట్టి బెంగాలీ నుంచి కొనుక్కుంటే మనం జాలి పడాలి

★ ★ ★

మన మనుషుల్లో కొందరు—రోడ్డు మీద నడుస్తూ పోతున్నప్పుడు ఏదో వెతుక్కుంటూ పోతున్నట్టు కనిపిస్తారు నిజానికి వాళ్ళేమీ వెతకరు వాళ్ళ నడకే అంతట కొందరు కళ్ల జోళ్ళ వాళ్ళ చూపులు కూడా ఎప్పుడూ వెతుకుతూనే వుంటాయి ఒక ఇల్లుగలాయన, రోజూ తిరిగితిరిగి తన ఇంటికి వచ్చి ఒకసారి ఎగాదిగా చూసిగాని లోపలికి ప్రవేశించేవాడు కాదు ఒక నరసింహంగారు, వెతికితే గాని ఏదీ ఇచ్చేవాడు కాడు అనగా ఆయన జేబులో రోజూ పెట్టుకునే చోటనే ఫౌంటెన్ పెట్టుకున్నా మనం అడిగితే ఓసారి పక్కజేబూ, బొత్తాల దగ్గిరా వెతికి అప్పుడు అసలు స్థానానికి వచ్చేవాడు ఇటువంటి వాళ్ళు చాలా మంది ఉంటారు మనం అడిగిన వస్తువేదో వాళ్ళ దగ్గర వున్నదని వాళ్ళకు రూఢీగా తెలిసే వున్నా— మనం అడిగాక కాస్త వెతికితే గాని అది బయటపడదు ఆదరాబాదరాగా ఏ పుస్తకం కోసమో టేబిలు మీద వెతుకుతూ '' ఇదిగో, పుస్తకం ఇక్కడ పెట్టానూ కనిపించదేం'' అంటాడు వంటింట్లోకి ''ఐతే అక్కడే వుంటుంది చూడండి'' అని వంటింట్లోంచి సమాధానం వస్తుంది ఈయన గారు, డ్రాయర్లోనూ, కిందనూ, మంచం మీదా, దిండుకిందా వెతికి మళ్లీ టేబిలు దగ్గర కొచ్చి ''హా ఇక్కడే వుంది'' అనుకుని ''ఇక్కడే వుందే'' అంటాడు వంటింట్లోకి దీనికి వంటింట్లోంచి ఏ సమాధానమూ రాదు ఆ సంగతి ఆయనకూ తెలుసు ఈ రకం అన్వేషకులు మందమతులై వుండవచ్చునేమో గాని, కొందరికి అలవాటు లాంటిది వుంటుంది టేబిలు మీద

ఎదురుగానే అగ్గిపెట్టె కనిపిస్తూ వుంటుంది ''అగ్గిపెట్టె '' అంటాం మనం ఆయన మనకు అగ్గిపెట్టె ఇవ్వబోతాడు ఐతే ముందుగా అతని చెయ్యి అటు ప్రక్కో, ఇటు ప్రక్కో పోయి అప్పుడొచ్చి అగ్గిపెట్టె మీద పడుతుంది వీళ్ళు నిత్యాన్వేషకులు

మన పురాణాల్లో దేవుళ్లు సయితం వెతికిన వాళ్ళే 'దశావతారములు దాల్చిన శ్రీమహావిష్ణువు మత్స్యావతారంలో వేదాల కోసమూ, సోమకాసురుడి కోసమూ వెతికాడు కూర్మావతారంలో మోహినిగా వున్నప్పుడు అమృతం పంచటానికి దేవతల్లో దానవులను వెతికాడు హిరణ్యాక్షుడి కోసం వరహావతారంలోనూ, హిరణ్యకశిపుడిని సంహరించటానికి తగిన వేళ, స్థలం, రూపం మొదలైన వాటి కోసం నరసింహావతారంలో వెతికాడు మూడో అడుగు పెట్టడానికి చోటు కోసం వెతుక్కుంటూ వుంటేనే వామనుడిని, బలి తనతలపై పెట్టమన్నాడు శిరస్సులు నరకటానికి రాజుల కోసం అన్వేషణ చేశాడు పరశురామావతారంలో రాముడై సీత కోసం వెతికాడు— కృష్ణుడై శమంతకమణి కోసమే కాదు— చాలా వాటి కోసం వెతికాడు బుద్ధావతారంలో సత్యాన్ని అన్వేషించాడు కలికావతారంలో 'శిక్షణ' కోసం దుష్టుల్ని అన్వేషిస్తూనే వున్నాడు ఇట్లా భగవంతుడే వెతికాడు మనం అనగా ఎంత? వెతుక్కోవలసిన కర్మ దేవుడికే పట్టగా మానవుడికి పట్టటంలో ఆశ్చర్యమూ లేదు అబ్బురమూ లేదు

ఏం రా, ఉద్యోగం దొరికిందా? అని అడిగితే, ''నే నెక్కడా పారేసుకోలేదే దొరకటానికి'' అన్నాట్ట ఒకడు, ఆ 'దొరికింది' అనే పదం మీద మండిపడి

పశు పక్ష్యాదులు చేసే పనల్లా వెదకటమే వాటికి ఇంకో ఉద్యోగం లేదు అవి వెతికేది కూడా రెండింటి కోసం ఒకటి—ఆహారం, రెండు—నివాసం కుక్కలు సాధారణంగా వెతుక్కుంటూనే పోతాయి వెతకటంలో మానవుడి మేధ కంటే కుక్కల మేధ గొప్పది అందుకనే నేరస్తుల్ని పట్టుకోవటం మానవుల చేతకాకపోతే ఆ 'అన్వేషణ' కుక్కలు చేసి మనుష్యుల్ని పడుతున్నాయి తుమ్మెదలు పువ్వుల కోసం వెతుకుతాయి పువ్వులు దేవుని పాదాల కోసం వెతుకుతాయి, లేదా స్త్రీల శిరోజాలను వెతుకుతాయి ఈ స్త్రీల జడలు పురుషుల కళ్ళ కోసం వెతుకుతాయి పురుషుల కళ్లు ఇటువంటి వాటినే వెతుకుతూ వుంటాయి కాబట్టి అవి కనిపించగానే నవ్వు తాయి ఇట్లా ఒక దాన్లోంచి ఇంకో దాన్లోకి 'వెతకటం' అనేది వ్యాపించి వుంది కూడా

సినిమాలలో సాధారణంగా జానపదాల్లో నాయకుడు నాయికకోసమైనా వెతుకుతాడు, నాయిక నాయకుడికోసమైనా వెతుకుతుంది లేదా, వారి 'నోములపంట' యినా వాళ్ళ కోసం వెతుకుతుంది నాయకుని చెలికాడూ, హాస్యగాడూ నాయకుడికోసం వెతుకుతాడు సాదరణంగా ఈ వెతకటాలు చిత్రం ఆఖర్లో జరుగుతాయి ఎప్పుడెతే చిత్రం అయిపోవాలని, నిర్మించే వాళ్ళకు అనిపిస్తుందో, అప్పుడు వాళ్ళంతా ఒకరి కొకరు దొరికపోతారు— కావలించేసుకుంటారు దీనికి బాగా అవసరమైనది 'వెతకటం', 'చెలియా కనరావా' 'కనుగొనగలనో లేనో', 'కానగనైతినిగా' ''నిన్ను కన్నార గన్నా''— వంటి పాటలన్నీ వెతకటం క్రియతో పెనవేసుకున్నవే

అన్వేషణ నిరంతరమైనది ప్రపంచంలో జీవిస్తున్న మనం అందరమూ 'భావి' కోసం అన్వేషిస్తున్న వాళ్ళమే శరీరాలను వదిలి పోతున్న జీవుళ్ళన్నీ మళ్ళీ శరీరాలకోసం అన్వేషిస్తూనే

వుంటాయి విజ్ఞానమంటేనే అన్వేషణ అన్వేషణ లేకపోతే విజ్ఞానమే లేదు
(ఈ వ్యాసం రావికొండలరావుతో కలిసి రాసింది)

*జ్యోతి, మాసపత్రిక, నవంబరు, 1963*

# 91. మన సినిమా చిత్రాలు

మనదేశం స్వతంత్రమయాక దిగనాసిల్లిన కళలలో సినిమా కళదే అగ్రస్థానమని చెప్పవచ్చు యుద్ధానికి పూర్వం వచ్చిన చిత్రాలలో కనీసం సాంఘిక చిత్రాలలో జాతీయోద్యమం తాలూకు ప్రభావం అంతోఇంతో వుండేది 'మాలపిల్ల', 'మళ్ళీపెళ్ళి', 'రైతుబిడ్డ', 'గృహలక్ష్మి', 'ధర్మపత్ని', 'వరవిక్రయం' వంటి చిత్రాలన్నీ సాంఘిక ప్రయోజనం ప్రధానంగా గలవే ఈనాడు అటువంటి దృక్పథమే సినిమాలలో మృగ్యమయిట్టు కనబడుతుంది

యుద్ధానంతర కాలంలో ప్రజానాట్యమండలి ప్రభావంతో ఏర్పడిన అభ్యుదయ దృక్పథం వల్ల'షావుకారు', 'పల్లెటూరు', 'రోజులు మారాయి', 'పుట్టిల్లు' లాంటి చిత్రాలు వచ్చాయి అయితే ఈ ధోరణి కూడా శీఘ్రంగా అంతరించింది

పైన చెప్పిన దాన్నిబట్టి ఒకటి స్పష్టమవుతున్నది సమాజంలో సార్థకమైన చైతన్యం ఉన్నట్టయితే అది సినిమారంగంలో ప్రతిబింబించకపోదు అలాటి ప్రభావాలేమీ లేని పరిస్థితిలో సినిమా ఒక బజారు వస్తువు కావటమూ, దాని ఉత్పత్తి కేవలమూ వ్యాపారదృష్టితో మాత్రమే జరగటమూ సహజం

ఈనాటి మన సినిమా చిత్రాలు కళాదృష్ట్యా అసంతృప్తి కరంగా ఉన్నా, ఈనాటి కుర్రకారుపైన వాటి ప్రభావం అవాంఛనీయంగా ఉన్నా అందుకు తప్పు పట్టవలసింది ప్రభుత్వాన్ని

రష్యాలో సోవియట్ ప్రభుత్వం ఏర్పడుతూనే సినిమాపట్ల ప్రత్యేక శ్రద్ధ చూపబడింది అత్యుత్తమ ప్రజాకళ అన్నసంగతి అక్కడి ప్రభుత్వం గుర్తించి దాని సక్రమాభివృద్ధికి అవసరమైన దోహదం చేసింది ప్రజలకవసరమైన పరిజ్ఞానాన్ని సినిమాచిత్రాలద్వారా అందించటానికి అవసరమైన ఏర్పాట్లు జరిగాయి

మనం వెనక్కు తిరిగి చూసుకుంటే మన ప్రభుత్వం చాలా కాలంపాటు ఈ పరిశ్రమ పట్ల ఎలాటి సవతి తల్లి వైఖరి అవలంబించిందీ తెలుస్తుంది స్వాతంత్ర్యం వచ్చి రెండు దశాబ్దాలు కావొస్తున్నప్పటికీ సినిమాలకు అవసరమైన ముడిఫిలిం గాని, యంత్ర పరికరాలుగాని దేశంలో తయారయే ఏర్పాటు జరగనేలేదు (మనం చిన్నపిల్లల బాక్సు కెమెరాలు తయారుచేయటానికి కూడా విదేశీయుల సాంకేతిక సహాయం కోరే నికృష్ట స్థితిలోనే వున్నాం!) ప్రభుత్వానికి డబ్బుకాపీనం పట్టుకున్నది అందుచేత సినిమా పైన గాడిదబరువున పన్నులు వేశారు సినిమా పరిశ్రమనూ, కళనూ అణగార్చటమే ప్రభుత్వంయొక్క ఆశయమయితే ఇంతకన్నా ఏంచేసి వుంటారని కూడా అనిపిస్తుంది

ప్రభుత్వం సృష్టించిన వాతావరణంలో చిత్రనిర్మాతలు సినిమా ప్రేక్షకుల జేబులు తడవటానికి పడుతున్న పాట్లు ఇంతా అంతా కాదు తెలుగుసినిమాలలో స్త్రీలు తెలుగు బట్టకట్టు పూర్తిగా మానేసి పైజామాలూ, జీన్సూ, మొదలైనవి ధరించే రోజులు వచ్చాయి ప్రేమికులు ఉన్మాదకాముకులై, బూతు పాటలు పాడేస్తున్నారు సినిమా ఇతివృత్తాలలో అవాస్తవ

సమస్యలూ, అర్థంలేని త్యాగాలూ పాపంలాగ పెరిగిపోతున్నాయి

ఇందుకు చిత్రనిర్మాతలను నిందించటం పొరపాటేమోనని నా అనుమానం పరిస్థితుల ప్రోద్బలం ఎంతో లేకపోతే వాళ్ళు సినిమా కళను మరీ ఇంత దారుణ స్థితికి తీసుకురారు పేరు ప్రఖ్యాతులుగల మన కవులుశ్లేషగా బూతు పాటలు రాయరు, మన నటీనటులు తాము నటించిన ప్రణయ ఘట్టాలే చూసి తాము జుగుప్స పొందరు

ఒక మిత్రుడన్నాడు ''ప్రతి చిన్న సమస్యా కమ్యూనిస్టు ప్రభుత్వం వచ్చేదాకా పరిష్కారం కాకుండా ఉండవలసిందేనా ఈదేశంలో?'' అని

సినిమా సమస్య చిన్న సమస్య కాదు ఇది ఇంకా క్లిష్ట సమస్యగా పరిణమించినా ఆశ్చర్యంలేదు తాతాబిర్లాల కన్నింకా ఈ పరిశ్రమపైన పడలేదు అదికూడా జరిగిననాడు విదేశీపెట్టుబడులు ఈ పరిశ్రమలోకి కూడా దిగుమతి అవుతాయి వాళ్ళ కబంధ హస్తంలో మన 'జాతీయ' సినిమాపరిశ్రమ కూడా చిక్కుకు పోతుంది

ఇది ఉత్తుత్త భ్రమకాదు సినిమాగుత్త పెట్టుబడిదార్ల అధీనంలో వున్న బ్రిటనులో నూరింట 85 వంతుల సినిమా పెట్టుబడి అమెరికా వాళ్ళది తస్మాత్ జాగ్రత్త, జాగ్రత్త!

జనశక్తి, ద్వైవారపత్రిక, 3-8-1966

# 92. సెక్సు, పోష్టర్లు, సినిమాలు

ఆకలి విప్లవానికి దారితీస్తుంది సెక్సు ఆకలి సెక్సువిప్లవానికి దారి తీస్తుంది

ఆకలి విప్లవం జగన్నాధుని రథచక్రాలను భూమార్గం పట్టించి, భూకంపం తెప్పిస్తుంది వ్యాపారం స్తంభించిపోతుంది

సెక్సు విప్లవం గోడలనూ, పత్రికలనూ ఖరాబుచేసి ''టీ కప్పులో తుఫాను'' రేపుతుంది వ్యాపారాన్ని పెంపొందిస్తుంది

సెక్సు విప్లవం — వర్ధిల్లాలి!

మహావేదాంతి థర్బర్ చెప్పినట్లు ఒకప్పుడు సెక్సులేదు దాన్ని నవీన నాగరికత కనిపెట్టి, వెంటనే నిషేధించింది (నిషిద్ధవస్తువు మూల్యం పెరిగి పోవటమే గాక, దానికి గిరాకీ కూడా హెచ్చుతుంది ఇది వ్యాపార రహస్యం)

పూర్వం సెక్సు లేదనటానికి పెద్దపెట్టున రీసెర్చి సాగించనవసరం లేదు అజంతా చిత్తరువులు రాసిన బౌద్ధ సన్యాసులూ, ఖజురహో మైథున శిల్పాలు చెక్కిన సాదా సన్యాసులూ తాము ''సెక్సు'' చేస్తున్నామనుకోలేదు

ఆడవాళ్ళ కచకుచ జఘనాదులను వైనవైనాలుగా వర్ణించి, రతిక్రీడలను వాస్తవంగానూ, అవాస్తవంగానూ వివరించి, ప్రబంధాలను రచించి రాజులకు పళ్ళీగ్గా అంకితం ఇచ్చేసి, గండ పెండేరాలూ, ఈనాములూ, బిరుదానములూ పుచ్చుకున్న కవిబ్రహ్మలకు తాము సెక్సులో ఓలలాడామన్న భావమేలేదు ఆ కాలంలో సెక్సు శిశుర్వేత్తి, సమర్వేత్తిగా ఉండేది

ఈనాడు కూడా నవీన నాగరికతకు రెండు మూడు శతాబ్దాలు వెనుకపడి ఉండే కూలిజనం ఊడ్పులప్పుడూ, ఇతరపనులు చేసేటప్పుడూ మనం సెక్సు పాటలనుకునేవి ఆడామగా అంతా

కలసి పాడతారు

నాగరికత అడుగుపెట్టని ఎన్నో ప్రాంతాల వాళ్ళు, మన ఫిలిం సెన్సారు ఆమోదించని దుస్తులు ధరించి తిరుగుతున్నారు వారికి ''సెక్సు'' అర్థమయేటట్టు చెయ్యటమూ, వారికది లేకుండా చెయ్యటమూ దాన్నే ''సివిలైజింగ్'' అంటారు

నాగరికతతోపాటు సర్వస్త్రీలకూ పాతివ్రత్యమూ, సర్వపురుషులకూ ఏక పత్నీవ్రతమూ శాసనబద్ధమయేసరికి సెక్సుకు కొమ్ములొచ్చాయి దాన్ని నిషేధించేసరికి సెక్సు వ్యాపారానికి గొప్పగా దోహదం జరిగింది

సెక్సువ్యాపారం అన్నది శాఖోపశాఖలుగల అంతర్జాతీయవ్యాపారం దాని ముందు తలనొప్పి మాత్రలూ, పెట్రోలూ, కోకాకోలా ఆగవు దానిపైన టన్నులకొద్దీ సాహిత్యమూ, కోట్లకొద్దీ బొమ్మలూ సృష్టిఅయి, ప్రచారం అవుతున్నాయి ఎంతోమంది శాస్త్రవేత్తలూ, అర్ధశాస్త్రవేత్తలూ, అమాంబాపతువాళ్ళూ, చిత్రకారులూ, ఫోటోగ్రాఫర్లూ, ''సెక్సు'' ఫోటోలు తీయించుకునే అమ్మాయిలూ, ప్రెస్సులవాళ్ళు, పత్రికా ఏజంట్లూ, ''సెక్సు'' పుస్తకాలను ( తగినంత డిపాజిట్టు తీసుకుని) కిరాయికిచ్చే కిల్లీ కొట్లవాళ్ళూ ఈ వ్యాపారంమీద బ్రతుకుతున్నారు

( ఇక్కడ ఒక చిన్న హెచ్చరిక అవసరం ''సెక్స్'', ''బూతు'' పర్యాయపదాలుకావు నాగరికత వచ్చి ''సెక్సు'' ను సృష్టించకపూర్వం ప్రజలు యథేచ్ఛగా వాడుకచేసిన లైంగికభాషను ''బూతు'' అంటాం నాగరికయుగంలో వ్యాపారధర్మాల ననుసరించి ప్రచారం అయేదాన్ని ''సెక్సు'' అంటాం మాటవరసకి ప్రొఫెసరు రావు బాటం అనే ఆయన 'మైథునసుఖం' అనే పుస్తకం రాసి రెండు మిలియన్ల కాపీలు అన్నిదేశాలకూ రవాణా చేశాడనుకోండి ఆ పుస్తకాన్ని బూతుపుస్తకం అనగూడదు సెక్సుపుస్తకం అనాలి అద్దాల బీరువాల్లో పుస్తకాలమ్మే గొప్ప షాపుల్లోకి వెళ్ళి ''సెక్సు పుస్తకాలేమైనా ఉన్నాయా?'' అని అడగాలి నరసింహులు కిల్లీకొట్టుకు వెళ్ళి ''బూతుపుస్తకాలేవైనా ఉన్నాయిబ్రా?'' అని అడుగుతాం అదీ తేడా, కనీసం కొందరి విజ్ఞుల అభిప్రాయం అలా ఉంది ''సెక్సు'' అనే మాటకు ''బూతు'' అన్నది తెలుగు తర్జుమా అని కొందరంటున్నారు దాన్ని బట్టి తెలుగుభాష ఇంకా నాగరికం కాలేదని మాత్రమే తేలుతుంది )

మళ్ళీ సెక్సు వ్యాపారానికొద్దాం— దానికెప్పుడైనా రావచ్చు పోవచ్చు, దానికి వర్కింగవర్సు, హాలిడేసూలేవు

సెక్సు పుణ్యమా అంటూ ఇంకా అనేక పరిశ్రమలు బయలుదేరాయి, నైట్‌క్లబ్‌లూ, స్ట్రిప్‌టీజాలూ, రకరకాలడాన్సులూ, బ్లూపిక్చర్లూ, లాడ్జింగ్ హౌసెసూ మొదలైనవి అనేకం భారీ పరిశ్రమలుగా నడుస్తున్నాయి వాటి వెనుక కోటీశ్వరులుంటున్నారు

భారీ పరిశ్రమలన్నాక వాటికి రాజకీయాలతో సంబంధం ఉండకుండా ఉండదు ''సెక్సు'' ప్రభావం రాజకీయాలలో ఎలా ఉండేదీ మనం ఇటీవల పత్రికలలో పడిన వార్తలద్వారా తెలుసుకున్నాం ఆడవాళ్ళ మూలంగా— భార్యల మూలంగా కాదు— ''సెక్సు'' ఆడవాళ్ళ మూలంగా— మంత్రులు తమ కుర్చీలను ఖాళీచేయవలసొచ్చింది

''సెక్సు'' ఆడవాళ్ళ ఖ్యాతి ఏ ఇతరరకాల ఖ్యాతికీ తీసిపోదు మర్లిన్ మన్రో, క్రిస్టిన్

కీలర్ వంటి ''సెక్సు'' స్త్రీలను ప్రపంచం ఆరాధించింది వాళ్ళమీద కవులు గీతాలు రాశారు

సినిమా తారలకుగల పలుకుబడి కూడా ''సెక్సు'' ను కొంతవరకు ఆధారం చేసుకున్నదే పొలిటీషియనులూ, తదితరులు వాళ్ళతో పోటీ చేయలేరు సినిమా తారలతో పోటీచేయలేని పొలిటీషియనులు రెండు రకాలుగా రియాక్టవుతారు ఒకరకం వాళ్ళు సినిమాల మీద కత్తి కడతారు రెండోరకం వారు సినిమా తారల దగ్గర బెత్తెడు చోటు చూసుకుంటారు స్ఫోర్టివుగా

సెక్సు వ్యాపారం ఇంకా అనేక రకాలుగా ఉన్నది రకరకాలుగా చీరెకట్లు, బ్లౌజులు, బాడీలు, వాటి అడుగున అమర్చటానికి అదనపుస్తనాలు (ఫాన్సీస్), రంగురంగుల లిప్‌స్టిక్కులు, పూతలు, లోషన్లు, చర్మసౌందర్యాన్ని పెంచే సబ్బులూ, దేహకశ్మలాలనూ, పనికిమాలిన కేశసంపదను నిర్మూలించే దినుసులు, సెక్సు ఆకర్షణను తగ్గించే విధంగా పెరిగిపోయిన శరీరభాగాలను అదుపులో ఉంచే, నిగ్రహించే సాధనాలూ వగైరా ''సెక్సు వర్ధిల్లాలి!'' అన్న విప్లవానికి దానికీ అంతరాయంగా ఉండే గర్భధారణ వగైరా సాంఘికవ్యతిరేక కార్యకలాపాలకు గొడ్డలిపెట్టులాంటి లూపులు, మాత్రలు ఇలా అసంఖ్యాకమైన వ్యాపారాలు— మహాజోరుగా సాగుతున్నాయి

ఒకప్పుడు సెక్సు ఆడవాళ్ళలోనే ఉంటుందనే అపోహ ఒకటి ఉండేది ఇది చాలా పొరపాటు ఈ అపోహను తొలగించడానికి పత్రికలలో రోజూ ప్రకటనలు వస్తున్నాయి నువ్వు ఫలానా బ్లేడుతో గడ్డం గీక్కున్నావంటే ఒక అందమైన అమ్మాయి నిన్ను వెనక నుంచి వాటేసుకుంటుంది ఫలాని క్షవర లోషనుతో మొహం రుద్దుకున్నావంటే, ఇంకా అందమైన అమ్మాయి నీ మొహానికి తన మొహం చేర్చి ''నామొహంలా ఉంది!'' అంటుంది అంతేకాదు ఫలాని మార్కు సిగరెట్టు కాల్చావంటే ముగ్గురమ్మాయిలు నీదగ్గరికి పరుగెత్తుకుంటూ వస్తారు ఫలాని బట్టల మిల్లు వాళ్ళు తయారు చేసిన ఫలాని గుడ్డతో తయారుచేసిన సూటు వేసుకున్నావంటే—ఏమయేదీ మీకీసరి తెలిసే ఉంటుంది

శరీరంలోని రక్తం పెద్ద నాళాలగుండా చిన్ననాళాలకూ, చిన్ననాళాల గుండా బుల్లినాళాలకూ, వాటి నుంచి కంటికి కూడా కనపడనంతటి సూక్ష్మనాళాలకు పాకినట్టుగా సెక్సు నాగరికత జీవితంలో సర్వాంతర్యామి అయింది

అలాటప్పుడు లక్షలకు లక్షలు ధారపోసి వ్యాపారదృష్టికి ఎక్కడ మసకవస్తుందోనని సాంఘిక ప్రయోజనాలకు కూడా ఇన్ని నీళ్ళువదిలి తయారు చేసే సినిమాలలో సెక్సు ఉండరాదంటే ధర్మమా? అది ఒకంతట సాధ్యమయ్యే పనా?

కాదని తెలిసే, ముందుగా సినిమాలకి సెన్సారు ఏర్పాటు చేశారు ఈ సెన్సారు అన్నది పైకి చూడటానికి సెక్సును నిర్బంధించటానికే నన్నట్లు కనిపిస్తుంది కాని, వ్యాపార సూత్రం ఏమిటి? కంట్రోలులేనిదే ధరా, గిరాకీ పెరగవు

అదే జరిగింది అందమైన అమ్మాయిలనూ, అబ్బాయిలనూ తెచ్చారు వాళ్ళను ఆకాశంలో నిలబెట్టేవారున్నారు చక్కగా మేకప్‌చేయించి, చక్కని దుస్తులు తొడిగి ప్రేక్షకుల సెక్సుమనస్సు— ఇది సెరెబ్రిక్ కార్టెక్స్‌కు కొంచెం దిగువ నెక్కడో వుంటుందని వినికిడి, ఆసెక్సుమనస్సు—వేడెక్కి మతులుపోయేటట్టు చేశారు

ఇంతా చేసి సినిమాలలో సెక్సు ఉండరాదు అంటే అదేమన్న మాట? ఆడా–మగా

తెరమీద కావిలించుకోరాదన్నారు ముద్దులు పనికి రావన్నారు హీరోలు హీరోయిన్లని వెనకనించి కావిలించుకున్నారు మొహానికి మొహం అడ్డుపెట్టుకున్నారు ముద్దు పెట్టుకున్నట్టా లేనట్టా? సెన్సారువాళ్ళకి ఏం చెయ్యాలో తెలియలేదు

సినిమా పాటలలోకి సెక్సుమాటలు— ఒడి, సరి, వెచ్చనికౌగిలి లాటివి విశృంఖలంగా దొర్లసాగాయి శవంలేకుండా డిటెక్టివు నవల రాయటం ఎంత అసాధ్యమో ఈ సంకేత పదజాలం లేకుండా సినిమా ప్రేమ పాటలు రాయడం అంత అసాధ్యమైపోయింది సెన్సారువాళ్ళు మాత్రం ఎన్నింటికని చస్తారు?

డాన్సులు— రతిక్రీడల్లాంటి డాన్సులు, వాటిని కత్తిరించడమా, మానటమా? కత్తిరిస్తే డాన్సు కళకు అన్యాయం! డాన్సులో సెక్సు లేనట్టు

పోనీ అన్నింటా సెక్సు ప్రవేశించింది, సిఫిలిస్ శరీరంలో ప్రతినరానికీ పాకినట్టు అనుకుందాం అటువంటే, అప్పుడు సెన్సారువాళ్ళు బత్తాలు ఒదులుకొని ఇంటికి పోవలసిందే తప్ప మరోమార్గంలేదు

చూస్తుండగానే సెక్సు పోష్టర్లకు ఎగబాకింది ''అసభ్యం'' ''జుగుప్సాకరం'' అనికేకలు వేస్తున్నారు సెక్సు పోస్టర్లను నిషేధించేటందుకు బ్రహ్మాండమైన మహాయజ్ఞం జరగబోతున్నది

కాని ఏ నిషేధమూ ఆగదని అందరికీ తెలుసు ఏది అసభ్యమైన పోస్టరు? నిలువుగా అంటిస్తే సభ్యమనిపించే పోస్టరును అడ్డంగా అంటించే సరికి అందులోకి ఒకటున్న సెక్సు దిగుమతి అవుతుంది దాన్ని మరోవైపు అడ్డంగా అంటిస్తే, దాన్ని చూడటానికి గుమికూడిన వాళ్ళు ఇళ్ళకు పోరు బ్రహ్మాండమైన రాజకీయమీటింగుకు వచ్చినంతమంది జనం పోగవుతారు పోలీసులవల్ల కాకపోతే మిలటరీని పిలిచి కాల్పులు జరిపించి, చచ్చిన వాళ్ళను శవపరీక్షకూ, చావని వాళ్ళను ఇళ్ళకు పంపవలసివస్తుంది

పోస్టర్లంటించే కుర్రాళ్ళ దగ్గిరనుంచీ ''సెక్సువర్ధిల్లాలి!'' అనే నినాదం చేపట్టాక ఎవరిని నిగ్రహించేటట్టు?

తిండీ, తిప్పలూ, చదువూ, చట్టుబండలూ, కొంపాగోడూ, ధర్మమూ, దాక్షిణ్యమూ కంచు కాగడాలతో వెతికినా కనబడని ఈ విషాదభారతంలోకి నాగరికత యొక్క తోక జారబడి సెక్సు వచ్చేసింది మనం బూతుయుగంలోనే ఉండిపోయి, ఈ సెక్సు యుగంలోకి అడుగుపెట్టకుండా ఉన్నట్టయితే ఏ బెడదా ఉండేదికాదు

కాని వ్యాపారదక్షత గలవారు అధికారంలోకి వచ్చి సెక్సును నిగ్రహించటానికి ప్రయత్నంచేసి, దానికి గిరాకీ పెంచి, సెక్సువ్యాపారానికి ఎక్కడలేని శక్తీ సమకూర్చారు (వీళ్ళే ఇంతకు ముందు మద్యపాననిషేధం పెట్టి ఏనాడూ తాగని వాళ్ళందర్నీ తాగుబోతుల్ని చేసి, తాగుడువ్యాపారం లాభసాటి అయేట్టు చేశారు ఇంకేం? తాగుడు వెనక సెక్సూ వచ్చింది వస్తుందని పెద్దలేనాడో చెప్పారు )

ఈ దిక్కుమాలిన సెక్సును యధేచ్ఛగా వదిలి ఉంటే ఇంత గందరగోళం ఏర్పడకపోను ''అసభ్యం'', ''అశ్లీలం'' అనే మాటలకుఅర్థం ప్రతివాడికీ తెలుసు వాటిమీద ఆంక్షలుపెట్టకపోతే వాటికి గ్లామర్ వుండకపోను మైధునం లాంటి డాన్సులుగల పిక్చరును ప్రజలే బహిష్కరించి ఉండేవాళ్ళు ఒక ''ఒడిలోవడి'' ఫొటో, ఒక అసభ్యమైన నృత్యమేదో

సెన్సారు కత్తెరను తప్పించుకున్నదంటే దానికోసం ఎగబడుతున్నారు జనం!

ఏమైనా సెక్సుపైన నిషేధాలు మరింత జాస్తి అవుతాయి ''సెక్సు వర్ధిల్లాలి!'' అన్న నినాదం జయిస్తుంది శతకోటి సెక్సువ్యాపారులకు మహోజ్జ్వలమైన భవిష్యత్తు ఉన్నట్లే కనబడుతున్నది

*జయశ్రీ, మాసపత్రిక, జనవరి 1967*

# 93. వ్యాపారమా? కళా?

కొంతకాలం క్రితం ఈ ప్రశ్నమీద సినిమాలను గురించి కొంత చర్చరేగింది వ్యాపారం అవలీలగా గెలిచింది కళ ఓడిపోయింది

''నీ కళ ఎవడిక్కావాలి? ఇది లక్షలతో కూడుకున్న వ్యాపారం కళపోయినా ఫర్వాలేదు పెట్టుబడిపోయి, అసలుకే మోసం వచ్చిందో, పరిశ్రమే ఉండదు,'' అన్నారు ప్రొడ్యూసర్లు

''అదీ నిజమే మరి,'' అన్నారు ఫిల్మ్‌జర్నలిస్టులు

ఆ ప్రశ్న ఆ విధంగా అంతరించి పోయింది

కాని, నిజానికి ఆ ప్రశ్నకు అవాకాశం ఉన్నదా? లేదనుకుంటాను కొంచెం ఆలోచిస్తే అది అర్థంలేని ప్రశ్న

సినిమా వ్యాపారమే— కాని, కళా వ్యాపారం సినిమా చిత్రాలంటే పత్తికాదు, మిరపకాయలు కావు, రాళ్ళు కలిపిన బియ్యమూ కాదు కళా వస్తువులు ప్రేక్షకులలో రకరకాల భావాలు రేకెత్తించి, వాళ్ళ బుర్రలను మథించి, వారికొక విశిష్టమైన అనుభూతిని, ఆనందాన్ని ఇవ్వటానికిగాను, శిల్ప సౌష్ఠవంతో తయారు చేసినవి

ప్రతి సినిమా చిత్రంలోనూ కళా కృషి ఉన్నది మన నటులు గాని, గాయకులు గాని, రచయితలు గాని, సాంకేతిక ప్రవీణులుగాని, ''మీరు కళాకారులు కారు, వ్యాపార వస్తువుల ముడిసరుకు!'' అంటే ఒప్పుకోరు

సినిమా చిత్రంలో ఉండే ప్రతి సంభాషణా, అభినయమూ, ప్రతి చిన్న కామెరా కదలికా, ప్రతి లైట్ స్పాటూ, సెట్టుమీద ప్రతి చిన్న మోల్డింగూ, బాక్‌గ్రౌండు పెయింటింగులోని ప్రతి వివరమూ— ఒక కృత్రిమ సన్నివేశాన్ని వాస్తవ దృశ్యంలాగా కనబరచటానికీ, ప్రేక్షకుణ్ణి అందులో లీనం చెయ్యటానికీ ఉద్దేశించబడ్డవే

సినిమా చిత్రంలో హాస్యం వచ్చినప్పుడు ప్రేక్షకులు నవ్వకపోయినా, విషాద సన్నివేశాలప్పుడు ప్రేక్షకుడి కంఠనాళాలు ముడుచుకుపోయి, కంటిలో అశ్రువులు తొణకకపోయినా, చిత్రంలో ఏ రసమూ ప్రేక్షకుడిలో ఆ రసానుభూతిని కలిగించకపోయినా చిత్రంలోని కళ దెబ్బతింటూనే ఉన్నది— వ్యాపారం కూడా దెబ్బతింటూనే ఉన్నది

''మేం చేసేది వ్యాపారం'' అనేవాళ్ళు, షాట్‌లో ఒక్క చిన్న పొరపాటు జరిగితే ఎందుకు రీటేక్ చేస్తున్నారు? చిన్న పాత్రలకు కూడా పెద్ద నటులనే ఎందుకు ఎన్నుకుంటున్నారూ? ఓ వెయ్యి షాట్లుగల కథను సంవత్సరంపాటు ఎందుకు తీర్చిదిద్దుతున్నారు?

నిజం తెలుసుకున్నట్టయితే ప్రతి ప్రొడ్యూసరూ, డైరెక్టరూ తమ చిత్రాలను కళా వస్తువులుగా తయారు చెయ్యటానికే ప్రయత్నిస్తున్నారు అయితే ఆ మాట పైకి అనే ధైర్యం

వాళ్ళకు లేదు కళ అన్నాక పదిమందీ విమర్శిస్తారు కళ సామాజికమైనది వ్యాపారమూ, అందులో వచ్చే లాభ నష్టాలూ వ్యక్తిగతమైనవి చిత్రం విడుదలైన మర్నాడే డబ్బాలు తిరిగివస్తే అది ప్రొడ్యూసరునే బాధిస్తుంది గాని ఇతరులను బాధించనవసరం లేదు

''సినిమా కళ కాదు, వ్యాపారం'' అనటంలో ఉండే చిక్కులు మన ప్రొడ్యూసర్లు అర్థం చేసుకోవటం లేదు తమ చిత్రాలలో కళలేదని వాళ్ళే ఒప్పేసుకుంటున్నారు వారిలో హెచ్చుమందికి వ్యాపారం చేతగాదని బాక్సాఫీసు రుజావు చేస్తున్నది— విడుదలైన చిత్రాలలో కొద్ది భాగమే వ్యాపార విజయాన్ని సాధిస్తున్నాయి గనక! ఇదేమైనా ఘనంగా ఉన్నదా?

వెనక శ్రీ యస్ యస్ వాసన్ (బహుశా చిత్ర నిర్మాత లందరికీ ప్రాతినిధ్యం వహించి కాబోలు మాట్లాడుతూ) ''చిత్రాల ద్వారా ప్రేక్షకులకు బోధన చేసే శక్తి మాకు లేదు, వారికి వినోదం అందిచగల శక్తి మాత్రమే మాకున్నది'' అన్నారు ఏమయింది? డబ్బు రాని అసంఖ్యాకమైన చిత్రాలను నిర్మించినవారు, తమకు వినోదం ఇచ్చే శక్తి కూడా లేదని రుజావు చేసుకున్నారు

నన్నడిగితే, ''మేం చేసేది కళాసృష్టికాదు, వ్యాపారం మాకు బోధించే శక్తిలేదు, వినోదం ఇచ్చే శక్తి మాత్రమే ఉన్నది'' ఇలాటి మాటలన్నీ వట్టి పోజులు

సినిమాచిత్రం నూటికి నూరుపాళ్ళూ కళావస్తువు మామూలు వ్యాపార సరుకులకూ దానికి ఎలాటి పోలికా లేదు ఏ వ్యాపార వస్తువుకైనా భౌతిక వినియోగం ఉంటుంది, కళలకు ఉండదు మానసికానందమే వాటి పరమావధి ఒక అరకిలో సినిమాను ఎవడూ ఇంటికి పట్టుకుపోయి, బిస్కట్లు తిన్నట్టు తినడు అవి పెన్సిళ్ళు చెక్కు కోవటానికి గాని, పేపర్‌వేట్‌లుగా గాని పనికిరావు సంగీతం విన్నట్లుగా, సినిమా చూస్తాం, ఆనందిస్తాం— లేక ఏడుస్తాం తీరిపోతుంది

ఒకటి ఒప్పుకుంటాను ఈనాడు మన ప్రొడ్యూసర్లలో చాలమంది తాము కళాస్రష్టలమని చెప్పుకోలేని స్థితిలో ఉన్నమాట నిజం కొంత డబ్బు తెచ్చి నటులనూ, టెక్నీషియనులనూ, సాంకేతిక ప్రవీణులనూ బుక్ చేసి, డిస్ట్రిబ్యూటరును కుదుర్చుకున్న ప్రతివాడు— మాజీ లైట్‌బోయ్ అయినా సరే— ప్రొడ్యూసరు కాగల స్థితిలో ఉంటాడు కాని ప్రొడ్యూసరు కళాకారుడు కానంత మాత్రంచేత నటులూ, మ్యూజిక్ డైరక్టరూ, రచయితా, కామెరామాన్, డాన్స్ డైరెక్టరూ, ఎడిటరూ షాప్ అసిస్టెంట్లు అయిపోనవసరంలేదే వాళ్ళు కళాకారులుగానే ఉండిపోవచ్చునే!

కళ అంటే సినిమా పారిశ్రామికులకు బెదురు పుట్టటానికి కొంత కారణం లేకపోలేదు కళా విమర్శకుల హోదాలో ప్రొడ్యూసర్లను అటకాయించే వాళ్ళు అసంఖ్యాక ప్రేక్షక ప్రజలకు ఏ విధంగానూ ప్రతినిధులు కారు— మధ్యతరగతి సారస్వత ప్రియులు, టికెట్టు కొనకుండా ట్రేడ్ షోలకు ఆహ్వానాలను అష్టకష్టాలు పడి రాబట్టేవాళ్ళు, 'మేమెంత తెలివిగలవాళ్ళమో చూడండి' అన్నట్టుగా, 'ఈ చిత్రం మీద ఇదే లాస్ట్ వర్డ్! నాతో ఏకీభవించనివాడు శుంఠ' అన్న ధోరణిలో చిత్ర విమర్శలు రాసే జర్నలిస్టులు వీళ్ళకు నచ్చే 'కళాఖండాలు' తీస్తే తాము మట్టికొట్టుకుపోతామన్న భయం ప్రొడ్యూసర్లకు ఉంటే, అది కొంతవరకైనా సమర్థనీయమే కావచ్చు

ఇటువంటి విమర్శకులే సత్యజిత్‌రాయ్ చిత్రాలను ఆకాశానికెత్తుతున్నారు, సామాన్య ప్రేక్షకులను చూడబోతే, ఎదురు డబ్బిచ్చినా ఆ చిత్రాలను చూసేటట్టు లేరు

సత్యజిత్‌రాయ్ కళాకారుడు కాడనిగాని, అతని చిత్రాలు కళాఖండాలు కావనిగాని, వాటిని మెచ్చుకునే వాళ్ళకు కళ అంటే ఏమిటో తెలియదనిగాని నేననటం లేదు (నాకు సత్యజిత్ రాయ్ చిత్రాలంటే తగని యిష్టం!)

అసలు ప్రశ్న, ''సినిమా కళ ఔనా, కాదా?'' అని కాదు గనక, అన్ని కళలలోలాగే సినిమా దగ్గిర కూడా, ''ఈ కళ ఎవరి కోసం ?'' అన్న ప్రశ్న వేసుకోవాలి ''నో యువర్ పేట్రన్'' అని వర్జీనియావుల్ఫ్ రచయితలకు సలహా ఇచ్చింది వేరు వేరు తరగతులూ, జీవిత దృక్పథాలూ, అనుభవాలూ, ఆశయాలూ, అభిరుచులూ గల సమాజంలో ఒకరి కళ ఒకరికి కాదు. నా చిన్నతనంలో 'అలగా' జనం అనిపించుకునే అసంఖ్యాకులకు వీధినాటకాలకన్న తోలుబొమ్మలాటలు హెచ్చుగా నచ్చేవి కూచిపూడి వారి ప్రదర్శనలకు మధ్య తరగతివాళ్ళు హెచ్చుగా వచ్చేవారు, వాళ్ళు తోలుబొమ్మలాటల దగ్గిర కనబడేవారు కారు

వేరువేరు తరగతులకు చెందిన కళల ఇతవృత్తాలలోనూ, వాటిని ప్రదర్శించే విధానాలలోనూ కూడా వ్యత్యాసాలుండేవి కూచిపూడి వారి హిరణ్యకశిపుడూ, రాఘవాచారిగారి హిరణ్య కశిపుడూ వేరేవేరు చిత్రణలుగల ఒకే పాత్ర తోలుబొమ్మలాటలో ఆంజనేయుడికీ, నా చిన్నతనంలోనే స్టేజి మీద నటించిన సి ఎస్ నటేశన్ ఆంజనేయుడికి తేడా ఉండేది

సినిమాచిత్రాలు అత్యంత విశాలమైన ప్రేక్షక వర్గానికిగాను ఉద్దేశింపబడినవి ఒకే ప్రదర్శనాన్ని ఎన్ని సంవత్సరాలపాటయినా, ఎన్ని కోట్లమంది అయినా చూడటానికి తగిన సాంకేతిక ప్రక్రియలు చిత్రనిర్మాణంలో ఉన్నాయి సవాలక్ష అమెరికా, రష్యాలలాంటి దేశాలలో సైతం, అక్కడి జనాభాకు రెట్టింపుమంది ప్రతి వారమూ సినిమా చిత్రాలు-చూస్తారట సినిమాలు తప్ప మరే వినోదమూ లేని మన ప్రేక్షకులు, తగిన పరిస్థితులే ఉంటే, అలా ఎందుకు చూడగూడదు?

మాటవరసకు, మన ఆంధ్రలో ఉండే నాలుగుకోట్ల చిల్లర మందీ సగటున వారానికో సినిమా ప్రదర్శనం చూస్తారనుకుందాం అలా అనుకోవటం తేలిక కాదు దానితోబాటు అందరికీ అందుబాటులో సినిమా థియేటర్లు (సి పుల్లయ్యగారి కలలు నిజమై) ఏర్పడ్డాయనుకోవాలి ఈ అనుకోవటాలన్నీ నిజంగా జరిగిననాడు సినిమా వ్యాపారం మూడు పువ్వులూ ఆరుకాయలుగా ఉండదా? ఈనాడు మనం హిట్ పిక్చర్లనుకునేవి నిజంగా హిట్ పిక్చర్లా? ఎంత మాత్రమూ కావు గొప్ప వ్యాపారదక్షులమనే మన నిర్మాతలు నిజమైన హిట్ పిక్చర్లు తియ్యటం లేదు, తీసేటందుకు తగిన పరిస్థితులూ లేవు మొదట, దేశంలో థియేటర్లే లేవు

ఇప్పుడు థియేటర్ల సమస్య— కాని తెలుగు సినిమాలు ఆరంభమైన నాడు స్టూడియోల సమస్య చిత్ర నిర్మాణానికి అవసరమైన స్టూడియోలు కలకత్తా, బొంబాయి, కొల్హాపూరులలో మాత్రమే ఉండేవి నటులూ, కవులూ, సహాయకులూ తప్ప మిగిలినవారంతా ఆంధ్రేతరులు ఏమి ఇతివృత్తాలు తియ్యాలన్న సమస్య ఇట్టే విడిపోయింది పౌరాణిక చిత్రాలే తీశారు పౌరాణిక

కథలూ, వాటికి చెందిన పాత్రలూ, సన్నివేశాలూ యావద్భారత స్థాయికి చెందినవి ఏ భారతీయుడైనా పౌరాణిక చిత్రాన్ని డైరెక్టుచెయ్యవచ్చు, ఏ భారతీయ కళాకారుడైనా ఆహార్యమూ, అలంకరణలూ సమకూర్చవచ్చు ఆరోజుల్లో పౌరాణిక చిత్రాలు తీయటం చాలా తెలివైనపని ఈ నాటి చిత్రనిర్మాణం సాంకేతికంగా ఎన్నో రెట్లు పెరిగింది, చిత్రాలకు ప్రజాదరణ ఎంతగానో ఏర్పడి ఉన్నది, ఎన్నో కొత్త కొత్త ధియేటర్లు వెలిశాయి— కాని ఆ తొలి కాలపు నిర్మాతలు చిత్ర నిర్మాణం విషయంలో చూపిన వివేకం ఈనాటి నిర్మాతలు చూపుతున్నారా అన్నది అనుమానాస్పదంగా కనబడుతున్నది ఈనాటి నిర్మాతలు చచ్చు బాక్సాఫీసు సిద్ధాంతాలను పట్టుకునే వేళ్ళాడుతూ, వాస్తవిక దృష్టిపోగొట్టుకుని, తాము చేస్తున్నామనుకునే వ్యాపారమైనా ఎవరితో చేస్తున్నారో, ఏ పద్ధతుల మీద చేస్తున్నారో, తెలుసుకోలేకుండా ఉన్నారేమోననిపిస్తుంది (ఏ పిక్చరుకు విపరీతంగా లాభాలు వస్తాయో, ఏది దేశంమీదికి వెళ్ళిన మర్నాడే బబ్బుంటుందో ఎవరూ చెప్పలేరని చాలామంది నిర్మాతలు ఒప్పుకుంటున్నారు అటువంటి లాటరీని వ్యాపారం అనటం భావ్యమా అని నా సందేహం )

సినిమా నిజంగా లాటరీ అయినట్టయితే, అది కళా, వ్యాపారమా అన్న విషయం చర్చించటం శుద్ధ దండగ దాన్ని లాటరీగా తయారుచేస్తున్నవాళ్ళు కళాదృష్టీ, వ్యాపారదృష్టీ కూడా లేని నిర్మాతలు మాత్రమే లాటరీలో జయాపజయాలు దైవాధీనం గనకనూ, చిత్ర నిర్మాతలమని చెప్పుకుంటూ జూదమాడేవాళ్ళు చిత్రపరిశ్రమలో ఉండదగరు గనకనూ జూదం గురించి చర్చించ నవసరం లేదు

కళా వ్యాపారాలను గురించి అనదగినవీ, వినదగినవీ ఉంటాయి సినిమా కళకూ, సినిమా వ్యాపారానికి అవినాభావ సంబంధమున్నదని వేరే చెప్పనవసరం లేదు ఉత్తర ధృవప్రాంతంలో ఏర్‌కూలింగ్ యంత్రాలు అమ్ముడుపోవు, సహారా ఎడారిలో సెంట్రల్ హీటింగ్ ప్రసక్తి ఉండదు

వస్తుతః సినిమా చిత్రం—25 వేలలో మంచి చిత్రం తీసిన రోజులలో కూడా— ఖరీదైన వస్తువు అందుచేత అది సాధ్యమైనంత అధిక సంఖ్యగల ప్రేక్షకుల కళాభిరుచికి అనుకూలంగా ఉండాలి సినిమా ఇతివృత్తమూ, దాని చిత్రీకరణా కూడా ఇందుకు అనుగుణంగానే ఉండాలి

ఇతివృత్తాలను తీసుకున్నట్టయితే అత్యధిక సంఖ్యాకులైన ప్రజలకు సమదూరంలో ఉండేవి ప్రాచీన గాధలు—పౌరాణికాలూ, జానపదాలూ, చారిత్రకాలూనూ వీటిపట్ల వివిధ తరగతుల వారికి వేరువేరు దృక్పథాలుండే అవకాశాలు తక్కువ— ఉండనే ఉండవనటానికి లేకపోయినా

పైన చెప్పిన మూడురకాల కథలలోనూ జనాకర్షణ విషయంలో కొన్ని తేడాలున్నాయి పౌరాణికాలలో కథ కొట్టిన పిండి ఉన్న కథకు చిలవలూ, పలవలూ చేర్చవచ్చునేమోగాని, ఉన్న కథను మార్చితే జనం అదోలాగా భావిస్తారు పౌరాణిక కథల విషయంలో కూడా కొన్ని పట్టింపులున్నాయి పౌరాణిక సినిమాలకు ముందు పౌరాణిక నాటకాలుంటూ వచ్చాయి అవి ప్రజల అభిరుచులను కొత్త మూసల్లో పోశాయి హరిశ్చంద్రుడి కథే తీసుకోండి కొన్ని దశాబ్దాలమీదట తెలుగువాళ్ళకు బలిజేపల్లివారి సత్యహరిశ్చంద్రీయ నాటకమే (పద్యాలతోసహా) ప్రామాణికమైన హరిశ్చంద్రుడి కథ అయింది ప్రేక్షకుల అభిరుచులను తీర్చిదిద్దటానికి మన పాతనాటకాలకుండిన అవకాశం నేటి సినిమాలకు లేదు ఈ సినిమా చిత్రాలు కొన్ని కీటకాలలాగ

పుబ్బలో పుట్టి మఖలో మాడిపోతాయి  కె వి రెడ్డిగారి హరిశ్చంద్ర సినిమా చూసి చాలా గొప్ప చిత్రమని నేననుకున్నాను  దానిని చూసిన ప్రేక్షకులు హరిశ్చంద్రుడి కథ అని పోల్చుకోలేక పోయారేమోనన్నట్టు ప్రవర్తించారు  శ్రీ కృష్ణతులాభారమైనా అంతే  ముత్తరాజువారి పద్యాలూ, డయలాగులూ ఉంటేనే అది శ్రీ కృష్ణతులాభారం

ఇదే పౌరాణిక చిత్రాలతో వచ్చిన పెద్ద చిక్కు  అదీగాక, పౌరాణిక కథల సంఖ్య చాలా పరిమితం

చారిత్రక చిత్రాలతో మరొక చిక్కు  చరిత్ర అనేది సినిమా కథలకు వీలుగా జరగలేదు దాన్ని సినిమాలకు అనుకూలంగా మలుచుకోవాలి  జన సామాన్యానికి చరిత్ర తెలీదు, పట్టదు కూడానూ  చారిత్రక వాస్తవికత అంటూ ఒకటి ఉండి, విమర్శకు దారితీస్తుంది  పోతనా, వేమనా, త్యాగరాజూ, రామదాసూ మొదలైన వాళ్ళ కథలు చిత్రాలుగా తీసినా ప్రజలు వాటిని కాల్పనిక కథలలాగే చూస్తారు

ఈ ఇబ్బందులు అంతగా లేని కథలు జానపద కథలు, ఈ కథలు అత్యధిక సంఖ్యాకులకు సమదూరంలో ఉండి, తృప్తి కలిగించే అవకాశాలతో కూడుకుని ఉంటాయి  కాలాన్నీ, దేశాన్నీ, జాతినీ అధిగమించి పోవటానికి అవకాశం ఉండేది ఈ కథల్లోనే

బంగారపు గుడ్లు పెట్టే ఇటువంటి చిత్రాలను తియ్యటంలో కూడా మనవాళ్ళు అప్రతిభ ప్రదర్శించిన సందర్భాలున్నాయి  ఎంత జానపదమైనా, సిపాయిలకు గ్రీకు శిరస్త్రాణాలూ, హీరోకు స్పానిష్ దుస్తులూ ఎంతగా వేసినా, మానవస్వభావాన్నీ, సర్వమానవ సాధారణమైన విలువలనూ ఉపలక్షించటానికి లేదు  కథ ఏ దేశానికీ, ఏ కాలానికి చెందినా, చూసేవాడు ఈ కాలం వాడు  వీడికి అందులో బలమైన కళా ప్రయోజనం సిద్ధించాలి  అది లేనప్పుడు జానపదాలు కూడా దెబ్బతింటాయి

జానపదాలలో హీనజాతి కిందికి వస్తాయి స్టంటు చిత్రాలూ, హత్య చిత్రాలూ మొదలైనవి ఇవి సర్కసు కన్న ఒక్క మెట్టుపైగా ఉంటాయి  గనక వీటి తాలూకు కళాప్రయోజనాన్ని గురించి చర్చించటం అనవసరం

చిత్ర నిర్మాతలకు ఎంత శిరోభారం కలిగించినా కళకు ప్రయోజనం ఉండాలన్న సంగతి జ్ఞాపకం చేసి తీరాలి  ప్రయోజన రహితమైనది కళేకాదు  ప్రయోజనమన్నది ఎట్లా ఉంటుంది అన్న ప్రశ్న వేరు  దాన్ని పొడి అక్షరాలలో చెప్పటం తేలికకాదు  ఒక సినిమా ప్రేక్షకుడు సినిమా చూసి, రకరకాల ఉద్రేకాలకు గురి అయాక, ఆ అనుభవం తనకు ఏదో ఒక విధమైన మంచి చేసిందనిపించాలి  అనుభవాన్ని నెమరువేసుకుంటే మళ్ళీ మళ్ళీ తృప్తి కలగాలి  అంతేకాదు, ఆ అనుభవం అంటువ్యాధి లాగా పట్టుకోవాలి  (టాల్‌స్టాయ్ అన్నట్టు) కళానుభూతివల్ల ఆనందాశ్రువులే వచ్చినా, విషాదాశ్రువులే వచ్చినా వాటితోబాటు కొంత ''మాలిన్యం'' వదిలిపోయి, మనస్సుకు హాయి కలగాలి

అది అసంఖ్యాకులైన ప్రేక్షకులకు కలిగించటమన్నది సామాన్యమైన శక్తికాదు  కొద్దిమంది చదివే పద్యాలూ, కథలూ రాయటంకన్న కూడా సినిమా తీయటం చాలా హెచ్చు కళ అని నేను చాలా కాలంగా చెబుతున్నాను  కాని ఆ విషయం ఎవరూ సీరియస్‌గా తీసుకోరు  ఒక పాత్ర ఒక సందర్భంలో ఒకే ఒక మాట అంటే హాల్లో ఉండే ప్రేక్షకులందరూ హర్షధ్వానాలు చెయ్యటం

నేను కొన్ని సార్లు చూశాను అలా రాయగలవాళ్ళు సినిమాలకు కావాలి సినిమా చిత్ర నిర్మాణం అడుగడుగునా ఆ లెవెల్‌లో సాగాలి అప్పుడే సినిమా గొప్ప ప్రజాకళా, గొప్ప వ్యాపారమూ అయే అవకాశం ఉన్నది అంతే కాని సినిమాతారల సర్కసులాటి చిత్రాలుతీసి, లక్షలాది జనాన్ని మెప్పించి, అందులో కళ గాని, ప్రేక్షకుడికి కళానుభూతిగాని కలగకుండా భారీ వ్యాపారం చేస్తామని నిర్మాతలు కలలుకంటే అవి పగటి కలలే

చిత్రనిర్మాతల సిద్ధాంతాలూ, ఈక్వేషన్లూ, అలవాట్లూ సాంఘిక చిత్రాల దగ్గర మరింత దెబ్బతింటున్నట్టు కనబడతాయి ఎందుకంటే సాంఘిక కథలలో అవాస్తవికత మితిమీరితే రసభంగం కలుగుతుంది పైపెచ్చు అవాస్తవికత, సెట్టింగులలోనూ, మేకప్‌లోనూ, దుస్తుల్లోనూ, సంభాషణల్లోనూ, సన్నివేశాలలోనూ ప్రతి ఒక్కదానిలోనూ దొరికిపోతుంది

అందుకు తగ్గట్టే మనవాళ్ళు పరకాయ ప్రవేశం చేసిన హిందీ, బెంగాలీ, మరాటీ, హాలీవుడ్, జపాను, ఇటలీ వగైరాల కథలూ, సన్నివేశాలూ, దుస్తులూ దగ్గరనుంచీ వాడుక చేస్తున్నారు

కొందరు అమాయకులు, ''తెలుగులో కథలు లేవా? కథలు రాసే వాళ్ళు లేరా? ఈ ఎంగిలి కూడెందుకు?'' అని అడుగుతున్నారు నిజానికి తెలుగు కథలలో సినిమాకు పనికి వచ్చే కథలలో రాయగల వాళ్ళు— అంటే సొంతాన రాయగల వాళ్ళూ, తెలుగు జీవితం గురించి రాయగల వాళ్ళూ— లేరనే చెప్పాలి ఉన్న కథలూ, నవలలూ చూసినట్టయితే, తగినన్ని లక్షలమందిని ఆకర్షించగలవి లేవు మన సాహిత్యంలో లక్షలాదిమందిని ఆకర్షించగల కథలూ నవలలూ వచ్చినప్పుడు నిర్మాతలు తప్పక వాటిని చిత్రాలుగా తీస్తారని ఆశించవచ్చు.

ఉన్న పరిస్థితిని గురించి ఒక్కముక్కలో చెప్పాలంటే—

చిత్రనిర్మాతలు చేసేది వ్యాపారమే, వారి వ్యాపారాన్ని పడగొట్టే ఆదర్శాలు బోధించే అధికారం ఎవరికీ లేదు

సినిమా చిత్రాలు విధిగా కళాఖండాలు, వాటిని కేవలమూ వ్యాపారవస్తువులకింద కట్టేసి, తమకు కళతో ఏమీ సంబంధం లేదనే హక్కు చిత్ర నిర్మాతలకు కూడా లేదు , ఒకవేళ ఉన్నా, దాన్ని అమలుచేసిన నిర్మాతలు దెబ్బతింటారు, తింటున్నారు

సినిమా పరిశ్రమలో వ్యాపారాన్నీ కళనూ సమన్వయించవలసిన అవసరం ఉన్నది అది తేలికగా అందరూ సాధించలేరు మనం ఆ సంగతి ప్రత్యక్షంగా చూస్తూనే ఉన్నాం

*విజయచిత్ర, మాసపత్రిక, దీపావళి ప్రత్యేక సంచిక, నవంబరు, 1967*

# 94. సినిమాకళ–క్షీణదశ

ఆధునిక ప్రపంచంలో సినిమా కళ స్థానాన్ని మరేదీ ఆక్రమించలేదు ప్రజలకు అంత సన్నిహితమైన కళా మరొకటి వుండదు సాంకేతికంగా అంత అభివృద్ధి అయిన శిల్పంకూడా మరొకటి లేదు సినిమా ద్వారా మనకు చూడసాధ్యం కానిది దాదాపు ఏదీ లేదని చెప్పవచ్చు ఎలక్ట్రాన్ మైక్రో స్కోపులో కనిపించే వైరస్‌లనూ, బ్రహ్మాండ మైన టెలిస్కోపులకు మాత్రమే చూడ సాధ్యమయ్యే ఖగోళ దృశ్యాలనూ, సముద్రం అడుగున ఉండే జీవులనూ, స్పూత్నిక్‌ల నుంచి కనిపించే భూమినీ కూడా మనం సినిమాలో చూడవచ్చు

సినిమా చిత్రాలు త్రాసు పళ్లాలలాగా ఇలా కిందా, మీదా కావటానికి ప్రధాన కారణం పూర్తిగా పారిశ్రామిక కారణాలతో కూడుకున్నది ఒక రకం చిత్రం బాగా జనాదరణ పొందిందనగానే ప్రొడ్యూసర్లందరూ అటువంటి చిత్రాలే తీయటానికి ఎగబడతారు పడవలో వాళ్ళంతా ఒక పక్కకు వస్తే ఏమవుతుందో అదే అవుతుంది పడవ మునిగినంతపని అవుతుంది

ఈ లోపల మరొకరకం చిత్రం విజయం సాధించుకుంటుంది ప్రొడ్యూసర్లు దాన్ని అనుసరిస్తారు అటువంటి చిత్రాలు కొన్ని చూశాక ప్రేక్షకుడికి మొహం మొత్తిపోతుంది మళ్లీ సినిమాలకు చెడ్డ రోజులు వస్తాయి

సినిమా తాలుకు కళారంగం నుంచి ఎన్నడూ ఒక సూత్రం పుట్టిన పాపాన పోలేదు పుట్టిన సూత్రాలన్నీ వ్యాపార రంగం నుంచి పుట్టినవే

ప్రజాభిమానాన్ని చూరగొన్న తారలుంటేే తప్ప చిత్రానికి డబ్బురాదు

కనీసం మూడు గంటలైనా ఆడే చిత్రమైతే తప్ప డబ్బురాదు (పొట్టి చిత్రాలు దెబ్బతింటాయి)

మిగతా విషయాలేమైనా మంచి సంగీతం ఉంటే చిత్రం దెబ్బతినదు

'యాంటీ' హీరో ఉన్న చిత్రాలకు డబ్బు బాగా వస్తుంది

డాన్సులూ, సెక్సూ, వక్షోజాల ఊపులు ఉంటే కనక వర్షం కురుస్తుంది

ఇలాంటి సూత్రాలు సినిమా పరిశ్రమ నుంచి అసంఖ్యాకంగా వెలువడ్డాయి అయితే ఇందులో ప్రతి ఒక్కటీ ఫెలయిందని మనం రుజువు చేయవచ్చు

అదే విధంగా ఈ సూత్రాలను ధిక్కరించి డబ్బు చేసుకొన్న చిత్రాలు కూడా ఉన్నాయి

చిట్ట చివరకు సినిమా వ్యాపారరంగంలో అందరికీ ఆమోదకరంగా ఉంటున్న సూత్రం ఏమిటంటే అదృష్టం ఉంటే ఏ చిత్రానికైనా డబ్బు వస్తుందన్నది

మిగిలిన సూత్రాలన్నీ ఎంత నిజమో ఇదీ అంతే నిజం

సినిమాల భవిష్యత్ పూర్తిగా కళారంగంలోనే ఉన్నదనుకోవడానికి చాలా ఆధారాలు ఉన్నాయి

ముఖ్యమైన ప్రత్యక్ష విషయాలు కొన్ని తీసుకుందాం

ఏటా తెలుగులో 60,70 చిత్రాలు వెలువడుతున్నాయి ఇవన్నీ శిల్పరీత్యానూ, కళారీత్యాను, వ్యాపార రీత్యానూ అత్యుత్తమ చిత్రాలేనని ఒప్పుకున్నప్పటికీ, ఇన్ని చిత్రాలనూ తెలుగుదేశం పోషిస్తుందా? (మనకు దేశాంతరాల మార్కెటు చాలాకొద్ది) అసంభవం వారానికి ఒకటిన్నర చిత్రం చూసేవాళ్లు దేశంలో ఎన్ని దశలక్షలుంటే చిత్రానికయ్యే పెట్టుబడి తిరిగి వచ్చేట్టు?

ఇంకో ప్రశ్న కళాత్మకమైన చిత్రాలు ఏటా 60,70 తీయటానికి అవసరమైనంత మంది రచయితలూ, కథలూ, డైరెక్టర్లూ, సాంకేతిక ప్రవీణులూ, సంగీతం సమకూర్చేవారూ తదితరులూ దేశంలో ఉన్నారా?

ఈ సమస్యను సినిమా పారిశ్రామికులు గుర్తించలేదనటానికి లేదు దీన్ని పరిష్కరించటానికి వారు తీసుకుంటున్న చర్యలన్నీ వ్యాపార రంగానికి సంబంధించినవే

1 చిత్రాన్ని తక్కువ ఖర్చుతో తీయటం

2 పెద్ద తారలను వదిలేసి చిల్లర నటులనూ దక్షతలేని డైరెక్టర్లనూ, అనుభవంలేని

రచయితలనూ ఆశ్రయించటం

3 సరికొత్త సూత్రాలను అందరినీ మించి అమలుచెయ్యడం (ఆడపాత్రలను మరింత నగ్నంగా చూపటం, మైథునం లాటి డాన్సులను మరింతగా ప్రవేశపెట్టటం, ద్వంద్వార్థాలు గల పాటలనూ, డయిలాగులనూ మరిన్ని రాయించటమూ, ప్రసిద్ధ నటిచేత కాని, నటుడిచేత కాని రెండు, మూడు, నాలుగు తొమ్మిది పాత్రలు ఇలా నటింపజేయడమూ వగైరా!)

ఇలాంటి పద్ధతులు అవలంబించిన ఒక చిత్రానికి డబ్బు రాగానే ఆ పద్ధతివల్లనే ఆర్థిక విజయం సమకూరిందని భ్రమపడి, అందులో కళకు సంబంధించిన అంశాలేవైనా ఉంటే వాటిని పూర్తిగా విస్మరించటం!

చిత్రం చవగ్గా తియ్యటం తప్పుకాదు నిజమైన కళాదృష్టి కలవాడికి, చిత్రం మీద డబ్బు పెట్టిన కొద్దీ అందులో కళ పెరుగుతుందన్న భ్రమ ఉండదు కాని ఇది ముఖ్యమైన అంశం నాలుగు లక్షలైనా ఖర్చు కానిదే చక్కగా తయారు కాని చిత్రాలని రెండు లక్షలలో పూర్తి చేయాలని చూడడం తప్పు రెండు లక్షలలోనే చిత్రం పూర్తి చేయదలచినవారు, అంతలోనే చిత్రం పూర్తి కావడానికనువైన కథా, పాత్రలూ, షూటింగ్ షెడ్యూలూ, పాటలూ, డాన్సులూ ఉండేటట్టు చూచుకోవాలి కళా దృష్టిలోనూ, వ్యాపార దృష్టిలోనూ కూడా అది వివేకమైనపని చాలా డబ్బు వ్యయం అయ్యే చిత్రాన్ని చౌకలో లాగి పారేస్తే అది 'తూర్పు సావిత్రి' నాటకంలా తయారవుతుంది

కొత్తనటులను తెరకెక్కించటం కూడా వాంఛనీయమే కాని డబ్బు ఆదాకోసం ఏ సావిత్రిగాని, జమునగాని నిర్వహించదగిన వేషాన్ని ఒక సరికొత్త దౌర్భాగ్య స్త్రీకి ఇస్తే నష్టపోయేవాడు నిర్మాత

నిర్మాత కుండవలసినది మొట్టమొదట కళాదృష్టి ఆపైన దానికి అనుగుణమైన వ్యాపార దృష్టి డబ్బురాని చిత్రాలను తియ్యటమే కళాదృష్టి అనేది అనుభవజ్ఞులైన నిర్మాతలే ప్రచారం చేస్తున్నారంటే మన సినిమా కళా పరిశ్రమలకు ఏమీ భవిష్యత్తులేదని అనుకోవలసి వుంటుంది అచ్చుగా వ్యాపార దృష్టిగల నిర్మాతలు త్రాసు తక్కెడల్లాగా పైకీ కిందకీ ఊగుతున్నారు కళాదృష్టి అని కేకలుపెట్టి వ్యాపార దృష్టి లేనివాళ్ళు మట్టికొట్టుకు పోతున్నారు

మన నిర్మాతలందరూ కళా దృష్టితో ఆలోచన ప్రారంభించిననాడు ఏటా ఇన్ని చిత్రాలు రావు ఏ చిత్రానికీ అవసరానికి మించి ఖర్చు కాదు ఏటా పది పన్నెండు చిత్రాలను మనవాళ్ళ తేలికగా నిర్మించగలరు వారానికి ఒక మంచి చిత్రం చూడ్డం అలవాటైన వాడు కూడా ఒకదానితో బాటు తొమ్మిది చచ్చు సినిమాలు చూసే కన్న మంచి చిత్రాన్ని ఒకటికి పది సార్లు చూడడానికైనా ఇష్టపడతాడు

యాభై లక్షలు నిర్మాతకు ఆర్జించి పెట్టగల చిత్రం మీద, అవసరమైతే నలభై లక్షలు వ్యయం చెయ్యడం తప్పుకాదు కాని రెండు లక్షలు తేలేని చిత్రంమీద రెండున్నర లక్షలు ఖర్చు చేయటం కూడా అవివేకమే మన నిర్మాతలకు ఈపాటి వ్యాపార దృష్టివున్నా ఏటా ఇన్ని తుక్కు చిత్రాలు తయారుకావు ఈనాడు సినిమా రంగంలో చూసే క్షీణదశకు కారణం కళాదృష్టితో బాటు, వ్యాపార దృష్టి కూడా మృగ్యం కావడం

*జనధర్మ, వారపత్రిక, 21-10-1968*

# 95. సినిమాల్లో ముద్దు ముచ్చట్లు

సినిమాకు రెండు ముఖాలు అది ''ఇరుదల పాము'' రెండు నోళ్ళతో మాట్లాడుతుంది

''నువ్వు ఎవరు?'' అని ఎవరన్నా అడిగితే, ఒక ముఖం, ''నేను కళాపుంజాన్ని, సంస్కృతికి చిగురు కొమ్మను ప్రజా కళాదాహానికి అమృతాన్ని,'' అంటుంది

రెండో తల ''నేను పారిశ్రామికోత్పత్తిని వ్యాపార వస్తువును కొనుగోలు సరుకుని కోటిమందిని ఊరించి నూరుమందిని పోషించే దాన్ని ధనస్వామి నా యజమాని కళాకారులు నా సేవకులు ప్రజలు మా అందరికీ పోషకులు'' అంటుంది

సహజంగా ఈ ద్వైవిధ్యం సినిమాకు సంబంధించిన ప్రతి అంశంలోనూ విధిగా కనబడుతుంది

విజయవంతమైన చిత్రాలు హెచ్చుగా డబ్బు చేసుకున్నవి అవార్డులుపొందే చిత్రాలు కళాత్మకమైనవిగా కొందరు పెద్దలు నిర్ణయించారు

స్టార్ అనబడేవాడు లేక అనబడేది ఉత్తమ నటి (లేక నటుడు) కానక్కర్లేదు, ప్రజలను హెచ్చుగా ఆకర్షించేవాడు (లేక ఆకర్షించేది) ఉత్తమ నటుడూ, నటీ ఇత్యాదులకు బహుమతులూ గట్రా ఉంటాయి (నేను గొప్పనటులనుకునేవారిలో కొందరు చాలా స్వల్పమైన ఆదాయం గలవాళ్లే కాని నా లెక్కలు ఇరుదల పాము రెండు ముఖాలలో దేనికీ సూటిగా లేవు అది నా దురదృష్టం )

ఆఖరుకు ఊర్వశి అవార్డు చంద్రమతిలాంటి పాత్రలను పోషించిన వారికి ఇస్తున్నారు (ఊర్వశి చంద్రమతిలా ఉంటుందని దేవులపల్లి వారు ఒప్పుకోరేమో!)

సినిమాకు ప్రాణం వాస్తవికత అని భావించబడుతున్నది ఎందుకంటే ఏ స్టేజి మీదా చూపించటానికి అవకాశంలేనవన్నీ, ఏ గొప్ప రచయితా వర్ణించలేనవన్నీ, ఏకళాకారుడూ చిత్రించలేనవన్నీ వాస్తవ వివరాలను సినిమా చూపిస్తుంది మనం సినిమా పాత్రల వెంట రైళ్ళలోనూ, కార్లలోనూ వెళ్ళిపోయి, వారేమంటున్నారో, ఏం చేస్తున్నారో చూడవచ్చు ఆ మాటకు వస్తే, కూర్చున్న సీట్లో నుంచి కదలకుండా విమానయానాలు చేసి ఏర్ సిక్ నెస్ కూడా తెచ్చుకోవచ్చు కొండలెక్కవచ్చు, నదులు దాటవచ్చు, హీరోయిన్ మొహంలో మొహం పెట్టి ఆమె కళ్ళలో కన్నీరు గాని, ప్రేమ మెరుపుగాని చూడవచ్చు

ఇదంతా వాస్తవికతేమరి స్టేజీనటులు ఒక వంక పాత్రధారణ చేస్తూనే మనకు వినపడకుండా తమలో తాము మాట్లాడుకుంటారు, ప్రాంప్టర్లను తిట్టుకుంటారు కాని సినిమా నటులు, డైరెక్టరు ''కట్'' అనేదాకా పాత్రలోనే ఉంటారు

అయితే, గిరీశం అన్నట్టు —అందుకు డెబిట్— ట్రిక్ ఫొటోగ్రఫీ అనబడే స్పెషల్ ఎఫెక్ట్స్‌తోటి సినిమా వాళ్ళు అవాస్తవాలను కూడా వాస్తవంగా చూపించగలరు ఒక మనిషి పదిమంది మనుషుల ఎత్తు ఉన్నట్టు చూపవచ్చు ఒకే మనిషిని తెరమీద ఒకేసారి ఇద్దరు, ముగ్గురు, నలుగురైదుగురుగా చూపవచ్చు, ఇదంతా ''పురాణ వాస్తవికత '' కాని పురాణాలలో వాస్తవికత ఉన్నట్టు ఎవరూ ఒప్పుకోరు అదే చిక్కు

మేళతాళాలతో పాత్రలు తోటలలోనూ, దోడ్లలోనూ పరిగెత్తుతూ పాటలు పాడటం

వాస్తవికత కాదు (దస్తక్ సినిమా అంతా బాగుందిగాని పాటల ఆర్కెస్ట్రా చాలా పట్టిచ్చింది)

"నువ్వు చెప్పేది 'సంస్కార' లాంటి చిత్రం తీసి ప్రెసిడెంటు అవార్డు పొందమనా? ఇంకా నయం!" అని ప్రొడ్యూసర్లు అనవచ్చు

నేననేది అది కాదు సినిమాలో వాస్తవికతకు ఎంత అవకాశం పుష్కలంగా ఉన్నా, మన నిర్మాతలను దానికి అంటిపెట్టుకుని ఉండేట్టు చెయ్యటం ఎవరి తరమూ కాదు

ఇప్పుడు ముద్దులు తీసుకుందాం

దృశ్య కావ్యాలలో ముద్దులనేవి స్వతహాగా నిషిద్ధమేమీకావు వాటి ఔచితిని భావుకుడైన నాటక కర్త, లేదా స్క్రిప్టురైటరు నిర్ణయించవచ్చు

కన్యాశుల్కంలో ముద్దులు పెట్టుకోవటం ఉంది రామప్పంతులు ముద్దులు పెట్టుకోవటం గురించి మాట్లాడతాడు కూడా

అవిమారకుడు కురంగిని, "ప్రియే, ఏహి అభ్యంతరమేవ ప్రవిశావః" అని పడకటింటి ముచ్చటకు ఆహ్వానిస్తాడు (భాసుడి "అవిమారకం" 5వ అంకం చివరలో)

అయితే ఈ ముద్దులనేవి వాస్తవికతకు సంబంధించినవి ప్రియుడు తనకు అనుకోని మేలు చేస్తే ప్రేయసి అమాంతం అతన్ని ముద్దు పెట్టుకుంటుంది భార్యను విడిచి కొంతకాలం ఎటో పోతున్న భర్త తప్పక ముద్దు పెట్టుకుని మరీ వెళతాడు,

కాని సినిమా ముద్దులను స్క్రిప్టు రాసేవాడు నిర్ణయిస్తాడన్న సూచనలు ఏవీ కనబడవు అలాటి ముద్దులను కృత్రిమంగా ప్రదర్శించవచ్చు నిజంగాముద్దుపెట్టుకోవాలనేమీ లేదు ఇళ్ళ గోడల కింద కాన్వాసూ, కొండలు తయారు చెయ్యటానికి ఈతాకు చాపలూ, తడికెలు వాడుతున్నాం కామా?

కాని, నా అనుమానం, బాక్సాఫీసుకు కావలసినవి ఈ ముద్దులు కావని వీటిని సూచించటానికి ఏ కామెరామెన్‌కైనా అతి సులువు ప్రేక్షకులకు ఈ ముద్దులు కిర్రెక్కించవు

తర్జన భర్జనలన్నీ ప్రేక్షకుడికి కామోద్రేకం కలిగించి వాడి పాకెట్ పిక్ చెయ్యటం కోసమేనని నా అనుమానం అసలు గమ్యం మైథునం దానికి ఎంత దగ్గిరగా వెళ్ళగలమా అన్నది బాక్సాఫీసు తాపత్రయం డ్యూయెట్లు మైథునానికి ప్రత్యామ్నాయంగా పని చెయ్యటం మానుకున్నాయి ప్రేక్షకులు డ్యూయెట్లకు ఇమ్యూన్ అయిపోయారు మైథున నృత్యాలు కూడా అంతంత మాత్రంగానే ఉన్నాయి ఆడదాని మీద మగవాణ్ణి బోర్లించి కొంత ప్రయత్నిస్తున్నారు కాని అలా బోర్లాపడి వాడు ముద్దులు పెట్టుకోవటం కూడా చూపించగలిగితే ఒక ఘన విజయం సాధించినట్టు అవుతుంది

అయితే మరి చూపించరేం?

చూపించటానికి సెన్సారుకన్నా కూడా తీవ్రమైన అభ్యంతరాలు ఉన్నాయి, తారలు (ఆడ) తారలు (మగ) చేత వాస్తవంగా ముద్దులు పెట్టించుకోవటానికి ఒప్పుకునేటంత సాంస్కృతిక పరిణితి సాధించినట్టు కనబడరు

దేనికైనా దాని ప్రైస్ ఉంటుందనుకోండి ఒక హాలీవుడ్ పిక్చర్‌లో చాలాకాలం క్రితం "సిగరెట్" అనే బజారు మనిషివేషం వెయ్యటానికి క్లాడెట్ కోల్బర్ట్ కు 150,000 డాలర్లు ఇచ్చారట ఆమెకు అప్పుడది చాలా పెద్దమొత్తం కాబోలు, అట్లాగే మన తారలకు కూడా

ముద్దులకు ఆనందంగా డబ్బిస్తామంటే కొందరైనా ఒప్పుకుంటారేమో!

తీరా సొమ్ము పారేసి ముద్దులు చిత్రిస్తే రేపు జనం (ముఖ్యంగా ఆడ ప్రేక్షకులు) సినిమాని వెలివేస్తే? పెద్ద రిస్కు!

ఇంతకూ అసలు సంగతేమంటే, ముద్దులు లేకుండానే మహత్తరమైన చిత్రాలు తీయవచ్చు డబ్బుకూడా చేసుకోవచ్చు కాని మనసినిమా ఆర్థికంగా ముందుకు పోయి హాలీవుడ్‌కు మరింత చేరువ కావాలంటే ముద్దులు ప్రవేశపెట్టి తీరాలి ఇది ఆర్థిక సమస్య డబ్బు పారేస్తేగాని డబ్బు రాదు డబ్బు పోతుందేగాని రాదన్న భయం ఉన్నంతకాలమూ ప్రొడ్యూసర్లు ముద్దులు ప్రవేశపెట్టరు ఈ లోపల దీని విషయమై చర్చలన్నీ జనాన్ని సినిమా ముద్దుల ఐడియాకు అలవాటు చెయ్యటానికి పనికి వస్తాయి అంత కన్న మరేమీ లేదు

*విజయచిత్ర, మాసపత్రిక, ఏప్రిల్, 1972*

# 96. యువతీ యువకులపై నేటి సినిమాల ప్రభావం

ఈ నాటి సినిమాలను గురించి మంచిగా చెప్పుకునేది నాకేమీ కనబడదు ప్రజలను ఉత్తేజపరచే కళలు ఉండవలసినదానికి సినిమాలు పూర్తి విరుద్ధంగా ఉంటున్నాయి

వాటిలో వాస్తవికత ఉండటంలేదు జీవితసమస్యలు తారుమారుగా చూపబడుతున్నాయి సమాజంలో స్త్రీ, ప్రేమా, త్యాగమూ మొదలైనవి కృత్రిమంగానూ, అవాంఛనీయంగానూ చిత్రించబడుతున్నాయి ఇవి అందించే వినోదం ఒకప్పుడు విషతుల్యంగా ఉంటున్నది

ఈ సినిమాల ప్రభావం యువతీ యువకులపై ఎలా ఉంటుందన్న విషయం గురించి కూడా అవాస్తవమైన ఊహలు చేయవచ్చుననీ, చేస్తున్నారనీ నా అనుమానం

స్థూలంగా చెప్పాలంటే క్షుద్రమైన కళలు ప్రగతికి పెద్దగా అవరోధాలు కాలేవు అంతకన్నా కూడా, ప్రగతికి దోహదం చేసే కళలు లేకపోవటం వల్ల ఎక్కువ నష్టం ఉన్నది

ఈ నాటి సినిమాలు చూసే యువతీ యువకులందరూ వాటి వల్ల ఒకే విధంగా ప్రభావితులు కావటం ఎన్నడూ జరగదు వాటిలో ఉండే క్షుద్ర భావాలను సీరియస్‌గా తీసుకుని అవాంఛనీయమైన ప్రభావాలకు గురి అయే వాళ్ళు అదివరకే 'చెడిన' వాళ్లు, చెడటానికి సిద్ధంగా ఉన్నవాళ్ళూ అయి ఉంటారు వారిలో కొంతమనోవికాసమూ, వాస్తవ జీవితమూ తెలిసిన స్థితి కలవాళ్లు వాటిని విమర్శించగలిగి ఉంటారు ఈ సినిమాలు వారికి ధనస్వామ్యతత్వాన్ని మరింత స్పష్టంగా చూపిస్తాయి

విడుదల అయే చిత్రాలలో అనేకం ప్రజాదరణ పొందక పోవటం మనం చూస్తూనే ఉన్నాం అవి అభ్యుదయచిత్రాలు కావటంచేత ప్రజలు వాటిని బహిష్కరించటంలేదు, ప్రజలను ఆకర్షించటానికీ, వారి మనసులను వక్రీకరించటానికీ నిర్మాతలు అవలంబించే పద్ధతులు ప్రజల మీద పారటం లేదు ప్రజలను ఆకర్షించలేని చిత్రాల ప్రభావం గురించి చెప్పుకోవటం అనవసరం

ఈనాడు యువలోకం చాలా చైతన్యం ప్రదర్శిస్తున్నది జీవితం కల్పించే భ్రమలనే యువతీయువకులు తోసిపుచ్చుతున్నారు తమ భవిష్యత్తు గురించి వెనకటి తరాలవాళ్ళు పొందివుండని భయాందోళనలు ఈ తరం వారు ప్రదర్శిస్తున్నారు వారిలో రాజకీయ చైతన్యం

కూడా పెరుగుతున్నది అందుచేత సినిమాలు అదనంగా కల్పించే ప్రభావాలు వారి మీద పనిచేయకపోవచ్చు.

ప్రజలు ఈ నాటి సినిమాలని—చాలా తక్కువ సందర్భాలలో— కూడా వాటిని కళా దృష్టితో చూస్తున్నారనుకునేటందుకు వీలులేదు. ఒక ప్రదర్శనాన్నో, ఎగ్జిబిషనునో, క్రికెట్ ఆటనో చూసి నట్టు సినిమాను చూడటం అసాధ్యం. తక్కువగా ప్రదర్శించిన నాటకాలు కలిగించే చైతన్యం కూడా సినిమాలు కలిగిస్తున్నట్టు కనబడదు.

సినిమా ప్రజాకళగా ఈ దేశంలో ఇంకా అవతరించలేదనే అనుకోవచ్చు. బూర్జువాదేశాల్లో కూడా అది విజయవంతం కాలేకుండా ఉంది. సాధారణంగా సినిమాలలో నాయికా నాయకులు ఫ్యూడల్ సంప్రదాయాలకు కట్టుబడినవారిలాగానో, ఫ్యూడల్ సంప్రదాయాల నుంచి బయట పడటానికి కుస్తీపట్లు పట్టుతున్న వారిలాగానో కనబడతారు. పిక్నిక్కులకు పోవటమూ, బృందగానాలు చేయటమూ, జంటలుగా లేచిపోయి బూతుపాటలు పాడటమూ, బట్టలు పాడవుతాయన్న భయంలేకుండా ఎక్కడపడితే అక్కడ పడుకుని దొర్లటమూ— ఇదేమనం చూసే వర్గ సంఘీభావం. ఇలాంటి న్యూసెన్స్ ఈ కాలపు యువతీయువకులను ప్రభావితులను చేస్తుందనుకోవటం సాధ్యంకాదు. ఈ సినిమాలు నిర్మాతల పామరత్వానికి ప్రత్యక్ష నిదర్శనాలే గాని భవిష్యత్తుకు అడ్డుగోడలుగా పనిచేయవని నానమ్మకం.

ఈనాటి సినిమాలను ప్రదర్శించే థియేటర్లున్నట్టే విమర్శించటానికి పత్రికలూ ఉన్నాయి. అయితే ''ఎర్ర'' పత్రికలు కూడా విమర్శించటంలేదు. చాటలంత ప్రకటనలు రావని భయం.

*ముద్రణ యువజగతి, పక్షపత్రిక జన్మదిన సంచిక, 15-5-1973*

# 97. చిత్ర నిర్మాతగా చక్రపాణి

సెప్టెంబరు 24న చక్రపాణి ఆకస్మికంగా మరణించటం సినిమా పరిశ్రమకు పెద్ద దెబ్బ అంటే ఎవరూ ఆమోదించకపోవచ్చు. కాని సినిమా స్క్రిప్టు తయారు చెయ్యడంలో ఆయనకు గల అనన్య ప్రతిభ చాలామంది గ్రహించి ఉండరనుకుంటాను. అందుకు వేరువేరు కారణాలున్నాయి.

మన వాళ్లకు సినిమా స్క్రిప్టు గురించిన విచక్షణాజ్ఞానం చాలా తక్కువ. సినిమాల గొప్పతనం బాక్సాఫీసుల కొలతకు వస్తుంది. సినిమాలలో నటించే తారలు ప్రేక్షకుల దృష్టిని హెచ్చుగా ఆకర్షించేస్తారు. మంచి స్క్రిప్టు దానంతట అది రాణించదు. డైరెక్షను ఎంతగా రాణించనిస్తే అంతగానే అది రాణిస్తుంది. కొన్ని సందర్భాలలో ''రాంగ్ కాస్టింగ్'' కూడా మంచి స్క్రిప్టును మసి చెయ్యవచ్చు.

1939లో 'ధర్మపత్ని' (డైరెక్టరు పి. పుల్లయ్య) కి సంభాషణలు రాయటానికి నియోగించబడేదాకా చక్రపాణికి సినిమా పరిశ్రమతో ఎలాంటి సంబంధమూ లేదు. (సినిమా విజయం సంభాషణలమీద ఆధారపడుతుందని చక్రపాణికి నమ్మకం ఎప్పుడూ లేదు.)

ఆతరువాత ఆయనే సంభాషణలు రాసింది వాహినీవారి 'స్వర్గసీమ' (డైరెక్టరు బి. ఎన్. రెడ్డి) కి. కథ కూడా చక్రపాణికే క్రెడిట్స్‌లో అంట గట్టినట్టు జ్ఞాపకం. కాని అది చక్రపాణి కథ కాదు, కావటం అసంభవం— సినిమా కథలు ఒక్కరే రాస్తారని అనుకున్నప్పటికీ

చక్రపాణి సొంత కథతోనూ, సొంత స్క్రిప్టుతోనూ తీసిన మొట్టమొదటి చిత్రం 'షావుకారు' ఇది విడుదల అయిన నాటికి కొత్త తరహా చిత్రమే కాకుండా, తెలుగులో మొట్ట మొదటి అభ్యుదయ చిత్రం తరవాత చాలా కాలానికి అభ్యుదయ ముద్రతో వచ్చిన 'పల్లెటూరు' అడుగడుగునా 'షావుకారు' ను జ్ఞాపకం చేసింది

'షావుకారు' గొప్ప చిత్రంగా పేరు తెచ్చుకున్నది అందులో సరికొత్త నటులుగా వచ్చి ఎన్ టి రామారావు, ఎస్ వి రంగారావు, జానకిగార్లు తెలుగు సినిమా చరిత్రలో గొప్పగా వెలిగిన సంగతి అందరూ ఎరిగినదే అలాగే ఘంటసాలకు కూడా అమరఖ్యాతి లభించింది దాన్ని డైరెక్టు చేసిన ప్రసాద్‌గారికి కూడా అప్పటికింకా పెద్ద పేరు లేదు తెలుగు సినిమా చరిత్రలో పునాదిరాళ్ళుగా ఎంచదగిన చిత్రాలు కొన్ని ఉండవచ్చు కాని వాటిలో 'షావుకారు' నిస్సందేహంగా ఒకటి

అయితే చక్రపాణికి ఆ చిత్రం గురించి ఏమీ సంతృప్తి కలగలేదు అది జనాన్ని ఆకర్షించలేకపోవటం ఆయనకు అపజయంగా తోచింది ''పిక్చర్లో బంగారం ఉంటే మాత్రం ఏం లాభం, జనానికి అది పట్టక పోయినాక?'' అని ఆయన వాదం సినిమాలలోగాని, జర్నలిజంలోగాని విప్లవం సాధించాలన్న దృష్టి ఆయనకు ఏనాడూ లేదు సినిమా చిత్రాల విజయాలు బాక్సాఫీసుద్వారానే నిర్ణయించాలన్న వైఖరిని ఆయన అవలంబించటం తప్పనిసరి అయింది అది అందరూ అవలంబించే వైఖరే అనుకోండి కాని ఆయనకూ, మిగిలినవాళ్లకూ ఉన్న పెద్దతేడా ఏమంటే, ఆయన బాక్సాఫీసుకోసం ఏనాడూ ''ఫార్ములాలు'' ఆశ్రయించలేదు ఆయన ఎన్నుకున్న సినిమా కథలలో మంచివి ఉండొచ్చు, మంచివి కానివీ ఉండొచ్చు కాని ఫార్ములా కథలు మాత్రం లేవు

కథ ఎన్నుకున్న తరవాత చక్రపాణి దానికి జీవం పొయ్యటానికి ఎంతగానో కృషిచేసేవాడు షూటింగు జరిగే కాలంలో ఆయన మెదడుకు విశ్రాంతి లేదనిపించేది ''చక్రపాణి గారు ఆరో రీలు ఎడిట్ చేసుకుంటున్నారు'' అని ఆయన స్టుడియోలో నడిచిపోతుంటే ఆయన కింద పనిచేసేవాళ్ళు జోక్ చేసేవారు ఒక షాట్ నుంచి ''నాలుగు ఫ్రేములు'' కట్ చేసి చూడమని ఎడిటింగ్ వాళ్లతో అనటం నాకు తెలుసు చిత్ర నిర్మాణం లోకి తొలిగా ప్రవేశించన ''కొత్త బిచ్చగాళ్లు'' కాని, తలలు పండినవాళ్లు గాని తాము తీసే చిత్రం గురించి చక్రపాణిలాగా మథనపడటం నేను ఊహించుకోలేను

'షావుకారు' తరవాత, దాని అనుభవంనుంచి తాను నేర్చుకున్న గుణపాఠాలతో చక్రపాణి తీసిన చిత్రం 'పెళ్లిచేసి చూడు' అది పూర్తిగా అయన స్వయంకృషి దాని రచనలో చక్రపాణి ''జీనియస్'' పూర్తిగా కనిపిస్తుంది అందులో చక్రపాణి మార్కు హాస్యం సమగ్రంగా ఉన్నది కథను నడపటానికి పెట్టిన సంభాషణ ఆ చిత్రంలో మచ్చుకైనా లేదు ప్రతి సంభాషణా పాత్రనుంచీ, పరిస్థితినుంచీ ''స్పాంటేనియస్'' గా వొస్తాయి సినిమా సంభాషణలను సాహిత్య దృష్టితో చూడటం నిజానికి వ్యర్థప్రయాసే కాని 'పెళ్లిచేసి చూడు' సంభాషణలలో ''ధ్వని'' ఉన్నది ఆ చిత్రంలో కథానాయకుడూ, అతని బావమరిదీ కలిసి ఎంతో నాటకం ఆడతారు ఆ నాటకం ప్రారంభం కావటానికి ఎంతో ముందుగానే చక్రపాణి కథానాయిక తల్లి చేత, ''బావమరుదులిద్దరూ ఏదో భాగోతం ఆడుతున్నట్టున్నారే!'' అనిపించాడు ఆ తరం స్త్రీలకు

భాగోతం అంటే నాటకమే ఇది అద్భుతమైన ''టచ్''

'పెళ్లిచేసి చూడు' లో పాత్రలను గురించి ఎంతైనా రాయొచ్చు ఎస్ వి రంగారావు నటుడుగా ఉన్నత శిఖరాలు అందుకున్న నేపాళ మాంత్రికుడు ('పాతాళభైరవి') పాత్రలాటిది మళ్లీ అతనికి ఎవరూ ఇయ్యలేదు కాని 'పెళ్లి చేసి చూడు' లో వియ్యన్నపాత్ర ధరించిన అనంతరం అతను కనీసం ఒక డజను చిత్రాలలో అదేపాత్ర ధరించాడు 'పెళ్లి చేసి చూడు' లో పిల్లల పాత్రల దగ్గరనుంచీ న్యాయం జరగకుండాపోయిన పాత్ర ఒక్కటి కూడా లేదు

'మిస్సమ్మ' చిత్రంలో, చక్రపాణిలో నేను ఏనాడూ శంకించని ఒక వింత శక్తి వ్యక్తమయింది ఆయనకు సంగీతం పరిచయం లేదని నాకు తెలుసును ఇతర విధాల కూడా 'మిస్సమ్మ' 'పెళ్లిచేసిచూడు' తో పోల్చదగినదిగా నాకు తోచలేదు అందులో సంగీతానికి తొంభై శాతం బాధ్యత చక్రపాణిది ఆ సంగీతం రాజేశ్వరరావుకు అంతగా తృప్తి కలిగించినట్టు కనబడదు ప్లేబాక్ పాడిన లీల ఎంత అసంతృప్తి చెందిందంటే ''ఈసారి పిక్చరుకైనా కాస్త మంచి పాటలు పాడించండి'' అని చక్రపాణితో అన్నది కాని తీరా పిక్చరు విడుదలైనాక ఎవరినోట విన్నా ఆ పాటలే! రేడియోలో ఏళ్లతరబడి 'మిస్సమ్మ' పాటలు వచ్చాయి ఇది చక్రపాణికి, నేను కలలో కూడా ఊహించని విజయం అనిపించింది

'అప్పుచేసి పప్పుకూడు' చక్రపాణికి కీర్తి తెచ్చే చిత్రం కాదు, ఆ కథలో నన్నడిగితే ''సినిమా సౌలభ్యం'' లేదు కథతో దీర్ఘకాలం కుస్తీ పట్టవలసివచ్చింది మంచి కథను సినిమాకు మలచటానికి అంత శ్రమపడటమే అవలక్షణం దానికితోడు ఏ పాత్రా కూడా సరిగా పోషించబడలేదు అప్పుచేసి పప్పుకూడు తినేవాడి పాత్రకు సి ఎస్ ఆర్ ఏమాత్రమూ తగడు ఆ పాత్ర కుడిచిన పప్పుకూడు ఏమిటోకూడా సినిమాలో మనం చూడం అది నిజానికి వియ్యన్నకన్న రెండాకులు ఎక్కువ చదివిన పాత్రగా రూపొంది ఉండవలసింది అలాటి పాత్ర వియ్యన్నను లీలగా కూడా జ్ఞాపకం చెయ్యలేకపోయింది

దానికి అన్ని విధాలా వ్యతిరేకమైన చిత్రం 'గుండమ్మ కథ' ఇది సినిమాకు చాలా వీలుగా ఉన్న కథ, చక్రపాణి అయిదారు వాక్యాలతో కథచెబితే నాకు పనికివస్తుందనిపించింది అందులో ఉన్న సన్నివేశాలు బహుకొద్ది వాటికి పూర్తి న్యాయం జరిగింది నటులు తమ పాత్రలను అవలీలగా నిర్వహించారు చిత్రం నిర్మించటంలో ఎంత సౌలభ్యం ఉన్నదనిపించిందో చూడటంలోనూ అంత సౌలభ్యం గోచరించింది సంభాషణలమీద ఆధారపడకుండా కథ చాపకింది నీరులాగా ప్రవహించింది హాస్యానికి అవకాశం గల ఏ సన్నివేశమూ వృథాగా పోలేదు కొత్తదనం ప్రతి అంగుళానా ఉట్టిపడింది చిత్రం చాలా విజయవంత మయింది ఏదో ఫోర్త్ క్లాస్ సెంటర్లో అది నూరు రోజులు ఆడింది

'గుండమ్మ కథ' అనంతరం చక్రపాణి సొంత చిత్రమంటూ లేదు ఇతర 'విజయ' చిత్రాలతోబాటు అన్నిటిమీదనూ ప్రొడ్యూసర్లు నాగిరెడ్డి, చక్రపాణిగార్ల పేర్లు ఉన్నాయేగాని అవి చక్రపాణి స్వయంకృషి చిత్రాలు కావు మళ్లీ సొంతంగా ఎందుకు పిక్చరు ఆలోచించటంలేదని అడిగితే తనకు తాను 'కాన్‌సెంట్రేట్' కావటం లేదని ఆయన అన్నాడు ఆయనను విడలేని అనారోగ్యం వెన్నాడకపోతే ఇంకా మంచి చిత్రాలు ఆయన ప్రతిభకు శాశ్వత నిదర్శనాలుగా ఉండ దగినవి అనేకం వచ్చి ఉండేవేనని నా నమ్మకం కాని విధి అలా జరగవలసిలేదు

ఏమైనా చక్రపాణి సినిమా రచయితగానూ, నిర్మాతగానూ ఇతరుల కోవలో వాడు మాత్రం కాడు ఆయన సినిమా రంగంలో ఒక అరుదైన విశిష్టవ్యక్తి ఆ వ్యక్తిత్వం ఒకరినుంచి అరువు తెచ్చుకున్నది కాదు, మరొకరికి సంక్రమించినది కూడా కాకుండా పోయింది ప్రేక్షకులు వేలిముద్రలగాళ్లు అనుకునే ప్రొడ్యూసర్లూ, ఫార్ములాల కోసం బాక్సాఫీసు హిట్ చిత్రాలను భూతద్దాలతో అన్వేషించేవాళ్లూ ఆయనకన్న గొప్ప సినిమా విజయాలు సాధిస్తే సాధిస్తారేమోగాని, సినిమా సంస్కృతి దృష్ట్యా ఆయన ఛాయలకుకూడా రాలేరు

*తెలుగుతెర, మాసపత్రిక, అక్టోబరు, 1975*

# 98. అమరుడు రేలంగి

సినీ పథంనుంచి ఒక నక్షత్రం రాలి పోయింది రేలంగి ఇక లేడు

దక్షిణ దేశంలో ప్రసిద్ధికి వచ్చిన సినిమా తారలలో తెలుగువాళ్ల రికార్డు చాలా గొప్పది వై వి రావు మొదలుకొని వాణిశ్రీదాకా ఎందరో తెలుగు నటులు చలన చిత్రాల్లో కీర్తి ప్రతిష్టలు తెచ్చుకున్నారు ఒక్క హాస్యనటులకు మాత్రమే ఇది వర్తించనట్టు కనబడుతుంది ఏడవటం ప్రపంచమంతటా ఒకే విధంగా ఉంటుంది, కాని నవ్వటంలో ప్రాంతీయ భేదాలున్నాయి కాబోలు!

తెలుగు సినిమా రంగంలో కామెడియన్ల రికార్డు కూడా గొప్పదేనని నాకు తోస్తుంది అయితే ఈ రికార్డును తమిళ చిత్రాల పరిధిలో స్థాపించటానికిలేదు వేరు వేరు భాషలవాళ్లు తమ రేలంగి వెంకట్రామయ్యలనూ, బాలకృష్ణలనూ, అల్లు రామలింగయ్యలనూ, రాజబాబులనూ తాము సృష్టించుకోవలసిందే

రేలంగి సినీరంగ ప్రవేశం చేసినదాకా తెలుగు సినీ కామెడియనులు ''గెస్టు'' ఆర్టిస్టులుగా కనిపించేవారేగాని సిసలైన సినీనటుల జాబితాలో చేరకపోయారు వంగర వెంకటసుబ్బయ్యా, శివరావూ కొంతవరకు ఈ లోపాన్ని పూడ్చుకున్నారు (శివరావు గొప్ప కామెడియన్‌గా అంతకాలం రాణించటం నాకు ఇప్పటికీ మిస్టరీ గానే ఉన్నది)

రేలంగి ప్రముఖ సినీ నటుడు కావటమే కాదు, అతని పాప్యులారిటీ హీరోలనూ, హీరోయిన్లనూ కబళించిన సందర్భాలున్నాయి పది మంది సినీ తారల మధ్య రేలంగి ఉంటే జనం రేలంగి మీదనే ఎగబడేవారు ఒకసారి ఒక ప్రముఖ ప్రొడ్యూసరు అన్నాడు— ''శతదినోత్సవానికి వెళ్లాం మాకు ఒక స్కూలువాళ్లు రిసెప్షన్ ఇచ్చారు హెడ్‌మిస్ట్రెస్ దగ్గరనుంచీ అందరూ రేలంగితో మాట్లాడేవాళ్లే! మా మొహాలు చూసినవాళ్ళు లేరు!''

బియ్యేలు, ఎమ్మేలూ పాసయిన వాళ్ల సంగతే ఇలా ఉంటే, ఇక జనసామాన్యం సంగతి చెప్పనక్కర్లేదు వాళ్లు రేలంగిని చూడగానే, ''రారా, నా కొడకా!'' అనేవాళ్లు ఆనందంతో మైమరచి, పామర సంస్కృతిలో ఆమాటలే పూలదండలు! రేలంగి ప్రజాసామాన్యం నుంచి పొందిన కనకాభిషేకం ఇంతా అంతా కాదు

నిజానికి రేలంగి అన్ని రకాల ప్రజలకూ అత్యంత ఆప్తుడయ్యాడు ఆ అవకాశం హీరోలకూ, హీరోయన్‌లకు లేదు అయితే రేలంగి వారికి ఏ మాత్రమూ తీసిపోకుండా తారాపథంలో వెలిగాడు

అందుకు తగిన కారణం ఉన్నది రేలంగి కేవలమూ హాస్యగాడుకాడు, సమగ్ర నటుడు

అతన్ని సెట్టుమీద చూసినవాళ్ళకు ఈ విషయం మరింత స్పష్టంగా తెలిసేది తానుషాట్‌లో లేకపోయినా, తీస్తున్న షాట్‌కు తాను అద్భుతంగా రియాక్షన్ ఇచ్చేనాడు కామెరా ముందున్నవాళ్ళు అందులో సగం చూపితే ఎంత బాగుండునని నేను అనుకున్న సమయం కూడా ఉన్నది అతను సినిమాలో వేషాలు వెయ్యటం అచ్చంగా డబ్బుకోసం కాదనీ, అంతకన్న హెచ్చుగా నటనాసక్తి అనీ అనుమానం తగిలి, ''నిన్ను ఎవరూ బుక్ చెయ్యకపోతే ఏం చేస్తావు?'' అని అడిగాను ''ఎవరినన్నా బతిమాలి ఊరికే వేషాలు వేస్తాను '' అన్నాడు రేలంగి నటించడం అతని ఊపిరి నాకు తెలిసినంతవరకు అతనికి సినీ రాజకీయాలు లేవు, శత్రువులు లేరు ఎవరితోనూ పేచీలు లేవు, ''ఇగో'' లేదు

అందుచేత నే అతను ఇతరులలో సామర్థ్యాన్ని నిష్కపటంగా మెచ్చుకొనేవాడు, తనకు స్పష్టమైన ఉచ్చారణ లేదు, సూర్యకాంతం షాట్‌లో స్పీచ్ చెబుతుంటే మెచ్చుకునేవాడు ఒకసారి అతనికి జంటగా ఒక కొత్త అమ్మాయిని వేశారు, ''పాపం, ఆ పిల్ల ఒట్టి అర్భకురాలు సరిగా చెయ్యలేకుండా ఉంది'' అన్నాడు రేలంగి రేలంగికి జంటగా నటించగలవాళ్ళు ఫీల్డులో చాలామంది ఉన్నారు, అయితే రేలంగి ప్రొడ్యూసర్లు కుదిర్చిన జంటతోనే నటించాడు— తనకు ఆ అమ్మాయి అడ్డమైనాకూడా

ఏడాదిక్రితం అనుకుంటాను, మద్రాసులో ఒక ఆదివారం ఉదయం 'పెద్దమనుషులు' వేశారు రేలంగి దాన్ని చూసి కంట తడిపెట్టుకున్నాడు ''ఇప్పుడు చూస్తే పిక్చరు ఎట్లా ఉంది'', అని అడిగాను ''ఇటువంటి పిక్చర్లు ఇప్పుడింక రావు'' అన్నాడు అంతేకాని అందులో తాను అద్భుతంగా నిర్వహించిన తిక్కశంకరయ్య పాత్ర గురించి మాట్లాడలేదు తాను అటువంటి పాత్రలు ఇంక వెయ్యలేనన్నదికూడా అతనికి తట్టి ఉండాలి

కామెడియన్‌గా రేలంగి అస్తమించి కొంతకాల మయింది అతని ఆరోగ్యం అతను సినిమాలలో నటించటానికే అడ్డుగా ఉంటూ వచ్చింది అతను ఖాళీచేసిన జాగాలో ఇతర కామెడియన్లు వచ్చేశారుకూడా అయితే ఇప్పటి కామెడియన్లు రేలంగి లాగా ''క్లాసిక్'' అవుతారా అన్నది అనుమానాస్పదం

ఒకనటుడు ''క్లాసిక్'' అనిపించుకోవటానికి విజయవంతంగా ''పాత్రధారణ'' చెయ్యటం చాలదు, పాత్రలో ''గృహప్రవేశం'' చేసి, దానిద్వారా చిత్రం బరువు మొయ్యాలి రేలంగి ఈ పని అనేక మార్లు అవలీలగా చేశాడు తెలుగు సినిమా చరిత్రలో రేలంగి శకం చిరస్మరణీయమైనది అతను అమరుడు

తెలుగు తెర, మాసపత్రిక, డిశెంబరు 1975

# 99. సినిమా ప్రపంచం

సినిమా ప్రపంచం మామూలు ప్రపంచం కాదు! అది వేరే ప్రపంచం దానికీ, మామూలు ప్రపంచానికీ ఉండే తేడాలను అనేక కోణాలనుంచి పరిశీలించుకోవచ్చు

ఒకవిధంగా అన్నిరకాల కళాప్రపంచాలూ వేరువేరు ప్రపంచాలే అయినా అవి మామూలు ప్రపంచంలో అంతర్భాగంగా ఉండే అవకాశం ఉన్నది సినిమా ప్రపంచానికి ఈ అవకాశంలేదు

మొట్టమొదటి సంగతి, ఈ ప్రపంచానికి పునాది చాలా ఇరుకైనది కొద్దిమంది

చిత్రనిర్మాతలు— వారు తీసే చిత్రాల ఆధారంమీద సినిమాప్రపంచం నడవాలి ఈచిత్ర నిర్మాతల ఏకైకజీవిత లక్ష్యం లాభాలు సంపాదించటం వాళ్ళకు వాస్తవ జీవితంలో ఇతర సామాజిక, ఆధ్యాత్మిక విలువలు ఉండవచ్చుగాక వాళ్ళు వాటిని చిత్ర నిర్మాణంలోకి రాకుండానైనా చూసుకోవాలి, లేదా వ్యాపారధర్మంతో విజయవంతంగా వాటిని సమన్వయించగలగాలి ఇది తేలికైన పనికాదు అపజయాలనూ, ఆర్థిక వినాశనాన్ని కోరితెచ్చుకునే నిర్మాతలు సినిమాప్రపంచానికి పునాదిగా ఉండటం సాధ్యంకాదు గనక, అందుకు మనం వాళ్లను తప్పుపట్టి ప్రయోజనంలేదు

మామూలు జీవితంలో సమాజాభివృద్ధి కోసం చిన్నా, పెద్ద త్యాగాలుచేసిన వాళ్లుంటారు వాళ్ళకు కీర్తి, గౌరవమూ లభించటంకూడా కద్దు సినిమా పరిశ్రమకు మూలస్తంభమైన నిర్మాత ఎలాటి త్యాగమూ చేసేస్థితిలో లేకపోవటం గమనించాలి నిర్మాతలు తమడబ్బును ఇతరత్రా క్షామనివారణలకూ, లోకోపకార చర్యలకూ వినియోగించి త్యాగం చూపలేరనికాదు, నిర్మాతలుగా త్యాగానికి ఒడి గట్టలేరు త్యాగాలు చెయ్యటానికి సినిమా ప్రపంచం నుంచి మామూలు ప్రపంచంలోకి అడుగుపెట్టాలి

సినిమాప్రపంచంలోగల నటులూ, తదితరులూకూడా ఆ రంగంనుంచి ఇవతలికి వచ్చి, మామూలు ప్రపంచపు విలువను పాటించవచ్చు కాని సినిమా ప్రపంచంలో ఉండగా వాళ్లు వ్యాపార కబంధహస్తంలో ఉన్నవాళ్ళే

రెండవసంగతి ఏమంటే, సినిమా వ్యాపారం మామూలు వ్యాపారాలలాటిదికాదు ఇది మొట్టమొదట పరిశ్రమ, తరువాత వ్యాపారం పరిశ్రమగా కూడా ఇది మామూలు పరిశ్రమవంటిది కాదు ఈ పరిశ్రమలో తయారయే సరుకు— సినిమా చిత్రం— బజారుధర ఏమిటో ఎవరికీ తెలీదు, మార్కెట్టులో పెట్టేదాకా మార్కెట్టులో పెట్టినాక అది కోట్లు చెయ్యవచ్చు వందలు కూడా చెయ్యకపోవచ్చు ఏ ఇతర పరిశ్రమలోనైనా పారిశ్రామిక వస్తువు మూల్యమూ, నాణ్యత, నిర్మాణంలోనే నిర్ణయమౌతుంది దానికి వాడే ముడిపదార్థాలను బట్టి, దాన్ని తయారు చేసే యంత్రాలు వగైరాల ప్రాశస్త్యాన్ని బట్టి దాని మూల్యమూ, వెల ఆధారపడుతుంది ఎంత 'అణాకాని' సరుకైనా అణా న్నరకు అమ్ముడవుతుందన్న నమ్మకం ఉంటుంది

ఇలాటి నియమాలేవీ సినిమాకు వర్తించవన్నది ఈనాడు తెలియనివారులేరు నాలుగు లక్షలతో తీసిన చౌక చిత్రానికి మార్కెట్టులో నలభై లక్షలు రావచ్చు నలభై లక్షలతో తీసిన చిత్రం గట్టిగా నాలుగురోజులు నడవకపోవచ్చు

ఈ సినిమా పారిశ్రామిక వస్తువుకు ముడిపదార్థం ఏదో ఎవరూ చెప్పలేరు ఇందుగురించి అభిప్రాయభేదాలున్నాయి సాధారణంగా పేరుపడ్డ తారలు ప్రధాన ముడిసరుకు అన్న అభిప్రాయం కొందరికి ఉండేది ఈ తారలు సినిమాచిత్రాల వ్యాపార విభాగానికి దోహదం చెయ్యగలరేమోకాని, పరిశ్రమ విభాగానికి ఏమీ చెయ్యలేరు అందుకు నిదర్శనంగా ఆల్‌స్టార్ కాస్ట్ చిత్రాలు దెబ్బతిన్నాయి కొత్త వాళ్లతో తీసిన చిత్రాలు నెగ్గటంకూడా జరిగింది

సంగీతానికీ, సంభాషణలకూ, కథకూ, డైరెక్షనుకూ, ఫొటోగ్రఫీకీ, ఆర్టు డైరెక్షనుకూ అగ్రతాంబూలాలు ఇయ్యటం తారలకు ప్రాముఖ్యత ఇయ్యటంలాంటివే చాలామంది ఇప్పటికే

''మంచికథ సినిమా చిత్రానికి అసలైన ముడిపదార్థం'' అని నమ్మేవాళ్ళున్నారు దురదృష్టవశాత్తూ 'మంచికథ' ను నిర్వచించటం అంతసులువుకాదు అందుచేత, విజయవంతమైన చిత్రాల కథలను మంచికథలుగా భావించటం జరుగుతున్నది ఇందువల్ల నిర్మాతలకు ఏమంతలాభం కలుగుతున్నట్టులేదు ఆఖరుకు, ఒకభాషలో పెద్దహిట్ అయిన పిక్చరును ఇంకో భాషలో తీస్తే చచ్చేదెబ్బతినటం కూడా జరుగుతున్నది

సినిమా కథలలో ఉండే ప్రపంచం ఎటువంటిది? అది ప్రపంచమూకాదు, వాస్తవిక ప్రపంచమూకాదు అదొక ''సంకర'' ప్రపంచం అందులో పాత్రలు సినిమా వ్యక్తులూకారు, సామాజిక వ్యక్తులుకారు ఒక్కొక్కసారి ఆపాత్రలు ఏ యుగానికి, ఏదేశానికి, ఏ జాతికి చెందినవో చెప్పటం కష్టం వాళ్ల మనస్తత్వాలూ, కష్టసుఖాలూ, సమస్యలూ, త్యాగాలూ, ప్రవర్తనా— ఊహాతీతంగా ఉంటాయి సినిమా చూసేవాళ్ళకు '' పాత్ర అచ్చు ఫలానివాడల్లే వుంది!'' అని పొరపాటునకూడా అనిపించదు అలా అనిపించటం సినిమా వ్యాపారానికి దెబ్బఅని నాఊహ ఆ పాత్రధరించే నటులే ప్రేక్షకులకు జ్ఞాపకం వస్తూంటే సినిమా వ్యాపారానికి మంచిదేమో! లక్షలుపోసి తారలను తెచ్చినాక వాళ్లు పాత్రల వెనక అదృశ్యమై పోవటం నిర్మాతకు గిట్టుబాటు కాకపోవచ్చు

సినిమాసెట్లలో మనం చూసే ఇళ్ళు కూడా ఎక్కడాచూడం ఒక ఆర్టు డైరెక్టరు అన్నట్టు సినిమాలో మనం నిజమైన గుడిసె కూడా చూడలేం సినిమా సెట్టింగులు సివిల్ ఇంజినీర్లను దిగ్భ్రాంతుల్ని చేయగలవు సినిమా ''ప్రమాద'' ఘటనలు డాక్టర్ల ను చకితుల్ని చేయగలవు సినిమా వాద్యాలు వాయించటం సంగీతం తెలిసినవాళ్ళకు మతిపోగొట్టగలవు సినిమా ప్రపంచంలో జరిగే సంఘటనలు ఎందులో ప్రావీణ్యం గల వాడికీ మింగుడు పడవని చెప్పవచ్చు

సినిమా పాటలవెంట ఉండే డ్రిల్లులాటి డాన్సులు ఎక్కడా వుండవు వాటిలో సినిమా సాంకేతిక నియమమైన కంటిన్యుయిటీకూడా అదృశ్యమవుతుంది వ్యాపారం నిమిత్తం సినిమా చిత్రాలు సినిమా నియమాలనే ఎడాపెడా ఉల్లంఘించటం కద్దు

సినిమా ప్రంచానికి సంబంధించిన కొన్ని అంశాలు మాత్రమే ఇక్కడ ప్రస్తావించాను

*తెలుగుతెర, మాసపత్రిక, మార్చి, 1976*

# 100. తారల జీవితాలు

ఒకప్పుడు నటవిట గాయకులను పెడగా ఉంచి వాళ్ళ ప్రపంచం వేరన్నట్టు చూసేవాళ్ళు దానికేవో కారణాలు ఉంటే ఉంటాయి అయినా వాళ్ళ తో మామూలు ప్రజలకు అవసరం ఉండేది

ఈనాడు సినిమాకారులు కూడా విలక్షణమైన జీవితం గడపవలసిన స్థితిలో ఉన్నారు అందుకు కారణాలు లేకపోలేదు

సినిమాలలో ప్రమోషన్ అతి విచిత్రమైనది అలాంటిది మామూలు ప్రపంచంలో ఏ జీవితరంగంలోనూ సాధ్యం కాదు సినిమా తారలు మామూలు జీవితం తాలూకు ఏ పొరనుంచి అయినా రావచ్చు, అట్టడుగు నుంచి కూడా రావచ్చు ఇవాళ రేకుల గుడిసెలో జీవితంతో ఘర్షణపడుతున్న మనిషి రేపు సినిమా తెరమీదికి ఎక్కి, ఎల్లుండి తారాపథాన్ని అందుకోవచ్చు

స్టేజిమీద చిల్లర వేషాలు వేసుకునే మనిషి సినిమాలలో మేటి నటుడనిపించుకోవచ్చు ఎనిమిదేళ్ల పిల్లలకు స్వరజతులు చెప్పటానికి అర్హుడుకాని వాడు నేపథ్య గాయకుడుగా రాణించవచ్చు జన్మలో ఎన్నడూ నాట్యం చెయ్యని ఆర్టిస్టు, సెట్టుమీద కొంచెం సేపు రిహార్సల్స్, చేసి చిత్రంలో గొప్ప భరతనాట్యం చేసిందన్న భావం కలిగించవచ్చు

ఒక్క ముక్కలో చెప్పాలంటే సినిమా కళల ఔన్నత్యానికి గల ప్రమాణాలు వాస్తవ ప్రపంచానికి చెందినవి కావు— సినిమా ప్రపంచానికి మాత్రమే పరిమితమైనవి నిజమే, ప్లేబాక్ పాడే వాళ్ళు పెద్ద పెద్ద ఆర్కెస్ట్రాలతో దేశపర్యటనలు చేసి ''కచేరీలు'' చేస్తున్నారు ఏ మహా సంగీత విద్వాంసులూ సంపాదించనంతగా సంపాదిస్తున్నారు కాని వాళ్ల ''కచేరి''లలో పాడేవి రికార్డులలో ఉన్నపాటలే ఆరికార్డులు పెట్టుకున్నా కచేరి అవుతుంది ''అయ్యా! నగుమోము పాడండి'' అని వాళ్లను అడగటానికి లేదు, అడగదలిస్తే ఫలాన రికార్డుపాట పాడండి అని అడగాలి

ఈ ప్రమోషన్ వెంట డబ్బుకూడా ఉన్నదని వేరే చెప్పనవసరం లేదు ఇది మామూలు డబ్బు కాదు— బిగ్‌మనీ దాని ప్రమాణమూ, అది చేతికివచ్చే తీరూ మధ్యతరగతి వాళ్ల ఊహకు అందదు మామూలు ప్రపంచంలో బిగ్‌మనీ సంపాదించే స్థితికి వచ్చినవాడు నిచ్చెన మెట్లన్నీ ఎక్కుతాడు సామాజిక సంస్కృతిని క్రమంగా తలకెక్కించుకుంటూ సంస్కృతి నిచ్చెననుకూడా ఒక్కొక్క మెట్టే ఎక్కి, తన ఆర్థిక స్థాయికి తగిన సాంస్కృతిక స్థాయి ప్రదర్శించగలుగుతాడు

సినిమా సంపాదనలో ఇలాంటి పరిణామానికి అవకాశంలేదు అది వర్గాలకు అడ్డంగా దూసుకుపోయింది దిగువ మధ్య తరగతి వాణ్ని ఆర్థికంగా ఐ ఎ ఎస్ వాళ్ల స్థాయికీ, మంత్రుల స్థాయికీ, ఇంచుమించు గవర్నర్ల స్థాయికీ చేర్చుతుంది మధ్యతరగతి ఆధ్యాత్మిక ధార్మిక నైతిక విలువలు స్క్రిప్‌టీజ్ దుస్తుల్లాగా దారిలో ఎక్కడో రాలిపోతాయి వాటికోసం బెంగపడినా ప్రయోజనం ఉండదు

ఈ కారణంగా మామూలు జీవితంలో కళాకారులకూ సినిమా కళాకారులకు మధ్య ఊహించరాని అంతరం ఏర్పడుతుంది ఎంత సమర్థుడైన స్టేజి నటుడైనా సినిమాలలో చిన్న నటుడంత సంపాదించలేకపోవచ్చు అతడిలాగా జీవించలేకపోవచ్చు అలాగే గాయకులూ నర్తకులూ రచయితలూనూ

ఈ తేడా ఒక్క డబ్బు విషయంలోనే ఉంటే సాంస్కృతిక హాని జరగకపోవచ్చు కాని ఈ హెచ్చు డబ్బుతో సృష్టి అయే కళలలో ఉండే సాంస్కృతిక విలువలూ మామూలు ప్రపంచంలో ఉండే విలువలూ ఒకటి కాదు

సినిమా రచన సాహిత్య రచన అనిపించుకోదు, సినిమా సంగీతం గానం అనిపించుకోదు సినిమా నృత్యం నాట్యం అనిపించుకోదు ఒక్క సినిమా నటనే నటన అనిపించుకుంటుంది కాని అది స్టేజినటనకాదు

సినిమాకారులకు రోజువారీ జీవితం ఉంటుంది కాని అది మామూలు ప్రపంచంలో వాళ్ళు అనుభవించే జీవితం కాదు భానుమతీ రామకృష్ణ ఈ తేడా ఏమిటో ఒక్కముక్కలో చెప్పింది ''నాకు అందరాడవాళ్లతో కలిసి పేరంటాలకు పోవాలని ఉంటుంది కాని పోలేను ''

సినిమా కళాకారులలో అగ్రశ్రేణి వాళ్లు ''మామూలు'' జీవితాలు జీవించలేరు వాళ్ల

తీరు 'స్థాయి' నిలబెట్టుకునేటందుకు సినిమా సెట్టింగులలాంటి ఇళ్లలో ఉండాలి తమ హోదాకు తగ్గ కార్లలో తిరగాలి— అసిస్టెంటులనూ గుమస్తాలనూ నౌకర్లనూ చాకర్లనూ— డ్రైవర్ల నూ జమిందారు పరివారాన్ని పెట్టుకోవాలి చెట్టుమీద పక్షులు చేరినట్టు లేదా చెరువునిండితే కప్పలు చేరినట్టు దగ్గర బంధువులూ దూరపు బంధువులూ ఆశ్రయిస్తారు ఉత్తరాలకట్టలు వచ్చిపడతాయి పబ్లిసిటీ—పత్రికల వాళ్లు— ఫోటోగ్రాఫర్లు— ఇంటర్వ్యూలు — అభిమానులు — అభిమాన సంఘాలు! ఈ ప్రపంచంలో సినిమా తారలు జీవించాలి

మామూలు ప్రపంచంలో జరిగే రాజకీయ రభసలూ, పత్రికల్లో వచ్చే నిత్య వార్తలూ ఈ సినిమాతారల జీవితంలోకి చొరవగా ప్రవేశించలేవు, వాటి గొణుగుడు అస్పష్టంగా వినిపిస్తుంది నిజానికి ఆ వార్తల ప్రాముఖ్యం వారి జీవితాలకు సాధారణంగా ఉండదు– అనుకోకుండా ఇన్‌కమ్‌టాక్స్ వాళ్ల సోదాలకు వచ్చినప్పుడు తప్ప

మామూలు ప్రపంచపు తనిఖీ ఇంకో రకంగాకూడా ఉంటుంది చందాలవాళ్ల తగులుకుంటారు వచ్చినవాళ్ళు పెద్దవాళ్లయితే పెద్దమొత్తాలు ఇచ్చుకోవడం తప్పదు అందులో కూడా హోదా నిలబెట్టుకోక తప్పదు పదులూ, ఐదులూ చందాలివ్వటంలో నష్టంలేదుగాని హోదాకూడా లేదు

తారలు పెరిగినప్పుడూ, తరిగినప్పుడు కూడా ఆర్థిక సమస్యలు వాళ్ల జీవితాలను నడిపిస్తాయి ఎంతచెట్టు కంతగాలి కదా! హోదా నిలబెట్టుకోవటం ఖర్చుతోకూడిన పని తారత్వం శాశ్వతం కాకపోవచ్చు తారాపథం నుంచి దిగివచ్చినాక మామూలుగా బతకటానికైనా డబ్బు వెనక వేసుకోవాలి, పూలమ్మిన చోట కట్టెలమ్మటం కష్టం ప్రావిడెంటు ఫండూ, గ్రాట్యుయిటీలు ఉండే ఉద్యోగాలుకావు సినీనటులవి ఆస్తిపాస్తులు సంపాదించవచ్చుగాని ప్రభుత్వం సీలింగులనీ చట్టుబండలనీ అనవచ్చు నల్లడబ్బు చేర్చితే అది దొరికి పోవచ్చు

అందుచేత సినిమాతారల సమస్యలు వేరు అవి కూడా ఉన్నత వర్గం సమస్యలే! చిక్కేమిటంటే వాళ్లది స్థిరమైన ఉన్నత వర్గంగా ఉండదు సాధారణంగా వాళ్ల జీవితాలు సినిమా కథలంత అభూత కల్పనలుగాను ఉంటాయి

పై వర్గంలాగా జీవించటంలో కొన్ని తిరుగుళ్లు ఉంటాయి ఆ వర్గానికి సంబంధించిన వినోదాలూ, అతిథి మర్యాదలూ వ్యసనాలూ అలవడక తప్పదు కింది వర్గాలను బాధించే నియమాలనుంచి కొంత స్వేచ్ఛకూడా ఉంటుంది అ స్వేచ్ఛను వినియోగించుకోకుండా ఉండటమూ, ఆత్మనిగ్రహం ప్రదర్శించటమూ తారత్వాన్ని అతిశయింపజెయ్యవు

ఇదంతా ఇలా ఉన్నందుకు ఒకరిని తప్పుపట్టే పనిలేదు ఈనాడు ఉన్న పునాదిమీద సినిమా ప్రపంచం ఇలా ఉండటం తప్పనిసరి మనస్తత్వాల మీద వాతావరణానికి గల ప్రభావం అనివార్యమని చెప్పనవసరంలేదుగాని, చాలా బలీయమైనది

అసలు సమస్య ఏమంటే, సినిమా ప్రపంచానికి మామూలు ప్రపంచంపైన గల ప్రభావం దాన్ని గురించి ఇంకొక్కసారి ఆలోచింతాం

*తెలుగుతెర, మాసపత్రిక, ఏప్రిల్, 1976*

# 101. సినిమా ప్రభావం

సినిమా ప్రపంచంలో అందరూ డబ్బులో ఈదుతూ ఉంటారని నా అభిప్రాయం ఎంత మాత్రమూ కాదు అందులోకూడా దారిద్ర్యం ఉన్నది చిత్రమేమిటంటే ఆ దారిద్ర్యంకూడా మామూలు ప్రపంచలోని దారిద్ర్యానికి భిన్నంగా ఉన్నట్టే కనిపిస్తుంది

సినిమా ప్రపంచంలో తక్కువ జీతగాళ్ళున్నారు కానివాళ్ళు ఇతర రంగాలలోని తక్కువ జీతగాళ్లవంటి వాళ్లుకారు ప్రొడ్యూసర్లకూ, నటీనటులకూ కాఫీలు అందించే వాళ్లుకూడా పనివున్నంత కాలమూ అందలాలు ఎక్కి తిరుగుతారు వాళ్ల జీవితం వేగంతోనూ, సంచలనంతోనూ కూడుకొని ఉంటుంది అది భూమిని అంటదు వేళ్ళుతన్నదు ఒకవిధంగా అది జమీందార్ల కొలువులాగే ఉంటుంది, కాని జమీందార్ల కొలువుచేసిన నౌకర్లకు ఉండిన స్థిరత్వం వీరికి ఉండదు సినిమాలలో పనిచేసే అందరిలాగానే చిల్లర జీతగాళ్లుకూడా ఒక రకమైన త్రిశంకు స్వర్గంలో నివసిస్తూ మామూలు ప్రపంచంలో వాళ్లకు కృతకంగా కనిపించే మానసిక చైతన్యాన్ని ప్రదర్శిస్తారు

ఇంకొకటి ఏమిటంటే, దెబ్బతిన్న చిత్రాలలో పనిచేసేవాళ్లందరూ తమ జీవితాలను పెట్టుబడిదారీ నియమానుసారం— రాబట్టుకుంటారు సినిమా వ్యాపారపు లాభనష్టాలతో వారికి ప్రమేయంలేదు అంతవరకు సవ్యంగానే ఉంది కాని ఒక కంపెనీ దివాలా ఎత్తితే ఆ కంపెనీని మాత్రమే ఆశ్రయించి బతుకుతున్న చిల్లర ఉద్యోగులు ఏమవుతారు, వాళ్ళ అనుభవం ఎంత ఎక్కువైతే వాళ్లు అంతగా నష్టపోతారు మాటవరసకు, పాతికేళ్లు ప్రొడక్షన్ అసిస్టెంటుగా పనిచేసినవాడు ఆ ఉద్యోగంపోతే ఇంకోపని చెయ్యటానికి పనికిరాడు సినిమాల పద్ధతులు అతి వేగంగా మారుతూండటంచేత సొంత అనుభవాలు కొత్త పరిస్థితులకు పనికిరావు

అయితే సినిమా ప్రపంచంలో ఉండే దారిద్ర్యం పైకి కనిపించేదికాదు సినిమా జీవితం అందలాలెక్కి తిరగటంలాగే ఉంటుంది సినిమాలతో ఏవిధమైన సంబంధంగల వాళ్ళయినా బస్సులలో ప్రొడక్షనులను గురించి, కాల్ షీట్ల గురించి, తారలను గురించీ మాట్లాడుతూంటే, వాళ్ళదే జీవితం అనిపిస్తుంది సినిమా పత్రికలు ఈ గ్లామర్‌ను దేశం నలుమూలలా విరజల్లుతాయి దీని ప్రభావం జీవితంలోకి అడుగుపెట్టే యువకులమీదా, పెళ్ళిళ్ళు చెయ్యటమంటే పీకలు తెగగోసుకోవటమేనని గ్రహించిన ఆడపిల్లల మీద అపారంగా ఉంటుంది దీనికితోడు, తమకుతెలిసిన వాళ్లు— తమదృష్టిలో ఎందుకూ పనికిరాని వాళ్ళు— అలా మద్రాసుపోయి ఏ సినిమా కంపెనీలోనో చేరిపోయారని తెలిసినవాళ్లకు సినిమా వ్యసనం మహాబలంగా పట్టుకుంటుంది

సినిమా గేట్లు దాటటానికి నిర్దిష్టమైన అర్హతలంటూ లేని పరిస్థితిలో "అదృష్టం" అన్నది మాత్రమే లెక్కలోకి వస్తుంది ఎవడి అదృష్టంవాడిది తమలాగే సినిమా దాహంతో మద్రాసుపోయి, చెడతిరిగి, తెచ్చుకున్న డబ్బు ఖర్చయిపోయి, తిండికి ముష్టెత్తి చావుతప్పి కన్ను లొట్టబోయి, నిరాశతో ఇంటికి తిరిగివచ్చినవాళ్ళు నూరుమందిఉన్నా, నూట ఒకటోవాడు తన అదృష్టం మరోవిధంగా ఉండవచ్చుననుకుంటాడు అది వాడితప్పుకాదు రష్యాలో సినిమాలో ఎలాటి పనిచేసినవాడికైనా ఒక డిప్లొమా ఉంటుందట మనదేశంలో అలాటిదిలేదు సినిమాలో ప్రవేశించినవాళ్లలో తొంభైతొమ్మిది శాతం, ప్రవేశించ లేకపోయిన వాళ్ళు చేసిన

ప్రయత్నాలు చేసినవాళ్లే నీతి అంటూ ఏమీలేదు

సినిమా సరిహద్దుకు లోపలా, వెలుపలా ఎంతతేడా ఉన్నదంటే, సినిమాలలో పెద్ద పనులు చేద్దామని వచ్చినవాడు చిన్నపనులు చెయ్యటానికి కూడా సంతోషంగా ఒప్పుకుంటాడు "అబ్బో, నీపాట ఘంటసాలకు ఏమీతీసిపోదు," అని మిత్రులు చెప్పిన మాట నమ్మి సినిమాలలో ప్లేబాక్ పాడదామని వచ్చినవాడు, అడ్డమైన వాళ్లనూ కలుసుకుని, పరిస్థితి అంతా తెలుసుకున్నాక, కోరస్‌లో పాడే అవకాశం దొరికినా మహాభాగ్యమే అనుకుంటాడు అలాగే పెద్దవేషాలమీద ఆశపెట్టుకుని వచ్చిన నటుడు పరిషత్తులలో రాణించినవాడు అనుకుందాం—టు బిగిన్ విత్, ఒక ఎక్‌స్ట్రా వేషం దొరికినా తృప్తిపడతాడు, దాన్నే నిచ్చెన అడుగుమెట్టుగా భావిస్తాడు

సినిమా వ్యామోహం ఉద్యోగులకే పరిమితం కాదన్న సంగతి అందరికీ తెలుసు రిలీజైన చిత్రం మొదటిరోజు మొదటి ఆట చూడాలన్న శపథంగలవాళ్ళు మొదలుకుని కొనో, ముష్టెత్తో ప్రతిసినిమా పత్రికా ఈ చివరనుంచి ఆ చివరిదాకా చదవనిదే నిద్రపోనివాళ్ళందరూ సినిమా ప్రభావానికి గురి అయినవాళ్లే అన్ని పత్రికలలోనూ సినిమాబొమ్మలూ, వార్తలూ ఉంటాయి ఆడవాళ్లే పత్రికలు అధికంగా చదువుతారు

"పెద్ద స్టారుమల్లీనూ! ఇంత అసహ్యంగా ఉందేమే! మనరాధ ఇంతకన్న లక్షరెట్లు బాగుండదూ!" అంటుందొక తల్లి "సముద్రంలో ఇంతకన్న పెద్ద చేపలున్నాయి," అన్న ఇంగ్లీషు సామెత సినిమా ప్రపంచానికి వర్తిస్తుంది దేశంలో ఉన్న అత్యుత్తమ నటులూ, రచయితలూ, గాయకులూ ఇత్యాదులు సినిమాలలోనే ఉన్నారనుకోవలిసిన అవసరం లేదు (అందుకే గదా సినిమాఛాన్సు అదృష్టం అనుకునేది?)

ఇలా తల్లులు వెయ్యిమంది అన్నమీదట ఒక "రాధ" అయినా తెగబడకపోదు అలా తెగబడినవాళ్లలో ఒకరిద్దరు సినిమాగేట్లు గడిచి లోపలికిరావచ్చు మగవాడికి సినిమాప్రవేశం కావాలంటే అదృష్టం ఎంత అవసరమో, ఆడదానికి "సాహసం" అంత అవసరం అందుకే సినిమా ప్రపంచంలో ఆడవాళ్ళ "సాహసం" వాసన జాస్తిగా ఉంటుంది

సినిమా ప్రపంచపు రెండోప్రభావం సినిమా చిత్రాలనుంచి ఏర్పడేది దీన్నిగురించి లేశమాత్రంగా పత్రికలలో కూడా చదువుతూ ఉంటాం ఎవరో సినిమా చిత్రంలోలాగా దొంగతనాలు చేస్తారు, ప్రేమకలాపాలు సాగిస్తారు, ఇంకేవేవో చేస్తారు సినిమా చిత్రాలలో కనిపించే ప్రపంచం కూడా వాస్తవ ప్రపంచానికి భిన్నంగా ఉంటుంది గనక, సినిమా చిత్రాల ప్రభావంవల్ల అనేకమంది మానసికంగా ఒక కృత్రిమ ప్రపంచంలో జీవిస్తూ, యదార్థ జీవితానికి పనికిరాకుండాపోతారు

సినిమా చిత్రాలలో ఉండే సంస్కృతి అవాస్తవికమేకాక, అభ్యుదయ నిరోధకంగా కూడా ఉంటుంది ముఖ్యంగా ఆడదాన్ని ద్వాపరయుగం నుంచి ఇవతలికి రాకుండా ఉంచటానికి సినిమా చిత్రాలు పడేపాట్లు జుగుప్సాకరంగా ఉంటాయి అయినా సినిమా ప్రేమలు ప్రబంధ ప్రేమలులాగా ఉంటాయి, నీతిమాత్రం పురాణనీతి, నాయికానాయకులు ఆధునిక పాశ్చాత్య ప్రమాణాలను ప్రతిబింబిస్తూ పరమ ఛాందసమైన నైతిక ప్రమాణాలకు దాసులౌతారు ఈ మిశ్రమాన్ని మింగటమే కష్టం

*తెలుగుతెర, మాసపత్రిక, మే, 1976*

# 102. సినిమా కళకాదు

మనమీద వాతావరణ ప్రభావ ం ఎంతగా వుంటుందంటే, మనం అనేక జీవిత రంగాలకు సంబంధించిన ఉత్తుత్తి సమస్యలను గురించి ఏళ్ళతరబడి చర్చించగలం! రాజకీయరంగంలో ప్రజాస్వామ్యం, స్వాతంత్ర్యం లాంటివి ఉత్తుత్త సమస్యలు అలాగే ఆర్థికరంగంలో తలసరి ఆదాయమూ, పొదుపు వుద్యమమూ, హరిత విప్లవం, ద్రవ్యోల్బణ నిరోధము లాంటి ఉత్తుత్త సమస్యలున్నాయి ఈ ఉత్తుత్త సమస్యలు పత్రికలు నింపటానికీ, మేధను మహా ఉపయోగిస్తున్నట్టు కొందరు నటించటానికీ పనికివస్తాయి

''సినిమా కళా, వ్యాపారమా?'' ఈ ప్రశ్న గురించి చాలామంది తర్జన భర్జనలు చేసి, విసుగెత్తి ''ఫ్లాప్ చిత్రానికి నిర్వచనం ఏమిటి?'', ''సినిమాలలో మనుషులను చిత్రవధ చెయ్యటమూ, స్త్రీలను బలాత్కారంగా గాని, అబలాత్కారంగా గాని అనుభవించటం చూపాలా వద్దా?'' లాంటి సమస్యలను గురించి చర్చిస్తున్నారు ఈ సమస్యలు కూడా ఉత్తుత్తి అని తోచినమీదట ఇంకేమో సమస్యలు సృష్టిస్తారు కాలక్షేపం కావటం ముఖ్యం

అయితే మనం గమనించవలసిన అసలు విషయం ఏమిటంటే, సినిమాకు సంబంధించిన ఏ కొత్త సమస్యల వెనకనైనా పాతసమస్యలే వుండేది ''ఫ్లాప్ చిత్రం నిర్వచనం'' అంటే సినిమా వ్యాపారమా, కాదా అన్న సమస్యకు పుట్టిన బిడ్డ అన్నమాట అలాగే వయొలెన్స్, సెక్స్ సమస్యలు 'సినిమా కళా, కాదా' అన్న సమస్యకు పుట్టినవే!

ఈ భ్రమలనుంచి బయటపడాలంటే మనం స్పష్టంగా గ్రహించవలసిన విషయం ఏమంటే, సినిమా కళకాదు ఈ మౌలిక సత్యాన్ని గుర్తించని వాళ్ళు సినిమా చిత్రాలను అవాస్తవికంగా విమర్శిస్తున్నారు! సినిమాకారుల ప్రతిభా వ్యుత్పత్తులను గురించీ, కళాకారుల గురించి అర్థంలేని వ్యాఖ్యానాలు చేస్తున్నారు

ఇందులో డబుల్ గందరగోళం కూడా ఉంటున్నది అదేమిటంటే పరస్పర సంబంధంలేని వ్యాపార, కళా సమస్యలను ఒకటి చేసి, హిట్ అయిన పిక్చర్లను కళాఖండాలని ప్రచారం చెయ్యటం కొన్ని హిట్ పిక్చర్లు తీసిన కళాకారులే ఫ్లాప్ పిక్చర్లు తీయటం జరిగితే ఏమనటానికీ తెలీక నానాగొడవా పడిపోతున్నవారు కూడా వున్నారు వారు తాము గొడవపడి జనాన్ని గొడవపెడుతున్నారు

అసలు ఈ కళ అనే మాట మనకు విజాతీయమైనది మన సంప్రదాయంలో విద్యలున్నాయి సినిమా చిత్రాలు నిర్మించటం ఒక విద్య ప్రతివాళ్ళు చిత్రం తీసినప్పుడు తమ విద్య ఏపాటిదో చూపుతారు ఈ విద్య ఏ ఒక్కరిలోనూ సమగ్రంగాలేదని, ప్రతి సినిమా చిత్రంలోనూ 'బొక్కలు'— ఒక్కోసారి మహాదారుణమైన బొక్కలు కూడా— ఉన్నాయనటానికి సందేహం ఏమీలేదు కాని సినిమా చూసే ప్రేక్షకులకు కావలసింది నిర్మాతల విద్యాపాటవం కాదు, ఇంకేదో అదేమిటో తెలిస్తే లోకాలను జయించినట్టే

అందుచేత హిట్ పిక్చర్లన్నీ కళాఖండాలనటమూ, వాటిలో పాల్గొన్నవారు గొప్ప కళాకారులనటమూ, కొందరుచేరి 'ఉత్తమ' సినీ అంశాలను నిర్ణయించి బహుమానాలివ్వటమూ, ఇదంతా ఒక ఆట— అసలైన బొమ్మలాట

మాటవరసకు ఒక పిక్చరు దాని నిర్మాణ వ్యయం కన్న రెట్టింపు లాభం తెచ్చిందనుకుందాం అది మంచి చిత్రంకాదని పత్రికలన్నీ ఘోషించినా, దానికి ఎవరూ ఎలాటి అవార్డూ ఇయ్యక పోయినా నిర్మాతలు విచారించరు పైపెచ్చు తమ పిక్చరు బాగాలేదన్న వాళ్ళకన్నా మూఢులు ప్రపంచంలో ఉండబోరని కూడా అనుకుంటారు అంతేకాదు, అదే ధోరణిలో పిక్చర్లు తియ్యటానికి అరడజను మంది ప్రొడ్యూసర్లు ముందుకొస్తారు

నిర్మాతకూ, డిస్ట్రిబ్యూటర్లకూ కావలసింది ఆర్థికవిజయం ఆర్థిక విజయం వచ్చినాక తమ పిక్చరు కళాఖండమని ఎవరన్నా అంటే వారికేమీ అభ్యంతరం చెప్పలేదు కాని కళాఖండమన్న మాట పుట్టినాక పిక్చరుకు డబ్బురాకపోతే పొడ్యూసరు కళాఖండమన్నవాణ్ణి చంపి పారెయ్యాలనుకుంటాడు ఇందులో అతిశయోక్తి ఏమీలేదు

డైరెక్టర్ల మాటేమిటి? నిజానికి చిత్ర నిర్మాణ విద్య వారిది అయితే స్టార్ సిస్టమ్ వచ్చాక డైరెక్టర్లు దగాపడిన తమ్ములు అయారు వాళ్ళు చెప్పినట్టు పెద్ద స్టార్లు వినరు డైరెక్టరు బాధ్యతలు లేకుండా, అధికారాలు మాత్రం చెలాయిస్తారు స్టార్లు! ఈ విషయంలో చాలామంది డైరెక్టర్లు బొత్తిగా నిస్సహాయులు

కాని అందరూ కారు వీరిలో కొందరికి తమ విద్యలో ప్రావీణ్యంవుంది వాళ్ళు తమ అభిరుచులకు అనుగుణంగా పిక్చర్లు తీస్తారు దాన్ని కావలిస్తే కథాకౌశలం అనండి, కాని అభిరుచి కామన్‌సెన్సుకు కూడా అతీతంగా ఉంటుంది పిక్చరు రిలీజయాక జర్నలిస్టూ, ప్రేక్షకులూ, ''ఇదేమిటి?'' అని లోపాలు ఎంచటం మొదలుపెడతారు కాని ప్రేక్షకులపాటి తెలివితేటలు డైరెక్టరుకు అందులోను తన విద్యలో నిష్ణాతుడైన వాడికి ఉండవా? తప్పక ఉంటాయి

ఇలాటి డైరెక్టర్లు తమ పిక్చర్లు ఆర్థికంగా దెబ్బతిని, తమకీర్తికి భంగం వాటిల్లినప్పుడు బాధపడవచ్చు— కానీ వాళ్ళు తమ సృష్టి లోపభూయిష్టమని మాత్రం ఒప్పుకోరు ప్రేక్షకులకు లోపాలుగా కనిపించినా అవి వారి దృష్టిలో చాలా అల్పవిషయాలు సినిమా డైరెక్టర్లకూ, సామాన్య సినిమా ప్రేక్షకులకూఉండే సామాజిక సంపర్కం పరోక్షమైనది అంటే ఇతర జీవితరంగాలకు సంబంధించినది కావటంచేత డైరెక్టరు అభిరుచులను ప్రేక్షకులు పరామర్శించటమూ, పరామర్శించక పోవటమూ కేవలం దైవాధీనంగా వుంటుంది అలాంటి వాళ్లు నిర్మించిన చిత్రం విజయవంతమైనప్పుడు ఆ డైరెక్టరుకు ప్రజాహృదయం తెలిసిందని భ్రమపడతాం, ఈ భ్రమ తరువాత తొలగిపోవచ్చు

ఇటువంటి పరిస్థితి నిజమైన కళలకు ఎన్నడూ పట్టదని వేరే చెప్పనవసరంలేదు కథలూ, నవలలూ, కవితలూ, గానాలూ, చిత్రకళావగైరా రంగాలలో వారు ఆదివారం ఆకాశమంత ఎత్తు పెరగడమూ, సోమవారంనాడు ఫ్లాప్ అయిపోవడమూ జరగదు నిజమైన కళాకారులు దశాబ్దాల తరబడి ప్రజాభిమానాన్ని చూరగొంటారు మరి జరిగిన నలభై చిల్లర ఏళ్ళలో ఎంతమంది డైరెక్టర్లు పైకి వచ్చి దిగిపోయారో చూడండి

బాక్సాఫీసు విజయాలను ఆధారంగా చేసుకుని ఇటీవల ముగ్గురు డైరక్టర్లను పత్రికలు పైకెత్తాయి— బాపూ, దాసరినారాయణరావూ, విశ్వనాథ్ వీళ్ళ మధ్య ఉన్న సామ్యం హిట్ పిక్చర్లు తియ్యటం కాదు— తమకు కావలసిన పిక్చర్లు తియ్యడం పాతతరం డైరెక్టర్లలో ఇలాటి

ప్రత్యేకత కలవారు బి యన్ రెడ్డి గారు

డైరెక్షన్ కళకాదని బాపు ద్వారా రుజువు చెయ్యొచ్చు బాపు ప్రసిద్ధ చిత్రకారుడు బాపు బొమ్మలు ఫ్లాప్ అయినట్టు నేనెన్నడూ వినలేదు కాని బాపు తీసిన సినిమాలు ఫ్లాప్ కావటం అనూహ్యం కాదు

ఈనాడు తెలుగు సినిమారంగంలో చాలా మంది డైరక్టర్లున్నారు వారిలో చాలా మంది తమ సృజన శక్తిని అమ్ముకునే వారిలాగా కనిపిస్తారు తమకు కావలసినదంటూ వున్నా అదే తియ్యాలన్న పట్టుదల వారికి వున్నట్టు కనిపించదు వాళ్ళు వృత్తి డైరెక్టర్లు మరికొందరు డైరెక్షనంటే ఏమిటో తెలియకుండానే, ఇతర సాంకేతిక నిపుణులమీద , అనుభవం గల నటవర్గం మీద ఆధారపడి డైరక్షన్ చూసుకుంటూండవచ్చు ఈ పరిస్థితుల్లో సినిమా ఒక కళ అనుకోవడం ఒకభ్రమ

*వెండితెర, వారపత్రిక, జన్మదిన ప్రత్యేక సంచిక, 1-10-1976*

# 103. గూడవల్లి రామబ్రహ్మం

ఈనాటి సినిమాలు చూసేవారికి రామబ్రహ్మం మరో యుగానికి చెందిన నిర్మాతగా తోస్తే ఆశ్చర్యం లేదు నిర్మాతగా ఆయన మనస్తత్వం వాళ్ళు ఊహించను కూడా లేరు

రామబ్రహ్మంలో జాతీయోద్యమ ప్రభావమూ, సాహిత్య ప్రభావమూ, సినిమాల ద్వారా ప్రజలకు సాంస్కృతికంగా ఏదో చెయ్యాలన్న అభిలాషా కూడా ఉండేవి మాలపిల్ల, రైతుబిడ్డ చిత్రాలే ఇందుకు నిదర్శనం

అయితే రామబ్రహ్మంలో మరి రెండు ప్రేరణలు కూడా లేకపోలేదు ఒకటి, నిర్మాతగా గొప్ప కీర్తి గడించాలనేది రెండోది సినిమా వ్యాపారంలో మిగతా నిర్మాతలను పోటీ ద్వారా మించిపోవాలనేది ఇందులో మొదటిది శ్లాఘనీయమైనదికాదు అయితే ఈపోటీ మనస్తత్వం రామబ్రహ్మం స్వభావం నుంచి ఉత్పన్నమైనదిగా కనబడదు అది డిస్ట్రిబ్యూటరు పారుపల్లి శేషయ్యగారి నుంచి సంక్రమించినది అయివుండవచ్చు ఏమైనా లక్షరూపాయలుపోసి తెలుగు సినిమా చిత్రం తీయటం అవాంఛనీయంగా అనేకమంది భావిస్తున్న తరుణంలో రామబ్రహ్మం తన చిత్రం ( ఇల్లాలు) పబ్లిసిటీ కింద 42 వేలు ఖర్చు చేసిన మాట నిజం

అదే సమయంలో సినిమా తీయటానికి ఎంత ఖర్చుచెయ్యాలి అన్నదాన్ని గురించి 1941-42లో ఆంధ్ర వారపత్రికకూ, ప్రజామిత్రకూ మధ్య కొంత సంఘర్షణ జరిగింది ఆరోజుల్లోనే స్టార్ సిస్టమ్ ఆరంభమయింది ఈ పోటీలో రామబ్రహ్మంతో బాటు బి యన్ రెడ్డి, వై వి రావు కూడా పాల్గొన్నారు అయితే ఈ ముగ్గురూ ప్రయోజనాత్మకమైన చిత్రాలు తీసిన వారే ''మాకు కావలిసింది డబ్బు'' అని కుండ పగలేసి అన్నవాళ్ళు కారు అలా అనే అవకాశం కూడా అప్పట్లో లేదు ఎందుకంటే, ఆ కాలంలో సినిమాలు హెచ్చుగా కొంత సంస్కారం గలిగిన ప్రేక్షకుల ఆదరాభిమానాలపై ఆధారపడేవి

రామబ్రహ్మం డబ్బు కోసం తీసిన పిక్చరు లేకపోలేదు అది 'మాయలోకం' అది నిర్మాణం జరిగినప్పుడుగాని విడుదల అయినప్పుడుగాని నేను మద్రాసులో లేను నేను తిరిగి మద్రాసు వచ్చినాక 'మాయలోకం' గురించి తెలిసింది దానికి బాగా డబ్బు వచ్చిందన్నారు

నాకా పిక్చరు చూపించమని రామబ్రహ్మాన్ని అడిగాను రామబ్రహ్మం, డబ్బు తెచ్చిన తన చిత్రాన్ని గురించి గర్వపడటానికి బదులు సిగ్గుపడిన వాడిలాగా, ''అది నువ్వు చూడాలిసిన పిక్చరు కాదులే, బ్రదర్'' అన్నాడు

అచ్చగా ఆమాటకే అయితే రామబ్రహ్మాన్ని నేను అంతగా మెచ్చుకోక పోదునేమో కాని ఆయన 'మాయలోకం' లాటిదే మరొకటి ప్రారంభించక, 'పల్నాటి యుద్ధం' ప్రారంభించాడు దాన్ని బట్టి ఆయన నాతో అన్నమాట ''పోజు'' కాదని స్పష్టమయింది

ఈ పల్నాటి యుద్ధం గురించి మరొక సంగతి కూడా చెప్పాలి ఈ కథ సినిమా తీయాలని రామబ్రహ్మం చాలా కాలంగా కలలు కన్నాడు మాలపిల్ల విడుదల అయాక నేను ఆయనను బెజవాడలో కలిశాను ఆ సమయంలో కృష్ణాపత్రికలో మాలపిల్లను దుయ్యబట్టారు ''కృష్ణా పత్రిక లో రాసిన దానికి సమాధానం రాయి, కొడవటిగంటీ, ప్రజామిత్రలో వేస్తాను'' అన్నాడాయన సినీ జర్నలిస్టుగా నన్నాయన వాడుకున్నది ఆ ఒక్కసారే అప్పుడే ఆయన తనకు పల్నాటి యుద్ధం తీయాలని ఉన్నట్టూ, అది తన జీవితాశయం అయినట్టూ బయటపెట్టాడు

''ఈసారి అదే తీయరాదా?'' అన్నాను

''అబ్బో, దానికి చాలా కృషిచెయ్యాలి'' అన్నాడాయన

ఆ కృషి ఏమిటో నాకు తరవాత గాని అర్థం కాలేదు ఆయన పల్నాటి వీరచరిత్ర మీద ఎంతో చదివాడు దాన్ని ఎనలైజ్‌చేశాడు 1945 లో నాజర్ బుర్రకథ విని ముగ్ధుడై, అతన్ని తన యింటికి ఆహ్వానించి, '' ఏం, నాజర్! నీ అంతటివాడు రాబోతాడని తెలీక దొడ్డారపు వెంకటస్వామి చేత బుర్రకథ రికార్డు చేయించాను కొత్త కథ ఏమైనా రాస్తున్నావా?'' అని అడిగాడు రామబ్రహ్మం

''పల్నాటి వీర చరిత్ర రాద్దామనుకుంటున్నాను,'' అన్నడు నాజర్

రామబ్రహ్మం వెంటనే లేచి ఒక పుస్తకం తెచ్చి నాజరుకిచ్చి, ''ఇది చదివినాక బుర్ర కథ రాయి,'' అన్నాడు పల్నాటి యుద్ధానికి వెనక గల ప్రధాన కారణాలు వివరించి చెప్పాడు

రామబ్రహ్మం పల్నాటి యుద్ధం ప్రారంభించాడు గాని పూర్తి చెయ్యలేదు అందులో ఆయన తీసినవి మాంచాలకు సంబంధించిన సీక్వెన్సులు రెండే రెండు ఆ చిత్రం పూర్తి అయింది కాని అది రామబ్రహ్మం కనిన కలగా రూపొందిందని నేను అనుకోను (బ్రహ్మనాయుడూ, నాయకురాలూ డ్యూయెట్ పాడాలని రామబ్రహ్మం అనుకుని ఉంటాడా!)

నిర్మాతగా రామబ్రహ్మం ఆ కాలపు సినీరంగాలలో సమర్థుడనే చెప్పవచ్చు కాని డైరక్షనులో చెప్పుకోదగినంత విశిష్టత గలవాడు కాదు రైతుబిడ్డ తీసేటప్పుడు ఆయన రాఘవాచారితో సతమతం కావడం చూశాను అంతటి నటుణ్ణి డైరెక్టు చేసే దక్షత రామబ్రహ్మంలో లేదన్నది స్పష్టం ఇతర సాంకేతిక ప్రవీణులను నడపటంలో కూడా రామబ్రహ్మానికి సామర్థ్యం తక్కువే డైరెక్టరుకు సృజనశక్తి ఉండాలన్నది రామబ్రహ్మానికి తెలియదేమో ననుకోవాలి

కాని రామబ్రహ్మం సినీ రంగంలో పైకి ఎక్కి వచ్చిన పద్ధతి నిర్దుష్టమయినది పి వి దాసుగారు మద్రాసులో సినిమా నిర్మాణం ప్రారంభించిననాడే రామబ్రహ్మం ఆ పరిశ్రమ

యొక్క లఘువు బిగువులు తెలుసుకోవటం ప్రారంభించాడు తరువాత ప్రొడక్షను నిర్వహించి చాలా అనుభవం కలిగినదాకా నిర్మాతగానూ, దర్శకుడుగానూ ముందుకు రాలేదు ఈకాలపు వాళ్ళకు అంత ఓర్పు ఉండటం అరుదు అంత కాలం ''ఎప్రెంటిస్'' గా ఉన్నవాడు చిత్ర నిర్మాణ రంగాలన్నటిని గురించి ఎంతో క్షుణ్ణంగా తెలుసుకుని ఉండవచ్చు ఆయన ఆ పని చెయ్యలేదు ఆయన తీసిన షాట్స్ ఏ విధంగానూ ఎడిటింగుకు లొంగక పోవటం నాకు తెలుసు

సాంకేతిక విషయాల కన్న సంస్కృతికి సంబంధించిన విషయాలే రామబ్రహ్మాన్ని బలంగా ఆకర్షించేవి ప్రతిభగల వాళ్ళంటే ఆయనకు వల్లమాలిన అభిమానం అలాంటి వాళ్ళను చుట్టూ పెట్టుకుని కాలక్షేపం చెయ్యటం చిత్రనిర్మాణంలో ఆయనకు ముఖ్యంగా కనిపించేదేమో

నాకు తెలిసినమటుకు రామబ్రహ్మం అనేక రకాల సంకుచితత్వాలను అధిగమించిన వాడు బుర్ర కథలూ, జముకుల కథలూ, నాటకాలూ, సాహిత్యమూ, సంగీతమూ మొదలైన వాటిలో ఆనందం పొందగలవాడు ( నాకు ఆయన జముకుల కథ కొద్దిసేపు వినిపించాడు ) ఎంత చిన్న కళలోకూడా ప్రతిభను గౌరవించేవాడు స్నేహపాత్రుడు తాను సినిమాజీవి కనక అస్తమానమూ సినిమా విషయాలే మాట్లాడే స్వభావం గలవాడు కాడు ఆయన మానసిక జీవితం సినిమా రంగాన్ని మించి విశాలంగా ఉండేదని నా ఇంప్రెషన్

అచ్చు కాంగ్రెస్ వాడిగా ఆయన కమ్యూనిస్టులను అమోదించిన వాడు కాడు అభ్యుదయ రచయితల సంఘాన్ని ఆయన కమ్యూనిస్టు అనుబంధ సంస్థగానే చూశాడు కాని ఆయన ప్రజానాట్య మండలి వాళ్ళ నాటక ప్రదర్శన ( ముందడుగు అనుకుంటాను) చూసి తన్మయుడై పోయి , నటులను ఎంతగానో అభినందించాడు

ఈనాడు రామబ్రహ్మం లాంటి వ్యక్తికి సినిమా రంగంలో చోటు ఉండదేమో అనిపిస్తుంది ఈనాటి స్టంటు పిక్చర్లను గురించి ఆయన ఏమనుకుని ఉండేవాడో మనం ఊహించవచ్చు ఏమయినా సినిమా కళ ప్రారంభదశలోనే ఉండగా దానికి కొంత ఖ్యాతి చేకూర్చి పెట్టిన ఘనత రామబ్రహ్మానికి దక్కుతుంది

*కినిమా పక్షపత్రిక, 15-2-1972*
*పునర్ముద్రణ 1 తెలుగుతెర, మాసపత్రిక, 10-10-1976*
*2 చిత్ర సంస్కార, మాసపత్రిక, 10-11-1976*

# 104. సంస్కార హృదయుడు రామబ్రహ్మం

చాలా మంది వ్యక్తిత్వం వ్యక్తికే పరిమితమవుతుంది కొద్ది మంది వ్యక్తిత్వం శాఖోపశాఖలుగా విస్తరించి, సామాజిక చైతన్యాలను ప్రేరేపించటమూ, వాటినుంచి ప్రేరణ పొందటమూ జరుగుతుంది రామబ్రహ్మం రెండో రకం వ్యక్తి ఇది సరిగా 40 ఏళ్ల క్రితం ఆయనను మొదటి సారి చూసినపుడే తెలుసుకున్నాను నేను ఫలానా అని ఆయనకు మిత్రులు పరిచయం చేయగానే ఆయన నన్ను చూసి చిన్నప్పటినుంచి ఎరిగి వున్నట్టు నాతో వ్యవహరించాడు ఆయన జీవించివున్నంతకాలమూ నాతో ఆయన వ్యవహరించిన తీరులో ఏ మాత్రము మార్పురాలేదు మొదటి పరిచయంలో సంకోచించటమూ, క్రమంగా ఆత్మీయత

పెంచుకోవటమూ , వ్యక్తిగత కారణాలు ఏర్పడ్డప్పుడు ముడుచుకుపోతూ ఉండటమూ, ఇతర కారణాలు కలిగినప్పుడు మనస్సు విచ్చుకుంటూండమూ— ఇవి సంకుచిత వ్యక్తిత్వాన్ని సూచిస్తాయి స్వర్గీయ గూడవల్లి రామబ్రహ్మం ప్రవర్తనలో ఇలాంటి సంకోచ వ్యాకోచాలు నేను గమనించలేదు

మా ఇద్దరి మధ్యా వైరుధ్యాలు రాకకాదు ఒకటి రెండుసార్లు అలాటివి ఏర్పడ్డాయి రామబ్రహ్మం 'మాలపిల్ల'కు కాంచనమాలను బుక్ చేయదలచి కాబోలు ఆమెను గొప్ప తార గా ప్రశంసిస్తూ తన పేరున పత్రికలలో రాసాడు నిజానికి అప్పటి కాంచనమాల 'తార' కాదు అలా మనిషిని ఎగదొయ్యటం ఆమెకు మంచిదికాదు నిజానికి తారగా ఎంతో పైకి రావలసి ఉండిన మనిషి రామబ్రహ్మం అన్నదాన్ని నేను పత్రికలో ఖండించాను ఆ తరువాత మేమిద్దర మూ కలుసుకున్నపుడు రామబ్రహ్మం ఆ ప్రస్తావనే తీసుకురాలేదు

మరోసారి— 1941 లో— రామబ్రహ్మం మార్కెట్ కోసం పోటీ పెంచుతూ చిత్ర నిర్మాణ వ్యయం లక్షరూపాయలకు తీసుకుపోయాడు దాన్ని నేను ఆంధ్రపత్రికలో తీవ్రంగా విమర్శించాను అటునుంచి రామబ్రహ్మం ప్రజామిత్రలో తనను తాను సమర్థించు కుంటూ మరొకరిపేర వ్యాసాలు రాసాడు అప్పట్లో ఇది బజారుకెక్కిన సమస్య అయింది ఇండియా అంతటా ఎవరెవరు సినిమా తీయటానికి ఎంతెంత ఖర్చు చేస్తున్నారని ఆరాతీయటమూ పత్రికలలో వివరాలు ప్రకటించటము జరిగింది అయినా నాకు రామబ్రహ్మంకు మధ్య ఉండిన సంబంధంలో అణుమాత్రం భేదం కలగలేదు

రామబ్రహ్మం అందరినీ 'బ్రదర్' అని పిలిచేవాడు నన్ను పేరున పిలిచినపుడు 'కొడవటిగంటి' అని పిలిచేవాడు రామబ్రహ్మం వెంటవుండిన కె ఎస్ ప్రకాశరావు లాంటి వాళ్ళకు కూడా కొద్దిగా ఆ అలవాటు అబ్బింది

రామబ్రహ్మం సంస్కార హృదయం కలవాడు సినిమాలాయనకు ఒక సంస్కృతిక సాధనం మాత్రమే అనుకుంటాను పిక్చర్లు తీస్తున్న ఆరోజుల్లో కూడా నలుగురు కళాకారులు చేరితే గోష్ఠి లో దిగిపోయి, అన్నీ మరిచే వాడు ప్రజామిత్ర ప్రత్యేక సంచికలు వేసినపుడు మాత్రమే నన్ను ఏదన్నా రాయమని అడిగేవాడు 'మాలపిల్ల' మీద దుమారం సాగినప్పుడు మాత్రం ఆపిక్చరు మీద నా చేత ఒక వ్యాసం అడిగి రాయించుకున్నాడు

సినిమా జర్నలిస్టు— విమర్శకుడుగా రామబ్రహ్మం డైరక్షనును నేనుమెచ్చుకోలేను కాని చిత్ర నిర్మాతగా ఆయన హృదయ సంస్కారాన్ని ఎంతైనా మెచ్చుకోగలను ఈ విషయంలో కూడా ఆయన వ్యక్తిత్వం విశాలమైనదే 'త్యాగయ్య' ఇంకా విడుదల కాకముందే చూసి రామబ్రహ్మం పరవశుడైపోయి ఆపిక్చరు తెలుగు సినిమాచరిత్రలో మైలురాయి అవుతుందన్నాడు

'పల్నాటియుద్ధం' తీయాలన్నది రామబ్రహ్మం చిరకాలవాంఛితం దాన్ని ప్రారంభించే అవకాశం మాత్రమే ఆయనకు దక్కింది కాని నన్ను ఆశ్చర్యపరిచింది ఆ చిత్రంలోని ఆయన తీసిన మాంచాల సీనులు కాదు— ఆయన పల్నాటి యుద్ధం గురించి చదవదగినది అంతాచదివి, చిన్న పరిశోధకుడిగా పనిచేసాడు ఈరోజుల్లోగాని, ఆరోజుల్లోగాని ప్రొడ్యూసర్లు తాము తీయదలుచుకున్న ఇతివృత్తం గురించి అంతగా అధ్యయనం చేయడం ఊహించరానిది నాజర్

పల్నాటియుద్ధం బుర్రకథగా తయారు చేయబోతున్నట్లు తెలిసి, రామబ్రహ్మం అతనితో ఆ సబ్జెక్టు గురించి చాలాసేపు మాట్లాడటమేగాక ఏవోపుస్తకాలు కూడా ఇచ్చాడు

నాజర్ మాటవచ్చింది గనక రామబ్రహ్మం హృదయవైశాల్యం గురించి మరోమాట కూడా చెప్పాలి 1947లో మద్రాసులో అభ్యుదయ రచయితల మహాసభ జరిగింది అందుకు చందాలు వసూలు చేసాం నేను కూడా కొందరి వద్ద చందాలు పుచ్చుకున్నాను రామబ్రహ్మానికి కమ్యూనిష్టులు పడరు, అభ్యుదయ రచయితలు ప్రచ్ఛన్న కమ్యూనిస్టులు అని ఆయన అనుమానం అయినా ''బ్రదర్, నిన్నుచూచి'' అంటూ ఆయన చందా ఇచ్చాడు చందా ఇయ్యటమేకాకుండా, ఆయన 'మాభూమి' నాటక ప్రదర్శన చూచి, పారవశ్యం చెందాడు

రామబ్రహ్మం చేపట్టినసినిమా కళ ఎంత యాంత్రికమైనదో, జానపదకళలంటే ఆయనకు అంత ఇష్టం బుర్రకథ నశించిపోతున్నదనుకుని దాన్ని రికార్డులు తీయించాడు కాని నాజర్‌దాన్ని కొత్త శిఖరాలకు తీసుకుపోవటం ఆయనకు విస్మయం కలిగించింది నేను నాజీవితంలో జముకులకథ ఒకేసారివిన్నాను— రామబ్రహ్మం ప్రోత్సాహంతో

రామబ్రహ్మం తనజీవితంలోచాలా వైరుధ్యాలను ఎదుర్కొని ఉండాలి అన్నింటిలోకి నాకు స్పష్టంగా తెలిసింది ఆయన రైతుబిడ్డ చిత్రం తీయటం మరొకరైతే రామబ్రహ్మం ఉన్న పరిస్థితిలో ఆచిత్రం తీద్దామనికల్లో కూడా అనుకొని ఉండరు! అంతకన్నా గొప్ప సంగతి రామబ్రహ్మం గురించి నేను చెప్పలేను

*గూడవల్లి రామబ్రహ్మం సంస్మరణ సంచిక, 1976*

# 105. కళారూపాలలో పరివర్తన

ప్రాణుల పరిణామంలో నిసర్గ వాతావరణంలో మార్పులకు తట్టుకోలేక కొన్ని ప్రాణి జాతులు నశించటమూ, మరికొన్ని మార్పులు చెందటమూ జరిగినట్టే, సమాజంలో కలిగే మార్పులకు అనుగుణంగా కొన్ని కళలు అంతరించటమూ, మరి కొన్నింటిలో పరివర్తన సంభవించటమూ జరుగుతుంది ''కొత్తనీరు వచ్చి పాతనీటిని కొట్టేసింది'' అంటాం

అయితే కళల విషయంలో ఇది కేవలమూ కొత్తపాతల సమస్యకాదు ''ఓల్డ్ ఈజ్ గోల్డ్'' అన్నట్టుగా పాత సాహిత్యమే బాగుండేదని, పాత సినిమా బాగుండేవని అనేవారున్నారు ఇలా అనటానికి కారణం కేవలం ఆ అనేవాళ్ల వెనుకబాటుతనం కావచ్చు వర్తమాన కళలు కాల దోషానికిగురి అవుతున్నదశలోనే ఇలాంటి మాటలు పుట్టడం మనం గమనించవచ్చు అందుచేత ''పాతసినిమాలే బాగుండేవి'' అని నలుగురూ అనటం మొదలు పెట్టారంటే దాని అర్థం ''ఈ సినిమాలు మారవలసిన దశ ఏర్పడింది'' అని సాహిత్యం గురించిగాని, సంగీతం గురించిగాని ఇలాటి మాటలు పుట్టితే కూడా ఇదేఅర్థం చెప్పుకోవాలి

ఈదశలో కొత్త కళారూపాలకు ప్రోత్సాహం ఇచ్చి పాతవాటికి ఉద్వాసన చెప్పే బాధ్యత విమర్శకుల మీదే ఉంటుంది ఈబాధ్యతను కేవలం ప్రజలకే వదిలెయ్యడం అన్యాయం సామాన్య ప్రజలు తమకు అలవాటయిన కళారూపాలను ఒకంతట వదలరు ఒక కళారూపం సామాజిక పరిస్థితుల దృష్ట్యా బలం కలదై ఉండి, దానివల్ల ప్రజలకు అంతో ఇంతో మేలు చేకూరుతున్నప్పుడు విమర్శకుడు నిర్వహించేపాత్ర ఏమంత ఉండదు కాని పరివర్తన దశలో విమర్శకుడి కృషివల్ల

చాలామేలు కలుగుతుంది ఎదిగివచ్చే కళారూపం, వార్ధక్యం వాతబడిన కళారూపాన్ని పారదోలలేదనికాదు, ఆ ప్రక్రియను శీఘ్రతరం చేయగలవాడు విమర్శకుడు

ఇవాళ సినిమా చిత్రాలలో పరివర్తన మనం కళ్లారా చూస్తున్నాం, ఒకవంక, భారీ పెట్టుబడితో, గ్లామర్ స్టార్లతో, చెత్త సెంటిమెంటు కథలతో, బ్రహ్మాండమైన పబ్లిసిటీ కాంపేన్‌లతో, సినీజర్నలిస్టుల చెక్కభజనలతో వీధినాటకంలో బాణాసురుడిలాగా వెడలే చిత్రాలు వస్తున్నాయి ఇంకోవంక , ఊరూపేరూ లేకపోయినా నటనా సామర్థ్యం ఉన్న నటులతో, బలమైన సామాజిక ప్రయోజనాలతో కూడిన కథతో, స్టార్లకు దాసోహం అనేవాళ్లు కాక నిజంగా డైరెక్టు చెయ్యగలవాళ్ల కృషితో, చౌకగా, మేకప్ సైతంలేని పాత్రలతో, నాలుగు వారాలు పోతే చాలునన్న పిక్చర్లూ వస్తున్నాయి ఈ రెండోరకం చిత్రాలకు ఏకొద్దిపాటి ప్రోత్సాహం దొరికినా— పాత చిత్రాలకు ఇట్టే కాలదోషం పట్టించెయ్యగలవు— 10, 15 కోట్ల ఏళ్లక్రితం రాక్షసిబల్లులు నల్లుల్లాగా ఎడాపెడా చస్తూంటే— అల్పప్రమాణంగల పాలిచ్చే జంతువులు బతికి బట్టకట్టి, ఈనాటిదాకా పరిణామానికి మూలస్తంభాలుగా నిలిచినట్టు!

సినిమాలాంటి కళారంగంలో ఇటువంటి గొప్పమార్పు ప్రత్యక్షంగా వస్తున్నప్పుడు, సినిమా కళ భవిష్యత్తు ఎటుగా ఉన్నదీ విమర్శకులకే తెలీకపోతే— సామాన్య ప్రజలకు తెలిసే అవకాశం చాలా తక్కువ విమర్శకులు తాము తెలుసుకున్న దాన్ని ప్రేక్షకులకు గట్టిగా చెబితే, ఒక కళా రూపానికి మంచి పునాది వేసినవారవుతారు ఈపునాది ప్రభావం ఇతర కళల మీద కూడా ఉండి తీరుతుంది పాత సినిమాకళ అవసానదశలో తెలుగు నవలలు సినిమాలకు పుస్తకావతారాలుగా మార్పుచెందాయికావా? ''చెత్త'' నవలల మీద వెలువడేపాటి విమర్శ అయినా సినిమాలమీద రాకపోతే అంతకన్న అన్యాయం ఉండదు

సాధారణంగా సినిమా కళ బాగోగులను రూపాయలలో కొలిచే పాడు సంప్రదాయం ఒకటి దేశంలో పాతుకుపోయింది ఆవిలువ సినిమా కళకు మేలుచేయదు ''ఇందులో ఏమున్నది''! అనిఅడిగించుకున్నందుకు అర్థంలేని చిత్రాలు ఏడాదిపాటు నడిచి, నిర్మాతలకు లాభం చేసిపెట్టవచ్చు అందరూ చాలాఅద్భుతంగా ఉన్నదన్న చిత్రానికి దానిపెట్టుబడి తిరిగిరావడమే గగనం కావచ్చును ఉదాహరణలు అనవసరం అందరికీ తెలిసినవే దాన్నిబట్టి అచ్చంగా ప్రేక్షకులే సినిమాల్లో వాంఛనీయమైన పరివర్తన తీసుకురాలేరన్నది స్పష్టం అవుతున్నది అందుచేత ''తెలిసిన'' విమర్శకులు ఈ విషయంలో నిర్వహించాల్సిన పాత్ర ఎంతైనా ఉన్నది

*విజయచిత్ర, మాసపత్రిక, డిసెంబర్, 1977*

# 106. ముందుమాట -షావుకారు

తెలుగు భాషలో వెలువడిన మొట్టమొదటి అభ్యుదయచిత్రం 'షావుకారు', ఆరోజులలో తెలుగుదేశంలో అభ్యుదయ రచయితల సంఘమూ, ప్రజానాట్యమండలీ ఎంతో ఉత్సాహంతో కృషిచేస్తున్నాయి వీధిభాగోతాలూ, బుర్రకథలూ మొదలైన జానపద కళారూపాలను ప్రజలు ఎగబడి చూసి ఆనందిస్తున్నారు అభ్యుదయ సినిమా చిత్రం తీస్తే బాగుండుననే భావం లేకపోలేదు కాని సినిమా అంటే బూర్జువాల చేతి సాధనం అన్న అభిప్రాయం ఉండేది అటువంటి దశలో అభ్యుదయ కళలూ, ఉద్యమం పట్ల సానుభూతిగాని, లక్ష్యంగాని లేని చక్రపాణి చేత

నిర్మించబండిది 'షావుకారు'

తీరా 'అభ్యుదయ' చిత్రం అని పేరుపెట్టి తీసేసరికి 'పల్లెటూరు' అనేక విషయాలలో 'షావుకారు' కుఅనుకరణ అనిపించేలాగా తయారయింది 'షావుకారు' చిత్రాన్ని రెండుసార్లు చూసిన హైకోర్టు జడ్జీలున్నారు 'పల్లెటూరు' విజయవంతం కాలేదు

'షావుకారు' చిత్రంలోగల అభ్యుదయ లక్షణాలేమిటి? మొదటిది, సినిమాలలో మృగ్యంగా వుండేది 'వాస్తవికత' 'షావుకారు' లో వాస్తవికత నూటికినూరుపాళ్లు రెండవ విషయం పాత్రల వర్గ స్వభావం స్పష్టంగా ఉండడం ఇద్దరు రైతులు, కోమట్ల కుటుంబమూ,పంతులూ, చాకలిది ,రౌడీ— ఇలాంటి పాత్రలు ఇతరచిత్రాలలో వచ్చినా 'షావుకారు' లో ఉన్నంత సహజంగా ఉండటం నేను చూడలేదు చిత్రంలో నాటకీయతకు అవసరమైన సంఘర్షణ ఉన్నది కాని అది కృతకంగా ఎగదోసి ఉండకపోవటంచేత, అప్పటికే చెత్తసినిమాల ప్రభావంతో బుర్రలు చెడివున్న సినిమా ప్రేక్షకులు 'షావుకారు' చిత్రాన్ని ఎగబడి చూడలేదు చూసి ఉంటే చక్రపాణి ఇంకా ఎన్ని అభ్యుదయ చిత్రాలు తీసి ఉండునో!

చక్రపాణి అంచనా ప్రకారం చిత్రం యొక్క విజయం ప్రజలు దానిపట్ల చూపే ఆదరణ ఆయనకు తారల మీద మోజు కూడా లేదు 'షావుకారు' లో అనేక 'కొత్తముఖాలు' ఉన్నాయి కాని 'నాగిరెడ్డి–చక్రపాణి' నిర్మాతలుగా అఖండమైన ఆర్థిక విజయాలు సంపాదించిన చిత్రాలు నిర్మించి ఉన్నందున ఆ బేనర్ కింద కొత్తముఖాలతో మరొక 'లోబడ్జెట్' చిత్రం తీసే అవకాశం లేకపోయింది చక్రపాణి నుంచి మరొక 'షావుకారు' లాంటి చిత్రం రాకపోవటానికి అదొక కారణం 'షావుకారు' పదం జానకి పేరుతో శాశ్వతంగా చేరిపోయింది ఇంతకాలానికి 'షావుకారు' కథ పుస్తకరూపంలో ఆయన జన్మదినంనాడు వెలువడుతున్నది చక్రపాణికి శాశ్వతమైన కీర్తి తెచ్చేది 'షావుకారు' చిత్రమే అయితే నామటుకు నాకు ఆశ్చర్యంలేదు

*మద్రాసు* *కొడవగంటి కుటుంబరావు 28–7–77*

*విజయాప్రొడక్షన్స్ తొలిచిత్రం 'షావుకారు' 1950లో విడుదల అయింది*
*వెండితెర నవల 77 ఆగస్టులో నవోదయ పబ్లిషర్సు అచ్చువేసారు*
*రచన చక్రపాణి (5–8–1908, 24–9–75 ) , నవలారూపం రావికొండలరావు*

# 107. సినిమా పాటలు

ఈనాడు అన్ని కళారూపాలకన్నా ప్రజలకు హెచ్చుగా అందుబాటులో ఉన్నది సినిమా సినిమాలో అన్ని కళలకూ స్థానం ఉన్నది ఈవిషయంలో కూడా సినిమా ఇతర కళారూపాలకన్నా విశిష్టమైనది అన్నిటికన్నా సినిమా విశిష్టత కొట్టవచ్చినట్టు కనిపించేది కెమెరాలో వాస్తవికాలలో సినీకెమెరా చూపించలేనిదంటూ లేదు మనం దానివెంట విమానయానాలు చెయ్యవచ్చు, , కాశ్మీరు వెళ్లవచ్చు, పేలుతున్న అగ్ని పర్వతాల ముఖంలోకి తొంగిచూడవచ్చు సినీకెమెరా నటులను ఎంత దగ్గరగానైనా చూపగలదు వారి భావప్రకటనను ఎంత సూక్ష్మంగానైనా గ్రహించవచ్చును

ఇంతేకాదు, సినిమాలో వాస్తవికత జీవితంలో వాస్తవికతకన్నా చాలా ముందుకు పోయింది, మైక్రో ఫొటోగ్రఫీ ద్వారా కంటికి కనిపించనివికూడా మనం చూడగలుగుతున్నాం

'స్పెషల్ ఎఫెక్ట్స్' ధర్మమా అంటూ ఊహకుకూడా అందరికీ అందని లోకాంతరయానాలు చెయ్యగలుగుతున్నాం

ఇదంతా దేనికి చెప్పానంటే సినిమా కళారూపానికి వాస్తవికత ఆయువుపట్టు ఈవాస్తవికతే మన సినిమాచిత్రాలలో హత్య చేయబడుతున్నది బట్టబయలులో పట్టపగలు ఆడదాన్ని మగవాడు తరిమి పట్టుకోవడమూ, ఏజాతికీ, సంప్రదాయానికీ చెందని డ్యాన్సులు చెయ్యడమూ అలా ఉంచి, ఈదృశ్యాల వెంట బాజాభజంత్రీలతోసహా యుగళగీతాలు, ఏకగళ గీతాలు ఉంటాయి నిత్య జీవితంలో అలా ప్రవర్తించిన వాళ్లని వెంటనే వెర్రాసుపత్రికి పంపి పరీక్ష చేయించాలిసుంటుంది కాని సినిమాల్లో అదంతా చాలా ''స్వాభావికం''

సినిమాల్లో వాస్తవికతను ఎక్కువగా దెబ్బతీస్తున్నది పాటలు—సంగీతం కాదు నిత్యజీవితంలో పాటలకు గల స్థానాన్ని, పాడేవిధానాన్ని సినిమాలలోచూపితే వాస్తవికత దెబ్బతినదు ఆడవాళ్లు పాడుకునే మంగళహారతుల పాటలూ, పెళ్ళి పాటలూ లాటివాటికి వాద్య సహకారం ఉండదు పాటకచేరీలకుండే పెద్ద ఆర్కెస్ట్రాలో ఫిడేలూ, మృదంగమూ, తంబూరా, ఘటమూ, కంజీరా, మోర్సింగ్ ఇంతకు మించి ఉండవు 40 వాద్యాలతో, అయిదు రకాల డప్పులతో నిత్యజీవితంలో ఎవరూ పాడరు ఆ వాద్యాలలో చాలాభాగం దిగుమతి సరుకు

ఈ అవాస్తవికమైన సినిమా సంగీతం దశాబ్దాలమీద ఎంత ప్రాముఖ్యం సంపాదించుకున్న దంటే, ప్లేబాక్ గాయినులు తారలతో సమంగా సంపాదించగలరు వాద్యగాళ్లు, చిల్లర నటులకన్నా బాగా సంపాదించగలరు ఒక మూడు నిమిషాల పాట రికార్డుచెయ్యటానికి అన్నిఖర్చులూ కలుపుకుని 5వేలు అవుతుందని కొంతకాలం క్రితం ఎవరో అన్నారు ఇప్పుడింకా ఎక్కువ కావచ్చు 3నిమిషాలకు 20 వేలచొప్పున రెండున్నర గంటల చిత్రానికి రెండున్నర లక్షలు కావాలి ఇందులో నటుల ఖర్చూ, స్టూడియోలో షూటింగ్ ఖర్చులు, ఇతర నిర్మాణ వ్యయాలు చేరలేదు దీనిని బట్టి తేలేదేమంటే సినిమాలో మాటలభాగం కన్న పాటల భాగం కొన్ని రెట్లు ఖరీదైనదని, అందుకే కాబోలు దూరదర్శినిలో ఏదైనా పాత చిత్రం పరిచయం చెయ్యవలసివస్తే ఒక పాటభాగాన్ని చూపుతాడు కళాదృష్టితో సిగ్గుచేటుగా పరిగణించ వలసినభాగం కూడా అదే

త్యాగయ్య, క్షేత్రయ్య వంటి గాయక వాగ్గేయకారుల చిత్రాలు తీస్తే పాటలకు ఎంత ప్రాముఖ్యమైనా ఇయ్యవచ్చు, ఒకచెంప హీరోయిన్ ఊపిరి సలపకుండా పాడుతూ డాన్స్ కూడా చెయ్యటానికి ప్రయత్నిస్తుంటే హీరో ఆవిణ్ణి కావలించుకొనటానికి, ముద్దు పెట్టుకోటానికి ,వీలైతే మానభంగం చేయడానికి నానాపాట్లు పడేదుర్దశ ''మ్యూజికల్'' చిత్రాలలో ఉండదు

ఈ సినిమా పాటల సంప్రదాయం స్టేజి పాటల సంప్రదాయం నుంచి పరిణతి చెందిందనీ, స్టేజి నాటకాలకన్నా కూడా అనేకవేల రెట్లుగా సామాన్య ప్రజలకు పనికివచ్చే సంగీతాన్ని రూపొందించిందనీ ఒప్పుకోక తప్పదు అయితే దీని దుర్వినియోగానికి ప్రజలు బాధ్యులుకారు వారిని అడ్డంపెట్టుకుని సినిమాలలో అవాస్తవికతను సమర్థించటం సాధ్యంకాదు ప్రజలకు కావలసిన ఈ సంగీతానికి కావలసిన వాస్తవికతను సినిమావాళ్ళు సృష్టించుకుని ఉండవలసింది సినిమా సంగీతం ఒక ప్రత్యేక కళారూపం దానికి గల ఆర్కెస్ట్రా హంగులు బహిరంగంగా

ఆమోదించదగినవి సినిమాలలోపాత్రలలో ప్రతిడాక్టరు, మేస్టరు, పంతులమ్మ, పాకీమనిషి, ప్రజలకు ఆమోదకరంగా ఉండే సంగీతం— చిత్రీకరించడానికి వేలకువేలు గుప్పించవలసిన సంగీతం— పాడవచ్చునంటే విశ్వసించటం సాధ్యంకాదు సినిమా పాటలు పాడగలపాత్రలను సృష్టించండి ఆర్కెస్ట్రాను చూడండి అది లేనట్టు నటించవలసిన అవసరం లేదు ఊటీ పచ్చిక మైదానాల మీద పాట ప్రారంభం కాకుండానే ఆర్కెస్ట్రా ఆరంభం నుంచే నటులు లయప్రకారం అడుగులు వెయ్యడం మొదలు పెడితే ఆర్కెస్ట్రా లేనట్టు నటించేందుకు అవకాశం ఎక్కడ? ఉన్నదాన్ని వారించేట్టుంటే ఎక్కడ ఉన్నట్టు? ఇలాటి పనులు ఎవరో ఒకరిద్దరు నిర్మాతలు చేస్తున్నవి కావు అందరూ చేస్తున్నవే— కారు చౌకలో కళాచిత్రాలు నిర్మించి, తమ పిక్చరు రెండు వారాలు పోతేచాలు ననుకునే నిర్మాతలు తప్ప! కాబరే డాన్సులూ, పాటలూ, వాద్యాలూ చూపించినప్పుడు అందులో అవాస్తవికత ఏవీ ఉండటం లేదు— ఇతర కారణాలవల్ల చిత్రం కళాహీనం అయినప్పటికీ

సినిమా పాటల్లో ఒకే ఒకపీసం వాస్తవికత చూపించాలనో, లేక హీరోయిన్‌ను ( లేక హీరోను) కళాప్రపూర్ణుడుగాచిత్రించాలనో, పాడేటప్పుడు చేతికి ఒక వీణో, సితారో ఇస్తారు అవతల 40 వాద్యాలు ఉండనే ఉంటాయి వినిపిస్తూ ఉంటాయి కాకపోతే ఈవీణ, లేక సితారు వాదనం రక్తి కట్టే దెక్కడంటే దానికీ పాటకూ ఎలాటి సంబంధమూ లేకపోవటంలో!

సినిమా పాటలను గురించి ఇంకొక్క అంశం నాకు ఏనాడూ అర్థంకాలేదు నేపథ్య సంగీతంలో పాశ్చాత్యబాణీలకూ, వాద్యాలకూ చాలా మంచి అవకాశాలున్నాయి అవి పాటలవెంట దేనికి ? అవి కావాలని లోకం కోడైకూసినట్టు నా ఊహకు అందటం లేదు కీర్తి శేషులు సుబ్బరామన్ ఘాటైన శాస్త్రీయ సంగీతం సినిమాపాటలకు అమర్చి పాడించాడు ఘంటసాల ఈనాటికీ, ఏనాటికీ అద్వితీయ సినిమా సంగీతకారుడు సంప్రదాయ బద్ధంగానే కొన్నివేల సినిమా పాటలకు స్వరకల్పనచేసి, మామూలు ప్రేక్షకులను ఆనందంలో ఓలలాడించాడు ఆధోరణిలో ఏమి లోటు కనిపించి, సంకర సంగీతాన్ని సినిమాలలోకి తెస్తున్నారు?

సినిమా సంగీతం గురించి చెప్పుకునేటప్పుడు బూతు పాటలను గురించి ప్రత్యేకంగా చెప్పుకోవాలి మామూలు సంభాషణలలో కన్న పాటలలో ద్వంద్వార్థాల బూతులు ప్రవేశ పెట్టితే అంత పట్టియ్యదని నిర్మాతల అభిప్రాయంగా కనిపిస్తుంది ఈ బూతు పాటలు నూటికి నూరుపాళ్ళూ ఆర్థిక ప్రేరణగలవనే దానికి సందేహం లేదు బూతు పాటలు ప్రేక్షకులను ఆకర్షిస్తాయన్న ఆశతో, సెన్సారు కత్తెరను కూడా ఖాతరు చెయ్యకుండా నిర్మాతలు వాటిని చిత్రాలలో చేర్చుతున్నారు ఆ పాటలు రాసేవాళ్ళుగాని, పాడేవాళ్ళుగాని సభ్యత పాటించని వాళ్ళని మనం అనుకోనవసరం లేదు డబ్బుకోసం అలాటి పాటలు రాయటమూ, పాడటమూ జరుగుతున్నది ఒక సెక్సు పత్రిక ప్రచురించే పెద్దమనిషి, ''నా పత్రిక మాఇంట్లో కనిపించనియ్యను!'' అన్నాడట అతను ఆ పత్రికను డబ్బుకోసం నడుపుతున్నాడేగాని మానాభిమానాలు విడిచేసిన సామాజికుడు కాడు అలాగే నలుగురి మధ్య గౌరవంగా బతకదలచినవారు సైతం బూతుపాటలు రాయవచ్చు, పాడవచ్చు డబ్బుతో ఎంతలేసి పాపాలూ పరిహారం అయినప్పుడు ఈ కొద్దిపాటి అసభ్యత పరిహారంకాదా?

అయినా సంస్కృతీశక్తులదృష్ట్యా చూస్తే ఈ బూతుపాటలు తాత్కాలికమే కావచ్చు వాటివమూలాన చిత్రం దెబ్బ తింటుందనీ, నిర్మాతకూ, కవిగారికీ, గాయకులకూ పరువుపోతుందనీ ఏనాడు అనిపిస్తే ఆనాడు బూతుపాటలుపోవచ్చు, అంతదాకా సినిమా పాటలకు ఇతర ఆధారాలన్నీ పడిపోయినా ''బూతు'' ఆయువుపట్టుగా ఉంటుంది

*కళాసాగర్, ఆరవ వార్షికోత్సవసంచిక, 1978*

# 108. సినిమాల భవిష్యత్తు

సరిగ్గా నలభై ఏళ్ళ క్రితం నా మిత్రుడొకడు తెలుగు సినిమా తీసే ఆలోచన చేస్తే, నేను కీ శే పారుపల్లి శేషయ్య గారిని డిస్ట్రిబ్యూషన్ తీసుకుంటారా అని అడిగాను ఆయన నన్ను బాగానే ఎరుగును ''ఎవరా సినిమా తీసే మొనగాడు? కళ్ళు మూసుకొని వేలుతో చూపిస్తాను దాని కెదురుగా ఎవర్నైనా నిలబెట్టండి 'మీకు సినిమా తియ్యటం చేతకాదు' అని చెప్పగలను, రామబ్రహ్మమంత వాడికి చాతకాకుండా ఉంటే ఇంకొరికి సినిమా తీసే శక్తి ఉందని ఎలా అనటం?'' అన్నాడాయన

చెప్పొచ్చిందేమంటే, ''సినిమా తీయగల మొనగాడెవడు?'' అన్న సమస్యకు సూటిగా సమాధానం ఏనాడూ ఎవరూ చెప్పలేదు కాకపోతే కొద్దికాలం జెండా ఎగరేసిన నిర్మాతలు చరిత్రలో నిలిచారు ఆదిపురుషుడు హెచ్ యం రెడ్డి, తరవాత పి వి దాసు, రామబ్రహ్మం, మ బలరామయ్య, పి పుల్లయ్య, బి ఎన్ రెడ్డి, కె వి రెడ్డి, నాగిరెడ్డి చక్రపాణి, ఎల్ వి ప్రసాద్ ఇలా ఎవరూ నాలుగు కాలాలపాటు తారాపథంలో గాని, సినిమా చరిత్రలో గాని గట్టిగా నిలబడలేదు

ఇటువంటి పరిస్థితి— ఒక వెలుగు వెలిగి ఆరిపోవటం— ఏ ఇతర కళలోనూ లేదు సువర్ణాక్షరాలతో లిఖించదగిన పేర్లుగల కవులూ, రచయితలూ, గాయకులూ, వాద్య విద్వాంసులూ, చిత్రకారులూ, నాట్య నిపుణులు ఉన్నారు వారి కృషి నిలిచి ఉండటమే గాక, వారి కళా సాంప్రదాయాలు పిల్లల్ని పెట్టాయి ఒకనాడు చలం గారినీ, ఈనాడు రావి శాస్త్రి గారినీ, అనుకరించటానికి ఉబలాటపడే రచయితల సంఖ్యను చూస్తే, సినిమా రంగంలో అటువంటిది మచ్చుకైన లేకపోవటం ఆశ్చర్యం వేస్తుంది

దీని నుంచి ఒక ప్రశ్న ఉదయిస్తుంది సినిమా కళ అంటూ ఉన్నప్పటికీ, అది ప్రపంచమంతటా గొప్ప పరిణామాన్ని పొందుతున్నప్పటికీ, మన తెలుగుదేశంలో అది కళావరంగా ఏనాడూ చలామణీ కాలేదేమో?

తెలుగు సినిమాలలో పరిణామం జరగలేదని ఎవరు అనగలరు? ఆ పరిణామం తాలూకు పర్యవసానం ఏమంటే హెచ్చు డబ్బు గడించుకున్నది అత్యుత్తమ చిత్రం, దాన్ని నిర్మించినవాడు తాత్కాలికంగా ఉత్తమ దర్శకుడు – రెండేళ్ళ అనంతరం అతన్ని తలచుకునేవాడు లేకపోయినా సరే ! డబ్బుకోసమే సినిమాలు తీస్తామనీ, సినిమాల నిర్మాణం కేవలం వ్యాపారమేననీ అనేవాళ్ళతో పేచీ పెట్టుకుని లాభం లేదు వాళ్ళను సినిమా వ్యాపారం చేసుకోనీకుండా చెయ్యగల శక్తి ఏదీ లేదు, ఓ కే!

కీ॥శే॥వాసన్ గారు నిర్మాతలకు ఒక స్లోగన్ ప్రసాదించారు ''ప్రేక్షకులను ఎడ్యుకేట్ చెయ్యటం మా పని కాదు, అందుకు మేం అర్హులం కాదు, ఎంటర్ టైన్ చెయ్యటమే మాకు చాతనవును ''

అనగా, సర్కస్‌లాగ, తోలుబొమ్మల్లాగ, వీధిగారడీల్లాగా ప్రేక్షకులకు వినోదం చేకూర్చటమే నిర్మాతలకు చేతనవునన్నమాట ''మరి మీరు తీసే చిత్రాలు చూస్తే ఒక్కోసారి తిన్నది వాంతి అవుతుందే'' మని మనం అడగరాదు సినిమాలు తీయటం లాభాల కోసమే నన్నట్టే, వినోదం కోసమే ననటం కూడా ఒక పోజు ఈ పోజులు విమర్శకుల నోరు మూయటానికే గాని, రుజావు అవుతాయని కావు రెండో రోజు ఆడకుండా టిన్నులు తిరిగొస్తే అదేం వ్యాపారం? ప్రేక్షకులు డబ్బు తగలేసుకున్నామో అని ఏడుస్తుంటే అదేం వినోదం?

ఈనాడు కూడా సామాజిక స్పృహ ప్రముఖంగా లేని కళ అంటూ ఉంటే, అది సినిమా కళే కాని ఆ పరిస్థితి కూడా మారిపోతున్నది సామాజిక స్పృహా, వాస్తవికతా, ప్రేక్షకులలో చైతన్యం తేవాలన్న ఆశయమూ, కళా ప్రమాణాలను నిలబెట్టాలన్న తాపత్రయమూ గల చిత్రాలు వస్తున్నాయి సినిమాలకు సంబంధించిన యుగధర్మం మార్పు చెందుతున్నది సినిమా చిత్రాలతో జాతి భేదాలు ఏర్పడి, ఏ జాతి భవిష్యత్తు అది చూసుకునే పరిస్థితికి బీజాలు పడుతున్నాయి

పెద్ద సెట్టింగులూ, పెద్ద తారలూ, బ్రహ్మాండమైన పబ్లిసిటీ వగైరాలతో వ్యాపారం చేసేవారు వ్యాపార చిత్రాలు తీస్తారు

కృతక సమస్యలతో జనాన్ని మభ్యపెట్టి సమాజానికి పనికివచ్చే చిత్రాలు తీసినట్టు డప్పు కొట్టుకునేవాళ్ళు మరో రకం చిత్రాలు తీస్తారు ( తన పాతివ్రత్యం రక్షించుకోవటానికి భర్తను చంపటమూ, ఎలాటి పరిస్థితిలో ఎవడు తన మెడలో తాళిగట్టినా వాడే భర్త అని సినిమా సిట్యుయేషన్లు సృష్టించటమూ వగైరా గొప్ప సామాజిక సమస్యలను గురించి తీసిన చిత్రాలు చూశాం మంగళసూత్రం సినిమాకు తిరుగులేని కథావస్తువుగా పనికొస్తున్నది! )

ఆయా సినిమా శాఖలలో సాంకేతిక నైపుణ్యమూ, ఫిలిం ఎప్రీసియేషన్, వాస్తవికత మీద అంతులేని గురి ఉండి యువకులు సాధ్యమైనంత తక్కువ ఖర్చుతోనూ, ఎక్కువ ఉత్సాహంతోనూ తీసే సినిమాలు వస్తున్నాయి ఈ సినిమా జాతులు వేటికి అవిగా పురోగమించ వలసిందేగాని, ఇది ఒకదాని కొకటి పోటీ కాబోదు

వ్యాపార చిత్రాలకు ప్రకటనల బలమూ, పబ్లిసిటీ హంగామా హెచ్చుగా ఉండాలి కృత్రిమ సమస్యలుగల చిత్రాలు ప్రజల మూఢత్వంమీద హెచ్చుగా ఆధారపడి నడవవలసి వుంటుంది అన్నిటికన్న మంచి భవిష్యత్తుగల కళా చిత్రాలు జనానికి పట్టాలంటే వాటికి ఆరంభ దశలో— అంటే ఇప్పుడు—విమర్శకుల సహాయం కావాలి కాలం గడిచి కళా చిత్రాలను చూడటం జాస్తి అయేకొద్దీ, ప్రేక్షకులలో విమర్శనాశక్తి అదే పెరుగుతుంది అంతదాకా చిత్రాలకు విమర్శకుల సహాయం పూర్తిగా కావాలి

ఈనాడు ప్రేక్షకులు 'వ్యాపార' చిత్రాల 'గోత్రాలు' పసిగట్టగల స్థితికి వచ్చినట్టు కనబడతారు చిత్రాలు హిట్ కావటానికి పెట్టే 'మసాలాలు' జనం మీద పారటం లేదు ఈ జాతికి చెందిన చిత్రాలలోనే 'ఫ్లాప్స్' ఎక్కువగా ఉంటున్నట్టు కనబడుతుంది కృత్రిమ సామాజిక సమస్యలను విమర్శించే శక్తి ప్రేక్షకకోటిలో ఉండదగినంతగా ఉన్నట్టు కనబడదు కళా

చిత్రాలను తగినంతగా ఆదరించేపాటి రసజ్ఞత ప్రేక్షకులలో చాలా తక్కువగా ఉన్నది ప్రస్తుతం ఇలాటి చిత్రాలను గురించి నాలుగు మంచి మాటలు చెప్పగల స్థితిలో ఉన్నవారు అల్పసంఖ్యాకులైన మధ్యతరగతి రసజ్ఞులు తమకు అభిమాన పాత్రమైన ఈచిత్రాలను ప్రజలు ఆదరించేటట్టు చేయవలసిన బాధ్యత కూడా వీరిపైనే ఉన్నది

ఇటువంటి చిత్రాలు ఏ పరిస్థితులలోనూ నెలల తరబడి ఆడకపోవచ్చు కాని సిసిల్ బి డిమిల్ తీసే చిత్రాలు వంద అయినా సాధించలేని సామాజిక చైతన్యాన్ని ఈనాటి ''వాస్తవిక'' చిత్రాలలో ప్రతి ఒక్కటీ సాధిస్తుంది కళకు అంతకన్న ఉన్నతమైన ఆశయం ఏముంటుంది?

*చిత్ర సంస్కార, మాస పత్రిక, 10-3-1978*

# 109. సినిమా పరిశ్రమలో అవలక్షణాలు

సినిమా ఒక పరిశ్రమే కాదని రెండు, మూడు దశాబ్దాల క్రితం నాబోటి వాళ్ళం వాదించాం ఎందుకంటే, సినిమా చిత్రం మార్కెట్ ధరకు, దాని ఉత్పత్తి ఖర్చుకు ఏమీ పొంతన లేదు మార్కెట్‌లో ''ఇంత ధర పలికితేగాని నేను అమ్మను,'' అని చిత్ర నిర్మాత భీష్మించలేడు కురిస్తే కనక వర్షం కురవవచ్చు, లేదా పెట్టుబడి యావత్తూ వరదలో కొట్టుకుపోవచ్చు సినిమా చిత్రం విలువ నిర్ణయించేది కొనుగోలుదార్లు!

సినిమా పరిశ్రమ అయినా కాకపోయినా, అది పెట్టుబడిదారీ వ్యాపారం అవును పెట్టుబడిదారీలో ఉండే లక్షణాలూ, అవలక్షణాలూ ఈ సినిమా వ్యాపారంలో ఉన్నాయి అన్ని లక్షణాలలోకీ ముఖ్యమయినది బూర్జువా సంస్కృతి

బూర్జువా సంస్కృతిలో కళలు ప్రయోజనకరంగా ఉండటం ముఖ్యం కాదు, ఆనందాన్ని యివ్వడం ముఖ్యం అందుకే సినిమాచిత్రం కంటికీ, చెవికీ యింపుగా ఉండటానికి విశ్వ ప్రయత్నాలు జరిగాయి ముఖ్య స్త్రీ, పురుషపాత్రధారులు— తారలు— నటనలో సమర్థులు కావటం కన్న, అందంగా ఉండటం ముఖ్యం నిజంగా సమర్థులయిన నటులు యితర పాత్రలు ధరించవచ్చు సినిమాలలో నటనకూ మంచి స్థానం వున్నదనిపించుకోవచ్చు!

బూర్జువా సంస్కృతి అచ్చుగా పురుష ప్రధానమయినదని అందరికీ తెలుసు అందుచేత బూర్జువా సినిమా కళలో ఆడవాళ్ళు అందంగా ఉండటంతోబాటు, వాళ్ళ అందం ఎంత బాగా కనబడితే అంత కళాసౌరభం ( కీర్తిశేషులు చక్రపాణిగారు, ''దుష్టస్త్రీ పాత్ర కయినా అందమయిన మనిషిని పెట్టాలి!'' అనే వారు) అందుకే ఆడదాని వంపుసొంపులు నిర్నిరోధంగా ప్రదర్శించటంలో పోటీ ముమ్మరంగా సాగి, హీరోయిన్‌లను నీళ్ళలో నానబెట్టి బయటకు తీసి చూపటం దాకావచ్చింది నాట్యాలూ, కాబరే నృత్యాలూ స్త్రీలను వీలయినంత నగ్నంగా చూపటానికీ, నృత్యాలు వీలయినంతగా మైథునాన్ని స్ఫురింపజేయడానికీ, డ్యాన్సు పాటలు వీలైనంత బూతుగా ఉండటానికీ ఈ సంస్కృతి దారి తీసింది

అలాగే పాటలు కూడా శ్రవణపేయంగా ఉండటం తప్పనిసరయింది హీరోయిన్ ఆరంభంలో అంట్లు తోమేదయినా, పాయిలోకి పుల్లలు ఏరేదయినా ఆర్కెస్ట్రాతో 'అద్భుతంగా' పాడగలదై ఉండాలి

ఇదంతా వాస్తవికతకు దెబ్బ కాదా అనవచ్చు బూర్జువా కళలలో వాస్తవికతకు ప్రాముఖ్యం లేదు మన ప్రబంధాలలో వ ర్ణించిన శృంగారంలో ఎంత వాస్తవికత ఉన్నదో సినిమా శృంగారంలోనూ అంతే వాస్తవికత ఉన్నది ( మన బూర్జువా సంస్కృతి ఫ్యూడల్ సాంకర్యం గలిగినది, ఫ్యూడల్ సంస్కృతిని నిర్మూలించి పైకి వచ్చినది కాదు దానితో చేతులు కలిపి రాజీ పడినది )

సినిమాలలో బూర్జువా సంస్కృతికి కావలసిన వునాది ఏర్పడ్డాక డబ్బు సమస్య : స్తుంది అవును, డబ్బూ, లాభాలూ కావాలి అధికస్య అధికం ఫలం ఇక్కడే ఒక వైరుధ్యం ఎదురయింది సినిమాలకు డబ్బిచ్చే వాళ్లు బూర్జువాలు కారు మూడు వంతులు పామరులూ, ఒక వంతు విస్పష్టమయిన కళా దృక్పథంలేని మధ్యతరగతి వాళ్ళూనూ

ఈరెండు తరగతులకూ, తమ సొంత సంస్కృతి లేకపోతే బూర్జువా సంస్కృతే సార్వజనీనమైన, సార్వకాలికమైన, శాశ్వతమయిన సంస్కృతి అని నమ్మించి సినిమా ప్రేక్షకులకు దాన్ని మప్పవచ్చు, మప్పారు కూడా! ''ప్రేక్షకుల అజ్ఞానం (స్టేజి) నటుల అజ్ఞానం కన్న ఒక్క పిసరు హెచ్చు,'' అన్న భావాన్ని ఒకప్పుడు బళ్ళారి రాఘవగారు వెలిబుచ్చారు సినిమా ప్రేక్షకుల అజ్ఞానం నిర్మాతల అజ్ఞానం కన్న నాలుగు పిసర్లు ఎక్కువగా ఉన్నంతకాలమూ సినిమా కళ ఒక వెలుగు వెలిగింది

''మార్కెట్'' అవసరాలతో జనాన్ని మభ్యపెట్టి సినిమా హాలుకి ఈడ్చుకు రావాలి జనాభాలో సగం మంది స్త్రీలు వాళ్ళని ఎట్లా ఆకర్షించటం? స్త్రీలను ఆకర్షిచటం కోసం ''సిడిపోతుల'' లాటి మగవాళ్ళను బుక్ చేసారు ( డొప్ప చెవులూ సొట్టల ముఖమూగల క్లార్క్‌గేబుల్ ఆడవాళ్ళను తన మగసిరితో అమెరికన్ స్త్రీ లను అమితంగా ఆకర్షించాడని అక్కడి పత్రికలు రాసాయి )

ఆ పప్పులు ఈ పవిత్ర భారతంలో ఉడకవు అందుకని హీరోయిన్‌లో సంప్రదాయ పాతివ్రత్యం పెద్ద ఆకర్షణఅయి కూర్చున్నది ''కన్య'' గా ఉన్నస్థితిలోనే వంద మంది పురుషులను పడగొట్టిన అనుభవం తన అభినయంలో ప్రదర్శించినప్పటికీ హీరోయిన్ మొగుడికాళ్ళను కళ్ళకు అద్దుకునే పతివ్రతగానే చిత్రించబడుతుంది

బూర్జువా సంస్కృతి లక్షణాలు సినిమాకళలో ఎన్ని ఉన్నాయో చెప్పుకుంటూ పోతే తెల్లవారి పోతుంది ఒక్కముఖ్య లక్షణం చెప్పి ఈవిషయం ముగిస్తాను బూర్జువా సంస్కృతి స్వలాభం కోసం చట్టబద్ధమైన పద్ధతులు ఉపయోగపడకపోతే ''క్రిమినల్'' చర్యలకు పూనుకోవటానికి జంకదు ఇప్పడు అదే జరుగుతన్నది సెన్సార్ వాళ్ళు కత్తిరించిన భాగలు తీసెయ్యకుండానే థియేటర్లలో చూపుతున్నారట కొన్ని తెలుగు సినిమా చిత్రాలు ''బ్లూ'' పిక్చర్స్‌కు ఎంత దగ్గరగా రాగలమా అని ప్రయత్నిస్తున్నాయట! దీన్ని నిరోధించే శక్తి సామర్థ్యాలు అధికారులకు లేవా? లేక వాళ్ళు కూడా బూర్జువా సంస్కృతికి ఒక కాపు కాస్తున్నారా?

పామర జనం మరొక వర్గ సంస్కృతిని ఆశ్రయించటం అసహజం అది శాశ్వతంగా కొనసాగదు ఇతర కళారంగాలలో— ముఖ్యంగా సాహిత్యంలో — అభ్యుదయ విప్లవోద్యమాలు వచ్చాయి వాటి ప్రభావం చిత్ర నిర్మాణం మీద ఉండక తప్పదు అది సినీ ప్రేక్షకులను ప్రభావితం చెయ్యకా తప్పదు అదే ఇప్పుడారంభమయింది అధిక సంఖ్యాకులైన

ప్రేక్షకులకు వారి సంస్కృతికి తగిన చిత్రాలు 'చలిచీమలు' లాంటివీ వస్తున్నాయి వాటిని ఆదరించి బూర్జువా సంస్కృతితో కూడిన సినిమా చిత్రాలను బూర్జువా వర్గానికే పరిమితమయేటట్టుచూసే బాధ్యత సినిమా ప్రేక్షకులమీద ఉన్నది 'చలి చీమలు' కింది తరగతిని హెచ్చుగా ఆకర్షించిందంటే నాకు అది మంచి లక్షణంగానే తోచింది

*చిత్ర సంస్కార, మాసపత్రిక, సెప్టెంబరు 1978*

# 110. సంపాదక లేఖ

విజయచిత్ర డిసెంబరు '78 సంచికలో బాపు 'సంభాషణం' చదివినాక చాలాకాలంగా నాకు సినిమా అభిరుచి గురించి ఉన్న భావాలు పైకి చెప్పెయ్యాలనిపించింది ప్రేక్షకుల అభిరుచి గురించి ఎవరూ చెప్పలేరని అందరూ ఒప్పుకుంటున్నట్టే కనబడుతుంది— సత్యజిత్‌రాయ్, బాపులతో సహా అయినా నిర్మాతలలోనూ డైరెక్టర్లలోనూ విశిష్టస్థానం సంపాదించుకున్న వారు సినిమారంగంలో వున్నారు బాపు లాగా వీరికి ఇలాంటిస్థానం రావటానికి బాక్సాఫీస్, కళాదృష్టి , సృజనశక్తి, ప్రేక్షకుల మూకాభిరుచి లాటివి కొన్నిగాని, అన్నీగాని ఏ విధంగా తోడ్పడుతున్నాయి? సరి అయిన విమర్శవుంటే సినిమా చిత్రాలూ ప్రజల అభిరుచీ బాగుపడతాయని లోగడ అన్నాను ఇప్పుడూ అంటాను కాని విమర్శ ఒక్కటే అభిరుచిని నిర్ణయించదనీ, సినిమాచిత్రాల జయాపజయాలను ఒక అనిర్వచనీయమైన అభిరుచి నిర్ణయిస్తుందనీ, అది మాత్రం అంతుబట్టటం లేదని ఒకరి తర్వాత ఒకరు చెబుతుంటే చీకట్లో చిందులాట లాగుంది

నాకు స్పష్టంగా అర్థమవుతున్న ఒకటి, రెండు అంశాలు (నా అనుభవం నుంచి) చెబుతాను

బాపూ, బి యన్ , విశ్వనాథ్ లాంటి వారికీర్తికి, వారి చిత్రాల నిర్దుష్టతకూ ఏమీ సంబంధం లేదు

ఉదా బి యన్ అనేక దశాబ్దాలు తెలుగు సినిమారంగంలో విశిష్టుడుగా నిలబడినవాడు నాదృష్టిలో అయన తీసిన చిత్రాలలో విమర్శకు అతీతమైనది ఒకటికూడా లేదు రాయలుపాత్ర పూర్తిగా ఖూనీ అయిన 'మల్లీశ్వరి' ఈ నాటికీ నా అభిమాన చిత్రాలలో ఒకటి

ఇంకో ఉదా బాపు తీసిన 'ముత్యలముగ్గు' లో నాకు కనీసం అయిదారు పెద్దలోపాలు కనిపించాయి కాని నేను ఎంతో ఆనందించిన కొద్దిచిత్రాలలో 'ముత్యాల ముగ్గు' ఒకటి

చిత్రంలో లోపాలు విజయానికీ, కీర్తికీ అడ్డం రావు అభిరుచులను గురించి ఎంత అయోమయంగా నైనా చెప్పవచ్చు ఎన్నికోతలైనా కోయవచ్చు అన్ని కళలలాగే సినిమాలు కూడా 'రక్తి' కట్టాలి ఈ పాత మాటను ఈకాలపు మనుషులు ఎరిగినట్టు కనపడదు ఒకరికి కనిపించిన లోపాలు ఇంకొకరికి కనిపించవు మీ అభిరుచి ఏమిటంటే ఏ ఇద్దరూ ఒకటిగా చెప్పరు కాని 'రక్తి' సార్వజనీనం ఒక ప్రేక్షక సముదాయానికి రక్తి కట్టినది ఇంకొక సముదాయానికి రక్తికట్టడం దాదాపు అసంభవం చిత్రనిర్మాణంలో ఉండేవారు తమ ''ఫార్ములా' గురించి ''ఆబ్జెక్టివ్'' గా ఆలోచించటం మాని తమరక్తి తాము చూసుకుంటే

సినిమా పరిశ్రమ ఇంత అయోమయంగా తయారై ఉండునా? తనరక్తి తాను అన్నిటికన్నా మిన్నగా చూసుకోవటం బి ఎన్ లో చాలా అరుదైన గుణం కదా!

*విజయచిత్ర, మాసపత్రిక, జనవరి, 1979*

# 111. మరో సంపాదక లేఖ

కళాప్రదర్శన రక్తి కట్టటానికీ, ప్రేక్షకుల అభిరుచికీ తేడా గ్రహించాలి రక్తి కట్టించే గుణం ప్రధానంగా కళాఖండాలలో వుంటుంది కళాభిరుచి ప్రధానంగా ఆస్వాదించే వారిలో—అదికూడా వ్యక్తిగతంగా—వుంటుంది ఈ సంగతిని శ్రీ వెంకట నరసింహం గారిచ్చిన ఉదాహరణలే రుజువు చేస్తాయి ఉత్తమాభిరుచిని తృప్తిపరచే చిత్రాలు (ఒక వూరికథ) బహుమానాలు పొందుతాయి, కాని అవి రక్తి కట్టని కారణంగా డబ్బు చేసుకోలేకపోవచ్చు ఈ రెండూ సాధ్యమేనంటూ సత్యజిత్‌రాయ్ తానుతీసిన 'చారులత', 'కాంచనజంగ' లాంటి చిత్రాలను పేర్కొన్నారు అది నా వాదనకు అడ్డురాదు 1 'రక్తి' అన్నమాట సామూహిక కళలకే వర్తిస్తుంది పుస్తకం రక్తి కట్టుతుందనం చిత్తరువులు రక్తి కట్టవు

2 'రక్తి' కట్టటం ఏ అభిరుచినీ సూచించకపోవచ్చు లారల్—హార్డీ చిత్రాలలో హాస్యం రక్తి కడుతుంది కాని అది ఏ అభిరుచినీ నిరూపించదు 'ముత్యాల ముగ్గు' లో రావుగోపాలరావు— మాడా ల సన్నివేశం 'యమ' గా రక్తికట్టింది అది ఏ అభిరుచిని తృప్తి పరుస్తుందో చెప్పటం సాధ్యం కాదనుకుంటాను

3 విమర్శకులు సైతం అభిరుచిని ప్రదర్శించటమేగాక, అభిరుచులలో తారతమ్యాలను సునిశితంగా నిరూపించగలరు కాని 'రక్తి' అనేదాన్ని విశ్లేషించటం ఏ విమర్శకుడికీ సాధ్యంకాదు 'షావుకారు' లో ఉత్తమ అభిరుచి కనిపించిందిగాని అది చెప్పుకోదగినట్టు రక్తి కట్టలేదు రక్తి కట్టటానికి భాషతో సంబంధం లేదని ఎందుకనుకోవాలి? 'చలిచీమలు' లో నూతన్ ప్రసాద్ మరోభాషలో టెలిఫోన్‌లో ఏకపక్ష సంభాషణ జరిపివుంటే అది రక్తి కట్టివుండునా? ఇంకో నటుడు అదే సంభాషణను తగలేసి ఉంటాడన్నది ఊహించరానిదా? 'షోలే', 'అడవిరాముడు' మంచి అభిరుచి లేనివి కావచ్చు అవి రక్తి కట్టే ఉండాలి!

*విజయచిత్ర, మాసపత్రిక, మార్చి 1979*

# 112. సినిమా భవిష్యత్తు

ప్రజల దృష్టినుంచి ఈ 20వ శతాబ్దిలో సినిమాను మించిన, మళ్ళీ మాట్లాడితే సినిమాతో సరిరాగల, కళా స్వరూపం లేదు వరసగా విడుదల అయ్యే క్షుద్ర సినిమా చిత్రాలను చూస్తూ, ఈ కళా రూపంమీద ఎలాటి సదభిప్రాయమూ లేనివారికి ప్రజలు దీనిచేత ఎందుకింత బలంగా ఆకర్షించబడతారా అని ఆశ్చర్యం కలగవచ్చు ఆకర్షణ అచ్చగా సినిమా చిత్రాలలోని విషయానికి సంబంధించినది కాదు సినిమా స్వరూపానికి సంబంధించినది అందుచేత సినిమా స్వరూపానికి గల ప్రత్యేకతను గుర్తించటం చాలా అవసరం

సినిమా దృశ్యకావ్యాల జాతికి చెందినది పరన కావ్యాలకన్న శ్రవ్యకావ్యాలూ,

దృశ్యకావ్యాలూ ప్రజలను హెచ్చుగా ఆకర్షిస్తాయి ''నాటకాంతం సాహిత్యం'' అన్న మాట ఏనాడో వచ్చింది బుర్రకథలూ, జముకుల కథలూ, హరికథలూ, పురాణ పఠనాలూ శ్రవ్యాలు తోలుబొమ్మలూ, వీధి నాటకాలూ, స్టేజి నాటకాలూ, సినిమాలు దృశ్యాలు

వచన కావ్యానికి గల శక్తి రచనలో ఉంటుంది శ్రవ్యాలూ, దృశ్యాలూ రచించినవే అయినా వాటి జీవం ప్రదర్శనలో ఉంటుంది అందుచేత అవి ఎప్పటికప్పుడు నవ్యత ప్రదర్శిస్తాయి ఈనాడు కూడా విశేషంగా ప్రేక్షకులను ఆకర్షిస్తున్న 'చింతామణి', 'కురుక్షేత్రం' నాటకాల పుస్తకాలు ఎన్ని అమ్ముతున్నారో విచారించి చూడండి పఠన కావ్యాలుగా వాటి జీవితం ఏనాడో అయిపోయింది అలాగే పురాణగ్రంధాల శకం అయిపోయి మరి రెండు శకాలు వచ్చినా, వీధినాటకాలలోనూ, హరికథలలోనూ, రంగస్థల నాటకాలలోనూ, అన్నిటినీ మించి సినిమాలలోనూ నిలబడింది (నా మాట నమ్మకపోతే బాపును అడగండి ) దృశ్యాలైన సినిమాల వెంట సినిమా కథల పుస్తకాలు వెలువడి హెచ్చుమంది పఠితలను ఆకర్షిస్తున్న మాట నిజమే కాని సినిమా విడుదల చేయకుండా ఆ పుస్తకాలను అమ్మజూపితే ఇతర పుస్తకాలకన్న హెచ్చుగా అమ్మకపోవచ్చు సినిమా కథల పుస్తకాలను అమ్మటం పరోక్షంగా సినిమా దృశ్యకావ్యాన్ని అమ్ముకోవటమే

దృశ్య కావ్యాలలో ఉన్న రెండో విశేషం వాటి ప్రేక్షకుల సామూహికత పురాణమే ఎవరికి వారే చదువుకున్న దానికన్న పదిమంది కలిసి పురాణ శ్రవణం చెయ్యటంలో ఎక్కువ ఆనందం ఉన్నది శ్రోతల రసానందం పురాణం నుంచి మాత్రమే గాక, పురాణం చదివేవాడి నుంచి— అతడి వాచికాభినయం నుంచి — కూడా వస్తుంది

దృశ్య కావ్యాలకుగల ఈ సామాజిక స్వభావాన్ని సరిగా మనసుకు పట్టించుకుంటే చాలా 'సినీ సందేహాలు' తీరిపోతాయి చదవటానికి ఎంతో అద్భుతంగా ఉండే కథలు సినిమాలలో ఎందుకు పేలిపోతాయి? చాటుగా చదువుకుంటే ఉద్రేకం కలిగించే సెక్సు సన్నివేశాలు సినిమాలలో ఎందుకు అసభ్యమనిపిస్తాయి? రచన దృష్ట్యా ఎంతో మంచి ఫార్ములాలాగా కనిపించింది, సినిమాలోకి రాగానే ఎందుకు పట్టిస్తుంది? స్క్రిప్టు రాసుకుంటున్నప్పుడు రచనలో పాల్గొనే వాళ్ళకు కలిగిన తన్మయత్వం ప్రేక్షకులకు చిత్రం చూసేటప్పుడు ఎందుకు కలగదు? ఒక్కటే సమాధానం – సినిమా సామూహిక ప్రదర్శనకు ఉద్దేశించిన దృశ్యకావ్యం, పఠన కావ్యం కాదు

దృశ్యకావ్యంగా సినిమా కళాస్వరూపం ఈనాడు అత్యున్నతమైనది అందుగురించి ఎవరికీ ఎలాటి అనుమానమూ అవసరం లేదు ప్రపంచమంతటా అనేక రంగాలకు చెందిన మేధావులనూ, కళాకారులనూ అది ఆకర్షిస్తున్నది డబ్బుచేత ఆకర్షించబడే వాళ్ళు కూడా మందలుగా ఎగబడటంతో సినిమా ఒక వేలంవెర్రి అనే అభిప్రాయం ఏర్పడిందిగాని, చార్లీచాప్లిన్ లాంటి చిత్రనిర్మాత షేక్స్పియర్, కాళిదాసులతో సమమైన ఖ్యాతికి నోచుకున్నాడంటే అతని 'మీడియమ్' సినిమా కావటం చేతనే నిన్నగాక మొన్న సినిమా రంగంలోకి వచ్చిన నాలుగోతరం చిత్ర నిర్మాతలు సత్యజిత్‌రాయ్, మృణాళ్‌సేన్ లాంటి వారు దేశంలోని ఏ కవులకూ, కథకులకూ లేని అంతర్జాతీయ ఖ్యాతికి అర్హులనిపించుకున్నారు

అనేక కారణాలవల్ల సినిమాకు బలమైన, సమగ్రమైన రూపం రాలేదు అంతర్జాతీయ సినిమా ప్రదర్శనలలో మనం చూసి ప్రస్తుతం తన్మయత్వం పొందుతున్నది— సినిమా శిల్పంలో

గొప్ప ప్రయోగాలను చూసి మాత్రమే  నిజమైన కళకు జాతీయ స్వభావమూ, వర్గచైతన్యమూ ఉండి తీరాలి  మొపాసా  కథలు చదివి  తెలుగు పాఠకులు  అవి తమ కథలేనన్న  తృప్తి పొందటం ఎలాటిదో, శరత్ నవలలుంటే తెలుగు నవలలు వేరే అవసరం లేదనుకోవటం ఎలాటిదో, ఇతర భాషా చిత్రాలను తెలుగులో ఉత్తమ చిత్రాలుగా  నిర్మించుకోవటం అలాటిదే  అవి ఆ భాషలకు చెందిన చిత్రాలైనా  కావు, అరువు కథలూ, కృత్రిమ  కథలూ కలిగినవే

ఒకప్పుడు దేశమంతటా  ఒక సంస్కృతి ఉండి, సంస్కృతభాష కళాసాధనంగా దేశమంతటికీ ఉపయోగపడిందేమో, కాని చారిత్రక కారణాలవల్ల  ఆదశ పోయింది ఏనాడో  ఇవాళ మన చింతామణి,  కురుక్షేత్ర నాటకాలను నలుగురు  కృష్ణులతో ఇతర భాషలలోకి తర్జుమా చేసి,  ఇతర  ప్రాంతాలలో  ఆడితే  రాళ్ళూ, చెప్పులూ  పడతాయి   సినిమాలకు ఇంకా అది సాధ్యమవుతున్నదంటే, నాటకమంతగా సినిమా దృశ్యకావ్యంగా పరిణమించకపోవటం చేతనే

అలాగే ''వినోదం'' అన్నది ఒక సమగ్ర కళారూపం కాదు   ఆఖరుకు వీధి నాటకాలలో కూడా భావ తీవ్రతను 'బ్రేక్'  చెయ్యటానికి, హాస్యాన్ని పెట్టేవాళ్లు  అప్పుడు  కూడా హాస్యాన్ని వ్యంగ్య  విమర్శలకు ఉపయోగించేవారు  సినిమా  చిత్రాలు మొత్తంగా  వినోదం కోసం తయారు కావటం  ఏ సంస్కృతినీ, ఏ వర్గ లక్షణాన్నీ సూచిస్తుందో తెలియదు

నిజమైన కళగా రూపొందేవరకూ సినిమా సాంకేతిక ప్రదర్శనగానే ఉండి పోతుంది ప్రజాకళగా  అది రూపొందేదాకా  ధనపిశాచి దాని రక్తం  పీల్చుతూ,  ప్రజా జీవితానికి ద్రోహం చేస్తూనే ఉంటుంది

*విజయచిత్ర , మాసపత్రిక, ఫిబ్రవరి 1979*

# 113. నేను మెచ్చిన విభిన్న చిత్రం

'ఒక ఊరి కథ' ను మామూలు  చిత్రంగా  తీసి ఉంటే  ఇందులో ఒక రాక్షసుడిలాటి జమీందారూ, వాడి తాగుడూ, ఆడవాళ్ళను చెరవట్టటాలూ, తన మాట వినని పేద శ్రామికులను కొరడాలతో  కొట్టించటాలూ, బీభత్సమూ ఉండేవి. అలాగే ఇంకోవైపు  జమీందారు పెట్టే కష్టాలతో సతమతమయే కూలిజనం  జీవితం ఉండేది  ఈరెండు రకాల సంఘటనలకూ ఈ చిత్రంలో స్థానం లేకపోవటం వల్లనే ఇది భిన్నమైన చిత్రం

ఇందులో ఒక సమస్యా, దానికి  పరిష్కారమూ లేదని కొందరు ఆక్షేపించారు  కళలు పరిష్కరించిన సమస్యలు చెక్కుచెదరవు   వాస్తవజీవితంలో వాటికిగల పరిష్కార మార్గాలు కళలలో   చిత్రించటం  ఒక్కోసారి  సాధ్యం  కూడా  కాదు   కాకపోతే,  కళలలో   కనిపించే పరిష్కారాలు ప్రజలలో భ్రమలను రేకెత్తిస్తాయి

' ఒక ఊరి కథ' లో ఒక వ్యవస్థ చిత్రించబడింది   ఈవ్యవస్థ స్వరూపాన్ని స్పష్టం చేసే పాత్ర వెంకయ్య  శ్రీశ్రీ అన్నట్టు, కదం తొక్కుతూ,  పదం పాడుతూ పైపైకిపోయే పాత్ర కాదిది  వెంకయ్యను సోమరి అనీ, 'లంపెన్'  అనీ అన్నారు  అలాటి పాత్రలు సామాన్యంగా దోపిడీదార్ల ఎంగిలిచేత్తో విదిలించే మెతుకులకు ఆశపడి,  అవతల విప్లవోన్ముఖులైన వాళ్లుంటే వారి  దారికి  అడ్డం  తగులుతాయి    తమ  సోమరి  తనాన్ని  సమర్థించటానికి  అనేక  మూఢ విశ్వాసాలను అంటి పెట్టుకుంటాయి

వెంకయ్య పాత్రలో ఈ లక్షణాలేవీ లేవు వాడి అభిప్రాయాలన్నీ వాస్తవిక దృక్పథం నుంచీ, జీవితానుభవం నుంచీ ఏర్పడినవి తాను పని చెయ్యడు అంతేకాదు ఇతరులను పని చెయ్యవద్దంటాడు ఎందుకు పని చెయ్యాలి? బతికినన్నాళ్లూ పనిచేసి, వాడి తాతా, తండ్రీ ఉన్నదంతా పోగొట్టుకున్నారు సంఘంలో కొవ్విన వాళ్లకు కొవ్వు పుట్టించినది పనిచేసిన వాళ్ళే! ఇది అనుభవం!

ఈచిత్రంలో వెంకయ్యలాగాకాక పనిచేసే వాళ్ళున్నారు వెంకయ్య కృషిచెయ్యని విప్లవం కోసం వాళ్లు చేసిన కృషి ఏమీలేదు ఊళ్లో ఉన్న వ్యవస్థను వాళ్లు వ్యక్తం చెయ్యరు నిజమే, విప్లవ పరిణామాలు కలగటానికి వెంకయ్యలాటి వాళ్ళు కృషి చెయ్యరు కాని వెంకయ్యది విప్లవ చైతన్యంలేని తిరుగుబాటు వాడికి పని చెయ్యటానికి అభ్యంతరం ఉందిగాని, దొంగతనం చెయ్యటానికి, పని రలాయించడానికి అభ్యంతరం లేదు ఇది అశక్తుడి తిరుగుబాటు

పరిస్థితులను మార్చటానికి అశక్తుడైన వెంకయ్యలో స్వతహాగా (వ్యక్తిగతంగా) కొంత బలం లేకపోలేదు వాడికి తన శక్తికి మించిన సమస్యలేవో స్పష్టంగా తెలుసు అందుచేత వాడిలో వివేకం ఉన్నది ఒక ఇల్లాలి మేకను జమీందారు మనుషులు పట్టుకుపోతే, ''నీకామేక ఉంది గనక పట్టుకుపోయారు,'' అని, తన దగ్గిర పట్టుకుపోయేటందుకు ఏమున్నదో సూచిస్తాడు ''పోగొట్టుకునేటందుకు సంకెళ్ళు తప్ప మీ వద్ద ఏమీ లేవు'', అన్న మార్క్స్ మాటవాడెరగడు, కాని వాడి లెవెల్‌లో ఇంచుమించు అదే వేదాంతం చెప్పాడు

అలాగే తన కొడుకును పెళ్లాడవద్దంటాడు అందులో ఉన్న చిక్కులు వాడికి తెలుసు కోడలు ప్రసవవేదన పడుతూంటే రాయిలా ఉంటాడు వేదనకు కరిగి నీరుకారడంలో ఉన్న ఆనందం (తియ్యని బాధ) మధ్య తరగతిది అట్టడుగువారికి అందుబాటులోలేని అనేక సరుకులలో ప్రేమలూ, వియోగతాపాలూ, ఆర్ద్రతలూ కూడా ఉన్నాయి

అన్నిటికన్నా వ్యవస్థలో ఉన్న గొప్ప సత్యం ఏమిటంటే, పనిచేస్తే ఉన్నది పోతుంది గాని, ప్రాణాన్నే పోగొట్టుకున్న శవం మీద డబ్బు గలగలా రాలుతుంది జమీందారుకూ, జమీందారీలో ఉన్న కటిక పేదవాడికీ కూడా సమంగా ఉపయోగపడేది డబ్బే అందరికీ '' ఉన్నది పుష్టి ''

ఇంక చిత్ర నిర్మాణం గురించి చాలా చెప్పటం అనవసరం ఒక ముసలాడు గుడిసెలోనుంచి నిద్రలేచి వచ్చి ఉచ్చపోసుకోవటంతో ప్రేక్షకుణ్ణి పట్టేసే వాస్తవికత చిత్రంలో ఎక్కడా పట్టుసడలినట్టు నాకు అనిపించలేదు

*విజయచిత్ర, మాసపత్రిక, జూన్ 1979*

# 114. తెలుగు సినిమా ఎలా ఉంది?

సినిమాలకు సంబంధించని వివిధ రంగాలకు చెందిన ఒక రకమైన మేధావి వర్గం దృష్టిలో తెలుగు సినిమా ఎలా వుంది? తెలుగు సినిమా గురించి వారి వారి అభిప్రాయాలు ఏమిటి? అన్న విషయాలపై 'విజయచిత్ర' ఉమ్మడిగా ఒక గోష్ఠి జరిపింది ఈ గోష్ఠిలో కొడవటిగంటి కుటుంబరావు, చల్లా రాధాకృష్ణశర్మ, అత్తిలి కృష్ణారావు, ఎమ్ ఎ సుభాన్, మాలతీ చందూర్ పాల్గొన్నారు

మాలతీ చందూర్ సినిమాల గురించి విమర్శించేటప్పుడు ప్రేక్షకుల్ని రెండు తెగలుగా విభజించాలి చదువుకున్న వాళ్ళ దృష్టి, నిరక్షరాస్యుల దృష్టిఎలా వుంటుందో దృష్టిలో పెట్టుకొని విమర్శించాలి మనం యిక్కడ కూర్చుని కళాత్మక చిత్రాల గురించి మాట్లాడే ముందు ప్రేక్షకుల అభిప్రాయాలూ పూర్తిగా తెలుసుకోవాలి కుంటుంబరావుగారు 'ఒక వూరి కథ' చాలా గొప్ప చిత్రంగా చెప్పారు కొంతమందినన్ను ఆచిత్రంలో ఏముందని అడిగారు చాలామంది దాన్ని చూడలేదు ఎంచేతంటారు కుటుంబరావుగారూ?

కొ. కు అది నాకెలా తెలుస్తుంది? అది ప్రజలు చూడకపోతే నేనెందుకు బాధపడాలి? అది గొప్ప చిత్రమన్నది నా అభిప్రాయం

మా చ మరి కళాత్మక చిత్రాలు కావాలని కదా మీ అభిప్రాయం?

కొ కు నా అభిప్రాయమైతే కావచ్చు కళాత్మక చిత్రాలు రావాలని నాకైతే వుంటుందే కాని నేను అందరినీ అలాంటి చిత్రాలు తియ్యమని శాసించలేనే తీసే వాళ్ళు డబ్బు కోసం తీస్తారు

మా చ అయితే సినిమాలు వ్యాపారమా, కళా అన్నది ముందు మనం తేల్చుకోవాలి

కొ కు వ్యాపారంగా తేసేవాళ్ళకి వ్యాపారం కళగా తీసే వాళ్ళకి కళ

మా చ అంటే రెంటికి పొత్తు కుదరదంటారా?

కొ కు కుదరదని చెప్పడానికీ లేదు కుదురుతుందని చెప్పడానికీ లేదు

చ రా నా వుద్దేశ్యంలో సినిమా కేవలం వ్యాపారమే అయినా కళాత్మకంగా కూడా తియ్యొచ్చు లక్షలు పెట్టి వ్యాపారం చేసేవాడు లాభం ఆశిస్తాడు వ్యాపారానికే ప్రాముఖ్యత యిస్తాడు

సుభాన్ ఇచ్చినా కూడా సినిమాల ప్రభావం ప్రజలమీద పడడానికి అవకాశం వుంది కాబట్టి, ప్రజల మంచి కోసం, మేలు కోసం సినిమా కొంత ప్రయోజనకరంగా వుండాలి

కొ కు నిజమే. మామూలుగా వుండే పరిశ్రమల ప్రభావం ప్రజల మీద పడ్డానికి అవకాశం వుండదు ఈ పరిశ్రమకే ఆ అవకాశం ఎక్కువ అంచేత కచ్చితంగా కళాత్మకంగానే వుండాలి

అ కృ సినిమా మాస్ మీడియం కనక కచ్చితంగా దాని ప్రభావం ప్రజల మీద వుంటుంది గతంలో తీసిన కొన్ని చిత్రాలు సమాజం మీద అలాంటి ప్రభావం చూపించాయి అవి సమాజాన్ని ముందుకు నడిపించాయి కాని యివాల్టి చిత్రాలు సమాజం కొంత ముందుకు నడుస్తున్నా నిజానికి అవి వెనక్కి లాగుతున్నాయి

మా చ అంటే పూర్వం వచ్చిన చిత్రాలకి ఒక సాంఘిక ప్రయోజనం వుండేదనీ, యివాల్టి చిత్రాలకి లేదనీ మీ అభిప్రాయం అంతేనా?

అ కృ అంతే!

సుభాన్ పైగా ఇవాళ సినిమా ప్రభావం దేశంలో బాగా వుంది ప్రజలు సినిమాలు బాగా చూస్తున్నారు కొన్ని కొన్ని వూళ్ళలో ఉదయం తొమ్మిదిన్నర నుంచి మర్నాడుదయం ఐదు గంటల వరకూ సినిమాలుప్రదర్శిస్తూనే వున్నారు ప్రజలు ఎక్కువగా యివాళ చర్చలు జరుపుకునేది కూడా సినిమాల గురించే వెనకటి రోజుల కంటె యిపుడు సినిమాలు చూడడం బాగా ఎక్కువైంది అంచేత వాటి ప్రభావం ప్రజల మీద కచ్చితంగా వుంటుంది

అ కృ   ఆ ప్రభావం వుందని మనమందరం అంగీకరిస్తున్నాం కనకనే చిత్రాలు ఎలా వుండాలని మనం చర్చ జరపాల్సి వచ్చింది

చ రా   సినిమాలో 'సామాజిక స్పృహ' అన్నది కొంత వుంటూ కొంత ప్రజారంజన కూడా వుండాలని అంటే మనకి సదుత్తరం వస్తుందేమోనని నేను భావిస్తాను

అ కృ   సినిమాలన్నీ ప్రజారంజన కోసమే తీస్తున్నారు  అందుకే 'ప్రజలు కావాలన్నారనే యిలాంటి దృశ్యాలు పెడుతున్నాం  ప్రజలు కోసమే యిలాంటి సినిమాలు తీస్తున్నాం' అంటున్నారు  ప్రజలు కావాలని ఎపుడు చెప్పారు వీళ్ళతో?  కొన్ని సంవత్సరాల క్రితం ద్వంద్వార్థాలతో అసభ్యకరమైన గ్రామఫోన్ రికార్డులు వచ్చాయి  బాగా ప్రచారం పొందాయి అవి విన్న కొంతమంది చదువుకున్న వాళ్ళు అవి రాకుండా ఆపు చేయించారు  కాని మళ్ళీ అలాంటి రికార్డులు రాలేదు  ''అవే మాకు కావాలి''  అని ప్రజలు అడగలేదే ?  అలాగే సినిమాలు కూడా మనం చూపిస్తేనే వాళ్ళు చూస్తారు కానీ 'యిది కావాలి' అని అడగరు నిర్మాతలు అదొక సాకుగా చెప్పుకుంటారు అంతే!

కొ కు   పైగా ఫలానాది పెడితే డబ్బొస్తుందని అలాంటిదేదో పెడతారు  పెట్టి దెబ్బతిన్న నిర్మాత లెందరో వున్నారు

అ కృ   దాన్నిబట్టే మనం చెప్పొచ్చు కదా ప్రజలు 'యిలాంటివి కావాలి' అని కోరడం లేదని

కొ కు   'షావుకారు' లాంటి చిత్రం జనాదరణ పొందుతుందని మేము అనుకున్నాం కాని, వ్యాపారపరంగా దానికేమీ లాభాలు రాలేదు  అంతకుముందు ఒక అభిరుచితో సినిమాలు తియ్యాలనుకున్న చక్రపాణిగారు మళ్ళీ యిలాంటి చిత్రం తియ్యకూడదనుకున్నారు

చ రా   అందుకే సినిమాకి ఒక కొలబద్ద అంటూ వుండాలి

కొ కు   ఎవరు నిర్ణయిస్తారు  ఆ కొలబద్దని ?

మా చ   నా ఉద్దేశంలో సినిమాగానీ, మరేదైనా కళావస్తువు గానీ వున్నప్పుడు — దానికి కొలబద్ద అంటూ వుండకూడదు

అ కృ   ఇదివరలో 'మాల పిల్ల', 'రైతు బిడ్డ', 'మనదేశం', ' మల్లీశ్వరి', 'దేవదాసు' లాంటి సినిమాలు బాగా ప్రజాదరణ పొందాయి  అప్పట్లో  అవి గొప్ప చిత్రాలు  ఇప్పట్లో అలాంటి  గొప్ప చిత్రాలు రావడం లేదని చాలా మంది చెప్తూనే వున్నారు

కొ కు  . అప్పటి నిర్మాతలు బాగా ధైర్యవంతులు ఇప్పటి వారికి అలాంటి ధైర్యం లేదు వీళ్లు పిరికివాళ్ళు

మా చ   వాళ్లని పిరికి వాళ్ళనడానికి లేదు  మన సమాజం కూడా అలాగే వుంది

కొ కు   నన్ను చెప్పనివ్వండి  ఎందుకు పిరికి వాళ్ళంటున్నానంటే 'యిది వుంటే కాని డబ్బు రాదేమో',  'అది వుంటే కాని డబ్బురాదేమో' అన్న  భయం  అడుగడుగునా వాళ్లని వేధిస్తూ వుంటుంది  ఈమధ్య నరసరాజుగారు రేడియో నాటకం ఒకటి రాశారు.  అందులో ఒక ప్రొడ్యూసరు సినిమా అంతా తీస్తాడు  తీసిన  తర్వాత 'యిందులో రేప్ సీన్స్ లేవు డబ్బు రాద'ని కొందంటారు  అంచేత మళ్లీ బోలెడంత  డబ్బు ఖర్చుపెట్టి రేప్ సీన్స్ తీసి సినిమాలో యిరికిస్తారు  కాని సెన్సార్ వాళ్లు కట్ చేసి పారేస్తారు  ఇప్పటి ప్రొడక్షన్ వ్యవహారాలు ఎంత

పిరికితనంగా వున్నాయో ఈనాటకం చెబుతుంది

చ రా పిరికివాళ్ళనే కాదు అప్పటి వాళ్ళకున్న చిత్తశుద్ధి కూడా యిప్పటి వాళ్లకి లేదేమోనని నాకు అనిపిస్తుంది

అ కృ దానికి కారణం రియల్ ప్రొడ్యూసర్స్ అన్న వాళ్లు యివాళ ఎక్కువ మంది లేక పోవడమే అలాగే సమర్థవంతమైన దర్శకులు కూడా ఇది వరకు వున్నట్లుగా యివాళ లేరు

సుభాన్ అందువల్ల నా వుద్దేశ్యం ఏమిటంటే రియల్ ప్రొడ్యూసర్స్ కావాలని అనుకునేటప్పుడు సినిమా పరిశ్రమలో ఒక లైసెన్సింగ్ విధానం అన్నది అమలు చేస్తే బాగుంటుందేమో అది లేక పోవడం మూలానే లాభాలు సంపాయించాలన్న వుద్దేశ్యంతో ఏమాత్రం అభిరుచి లేనివాళ్ళు కూడావచ్చి సినిమాలు అస్తవ్యస్తంగా తీస్తున్నారు లైసెన్సింగ్ విధానం అంటే ప్రొడ్యూసర్ స్తోమత, అభిరుచి, అనుభవం దృష్టిలో పెట్టుకుని అతను సినిమా తియ్యడానికి సమర్థుడు అని ఒక లైసెన్స్ ఇవ్వడం అన్నమాట దానివల్ల చిత్రాల సంఖ్య బాగా తగ్గడానికీ ఆస్కారం వుంటుంది మనకున్న థియేటర్లకి సరిపడ చిత్రాలు రావడానికి అవకాశం వుంటుంది

కొ కు ఆ విధానం బాగానే వుంది కానీ అలాంటి విధానం వున్నప్పుడు 'చలిచీమలు' లాంటి చిత్రం రావడానికి అవకాశంలేదు! అంచేత లైసెన్సింగ్ విధానంవల్ల మంచి సినిమాలు వస్తాయనుకోవడానికి లేదు ఇంకొకటుంది లైసెన్సింగ్ సిస్టమ్‌లో వాళ్ళ వాళ్ళే తిరిగిరావడానికి అవకాశం వుంటుంది దానివల్ల మొనాపలీ తలెత్తడానికి అవకాశం వుంది డబ్బు పెట్టుబడి పెట్టి వ్యాపారం చేసేచోట సాంస్కృతిక విలువలు కచ్చితంగా తగ్గుతాయి

మా చ వ్యాపారం అనుకున్నప్పుడు మళ్ళీ సంస్కృతి అని మాట్లాడతారేమిటి? సంస్కృతికీ, వ్యాపారానికీ పొత్తు కుదరదు

చ రా పొత్తు కుదిరినా కుదరకపోయినా సంస్కృతిని వ్యాపారానికి వాడుకుంటున్నారు కాబట్టి కొంతైనా అందులో కళని ప్రతిబింబింపజేయాల్సిన అవసరం వుందా లేదా?

కొ కు అచ్చంగా కళ అని కాకుండా 'ఆకట్టుకునే విధంగా వుండడం' అనేది చాలాముఖ్యం ఉదాహరణకి— సాంఘిక సమస్య అనేది ఎలా వున్నా 'చిలకమ్మ చెప్పింది' నాకు నచ్చింది అలాగే కొంత అసహజత్వం కనిపించినా 'ఇంటింటి రామాయణం' కూడా నచ్చింది

చ రా మరి అసహజత్వం వున్నచోట సామాజిక స్పృహ ఎలా వుంటుందండి?

కొ కు ప్రతి దాంట్లోనూ సామాజిక స్పృహ వెతకాల్సిన అవసరం లేదు

మా చ సినిమాలు హాయిగా, సరదాగా వుంటే ఫరవాలేదన్నమాట

కొ కు తప్పకుండా వుండొచ్చు అలాంటి సినిమాలు మనం ఎన్నో చూశాం మెచ్చుకున్నాం ప్రతిదాంట్లోనూ సాంస్కృతిక విలువలు వెతకనక్కరలేదు 'చలిచీమలు' లో నూతన్ ప్రసాద్ టెలిఫోన్లో మాట్లాడడం, 'ముత్యాల ముగ్గు' లో రావుగోపాలరావు, మాడాల సంభాషణలు ఎవర్ని అప్పీల్ చెయ్యలేదు? అందులో సాంస్కృతిక విలువలు ఏమున్నాయి? అలాంటి ఘట్టాలెన్నిసార్లయినా చూడొచ్చు ఆనందించవచ్చు లారెల్, హార్డీ సినిమాలు చూసినప్పుడు నేను బ్రహ్మాండంగా ఆనందిస్తాను అలాంటివి ప్రొడ్యూస్ చేయడానికి ఎంతో

కృషి కావాలి, శ్రద్ధా కావాలి ఒక రకమైన 'టెక్నిక్' ని 'ఎడాప్ట్' చెయ్యాలి సామాన్య ప్రేక్షకుడ్ని కూడా నవ్వించడమో, కదిలించడమో చెయ్యగల ప్రక్రియ ఏదైనా అది కళకి దూరమైనది అని చెప్పడానికి లేదు ఇలాంటివి తయారైనప్పుడు వాటిల్లో కొన్ని విలువలు వుంటాయి వ్యాపారరీత్యా వాటికి ఆదరణా వుంటుంది

అ కృ అందుకనే— సామాన్య ప్రజల్ని కూడా ఆకట్టుకోవాలన్న వుద్దేశ్యంలోనే వాళ్ళని ఆహ్లాదపరచాలనే ఈ నగ్న దృశ్యాలు, రేప్ సీన్స్ లాంటివి పెడుతున్నారు అలా కాకుండా వినోదంతో పాటు వాళ్లని ఎడ్యుకేట్ చెయ్యగలిగేటటువంటి చిత్రాలు కూడా రావాలి. వాళ్ళకి చెడ్డ అభిరుచులు కలగకుండా చూడాలి

మా చ ప్రబోధాత్మకంగా వున్నా లేకపోయినా అనవసరమైన దృశ్యాలు, అసభ్యకరమైన దృశ్యాలు లేకుండా— నీట్‌గా వుంటూ కుటుంబంతో సహా వెళ్ళి చూడగలిగే చిత్రాలు వస్తే చాలు

సుభాన్ నా వుద్దేశ్యంలో యిటువంటి సినిమాలు తీసినప్పుడు నిర్మాతలు నష్టపోరు నీట్ ఎంటర్‌టైన్‌మెంట్, అందులో పెద్దగా కథ లేకపోయినాసరే బాగా అప్పీల్ చేస్తుంది 'సొమ్మొకడిది— సోకొకడిది' మేము మా సభ్యులకి వేసుకున్నప్పుడు, సినిమా ఐన తర్వాత వాళ్ళందరూ ఈ చిత్రాన్ని ఎంతగానో ఆనందించినట్లుగా వాళ్ళ ముఖాలు చెప్పాయి

చరా ఏమైనా సామాజిక స్పృహకీ రక్తికట్టే సినిమాకీ దూరం వుంది సామాజిక స్పృహ గల సినిమాలు రక్తి కడతాయంటారా?

కొ కు తీసే విధానంలో తీస్తే కట్టడానికి అవకాశం వుంది ఈమాట సత్యజిత్ రాయ్‌లాంటి డైరక్టరే చెప్పాడు

అ కృ అయినా మనకి కూడా 'ఘటశ్రాద్ధ' 'సంస్కార', 'వంశవృక్ష' లాంటి సినిమాలు కూడా రావాలి జనసామాన్యానికి అందుబాటులో వుంటాయా లేదా అన్నది కాదుగానీ అవి కూడా మనకి అవసరమే జాతీయ స్థాయిలో తెలుగు సినిమాకి కూడా ఒక సమున్నత స్థానం ఏర్పడడం కూడా చాలాఅవసరం ఇప్పుడు నేను చెప్పిన చిత్రాలకి ఆస్థాయి లభించింది కాబట్టే యివాళ మనం వాటి గురించి మాట్లాడుకుంటున్నాం అయితే వీటిని రెగ్యులర్ సినిమా థియేటర్లతో కలపకుండా వాటికి అని ప్రత్యేకమైన థియేటర్లు నిర్మించి ఆ అభిరుచిని ప్రోత్సహించాలి కొంత వరకు ఫిల్మ్ క్లబ్‌లు ఆ పని నెరవేరుస్తున్నాయి

మా చ అయితే ఈ ఫిల్మ్ క్లబ్స్ కూడా ఎంతసేపూ విదేశీ చిత్రాలనే ప్రదర్శిస్తున్నాయి కానీ మంచి తెలుగు చిత్రాలని ప్రదర్శించడం లేదు

కొ కు ఈ క్లబ్స్‌వాళ్ళు అన్ సెన్సార్డ్ ఫారిన్ ఫిల్మ్స్ చూడ్డంలోనే ఎక్కువగా మోజు పడుతున్నారు అయినా కూడా వాళ్ళు కొంత మంచిపనే చేస్తున్నారు అది మనం మెచ్చుకోవాల్సిందే ననుకోండి

సుభాన్ 'చలిచీమలు' తీసిన దేవదాసులాంటి వ్యక్తులు మళ్ళీ అలాంటి సినిమాలు తియ్యడానికి భయపడుతున్నారని మీరు చెప్పారు మన ప్రభుత్వం, స్థానిక పురపాలక సంఘాలు కలిసి ఏవైనా చిన్న చిన్న థియేటర్లలాంటివి ప్రతి పట్టణంలోనూ నిర్మించి ఈ రకమైన చిత్రాలను ప్రోత్సహిస్తే దేవదాసులాంటి దర్శకులు ఎందుకు భయపడతారు? కేవలం ఫిల్మ్ క్లబ్స్ వేసుకుని

చూసినందువల్ల యిలాంటి సినిమాలకి ప్రోత్సాహం రాదు ఒక అభిరుచిగల ప్రజలందరూ కూడా థియేటర్లకి వెళ్లి టిక్కెట్లు కొనుక్కొని చూడాలి

అ కృ మనకి వున్న అభిమాన సంఘాలు కూడా మంచి చిత్రాలు తియ్యడానికి కొంత దోహదం చెయ్యవచ్చు కాని అవి వేరే పద్ధతులు తొక్కుతున్నాయి

మా చ తారల ప్రాబల్యం వున్నంత కాలం అలాంటివి తప్పవు అందుకే — తారలని బట్టి సినిమాలు చూడడం అన్నది కాకుండా దర్శకులనిబట్టి చూడగలగాలి

సుభాన్ ఆ మాట నిజమే ఈ మధ్య 'పుదియ వార్పుగళ్' అనే తమిళ చిత్రం రిలీజ్ అయినప్పుడు దానికి ఏవిధమైన పబ్లిసిటీ యివ్వలేదు కాని ఆ సినిమా విడుదలైన రోజున విపరీతంగా జనం ఎగబడ్డారు అందులో పెద్ద నటీనటులెవ్వరూ లేరు అంతా కొత్తవాళ్లు కాని ఆ చిత్రం దర్శకుడు భారతిరాజా అంతకు ముందు తను తీసిన చిత్రాలవల్ల ఆఘనవిజయాన్ని సాధించగలిగాడు అలాగే మనకి కూడా దర్శకులు రావాలి

కొ కు అలాంటి దర్శకులు వున్న రోజున ఆ చిత్రాలకే పేరొస్తుందిగానీ ఏ ఒక్కరికో పేరురాదు డెసికా 'బైసికిల్ తీవ్స్' తీసినప్పుడు ఎవరెవరినో పెట్టి తీశాడు అందులో ముఖ్య పాత్ర వేసినవాడు తర్వాత ఏమైపోయాడో మనకి తెలియదుగానీ ఆ చిత్రం మాత్రం మనకి బాగా గుర్తుండిపోయింది సినీ తారల ప్రాబల్యం పెరిగిన తరువాత మన దర్శకులకి ఆ స్థానం రాకుండా పోతుంది వెనక వై వి రావ్, గూడవల్లి రామబ్రహ్మం, ఎల్ వి ప్రసాద్ మొదలైన వాళ్ళందరికీ గొప్ప పేరుండేది పత్రికలు కూడా వాళ్ళకి బాగా ప్రచారం యిచ్చేవి కాని యివాళ మాత్రం మన పత్రికలు ఎంతసేపూ తారల భజన చెయ్యడం తప్ప దర్శకుడి గొప్పదనాన్ని మెచ్చుకోవడం లేదు

మా చ పత్రికలు రివ్యూలు రాయడంలో కూడా సరైన విధానం అనుసరించడం లేదు కొంచెం మంచి అభిరుచితో వున్న సినిమాకి కొంత పబ్లిసిటీ యివ్వడం, ఆ సినిమా గురించి కొంత బాగా రాయడం చేస్తే అది కొంత దోహదకారిగా వుంటుంది అలాగే ఏ మాత్రం చెత్త చిత్రమైనా దాన్ని గట్టిగా విమర్శించాలి మళ్ళీ అలాంటి చిత్రం ఎవరూ తియ్యకుండా వున్నంత ఘాటుగా విమర్శించాలి

కొ కు అది కష్టం? పరిశ్రమలో తారల ప్రాబల్యం వున్నంతవరకూ పత్రికలు అలాంటి సాహసం చెయ్యలేవు

అ కృ ఇది అప్పట్లో తగ్గే సూచన కనిపించడం లేదులెండి, ఎందుకంటే సినిమా పరిశ్రమలో ప్రతీదీ తారల గుత్తాధిపత్యం మీదనే నడుస్తోంది ఇది జనసామాన్యానికి అందరికీ తెలిసిన విషయమే ఒక తార వున్నట్టయితేనే దానికి డిస్ట్రిబ్యూషను, ఎగ్జిబిషనులాంటివన్నీ కూడా ఏర్పాటవుతున్నాయి అంతే కాదు దర్శకులు, రచయితలు, తక్కిన టెక్నీషియన్లు, చిన్న వేషాలు వేసేవాళ్ళు కూడా కొందరు తారల ప్రాపకంలో వుంటున్నారు ఈ గుత్తాధిపత్యం కొంతవరకూ తగ్గితే ఒకరకంగా తారల ప్రాబల్యం తగ్గొచ్చు తారల ప్రాబల్యం తగ్గినప్పుడు మంచి సినిమాలకి డిస్ట్రిబ్యూషను, థియేటర్లూ లభించడానికి కొంత అవకాశం వుంది

సుభాన్ తారలు సినిమాల్లో వున్నంత మాత్రాన అది మంచి సినిమా కాకూడదు అని ఎక్కడుంది? తారలు వున్నా కూడా దాన్ని మంచి సినిమాగా రూపొందించవచ్చు ఏది

ఏమైనా నా అభిప్రాయంలో కథకి సంబంధం లేని దృశ్యాలను యిరికించకుండా, అసభ్యతని చూపకుండా, నీట్‌గా, మంచి సాంకేతిక విలువలతో వున్న చిత్రమైతే అది కచ్చితంగా అందరినీ ఆకట్టుకోగలదని నా అనుభవంతో చెప్పగలను వీటితోపాటు 'ఘటశ్రాద్ధ', 'సంస్కార', 'నిర్మాల్యం', 'స్వయంవరం' లాంటి చిత్రాలు కూడా రావడం అవసరమే అయితే వాటిని కమర్షియల్ థియేటర్లలో వినోదపు పన్ను మినహాయించి చూడగలిగితే నిదానంగా అలాంటి చిత్రాలు చూడటానికి కూడా మనం అలవాటు పడతాం

కొ కు మంచి సినిమా రాకపోవడానికి గల కారణాల్లో ముఖ్యమైనది మరోటుంది సినిమా నిర్మాణం మీద తీసేవాళ్లు సరైన శ్రద్ధ చూపకపోవడం క్లాప్ బాయ్ దగ్గర్నుంచి నిర్మాతవరకూ అందరికీ ఆ సినిమా మీద అవగాహన వుండాలి అందరూ తమ తమ పనులమీద శ్రద్ధ చూపించి పాటుపడాలి ఇది వరకు ఆ శ్రద్ధవుండేది ఇప్పుడది మృగ్యం 'దేవదాసు' సినిమా తీస్తున్నప్పుడు సెట్లో దేవదాసు నవల కాపీలు నాలుగైదు వుండేవి దృశ్యం తీస్తున్నప్పుడు, తీసేముందూ, తీసిన తరువాత కూడా అది పుస్తకంలో వున్నట్టుగా— ఎంచేతంటే పుస్తకం బాగా ప్రజలను హత్తుకున్నది కాబట్టి— వస్తున్నదా లేదా అని ప్రతివారూ నిమిష నిమిషానికీ చూసుకుంటూ వుండేవారు అంతటి శ్రద్ధ వుండబట్టే దాని ఫలితం ఏమిటో యివాళ అందరికీ తెలిసింది మనకి యినాళ చెప్పుకోదగ్గ సినిమాలు అనేవి కొన్ని వున్నాయి ఆ సినిమాల్లో ఈ శ్రద్ధ కనిపిస్తుంది ప్రతి చిన్నపాత్రారాణించడం, ప్రతి చిన్న విషయానికీ యివ్వవలసిన ప్రాముఖ్యత యివ్వడం అనేవి మన బాగున్న సినిమాలన్నీ ప్రత్యక్షంగా చెబుతాయి అంచేత అలాంటి శ్రద్ధ యివాళ చాలా అవసరం

చ రా సినిమా 'పరిశ్రమ' అనేది ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా అది సర్వకళా సమాహారం కనక, అది ప్రజలకోసం అని తియ్యబడుతోంది గనక, దాంట్లో సామాజిక స్పృహ కూడా వుండాలని నేను పూర్తిగా అభిప్రాయపడుతున్నాను జనరంజకమైన కథ, లేదా ప్రజల జీవితానికి సంబంధించిన యితివృత్తం గల కథ వుండాలి కాని, అభూత కల్పనలవల్ల ఏమీ లాభం వుండదని నా వుద్దేశ్యం.

అ కృ తొలి రోజుల్లో సినిమాఅంటే ఒక లక్ష్యం వుండేది అప్పటివాళ్ళు సినిమా ద్వారా ప్రజలను ఉత్తేజపరచాలనుకునేవాళ్లు అప్పట్లో కూడా సినిమా వ్యాపారమే అయినా, అప్పటి వాళ్ళకి వ్యాపార లక్ష్యం ఎక్కువలేదు రానురాను వ్యాపార దృక్పథం పెరిగింది దాంతో అతి సులభంగా ధనార్జన చేసుకోవచ్చునన్న వుద్దేశ్యంతో ఏమాత్రం కళాదృష్టి, సాంస్కృతికమైన ఆలోచనా లేనివాళ్ళు సినిమాల్లోకి వచ్చి దీన్ని కేవలం పరిశ్రమగా మార్చేసి సినిమాలు 'చుట్టడం' ఆరంభించారు దానివల్ల నిజంగా మంచి చిత్రాలు తియ్యాలనుకున్న వాళ్ళకి కూడా పలురకాల ఆటంకాలు ఏర్పడడం ఆరంభించాయి మన యిప్పటిజనాభాకి యిప్పుడున్న థియేటర్లు చాలవు ఉన్న థియేటర్లన్నీ ఎవరో కొందరి చేతుల్లో వుంటున్నాయి. ఎక్కువగా థియేటర్లు నిర్మాణమైతే తయారవుతున్న సినిమాలన్నీ వాటిల్లో విడుదలైతే— కొంత మంది చెలాయిస్తున్న ఆధిపత్యం తగ్గిపోతుంది ఆధిపత్యం తగ్గినప్పుడు 'డిక్టేషన్' వుండదు 'డిక్టేషన్' లేనప్పుడు మంచి చిత్రాలు రావడానికి ఆస్కారం వుంటుంది

సుభాన్ అందుకనే— కొన్ని రాష్ట్రాలలో బ్యాంకులు సినిమాలకు రుణసహాయం

చేస్తున్నట్లు తక్కిన బ్యాంకులు కూడా మంచి చిత్రాలకు రుణసహాయం చేస్తే కూడా వుత్సాహవంతులు ముందుకు వచ్చి మంచి చిత్రాలను అందించవచ్చు

అ క్ర బ్యాంకులు సహాయం చేసినా కూడా డిస్ట్రిబ్యూషన్‌శాఖ గుత్తాధిపత్యం వుండనే వుంటుంది ఆ ఆధిపత్యం తగ్గడానికి ఏదైనా మార్గం ఆలోచించాలి

మా చ సినిమా పరిశ్రమలో యిలాంటి గుత్తాధిపత్యాలు ఎన్నో కనిపిస్తున్నాయి పరోక్షంగా థియేటర్లు చాలవు ఉన్నా యివన్నీ మంచి చిత్రాల నిర్మాణం జరక్కపోవడానికి దోహదం చేస్తున్నాయి ఈ గుత్తాధిపత్యాలు తగ్గాలి ప్రజల అభిరుచి అన్న పేరుతో విపరీత ధోరణులతో వస్తున్న చిత్రాల నిర్మాణం కూడా తగ్గాలి ఎప్పుడైనా ఎక్కడైనా కోరుకునేది ఒకటే సకుటుంబంగా వెళ్ళి చిత్రాన్ని హాయిగా చూసి— అందులో ఏదైనా సందేశం వుంటే గ్రహించి తృప్తిగా రావడం అలాంటి చిత్రాలే యివాళ మనకి కావాలి

*విజయచిత్ర, మాస పత్రిక, జులై 1979*

# 115. సినిమాకళ- విమర్శ

సినిమా ప్రొడ్యూసర్ల ధనదాహంతో సినిమా చిత్రనిర్మాణం వెర్రితలలు వేయటం పరిపాటి అయిన మీదట కొందరు యువకళాకారులు, సినిమా కళను గురించి శాస్త్రీయంగా తెలుసుకున్నవారు కళాత్మకమైన చిత్రాలను, సామాజిక స్పృహ, ప్రయోజనంగల చిత్రాలను నిర్మించ సాగారు కాని, వాటిని చూసి ఆనందించగల కళాహృదయం ప్రేక్షక సామాన్యానికి ఇంకా అలవడలేదు అది జరిగి, ప్రేక్షకుల అభిరుచులలో మంచి పరివర్తన రావాలంటే సినిమారంగాల్లో ఈనాడు చాలావరకు మృగ్యంగా ఉన్న విమర్శ విస్తారంగా సాగాలి

ఈ విషయంలో విమర్శ పాత్రను ఏ మాత్రమూ తక్కువ చేయటానికి లేదు విషమూర్ఛిత అయిన కాళిదాసు కవిత్వాన్ని తన సంజీవనీ వాఖ్యముతో సజీవం చేసినట్లు మల్లి నాథసూరి చెప్పుకున్నాడు మల్లి నాథసూరి కొంత కోతలు కోశాడనుకున్నా ఈ నాడు మన దేశంలో కాళిదాసుకున్న గొప్ప ఖ్యాతికి సూరిగారి దోహదం లేదని ఎవరూ అనలేరు కదా!

విమర్శ అనేది ఒకరకం ప్రచారం ప్రచార ప్రభావం ఇతరలోపాలు కూడా చాల ఫలప్రదంగా ఉంటుందనడానికి మనకు సినిమా రంగంలోనే అనేక ఉదాహరణలు దొరుకుతాయి ఒక క్రొత్త రకం చిత్రం మద్రాసు వచ్చి రెండు రోజులుకూడ చూసేవాళ్ళులేక వెళ్ళిపోయింది అదే చిత్రం బొంబాయిలో చాల వారాలు ఆడినట్లు మద్రాసుకు వార్తవస్తుంది అది మళ్ళీ మద్రాసుకు వచ్చినప్పుడు ప్రేక్షకులు పదివారాలపాటు దాన్ని పోనివ్వరు

ఇంకోరకం ప్రచారం విదేశాలలో ఖ్యాతి ద్వారా చిత్రానికి లభిస్తుంది సత్యజిత్‌రాయ్ 'పథేర్ పాంచాలి' వచ్చినప్పుడు ఇది కూడ ఒక పిక్చరేనా! మెడమీద తల ఉన్నవాడు ఇటువంటి పిక్చర్లు చూస్తాడా అని అడిగారు సినిమాలు తీయటం వారికే తగుననుకున్న పాశ్చాత్యులు సత్యజిత్‌రాయ్‌ని ప్రపంచ ఉత్తమ డైరెక్టర్లలో ఒకడుగా గుర్తించేసరికి రాయ్ చిత్రాల వాసనా, రంగూ, రుచీ పూర్తిగా మారిపోయినది

ఈవిధంగా సినిమా చిత్రాలపట్ల ప్రేక్షకుల వైఖరిని, రకరకాల ప్రచారాలు మార్చగలవి అనేది మనం చూస్తూన్నదయితే నా దృష్టిలో ఏయితర ప్రచారాలూ విమర్శకు సాటిరావు ఎందుకంటే అలాంటి ప్రచారాల ప్రభావం వల్ల కొన్ని ప్రత్యేక చిత్రాలకు కొందరు ప్రత్యేక

డైరక్టర్లకూ, నిర్మాతలకూ లాభం కలగవచ్చు కాని ప్రేక్షకుడి అభిరుచిని అవిమార్చలేవు ఈనాడు సత్యజిత్‌రాయ్, మృణాళ్‌సేన్, శ్యామ్‌బెనెగల్ లాంటి కొద్దిమంది పేర్లు పైకి వచ్చాయి షేక్ స్పియర్ గొప్ప నాటక కర్త అంటే ఎవరూ పోట్లాడనట్టు, వీళ్ళు గొప్ప చిత్రాలు తీస్తారంటే పోట్లాడేవాళ్ళు ఎక్కువ మంది ఉండరు అంత మాత్రాన వాళ్ళ చిత్రాలను జనం ఎగబడి చూడనూచూడరు అందుచేత వీరికి వచ్చిన కీర్తి నిజమైన విమర్శకులద్వారా వచ్చినదికాదనీ, విమర్శేతర ప్రచారంద్వారా వచ్చినదనీ అనుకోవాలి వీరి చిత్రాలను గురించి సరిఅయిన విమర్శ రాలేదనికాదు అది కళాప్రియుల పరిధిలోనే చాలవరకు ఉంటున్నది

ఇది విమర్శలో ఉన్న లోపాలలో ఒకటి అని నా అభిప్రాయం విమర్శలో కూడా నిజానికి కొన్ని లోపాలుండే అవకాశం ఉన్నది అ సంగతి గుర్తించటం అవసరం, అందులో ఒకటి తెలిసినవాడికే తెలియ జెప్పటం జీవితం తాలుకు అనేక రంగాలలో ఇలాంటిది చూస్తాం మతం వారిని మాత్రమే మెప్పించే మత ప్రచారం, కమ్యూనిస్టు భావాలను ఆమోదించిన వారిని మాత్రమే ఆనందపరిచే కమ్యూనిస్టు ప్రచారం, మార్క్సిస్టు దృక్పథం గలవారికి మాత్రమే అర్థమయే కళావిమర్శ ఇత్యాదులు సహజంగానే జీవితంలో కలుగుతాయి వాటిని ఆపటం ఎవరితరంకాదు కాని వాటివల్ల ఆయా భావాలపెంపూ, విస్తృతీ అంతగా ఉండదు.

నిజానికి వీటి ప్రచారం నిమిత్తమాత్రం జీవితంపట్ల మార్క్సిస్టు దృక్పథం గలవాడు అభ్యుదయ రచనలనూ, విప్లవ దృక్పథంగలవాడు విప్లవరచనలనూ తనంతట తానే ఆమోదించి, ఆస్వాదిస్తాడు మధ్యవాళ్ళు అనవసరం కాని ప్రయోజనాత్మకమైన విమర్శ ప్రచారం 'కొత్తవాళ్ళను' కూడగట్టుకురావాలి

స్టంటులూ, డ్యూయట్లూ, రేప్‌సీనులూ వగైరాలుంటేగాని సినిమా చూడని వాణ్ణి 'పథేర్‌పాంచాలి' చూసి ఆనందించేలాగా చేయగల విమర్శ అత్యుత్తమమైనది అభిరుచులలో అలాంటి గుణాత్మకమైన మార్పుకల్గినవాడు మరి వెనక్కుపోడు వాణ్నిచూచి మరికొందరు మారే ప్రయత్నం చేయవచ్చును మన అందరి అభిరుచులూ అనేక కళారంగాలలో ఎన్ని సార్లు గుణాత్మకమైన మార్పులు పొందాయో తిరిగి చూసుకుంటే తెలుస్తుంది షేక్స్పియర్‌కు ఆదిలో కీర్తి తెచ్చినవారు రెండు డజన్ల మంది విమర్శకులు మాత్రమేనని ఎవరో అన్నారు ఈనాడు షేక్ స్పియర్ విమర్శకులు వెయ్యిమందికి పైగా ఉన్నారట వీరందరికన్నా ఆ తొలి విమర్శకుల కృషివెయ్యిరెట్లు గొప్పది

విమర్శ వెంట సాధారణంగా కనబడే మరో లోపం పాక్షిక దృక్పథంతో కూడిన విమర్శ రాజకీయ దృక్పథంతోగాని, మత దృక్పథంతోగాని, జాతి దురహంకార, కుల దురహంకార, దృక్పథాలతో గాని చేసే విమర్శ ఈ విమర్శ కొన్ని కొన్ని వర్గాల దృక్పథంనుంచి సబబుగా ఉన్నట్టు కనబడవచ్చును కాని ప్రజా బాహుళ్యం దృకృథం నుంచి తప్పుకావచ్చు

ఉదాహరణకు సత్యజిత్ రాయ్ చిత్రాలు మార్క్సిస్టు లెనినిస్టు దృక్పథం నుంచి సరిగా లేవని విమర్శించారు ప్రజాజీవితాన్నిచైతన్యవంతం చేస్తున్నది మార్క్సిస్టు లెనినిస్టు రాజకీయాలే అయితే ఈ విమర్శకు అర్థం ఉంటుంది అటువంటి పరిస్థితిలో మార్క్సిస్టు లెనినిస్టు దృక్పథంగల కళలనుంచి ప్రజలు ఎక్కువ చైతన్యం పొందగలుతారు కాని అదిలేని పక్షంలో సత్యజిత్ రాయ్‌ని మార్క్సిస్టు లెనినిస్టు దృక్పథానికి అనుగుణమైన చిత్రాలే తియ్యాలని విమర్శకులు నిర్బంధించటంతో వారి విమర్శ నిరుపయోగమై పోతున్నది అంటే సత్యజిత్‌రాయ్ (లేక

మరొక నిర్మాత / దర్శకుడు) మార్క్సిస్టు లెనినిస్టు దృక్పథంతో చిత్రాలు తీయరాదని ఉద్దేశంకాదు ఈ విషయం ముందే సూచించాను విమర్శకుడు ఒక మార్క్సిస్టు లెనినిస్టు దృక్పథంతో తయారు చేసిన చిత్రాన్ని అలాటి దృక్పథం లేనివాడికి నచ్చేలాగా విమర్శించగలిగితే అది ఉత్తమ విమర్శే

అదే ఒక విమర్శకుడు అభ్యుదయవాదులకు ఫ్యూడల్ సంస్కృతితోనూ, పెట్టుబడిదారి బూర్జువా సంస్కృతితోనూగూడిన కళలమీద ఆదరంకలిగేలా విమర్శరాస్తే అది ఉత్తమ విమర్శ అవుతుందా? కాదని నానమ్మకం ఎందుచేత? అభిరుచి ముందుకుపోవాలిగాని తిరోగమించరాదు బియ్యే పాసయినవాడు పదోక్లాసు పరీక్షకు కూర్చుని తప్పటం లోకవిరుద్ధం నిజమైన ఆర్టుపిక్చర్లు చూసి ఆనందించటం నేర్చినవాడు కళాహీనమైన వ్యాపార చిత్రాలమీద అభిరుచి కలిగించుకొనటం లోకవిరుద్ధమూ, ప్రకృతి విరుద్ధమూనూ

విమర్శగురించి ఇంతదూరం రాసినాక, విమర్శతో పనిలేకుండా చిత్రాలు తమంతటతామే ప్రేక్షకుల అభిరుచులను పెంపొందించగలిగితే అది సర్వోత్తమమని వాదించబోతున్నాను

''అలాకూడా జరుగుతుందా'' అని అడగవచ్చు జరుగుతుంది! కాని ఏ పరిస్థితులలో జరుగుతుందనేది కళాకారుల తెలివితేటలమీద ఆధారపడి ఉంటుంది

తెలుగుదేశంలో అభ్యుదయ సాహిత్యోద్యమం ప్రారంభమైనప్పుడు, ''ఇదంతా కమ్యూనిస్టుల దుర్మార్గం రాజకీయాలకు అతీతంగా, పవిత్రంగా ఉండవలసిన సాహిత్యాన్ని వీళ్ళు తమ క్షుద్రరాజకీయాలతో కలుషితం చేస్తున్నారు,'' అన్నారు సానుభూతి లేనివాళ్ళు కానీ వీళ్ళే అభ్యుదయ కళారూపాలు చూచి పొందిన తన్మయత్వం అంతా ఇంతాకాదు 'మాభూమి' చూసి సామాజిక భావాలు మార్చుకోవటానికి విమర్శకుల సహకారం అవసరం లేకపోయింది ఆ నాటకం పుట్టేనాటికి జమీందార్ల పట్లా, భూస్వాములపట్లా ఎవరికీ ప్రేమానురాగాలు లేవు అందుచేత 'మాభూమి' లో ప్రత్యక్షంగా కనిపించిన సామాజిక సత్యాన్ని కమ్యూనిస్టు వ్యతిరేకులుకూడా కాదనే అవకాశం లేకపోయింది ఆవిధంగా ఒక రాజకీయ దృక్పథానికి అంకితమయిందనిపించుకున్న కళాఖండం రాజకీయాలకు అతీతంగా ప్రజల అభిరుచులను పెంపొందించింది

ఈనాడు గ్రామాలలో జులుం సాగించి, అర్భక ప్రజలను చెండుకుతింటూ, రాజకీయ శక్తులను తమకు అనుకూలంగా ఉంచుకున్న వర్గం గురించి ఏ నిజమైన కళాకారుడూ గొప్పగా చెప్పలేడు— అమ్మెడు పోయినవాళ్ళమాట వదిలేస్తే ప్రజలు గుర్తించగల జీవితసత్యాలను హృదయానికి సూటిగా తగిలేలాగా చూపగల కళ ప్రజలలో అభ్యుదయకరమైన అభిరుచులను తప్పక పెంపొందిస్తుంది ప్రజల అనుభవాన్ని స్పృశించలేని కళ 'సిద్ధాంత' రీత్యా ఎంతో ఉదాత్తమైనది అయినప్పటికీ అది ప్రజలలో వాంఛనీయమైన అభిరుచులను పెంపొందించలేదు

కళలు కేవలం 'ఉపదేశాలు' (వర్ణాంతర వివాహాలు జరుగవలెను, అస్పృశ్యత పనికిరాదు, మూఢాచారాలకు స్వస్తి చెప్పవలెను, వగైరా) ప్రేక్షకుల అభిరుచిని పెంచవు వాటిని చూసి సంస్కార భావాలు గలవారు గర్వించవచ్చు, కాని ప్రజల సంస్కృతిని ముందుకు తీసుకుపోవటానికి అవి ఉపన్యాసాలకన్న ఫలితాన్నియ్యవు

పైన చెప్పినదంతా ఒక్కముక్కలో చెప్పాలంటే, తక్కువ అభిరుచులు గలవారిలో ఉన్నత అభిరుచులు కలిగించగల సినిమా విమర్శవల్ల సినిమా భవిష్యత్తు చాలా బాగుపడుతుంది ఆ

విమర్శకూడా అవసరం లేకుండా స్వయంగానే ప్రేక్షకుల అభిరుచులను ముందుకు తీసుకుపోగల చిత్రాలు ఉత్తమోత్తమమయినవి

*చిత్రసంస్కార, మాసపత్రిక, జూలై 1979*

# 116. అభిప్రాయాలు

నెల్లూరు ప్రోగ్రెసివ్ ఫిల్మ్ అసోసియేషన్ ఆర్థిక కార్యదర్శి శ్రీ కె పెంచలయ్య, 'విజయచిత్ర' ఆగస్టు సంచికలో ఫిల్మ్‌క్లబ్బులను గురించి నేను— ఇందులో శ్రీమతి మాలతీ చందూర్ ప్రమేయం చాలా తక్కువ— అన్నమాటలను గురించి కొంత ఆక్షేపణ తెలియజేశారు నా అభిప్రాయాలను వివరించే ముందు రెండు విషయాలు చెప్పాలి

ఒకటి నేను కూడా ఒక ఫిల్మ్ క్లబ్బులో సభ్యుణ్ణి

రెండు ఫిల్మ్ క్లబ్బుల అభ్యుదయాన్ని కాంక్షిస్తూ నేను చేసిన రచనలు కొన్ని ఫిల్మ్ క్లబ్బుల పత్రికలలో వచ్చాయి అందుచేత నేను ఫిల్మ్‌క్లబ్బులకు 'శత్రువు' ను కాను వాటివల్ల మంచి జరుగుతుందని అన్నాను కూడా

విదేశీ చిత్రాలలో అప్పుడప్పుడూ 'పచ్చి' శృంగారం వస్తుందని పెంచలయ్యగారికి తెలిసివుండాలి అలాటివి చూస్తూ 'సభ్యులు' కిలకిలలాడటం నేను గమనించాను వారు సామాజిక చైతన్యాన్ని ఇతర భాషా చిత్రాలద్వారా పొందటానికే సభ్యులుగా వున్నారని నేను నమ్మలేకుండా ఉన్నాను

ఫిల్మ్ క్లబ్బులలో చేరే ఒక వర్గానికి చెందినవారే అంతర్జాతీయ సినిమా ప్రదర్శనలలో ప్రవేశం కోసం వందల కొద్దీ రూపాయలు పోసి టిక్కెట్లు బ్లాక్‌లో సంపాదిస్తారు వారందరూ సినిమా కళను గ్రోలటానికి ఎగబడుతున్నారని కూడా నేను అనుకోవటం లేదు

ఫిల్మ్ క్లబ్బుల ప్రధాన ఉద్దేశం ప్రజాకళా సాధనంగా సినిమాలను పెంపొందించే చర్యలు తీసుకోవటం ఇందులో అతి తేలికైనది 'మంచి' చిత్రాలనూ, 'అవార్డ్' చిత్రాలనూ సభికులకు చూపటం కాని ఎవరో అన్నట్టు ఈఫిల్మ్ క్లబ్బులన్నీ కలిపినా ఒక 'అభిమాన సంఘాని' కి సాటిరావు అభిమానసంఘాలు తారలను ప్రమోట్‌చెయ్యటానికి తప్ప ఎందుకూ పనికిరావు ఆర్థికంగా దెబ్బతినదగిన తారల చిత్రాలను అభిమాన సంఘాలు ఒక కాపు కాయగలగవచ్చు

కాని డిస్ట్రిబ్యూటరు తాక నిరాకరించే 'మంచి' చిత్రాన్ని— ఎంత చౌకలో తీసినదైనా— ఫిల్మ్ క్లబ్బులు కాపాడే స్థితిలో లేవు

కోట్లాది సినీ ప్రేక్షకుల అభిరుచిని చిన్నమెత్తు మార్చే కార్యక్రమాలూ, షూటింగులూ, పత్రికలలో విమర్శలూ, పుస్తకాలూ— ఫిల్మ్ క్లబ్బులు చేపట్టటం లేదు వాటి ప్రభావం ఇటు చిత్రనిర్మాణం మీదా, అటు ప్రేక్షకుల అభిరుచుల మీదా ఉండాలంటే చేయవలసినది ఎంతైనా వుంటుంది అది నాబోటి సామాన్య ఫిల్మ్ క్లబ్ సభ్యుడికన్నా, శ్రీ పెంచలయ్యగారి లాటి నిర్వాహకులకే బాగా తెలియాలి ఇతరులను తప్పుపట్టే కన్న ఆత్మవిమర్శ ఎక్కువ ప్రయోజనకారి

*విజయచిత్ర, మాసపత్రిక, సెప్టెంబరు, 1979*

# 117. అభిప్రాయాలు

అక్టోబరు సంచికలో వాసాల రమేష్ అనేవారు అడిగిన బహుమతి ప్రశ్నలాటివి చాలామంది నోట వింటున్నాం సినిమాప్రొడ్యూసర్లూ, పెట్టుబడిదార్లూ కానివారు ఇలాటి ప్రశ్న ఎందుకు వేస్తారో, ఇలాటి వైఖరి ఎందుకు అవలంబిస్తారోఎంత ఆలోచించినా నాకు బోధపడదు సినిమాలు తుక్కుగా ఉన్నాయనుకోదలచుకున్న వారికి నిర్మాతల వ్యాపారధోరణితో ఏమిటి సంబంధం? ఒక పుస్తకం చదువుతాం బాగుంటే బాగుందనుకుంటాం లేకపోతే బాగాలేదనుకుంటాం అంతేగాని దాన్ని రాసినాయన ఏ కండూతితో రాశాడో, అచ్చేసినాయన ఏ ఆశయంతో వేశాడో చదివే వాడికెందుకు? ఆమాటకు వస్తే జనం ఎగబడి సినిమా చూడటం దాని ఘనతకు సాక్ష్యమా? అభిరుచి లేనివాళ్ళు విపరీతంగా ఎగబడి చదివే చచ్చు నవలలు అమ్మకాలనుబట్టి ఉత్తమ సాహిత్యం అయిపోతాయా? లేక, ఒక జాతి యొక్క సంస్కృతి సినిమా నిర్మాతలు తీసే లాభాలను బట్టీ, సినిమా ప్రేక్షకుల ఓట్లను బట్టీ అంచనా వేస్తారా? వాసాల రమేష్‌గారిలాటి వారు ఎవరి ప్రతినిధులుగా మాట్లాడుతున్నదీ స్పష్టంచేస్తే ఎలాంటి సందేహాలకూ అవకాశం లేకుండా ఉంటుంది

*విజయచిత్ర, మాసపత్రిక, నవంబరు 1979*

# 118. సినిమాల గురించి

నేను చూసే చిత్రాలు చాలా తక్కువ, వీటిలో మనసులో ముద్ర పడేవి, నాలుగు కాలాలపాటు జ్ఞాపకం ఉంచుకునేవి ఏవి? వీటిలో కథ గురించి చెప్పటానికేంలేదు! చిత్రాల్లో కథకు ప్రాముఖ్యం ఉండటంలేదు కథతో సంబంధం లేకుండానే చిత్రాలు తయారవుతున్నాయి అసలు సినిమా మీడియంలో కథకంటే డ్రామా వర్కవుట్ ఎక్కువ చేస్తారు. సినిమా టెక్నిక్‌లో కథ మృగ్యమైపోయింది నేను ఈమధ్య చూసిన చిత్రాల్లో చిన్న కథను చిత్రంగా తీసిన చిత్రాలు నిమజ్జనం, ఊరుమ్మడి బతుకులు కేవలం కథాబలంతో తీసిన ఇటువంటి చిత్రాలు విజయవంతమవుతాయని నేను అనుకోను

చిత్రాలల్లో పాటలు అనవసరమంటాను పాటలతో ప్రేక్షకులను ఆకట్టుకునే పద్ధతిని నేను అంగీకరించను బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్ కూడా తగినంతగా ఉండాలికాని చిత్రంలోని ముఖ్యాంశాలను మింగేసేదిగా వుండకూడదు నేననేదేమంటే చిత్రంలోని ఉపాంగాలమీద చిత్రవిజయం ఆధారపడి ఉండకూడదని, అన్ని అంశాలు బాలెన్స్‌డ్‌గా ఉండాలి అసలు ఒక చిత్రం మంచి చిత్రమనగానే ఆ చిత్ర దర్శకుడు మంచి దర్శకుడై వుంటాడని నా ఉద్దేశ్యం చిత్రం యొక్క మంచి చెడ్డలు దర్శకత్వం వల్లనే తెలుస్తాయి సినిమా కథ విషయానికి వస్తే వాటికి ఒక పద్ధతంటూ లేదని చెప్పాలి ఒక గొప్ప హిట్ చిత్రం తీసిన దర్శకుడు ఒక ఆర్ట్ చిత్రం తీయలేడు! ఆర్ట్ ఫిలింస్, ఎక్స్‌పెరిమెంటల్ చిత్రాలు తీయటం కష్టమైన పని చిత్రాల్లో సాంఘిక ప్రయోజనాన్ని ఇమిడ్చి తీరాలి అయితే ఈ సాంఘిక ప్రయోజనమనేది, 'ప్రోపగాండా' గా ఉండకూడదు! ఇది దర్శకుని యొక్క పనితనం మీద ఆధారపడి ఉంటుంది ఇలాంటి సాంఘిక ప్రయోజనం

కథలో ఇమిడ్చి అన్ని అంశాలనూ సమపాళ్ళలో కలిపి తీసిన,'చలిచీమలు', నాకు చాలా నచ్చింది ఈ చిత్రంలో ఏ అంశం మరో అంశాన్ని డామినేట్‌చేయలేదు! ప్రేక్షకులకు చెప్పాల్సిన సాంఘిక ప్రయోజనం ఒక ,'ప్రాపగాండా' గా కాకుండా చిత్రం చిత్రంగావుంది!

సామాజిక స్పృహ అనేది చిత్రంలో తప్పనిసరిగా వుండాలి అయితే ఈ సామాజిక స్పృహ అనేది ముందు ఆ తీసేవారిలోనూ, చూసేవాడిలోనూ ఉండాలి! అప్పుడు ఆ సామాజిక స్పృహ కలిగిన చిత్రం బ్రతుకుతుంది అలాలేనినాడు ఆ నిర్మాత, ఆ చిత్రమూ స్పృహ లేకుండా పోతాయి

చిత్రం వ్యాపారసరళి లేకుండా రావడమంటే కలలో మాట! నటీనటులు తప్ప సినిమాకు సంబంధించిన అన్ని శాఖలు— ముడి ఫిల్ము, స్టూడియోలూ, ఎగ్జిబిషన్, డిస్ట్రిబ్యూషన్ వగైరాలు— వ్యాపారధర్మం గలవే టెక్నీషయనులు కూడా శ్రమ జీవులుగా బతుకుతున్నవారే ఈ పరిస్థితుల్లో నిర్మాత తను పెట్టిన డబ్బుకు మరెన్నో రెట్లు లాభాలు ఆర్జించటానికి ఇంకెన్నో ఎత్తులు వేస్తున్నాడు ఇలాంటి పరిస్థితుల్లో— ఈ రోగాలన్నిటికీ ఒకే మార్గం — ప్రేక్షకుడనేవాడు చైతన్యవంతుడు కావాలి! అప్పుడు అన్ని రకాల అవలక్షణాలకూ జవాబు దొరుకుతుంది!

ప్రేక్షకులను ఎడ్యుకేట్ చేయాల్సిన బాధ్యత సినిమావాళ్ళకుండదు వాళ్ళధ్యేయం డబ్బును వీలయినంత ఎక్కువ సంపాదించటం చెడ్డ చిత్రాలు మూకుమ్మడిగా వచ్చిపడి మంచి చిత్రాలను ఖూనీ చేస్తున్నాయి ఒక మంచి చిత్రం తీసిన వాడు— అందరూ అవేకావాలనే— సామాజిక స్పృహ— లేదా — ఆర్ట్‌ఫిలిం లాంటివి— మళ్ళీ తన తరువాత చిత్రాన్ని మరో మంచి చిత్రంగా తీయటం లేదు! గొప్ప అవలక్షణాల చిత్రాన్నితీస్తున్నాడు! అందుచేత చూసే జనం ఈగొప్ప అవలక్షణాల' చిత్రాన్ని బాయ్‌కాట్ చేస్తే ,పోనీ కనీసం ఆ మంచి చిత్రాన్ని ప్రోత్సహించనైనా ప్రోత్సహించితే ఆ మంచి చిత్రం తాలూకు నిర్మాత నిజంగా స్పృహ అనేది కలిగి ఉంటాడు! ఇలాంటి మంచి చిత్రాలను ప్రోత్సహించాల్సిన బాధ్యత మధ్య తరగతి ప్రేక్షకునిది ! మన చిత్రాలు చెత్తగా ఉండటానికి బాధ్యత కూడా మధ్యతరగతి ప్రేక్షకులదే మన ప్రేక్షకులలోకో జబ్బులాంటిదుంది ఒక ఉత్తమ చిత్రాన్ని ముందు తాము ఆదరించరు ఆ చిత్రం ఇతర దేశాల్లో అవార్డులు పొంది , ఓహోహో అన్నాక మన వాళ్ళురెండు మూడు రోజులు ఆ చిత్రం కొరకు ఎగబడతారు ! ఇక్కడ మనవాళ్ళకు సొంత బుర్ర, సొంత టేస్టు అనేవి లేవని అర్థం కావటంలేదూ!

చిత్రాలను వడకట్టే సెన్సారుబోర్డు కొన్ని విషయాలల్లో మౌనంగా వుంటుందేమో అనిపిస్తోంది అయితే నిజంగా మన సెన్సారు నిబంధనలు అమలు జరుగుతున్నాయో లేదో చెప్పలేను చాలా మంది నిర్మాతలు ఇప్పుడు సెన్సారు మీద మండిపడుతున్నారు కనుక ఎంతో కొంత సెన్సారు పనిచేస్తోందనుకోవాలేమో!

మన చిత్రాలలో స్త్రీ సమస్యలకు వస్తే— స్త్రీ సమస్యలనేవి మన చిత్రాల్లో కనపడ్డం లేదనే చెప్పాలి ఎంతసేపూ పెళ్ళాం మొగుడి పక్కలోకి పోదామనే చూస్తూంటుంది సాధ్యమయినంత ఎక్కువగా తన వంపుసొంపులను ప్రదర్శించటానికే స్త్రీపాత్రలున్నాయి , ఇదే దృక్పథం! నిజజీవితంలో— మన సమాజంలో సెక్సుకి ఎంత అవకాశముందో తెలీదా ? ఒక యింట్లో పదిమంది కాపుర ముంటారు ఈ పదిమందినీ ఎలా పోషించాలనే సమస్య

మగవాడికి, ఆ సంసారంలో సవాలక్ష సమస్యలు ఆ స్త్రీ పురుషులకు ఉన్నాయి ఇలాంటి వాస్తవిక పరిస్థితిలో మనవాళ్ళు ఎంతసేపూ స్త్రీని సెక్సీగానే చూపించటం వాస్తవమవుతుందా? మన స్త్రీకి పాతివ్రత్యం మీద మహానమ్మకం ఈ నమ్మకాల మీద అడ్డమైన కథలూ అల్లుతున్నారు ఆ తరువాత మంగళ సూత్రాలమీద కథలు మొదలు పెట్టారు ఇవన్నీ వెర్రితలలు అవగాహన లేని, సంస్కారం లేనివాళ్ళు తీస్తున్న చిత్రాలు ఈ చిత్రాల్లో నిజమైన సమస్యలు ఎలా ప్రతిబింబిస్తాయి?

సినిమా సాహిత్యం, సినిమా పత్రికలు— ఇవి చాలా ప్రధానమైన భాగాలు సాహిత్యం మన చిత్రాల్లో లేదు ఇక పత్రికలు— ఇవి పరిశ్రమ మీద ఆధారపడి పోయాయి పరిశ్రమ బాగుంటే అవి బ్రతుకుతాయి బ్రాహ్మడు అన్ని వ్రతాలనీ కూడా ఉత్తమ వ్రతమే అని చెబుతుంటాడు అలాగే మన పత్రికలకు అన్నీ ఉత్తమ చిత్రాలే ప్రస్తుతం మన సినిమా పత్రికలకూ, పత్రికల్లోని వారికి బ్రతుకు తెరువు బాగుంది

ఈ మధ్య నాటి 'పోతన', 'పెద్దమనుషులు' చిత్రాలు చూశాను, బాగున్నాయి ప్రస్తుత చిత్రాలతో పోల్చుకుంటే, ఈ వ్యక్తులతో ఆ వ్యక్తులను తూకంవేస్తే కొన్ని విషయాలు స్ఫుటంగా తెలుస్తున్నాయి ఆ వ్యక్తులకు ఒక సంస్కారం ఉండేది చక్కని ఆలోచనలు ఉన్నాయి ప్లానింగ్ ఉండేది అందుచేత ఆ చిత్రాలు బాగుండేవి

చిత్ర పరిశ్రమను జాతీయం చేస్తే బాగుంటుందంటారు కొంతమంది అయితే ప్రభుత్వాధీనంలో ఉన్న ఫిలిమ్స్ డివిజన్ ద్వారా ఏ మాత్రం ఉపయోగం జరుగుతోంది ప్రజలకు ? పరిశ్రమ జాతీయమనేది జరిగితే అది ప్రభుత్వానికే ఉపయోగం గాని ప్రజలకు కాదు ! మార్క్సిస్టు దృక్పథంతో తీసిన చిత్రాలు సమాజానికి ఉపయోగం కలిగిస్తాయి అలాంటి చిత్రాలు రావాలంటే అలాంటి దృక్పథం గలవాళ్ళు రావాలి— తీయాలి అంతవరకు ఈ చిత్రాలింతే?

*జ్యోతిచిత్ర, వారపత్రిక, సంక్రాంతి, 1980*

# 119. సినిమా అనేది ఏమిటి ?

సినిమా కళ గురించీ, ప్రయోజనం గురించీ, వ్యాపారం గురించీ, సినిమాలో అంతర్జాతీయ, జాతీయ, ప్రాంతీయ ధోరణుల గురించీ చాలా రాస్తున్నారు, చాలా చదువుతున్నారు కాని సినిమా అనేది ఎటువంటి దినుసు అన్న దాన్ని గురించి ఎవరూ మాట్లాడరు ఇది అన్యాయం

ఒక్క మనదేశంలోనే కన్యాకుమారి నుంచి కాశ్మీరు దాకానూ, అస్సాము నుంచి పంజాబు దాకానూ ఎన్నో ప్రాంతాలున్నాయి; ఆయా ప్రాంతాల వాళ్లనందరినీ రకానికి ఒకడు చొప్పున ఒకచోట నిలబెట్టితే, ఏ ఇద్దరూ ఒక రకంగా కనబడకపోవటమేగాక, ప్రతి ఒక్కడూ వేరువేరుగా గుర్తించటానికి వీలుగా ఉంటాడు ఇక ప్రపంచ ప్రజల మాట చెప్పనే అక్కర్లేదు

సినిమాలైనా అంతే ఎవరో చిన్నపిల్లల చిత్రాలను గురించి మాట్లాడుతుంటే, కీ శే చక్రపాణిగారు, ''మళ్ళీ పిల్లలచిత్రాలేమిటి ? మనం తీస్తున్నవన్నీ పిల్లల చిత్రాలు కావూ ?'' అని అడిగారు

ఆమాట నిజమే గద! కాస్త గ్రాహికం ఉన్నవాడెవడైనా మన సినిమాలలో చూపించే సన్నివేశాలనూ, పాత్రల ప్రవర్తననూ, వాస్తవ విరుద్ధమైన సెట్టింగులనూ, ఆర్కెస్ట్రా మోతల పాటలనూ, విలన్ పాత్రలో ఆకస్మికంగా ఆఖరు క్షణంలో కలిగే పరివర్తననూ, న్యాయ స్థానాలనూ, రోగాలనూ, వైద్యాలనూ, ఇంకా సవాలక్ష ఇతర విషయాలనూ నమ్ముతాడా ? నమ్మడు మన చిత్రాలన్నీ ఒక లెక్కన అమాయకుల కోసమూ, అజ్ఞానుల కోసమూ తీసినచిత్రాలే పిల్లల కోసం తీసేవే చాలాకాలం క్రితం నేనొక ''బాల'' చిత్రం చూశాను అందులో కొందరు పిల్లలు భూమినుంచి చంద్రుడికి పోతారు దారిపొడుగునా మబ్బులు చూపించారు, ఇటువంటి చిత్రాన్ని డబుల్ బాల చిత్రం— పిల్లల కోసం, పిల్లలే తీసినది— అనవచ్చు దీనికి కూడా చక్రపాణిగారు ముచ్చటగా 'చనుబాల' అని పేరు పెట్టారు

అయితే వచ్చే సినిమాలన్నిటినీ బాల చిత్రాలనీ, చనుబాల చిత్రాలనీ విభజిస్తే సరిపోతుందా అంటే, అది కుదరదు కొన్ని పెద్దవాళ్ళు చూడదగిన చిత్రాలు కూడా ఉంటున్నాయి వీటిలో కొన్నింటిని సెన్సారు బాలలు ఒప్పుకోరు, కొన్నింటిని డిస్ట్రిబ్యూటరు బాలలు అంటుకోరు, మరి కొన్నింటిని ప్రేక్షక బాలలు చూడరు 'అవళ్ అప్పడిత్తాన్', 'నిమజ్జనం', 'హరిజన్' ఈ తరగతి చిత్రాలు

ఇందులోకి సినిమా కళ ప్రస్తావన తెచ్చి కొందరు అయోమయం కలిగిస్తున్నారు ''ఆర్టు చిత్రాలూ'', ''బాక్సాఫీసు చిత్రాలూ'' అన్న విభజన బొత్తిగా బుర్రలేని వాళ్ళు చేసేది ''ఆర్టు'' నిరపాయమైనది చెప్పదలుచుకున్నదీ, చూపదలచుకున్నదీ సమర్థతతో చెప్పటమూ,చూపటమూ ఆర్టు అందుకు తగిన పద్ధతులు వాడటం టెక్నిక్ అంతేగాని ''ఆర్టు'' ఎవరికీ అక్కర్లేనిదని బుద్ధిగల వాడెవడూ అనడు ఇది కూడా బాల్య విచేష్ట— బాల విమర్శకులు కల్పించినది ఆర్టు పిక్చర్స్ ద్వారా డబ్బు చేసుకుంటున్న వాళ్ళు చాలామంది ఉన్నారు

న్యూవేవ్— కొత్త గాలి— సిద్ధాంతం ఒకటి ఉన్నది ఇందులో మహత్తరమైన ఆదర్శం ఏదో ఉన్నట్టు చాలామంది నటిస్తున్నారు అన్నీ వట్టివే ! జనతా ప్రభుత్వ ధోరణి చూసి మండిపోయి, జనం ఇందిరాగాంధీని ఇండియాకు రాణిని చేసినట్టుగా, పాతగాలిలో పొల్యూషన్‌చూసి భరించ లేక కొందరు బుద్ధిమంతులు ''కొత్తగాలి'' చిత్రాలు ప్రారంభించారు దీనికి అంకురార్పణ చేసిన సత్యజిత్‌రాయ్ పెద్దవాళ్ళు చూసే చిత్రాలు తీస్తూ, ఆర్టు చిత్రాలు తీస్తున్నాడనిపించుకుంటూ, తన చిత్రాలను డిస్ట్రిబ్యూటరు బాలలూ, ప్రేక్షక బాలలూ వెలిపెట్టకుండా చూసుకుంటున్నాడు

''పెద్దల కొరకు'' చిత్రాలు తీస్తున్న వారిలో ''బాల'' ప్రౌఢ్యూసర్లు అమాయకంగా ,చిత్రాలు తీసి, వాటిని డిస్ట్రిబ్యూటర్లు, ప్రేక్షకులు వెలివేస్తారన్న సంగతి టూలేట్‌గా తెలుసుకుంటున్నారు! వీళ్ళను చూసి మరికొందరు ''గుణపాఠాలు'' నేర్చుకుంటున్నారు

ఇందులో మరీ ''చనుబాల'' ధోరణి ఏమిటంటే, పెద్దవాళ్ళ చిత్రాలు తీసేఅర్హతగాని, బాక్సాఫీసు (బాల) చిత్రాలు తీసే డబ్బుగాని లేనివాళ్ళు చవగ్గా చిత్రం తీసే పద్ధతి ఒకటి అందుబాటులో ఉంది గదా అనీ, అందులో కొంత ప్రభుత్వం ఇచ్చే లక్షో, లక్షన్నరో పూడ్చుతుంది గదా అనీ ఎవరికీ పనికిరాని చిత్రాలు తియ్యటం

డబ్బు బాగా వచ్చినా, రాకపోయినా ''విమర్శకులు'' ఘనంగా చెప్పుకున్న చిత్రాలను

కూడా మరీ నిశితంగా పరీక్షించటానికి లేదు 'సంస్కార', 'ఘటశ్రాద్ధ' ఉదాహరణలుగా తీసుకుందాం చాలా చక్కని, కళాత్మక, న్యూవేవ్ చిత్రాలు కాని ఏం లాభం ? అవి ఈ నాటి సమాజాన్నీ, జీవితాన్నీ ప్రతిబింబించవు వర్తమాన సమస్యలు అందులో లేవు 'ఘటశ్రాద్ధ' లో పెద్ద బొక్క ఉన్నది! ఎవరో చెప్పినట్లు , అంత శ్రోత్రియుడు తన విధవ కూతురుకు వెంట్రుకలుంచుతాడా ? బోడెమ్మ కడుపు చేసుకుంటే చిత్రం మొత్తం అభాసు అవుతుంది గనక 'ఘటశ్రాద్ధ' చిత్రం వాస్తవంగా తీయటమే అసంభవం అయిపోవచ్చు!

చూసి ఆనందించటానికి తప్ప పనికిరాని 'సర్కస్' లాటి చిత్రాలు మొదలుకొని, జీవిత పోరాటంలో ఓడిపోతున్న యువతరం— దొంగతనాలూ, హత్యలూ ఎలా చెయ్యాలో నేర్పే చిత్రాలదాకా ఎన్నోరకాల చిత్రాలున్నాయి దాదాపు అన్నీ బాల చిత్రాలే !

జీవితాన్ని భరించలేని ప్రజలు కాస్సేపు ఆ జీవితాన్ని మరిచి పోవడానికి చిత్రాలు తీస్తున్న వారు ప్రజలకు ద్రోహం చేస్తున్నారు ఏడిచే పిల్లవాడికి కలకండ ఇయ్యటం కన్న కూడా ఇది అన్యాయం కాస్సేపు జీవితాన్ని మరిచిపోయి తిరిగి జీవితంలోకి అడుగుపెట్టిన వాడికి జీవితం మరింత దుర్భరం అనిపించదా ? రాజాను చూసిన కళ్ళతో మొగుణ్ణి చూస్తే మొత్తబుద్ధి అయినట్టు!

కావలసింది ప్రేక్షకుల ''బాల్యాన్ని'' వదలగొట్టే చిత్రాలు ! చిత్రాలు చూసిన తరువాత ప్రేక్షకుడికి తన జీవితం మరింత బాగా అర్థం కావాలి, దానితో పోరాడేందుకు వారికి శక్తి రావాలి ఇలాటి చిత్రాలను ఆర్టు చిత్రాలనాలా? న్యూవేవ్ అనాలా ? బాక్సాఫీస్ అనాలా ?

*విజయచిత్ర , మాసపత్రిక , ఏప్రిల్ 1980,*
*పునర్ముద్రణ విజయచిత్ర, నవంబరు 1980*

# 120. ఏరకం సినిమా తీయాలి?

మనం ఏ రంగంలో కృషిచేసినా, ఆ రంగంలో అనుభవంతో బాటు కొంత సూక్ష్మజ్ఞానం కూడా కావాలి తోటలో చెలికత్తెలతో పాడుతూ విహరించే రాజకుమార్తె కన్న తోటమాలికి హెచ్చుగా చెట్లను గురించీ,మొక్కలను గురించి సూక్ష్మజ్ఞానం ఉండాలి తోటమాలి అయోమయం మనిషి అయి,చెట్లను ఎట్లా పెంచి పోషించాలని రాజకుమార్తెను అడిగే స్థితి వొస్తే త్వరలో మొదట తోటే లేకుండా పోతుంది

ఈ మాట ఎందుకు అనవలసి వచ్చిందంటే చాలా మంది సినిమా ప్రొడ్యూసర్లు ప్రేక్షకుల అభిరుచులను భూతద్దాలతో గమనించి, ఆ అభిరుచులకు అనుగుణంగా సినిమాలు తీస్తూ విజయం సాధించుదామనుకోవటం ఉంటున్నది ఇంగ్లీషులో గుర్రంముందు బండి తెచ్చి ఉంచటం అనే సామెత ఉన్నది ఈ ప్రొడ్యూసర్లవైఖరి అలాటిదేననిపిస్తుంది ఎందుకంటే, మాటవరసకు హాస్యం ఉన్న చిత్రాలు బాగా పోతాయన్నంత మాత్రం చేత ప్రతి ప్రొడ్యూసరుకూ చిత్రంలో హాస్యం పెట్టటం అమాంతం కరతలామలకమై పోతుందా, పోదు అందుచేత ఏం చేస్తాడూ? హాస్యనటులను పెడతాడు? ఇదే గుర్రం ముందు బండిని తెచ్చి పెట్టం హాస్యనటులు ఆటోమాటిక్‌గా హాస్యం సృష్టించరు అల్లురామలింగయ్యలాంటి అపురూప హాస్య నటుడు

ఎన్ని చిత్రాలలో అభాసు పాలుకాలేదు? తారలను— వీలైనంత ఎక్కువ ఖరీదైన వాళ్ళను— బుక్ చెయ్యటం వల్ల చిత్రానికి కనకవర్షం కురవటం ఎంత నిజమో, హాస్యనటుణ్ణి పెట్టగానే హాస్యం ఫౌంటెన్‌లాగా చిమ్మటం అంత నిజం

సినిమాలో ప్రతిదీ సృష్టించాలి! అరువు తెచ్చుకుని లాభం లేదు ఏ నటుణ్ణి, ఏ నటుడి సహజ శక్తులను, ఎట్లా వాడుకోవాలో తెలీని వాళ్ళు ఒక చిత్రం రక్తి కట్టించిన నటుణ్ణి పది చిత్రాలలో అరువు తెచ్చుకుని— ముందు తమ చిత్రాలనూ, పరోక్షంగా సినిమా కళాపరిశ్రమలనూ ధ్వంసం చేసేస్తారు ఈ కాలపు సినిమా చరిత్రను లోతుగా పరిశీలించనవసరం లేదు ఏ డైరెక్టరు, నటులూ, సంభాషణలు రాసేవారు, సంగీతం కట్టేవారు, పాటలురాసేవారు, ఒక ఏడు ఎక్కువ గిరాకీలు ఉంటే, వాళ్ళ వెనక విజయవంతమైన చిత్రాలు ఒకటో,రెండో ఉన్నాయన్నమాట

సినిమా చిత్రాల నిర్మాణం సృజనాత్మకమైన పరిశ్రమ అనీ, విజయవంతంగా చిత్రాలు తీయాలంటే,వ్యక్తుల సృజనశక్తిని సరి అయిన విధంగా వాడుకోవాలనీ నిర్మాతలే గ్రహించటానికి వారికి చిత్రనిర్మాణం గురించి కొంత సూక్ష్మజ్ఞానం కావాలి 'శంకరాభరణం' తర్వాత సోమయాజులును బుక్ చేసి శంకరశాస్త్రి లాటి వేషాలు వేయించటానికి ఏ సూక్ష్మజ్ఞానమూ అక్కర్లేదు

సాధారణంగా కళలకన్నిటికీ వర్తించే కొన్ని విషయాలు సినిమా చిత్రాలకు కూడా వర్తిస్తాయి వర్తిస్తున్నాయి అయితే వాటిని గురించి స్థూలంగానైనా తెలియని వాళ్ళకు సినిమా చిత్రాలలో ఫ్లాప్ అయేవీ, పెట్టిన డబ్బు తెచ్చేవీ, కొంత లాభం ఇచ్చేవీ, కామధేనువులూ—ఈః ర్గీకరణ మాత్రమే తెలుసు ఇది వ్యర్థమైన వర్గీకరణ అనికాదు ఇది చిత్రాలు తీయటానికి పనివచ్చే వర్గీకరణకాదు, ఎత్తేసిన చిత్రాలను గురించి చెయ్యవలసిన వర్గీకరణ ''నేను ఫ్లాప్ చిత్రం తీయబోతున్నాను'' ''నేను సూపర్‌హిట్ తియ్యబోతున్నాను'' అన్న ధోరణిలో ఏ ప్రొడ్యూసరూ మాట్లాడడు, ఒక వేళ బుర్ర కొద్దిగా తిరిగి మాట్లాడినా, అన్నమాట నిలబెట్టుకోలేడు సూపర్‌హిట్ చిత్రాలు తీసినవాళ్ళు కూడా ఆ చిత్రాలు జనం మధ్యకు పోయినదాకా తాము సూపర్‌హిట్ చిత్రం తీశామని గుర్తించడం జరగలేదు

''చిత్రంలో నావెల్టీ వుంది కదండీ? జన్నాని అదిపట్టింది!'' అని హిట్ పిక్చర్ గురించి చెప్పే వాళ్లు కూడా నిజం చెబుతారనటానికి లేదు పిక్చర్లో నావెల్టీ మాత్రం వుండి, పాత ఫార్ములాలనన్నిటినీ తోసేసి జనాన్ని అపారంగా ఆకర్షించిన'శంకరాభరణం' లాంటి చిత్రాన్ని చూసి ఒక్కరయినా అదే పద్ధతి అవలంబించి,పూర్వం ఎన్నడూలేని రకం చిత్రాన్ని తీస్తారా? తియ్యరు 'శంకరాభరణం' నుంచి కొత్త ఫార్ములా లాగుతారు

సినిమా చిత్ర నిర్మాణంలో సూక్ష్మజ్ఞానం ఎన్ని రంగాలలో అయినా ఉన్నది దాని లోతుపాతులు టెక్నీషియన్లకూ, విమర్శకులకూ మాత్రమే తెలుస్తుంది 'పథేర్ పాంచాలీ' లో చాలామంది నిర్మాతలకు ఏమీ కనిపించలేదు దానికి అంతర్జాతీయ ఖ్యాతి వచ్చినాక కూడా ''నా ఎత్తు ధనం పోసినా అటువంటి పిక్చరు తియ్యను!'' అన్న ప్రొడ్యూసర్లున్నారు వాళ్ళను అర్థంచేసుకోవచ్చు కాని 'పథేర్ పాంచాలీ', 'పాతాళభైరవి' ఒకేరకం చిత్రాలని భ్రమపడేవాడు నిర్మాతనని చెప్పుకోవటానికి పనికిరాడు

వర్తమానకాలంలో కళలూ, కళాఖండాలూ, మూడు జాతులుగా ఉంటాయి, 1 జానపద కళలు 2 ప్రజాకళలు, 3 సంప్రదాయకళలు

జానపద కళలు నిక్కచ్చిగా చెప్పాలంటే కళలు కావు అయితే వాటికి ప్రజాజీవితంలో స్థానం ఉన్నది పనులు చేసుకుంటూ పాడతారు విశ్రాంతి సమయంలో వింటారు దిమ్మిసపాటలు దంపుళ్ళ పాటలు, పొలంపాటలు, పెళ్లిపాటలు, మంగళహారతి పాటలు — ఇలాటివి ప్రజల జీవితంలో లోపించిన దాన్ని దేన్నోనింపుతాయి పనికి ఉత్సాహం కలిగిస్తాయి ఇవి జీవితాన్ని మార్చవు

ప్రజాకళలు అలాటివి కాదు ప్రజల జీవితానికి ప్రజాకళలలో అర్థం దొరుకుతుంది ప్రజల జీవితాన్ని అవి చైతన్యవంతం చేస్తాయి వాటిలో ''చదువు'' ఉన్నది ఒకనాడు తెలుగు భారత, భగవతాలూ శతకాలూ, వేమనపద్యాలూ లాటివి ప్రజాకళలు హరికథలు కూడా ఈ జాతివే ఈ ప్రజాకళలు జీవితంలో ఇమిడిపోవు వీటికోసం జనం వేరే కాలం కేటాయించాలి

( ప్రజలు అంటే ఎవరు? ఈ ప్రశ్నకు ప్రజాసామాన్యమనీ— అంటే చెప్పేవాడు మినహాగా వాడితరగతి మినహా మిగతావాళ్ళని చెప్పవచ్చు కష్టజీవులైన కర్షక కార్మికులూ, సంపదను ఉత్పత్తి చేసేవారనీ ఒక నిర్వచనం వున్నది కాని నా ఉద్దేశం అందరూ ప్రజలే— తాము ప్రజలనుంచి వెలివేసుకునే వాళ్ళు తప్ప ఈ మాట ఎందుకంటున్నానంటే, నేను గమనించినంతలో ప్రజాసామాన్యానికి విలక్షణంగా ఉన్నామనుకునే వాళ్ళు కూడా ప్రజాకళలలో బలం వున్నప్పుడు వాటి ప్రభావాన్ని ఆమోదిస్తారు వేమనపద్యాలను అచ్చుగా కార్మిక కర్షకలే మెచ్చుకున్నారన టానికిలేదు కమ్యూనిష్టు వ్యతిరేకి అయిన సురవరం ప్రతాపరెడ్డిగారు ''కవితాకన్య కమ్యూనిష్టులను వరించినందుకు'' ఆశ్చర్యపోయారు ఇంకొక విధంగా కూడా ప్రజలను గుర్తించవచ్చు ఈ కాలపు ప్రజాసాహిత్యం ప్రపంచమంతటా విప్లవసాహిత్యమే కాని మంచి విప్లవ సాహిత్యానికి స్పందించలేని కార్మికకర్షకులు ప్రజల నిర్వచనం లోకి చేరరదు అలాగే విప్లవోన్ముఖులుగా ఉన్న వర్గాలను కదిలించలేనిది విప్లవసాహిత్యం కూడా కాదు)

మూడోవి సంప్రాదాయ కళలు వీటిని గుర్తించటం తేలిక— సంప్రదాయ సంగీతమూ, సంప్రదాయ సాహిత్యమూ, నాటకాలు, చిత్రలేఖనమూ వగైరాలు సంప్రదాయకళలు సమాజంతో పాటు పరిణమించేవి ఆ కారణంచేత సాహిత్యంలాటి కళలో సమాజం పొందిన మార్పులన్నీ ప్రతిబింబితమవుతాయి అంతేకాదు, గత చరిత్రకు చెందిన ఉత్తమ ప్రజా సాహిత్యమంతా అందులో చేరిపోతుంది

అయితే ఈ చేరిపోవటం స్పాంటేనియస్‌గా జరగదు తాము ప్రజలకు విలక్షణంగా ఉన్నామనుకునేవారు ప్రజాసాహిత్యాన్ని మత విశ్వాసాలమూలానో, సామాజిక ఆచార వ్యవహారాల మూలానో, రాజకీయ కారణాలచేతనో ప్రతిఘటిస్తారు దానివల్ల ప్రజలకు జరగవలిసిన లాభం జరిగి పోయాక , లేదా ప్రజాసాహిత్యానికి కాలదోషం పట్టినాక, దాన్ని నెత్తిన పెట్టుకుంటారు ఇది చరిత్రలో జరుగుతున్నదే ఒకప్పుడు బుద్ధుడు లోకంలో పాపం పెంచటానికి విష్ణువు ఎత్తిన అవతారం తరువాత మహాపురుషుడు, గుడికట్టి పూజించవలిసినవాడు మార్క్స్, లెనిన్, స్టాలిన్, మావోలు ఒకప్పుడు లుచ్చాలు వాళ్ళే కాలక్రమాన మహా మేధావులయారు వేమన పద్యాలను పండితులు ఒప్పుకోకపోవటాన్ని, ఈ

నాడు అతనిమీద రిసెర్చి చేసి డాక్టరేట్లు పొందటాన్నీ కూడా అర్థం చేసుకోవచ్చు

ఈ మూడు రకాల కళల్లోనూ మంచిచెడ్డలూ, మూసపోతలూ ఉన్నాయి

ఇప్పుడు నేను చెప్పదలచిన దేమంటే సినిమాలలో ఈ మూడు రకాలూ ఉన్నాయి సినిమా చిత్రాలలో అత్యధిక సంఖ్యలో వచ్చినవి జానపద సినిమాలు (జానపదం అన్నమాటను కథకు అన్వయించవద్దు చిత్రనిర్మాణానికి అన్వయించండి అది కళారూపానికి సంబంధించినది 'పాతాళభైరవి' జానపద కథ కావచ్చు ఆ చిత్రం సంప్రదాయ చిత్రంకావచ్చు )

జానపద చిత్రానికి గల ముఖ్య లక్షణం ఏమంటే, దానికి భవిష్యత్తులేదు అది సినిమా చరిత్రలో స్థానం సంపాదించుకోదు రన్ అయిపోగానే కాలగర్భంలో కలిసిపోతుంది జనానికి తాత్కాలికంగా నచ్చి, హిట్‌లూ, సూపర్‌హిట్‌లూ అయిన చాలా పిక్చర్లు జానపద కళావిభాగానికి చెందినవే ''వినోదం'' వీటి ప్రధానగుణం సామాజికవ్యక్తిలో అవి మార్పు తీసుకురాలేవు

ప్రజాకళ అనదగిన సినిమా చిత్రాలు రావటానికి మన దేశంలో పరిస్థితులు అనుకూలంగా లేవు ప్రజాచిత్రాలు తీయటానికి చిత్రనిర్మాణంలోనూ అన్ని రంగాలలోను ప్రజాకళాకారులు కావాలి మధ్యతరగతి సృష్టించుకున్న శ్రామిక పాత్రలతోనూ, వాళ్ళ కృత్రిమ కష్టాలతోనూ, డబ్బు రాలుతుందని తోస్తే, ఏర్‌కండిషన్డ్ నిర్మాతలు చిత్రం తీయవచ్చు కాని అది ఒక 'చలిచీమలు' లాగా, ఒక 'మాభూమి' లాగా, ఒక ' ఊరుమ్మడి బతుకులు' లాగా తయారు కాకపోవచ్చు

ఈ పిక్చర్లను డిస్ట్రిబ్యూటర్లు అంటుకోరు మంచి థియేటర్లు దొరకవు చిత్రం బాగా లేదని ప్రచారం జరుగుతుంది లక్షలు కుమ్మరించి ఎన్నికల్లో నిలబడిన వాడిమీద నిజమైన ప్రజాసేవకుడు నిలబడి గెలవటం ఎంత కష్టమో, నిజమైన ప్రజా చిత్రాలు నిర్మాతలకు ఉత్సాహజనకంగా ఉండటం అంత కష్టం

పోతే ''మంచి'' చిత్రాలుగా పరిగణనలోకి వచ్చి, ఆడేవాళ్ళకూ, రాసే వాళ్ళకూ, డైరెక్టు చేసేవాళ్ళకూ, జన్మభూమిగా ఉండేవి ''సంప్రదాయ'' చిత్రాలు

వీటి నిర్మాణానికి సూక్ష్మజ్ఞానం అవసరం లేదనుకుని చాలామంది పొరపాటుపడిన ఫలితంగా పాతికలక్షలుపెట్టి తీసినపిక్చరు— వరదనీటికి కొట్టుకుపోయిన కొత్తడామ్‌లాగా అయిపోవటం జరుగుతున్నది

సంప్రదాయ చిత్రాలు సమాజాన్ని ముందుకు నడపనక్కర్లేదు, విప్లవం తీసుకురానవసరం లేదు సమాజంలో ఉన్న వాస్తవాన్ని వక్రీకరించకుండా చూపితే చాలు పెళ్లిళ్ల ఎట్లాజరుగుతాయి పెళ్లిగాక ముందు ఆడపిల్లలు మగవాళ్లతో ఎట్లా మసలుకుంటారు, కలవాళ్లు లేని వాళ్ళ పట్ల ఎట్లా ప్రవర్తిస్తారు బిక్షాధికార్లు లక్షాధికార్లు అయిపోవటానికి ఎన్నిపాతకాలకు ఒడికట్టాలి— ఇలాంటివైనా వాస్తవికంగా మన చిత్రాల్లో చూపక పోవటంచేత గొప్ప సందేశం ఉన్నట్టు నటించే చిత్రాలు జానపద కళల స్థాయిని మించలేకుండా వున్నాయి సంఘంలో పరమ అజ్ఞానులను కూడా నమ్మించలేకుండా ఉన్నాయి

సంఘంలో అమలులో ఉన్న సంప్రదాయాలూ, ప్రభుత్వం అమలుచేసే శాసనాలలో ఉన్న ప్రజా సౌకర్యాలూ తారుమారు చెయ్యకుండా సంప్రదాయ చిత్రాలు సృజన శక్తితో తీస్తే అవి దెబ్బ తిననవసరంలేదు అట్లాగే జానపద చిత్రాలలో వినోదానికి బదులు విషాదమూ,

భయోత్పాతాలూ, చావగొట్టు కోవటాలూ పెడితే అవి దెబ్బతింటాయి

అందుచేత చిత్ర నిర్మాతలు సాంఘిక చిత్రాలు తీస్తున్నామనుకుని జానపద చిత్రాలూ, హిట్ చిత్రాలు తీస్తున్నామని చెత్త చిత్రాలూ, తీయబూని, ఏరకం చిత్రం తీయటానికి పనికి వచ్చేవాళ్ళను ఆరకం చిత్రానికి ఉపయోగించక, ''హిట్'' చిత్రాలలో పనిచేసేవాళ్ళను అన్ని రకాల చిత్రాలకూ ఉపయోగించటం అంత మంచిదికాదు

ప్రజా చిత్రాలకు భవిష్యత్తు లేదనుకోవద్దు అన్ని రకాల చిత్రాలలోకి విజయవంతం అయే ప్రజాచిత్రం తీయటం చాలా కష్టం— కాని అసాధ్యం కాదు ఎక్కడన్నా ఒక ప్రజా చిత్రం విజయవంతమైతే అందులో పనిచేసి, దాని విజయానికి తోడ్పడినవారిని ఎగరేసుకుని పోతారు సినిమా పారిశ్రామికులు దీన్ని ఆపటం సాధ్యంకాదు ఇవాళ కాకపోతే రేపైనా ప్రజాచిత్రాలు ప్రజాకళాకారుల నుంచి రాకపోవు కాని ఆ చిత్రాలు ఆనాటికి సంప్రదాయ చిత్రాలలోకే చేరపోతాయి 50 ఏళ్ళ క్రితం 'శంకరాభరణం' లాంటి చిత్రం సంప్రదాయ చిత్రాల చరిత్రలో ఒక మలుపు తెస్తుందని అనుకోగలిగారూ ఆ రోజుల్లో సినిమా చిత్రమంటే— పౌరాణిక చిత్రమే!

*విజయచిత్ర, మాసపత్రిక, సెప్టెంబర్ 1980*

# 1. చార్లీ చాప్లిన్ సినిమాకళ

చార్లీ చాప్లిన్ హాస్యగాడుగా ప్రసిద్ధికెక్కాడు అతని హాస్యం వెనక కరుణ కూడా వుందని విమర్శకులు చాలాకాలం క్రితమే గుర్తించారు లాక్షణికంగా చార్లీచాప్లిన్ సినిమాకళ కరుణా సమన్వితమైన హాస్యం ప్రధానంగా గలది అని చెప్పినంత మాత్రంచేత చాప్లిన్ సినిమా కళను గురించి సమగ్రంగా వివరించి చెప్పినట్టు కాదు

టెక్నికల్‌గా చాప్లిన్ హాలీవుడ్‌కు కొంత వెనకగా వుంటూ వచ్చాడు. టాకీలు వచ్చిన చాలాకాలం దాకా చాప్లిన్ మూకీలే తీస్తూవచ్చాడు గత ప్రపంచయుద్ధం ప్రారంభమైన తరువాత విడుదల అయిన 'గ్రేట్‌డిక్టేటర్' చిత్రంలో మొట్టమొదటిసారి చాప్లిన్ నోరుతెరచి మాట్లాడాడు ఈనాడు కూడా చాప్లిన్ చిత్రాలలో శిల్పం పాత వాసనే కొడుతూ వుంటుంది

చాప్లిన్ ప్రత్యేకత తెలుసుకోవాలంటే అతని ఆశయాలనూ, వాటిని చాప్లిన్ సాధించే పద్ధతులనూ అవగాహన చేసుకోవాలి

'కిడ్', 'గోల్డ్‌రష్', 'సర్కస్', 'సిటీలైట్స్', 'మోడరన్ టైమ్స్', 'గ్రేట్ డిక్టేటర్', 'మన్స్యువెర్డు' —1925 నుంచీ 1947 వరకూ చాప్లిన్ తయారుచేసిన చిత్రాలు ఈ ఏడే వీటిలో మొదటి ఆరింటిలోనూ చాప్లిన్ ఒకే పాత్ర ధరించాడనీ, అకస్మాత్తుగా 'మన్స్యువెర్డు' లో అతను వేషం మార్చేశాడని అందరూ నమ్ముతున్నారు ఇది కేవలం పొరపాటు తన పాత్రను 'ట్రాంప్' అని పిలవనిచ్చాడు చాప్లిన్ కాని ఇది కూడా పూర్తిగా నిజంకాదు ఎందుచేతనంటే దాదాపు ప్రతి చిత్రంలోనూ చాప్లిన్ ధరించిన పాత్ర ఏదో ఒక పని చెయ్యటానికి ప్రయత్నిస్తుంది 'కిడ్' లో అద్దాలు వేస్తుంది, ఇళ్ళముందు మంచు ఊడుస్తుంది సర్కస్‌లో కూడా సర్కస్ పనులు చెయ్యటానికి సిద్ధపడుతుంది 'మోడరన్ టైమ్స్' లో ఈ పాత్ర ఫ్యాక్టరీ కూలీ 'గ్రేట్ డిక్టేటర్' లో మంగలి అయితే చార్లీచాప్లిన్ ఇన్ని ఏళ్ళుగా ధరిస్తూ వచ్చిన పాత్రను శ్రామికుడనటానికి రెండు కారణాల చేత వీలు లేదు ఒకటి, ఈ పాత్రకు శ్రమించటంలో విశ్వాసం లేదు రెండు, ఈ పాత్ర యొక్క ఆశయాలు మధ్యతరగతి మనస్తత్వానికి చెందినవీ, అసాధ్యమైనవీను

'మన్స్యువెర్డు' చిత్రంలో చాప్లిన్ పాత్ర అకస్మాత్తుగా మారాడా? లేదు ఇప్పుడైనా అతను ఉద్యోగం పోగొట్టుకున్న బాంకు గుమాస్తా — మంగలివానికన్న ఎక్కువ ఘనమైన వాడుకాడు అయితే ఈ చిత్రంలో కూడా ఈ అభాగ్యుడైన బాంకు గుమాస్తా తన గొంతెమ్మ కోరికలు తీర్చుకోవటంలో వెనుకటి పాత్రకన్న ఎక్కువ విజయం పొందినట్టు కనిపిస్తాడు— కాని నిజంగా విజయం పొందడు 'సిటీలైట్స్' అనే చిత్రంలో చాప్లిన్ తన ప్రియురాలి గుడ్డితనం పోగొట్టటానికి దొంగతనం చేసి జైలుకి పోయి, కళ్ళు వచ్చాక ఆమెకూ తనకూ ఉన్న ఎడం తెలుసుకొని తన ప్రేమ గగనకుసుమమని గ్రహించుకున్నట్టుగానే, వెర్డుకూడా తన భార్యా పిల్లలు పోగానే తన ఆదర్శాలు తనకు అందకుండా పోయాయని తెలుసుకుంటాడు

వెర్డుగా చాప్లిన్ మారలేదు—పరిణామంచెందాడు, అంతే! 1925లో కిటికీలకు అద్దాలు

వేసేవాడికి జీవితం మీద ఎంత అధికారం ఉందో, అతడి కలలు నిజమయ్యే అవకాశాలేపాటి వున్నాయో, 1947లో వెర్డు వంటి బాంకు గుమస్తాకు జీవితం మీద అంతే అధికారమూ, తన కలలు నిజంచేసుకోవటానికి అంతే అవకాశాలూ ఉన్నాయి సాంఘిక పరిణామం ఇదికాదా?

చార్లీ చాప్లిన్ కళ వాస్తవిక కళకాదు అతని పాత్రలు యథార్థ పాత్రల ప్రతిబింబాలు కావు అతను మనకు అద్దాలమ్మేవాణ్ణిగాని , ఒక ఫ్యాక్టరీ కూలీని గాని, ఒక మంగలినిగాని, ఒక బాంకు గుమస్తానిగాని చూపడు మధ్యతరగతి వాళ్ళ ఆదర్శాలకూ, నగ్నజీవితానికీ ఉండే సంఘర్షణను చిత్రించేందుకు ఈ యీ పాత్రలను చాప్లిన్ సృష్టించాడు చాప్లిన్ కళ ప్రత్యేకించి మధ్యతరగతికే మధ్యతరగతివాళ్ళు విశ్వసించే ధర్మాలు, నియమాలు, డబ్బు, అధికారం, పోలీసులు, సంస్కారం నికృష్టజీవుల జీవితాల దృష్టి పథంనుంచి ఎట్లా కనిపిస్తాయో చాప్లిన్ చూపిస్తాడు మధ్యతరగతి వాళ్ళ కలలు భగ్నం చేస్తాడు 'కిడ్' చిత్రంలో పోలీసువాడికి దడిచి చాప్లిన్ ఎవరో ఒదిలేసిన కుర్రాణ్ణి పట్టుకుపోయి పెంచుకుంటాడు 'మోడరన్ టైమ్స్' చిత్రంలో ఎవరో పారేసుకున్న ఎర్రజండా చేతితో పట్టుకుని ఎరెస్టవుతాడు పోలీసులు శాంతిభద్రతలు కాపాడడానికి కావచ్చు, కాని వారు కాపాడే శాంతిగాని, భద్రతగాని అనాథలవి కావు తిండి ఆకలి తీర్చడానికి కావచ్చు, కాని బీదవాళ్ళ ఆకలి తీర్చడానికి కాదు మతం ఆత్మశాంతికి కావచ్చు, కాని అసమర్థుడి ఆత్మశాంతికి మట్టుకు కాదే! ఒక బుడ్డీ వేసివున్నప్పుడు తప్ప ధనికుడి మానవప్రేమను విశ్వసించటానికి లేదు డబ్బుతో పోయిన కళ్ళు తెప్పించవచ్చుగాని జైలుకి పోకుండా అనాధకి ఆ డబ్బు లభించదు సంఘంలో వుండే ఈ సత్యాలని విమర్శిస్తూ చాప్లిన్ చిత్రాలు తీస్తూ వచ్చాడు మధ్యతరగతి వాస్తవికత ద్వారా ఈ సత్యాన్ని ఎన్నటికీ గ్రహించలేదు

చాప్లిన్ రసాన్ని సాధించే విధానం కూడా వాస్తవికతకు తావివ్వదు ఎంత ఆకలిగొన్నవాడు గాని మైనపు వత్తులు తినగలడా? చెప్పులు వండుకుని తినగలడా? ఎక్కడన్నా ప్రెస్సులో పడ్డ జేబు గడియారం వెడల్పయిన అట్టగడియారంలాగా సాగుతుందా? యంత్రాలల్లో ఇరుక్కుపోయిన మనిషి ఒక్క చుక్క రక్తం కారకుండా బతికి బయటికివస్తాడా? చాప్లిన్ చిత్రాల్లో ఇవన్నీ సాధ్యమవుతాయి వెర్డుచేసే వ్యాపారం వయసుమళ్ళిన, డబ్బు గల స్త్రీలను పెళ్ళాడి హత్యచేసి డబ్బు కాజెయ్యటం అయినప్పటికీ 'వెర్డు' చిత్రంలో బీభత్సం దాదాపు లేనేలేదు

చాప్లిన్ రాజకీయవాదికాడు 'వెర్డు' చిత్రం చూసి చాప్లిన్ను ''నీవు కమ్యూనిస్టువా?'' అని అడిగిన వాడికన్న మతిలేని వాడుండబోడు డిక్టేటర్లు, నిరుద్యోగమూ, లాకవుట్లూ, వ్యాపారమూ, మారణ సామగ్రి నిర్మాణమూ, యుద్ధాలూ— వాటినిగురించి విస్పష్టమైన అభిప్రాయాలు వెలిబుచ్చే అధికారం రాజకీయవాదులకే వున్నట్టూ, కళాకారులకి లేనట్టూ మాట్లాడటం మూఢత్వం సాంఘిక దోపిడి చెలాయించే వాళ్ళు ఇటువంటి మూఢత్వాన్ని బలపరుస్తారు

చాప్లిన్ తన చిత్రాల ద్వారా సాంఘిక వ్యవస్థను విమర్శించుతాడే గాని ప్రపంచానికి రాజకీయ ప్రణాళిక లివ్వడు అంతవరకు కళాకారుడుగా అతన్ని తప్పుపట్టటానికి ఎవరికీ

అధికారం లేదు

ఇటీవల మనదేశంలో విడుదల అయిన 'మస్యు వెర్డూ' చిత్రంలో చార్లీచాప్లిన్ కళ అనేక విధాల ఉన్నత స్థాయికి వచ్చింది 'వెర్డూ' వాస్తవికపాత్రకాదు తనభార్యాబిడ్డల మీది ప్రేమ కొద్దీ ధనార్జన కోసం హత్యలు సాగించే యధార్థపాత్ర కొద్ది కాలానికి హంతకుల మనస్తత్వం అవలంబించి సంఘానికీ మధ్యతరగతి విలువలకూ ఎడమై పోతుంది కాని 'వెర్డూ' అట్లా కాడు తన స్థితిలోనే వున్న ఒక అనాధ స్త్రీకి సహాయం చేస్తాడు హింస హింసను ప్రేరేపిస్తుందంటాడు నోరులేని జంతువుల మీద ప్రేమ చూపిస్తాడు తన భార్యాబిడ్డలను చివరివరకూ ప్రేమిస్తాడు ఒక వ్యక్తి చెయ్యలేని ఈ పని మధ్యతరగతి చేస్తూనే వున్నది మధ్యతరగతికి జీవకారుణ్యంలో విశ్వాసం వున్నది, యుద్ధాలనూ ఆమోదిస్తున్నది నీతిలోనూ విశ్వాసం ఉంచుతున్నది వ్యాపారాన్ని ఆమోదిస్తున్నది 'వెర్డు' మధ్యతరగతి ప్రజ మధ్యతరగతి గుర్తించవలసిన నీతులన్నీ 'వెర్డూ' నోట మనం వింటాం

''వ్యాపారం ఎప్పుడూ తప్పుడు వ్యాపారమే''

''క్రౌర్యం విస్తృతంగా ఆచరణలో పెడితే తప్పు ఫలించదు''

''ఒకరిని చంపటం హత్య! అనేకులను చంపటం పరాక్రమం''

''పాపాత్ములు ప్రపంచంలో లేకపోతే మత గురువులేం కావాలి?''

''ఆత్మకు క్షాళన అనవసరం, అది భగవంతుడిలో భాగం''

''నా పేచీ దేవుడితో కాదు, మనుష్యులతో''

'వెర్డూ' ప్రకటించే ఈ భావాలను ఎట్లా స్వీకరించుకోవాలో, వాటిని గురించి మనస్సు లెట్లా సమాధానపరచుకోవాలో, సమాధాన పరచలేకపోతే ఏం చెయ్యాలో తేల్చుకోవలసినది ప్రపంచ ప్రజలు ఉన్న సంగతి నగ్నంగా చాప్లిన్ వెర్డూ నోట పలికించాడు అదే చాప్లిన్ సినిమాకళ యొక్క ఒక్క ఆశయమూనూ

*అభ్యుదయ, మాసపత్రిక, మార్చి, 1948*

# 2. చార్లీ చాప్లిన్ ప్రతిభ

ఈ సంవత్సరం మార్చి ఆరంభంలో ''డెయిలీ వెరైటీ'' అనే హాలీవుడ్ పత్రిక 25 ఏళ్లకు పైబడి సినిమా రంగంలో పనిచేసిన 200 మంది స్త్రీపురుషులను, గత 50 సంవత్సరాలలో వెలువడిన ఉత్తమ చిత్రం, ఉత్తమ నటుడు, నటీ, దర్శకుడు, నిర్మాతా ఎవరని ప్రశ్నించగా, వారు చార్లీచాప్లీన్ ఉత్తమనటుడుగా పేర్కొన్నారు

టాకీలు రాకపూర్వమూ, వచ్చిన తరువాతా చార్లీచాప్లిన్ నిర్మించిన చిత్రాలు ఇప్పుడు కూడా అమెరికాలో అతి విజయవంతంగా నడుస్తున్నాయి చాప్లిన్ తయారు చేసిన 'సిటీ లైట్స్' అన్న చిత్రం ఇటీవల మళ్లీ విడుదల అయినప్పుడు దాన్ని సమీక్షిస్తూ ''టైమ్'' పత్రిక ''ప్రపంచంలో ఏ ఇతరవ్యక్తి మొహమూ గుర్తించలేనంతమంది చార్లీ చాప్లిన్ మొహం గుర్తించగలరు'' అన్నది

ఇందులో అతిశయోక్తి ఏమీ లేదు అన్ని దేశాలవారూ, జాతులవారూ, సంస్కారాలవారూ చార్లీచాప్లిన్ చిత్రాలు చూసి ఆనందించినట్టుగా ఏ ఇతర సినిమా చిత్రాన్ని చూసీ ఆనందించలేరు సార్వజనీనమైన కళ ఏమిటో చాప్లిన్ అర్థం చేసుకున్నాడని చెప్పవచ్చు ఒక్క విజయవంతమైన చిత్రం తీయటానికి నానా అగచాట్లూ పడే మన నిర్మాతలు వరసగా విజయపరంపర సాధించిన చాప్లిన్ రహస్యం తెలుసుకోవడానికి ఆత్రపడవచ్చు ఒక విధంగా ఆ రహస్యం చాప్లిన్ వ్యక్తిలో ఉన్నది, దేన్నయినా డబ్బుతో కొనగల హాలీవుడ్ మరొక చాప్లిన్‌ను తయారుచేయలేక పోయింది

చాప్లిన్ విలువలు:

చాప్లిన్ చిత్రాలలో కొన్ని మూలసూత్రాలు లేకపోలేదు వాటిని గురించి కొంత వరకు తెలుసుకొనడం అసాధ్యం కాదు

చాప్లిన్ చిత్రాలలో ప్రధానంగా ఉండే రసాలు హాస్యమూ, కరుణా చాప్లిన్ ధరించే పాత్ర– అతని చిత్రాలలోని ప్రధాన పాత్ర– దరిద్రుల ప్రతినిధి అయి ఉండికూడా మధ్యతరగతి మనస్తత్వం కలవాడు చాప్లిన్ చిత్రాలకు చెందిన కథలన్నీ ఈ పాత్ర దృక్పథంతో రచించబడినవే

చాప్లిన్ సామాన్యంగా తన చిత్రాలలో కనిపించే పాత్రకు శ్రమపడటం ఏమీ ఇష్టం లేదు ఆకలి ప్రేరేపిస్తేనే గాని పని చెయ్యడు మామూలు మధ్యతరగతివాడిలాగానే ఆ పాత్ర చెయ్యీ కాలూ కదిలించకుండా హాయిగా జీవించాలనీ, మధ్యతరగతి మర్యాదలూ అవీ లోకానికి ప్రదర్శించాలనీ, శాంతియుతమైన స్వర్గం ఒకటి కల్పించుకుని అందులో తన ప్రియురాలితో ఒంటరిగా జీవించాలని కలలు కంటాడు ఇతను పోలీసులనూ, బలశాలులను తప్పించుకు తిరుగుతాడు అతని దృష్టిలో అవి తనకు హితమైన శక్తులు కావు అవకాశం దొరికితే వ్యాపారం– అట్టే పెట్టుబడి లేని వ్యాపారం–చెయ్యటానికి ఈ పాత్రకు అభ్యంతరం లేదు కాని వ్యాపారంలో ''నేరం'' ఇమిడి ఉన్నదని అతను స్పష్టంగా గుర్తిస్తాడు ఇది అందరూ సులభంగా గుర్తించగల పాత్ర, అర్థం చేసుకోగల పాత్ర

చార్లీచాప్లిన్ చిత్రాలలో 'మంచి పోలీసులూ', 'వంచన లేని వ్యాపారమూ' చూడలేం

''కిడ్'' అనే చిత్రంలో చాప్లిన్ ఎవరో వదిలివేసిన పిల్లవాణ్ని పొరపాటున అంటించుకుని వదిలించుకోలేకపోతాడు ఆ పిల్లవాణ్ని ఎవరి గడపమీదో వదిలిపెట్టి పోదామనుకుంటూ చాప్లిన్ పోలీసులకంట పడతాడు వెంటనే ద్రోహం చేస్తున్న వాడల్లే పిల్లవాణ్ని తీసుకుపోయి పెంచు కుంటాడు ఇద్దరి పొట్టా గడవగలందులకు చాప్లిన్ కిటికీలకు అద్దాలు వేసే వ్యాపారం ప్రారంభి స్తాడు మోసం లేకుండా ఈ వ్యాపారం సాగదు చాప్లిన్ పెంపుడుకొడుకు అద్దాలు పగలు గొట్టటమూ, చాప్లిన్ కొత్త అద్దాలు వేసి డబ్బు పుచ్చుకోవటమూ చేస్తారు శీతాకాలం వస్తుంది చాప్లిన్‌కు కూలి చెయ్యక జరగదు ఇళ్ల ముందు పడ్డ మంచు ఎత్తిపారెయ్యటానికి వారితో బయలు దేరుతాడు ఒక ఇంటి వాకిలి ముందు ఎత్తిపారెయ్యటానికి మాట్లాడుకుంటాడు ఈ ఇంటి ముందు మంచు ఎత్తి పారతో భుజం మీదగా పక్క ఇంటిముందు పోస్తాడు పక్క ఇంటివాళ్లుకూడా కూలి ఇచ్చి చాప్లిన్‌ను మంచు ఎత్తడానికి నియోగిస్తారు మళ్లీ ఈ ఇంటిముందు మంచు ఎత్తి

ఇంకా అవతలగా ఉన్న ఇంటిముందు పోస్తాడు తీరా చూస్తే అది పోలీసుస్టేషనవుతుంది చాప్లిన్ కాలికి బుద్ధి చెబుతాడు మోసం వ్యక్తికి ఎట్లా లాభించేది, పేదవాడు మోసం చెయ్యటానికి ఎటువంటి అవాంతరాలు సంఘంలో ఉన్నదీ ఈ చిత్రంలో చాప్లిన్ చూపిస్తాడు

వ్యాపారాన్ని గురించి 1925లో 'కిడ్' చిత్రంలో ప్రదర్శించిన అభిప్రాయాలనే చాప్లిన్ 1948లో 'మస్యూవెర్డూ' లో మరింత సమగ్రంగా ప్రదర్శించాడు ఈ చిత్రంలో చాప్లిన్ వాటా వ్యాపారస్థుడు ఈ వ్యాపారానికి కావలిసిన మూలధనాన్ని చాప్లిన్ డబ్బున్న స్త్రీలను పెళ్ళాడి, హత్యచేసి సంపాదిస్తాడు అనంతరం ప్రాణమే పోతుంది వెర్డూకు

'సిటీ లైట్స్' చిత్రంలో చాప్లిన్ ఒక ధనికుడి స్నేహం సంపాదిస్తాడు కాని ఆ ధనికుడు తాగి వున్నప్పుడు తప్ప చాప్లిన్‌తో స్నేహంగా ఉండడు ఇంత ధనికుడి స్నేహితం వున్నా చాప్లిన్ తన ప్రియురాలి అంధత్వం నయం చెయ్యటానికి దొంగతనం చేసి జైలుకు పోవలసివస్తుంది

ఒక్క ముక్కలో చెప్పాలంటే చాప్లిన్ చిత్రాలలో ఉన్న విలువలు అనాధ ప్రజలు సులభంగా గుర్తించేవి ఏ విలువలపై జీవితం నడుస్తున్నదని మధ్యతరగతివారు భావిస్తారో అవి మామూలు మనుష్యులకు అందుబాటులో ఉండేవి కావు వాటి వెనుక ఎంతో దుర్మార్గం వుంది.

**చాప్లిన్ శిల్పం:**

చాప్లిన్ చిత్రాలలో వాస్తవికత్వానికి చోటు లేదు అందుచేతనే అది ఏ నీతినీ నేరుగా బోధించవు అంతమాత్రంచేత వాటిలో జీవితసత్యం లేకపోలేదు ఆ జీవిత సత్యాన్ని చాప్లిన్ స్వాప్నిక శిల్పంతో పొదుగుతాడు స్వాప్నిక జగత్తులో వాస్తవికత వుండదు అందులో నవ్వూ, ఏడుపూ తప్ప ఇతర భావాలకు అంత ప్రాధాన్యం ఉండదు.

చాప్లిన్ తన చిత్రాలలో ఉపయోగించే స్వాప్నికశిల్పానికి ఎన్ని ఉదాహరణలైనా ఇవ్వవచ్చు అతని చిత్రాలలో రక్తపాతం వుండదు 'మాడర్న్‌టైమ్స్' చిత్రంలో యంత్రంలో చిక్కుకుపోయిన కార్మికుడికి ఒక్క గాయంగూడా కాదు రక్తపాతం చూపటానికి మంచి అవకాశంగల 'గ్రేట్ డిక్టేటర్' లోగాని, ''మస్యూవర్డూ'' లోగాని చాప్లిన్ ఒక్క చుక్క రక్తం చూపడు అతని చిత్రాలలో దారుణ సంఘటనలున్నప్పటికీ అవి ప్రత్యక్షంగా చూపబడవు ప్రేక్షకుల ఊహకు వదలబడతాయి చాప్లిన్ వాస్తవిక జగత్తుగురించి చిత్రాలు తీస్తూకూడా ప్రేక్షకులకు వాస్తవిక జగత్తును జ్ఞాపకం చెయ్యడానికి జంకుతున్నట్టు కనిపిస్తాడు కాని ఈ విధంగా వాస్తవ ప్రపంచాన్ని దూరంగా ఉంచడంవల్ల చాప్లిన్ ప్రేక్షకుణ్ని ఒక విధమైన అర్ధసుషుప్తిలో – మైకంలో – వుంచగలుగుతాడు

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 4-10-1950*

# 3. చార్లీ చాప్లిన్ బాల్యం

చార్లీ చాప్లిన్ 1889 ఏప్రిల్, 16న బ్రిటన్‌లోని కెనింగ్టన్ నగరంలో, కెనింగ్టన్ రోడ్డులో గల 287 నంబరు గల భవనంలో జన్మించాడు మరి నాలుగు రోజులకు ఆస్ట్రియాలో హిట్లర్ జన్మించాడు ఆ సంవత్సరమే విలియం ఫ్రీజ్ గ్రీన్ అనే ఆయన సినిమా కామెరాలాటిది తయారుచేశాడు

చార్లీ తండ్రి చార్ల్‌చాప్లిన్ సీనియర్, తల్లి పేరు లిలీ హార్లీ ఆమె మొదటి భర్తకు సిడ్నీ అనే కొడుకును కన్నది సిడ్నీ కూడా చార్లీ వెంట పెరిగాడు చాప్లిన్ తల్లి దండ్రులు తక్కువరకం వినోద ప్రదర్శనలలో పాల్గొంటూ ఉండేవారు లిలీ హార్లీ పాటలు పాడి ప్రజలను రంజింప చేసేది చాప్లిన్ కుటుంబం ప్రదర్శనల వెంట ఇంగ్లండులోనే గాక యూరప్ యావత్తూ పర్యటించింది కాని వారి దారిద్ర్యం తీరలేదు ఎప్పుడైనా నాలుగు డబ్బులు కనిపిస్తే చాప్లిన్ తండ్రి వాటితో మస్తుగా తాగేసేవాడు

చార్లీ పసితనంనుంచీ చురుకైనవాడు అతను తప్పటడుగులు వేయనేర్చినది లగాయతు నృత్యం చేయటమూ పాడటమూ నేర్పారు అతనికి మూడేళ్ళయినా వెళ్ళక మునుపే అతని తల్లి అతని నటనాసామర్థ్యం గురించి అందరికీ చెప్పేది తల్లిదండ్రులు పాల్గొనే ప్రదర్శనాల అనంతరం జరిగే పార్టీలలో చార్లీని బల్లమీదికెక్కించి అందరూ పాడే పాటలు పాడించేవారు, చాప్లిన్ తాను ఎరిగిన ప్రతి వ్యక్తినీ అద్భుతంగా అనుకరించి అందరినీ నవ్వించేవాడు

ఈ శిక్షణ చార్లీకి బాగా ఉపయోగించింది ఒకనాడు అతని తల్లికి ఆకస్మికంగా జబ్బు చేసి స్టేజిమీదికి వెళ్ళి పాడలేకపోయింది అయిదేళ్ళ వయస్సుగల చార్లీని తండ్రి స్టేజి మీదికి తోసి పాడమన్నాడు చార్లీ భయాన్ని అణచుకుని ''జాక్‌జోన్స్'' అనే పాటను సత్తువకొద్దీ పాడ సాగాడు ప్రేక్షకులు చార్లీమీద డబ్బులవర్షం కురిపించారు చార్లీ ఎంతకూ పాట ఆపకపోవటం చూసి తండ్రి అతనిని స్టేజిమీదినుంచి లాక్కుపోవలసి వచ్చింది

అతి బాల్యదశలో వచ్చిన ఈ విజయం చార్లీకి ఆనందం చేకూర్చలేదు ఇది జరిగిన కొద్దికాలానికే అతని తల్లిదండ్రులు విడిపోయారు మరి కొద్ది రోజులలో అతని తండ్రి తాగుడువల్ల సెంట్ థామస్ ఆస్పత్రిలో మరణించాడు చార్లీకి దుర్దినాలు సంప్రాప్తమయాయి అతని తల్లి తన మకాం కెనింగ్టన్‌లోని పేదయిళ్ళలోకి మార్చింది పౌనాల్ టెరెస్ నంబరు 3 లో చార్లీ తన గడ్డు రోజులు గడిపాడు నాలుగో అంతస్తులోని తమగదికి చార్లీ రోజూ మెట్లు ఎక్కి దిగుతూండేవాడు హిట్లరు గత యుద్ధకాలంలో తన విమానాలను బ్రిటన్‌పైకి పంపి బాంబులతో నిర్మూలించిన ఇళ్ళల్లో ఈ ఇల్లుకూడా ఒకటి

భర్త మరణానంతరం చాప్లిన్ తల్లికి రుగ్మత పట్టుకుంది ఆమె తన కుమాళ్ళను వసతిసౌకర్యాలు గల హాన్వెల్ స్కూలుకు పంపింది ఇక్కడ చార్లీ ఒక సంవత్సరం చాలా కష్టంతో గడిపాడు తరువాత తల్లి ఆరోగ్యం కొంత బాగుపడింది ఆమె తన బిడ్డలను తిరిగి తెచ్చుకుని

కుట్టుపనిచేస్తూ ఆ సంపాదనతో కుటుంబాన్ని పోషించ సాగింది

చార్లీ ఏడో ఏట మ్యూజిక్ హాల్ ప్రదర్శనలలో పాల్గొనే అవకాశం దొరికింది ఇందులో చార్లీ మరికొందరితో కలసి వినోద నృత్యమూ, ఇమిటేషన్‌లూ చేసేవాడు ఇందులో సంవత్సరమున్నర గడిచింది అంతటితో ఆ ప్రదర్శనలు మూతపడ్డాయి అనంతరం చార్లీ లండన్‌కు సమీపంలో హెర్న్ బాయ్స్ కాలేజికి వెళ్ళి అక్కడ రెండేళ్ళు చదివాడు అతని విద్యాభ్యాసమంతా ఇంతే

చార్లీకి నిజమైన గురువు అతని తల్లి మనుషులను పరిశీలించటంలో, వారినిగురించి క్షణంలో అనేక విషయాలు తెలుసుకోవటంలో ఆమె అసాధారణ ప్రజ్ఞగలది వీధిలో పోయే మనిషి భార్యతో పోట్లాడి తిండి తినకుండా బయటికి వచ్చాడని కనిపెట్టేది ఆమె చెప్పే విషయాలు ఆచూకీ తీసినప్పుడల్లా రుజువవుతూనే ఉండేవి ఈ విద్యతోనే చార్లీ పైకి రాగలిగాడు

కాలక్రమాన చార్లీ తల్లిమనసు చలించసాగింది, ఒకనాడు చార్లీ ఇంటికి వచ్చేసరికి ఇల్లు బావురుమంటోంది తల్లిని ఆస్పత్రికి చేర్చారని తెలిసింది అన్న సిడ్నీ అంతకు పూర్వమే ఆఫ్రికా వెళ్ళిపోయాడు చార్లీ ఒంటరిగాడైపోయి, వీధులపాలై తిరిగాడు ఈ రోజుల్లో అతను కొవెంట్ గార్డెన్ షాపులో పనివాడుగా పనిచేశాడు వీధినృత్యాలుచేశాడు లుడ్‌గేట్ సర్కస్‌లో కాగితం పడవలు అమ్మాడు మంగలి దుకాణాల్లో సబ్బురాసే పని చేశాడు పార్కులోనో, మార్కెట్ లోనో పడుకుంటూండేవాడు ఈ కాలంలో ఇతని అనుభవాలు కొన్ని ''కిడ్'' అనే చిత్రంలో చిత్రించబడ్డాయి

తిరిగి అతని స్టేజిజీవితం ఏ తేదీన ప్రారంభమయిందీ చెప్పటం సులభంకాదు కాని 15 జనవరి 1900లో లండన్ హిపొడ్రోమ్ థియేటర్లో 'గిడీబస్టెండ్' అనే నాటకంలో అతను వేషం వేసినట్టు దాఖలావుంది అప్పటి కతనికి పదేళ్ళు ఈ నాటకంలో అతని నటనను బాగా మెచ్చుకున్నారు అతనికి నాటకాలు అచ్చివచ్చాయి, చేతి కర్రతోసహా తిరగసాగాడు తల్లిని పిచ్చి ఆసుపత్రినుంచి బయటికి తెప్పించి చికిత్స చేయించాడు కాని ఆమెకు మతి తిరిగిరానేలేదు

మూడేళ్ళపాటు అతని సంపాదన నిలకడగావుంది ''షెర్లాక్ హోమ్స్'' నాటకంలో అతను బిల్లీ అనే ఆఫీసు కుర్రాడిపాత్ర ధరించి ఊరూరాజరిగే ప్రదర్శనాలలో పాల్గొంటూ వచ్చాడు ఈ నాటకంలో షెర్లాక్ హోమ్స్ పాత్రను సెయింట్స్ బరీ అనే ఆయన ధరించేవాడు ఇదే పాత్రను అమెరికాలో ప్రసిద్ధంగా ధరించే విలియం గిలెట్ అనే ఆయన ఈ నాటకమే ఆడటానికి లండన్ వచ్చి నప్పుడు అందులో ''బిల్లీ'' పాత్రకు చార్లీ అరువివ్వబడ్డాడు

ఈ నాటకాన్ని చూడడానికి ఒకనాడు ఏడవ ఎడ్వర్డ్ రాజూ, అలెగ్జాండ్రా రాణీ, గ్రీస్ దేశపురాజూ వచ్చారు నటులెవరూ ఈ రాచవారికేసి చూడరాదని ఆంక్ష కాని చార్లీ కళ్ళు అటువేపే మళ్లాయి హాలంతా నిశ్శబ్దమయిపోయింది ఆ నిశ్శబ్దంలో ఎడ్వర్డ్‌రాజు నవ్వు వినిపించింది చార్లీ చీవాట్లు తిన్నప్పటికీ, మహారాజును నవ్వించానన్న సంతృప్తిపొందాడు

గిలెట్ తనని అమెరికాకు తీసుకుపోతాడేమోనని చార్లీ ఆశించినట్లయితే ఆశా

భంగమయింది అతని వయసు ఎటూ కానిది కావటంచేత నాటకాలలో అవకాశాలు దొరక లేదు దారిద్ర్యం మళ్ళా ప్రత్యక్షమయింది గ్లాస్‌ఫాక్టరీలో పని చేయబోయి చేయి కాల్చు కున్నాడు ఒక్కరోజుతో ఆపని అయిపోయింది మళ్ళా స్టేజినే ఆశ్రయించి దొరికిన చిల్లరవేషం వేస్తూవచ్చాడు

ఇలా ఉండగా చాప్లిన్‌కు ''కేసీజ్ కోర్ట్ సర్కస్'' అనే హాస్యనాటికలో నటించే అవకాశం వచ్చింది ఇది నాలుగు రోజులపాటు ఉండే ఉద్యోగం కాని ఉత్తమ నటుడుగా పైకివద్దామను కుంటున్న చాప్లిన్‌కు ఆశాభంగం కలిగింది కాని ఈ నాటకం ప్రదర్శనలు జరుగుతున్న కాలంలో ఇతనికి నటుడు కావాలనే ఉద్దేశం మారిపోయి కామెడియన్ (హాస్యగాడు) కావాలన్న తృష్ణ కలిగింది దానికొరకు కృషిచేయసాగాడు

దీనితోబాటు చాప్లిన్ మరొక విద్యకూడా నేర్చుకున్నాడు మూకాభినయం ఇది ఎలా జరిగిందంటే ఒకసారి చాప్లిన్ చానెల్ దీవులలో నటిస్తున్నాడు అతని హాస్య సంభాషణలకు ప్రేక్షకులు కొంచెమైనా నవ్వటంలేదు కారణం త్వరలోనే తెలుసుకున్నాడు ఆ ప్రేక్షకులకు ఇంగ్లీషు భాష రాదు అప్పుడతను మూకాభినయం (పాంటొమీమ్) ప్రారంభించి వారిని నవ్వించగలిగాడు ఈనాటికీ చాప్లిన్ నటనలో ఈ మూకాభినయానికి చాలా ప్రాముఖ్యం ఉంది

ఈ లోపుగా చార్లీ అన్న సిడ్ (సిడ్నీ) చాప్లిన్‌కూడా స్టేజీ నటుడై ఫ్రెడ్‌కార్నో కంపెనీలో నౌకరీ సంపాదించాడు ఫ్రెడ్‌కార్నో అనే ఆయనకింద పేరుబడిన మ్యూజిక్ హాల్ ట్రూప్ ఉండేది సిడ్నీ, కార్నోగారికి తన తమ్ముణ్ణి గట్టిగా శిఫార్సుచేశాడు చార్లీ ఈ కంపెనీలో ఎప్రెంటీస్‌గా తీసుకోబడి త్వరలోనే కార్నోగారి అభిమానానికి పాత్రుడైనాడు చార్లీ నటనకు ఈ కంపెనీ అనుభవం మాంచి ఉక్కుపునాదిలా పనికివచ్చింది రకరకాల హాస్యాలూ, మూకాభినయమూ ఈ కంపెనీలో చార్లీ నేర్చుకున్నాడు

ఈ కంపెనీవారు ''జిమీ ది ఫియర్‌లెస్'' అనే నాటకం ప్రదర్శించబోయేటప్పుడు ఇందులో ప్రధానపాత్ర ధరించే అవకాశం చాప్లిన్‌కు వచ్చింది, కాని అతను ధైర్యంచాలకనో ఏమో, తటపటాయించాడు ఆ అవకాశం కాస్తా ఆర్థర్ స్టాన్లీ జెఫర్సన్ అనే అతనికి దక్కింది (ఈయన మీస్టాన్ లారెల్–లారల్‌హార్డీ జంటలో సన్నటివాడు) ఈ అవకాశం పోగొట్టుకు న్నందుకు చాప్లిన్ చాలా విచారించాడు అయినా కొద్దికాలానికే ఆ అవకాశం అతనికి రానేవచ్చింది కార్నోగారు జెఫర్సన్‌కు మరో నాటకంలో మరో పాత్ర ఇచ్చి బదలాయించారు

చార్లీ అభివృద్ధిలోకి వచ్చాడు మంచి భవంతిలో భాగం అద్దెకు తీసుకుని, టర్కీతివాసీలు పరిచాడు, ఎర్రదీపాలు అమర్చాడు, ఈ రోజుల్లోనే అతనికి ''ప్రథమ జ్వాల'' కూడా సోకింది

ఆ అమ్మాయి పేరు హెటీకెల్లీ ఆమె నటి అంతేగాక ఆమె సోదరుడు చార్లీ అనుచరులలో ఒకడు చాప్లిన్‌కు పందొమ్మిదో ఏడు, షోకిల్లాలాగా దుస్తులు ధరించేవాడు కాని అమిత బిడియం కెనింగ్టన్ గేటుదగ్గిర బీటువేసేవాడు ఆమె అక్కడ ట్రాం దిగేది ఏపార్కుకో, టీస్టాల్‌కో వెళ్ళేవాళ్ళు చార్లీ ఆమెతో గడిపే జీవితంగురించి కలలు కనేవాడు ఆమె మట్టుకు అతన్నిగురించి

పెద్దగా కలలుకన్నట్టు కనబడదు చివరకామె ఒక ధనికుణ్ణిచూసి పెళ్ళాడేసింది ఆ సమయంలో చాప్లిన్ అమెరికాలో రెండుచేతులా సంపాదిస్తున్నాడు

కార్నో కంపెనీ ఇంగ్లండులోనేగాక యూరప్ అంతటా ప్రదర్శనలిచ్చేది చాప్లిన్ పారిస్‌లోని ప్రసిద్ధ నాటకశాలలో నటించాడు రైలుప్రయాణాలు చేసేటప్పుడు అందరూ కులాసాగా పేకాటలు ఆడుతుంటే చాప్లిన్ ఒంటరిగా కూచుని విచారంగా రైలు కిటికీలలోనుంచి బయటికి చూస్తూండేవాడు అతనికి తాగుడంటే అసహ్యం తండ్రి తాగుడుతో చనిపోవటమే దీనికి కారణం

1910లో ఫ్రెడ్‌కార్నోగారి రెండవ కంపెనీ అమెరికాకు పయనమయింది ఈ కంపెనీలో చాప్లిన్‌కూడా ఉన్నాడు అప్పటికి చాప్లిన్21 ఏళ్ళ వయసువాడు ఈ ప్రయాణం చాప్లిన్ జీవితాన్ని పూర్తిగా మార్చివేసి చరిత్ర తుల్యంగా పరిణమింపజేసింది ఈ సంగతి తనకు తెలిసిన వాడులాగే ప్రవర్తించాడు చాప్లిన్ పడవ బ్రిటన్ తీరం వదిలింది లగాయతు అతను ఎవరితోనూ మాట్లాడ లేదు ఏదో దీర్ఘాలోచనచేసేవాడు అమెరికాలో తన జీవితం ఫలోన్ముఖం కాబోతుందని అతని దృఢనమ్మకం న్యూయార్క్‌తీరం కంటపడగానే అతను చెయ్యి ఎత్తి, అందరూ వినేలాగ, ఉపన్యాస ధోరణిలో, ''కాచుకో, అమెరికా! నేను నిన్ను జయించటానికి వస్తున్నా!'' అని అరిచాడు

చాప్లిన్ అమెరికానే కాదు, ప్రపంచాన్నే జయించాడు కాని ఈ విజయానికి అంకురార్పణ కావటానికి ముందు మూడేళ్ళపాటు ఫ్రెడ్‌కార్నో కంపెనీవెంట అమెరికా అంతటా పర్యటిస్తూ చెమట ఓడ్చి కృషిచేయటం జరిగింది

*కినిమా, మాసపత్రిక, జూన్ 1954*

# 4. చార్లీ చాప్లిన్ - తొలి చిత్రాలు

చార్లీ చాప్లిన్ కొత్తగా సినిమాలలో అడుగుపెట్టినప్పుడు అతనితో సంబంధంగల ప్రతిఒక్కరూ, అతను సినిమాలలో ప్రవేశించటానికీ, పైకిరావటానికీ తామే కారకులైనట్టు తరువాత చెప్పుకున్నారు ఇంగ్లండుకు చెందిన కార్నోకంపెనీ లాస్ ఏంజెలిస్ నగరంలో ప్రదర్శన లిచ్చినప్పుడు చాప్లిన్‌ను చాలామంది సినిమాలవాళ్ళు చూశారు వీరిలో మాక్ సెనెట్ అనే ఆయన ఒకడు ఈయన కీస్టోన్ కంపెనీ నడుపుతూ సినిమా చిత్రాలు తీసేవాడు ఈయన కెనడా దేశస్తుడు సినిమా హాస్యానికి గొప్ప దోహదం చేసినవాడు ఈయనకింద చాలమంది హాస్య గాళ్ళుండేవారు వీళ్ళతో ఆయన ఒకటి, రెండు రీల్సువి హాస్య చిత్రాలు తీస్తూండేవాడు

కీస్టోన్ కంపెనీలోగల హాస్యనటులలో అగ్రగణ్యుడు ఫోర్డ్ స్టెర్లింగ్ అనేవాడు 1913 మధ్యలో ఈ ఫోర్డ్ స్టెర్లింగ్ తనకింకా పెద్దజీతం ఇవ్వాలనీ, లేకపోతే వెళ్ళిపోతాననీ పేచీ పెట్టసాగాడు ఇతని స్థానంలో చార్లీ చాప్లిన్‌ను తీసుకోమని మాక్ సెనెట్‌కు ఎవరో సూచన చేశారు మాక్ సెనెట్‌కు చాప్లిన్‌పై అభిమానం ఉన్నది అందుచేత ఈ సూచనను ఆమోదించాడు

ఆ రోజులలో చాప్లిన్‌కు స్టేజిమీద నటించినందుకు వారానికి 12 పౌను లిచ్చేవారు సినిమాలలో తాను ఎంత వరకు పైకి రాగలుగుతాడో చాప్లిన్‌కే అనుమానం అయినా వారానికి 38 పౌనుల జీతంచూసి భయపడుతూనే అంగీకరించాడు

ఈ సమయంలో అమెరికాలోని సినిమా పరిశ్రమ అల్లకల్లోలస్థితిలో ఉన్నది విదేశీ సినిమాలు తీవ్రంగా పోటీ చేస్తున్నాయి కొత్త కంపెనీలు బయలుదేరి దీర్ఘ చిత్రాలు తీయనారంభించాయి మాక్ సెనెట్‌కు గల ఆకర్షణ కేవలమూ హాస్యనటులూ, ఆకర్షణగల బేతింగ్ బ్యూటీలూనూ ఫోర్డ్ స్టెర్లింగ్, మెబెల్ నార్మాండ్, ఫాటీ ఆర్బకిల్, మాక్‌స్వేన్, మేరీ డ్రెస్లర్, టామ్‌కెనడీ, చార్లీముర్రే, స్లిమ్ సమర్విల్, చార్లీ చేజ్, పోలీ మొరాన్, గ్లోరియా స్వాన్సన్, హారీ లాంగ్డన్, కెరోల్ లొంబార్డ్ మొదలైన ప్రసిద్ధులు మాక్ సెనెట్ ద్వారా పైకి వచ్చారు కొత్తగా టాకీలు వచ్చినకాలంలో, మూడు పెద్ద స్టూడియోలచే నిరాకరించబడిన బింగ్ క్రాస్బీనికూడా మాక్ సినిమాలలో ప్రవేశపెట్టాడు

మాక్ సెనెట్ పెద్ద సంస్కారంగాని చదువుగాని కలవాడుకాడు అయితే అతనికి హాస్యం యొక్క రహస్యం తెలుసు అతని చిత్రాలలో హాస్యసన్నివేశాలు వాయువేగంతో ఒకదాని వెంబడి ఒకటి వచ్చిపడేవి వెర్రి ఊహలూ, విడ్డూరమైన దుస్తులూ, వేగమూ, ఉపద్రవకర సంఘటనలూ మొదలైనవి ఆధారం చేసుకుని, కామెరా ట్రిక్‌లు ఉపయోగిస్తూ, కథా స్క్రిప్టూ లేకుండా, ఏ లాండ్రీయో, హోటలో, పార్కో, మరేదో వాతావరణంగా ఉపయోగించి మాక్ సెనెట్ హాస్య చిత్రాలు తీసేవాడు తరువాత చాప్లిన్ తన చిత్రాలలో మాక్ సెనెట్ పద్ధతులు చాలా అనుసరించాడు, వాటికి తన పద్ధతులను జోడించాడు

ఈయన కంపెనీలోకి అడుగుపెట్టేసరికి చార్లీ చాప్లిన్ కేవలం 24 ఏళ్ళ యువకుడు మాత్రమేనన్నది చూసి చాలా మంది ఆశ్చర్యపోయారు ఏమంటే అతను స్టేజీమీద ఇంకా ఎక్కువ వయసుగల పాత్రలు ధరించగా వారు చూశారు సినిమా రంగంలో చాలా కాలంగా పనిచేస్తున్న వారి అసూయకు చాప్లిన్ గురికావలసివచ్చింది అతనిని ఒక పురుగు కింద చూసినవారిలో మేబెల్ నార్మాండ్ ఒకతె చాప్లిన్ మొదటి చిత్రంలో ఆమె నటించ నిరాకరించిందికూడా

ఈచిత్రం పేరు ''మేకింగ్ ఎ లివింగ్'' ఇది ఒక రీల్ చిత్రం ఇందులో చాప్లిన్ వెంబడి అర్బకిల్, స్వేన్ – ఇద్దరూ లావాటివాళ్ళే – నటించారు ఈ చిత్రంలో చాప్లిన్ జగత్ప్రసిద్ధమైన ''ట్రాంప్'' దుస్తులు ధరించలేదు అవి అతని రెండవ చిత్రంలో ప్రారంభమయ్యాయి

చాప్లిన్ నటించిన ఈ తొలిచిత్రం చూసి సెనెట్ దీనికి డబ్బురాదన్నాడు కాని 1914లో విడుదల అయినప్పుడు దీనికి బాగానే డబ్బు వచ్చింది

చాప్లిన్ నటించిన రెండో చిత్రం ''కిడ్ ఆటో రేసెస్ ఎట్ వెనిస్ '' ఇందులో నటించటానికి చాప్లిన్‌ను నవ్వొచ్చే దుస్తులు ధరించమన్నారు చాప్లిన్ తన చేతికందినవాటిలో విడ్డూరంగా ఉండేవి – ఆర్బికిల్ ధరించే పాంటూ, ఫోర్డ్ స్టెర్లింగ్ ధరించే బూటులూ, చాలీ చాలని కోటూ,

చౌలర్ టోపీ – తీసి ధరించాడు మాక్ స్వేన్ ఉపయోగించే మీసాలు గొంగళిపురుగు ప్రమాణంలో కత్తిరించి పెట్టుకున్నాడు చేతికర్ర ఒకటి సంపాదించాడు పాంటు చాలా వొదులయింది బూట్లు కూడా వొదులే అవి కాళ్ళకు బిగుతుగా ఉండగలందులకై ఒక కాలిది మార్చి మరొకకాలికి తొడిగాడు ఈ ఆహార్యం కాలక్రమాన జగత్ప్రసిద్ధి సంపాదించి, దాదాపు 70 చిత్రాలలో చాప్లిన్‌కు ఉపయోగపడింది ఈ చిత్రంలో చాప్లిన్ చెయ్యవలసిన పని ఏమంటే, రేసెస్‌ను ఎవరో ఫిలిం తీస్తుంటే చాప్లిన్ కామెరాకు అడ్డువస్తాడు గుర్రాలు పరుగెత్తే దారిలోకి పోతాడు వాళ్ళనూ వీళ్ళనూ ఢీకొంటాడు అందరితోనూ జగడమాడతాడు

మూడవ చిత్రం, ''మేబెల్స్ స్ట్రేంజ్ ప్రెడికమెంట్'' అనేదానిలో చాప్లిన్ ఒక కొత్త విద్య ప్రదర్శించాడు అతను పరిగెత్తుతూ మలుపు తిరిగేటప్పుడు ఒక కాలు పైకెత్తి రెండవ కాలిమీద జారుతూ, టోపీతీసి చేతిలో పట్టుకుని వెనక్కు తిరిగిచూస్తూ పోతాడు మొదటిసారి చాప్లిన్ ఈ విద్య ప్రదర్శించినప్పుడు షూటింగ్ వద్ద ఉన్న వారంతా ఒకే విధంగా పగలబడి నవ్వారు త్వరలోనే చాప్లిన్ హాస్యం పత్రికల వారికి వ్యసనమై పట్టుకుంది ''చాప్లిన్‌కు సాటిలేదు'' అని వారు రాయసాగారు అది మొదలు చాప్లిన్ వారానికొక చిత్రంలో నటించసాగాడు.

ఈచిత్రంలో— తరువాత యింకా అనేక చిత్రాలలోనూ –చాప్లిన్ ధరించిన దుస్తులు దారిద్ర్యం వాతపడిన ధాష్టీకాన్ని సూచిస్తాయి చేతికర్రా, మీసాలూ అతిశయ చిహ్నాలు, వొదులైన లాగూ, బూట్లూ, చాలని కోటూ, టోపీ దారిద్ర్యాన్ని సూచిస్తాయి చాప్లిన్ వేషమూ, కీర్తి దిగంతాలకు పాకిన కొద్దీ అతని అనుచరులకు అతని మీద అనురాగం కూడా పెరిగింది మొదట అతన్ని గడ్డిపోచలాగా చూసిన మేబెల్ నార్మాండ్ సహితం కాలక్రమాన చాప్లిన్‌కు ఆప్త స్నేహితురాలయింది

ఈ స్నేహానికి ఒకే ఒక అంతరాయం కలిగింది ఒక చిత్రంలో చాప్లిన్ మేబెల్‌ను వెనక ఎక్కించుకుని మోటార్ సైకిల్ నడపవలసి వచ్చింది ''నీకు మోటార్ సైకిల్ నడపటం చాతనవునుగదా?'' అన్నాడు సెనెట్ చాప్లిన్‌తో, ''నాకు సైకిల్ నడపటం రాకేం? దానిమీద లండన్ యావత్తూ తిరిగేవాణ్ణి,'' అన్నాడు చాప్లిన్ కామెరాలు సిద్ధంగా ఉన్నాయి చాప్లిన్ మోటార్ సైకిల్ ఎక్కాడు అతని వెనక మేబెల్ ఎక్కికూచుంది చాప్లిన్ బండి స్టార్ట్ చేసి హాలీవుడ్ కొండను వాయువేగంతో దిగసాగాడు అతనికి మోటార్ సైకిల్‌ను అదుపు చెయ్యటం చాతకాదని తేలిపోయింది మేబెల్ ప్రాణాలు ఎగిరిపోతూ చాప్లిన్‌ను గట్టిగా పట్టుకుంది చాప్లిన్ ఏం చెయ్యాలో తెలియక తడుపుకోసాగాడు సైకిల్ కొండదిగి వచ్చాక ఇద్దరూ సైకిలు మీదుగా ఎగిరి ఒక కందకంలో పడిపోయారు అదృష్టవశాత్తూ ఎవరికీ దెబ్బలు తగలలేదు ఆ దెబ్బతో ఆమె చాప్లిన్‌తో చాలా రోజులు మాట్లాడలేదు

మేబెల్ చాలా అందగత్తె చురుకుతనంగలది ఆమెతో సన్నిహితంగా ఉన్న కాలంలో చాప్లిన్‌పై ఆమె ప్రభావం అపరిమితంగా ఉండేది కాని ఆమెకు కాలం కలసిరాలేదు ఒక హత్య కేసులో ఆమె ఇరుక్కున్నది స్త్రీలక్లబ్బులు ఆమె చిత్రాలను బహిష్కరించాయి చివరకు ఆమె

చిత్రాలలో నటించటం మానుకున్నది చివరకు క్షయవ్యాధికి గురిఅయి 1930లో చనిపోయేటప్పుడు కూడా ఆమె హాస్యసంభాషణ చేస్తూనే మరణించింది

మేబెల్ మినహాయిస్తే కీస్టోన్ నటులందరూ పైకివచ్చి కీర్తి, డబ్బూ గడించారు వారందరూ సినిమాలకు పనికిరాడని జోస్యం చెప్పిన చార్లీ చాప్లిన్ అందరికన్నా పైకి వచ్చాడు దీనికోసం అతను తన కళను శ్రద్ధగా అభివృద్ధి చేసుకుంటూ, కొత్త విషయాలు నేర్చుకుంటూ చాలా శ్రమ పడ్డాడు ఈ శ్రమ ఫలించింది అతని కీర్తి ప్రపంచమంతా చుట్టివచ్చింది అయితే ఎండ ఉన్న చోట నీడ కూడా ఉన్నట్టుగా అతని అభ్యంతర జీవితంలో ప్రతి చిన్న రహస్యమూ ప్రపంచం దృష్టికి గురిఅయి, చాప్లిన్ శత్రువుల విమర్శలకు తీవ్రంగా గురికావటం కూడా జరిగింది

1914 పూర్తి అయ్యేలోపుగానే చార్లీ చాప్లిన్ కీర్తి హాలీవుడ్ అంతటా పాకింది మాక్ సెనెట్ వద్ద నుంచి అతనిని కాజెయ్యాలని ఇతర నిర్మాతలు చాలా తహతహలాడుతున్నారు ఈసంగతి పసికట్టి కీస్టోన్ స్టూడియో బయట పహరావాళ్ళని పెట్టి వాళ్ళని లోపలికి అడుగుపెట్టకుండా మాక్ సెనెట్ కట్టుదిట్టాలు చేశాడు

కాని ఈ ప్రయత్నాలేమీ పనిచేయలేదు కీస్టోన్ కంపెనీ తయారు చేస్తున్న ఒక చిత్రంలో ఎక్స్ట్రావేషం వేయటానికి ఒకడు వచ్చాడు ఇతను ఎసెనే కంపెనీ గూఢచారి ఇతను చాప్లిన్ చెవిలో గుసగుసలాడాడు చాప్లిన్ మాక్ సెనెట్‌ను వొదిలేసి ఎసెనేకంపెనీలో చేర నిర్ణయించాడు ఎసెనే కంపెనీవారు చాప్లిన్‌కు వారానికి 310పౌనులకు పైగా ఇవ్వటానికి ఒప్పుకున్నారు మాక్ సెనెట్ దగ్గిర చాప్లిన్‌కు ముట్టినది ఇందులో రమారమి పదోవంతు మాత్రమే

1915 జనవరిలో చాప్లిన్ మాక్ సెనెట్‌కు వీడ్కోలు చెప్పాడు చాప్లిన్ కీస్టోన్ కంపెనీలో ఒక సంవత్సరం పాటు పనిచేసి 35 చిన్న చిత్రాలూ ఒక దీర్ఘ చిత్రమూ తయారు చేశాడు మొదటి కొద్ది చిత్రాలుతప్ప మిగిలినవన్నీ చాప్లిన్ స్వయంగా డైరెక్టు చేశాడు చిత్రనిర్మాణంలో అతనికి పూర్తి స్వాతంత్ర్యం ఉండింది చార్లీ తయారుచేసిన దీర్ఘ చిత్రం ''టిల్లీస్ పంక్చర్డ్ రొమాన్స్'' ఇందులో మేరీ డ్రెస్లర్ అనే సుప్రసిద్ధ హాస్యనర్తకి ప్రధాన పాత్ర ధరించింది ఈ చిత్రం 1914లో విడుదల అయి చాప్లిన్ ఖ్యాతిని ఎంతో విస్తరింపజేసింది అన్ని వర్గాల ప్రేక్షకులకూ ఇది వినోదం అందించి అమెరికన్ హాస్యానికి గీటురాయిగా భాసించింది

కినిమ్మా, మాసపత్రిక, జూలై 1954

# 5. హాలీవుడ్‌లో చాప్లిన్ అభ్యుదయం

1915 జనవరిలో చార్లీ చాప్లిన్ ఎసెనేకంపెనీలో వారానికి 310 పౌన్లు (సుమారు 4 వేల రూపాయలు) జీతం మీద ప్రవేశించాడు మాక్ సెనెట్ కంపెనీలో అతనికి మంచి నటులుండేవారు కాని ఇక్కడ ఆ సౌకర్యం లేదు అందుచేత చాప్లిన్ ముందుగా కొందరు నటులనూ టెక్నీషియనులనూ పోగుచేశాడు (వీరిలో చాలామంది యావజ్జీవం చాప్లిన్‌తోనే వుండిపోయారు)

ఒక పార్టీలో చాప్లిన్‌కు ఎడ్నా పర్వియాన్స్ అనే పిల్ల తటస్థపడింది ఈమె అందగత్తె వయసు 21 ఈమె తండ్రి నెవేడాకు చెందిన గని కార్మికుడు ఈమె షార్ట్ హాండ్ టైపిస్టు పని చేసుకుంటున్నది ఆమెకు స్టేజి అనుభవంగాని సినిమా అనుభవంగాని లేదు అయినా చాప్లిన్ ఈమెను చేరదీసి తనకు అవసరమైనట్టుగా తయారు చేసుకున్నాడు చాప్లిన్ తీసిన చిత్రాలు చాలావాటిలో ఈమె నటించింది వీరిద్దరూ జీవితంలోకూడా చాలా అన్యోన్యంగా వుండేవారు చాప్లిన్ ఆమెను వివాహం చేసుకుంటాడని కూడా అనేకమంది భావించారు అయితే అది జరగలేదు

1915 లో చాప్లిన్ ఎసెనే కంపెనీలో పనిచేస్తూ 14 చిత్రాలు తీశాడు వీటి నిర్మాణం గురించి అతను పూర్వం ఎన్నడూ తీసుకోని శ్రద్ధ తీసుకోవటమే కాకుండా వీటిశిల్పంలో కొత్త అంశాలు – కరుణరసం, వ్యంగ్యధోరణి, అనుకోని కథా పరిణామాలూ, అలౌకిక సంఘటనలూ, ధ్వనీ – ప్రవేశపెట్టాడు ''ఎ వుమన్'', ''కార్మెన్'' ''ది బాంక్'' చిత్రాలలో ఈ అంశాలున్నాయి

చాప్లిన్ ఎసెనే కంపెనీలో చేరిన మూడు మాసాలకు ''ది ట్రాంప్'' అనే చిత్రం విడుదల అయింది దీనిని తయారు చేయటానికి మూడు వారాలు పట్టింది చాప్లిన్ తయారుచేసిన చిత్రాలలో ''క్లాసిక్'' ( అత్యుత్తమ కళాఖండం) గా పేర్కొనదగినవాటిలో ఇది మొదటిదిగా భావించబడుతున్నది కూడానూ అప్పటికి విషాదాంత చిత్రమన్నది ఎవరూ కనలేదు వినలేదు

ఈ చిత్రంలో ''ట్రాంప్'' ( తిరుగుబోతు) పాత్రను చార్లీ ధరించాడు ఇతను ఒక పిల్లను దొంగల బారినుంచి రక్షిస్తాడు దీనికి బహుమానంగా ఆమె తండ్రి అతనికి నౌకరీ ఇస్తాడు కొన్ని రోజులు ఇతనికి ఆనందంగా గడుస్తాయి ఇంతలో ఆపిల్ల ప్రియుడు – అందగాడు – ఎక్కడినుండో దిగుతాడు అంతటితో తిరుగుబోతు పగటికలలు భగ్నమవుతాయి అతను మూటసర్దుకుని వెళ్ళిపోతాడు దీర్ఘమైన బాటవెంబడి నడుచుకుంటూ దిఙ్మండలం కేసిపోతూండగా చిత్రం ఫేడౌట్ అవుతుంది తరువాత మరికొన్ని చిత్రాలనుకూడా చార్లీ ఇదేవిధంగా అంతంచేశాడు

చాప్లిన్‌కు కరుణరసం స్వతహాగా ఇష్టంలేదు జీవితమే విచారమయం కాని కరుణలో సౌందర్యం ఉన్నది ఆ సౌందర్యంకొరకే చాప్లిన్ కరుణను చిత్రాలలో ఉపయోగిస్తాడు

1915 ఆఖరున చాప్లిన్‌కోసం ఇతర కంపెనీలు పోటీ పడ్డాయి ఈ పోటీలో ఎసెనే కంపెనీవారు చాప్లిన్‌కు లాభాలలో భాగం ఇస్తామనీ, అతనివంతు 1,25,000 పౌనులు ( దాదాపు 16న్నర లక్షల రూపాయిలు) తగ్గకుండా పూచీపడతామనీ అన్నారు ఈ సమయానికి చాప్లిన్ అన్న సిడ్ నాటకాలను మానేసి చార్లీ వ్యవహారాలు చూడసాగాడు ఎసెనే కంపెనీ ఇస్తామన్న మొత్తానికి సిడ్ ఒప్పుకోలేదు అందుచేత 1916 ఫిబ్రవరి 26న చార్లీ మ్యూచువల్ కంపెనీలో చేరాడు ఈ కంపెనీలో ఇతని జీతం వారానికి 2,500 పౌనులు(32న్నరవేల రూపాయలు) ఇదికాక ఏడాదిచివర 37,500పౌనులు బోనస్. చాప్లిన్ సాలుసరి సంపాదన

1,67,500 పౌనులు ( దాదాపు 22 లక్షల రూపాయలు)

మరోసారి చార్లీజీతం పదింతలు పెరిగింది అతని వయస్సు అప్పటికి 26 ఏళ్ళు, మూడేళ్ళక్రితం సినిమా ప్రపంచంలో అతనిపేరు విన్నవారు లేరు అదీ జాతకమంటే

ఈ కాంట్రాక్టుమీద సంతకంపెట్టి చాప్లిన్ –''ఇంతకంటె ఎక్కువ లేకపోతే పోనీ, ఇదైనా ఇస్తున్నారు ఇప్పుడే వెళ్ళి డజను నెక్ టైలన్నా కొనుక్కుంటాను'' అన్నాడు

చిత్రమేమంటే ఇంత డబ్బువచ్చినా చాప్లిన్ మనస్తత్వంలోగాని అతని నటనలోగాని దాదాపు మార్పేమీ కలగలేదు ఎప్పటిలాగే షోకిల్లా దుస్తులు ధరించాడు లాస్ ఏంజలిస్‌లోని స్ప్రింగ్ స్ట్రీట్‌లో ఉన్న స్టావెల్ హోటల్ గదిలోనే ఉంటూవచ్చాడు సెట్టుమీద ఉన్నప్పుడు తప్ప మనుషులను తప్పించుకు తిరిగేవాడు సినిమాకారులు చేరే చోట్లు వర్జించేవాడు రాత్రిళ్ళు పేదపేటలు కలయతిరిగేవాడు

చివరకు ఇతరుల ప్రోద్భలంమీద చాప్లిన్ లాస్ ఏంజెలిస్ ఎథ్లెటిక్ క్లబ్బుకు బసమార్చాడు అన్న ప్రోద్భలం మీద ఒక కారుకొని, టామ్‌హారింగ్టన్ అనే సెక్రటరీని పెట్టుకున్నాడు కోనో అనే జపానువాడు కారుడ్రైవరుగా చాప్లిన్‌కు కుదిరాడు ఈ కోనో 18 సంవత్సరాలపాటు చాప్లిన్‌వెంటే ఉండి, చాప్లిన్‌కు డ్రైవరుగా, అంగరక్షకుడుగా, సెక్రెటరీగా, నౌకరుగా పనిచేశాడు పాలెట్ గొడార్డ్ చార్లీని పెళ్ళాడి, కోనోకు ఉద్వాసనచెప్పి అతని స్థానం తానే ఆక్రమించుకున్నది

1916,1917 సంవత్సరాలలో చాప్లిన్ కళ ఇంకా పరిణామం చెందింది 18 నెలల కాలంలో అతను మూచువల్ కంపెనీ తరఫున12 హాస్యచిత్రాలు చచ్చులేనివి తయారుచేశాడు

చిత్రంకోసం కొత్తఐడియాలు ఆలోచించేటప్పుడు చాప్లిన్ చాలా కంగారులో ఉండేవాడు తనశక్తులు చల్లారిపోయాయని అతనికి భయం కలిగేది ''నాపని అయి పోయింది'' అనుకొనేవాడు కాని ఐడియాలవే వచ్చేవి మూచువల్ కంపెనీలో చేరగానే చాప్లిన్‌కు ఇలాటి అనుభవం కలిగింది స్టూడియోపని ప్రారంభించటానికి సిద్ధంగా ఉంది నటులు అంతకన్న ఆత్రంగా ఉన్నారు కాని చాప్లిన్ బుర్రలో ఐడియాలేదు ఎన్నోరోజులు గడిచాయి కాని చాప్లిన్ బుర్రలో ఏమీ కదలికలేదు

న్యూయార్కులోని డిపార్ట్‌మెంటుస్టోర్ ఎస్కలేటర్( కదిలేమెట్లు) మీద జారిపడిన మనిషిని చాప్లిన్ చూశాడు బుర్ర వెంటనే కదలింది చాప్లిన్ హాలీవుడ్‌కు తిరిగివచ్చి డిపార్ట్‌మెంట్ స్టోర్ సెట్టు వెయ్యమని చెప్పాడు త్వరలోనే 'ఫ్లోర్ వాకర్' అనే చిత్రం తయారయింది దీని తరువాత 'దిరింగ్', 'ది ఇమిగ్రెంట్' మొదలైన చిత్రాలలో చాప్లిన్ తన పనితనం క్రమంగా అభివృద్ధి చేసుకోసాగాడు చాప్లిన్ ఈ చిత్రాలు చేస్తున్నకాలంలో ప్రపంచ ఖ్యాతి గల పురుషులెందరో చాప్లిన్‌ను చూడవచ్చారు మేధావులు సహితం చాప్లిన్ కళను కీర్తిస్తూ రాయసాగారు అతని కీర్తి ప్రపంచమంతటా ఏ విధంగా పాకిందీ తెలపటానికి ఒక సంఘటన చెబుతారు

1916లో నిజిన్‌స్కీ బాలే బృందం లాస్ ఏంజెలిస్‌కు వెళ్ళింది వారి ప్రదర్శనం చూడటానికి చాప్లిన్‌కూడా వెళ్లాడు ప్రేక్షకులలో చాప్లిన్‌ను పసికట్టగానే నృత్యం చేసేవారు ప్రదర్శనం మానేసి

చాప్లిన్‌ను తెర వెనక్కు పిలిపించుకున్నారు ప్రేక్షకులు అరగంటదాకా ప్రదర్శనం కోసం వేచి ఉండవలసి వచ్చింది

చాప్లిన్ కాంట్రాక్టు గడువు తీరాక మూచువల్ కంపెనీ వారు చాప్లిన్‌ను మరి 12 చిత్రాలు తీసిపెట్టమనీ, అందుకుగాను 10 లక్షల డాలర్లు (25 లక్షల రూపాయలు) ఇస్తామనీ అన్నారు చాప్లిన్‌కు ఖర్చులతో సంబంధం లేదు చాప్లిన్ దీనికి ఒప్పుకోక ఇంతకన్న ఆర్థికంగా తక్కువగా భావించదగిన ఎగ్రిమెంట్ చేశాడు ఫస్ట్ నేషనల్ సర్క్యూట్ అనే సంస్థ ఒకటి కొత్తగా ఏర్పాటయింది ఈ సంస్థవారు చాప్లిన్‌కు పది లక్షల డాలర్లు కాంట్రాక్టు ఇచ్చారు కాని ఇదంతా అతని జీతం కాదు ఈ కాంట్రాక్టుకింద తనకు స్వేచ్ఛ హెచ్చుగా ఉండటంచేత చాప్లిన్ దీనిపై సంతకం చేశాడు ఈ కాంట్రాక్టుప్రకారం స్టూడియో చాప్లిన్ సొంతం అతనే నిర్మాత కూడా 18 నెలలకాలంలో అతను 8 చిత్రాలు తీసేటట్టూ ఇందుకుగాను అతనికి 2,53,750 పౌనులు ముట్టేటట్టు ఏర్పాటు జరిగింది

హాలివుడ్‌లో లాబ్రియా ఎవెన్యూ, సన్సెట్ బూల్వార్డ్‌లు కలిసే చోట అయిదెకరాల స్థలాన్ని చాప్లిన్ సోదరులు స్టూడియో నిమిత్తమై కొన్నారు 1917 అక్టోబరులో దాని ఖరీదు 8,500 పౌనులు ఇవాళ 40 రెట్లుంటుంది ఆనాడది హాలీవుడ్‌కు ఒక చివరవుండేది ఇప్పుడది హాలీవుడ్ స్టూడియోల నట్టనడానవున్నది 1918 నుంచీ చాప్లిన్ ఇంతవరకు తీసిన చిత్రాలన్నీ ఇక్కడే తీయబడ్డాయి

ఇంతలో మొదటి ప్రపంచ యుద్ధంలో అమెరికా ప్రవేశించింది చాప్లిన్‌ను యుద్ధంలో చేరమంటూ అంతులేని ఉత్తరాలు –చాలాభాగం తిట్లతోసహా –వచ్చాయి. నిజానికి చాప్లిన్ సైనికుడుగా పనికిరాడు అతని ఎత్తు 5 అడుగుల 4 అంగుళాలు అప్పుడు అతని తూకం 100 పౌనులకులోపు అయినా తిడుతూ ఉత్తరాలురాసే వారికిది అంతగా పట్టలేదు అతను అంతులేని డబ్బూ, కీర్తి గడించటంవల్ల అసంఖ్యాకులకు కలిగిన కడుపుమంటే దీనికి కారణం

కొత్త కంపెనీకి కొద్ది ఫిలిములు తయారుచేసిన అనంతరం చాప్లిన్ యుద్ధరుణపత్రాల అమ్మక ప్రచారంకోసం రెండు మాసాలు పర్యటించాడు ఇతని వెంట డగ్లస్‌ఫేర్ బ్యాంక్స్, మేరీ పిక్‌ఫోర్డ్ ( భార్యా భర్తలూ, సినిమా తారలూ) కూడా పర్యటించారు వెళ్ళినచోటనల్లా డగ్లస్ ఫేర్ బ్యాంక్స్ –చాలా బలశాలి –చాప్లిన్‌ను బుజాలమీదికి ఎత్తుకుని ప్రేక్షకులకు ప్రదర్శించే వాడు అమెరికా అధ్యక్షుడు విల్సన్ వైట్‌హౌస్‌లో చాప్లిన్‌కు స్వాగతమిచ్చాడు వాషింగ్టన్ నగరంలో 65 వేల మంది ప్రేక్షకుల ఎదుట చాప్లిన్, మేరి డ్రెస్లర్‌తో నృత్యంచేశాడు అప్పటికప్పుడే యుద్ధబాండ్లు చురుకుగా అమ్ముడుపోయాయి

ఈ సందర్భంలో చాప్లిన్ దక్షిణ రాష్ట్రాలను ఒంటరిగా పర్యటించాడు ఇతని ప్రయత్నంవల్ల డిక్సీలో బాండ్లు బాగా అమ్ముడయ్యాయి న్యూ ఆర్లియన్స్‌కు చాప్లిన్ వెళ్ళినప్పుడే అక్కడికి మాజీ ఆర్థిక మంత్రి ఒకాయన బాండ్ల అమ్మకం ప్రోత్సహించే పనిమీదనే వెళ్ళాడు ''ఒక క్షుద్ర సినిమా నటుడి'' పేరుతో తనపేరును జతచేయనివ్వటానికి ఈ రాజకీయవేత్త

ఆమోదించకపోవటంవల్ల ఆయనా, చాప్లిన్ వేరువేరు సమావేశాలలో ప్రసంగించటానికి అధికారులు ఏర్పాట్లుచేశారు ఫలితం రాజకీయవేత్త ప్రసంగం వినటానికి 400 మంది వచ్చారు చాప్లిన్ మీటింగుకు 40,000 మాత్రమే వచ్చారు

*కినిమా, మాసపత్రిక, ఆగస్టు, 1954*

# 6. లోకోత్తరమైన చాప్లిన్ చిత్రాలు

మొదటి ప్రపంచ యుద్ధ మప్పుడు యుద్ధ బాండ్ల అమ్మకం కోసం చార్లీచాప్లిన్ చేసిన పర్యటనా, దర్శించిన ట్రెయినింగు క్యాంపులువృధాకాలేదు ఈ అనుభవంతోచాప్లిన్ 'షోల్డర్ ఆమ్స్' అనేచిత్రం 1918లో తీసాడు ఇంతకన్నా ఆర్భాటంగా తీసిన చిత్రాలుసయితం చెప్పని సత్యాలను యుద్ధం గురించి ఈచిత్రం చెప్పింది ఈ చిత్రంలో చాప్లిన్ అనేక విషయాలను ఉత్ప్రేక్షించాడు ఉదాహరణకు, నీళ్లలో మునిగి ఉన్న సైనికుల పడకలూ, నోట్లో గొట్టాలు పెట్టుకుని సైనికులు నీటిలోమునిగి పడుకుని ఊపిరిపీల్చడమూ, శత్రుసైనికులు పేల్చే తుపాకుల గుళ్ళకు సీసామూతులు విరిగేటట్టు పట్టుకోవటమూవగైరా అయితే యుద్ధంలో ఉండే ఉన్మాదం యావత్తూ ఈచిత్రంలో స్ఫురించింది

ఈ చిత్రం తీస్తుండగా చాప్లిన్ మొదటి వివాహం జరిగి విచ్ఛిత్తి కూడా జరిగిపోయింది 1919లో చాప్లిన్ రెండుచిత్రాలు తీసాడు ఆ రెండింటిలో ఒకటీ బాగాలేదు కాని1920లో మళ్లా 'కిడ్' చిత్రం తీయడానికి చాప్లిన్‌ను ప్రేరేపించినది జాకీకూగన్ అనే అయిదేళ్ల కుర్రాడు ఒక హోటల్లో ఈ కుర్రాడు చాప్లిన్‌ను చూసి కన్నుమలిపాడని చెబుతారు ఈ కుర్రవాడు తన తండ్రితో బాటు వెరైటీ ప్రదర్శనలలో నటిస్తుండేవాడు

తాను లండను గల్లీలలోగడిపిన బాల్యంతాలూకు జీవితాన్నిచాప్లిన్ 'కిడ్' చిత్రంలో చూపాడు ఈ చిత్రం తీయడానికి చాప్లిన్ ఖర్చుచేసినంత మొత్తం అదివరకే చిత్రానికీ ఖర్చుచేసి ఉండలేదు ఈచిత్రం నిర్మించటానికి దాదాపు సంవత్సరం పట్టింది 5 లక్షల అడుగులకుపైగా ఫిలిం ఎక్స్‌పోజ్‌చేసాడు చిత్రంపూర్తి అయాక ఫస్ట్‌నేషనల్ కంపెనీ నుంచి చాప్లిన్‌కు ఒకటిన్నర లక్షలపౌనులు ముట్టాయి, ఈచిత్రం గడించిన అంతులేని లాభాలలో చాప్లిన్‌వంతుమరి రెండున్నర పౌన్లు –మొత్తం4 లక్షలపౌన్లువచ్చింది

'కిడ్' చిత్రంలో హాస్యం మోతాదు, పాతచాప్లిన్ చిత్రాలలోకంటె ఒకవీసం తక్కువే ఉన్నప్పటికీ, ఈ చిత్రం పామరులనూ, విమర్శకులనూ కూడా గొప్పగా ఆకర్షించింది ఇందులో వినోదం ఉంది, విషాదం ఉంది, అన్నిటినీమించి కొత్తదనం ఉ ంది

ఫస్ట్ నేషనల్ వారికి చాప్లిన్ 8చిత్రాలు తయారుచేసేటట్టు కాంట్రాక్టు వీటిని త్వరగా పూర్తిచేద్దామనే ఉద్దేశంతో,చాప్లిన్ ''ఐడిల్‌క్లాస్'' అనే చిన్న చిత్రంతీసి, మూడోచిత్రానికి మూడునెలలు పనిచేశాడు సెట్లు తయారయాయి, ఒకనాటి ఉదయం (1921 ఆగస్టులో) లైట్లూ, కెమారాలు అన్నీ సిద్ధంచేసారు, కాని చాప్లిన్ జాడలేదు, ఆమర్నాడు రాత్రే చాప్లిన్ ఎవరికీ

ఏమీ చెప్పకుండా యూరప్‌కు ప్రయాణమయాడు!

ఈప్రయాణానికి ఒకకారణం, చాప్లిన్‌కు ప్రపంచఖ్యాతి లభించినప్పటికీ, అతను ప్రజలిచ్చే ఘనస్వాగతాలెరుగడు, 1921లోనే డగ్లస్ ఫేర్‌బాంక్సు, మేరిపిక్‌ఫోర్డులు తమ ''త్రీమస్కెటీర్స్'' చిత్రానికి ప్రీవ్యూ ఇచ్చినప్పుడు ఆ జంటను చూసి ప్రజలు ఎలా హర్షధ్వానాలు చేశారో డగ్లస్ ఫేర్‌బాంక్స్ తన భార్య జనానికి బాగా కనబడగలందులకు ఏవిధంగా తన భుజంమీద ఎత్తుకున్నాడో చాప్లిన్ దగ్గిరే ఉండి చూశాడు చాప్లిన్ చిత్రాల ప్రివ్యూలు అతని స్టూడియో థియేటర్‌లో జరిగేవి గనక అతను ఇలాటి ప్రజాదరణను స్వయంగా చవిచూసి ఎరుగడు, ఇది ఎలా ఉంటుందో అనుభవం పొందటానికి చాప్లిన్ యూరప్ ప్రయాణం కట్టాడు

చాప్లిన్ లండన్‌లో కాలుపెట్టగానే ఈ అనుభవం అతనికి అయింది అంతులేని జనం చాప్లిన్‌ను చూడటానికి గుమిగూడారు ఎవరో చాప్లిన్‌ను భుజాలమీద ఎత్తుకున్నారు జనాన్ని అదుపులో ఉంచడం పోలీసులకు సాధ్యంకాలేదు ఎట్లాగైతేనేం చాప్లిన్ రిట్జ్ హోటల్ చేరుకోగలిగాడు తరువాత ఈహోటల్ దొడ్డిదారి నుండిటాక్సీలో కెనింగ్టన్‌వెళ్లి, తన బాల్యంనాటి ప్రదేశాలన్ని చూడటానికి ప్రయత్నించాడు కాని ఇక్కడా జనం మూగి చాప్లిన్ పోలీసుల సహాయంతో ఇవతల పడవలసివచ్చింది చాప్లిన్ రిట్జ్ హోటల్ లో ఉండగా మూడురోజుల్లో అతనికి 73వేల ఉత్తరాలు వచ్చాయి వాటిని చూడటానికి 6గురు గుమాస్తాలు కావలసివచ్చారు

అకస్మాత్తుగా చాప్లిన్ ఇంగ్లండ్ నుండి విమానంమీద పారిస్ వెళ్ళాడు అక్కడా జనసమూహాలు అతన్ని చుట్టుముట్టాయి, చాప్లిన్ పారిస్ నుండి జర్మనీకి వెళ్లాడు, బెర్లిన్‌లో అతనికి పోలానెగ్రి అనే నటితో పరిచయం కలిగింది, ఈపరిచయం స్నేహంగామారి ఒక వారం పాటు ఇద్దరూ ఒకరినొకరు విడవకుండా తిరిగారు చాప్లిన్ జర్మనీ నుండి ఇంగ్లాండుకు వచ్చి తిరిగి పారిస్‌వెళ్లాడు అక్కడ 'కిడ్' చిత్రం విడుదల అవుతోంది ఈచిత్రానికి వచ్చిన సొమ్మును, యుద్ధంలో నష్టపడిన ఫ్రాన్స్‌కు సహాయార్థం ఇచ్చేసాడు 'కిడ్' ప్రారంభోత్సవంనాడు పారిస్‌కు ఆటవిడుపు ఇచ్చేసారు చాప్లిన్ పర్యటనలో అతనికి ఈనాడు జరిగిన పౌరసన్మానం ఎక్కడా జరుగలేదు 'కిడ్' ప్రదర్శనం అయినాక ఫ్రెంచి అధికారులు చాప్లిన్‌కు ప్రత్యేక సన్మానం చేసారు

1922 ఆరంభంలో చాప్లిన్‌కు పెగ్గీ హాప్కిన్స్ జోయిస్ అనే స్టేజినటితో పరిచయమయింది ఆమె చాప్లిన్ మనస్సును బలంగా ఆకర్షించింది ఆమెతో జీవితంలో కొన్నిఅంశాలు ఆధారంతో 'దివుమన్ ఆఫ్ పారిస్' అనే చిత్రం తీసి యునైటెడ్ ఆర్టిస్ట్‌కు ఇవ్వ తలపెట్టాడు చాప్లిన్ ఈసంస్థ 1919లోనే చాప్లిన్, ఫేర్‌బాంకు, మేరిపిక్‌ఫోర్డ్, డి డబ్లు గ్రిఫిత్‌లతో ఏర్పాటయింది కాని దాని తరవున 1922 దాకా చాప్లిన్ చిత్రం తీయలేదు 'వుమన్ ఆఫ్ ప్యారిస్' చిత్రంలో చిన్నపాత్ర మాత్రమే ధరించాడు ఇందులో ప్రధానపాత్రలు ధరించిన వారు ఎడ్నాపర్వియాన్స్, ఎడోల్ఫ్‌మెంజూ, ఈచిత్రం చాలావిజయవంతమైన చిత్రం

తిరిగి రెండేళ్లపాటు చాప్లిన్ ఏచిత్రమూ తయారుచేయలేదు రెండేళ్ల అనంతరం

''గోల్డ్‌రష్'' విడుదల అయింది, ''ఈచిత్రంద్వారా ప్రజలు నన్ను జ్ఞాపకం ఉంచుకుంటారు'' అని చాప్లిన్ అన్నాడట దీనిని తయారు ,చేయడానికి చాప్లిన్‌కు 14 మాసాలుపట్టింది ఈ చిత్రంలో చాప్లిన్ బంగారం అన్వేషించబోయి అగచాట్లు పడే వాడిపాత్ర ధరించాడు ఇందులో ప్రతి సన్ని వేశమూ ఒకసారి చూస్తే యావజ్జీవం జ్ఞా పకం వుండేదే! చాప్లిన్ రొట్టెముక్కల నృత్యం, మంచుమధ్య తిండి దొరకక కాలిబూట్ వండి తినటం, మాక్ స్వేన్ చాప్లిన్ నుచూసి కోడి అనుకుని వెంటపడడం , ఒకనాటి రాత్రి చాప్లిన్ వుండే కొయ్య ఇల్లు కొండ అంచుకుచేరి అగాధంలోకి సగం ఒరిగివుండటం వగైరా సన్నివేశాలుఅన్నీ అత్యద్భుతమైనవి రెండేళ్ల తరువాత వచ్చిన ఈ కొత్తచాప్లిన్ చిత్రంచూసి జనం వెర్రెక్కిపోయారు ఈచిత్రం 10లక్షల పౌనులకుపైగా ( దాదాపు15 కోట్ల రూపాయలు) ఆర్జించింది ఇందులో చాప్లిన్‌కు సగం భాగం ఈ చిత్రం విడుదల అయిన సమయంలోనే 1924 నవంబరు 24న చాప్లిన్ రెండవ వివాహం జరిగింది

1926 లో చాప్లిన్ 'సర్కస్' చిత్రాన్ని తయారుచేసాడు ఇందులో కూడా చాప్లిన్ తాను ప్రేమించినపిల్ల మరొకరిని ప్రేమించిందని తెలుసుకొని, తప్పుతెలుసుకొని, తప్పుకుని, ఒంటరిగాడై దిగంతానికేసి పోతాడు

తిరిగి చాప్లిన్ చిత్రంతోసేలోగా టాకీలయుగం ప్రారంభమయ్యింది అయినా చాప్లిన్ టాకీ చిత్రం తీయదలచలేదు, 'సిటీలైట్స్' మూకీచిత్రం దీనిని చాప్లిన్ రెండేళ్ళకు పైగాతయారు చేశాడు దీనికోసం 3,75,000 పౌనులు( దాదాపు50 లక్షల రూపాయలు) ఖర్చుచేసాడు 1931 లో ఇది బ్రిటన్‌లోచూపబడినప్పుడు చాప్లిన్ బ్రిటన్‌వెళ్లాడు అంతేకాదు, చాప్లిన్ 'సిటీలైట్స్' నడచిన ప్రతి దేశానికీ వెళ్లి ప్రపంచపర్యటనచేసి వచ్చాడు ఈ చిత్రానికి బ్రాడ్వే( న్యూయార్క్) లో బ్రహ్మాండమైన ప్రివ్యూ జరిగింది దీనిని చూసిన జనం ఆనందాశ్రువులూ, దుఃఖాశ్రువులూ రాల్చారు ఒక పూలమ్మకొనే గుడ్డిపిల్లకొరకు తిరుగుబోతు ఒకడు దొంగతనంచేసి జైలుకు పోయి, ఆ పిల్లకు దృష్టి వచ్చేటట్లు చేయడం ఈ చిత్రానికి ఇతివృత్తం ఈ చిత్రంలో చాప్లిన్‌కళ పరాకాష్ఠ చేరిందన్నారు

తిరిగి చాప్లిన్ 1935 లో 'మోడరన్ టైమ్స్' విడుదలచేశాడు ఇందులో సంభాషణలు కొద్దిగా ఉన్నప్పటికీ ఇది టాకీచిత్రమే అయితే చాప్లిన్ మట్లుకు మాట్లాడడు చిత్రం ఆఖరున ఒక పాటమట్లుకు పాడతాడు ఈచిత్రంలో చాప్లిన్ యంత్ర సంస్కృతిని బాగా వెటకారం చేసాడు ఇందులో ఇతని మూడవభార్య నాయికాపాత్ర ధరించింది

'గ్రేట్ డిక్టేటర్' లోకూడా ఈమెప్రధాన స్త్రీ పాత్ర ధరించింది ఈచిత్రాన్ని చాప్లిన్ ఫాసిస్టు నాయకులను— హిట్లర్, ముసోలినీలను—వెటకారం చెయ్యటానికి తీశాడు ఇందులో చాప్లిన్ డిక్టేటర్ హింకెల్‌గానూ, యూదుజాతికి చెందిన మంగలివాడుగాను కూడా నటిస్తాడు చిత్రం ఆఖరులో చాప్లిన్, యుద్ధోన్మాదులైన నియంతల తరుపున పోరాడవద్దని సైనికులకు ఉద్బోధిస్తాడు, 'గ్రేట్ డిక్టేటర్' 1940లో విడుదల అయింది

దీనిఅనంతరం చాలాకాలానికి చాప్లిన్ మరొక చిత్రం 'మెస్యూవెర్డూ' విడుదల చేశాడు

ఈ చిత్రంలో చాప్లిన్ ''వ్యాపారం'' అంటే ''క్రౌర్యం'' అనీ, అందరమూ యుద్ధమనే దారుణ హత్యాకాండలో భాగస్తులమేనని అంటాడు ఇందులో ప్రధానపాత్ర చాలాకాలం బాంకు గుమాస్తాగా ఉండి, ఉద్యోగం పోగొట్టుకొని తన భార్యాబిడ్డల పోషణకుగాను డబ్బున్న నడివయసు స్త్రీలను పెళ్ళాడి వారినిచంపి డబ్బుకాజెయ్యటం వృత్తిగా పెట్టుకుంటాడు అయితే ఆర్థిక కాటకంలో ఈ డబ్బు కూడా పోగొట్టుకుంటాడు చివరకు అతను పోలీసులకు దొరికిపోతాడు హత్యలుచెయ్యటం వృత్తిగా పెట్టుకున్న ఈ పాత్రను శాకాహారిగానూ, జీవకారుణ్యం కలవాడుగానూ, చాప్లిన్ చిత్రించాడు ఈచిత్రాన్ని అత్యుత్తమ కళాఖండంగా అనేకమంది కొనియాడినప్పటికీ , అమెరికాలో, ఇది రాజకీయ గాలిదుమారాన్ని లేపింది

అయినా చాప్లిన్ తన 'లైమ్‌లైట్' చిత్రాన్ని అమెరికాలోనే తయారుచేసాడు 1952 లో విడుదల అయిన ఈచిత్రం ఇంకా మనదేశానికిరాలేదు ఇది చాప్లిన్ తీసిన 78వ చిత్రం చాప్లిన్ ఖ్యాతి ప్రపంచమంతటా పాకిన తరువాత అతను తీసిన ప్రతి చిత్రాన్నీ విమర్శకులు ''చాప్లిన్ చిత్రాలలో అత్యుత్తమమైనది'' అంటూనే ఉన్నారు ' లైమ్‌లైట్' చిత్రానికి కూడా ఇలాటి ప్రశంసే వచ్చింది తనకు శాంతి బహుమతి లభించిన అనంతరం, జెనీవా సమావేశమప్పుడు చాప్లిన్ ఈ చిత్రాన్ని సమావేశంలో పాల్గొన్నవారికి చూపాడు

ఇప్పుడు చాప్లిన్‌కు 66వ ఏడు నడుస్తోంది కాని అతను ఇంకా చిత్రాలు తీస్తాడు అతని కళ వయసుతోనూ, అనుభవంతోనూ ప్రజ్వరిల్లుతోందిగాని, తగ్గటంలేదు

*సినిమా, మాసపత్రిక, సెప్టెంబరు 1954*

# 7. చార్లీచాప్లిన్ భార్యలు

మిల్‌డ్రెడ్ హారిస్ సినిమానటి ఆమె పదహారేళ్ళు నిండక పూర్వమే 'ఫర్ హజ్బెండ్స్ ఓన్లీ', 'దిప్రైస్ ఆఫ్ ఎ గుడ్ టైమ్', 'బారోడ్ క్లోత్స్' లాటి చిత్రాలలో నటించింది 1918 ఆరంభంలో చాప్లిన్ ఆమెను మొదటిసారి చూసినప్పుడామెకు పదహారేళ్లు చూసిన మరుక్షణమే ఆమె అతన్ని బలంగా ఆకర్షించింది సినిమా నటులలోకెల్లా ధనికుడూ, ప్రఖ్యాతిగలవాడూ, అందగాడూ అయిన చాప్లిన్ తనచేత ఆకర్షించబడటం మిల్ డ్రెడ్‌కు సహజంగా గర్వకారణమై ఉండాలి

చాప్లిన్ తరుచు యూనివర్సల్ స్టూడియోస్ వద్దకు వచ్చి ఆమెకొరకు గంటలతరబడి బయట కారులో వేచి ఉండేవాడు వారు ఒకరికొకరు ''నువ్వెప్పుడు పెళ్లిచేసుకుంటా'' వంటే ''నువ్వెప్పుడు'' అని అడుగుకోవటమూ, తాను 22,23 ఏళ్లు వచ్చేదాకా చేసుకోనని మిల్‌డ్రెడ్ చెప్పటమూ, తాను అసలెన్నటికీచేసుకోనని చాప్లిన్‌చెప్పటమూకూడా జరిగింది కాని వారిద్దరూ 1918 అక్టోబరులో లాస్ ఏంజెలిస్‌లోనే చడీచప్పుడు కాకుండా పెళ్లాడారు ఈ పెళ్ళి వార్త హాలీవుడ్‌లోనేగాక, చాప్లిన్ అంతరంగిక మిత్రులకుకూడా అత్యాశ్చర్యం కలిగించింది ఎందుకంటే వారిద్దరూ అంతగా కలిసి తిరగలేదు వారిద్దరిస్నేహం పెళ్లిదాకా వస్తుందని ఎవరూ

ఊహించికూడా ఉండలేదు

ఇది చాప్లిన్ తొలివివాహం వివాహం కాగానే ఒక వారంరోజులు ''హనీమూన్'' గడిపి, తమ కొత్త హాలీవుడ్ భవనంలో కాపరం ప్రారంభించారు వధూవరులు రెండేళ్లపాటు పనిచేసిన అనంతరం భూప్రదక్షిణంకూడా చేద్దామని వారు కలలు కన్నారు కాని వివాహంతో ప్రణయం వెనకబడి సంసార తాపత్రయానికి ప్రాముఖ్యం వస్తుందని మిల్‌డ్రెడ్ త్వరలోనే తెలుసుకున్నది ఇలా జరగకుండా చూడాలని యత్నించింది కాని ఆమెవల్లకాలేదు

1919 వేసవిలో మిల్‌డ్రెడ్‌కు అకాలప్రసవం అయి మగబిడ్డపుట్టి మూడురోజులు బతికి చనిపోయాడు అసలే మిల్‌డ్రెడ్ చిన్నది, దానికితోడు ఏమంత తెలివిగలదికాదు తన భర్త యొక్క క్లిష్టత్వాన్ని అర్థంచేసుకునేశక్తి ఆమెకులేదు ఇద్దరిమధ్యా ఉన్న ఎడం పిల్లవాడి చావుతో మరింత అయింది రానురాను చాప్లిన్ ప్రవర్తన ఎట్లా పరిణమించిందీ వర్ణిస్తూ, అతను గంటలతరబడి తనను వొదిలేసి సముద్రం దగ్గరికిపోయి సముద్రం మీదికిచూస్తూ నిలబడే వాడనీ, తన విషయమే పట్టించుకోకుండా గంటలతరబడి సంగీతంలో నిమగ్నుడైపోయేవాడనీ మిల్‌డ్రెడ్ అన్నది

కాలక్రమాన వారు విడిపోయారు అనంతరం ఉభయ పక్షాల ఆరోపణలు వెలువడ సాగాయి వివాహానికి పూర్వమే చాప్లిన్‌కు ఒకస్త్రీ ఉన్నదనీ, ఆమెకారణంగానే తనసుఖం పాడయిందనీ మిల్‌డ్రెడ్ అన్నది తనింకా చాప్లిన్‌ను ''చచ్చేట్టు'' ప్రేమిస్తున్నానని, అయినా అతన్ని అతని యిష్టంలేకుండా పట్టుకువేళ్ళాడటం తనకియిష్టంలేదనీకూడా ఆమె అన్నది

చాప్లిన్ నిత్యమూ కారులో వెళ్ళేదారిలో తన కారు నిలిపి అందులో మిల్‌డ్రెడ్ ముడుచుకుని కూర్చునేదిట – ఒకసారైనా తనకేసి చూస్తాడేమోననీ తనతో ఒక మాటైనా మాట్లాడతాడేమోనని! చాప్లిన్ కారు ఆగకుండా వెళ్ళిపోయేది చాప్లిన్ తన భార్యను పూర్తిగా తప్పించుకు తిరగసాగాడు అతనికి అసూయ తెప్పించి చూడమని ఒక స్నేహితురాలు సలహా ఇవ్వగా మిల్‌డ్రెడ్ ఆ స్నేహితురాలి సోదరుడితో దాదాపు ప్రతిరాత్రీ భోజనం చెయ్యసాగింది

దీనిమూలంగా చాప్లిన్‌కు అసూయ కలగకపోగా, మిల్‌డ్రెడ్ మరొకరితో నిజంగా గ్రంథం నడుపుతున్న పక్షంలో ఆ సాక్ష్యం విడాకులకు పనికివస్తుందన్న ఆశపుట్టింది చాప్లిన్, అతని జపానీ నౌకరు కోనో, ఇద్దరూ కలిసి వరుసగా మూడు రాత్రులు మిల్‌డ్రెడ్ ఉంటున్న ఇంటివద్దకు మునివేళ్లమీద నడిచివచ్చి లోపలి సంభాషణ వినటానికి ప్రయత్నించారు కాని వారికేమీ సాక్ష్యం లభించలేదు

చివరకు 1920 ఆగస్టులో మిల్‌డ్రెడ్ భర్త మీద తానే విడాకులకు దావావడేస్తూ అతి విడ్డూరమైన ఆరోపణలు చేసింది ''నా భర్త నన్ను కొట్టలేదన్నమాటేగాని, నన్ను త్రణీకరించి మానసికంగా చాలా హింసించాడు అతను ఎప్పుడు ఎక్కడుంటాడో, ఏం చేస్తాడో నాకు తెలిసేది కాదు'' ఈ ధోరణిలో ఆమె ఆరోపణలు చేసింది వీటిని ''అర్థంలేని'' ఆరోపణలకింద తోసివేస్తూ చాప్లిన్, ''మాకు సుఖం లేకపోయింది ఆమెకు డబ్బిస్తానన్నాను అది నాకు భావ్యంగా

తోచింది కాని ఆమె ఒప్పుకోలేదు'', అన్నాడు విడాకుల వ్యాజ్యం ప్రారంభం కాకపూర్వం చాప్లిన్ తన భార్యకు డబ్బిస్తానన్న సందర్భంలో చిత్రనిర్మాత లూయీ బి మేయర్ మధ్య వర్తిత్వంకూడా జరిగింది 1920 ఏప్రిల్‌లో మేయర్, చాప్లిన్ అలెగ్జాండ్రియా హోటల్ (హాలీవుడ్) లో కలుసుకున్నారు తన భార్యకు ఎంత ఇవ్వదలచినదీ చాప్లిన్ చెప్పాడు ''పిసినారి మొత్తం'' అన్నాడు లూయి బి మేయర్ ''ఒకసారి కళ్లజోడుతియ్యి'' అన్నాడు చాప్లిన్ మేయర్ ఎందుకోనని సులోచనాలు తీశాడు చాప్లిన్ లాగి మేయర్‌ను మొహంమీద కొట్టాడు మేయర్ చాచి చాప్లిన్‌కు ఒకటి ఇచ్చుకున్నాడు చాప్లిన్ కిందపడ్డాడు అందరూ వచ్చి విడదీశారు

మిల్‌డ్రెడ్ తెచ్చిన విడాకుల దావాను చాప్లిన్ వ్యతిరేకించలేదు అతను తన భార్య కివ్వవలిసిన న్యాయమైన మొత్తం – 25 వేల పౌనులు లేక సుమారు మూడున్నర లక్షల రూపాయిలు – కోర్టువారే నిర్ణయించారు చాప్లిన్ ఆస్తిలో కొంతభాగంకూడా ఆమె కిప్పించారు 1920 నవంబరులో విడాకులులివ్వబడ్డాయి

విడాకులు పొందిన మరుసటి సంవత్సరం మిల్‌డ్రెడ్ ''ఫూల్స్ పేరడైజ్'' అన్న సెసిల్ బి డిమిల్ చిత్రంలో నటించింది అటుతరవాత ఆమె సినిమానటిగా పతనమయి చివరకు ఎక్స్ట్రా పాత్రలు ధరించే స్థితికికూడా వచ్చింది 1922 లో ఆమె దివాళా పిటిషన్ పడేసింది ఆమె తిరిగి రెండుసార్లు వివాహం చేసుకుని ఒక కొడుకును కూడా కన్నది 1944 లో ఆమెకు ఆపరేషన్ చేశారు ఆపరేషన్ అనంతరం న్యుమోనియావచ్చి ఆమె చనిపోయింది

మిల్‌డ్రెడ్ నుంచి విడాకులు పొందిన నాలుగు సంవత్సరాలకు చాప్లిన్ రెండో పెళ్ళి చేసుకున్నాడు అతని రెండవభార్య లిటాగ్రే అతనికి బొత్తిగా అపరిచితురాలు కాదు చిన్నపిల్లగా ఒకప్పుడామె రెండు చాప్లిన్ చిత్రాలలో నటించింది తిరిగి పదహారో ఏటలో లిటామన్ ముర్రే అనే పేరుతో ఆమె చాప్లిన్ వద్దకు ఉద్యోగం కోసం వచ్చినప్పుడు బాగా పెద్దదై, పెద్ద అందం లేకపోయినా ఆకర్షవంతంగా కనబడింది ఆమెలోవున్న ప్రధానాకర్షణ శారీరకమైనది ఆమె ప్రవర్తన నిస్సంకోచమైనది ఆమెకు బడిలో చదువు సరిగా అబ్బలేదు ఆమెలో తెలివితేటలున్నట్టుకూడా కనబడలేదు అయినా చాప్లిన్ ఆమెను టెస్ట్‌చేసి, ఆమె పేరు లిటాగ్రే అని మార్చి వారానికి 19 పౌనులు (సుమారు 250 రూపాయలు) జీతంమీద బుక్ చేశాడు ఇది జరిగినది 1924 మార్చిలో

ఈ బుకింగ్ దొరకగానే లిటా ''బలే, బలే'' అని ఎగిరి గంతులేసింది ఆశాపాతకు రాలైన ఆమె తల్లి ఆనంద పడింది చార్లీచాప్లిన్ వెంట నటించనున్న కొత్తనటి అందచందాలను గురించీ ప్రతిభను గురించీ, ఆమె పూర్వీకుల గొప్పతనాన్ని గురించి మామూలు పబ్లిసిటీ అబద్దాలు పత్రికలలోపడ్డాయి చాప్లిన్ వెంబడి ఆమె నలుగురిమధ్యకూ రాసాగింది అకస్మాత్తుగా ఆమె బంధువులు, '' ఆమెను పెళ్ళాడతావా? నిన్ను కోర్టుకీడ్చాలా?'' అని చాప్లిన్‌ను ప్రతిఘటించారు

ఈ వివాహానికి తల ఒగ్గిన చాప్లిన్ పబ్లిసిటీ ఏమీ ఉండకుండా చూసుకోవటానికి

విశ్వప్రయత్నాలు చేశాడు పత్రికలవాళ్ళ కళ్ళలో దుమ్ముకొట్టటానికి తాను తీస్తున్న 'గోల్డ్‌రష్' చిత్రం లొకేషన్ అలాస్కా నుంచి మెక్సికోకు మార్చానని ప్రకటించాడు తన టెక్నీషియను లందరినీ తీసుకుని రైలులో ప్రయాణమైనాడు గ్వేమాస్‌వద్ద ఈ టెక్నీషియనులు ఒక బోటు కిరాయికి తీసుకొని సముద్రం మీదికి , షూటింగుకోసం పోతున్నట్టు, వెళ్ళిపోయి రోజల్లా తీరానికి రాలేదు, ఈలోపుగా చాప్లిన్ లిటాగ్రేను వెంటబెట్టుకుని సోనోరాకు వెళ్లి అక్కడ గుట్టుచప్పుడు కాకుండా వివాహం చేసుకున్నాడు ఇది జరిగినది 1924 నవంబరు 24న

చాప్లిన్‌కు ఈ పెళ్ళి సుతరామూ ఇష్టంలేదనటానికి బోలెడన్ని ఆధారాలున్నాయి పెళ్లికాగానే అతను చేపలుపట్టటానికి వెళ్లాడు పెళ్లినుంచి తిరిగివచ్చే రైలు డైనింగ్ కారులో వధువు బంధువులంతా జల్సాచేసుకుంటూంటే అదే రైలులో చాప్లిన్ తన పెట్టెలో ఒంటరిగా కూచున్నాడు తనకు ఎంతమాత్రం తగని స్త్రీని చాప్లిన్ రెండవమారు పెళ్ళాడాడు దీనికితగ్గట్టే లిటాతల్లి తన కుమార్తె మరీచిన్నదనీ, ఏపనీ చేసుకోలేదనీ చెప్పి, తోడుగా తానే వచ్చి చాప్లిన్ ఇంట తిష్టవేసింది

లిటాకు పదహారేళ్ళు మాత్రమే లాస్ ఏంజెలిస్ చట్టం ప్రకారం ఆమె ఇంకా చదువుకోవాలి నలభై గదులుగల ఇంటికీ, అనేకమంది నౌకర్లకూ యజమాని అయి ఉండి కూడా ఆమె ట్యూటర్లను పెట్టి చదువుకోవలిసివచ్చింది

'గోల్డ్‌రష్' చిత్రంలో ఆమె నటించటంలేదనీ, ఆమె తన కాలాన్ని పత్నీత్వానికే అంకితం చేయదలుచుకున్నదనే ప్రకటన జరిగింది ఈ చిత్రంలో చాప్లిన్ ఆమెను నటించనివ్వకపోవటానికి మరొక కారణం ఆమె గర్భవతిగా ఉండటం కావచ్చు లేదా, లిటాను అనామకురాలిగా ఉంచి తన అత్తగారికి ఆశాభంగం కలిగించాలని అతని అభిప్రాయం అయియుండవచ్చు ఇందుకు ఆ ముసలావిడ చాప్లిన్‌ను బాగానే శిక్షించిందని చెప్పాలి

1925 జూన్ 28న లిటా ఒక కొడుకును – చార్ల్స్ స్పెన్సర్ చాప్లిన్ జూనియర్‌ను – కన్నది ఈ వార్త ప్రతికలలో కెక్కకుండా చూడాలని చేసిన ప్రయత్నాలు ఫలించలేదు తిరిగి 1926 మార్చి 30 న చాప్లిన్‌కు రెండో కుమారుడు, సిడ్నీ ఎర్ల్ చాప్లిన్, పుట్టాడు (చార్లీ అన్న పేరు సిడ్నీచాప్లిన్ )

చాప్లిన్ సంసారజీవితం ప్రశాంతంగా లేదని పుకార్లు బయలుదేరాయి లిటా చేస్తున్న దుర్వ్యయాలను గురించి పోట్లాటలుసాగాయి ఒకనాడు చాప్లిన్ 'సర్కస్ ' చిత్రం షూటింగు నుంచి అలిసి ఇంటికి వచ్చేసరికి ఇంటి నిండా అతిథులు చేరి తప్పతాగుతున్నారు అతిథులను సాగనంపినప్పుడు లిటా తన ఇద్దరు పిల్లలనూ తీసుకొని వారివెంటనే బయటికి వెళ్ళింది

చాప్లిన్ అతని భార్యా కోర్టుకెక్కకుండా వేరుపడటానికి ప్లీడర్లు యత్నించారు కాని ఈ లోపుగా ఉభయుల ప్రకటనలూ ప్రముఖంగా పత్రికలలో పడసాగాయి చివరకు 1927 ఆరంభంలో లిటాగ్రే విడాకులకోసం దావా వేసింది ఈ సందర్భంలో ఆమె 42 పేజీల అర్జీ దాఖలు చేస్తూ, చాప్లిన్ అవినీతిపరుడనీ, తనను చంపుతానని బెదిరించాడనీ, అతనికి పిల్లలమీద

ప్రేమలేదనీ, అనేక అమానుషచర్యలు చేశాడనీ, పుస్తకాలలోనుంచి తనకు జుగుప్స కలిగించే విషయాలు చదివి వినిపించేవాడనీ, అతనితో సంబంధంవున్న అయిదుగురు పెద్ద హాలీవుడ్ తారల పేర్లు తాను చెప్పగలననీ ఆరోపించింది చాప్లిన్ ఆస్తి 40లక్షల పౌనులు (అయిదుకోట్ల రూపాయలకు పైగా) ఉంటుందనీ, ఇందులో 25 లక్షల పౌనులు సమిష్టిఆస్తిగా గణించవచ్చుననీ, ఈ సమిష్టి ఆస్తిలో సగభాగం (కాలిఫోర్నియా చట్టంప్రకారం) భార్యకు – అనగా తనకు –చెందవలసి వుంటుందనీ ఈమె కోర్టువారికి నివేదించింది ఇదంతా తప్పనీ తన ఆస్తి ఏడున్నర లక్షల పౌనులుకూడా ఉండదనీ చాప్లిన్ అన్నాడు

లిటా గ్రే కోర్టు పిటిషనును అచ్చువేసి కాపీ ఒక్కంటికి 25 సెంట్లు (సుమారు 12 అణాలు) ఖరీదుకు వేల సంఖ్యలో అమ్మారు చాప్లిన్ తన ప్రతివాదంలో తన భార్య కుటుంబంవాళ్ళు డబ్బుగుంజటానికి పథకం వేశారని ఆరోపించాడు చిన్నవయసులోవున్న ఆడపిల్లలపట్ల తనకు కలిగే ప్రేమ పితృప్రేమ లాంటిదనీ, ఆ వయసులో స్త్రీలు మేధావులుగా ఉండరనీ, అందుచేత వారిని ప్రేమించటంలో గాఢమైనభావం ఉండదనీ చాప్లిన్ సంజాయిషీ చెప్పుకున్నాడు కాని అతని సమర్ధనలు ఉపకరించలేదు స్త్రీల సమాజాలవారు సాగించిన ఆందోళనల ఫలితంగా కొన్ని అమెరికన్ రాష్ట్రాలలో అతని చిత్రాలను బహిష్కరించారు చాప్లిన్ మంచంపట్టాడు అతని మనస్థితి ఆందోళనకరంగా ఉన్నదనీ, అతను ఆత్మహత్య చేసుకోకుండా కావలా ఉంచుతున్నారనీ వార్తలు వచ్చాయి కాని వీటిని ఖండించారు అతను కొద్దివారాలపాటు విశ్రాంతి తీసుకుం టున్నాడని అతనిపక్షాన పత్రికలలో ప్రకటించారు

చాప్లిన్‌కూ, అతని రెండవ భార్యకూ మధ్య సమరం సాగుతూనేవుంది తన కెవరో బెదిరింపు ఉత్తరాలు రాస్తున్నారని లిటా గ్రే పోలీసుల రక్షణ ఏర్పాటు చేసుకున్నది చాలామంది లిటా గ్రే పక్షమైనారు కొద్ది వారాల క్రితం చాప్లిన్ పేరు తలుచుకుని తన్మయులై పోయినవారు సహితం ఇప్పుడు అతన్ని ప్రాణాలతో దహించితే చూడాలని ఉబలాటపడసాగారు అయితే చాప్లిన్ పక్షం అవలంబించిన వారుకూడా లేకపోలేదు

ఈ కేసు ముగిసేలోపుగా తన పేరు ప్రతిష్టలు మట్టి పాలవుతాయని చాప్లిన్ భయపడ్డాడు, అతను న్యూయార్కు పారిపోయి కోర్టువారి తీర్పుకోసం ఎదురుచూడసాగాడు ఇక్కడ న్యూయార్కు పత్రికలవారి క్లబ్బులో ఒక వార్షికోత్సవం జరిగింది అందులో చాప్లిన్ పాల్గొన్నాడు ''బుల్ ఫైటర్'' ను అనుకరిస్తూ అభినయించాడు ప్రేక్షకుల తన్మయత్వానికి మేరలేదు పత్రికలనిండా చాప్లిన్ ప్రశంసలే! దీనితో అతనికి విజయం లభించింది

1927 ఆగస్టు 22 లిటా గ్రేకు కోర్టువారు విడాకులిప్పించారు ఆమెకు చాప్లిన్ నుంచి ఒకటిన్నర లక్షల పౌను లిప్పించారు పిల్లలను ఆమెకే ఇచ్చారు వారి కొరకు 50 వేల పౌను లిప్పించి, దానికి ఆమెనే ధర్మకర్తగా నియమించారు చాప్లిన్ తన కొడుకులను చూడటానికి అనుమతి ఇచ్చారు

విడాకులు పుచ్చుకున్నాక లిటా గ్రే తన పేరు చివర చాప్లిన్ పేరు చేర్చుకుని చిన్నచిన్న

ప్రదర్శనలలోనూ, నైట్ క్లబ్బులలోనూ పాల్గొనసాగింది ఆమె తన కొడుకులను 1932లో సినిమాలలో ప్రవేశపెట్టటానికి చేసిన ప్రయత్నాన్ని చాప్లిన్ పడగొట్టాడు వారి ఆస్తిగురించి చాప్లిన్‌కూ, అతని మాజీ భార్యకూ దావాలుకూడా నడిచాయి, 1936లో తిరిగి ఆమె వివాహం చేసుకున్నది

1931లో చాప్లిన్ 'సిటీలైట్స్ ' చిత్రం తీస్తుండగా అతని తల్లి చనిపోయింది ఆఖరు రోజులలో ఆమెకు మతికూడా చెడిపోయింది 'సిటీలైట్స్' చిత్రం విడుదల అయి చాప్లిన్ భూప్రదక్షిణంచేసి తిరిగి వచ్చాక అతనికీ పాలెట్ గొడార్డ్ అనే ఆమెకూ దోస్తీ ఉందని పత్రికలలో పుకార్లు బయలుదేరాయి పాలెట్ గొడార్డ్ అసలుపేరు పాలైన్ లెవీ ఆమె 1911లో పుట్టింది 1927 లో ఎడ్గార్ జేమ్స్ అనే అతన్ని పెళ్ళాడి, అతనితో నాలుగేళ్ళు కాపరం చేసి 1931లో అతనికి విడాకులిచ్చింది ఆమె ఇంకో స్టూడియోకు ఎగ్రిమెంట్ చేసింది, చాప్లిన్ ఈ ఎగ్రిమెంటును కొనేసి తన స్టూడియోలోకి తీసుకున్నాడు సినిమాలకోసం రంగుమార్చిన ఆమె జుట్టును తిరిగి మామూలు రంగుకు మార్పించాడు నృత్యంలోనూ, వాచికంలోనూ ఆమెకు శిక్షణ ఇవ్వటానికి ఉపాధ్యాయులను పెట్టాడు అప్పుడప్పుడూ తానే ఆమెకు నటన నేర్పాడుకూడా

చాప్లిన్ అంతకు పూర్వం ప్రేమించిన స్త్రీలకన్న పాలెట్ ప్రౌఢమైన మనస్సుకలది దానితోపాటు ఆమెలో యువకోత్సాహంకూడా ఉండేది ఆమె అన్నివిధాలా చాప్లిన్‌కు తగిన జోడుగా కనిపించింది వారిద్దరూ బహిరంగంగా చాప్లిన్ భవనంలోనే కలిసి నివసిస్తూవచ్చారు, వారికి పెళ్ళి అయిందో, లేదో అయితే ఎప్పుడయిందో, ఎక్కడయిందో ఎవరికీ తెలీదు 1932లో వారికి వివాహమయిందని కొందరి ఊహ 'మోడరన్ టైమ్స్' విడుదల అయిన సందర్భంలో వారు ప్రాచ్యదేశాలకు వెళ్ళినప్పుడు సింగపూర్‌లో వారు పెళ్లాడారని కొందరి నమ్మకం కాని 1940 లో 'గ్రేట్ డిక్టేటర్ ' ప్రివ్యూ జరిగేవరకు చాప్లిన్ పాలెట్ తన భార్య అని బహిరంగంగా ప్రకటించనేలేదు (పాలెట్ 'మోడరన్ టైమ్స్' లోనూ 'గ్రేట్ డిక్టేటర్ ' లోనూ కూడా నాయికగా నటించింది )

పాలెట్ తాను చాప్లిన్ భార్యనని బహిరంగంగా ప్రకటించని కారణంగా ఆమెకు ఒక గొప్ప సినిమా అవకాశం పోయింది 'గాన్ విత్ ది విండ్ ' అనే అతి దీర్ఘ చిత్రంలో కథానాయిక స్కార్లెట్ ఓహారా పాత్రను మొదట పాలెట్‌కు ఇద్దామనుకున్నారు కాని అమెరికాలోని స్త్రీలూ, స్త్రీల సమాజాలూ అభ్యంతరం చెబుతూ స్టూడియోపై లేఖలవర్షం కురిపించాయి ఆమె చాప్లిన్‌ను పెళ్ళాడకుండా అతనితో బహిరంగంగా ఉంటున్నదని వారి అభ్యంతరం

కొద్ది సంవత్సరాలపాటు చార్లీ పాలెట్ చాలా అన్యోన్యంగా గడిపారు కాని చాప్లిన్ మూడవ వివాహంలోకూడా ముసలంపుట్టింది పది సంవత్సరాల అనంతరం వారిమధ్య ఘర్షణ ఏర్పడింది పాలెట్ కూడా చాప్లిన్‌లాగే మంకుపట్టు కలది దీనికి తోడు చాప్లిన్ తాను ప్రేమించిన స్త్రీని అంతులేకుండా ఆరాధిస్తూ కూచో లేడు ఈ రెండు కారణాలుగా వారి ప్రేమ

భగ్నమయింది అయినా చాప్లిన్ మూడవ వివాహం విజయవంతమైనదనే చెప్పాలి తన మూడవ భార్యతో చాప్లిన్ స్వేచ్ఛగా మాట్లాడగలిగాడు తన భావాలు చర్చించాడు, హాస్యంలో ఆమెతో భాగంపంచుకున్నాడు ఆమెను పెళ్లాడేనాటికి చాప్లిన్ వయసు 42 అయినా అంతకుపూర్వం చాప్లిన్ తన జీవితాన్ని మరొక స్త్రీతో పంచుకుని ఎరగడు అతని కీసారి ఆదర్శప్రాయురాలు దొరికిందని చాలాకాలం అతనూ నమ్మాడు, లోకమూ నమ్మింది ఇంతలోనే ఆ బుడగ విచ్చిపోయింది

అయితే ఈ మూడవ వివాహం విచ్ఛిత్తి కావటం పూర్వపు వివాహాలలాగా అల్లరిగా కాలేదు పాలెట్ మెక్సికోలో చాప్లిన్ నుంచి అతిగోప్యంగా విడాకులు పుచ్చుకున్నది చాప్లిన్ పాలెట్‌కు రెండున్నర లక్షల పౌనులు నగలరూపేణా ఇచ్చాడు (ఆమెకు నగలంటే ప్రీతి ) పాలెట్ సినిమాతారగా తనజీవితాన్ని సాగించి కాలక్రమాన బర్గెస్ మిరెడిత్ అనే నటుణ్ణి పెళ్ళాడింది

ఈలోపుగా చాప్లిన్‌ను ఊనా ఓనీల్ అనే కుర్రది ఆకర్షించినట్టు వార్తలుపొక్కాయి ఆమె యూజీన్ ఓనీల్ అనే నోబెల్ బహుమతి పొందిన సుప్రసిద్ధ అమెరికన్ నాటకకర్త కుమార్తె ఆమె సన్నగా, ఎత్తుగా, నల్లనిజుట్టు గలిగిన 18 ఏళ్ళ పిల్ల తరుచు చాప్లిన్‌వెంట కనిపించ సాగింది 1943 జూన్ 16న ఈమె 54 సంవత్సరాల వయసుగల చాప్లిన్‌కు నాలుగో భార్య అయింది. ఈమె కూడా వివాహానికి పూర్వం చాప్లిన్ వద్ద నటననేర్చుకుని వేషం వేద్దామనుకున్నది కానిపెళ్లికాగానే ఆ ప్రయత్నం పూర్తిగా మానేసింది ఈ వివాహం జయప్రదంకావాలని ఆమె మొదటినుంచీ తీర్మానించుకున్నది ఈపని సాధించే శక్తి చాప్లిన్ భార్యలందరిలోకీ ఆమెకు ఒక్కత్తెకే ఉన్నట్టు కనిపిస్తుంది

చిన్నపిల్లల మీది వ్యామోహం అతన్ని పెళ్ళిదాకా తీసుకురావటం ఇది నాలుగోసారి కాని అతనికి నిజమైన సంతృప్తినివ్వటం ఈ 18 ఏళ్ళ పిల్లకుమాత్రమే సాధ్యమయింది ఈమెలో గల ఈశక్తి పెళ్లినాడే బయట పడింది. '' నీకన్న మూడింతలు వయస్సుగలవాణ్ణి, అది వరకే మూడు సార్లు పెళ్ళి అయినవాణ్ణి ఎందుకు పెళ్లాడావు?'' అని ఊనాను ఒక రిపోర్టరు అడిగాడు ఆమె తడువుకోకుండా, నవ్వుతూ ''మాది అందరికీ అర్థమయే వివాహం కాదు '' అన్నది రిపోర్టరు నిర్ఘాంతపోయాడు

ఊనా–చాప్లిన్ ఇప్పటికి 11 ఏళ్ళుకుపైగా సంసారయాత్ర సాగిస్తున్నారు వారికొక కుమారుడూ, ముగ్గురు కుమార్తెలూ ఉన్నారు చాప్లిన్‌కు అర్ధాంగిగా ఉండటానికి తగిన తెలివితేటలు ఆమెలో ఉన్నాయి ఈ వివాహం కొద్దిరోజులకన్న దక్కదన్నారు తరవాత వారాలు గడువుపెట్టారు కాని నెలలూ, సంవత్సరాలూ గడిచిపోయాయి చాప్లిన్ అమెరికాలో నివసించటానికి వీలులేని పరిస్థితులు ఏర్పడినప్పుడు ఊనా తన అమెరికా పౌరసత్వానికి తిలోదకాలిచ్చేసి అతనితో బ్రిటన్‌కు వచ్చేసింది

చాప్లిన్ ప్రేమను సంపాదించుకోవటం సులభమే అనుకున్నా దాన్ని దక్కించుకోవటం చాలా కష్టం ఈ విషయం అతని భార్యలేగాక, తాత్కాలికంగా అతని ప్రేమకు పాత్రురాళ్ళయిన

అనేకమంది స్త్రీలు అనుభవపూర్వకంగా తెలుసుకున్నారు వారెవ్వరూ సాధించలేని విజయాన్ని యూజీన్ ఓనీల్ కూతురు సాధించింది

*కినిమా, మాసపత్రిక, అక్టోబరు 1954*

# 8. అమరజీవి చార్లీ చాప్లిన్

అంతర్జాతీయ కళాకారులలో అగ్రగణ్యుడూ సాధారణ సినిమా ప్రేక్షకులోకాన్నేకాక, అత్యున్నత స్థాయికి చెందిన ప్రపంచ మేధావులందరి ప్రశంసలూ అందుకున్నవాడు చార్ల్స్ స్పెన్సర్ చాప్లిన్ అతను తన కళను లోక కల్యాణం కోసం వినియోగించాడనటానికి ప్రబల తార్కాణం ఏమిటంటే అతని చిత్రాలలో వుండే విమర్శధాటికి తట్టుకోలేని అభ్యుదయ వ్యతిరేక వర్గాలవారు, అతని మీద దుష్ప్రచారం సాగించటానికి అతని వ్యక్తిగత జీవితాన్ని మాత్రమేగాక చేతికి అందిన ప్రతి కర్రపుల్లనూ విసిరారు ఉదాహరణకు 'మెస్యూవర్డూ' చిత్రం విడుదల అయినప్పుడు అదే పేరుగలవాడని చెప్పబడే ఒక ఫ్రెంచి వాడిచేత చాప్లిన్ మీద దావా వేయించారు మహాగజం వెళుతుంటే చాలా గజ్జికుక్కలు మొరిగాయి అతని 'మోడర్న్‌టైమ్స్', 'గ్రేట్ డిక్టేటర్' చిత్రాన్ని తిట్టినవాళ్ళు తమకు ఫాసిజంమీద ఉన్న మోజును బయటపెట్టుకున్నారుగానీ, మరేమీ చేయలేకపోయారు చాప్లిన్ ఇలాటి విమర్శలతో విసుగెత్తి ''అవసరమైతే నా సర్వస్వమూ ధారపోసి 'గ్రేట్ డిక్టేటర్' మళ్లీ తీస్తాను '' అన్నాడు

''నారాయణా అంటే బూతు'' అన్న మాదిరిగా అమెరికాలో ''కమ్యూనిస్టు'' అన్న మాట పెద్ద తిట్టు చాప్లిన్‌ను ఆ మాటకూడా అన్నారు ''నువ్వు కమ్యూనిస్టువా?'' అని పాత్రికేయులు అడిగితే ''కమ్యూనిస్టు అనిపించుకోవటానికేం కావాలి? ఎడమకాలు రోడ్డుమీద ముందు పెడితే కమ్యూనిస్టే'' అన్నాడు చాప్లిన్ అతన్ని అమెరికా నుంచి పారదోలినదాకా వదిలిపెట్టలేదు కాని ''యాభై సంవత్సరాల సినిమా చరిత్రలో ప్రముఖ వ్యక్తి'' గా చాప్లిన్ ఎన్నిక కాకుండా ఎవరూ ఆపలేకపోయారు

చాప్లిన్‌మీద అమెరికనులు సాగించిన పోరాటం చాలా రంగాలలో సాగిందనుకుంటాను అందులో ఒకటి సినిమా రంగమే అతడు మొదటినుంచీ సామాజిక స్పృహగల చిత్రాలు తీయ లేదు అతని హ్రస్వచిత్రాలు ఆరంభంలో ''పొయ్యిలో పిల్లి లేవటానికే'' అవన్నీ హాస్యచిత్రాలు వాటికి ఒక కథా, స్క్రిప్టూ వుండేవికావు ఒకసారి అతను షూటింగ్ ఎనౌన్స్‌చేసి, ఎటో మాయమయ్యాడు కారణం, అతని బుర్రలో ఏ ఐడియాకూడా లేదు అలా తిరుగుతూపోయి, రైలుస్టేషనులో ''ఎస్కలేటర్'' చూశాడు బుర్రలో ఏదో కదిలింది స్టూడియోకు వచ్చి ఎస్కలేటర్ వేయించి ఒక రీల్ కామెడీ కాబోలు తీశాడు

అయితే మిగిలిన హాలీవుడ్ నిర్మాతలు వ్యాపార దక్షతను పెంచుకుంటున్న సమయంలో చాప్లిన్ నిజమైన కళాకారుడుగా తన సామాజిక స్పృహను పెంపొందిచుకుని, తీవ్రమైన విమర్శతో కూడుకున్న కథా చిత్రాలు తీయ నారంభించాడు మొదటి ప్రపంచ యుద్ధం జరుగుతూండగానే

అతని ''షోల్డర్ ఆమ్స్'' అనే వ్యంగ్య చిత్రం వెలువడింది యుద్ధం ఎంత బుద్ధిహీనమో చాప్లిన్ ఆ చిత్రంలో చూపాడు అదే చాప్లిన్ రెండవ ప్రపంచ యుద్ధమప్పుడు 'గ్రేట్ డిక్టేటర్' తీసి, యుద్ధం ఎంత దారుణమో హాస్య సమ్మిళితంగా చూపాడు రెండు యుద్ధ చిత్రాలనూ అమెరికాలో కొన్ని వర్గాల వారు విమర్శించారు

చాప్లిన్ మీద వచ్చిన విమర్శలలో ఒకటి అతను సినిమా శిల్పాన్ని అంతగా లక్ష్యపెట్టలేదని ఎందుకంటే అతను టాకీలు వచ్చిన తరవాత చాలాకాలం సంభాషణలు ప్రవేశపెట్టలేదు 'మోడర్న్ టైమ్స్' లో ఇతరులు మాట్లాడినా చాప్లిన్ ''మైమ్'' మాత్రమే చేశాడు చివరకు ఒక్క పాట పాడాడు (చాప్లిన్ ఇంత బాగా పాడతాడని నాకు తెలీదు అన్నాడు బెర్నార్డ్‌షా ) అటు తరువాత అతను తీసిన చిత్రాలు పూర్తి టాకీలే

గత యుద్ధం అనంతరం చాప్లిన్ మూకీలు 'కిడ్', 'సిటీ లైట్స్' 24 ఫ్రేముల స్పీడుకు మార్పుచెంది, ధ్వని జత చేసి వెలువడ్డాయి అందులో 'సిటీ లైట్స్' ఇంగ్లండులో విడుదలై అన్ని రికార్డులను అధిగమించిందట

చాప్లిన్ చిత్రాలు తీసే పద్ధతికూడా విశిష్టంగా ఉండేది అతను చిత్రకథను రూపొందించటానికి, అవసరమైతే, ఎంత కాలమైనా తీసుకొనేవాడు షూటింగ్‌మాత్రం 20 రోజులలో ముగిసేది ఒక సీను తనకు తృప్తికలిగినదాకా, గంటలతరబడి రిహార్స్‌చేసి, అప్పుడు షూట్ చేసేవాడు అతని చిత్రాలలో సినిమా శిల్పసంపదకన్న సాహిత్య గౌరవం హెచ్చుగా ఉండేది

అరవై ఏళ్ళ క్రితం తీసిన హాలీవుడ్ చిత్రాలు ఈనాడు ఎన్ని చూడదగిన వుంటాయో చెప్పలేం కాని చాప్లిన్ చిత్రాలు చాలా భాగం ఈ నాటికీ చూసి మనం ఆనందించగలం అదే కళాకారుడుగా చాప్లిన్ బలం అతని సమాజ విమర్శ ఆయువుపట్లకు తగిలేదిగా వుంటూనే అందరికీ అర్థమయేదిగా వుండేది

చాప్లిన్ ధరించిన ''ట్రాంప్'' పాత్రకు జగద్విఖ్యాతి లభించింది ఆ పాత్రకోసం చాప్లిన్ వాడిన దుస్తులూ, టోపీ, బూట్లూ , చేతికర్రా హాలీవుడ్‌లో ప్రదర్శితమై వున్నాయట జాన్ కోల్మన్ లాంటి విమర్శకుడు ఈ ''ట్రాంప్'' పాత్రను అర్థం చేసుకోలేదు ఇంగ్లండులో 'మోడర్న్ టైమ్స్' కొన్ని ఏళ్ళ క్రితం విడుదల అయినప్పుడు ఆ ''ట్రాంప్'' చైతన్యంగల శ్రామికుడు కానందున తప్పుపట్టాడు ''ట్రాంప్'' శ్రామికుల ప్రతినిధికాదు మధ్యతరగతిలో చచ్చు నమూనాలకు ప్రతినిధి వాడికి పని అంటే గిట్టదు వాడు పడుకున్న చోటినుంచి చెయ్యి చాస్తే ద్రాక్షపళ్ళు అందాలి ఆవు వాడి ఇంటిముందు ఆగి, పొదుగుకింద పాత్ర పెడితే పితకకుండా పాలధార కార్చాలి వాడు దారితప్పి స్నానం చేద్దామని చెరువులోకి దూకితే, అందులో మడమలోతునీరే ఉంటుంది. వాడి కలలు ఒక్కటీ నిజంకావు జీవితం అన్నివిధాలా వాడికి శత్రువు అయినా దానితో వాడు పోరాడడు వాడికి పొరపాటున చిన్న హోదావస్తే అది కాకతాళీయంగా వస్తుంది ఒక లారీలో నుంచి కింద పడిపోయిన ఎర్రజెండాను ఎత్తి లారీ వెనక ఊపుకొంటూ వాడు వెళుతుంటే, కాకతాళీయంగా ఒక మలువులో ఒక ప్రొసెషన్ వస్తుంది,

వెంటనే వాణ్ణి కార్మిక నాయకుడని ఎరెస్టు చేస్తారు ఇంకోసారి ఏదో గుర్రం వాణ్ణి తరుముకుంటూ సర్కస్ డేరాలోకి ప్రవేశిస్తే, ప్రేక్షకులు గొల్లున నవ్వటమూ, వాడు సర్కస్ క్లౌన్ ఉద్యోగం సంపాదించటమూ జరుగుతుంది మరోసారి వాడు సిపాయిగా నోమాన్స్‌లాండ్ మీద అందరితోపాటు ముందుకు పాకుతూ, దారితప్పి శత్రు సేనలను చేరుకుని, అనుకోకుండా వాళ్ళకు తాత్కాలిక నాయకుడౌతాడు ఇటువంటి పరిస్థితులు సృష్టించడంలో చాప్లిన్ శక్తి అసాధారణమైనది అతను తన చిత్రాల ద్వారా ధనస్వామ్య వ్యవస్థలోనూ, యంత్ర నాగరికతలోనూ వుండే అవకతవకలను హాస్యంపట్టించాడు, అతను రాజకీయ సిద్ధాంతాలను వేటినీ ప్రచారం చెయ్యలేదు స్వయంగా అతను దారిద్ర్యాన్ని ద్వేషించాడు అతని కళ అతన్ని కోటీశ్వరుణ్ణి చేసింది, అయినా అతని కళా దృష్టిలో చెప్పుకోదగిన మార్పు రాలేదు ('లైమ్‌లైట్' నేను చూసిన ఆఖరు చాప్లిన్ చిత్రం )

ఏమయినా, ఎగ్జిబిషనూ, డిస్ట్రిబ్యూషనూ అన్న వ్యాపార ప్రతిబంధకాలు లేకుంటే చాప్లిన్ చిత్రాలు, ఉత్తమ సాహిత్యం లాగా, ఇంకా అనేక తరాల వాళ్ళకు ఉపకరిస్తాయనటానికి సందేహంలేదు

*ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 20-1-78*

'మోడర్న్ టైమ్స్' (1934లో షూటింగ్ -1936లో విడుదల)

'ది గ్రేట్ డిక్టేటర్'

(1939లో షూటింగ్ -1940లో విడుదల)

అంతవరకూ తన 'నిశ్శబ్దం'తో ప్రపంచాన్ని ఆలోచింపచేసిన చాప్లిన్
1942లో 'గోల్డ్‌రష్' సౌండ్ వెర్షన్ పనిలో పడ్డాడు

'ది సర్కస్' (1925 లో షూటింగ్ -1928 లో విడుదల)

జార్జి బెర్నార్డ్ షాతో

అల్బర్ట్ ఐన్‌స్టీన్‌తో

ఎ కింగ్ ఇన్ న్యూయార్క్

# 1.ఎన్నిలోపాలున్నా 'గృహలక్ష్మి' తెలుగు చిత్రాలలో ఉత్తమమైనది

ఆంధ్రదేశం ఇంతకాలంనించీ ఎదురుచూస్తూ ఉండిన 'గృహలక్ష్మి' దేశంలోకి అడుగుపెట్టింది రోహిణీ పిక్చర్స్‌వారు ఈ చిత్రాన్ని జయప్రదంగా తీశారని చెప్పాలి తప్పనిసరిగా ప్రతి నిర్మాణంలోనూ ఉండే, లోపాలేకాక ఈ చిత్రంలో జరగగూడనివి, పొరపాట్లు – కావాలని చేసిన పొరపాట్లు –కూడా ఇందులో లేకపోలేదు ఇన్నిలోపాలతోనూ, బుద్ధిపూర్వకంగా చేసిన పొరపాట్లతోనూ ఈ చిత్రం మన తెలుగు చిత్రాలన్నిటికంటె కూడా ఉత్తమంగా ఉన్నదనిపించితే అందుకు ఉమ్మడిమీద రోహిణీ పిక్చర్స్ వారినీ, ప్రత్యేకించి రెడ్డిగారినీ, తదితర సహాయులనూ ఆంధ్రలోకం ఎంతో అభినందించవలసి వుంది ఈ చిత్రం కంటె ఏవిధంగానూ ఎక్కువకాని హిందీ చిత్రాలను పత్రికలూ, విమర్శకులూ తెగపొగడి పరిశ్రమమీద తమకు గల అభిమానం వెలిబుచ్చటం మనం చూస్తున్నాం

చిత్రమంటే ఏమిటో, చిత్రాలు తీసే విధానం ఏమిటో తెలియని ప్రొడ్యూసర్లు మనకు చిత్రాలు ఇస్తూ ఉండటమూ, వారి ప్రగల్భాలన్నీ విశ్వసించి మనం ఆఖరుకు ఆశాభంగం పొందుతూ ఉండటమూ పరిపాటి అయిపోయింది ఆ చిత్రాలన్నీ ఆంధ్రుల అజ్ఞానానికీ అపకీర్తికీ ప్రత్యక్ష ప్రమాణాలూ, హేతు భూతాలూనూ కాని గృహలక్ష్మి శాస్త్రీయంగా తియ్యబడిన చిత్రం మంచో, చెడో, ఈ చిత్రంలో ఉండవలసిన లక్షణాలున్నై ఇది చేసిన వాగ్దానాలు కొంతవరకైనా నెరవేర్చింది తెలుగు టాకీ పరిశ్రమ ఈ చిత్రంతో ఒక మెట్టు ఎక్కిందనటానికి ఏమీ సందేహం లేదు

ఈ చిత్రం తాలూకు కథే ఒక పెద్ద పొరపాటని చెప్పాలి చింతామణికథను స్వల్పంగా మార్చి అమర్చటంలో చింతామణిలో ఉన్న గుణాలు కొన్ని ధ్వంసంచెయ్యగా గృహలక్ష్మి కథ తయారయింది తరుచు సినిమాలు చూసేవారికి ఈ కథలో నూతనత్వం ఏమీ గోచరించదు ఈ కథకు సరిఅయిన పరిణామంలేదు ఇందులో సరిఅయిన పాత్ర పోషణలేదు దీనికితోడు కథకు అతకకుండా హరిజన సేవాసమితి అంటూ ఒకటి తెచ్చిపెట్టారు అది అసలు కథకు ఎక్కడా అతకదు మొదట్లో డాక్టరు కృష్ణారావుకు మాధురి అనే వేశ్యతో పరిచయం కలగటానికి మాత్రం వినియోగించింది అంతటితో ఆ హరిజన సేవాసమితి పని అయిపోయింది కాని రోహిణి పిక్చర్సువారు దాన్ని పోనివ్వక పట్టుకొచ్చారు

మనో వైజ్ఞానిక దృష్టిలో ఈ కథ తాలూకు ఏ పాత్రకూ ఒక స్వరూపమంటూ లేదు ఇందులో ముఖ్యపురుషపాత్ర అయిన డాక్టరు కృష్ణారావు భార్యను అమితంగా ప్రేమిస్తూ ఉండి మాధురి అనే వేశ్యను చూసి ఆమె సౌందర్యానికి, కళాభిజ్ఞతకూ ముగ్ధుడై, ఆమె మాయలలో పడి భార్యనూ ఉద్యోగాన్ని ఇంటినీ త్యజించి, తన ధనమంతా ఆమెకు కోల్పోయి, తాగుడు మరిగి, ఆఖరుకు మరొకరు చేసిన ఖూనీకి తాను ముద్దాయిగా నిరూపించబడి, చివరకు దైవశాత్తూ మరణదండన తప్పించుకుని భార్యాపిల్లలతో సుఖంగా ఉంటాడు ఇటువంటి పాత్రలను మనం రంగస్థలం మీద చాలా కాలం నుంచి చూడటమే కాక అనవసరంగా సహిస్తున్నాం ఈ పాత్రవంటి పురుషులను మనం జీవితంలో అట్టే గౌరవించం ఎందుచేతనంటే

ఈవిధమైన అనుభవం పొందేవాడు చాలా అవివేకీ, అజ్ఞానీ కావాలి, లేదా కళ్ళు తెరుచుకుని ఒక ట్రాజిక్ ఇనిస్టింక్ట్సు ప్రేరేపణ వల్లనైనా అటువంటి ఊబిలో దిగాలి అప్పుడు ఆపాత్రకు రూపకాలలో స్థానం ఉంటుంది అతని జీవితంలో ట్రాజిక్ బ్యూటీ మనం చూడగలం కాని ఈ డాక్టరు కృష్ణారావుకు తన కథ అడ్డంగా తిరిగే వరకూ తాను ప్రేమించిన మాధురిలో అపారమైన విశ్వాసం, ఆమె తాగించితే తాగటమూ, జూదంలో ఆమెకు డబ్బు కోల్పోవటమూ అతనికి రోజూ ఆనందాన్ని చేకూర్చే పనులు ఆఖరుకు ఆమె తన మీద హత్యానేరం మోపినప్పుడు అతనికి పెద్ద కనువిప్పు ' ఏకచ్ప్యాలా' అనే మరాటీ నాటకంలో సుధాకరు పాత్రతోగాని, వెంకటాచలం గారి 'అదృష్టం' అనేకథలో సర్కసులో పనిచేసే స్త్రీకి మూడు వందల రూపాయలిచ్చిన విశ్వపతితోగాని పోల్చితే ఈ పాత్ర వట్టి వాజమ్మపాత్ర అనిపిస్తుంది (సాహిత్య పరుడు నిర్మించే పాత్రకి, చాతకానివాడు ఊహించే పాత్రకీ ఇటువంటి భేదం ఉండడంలో వింతలేదు )

ఈ డాక్టరుకు మొదట్లో భార్య మీద ప్రేమ ఉండిందంటే, అతని తరువాత ప్రవర్తనను బట్టి, ఆప్రేమ పరస్త్రీ మోహం యెరగనివాడు తన హక్కు భుక్తాలలో ఉన్న స్త్రీ యందు కలిగి ఉండే మమకారమే ననుకోవాలి

మంచో చెడో ఈ పాత్రకు ఒక శాస్త్రీయమైన ప్రకృతి అయినా ఉంటే కొంతబాగుండి ఉండును— ఈపాత్రను మనం మెచ్చుకోలేకపోయినప్పటికీ, అతని కష్టసుఖాలు మనవిగా మనం భావించలేకపోయినప్పటికీ ''అయ్యోపాపం! అజ్ఞాని!'' అని జాలిపడటానికైనా వీలుండునేమో, కాని ఈ పాత్ర సైకలాజికల్‌గా లేదు మొదటిసారి మాధురి తన్ను వలలో వెయ్యజూచినప్పుడు మంచి చురుకైన సమాధానాలిచ్చి ప్రజ్ఞావంతుడల్లే కనిపించాడు ఆమె కృత్రిమ రోగాన్ని పరీక్షించినప్పుడు ''ఇది మందుల వల్ల నయమయేది కాదు'' అని మాధురి బతుకంతా అర్థమైనట్టు కనిపించాడు ఇటువంటి మనిషి ఆఖరుకు ఆమె చేతి కీలుబొమ్మ అయిపోవటమూ, అంత దూరం పతనం కావటమూ నమ్మదగినట్టుగా లేవు ఈ పాత్ర కేవలమూ రోహిణీపిక్చర్స్‌వారు సాంస్కారిక చిత్రం ఒకటి తియ్యగలందులకు మాత్రమే పుట్టినట్టు కనిపిస్తుంది

రాధపాత్రకు కూడా ఇటువంటిగతే పట్టింది ఆమె పాతివ్రత్యానికీ త్యాగానికి ఆదర్శప్రాయురాలుగా మనం భావించాలని కథ యొక్క అభిప్రాయమనుకుంటాను కాని ఒక్క రవ్వ సూక్ష్మదృష్టితో ఈ పాత్రను పరీక్షించినట్టయితే దీనిలో ఈ రెండూ కనిపించవు తన భర్త మొదటిమారు తాగి ఇంటికి వస్తే ఆమె తాగి ఉన్నాడని కనిపెట్టదు అతను పూర్తిగా రెండు మాసాలు తాగుడులోనూ, పరస్త్రీరతిలోనూ మునిగి తేలుతుంటే అదికనిపెట్టకపోగా తన అన్న చెప్పితే తన భర్త అటువంటి వాడుకాడని కోపపడుతుంది ఒక వేళ భర్తలోపాలు చూడలేకపోవటమే, వాటిని లోపాల కింద గణించకపోవటమే పాతివ్రత్యమని కథకుల అభిప్రాయమనుకుంటే రాధ భర్త చేతిలోని సారాసీసా తీసుకుని ఇవ్వకపోవటాన్ని ఎట్లా సమర్థించటం? ఆమె పాతివ్రత్యం ఇట్లా ఉంది ఇక ఆమె త్యాగం – ఆమె భర్తకోసం త్యాగం చేసినదేమీ కనిపించదు తన మతితప్పి! భర్త నిరపరాధి అని తెలిసిన తరువాత అతను నిష్కారణంగా ఉరిపడనుంటే ఏ సామాన్యపు ఇల్లాలు కూడా ఆమాత్రం ఆందోళనపడక పోదు రాధ పడ్డవిధంగా బాధపడక పోయినప్పటికీ

ఈకథలో వచ్చే మరొక ముఖ్యపాత్ర మాధురి కూడా అర్థం గాని ప్రవృత్తికలది ఇతర పాత్రల కష్టసుఖాలు ఆమెలో యెటువంటి పరిణామాన్నీ తీసుకురాలేకపోయినై తనవలలో చిక్కిన డాక్టరు మీద ఆమెకు జాలి అయినా కలగాలి అసహ్యమైనా కలగాలి ఒక విధంగా ఆమె అతన్ని చదరంగంలో ఒక బంటుకింద చూసినా చూడవచ్చును కాని అతనిమీద అంత పగవుండటం దేనికో నేను ఊహించుకోలేకుండా ఉన్నాను మార్వాడీ ఆస్తిమీద ఆపేక్షచేత మార్వాడీని రక్షించటానికి హత్యానేరం డాక్టరు మీద తోసిందనుకున్నా అట్లా చేసిన మనిషిలో ఏదో వికారం పుట్టకతప్పదు అటువంటి వికారం ఏమీలేకపోగా ఆమె డాక్టరు ఉరిశిక్షకోసం ఉవ్విళ్లూరటం వింతగా వుంది ఈచిత్రంలో మనంచూసే మాధురి మనిషేకాదు ముఖ్యంగా గమనించవలసిందేమిటంటే మాధురి కూడా మనిషేనని చూపటానికి కొంత ప్రయత్నం జరిగింది రాధపతిభిక్షవేడినప్పుడు మాధురి చలించినట్టు కనపరిచారు కథలోనే జరిగిపోయిన లోపాన్ని ఒకటి రెండు షాట్లలో సర్దాలంటే ఎట్లా వీలుపడుతుంది? ఈ పాత్ర చిట్టచివరకు మోటారు ప్రమాదంలో దెబ్బతిని, ప్రాణం పోబోతూ, దేవుడున్నాడని ఒప్పుకొని పశ్చాత్తాప పడటం కూడా నమ్మదగినట్టుగా లేదు

రాధ తమ్ముడు గోపీ ఒకడున్నాడు అతను హరిజన సేవాసమితి మనిషి అసలు కథతో అతనికేమీ సంబంధంలేదు కథయొక్క పర్యవసానానికి కూడా అతని సాయం ఏమీలేకపోయింది — డాక్టరును రక్షించటానికి తనతల ఇస్తానని ఉత్తర ప్రజ్ఞాలు పలకటం తప్ప

విశ్వాసరావు వ్యర్థ పాత్ర ఆ స్థానం గోపీ ఆక్రమించినట్టయితే కథ ఇంకా కొంచెం బాగుపడేది గోపీని క్లైమాక్సులో చావనివ్వటానికి రోహిణీ పిక్చర్స్ వారికి ''గుండె'' లేకపోయింది

పిలవని పేరంటంగా వచ్చి చెప్పకుండావెళ్లే అతిథిలాగే ప్రవర్తించిన పాత్ర బ్రాహ్మణుడు కథయొక్క నడకలో అతనికి కూడా కొంత భాగం ఉండికూడా ఆకథయొక్క పరిణామం అతన్ని అంటటం లేదు

చెప్పవచ్చిందేమంటే ఇటువంటి కథ తీసుకుని కూడా రోహిణీ పిక్చర్స్ వారు దీన్ని ఒక చిత్రంగా తీసి చూపగలగటం చెప్పుకోదగిన విషయం దానికి మరేమీ కారణంలేదు, నేను పైన చెప్పినట్టు వీరికి చిత్రాలు తియ్యటంలో నేర్పూ, అనుభవమూ ఉండటమే ఆ ప్రజ్ఞ చాలాదూరం వెళుతుందనటానికి ఇంతకన్న నిదర్శనం ఏంకావాలి?

ఏ సంఘటన ఎంతసేపు ప్రేక్షకుల ఎదుట ఉంచాలో, సీనులు క్లుప్తంగానూ విశదంగానూ కూడా తియ్యటం ఎట్లాగో, ఒక సీను నుంచి మరొక సీనుకు కథను మార్చటం ఎట్లాగో ఈ చిత్రం తీసినవారికి చక్కగా తెలుసును మొత్తంమీద చక్కని ఫోటోగ్రఫీ ఇందుకు బాగా తోడు అయింది ఈ చిత్రంలో కంటిన్యూటీ లోపాలూ, పర్స్పెక్టివు సరిగాలేని షాట్లూ లేవని కాదు అవిలేకుండా ఉంటే ఇంకా బాగుండేది కాని ఉన్నందువల్ల చిత్రానికి పెద్ద ప్రమాదం ఏమీలేదు

చెప్పుకోదగిన లోపాలు వేరే లేకపోలేదు ఈ చిత్రంలో పెద్దలోపం ఒకటి ఏమిటంటే ఈ చిత్రం కొన్నికొన్ని ముఖ్యమైన స్థానాల్లో ప్రేక్షకులను నమ్మించలేకుండా ఉంది ఈ లోపం ఏ చిత్రంలోనూ ఉండకూడదు ఉత్తమ తరగతి చిత్రంలో బొత్తిగా ఉండకూడదు మాధురి డాక్టరు దగ్గరికి వచ్చి మొదటిసారి ప్రేమ ప్రసంగం చెయ్యటం చాలా వెలితిగా ఉంది

అంతకు పూర్వం డాక్టరుకు మాధురిని గురించి ఏమాత్రమైనా సదభిప్రాయం ఉంటే ఆ సంఘటనతో అదికాస్తా అంతరించవలసింది చిత్రం చూస్తే ఈ సంఘటన వల్ల డాక్టరుకు ఆమె మీదగల అభిప్రాయం ఏమయినట్టూ కనిపించకపోవటంవల్ల అది అనవసర సంఘటనగా పరిణమించింది

చివరలో ఉన్మాదావస్థను రోహిణి పిక్చర్స్‌వారు దుర్వినియోగ పరిచారు ఆసంఘటన యొక్క విలువ వారికి సరిగా అర్థం కాలేదో, అయికూడా కావాలని దుర్వినియోగపరిచారో నేను నిర్ణయించుకోలేకుండా ఉన్నాను ఆ పరిస్థితులివి అప్పటికి కథ విశ్వసరావు చావుతో క్లైమాక్సుకు వెళ్ళి, మాధురి కారుప్రమాదం తో యాంటీ క్లైమాక్సుకు రాబోతున్నది రాధ ఉన్మత్తురాలై ''దేవుడు లేడూ? అని అడుగుతూ వీధులవెంటపడడం ఈ యాంటీ క్లైమాక్సుకు అవసరమైన టెంపో ఇస్తుంది ఈ చిత్రంలో ఈ టెంపోను సాగదీసి అవసరమైన యాంటి క్లైమాక్సు ఘట్టన్ని – కారు ప్రమాదాన్ని– కొద్దిలో తేల్చేశారు. ఆ ప్రమాదం తాలూకా ఇంప్రెషన్లు ఇంకా కొన్ని ఉండాలి

ఈ ఛాయనే ఇంకొక పొరపాటు కూడా జరిగినట్టు నాకు అనుమానంగా ఉన్నది ''రేపు తీర్పు చెప్తుతాను'' అని ఆసాయంకాలం అయిదింటికి జడ్జిగారు లేచారు ఈ లోపల జరిగిన సంఘటనలు చూడండి రాధ మాధురి ఇంటికి వెళ్లటమూ, ఆమె కోరికను మాధురి నిరాకరించటమూ, ఆమెకు పిచ్చియెత్తటమూ, ఆపిచ్చిలో ''దేవుడు లేడూ?'' అనుకుంటూ ఆమె మద్రాసులో ప్రతి ట్రాముదగ్గిరా హాజరు కావటమూ, ఆమాటలకు నిద్రపోతున్నవారు కూడా ఉలకటమూ, కొందరు ఆమె చిత్రం ఫోటో ఎత్తటమూ, అది ప్రజామిత్రలో ప్రకటన కావటమూ, అది జడ్జిగారు ఇంటిదగ్గరే చూడటమూ మొదలైన వన్నీ జరిగినై పిచ్చి ఎత్తిన క్షణం నుంచి రాధ జన సమర్థములైన వీధుల్లోనే తిరుగున్నదీ, రాత్రి దృశ్యాలు ఎక్కడా లేవు

అవసానదశయందున్న మాధురి చేసిన కొత్త స్టేట్‌మెంట్ ఆధారంగా జడ్జిగారు రెండవ విచారణ లేకుండా తీర్పు ఇవ్వటం తప్పని నా ప్లీడరుస్నేహితులు చెబుతున్నారు ఇంకొక విచారణ పెట్టుకోవటం తలనొప్పిపని అని తోచినట్టయితే ఒక వైప్ తగిలించి రెండవ విచారణ జరిగిందని తేల్చినట్టయితే సరిపోయేది

అంత ఉన్మాదంలో కూడా ''దేవుడులేడూ?'' అని వాపోయిన రాధ మాధురి నోటివెంట ''దేవుడున్నాడు!'' అనే మాట రాగానే మూర్ఛలోనించి లేచి ఉంటే ఎంతో ఉచితంగా ఉండేదన్నారు మా నండూరి శేషాచార్లుగారు రాధకు కావలసింది అదే ఆ హామీ కోసమే అంతపిచ్చిలో కూడా ఆమె మనస్సు ఎదురు చూస్తున్నది

ఇటువంటి లోపాలమాట ఎట్లా ఉన్నా ఈ చిత్రంలో చేజేతులా చేసినపొరపాట్లు లేకుండా ఉంటే బాగుండేది ఈ చిత్రంలో కొన్ని అమిత అసహ్యకరమైన సంభాషణలు ఉన్నై – అమిత ఏహ్యమైన సూచనలు చేసే సంభాషణలు కొందరికిమల్లే నేను బూతుకు భయపడేవాణ్ణి కాదు అవసరమైన బూతు అంటూ ఒకటి ఉందని కూడా నేను గుర్తించాను కాని అంత చవకరకపు సూచనలకు ఎక్కడా అవసరం ఉండటానికి వీలులేదు ఆ వేశ్యమాత పాత్రకు అవి ఉచితమనటం కూడా సమర్థింపు కాదు మనమంతా చేసే పనులే కొన్ని ఈవిధంగా చిత్రాలలో చూపటానికి వీలులేదని నేను వివరించి రాయనక్కర్లేదు

బొబ్రలకూ లంగాలోనించి కనిపించే తొడలకూ క్లోజప్పులు ఇవ్వటం కూడా ఈజాతికి చెందినవనే పాట్టలతో పంపు కొట్టించటమూ ఇంతకంటె ఘనమైనపనికాదు రోహిణీ పిక్చర్సు వారు ఈ రెండణాల డబ్బుల కోసం చెయ్యవలసిన పనులు మానితే ఎంతో బాగుండేది

ఇంతకూ మన టాకీ పరిశ్రమకు అంగబలం చాలదు, అర్థబలం చాలినా రెడ్డిగారు టాకీ పరిశ్రమకు చెందిన అనుభవం చాలా కలవారు కావచ్చును ఈచిత్రం తియ్యటంలో వారు చూపిన ప్రజ్ఞనుబట్టి కలవారనే ఊహించవలసి ఉంది కాని వారు తమ అనుభవం రాణింపచెయ్యాలనుకొంటే తమకు సహాయభూతులుగా మంచి సమర్థులను ఏరుకోవాలి టాకీపరిశ్రమ బహుశాఖలు కలది అందులో ఒక్కొక్క శాఖకు ఒక్కొక్క అధినాధులుండాలి ఏశాఖ సరిగా లేకపోయినా చిత్రంలో ఆలోపం కనిపిస్తుంది ఈ చిత్రంలో కథ తాలూకు లోపాలు చావకొట్టినట్టు కనిపిస్తున్నై సరిఅయిన పాత్ర పోషణకు అవకాశాలుండి మంచి పరిణామంతో కూడుకున్న కథ రెడ్డిగారి చేత పడినట్టయితే ఇంకా ఎంత మంచి చిత్రం వచ్చేదోనని అనుకోకుండా ఉండలేకుండా ఉన్నాను ఈ చిత్రంలో మ్యూజిక్ డైరెక్షను కూడా తృప్తికరంగా లేదు తీసుకున్న కీర్తనలు అదివరకు చాలా ప్రచారంలో ఉండి పాతబడిపోయినవే పద్యాలు పెట్టటం ఈచిత్రంలో చాలా పొరపాటయింది

టాకీ తీయడంలో అనేక లోపాలు తప్పనిసరిగా వస్తై అంతా మనం అనుకున్నట్టు జరగదు మంచి చిత్రాలు తీయటానికి ఎటువంటి ప్రజ్ఞావంతులు అవసరమో అటువంటి ప్రజ్ఞావంతులు దేశంలో లేరు చాలా సమయాల్లో చేతికి అందినరితో పని గడువుకొని వెళ్ళవలసి వస్తూంటుంది ఈ కష్టసుఖాలు చాలావరకు నేనెరిగినవే మిగిలినవి ఊహించుకోగలనుకూడా అయినప్పటికీ, రెడ్డిగారి వంటి ప్రొడ్యూసరు లేనిదాన్ని కూడా సృష్టించేంత ప్రయత్నం చేయాలి తృప్తి అనేది మనస్సుకు రానివ్వరాదు వారి ప్రయత్నాలు ఇకముందుకూడా జయప్రదం పరిణమించి, గృహలక్ష్మికంటే కూడా మంచి చిత్రాలు తీసి ఈ చిత్రంతో వారు సమకూర్చుకున్న రికార్డు వారే విచ్ఛిన్నం చేయాలని నా కోరిక

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 23-3-1938*

# 2. ఆద్మీ

చక్కని ఫోటోగ్రఫీ, ఆహ్లాదకరమైన శబ్ద గ్రహణమూ, ప్రజ్ఞావంతమైన పాత్రపోషణా, ప్రశంసనీయమైన దర్శకత్వమూ – వీటితో కూడిన హిందీ చిత్రాలు అప్పుడప్పుడూ చూస్తూ వుండటం ఆంధ్రప్రేక్షలోకం మాట అట్లా ఉంచి, ఆంధ్ర ప్రొడ్యూసర్లకే చాలా ప్రయోజనకారి ఇటీవల మన చిత్రాలు మరీ అన్యాయంగా పడిపోతూ ఉండటానికి కారణం ఇటువంటి హిందీ టాకీలే గనక అయినట్టయితే ఆ హిందీ టాకీలను చూసి ప్రొడ్యూసర్లు నేర్చుకునేదానికన్న ప్రేక్షకులే ఎక్కువ నేర్చుకున్నారన్నమాట! హతోస్మి!

హిందీ టాకీలలో కూడా తోసివెయ్యటానికి బొత్తిగా వీలులేనివి ప్రభాత్ వారి చిత్రాలు అందులో మళ్ళీ అగ్రస్థానం శాంతారం తీసిన వాటికి శాంతారాం చిత్రం ఇల్లు బయల్దేరిందంటే దిగ్విజయమే ఇటువంటి విజయయాత్రకు బయల్దేరింది 'ఆద్మీ'.

'మహాత్మా' నాటినించీ శాంతారాం ప్రబోధంలేని చిత్రాలు తియ్యటంలేదు కాకపోతే మన ప్రొడ్యూసర్ల మోస్తరుగా శాంతారాం ''నా చిత్రంలో ప్రబోధం ఉందొహోయ్!'' అని డబ్బాకొట్టుకోవటం లేదు – అటువంటి స్వల్పవిషయాలు ప్రేక్షకులు గ్రహించలేకపోరనే ధైర్యంవల్లనో, పెద్దమనిషి కనకనో

''ఆద్మీ'' లో ఉన్న ప్రబోధం – కనీసం నీతి – ఏమిటంటే, జీవితం జీవించటానికేనని, తాత్కాలిక వికారాలు జీవిత ప్రవాహానికి ఆనకట్టలు కాకూడదని

కాస్త తరచిచూస్తే ఈనీతిలో పస ఏమీలేదని తెలుస్తుంది 'ఆద్మీ'లో ఉన్ననీతిని పశుపక్ష్యాదులన్నీ అనుక్షణమూ పాటిస్తూనే ఉన్నై జీవించటమనేదానికి ప్రభాతవారి నిర్వచనం ఏమిటో నాకు సరిగా బోధపడటం లేదు, ఊపిరి పీలుస్తూ ఉండటమైతే జీవించటం ( లేక ఊపిరి పీల్చటం) దేనికనే సమస్య తప్పకుండా వస్తుంది ప్రత్యేకాదర్శాలు కలవాళ్లు ఆ ఆదర్శాల కోసం జీవితాన్ని ధ్వంసం చేసుకోవటమే సమగ్రంగా జీవించటం కింద భావిస్తారు బమ్మెర పోతన్నగారిమల్లే తప్పేమిటి!

జీవితం జీవించటానికేననే సూత్రాన్ని 'ఆద్మీ' చిత్రానికే అన్వయించిచూస్తే ''జీవితం ప్రేమించటానికి కాదు – పోలీసుపని చెయ్యటానికి!'' అని తేలుతుంది నన్నడిగితే పోలీసుపని అందులో కూడా నైట్ డ్యూటీ–చెయ్యటంకంటే ప్రేమించటమే యోగ్యమైన పనిగా కనిపిస్తుంది, ప్రేమించటానికి శాంతా హుబ్లీకరు వంటిది దొరికినప్పుడు

పోనీ పోలీసుపనిని ధర్మంగా పరిగణించి పై సూత్రాన్ని ఈవిధంగా మార్చిచూతాం జీవితం యొక్క ప్రయోజనం ధర్మం ఆచరించటమే! ధర్మం గురించి వ్యక్తికి లోకభిన్నమైన విశ్వాసం కలిగేవరకూ, తన విశ్వాసం కోసం వాడు లోకంమీద తిరగబడేవరకూ వాడు జీవించినవాడే కాడు 'ఆద్మీ'లో పోలీసువాడు అటువంటి పని ఏమీ చెయ్యలేదు వాడు ప్రేమను త్యాగం చేసినమాట వాస్తవమే కాని దేనికోసం ఆ త్యాగం చేశాడో తెలియటం లేదు – హెడ్ కానిస్టేబులు కావటానికైతే తప్పు! ఒక విశ్వాసంగాని, ఆఖరుకు తన అహంకారంగాని నిలబెట్టుకోవటానికైనా వాడా త్యాగం చేసి ఉంటే సంతోషించడానికవకాశం ఉండేది పైగా వాడు త్యాగం చెయ్యవచ్చేటప్పటికా త్యాగం త్యాగంగా కూడా లేదు వాడు ప్రేమించిన స్త్రీ హత్యచేసి పోలీసులకు దొరికిపోయింది

ఇక పోలీసువాడు చేసిందల్లా ఏమిటంటే ప్రాణత్యాగం చేసుకోకుండా ఉండటం ( అది కూడా ప్రయత్నించాడు, కాని ఆఖరుకు అతి నిగ్రహంతో ఆ ప్రయత్నంనించి విరమించి మనకు చక్కని గుణపాఠం నేర్పి హెడ్డుకనిస్టేబులయి ఊరుకున్నాడు! ) ఆపోలీసు జీవితం కోటిలో 99,99,999 మందిది మిగిలిన ఒకడూ ప్రేమకోసం ప్రాణం తీసుకుంటాడేమో! అటువంటి వాడి దినచర్యను చిత్రించి అందులోనించి మనకు గుణపాఠం చెప్పటానికి శాంతారామువంటి సుప్రసిద్ధ నిర్మాత అవసరం లేదేమో అనుకుంటాను

మరొక ఆశ్చర్యకరమైన సంగతేమిటంటే ఈ చిత్రంలో నాయిక మొదటి నుంచి ఆఖరు వరకూ జీవితం జీవించటానికేననే సూత్రాన్నితోసి వేసింది ఆ మనిషి తన విద్యుక్తధర్మమైన లంజరికం చూసి అసహ్యించుకున్నది, ఒక పోలీసును ప్రేమించింది అతని కోసం తన సమస్తమూ త్యాగం చేసింది ఆఖరుకు తన స్వేచ్ఛను త్యాగం చేసుకున్నది పోతూపోతూ జీవితం జీవించటాని

కేనని తన ప్రియుడికి పారం చెప్పింది ఈ పాత్రను గురించి మనం ఏమనుకోవాలని శాంతారాం గారి అభిప్రాయమో నాకు తెలియటం లేదు

నాకు పోలీసువాడి మీదకన్న ఆ వేశ్యమీద సానుభూతి జాస్తిగా ఉంది చిత్రం బోధించే నీతిని బట్టి చూస్తే నాకా సానుభూతి ఉండటం నా దౌర్బల్యమేనని తెలుస్తూనే వుంది ఒప్పుకుంటాను కాని ఆ ముక్క ఆవేశ్యచేత చెప్పించటంలో అభిప్రాయం ఏమిటి? ఆమె తను చేసిన త్యాగానికి పశ్చాత్తాపడ్డదనా? లేక ఆ సూత్రం పోలీసులకే కాని వేశ్యలకు వర్తించదనా? ఇది తెలిసే వరకూ నాకు 'ఆద్మీ' కథ నచ్చదు ఆ తరవాత అసలే నచ్చదు

కథలో ఉన్నలోపమంతా ఈ అర్థంలేని నీతినిబట్టే కలిగిందనుకోవద్దు ఆనీతి లేకపోయినా కథ కోతిగానే ఉంది ఈ కథనిండా కథకుడి అప్రతిభ సమృద్ధిగావుంది ఈ కథలో ఉన్నటువంటి అప్రతిభ ఎందువల్ల కలుగుతుందో నాకు స్వానుభవం వల్ల తెలుసును యథార్థాన్నీ కలలనూ ముడి పెట్టడానికి ప్రయత్నిస్తే 'ఆద్మీ' కథ వంటి కథ తయారవుతుంది

బోగంది, తన వృత్తిలో ప్రయోజకురాలు, సమృద్ధిగా సంపాదిస్తున్నది, కాని తన వృత్తి మీద గౌరవం లేదు! తనని ఎరెస్టునించి కాపాడిన పోలీసును ప్రేమించి, వెంటపడి, వాడిమెడకు గుదిబండ అయి వాడిరాకకోసం అన్నాహారాలు లేకుండా కూర్చుంది! అతని ఇంటికి పోయి అక్కడ ఉండటానికి తనకు అర్హతలేదని తెలుసుకున్నది! అక్కణ్ణించి లేచిపోయి తన ప్రియుడికి అందకుండా దాక్కున్నది, తనని బయట పెట్టబోయిన వాణ్ణిహత్యచేసింది! ఈ వేశ్య అపూర్వమైన వేశ్య కాదని నిరూపించడానికి ప్రభాత్ వారు చాలా బాధలు పడ్డారు!

ఆవిధంగానే ఈ కథలో ప్రణయం కూడా అపూర్వప్రణయం కాదని నిరూపించడానికి చాలా బాధలు పడ్డారు ప్రేమ అనేమాటను నాయికా నాయకులచేత చాలా అసహ్యంగా పరిహసింపించారు కాని ఈ నాయికా నాయకులు సెంటిమెంటాలిటీనించి తప్పించుకున్నారా? పోలీసు కంఠస్వరం వినపడితే బోగందాని పంచప్రాణాలూ లేచిరాలేదా? 225 నంబరును బోగంది తన గోడల నిండా బొగ్గుతో రాసుకోలేదా? మైనపు చుక్కలతో నేలమీద వెయ్యలేదా? అది చూడగానే పోలీసు హృదయం గొంతులోకి వచ్చి కొట్లాడలేదా? పోలీసు మీది ప్రేమ తలకెక్కి బోగంది పోలీసును తననించి కాపాడటానికి ఆత్మత్యాగం చేసుకోలేదా? నాయికను పోగొట్టుకున్న పోలీసు నదిలోపడి చావటానికి ఉద్యుక్తుడు కాలేదా? ఇక వారిద్దరూ నవ్వింది దేన్ని చూసి?

అపూర్వమైన వేశ్యనూ అపూర్వమైన ప్రణయాన్నీ చిత్రించటానికీ భయందేనికీ? కళాదృష్టిలో సహజత్వానికి భంగం కలుగుతుందనా? అయితే సహజమైన బోగందాన్ని సామాన్యపు పోలీసునూ చిత్రించరాదూ? దీనికంతా మూలకారణం ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్! ఈ చిత్రం నిండా ఉన్నదదే!

అసలు శాంతారాముది చవుకరకం భావనా శక్తి కథకుడి ఉద్రేకాన్ని విమర్శకుడు కనుక్కోగలడు మామూలు పాఠకులు కనుక్కోలేరు అట్లాగే చిత్రంద్వారా నిర్మాత ప్రకటించుకునే స్వంతవికారాలను విమర్శకుడు అర్థం చేసుకోవటం సాధ్యమవుతుంది

నేను వెనక ఒకసారి అన్నట్టు శాంతారం నిర్మించే పాత్రలకు స్ఫుటత్వం ఉంటుంది గాని సహజత్వం తక్కువ ఈ పాత్రలద్వారా శాంతారాం తన స్వరూపాన్ని బయట పెట్టు

కుంటున్నాడు అందరికీ తెలిసిన విషయాలను గురించే గట్టిగా దబాయించి మాట్లాడేవాడి తత్వం శాంతారాం తత్వం తను ప్రకటించేదానిలో లోపించిన విశిష్టతను ప్రకటనా విధానం యొక్క డాబుతో కప్పెయ్యటం

వెనక 'అమరజ్యోతి' లో నందిని ప్రణయగాధలో ఆప్టేచేత మేక అరిచినట్టు అరిపించీ నీళ్లలో పడేసీ ఎటువంటి అభిరుచిని వెల్లడించాడో ఇప్పుడు శాంతాహుబ్లికరు చేత నానాభాషల్లో పాట పాడించీ, సినిమా ప్రేమను చూసి నవ్వించీ అటువంటి అభిరుచినే ప్రకటించాడు శాంతారం ఇటువంటివి సాధించటానికి పడే శ్రమ వాటివల్ల సాధించే ఫలితాన్ని మించి ఉంటుంది అంతకంటే మరేమీ లేదు

శాంతారం ఈ కారణంవల్లనే విమర్శకుణ్ణి బుట్టలో వెయ్యలేడు ఒక ఉదాహరణ చూడండి బోగంది తన గోడల నిండా 255 అంకె గీసుకున్న సంగతి ప్రేక్షకుడు చూస్తే శాంతారాముకు తృప్తిలేదు ఒకటికి రెండు సార్లు పోలీసు కూడా చూడాలి! గోడమీద గీసుకున్న గీతలూ అంతే! బోగందాని ప్రేమను మనం అర్థం చేసుకునే సాధనాలే పోలీసుకూనూ?

శాంతారాం మంచి టెక్నీషియను కావటమూ అతని తల కళా సూక్ష్మతను తెలుసు కోవటమూ పరస్పర బాంధవ్యం కల విషయాలల్లే కనిపించుతై కూర్చేవాడు కావటం చేత అతనికి ఎంత సేపటికీ ''సింతెసైజు'' చెయ్యటమే చాతనవును అందువల్ల అతని చేతి కింద పడిన కథలో సంఘటనలనించి భావం సహజంగా పరిణమించదు భావం కోసం సంఘటనలు మెలికలు తిరుగుతై పాత్రలు కూడా అంతే తన తల్లితో తప్ప మరేఆడదానితోనూ మాట్లాడి ఎరగని పాపభీతిగల పోలీసు బోగం దాని స్నేహానికి వెరవడు ఆ బోగంది కనబడగానే పారి పోడు ప్రేమిస్తాడు ప్రేమించిన వాడు శరీరంతో ప్రేమించడు, ఆత్మతో! పోలీసుకు జీతం ఎంత ఉంటుందో నాకు సరిగా తెలీదు ఒక పోలీసు నడిగితే పదిహేడని చెప్పాడు కాని 'ఆదీమ్' ఎక్కడపడితే అక్కడ బోగందాన్ని అదర గొట్టటానికి జేబులోంచి డబ్బు తీస్తూ ఉంటాడు తన జీతంతో బోగందానికి వేరే కాపరం కూడానూ! ఆ బోగంది చూడబోతే ఆ సాయంకాలం వరకూ కనకవర్షంలో తడిసి చిల్లర డబ్బులతో బయటకి వచ్చిన మనిషి!

నిజమైన ప్రేమ ఏమిటో చూపించటానికి ఆద్మీలో చిత్రించిన పోలీసు చెప్పు ఘట్టం వాచకపు పుస్తకాలలో పాఠం కంటె ఏమాత్రమూ ఎక్కువ సహజంగా లేదు ''ఇదీ నిజమైన ప్రేమ!'' అనే ముక్కకూడా గంభీరంగా ఇనస్పెక్టరుగారిచేత చెప్పించబడింది కాని మామూలు పోలీసు చేత కాదు! ఏమి కల్పన!

శాంతారాం హృదయంలో నాగరికతతో కూడుకున్న మృదుత్వం లేదు అతని పాత్రలు నవ్వించటానికితప్ప నట్టుతూ మాట్లాడవు వాటికి బిగ్గరగా నవ్వటం చాతనయినట్టు చిరునవ్వు నవ్వటం చాతకాదు! అతను గాంభీర్యం నించి హాస్య ధోరణిలో పడటం అమిత కృత్రిమంగా, పెళుసుగా ఉంటుంది తిండికిలేక మాడుతున్న బోగందానికి పోలీసు దర్శనమిచ్చిన ఘట్టంలో ఇటువంటి గుణమే కనిపిస్తుంది శాంతారాం చిత్రించే ప్రణయాన్నికాని కలహాన్నిగాని ఆనందించవచ్చును గాని ప్రణయకలహం దుర్భరంగా ఉంటుంది!

శాంతారామును తీసిపారెయ్యాలని నా అభిప్రాయం కాదు (నేను తీస్తే అతను పోతాడనేది కూడా అనుమానాస్పదమైన సంగతి ) కాని నిజమైన ఉత్తమ తరగతి చిత్రాలు

తియ్యటానికి తగిన నాగరికత శాంతారాముకు లేదని నా సందేహం అతను తన పాత్రల ద్వారా ప్రకటించే – నాదృష్టిలో – ఇన్ఫిరియారిటీ కాంప్లెక్సును జయించకపూర్వమే గొప్పవాడై కూర్చోవటం చాలా పొరపాటయింది ఇప్పుడీ విషయంలో అతన్నెవరూ సంస్కరించలేరేమో!

ప్రజామిత్ర, వారపత్రిక, 24-12-1939

# 3. శాంతారాం సమర్థతను ఎంతవరకు ఆమోదించానో గమనించారు కారు

నేను ప్రభాత్ వారి 'ఆద్మీ' మీద రాసిన విమర్శనను ఖండించుతూ శ్రీ లక్ష్మణరావు గారు ఈ విషయాలు తేల్చారు నేను ''చెడుగుతో మంచి కూడా '' విమర్శించలేదనీ, అందుచేత నాది ''సద్విమర్శ'' కాదనీ, '' ఊపిరి పీల్చుకుంటూ ఉండటమే జీవించటమని'' నా అభిప్రాయమనీ, ''ఆ నీతిని మానవజాతే అనుసరించలేకున్నది'' అనీ, ''అర్థం చేసుకోగలిగితే 'ఆద్మీ' లో అత్యున్నత భావాలెన్నో ఉన్నాయి'' అనీ

శ్రీ లక్ష్మణరావు గారికి సినిమాలు చూడటంలో ఏమాత్రం ప్రజ్ఞ ఉన్నదో నాకు తెలియదు, తెలుగు వ్యాసాలు చదివి అర్థం చేసుకోవటంలో వారికి విశేష ప్రజ్ఞ ఉన్నట్టులేదు ఉంటే జీవించటాన్ని గురించి నా అభిప్రాయం ఊపిరి పీల్చటమని తేల్చి వుండరు జీవించటమనే దాన్ని నిర్వహించటం చాలా కష్టమన్నాను ఆమోదించే నిర్వచనాలను తీసుకుని, వాటి దృష్టిలో ''జీవితం జీవించటానికే'' అనే నీతిలో పసలేదన్నాను ఉన్నదని లక్ష్మణరావుగారు నిరూపించవలసింది

వారన్నదల్లా, ''మానవజీవితానికి జీవిత మధ్యములో ఎన్నోచిక్కులు దాపరిస్తాయి వాట న్నిటికొరకు ఎన్నిసార్లు చస్తాడు మానవుడు? అందులోనూ అల్పవిషయమైన ప్రేమకోసరము చావటము అసలే మంచిది కాదు ఈ నీతియే జీవిత రహస్యము అని నేనంటాను'' అని

దీన్ని సమర్థించటానికి లక్ష్మణరావుగారు సుభాష్‌చంద్రబోసుగారి వివాహం విషయమై ప్రకటించిన అభిప్రాయాన్ని కూడా వంత తెచ్చుకున్నారు పెళ్లికీ ప్రేమకూ గల సంబంధమేమిటో ''ప్రతి విమర్శకులు'' సూచించలేదు

ప్రేమ అల్పవిషయమని అనటానికి లక్ష్మణరావుగారికి గాని, శాంతారాంగారికిగాని ఏమి అధికారం ఉందో నాకర్థం కాలేదు ప్రేమ ''అత్యుత్తమమైనదీ అమూల్యమైనదీ'' అని నా అభిప్రాయంకాదు కాని దాని కోసం ప్రాణత్యాగం చేసుకున్న వ్యక్తులను సహృదయంతో స్మరించటం ఆచారంగా ఉంది అంతేకాక మోతీ ప్రేమను త్యాగం చెయ్యటం కూడా గొప్పగా పరిణమించి ఉండేదే, ప్రేమకన్న ఉత్తమమైనదీ అమూల్యమైనదీ ఏదైనా ఉండి ఉంటే, అటువంటిది 'ఆద్మీ' లో నాకేమి కనిపించలేదు

మోతీ ఆత్మహత్యా ప్రయత్నంనించి విరమించి చేసినదల్లా డ్రిల్లే! ఆఖరుకు మోతీ ఆత్మ హత్య చేసుకోకపోయినంత మాత్రంచేత, ప్రమాదవశాన ఒక్క దెబ్బకే కేసరి తండ్రి చచ్చి కేసరి మోతీకి శాశ్వతంగా ఎడమైపోయినంత మాత్రంచేత 'ఆద్మీ' మోతీ కేసరీల ప్రణయగాథ కాదంటారా లక్ష్మణరావుగారు?

లక్ష్మణరావుగారు జీవిత రహస్యమని ప్రకటించిన నీతిని, అంటే ప్రతి స్వల్పవిషయాన్ని

జీవితానికి అడ్డం రానీకుండా, '' ప్రేమవంటి అల్ప విషయానికి చావకుండా ఉండడమే జీవిత రహస్యమనే సూత్రాన్ని మానవుడే పాటించలేకుండా ఉన్నాడని, ఆ గుక్కలోనే పక్షులు ఒకదానికోసం మరొకటి చస్తున్నవని ఒప్పుకుంటున్నారు! ఆ వెంటనే మళ్లీ ' ఇలా నీతికి నిలబడేవాళ్లు (అంటే ప్రేమకోసం ప్రాణత్యాగం చేసుకునేవాళ్లు) కోటికొక్కడు కాదు ఎంతో మంది దొరుకుతారు '' అంటున్నారు లక్ష్మణరావుగారు ఏ ఊహాప్రపంచంలో ఉండి అంటున్నారో దురూహ్యంగా ఉంది

ఈ ఊపిరి పిల్చటానికి తోడు ఆహారము తీసుకోవటం, నీరు త్రాగడం, శుభ్రతకూడా ఉండాలనితోస్తుంది అయితే ఇంతమాత్రానికే 'జీవనము జీవించటానికే' నని అన్వయం చేసుకోవటము అంత సబబు కాదు – అనే నా తాత్పర్యం కూడానూ నేను తెలుసుకో గోరేదల్లా ఏమంటే ఏది ''సబవు''?

''ఈ పాత్ర (కేసరి) తన జీవితము పోవడము మంచిదనే విషయము కాని, భావముకాని ఎక్కడా కనపర్చలేదు, చర్యలు కూడా అలాటివిగా కనపడలేదు'' అని శ్రీ లక్ష్మణరావుగారు గట్టిగా చెబుతున్నారు ఆమె'' అనేకసార్లు పశ్చాత్తపపడింది '' ఇది అసహజకల్పన తన వృత్తిలో విజయం పొందిన వేశ్య పశ్చాత్తాపపడదు అల్లా పశ్చాత్తాపపడటానికి ప్రబల కారణాలు కావాలి

ఈ విషయం ఏమైనా సందేహం వుంటే వేశ్యలనుంచి ఆరా తియ్యావచ్చును పోనీ కేసరి పశ్చాత్తాపపడ్డదే అనుకుందాం ఆమె ఆవృత్తి మానేసి అంట్లుతోముకు బతకటానికి ఎవరి అభ్యంతరమూ ఉండదు కేసరి ఆ పని చేయ్యలేదు మోతీ మీద ప్రేమో– కనీసం గురో– లేకపోతే అతని వెంట ఇల్లు విడిచిరాదు నిజంగా పశ్చాత్తాపపడి వచ్చిన వేశ్య దేవత యొక్క సాక్షాత్కారంతో కంపించి పారిపోదు దేవత నిజంగా ఆమెను క్షమించింది

మొదటి పుష్పం మోతీ ఊది పడగొట్టినా, రెండోపుష్పం దానికదే కిందపడింది ఇక కేసరి మోతీ ఇంటి నుంచి పారిపోవటంలో అర్థమేమిటి? ఈ పారిపోవటం మరొక అర్థంలేని కల్పన ఇందులో అర్థం వుంటే కేసరి '' ఉచ్చదశలోకి రావాలని ఆశించటం'' అబద్ధమనీ, ఆమె ఆశించింది కేవలం మోతీ ప్రేమేననీ, అతని ఇంటిలో తన ప్రవృత్తికి స్థానంలేదనితెలిసి లేచిపోయిందనీ అనుకోవాలి నేనట్లాగే అనుకున్నాను ఇన్ని అనర్థపు కల్పనలతోకూడిన పాత్ర (కాళ్ళకూరివారి చింతామణి పాత్రకంటె ఈ పాత్ర ఏ విధంగానూ ప్రతిభతో కూడిన కల్పన కాదు!) మిగిలిన పాత్రల కంటే కూడా అతి నిపుణతతో నిర్వహించబడింది'' అని లక్ష్మణరావుగారంటే, పొరుగింటి పుల్లకూర రుచి అని మాత్రమే నిరూపణ అవుతున్నది

కేసరి పాత్రలో మొదటి నుంచీ త్యాగమే కనిపిస్తుంది ఆమె మొదటి నుంచీ జీవించాలనే ట్రైబ్కు ఎదురువెళ్ళింది ఆమె గోడల నిండా వేసిన 225 అంకె ఆమె మమకారాన్ని తెలియ చేస్తోంది ఈ మమకారం ఆమె వృత్తి విసర్జించక పూర్వమే కలిగి ఉండాలి ( ఈ అంకెలు వేసి రావటానికి ఆమె మళ్ళీ ఇంటికి వెళ్ళిందనుకోవటం అర్థంలేని పని!)

ముందు కేసరి తన క్షేమాన్ని త్యాగం చేసింది ఆ తరవాత ఆమె తన ప్రేమకు మోతీ ఇల్లు సరి అయిన వాతావరణం కల్పించదని మోతీనే త్యాగం చేసింది ఇదికూడా తన ప్రేమకోసం చేసిన త్యాగమే ఆఖరుకు తన ప్రేమకు ప్రేమించటమే ఫలితమనీ, దాన్ని సఫలం

చెయ్యటానికే ప్రయత్నం చేసినా ప్రేమకే భంగం కలుగుతుందనీ తెల్సుకుని ఆమె తుది త్యాగంచేసి హంతకురాలయింది నాకోసం నీ జీవితాన్ని పాడుచేసుకోకు, నీజీవితంలో నాకంటె ఉత్తమమైన విషయాలు చాలా ఉన్నై! అని ఆమె చెప్పటం యుక్తంగానే ఉంది కాని అందులో నీతి ఏమీలేదు

అది చిత్రానికి అన్వయించటం మాట అట్లా ఉంచి, కేసరి ఆదర్శాలను మనం మెచ్చుకోకపోతే పోవచ్చును కానీ, ఆమె త్యాగాన్ని తృణీకరించడానికిగాని, లేదనటానికిగాని మనకే అధికారమూ లేదు ఎవరి దృష్టి నుంచి చూడవలసినదాన్ని వారి దృష్టినుంచే చూడాలి విమర్శకుడు

తను మోతీకి చెప్పిక మాటలు కేసరి తనకు తనే చెప్పుకున్నట్టు భావించవలసివస్తే ఆమె తను చేసిన త్యాగానికి పశ్చాత్తాపపడుతుందనే అభిప్రాయం రాకతప్పదు జీవితం జీవించటానికే అయితే బోగం వృత్తిలో ఉండిపోకపోయిందీ? ఆవృత్తిలో తాను ఆనందించలేదా? ఒక రూపాయి తన తండ్రికి ఇవ్వకుండా ఉండటానికి విశ్వప్రయత్నం చెయ్యలేదా? అంతగా తన వృత్తిమీద రోతపుడితే హాయిగా మోతీ యింట్లో ఉండక పోయిందీ? ఎవరభ్యంతర పెట్టారూ?

ఉచ్ఛదశ లభించిందిగా!? జీవితం జీవించటానికేనని ఆమె నమ్మినట్లు శ్రీ లక్ష్మణరావు గారిని ఒక్క నిదర్శనం చూపమని అడుగుతున్నాను జీవించటమంటే చావకుండా ఉండటమనే నీచాన్వయం చేయటానికి వారికధికారంలేదు (అంతకంటె ఊపిరి పీల్చటమనేదే బాగుంది!)

"మోతీ కేసరిని ప్రేమించటానికి వెరచలేదంటారు విమర్శకులు" అని లక్ష్మణరావుగారు నేను పొరపాటువడ్డానని నిరూపించటానికి వారు చేసినదేమంటే మోతీ లోకాన్ని చూసి వెరచాడని నిరూపించటం! లోకానికి వెరవటం ప్రేమించటానికి వెరవటంకాదు, ప్రేమ సఫలం చేసుకునేటందుకు వెరవటం!

ఇంతకూ శ్రీ లక్ష్మణరావుగారి వ్యాసం మరేమీ చెయ్యకపోయినా నా విమర్శయొక్క ఆవశ్యకతను రూఢీపరుస్తున్నది ఇతర రాష్ట్రాలతో పోల్చితే ఆంధ్రునికి విమర్శనాశక్తి ఎక్కువ గానూ ఆరాధనాశక్తి తక్కువగానూ ఉన్నమాట నిజమేగాని మనలో కూడా అక్కడక్కడా లక్ష్మణరావుగారి వంటి ఆరాధకులున్నారు వారు శాంతారం మాదిరిగా పైకి వచ్చినవారి మీద ఈగవాలనివ్వరు వారికి విమర్శనానుభవంగా విశేషం ఉండదు, ఉన్నదాన్ని ఏమాత్రమూ వినియోగపరచరు సాటివాడు రాసిన తెలుగు వ్యాసం సరిగా అర్థంకాదు కాని ఏ హిందీ చిత్రంలోనో ఉన్న "అత్యుత్తమ భావాలూ", ఇంగ్లీషులో వ్రాసిన వ్యాసాలూ చక్కగా అవగాహన అవుతై

లక్ష్మణరావుగారు ఆత్మశోధన చేసుకోలేదు నేను 'ఆద్మీ' లో ఉన్న మంచిని విమర్శించ లేదనే నెపం మీద నాది సద్విమర్శకాదని తేల్చారుగాని, నా విమర్శను విమర్శిస్తూ నా విమర్శలో ఒక్క మంచి విషయంకూడా చూపటం మరిచిపోయినారు నేను శాంతారాం సమర్థతను ఎంతవరకు ఆమోదించానో గమనించటం కూడా లక్ష్మణరావుగారికి సాధ్యం కాలేదు

టెక్నీషియనుకు కావలసిన కూర్పేశక్తి (Synthisising capacity) శాంతారాంలో అపారంగా ఉంది కాని మహోన్నత భావాలను సృష్టించేకళ, అద్భుతమైన పాత్రలను చిత్రించే నాగరికత శాంతారంలో లోపించింది ఇది నేను శాంతారం అభ్యంతర జీవితాన్ని బట్టి

తెలుసుకున్నది కాదు అతని కథద్వారా తెలుసుకున్నదే

నేను కనుక్కోగలిగిన విషయాన్ని లక్ష్మణరావుగారు కనుక్కోలేకపోగా నేను వ్యక్తి దూషణకు దిగాననుకోవడం వారి పొరపాటు, నా పొరపాటు కాదు శాంతారం చిరతపులితోక లాగుతూ, ఇద్దరు బ్రాహ్మణ వటువుల పిలకలు రెండు చేతులు పట్టుకుని ఇద్దరితలలూ ఒకదాని కొకటి కొడుతూ తీయించుకున్న ఫోటోలూ, ఆయన 'అమరజ్యోతి' లో నంద్రేకరు చేత శాంతా ఆప్టేను ఈడిపించటమూ, నీళ్ళలో తోయించటమూ, గోగ్రెమాదిరిగా ఆమెచేత అరిపించటమూ, ఆమె చేతనే, ''అనెక్స్పెక్టెడ్'' అనే కోతి పేరుగల చిత్రంలో సవతి కొడుకును కత్రతో ఉతికించటమూ, ఛోటూ చేత గాడిద మాదిరిగా మొరిగించటమూ – ఇటువంటి వన్నీ లక్ష్మణరావుగారి కాహ్లాదకరంగా ఉంటే, వాటిల్లో శాంతారాం నాగరికతా సంస్కారమూ కనిపిస్తే అందుకు నా జవాబుదారీ ఏమాత్రమూ లేదు నా కదంతా పచ్చి అనాగరికతగా ఉంది! ఆ దర్శకత్వంలో సహజత్వం సాధించటానికి శాంతారాం పడే పాట్లు చూస్తే నాకందులో (inferiority complex) కనిపించింది ఏమో! నేనే అంతపొరపాటు పడ్డానేమో! నేను మాత్రం సర్వజ్ఞుణ్ణా, దేవుణ్ణా?

నా విమర్శనా విధానాన్ని శ్రీ లక్ష్మణరావుగారు సంస్కరించటానికి ప్రయత్నం చేశారుగనక నేను కూడా సాహసించి వారికొక సలహాయిస్తాను నేను పొరపాటు పడి, సద్విమర్శా సంప్రదాయం ఎరగక 'ఆద్మీ' లో లోపాలే తీసుకున్నాననుకోండి. శ్రీ లక్ష్మణరావు గారు అందులో వున్న మంచి విషయాలన్నీ మరొక విమర్శ కింద ప్రకటించి ఉండరాదూ? నా విమర్శను విమర్శించటం వల్ల లోకానికి కలిగే ప్రయోజనం కంటె అధిక ప్రయోజనం కలిగేదిగా? వ్యాసమంతా నామీద వ్యర్థం చేసి పోతూ పోతూ ''అర్థం చేసుకోగలిగితే 'ఆద్మీ' లో అత్యుత్తమ భావాలోన్నో ఉన్నా'' యని అంత ముఖ్య విషయాన్ని ఒక్క ముక్కలో తేల్చటం దేనికీ?

*ప్రజామిత్ర, వారపత్రిక, 7-1-1940*

# 4. భూకైలాసం

భూకైలాసం తాలూక కథ చదివిన తరువాత ఇటువంటికథ ఈ కాలపు సినిమా ప్రేక్షకులు సహిస్తారా అని సందేహం వేసింది కాని చిత్రం చూసింతరవాత, '' ఇట్లా తీస్తే తప్పక చూస్తారు! '' అనిపించింది ఆదర్శాలరీత్యా 'భూకైలాసం' చిత్రంకాదు దానికంతా పుడోవుకిన్ టెక్నికు పెట్టి చిత్రం తీస్తే ఏమయి ఉండేదో చెప్పలేం సరస్వతీ స్టోర్సువారు చేసిందల్లా ఏమంటే నా చిన్నతనంలో– ఇప్పటికీ అంతేనేమో!– మంచి స్టేజి నాటకంగా పరిగణించబడేటటువంటి రూపకాలను తెచ్చి అదే స్పిరిట్‌తో తెరకెక్కించారు ఆ నాటకాన్ని చూసి ఆనందించగలిగే వ్యక్తులు ఈచిత్రం చూసి ఆనందించడానికభ్యంతరం ఏమీ కనిపించలేదు

కథగా చూస్తే భూకైలాసంలో చెప్పుకోదగిన లోపం ఒక్కటే –మొదటిసారి రావణుడు ఆత్మలింగం కోసం బయలు దేరినప్పుడయిన అల్లకల్లోలం – నారదుడు పడ్డ పాట్లూ, విష్ణువు పన్నిన పన్నాగం – రావణుడి రెండవ ప్రయత్నమప్పుడు అయిపులేవు! అందుచేత నారదుడు మొదట పడ్డ పాట్లన్నీ రావణుడు ఆత్మలింగం తెచ్చుకోకుండా ఉండగలందులకన్నట్టుకాక,

రావణుడికి మండోదరినిచ్చి పెళ్ళి చేయడానికన్నట్టుగా ఉన్నాయి . కథలో వాస్తవికత ఏకోశానా లేదు చిత్రం తియ్యటంలో కూడా అటువంటి వాస్తవికతకోసం ఎటువంటి పాట్లు పడబడలేదు అది నాబుద్ధికి చాలా ఉచితంగా ఉంది

ఇక ఈ చిత్రంలో చప్పున స్ఫురించే విషయాలేమంటే, ప్రేక్షకులను రంజింపచెయ్యడానికి ప్రొడ్యూసర్లు చేసిన సర్వతోముఖ ప్రయత్నం తెలుగు సినిమా చరిత్రలో ఇది మొదటిదని ఘట్టిగా చెప్పగలను సంభాషణ రూపంగా గాని, సంఘటనా రూపంగాగాని ప్రేక్షకులకు రక్తి కలిగించే అవకాశం ఎంతచిన్నది దొరికినా ప్రొడ్యూసర్లు బీరు పోనివ్వలేదు సంభాషణలు చిత్రం మొత్తం మీద రెండు మూడు సార్లు కుంటినా మొత్తం మీద చాలా బాగున్నై

ఇది కళాదృష్టితో తీసిన చిత్రంకాదు నటనలో కూడా కళ అనే దానికోసరం ఎవరూ పాటు పడలేదు కాని ప్రేక్షకులను రంజింపజెయ్యటానికి ప్రతి ఒకనటుడూ పనిచేసినట్టు స్పష్టంగా తెలుస్తుంది చిత్రం వల్ల ప్రేక్షకులకు ఏయే భావాలు కలగాలని భావిస్తారో అవన్నీ ముందుగా చిత్రంలో పాల్గొన్నవారు అనుభవించి ఉన్నప్పుడా చిత్రం విజయవంతమైన చిత్రమైతే భూకైలాసం నిస్సంకోచంగా విజయవంతమైన చిత్రమే

ఇందులో పాల్గొన్న నటులను గురించి ఒక్కముక్క చెప్పవలసి ఉంది వారిలో ముఖ్యులు తెలుగువాళ్ళుకారు, కాని ఆలోపం ఎక్కడా కనిపించలేదు ఇదే సాంఘిక చిత్రమైతే వారి 'యాస' బాగా పట్టిచ్చునేమో అందులో కొందరి నటన కూడా కథను బట్టే సహించవలసి వుంది ముఖ్యంగా రావణపాత్రధారికి సామాన్య చిత్రంలో స్థానమేలేదు ఈ కథలో ఆయన నటన పరిసిపోయింది అందరిలోకీ మండోదరి పాత్రధారిణి లక్ష్మీభాయి చాలాబాగా నటించటమే కాక ఆమెకు తెరమీద ఇంకా మహోన్నతస్థానం లభించే లక్షణాలు కనిపించుతున్నై నటనలో ఆమె చూపిన సమగ్రత మన తెలుగు తారలెవరు చూపగలరో నేనూహించలేకుండా ఉన్నాను ఆమెకు తగిన పర్సనాలిటీ లేకపోవటం శోచనీయం

డైరెక్షను చాలా బాగుండడమే కాక ఒకందుకు ప్రత్యేకంగా శ్లాఘించదగినట్టుగా కూడా ఉంది మంచి నాటకం కాతగినది తెరమీదికి రాగానే ఖరాబు కాకుండా చేసినందుకు ప్రత్యేకించి శ్లాఘించవలసింది ఈచిత్రం డైరెక్టు చేసినవారినే ఆయన కథయొక్క పైనం చెడగొట్టకుండా డైరెక్షనులో ఆధునికత్వం చూపగలిగాడు కొన్నికొన్నిచోట్ల డైరెక్షను కథకు వ్యాఖ్యానమల్లే ఉండి పోవలసిన భాగాలు చూడదగినట్టు చేసింది

సంగీతంలో ప్రత్యేక ఏమీలేదు ఇద్దరూ, ముగ్గురూ కలసి పాడేపాటలు లేకుండా ఉంటే ప్రాణానికి ఇంకా హాయిగా ఉండేది అన్ని పాతమట్లే ఉంచక కొన్ని చోట్ల హిందుస్థానీ వులగం ఎందుకు తెచ్చిపెట్టారో బోధపడదు

అభిరుచుల విషయం వస్తే ఇది నాబోటి వాడికి చిత్రం కాదని ఒప్పుకుంటాను కాని విమర్శనాదృష్టితో చూస్తే ఇది ఏ అభిరుచులు కలవాళ్ళకు నిర్దేశించబడ్డదో వారి దృష్టిలో, విజయవంతమైన చిత్రంకాదని నేననలేను చాతకాని రియలిజం కోసం పరిగెత్తి బొక్కబోర్లా పడేవారి కంటె సరస్వతీ స్టోర్సు వారినే అభినందించగలను ఈ చిత్రంలో ఫోటోగ్రఫీ సౌండు రికార్డింగులు కంటికీ, చెవికీ హాయిగా ఉన్నై అక్కడక్కడా చిత్రంలో వేసిన రంగు అట్టే అసహ్యంగా లేదు

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 25-12-1940*

# 5. ధర్మపత్ని

చిత్రం తాలూకు కథలో పత్నీత్వాన్ని గురించి సంప్రదాయ సిద్ధంగా వస్తున్న అభిప్రాయాలు పాటించబడలేదు పాటించబడకనూపోలేదు రాధ మోహనరావును తన భర్తగా పరిగణించి, వివాహ సంస్కారం లేకుండానే, నైతిక దృష్టిలో అతని ధర్మపత్ని అయిపోవటం ఆధునికంగా ఉంది ఆ పత్నీత్వం ఆచరించటం యొక్క మైనం పూర్వభాగంగానే ఉంది ఆడవాళ్ళు స్వతంత్రం కాంక్షించటం కంటె భర్తలకు భక్తి చూపటమే సక్రమమని నిరూపించే ఈ చిత్రంవల్ల కలగగల సంస్కారం అనుమానాస్పదమేమో భర్త అనేవాడు యెవడు? అది కూడా ఈ చిత్రంలో నిర్వచిస్తే కొంత ప్రయోజనం ఉండేది రాధకు మోహనరావు భర్త అయిన విధంగా ప్రపంచంలో ఉన్న ఆడవాళ్లందరికీ భర్తలు దొరుకుతారా? ఈ చిత్రం జనసామాన్యాన్ని స్పృశించలేదు ఈ చిత్రం తాలూకు కథ యితర విధాల మెచ్చుకొనేదే కాని చిత్రరూపం ధరించటంలో చాలా చోట్ల దెబ్బలు తిన్నది ఒక సంసార స్త్రీ చచ్చిపోతూ తన కుమార్తెను ఒక వేశ్యకు పెంచుకోనిచ్చింది ఇది కథకు మూలధారమైన విషయం దీన్ని మనం విశ్వసించలేకపోతే మిగిలిన కథంతా వట్టిగుల్లంతు కాని ఈ విషయానికి చిత్రంలో తగినంత ప్రాధాన్యత ఇవ్వబడలేదు ఆ పిల్లను ఇంకెవ్వరూ ఎందుకు పెంచలేదు? ఒక వేశ్య తన వృత్తిని కూడా విడిచిపెట్టి ఆ పిల్ల కోసం అంత త్యాగం ఎందుకు చేసిందో స్పష్టంగా తెలియదు (ఆవిడకి పిల్లల మీద భ్రమ ఉంటే 20 రూపాయలకు పిల్ల దొరికేదని చిత్రంలో సంభాషణలబట్టే తెలుస్తుంది) ఈవిధంగానే ఇతర ఘట్టాల్లో కూడా అశ్రద్ధ కనిపించుతున్నది మోహనరావు రాధ అనే దానితో సావాసం చేస్తున్నట్టు తల్లి దండ్రులకు తెలుసునా తెలియదా? తెలిసినట్టు ఈషణ్మాత్ర సాక్ష్యం ఇవ్వకుండానే తెలుసునని మనకు అకస్మాత్తుగా నిరూపించారు కథలలో అనర్థకపు కల్పనా, చేతకాని నిర్వహింపూ కనిపిస్తుంది ఆడదానికోసం – ఏ ఆడదాని కోసమైనా సరే – అడ్డమైన పాట్లూ పడటమే దుర్మార్గంగా గల ఆనందరావు పాత్ర సృష్టి అసహ్యకరంగా ఉంది ఉమని చేతనయినవాడు సృష్టించితే అద్భుతమైన వ్యక్తి ఆమె తన ఆనందానికి అడ్డం ఉన్న కారణాన ప్రతిఘటించటంలో తనకు అపాయకరమైన దారి తొక్కటానికి వెనకాడదు అందుకనే భర్తతో తన సవతి పక్షం తీసుకొని పోట్లాడుతుంది ఇది ఎంతో సహజమైన పాత్ర కాని తెరమీద అసహజంగా కనిపిస్తున్నది ముఖ్యమైన విషయాలకు అవసరమైన ప్రాముఖ్యత ఇవ్వకపోవటమే గాక అనవసర విషయాలకు అక్కడక్కడా ప్రాముఖ్యత కూడా ఇచ్చారు, మోహనరావుచేత ఒక పాట పాడించటానికి ఒక మహిళా సమావేశ దృశ్యం పెట్టారు మోహనరావుకూ రాధకూ చిన్ననాటి స్నేహం ఎస్టాబ్లిషు చెయ్యటానికి బోలెడంత మంది కుర్రాళ్ళను తెచ్చి నానా అభాసూ చేశారు చిత్రంలో సంభాషణలు చాలా బాగున్నై సముద్రాల వారితోనూ, తాపీ వారితోనూ సమానమైన స్థానం సంపాదించుకున్నారు శ్రీ చక్రపాణిగారు కాని ఆయన సంభాషణలకు పరిపూర్ణమైన న్యాయం జరగలేదు సాంఘిక చిత్రాన్ని డైరెక్టు చెయ్యటం శ్రీ పి పుల్లయ్యగారికిది కొత్త అయినప్పటికీ బాగానే చేశారు ఇక ముందు వారి డైరెక్షను ఇంకా సమగ్రంగా ఉంటుందని ఆశపడటానికి అవకాశం లేకపోలేదు ఈ చిత్రంలో అందరికన్నా ప్రశంసా పాత్రులైన వారు

నటులు, అందులో ముఖ్యంగా చెప్పుకోదగిన వారు రాళ్లబండీ, భానుమతీ, శాంతకుమారీ, ఆదినారాయణగార్లు హనుమంతరావు నటన దుర్బలంగా ఉంది తనకిచ్చిన అర్థంలేని వేషాన్ని రాళ్లబండి అతినిగ్రహంతో నటించాడు ఇటువంటి నటుడు బొంబాయిలో ఉంటే ఆయన నుంచి ఇంకా మంచి చిత్రాలు సృష్టి కావటమే కాక బాబూరావు పెండార్కరులాంటి ప్రఖ్యాత నటులనిపించుకుంటున్న వాళ్లు సోదిలోకి రాకుండా పోయి ఉందురు తనకు మించిన వేషాన్ని వేసిన భానుమతి ఉమపాత్రను ఎంతో ధైర్యసామర్థ్యాలతో నిర్వహించింది ఈమెను పైకి తేవలసిన బాధ్యత తెలుగు సినిమా ప్రపంచంమీద ఉంది శాంతకుమారి తార కుండవలసిన లక్షణాలన్నీ కలది ఆమె అపజయం ఎరగదు కాని అఖండవిజయమూ ఎరగదనే చెప్పాలి ఆ కొరత ఈ చిత్రంతో కూడా ఇంకా తీరలేదు ఆఖరుకు నేను చెప్పదలచిన ముక్క ఒకటి ఉంది తెలుగు చిత్రాలు తియ్యటనాకి పై దేశస్థులు వస్తే రావచ్చుగాని తమ దేశాల్లో ప్రఖ్యాతులైన కథకులు తెలుగు చిత్రాలు తియ్యటానికి చాలు తారలనుకోవటం సాహసమేమో.

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 8-1-1941*

## 6. ఏక్ థీ లడ్కీ

రూప్ కే షోరి నిర్మించిన '' ఏక్ థీ లడ్కీ''( 'అనగనగా ఒక అమ్మాయి ') అన్న హిందీచిత్రం ఈనెల 6 వ తేదీన మద్రాసు శ్రీకృష్ణాటాకీస్‌లోనూ, కాసినో థియేటర్లోనూ ఒకేసారి విడుదల అయింది

ఈ చిత్రం మొదటినుంచి చివరిదాకా హాస్యంతో కూడుకొని ఉన్నది కథలో పటుత్వంగానీ, పాత్రపోషణలో ప్రత్యేకమైన ప్రతిభగానీ, సన్నివేశాలలో నూతనత్వంకాని లేకపోయినప్పటికీ ఈ చిత్రంలో వినోదానికి ఏ మాత్రమూ లోటు లేదు ఇందులో మరొక విశేషమేమంటే ఈ హాస్యంలో మొరటుతనంగాని, అనౌచితిగాని ఏమీ లేదు

మీనా అనేపిల్లకు నా అన్నవారు లేరు ఆమె ఉద్యోగనిమిత్తం ఒక వ్యాపారస్తుణ్ని చూడబోగా ఆ వ్యాపారస్తుడు అంతకు పూర్వమే హత్య చేయబడి ఉంటాడు హత్యానేరం మీనాపై వడ్డంతపని అవుతుంది ఇద్దరు పాత నేరస్తులు ఆమెను ఆశ్రయించి, ఆమెను తప్పిస్తారు లోకాన్ని మోసపుచ్చడం అలవాటైన ఆ మాజీ ఖైదీలు ఆమెను ఒక గొప్ప హోటల్లో చేర్చి దొంగ చెక్కుల ద్వారా హోటలు యజమాని దగ్గర డబ్బు పుచ్చుకుని కొద్దికాలం నిష్పూచీగా గడుపుతారు ఇంతలో మీనాకు వారి వృత్తి తెలిసివస్తుంది ఆమె తన కపటరాణీ వేషం ధరించి హోటల్లోనుంచి పారిపోతుంది

ప్రమాదవశాత్తు ఆమె ఒక కంపెనీ మేనేజరు (మోతీలాల్) కు స్టెనోగ్రాఫరుగా కుదరటం జరుగుతుంది మోతీలాల్ తన యాజమానికుమార్తె( కులదిపి) ను పెళ్లాడనున్నాడు అయితే అతను అర్జంటుగా ఢిల్లీ వెళ్లవలసివస్తుంది మోతీలాల్‌కు ఢిల్లీ హోటల్లో గది రిజర్వు అయి ఉన్నది కాని ఆ హోటలో మీనా తన పాత స్నేహితులైన మాజీఖైదీలను చూసి, గది కాన్సిల్ చేసి బయట ఉన్న మోతీలాల్‌తో గది దొరకలేదని అబద్ధమాడుతుంది

మరెక్కడా గది దొరకక ఆ రాత్రి ఇద్దరూ పార్కు బెంచిమీద గడిపి, వానకు తడుస్తారు

మర్నాడు ఉదయం మోతీలాల్ సేట్‌ను చూడబోతాడు మీనా పత్రికలో పనివాళ్ల కావాలన్న ప్రకటన చూస్తుంది పనివాళ్లకు గది ఇస్తామని ప్రకటనలో ఉంటుంది మీనా ఈ సేట్ భార్యదగ్గరికే వెళ్లి తానూ, తన భర్తా పనికి కుదురుతామని చెబుతుంది మోతీలాల్ మరి నాలుగురోజులు ఢిల్లీలో ఉండవలసివస్తుంది '' మా పెదనాన్నగారున్నారు వాళ్లింటికి పోదాం'' అని మీనా మోతీలాల్‌ను సేట్ ఇంటికి చేరుస్తుంది మీనా అబద్ధమాడిందనీ, ఇంటివాళ్లతననూ, మీనానూ నౌకరీగా పెట్టుకున్నారనీ తెలిసి మోతీలాల్ మండిపడిపోతాడు గాని గత్యంతరం ఉండదు

ఇంతలో మోతీలాల్ యజమాని, తన మేనేజరు అతీ గతీ తెలియక, కనుక్కుందామని ఢిల్లీ బయలుదేరుతాడు మోతీలాల్, మీనాలు ఢిల్లీలో ఏంచేస్తున్నారో తెలుసుకోవాలనే కాంక్షతో అసూయాగ్రస్తురాలైన కులదీప్ కూడా తండ్రివెంట వస్తుంది

మోతీలాల్ రహస్యం బయటపడుతుంది కులదీప్ అనుమానంకూడా ధృవపడుతుంది మోతీలాల్ పాత ఉద్యోగం పోగొట్టుకుని సేట్‌దగ్గర కొత్త ఉద్యోగం సంపాదించుకుంటాడు

మీనాతో సహా మోతీలాల్ కాశ్మీరువెళ్లి శ్రీనగరులో మకాం పెడతాడు పెళ్లి ఏర్పాట్లు జరిగి శుభలేఖలు వెళతాయి వివాహం ఎట్లాగైనా భగ్నం చేద్దామని కులదీప్ నిశ్చయించుకుని పెళ్లికి వస్తుంది మీనా పాతస్నేహితులు, మాజీ ఖైదీలిద్దరూ కూడా శ్రీనగరు చేరుతాం-గడ్డాలూ, మీసాలు పెట్టుకుని

మీనా తన పాత స్నేహితులను గుర్తిస్తుంది కాని వాళ్ల సంగతి బయటపెడితే హోటలు ఉదంతం బయటపెడతారని ఆమె నోరుకట్టేసుకుంటుంది వాళ్లు మీనా చుట్టాల మని చెప్పుకుని మకాం పెడతారు పెళ్లికి వచ్చిన ఆడవాళ్లకు దొంగలున్నారని భయం పెట్టి వాళ్ల నగలు భద్రంగా దాస్తామని చెప్పి పుచ్చుకుని మోటారు బోటులో వెళ్లిపోతారు వాళ్లను పట్టుకొనటానికి మీనా మరొక మోటారు బోటులో వెంబడిస్తుంది

ఆఖరుకు ఆమె వారిని కలుసుకొని నగలిచ్చేసి తన మర్యాద కాపాడమని వాళ్ళిద్దరిని ప్రాధేయపడుతుంది చివరకు వాళ్లు లొంగిపోయి మీనాకు నగలిచ్చేస్తారు

మీనా మాజీఖైదీల స్నేహితురాలనీ, ముగ్గురూ కలిసి చోరీ చేశారని కులదీప్ చెప్పిన మాటలు నమ్మి, నగలుపోగొట్టుకున్న స్త్రీలచేత తిట్లుతింటూ విచారంలో మునిగివున్న మోతీలాల్ దగ్గరికి నగలతో మీనా తిరిగి వస్తుంది మోతీలాల్, మీనా, ఇద్దరూ సుఖంగా ఉంటారు

మోతీలాల్ దగ్గిర మీనా స్టెనోగ్రాఫర్‌గా చేరి ఉత్తరాలు బొమ్మలుగా లిఖించటమూ, వాళ్లిద్దరూ ఢిల్లీలో సేట్ ఇంట్లో నౌకరీ చేయుటమూ, సేట్‌తో మాట్లాడటానికి వచ్చిన మోతీలాల్‌తో మాజీఖైదీలు పందెం వేసి అతని డబ్బు లాగటమూ మొదలైన సన్నివేశాలు చాలా హాస్యంతో కూడుకొని ఉన్నాయి

కాశ్మీరులో దొంగతనం చేసి వచ్చిన తరువాత మాజీ ఖైదీలైన తన పాతస్నేహితులను వేడుకొని మీనా వారిలో హృదయపరివర్తన కలిగించే సన్నివేశం చాలా ఉపజ్ఞతో కూడుకుని ఉన్నది

కాశ్మీరు దృశ్యాలన్నీ ఎంతో రమణీయంగా ఉన్నాయి ముఖ్యంగా మోటారు బోట్ రేసు అత్యద్భుతంగా ఉన్నది ఇటువంటి సంఘటనలను హాలీవుడ్ నిర్మాతలు అత్యుత్తమంగా

తీస్తే ఎంతబాగుంటుందో, అందుకు ఏమాత్రమూ తగ్గకుండా ఈ సంఘటన చిత్రించబడింది చిత్రంలో పాటలన్నీ వినసొంపుగానే ఉన్నాయి గాని '' లారాలప్పా, ఆధాలప్పా'' పాట జనరంజకమవుతుంది

ఫొటోగ్రఫీలోనూ, శబ్దగ్రహణంలోనూ, దర్శకత్వంలోనూ సమర్థత కనిపిస్తున్నది

మీనా ఇతర నటీనటులలో, చుక్కల్లో చంద్రుడులాగా ప్రకాశించింది ఆమెనటన వివిధ సన్నివేశాలకు తగినట్టుగా, మొదటి నుంచి చివరిదాకా నిండుగా ఉన్నది మోతీలాల్, కులదీప్ కూడా బాగా నటించారు

ప్రేక్షకుడికి పూర్తి వినోదాన్ని ఇచ్చే కొద్ది చిత్రాలలో '' ఏక్ థీ లడ్కీ'' ఒకటి.

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 11-10-1950*

# 7. బీదలపాట్లు

''Les Miserables'' అనే ఫ్రెంచి నవల ఆధారంతో పక్షి రాజాస్టూడియోస్ వారు తమిళంలో '' ఏళైపదుంపాడు'' అన్న చిత్రం తయారు చేశారు అది ఇటీవలనే విడుదలఅయి విజయవంతంగా నడుస్తున్నది ఆ చిత్రానికి తెలుగు సంభాషణలు ''మిక్స్'' చేసి ''బీదల పాట్లు'' అన్న చిత్రం తయారుచేసి ఈ 7వ తేదీన మద్రాసు మినర్వా థియేటర్లో ప్రివ్యూ ఇచ్చారు

ఈ చిత్రానికి మాతృక అయిన విక్టర్ హ్యూగో నవల జగద్విఖ్యాతికన్న రచన దాని ఉదాత్తతకు భంగంకలగకుండా చూడడానికి కథకుడు చాలా ప్రయత్నంచేశాడు ముఖ్యంగా పాత్రపోషణ విషయంలో చాలా శ్రద్ధవహించబడింది అయితే కథ యొక్క వాతావరణం పూర్తిగా తర్జుమాగాక, ఉడికీ ఉడకని అన్నంలాగా తయారయింది, మతగురువు మతగురువుగానే ఉంచబడ్డాడు కాండిల్ స్టిక్స్ ఉంచబడ్డాయి ఇలా చేయడం చేత కథానాయకుడు కొండన్నను ప్రపంచమంతా నిరసిస్తుంటే ఈ రోజున కేథలిక్ మతగురు వొక్కడే ఔదార్యం చూపాడన్న భావం కలుగుతున్నది విక్టర్ హ్యూగో సృష్టించిన మతగురు వు దేశవువాతావరణానికి తగడు మన జాతీయతను నిర్మూలించి సామ్రాజ్యవాదులకు తోడ్పడడానికి వచ్చిన మతప్రచారకులను తప్ప మనదేశం ఎరగదు అదే విధంగా పోలీసు అధికారి పేరు జావర్ అని ఉంచటం కూడా అతకలేదు

ఇంకొక విషయంలో కూడా అనుకరణలో చాలా పెద్దలోపం జరిగింది మాతృకలో నాయకుడు ఖైదునుంచి తప్పించుకొని పారిపోయినవాడు ఈ చిత్రంలో కథానాయకుడు జైలునుండి డిస్చార్జి పొందినవాడు ఇందువల్ల కథానాయకుడిపట్ల ప్రేక్షకులు మరింత సానుభూతి కలుగుతుందని ఆలోచించారేగాని ఉత్తరోత్తరా కథ ఆయువుపట్టు దెబ్బ తింటుందని గమనించలేదు కథానాయకుడు కరుణాకరుడని పేరుపెట్టుకుని పరిశ్రమలు సాగించి భాగ్యవంతుడై నగరానికి మేయరై మానవ సేవ చేస్తూ సుఖంగావున్న తరుణంలో ఇంకెవరినో పట్టుకొని కొండన్న అని ఆరోపించి మామిడికాయ దొంగిలించినందులకు, మూడేళ్లపాటు జాడ పోలీసులకు తెలపనందుకు విచారణ జరుపుతారు అప్పుడు కరుణాకరుడు అక్కడికి వెళ్లి తానే కొండన్ననని రుజువు చేసుకుంటాడు కరుణాకరుడు ఈ పని చేయటం వల్ల రెండో ముద్దాయికి కలిగిన పెద్దలాభం ఏమీ లేదు మామిడికాయలు దొంగిలించిన నేరం అతనిపై ఉండనే

ఉన్నది కొండన్న పద్దేళ్లపాటు గౌరవనీయుడుగా బతికిన అనంతరం అతడు తనజాడ పోలీసులకు తెలువకపోవటం ఏమంత గొప్ప నేరం కాజాలదు అయినప్పటికీ పోలీసుఅధికారి కరుణాకరుణ్ని కన్నంలో పట్టుబడ్డ దొంగలాగా చూడటమేకాక కథానాయకుడు అతని బారినుండి తప్పించుకో వటానికి పారిపోయి పురుషోత్తముడని పేరు మార్చుకుంటాడు ఇది పూర్తిగా అనవసరకల్పన

ఇటువంటి లోపాలున్నప్పటికీ ''బీదలపాట్లు'' చిత్రం చాలానిండుగా ఉన్నది మామూలు తెలుగు చిత్రాలలో కంటే ''తుక్కు'' ఇందులో చాలా తక్కువ ఒక సన్నివేశంవెంట వేరొకటి వేగం వచ్చేస్తుంది అందుచేత చిత్రంనడకలో కుంటులేదు

నాగయ్య, లలిత, పద్మిని, రాజం మొదలైన కొద్దిమంది గొంతుకలు తప్ప మిగిలిన వన్నీ ''డబ్'' చేసిన గొంతులే డబింగ్ జరగవలసినంత జయప్రదంగా జరుగలేదు ఈ విషయంలో చిత్రనిర్మాతలు శ్రద్ధ తీసుకున్నట్లయితే ఈ చిత్రం ఎన్నో రెట్లు రక్తిగా ఉండేది డబింగ్‌లో జరుగవలసిన లోపాలన్నీ జరిగాయి ఒకే కంఠస్వరం రెండు మూడు పాత్రలకు ఉపయోగించడం, కొన్ని పాత్రలకు ఉచితమైనటువంటి గొంతులు ఉండకపోవటం, సౌండ్ సరిగా ''సింక్'' కాపోవడం డబింగ్‌కు సరి అయిన వారిని ఏరుకుని తాపీగా పనిసాగించిన ట్లయితే ఈ లోపాలన్నీ సర్దుకుని ఉండేవి

స్వయంగా సంబాషణలు చెప్పినవారిలో రాజం, లలితా, పద్మినీ కూడా చాలాయాస తెలుగు మాట్లాడారు, ఇటువంటి యస హాస్యప్రధాన పాత్రలకు నప్పుతుందిగాని, గంభీరమైన కరుణామయ పాత్రలకు నప్పదు

చిత్రంలో ఒక రెండు వాక్యాలు అనవసర మనిపించాయి గాని అకారణంగా పాటలు ప్రవేశపెట్టడం జరగలేదు బలవంతాన తెచ్చి పెట్టిన హాస్యంకూడా ఇందులో లేదు

నటనలో ఇంచుమించు అందరూ బాగానే చేశారు నాగయ్యనటన ప్రత్యేకించి చిత్రానికి జీవం పోసింది మిగిలిన వారిలో శామా, బాలయ్య, సీతారామన్ చక్కగా నటించారు అంజల పాత్రను లలిత చాలా సమర్థతతో నిర్వహించింది

డైరక్షను, పాటోగ్రఫీ, సౌండ్ రికార్డింగూ బాగానే ఉన్నాయి మతగురువు సంభాషణ లోనూ, ఇతరచోట్లా గాంభీర్యం కోసమో, ఉదాత్తతకోసమో గ్రాంధికం వాడారు ఇది కేః లం అనవసరం ఇటువంటి భ్రమ ఇటీవల ఎవరూ ప్రదర్శించటం లేదు వ్యావహారికంలోరాని ఉదాత్తత గ్రాంధికంలో ఎన్నటికీ రాదు పాటలు సుమారుగా ఉన్నాయి

మొత్తంమీద ''బీదలపాట్లు'' అందరూ ఆదరించదగిన చిత్రం

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 1-11-1950*

# 8. సంసారం

ఇటీవలనే ఆంధ్రదేశమంతటా విడుదల అయిన శ్రీ సాధనాపిక్చర్స్ వారి తొలి, సాంఘిక చిత్రం ''సంసారం'', జనవరి 4 ఉదయం 9న్నర గంటలకు మద్రాసు శ్రీ కృష్ణాటాకీస్‌లో పత్రికా విలేఖరులు మొదలైనవారికి చూపబడినది కొత్తగా చిత్రనిర్మాణానికి దిగిన ఈ సంస్థ ఎన్ని ఇబ్బందులు ఎదుర్కొని ఈ చిత్రాన్ని తీసినదీ, జ్ఞాపకం రాకుండా ఈ చిత్రాన్ని ఎవరూ

చూడలేరని చెప్పవచ్చు అట్టి ఇబ్బందులలో కూడా, ఉత్తమ తరగతికింద చెప్పదగిన ''సంసారం'' తయారు చేసి విడుదల చేయగలిగినందుకు సాధనావారు అభినందనీయులు

ఈ ''సంసారం'' అచ్చుగా ఒక కుటుంబానికి చెందినది కాదు రఘు (ఎన్ టి రామారావు) సంసారానికి అనుబంధంగా అతని తమ్ముడైన వేణు (ఎ నాగేశ్వరరావు) సంసారమూ, అతని చెల్లెలి భర్త అయిన సీతారాం(రేలంగి) సంసారమూ కూడా చిత్రంలో చిత్రించబడ్డాయి సంసార విచ్ఛిత్తికి మూలశక్తులకు ప్రతినిధులుగా రఘుతల్లీ, రఘు చెల్లెలు కామాక్షీ చిత్రంలో చూపబడినప్పటికీ వారు సంఘంలో వున్న దుష్టశక్తులను చాలా సమగ్రంగానే ప్రతిబింబించారు అట్లాగే రఘూ, వేణూ సంఘంలో ఉన్న మంచితనానికి ప్రతినిధులుగా నిలిచారు

ఒక వంక పాషాణహృదయాలు, వంచనా హింసా, అసత్యమూ, రెండో వంక ప్రేమా, సాహసాలూ, మంచితనమూ ఈ చిత్రంలో ఒకదానికొకటి పోటీ చేయబడినవి సంఘంలోని అసమర్థతకు ప్రతినిధిగా సీతారాం పాత్ర నిలబెట్టబడినది

ఈ చిత్రంలో కథ వాస్తవిక దృష్టితో చూస్తే విమర్శకు నిలిచేదికాదు పాత్రపోషణ కూడా నిర్దిష్టంగా లేదు ఒక ఉదాహరణ, ధనికుడైన కమల తండ్రి, తన కుమార్తె ఎవరో పల్లెటూరి ''బైతు''ను, అందులోనూ నిరక్షరుణ్ని, పెళ్లాడబోతుందని తెలిసి అటే అభ్యంతరం చెప్పక ఏడేళ్ల అనంతరం తన కుమార్తెకు ఇంకొక మొగుణ్ణి చూసి, అకస్మాత్తుగా ఆమె పెళ్లికి గడువు ఏర్పాటుచేసి ససేమిరా అంటాడు తాను ప్రేమించిన వాణ్ణి పెళ్లాడాలనే తహతహ కమలకు ఉండటం సబబే గాని, ఆమే ప్రేరేపణ ఏమీ లేకుండానే తండ్రి తహ తహలాడటం భావ్యంగా లేదు సన్నివేశాలలో కూడా అస్వాభావికత లేదు కన్న తల్లీ, తోబుట్టువూ కలిసి నిర్విరామంగా రఘూ కాపరం కూలదొయ్యటమూ, వేణుకు రంకులు కట్టటమూ స్వభావికంగా లేదు కథకిదే ఆయువుపట్టు

అయినప్పటికీ ఈ కథలో సినిమా చిత్రానికుండదగిన సన్నివేశాలు, నడకా విరివిగా లభించిందే అందుచేత, చిత్రం చాలా దీర్ఘమైనప్పటికీ ఎప్పటికప్పుడు కొత్త చైతన్యం కథలో ప్రవేశిస్తుంది సన్నివేశ వైవిధ్యం వల్ల కలిగిన మరొక మేలేమంటే ప్రాముఖ్య మంతా అచ్చుగా ఏ ఒకటి రెండు పాత్రలకో ఇవ్వక అప్రధాన పాత్రలను సయితం ఆకర్షవంతంగా చిత్రించడానికి వీలయింది రఘూ, మంజూ, వారి పిల్లలూ పడే కష్టాలతోబాటు, సీతారాం, అతని తల్లీ చేసే కోతిచేష్టాలూ, వేణూ, కమలా, ఆమె స్నేహితురాళ్లూ చేసే అల్లరీ చిత్రంలో రక్తికి తీసుకు రాబడ్డాయి ప్రతి సంభాషణా గొప్పగా లేనప్పటికీ మొత్తంమీద సంభాషణలు సినిమా చిత్రానికి ఉండదగినట్లుండమే కాక, తెలివిగా కూడా ఉన్నాయి సంభాషణలో వ్యంగ్యంగా కూడా అశ్లీలాలు లేకపోవటం మరొక సుగుణం

చిత్రానికున్న ప్రధానలోపం పాడవు ఆకర్షవంతమైన సన్నివేశాలుండటం చేత చిత్రం పొడవైతే అంత పట్టింపు లేకపోను, ఈ చిత్రం కేవలం సన్నివేశాలచేతనేగాక అవసరమైన పాటలతో కూడా పెరిగిపోయింది ముఖ్యంగా రాజ్యం పాడిన పాటలతో చాలాభాగం నిరుపయోగమేగాక కథా గమనాన్ని పూర్తిగా నిరోధించాయి అదేవిధంగా రేలంగి, సురభి బాలసరస్వతీ పాడుతూ చేసిన పడకగది నృత్యం తీసివేయవచ్చు

పాటల గురించి ఇంకొక విమర్శకూడా చెయ్యవలసివున్నది ఇటీవల వచ్చిన హిందీ సినిమాగీతాలను చాలావాటిని అనుకరించారు ఈ అనుకరణవల్ల చిత్రానికి చౌకబారుతనం కూడా సంక్రమిస్తుంది హిందీ సంగీతపు ఛాయలు బాగున్నప్పుడు వాటిని సొంతం చేసుకుని మట్లు నిర్మించుకోవటం మంచిదిగాని, హిందీ జాతీయత ముఖానగుద్దినట్టుండే మట్లను కాపీకొట్టడం తగినపని కాదు

చిత్రంలో తగినంత హాస్యం ఉండటం చేతనే కథ ప్రేక్షకులకు భార మనిపించటం లేదు హాస్యనటుడుగా ముద్రపడిన రేలంగితో సరిసమానంగా నాగేశ్వరరావూ, రఘూ తల్లిపాత్ర ధరించిన బెజవాడ కాంతమ్మా, కామాక్షి పాత్ర ధరించిన సురభి బాలసరస్వతీ, సీతారాం తల్లి పాత్ర వహించిన సూర్యకాంతం కూడా చక్కని హాస్యం ఒప్పించారు

ఇతర నటులలో రఘు పాత్ర ధరించిన ఎన్ టి రామారావు చాలా నటనా సామర్ధ్యం కనబరచాడు పూర్వం ''స్వర్గ సీమ''లో నాగయ్యలాంటి అనుభవశాలి ధరించిన మూర్తి పాత్రవంటిది రఘూపాత్ర అటువంటి పాత్రను సమర్ధతతో నిర్వహించి రామారావు తెలుగు సినిమా నటులలో అగ్రశేణిలో చేరడానికి అర్హత పొందాడనవచ్చు రాజ్యంకూడా అతిక్లిష్టమైన మంజా పాత్రను సమర్ధతతో నిర్వహించింది కాని చిత్రంలో ఆ పాత్రకు ఉండదగినంత ప్రాముఖ్యం లేకపోయింది ఆమెకు నిజంగా మంచి అవకాశం లభించిన ఆఖరి దృశ్యాలలో ఆమె నటన అసమానంగా ఉన్నది

నటులందరిలోకి కమలపాత్ర ధరించిన పుష్పలతా, డా. దామోదరం పాత్ర ధరించిన సుందరరావూ బలహీనంగా ఉన్నారు. కొద్దిసేపే తెరమీద కనిపించినప్పటికీ మంజా తండ్రిగా నటించిన రంగస్వామీ డాక్టరు పాత్ర ధరించిన దొరస్వామీ మంచి నటన కౌశలం ప్రదర్శించారు

డైరెక్షన్‌లో ప్రసాద్ ప్రత్యేకత మళ్లీ ఈ చిత్రంలో కొట్టినట్టు కనిపిస్తుంది స్క్రిప్టు రూపంలో కాగితం మీద ఉన్న దృశ్యాన్ని సెల్యులాయిడ్ మీదకి ఎక్కించేటప్పుడు ఆదృశ్యానికి జీవం ఇచ్చే రహస్యం ప్రసాద్‌కు తెలిసినట్టుగా చాలా మంది డైరెక్టర్లకు తెలియదు స్క్రిప్టులోని పెద్ద లోపాలను డైరెక్షనుతో కప్పిపుచ్చటం ఏడైరెక్టరుకూ సాధ్యంకాని పని కాని నిర్ణీత సన్నివేశాన్ని వాస్తవిక సంఘటన అనిపించేలాగా చేసే కళాసృష్టి ప్రసాద్ చేతిలో ఉన్నది

ఈ చిత్రానికి కేమెరామెన్‌గా పనిచేసిన రహమాన్, బి సుబ్బారావులు చాలావరకు నిపుణతతో పనిచేశారు కాని ఎడిటింగ్ ఉండదగినంత నిర్దుష్టంగా లేదు అయితే దీనికి బాధ్యులెవరో ఊహించటం కష్టం రాజ్యంచేత పాడించిన పాటలు ( లీల పాటలకు ప్లేబాక్) సరిగా ''సింక్'' కాలేదు

ఎన్ని లోపాలున్నప్పటికీ ''సంసారం'' చెప్పుకోదగిన చిత్రం ఇది ప్రజాదరం విశేషంగా పొందగలది, పొందదగినది సాంఘిక చిత్రాలకు గిరాకీ తక్కువ ఉన్న రోజులలో మంచి సాంఘిక చిత్రం నిర్మించిన సాధనావారు ఎంతైనా అభినందనీయులు

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 10-1-1951*

# 9. మంగళ

జెమినీస్టూడియోస్ వారు, తాము యుద్ధకాలంలో తయారుచేసిన ''మంగమ్మశపథం'' అనే చిత్రాన్ని కొత్తగా హిందీ, తెలుగుభాషలలో పునర్నిర్మించి సంక్రాంతినాడు విడుదలచేశారు జనవరి 12న తెలుగు ''మంగళ'' జెమినీస్టూడియోలో పత్రికలవారి కొరకు ప్రదర్శించబడింది

''మంగళ'' జానపద చిత్రం ఆబాల గోపాలాన్నీ ఆకర్షించగల ఇతివృత్తం ఆధారంతో ఈచిత్రం నిర్మించబడింది నీతి నియమాలు లెక్కచెయ్యని ఒక రాజకుమారుడు అందగత్తె అయిన సంసారిపిల్ల నొకదాన్ని చూసి మోహించి దానిచేత తిరస్కరించబడతాడు వాడికి ఆ పిల్లపై ఆగ్రహం వచ్చి ఆమెను బలవంతంగా వివాహం చేసుకుని కారాగృహంలో ఉంచి ఆమెకు సంసార సుఖం లేకుండా చేస్తాడు ఆ రాజకుమారుడికే ఒక పిల్లవాణ్ణి కని వాడిచేత తండ్రిని కొట్టిస్తానని ఆమె ప్రతిజ్ఞ చేసి నెరవేర్చుకుంటుంది

జెమినీ స్టూడియోస్‌వారు తీసే జానపద చిత్రాలలో రెండు సుగుణాలు కనిపిస్తాయి ఒకటి, కథ చాలా సాఫీగా చెప్పటం, రెండు, అమానుషశక్తులకు తావు లేకుండా చూడటం, ఈ రెండు విషయాలూ ఇతర జానపద చిత్రాలలో తరుచు చూపిస్తూనే ఉంటాయి ఈ సుగుణాలు ''మంగళ'' లో కూడా ఉన్నాయి

కాని అమానుషశక్తులూ రానివ్వకుండా కేవలం యుక్తిపైనే ఆధారపడి జానపద చిత్రం నడపటంలో కొన్ని చిక్కులు లేకపోలేదు మంగళ ఖైదునుంచి తప్పించుకుని బయటికి వెళ్లి దొమ్మర విద్యలు నేర్చి రాజకుమారుణ్ణి మెప్పించి అతని ద్వారా గర్భం ధరించి పిల్లవాణ్ణి కని, వాణ్ణి తన పుట్టింట పెంచాలంటే యుక్తి చెయ్యటం తప్పనిసరి ఈయుక్తి ఏమిటంటే తన తండ్రి చేత సొరంగాలు తవ్వించటం మంగళ తండ్రి ఈ పనిని రెండో కంటివాడి తెలియ కుండా ఎట్లా చేశాడో ప్రేక్షకులు ఊహించుకోలేరు చిత్రంలో మనం చూసే సొరంగం ప్రభుత్వాలు తలుచుకుంటేగాని సాధ్యపడేది కాదు, సొరంగంతోపాటు ఖైదుకు మరతలుపు కూడా ఏర్పాటు చేయబడింది ఈ విషయం రాజకుమారుడికిగాని, మంగళను నిత్యమూ అనుసరించి ఉండే రతికిగాని, కింద కాపలా ఉండే రక్షకభటులకుగాని ఏమాత్రమూ తెలియ దు ఆవిధంగానే రాజకుమారుణ్ణి పోలిన కుర్రవాడు మంగళ తండ్రి ఇంట్లో ఎదిగివస్తుంటే వాడి ఆచూకి ఏవిధంగానూ రాజకుమారుడికి తెలియదు మంగళ చేసిన శపథం నెరవేరటానికి ఈరెండూ అతి ముఖ్యమైనవిషయాలైనప్పటికీ ఇది నమ్మదగినట్లుగా చిత్రించబడలేదు ఇది కథకు చాలా పెద్ద లోపం

కథలో మరొక పెద్దలోపం ఏమిటంటే మంగళ దొమ్మరి నాయకుడి కూతురని వంక పెట్టుకుని పాశ్చాత్యనృత్యం చెయ్యటం మంగళ దొమ్మర్లకు బోలెడంత డబ్బిచ్చి వాళ్లదగ్గిర ఏవేవో నేర్చుకున్నట్టు చూపబడింది కాని చివరకు ఆమె రాజకుమారుడి దగ్గిర చేసే నృత్యానికి దొమ్మర్లుచేసే ఆటలకూ, పాడే పాటలకూ ఎటువంటి సంబంధమూ లేదు ఈ ఒక్క నృత్యం కోసం దొమ్మర్లకథను చాలా ఎక్కువ చూపించారంటే, ఈదొమ్మర్ల లేకపోతే నష్టమని ప్రేక్షకుల కు అనిపించటం సహజం అదీకాక రాజకుమారుడు చేరదీసిన ఇతరస్త్రీ నమూనాలు చూస్తే

మంగళ ఏమారు వేషంలో వచ్చి కన్నుగీటినా వలలోపడేవాడేనన్న భావం ప్రేక్షకులకు కలుగుతుంది అటువంటప్పుడు మంగళ పెద్ద పన్నాగం వెయ్యవలసిన అవసరం లేదు చౌకబారు నిర్మాతలవలె జెమినీస్టూడియోస్‌వారు హాలీవుడ్ పాటలను అనుకరించటం బాగాలేదు

కథలో ఇటువంటి లోపాలున్నప్పటికీ మంగళ చిత్రంలో కావలసినంత వినోదం ఉన్నది దొమ్మరివాళ్ల మొగ్గలూ, టి ఆర్ రామచంద్రన్ హాస్యమూ, సూర్యప్రభ పాటలూ, నృత్యాలూ ప్రేక్షకులను ఆకర్షించదగి ఉన్నాయి

మంగళగా భానుమతి సమర్థతతో నటించింది సర్వతోముఖమైన ఆవిడప్రజ్ఞను బయటపెట్టటానికి మంగళ పాత్ర బాగా వినియోగపడింది మూడుతరాలకు చెందిన పాత్రలను రంజన్ బాగానే పోషించాడు మొద్దబ్బాయిగా రామచంద్రన్ చిత్రానికి మంచి హాస్యం చేకూర్చాడు మంగళ తండ్రిగా దొరస్వామి, దొమ్మరి నాయకుడి కుమార్తెగా సూర్యప్రభా కూడా తమ పాత్రలను బాగా పోషించారు

తాపీ ధర్మారావు నాయుడు గారి పాటలు అంతగా బాగాలేవు గాని మాటలు చక్కగా అమరాయి కాని ముందుగా ఏర్పాటైన మట్లకు పాటలు రాయటం ఎవరికైనా చిక్కే

సెట్టింగులూ, ఫోటోగ్రఫీ, సౌండురికార్డింగూ, పాటల మట్లూ బాగానే ఉన్నాయి

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 24-1-1951*

# 10. తిలోత్తమ

పూల మాలలు కట్టుకుని జీవించే దేవదత్తుడనే అందగాడు ( నాగేశ్వరరావు), వసంతసేన అనే వేశ్య (సూర్యప్రభ) చేతా, దేవలోకంలోని అప్సరస తిలోత్తమ ( అంజలీ దేవి) చేతా, ఆమె అంశనే జన్మించిన తిలోత్తమ ( అంజలీ దేవే) అనే రాజకుమార్తె చేతా ప్రేమించబడి, స్వర్గలోక తిలోత్తమ ఇంద్రజాలానికీ, ఆమెను ప్రేమించిన గంధర్వుడి శాపానికీ గురి అవుతాడు ఈ శాపం ఫలితంగా స్వర్గలోక తిలోత్తమా, దేవదత్తుడూకూడా కిరాతక రూపాలు ధరించి తమ జన్మ వృత్తాంతాలు మరిచి ఉన్న స్థితిలో, దేవదత్తుడు తన భార్య అయిన కిరాతకి వంధ్యత్వం పోగొట్టడానికిగాను తనవల్లనే భూలోక తిలోత్తమకు కలిగిన బిడ్డను కాళికి బలి ఇస్తాడు కాళి ప్రత్యక్షమై అందరి కష్టాలూ కడతేర్చి బలి అయిన బిడ్డను బతికిస్తుంది స్వర్గలోక తిలోత్తమ స్వర్గానికి తిరిగిపోగా దేవదత్తుడు భూలోక తిలోత్తమ తోనూ, వసంతసేనతోనూ సుఖంగా ఉంటాడు ఇది ''తిలోత్తమ'' చిత్రం తాలూకు టూకీ కథ

ఈ కథను తెరమీద పరచటంలో అనేక లోపాలు జరిగినా శోభనాచలవారు మొత్తంమీద ప్రేక్షకులకు రక్తి కలిగించే చిత్రమే తీశారు జరిగిన లోపాలలో ముఖ్యంగా పేర్కొనదగినది చిత్రంలో వడి లేకపోవటం అసలే అనేక సంఘటనలూ, సన్నివేశాలూ గల కథ కావటానికి తోడు ప్రతి సంఘటననూ అనవసరంగా నానబెట్టారు అందుచేత విరామందాకా కథ ఎక్కడా పరుగులుతీసే ఆశ కనబరుస్తుందే గాని నిజంగా పరుగులు తీయదు

దేవదత్తుడూ, అతని అన్నా పూలమాలలు అమ్మబోవటంతో ప్రారంభమైన చిత్రం, దేవదత్తుడు వసంతసేనను కలవటం, అక్కడినుంచి దేవలోకానికి తిలోత్తమ చేత అపహరించ

బడటం పూర్తి అయ్యేవరకూ బాగానే నడుస్తుంది అక్కడినుండి దేవదత్తుడు తిలోత్తమతోబాటు గంధర్వ శాపానికి గురిఅయ్యేదాకా గల కథ నృత్యాలతోనూ, అల్ప సన్నివేశాలతోనూ అకారణంగా పొడిగించబడింది నిజానికి నృత్యాలు బాగానే ఉన్నాయి స్వర్గంలోని తిలోత్తమ దాసీపాత్ర కూడా చక్కగానే చిత్రించబడింది అయితే మొత్తం కథలో స్వర్గలోక సన్నివేశాలు ఇంత ప్రాధాన్యం పొందనవసరం లేదు చిత్రానికి ప్రధాన కథానాయిక స్వర్గలోక తిలోత్తమ అయితే ఈ ట్రీట్మెంటుకు సమర్థన ఉండేది కాని అసలు కథానాయిక భూలోక తిలోత్తమ. ఆమెను ఎంత త్వరగా ప్రవేశపెడితే చిత్రానికంత బిగువు వచ్చేది

ఇతర లోపాలలో ముఖ్యంగా ఎన్నదగినది కాళికాదేవి వచ్చి గంధర్వుడి శాపం ఉపసంహరించటం కాళికాదేవి వల్ల అయిన పనే చేయగల ''బైరాగి చిటిక'' చిత్రంలో ప్రవేశ పెట్టారు భూలోక తిలోత్తమ మేనమామ, దేవదత్తుణ్ణి వెదుకుతూ, తిలోత్తమా రాజకుమారి దగ్గిరికి వచ్చిన వసంతసేనను ప్రేమించి, ఆమె చేత నిరాకరించబడి, ఆమెను వశపరచుకొనటానికి ''గోసాయిచిటిక'' ఒకటి సంపాదిస్తాడు అది అతని కెందుకూ పనికిరాదు ఎందుచేతనంటే ఆ ''చిటిక'' ప్రేమించి మరచిన వారిని మాత్రమే చేరదీస్తుంది భిల్లుడై తిరుగుతున్న దేవదత్తుడు భూలోక తిలోత్తమను ప్రేమించి మరచినవాడే కనక, అతనిమీద అది అమోఘంగా పని చేసి ఉండును ఈ ''గోసాయి చిటిక'' కోసం ఎన్నో వందల అడుగులు దుర్వ్యయంచేసి శోభనాచల వారు ఆఖరుకు దీనిని అవసరానికి వినియోగపరచక పోవటం ''అంగట్లో అన్నీ ఉన్నాయి, అల్లుడినోట్లో శని'' అన్న సామెత స్ఫురింప జేస్తుంది

పాత్ర సృష్టిలోనూ లోపాలున్నాయి దేవలోకంలో దేవదత్తుడికి అపాయం ఉన్నదని భయపడిన స్వర్గలోక తిలోత్తమ అతనితో సహా భూలోకానికి వెళ్లక, భూలోక తిలోత్తమను చూపడం దేనికో అర్థం కావడం లేదు ఈ రెండు పాత్రలనూ ఒకే నటి చేత నిర్వహింప జేసి కూడా వారి పోలికలను కథలో ఏవిధంగానూ ఉపయోగపరచలేక పోయినారు అంజలీదేవిని సాధ్యమైనంత వరకు ప్రేక్షకుల ఎదుట ఉంచే ఉద్దేశంతో మాత్రమే రెండు పాత్రలనూ ఆమె చేత ధరింపజేసినట్టు కనిపిస్తుంది

ప్రమాదవశాన అంతఃపురం నుంచి వసంతసేనకు మారుగా తన మేనమామ కామ సంతృప్తి కొరకు తీసుకురాబడి అనంతరం అరణ్యంలో వదలబడిన తిలోత్తమా రాజకుమారి తన రాజ్యానికి వెళ్లటానికి ఎట్టి ప్రయత్నమూ చేయదు అరణ్యంలో తనను రక్షించిన సార్థవాహులతో తాను ఫలానా అని అయినా చెప్పదు నిండు మూలాలుగా ఉన్న స్థితిలో ఆమె ప్రవర్తన దురూహ్యం

కొన్ని చోట్ల సంభాషణలు అసభ్యంగా కూడా ఉన్నాయి ఇటువంటి లోపాలు సవరణ చేసుకున్నట్టయితే ప్రేక్షకుల దృష్టిలో ఈ చిత్రం ఎన్నో రెట్లు ఆకర్షవంతంగా ఉండేది

మామూలుగా అన్ని జానపద చిత్రా కథలకూ ఉండే లోపమే ఈ చిత్రంలో కూడా ఉంది అది కృతకత్వం స్వర్గలోక తిలోత్తమకు సంభవించే కష్టాలలో ఒకటీ సహజమైనది కాదు కథానాయకుడైన దేవదత్తుడి ''మూడు వలపులూ'' కృత్రిమంగానే ఉన్నాయి వసంతసేనకు పూలమాల కట్టబోయి ఆమెను తక్షణం ప్రేమించి, ఆమె ప్రేమను పొందుతాడు అల్లాగే నిద్రపోతూ స్వర్గలోక తిలోత్తమ చేత ప్రేమించబడి, ఆమెను చూస్తూనే ప్రేమిస్తాడు అదే విధంగా భూలోక తిలోత్తమను చూసి, ఆమెచేత చూడబడి వెంటనే ప్రేమిస్తాడు ఇది ప్రబంధ ప్రణయం, కృత్రిమం

ఈ ప్రేమల్లో ఏ ఒకటి అతన్ని చైతన్యవంతుణ్ణి చేసినట్టు కనబడదు ఇది జనసామాన్య దృష్టిలో అంత సంతృప్తికరంగా ఉండకపోవచ్చు)

కథలో ఏ లోపాలున్నప్పటికీ ఈ చిత్రంలో పాత్రలను, కథ అనుమతించినంతలో, బాగా ఉపయోగించుకున్నారు ఇది చెప్పుకోదగిన సంగతి అంజలీదేవి ధరించిన మూడు పాత్రలూ తిలోత్తమా, రాజకుమారి, కిరాతకీ కూడా దేని కది తగినంత ప్రాముఖ్యం ఇవ్వబడి విస్పష్టంగా ఉంచబడ్డాయి దేని అనుభవం, దేని మనస్తత్వం, దేని కష్టసుఖాలు దానికి చక్కగా కేటాయించ బడ్డాయి వసంతసేన పాత్ర కూడా మొదటి నుంచి చివరదాకా చక్కగా చిత్రించబ డింది ఈ పాత్రకు గల ప్రాముఖ్యం కూడా ఆవగింజంతైనా తగ్గించబడలేదు

దేవదత్తుడి పాత్రకు కూడా ఎట్టి లోపమూ జరగలేదు ఈ పాత్రకూడా ఎక్కడికక్కడ కథలో తన ప్రాముఖ్యాన్ని గట్టిగా రుజావు చేసుకుంటుంది

కథలో తిలోత్తమ రాజకుమారి మేనమామ పాత్రకు అవసరమైన దానికన్న కూడా ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వబడిందని చెప్పాలి ఉన్న ప్రాముఖ్యం ఏమాత్రమూ తగ్గించబడలేదు

కనకం ధరించిన మాలతి పాత్రా, రామ్మూర్తి ధరించిన కోమటబ్బాయిపాత్రా, కె వీ సుబ్బారావు ధరించిన కోమటి పాత్రా, స్వర్గలోక తిలోత్తమ చెలికత్తె పాత్రకూడా చక్కగా, నిండుగా చిత్రించబడటం ప్రశంసనీయం మన చిత్రాలలో అనేక పాత్రలకు ప్రాధాన్యం ఉన్నప్పుడు ఒక పాత్రకోసమో, రెంటికోసమో మిగిలినవి త్యాగం చెయ్యటం జరుగుతూ ఉంటుంది.

''తిలోత్తమ'' చిత్రంలో అన్నిటికన్న ఎక్కువగా చెప్పుకోదగిన ఆకర్షణ అంజలీ దేవి నటనా, నృత్యాలూ, దేవతాస్త్రీగానూ, స్త్రీగానూ, కిరాతకి గానూ కూడా ఆమె చాలా ప్రతిభావంతంగా నటించి చిత్రానికి ఎంతోజీవం పోసింది ఆమె నృత్యాలు బాగున్నందుకు ఆమెనూ, వేదాంతం రాఘువయ్యనూ అభినందించవలసిందేగాని దేవలోక నృత్యాలు ఆమెరి కన్ చిత్రాలలో చూపించేవి జాతీయ నృత్యాలు లాగా ఉన్నట్లు చూపటంలో ఔచిత్యం ఏమిటో తెలియటం లేదు తెల్లవాళ్ళు మననెత్తి కెక్కించిన భావదాస్యం ఇవాళ ఇంకా ఈ విధంగా వ్యక్తం అవుతూ ఉండటంకన్న శోచనీయం మరొకటి ఉండబోదు వేదాంతం రాఘువయ్య భరత నాట్యంలో నిధి, స్వర్గాన్నీ, అక్కడి కళలనూ ఉదాత్తంగా చూపదలిస్తే భరత నాట్యం కన్న దక్షిణ ఆమెరికా నృత్యాలు జనరంజక మవుతాయని చిత్రనిర్మాతలు భ్రమపడి ఉంటే ఆ భ్రమ కేవలం వారిదే

దేవదత్తుడి పాత్రను అన్ని దశలలోనూ నాగేశ్వర్రావు విజయవంతంగా పోషించాడు అయినప్పటికీ కిరాతుడుగా అతను చూపిన చురుకు అంతకుపూర్వం చూపలేక పోయినా రు దానికి కారణం ఆ పాత్రలో, ఆ దశలలో సహజత్వం లోపించటం కావచ్చు ఎందుకంటే స్వర్గలోక తిలోత్తమ మెడలో హారమైపోయినది మొదలు భూలోకంలోకి పతనమయేదాకా దేవదత్తుడు కేవలం పరిస్థితుల కీలుబొమ్మ అతనిలో ఏ చైతన్యమూ లేదు అప్పటికీ ఆ పాత్రను ఆ దశలోకూడా సరిగా పోషించటానికి చేతనైనంత కృషి చేశాడు స్క్రిప్టు అనుకూ లించనప్పుడు నటుడి జయాపజయాలు కేవలం దైవాధీనాలు

నటనలో బి ఎ సుబ్బారావూ, సూర్య ప్రభా కూడా చక్కగా నటించారు వసంతసేన పాత్రలోని గాంభీర్యాన్ని సూర్యప్రభ అడుగడుగునా బాగా వ్యక్తం చేసింది కనకం, రామ్మూర్తి,

కే వీ సుబ్బారావూ, రాఘవన్ తమ పాత్రలు బాగానే పోషించారు

చిత్రంలో ఆదినారాయణ ఇచ్చిన సంగీతమూ, నేపథ్య సంగీతమూ బాగున్నాయి పాటలూ, వాటి మాట్లూ కూడా బాగున్నాయి అంజలీదేవికి ప్లేబాక్ పాడిన జోలపాట చెవికి చాలా ఇంపుగా ఉంది నృత్యాలు ఎక్కడైనా పానకంలో పుడకల్లాగా పడ్డాయి గాని పాటలు సందర్భోచితంగానే ఉన్నాయి

మొత్తంమీద ''తిలోత్తమ'' ప్రజాదరణ పొందగల జానపద చిత్రాలలోకే వస్తుంది

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 28-2-1951*

# 11. హమ్‌లోగ్

ఈనాడు వెలువడుతున్న చిత్రాలలో ఇది అనేక విధాల విశిష్టతగల చిత్రం మొదటి సంగతి, ఇది వినోదం కొరకు తీసిన చిత్రం కాదు, ఈ చిత్రం చూస్తూ ఆనంద పారవశ్యం పొందటం సాధ్యం కాదు ఇది జీవితాన్ని ప్రతిబింబించే ఉద్దేశంతో తీసిన చిత్రం, జీవితంలో ఏ భాగాన్ని ప్రతిబింబిస్తుందన్న విషయం కథచూస్తే తెలుస్తుంది మూడో విషయమేమంటే ఈ చిత్రం ప్రేక్షకులను గౌరవిస్తుంది చాలా చిత్రాలు గౌరవించవు ఇతర చిత్రాలను తయారు చేసేవారికి ప్రేక్షకులపై గల భావాలు ఈ చిత్రంలోనే ఒక పాత్ర ద్వారా వ్యక్తం చేయబడ్డాయి ''ప్రజలు మూఢులు, దేవుడిదయవల్ల వాళ్ళు నాలుగు కాలాలపాటు అట్లాగే ఉండాలి వాళ్లను మూఢులను చెయ్యటానికే మనం నాటకాలు ప్రదర్శించాలి,'' అంటుందీ పాత్ర ప్రజలలో సర్వశక్తులూ ఉన్నవనీ, వారినుంచి చైతన్యం ప్రభవిస్తుందనీ ఈ చిత్రం విశ్వసిస్తున్నది

ఈ చిత్రానికి కథానాయిక పారో(నూతన్) క్షయరోగి అయినపిల్ల ఈమె తండ్రి లాలాజీ(కనైలాల్) సేట్‌జీ దగ్గిర 80 రూపాయల గుమస్తా పారోతల్లి (దుర్గాఖోటే) తన భర్తతోనూ ముగ్గురు బిడ్డలతోనూ ఉపాయంగా సంసారం ఈదుకొస్తోంది పెద్దవాడు రాజ్( బల్రాజ్ సహానీ) సాంఘిక వ్యవస్థపై విశ్వాసం లేని వాడు

పారోకు చికిత్స చేయవలసి వచ్చేసరికి దారిద్ర్యం ఈ కుటుంబాన్ని మరింత బాధిస్తుంది ఈ దారిద్ర్యం కారణంగా రాజ్ తనను ప్రేమించే నేపాలీ (శ్యామా) ప్రేమను స్వీకరించలేడు తన రోగం కారణంగా పారో ఆనంద్ (సజ్జన్) ప్రేమను స్వీకరించలేకపో తుంది

ఈ స్థితిలో ఒకనాడు రాజ్ తన తండ్రి ఇంట తెచ్చిపెట్టిన సేట్‌జీ డబ్బు పెట్టె తస్కరించి తన మిత్రుడైన కుందన్( అన్వర్ హుసేన్) ఇంట దాస్తాడు కుందన్ పెట్టె పగలగొట్టి డబ్బు పట్టుకుపోయి జూదంలో పోగొట్టుకుంటాడు లాలాజీ జైలుకుపోతాడు కుటుంభారం మీదపడగా రాజ్ అతిగా శ్రమించి గుండె జబ్బు తెచ్చుకుంటాడు ఇంతలో కుందన్ తిరిగి రాజ్ కంటపడి, రాజ్ తనను ద్వేషించటంలేదని తెలుసుకుని పశ్చాత్తాపపడి ఆత్మహత్య చేసుకుంటాడు రాజ్ అతనిని హత్య చేశాడని విచారిస్తారు విచారణ సమయంలో జరిగినది చెబుతూ రాజ్ మరణిస్తాడు పారో రాసిన నాటకం ''హమ్‌లోగ్'' అన్నది ఆనంద్ సహాయంతో ఆడబడుతుంది రాజ్ కోర్టులో సాక్ష్యంచెబుతూ అన్నమాటలలోని యథార్థాన్ని ఆ నాటకం ప్రచారం చేస్తుంది

ఈ కథలో కొన్ని గమనించదగిన విషయాలున్నాయి ఈ కథలో దారిద్ర్యం ఉన్నది గాని అది కార్మికుల దారిద్ర్యం కాదు పారో నాటకం రాసే తాహతుగలది మిగిలిన పాత్రల

కు కూడా ప్రేమ అంటే ఏమిటో, స్నేహమంటే ఏమిటో, నీతి ఏమిటో తెలుసును జీవితంలో అవి లేకుండా పోయినందుకు ఆ పాత్రలు బాధపడతాయి అన్నిటి స్థానమూ డబ్బు ఆక్రమించుకున్నందుకు అవి చింతిస్తాయి

అన్ని పాత్రలలోను ఉదారమైన పాత్ర రాజ్ ఆనంద్ తన డబ్బు ఎత్తుకుపోయినాడని ఆగ్రహించాను ''అందులో ఏముంది? నేనూదొంగనే మనమంతా దొంగలమే,'' అంటాడు, ఆనంద్‌లోకూడా మానవత్వం పూర్తిగా నశించలేదు '' ఇదేం జీవితం, రాజ్? ఇందులో ఎట్లా బతకటం ?''అంటాడు ''మానవుడు నశించడు,'' అంటాడు రాజ్ అదే అతని దృఢ విశ్వాసం

ఎన్నో చోట్ల ఈ చిత్రం అతి చిన్న సన్నివేశాలలో గుండెను గుచ్చుకుంది తల్లి దారిన పోతూ ఉండగా వైద్యుడు కనపడి పారో ఆరోగ్యం గురించి ప్రస్తావించి ఆ పిల్ల బట్టలూ, లోటాలూ, కంచాలూ ఎడంగా ఉంచమంటాడు ఆమె ఇంటికి వచ్చేసరికి అక్క తాగిన లోటానుంచి తమ్ముడు తాగబోతూ ఉండటం చూసి ఆమె కేకపెట్టి మరుక్షణం పెద్దపెట్టున ఏడుస్తుంది కేవలం శోకంకంటె బాధతో కూడిన ఏడుపుకు ఈ చిత్రంలో ప్రాముఖ్యం ఉంది

చిత్రంలో సంభాషణలు పరిమితంగానూ, శక్తివంతంగానూ ఉన్నాయి ఫొటోగ్రఫీ, రికార్డింగు బాగున్నాయిగాని, ఫొటోగ్రాఫరు పాత్రల ముఖాలను సగం వెలుగులోనూ, సగం చీకటిలోనూ ఉంచటం అతిగా చేశాడు సంగీతం కూడా కొత్త బాణీలో ఉన్నది

నటులలో బల్రాజ్ సహానీ అత్యద్భుతంగా నటించారు దుర్గాఖోటే, నూతన్, శ్యామా, అన్వర్ హొసెన్, రషీద్ ఖాన్ మొదలైనవారు కూడా చాలా బాగా నటించారు

ఈ చిత్రాన్ని సృష్టించిన జీయాసార్ హదీ అన్ని విధాలా అభినందనీయుడు అందరూ చూడదగిన కొద్దిపాటి మంచి చిత్రాలలో ''హమ్‌లోగ్'' ఒకటి

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 12-12-1951*

# 12. నా ఇల్లు

ఆంధ్ర సినిమా ప్రేక్షకులు చాలా కాలంగా ఎదురు చూస్తూ వుండిన 'నా ఇల్లు' బయటకి వచ్చింది నాగయ్యగారికి చిత్రం గనక ఇందులో కొన్ని ఆశించాం ఆ ఆశలు కొంతవరకు ఫలించాయని చెప్పవచ్చు మొదటి సంగతి నాగయ్యగారి గంభీరమైన నటన మరొకసారి ఈ చిత్రంలో చూశాం రెండో సంగతి విశిష్టమైన సంప్రదాయమైన సంగీతం ఈ చిత్రంలో విన్నాం

అయితే 'నా ఇల్లు' కొంత ఆశాభంగాన్ని కూడా కలిగించకపోలేదు ఇందులో నాగయ్యగారు ధరించిన శివరాం పాత్ర ఆయన పూర్వం ధరించిన 'త్యాగయ్య' కంటె గొప్పది కాదు 'బీదలపాట్లు' చిత్రంలో ఆయన ధరించిన పాత్రకన్నా కూడా ఎక్కువైనది కాదు ఈలోపం ఈ శివరాం పాత్రలోనే ఉందనటానికున్కూడా వీలులేదు అసలా పాత్రకు సరిఅయిన న్యాయం జరిగినట్టు కనబడదు

శివరాం కొన్ని ఆదర్శాలను నమ్ముకుని, వాటిని అనుసరిస్తూ, చిన్న ఉద్యోగంలో ప్రవేశించి, లోకాన్నీ తన యజమానినీ మెప్పించి క్రమంగా పైకివచ్చి, బాధ్యతగల పదవిలోకి వచ్చి, ఇంటివద్ద భార్యా బిడ్డలే సర్వస్వంగా ఉంటూ జీవిత మాధుర్యాన్ని ఇంటి గోడలమధ్యనే

చవిచూస్తూ ఉండిన వాడు ఈ విషయం వ్యక్తం చేయ్యటానికి చిత్రంలో చూపిన దృశ్యాలు నీరసంగా ఉన్నాయి ఆ తరువాత శివరాం తన యజమానికొరకు ఐదు లక్షల రూపాయల విలువగల బంగారం స్వయంగా పట్టుకురావటానికి బొంబాయి వెళతాడు అతన్ని బుట్టలో వేసి ఆ బంగారాన్ని కాజేసే యత్నంలో ధనరాజు ఉంపుడు గత్తె లీల అతనితో రైలు ప్రయాణం చేస్తుంది ఈ లీల చేసిన యత్నం ఫలిస్తుంది కాని శివరాం వంటివాడు లీల మాయోపాయాలలో చిక్కాలంటే ఉపాయాలు ఎంతో అమాయకంగా కనబడాలి శివరాం వంటి మనస్తత్వం గలవాడికి లీల విశ్వసనీయురాలు కావటానికి తగిన సన్నివేశాలు చిత్రంలో లేవు ఈ సంఘటనల అనంతరం శివరాం అజ్ఞాతవాసంలోకి వెళ్లి, అతను చచ్చిపోయినట్టు లోకం నమ్మటమూ, అతను పాకీపని ప్రారంభించి అనేక సంవత్సరాలపాటు అదే పనిలో ఉండటమూ తప్పనిసరిగా, పరిస్థితుల ప్రోద్బలం చేత ఏర్పడినట్టు ప్రేక్షకులు నమ్మలేరు ఇదంతా శివరాం పాత్రలో నిండుతనం లేకుండా చెయ్యటానికి తోడ్పడింది కథతో కొద్దిపాటి సంబంధంగల బాలానంద సంఘానికీ పిల్లల కార్యక్రమాలకూ అంతపుటేజ్ వృధా చెయ్యకుండా శివరాం పాత్ర పోషణకు మరింతగా తోడ్పడే సన్నివేశాలు కల్పించుకున్నట్టయితే ఈ కథ ఇంకా బాగా రక్తికట్టటమేగాక శివరాం పాత్ర గొప్ప పాత్రగా రాణించి ఉండేది

స్క్రీన్‌ప్లేలో ఇంకా ఇతర లోపాలు అనేకం ఉన్నాయి ఇందులోకి అనేక విషయాలు ప్రవేశపెట్టయత్నించి కలగూరగంపలాగా తయారు చేశారు డ్రమెటిక్ ఐరనీ కోసం చాలా తంటాలు పడ్డారు ఐరనీ మంచిదే, ఉండవలసిందే కూడా కాని అది కథతో కలిసిరానప్పుడు తెచ్చి పెట్టుకున్నట్టే ఉంటుంది రఘుపాత్ర దీనికోసం ప్రవేశపెట్టబడిందే ఆపాత్రలో కథకు ఎట్టి ప్రయోజనమూలేదు శివరాం బొంబాయిపోతూ భార్యను "నీకేం కావాలి?" అని అడిగితే ఆమె, "మీరు త్వరగా రావాలి," అన్నప్పుడు, "నేను రానేరాను," అనడం తెచ్చిపెట్టుకున్నట్టే ఉంది మొదటి నుంచీ భార్యను అట్లా ఏడిపించే పాత్రగా శివరాంను సృష్టించి ఉంటే అదే సంభాషణ చాలా రక్తికట్టేది అంతేగాక ఈ సందర్భంలో అపశకునాలూ అవీ తెచ్చిపెట్టి అటువంటి హాస్యానికైనా తావులేకుండా ఆడియన్స్ మూడ్ చెడగొట్టారు శివరాం "నేను రానేరాను" అనకపోయినా ఏదో కొంపమీదికి రాబోతున్నదన్న భావం ప్రేక్షకులకు కలగజేయనే బడింది శివరాం మామూలుగా ఊరికి వెళ్ళిపోతున్న వాడల్లే ఏ అట్టహాసమూ లేకుండా వెళ్ళిపోయి ఉంటే ఆ తరువాత జరిగిన సంఘటనలకు మరింత బరువువచ్చేది కాని శివరాం నిత్యజీవితం చూపించేటప్పుడు ఏ ఒక్క సన్నివేశమూ సహజంగా, మధ్యతరగతి ఇళ్ళలో జరిగేటనట్టు జరగనివ్వలేదు కుటుంబమంతా రోజూ దేవతా ప్రార్థన చెయ్యడం దగ్గర నుంచీ కృత్రిమంగానే చూపబడింది

కథకు తగిలీతగలని విషయాలను ప్రేక్షకుల ఇంటరెస్టు కోసం సాగదీశారు బాలానంద పిల్లలూ, రేడియో అక్కయ్య, అన్నయ్యా, మొద్దబ్బాయి, రేడియో తాతయ్యా, పిల్లలపాట కచ్చేరీలూ ఈ జాబితాలోకి వస్తాయి ఇవన్నీ ప్రేక్షకులకు ఆనందం ఇచ్చినప్పటికీ కథలో వాటికున్న ప్రాముఖ్యం పెరగబోదు ప్రేక్షకులకు రుచిస్తాయనే అనేక చోట్ల అనేక నినాదాలు కూడా పెట్టారు ఈ నినాదాలు ఎంత యాదార్థమైనవయినా ఒకటే – వాటికి కథలో సహజమైన స్థానం లేనప్పుడు

'నా ఇల్లు' సాంఘిక కథ కాని అందులో సంఘం కనబడదు మన సాంఘిక చిత్రాలలో సంఘం తగినంతగా కనబడకపోవటం దాదాపు ప్రతి చిత్రంలోనూ ఉంటూనే ఉంది కాని ఇంత బొత్తిగా కనబడకపోవటం చాలా అరుదు ఈ చిత్రంలో ప్రతిపాత్రా తనకు తానే ప్రాతినిధ్యం వహిస్తుందిగాని మరెవరికీ ప్రాతినిధ్యం వహించదు శివరాం, శివరాం యజమాని, అతని భార్య, ఆవిడ తమ్ముడూ, ఆవిడ కొడుకూ, శివరాం భార్యా, అతని పిల్లలూ, లీలా–వీరిలో ఒక్కరూ ఏ వర్గానికీ ప్రతినిధులు కారు చిత్రంలో కొందరు మంచి వాళ్లున్నారు కొందరు చెడ్డవాళ్ళున్నారు కాని ఈ మంచి చెడ్డలు వ్యక్తిగతమైనవే తప్ప సంఘపరమైనవి కావు

ఈలోపం అచ్చుగా పాత్రలలోనే ఉన్నట్టు మనం భావించనవసరం లేదు కథ రాసినవారిలోనూ, చిత్రం తీసినవారిలోనూ కూడా ఉంది చిత్రంలో ధనికులను గురించీ, దరిద్రులను గురించీ ఏ నినాదాలు వున్నప్పటికీ యీ చిత్రం తీసిన వారికి జీవితం పట్ల గల విశ్వాసాలు 1953లో చెప్పుకోతగ్గవి కావు తన యజమానిని విశ్వాసంతో కొలిచి తద్వారా పైకివచ్చిన తనను చూచి నేర్చుకోమని శివరాం రఘూను మందలిస్తాడు ఇందులో సాంఘిక సత్యం ఏమీలేదు ఉన్నట్టయితే ధనికులను విశ్వాసంతో కొలిచిన బీదలు శాశ్వతంగా దారిద్ర్యంలో ఉండవలసిన పనిలేదు ఈ కథ రాసినవారికి శకునాలలోనూ, పీడకలల్లోనూ కూడా విశ్వాసం ఉన్నట్టు చిత్రం రుజువు చేస్తున్నది లక్ష్మిని బలాత్కరించబోయినందుకు ధనరాజు దౌష్ట్యం చాలా భయంకరంగా చిత్రించబడింది కాని తనను వంచిచటానికి వచ్చిన లీలతో తన యజమాని సొత్తు రహస్యం చెప్పేసి, ఆమె సౌందర్యానికి లొంగిపోయి భార్యా బిడ్డల కష్టాలకూ, దారిద్ర్యానికి కారణభూతుడైన శివరాం నుంచి మనం నేర్చుకోవలసిన నీతి ఎవరినోటా వినిపించదు తన యజమానిని విశ్వాసంతో కొలిచిన శివరాం చచ్చిపోయినాడంటే అతని భార్య బిడ్డలను ఆదరించేటందుకు ఒక్క ఆఫీసు నౌకరు మాత్రమే కనిపిస్తాడు శివరాం దిక్కులేనివాడుగా ఉంటే నిరుపేదలు అతని నోటికి ముద్దలు కూడా అందిస్తారు ఇందులో ఉన్ననీతి కూడా చిత్రంలో ఎవరినోటా వినపడదు దారిద్ర్యం కష్టాలతో జోడించబడ్డది మంచితనంతో కూడా జోడించబడ్డట్టు చూపబడిందిగాని ఇది కేవలం ప్రేక్షకులను మభ్యపెట్టటానికి ఏమంటే శివరాం యజమాని ధనికుడే అయినా మంచివాడు బొంబాయిలో సేట్ కూడా ధనికుడే అతనూ మంచివాడే, ''మంచి రోజులు'' వచ్చేసరికి శివరాం పిల్లలు మళ్ళీ ధనికులై, 45 వేల రూపాయలకు అవలీలగా చెక్కులు రాసేస్తారు! ఇక ధనరాజు గాని, లీలగాని, హరీష్‌గాని దుర్మార్గులుగా చూపబడ్డారంటే వారు ఏ వ్యాపారమో చెయ్యక, ఏ బంగారమో తక్కువకు కాని ఎక్కువకు అమ్మక గుర్రప్పందాలలోనూ, దొంగతనం చేసీ ధనికులౌదామని యత్నించారు గనుకనే! ఇందులో గొప్ప సాంఘిక సత్యంలేదని మనం అనుకోను కూడా వద్దు, ఈ సాంఘిక సత్యం కనీసం మూడువేల ఏళ్ళ నుంచి ప్రచార మౌతున్నదేగాని ఇందులో కొత్త ఏమీలేదని మట్టుకు అనుకుందాం

ఇంతకూ 'నాయిల్లు' పేరుకు మాత్రమే సాంఘిక చిత్రం ఇందులో పౌరాణిక చిత్రం ఛాయలూ, జానపదచిత్రాల ఛాయలూ కూడా ఉన్నాయి శివరాం బొంబాయికి బయలుదేరే సమయంలో సీనులు ఏ పురాణ చిత్రంలోనైనా చేర్చవచ్చు లక్ష్మిపుట్టినరోజు పండుగ చేసుకునే సీను ఏ జానపద చిత్రంలోనైనా ఉన్నపాళంగా అతికిపోతుంది

'నా యిల్లు' లో వాస్తవికత లోపించటమే అయితే అదొక పెద్ద నేరం కింద చెప్పుకోనవసరం లేదు ఈనాడు అనేక సాంఘిక చిత్రాలలో వాస్తవికత పూర్తిగా ఉండడంలేదు డ్రామా కోసం వాస్తవానికి కుడీఎడంగా పోతున్నారు కాని 'నా యిల్లు' లో రచయిత యొక్క చిత్తశుద్ధినే శంకించవలసి వస్తున్నది దీనిమూలంగా వాస్తవికత లోపించిందంటే ఆవిషయం చెప్పకోవలసి వస్తుంది వితంతువు చనిపోయిన భర్తఫోటోను పూజించటం, పిల్లలు తల్లిదండ్రులకు పువ్వులతో పాదపూజ చెయ్యటం, మొగుడు బతికున్నాడని తెలియగానే శివరాం భార్య శారద దేవుడి విగ్రహం దగ్గరికి పోయి దణ్ణాలు పెట్టడం మొదలైనవి తోసేసినా, నాగయ్యా రాజకుమారిగార్లు తాము సినిమానటులు అయిపోవడం గురించి అనూహ్యమన్నట్టు నటించడమూ, సినిమా కంపెనీలను ఏహ్యంగా చిత్రించటమూ వగైరా అసత్యాలకు కథలో న్యాయంగా స్థానంలేదు వీటిని బలవంతాన తెచ్చిపెడుతూ అవాస్తవికంగా చిత్రించటం చిత్తశుద్ధిలేని పని అనటానికి సందేహం అవసరం లేదు

కొన్ని చోట్ల – విశేషించి హాస్యధోరణిలో – సంభాషణలు చిత్రంలోని ఏ పాత్రలకూ అన్వయించకుండా చిత్రంతో సంబంధంలేని మరెవరికో తగలాలని ఉద్దేశింపబడినట్టుగా ఉన్నాయి ఉదాహరణకు ధనరాజు 'కళావరు జాకీ' తో ''ప్రాసరోగం నీక్కూడా పుట్టిందీ'' అంటాడు ప్రాసరోగం చిత్రంలో ఇంకెవరికి గాని పుట్టినట్టు చూపబడలేదు ఈ సంభాషణ చిత్రంలో నుంచి బయటికి ఎవరికేసో తొంగిచూస్తోంది అది ఎవరైందీ తెలియని కారణంచేత ప్రేక్షకులకు ఏదో అసంతృప్తి కలుగుతుంది అందువల్ల కలిగేనష్టంకంటే కూడా చిత్రం యొక్క వాస్తవికతకు కళా దృష్ట్యా తగిలే దెబ్బ పెద్దది

స్క్రిప్టు రచనలో అసమర్థత కూడా కొంత ఉన్నది ప్రేక్షకుల సానుభూతి సంపాదించుకోవటానికి స్క్రిప్టు రచయిత పడ్డ కొన్ని పాట్లే దీనికి నిదర్శనం ప్రేక్షకులకు శారదపైనా, పిల్లలపైనా కరుణ కలగాలని ఆ పిల్లలు అన్నానికి కూడా మాడుతున్నట్టు చూపారు శివరాం ఇల్లు కొన్నవాడు పిల్లల చేతిలో బొమ్మల దగ్గర నుంచీ లాకున్నట్టు చూపారు ఇది అనవసరం శారద పిల్లలకు పక్క ఇళ్ళవాళ్లు పిలిచి అన్నం పెట్టినా, ఇల్లు కొన్నవాడు తానై స్వయంగా వారికి బొమ్మలిచ్చి బయటికి పంపినాకూడా ప్రేక్షకులకు కరుణ కలుగుతుంది ఇప్పుడున్నంత అస్వాభావికంగా ఉండదు గనుక ఆ కరుణ మరింత గాఢంగా కలుగుతుందేమో కూడాను శివరాం వీధులు ఊడవటం కూడా చాతగాని కల్పనే ఏకోమటి గుమస్తాగానో చేరి తిట్లుతిన్నా అతని పాత్రకది పతనమే కాని కల్పనాశక్తి చాలకపోవటం వలన మధ్యతరగతి వర్గం వారికి కింది తరగతి వారిస్థితిగతులు తెచ్చిపెట్టి అవే బ్రహ్మాండమైన కష్టాలుగా నిరూపించజూశారు నిర్మాతలు ఇట్లా చేయటం వల్ల కోల్పోతున్న వాస్తవికతనూ, కళా మూల్యాన్నీ అంచనాకట్టలేదు

కథను మంచి హాలీవుడ్ చిత్రంనుంచి కాపీకొడుతూ కూడా ఇటువంటి లోపాలు రానిచ్చారంటే అవరిండియా వారికి సరి అయిన కథకుడి సహకారం ఏదశలోనూ లభించలేదని రుజువవుతున్నది ఈలోపాలన్నీ ఉన్నప్పటికీ 'నాయిల్లు' చిత్రంలో ప్రేక్షకులకు తృప్తినీ, ఆనందాన్నీ ఇవ్వగలిగిన విషయాలు సమృద్ధిగానే ఉన్నాయి ప్రధాన పాత్ర ధారులందరి నటనా బాగానే ఉన్నది పాటలన్నీ ఇంపుగానే ఉన్నాయి సంగీతం కూడా చక్కగా ఉంది ఫోటోగ్రఫీ, సౌండు రికార్డింగూ తృప్తికరంగానే ఉన్నాయి చిత్రం నిండా సెంటిమెంటు కూరారు చప్పున

ద్రవించేవారు ఈచిత్రంచూస్తూ యెన్ని సార్లయినా ద్రవించవచ్చు ఇది ఆషామాషీగా తీసిన చిత్రం కాదనీ, చిత్ర నిర్మాణంలో చాలా శ్రద్ధ వహించారనీ ప్రతీ, ప్రేక్షకుడూ గ్రహించగలుగుతాడు చిత్ర నిర్మాణానికి పడ్డ శ్రమలో కొంతభాగం కథారచనకు వినియోగపరచినట్టయితే ఫలితాలు ఇంకా చాలారెట్లు బాగుండేవనేది బహుకొద్ది మంది ప్రేక్షకులే తెలుసుకోవచ్చు ఇకముందు తీయబోయే చిత్రాల విషయంలోనైనా నాగయ్యగారు ఇటువంటి లోపాలు సవరించుకుంటారని ఆశిద్దాం

*తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 16–1–1952*

# 13. పరదేశి

సంక్రాంతి పండుగనాడు ఆంధ్రలో విడుదలైన అంజలీ పిక్చర్స్ తొలి చిత్రం 'పరదేశి' జనవరి 18 ఆదివారంనాడు పత్రికలవారికి చూపారు 'పరదేశీ' చిత్రానికి రెండు బాహ్యా కర్షణలున్నాయి అంజలీదేవి స్వంత చిత్రం కావటం, దానికి ప్రసాద్ దర్శకత్వం వహించటం ఇందుకుతోడు అంజలీ నాగేశ్వరరావుల కోసం తెలుగు సినిమా ప్రేక్షకులు మొహం వాచి ఉన్నారు కూడా ఈ కారణాలచేత చిత్రం చూడటానికి ఆకర్షించబడిన సినిమా ప్రేక్షకులను తృప్తిపరచడానికి తగిన ఆకర్షణలు చిత్రంలో లేవు అంజలీ నాగేశ్వరరావులు బాగా నటించక కాదు కొన్ని చోట్ల ఇద్దరి నటనా చాలా బాగుంది అయితే మంచి నటన రాణించేటందుకు తగిన పాత్రలూ, కథా చిత్రంలో లేవు

అసలు 'పరదేశీ' కథ అవాస్తవికమైన కథ ఈ కథ యొక్క ఆశయం ఒక అదర్శాన్ని నిరూపించటమేగాని ఒక సాంఘిక సత్యాన్ని నిరూపించటంకాదు అందుచేతనే కథలో వాస్తవికతకు స్థానం లేదు దీనికితోడు కథనంలో కూడా వాస్తవికత పాటించబడలేదు

చంద్రు అనే యువకుడు ( నాగేశ్వరరావు) ఆరోగ్యం కోసం శీతగిరి వెళ్ళి అక్కడ లక్ష్మి అనే పూలపిల్ల ( అంజలి) ని చూసి ప్రేమిస్తాడు ఇద్దరూ గాంధర్వ వివాహం చేసుకుంటారు ఇది జరిగిన వెంటనే చంద్రం తన స్వగ్రామం వెళ్ళవలసి వుంటుంది అతని అండచేరిన అతని స్నేహితుడి వితంతువు సుశీల ( పండరీబాయి) తన కొడుకు ఆనంద్ (మోహన్) చాలా జబ్బుగా ఉన్నట్టు తంతి ఇస్తుంది చంద్రం వెళతాడు ఈ వివరాలువిని సుశీల చంద్రం భార్య అని, ఆనంద్ కుమారుడని, చంద్రం తనను వంచించాడని లక్ష్మి అపోహపడి, తాను వంచితురాలైనట్టు తన తండ్రి రంగడికి (ఎస్ వి రంగారావు) చెబుతుంది రంగడు అవమానం భరించలేక, తన కూతుర్ని చేతులారా చంపలేక, తనే ఆత్మహత్య చేసుకుంటాడు చంద్రం లక్ష్మికి అన్ని విషయాలు వివరిస్తూ లేఖ వ్రాస్తాడు కాని ఈ లేఖలో విషయాలు లక్ష్మి సొంతం వినదు తిరిగి జవాబు కోసం అతను పంపిన కవరు నందు తన బొటన వ్రేలి గుర్తులు పంపుతుంది కాలక్రమాన లక్ష్మికి ఆడపిల్ల కలుగుతుంది మళ్ళీ చంద్రం నుంచి ఉత్తరం వస్తుంది ఈసారి లక్ష్మి చంద్రానికి తన బిడ్డ చేతి గుర్తులు పంపుతుంది చంద్రం తన భార్యాబిడ్డలను చూడవస్తాడు కాని లక్ష్మి అతన్ని దూషించి, అతను వెళ్ళిపోకపోతే ఆత్మహత్య చేసుకుంటానని బెదిరించి పంపిస్తుంది ఆరాత్రే కులపెద్ద లక్ష్మి ఉన్న ఇంటికి నిప్పు పెట్టిస్తాడు లక్ష్మి తన బిడ్డతో సహా నిప్పునుంచి

బయుటపడుతుందిగాని చంద్రం మట్టుకు తన భార్య బిడ్డలు నిప్పులో పడి దగ్ధమై పోయినారనుకుంటాడు ఊళ్ళోవాళ్ళంతా కలసి లక్ష్మిని ఊరినుంచి తరిమేస్తారు లక్ష్మి బిడ్డతో సహా జాతికి వెలిఅయి ఎక్కడో కొండలమధ్య నివాసం ఏర్పరచుకుంటుంది

పదహారేళ్ళు గడుస్తాయి ఆనంద్ (గణేశన్) బి ఎ పాసవుతాడు తన తల్లి మొక్కు చెల్లించటానికి శీతగిరికి వచ్చి జయలక్ష్మి కోవెల వద్ద పూలమ్ముకునే తార (వసంత) ని చూసి ప్రేమిస్తాడు తార కూడా అతన్ని ప్రేమిస్తుంది కాని తారకు చిన్నతనం నుంచీ, "కన్నతల్లి ప్రేమ ఘనమైన ప్రేమ, కడమ ప్రేమలన్నీ కష్టాలపాలె" అని బోధించిన లక్ష్మి ఆనందుకు తన కష్టాలన్నీ చెప్పి, తన కుమార్తెను మరిచిపొమ్మని హెచ్చరిస్తుంది ఆనంద్ ఇంటికి తిరిగిపోయి తాను విన్న లక్ష్మిగాధను చంద్రానికి చెబుతాడు తన భార్యబిడ్డలు బతికున్నారని చంద్రం తెలుసుకుని వారిని చూడవస్తాడు లక్ష్మి బుద్ధిమారలేదనీ, ఆమె తన కుమార్తెతో తాను చచ్చిపోయినట్టు చెప్పిందనీ, తన అపోహను తొలగించుకునే బుద్ధి లక్ష్మికి లేదనీ తెలుసుకుని చంద్రం ఆత్మహత్య చేసుకొన నిశ్చయిస్తాడు

చంద్రం వెనకగా వచ్చిన సుశీలా ఆనందులు చంద్రాన్ని వారించలేకపోతారు కాని సుశీల చంద్రం భార్యకాదనీ, ఆనంద్ అతని కొడుకు కాదనీ లక్ష్మి తెలుసుకుని చంద్రం ఆత్మ హత్యా ప్రయత్నాన్ని నివారించ యత్నించి విఫలురాలయే తరుణంలో ఆమె చెయ్యలేనిపని తార చేసేస్తుంది తారా ఆనందూ పెళ్ళాడతారు

ఈకథ యావత్తూ లక్ష్మి యొక్క అపోహపై ఆధారపడటం కథకు పెద్దలోపం చంద్రం తనకు రాసిన మొదటి ఉత్తరం లక్ష్మి సొంతం చదవకపోవటం అస్వాభావికమే కాకుండా, దానికి ఎటువంటి సమర్ధనాలేదు సుశీల చంద్రం భార్య అన్నీ, ఆనందు అతని కుమారుడనీ లక్ష్మి పడ్డ భ్రమకు కథకుడు ఇతర ఆధారం ఏ కొంచెంగానైనా కలిగించి ఉంటే లక్ష్మి మిగతా ప్రవర్తనపట్ల ప్రేక్షకుడి సానుభూతి ఉండేది కాని ఈ ఆధారం లేని అపోహపైనే లక్ష్మి తండ్రిచేత చావటానికి సిద్ధపడింది తండ్రి చావుకు కారకురాలైంది తన కోసం వచ్చిన భర్తపై అంక్షపెట్టి పంపింది చంద్రం పూర్తిగా నిర్దోషి అని తెలిసిన ప్రేక్షకులు లక్ష్మి పడేకష్టాలతో ఏమాత్రమూ సానుభూతి చూపలేకపోవటానికి ఇదే కారణం – లక్ష్మి అపోహకు ఇతర ఆధారం లేకపోవడం, ఆ అపోహను తొలగించుకునేందుకు లభించిన అవకాశాలన్నిటినీ విడిచిపుచ్చి లక్ష్మి తన అపోహనే ఆలింగనం చేసుకోవటం

నాయిక ఈవిధంగా ప్రేక్షకుడి సానుభూతికి అనర్హురాలైపోగా చంద్రం కూడా కొంతవరకు ప్రేక్షకుడి సానుభూతిని పోగొట్టుకున్నవాడైనాడు అతను చిత్రంలో ఆదర్శమూర్తిగా చూపించబడ్డప్పటికీ లక్ష్మి పట్ల అతని ప్రవర్తన సమర్ధనీయంగా లేదు సుశీల యిచ్చిన తంతి చూసుకుని లక్ష్మికి చెప్పకుండా వెళ్ళిపోయినవాడు మరొక సంవత్సరానికిగాని ఆమెను చూడరాలేదు ఈ సంత్సరంపాటు ఆనందు చావుబతుకులమధ్య ఉండి ఉండటం అసంభవం (అసలు ఆనందుకు తీవ్రమైన జబ్బుగా ఉన్నట్టయినా చిత్రంలో చూపబడలేదు ) సంవత్సరంపాటు చంద్రం లక్ష్మిదగ్గరికి వెళ్ళలేక పోయాడన్నది రుజావు చేయాలంటే చిత్రంలో సగంభాగం దానికే ఖర్చు పెట్టవలసి ఉండేది అయితే దానికోసం నిర్మాతలు ఒక్క అంగుళం కూడా ఖర్చు చెయ్యలేదు ఇది కూడా పెద్దలోపమే

అసలు ఈ సంవత్సరకాలంలో కథే స్తంభించి పోయింది లక్ష్మికి పిల్ల పుట్టినదాకా కథకుడు చేతులు కట్టుకు కూర్చున్నట్టు స్పష్టమవుతోంది ఎందుకంటే లక్ష్మి మీద కన్నువేసిన కులపెద్ద కూడా ఈ సంవత్సరమూ జరగనిచ్చే లక్ష్మి ఇల్లు తగలబెడతాడు అప్పుడే ఊళ్లో వాళ్లు లక్ష్మిని ఊరునుంచి తన్ని తగిలేసి వెలిపెడతారు

చంద్రం పాత్రలో ఇంకో లోపంకూడా కనిపిస్తుంది లక్ష్మి తన అపోహను అంటిపెట్టుకున్న దంటే ఆమె విద్యావంతురాలు కాదు తన మూర్ఖత్వానికి క్షమాపణ చెప్పుకున్నది కాని విద్యాధికుడై ఉండి చంద్రం కూడా ఆమె చేసిన పొరపాటే తానూ చేశాడు లక్ష్మి, బిడ్డా నిప్పులో పడి కాలిపోయినట్టు కులపెద్ద చెబితే రెండడుగులు ముందుకు వేసి కాలిన శవాలనన్నా చూసు కోకుండా అశ్రువొకటి రాల్చి వెనక్కు తిరిగి వెళ్ళిపోతాడు లక్ష్మి బతికి ఉన్న సంగతి వెలివేసిన ఊరివారందరికీ తెలుసు కాని పదహారేళ్ళపాటు చంద్రం ఎరగడు లక్ష్మి చనిపోయిందనుకుని కూడా తిరిగి పెళ్లాడక కోరికలను చంపుకున్న చంద్రం లక్ష్మి చావుగురించి ఆరాతియ్యకపోవటం భావ్యంగాలేదు చంద్రంయొక్క ఈ ప్రవర్తనకు ప్రేక్షకుడి దృష్టిలో తగిన ఆధారంగా తోచేది మాత్రమే చిత్రంలో చూపారుగాని, చంద్రం పాత్రనుబట్టి అతని ప్రవర్తనను చిత్రంచలేదు మన సినిమాలలో పాత్ర కల్పనయందు ఈ లోపం తరుచు చూస్తూనే ఉంటాం

'పరదేశి' కథ వెనక ఉండే సూత్రం పవిత్ర ప్రేమ సూత్రం అందులో ఉన్న సంస్కృతి ఆత్మవిధ్వంసకంగా కనిపిస్తుంది చిత్రంలో ఆత్మహత్యలు, తత్ప్రయత్నాలూ జాస్తి చంద్రం తండ్రి ఆత్మహత్య చేసుకుంటాడు లక్ష్మి తండ్రి చేత చావటానికి తయారు కావటమేగాక, అతన్ని తొందరచేస్తూ ''కోపం తగ్గిపోతే చంపలేవు'' అంటుంది రంగడు ఆత్మహత్య చేసుకుం టాడు లక్ష్మిఆత్మ విధ్వంసక విధానం అవలంబించటమే గాక, తానూ తన కూతురూ ఆఖరుకు మట్టిలో కరిగిపోవటం జీవితగమ్యంగా ప్రకటిస్తుంది అంతా అయినాక చంద్రమే ఆత్మహత్యకు పూనుకొంటాడు ఇంత ఆత్మ విధ్వంసన ఈ చిత్రంలో ఎందుకున్నదో, నిజమైన ప్రేమకూ దీనికీ ఏమి సంబంధమో స్పష్టంగా తెలియటంలేదు

అయితే ఈలోపాలన్నీ చిత్రం యొక్క విజయానికి పెద్దగా అడ్డం రావలసిన అవసరం లేదు అవాస్తవికమైన కథలనూ, సన్నివేశాలనూ మన ప్రేక్షకులు చూస్తున్నారు ఇతరత్రా చిత్రంలో ఆకర్షణ ఉన్నప్పుడానందిస్తున్నారు 'పరదేశి' లో వారి ఆనందానికి అంతరాయంగా వుండే పాత్ర లక్ష్మి ఈ పాత్ర చిత్రానికి అంత్యంత ప్రధానమైన పాత్ర అయి ఉండీన్నీ ప్రేక్షకుల సానుభూతి సంపాదించలేకపోవటం చిత్రం విజయానికి దెబ్బ అయితే ఆశ్చర్యపడనవసరంలేదు లక్ష్మి పాత్రకు ప్రపంచజ్ఞానం లేదు ప్రపంచజ్ఞానం కోసం ప్రయత్నించదుకూడా అయినాకూడా తీవ్రమైన నిర్ణయాలు చేస్తుంది తీవ్రంగా ఇతరులను శాసిస్తుంది ఆమె వివాహానికి ముందు ఆమె మాటలూ చేష్టలూ అమాయికంగా కనిపించాలని నిర్మాతల అభిప్రాయం అయి ఉండవచ్చుగాని, అక్కడక్కడా వెటకారామూ, వ్యంగ్యంకూడా కూడా కనిపిస్తుంది ఉదాహరణకు ఆమె తనతండ్రి కాలుపోయిన కథచెబుతూ, ఆ వులి చచ్చిపోతూనో చచ్చిపోయాకో తనతండ్రికాలు కొరికిందంటుంది సుశీల విధవరాలుగా కళ్ళెదుట కనిపిస్తున్నా, ఆనందు చంద్రబాబుగురించి చెపుతూ ''బాబాయి'' అనేమాట ఉపయోగించినా కూడా లక్ష్మి తనతప్పు తెలుసుకోదు

అంజలి మనకున్న ఆకర్షవంతమైన బహుకొద్ది తారలలో ఒకతె లక్ష్మి పాత్రలో ఆమె ఆకర్షవంతంగా లేకపోవటానికి తోడుగా లక్ష్మిపాత్రే ఆకర్షవంతంగాలేదు ఈ లోపాన్ని ఇకముందు తీసే చిత్రాలలో అంజలి తప్పక సవరించుకోవాలి

కథలో దాదాపు సగంభాగం గాజులబత్తు ఫార్సుతోపోయింది ఈ గాజులబత్తులకు అసలు కథలో ఎట్టిసంబంధమూలేదు లక్ష్మి ఇల్లు తగలబడిపోయేటప్పుడుమట్టుకు ఈ గాజులబత్తులు లక్ష్మిని, పిల్లనూ బయటకి తెస్తారు (ఈ చిత్రంలో వారుచేసే మంచిపని ఇదొకటే) అయినా ఈ గాజులబత్తు ఫార్సు బొత్తిగా వృధా పోలేదు వీళ్ళ చేష్టలు జుగుప్సాకరంగా ఉన్నప్పటకీ, కథలో ప్రధాన పాత్రలలో లేని ఆకర్షణ ఈ పాత్రలలో ఉన్నది వాళ్ళేలేకపోతే 'పరదేశి' కథ దుర్భరమై ఉండును అసమర్ధపు కథనం కంటె జుగుప్స అయినా మెరుగేనని ఈ విమర్శకుడికి 'పరదేశి' చూసేదాకా తెలియదు, అంతమాత్రాన గాజులబత్తు హాస్యాన్ని సమర్ధించటంకాదు ఈ చిత్రాన్ని ఈ హాస్యం యొక్క అవసరం రానివ్వకుండా తయారు చేయవలసింది

ప్రసాదు డైరెక్షను ఈ చిత్రాన్ని చాలాచోట్ల పైకెత్తిందనటానికి ఎటువంటి సందేహమూ లేదు అంజలీ, నాగేశ్వరరావుల నటన కొన్ని చోట్ల చాలా బావుండడానికి డైరెక్షను నిస్సందేహంగా సహకరించింది మరికొన్ని చోట్ల డైరెక్టరు శ్రద్ధ లోపించినట్టు కనిపిస్తుంది ఉదాహరణకి తార జయలక్ష్మి దేవతకు క్షమాపణ చెప్పుకునే ఘట్టం పూర్తిగా తప్పుగా డైరెక్టు చేయబడింది తార తన వెలిని ఆమోదించిన మనిషిగా కథకుడు చిత్రించాడు ఆనందు దేవతకు అత్యాచారం చేశాడని తారయొక్క పూర్తి విశ్వాసం కాని చిత్రంలో ఈ ఘట్టం హాస్యంకింద నడిచింది చిత్రం ఆరంభంలో లక్ష్మి అమాయకత్వం వ్యంగ్యంగా స్ఫురించటం కూడా డైరెక్టరులోపమే 'పరదేశి'కి ప్రసాదుగారి డైరెక్షను సహకారం ఇంకా సమగ్రంగా లభించి ఉంటే చిత్రం ఇంతకన్న తప్పక రాణించేది

స్లోమోషన్‌లో తీసిన శకుంతా దుష్యంతుల గాథ అతి దీర్ఘమైనట్టుంది రికార్డింగూ, ఫోటోగ్రఫీ, సంగీతమూ చిత్రానికిచాలా తోడ్పడ్డాయి లొకేషన్‌లూ, సెట్టింగులూ బాగున్నాయి లొకేషన్ బస్సు ప్రయాణం షాట్లు, బాక్ ప్రొజెక్షన్ షాట్లూ మాచ్‌కావటంలేదు చంద్రం ఆత్మ హత్య చేసుకోబోయే సందర్భంలో ఔట్‌డోర్ షాట్లూ సెట్టింగు షాట్లూ లైటింగులో కలవటం లేదు ఎడిటింగు చాలా చోట్ల తూకంగాలేదు అనేక ''జెర్క్‌''లున్నాయి

ఇన్ని లోపాలున్నా 'పరదేశి' విసుగుపుట్టించే చిత్రం కాదు పూర్తిగా సంతృప్తి ఇవ్వలేకపోవటమే దాని లోపం అంజలీ పిక్చర్సువారు ఈసారి చిత్రం తీసేటప్పుడు కథను ఎన్నుకోవటం దగ్గిరనుంచీ కొత్త పద్ధతులు అవలంబించాలి ఒకనాడు సంఘంలో ఉండే లోపాలు విస్పష్టంగా ఎరగని ప్రేక్షకులు సంఘాన్ని తిడితే ఆనందించారు ఈనాడు వ్యక్తిని సమర్ధించ టానికి సంఘాన్ని తిడితే సంఘం సహించదు ప్రజలు సంఘంలోని దుర్మార్గాన్ని వేరుచేయటమూ, దాన్ని ప్రతిఘటించటమూ నేర్చుకుంటున్నారు కష్టజీవులకు ఈనాడు సంఘం శత్రువు కాదు. కష్టజీవులను ప్రజల సానుభూతికి అనుకూలంగా చిత్రించాలి లేదా ప్రజలకు ఇంత ఆనందమూ, ఆహ్లాదమూ కలిగించే చిత్రాలు తీయవచ్చు

*తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 23-1-1952*

# 14. శాంతి

వినోదా పిక్చర్స్ వారి 'శాంతి' ఫిబ్రవరి 15 వ తేదీని ఆంధ్ర దేశమంతటా విడుదలయింది నిర్మాత శ్రీ డి యల్ నారాయణగారు మూడు వారాలలో నిర్మించిన ఈ సాంఘిక చిత్రం మూడుగంటసేపు నడుస్తుంది రైల్వే సాహిత్యం ద్వారా ఆంధ్ర దేశానికి చిరపరిచితుడైన శ్రీ కొవ్వలి లక్ష్మీ నరసింహారావు గారు రామరాజ్యం అనే సర్వోదయ సమాజాదర్శాన్ని దృష్టిలో పెట్టుకుని కథ వ్రాశారు కష్టించి పనిచేసే వారికి న్యాయమైన ప్రతిఫలం ముట్టినప్పుడు కాని సమాజంలోశాంతి ఏర్పడదని చూపడం కథకుల లక్ష్యం కథారచనలో కొవ్వలి వారి ప్రత్యేకత కనబడుతుంది వివిధ సన్నివేశాలు, నృత్యాలు( టాప్ డాన్స్ కూడా), కార్మిక కర్షకగీతాలూ మిల్లులు, క్వారీలదృశ్యాలూ పేదలకష్టాలదృశ్యాలూ, నేరపరిశోధన మొదలైనవి ప్రేక్షకులనాకర్షించ గలిగేవి ఈ చిత్రంలో చాలా ఉన్నాయి

ఎస్టేటులో రైతుల్నీ, తన బట్టలమిల్లులో కార్మికుల్నీ పెట్టుబడిదారు మాంధాత( డా గోవిందరాజుల సుబ్బారావు) పీడించి లాభాలు గుంజుకుంటూ నిర్దాక్షిణ్యంగా ప్రవర్తిస్తున్న దృశ్యాలతో ఆరంభమౌతుంది చిత్రం ఇతనికి మూడో పెళ్లి పెళ్లాం మంజరి( సావిత్రి) నేతిబీరకాయ వంటి ఒక పత్రికా సంపాదకుడు 'టాంటాం'(పేకేటి శివరామ్) తోడై కర్షక కార్మికుల్ని షష్టిపూర్తి ఉత్సవమనీ, అదనీ ఇదనీ మరింత పీడిస్తారు చెల్లెలు(హేమలత), మేనకోడలు శుభ( చంద్రకుమారి) కటిక దారిద్ర్యం అనుభవిస్తున్నా పడుచు పెళానికి విధేయుడైన మాంధాత సహాయం చెయ్యడు

ఈపరిస్థితిలో కరుణకుమార్( రామచంద్ర కాశ్యప) అనే జమీందారు రంగంలోకి దిగుతాడు తన తండ్రి సద్గుణవంతుడైనప్పటికీ మాంధాత రాంధాతలనే దుష్టుల దుస్సహవాసానికి లోబడి ఎస్టేటు దివాలా తీయించాడనీ చివరికి ఆత్మహత్య చేసుకున్నాడనీ విని ఆదుష్టులజాడ తియ్యడానికి కరుణకుమార్ వస్తాడు వచ్చి అక్కడ సమ్మె చేస్తున్న కర్షకులకు నోట్లకట్టలు దానం చేసి తన పని నెరవేర్చుకుంటాడు పనిలోపనిగా మాంధాత చెల్లెలికి సహాయం చేస్తూ, శుభను పెళ్లి చేసుకోవడానికి నిర్ణయించుకుంటాడు కూడా మారు వేషం వేసుకుని మాంధాత ఇంట్లో నౌకరుగా కుదరి కూపి తీస్తాడు మాంధాత రాంధాత అనే అతనితో కలిసి తన తండ్రిని హత్య చేసి ధనం దోచుకున్నట్లు తెలుసుకుంటాడు దోచుకున్న దానిలో తన వాటా తనకి ఇవ్వకపోతే గుట్టు బైట పెడతానని బెదిరిస్తూ రాంధాత మాంధాతకి రాసిన ఉత్తరాన్ని కరుణ కుమార్ చూస్తాడు ఆ సమయంలోనే మాంధాత వచ్చి అతన్ని పట్టుకుంటాడు పట్టుకుని అతన్నీ శుభనూ స్థంభాలకు కట్టి హింసిస్తున్న సమయంలో కార్మికులూ పోలీసులూ వస్తారు దుష్టులిద్దరికీ మరణశిక్ష, మంజరికీ, పత్రికా సంపాదకునికీ ఖైదూ విధించబడతాయి జమీందారు కరుణకుమార్, తన ఎస్టేట్‌ని కర్షకులందరికీ పంచి ఇచ్చి, శుభను పెళ్లి చేసుకుని తను కూడా కర్షకుడౌతాడు

చిత్రం మొదటి నుంచి తుది వరకూ ( అక్కడక్కడ కొన్ని సన్నివేశాలలో తప్ప) ఒకే స్థాయిలో నడుస్తుంది కథాగమనానికి దర్శకుడు మరికొంత తోడ్పడి ఉండవలసిందని పిస్తుంది ఇందుకు ఆ వ్యవధి హేతుడై ఉండవచ్చు మధ్య మధ్య హాస్య సంభాషణలు, డా సుబ్బారావుగారి సహజనటనా కౌశలం, కాశ్యప గంభీర భావమూ చిత్రాన్ని రక్షిస్తాయి

*ఆంధ్రపత్రిక, వారపత్రిక, 20-2-1952*

# 15. ముగ్గురు కొడుకులు

ఆగస్టు 7న జెమినీవారి నూతన సాంఘిక చిత్రం 'ముగ్గురుకొడుకులు' జెమినీ స్టూడియోలో పత్రికల వారికి చూపబడింది దక్షిణ దేశపు సినిమా ప్రేక్షకులకు చిత్రాలు పొడవుగానే వుండాలని వాదించే చిత్ర నిర్మాతలలో వాసన్‌గారు ప్రథములైనప్పటికీ, 'ముగ్గురు కొడుకులు' మామూలు దక్షిణదేశ చిత్రాలతో పోలిస్తే ఏమంత దీర్ఘమైన చిత్రం కాదు దాని నిడివి 16 వేల అడుగులకు లోపే ఈ నిడివిలోనే రెండు తరాలకు చెందిన అనేక సంఘటనలను చాలా వివరంగా చూపారు

అన్ని జెమినీ చిత్రాలలోలాగే ఇందులో కూడా కథ చాలా సాఫీగా, ఎట్టి తికమకలు లేకుండా, అన్ని తరగతుల ప్రేక్షకులకూ అర్థమయ్యేలాగు నడుస్తుంది ఎక్కడా మజిలీలు వెయ్యదు

ఈ చిత్రంలో విచిత్రమేమంటే ఇది రెండు తరాల కథ కావటమే గాక దాదాపు నలభై మంది నటులున్నారు ముప్పైకి పైగా పాత్రలున్నాయి ఇన్ని పాత్రలూ తమ విధిని తాము నిర్వర్తించి కథకు ఏమీ అడ్డుతగలకుండా పక్కకు తప్పు కుంటాయి ఒక్కొక్క చిత్రం నిర్మించడంలో ఒక్కొక్క క్లేశం వుంటుంది ఈ చిత్రం లో ప్రధానక్లేశం ఇన్ని పాత్రలను సరిగా నిర్వహించటం ఈ క్లేశాన్ని కథా రచయితలూ, డైరెక్టరూ కూడా విజయవంతంగా భరించినందుకు అభినందించాలి

సాధారణంగా పత్తిలల్లే మాట్లాడుతూ సినిమా చిత్రాలమీద అభాండాలువేసే పెద్దలు ఏయే అవాంఛనీయాలు చిత్రాలలో వున్నాయంటారో అవేవి ఇందులో లేవు ప్రజల్ని సమ్మోహించటానికి ఈ చిత్రంలో ఫిలిము అంగుళం కూడా వినియోగించబడలేదు మామూలుగా ధర్మపన్నాలు చెప్పేవారు గమనించని ఒక గొప్ప విషయాన్ని ఈ చిత్రం లక్ష్యంగా పెట్టుకున్నది అది కాస్త వివరించాలి

పైకి ఈ చిత్రం ''తల్లి'' కథలాగా కనిపిస్తుంది కాని అట్టడుగున ఈ చిత్రంలో ఉన్నది మాతృత్వం – పిల్లలకోసం తల్లిపడేపాట్లు – మాత్రంకాదు ఈ చిత్రంలోని ప్రధానా నీతి సంఘనీతి స్థూలంగా కథ కొకనీతి ఉండుగాక, చిత్రం ప్రతి అడుగునా, ప్రతి సన్నివేశంలోనూ, నీతి అవినీతుల దృక్పథాలు ఒక దానికొకటి పోటీగా చిత్రించబడ్డాయి సామాన్యంగా మాతృప్రేమ చిత్రాలలో పిల్లకోసం పడే కష్టాలూ, వారికోసం, ఆమె చేసే త్యాగం ఆ త్యాగం వల్ల వారు పొందే సత్ఫలితాలూ నిరూపణ చేయబడతాయి ఈ చిత్రంలో అటువంటి యత్నమేలేదు

కథ ఆరంభం అయ్యే సరికి సోమశేఖర్ (నాగేంద్రరావు) తిండిదొంగ అయిన తనయజమాని అవినీతిపై తిరుగుబాటు చేసి ఉద్యోగం పోగొట్టుకుని ఉంటాడు తరువాత అతను జీవితంలో నీతికి గల ప్రభావానికి లొంగిపోయి, తాను పశ్చాత్తాపపడి దొంగతనాలు అవలంబించి సమస్య నుంచి బయటపడతాడు కాని మూడో కుమారుడు తన అవినీతిని గుర్తించేసరికి ఆ అవినీతి అతన్ని దహించివేస్తుంది శేఖరం ఆత్మహత్య చేసుకుంటాడు కొడుకులు పెద్దవారైనాక ప్రకాశం (ఎం కె ర్ ) అవినీతి తల్లి గౌరి (కన్నాంబ) కి అష్టకష్టాలు తెచ్చి పెడుతుంది

ఈ చిత్రంలో అవినీతి ప్రధానంగా రెండు రకాలుగా చిత్రించబడింది ఒకటి స్వార్థం మీద ఆధారపడినది సోమశేఖర్ యజమానీ, ప్రకాశం అతని భార్య కాంతం (సుందరీబాయి), మార్వాడి, ఈ తరగతికి చెందినవాళ్లు, ఇంకొక రకం అవినీతి కూడా ఈ చిత్రంలో ప్రదర్శించబడింది అది ప్రకాశంరూపంలో వ్యక్తమయ్యేది కమల తండ్రి (మదన్‌రావు), గోపాల్ భార్య ఛాయ (సూర్యప్రభ), సుశీలభర్తా ఈ రకం అవినీతి ప్రదర్శిస్తారు ఈ రెండు రకాల అవినీతికి కొలతబద్ధ ఇతరులకు దీనివల్ల కలిగే బాధా, వ్యధా కేవలం ఆదర్శవాదంతో కూడిన నీతి ఈ చిత్రంలో ఏమాత్రమూ ప్రదర్శంచలేదు

అవినీతికి లాగే నీతికి కూడా పరమార్థం ప్రత్యక్షంగా చూపబడింది అదేమిటంటే ఇతరులకు వచ్చే సుఖం కధానాయకుడు (శ్రీరాం) నీతిమంతుడు చిన్నతనంలోనే అతను ఇతరులకు బాధతప్పించటానికి తాను బాధపడడం నేర్చుకున్నాడు పెదవాడై తండ్రి చౌర్యం తనమీద వెనుకొని జైలు శిక్షకూడా అనుభవించాడు ఆ తరువాత తల్లిని సుఖ పెట్టటానికని తన 1500 జీతంలోంచి నెలనెలా తల్లికి 1000 రూపాయలు పంపుతూవచ్చాడు తనకూ కమలకూ స్నేహం ఉండడం ఆమె తండ్రికిష్టంలేదని తెలిసిన తరువాత ఆమెను చూడటానికైనా అతను ప్రయత్నించలేదు అనేక మాసాలపాటు ఆమెకొక ఉత్తరం ముక్కయినా రాయలేదు

కమలకూడా నీతికి ఉదాహరణే తనద్వారా రామూకూ, అతని తల్లికీ సాధ్యమైనంత ఆనందం చేకూరాలనీ ఆమె యత్నం

కాని అన్ని పాత్రలకన్న మూర్తీభవించిన నీతిగా చెప్పుకోదగిన పాత్ర తల్లి గౌరి చిత్ర నిర్మాతలు ఈ పాత్రకు దైవభక్తిగాని, పెద్దపెద్ద ఆదర్శాలుగాని సులభంగా అంటగట్టి ఉండవచ్చు చవకబారు చిత్రనిర్మాతలు అంటగట్టి వుందురు కూడానూ, కాని గౌరిలో ఉన్న ప్రత్యేకతల్లా ఇంకొకరికి ఆవగింజంత సుఖం కలుగుతుందంటే తాను తాటికాయంత కష్టాన్ని దిగమింగటం, ఆ మాట అని ఆమె ఒక్క శుష్కభావానికి బానిసకాదు ఆమెకు ఆత్మగౌరవం లేకపోలేదు తనకు చోటివ్వని వారిదగ్గర వుండదు ఇంకొకరి అసహిష్ణుతను కూడా వారి బాధగానే ఎంచి, దాన్నుంచి వారిని రక్షించడానికి తాను పైదొలగుతుంది ఇదే దృష్టితో ఆమె, చిత్రం ఆఖరున, తన అన్నమీద చెయ్యి చేసుకునే రామును గట్టిగా మందలిస్తుంది రామూ ఆగ్రహం రామూ బాదేకథా! అది అతను ఏ ఆశయంతో భరిస్తున్నట్టు?

'ముగ్గురు కొడుకులు' కథ వాస్తవ జీవితానికి ప్రతిబింబంగా తీసుకున్నట్టయితే గొప్ప ఉత్కృష్టమైన విజయం కాకపోవచ్చు కాని జీవితాన్ని తీవ్రంగా విమర్శించి, సందేశం ఇచ్చే నైతిక దృష్టి ఈ కథలో వుంది ఈ చిత్రంలో ప్రధాన పాత్రలంతా ఒకే కుటుంబం ఈ కుటుంబాన్ని ఏకంగా ఉంచగలది నీతికాని పక్షంలో మరొకటేమీలేదు ఈ విషయం చిత్రంలో చాలాచక్కగా విస్పష్టం కాబడ్డది అవినీతి సాగినచోట తల్లిలేదు, పిల్లలులేరు, అన్నలు లేరు, తమ్ముళ్లు లేరు, భార్యలులేరు, భర్తలు లేరు

నటులందరూ తమ పాత్రలను సమర్థతతో నిర్వహించారు కాని అందరినీ మించి తనపాత్రను అత్యద్భుతంగా పోషించినది కన్నాంబ, మొదటి షాట్ నుంచి చివరి షాట్‌దాకా ఈ పాత్ర ప్రేక్షకులను చాలాబలంగా ఆకర్షించి వారి పూర్తి సానుభూతిని సంపాదించుకుంటుంది నాగేంద్రరావూ, రాధా కూడా తమ పాత్రలను చాలా చక్కగా పోషించారు డైరెక్టరుగా కూడా

నాగేంద్రరావు చాలా సామర్థ్యం చూపించాడు

చిత్రంలో ఎక్కువపాటలు కమలకే ఉన్నాయి మిగిలినవన్నీ సందర్భాన్నిబట్టి పాట కచ్చేరీలుగానో, డాన్సు పాటలుగానో, నేపథ్య గానంగానో, ఉన్నాయి అందుచేత చిత్రంలో పాటలే ఉన్నట్టనిపించదు అవి కథకు యేమాత్రం అడ్డం తగలవు సంగీతమూ నేపథ్య సంగీతమూ, ఫోటోగ్రఫీ మొదలైన టెక్నికల్ బలం సంతృప్తికరంగా వుంది

చిత్రం గంభీరమైన ఆశయాలు కలదైనా అక్కడక్కడ సున్నితమైన హాస్యం లేకపోలేదు సినిమా ప్రొడ్యూసరు, హిందీ మ్యూజిక్ డైరెక్టరు, కమలను వరించే నేత్రరోగి అయినవకీలు, పాత ఇనప సామాన్లు కొనేవాడూ చక్కని హాస్యం జతపరిచారు గాంధీగారి వారసులైన కాంగ్రెసు నాయకుల పాలన ప్రతిబింబించే మహదాశయాలకు 'ముగ్గురు కొడుకులు' చిత్రంలో గల ఆశయాలకు ఉండే తేడా ప్రతి ప్రేక్షకుడు సులభంగా అర్థం చేసుకోగలడనటానికి ఎటువంటి సందేహమూ లేదు

*తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 15-8-1952*

# 16. రెండు కొత్త చిత్రాలు

గత వారంలో మద్రాసులో రెండు కొత్త చిత్రాలు పత్రికలవారికి చూపించారు ఒకటి శ్రీ రాజరాజేశ్వరీ వారి 'ఏళై ఉళవన్' అన్న తమిళ చిత్రం, ( దీని తెలుగు వెర్షన్ 'పేద రైతు' పై నెలలో గాని విడుదల కాదట )

'ఏళై ఉళవన్' తమ పదవ చిత్రమని శ్రీ రాజరాజేశ్వరీవారు తమ ఆహ్వానపత్రంలో చెప్పుకున్నారు జెమినీవారి అలవాటు చొప్పున ఎన్ని భాషలలో తీస్తే అన్ని ప్రత్యేక చిత్రాల కింద ఈ సంస్థ లెక్కవేసుకున్నట్టు కనిపిస్తుంది ఏమైనా తొమ్మిది చిత్రాలు తీసిన అనుభవమూ, గడుసుదనమూ, ఈ చిత్రంలో ఎక్కడా కనిపించవు రెండవ ఫారం కుర్రాడు ఉత్సాహం కొద్దీ ఏదో కథ రాసినట్టుగా ఉంది చిత్రం, అందులో తీసుకున్న సమస్యను గురించిగాని, పాత్రలను గురించిగాని, చిత్రించిన సంఘటనల ప్రభావాన్ని గాని చిత్ర నిర్మాతలు అవగాహన చేసుకున్న లక్షణాలు ఎక్కడాలేవు 'ఏళై ఉళవన్' అంటే 'పేద రైతు' పేద రైతుకు సంబంధించిన కథ ఇందులో లేదు ఇది ఒక ఎస్టేటు దారుకూ, ఎస్టేటు మేనేజరుకూ, జమీందారు కొడుక్కూ, అతనుపడే కష్టాలకూ సంబంధించిన కథ ప్రజల కష్టాలకన్న జమీందారు కొడుకుపడే కష్టాలే – – ఎంత అవిశ్వసనీయంగా కానివ్వండి – చిత్రంలో చూపించబడ్డాయి కృత్రిమం అనిపించకుండా ఉండే సన్నివేశం ఒక్కటి కూడా చిత్రంలో లేదు

రాజేశ్వరరావు అనే జమీందారు ( సి వి వి పంతులు) భువనగిరి ఎస్టేటుకు హక్కుదారు అతను చిత్రం ఆసాంతం వరకూ కంటిన్యుటీ చెడకుండా ఒకే దుస్తులతో మంచానపడి ఉండి చిత్రం పూర్తి అయేలోపుగా అదేమంచం మీద మరణిస్తాడు అతని భార్య దుర్గాంబ ( కన్నాంబ) తానే కొంత వరకు తన భర్త పనులు చూసుకుంటూ ఎస్టేటు మేనేజరు వేదాంతం ( లింగమూర్తి) మోసానికి గురి అవుతూ ఉంటుంది జమీందారు కొడుకు ప్రసాద్ (శ్రీరామమూర్తి) పట్నంలో చదువుకుంటూ తన సహాధ్యాయినీ, తన ఎస్టేటులోని పేదరైతయిన రాఘవన్ కూతురూ అగు

సీత (అంజలీదేవి) ని ప్రేమిస్తాడు వారు స్వగ్రామానికి తిరిగివచ్చినాక కూడా ఈ ప్రేమ అభివృద్ధి అవుతుంది ప్రసాదుకు వరస అయిన పిల్ల లీల (తులసి) జమీందారు ఇంటనే ఉంటూ ప్రసాదు వచ్చి తనను పెళ్లాడతాడని ఆశిస్తూ ఉంటుంది కాని ఈ ఆశ విఫలంకాగా ఆమె పెట్టేబేడా తీసుకుని వెళ్ళిపోతుంది

ఎస్టేటు మేనేజరు వేదాంతం సీతమీద కన్నువేసి ఉంచి ఆమెను ఒక సందర్భంలో సేవకుల చేత పట్టి స్తంభానికి కట్టించి కొరడాతో ఆమెను బాదనారంభిస్తాడు అదృష్టవశాత్తూ ఆ దారిని ఏదో పనిమీదపోతూ ఉండిన ప్రసాదు అడ్డుపడి ఆమెను రక్షించి తన ఎస్టేటు మేనేజరును మర్యాదగా మందలించి వెళ్లిపోతాడు వేదాంతం ఇట్లాకాదని రాఘవన్ ఇంటి తలుపులు బయటినుంచి బిగించి ఇంటికి నిప్పుపెట్టించేస్తాడు దీనివల్ల వేదాంతం ఏం లాభం పొందుతాడో మనకు స్పష్టంగా తెలీదు ఒకవేళ నిప్పుల్లో బూడిద అయినాకన్నా సీత తనకు లొంగకపోతుందా అనుకుంటాడో ఏమో! అయితే అదృష్టవశాత్తూ ఆ సమయానికి అక్కడి వచ్చిన ప్రసాద్ సీతను కాస్తా రక్షించేస్తాడు రాఘవన్ మాత్రం కథకు వీలుగా ఆ మంటల్లో మరణిస్తాడు ఆ సమయానికక్కడ ఇంకా అనేక మంది రైతులు పోగవుతారుగాని రాచబిడ్డకున్న ధైర్యంలో ఏవంతూ వారికున్నట్టు కనబడదు

ఈవిధంగా తండ్రినీ, పూరిపాకనూ కోల్పోయిన సీత బి ఎ ను కథానాయకుడు తన స్వగృహానికి తీసుకుపోయి తల్లి చేత తండ్రిచేత చీవాట్లుతిని, కులాల ఎక్కువ తక్కువలు కూడదని తల్లిదండ్రుల కొక ఉపన్యాసం ఇచ్చి తాను ప్రేమించిన ప్రియురాలి కోసం ఎస్టేటు వదులుకుని పట్నం వెళ్ళి ఆమెను పెళ్ళాడి బతుకు తెరువు కోసం 'ఏశై ఉళవన్' అన్న 'అభ్యుదయ' పత్రిక స్థాపించి దానితో జీవయాత్ర గడవక ఆర్థిక చిక్కులకు లోనవుతాడు

ఇట్లా ఉండగా పట్నంలో కామరాజనేవాడు (వెంకట్) నృత్యనాటకాలాడిస్తూ ఉంటాడు కాలేజీలో చదువుకునే రోజుల్లో సీత నృత్యం చెయ్యటం చూసి ఈ కామరాజే నెలకు అయిదు వందల జీతం మీద మూడేళ్ళు కంట్రాక్టు రాసిస్తానంటే సీత ఏ కారణంచేతో నిరాకరించింది అయితే ఇప్పుడా కామరాజు దగ్గిరికే వెళ్ళి తనకు నటించే అవకాశం ఇవ్వమంటుంది కామరాజు స్వల్పజీతం మీద ఆమెను తీసుకుంటాడు

వేదాంతం పట్నం రావలసిన పనిపడుతుంది అతను ఉంచుకున్న మనిషి సినిమాలలో వేషాల కోసం పట్నం పారిపోతుంది ఆమెను వెతుక్కుంటూ వచ్చిన వేదాంతం లతా అనే మారు పేరుతో నటిస్తున్న సీతను చూసి గుర్తించి ఆమె కాపరం చెడగొట్టమని కామరాజును పురమాయిస్తాడు కామరాజు సీతను బలాత్కరించబోతాడు ప్రసాద్ అక్కడికి వచ్చినప్పుడు అతని జేబులో పిస్తోలు బెట్టి, పోలీసుల్ని పిలుస్తాడు పోలీసులు వచ్చి ప్రసాదును ఎరెస్టు చేస్తారు దీని ఫలితంగా, ఆ పిస్తోలు తనది కాదని రుజువు చేసుకోలేని ప్రసాదు, సంవత్సరంపాటు జైలుకు పోతాడు సీతను ఇంటివాళ్లు, అద్దె ఇవ్వలేదని బయటికి వెళ్లగొడతారు గర్భిణిగా వున్న సీత లీల కారుకింద పడుతుంది లీల ఆమెను లతగా గుర్తించి తన ఇంటికి తీసుకుపోయి ఆమెకు పురుడుపోసి తన దగ్గిరే ఉంచుకుంటుంది పిల్లవాడు ఏడాదివాడైనాక సీత ప్రమాదవశాత్తూ లీల ఇంట తన భర్త ఫోటో మొట్టమొదటి సారిగా చూసి లీలా ప్రసాదూ బంధువులని గుర్తిస్తుంది లీలకూడా ఈ లతే సీత అనీ, తనను కాదని ప్రసాదు ఈమెనే పెళ్లాడాడనీ తెలుసుకుని సీతను

ఇంట్లోనుంచి వెళ్లగొట్టిస్తుంది

సీత తన బిడ్డతో నేరుగా వెళ్ళి భువనగిరి రైతులకు నాయకత్వం వహించి వేదాంతం ఆటకట్టించటానికి సర్వతోముఖ సమ్మె సాగించి ఇల్లుకట్టేవాళ్ళ చేతా, బట్టలుతికేవాళ్ళ చేతా, అందరి చేతా సమ్మె కట్టిస్తుంది ఈ సమ్మె ఫలితంగా జమీందారు భార్య కొంత దారికివస్తుంది కాని వేదాంతం దుర్మార్గాన్ని ఇంకా పూర్తిగా నమ్మదు ఇంతలో తన నైజాన్ని ఆమెకు రుజావు చెయ్యటానికిగాను వేదాంతం పత్రం ఒకటి రాసి దానిమీద ఆవిణ్ణి సంతకం చెయ్యమంటాడు ఇంతలో ఖైదునుంచి విడుదల అయిన ప్రసాదు వచ్చి అడ్డుపడతాడు వేదాంతం చచ్చిపోతాడు ప్రసాదు రైతులనందర్నీ పిలిచి భూదాన యజ్ఞం చేస్తాడు

ఈకథలో కాస్తయినా వాస్తవిక పాత్రపోషణా, నమ్మదగిన సన్నివేశాలూ, యదార్థ సమస్యల చిత్రణా లేకపోగా రైతులకు అవమానకరమైన విషయాలున్నాయి వేదాంతం రైతుల్ని పీడించినంతకాలమూ అతన్ని ప్రతిఘటించేవారుండరు అతను బలాత్కారంగా జమీందారు భార్యచేత దొంగనోటు మీద సంతకం చేయించబోయిన మరుక్షణం అతని ఆట కడుతుంది అతను దుర్మార్గుడని రుజావు చెయ్యటానికి కనపడ్డ ఆడదాన్నల్లా వాంఛించటమూ, ప్రయోజనం పాటించకుండా రాఘవన్ ఇల్లు తగలబెట్టటమూ, సీత కాపరం పాడుచెయ్యటమూ మొదలైనవి చేస్తాడు జమీందారీ విధానంలోగల లోపాలు భద్రంగా దాచబడ్డాయి అందుకనే జమీందారు కొడుకు కథానాయకుడు సీత లేవదీసే ఉద్యమంలో ఎస్టేటు భద్రతకూడా ఒక అంగంగా కనిపిస్తుంది

ఈ చిత్రంలో నటుల నటనా, ఫోటోగ్రఫీ, పాటలూ, సంగీతమూ అద్భుతంగా ఉన్నప్పటికీ కూడా ఇది మంచి చిత్రం అనిపించుకోలేదు ఇక జానపద చిత్రాలు పారవని గ్రహించి చిత్ర నిర్మాతలు ప్రజలను వంచిచటానికి స్యూడో ప్రొగ్రెసివ్ కథలు అర్థం లేకుండా అల్లి ఇటువంటి చిత్రాలు తీస్తున్నారు అభ్యుదయ చిత్రాలకు ప్రాణం వాస్తవికత అది లేక పోయినాక మిగిలినదంతా గానుగాడిన చెరుకు పిప్పి అంతకంటే ఏమీలేదు చిత్రనిర్మాతల అప్రతిభ ఎట్లాగూ దాగదు పైపెచ్చు అభ్యుదయ బురఖాలోనుంచి మరింత బాగా కనిపిస్తుంది వీళ్లు ఏజానపద చిత్రాలో తీసుకోవటమే మంచిది

★ ★ ★

రెండవ చిత్రం పీపుల్స్ ఆర్టు ప్రొడక్షన్స్‌వారి తొలిచిత్రం 'పల్లెటూరు' ఇది తయారు చేసిన కంపెనీయేగాక, చిత్ర నిర్మాతా, రచయితలూ, డైరెక్టరూ చాలా మంది చిల్లర పాత్ర దారులు సయితం కొత్తగా సినిమా రంగంలోకి అడుగు పెట్టినవారు అయినప్పటికీ ఈ చిత్రాని కొక లక్ష్యం ఉంది, ఆ లక్ష్యాన్ని సాధించటానికి తగిన కృషి జరిగింది ఫలితంగా ఒక కొత్తరకం చిత్రం – జనాన్ని సులభంగా ఆకర్షించి, ఒక అనుభవాన్ని చేకూర్చి, ఒక సందేశాన్ని అందించగల చిత్రం తయారయింది

ఇందులో ప్రతి చిన్నపాత్రా అతి సహజమైనది ఈ పాత్రల వాస్తవికతను ఇనుమడింపజేస్తూ పల్లెటూరి వాతావరణం చిత్రమంతటా సమృద్ధిగా ఉన్నది

సంక్రాంతి వేడుకలతో చిత్రం ప్రారంభమవుతుంది [illegible] కర్షకులకు ప్రతినిధీ నాయకుడు అయిన చంద్రం ( ఎన్ టి రామారావు) ప్రజలను ఉత్తేజపరచే ప్రదర్శనాలు ఏర్పాటు

చేస్తాడు షావుకారు గణపతి (ఎస్ వి రంగారావు) తన సంస్కృతికి తగ్గట్టుగా హరికథ ఏర్పాటు చేస్తాడు కుర్రకారు ప్రదర్శనలు విజయవంతమవుతే హరికథ కళాహీనంగా పోతుంది

గణపతి బాలయోగి నొకణ్ణి ఊళ్లోకి తెచ్చి రచ్చబండ సమీపంలో ఉన్న లైబ్రరీని ఆశ్రమంగా మార్చటానికి ఆలోచిస్తాడు కాని చంద్రం ఈ ఆలోచన సాగనివ్వడు ఆశ్రమం మరొక చోట ఏర్పాటవుతుంది ఈ ఆశ్రమంలో గణపతి తన కమతం చూసే కొండయ్య (నాగభూషణం) భార్య శాంతను (టి జి కమల) చూస్తాడు గణపతికి కుడిభుజంలాగా ఉండే శంకరం (రమణా రెడ్డి) శాంతను గణపతికి సంధానం చెయ్యటానికి ఉపాయం చెబుతాడు కాని ఈ ఉపాయం పారదు శాంత తప్పించుకు పారిపోతుంది అయితే ఈలోపునే ఆమెకూ చంద్రానికి సంబంధం ఉన్నట్టు కొండయ్య మనస్సులో శంకరం విషబీజాలు నాటుతాడు కొండయ్య తన భార్యను చావగొట్టి బయటికి గెంటుతాడు శాంత చంద్రం ఇంటికిపోయి అక్కడ తలదాచుకుంటుంది

కొండయ్యకు మెహర్బానీ చేసేవాడల్లే నటిస్తూ గణపతి తనకు చంద్రం ఇవ్వవలసిన పాత బాకీకింద చంద్రం ఎడ్లను జప్తు చేయిస్తాడు ఈ సందర్భంలో 'ఐరనీ' చాలాచక్కగా వినియోగించబడింది చంద్రం చెల్లెలు తన అన్నను కొత్తపరికిణీ కొనమని అడుగుతూ ఉంటుంది ఏదో బాడుగ వచ్చిందనీ, ఆ బాడుగ తోలిన డబ్బులతో ఆమెకు పరికిణీ కొనిపెడతాననీ చంద్రం అంటూండగా , చెల్లెలు మురిసిపోతూండగా ఎడ్లు కాస్తా జప్తు అవుతాయి

ఈ జప్తు సందర్భంలోనే చంద్రం యింటికి వచ్చిన శంకరం పక్క ఇంట్లో వున్న సాంబయ్య (కోడూరు అచ్చయ్య) కుమార్తె సుగుణ (సావిత్రి) ని చూసి ఆమె అందాన్ని ''బ్రదర్'' గణపతికి వర్ణించి అటువంటి అందగత్తెను గణపతి తప్పక పెళ్లాడాలంటాడు ఆస్తి కూడా కలసివస్తుందని గణపతి అంచనావేస్తాడు గణపతి అక్కపిచ్చమ్మ (శేషమాంబ) కు ''కీ'' యిచ్చి పెళ్ళి కుదర్చమంటారు పిచ్చమ్మ సాంబయ్యను పిలిపించి ఆయన దగ్గర నవరసాలూ ఒప్పించి సరే నన్నదాకా వదలదు

అక్కడ సాంబయ్య గణపతీ సంబంధానికి సరేనంటున్న సమయంలోనే ఇక్కడ చంద్రం సుగుణకు తన ప్రేమను వెలిబుచ్చి మౌనరూపమైన ఆమె అర్ధాంగీకారాన్ని సంపాదిస్తాడు తన తండ్రి గణపతి సంబంధానికి సరే నన్నాడనేసరికి సుగణ కూలిపోతుంది తన కూతురికి గణపతితో పెళ్ళి ఇష్టం లేదనేసరికి సాంబయ్య ఇరుకున పడతాడు సాంబయ్యది ఒకేటే నాలిక! సుగుణ మనసు చంద్రం మీద ఉందని తెలిసి కోపంలో చంద్రానికీ శాంతకూ మధ్య గణపతి కట్టిన రంకును తాను నమ్మినవాడల్లే మాట్లాడతాడు ఈమాట చెవినిపడగానే అభిమానవతి అయిన శాంత ఆరాత్రికి రాత్రే చంద్రం ఇల్లువిడిచిపోయి ఎక్కడెక్కడో తిరిగి ఒక ప్లీడరుగారింటి ముందు స్పృహతప్పి పడిపోతుంది సజ్జనుడైన ఆ ప్లీడరు (మిక్కిలినేని) ఆమెను తన ఇంట్లోకి తీసుకుపోయి ఆశ్రయమిస్తాడు

చిన్నతనం నుంచీ తన కడుపులో పెట్టుకు పెంచి, భర్త వెళ్లగొట్టినప్పుడు కూతురులాగా చేరదీసిన శాంత వెళ్లిపోయిందన్న దుఃఖంలో చంద్రం తల్లిసీతమ్మ (పద్మావతి) మంచానపడుతుంది ఊళ్ళో ఉన్న డాక్టర్లు ఆమెకు వైద్యం చెయ్యకుండా గణపతి అరికడతాడు

ఆమెను చూడబోవటానికి సుగుణ ప్రయత్నించినా, సాంబయ్య ఇంటనే ఉండి పెళ్ళి ప్రయత్నాలు జరుపుతున్న పిచ్చమ్మ అడుపడి సుగుణ మీద చెయ్యి కూడా చేసుకోబోతుంది

దీనితో సాంబయ్యకు మండి పిచ్చమ్మను తన యింట్లో నుంచి గెంటేస్తాడు

చంద్రం తల్లి మరణిస్తుంది సాంబయ్య పూర్తిగా చంద్రం పక్షమైపోతాడు ఈలోపుగా గణపతి కొండయ్యను కూడా శత్రువును చేసుకున్నవాడైనాడు ఎందుకంటే గణపతి దొంగతనంగా ధాన్యం అమ్మి రవాణాచేస్తుండగా చంద్రం, అతని అనుచరులూ పట్టుకున్నప్పుడు ఆ కేసు కొండయ్యమీదకి తోసేయించాడు గణపతి సాంబయ్య తనకు పిల్లనివ్వనన్నాడనే సరికి గణపతిలోని పైశాచికత్వం ఒక్కసారిగా పైకి వచ్చేస్తుంది సుగుణను గణపతివశం చెయ్యటానికి శంకరం ఉపాయం పన్నుతాడు గణపతి నౌకరు సుబ్బన్న (చదలవాడ కుటుంబరావు) భార్యకు పాతిక రూపాయలిచ్చి, శాంత ఊరిబటయ తోటలో ఉండి మాట్లాడడానికి రమ్మన్నట్టు సుగుణతో చెప్పమని ప్రేరేపిస్తాడు సుగుణ ఈ వార్త విని బయలు దేరుతుంది తన భార్య చేసిన అక్రమం తెలుసుకుని సుబ్బన్న సాంబయ్యకు చెప్పేస్తాడు చంద్రంకు కూడా ఈ వార్త తెలిసి బయలుదేరుతాడు

అక్కడ తోటలో గణపతి సుగుణను బలాత్కారం చేయ్యబోతుండగా ఎవరో అతని తల పగలగొట్టేస్తారు మరుక్షణమే అక్కడికి చేరిన చంద్రం మీద ఆకేసు పెడతారు చంద్రం అరెస్టవుతాడు కేసు జరుగుతుంది సాంబయ్య వగైరాలు చంద్రం తరఫున ప్లీడర్ను నియోగించబోయి ఆ ఇంట్లో శాంతను చూసి యింటికి తెస్తారు

కోర్టు విచారణలో కొండయ్య వచ్చి గణపతి తల పగలగొట్టినది తానే నంటాడు చంద్రాన్ని విడుదలచేసి గణపతిని ఎరెస్టు చేస్తారు స్త్రీ మానం రక్షించాడు గనక కొండయ్యకు శిక్షపడదు

ఈ చిత్రంలో లోపాలు లేకపోలేదు ప్రజా జీవితానికి చెందిన చిత్రంలో ఇంత మెలోడ్రామా అవసరం లేదు వ్యాపారచిత్రాలలోలాగే పాటలను పాటలకోసమై కొన్నిచోట్ల వినియోగించారు చంద్రాన్ని ప్రజాహీరోగా చిత్రించటంలో నిర్మాతలు పూర్తి విజయం సాధించలేదు గణపతిని విలన్‌గా చిత్రించటంలో సంకురుమయ్య శంకరం మీదుగా ఎక్కువ వెళ్ళాడు ఇది అనవసరం చంద్రం దగ్గిర అభ్యుదయ గ్రంధాలు తెచ్చి చదువుకునే సుగుణ తన తండ్రితో గణపతి తనకిష్టంలేదని మొదటనే చెప్పకపోవటం అస్వాభావికంగా ఉంది చంద్రం తల్లి పాత్రకు ఎంతో ప్రాముఖ్యం ఇచ్చికూడా ఆ పాత్రను కథకు ఉపయోగించలేకపోయారు అసలు శాంత పాత్రకు సంబంధించిన కథంతా చిత్రానికి ఎదురుగానే ఉంది ఆమెను భర్త ఇంట్లోనుంచి వెళ్ళగొట్టినమీదట జరగదగిన పరిణామాలలో ఏ ఒక్కటీ జరగదు

గణపతికీ చంద్రానికీ మధ్యగల వైరం కనీసం వైరుధ్యం — కథకు నేరుగా ఉపయోగించుకోబడలేదు అసలు వీరిద్దరూ ముఖాముఖీ తలపడరు ఇది కథకు చాలా పెద్దలోపం ఆఖరుకు గణపతి ఆట కట్టయిన సమయానికి అందులో చంద్రం నిర్వహించిన పాత్ర చిన్న మెత్తులేదు

ఇంకా చిల్లర లోపాలు ఎన్ని ఉన్నప్పటికీ ఈ చిత్రం వాస్తవిక పాత్రలనూ, అకృతిమ సన్నివేశాలనూ, ప్రజల యదార్ధ కష్టసుఖాలనూ ప్రేక్షకులకు అందజేస్తోంది దర్శకత్వంలోనూ, ఫోటోగ్రఫీలలోనూ, సంగీతంలోనూ చాలా సుగుణాలున్నాయి ఇక ముందు 'పీపుల్సు' వారు ఇంకా మంచి చిత్రాలు తీస్తారనే ఆశ కలుగుతోంది

*తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 24-10-1952*

# 17. బ్రతుకు తెరువు

ఈవారం భాస్కర్ పిక్చర్స్‌వారి 'బ్రతుకు తెరువు' విడుదలయింది నూతన సంవత్సరం ప్రారంభమైన అయిదు వారాలలోనూ అయిదు తెలుగు చిత్రాలు విడుదల అయాయి! 'బ్రతుకు తెరువు' అయిదవది ఇంతకన్న వింత ఏమిటంటే లోగడ విడుదలైన నాలుగు చిత్రాలలోనూ రెండు ప్రజాభిమానాన్ని దండుకున్నాయి, ఇది మూడవది అనటానికి సందేహంలేదు ఈ యేటి తెలుగు చిత్రాల ప్రమాణం ఈవిధంగా ఉండేపక్షాన మన సినిమా పరిశ్రమకు ఎంత మాత్రమూ చచ్చుండదు

వస్తుతహా 'బ్రతుకు తెరువు' కథ మధ్యతరగతి బీదల ఉద్యోగ పరిస్థితులమీద విమర్శగా కనిపిస్తుంది ఈ మధ్యతరగతి ఉద్యోగార్థిగాడు కేవలం మంచితనం చేత ఉద్యోగం సంపాదించుకోలేడు ఏదో ఒక వేషం వెయ్యాలి తీరా ఉద్యోగం సంపాదించాక, ''నా పెళ్ళాం ఏమవుతుందో, నా బిడ్డ లేమవుతారో?'' అనుకుంటే లాభం లేదు రాత్రింబగళ్ళు కొలువులో ఉండాలి ఈచిత్రంలో నాయకుడు తనకు పెళ్ళికాలేదని బొంకుతాడు ఇది వాస్తవ జీవితంలో జరక్కపోవచ్చు అయితే వాస్తవ జీవితంలో ఉద్యోగిగాడు తనకు పెళ్ళీ పెటాకులూ లేనట్టు నటించాలి స్వంత ఇష్టాయిష్టాలుంచుకోరాదు యజమానుల యిష్టాలూ, అభిరుచులూ, వినోదాలూ తప్ప తనకొక యిష్టమూ, అభిరుచీ వినోదమూ లేనట్టు నటించాలి ఈ దుస్థితి కార్మికుడికి కూడా లేదు వాడు రోజుకు ఎనిమిదిగంటలు యజమానికోసం చెమటోడ్చి తనదారిని తానువెళ్ళి తన జీవితం తాను అఘోరిస్తాడు మధ్య తరగతి ఉద్యోగిగాడికి అర్ధరాత్రీ అపరాత్రీ కూడా పిలుపు రావచ్చు 'బ్రతుకు తెరువు' కథానాయకుడి చిత్రణం వ్యంగ్యంగా మధ్యతరగతి ఉద్యోగిబతుకు చిత్రిస్తుంది అతడు పేరు మార్చుకోవటంలో కూడా అంతరార్థం ఉంది, మధ్యతరగతి ఉద్యోగికి వ్యక్తిత్వం కూడా పోతుంది!

చిత్ర కథలలోగల ఈ అంతరార్థం చిత్రంలో పూర్తిగా వ్యక్తంకాని మాట నిజమే మోహన్ (కథానాయకుడు) తన ఉద్యోగం నిలబెట్టుకునేటందుకు గాను, తన పెళ్ళాం బిడ్డల్ని పోషించుకునేటందుకుగాను తనకు పెళ్ళి కాలేదన్న అబద్ధం ఒకటే ఆడాడు అతను ఈ ఉద్యోగం కోసం తన యజమాని కూతురికి తనపై వ్యామోహం కలిగేటట్టు చేసుకున్నప్పటికీ, ఆమె అతన్ని పెళ్ళాడ సంకల్పించే పరిస్థితి తానే కలిగించినప్పటికీ కూడా అతని పాత్ర సరిగానే ఉండేది ఈ చిత్రంలో నీతి ఉండేట్టు చేయదలచినట్లయితే మోహన్ పాత్రను అట్లాగే సృష్టించి ఉండవలసింది కాని నిర్మాతలు ఇతి వృత్తానికీ , దాని ప్రయోజనానికీ ఇంత ప్రాముఖ్యం ఇవ్వలేదు ఇవ్వదలచలేదు కూడా నేమో వారు చిత్రంలో హాస్యం ప్రధానంగా పెట్టుకుని దాన్ని ఏదో విధంగా సాధించారు అందుచేత, కథకు కొంత అన్యాయం జరిగినా, ప్రేక్షకుడికి అన్యాయం జరగలేదు ప్రేక్షకుడు ఏమీ శ్రమ లేకుండా చిత్రం చూసి తన యిష్టం వచ్చినట్టుగా నవ్వుకోవచ్చు ఈచిత్రంలో ఒకనీతి ఉద్దేశించారనేది కూడా ప్రేక్షకుడు జ్ఞాపకం వుంచుకోనవసరంలేదు అవకాశం దొరకగానే చిత్రంలోని పాత్రలచేత ఆనీతి ఏమిటో స్పష్టంగా నిర్మాతలు చెప్పివేశారు

స్థూలంగా చూసినట్టయితే 'బ్రతుకు తెరువు' కథ 'సంసారం' కథకు అనుకరణలాగా

కనిపిస్తుంది ఇందులోనూ కథానాయకుడి దారిద్ర్యం వెంట అతని సోదరి దుర్మార్గం చిత్రించబడింది 'సంసారం' లోలాగే నాగేశ్వరరావు ఇందులో కూడా అతి సునాయాసంగా ఒక లక్షాధికారి దగ్గిరకి వచ్చిపడి, తన ప్రయత్నం ఏమీలేకుండా యజమాని కుమార్తె ప్రణయాన్ని సంపాదిస్తాడు అందులో లాగే ఇందులో కూడా ధనికుడు తన కుమార్తెకన్న కూడా ఆమె ప్రణయ సాఫల్యం కొరకు ఎక్కువ ఆదుర్దా కనబరుస్తాడు ఇందులోకూడా రేలంగి మళ్ళీ ఇల్లరికపు అల్లుడే నాగేశ్వరరావు తల్లికి డబ్బు పంపిస్తే దాన్ని మరొకరు అపహరిస్తూరావటం 'ముగ్గురు కొడుకుల' చిత్రాన్ని జ్ఞాపకం చేస్తుంది

అయితే ఇదంతా చూసి 'బ్రతుకు తెరువు' కథకేవలం అనుకరణలా గుందనుకోనవసరం లేదు కథలో అనేక కథలనుకరణ ఉన్నప్పటికీ దీని వ్యక్తిత్వం దీనికి లేకపోలేదు ఏ సంఘటనను ఎక్కడి నుంచి తెచ్చినా ప్రతిసంఘటనకూ కథలో సరిఅయిన స్థానం చూపించగలిగినందుకు మనం 'బ్రతుకు తెరువు' నిర్మాతలను తప్పక అభినందించలవలసిందే ఎందుకంటే సినిమా కథలు రాసుకోవడంలో గమనించదగిన ముఖ్య విషయం ఇదే

ఇక పాత్రల విషయం చూస్తే ఏపాత్రాకూడా ఒక గొప్ప సృష్టి అవటానికిలేదు చాలా పాత్రలు వ్యంగ్య కల్పనలు పల్లెటూళ్ళో కంసాలీ, బస్తీలో మోహన్ స్నేహితుడూ, అతని మేనల్లుడు మొదలైనవి మోహన్ అక్కకోటమ్మా, బావమరిది లోకయ్యా స్వయంగా వ్యంగ్యకల్పనలు కాకపోయినా వ్యంగ్య హాస్యానికి ఉపయోగించాయి ఏ పాత్ర యొక్క మనస్థితిగాని అట్టే వివరంగా చూపబడలేదు అందుచేత కథగాని, ప్రేక్షకులుగాని ఏ పాత్ర వెంటా ఎక్కువసేపు నడవరు ఇది కూడా చిత్రానికి దెబ్బే అని అనుమానపడవచ్చు కాని అట్లా జరగలేదు పైగా కథయొక్క వేగానికి చాలా సహాయపడింది ప్రతి చిన్న పాత్రను మరొక పాత్ర మింగటం జరగలేదు కథను కొద్ది పాత్రలు గుత్తకు పుచ్చుకోవటం జరగలేదు

కథారచనలో అవలంబించిన పద్ధతే డైరెక్షన్‌లో కూడా కనిపిస్తుంది డైరెక్షను కథను లోతుగా మథించదు, వైశాల్యం సాధిస్తుంది ఇది తెలుగు చిత్రాల డైరెక్షనులో ఒక కొత్త పంథా అని చెప్పవచ్చు సాధారణంగా ప్రతి డైరెక్టరు ''వినోదం'' ఆశించే పని చేస్తున్నట్టు పైకి చెప్పుకుంటాడు కాని ఆచరణలో అది కనిపించదు కాని చిత్రంలో డైరెక్టరు వినోదానికిచ్చిన ప్రాముఖ్యం మరిదేనికీ ఇవ్వలేదు చిత్రంలో హాస్యంకాక ఇతర రసాలు చాలా ఉన్నాయి అయితే డైరెక్టరు వాటికోసం కథా గమనాన్ని ఏమాత్రమూ తగ్గనివ్వలేదు ఒక్కొక్క చోట కొన్ని సన్నివేశాలకు డైరెక్టరు న్యాయం చెయ్యలేదని కూడా క్షణికంగా అనిపిస్తుంది కాని ఆభావం ఎంతో సేపుండదు

కథారచన, పాత్ర సృష్టీ, డైరెక్షనూ ఒకే పంథాలో నడవటం వల్ల చిత్రంలో ''యూనిటీ'' ఏర్పడింది సామాన్యంగా ఈ దారులు కలవకే పిక్చర్లు అభాసవుతుంటాయి

చిత్రం బాగుపడటానికిగాని, చెడిపోవటానికిగాని నాలుగోకారణంగా పనిచేసేది నటులు, మిగిలిన కారణాలతో పోలిస్తే ఇదంత ముఖ్యమైనది కాకపోయినప్పటికీ, నటులు కేవలం డైరెక్టరు ఆజ్ఞలకు బద్ధులై ఆయన చెప్పినట్టు చేసినదానికీ, తాము కూడా డైరెక్టరుతో ఏకమై చిత్రం సృష్టించిన దానికీ, కొంత తేడావుంటుంది 'బ్రతుకు తెరువు' చిత్రం అచ్చిగా ఒక కథకుడి కృషిగాని, డైరెక్టరు కృషి అనిగాని అనిపించదు నటులు కూడా చిత్రాన్ని సృష్టించటంలో

ప్రముఖ పాత్ర నిర్వహించినట్టే కనిపిస్తారు

చిత్రంలో హాస్యం గురించి వేరే చెప్పనవసరం లేదు ఇది ప్రధానంగా హాస్య చిత్రం అయితే ఇందులో సాంఘిక పరమార్థం లేకపోలేదు ఈవిషయంలో ఇది'పెళ్ళి చేసిచూడు' జాతికి చెందుతుంది ఇందులోని హాస్యం కూడా పదేపదే చూసి ఆనందించదగినది అక్కడక్కడా మాటల హాస్యంలో ముతకదనం కొద్దిగా ఉన్నా మొత్తంమీద ఎక్కడా జుగుప్స కలిగించేదాకా వెళ్ళలేదు హాస్యంలో కొత్తదనం కూడా లేకపోలేదు

నటులలో ముఖ్యులంతా తమ పాత్రలను చాలా చక్కగా పోషించారు నాగేశ్వరరావు నటన ఈచిత్రంలో ఉన్నంతబాగా ముందే చిత్రంలోనూ లేదని చెప్పవచ్చు రేలంగి చిత్రాన్ని మొదటి నుంచి చివరదాకా మోసేశాడు సూర్యకాంతం, రంగారావు, శ్రీరంజని, సావిత్రి, హేమలత, అన్నపూర్ణ తమ పాత్రలను చాలా సహజంగా పోషించారు మిగిలినవారు ఫరవాలేదు చిత్రంలో సంగీతం ప్రమాణం ఆదర్శప్రాయంగా ఉంది ఉన్న కొద్దిపాటలూ సరిఅయిన స్థానంలోనే పడ్డాయి శ్రీరంజని శోకంలో పాడేపాట తీసేస్తే సరిపోయేది నాగేశ్వరరావు పియానో వాయిస్తూ పాడిన పాట (రేలంగి ప్లేబాక్) అన్ని పాటలలోకీ చాలా బాగుంది

సినిమా ప్రేక్షకులకు కావలసింది వినోదమే అయినట్టయితే 'బ్రతుకు తెరువు' చాలా బాగానడవటానికి ఎటువంటి సందేహమూలేదు ప్రేక్షకులు విమర్శనాదృష్టితో చూసినట్టయితే చిత్రంలో వాస్తవికత కొంత లోపించటం లెక్కలోకి రావచ్చు

*తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 13–2–1953*

# 18. పుట్టిల్లు

రాజా ప్రొడక్షన్స్‌వారి తొలిచిత్రం 'పుట్టిల్లు' ఈవారం విడుదల అయింది డాక్టర్ రాజారావు సరికొత్త ప్రొడ్యూసరు–డైరెక్టరు–హీరో, ఈ చిత్రంలో హీరోయిన్‌గా నటించిన జమున కూడా సరికొత్తనటి మిగిలినవారిలో కూడా కొందరు సరికొత్తనటులున్నారు మరికొందరు ఇటీవలనే సినిమారంగంలో ప్రవేశించినవారు మాటలూ పాటలూ వ్రాసినవారు సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావులు, సంగీతం మోహన్‌దాస్, చలపతిరావులు కామెరా వి ఎన్ రెడ్డి, అజిత్ కుమార్‌లు రాజాప్రొడక్షన్స్ సంస్థ సినిమా పరిశ్రమద్వారా డబ్బుచేత పిల్లల్ని పెట్టించడానికికాక సినిమా కళద్వారా ప్రజలలో సాంఘికచైతన్యం పెంపొందించడానికి ముందుకు వచ్చిందని చెప్పాలి అందుకే వీరేశలింగం పేరు స్మరించి స్త్రీ జాతియొక్క ఔన్నత్యాన్ని సమర్థించడానికిగాను ఈ 'పుట్టిల్లు' చిత్రం తయారు చేశారు

ఈ ఆశయం సరిగా కొనసాగినట్టు కనబడదు 'పుట్టిల్లు' చిత్రం చూసిగాని, సుశీలపాత్రను చూసిగాని ప్రపంచం నేర్చుకునేదేమిటో ఊహించటం కూడా అంత తేలికైనపనిగా లేదు కథానాయిక సుశీల పల్లెటూరి రైతుకుటుంబంలో పుట్టిన పిల్ల అన్న అభ్యుదయ భావాలు కలవాడు తండ్రి పెద్దగా బతికిచితికి నవాడు, పాతసంప్రదాయానికి చెందినవాడు రజస్వలయ్యేవరకూ సుశీల చదువుకుంటుంది ఆతరవాత తండ్రి చదువు మానిపిస్తాడు పదివేలు కట్నం పొయ్యటానికి ఒప్పుకుని రాఘవరావు వంటి కోతినితెచ్చి సుశీలకు పెళ్ళి చేస్తారు సినిమా యాక్టరు నైపోతాననీ, కమ్మని కవిత్వం రాస్తాననీ, ఇంకేమో పాడిచేస్తానని కలలుగన్న సుశీల

కనిపిస్తుంది ఇందులోనూ కథానాయకుడి దారిద్ర్యం వెంట అతని సోదరి దుర్మార్గం చిత్రించబడింది 'సంసారం' లోలాగే నాగేశ్వరరావు ఇందులో కూడా అతి సునాయాసంగా ఒక లక్షాధికారి దగ్గిరకి వచ్చిపడి, తన ప్రయత్నం ఏమీలేకుండా యజమాని కుమార్తె ప్రణయాన్ని సంపాదిస్తాడు అందులో లాగే ఇందులో కూడా ధనికుడు తన కుమార్తెకన్న కూడా ఆమె ప్రణయ సాఫల్యం కొరకు ఎక్కువ ఆదుర్దా కనబరుస్తాడు ఇందులోకూడా రేలంగి మళ్ళీ ఇల్లరికపు అల్లుడే నాగేశ్వరరావు తల్లికి డబ్బు పంపిస్తే దాన్ని మరొకరు అపహరిస్తూరావటం 'ముగ్గురు కొడుకుల' చిత్రాన్ని జ్ఞాపకం చేస్తుంది

అయితే ఇదంతా చూసి 'బ్రతుకు తెరువు' కథ కేవలం అనుకరణలా గుందనుకోనవసరం లేదు కథలో అనేక కథలనుకరణ ఉన్నప్పటికీ దీని వ్యక్తిత్వం దీనికి లేకపోలేదు ఏ సంఘటనను ఎక్కడి నుంచి తెచ్చినా ప్రతిసంఘటనకూ కథలో సరిఅయిన స్థానం చూపించగలిగినందుకు మనం 'బ్రతుకు తెరువు' నిర్మాతలను తప్పక అభినందించలవలసిందే ఎందుకంటే సినిమా కథలు రాసుకోవడంలో గమనించదగిన ముఖ్య విషయం ఇదే

ఇక పాత్రల విషయం చూస్తే ఏపాత్రాకూడా ఒక గొప్ప సృష్టి అవటానికిలేదు చాలా పాత్రలు వ్యంగ్య కల్పనలు పల్లెటూళ్ళో కంసాలీ, బస్తీలో మోహన్ స్నేహితుడూ, అతని మేనల్లుడు మొదలైనవి మోహన్ అక్కకోటమ్మా, బావమరిది లోకయ్యా స్వయంగా వ్యంగ్యకల్పనలు కాకపోయినా వ్యంగ్య హాస్యానికి ఉపయోగించాయి ఏ పాత్ర యొక్క మనస్థితిగాని అట్టే వివరంగా చూపబడలేదు అందుచేత కథగాని, ప్రేక్షకులుగాని ఏ పాత్ర వెంటా ఎక్కువసేపు నడవరు ఇది కూడా చిత్రానికి దెబ్బే అని అనుమానపడవచ్చు కాని అట్లా జరగలేదు పైగా కథయొక్క వేగానికి చాలా సహాయపడింది ప్రతి చిన్న పాత్రను మరొక పాత్ర మింగటం జరగలేదు కథను కొద్ది పాత్రలు గుత్తకు పుచ్చుకోవటం జరగలేదు

కథారచనలో అవలంబించిన పద్ధతే డైరెక్షన్‌లో కూడా కనిపిస్తుంది డైరెక్షను కథను లోతుగా మథించదు, వైశాల్యం సాధిస్తుంది ఇది తెలుగు చిత్రాల డైరెక్షనులో ఒక కొత్త పంథా అని చెప్పవచ్చు సాధారణంగా ప్రతి డైరెక్టరు ''వినోదం'' ఆశించే పని చేస్తున్నట్టు పైకి చెప్పుకుంటాడు కాని ఆచరణలో అది కనిపించదు కాని చిత్రంలో డైరెక్టరు వినోదానికిచ్చిన ప్రాముఖ్యం మరిదేనికీ ఇవ్వలేదు చిత్రంలో హాస్యంకాక ఇతర రసాలు చాలా ఉన్నాయి అయితే డైరెక్టరు వాటికోసం కథా గమనాన్ని ఏమాత్రమూ తగ్గనివ్వలేదు ఒక్కొక్క చోట కొన్ని సన్నివేశాలకు డైరెక్టరు న్యాయం చెయ్యలేదని కూడా క్షణికంగా అనిపిస్తుంది కాని ఆభావం ఎంతో సేపుండదు

కథారచన, పాత్ర సృష్టి, డైరెక్షనూ ఒకే పంథాలో నడవటం వల్ల చిత్రంలో ''యూనిటీ'' ఏర్పడింది సామాన్యంగా ఈ దారులు కలవకే పిక్చర్లు అభాసవుతుంటాయి

చిత్రం బాగుపడటానికిగాని, చెడిపోవటానికిగాని నాలుగో కారణంగా పనిచేసేది నటులు, మిగిలిన కారణాలతో పోలిస్తే ఇదంత ముఖ్యమైనది కాకపోయినప్పటికీ, నటులు కేవలం డైరెక్టరు ఆజ్ఞలకు బద్ధులై ఆయన చెప్పినట్టు చేసినదానికీ, తాము కూడా డైరెక్టరుతో ఏకమై చిత్రం సృష్టించిన దానికీ, కొంత తేడావుంటుంది 'బ్రతుకు తెరువు' చిత్రం అచ్చుగా ఒక కథకుడి కృషిగాని, డైరెక్టరు కృషి అనిగాని అనిపించదు నటులు కూడా చిత్రాన్ని సృష్టించటంలో

అడిగినప్పుడు ఆకాశమెత్తు ఎగురుతాడు, కాని తన కూతుర్ని అత్తవారు నానా మాటలూ అంటుంటే అవగింజంతైనా పౌరుషం చూపకపోగా కళ్ళనీళ్ళు కుక్కుకుని జారుకుంటాడు! ఆక్షణంలో ఆయన ఆగ్రహించి కూతుర్నీ మనవణ్ణీ ఇంటికి తెచ్చుకుంటే కథ మారిపోతుంది

కథానాయకుడు రాఘవరావూ అంతే అతను మద్రాసు వెళ్లేదాకా వొట్టి ఓబయ్య అతరవాత విలన్, జూదగాడు, చోరుడు, హంతకుడు ఏ ఓబయ్య అయినా పెళ్లామంటే ఇష్టంగా ఉంటే కథలేదు ఓబయ్యగా ఉండగా ఇష్టపడతాడుగాని తెలివిమీరినాక భార్య అంటే ఇష్టపడడు ఇది వాస్తవ పరిణామమా అన సమస్యేలేదు సుశీల కథకు అది అనుకూలపరిణామం అన్ని పాత్రలూ ఈవిధంగా సృష్టించబడినవే సుశీల అత్తగారు ఒక కోడలి మొహాన అకారణంగా మొద్దులు పెట్టి రెండో కోడలికోసం ఆత్రంగా ఎదురుచూస్తుంది సుశీలను వెళ్ళగొట్టడానికి ఆమె ఎందుకంత ఆరాటపడేదీ తెలియదు ఆమె భర్త కూడా ఇంతే మొదటి నుంచీ భార్య అనుకున్న ప్రకారమల్లా సాగనిచ్చి ఉన్నట్టుండి ఎదురు తిరిగి కోడల్ని పక్కభాగంలో పెట్టేసి మళ్ళీ కనిపించడు పాత్రలన్నీ రెండు రకాలు – మంచివీ, చెడ్డవీను చెడ్డపాత్రలకు అమానుషంగా అర్థవిహీనంగా ప్రవర్తించే హక్కువుంది మంచి పాత్రలను చెడ్డపాత్రలతో సంఘర్షణపడి తమ పట్టు నెగ్గించుకునే శక్తిలేదు

కథనూ, పాత్రలనూ తలతన్నినది చిత్రకథనం దాన్నిమించినది డైరెక్షన్ మూగవాడికీ సుశీలకూ రంకుకట్టే సన్నివేశం మచ్చుతునక బుర్రకథ జరుగుతూ ఉంటుంది మూగవాడు కథనుంచివచ్చి పంచలో పడుకుంటాడు లోపల గదిలో ఉన్న సుశీల తలుపు తెరుచుకుని బయటికివచ్చి వాణ్ణి గదిలోకి తీసుకుపోయి పడుకోబెడుతుంది ఇదంతా జరిగిన మరుక్షణం సుశీల అత్తగారు వచ్చి సుశీల గదిలోకి తొంగిచూసి బయట గొల్లెంపెట్టి అందర్నీ పిలిచి తన కోడలిమీద రంకు కడుతుంది ఇదంతా దైవికంగా జరిగినదనుకోవటానికీ వీల్లేదు అత్త కుట్ర అనటానికీ వీల్లేదు రెండింటి కలగాపులగం కాని సుశీల పదిమెట్లు పైననిలబడి భర్తకు ఉపన్యాసం ఇచ్చేటందుకు ఇదే పునాది డైరెక్షన్‌లో చాతగానితనం చిత్రమంతటా ఉన్నది చిత్రంలో ఉండే టెంపోగాని, సస్పెన్సుగాని బొత్తిగా అవాస్తవికంగా తయారు కావటానికి కథలో లోపాలేగాక డైరెక్షన్‌లోపాలు కూడా తోడ్పడ్డాయి రాఘవరావు తన కొడుకు మెళ్లో గొలుసు తీసుకుపోవటానికి గొంతు పిసకనవసరం లేదు తీరా గొంతు పిసికినాక కాస్త "టూలేట్"గా సుశీల అక్కడ ప్రత్యక్షంకానవసరంలేదు తండ్రిచేత కొడుకు గొంతు పిసికించినంత ఘోరం చిత్రంలో చూపించి ఆసంఘటన సహాయంతో రాఘవరావును జైలుకు పంపించకుండా మళ్ళీ అదేచోటికి రాఘవరావును తెప్పించి సుశీలచేత ఎందుకు ఉపన్యాసం ఇప్పించారో తెలియదు

నటుల డైరెక్షను కూడా చాలాచోట్ల మోతాదు మించి ఉంది ఒక్కరి నటనకూడా రాణించలేదని చెప్పవచ్చు రాజరావు, జమున, అచ్చయ్య, పెరుమాళ్ళు, మిక్కిలినేని, కుటుంబరావు, సురభి కమల, రమణారెడ్డి మొదలైనవారు కష్టపడినా ఫలితం లేకపోయింది జమున గొప్పతార అయ్యే అవకశాలు చాలా తక్కువ కాని సరిఅయిన పాత్రా, డైరెక్షనూ లభిస్తే సినిమానటిగా ఇంత కంటె రాణించవచ్చు

ఫోటోగ్రఫీలో ఆర్భాటం జాస్తి అనేక చోట్ల బ్లాక్ కంపోజిషన్ కూడా సరిగాలేదు

కథకు అనువైన వాతావరణం ఫొటోగ్రఫీద్వారా సాధించటానికి యత్నం జరగలేదు. పాటలు పరిమితంగా ఉన్నాయి సంగీతం బాగానే ఉంది అయితే ఈనాటి జనరంజక సినిమా సంగీతంతో పోటీ చేయలేదు

ఇంతకీ, ఈనాడు సినిమా పరిశ్రమలోకి సాంఘిక అభ్యుదయ ఆశయాలతో అడుగుపెట్టే వారు చాలా కొద్దిమంది ఆకొద్దిమంది కూడా సినిమా శిల్పాన్నీ, కళనూ తృణీకార భావంతో చూసి, తమ ఆశయాలే విజయాన్ని సాధిస్తాయనుకోవటం శోచనీయం సినిమా అనేది నాటకం కంటెకూడా బలమైన దృశ్యకావ్యం కాగితం మీదరాసి చదువుకుంటే కలిగే చైతన్యంకంటె ప్రదర్శనలో ఎన్నోరెట్లు జీవంరావాలి 'పుట్టిల్లు' లో ఒక్క సన్నివేశం కూడా చదువుకుంటే కలిగేదాన్ని మించి చూడటంలో ఎక్కువ రక్తిగా ఉన్నదనుకునేందుకు లేదు ఎన్నో సన్నివేశాలు ప్రేక్షకుని భావనాశక్తిని దిగలాగాయి కూడా ఇంతకంటె శోచనీయం మరొకటి లేదు

ఇంకముందైనా రాజా ప్రొడక్షన్స్ వారు తమ ఆశయాలకు తగినకథను ఎన్నుకొని సాంకేతికంగా దానికి న్యాయం చేకూరుస్తారని ఆశించాలి

*తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 27-2-1953*

# 19. మిస్టర్ సంపత్

మద్రాసు చిత్ర నిర్మాతలు తగినంత హంగుతో విజయవంతంగా హిందీచిత్రాలు తీయగల రనటానికి మరొక నిదర్శనం జెమినీ వారి 'మిస్టర్ సంపత్' జెమినీ వాసన్ గారు తాము కొంత కాలం క్రితం తమిళంలో తయారు చేసిన 'మిస్ మాలిని' చిత్రాన్ని కొద్దిపాటి మార్పులుతో 'మిస్టర్ సంపత్' అనేపేరుతో ఇప్పుడు హిందీలో తీశారు ఈచిత్రాన్ని ఫిబ్రవరి 26న జెమినీ ప్రొడక్షన్ థియేటర్‌లో పత్రికలవారికి చూపారు

సంపత్ అనేవాడు '' ఎడ్వంచరర్'' తన కబుర్లతో అందర్నీ నమ్మిస్తూ మోసగిస్తూ, చుక్కానిలేని ఓడలాగ జీవితసముద్రంలో ఎక్కడా లంగరు అట్టేకాలం దించకుండా తిరుగుతూ ఉంటాడు ఈసంపత్ టిక్కెట్టు లేకుండారైల్లో ప్రయాణిస్తుండగా చిత్రం ప్రారంభమవుతుంది అట్లాగే చిత్రంపూర్తి అవుతుంది కూడా సంపత్‌కు పాతహోటళ్ళలో పరపతి అయిపోయి ఒక కొత్త హోటలుకు పోతాడు ఆ హోటలు యజమానికి మిస్ మాలిని అన్న నటిమీద వెర్రి అభిమానం ఈ సంగతి తెలియగానే సంపత్ తనకు మాలిని బాగా తెలుసునని బొంకి హోటలు యమానిదగ్గిర పరపతి సంపాదిస్తాడు మిస్ మాలిని కళామందిరంలో నృత్య నాటకాలలో ప్రధానపాత్రలు ధరించి పైకి వస్తున్న నటి ఒకనాడు సంపత్ దగ్గిరికి ఒక పారిశ్రామికుడు వచ్చి, తాను మునిసిపల్ కౌన్సిలరుగా నిలబడుతున్నానని చెప్పి వోటడుగుతాడు వలలోపడిన ఇంత పెద్ద చేపను పోనివ్వరాదని సంపత్ అతని ఎలెక్షన్ ప్రచారానికి సాయపడటానికి పూనుకుంటాడు దీనికోసం టీపార్టీ ఏర్పాటు చేసి ఆ కంట్రాక్టు తన స్నేహితుడైన హోటలు యజమానికిప్పిస్తాడు ఆ సందర్భంలో మిస్ మాలినిని కూడా మీటింగుకు తెస్తానని సంపత్ అభ్యర్థికి మాట యిస్తాడు ఇక మాలిని పరిచయం తరువాయిగా ఉంటుంది దీనికోసం సంపత్ కెమెరా ఒకటి కొని పత్రికాప్రతినిధిగా నటిస్తూ మాలిని ఇంటికి పోతాడు ఆమెను ఫోటో తీసి, ఆమె పరిచయం సంపాదిస్తాడు ఆమెను ఉబ్బవేస్తాడు. విందూ, మీటింగూ

జరుగుతుంది ఎన్నికలలో అభ్యర్థి గెలుస్తాడుగాని కొంప గుండం అవుతుంది ఇందులోనుంచి బయటపడటం కోసమని సంపత్ ఆ పారిశ్రామికుడిచేత బాంక్ పెట్టిస్తారు డిపాజిట్లు మీద అంతులేని వడ్డీనిస్తామని అబద్ధాలాడి లోకం డబ్బు సంపాదిస్తారు ఇట్లా బాంకుకు డబ్బిచ్చినవారిలో ఒక జమీందారుంటాడు అతను మిస్‌మాలినిని కామించి ఆమె కోసం బాంక్‌కు రెండు లక్షలిస్తాడు ఈ సంగతి మాలినికి తెలియదు ఆమె కళామందిరం యజమానిని ప్రేమిస్తుంది ఈజమిందారు ప్రేమను తిరస్కరిస్తుంది జమీందారు బాంకునుంచి తన రెండు లక్షలు తీసివేస్తాడు బాంకు దివాలా తీసే పరిస్థితి ఏర్పడుతుంది ఈ సమయంలోనే మాలిని పబ్లిసిటీ ఆర్భాటంలో పడిపోయి కళామందిరానికి సరిగా హాజరు కాపోటమూ, ఒకనాడు ఆమె స్థానంలో మరొకరు స్టేజిమీదికి వెళ్ళవలసి రావటమూ, మాలిని పుట్టెడు కోపంతోనూ, దుఃఖంతోనూ ఇంటికి తిరిగి రావటమూ జరుగుతుంది సంపత్ ఆమెను కళామందిరం నుంచి చీలదీసి పారిశ్రామికుడిచేత నాటకం కంపెనీ పెట్టిసాడు త్వరలోనే బాంకు దివాలాతీస్తుంది నాటక కంపెనీ దివాలా తీస్తుంది బాకీలవాళ్ళు మాలిని స్వంత ఆస్తి జప్తు చేస్తారు కళామందిరం యజమాని ఆమె బాకీలు చెల్లించి ఆమెను తిరిగి తనకంపెనీలోకి తీసుకుంటాడు సంపత్ జోగివేషం వేసి రైలెక్కి నిష్క్రమిస్తాడు

'మిస్ మాలిని' చిత్రంలో మద్రాసు వాతావరణం చూపారు 'మిస్టర్ సంపత్' లో బొంబాయి వాతావరణం చూపారు చిత్రం హిందీలో తీసినప్పటకీ దానికికూడా మద్రాసు వాతావరణమే ఉంటే బాగుండేదనిపిస్తుంది ఏ వాతావరణం ఉన్నప్పటికీ కథమీద వాతావరణ ప్రభావం దాదాపు ఏమీలేదని చెప్పవచ్చు ఎందుచేతనంటే ఈకథలో ప్రధానాంశం సంఘవిమర్శే గాని వాస్తవికపాత్ర చిత్రణా, పోషణాకాదు కథానాయకుడు సంపత్ కూడా వాస్తవికమైన పాత్రకాదు ఆపాత్ర కేవలం యుక్తిచేత బతుకుతుంది దానికి వర్తమానమేతప్ప భూతభవిష్యత్తులు లేవు దానికొక కార్యక్రమంలేదు సంపత్ ఒక కప్పు టీ కోసం చాణక్యుడంతగా ఎత్తులు వేస్తాడు తన క్షణిక స్వార్థం కోసం ఎంతమందినైనా గోతుల్లో తోస్తాడుకాని తాను బాగుపడడు వాడికి జీవితపు నైతిక విలువలులేవు అయినా వాడు నీతి అవినీతులకు అతీతుడుగా ఉంటాడు మిస్ మాలినిని జమీందారుకు వంటరిగా వప్పజెప్పుతాడు ఆమె నీతిని గురించి వాడికి విచారం లేదు కాని తానై మాలినిని కామించదు ఈచిత్రంలో ఎవరికి ఏ బాధలు కలిగినా సంపత్ మూలంగానే కలుగుతాయి కాని వాస్తవ ప్రపంచాన్ని బాధలలో ముంచేవాళ్ళు సంపత్ లాంటి వాళ్ళు కాదు పైగా ఈ సంపత్ చిత్రంలోవచ్చే అన్నిరకాలపాత్రలనూ –ఒక పారిశ్రామికుణ్ణీ, ట్రావెలింగ్ టిక్కెట్‌ఎగ్జామినర్లనూ, ప్రసిద్ధికెక్కిన నటినీ తన మాటలతోబోల్తాకొట్టించేస్తాడు వారు మోసపోయే పద్ధతి నమ్మదగినట్టుగా లేదు

చిత్రంలో దాదాపు సగంభాగం స్టేజి ప్రదర్శనాలూ, మిగిలిన సగమూ కథకు సంబంధించిన దృశ్యాలు, ఒక్కొక్కసారి ఈ రెంటికీ వ్యత్యాసం తెలియనట్టుగా కూడా ఉంటుంది స్టేజిమీది దృశ్యాలు ఎంత కృత్రిమంగా ఉన్నాయో కథకు సంబంధించిన దృశ్యాలు కూడా అంత కృత్రిమంగానే ఉన్నాయి అయితే ఈలోపం బుద్ధిపూర్వకంగా చేసినదిగా కనిపిస్తుంది దీనివల్ల చిత్రానికి, రెండు విధాల లాభించింది వివిధ సాంఘిక విమర్శలతో కూడుకున్న స్టేజి దృశ్యాలు చిత్రంలో బాగా అతికాయి మరొకటేమిటంటే చిత్రమంతటా

కావలసినంత హాస్యం ఇమిడింది ఈ చిత్రంలో పాత్రపోషణ పెట్టుకున్నట్టయితే చిత్రం ధోరణి పూర్తిగా మారిపోయి ఉండేది

దీనికి పండిట్ ఇంద్ర రాసిన పాటలూ మాటలూ బాగనే ఉన్నాయి. మోతీలాల్ సంపత్ పాత్ర ధరించి చాలాబాగా నటించాడు ఇటీవల అతను హిందీ చిత్రాలలో చూపిన నటనకంటె ఈచిత్రంలో నటన బాగున్నదంటే దానికి కారణం హిందీ చిత్రనిర్మాతలు అతనికి సరిఅయిన పాత్ర లివ్వకపోవటమే మిస్ మాలినిగా పద్మిని తృప్తికరంగానే నటించింది, హోటలు వాడుగా ఆగాకూడా చక్కని హాస్యం ఒప్పించాడు చిల్లర నటులలో కూడా తీసివెయ్యవలసిన వారెవరూ లేరు

సంగీతమూ, ఫోటోగ్రఫీ, డాన్సులూ, సెట్టింగులూ మొదలైనవి ఉత్తమ ప్రమాణాలలో ఉండి మామూలు హిందీ చిత్రాలకు ఏవిధంగానూ తీసిపోకుండా ఉన్నాయి అసలు ఇటువంటి కధ దక్షిణ భారత సినిమా ప్రేక్షకులనుకన్నా హిందీ సినిమా ప్రేక్షకులనే ఎక్కువగా ఆకర్షించవచ్చు ఎందుచేతనంటే ఇది పల్లెప్రజలకన్న పట్టణవాసులను అధికంగా ఆకర్షించే కధ ఈ చిత్రాన్ని గురించి బొంబాయి పత్రికలు బాగా రాయటంలోనూ, హిందీ ప్రేక్షకులు దీన్ని ఆదరించటం లోనూ ఆశ్చర్యం ఏమీలేదు

*తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 6-3-1953*

# 20. గుమస్తా

అరుణావారు తమ రెండవ చిత్రం 'గుమస్తా' (తెలుగు వెర్షన్) మార్చి 12 ఉదయం మద్రాసు పారగన్ టాకీసులో ప్రెస్‌షో ఇచ్చారు ఈ చిత్రంలోని కథకూ, మాటలకూ, పాటలకూ బాధ్యుడు ఆచార్య ఆత్రేయ, ఫోటోగ్రఫీ, డైరెక్షన్ ఆర్ ఎమ్ క్రిష్ణస్వామి నిర్వహించాడు దీనికి సంగీతం చేకూర్చినవారు సి ఎన్ పాండు రంగం, వి నాగయ్య, జి రామనాథం దీనిని వి సి సుబ్బరామన్ ఫిలింసెంటర్ లిమిటెడ్ లో నిర్మించారు , ఇందులో నాగయ్య, పండరీబాబు, మనోహర్, జయమ్మ, రామశర్మ, వెంకయ్య, పేకేటి శివరాం, సి కె సరస్వతి, సరోజ, సి వి వి పంతులు, మేనక, నరసింహరావు మొదలైన వారు నటించారు

ఈచిత్రానికి 'గుమస్తా' అని పేరు పెట్టినప్పటికీ ఇందులో అచ్చగా గుమస్తా కథ మాత్రమే గాక, గుమాస్తా చెల్లెలు కథా, ఆమె కూతురి పెళ్లి కథాకూడా ఉన్నాయి మూడింటిలోకీ ముఖ్యంగా కనిపించేది గుమాస్తా చెల్లెలి కథ అదే మిగిలిన రెండు కథలకూ మధ్య వంతెనలా ఉన్నది

గుమాస్తా రంగనాథం (నాగయ్య) మొదట్లో ప్రేక్షకుడి సానుభూతిని సంపాదిస్తాడు అతనికున్న సమస్యలు మనకర్థమవుతాయి పెద్ద సంసారాన్ని క్షుద్రమైన జీతంతో ఈదటమేగాక రంగనాథం తమ్ముడికి చదువు చెప్పించాలి చెల్లెలికి పెళ్ళిచెయ్యాలి, బాకీదార్లకు మంచిగా ఏదో సమాధానాలు చెప్పాలి ఈ సమస్యలతో నలిగిపోతున్నరంగనాథం భార్య మీద కసరుకున్నా మనం అర్థం చేసుకోగలం తన చెల్లెలు సుశీల (పండరీబాయి) ని పొరుగింటి ధనికుడి కొడుకు రవి (రామశర్మ) ప్రేమించి పెళ్ళాడుతుంటే ఆఖరుక్షణంలో అతనికి గుండెజబ్బు ఉన్నట్టు తమ్ముడు గోపి (మనోహర్) ద్వారా తెలుసుకుని రంగనాథం పెళ్ళి మాన్పించకపోయినప్పుడు

కూడా అతన్ని అర్థంచేసుకుంటాం ఆ తరువాత నుంచీ అతని పాత్ర అయోమయంలో పడిపోతుంది తిరిగి ఆకారం పొందదు సుశీల వివాహానంతరం అతనికి ఒక ధనికుడు ఒక వెయ్యిరూపాయలు లంచంయిస్తాడు రంగనాథం ఈవెయ్యి రూపాయలతో తన స్నేహితుడికి బాకీ తీర్చేస్తాడుగాని ధనికుడు కోరిన అవినీతికరమైన సహాయం చేయనిరాకరించి ఆదర్శవాది లాగా ప్రవర్తిస్తాడు కాని పెళ్ళి అయిన మర్నాడే భర్త పోయిన సుశీలకు గర్భమయినట్టు కాలక్రమాన బయటపడి, అత్తవారామెకు రంకుగట్టి తన ఇంటికి – సత్రానికి – పంపినప్పుడు చెల్లెలి విషయంలో రంగనాథం ప్రవర్తన వాస్తవికంగానూ లేదు ఆదర్శంగానూ లేదు లోకరీతు లన్నిటికీ తానే రక్షకుడనని రంగనాథం అనుకోనవసరం లేదు లోకరీతుల ప్రోద్భలంచేత అతను అవటికే ఉద్యోగాన్నీ, ఉంటున్న కొంపనూ పోగొట్టుకుని ఉన్నాడు

కథ ఇంకా కొంచెం ముందుకు పోయేటప్పటికి ఈ పాత్ర పూర్తిగా ధ్వంసమైపోతుంది అతను కానీ సంపాదించలేని స్థితిలో, అతని భార్య సీత ( జయమ్మ) ఎవరింటనో వంటలక్కగా చేరి ఆ విషయం భర్తకు తెలియనివ్వదు ఆమె అంత వాస్తవిక పంథా అనుసరించి కూడా ఈ విషయం భర్తదగ్గర దాస్తుందంటే అప్పటికే రంగనాథం పాత్ర వాస్తవికానికి చాలాదూరం వెళ్ళిపోయిందన్నమాట, ఈ విషయం త్వరలోనే రుజువవుతుంది తన భార్య రహస్యం తెలియగానే ఈ దౌర్భాగ్యపు గుమాస్తా ఇంటిల్లిపాదికీ మరణదండన విధించటమే గాక, తన కుమార్తెను చంపేస్తాడు కూడా! ఈ నేరానికి అతన్ని అధికారులు ఖైదు చేసిన తరువాత సీత ఫ్యాక్టరీలో పనికికుదిరి నిక్షేపంగా తనకూ కొడుక్కూ జరిపి, పిల్లవాణ్ణి పెద్దవాణ్ణి చేస్తుంది ఇందులో ఆమె ఎట్టి తీవ్రసమస్యలనూ ఎదుర్కొంటున్నట్టు చిత్రంలో చూపలేదు

ఈవిధంగా రంగనాథం అసమర్థతను సీత నిరూపించగా, రంగనాథం ఆమెను ప్రశంసించాడు గాని, ఆమె ఏడేళ్లు సంసారం నెట్టినందుకు తనకు కుటుంబంలో స్థానం లేకుండా పోతున్నదేమోనని ఉడుక్కుంటాడు! చెల్లెలు ఎన్నో ఏళ్ళకు కనిపించి, తనకోసం వెతుక్కుంటూ వచ్చి పిల్ల పెళ్ళికి రమ్మని ఆహ్వానిస్తే నిక్కి నీలుగుతాడు

మొత్తం మీద గుమస్తా రంగనాథం పాత్ర చాలా జుగుప్సాకరంగా ఉన్నదనాలి ఆపాత్రతో సానుభూతి చూపాలనుకున్న ప్రేక్షకుడికి అవమానం జరిగినట్టవుతుంది ఈ పాత్ర ఈవిధంగా చెడిపోవటం చిత్రానికికూడా దెబ్బే

చిత్రానికి నాయిక సుశీల ఆమె వివాహం కోసమే అన్న రంగనాథం వెయ్యిరూపాయలు అప్పు చేస్తాడు ఆ అప్పే అతని ఉద్యోగం పోవటానికీ, ఇల్లుపోవటానికీ, అతడు హంతకుడుగా పరిణమించటానికీ కూడా బీజంవేస్తుంది ఈమె గర్భవతి కావటమే అన్నదమ్ములమధ్య ( రంగనాథం గోపీలమధ్య) బేధాభిప్రాయాలు రావటానికీ, వారు వేరుపడి ఒకరికొకరు దూరమై పోవటానికీ కారణమౌతుంది ఆఖరుకు ఆమె కుమార్తె సుశీల వివాహం తప్పిపోయినంతపని కావటానికి కూడా ఆమె గర్భం గురించి లోకులకుగల సందేహమే కారణం

అయితే సుశీలపాత్ర ప్రేక్షకుల సానుభూతిని బాగా సంపాదిస్తుంది ఎంచేతనంటే మొదటి నుంచి చివరిదాకా ఆమె ఎట్టితప్పుచేయకపోగా ఇతరుల తప్పులకు తాను శిక్ష అనుభవించి, గుమాస్తాలకు రంగనాథం ప్రతినిధి కాలేకపోయినా, తాను మాత్రం ఈనాటి భారతీయ మహిళలకు నిజమైన ప్రాతినిధ్యం వహిస్తుంది రవి ఆమెను ప్రేమించటంలో గాని, పెళ్ళాడటంలో

గాని, పెళ్ళి నాటి రాత్రి ఎవరూ చూడకుండా ఆమె గదికి రావటంలోగాని, ఆమె రంకులాడి అని ఇతరులు శంకించటంలో గాని ఆమె దోషం అణుమాత్రం కూడాలేదు

సుశీల ఆదర్శప్రాయమైన మహిళ అని చెప్పటానికి లేదు కాని ఉన్నంతలో ఆమె ప్రవర్తన నిర్దుష్టంగా మట్టుకున్నది 'గుమస్తా' చిత్రాన్ని ప్రజలు బాగా ఆదరించే పక్షంలో దానికి ఈ సుశీల పాత్రే అధికంగా కారణభూత మవుతుందనటానికి సందేహం లేదు.

ఒక విధంగా సుశీల పాత్రకన్న ఆదర్శప్రాయమైనది గుమాస్తా భార్య సీతపాత్ర ఈ పాత్రలో సహనం వివేకం, వాస్తవికదృష్టీ గూడా ఉన్నాయి కాని ఈ పాత్ర కథకు ఎక్కడా వినియోగపడక వృథా అయిపోతుంది దీనికి విరుద్ధంగా ''బ్రదర్'' (పేకేటి శివరాం) పాత్రను చాలా వెకిలిగా సృష్టించి దానిని చాలా గొప్పగా ఉపయోగించుకునేటందుకు కథకుడు యత్నించాడు ఈ బ్రదరే దారిన వస్తూ ఏనాడోపోయిన రవి డయిరీ తలవని తలంపుగా సంపాదించి సుశీల సౌశీల్యాన్ని అందరికీ రుజువు చేస్తాడు ఈరెండు పాత్రలూ రెండు విధాలుగా కథకుడి అశక్తతను రుజువు చేస్తున్నాయి మిగిలిన పాత్రల సృష్టిలో కూడా చెప్పుకోదగిన ఉపజ్ఞ ఏమీ లేదు

కథలో ముఖ్యమైన సన్నివేశాలలో హెచ్చుభాగం అసహజంగా ఉన్నాయి ఉదాహరణకు రవి సుశీలను చూసి ప్రేమించటమూ, ఆమె పెళ్లి శుభలేఖ చూసి తాతచావటమూ, చచ్చినా సుశీల పెళ్ళి జరిగిపోవటమూ, అసలు పాండురాజులాగ చస్తూ డయిరీ రాయటమూ, ఆ డయిరీని పని మనిషి అమ్మెయ్యటమూ, రంగనాథం తన పిల్లల్ని నూతిలో పారెయ్యటానికి పోవటమూ, సుశీలను అమ్మలక్కలుపని పెట్టుకుని ఏడిపించటమూ, గోపీ ఊరగాయలమ్మి లక్షలు గడించటమూ, ఆ లక్షల్ని రాణీ పెళ్ళి సమయంలో వెదజల్లటమూ బ్రదర్‌కు రవి డయిరీ రోడ్డు ప్రక్క జ్యోతిష్యుడి దగ్గర దొరకడమూ మొదలైనవి

చాలా మంది నిర్మాతలు చేస్తున్న తప్పే ఈ చిత్రనిర్మాతలూ చేశారు అదేమిటంటే కథ నిండా సంఘటనలు కుక్కటం, అడ్డమైన పాత్రలూ సృష్టించటం, ఇన్ని సంఘటనలూ, ఇన్ని పాత్రలు అయేసరికి ఏ సంఘటనకూ, ఏ పాత్రకూ న్యాయం జరగదు 'గుమస్తా' చిత్రం 16వేల అడుగుల చిల్లరే ఉన్నప్పటికీ అందులో కత్తిరించి పారెయ్యవలసిన తుంపులు చాలా వున్నాయి ఉదాహరణకు రవి పెళ్ళి సమయంలో పాడిన పాటలూ, చేసిన నృత్యాలూ శుద్ధదండుగ రవి తండ్రి గురుమూర్తి (మహంకాళి వెంకయ్య) ''ఆముహూర్తానికే పెళ్ళి చేద్దాం'' అన్న తరవాత పండరీబాయి చేత పాడించిన శోకరసం పాట ''ఆశలే అడియాసలై'' అన్నది కేవలం అనవసరం ఆ సుముహూర్తానికి పెళ్ళి కానే అయింది రంగనాథం ఆత్మతో వాదించుకునే పాట వృథా బ్రదర్ పిప్పి కలిసి వివిధ నగరాలలో చేసిన నృత్యం, పాట అనవసరం ఇది కతను నడపటానికి గాని, ఏ సన్నివేశాన్ని గాని రక్తికట్టించటానికి తోడ్పడనే లేదు

పాటలు మామూలు సినిమా పాటలకన్న ఒక మెట్టు పైగా ఉన్నాయనే చెప్పాలి సంభాషణలు అటూ ఇటూ ఉన్నాయి కొన్ని చోట్ల పాత్రకూ, సన్నివేశానికీ అతికేటట్టున్నాయి మరి కొన్ని చోట్ల చాలా వెలితిగా ఉన్నాయి పెళ్ళి అయిన రోజు ఒక రాత్రివేళ నా మొగుడు నా గదిలోకి వచ్చాడు అని చెబితే అర్థమయేదానికి సుశీల '' ఆరాత్రి నేనూ, ఆయనా'' – అని ఎట్లా వాక్యం ముగించాలో తెలీక గిలగిల్లాడుతుంది ఈ గిలగిల సంభాషణలు రాసినవారిది

సంగీతంలోగాని నృత్యాలలోగాని చెప్పుకోదగిన విశేషం లేదు సీతపాడిన రెండు పాటలలో మొదటి దాని మట్టు బాగుంది రెండవది మూడ్‌లో లేదు సంగీతం కోసం ఈ చిత్రాన్నెవరూ రెండోసారి చూడరారని చెప్పవచ్చు ఫోటోగ్రఫీ డైరెక్షన్ ఒకరే నిర్వహించటంలో ఈ చిత్రానికి కొన్ని సౌకర్యాలు కలక్కపోలేదు కాని అక్కడక్కడా జెర్కులు వస్తున్నాయి నటీనటులు తమతమ పాత్రలను చాలావరకు బాగానే నిర్వహించారు ముఖ్యంగా నాగయ్యా, జయ్మా, పండరీబాయి రామశర్మ బాగా నటించారు కొందరు తమిళనటుల వాచకాన్ని మార్చిఉంటే బాగుండేది మొత్తం మీద 'గుమస్తా' ఒకసాదాచిత్రం అందులోఏమైనా సందేశం గాని, నీతిగాని ఉంటే అది అర్థం కావటంలేదు లేక బ్రహ్మాండమైనంత జీవితసత్యమూ, సందేశమూ ఉండే చిత్రాలను తీసే ధోరణిలో దీన్ని తయారు చేశారు ఇది అనవసరం విస్పష్టమైన సందేశం లేనప్పుడు తేలికైన హాస్య చిత్రం తీసేస్తే సరిపోయేది ఇదే అరుణావారు చేసిన పొరపాటు

*తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 20-3-1953*

# 21. కన్నతల్లి

ప్రకాశ్ వారి 'కన్నతల్లి' ఈ నెల 16న విడుదల అవుతోంది దీనిని ఏప్రిల్ 10న మద్రాసులోని పత్రికా విలేఖరులు ప్రకాశ్‌స్టూడియో ప్రొజెక్షన్ థియేటర్‌లో చూశారు, ఆనందించారు 'దీక్ష' లాగే 'కన్నతల్లి' కూడా సాహిత్య రంగంలో దిగ్గజాలవంటి ఆరుగురు – తాపీ, శ్రీశ్రీ, ఆరుద్ర, ఆత్రేయ, సుంకర, వాసిరెడ్డి – ఈ చిత్రానికి సరస్వతీ ప్రసన్నం కలిగించారు

'కన్నతల్లి' కథకు కూడా బలిష్టమైన ఆధారాలే ఉన్నాయి ఈ చిత్రం పూర్వార్థం మహబూబ్‌గారి 'ఔరత్', ఉత్తరార్థం న్యూథియేటర్స్ వారి 'సౌగంధ్' కాకాపోతే తమ్ముడి హత్య నేరాన్ని అన్న మీదవేసుకోవటానకి బదులు అమ్మనితన మీద వేసుకుంటుంది

ఈ చిత్రంలోని కథ సంగ్రహంగా ఇది

శాంత యుక్తవయసులో చలపతిని పెళ్ళాడుతుంది రాము, శంకర్ అనే పిల్లల్ని కంటుంది చలపతి సాగినన్నాళ్ళుడబ్బు ఎడాపెడా ఖర్చుచేసి, కూడదన్న వారందరిన్నీ తిట్టి, చివరకు వ్యవహారం తలకు మించిపోయిన తరువాత దండకమండలాలు సంపాదించి బైరాగి అయిపోతాడు శాంతధైర్యంగా కుటుంబ భారం మీదవేసుకుని పొలం పని తానేచూసుకుంటూ పిల్లల్నీ తానే పెంచుకుంటూ వస్తుంది రాముా కొంచెం పెద్దవాడయాక తల్లి తమ కోసం పడుతున్న పాట్లుగమనించి, తన చదువు మానుకుని వ్యవసాయం కంటే లాభ సాటిగా ఉండే వ్యాపారం తలపెట్టి తల్లిని అందులోకి దింపుతాడు తల్లి మోదుగాకుల విస్తళ్లు కుడుతుంది కొడుకు ఊళ్ళో అమ్ముకొస్తాడు

వ్యాపారం క్రమంగా పెరుగుతుంది రాము కొట్టుపెడతాడు శంకర్ చదువుకుంటాడు చదువుతో బాటు పొరుగింటి కాంతయ్య కూతురు గౌరితో ఆడుకుంటూ కూడా ఉంటాడు ఊళ్లో శంకర్ చదువు అయిపోతుంది వాడిచేత పెద్దచదువు చదివించాలని రాముా ఆలోచిస్తాడు తల్లి వద్దంటుంది డబ్బు లేదంటుంది దీనికి రాము ఒక ఉపాయం ఆలోచిస్తాడు పదివేల

హత్యను మరొక మనిషి తన మీద వేసుకుని హంతకుణ్ణి శిక్ష నుంచి కాపాడటంలోగల నీతి ఏమిటో తెలియదు ఇది సంఘ విద్రోహకరమైన విషయం (ఈ లోపం 'సౌగంద్' లో కూడా ఉంది ) శాంత తన కొడుకును రక్షించి తాను హత్యా నేరం మీద వేసుకోవడంలో కొడుకు మీది ప్రేమను వెల్లడిస్తున్నదని చిత్ర నిర్మాతల అభిప్రాయమై ఉంటుంది కాని ఆమె సంఘ నియమాన్ని తృణీకరించి సంఘద్రోహి అవుతున్నదని ఆలోచించలేదు అంతేగాక ఈ చిత్రంలో శాంత ఈ పనిచేసి కొడుకుమీద తనకుగల ప్రేమకూడా ఏమీవ్యక్తంచెయ్యటంలేదు ఎందుచేతనంటే ఈ శంకర్‌ను బాగు చెయ్యటానికి ఎవరూ ప్రయత్నించటంలేదని గౌరి ఆక్షేపించినప్పుడు వాడు ఎవరిమాటా వినడని ఈ శాంతే అన్నది వాణ్ణి పెళ్ళాడే ఆలోచన మానమని గౌరికి హితబోధ చేసింది. శంకర్ తన వదినెగారి సొత్తు తీసుకుని పారి పోయేటప్పుడు తాను కర్ర తీసుకు నిలబడి ఆపజూచినా వాడు ఆగలేదు కోడలు లక్ష్మి చెప్పినట్టు శాంత ఒక్కకేకపెట్టి నలుగురినీ పిలవనైనాలేదు తన ఉంపుడుగత్తెను చంపిన అనంతరం శంకర్ పూర్తిగా మారిపోయి సన్మార్గంలో పడతాడనుకోవటానికి శాంతకు ఆధారం ఏమీలేదు అయినావాడి హత్యానేరాన్ని తనమీద వేసుకుంది!

ఇలాంటి విపరీత నైతిక దృష్టిని నిర్మాతలు పాత్రపోషణలో కూడా ప్రదర్శించారు ఈ చిత్రంలో కల్లా కొట్టవచ్చినట్టు సందేశమిచ్చే దానిలాగ కనపడే పాత్ర శాంత ఈ పాత్రను నేపథ్య గానంలో కూడా "ఎంత మంచిదానవోయమ్మ, నీదెంత వింత విధానమోయమ్మ" అని కీర్తించారు ఆమె విధానంలో వింత ఏమిటంటే అది ఎవరికీ అర్థంకాకపోవడమే. భర్త లేచిపోయేదాకా మనం చూచే శాంత చాలానిండైనమనిషి, అచంచలమైన ఆత్మవిశ్వాసం గలది, కొంతవరకు ఆదర్శప్రాయమైనది కాని ఆ తరువాత ఈ శాంత "విధానం" చాలా అయోమయం లో పడుతున్నది మొదటి సంగతి, రామూ మోదుగాకులు తెచ్చి ఈమె ముందు పడేసి విస్తళ్లు కుట్టమన్న క్షణం నుంచీ ఏ పాత్రపైనా ఈమె ప్రభావం కనపడదు ఇంటికి రాము పెద్దఅయినాడు తమ్ముణ్ణి చూసి గర్వపడ్డాడు, వాణ్ణి బడుద్దాయిగా పెరగనిచ్చాడు, అచ్చుబోసి మద్రాసు పంపాడు వాడికోసం పెళ్ళాడి తన కట్నం సొమ్ము అంతులేకుండా పంపాడు ఇందులో శాంతది ఏమీలేదు ఆఖరుకు తన పెద్దకొడుకు కట్నం కోసం లక్ష్మిని పెళ్ళాడుతున్నప్పుడైనా ఆమె వారించలేదు తన పిల్లలు ఏమౌతున్నారో ఆమెకు తెలిసినట్టయినా మనకెక్కడా దాఖలా లేదు. తరువాత ఈ శాంత చేసిన పనులలో ఒకటికూడా సమర్థనీయంగా లేదు తమ్ముడు చెడిపోనాడని తెలుసుకుని రామూ వాడికి డబ్బుపంపడం మానేసరికి పెద్దకొడుక్కు తెలియ కుండా రెండు వందలు పంపి శంకర్‌ని ఇంటికి పిలిపించి వాడి దొంగతనానికి దోహదం చేసింది అంతవరకూ అన్ని నిర్ణయాలూ రామూకు వదిలివేసిన మనిషి ఈ నిర్ణయం తానై ఎందుకు తీసుకుందో, ఈ విషయంలో రామూ నిర్ణయాన్ని మార్చడానికైనా ప్రయత్నించకుండా దాన్ని గడ్డిపోచవతుగా ఎందుకు తీసిపారేసిందో తెలియదు శంకర్ దొంగతనం చేసి పారిపోయేటప్పుడు తానై ఒంటరిగా వాణ్ణివారించ యత్నించిది అది సఫలం కాకపోయేసరికి వొదిలేసి ఊరుకుంది శంకర్ ఆ క్షణంలోనే రైలెక్కలేడని ఆమెకు తెలిసి ఉండాలి లక్ష్మిచెప్పినట్టు ఎవర్ని కేకేసినా పోయిన సొమ్ము దక్కేది, శంకర్ మారేది ఉంటే ఇంకా కొంచెం త్వరగా మారే అవకాశం ఉండేది కాని శంకర్ దొంగతనం అచ్చుగా తన ఒక్కతెకే సంబంధించిందనీ, దీనితో మరెవరికీ

– లక్ష్మికి సయితం – సంబంధం లేదని ఆమె భావించినట్టే కనిపిస్తుంది! శాంత తనకు శంకర్ మీద ఉన్న ప్రభావాన్ని పరీక్షించేటందుకే వాడిమీద కర్ర ఎత్తిందా, అని ఏ ప్రేక్షకుడికైనా సందేహం వస్తే ఆలోచించిన కొద్దీ మొదటి అనుమానం మాత్రమే ధృవపడుతుంది దొంగతనం బయటపడ్డాక లక్ష్మి ఆమెపై చేసే ఆరోపణలకు ఆమె ఏ సమాధానం ఇవ్వదు నిజానికి లక్ష్మి స్థితిలో ఏ బుద్ధిగలదైనా అదే ఆరోపణలు చేస్తుంది శాంత తనకేదో పెద్ద అవమానం జరిగినట్టు అఘాయిత్యంగా గొడ్లపాకలో చేరి విస్తళ్లు కుట్టి అమ్మించనారంభిస్తుంది తన పెద్దకొడుకును నలుగురిలోనూ నవ్వులు పాలు చెయ్యటం శాంతయొక్క అభిప్రాయమైతే ఆమె ఇంతకన్నా మంచి ఆలోచన చేసి ఉండగలిగేది కాదేమో చివరకు కొడుకు హత్య తనమీద వేసుకుని ఖైదులోపడి కాకతాళీయంగా భర్తను కలుసుకుని ఈమె తన జీవితాన్ని సింహావలోకనం చెయ్యటం చూస్తే ఆమె ప్రకటించే ఆత్మసంతృప్తి విమర్శనా దృష్టిగల ప్రేక్షకుడికి వెగటు కలిగిస్తుంది

ఒక్క శాంత పాత్ర విషయంలోనే గాక మిగిలిన పాత్రల విషయంలో కూడా నిర్మాతలు చాలా పక్షపాత బుద్ధి ప్రకటించారు సాధారణంగా నిర్మాతలు తమ పాత్రల వట్ల కొంత పక్షపాతం వహించటం పరిపాటిగా జరుగుతుంది కాని ఈ చిత్రంలోలాగా అనేక పాత్రలపట్ల పక్షపాతం ప్రదర్శించటం మనం తరచు చూడం ముఖ్యంగా నాయుడమ్మను, లక్ష్మని చాలాహీనంగా చూశారు కారణం తెలియదు నాయుడమ్మ వడ్డీలకిచ్చి డబ్బు సంపాదించాడని ఒక ఆరోపణ ఉన్నట్టున్నది వ్యాపారంచేసి డబ్బుగడించడంలోనూ, కట్నంకోసం ఇష్టంలేని పిల్లని పెళ్ళాడటంలోనూ ఉన్న ఘనత వడ్డీల కిచ్చి డబ్బు వసూలు చెయ్యటంలో లేదని మనం భావించాలని నిర్మాతల ఉద్దేశం! లక్ష్మి విషయం మరీ ఘోరం ఎప్పుడైతే రాము ఆమెను కట్నం కోసం పెళ్ళాడాడో అప్పుడే ఆమెకు ఘోరమైన అన్యాయం జరిగింది ఆ కట్నం సొమ్ము రాము తిన్నవాడు కాలేదు, లక్ష్మి తిన్నది కాలేదు అదంతా శంకర్ కింద ఖర్చయిపోవటం ఆమె కళ్ళారా చూసింది ఆఖరుకు ఈ శంకర్ తన నగలనే అపహరించుకుపోయాడు పైగా వాడు తాగుబోతనీ, ముండలకు పెడుతున్నాడనీ విన్నది ఆమెకు కడుపుమండదా? ఆమెను ప్రేక్షకుల దృష్టిలో హీనురాలుగా చెయ్యటానికీ, శాంత పక్షాన ప్రేక్షకుల సానుభూతి సంపాదించటానికి లక్ష్మిచేత అనాగరికంగా మాట్లాడించారు కల్పనలో పాత్రకు ఇంతకంటే అన్యాయం జరగటం మనం ఊహించలేం

కథ ద్వారా ఒక సందేశాన్ని గాని ప్రయోజనం గాని సాధించటంలో ప్రకాశ్‌వారు పూర్తిగా విఫలులైనారని చెప్పవచ్చు పాత్రలను పోషించడంలోనూ, ఉపయోగించుకోవటంలోనూ కూడ పెద్దగా విజయం సాధించలేదు ఒక్క రామూ పాత్ర మట్టుకు చాలా సహజంగా కనిపిస్తుంది ఆ పాత్రలోని దౌర్బల్యం కూడా ప్రేక్షకుడి సానుభూతిని చాలా చక్కగా సంపాదిస్తుంది

ఈ లోపాలన్నీ ఉన్నప్పటికీ 'కన్నతల్లి' నిర్మాణంలో చాలా సమర్థత ఇతరత్రా కనిపిస్తుంది చిత్రమంతటా వాతావరణం బాగా సమకూర్చబడింది సంభాషణలు మొత్తం మీద చాలా తూకంగా జాతీయంగా ఉన్నాయి. కథకు అడ్డం వచ్చే పాటలేమీలేవు వరలక్ష్మికి ఒక్కపాట కూడా లేదు ఆమెచేత ఒక పద్యమూ, వసంతచేత ఒక పద్యమూ చదివించారు ఈ రెండూ తీసిపారేసినా ఇబ్బందిలేదు ఏ పాత్రకూడా మితిమీరిన ఆవేశానికి పోకుండా చిత్రాన్ని బాగానే పట్టుకొచ్చారు సాధారణంగా మన సాంఘిక చిత్రాలలో తగలబడిపోయే కాలేజి విద్యార్థుల

సన్నివేశాలు చాలా చక్కగా తీయబడ్డాయి పొట్టేళ్ళ పందెం బాగుంది సంభాషణలలో ధ్వని కూడా ఉంది మొట్టమొదటి దృశ్యంలోనే చలపతి దారిమధ్య తన బరువు శాంత మీద వేసి "నాదారి నాదీ, నీదారి నీదీ" అంటాడు అట్లాగే ఇంకా పెళ్ళికాక మునుపే శాంత తన కాబోయే భర్త ఇంట దీపం వెలిగిస్తుంది కొద్ది విషయంలో పెద్ద భావాలు ప్రతిబింబింపచేయటానికి నిర్మాతలు పాటుపడ్డారు ప్రేక్షకులీశ్రమను సానుభూతితో చూడగలుగుతారు

ప్రధాన నటులలో వరలక్ష్మి, నాగేశ్వరరావూ చాలా సమర్థతతో నటించారు తాము ప్రదర్శించే పాత్రలకు జీవం పోశారు నంబియార్ నటన కొంచెంకూడా రాణించలేదు లక్ష్మిపాత్రను సి వరలక్ష్మి, నాయుడమ్మ పాత్రను కోడూరు అచ్చయ్యచౌదరీ, చలపతిరావు పాత్రలను ఆర్ నాగేశ్వరరావు, శర్మపాత్రను పేకేటి శివరాం బాగానటించారు సుధాకర్, మోహన్ బాగానే నటించారు యక్షగానం బాగానే ఉన్నది గాని కథకు నిరుపయోగం రామూ విస్తళ్ళు అమ్మటానికి పాటయెందుకు పెట్టారో తెలియదు మిగిలిన పాటలూ, సంగీతమూ సుమారుగా ఉన్నాయి నేపథ్యసంగీతం బాగా లేదు రికార్డింగు అంత తృప్తికరంగా లేదు ఫోటోగ్రఫీ ఫరవాలేదు ఇటీవల విడుదలైన కొన్ని చిత్రాల కన్న 'కన్నతల్లి' బాగానేపోవచ్చు

*తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 17-4-1953*

# 22. ప్రపంచం

మూడేళ్ళ పాటు నిశ్శబ్దంగా తయారైనా సొసైటీ పిక్చర్స్ వారి 'ప్రంపంచం' ఈనెల 10న దక్షిణ దేశంలో నూరు థియేటర్లలో ఆర్భాటంగా విడుదల అయింది ఎం హెచ్ ఎం మునాస్ అనే సింహళ వ్యాపారస్తుడు 25 లక్షలు ఖర్చుపెట్టి,160 మంది నటులతో, తన భార్య రాసిన కథతో తన స్వంత తమిళ మాటలతో, పాటలతో, ఈ చిత్రాన్ని తయారు చేశారు తెలుగు చిత్రానికి పాటలూ, మాటలూ, తర్జుమా చేసింది శ్రీశ్రీ ( శ్రీశ్రీ 'ప్రంపంచం' లో ఎనౌన్సర్‌గా కూడా కనిపిస్తారు ) ఈ చిత్రం చూసేవారికి లక్షరూపాయల విలువగల పోటీ బహుమతులు ఒక ప్రత్యేకాకర్షణ

భారీ పెట్టుబడితో దక్షిణ భారత రంగంలోకి అడుగుపెట్టిన 'ప్రపంచం' నిర్మాతకు వ్యాపారదక్షత ఉండవచ్చుగాని ఈ చిత్రంలో కళా ప్రమాణాలు మాత్రం విడ్డూరంగా ఉన్నాయి ప్రతి సినిమా ప్రేక్షకుడూ ఈ రోజుల్లో పూర్తిగా అలవాటుపడిన చక్కని ఛాయా, శబ్ద గ్రహణాలు కూడా ఈ చిత్రంలో లోపించాయి పాటలు మాటలు అన్నీ అనుకరణలు నేపథ్య సంగీతంలో విశిష్టత లేదు కొన్ని దృశ్యాలలో సంభాషణలకు అడ్డంగాకూడా ఉంది ఈ అంశాలలో ఈనాటి చిత్రాలు ఇంతకన్న బాగుంటున్నాయి

కథ విషయానికొస్తే ఇది మామూలు సినిమా కథ కాదని ఒప్పుకోవాలి ఇందులో ఉన్నన్ని పాత్రలూ సంఘటనలూ ఏ నాలుగైదు చిత్రాలు కలిపినా ఉండవు ఇది తన చిత్రానికి లోపం కాబోతుందని చిత్ర నిర్మాత భావించలేదని స్పష్టమవుతుంది కాని ఇన్ని పాత్రలూ, సంఘటనలూ ఉండడం వల్ల కథ దెబ్బతిన్నది ఏపాత్రకూ తగిన సంపూర్ణతా, సమగ్రతా లభించలేదు ఏపాత్రతోనూ ప్రేక్షకుడికి నిజమైన పరిచయం లభించదు ఆత్మీయత అసలే ఏర్పడలేదు 'ప్రపంచం' లో ప్రేక్షకుడు మూడు తరాల జీవితం చూస్తాడుగాని ఏ తరం వ్యక్తులను

గురించీ దాదాపు ఏమీ తెలుసుకోలేడు మొదటి తరం వాడు చలపతి ఉన్నాడు అతను బీదవాడు, కార్మిక నాయకుడైనాడు, లక్షలు గడించాడు అంతే అతన్ని గురించి మనకు తెలిసిందల్లా కార్మికనాయకుడు లక్షలెట్లా గణించాడన్నది ప్రేక్షకులు తెలుసుకోగోరుతారని కథకుడికి తట్టలేదు రెండో తరానికి వస్తే పెద్దవాడు శంకర్ తన తల్లి దండ్రులు చేసిన పిల్లను చేసుకుంటాడు తమ్ముడు మోహన్ తన ఇష్టం వచ్చినదాన్ని చేసుకుంటాడు ఇద్దరిలోగల తారతమ్యం వారు ఆస్తులు పంచుకోవడంలోనూ, శంకర్ భార్యను పొగొట్టుకుని మళ్ళీ పెళ్ళాడటానికి సిద్ధపడడంలోనూ మాత్రమే కనిపిస్తుంది మోహన్ లలితను నిరాకరిస్తాడు లీలను పెళ్ళాడతాడు ఆ ఇద్దరిలో అతనికి కనపడిన తేడా ప్రేక్షకుడికి కనిపించదు ఆ తేడా చూపటం అవసరమని కథకుడికి తట్టలేదు మూడవ తరం వాడైన చందర్ తన తండ్రి రెండో పెళ్ళి గురించి అంత గలభా ఎందుకు చేస్తాడో, మొదట పెళ్ళిచేసుకు తీరతానన్న శంకర్, ప్రేమనిచ్చి చేస్తానని పట్టుపట్టిన తండ్రీ చివరకు తమ పట్టుదల ఎందుకు వదులుకుంటారో ప్రేక్షకులు ఊహించ వలసిందే ఇవన్నీ అసంగతమైన విషయాలనుకోవటంకన్న వీటికి తగిన సమర్థన చిత్రంలో కనిపించదనుకోవటం భావ్యం పాత్రలను ఏ మాత్రమూ విపులీకరించకపోవటం ఈ కథలో పెద్దలోపం ఈ పాత్రలకు వ్యక్తిత్వం లేదు అవి కథకుడి శాసనానికి కట్టుబడిన తోలుబొమ్మలు

సంఘటనలు కూడా అంతే మోహన్‌కు భార్యగా లీలను ఏర్పాటు చెయ్యటం కోసమని చలపతి భార్యకు ఒక సోదరుణ్ణి కల్పించి అతని కుటుంబాన్ని ఆఫ్రికా నుంచి తెప్పిస్తారు అతన్ని ప్రేమించే మరొక మనిషిని ఏర్పాటు చెయ్యడం కోసం లలిత పాత్రను పెట్టారు ఆమె చచ్చిపోతుంది గనక ఆమె జీవితానికి వాతావరణం లేకుండా చేశారు లలిత బారిష్టరు చదువుకోసం ఇంగ్లండు వెళ్ళటంగాని, లలిత మగవేషం వేసుకుని మోహన్ ఇంటికి రావటం గాని కథకు తప్పనిసరి సంఘటనలు ఎంత మాత్రమూ కావు '' ఈ సంఘటన కథను ఏ విధంగా నడిపించింది?'' అని ప్రశ్నించుకుంటే కథను నడిపించని సంఘటనలు కోకొల్లలుగా ఉన్నాయి

కథా పరిణామానికి కూడా చాలా చోట్ల ఆధారాలు లేవు ఉదాహరణకు లలిత చెప్పిన మాటలు విని లీల మోహన్‌ను శంకిస్తుంది మోహన్ వెళ్ళి పోతాడు అతను వెళ్ళినాక అతని నిర్దోషిత్వానికి ఏమీ రుజావు లభించకుండానే లీల లలిత దగ్గిరికి వెళ్లి తనకు నిజం తెలిసినట్టు మాట్లాడుతుంది ఒకనాడు వేరుపడిన శంకర్, మోహన్‌లు చందర్ పెద్ద వాడయ్యేసరికి మళ్లీ కలుస్తారు తన భార్యకూ అన్న కొడుక్కూ రంకు కట్టిన మోహన్ అంతలోనే తాను పొరపడ్డట్టు ఒప్పుకుంటాడు (ఈ రంకును ప్రేక్షకులు భరించకపోతే వారి తప్పుకాదు!) ఒక దృశ్యంలో ప్రేమతో కలిసి వలపించే చందర్ అప్పుడే ఇంకో దృశ్యంలో తన పినతల్లితో కులాసాగా కబుర్లు చెబుతూ ఆమె కన్నీళ్ళు తుడుస్తూ ఉంటాడు

ఈ లోపాలన్నీ ఉండటమూ, ఏ ఒక సంఘటనా పరిణతి చెందకపోవటమూ ఈ కథలో పెద్దలోపం (ఆఖరుకి శంకర్ తాను పెళ్ళాడదలచిన పిల్లను కొడుక్కు చేసుకుంటానని చెప్పినప్పుడు చందర్ తాను ఇంకొక పిల్లను ప్రేమిస్తున్నానని చెప్పేలోపుగానే ప్రేమ ప్రవేశిస్తుంది సంఘటన పరిణతి చెందక పోవటానికిదొక ఉదాహరణ)

నటీనటులు ఎంత సమర్థులైనా వారి నటన రాణింపచేసేవి పాత్ర రచనా, సంఘటనల బలమూను ఇవి ఈ చిత్రంలో లోపించటంచేత పేరుపడ్డ నటీనటులు కూడా ఈ చిత్రంలో

తేలిపోయినారు ఇతర చిత్రాలలో వీరు చేసిన నటనతో ఈ నటనను పోల్చటానికి లేదనటానికి జి వరలక్ష్మి, వంగర, కుటుంబరావు, కనకం మొదలైన వారి పాత్ర పోషణే తార్కాణం

చిత్రంలో వినోదం కోసం ఏర్పాటు చేసిన ప్రదర్శనలలో కుమారి కమల నృత్యం, మల్ల యుద్ధం, చిరతపులితో పోట్లాట కొంతవరకు బాగున్నాయి మంచి కామెరామన్ ఉన్నట్లయితే ఈ దృశ్యాలు కూడా ఇంకా రక్తిగా ఉండి ఉండును 'ప్రపంచం' నుంచి ప్రేక్షకులు నేర్చుకునే దానికన్నా ప్రేక్షకులను గురించి నిర్మాతలు నేర్చుకునేది చాలా జాస్తి ఉంటుంది

తెలుగు స్వతంత్ర, వారపత్రిక 17-7-1953

# 23. చండీరాణి

దక్షిణ దేశంలో తయారైన హిందీ చిత్రాలే చాలా కొద్ది అందులోనూ తెలుగువారు తీసినవి లేవనే చెప్పాలి 'చండీరాణి' తెలుగు నిర్మాతలు స్వయంగా నిర్మించిన తొలి హిందీ చిత్రం ఈ చిత్రాన్ని జూలై 9న ప్లాజా థియేటర్లో కొందరు ప్రముఖులకు చూపారు ఒక్క ముక్కలో ఈ చిత్రాన్ని గురించి చెప్పాలంటే సాధారణంగా విజయవంతంగా నడిచే హిందీ చిత్రాలలో ఉండే మంచి లక్షణాలన్నీ ఈ 'చండీరాణి' లో ఉన్నాయి ఇందులో చక్కని పాటలున్నాయి మంచి నటన ఉంది ఫోటోగ్రఫీ ఉంది సున్నితమైన హాస్యం ఉంది వేగంగా నడిచే కథ ఉంది ద్విపాత్రాభినయముంది ''లవ్ ట్రయాంగిల్'' కూడా ఉంది ఇది ఇలా ఉండగా ఒక ప్రసిద్ధతార అందులోనూ హిందీ ప్రేక్షకులకు ఇది వరకే పరిచితురాలైన తార – దీనికి స్క్రిప్టు రాసి, డైరెక్టరుగా కూడా పని చేసిందన్నది – ఈ చిత్రానికొక ప్రత్యేకత కాకపోదు

వీర సింహుడనే రాజా (అమరనాథ్) తన ఇరవై అయిదవ పుట్టిన రోజున తన మంత్రినీ, సేనానినీ వెంట బెట్టుకుని మారువేషాలతో, వేడుక చేసుకుంటున్న ప్రజలను చూడబోతాడు వారుఒక చోట నృత్యం చేసే పిల్లను చూస్తారు రాజూ, సేనాని ప్రచండుడు (రంగారావు) ఒకే సారి ఆమెను మోహిస్తారు ఆమెనే పెళ్ళాడతానంటాడు రాజా కూడదంటాడు ప్రచండుడు పేరోలగంలో వాగ్వాదం జరిగి సభికులు రాజాను బలపరుస్తారు రాజా ఆకన్యను వివాహ మాడతాడు కాలక్రమాన ఆమె కవల పిల్లలను కంటుంది బాలింతరాలికి విషం పెట్టి చంపిస్తాడు సేనాని భార్య పోయిన దుఃఖంతో మతిపోయిన రాజాను చెరలో ఉంచుతాడు పిల్లలను కూడా చంపేస్తాడని తెలిసి ఒక పిల్లను దాసి (హేమలత) చేతికిచ్చి రహస్య మార్గాన పంపేసి, రెండవ పిల్లతో తాను కోట దాటిపోతూ సేనానికి దొరికి పోతాడు. సేనాని మంత్రిని చంపేసి పిల్లను చేజిక్కించుకుంటాడు మంత్రి కొడుకైన కిశోర్ (రామారావు) ను రామసింగ్ అనే సేవకుడు (దొరస్వామి) పెంచుతాడు ప్రచండుడు రాజాగా వ్యవహరిస్తూ ఉంటాడు

కొండలమీద చండి, రాజసౌధంలో చంపా (భానుమతి ధరించే ఉభయపాత్రలు) పెరిగి పెద్దవారవుతారు చండి అత్యంత సాహసిగా, చంప పంజరపు చిలుకగా తయారవుతారు

ప్రచండుడి కొడుకు ముకుంద్ (ఆగా, తెలుగు, తమిళ చిత్రాలలో రేలంగి) చంపను ప్రేమిస్తాడు కాని ఆమె చిరునవ్వు కూడా సంపాదించలేకపోతాడు

ఈస్థితిలో కిశోర్‌కు రామసింగ్ అతని తండ్రి దుర్మరణం గురించీ, సేనాని దుండగాలను

గురించి చెబుతాడు అతను ప్రతీకార ప్రయత్నంలో మూఢుడైన ముకుంద్‌ను అవలీలగా వంచించి రాజసౌధంలో ప్రవేశించి చంపను చూస్తాడు వెంటనే ఇద్దరి మధ్యా ప్రణయం పుడుతుంది

కిశోర్ చంప సోదరి చండిని అన్వేషిస్తూ బయలు దేరి ఆమెను కలుసుకుంటాడు చండి తన కథ తెలుసుకుంటుంది తన సోదరికి సాయపడటానికి సంసిద్ధురాలవుతుంది అన్ని ఏర్పాట్లూచేసి ఆమెను పిలిపించటానికి కిశోర్ బయలు దేరిపోతాడు

కాని ఈలోగా ఒక కోయదొర చండిమీద పగతో ఆమె ఇల్లు తగలబెట్టేస్తాడు ఆమెని పెంచిన దాసి చనిపోతుంది ఒంటరిగత్తె అయిన చండి రాచనగరు చేరుతుంది పహరావాళ్ళ కంట దుమ్ముకొట్టి చంపా ఉన్నచోటికి చేరుతుంది మొదటిసారిగా యిద్దరు అక్కచెల్లెళ్ళూ కలుసుకుంటారు చంప క్షేమం కోసం చండి ఆమెతో దుస్తులు మార్చుకుని ఆమెను కిశోర్ దగ్గిరికి పంపేస్తుంది చండిచంపగా మారిపోయిన ఫలితం ముందుగా ముకుంద్ జీవితాన్ని తారుమారు చేస్తుంది చంప మొదటిసారి తనని చూసినవ్వే సరికి ఉబ్బి తబ్బిబ్బయిపోతాడు ముకుంద్ దానికి ప్రతిఫలంగా అతడు ఆమెను ఖైదులో ఉన్నరాజా దగ్గిరికి తీసుకుపోవడానికి సమ్మతిస్తాడు అయితే లంఖిణిలాటి దాసి ఒకతె అడ్డున్నది ఆ దాసిని భయపెట్టడం కోసం ముకుంద్ తన భృత్యుడ్ని పులివేషం వేసుకుని వెంట రమ్మంటాడు అయితే దురదృష్టశాత్తూ ముకుంద్ వెనుకగా ప్రచండుడి పెంపుడి పులే స్వయంగా బయలుదేరుతుంది ఈ పులిని చూసి తన భృత్యుడేనని ముకుంద్ అనుకోవడం కొంతదూరం హాస్యంగానే నడిచి ఆకస్మికంగా తీవ్ర పరిస్థితికి దారితీస్తుంది పులి ముకుంద్ మీద పంజా ఎత్తుతుంది ఆపదలో తొణకని ముకుందుడు బల్లకింద దూరుతాడు చండి ఆత్మరక్షణార్థం తన బాకుతో పులిని చంపి ఆ గౌరవం ముకుందనే తీసుకోమంటుంది ముకుంద్ యధాశక్తి ప్రయాత్నిస్తాడు గాని అతని యత్నం సాగదు తన కొడుకు పులిని చంపి వుండనీ, చంపేచంపి వుండాలనీ, చంపవంటి భీరువు పులిని ఎట్లా చంపగలిగిందనీ ప్రచండుడుకి సందేహం కలగసాగింది నిలువ దీసి అడిగేసరికి ముకుంద్ నిజంగా చెప్పేస్తాడు చంప తనకు తెలియకుండా తన కొడుకు సహాయంతో రాజాను చూడయత్నించిందని తెలుసుకుని ప్రచండుడు ఆమెకు రాజాను కలుసుకునే వీలు కలిగిస్తాడు చండి తండ్రిని కలుసుకుని మాట్లాడుతుంది కాని ప్రచండుడు ఈ సంభాషణకు భంగం కలిగించి తన కొడుకుతో ఆమెకు వెంటనే వివాహం నిశ్చయిస్తాడు

చండి ఈ లోపుగా కిశోర్‌ను కలుసుకుని ఆలోచన చెయ్యటానికి బయలుదేరుతుంది ఆరాత్రి నిండు వెన్నెలలో చంపా కిశోర్‌లు ప్రేమగీతాలు పాడుతూ ఉండటం చూసి తనకు కిశోర్ మీదగల ప్రేమ వృధా అని తెలుసుకుని నిరాశతో తిరిగిపోతుంది

కిశోర్ ప్రచండుడి పతనం కొరకు యత్నాలు సాగిస్తాడు ఈ సంగతి తెలిసి కిశోర్‌ను ప్రచండుడు ఖైదును చేస్తాడు కిశోర్ చేత ప్రేరేపితులైన ప్రజలకూ, ప్రచండుడి భటులకూ యుద్ధం జరుగుతుంది చండి ప్రచండుడితో కత్తి యుద్ధం చేసి అతన్ని చంపి తానూ చచ్చిపోతుంది కిశోర్ చంపను వివాహమాడి సుఖంగా ఉంటాడు

నటులలో భానుమతి స్వేచ్ఛా విహంగంగానూ, పంజరపుపిట్టగానూ చాలా నైపుణ్యంతో నటించింది ప్రచండుడుగా రంగారావు తననటనా సామర్థ్యం బాగానే ప్రదర్శించాడు కిశోర్‌గా రామారావు నటన చాలా సంతృప్తికరంగా ఉంది ప్రచండుడి ఉంపుడుకత్తె పాత్ర

కథకు అనవసరమైనా అడ్డంగా మట్టుకులేదు ఈ పాత్రను విద్యావతి బాగానే నిర్వహించింది ముకుంద్‌గా ఆగా మంచి హాస్యం ఒప్పించాడు దొరస్వామి, హేమలత, అమరనాథ్, ఆర్ నాగేశ్వరరావు (ప్రచండుడి అనుచరుడు) తదితరులు బాగా నటించారు పిల్లలతో నృత్యం బాగుంది దాదాపు పాటలన్నీ భానుమతే పాడింది పాటల మట్లూ, రచనా, సంభాషణలు తృప్తికరంగా ఉన్నాయి డ్యూయెట్ పాటలో రామారావుకి తలత్ మహమ్మద్ పాడిన పాట చాలా శ్రావ్యంగా ఉంది

ఈ చిత్రానికి వంక పెట్టదలిస్తే కథలో కొత్తదనం తక్కువ అనవచ్చు బలవంతుడైన రాజోద్యోగి రాజును చెరబట్టటమూ, కవల పిల్లలు చెరొక దారీ అయిపోయి భిన్న వాతావరణంలో పెరగడమూ, ఇద్దరూ ఒకరినే ప్రేమించి, అందులో ఒకరు చచ్చిపోయి రెండో వారికి దారి ఇవ్వటమూ ఇదంతా పాత చింతకాయ పచ్చడే చిత్రం ఆఖరులో మార్తాండుడు ఖైదులో కత్తులబోను ప్రదర్శించి మరలు తిప్పడంలో కూడా నూతనత్వం ఏమీలేదు

ఉన్న కథలో కూడా అసందర్భాలు కొన్ని ఉన్నాయి చూలాలైన రాణినీ, ఆమెకు మందు పెట్టిన వైద్యుణ్నీ, కోట దాటిపారిపోయే మంత్రినీ సునాయాసంగా ఖూనీ చేసిన ప్రచండుడు రాజును ముందుగానే ఖూనీ చేసి అతను పెళ్ళాడగోరిన కన్యను తానే పెళ్ళాడి ఉండవచ్చు అతనికి కావలసినది రాజ్యమైతే, తనకు కవలల్లో చంప దొరికినాక రాజును ఖైదులో బతికి ఉండనివ్వటంలో అర్థం లేదు చంప నవ్వేందని ముకుంద్ చెప్పాడు ఇన్నేళ్ళుగా తండ్రిని చూడగోరని చంప ఆకస్మికంగా ముకుంద్‌ను తన వలలో వేసుకుని ఇందుకు ప్రయత్నించింది ఈయత్నంలో ఆమె పులిని చంపేటంత ధైర్యసాహసాలు ప్రకటించింది చంపకు కవల సోదరి ఉండేదని ప్రచండుడికి తెలుసు ఈ పరిస్థితిలో అతనికి చంప చంప కాదేమోనని సందేహం పుట్టి అది రూఢి చేసుకునేందుకు యత్నించటానికి బదులు ప్రచండుడు తన కొడుక్కు చంపనిచ్చి పెళ్ళిచేయ నిశ్చయిస్తాడు! చంప సోదరి బతికే ఉందని అతనికి తెలిసే సమయానికి ఆజ్ఞానం అతని కెందుకూ పనికిరాకపోతుంది

ఇటువంటి లోపాలు లేకపోతే 'చండీరాణి' చాలా ఉత్తమ తరగతికి చెందిన హిందీ చిత్రంగా గణనకు వచ్చి ఉండును ఇప్పటికైనా ఈ చిత్రం తగినంతగా హిందీ చిత్ర ప్రేక్షకుల ఆదరాన్ని చూర గొంటుదనీ, భానుమతి డైరెక్షన్‌తో భరణీ సంస్థ ఇంకా మంచి హిందీ చిత్రాలను తీయగలుగుతుందనీ ఆశించవచ్చు మూడు భాషలలో ఒకేసారి తయారై ఒకేసారి వెలువడుతున్న 'చండీరాణి' భరణీ స్టూడియోకు శుభప్రదమైన నాంది ఈ చిత్రం భరణీ సంస్థకు నిస్సందేహంగా గొప్ప ముందడుగు హిందీ చిత్రాలు తీయటం తప్ప గత్యంతరం లేనట్టు కనిపిస్తున్న ఈ రోజులలో మన పెద్ద చిత్ర నిర్మాతలకు భరణీ వారి 'చండీ రాణి', మంచి వొరవడి కాగలదనటానికి సందేహం లేదు

*తెలుగు స్వతంత్ర, వార పత్రిక, 28-8-1953*

# 24. అవ్వయార్

క్రీస్తుకు పూర్వం తమిళసాహిత్యానికి ప్రసిద్ధమైన యుగం 'సంగం' యుగం ఈ యుగంలో కవిత్వం చెప్పిన ప్రసిద్ధులలో అవ్వయార్, తిరువళ్లువర్ మొదలైన వారిని తమిళులు ఈనాటికీ ఆరాధిస్తూ వారి సూక్తులను నిత్యజీవితంలో వాడుకచేస్తున్నారు అటువంటి అవ్వయార్ కథను జెమినీ వారు చిత్రంగా తీయటం తమిళుల సాంస్కృతిక జీవితంలోనూ, తమిళసినిమా చరిత్రలోనూ ఒక ప్రముఖ ఘట్టమనటానికి సందేహం లేదు ఈ చిత్రం చూసి తమిళులు ఎంత ఆనందించారు, జెమినీ వారి కృషి తమిళంలో ఎంతవరకు సఫలమయింది అన్న సమస్యలు మనని అట్టే బాధించేవికావు

ఈ చిత్రాన్ని తెలుగులో తీయకుండానే దానికి తెలుగు కామెంటరీ, కొన్నిసంభాషణలూ డబ్ చేసి ఈ వారమే ఆంధ్ర దేశంలో విడుదలచేశారు సెప్టెంబరు 10 నాటి సాయం కాలం ఈ డబ్‌చేసిన అవ్వయార్ చిత్రం తెలుగు పత్రికల వారికి ప్రివ్యూ థియేటర్‌లో చూపబడింది ఈ సంచిక వెలువడే సమయానికి అనేక వేల మంది దీనిని చూసి ఉంటారు కూడా

ఈ చిత్రాన్ని తెలుగు ప్రజల అందుబాటులోకి తెచ్చినందుకు జెమినీ వారిని అభినందించాలి భారతీయుల రాజకీయ ఐక్యతను మన నాయకులు బహుకొద్ది కాలంలోనే సాధించగలిగారు కాని సాంస్కృతిక ఐక్యత అంత సులభంగా సాధ్యమయ్యేది కాదు ఇవాళదాక ఒకే రాష్ట్రపరిపాలన కింద ఉన్న తెలుగు, తమిళ, కన్నడ, మళయాళుల సంస్కృతులు ఒకరివి ఒకరికి తెలియవు మన వేమన పోతనాదులను గురించి తమిళులకు తెలియదు వారి అవ్వయార్, తివళ్లువర్‌లను గురించి మనం ఎరగం సాంస్కృతిక సాన్నిహిత్యం వివిధ ప్రాంతీయుల మధ్య పెంపొందించకుండా జాతీయైక్యత సాధ్యమవుతుందనేది వివాదాస్పదమైన విషయం సాంస్కృతిక సాన్నిహిత్యం కొరకు సినిమాలు చేసిన కృషిమరే విధంగానూ జరగలేదు జరగటానికి వీలులేదు కూడా 'విద్యాపతి' 'మహాత్మ', 'తులసీ దాస్', 'తుకారం', 'పోతన', 'వేమన', 'అవ్వయార్' మొదలైన అనేక చిత్రాలు ఆపనిని విజయవంతంగా సాగిస్తున్నాయి మాట వరసకు చదువుకున్న తెలుగువారిలోనే అవ్వయార్ పేరు విని ఉండని వారెందరో ఉన్నారు అటువంటి స్థితిలో జెమినీ వారి 'అవ్వయార్' చదువురాని తెలుగువారికి కూడా అవ్వయార్ గురించి తెలుపుతుంది ఆమె తననాటి సమాజానికి చేసిన హితబోధలను వివరిస్తుంది ఈ ఒక్క కారణం చేతనే ఇది ప్రతి తెలుగు వాడూ చూసి తీరవలసిన చిత్రం ఇలాటి చిత్రాలన్నీ తప్పక మనం చూడాలి ఇవి మన సోదర ప్రాంతీయులను గురించి మనకు అధికమైన విజ్ఞానాన్ని కలిగిస్తాయి ఎంత తారాబలం, ఎన్ని కర్ణపేయమైన పాటలు, ఎంత ఆకర్షణ ఉన్నప్పటికీ, కాకమ్మ పిచికమ్మ కథలు గల చిత్రాలు నూరయినా ఇటువంటి చిత్రాలతో పోలవు చిత్రం ప్రివ్యూ రోజున మాట్లాడుతూ నిర్మాతవాసన్‌గారు 'ఈ చిత్రం నాకళ్లు తెరిచింది ఇటువంటి చిత్రాన్ని ప్రజలు బాగా ఆదరిస్తారని నేను తెలుసుకున్నాను' అన్నారంటే అందులో ఆశ్చర్యం ఏమీ లేదు ప్రజలకు వినోదం కావలసిన మాట నిజమే కావచ్చు కాని కాపట్యం లేకుండా, వ్యాపార వంచన లేకుండా ఉదాత్తమైన నీతితో కూడిన విషయాలు సినిమాల ద్వారా లభ్యమైతే జనసామాన్యం పెడముఖం

పెడతారనుకోవటం చాలా పొరపాటు

ఇదే 'అవ్వయార్' లో ఉన్న రెండవ గొప్ప విశేషం ఈ చిత్రం నిర్మించిన వారు దీని నిర్మాణంలో వ్యాపార దృష్టికి ఎక్కడా తావివ్వలేదు ఇతి వృత్తంలో గల సందేశాన్ని అర్థం చే సుకుని దానిని అమలు జరిపేవారిలాగే చిత్రాన్ని తయారుచేశారు అవ్వయార్ జనసామాన్యాన్ని నీరసంగా, నిర్లక్ష్యంగా చూసిన మనిషి కాదు ఆమె వంచనా దుర్మార్గాలను సహించిన మనిషి కూడా కాదు అందలమెక్కిస్తే పొంగి బోర్లపడడంగాని, పేదల కుటీరాలకన్న రాజాంతః పురాలు ఆనందదాయకాలు అని భావించటం గాని ఆమె చేయలేదు మహారాజు ఆతిథ్యాన్ని తృణీకరించింది గయ్యాళి భార్యకు వెరిచేవాడి ఇంటికి అభ్యాగతిగా వెళ్ళింది ఈ విశాల దృక్పథం చిత్ర నిర్మాణంలో కూడా ప్రతిబింబించడం చాలా మెచ్చుకోదగిన విషయం ఈ చిత్రంలో పెద్ద తారలెవరూ లేరు ఇందులో ప్రధాన పాత్ర ధరించిన కె బి సుందరాంబాళ్ కిందటితరం వారెరిగిన స్టేజినటి సినిమా ప్రపంచంలో ఆమెకు దాదాపు పేరే లేదని చెప్పవచ్చు పెద్ద నటుల పేర్లతో ప్రేక్షకులనాకర్షించే ప్రయత్నం ఈ చిత్రంలో జరగలేదనే చెప్పాలి ఇందులో సుందరాంబాళ్ పాడిన సంగీతం కూడా మామూలుగా సినిమాలలో ఆకర్షవంతంగా భావించబడేలాటి సంగీతంకాదు ''రక్తి'' కొరకు నిర్మాతలు సాధరణంగా చిత్రాలలో ప్రవేశపెట్టే ప్రణయాలు, విరహాలూ, సెక్సప్పీలూ, ఈ చిత్రంలో మచ్చుకైనా లేవు

అవ్వయార్‌ను గురించి చెప్పుకోదగిన కథ ఏమీ ఉన్నట్టు కనబడదు ఉన్నగాథకు ఆనాటి వాతావరణాన్ని జతచేసినట్టున్నది అవ్వయార్‌ను ఎవరో కని పారేసిపోవడమూ, ఆమె ఎవరికో దొరికితే వారు పెంచిపెద్ద చేయడమూ, ఆమెకు వివాహం చేసుకోవడం ఇష్టం లేక వినాయకుడి అనుగ్రహంచేత పెళ్ళి ఈడులోనే వృద్ధురాలైపోయి దేశాటనచేస్తూ తన వాక్శక్తితో ప్రజలకు హితబోధచెయ్యడమూ, చిట్టచివరకు ఆమె బొందితో కైలాసం చేరడమూ, 'అవ్వయార్' చిత్రానికి ఇతి వృత్తం ఈ ఇతివృత్తాన్ని వాస్తవికంగా చిత్రించే అవకాశం లేదు ఇన్ని సహస్రాబ్దాలుగా ప్రజలు ఈ ఇతి వృత్తాన్ని ఏ రూపంలో సజీవంగా ఉంచారో అదే రూపాన్ని జెమినీ వారు చిత్రంగా తయారుచేయ యత్నించారు వారి యత్నం ఫలించిందనడానికి సందేహం లేదు ప్రభాత్ వారి 'తుకారాం' చూసి తుకారాంను మరచి పోవడం, ఎంత కష్టమో, ఈ చిత్రం చూసి అవ్వయార్‌నూ, ఆమె ఉద్దేశాలనూ మరచిపోవడం అంత కష్టం

సినిమా విమర్శలలో వినియోగించే పరిభాషలో 'అవ్వయార్' లో కథ లేదు ఇందులో అనేక సంఘటనలు గుదిగుచ్చబడ్డాయి కథ కోసం తీసిన చిత్రమైతే ఇది పెద్ద లోపమే కాని 'అవ్వయార్' లో కథ ఉన్నట్టయితే ఈ చిత్రం బాగా తన ఆశయాని సఫలం చేసుకునేదనుకోవడానికి ఆధారం లేదు చిత్రంలోని మనవాతీత సంఘటనలుకూడా అవ్వయార్ సందేశాలలోని యాథార్థ్యానికి ఏమాత్రమూ అడ్డురావు ''కొండలన్నీ పిండి కొట్టవచ్చు, కఠిన చిత్తు మనసు కరిగింపగారాదు'' అన్న సత్యాన్ని గ్రహించేటప్పుడు అందులో మొదటి మాట అబద్ధమన్నది ఎవరూ పాటించరు అవ్వయార్ చేసిన ''అద్భుతాలలో'' అలాటి అబద్ధమే ఉంది

జెమినీ సంస్థ చాలా చిత్రాలను తయారు చేసింది వాటిలో కొన్ని విశేష ధనాన్నీ, ఖ్యాతినీ సంపాదించాయి 'చంద్రలేఖ' చరిత్ర ప్రసిద్ధం కూడా అయింది కాని వాటన్నిటికన్నా నిజంగా ఈ నిర్మాతలు గర్వించదగిన చిత్రం ఒక విధంగా 'అవ్వయార్' అనే చెప్పాలి ఏ ఇతర జెమినీ

చిత్రం కంటే కూడా ఈచిత్రం ప్రేక్షకులలో సద్భావాలను పెంపొందిస్తుంది ఈనాటి సాంఘికవ్యాధులకు మంచి విరుగుడుగా పనిచేస్తుంది సంకుచిత భావాలుగల తల్లిదండ్రులు తమ బిడ్డలలో ఉన్నత పదవిలో ఉన్నవారి పట్ల ఎక్కువ అనురాగం చూపినట్టుగా మన చిత్ర నిర్మాతలు తమ కెక్కువ డబ్బు చేసిపెట్టిన చిత్రాన్ని చూసి సాధారణంగా గర్విస్తారు ఈ వైఖరి మారిన మరు క్షణం 'అవ్వయార్' వంటి చిత్రాలు ఇంకా ఎక్కువ అవుతాయి ఏమీ అనుమానం లేదు

ఈ చిత్రంలో ఫోటోగ్రఫీ బాగా ఉంది కొన్ని పాటలు బాగున్నాయి శబ్దం ఒక మాదిరిగా ఉంది కొన్ని ఘట్టాలు చాలా చక్కగా తీయబడ్డాయి ముఖ్యంగా అవ్వయార్ దయ్యాన్ని కలుసుకునే దృశ్యమూ, భూమిపగిలి అగాధం ఏర్పడే దృశ్యమూ, అవ్వయార్ కైలాసారోహణమూ చాలా చక్కగా చిత్రించబడ్డాయి ఏనుగుల దండు కోటను ఛేదించి ఖైదీని విడిపించే సన్నివేశం అంత సంతృప్తికరంగా లేదు

డబ్బింగ్‌లో కన్నాంబ, మాధవపెద్ది సత్యం ఇచ్చిన కామెంటరీ, సంభాషణలు చాలాచక్కగా ఉపయుక్తంగా ఉన్నాయి అవ్వయార్ పాటలకు ఇవ్వబడిన తర్జుమా చాలా సంగ్రహంగానూ, ఆకర్షవంతంగానూ ఉంది ఐతే చదవగలిగిన వారికే ఇది ఉపయోగపడుతుంది ఒక భాషలో తీసిన చిత్రాన్ని మరొక భాషా ప్రాంతంలో విడుదల చేయడానికి గాను డబ్బింగ్‌చేయడంలో అతి సులువైన విధానాన్ని జెమినీ వారు అనుసరించారు ఈ విధానాన్ని అనుసరించి ఇతరులు ఇంకా అనేక చిత్రాలు ఇతరభాషలలోకి డబ్‌చేయవచ్చు

ఈ చిత్రం ఆంధ్రుల ఆదరాన్ని విశేషంగా సంపాదిస్తుందని ఆశిస్తాం

*తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 18-9-1953*

# 25. పెంపుడు కొడుకు

ఇటీవల తయారైన మంచి తెలుగు చిత్రాలలో ప్రసాద్ ఆర్ట్స్‌వారి 'పెంపుడు కొడుకు' ఒకటి సినిమా కథకు పనికివచ్చే బలమైన సన్నివేశాలు ఇందులో చాలా ఉన్నాయి రంగస్వామి అనే కటికదరిద్రుడు, తన భార్య మంగమ్మ ఆస్పత్రిలో చావూ బ్రతుకూకాని స్థితిలో ఉండగా, ఎవరో సంవన్నురాలు కోరగా తన చంటి కొడుకును ఆమెకు పెంచుకోనివ్వటమూ, మంగమ్మ ఆస్పత్రినుంచి ప్రాణాలతో బయటపడి పసిబిడ్డకోసం తల్లడిల్లుతూంటే ఆ బిడ్డను వెతుక్కురావటానికి పదిరూపాయలు పుట్టక రంగస్వామి రాత్రిపూట కూలికిపోయి, కట్టే ఇంటి దూలంకూలి మీదపడి చావటమూ, మంగమ్మ తన పెద్దకొడుకు ముత్తడితో వేలూరు వెళ్ళి అక్కడ ఎవరిపంచనో నౌకరీ చేసుకుంటుంటే ఆమెపై హత్యాభియోగం వచ్చిపడి ఆమె ఖైదుకు వెళ్ళటమూ, ఆమె తిరిగి వచ్చేసరికి ఆమె పెద్దకొడుకు ముత్తడు ఏదో నాలుగుడబ్బులు సంపాదించుకుంటున్నప్పటికీ, ధనికుల ఇంట పెరిగే మోహన్‌కూ ముత్తడికీ బద్ధవైరం ఏర్పడి ఉండటమూ, మోహన్ పరమ దుర్మార్గుడుగా తయారయినందుకు మంగమ్మ తల్లిహృదయం గగ్గోలుపడటమూ మొదలైన ఘట్టాలిందులో ఉన్నాయి

'పెంపుడు కొడుకు' కథ ఒకచోట పీరం వేసుకు కూచోక సాగిపోతుంది దాని గమనంతో పాటు ఒక్కొక్క పాత్రే కథలో ప్రాముఖ్యం వహిస్తూ ముందుకు వస్తుంది ఈ కారణంచేత

కథనం సులువుగా రక్తి కట్టుతుంది ప్రొఫెసరుగారి భార్య చంటిబిడ్డను తీసుకుపోయేదాక రంగస్వామీ, పక్కింటి అంబుజం కథను నడుపుతారు ఆ తరువాత వేలూరులో మంగమ్మ పనిచేసే ఉద్యోగస్తుడి ఇల్లూ ఆ యింటి భార్యాభర్తల మధ్య కీచులాటా, భార్య పుట్టింటికి వెళ్ళిపోయి ఆమెస్థానే ఉద్యోగస్తుడి ఉంపుడు గత్తెరావటమూ, ఆమె విషపుకాఫీతాగి మరణించట మూ ప్రాముఖ్యం వహిస్తాయి తరవాత కథ ప్రొఫెసరుగారింటికి పోయి మోహన్ చెడిపోయే విధానం చూపిస్తుంది తుది ఘట్టంలో పెరిగిన మంగమ్మ పిల్లలూ, వారిమధ్య కలహమూ, పొరుగింటి పనిమనిషి గౌరీ కథకు ప్రముఖ్యం వహిస్తారు ఆస్పత్రిలో ఆరంభమైన కథ తిరిగి ఆస్పత్రిలోనే అంతమవుతుంది

సదాశివబ్రహ్మంగారి మాటలూ, శ్రీ శ్రీ ప్రభృతుల పాటలూ, శేఖర్ గారి ఆర్ట్ డైరెక్షనూ, ప్రసాద్‌గారి దర్శకత్వమూ చిత్రానికి చాలా రసపుష్టినిచ్చాయి మిగతాది నటులు పూర్తిచేశారు రంగస్వామి పాత్రను డైరెక్టర్ ప్రసాద్, మంగమ్మ పాత్రను పుష్పవల్లీ మోహన్ పాత్రను శివాజీ గణేశన్ చాలా సమర్థతతో నిర్వహించారు ప్రొఫెసరుగా ఎస్ వి రంగారావూ, ఆయనభార్యగా నటించిన కుమారీ, చిన్నముత్తడుగా నటించిన మోహన్, పెద్దముత్తడుగా నటించిన శ్రీరామమూర్తీ , చిన్న మోహన్‌గా నటించిన సుధాకర్ మొదలైనవారుకూడా తమ పాత్రలను బాగానే పోషించారు మొత్తంమీద చిత్రమంతటా అందరి నటనా తృప్తికరంగానే ఉంది గణేశన్ తెలుగు ఉచ్చారణ మాత్రం తృప్తికరంగా లేదు పాటలలో వీధినృత్యం తప్పిస్తే ఏ పాట యొక్క పిక్చరైజేషనూ ఉండదగినంత బాగాలేదు ఈ లోపాల్ని కొంతవరకు సంగీతం తీర్చింది

కథలో ఒకటిరెండు పెద్దలోపాలు కన్పిస్తాయి మంగమ్మపై కల్పించబడిన హత్యా నేరానికిగల ఆధారాలు కాకతాళీయంగా ఏర్పడ్డవి అట్లాగే కథచివరలో గౌరి పనిచేసే ఇంట్లో దొంగతనం జరగటంకూడా కథకు సంబంధంలేకుండానే జరిగింది మంగమ్మ ప్రొఫెసరు ఇంటికి వచ్చి పనిమనిషిగా కుదరటంకూడా కేవలం దైవికమే ఈ సంఘటలన్నిటికీ కథలో ప్రాముఖ్యంవున్నది గనక వీటికి కథతో సన్నిహితమైన సంబంధంవుంటే చాలా బాగుండేది

ఏమైనా ప్రసాద్ ఆర్ట్ వారి 'పెంపుడు కొడుకు ' చాలావిధాల జయప్రదంగా తయారుచేసిన చిత్రం అవును ఇది తెలుగుసినిమా ప్రేక్షకుల ఆదరాన్ని సులువుగా సంపాదిస్తుందని నమ్ముతున్నాం

*కినిమా, మాసపత్రిక, డిసెంబరు 1953*

# 26. చంద్రహారం

'చంద్రహారం' చిత్రంలో ఏ ఘట్టాన్ని ఒక నిమిషం పాటు చూసినా చాలు అది బ్రహ్మాండమైన చిత్ర మనేది తెలిసిపోతుంది ఈ చిత్రం షూటింగు చూసినవారూ, 'రష్' లు చూసినవారూ ఏకగ్రీవంగా ఈ మాటే అన్నారు ఇలా అన్నవారిలో ఇతర చిత్రనిర్మాతలు కూడా ఉన్నారు ఇందులోని ప్రతి సెట్టింగూ, పాత్రలు ధరించే దుస్తులూ అత్యంత ఆకర్షణీయంగా కనిపిస్తుంది చాలా సంవత్సరాలు శ్రమపడి, చాలా ధనం వెచ్చించి విజయవారీ చిత్రం తీశారు ఈ విధంగా తీసిన చిత్రాలు పూర్వం కొన్ని మనం చూశాం కాని ఈచిత్రం

చూసేవారికి చిత్ర నిర్మాణం గురించి తెలిసినపక్షంలో, దీనికొరకు వ్యయం చేసిన ప్రతిలక్షా, చిత్రంలో కనిపిస్తుంది తెర మీద పది సెకండ్లపాటూ, ఇర్వై సెకండ్లపాటూ మనం చూసే అనేక సెట్టింగులు నిర్మించటానికీ, అలంకరించటానికీ రెండేసి, మూడేసి వారాలు పట్టింది లైటింగు అమర్చటానికే ఒకటి రెండు కాల్‌షీట్‌లు అవసరమైన సెట్టింగులు కూడా ఈ చిత్రంలో ఉన్నాయి ఈ ఒక్క అంశంలోనే 'చంద్రహారం' ప్రేక్షకులకు మూడు నాలుగు చిత్రాలు కలిసినా ఇవ్వలేని సంతృప్తి ఇవ్వగలదు

నిర్మాణంలో భారీ చిత్రం కావటమే గాక 'చంద్రహారం' పనితనంలోకూడా భారీ పరిశ్రమతో కూడుకున్నది చందన కోటలో దృశ్యాలూ, చందనరాజా దేశయాత్రచేస్తూ గౌరి ఉండే గ్రామానికి వచ్చే దృశ్యాలూ జనసమూహాలతో కూడుకున్నవి ఇటువంటి దృశ్యాలను నిర్దుష్టంగా తీయాలంటే చాలా ప్రయాస ఇంద్రలోకంలో ఇర్వైమంది అప్సరసలు నృత్యంచేసే దృశ్యం ఉన్నది ఇటువంటి నృత్యాలు నిర్దుష్టంగా తీయాలన్నా ఎంతో శ్రమపడాలి ఏ ఒక నర్తకి ఏ చిన్న పొరపాటు చేసినా ఆ ''టేక్'' ఎందుకూ పనికిరావు

కధనం

'చంద్రహారం' కధ ఈ సంచికలోనే విపులంగా ఇవ్వబడింది కధనంలో గమనించదగిన గొప్ప విషయాలు కొన్ని ఉన్నాయి ఇది జానపద గాధ సహజంగా ఇందులో కొన్ని అసహజ విషయాలూ, అమానుష విషయాలూ ఉంటాయి చందనరాజా చంద్రహారంతో పుట్టటమూ, అందులో అతని పంచప్రాణాలూ ఉండటమూ, చచ్చినవాడు తిరిగి బ్రతుకుతూండటమూ, ఒక దేవకన్య మానవుణ్ణి ప్రేమించటమూ, దేవతలు మానవులకు సహాయపడటమూ మొదలైనవన్నీ అసహజమైన విషయాలూ, అసంభావ్యాలూ అయితే 'చందహారం' కధకుడు ఆ అంశాలన్నిటినీ రసపోషణకు చాలా వీలుగా వాడుకున్నాడు ఇందులోని రహస్యమేమంటే కళలోని రసోత్పత్తి మానవ మనస్తత్వాలను పురస్కరించుకుని సాధ్యమవుతుంది ''చంద్రహారం'' లోని అసంభావ్య విషయాలు కధలో మానవ మనస్తత్వానికి అతీతమైన సన్నివేశాలకు దారితీయవు

ఉదాహరణకు—

ఆకాశాన వెళ్ళే చంచల చందన్ అందం చూసి మోహించి, అతన్ని మోహింపజేయాలని వస్తుంది ఆమె తన దివ్యశక్తిచేత చందన్ మనస్సును తనకు సుముఖంగా చేసుకున్నట్టయితే ప్రేక్షకుల సహజ మనస్తత్వాలకు అతీతమైన సన్నివేశం ఏర్పడి ఉండును కాని అట్లా జరగదు నీతినియమాలను పాటించని మరొక మానవకన్యలాగే ఆమె అతనిని ఆకర్షించ యత్నిస్తుంది, విఫలురాలవుతుంది ఆగ్రహిస్తుంది, బెదిరిస్తుంది చంద్రహారం లాక్కుపోతుంది, చందన్ చనిపోతాడు ఈమెవల్ల చందన్ సహజ మనస్తత్వం లేశమాత్రమైనా మారలేదు అదివరకు చందన్ అనేకమంది రాజకన్యలను, నాట్యగత్తెలను, మరిడమ్మ కూతురు చిన్నిని నిరాకరించి ఉన్నాడు అదేవిధంగా చంచలనూ నిరాకరించాడు ఇంకా చంచలే మానవ మనస్తత్వాన్ని ప్రదర్శించింది ఆమె చంద్రహారం లాక్కుపోవటానికీ, మరో మనిషి చందన్‌ను హత్యచేసిపోవటానకీ ఆట్టే తేడాలేదు

అయితే చంచల చందన్‌ను తిరిగి బతికిస్తుంది నిజమే అదికూడా అసంభావ్యమే కాని చంచలకు గత్యంతరం లేదు శాశ్వతంగా చచ్చిపోయిన చందన్‌తో చంచలకు నిమిత్తంలేదు

అక్కడకూడా చంచల మానవ సహజమైన మనస్తత్వాన్నే ప్రదర్శిస్తుంది దీనికి ఫలితంగా మరొక అసహజ పరిస్థితి ఏర్పడింది –చందన్ చావు బ్రతుకుల మధ్య ఉండటం

దీన్నికూడా కథకుడు చాలా అద్భుతంగా వాడుకున్నాడు తాను చచ్చి బ్రతికినట్టు మొట్ట మొదటగా తెలుసుకునేవాడు చందన్ ''చావంటే ఏమిటో రుచిచూడు'' అని చంచల అనిఉన్నది చచ్చి బ్రతికానని తెలిసినాక చందన్ ''నన్ను వరించకపోతే చావూకాకుండా బతుకూ కాకుండా నీజీవితం వ్యర్థం చేసుకుంటావు'' అని చంచల అంటే, ''వ్యర్థం ఎందుకు? సార్థకమే చేసుకుంటాను!'' అంటాడు దీనితో అతని పాత్ర మరింత పదునెక్కింది

చందన్ తిరిగి బ్రతకటం చూసేవాడు మాలి వీరిద్దరి పునస్సమాగమం చిత్రంలోని రసవత్తర ఘట్టాలలో ఒకటి నిత్యజీవితంలోకూడా చచ్చారనుకున్న మనుషులు తిరిగి కళ్ళబడటం కద్దు అటువంటి సన్నివేశాలలో ఉండే మధురవేదన 'చంద్రహారం' లో సమగ్రంగా చిత్రించబడింది

చందన్ చచ్చిబ్రతుకుతున్నాడన్నది అన్ని పాత్రలకూ తెలిసిపోతే ప్రేక్షకుడి రసానుభూతికి భంగం కలుగుతుందని ఊహించి కథకుడు పెద్దయుక్తి చేశాడు చందన్ మాలితో ఈ రహస్యాన్ని ఎవ్వరికీ తెలియనివ్వవద్దంటాడు దీనివల్ల కథాగమనంలో రక్తి రావటమే గాక, చందన్ అప్పు డప్పుడు బ్రతకుతూ ఉండటం మరి కొన్ని రసవత్తర సన్నివేశాలకు ఉపకరించింది

వాటన్నిటిలోకీ అత్యంత ముఖ్యమయినదీ, కరుణామయమైనదీ గౌరీ చందన్‌ల సమావేశం గౌరినే ఊహించి, చిత్రించి, ఆమెకొరకు సమస్త రాజకన్యలనూ త్యజించి, దేశాటన కూడాచేసి, ఆమెకొరకే చంచల ఆగ్రహానికికూడా గురిఅయిన చందన్, తీరా ఆ మనిషిఎదట పడితే, ''సగంచచ్చిన ఈ చందనరాజా నిన్ను వరించమని అడిగే స్థితిలో లేడు'' అంటాడు ''బుజ్జాయికాక దీని మొహానికి చందనరాజా రాబోయేడా?'' అని సవతితల్లిచేత అనిపించుకున్న గౌరి, తీరా అతన్ని చేరుకుని తానే అతని ఊహాసుందరినన్న విషయం తెలుసుకునే ఆనంద సమయంలో అతను మరణశిక్ష విధించబడిన స్థితిలోవుంటాడు

కథకుడు చందనరాజా విచిత్రస్థితిని అద్భుత, కరుణరసాలకేగాక హాస్యరసానికి కూడా వాడుకున్నాడు చందన మహల్‌లో ధూమకేతు నిక్షేపరాయుళ్ళూ, మాలి కుటీరంలో ''ఎంతచెబితే అంతేగాళ్ళే'' చందన్‌ను ప్రాణంతో చూసే సన్నివేశాలు హాస్యరసంతో ఉట్టిపడుతున్నాయి

ఇంద్రసభలో చంచలకు జరిగే పరాభవంకూడా మానవాతీతమైన మనస్తత్వాన్ని ప్రదర్శించదు ఏ దుర్గుణాలైతే మానవులను సంఘవిద్రోహులుగా చేస్తాయో ఆ గుణాలే చంచల ప్రకటించింది ఆమె దేవతగనక మరింత హెచ్చుపరాభవానికి గురిఅవుతుంది

రచానా విధానం

కథలో పూర్వాపర సమన్వయమూ, ధ్వనీ చక్కగా సాధించబడ్డాయి కథ ధూమకేతు పట్టాభిషేకంతోనూ, దాని వైఫల్యంతోనూ ప్రారంభమవుతుంది తొలి దృశ్యంలోనే చందన్ జననానికికూడా సూచనజరిగింది అదే విధంగా చిత్రం ధూమకేతు పట్టాభిషేకయత్న వైఫల్యంతో అంతమవుతుంది అదే సమయంలో చందన్ పునర్జన్మ ఎత్తుతాడు

చందన్ తన ఊహాసుందరిని చిత్రించటం పూర్తిచేస్తూనే మాలిని, తనకలాటి సుందరి యెక్కడైనా దొరుకుతుందాఅని అడుగుతాడు, ఈ సందేహం చివరకు వాస్తవరూపంపొంది,

అతను దేశయాత్రనుండి గౌరిని చూడకుండానే ఇంటికి తిరిగిరావటం జరుగుతుంది

ఆ చంచల తన అక్కద్వారా, పెళ్ళికాకపోతే చందన్‌కు ప్రాణగండమున్నట్టు విని, అతన్ని వలపించి పెళ్ళాడి ప్రాణదానంచేసే మిషమీద చందన్ దగ్గిరికి వస్తుంది వచ్చిన మనిషి తన ఆశయం నెరవేర్చలేకపోగా తానే అతని మరణగండానికి కారకురాలయి చక్కాపోతుంది

చందన్ చనిపోయిన మర్నాడు రాజకుటుంబం విలపించే సమయంలో నిక్షేపరాయుడు, చందనరాజు మరణం దివ్యశక్తి కృతంకాదనీ, రాక్షస కృత్యఫలితమేననీ అంటాడు చిట్టచివరకు గౌరి రాక్షసి అని ప్రజలను నమ్మించటానికి ఇదేమాటను అతను ఆధారంచేసుకుంటాడు

ధూమకేతు పట్టాభిషేకానికి మాలలు కట్టించటం మినహాగా మిగిలిన ఏర్పాట్లన్నీ నిక్షేపరాయుడు చేయిస్తాడు ఈ ప్రయత్నాలన్నీ చందన్ పట్టాభిషేకానికి జరుగుతున్నాయనేది నిక్షేపరాయుడేగాదు ప్రేక్షకులుకూడా ఊహించరు, చెప్పినా నమ్మలేరు యిలాటి ప్రౌఢత్వం 'చంద్రహారం' రచన అంతటి విశేషంగా కనిపిస్తుంది

ఈ రచనలో 'క్లాసికల్ టచెస్' అనదగిన సంప్రదాయపు ఛణుకులు కొన్నివున్నాయి అందులో కొన్ని పాతకధలలోని వాటిని రచయిత ఉన్నపళంగా తీసుకోకుండా కొత్తమెరుగులు పెట్టాడు మాలివద్ద విద్యాభ్యాసం చేస్తున్న బాలచందన్ దగ్గిరికివచ్చి ధూమకేతు వెనకటి తెనాలిరామలింగడిలాగా రాయటానికి వీలులేని ధ్వనులు చెప్పి రాయమంటాడు కాని సహస్రఘంటకవి పరాభవంపొందినట్టుగా ధూమకేతువు పరాభవంపొంది లేచిపోతాడు అదేవిధంగా చంచల ప్రణయం చిత్రాంగి ప్రణయాన్ని స్ఫురింపజేస్తుంది నిక్షేపరాయుడు నాట్యగత్తెలను తీసుకొచ్చి చందనరాజు ఎదుటపెట్టి వారిలో ఎవరినన్నా వరించమనటం హరిశ్చంద్రుడి గాధను జ్ఞాపకం తెస్తుంది

ఇక్కడకూడా పరిణామంవేరు అచల, చంచల పాత్రలు దేవదేవినీ, ఆమె అక్కనూ స్ఫురింపజేస్తున్నాయి గౌరిని మాలికి పరిచయం చేసేటప్పుడు చిత్తరువుస్థానంలో గౌరిని నిలబెట్టి మాలికి భ్రమకలిగేటట్టు చేయటంకూడా ఈ జాతికి చెందినదే

చిత్రంలో బోలెడన్ని హాస్యసన్నివేశాలూ, హాస్య పాత్రలూ, హాస్యసంభాషణలూ ఉన్నాయి ధూమకేతు బాలచందన్‌ను హేళకోళంచేయబోయి పరాభవం పొందటం, ధూమకేతుకు నిక్షేపరాయుడు ప్రాప్తంకావటం, మరిడమ్మ ఇంటికి బుజ్జాయి రావటం, నిక్షేపరాయుడు గౌరిని మొదటిసారి చూడడం, నిక్షేపరాయుడూ బుజ్జాయీ తారసిల్లటం, ధూమకేతు సన్యాసివేషంతో మహారాజుదగ్గిరికి పోవటం, నిక్షేపరాయుడు మాలి కుటీరంలో రెండవసారి గౌరిని చూడటం, కింకరులు మాలి కుటీరాన్ని నిప్పుకోసం గాలించటం, చచ్చిపోయిన చందన్ బ్రతకగా ధూమకేతు నిక్షేపరాయుళ్ళు చూడటం వగైరా సంఘటనలు వస్తుతహా హాస్యపూరితమైనవి అయినా, కాపోయినా చాలా హాస్యవంతంగా రచించబడ్డాయి అశక్తదుర్జనుడైన ధూమకేతూ, అతి జిత్తులమారిఅయిన నిక్షేపరాయుడూ, వెర్రిబాగులవాడు బుజ్జాయీ, అపర పరమానందయ్య శిష్యులైన కింకరులూ హాస్యపాత్రలు హాస్య సంభాషణలు చిత్రంలో కొల్లలుగా ఉన్నాయి

'చంద్రహారం' లో అనేకరకాల రసాలను స్ఫురింపజేసే అనేక విధాల సన్నివేశాలున్నాయి ఏ సన్నివేశాన్నయినా బిగువుచెడకుండా నడిపించడంలోనూ, ప్రతి సన్నివేశంలోనూ తన యిష్టంవచ్చిన రసాలసమ్మేళనం సృష్టించటంలోనూ రచయిత సిద్ధహస్తుడు అతి సాధారణంగా

కనపడే సన్నివేశాలుకూడా ఈయన రచనలో విచిత్రమైన చవులూరుతాయి వాటికొక విశిష్టత చేకూరుతుంది ఇది సాధ్యకావటానికి కారణభూతమైనవి సంభాషణలలో చమత్కారమూ, పాత్రపోషణలో వింతమనస్తత్వ ప్రదర్శనా

పాత్రపోషణ

'చంద్రహారం'కు నాయకుడు చందనరాజు బుద్ధివచ్చినప్పటినుంచీ మాలివద్ద శిష్యరికంచేస్తూ విద్యలతో బాటు వినయాదిగుణాలు అభ్యసిస్తూ, సామాన్య పౌరుడివలె కాయకష్టం చేస్తూ, సామన్యులు తినే ఆహారమే భుజిస్తూ, ఆదర్శంగా ప్రజలను పాలించటానికి అవసరమైన శిక్షణ పొందినవాడు స్త్రీకి శీలమే సౌందర్యమని నమ్మి శీలవతి అయిన ఊహాసుందరిని చిత్రించుకుని, అలాటి కన్య దొరికితేనేగాని పెళ్ళాడనని తీర్మానించుకున్నాడు ఆ నిర్ణయాన్ని పురస్కరించుకుని దేశంలోని రాజకన్యల నందరినీ తృణీకరించాడు తాను వలచిన కన్యకొరకు దేశయాత్ర చేశాడు మానవయత్నం వృథాకాగా, దైవంమీద భారంవేసి, తనకు ప్రాప్తం ఉంటే తన ఊహాసుందరి తననే వెతుక్కుంటూ వస్తుందనే నమ్మకంతో ఇంటికి వచ్చేస్తాడు అతను పైకి విరాగిలాగా కనిపిస్తాడు కాని విరాగి కాదు రాజులు రాజకన్యలనే పెళ్ళాడటం ఆచారమని మాలి చెప్పినప్పుడు, ప్రజలను బిడ్డల్లాగా చూసుకునేవాళ్ళు కష్టాల్లో పుట్టి కష్టాల్లో పెరగవలసిందేగాని భోగాలు మరిగిన రాజకన్యలకు సాధ్యం కాదంటాడు దేవకన్య తనకు రెండు గడియల ఆయుర్దాయం ఇస్తే దానిని తన ఊహాసుందరి తపస్సుతో సార్థకం చేసుకుంటానంటాడు విధిని నమ్ముతాడుగాని తన ధర్మాన్ని వదులుకోడు నిరర్థక చిరజీవితం కన్నా సార్థక జీవితాన్ని ఎక్కువగా విశ్వసించి దానిని తరించటంతో ముడిపెడతాడు

కథా నాయిక గౌరి, పరమసాధ్వి స్వార్థం ఎరగదు ఇతరుల సుఖంకోసం తాను ఎన్ని కష్టాలైనా పడుతుంది వారికి తనయందు ఆదరం లేకపోయినాసరే సవతితల్లి తనను ఎంత బాధపెట్టినా, ఎంతగా తిట్టినా ఆమె తనను చిన్నతనంనుంచీ పెంచి పెద్దచేసిందన్న కృతజ్ఞతా, ఆమె ఇష్టంవచ్చినట్టు చేద్దామన్న భావమూ కనబరుస్తుంది ఆఖరుకు తన తల్లి నగలు తన పుట్టినరోజు పెట్టుకోవటానికి కూడా, సవతితల్లి అసూయకు వెరిచి జంకుతుంది చిన్నిని చందనరాజు చూస్తాడంటే తానే స్వయంగా ఆమెకు తన నగలన్నీ ఇచ్చి అలంకరిస్తుంది సవతితల్లి బుజ్జాయిని చేసుకోమంటే ఒప్పుకుంటుంది తాను బుజ్జాయిని చేసుకోవటంచేత తండ్రికి బాధకలుగుతుందని తెలుసుకుని ఇల్లువదిలి వెళ్ళిపోతుంది చందనరాజు తననే ఊహించి చిత్రంచాడనీ, తనకోసం దేశయాత్రచేశాడనీ తెలిసి, అతను చావుబ్రతుకులలో వున్నాకూడా వివాహమాడుతుంది చివరకు ధూమకేతు తననూ, తన భర్తనూ దహనంచేయ యత్నించినప్పుడు తనను దహనం చేసినట్టయితే తన భర్త బ్రతుకుతాడనికూడా చెప్పేస్తుంది ఇంత లక్షణవతిగా చిత్రించ బడినప్పటికీ ఈ పాత్రలో అమాయకత్వమూ, ప్రపంచజ్ఞానం అట్టే లేకపోవటమూకూడా మనకు కనిపిస్తుంది

ధూమకేతు దుష్టపాత్ర, కాని ఈ పాత్రలో సహజ దౌష్ట్యం ఏమీలేదు కథ ప్రారంభమవుతూనే ఇతని నెత్తి మీదికివచ్చే కిరీటం వెంట్రుకవాసిలో తప్పిపోతుంది ఇందుకు ధూమకేతు కొంత కుములుతాడు విధివైపరీత్యాన్ని భరించి ఊరుకుంటాడు తనకు బావమరిది పుట్టినాక ధూమకేతు అతనివల్ల ఏవిధమైన వైరభావమూ చూపడు పై పెచ్చు చందన్ స్వయంవరం విషయం

లో చాలా ఉత్సాహం కనబరుస్తాడు కాని చందన్ మరణగండం వినటంతో ధూమకేతుకు మళ్ళీ రాజ్యకాంక్ష పుట్టుకొస్తుంది చందన్‌ను తానై స్వయంగా హత్యచేయలేడుగాని, అతనికి పెళ్ళికాకుండాచేసి అందువమూలంగా అతను చస్తే తాను సింహాసనం ఎక్కవచ్చుగదా అనుకుంటాడు అందుకుకూడా దారితోచక కొట్టుకుంటూండగా నిక్షపరాయుడు తటస్థపడి కార్యభారం తననెత్తిన వేసుకుంటాడు నిక్షేపరాయుడి మంత్రిత్వంతో ధూమకేతు పతనం ప్రారంభమవుతుంది ధూమకేతు పతనమవుతున్నకొద్దీ అతనికి సింహాసనం చేరువవుతున్నట్టు కనిపిస్తుంది మొదటగా చందన్ చనిపోతాడు చందన్ శవం అక్కడ ఉండగానే ధూమ కేతు పట్టాబి షేకానికిగాను ఒక కపటనాటకం ఆడవలసి వస్తుంది తానై స్వయంగా ఈ నాటకం ఆడలేనివాడైనా నిక్షేపరాయుడి ప్రోత్సాహంతో ధూమకేతు సన్యాసివేషం వేసుకుని మహారాజావద్దకు పోయి పట్టాభిషేకం మంజూరు చేయించుకుంటాడు ఇంతలో తోటమాలి కుటీరంలో గౌరి వున్నట్టు తెలుస్తుంది చందనమహల్ తగలబెట్టించి గౌరిని హత్యచేయటానికి పాల్పడతాడు ఈ సమయంలో చందన్ శాశ్వతంగా మరణించలేదనీ, మధ్యమధ్య బ్రతుకుతున్నా డనీ తెలుస్తుంది ఇది తెలిశాకకూడా గౌరినీ చందన్ శరీరాన్ని కలిపి దహనంచేయించే ఏర్పాటు చేయటంవల్ల ధూమకేతు పతనం పూర్తి అవుతుంది ఈదశలో ధూమకేతు, చివరిదశలో మాక్‌బెత్ పాత్రని జ్ఞాపకానికితెస్తాడు ఏమంటే ఈస్థితిలో తాను చేయ తలపెట్టిన జంటహత్య వ్యర్థం కావచ్చు ననుకోవటానికి ఆధారమున్నది చందన్‌కూ గౌరికీ వివాహమయినట్టు గౌరి చెబుతుంది ఆ వివాహం జరిగినాక చందన్‌కు మరణభయంలేదు ఈదశలో వారిద్దరికీ దహనక్రియలు తలపెట్టిన ధూమకేతు విధినే ధిక్కరిస్తాడు అపజయం పొందుతాడు

నిక్షేపరాయుడుపాత్ర ఒక అపూర్వసృష్టి. అతను నిశిత బుద్ధికలవాడు, సద్యస్ఫూర్తి కలవాడు, నిజమైన రాజకీయవేత్త, ఆరితేరిన "డిప్లొమాట్," అతని ఇతర లక్షణాలకు తోడు చలించని స్వామిభక్తికూడా ఉన్నది నిక్షేపరాయుడిలో లేనిదల్లా ఒకే ఒక గుణం-అతని నిఘంటువులో నైతికదృష్టి అనేదిలేదు అతని పాత్రను గురించి లోతుగా ఆలోచించినకొద్దీ రాజకీయ చతురతకూ, నైతిక దృష్టికీ పొంతన కుదరదా అనిపిస్తుంది తనను చూస్తూనే "పొమ్మను, పొమ్మను" అన్న ధూమకేతును క్షణంలో బుట్టలో వేసుకుంటాడు చందన్‌కు ఆడదంటే మొహం మొత్తేట్టు చేసేభారమూ, అతని కంట అతని ఊహాసుందరిలాటి కన్య పడకుండాచేసే భారమూ తనమీద వేసుకుని రెండుపనులూ అనుకున్న ప్రకారం నిర్వర్తిస్తాడు తనను గురించి అవమానకరంగా మాట్లాడే మరిడమ్మ గౌరికి సహజ శత్రువని పసికట్టి మరిడమ్మను మంచిచేసుకుని, ఆమె పిచ్చికూతుర్ని చందనరాజా చేసుకుంటాడని అవలీలగా నిమ్మించి, గౌరి పెళ్ళిని బలపరుస్తాడు బుజ్జాయితో మాట్లాడేటప్పుడు బుజ్జాయిస్థాయికి దిగుతాడు బుజ్జాయిపలికే అర్థంలేని మాటలను "రాజతంత్రానికి పనికి వచ్చే పంచాక్షరీ మహామంత్రం" అని, రాజతంత్రాలపట్ల తనకుగల పరిజ్ఞానాన్ని వెల్లడిస్తాడు యుక్తి చాతుర్యాలలో అతని ప్రతిభ అడుగడుగునా కనిపిస్తుంది ఎంతక్లిష్టపరిస్థితి వచ్చినాసరే దానికేదో రస్తావేస్తాడు చందనరాజా చిన్నిని చేసుకోకుండా వెళ్ళిపోయినప్పుడు నిక్షేపరాయుడికి రెండు సమస్య లేర్పడ్డాయి మరిడమ్మను సముదాయించటం, గౌరి సమస్య పరిష్కరించటం ఈ రెంటినీ అతను ఒక్క దెబ్బతో పరిష్కరిస్తాడు అతని చెవులూ, కళ్ళూ అనుక్షణం చురుకుగా పనిచేస్తూంటాయనిపి

స్తుంది ధూమకేతు దాసి నీనా "మీరెక్కడి నుండి వస్తున్నారు?" అని అడిగితే, "అది తెలీకేగా మహామహులంతా మధనపడి చచ్చింది?" అని తప్పుకుంటాడు, " ఆలోచించి ఆలోచించి నాకు సన్యాసం ఇప్పించేటట్టున్నావు," అని ధూమకేతు అనేసరికి సన్యాసివేషంతో మహారాజా దగ్గిరికి పొమ్మని ధూమకేతుకు సలహా ఇస్తాడు చిట్టచివరకు గౌరి తాను చందనరాజా భార్యనని చెప్పినప్పుడు ధూమకేతు "పెళ్ళికూడా అయిందీ?" అంటాడు పెళ్ళి అయినపక్షంలో తనకు అపజయం తప్పదని ధూమకేతుకు తెలుసు కానీ నిక్షేపరాయుడికి కావలసిందదిగాదు తాను చందనరాజ్యానికి రాణికావాలనే ఉద్దేశంతో అబద్ధాలాడుతోందంటాడు దురుద్దేశాలు ఆపాదించి మంచి పనులను చెడ్డపనులుగా నిరూపించటమూ, నిజాన్ని అబద్ధాలుగా నిరూపించట మూ ఈనాటి అంతర్జాతీయ రాజనీతిలో మనం చూస్తూనే ఉన్నాం మొత్తంమీద నిక్షేపరాయుడు ఐక్యరాజ్యసమితిలో ఉండదగినవాడు! నిక్షేపరాయుడు అపజయం ఎరగడు అడుగడుగునా విధే అతన్ని ఓడిస్తుంది, అతను ఒక సమస్య పరిష్కరిస్తే మరో సమస్య తెచ్చిపెడుతూంటుంది

మాలి పాత్ర దొడ్డది అతను చందనరాజాకు "గురువు, చెలికాడు, అన్నీనీ " చందన్ మనస్తత్వం వెనుకగా మాలిపాత్ర కనిపిస్తూవుంటుంది కథయొక్క వివిధ సన్నివేశాలలో అతను కనపడకుండా చాలా పెద్దపాత్రనిర్వహిస్తాడు దేశంలోని రాజకన్యల పటాలన్నీ తెప్పించి ఎట్లాగైనా కుమారుడికి పెళ్ళి చేద్దామనుకున్న మహారాజాకూ, పటాలన్నీ తిరస్కరించి పెళ్ళి కిప్పుడు తొందరేమిటని దులుపుకుపోయిన చందన్‌కూ మధ్య అగాధం ఏర్పడింది తన మరణగండం గురించి చందన్ ఎరగడు, చందన్ చిత్రించుకున్న ఊహాసుందరిని గురించి మహారాజా ఎరగడు, మాలి ఈ అగాధానికి వంతెనకడతాడు మాలిద్వారా వినటం మూలానే చందన్ ఇష్టంవచ్చిన కన్యను మత కుల వివక్షత చూడనవసరంలేకుండా వివాహం చేసుకోటానికి రాజా అంగీకరిస్తాడు అందుచేతనే వివాహం చేయించేభారంకూడా మాలిపై పడుతుంది గౌరిని చందన్ కిచ్చి పెళ్ళిచేయటంతో మాలి కథను మరొకమెట్టు పైకితోస్తాడు ఈ వివాహం కొద్దిక్షణాలలో, రహస్యంగా జరగనిపక్షంలో అసలు జరగకుండాపోయే అవకాశంవుంది తరువాత గౌరి నిక్షేపరాయుడి కంటపడినప్పుడు ఆమెకు ప్రమాదం జరగవచ్చునన్నదికూడా మాలి దూరదృష్టితో ఆలోచిస్తాడు చందన్ కోరికపై రహస్యంగావుంచిన విషయాలను రాజాతో చెప్పే నిర్ణయాన్ని కూడా మాలి సరిఅయిన సమయంలోనే చేస్తాడు ఈ కథలో విధి చాలా పెద్దపాత్ర నిర్వహిస్తుంది ఆ విధికి ప్రతినిధిగా కనిపించే మానవపాత్ర ఈ చిత్రంలో మాలి ఒక్కడే. మహారాజాకు మొదటినుంచీ విధిలో ఎంత విశ్వాసంవుందో మాలిలోనూ అంత విశ్వాసమూ వుంది

చంచల దేవకన్య, రూపసి, గర్విష్ఠి, అహంకారిణి స్వార్థత్యాగం ఎరగని క్షుద్రప్రేమను చందన్‌పట్ల చూపుతుంది ప్రేమలోకూడా తన ఆధిక్యాన్ని క్షణంపాటు మరవలేదు ప్రేమసాఫల్యంకొరకు హేయమైన పనులు చేస్తుంది అతన్ని "ఛాందసరాజా" అని పిలుస్తుంది దేవతలకుగల మహిమలూ, మానవులకుగల నీచత్వమూ కలగలిపితే చంచలపాత్ర తయారయిం ది అటువంటి వ్యక్తిచేత ప్రేమించబడడం అవమానానికి గురికావటమే చందనరాజా ఏ కన్యను ఊహించి ఆమెకొరకు అష్ట కష్టాలూ పడుతున్నాడో ఆమెను స్వయంగా చూసినాకూడా, " ఏం మహిమచూసి చేసు కొన్నావోయ్ ఈ మానవ కన్యని?" అని అడుగుతుంది ధనికుడు తన

ధనికత్వాన్ని మరిచిపోలేనట్టు ఈ చంచల తన మహిమలను మరిచిపోలే కపోతుంది అందుచేత చిట్టచివరకు ఈమె తన మహిమలను కోల్పోవటంలో ''పొయెటిక్ జస్టిస్'' వుంది

మరిడమ్మ కేవలం దుష్టపాత్ర కాకపోయినా ప్రేక్షకుడు సానుభూతిని పోగొట్టుకునే పాత్ర ఈమె దౌర్బల్యంలో కూడా సహజత్వం ఉంది తనమాట నిరంకుశంగా సాగే వాతావరణంలో ఉన్నమనిషి కావటంచేత ముందూ వెనకా చూడకుండా నోరు పారేసుకుంటుంది పీకలమీదికి వస్తే అంతలో దిగజారిపోతూ తనతప్పు ఇంకొకరిమీదికి తోసెయ్యగలదు పైకి డంభంగా కనిపిస్తుందిగాని సులువుగా వంచనకు గురి అవుతుంది బుజ్జాయినిచూసి, ''వీడేమో పిచ్చి వాడనుకున్నా, తెలివిగానే మాట్లాడుతున్నాడే'' అంటుంది ఈమాట సగం నోరు జారి అన్నదీ, సగం ఆత్మసమర్ధనకోసం అన్నదీనూ ఇందులో కొంత అమాయకత్వం లేకపోలేదు ఈ అమాయకత్వంచేతనే చందనరాజు తనకూతురు చిన్నిని వరిస్తాడని నమ్ముతుంది అది జరగకపోగా, పెద్దదానికి పెళ్ళికానందువల్ల చిన్నదానికి ముడిపడలేదని నిక్షేపరాయుడంటే అదీ నమ్మేస్తుంది చిట్ట చివరకు తన అన్న బుజ్జాయికి చిన్ని నిమ్మంటే ఇవ్వను పొమ్మంటుంది

సీనయ్య చాలా చిన్నపాత్ర, అయినా సమగ్ర పాత్ర సీనయ్య తన ఇంట్లోనే ఎటువంటి స్థితిలో ఉన్నదీ, ఆయన మనస్తత్వం ఎటువంటిదైనదీ మనం వివరంగా చూడగలుగుతాం సీనయ్య అసమర్థుడుకాడు, అశక్తుడు, రోగిష్టి భార్య గయ్యాళిది ఆమెతో ఘర్షణ పడటంలో ఆయనకు ఆనందం ఏమీలేదు కాని ఈ గయ్యాళికి తలవంచి ఊరుకోలేడు తన పెద్ద కూతుర్ని సవతితల్లి బారినుండి రక్షించలేడు గౌరి ప్రతిదానికీ తల ఒగ్గటం తనకిష్టంలేదు కాని తలవొగ్గుతుంది గనుక ఆమె సౌఖ్యంపట్ల తన బాధ్యత మరింతగా భావిస్తాడు ఈ భావనయొక్క పరిణామమే ఆయనచేత గౌరిని ఇల్లువెళ్ళగొట్టిస్తుంది '' ఈపెళ్ళి చేసుకునేకన్న నువుచస్తే నేను సంతోషిస్తాను'' అన్న ఒక్కముక్కలో కూతురి అసౌఖ్యాన్ని చూసి సీనయ్య ఎంతగా బాధపడుతూవచ్చాడో తెలిసిపోతుంది ''చిన్నప్పటినుంచీ ఈ కొంపలో కష్టాలేపడ్డావు ఇకనైనా దేవుడు నీకు మేలుచేయకపోడు వెళ్ళిరా, తల్లీ'' అంటాడు సీనయ్య తన ఇంటిని గురించి ఎలా భావిస్తూ వచ్చాడో ఈ ముక్కలో వ్యక్త మవుతుంది తన ఇంట్లో తన అయినవాళ్ళమధ్య పొందలేని సౌఖ్యాన్ని గౌరి ఒంటరిగా బయటి ప్రపంచంలో పొందుతుందని ఆయన నమ్మకం!

బుజ్జాయి, చిన్ని పాత్రలు వెర్రిబాగుల పాత్రలు వారి వల్ల ఒకరికి కీడులేదు, మేలులేదు వారినెవరూ మార్చలేరు వారిద్దరూ ఒకరికొకరు సరిఅయిన జోడు వారి ప్రవృత్తులు వారిని దగ్గరికి ఈడుస్తూంటే, ఏ మరిడమ్మో, మరిడన్నో రెక్కపట్టుకు ఇవతలికి లాగుతూవుంటారు అయినప్పటికీ ఈ పాత్రలురెండూ కథలో చాలా పెద్దపాత్రలు నిర్వహిస్తాయి చిన్ని కారణంగా చందనరాజు దేశయాత్ర చాలించి తిరిగిపోతాడు బుజ్జాయి కారణంగా గౌరి ఇల్లువదిలి పోవలసినదవుతుంది తాము ఇంత పెద్ద పాత్రలు నిర్వహిస్తున్నామన్న జ్ఞానంలేని చదరంగపు పావులు ఈ పాత్రలు

ఇంచుమించు వీరివంటివాళ్ళే ధూమకేతు, కింకరులు వీళ్ళను చూస్తూనే నిక్షేపరాయుడు లాంటి కుశాగ్రబుద్ధి వీరికి ''ఎంతచెబితే అంతేగాళ్ళు'' అని నామకరణంచేశాడు వీళ్ళకి జీవితమంతా చిద్విలాసం, సాధారణంగా యజమానులకొక దౌర్బల్యం ఉంటుంది – తమ నౌకర్లు యేదిచెయ్యమంటే అదిచెయ్యాలని అదే కింకరుల ఆదర్శమైతే వీరు ఆదర్శ కింకరులు

గోఖలే, కళాధర్‌లు తమకు ఇలాటి అవకాశం మరి దొరకదేమోనన్నట్టుగా తమ ప్రతిభనంతా చూపి ప్రతి చిన్న దృశ్యమూ సహజత్వంతోనూ, సౌందర్యంతోనూ తొణికిసలాడేలాగు తయారుచేసారు కళాదర్శకత్వంలో వీరి కీర్తి చిరస్థాయిగా ఉండటానికి ఒక్క దేవలోకం సీను చాలును

ఈ చిత్రంలో ఘంటసాల సంగీతదర్శకత్వం మహోన్నతశిఖరాల నందుకున్నదని చెప్పవచ్చు ఒకసారి వింటే కలకాలం చెవులలో మారుమోగే చక్కని బాణీలు కుదర్చటమేగాక, పాత్రలనూ సన్నివేశాలనూబట్టి ఘంటసాల ఈ చిత్రంలో శుద్ధ సంప్రదాయబాణీలూ, మిశ్రమ బాణీలూ తయారుచేసి 'చంద్రహారం' కథా సన్నివేశాలలోని వైవిధ్యాన్ని సంగీతంలోకూడా విజయవంతంగా ప్రతిబింబింపజేశారు ఈయన సంగీతానికి డైరెక్టరాఫ్ ఆడియోగ్రఫీ కృష్ణయ్యరూ, అసిస్టెంట్ సౌండ్ ఇంజనీర్ శివరాం ఎంతగానో మెరుగులుదిద్దారు

'చంద్రహారం' లో నృత్యాలను గురించి ప్రత్యేకంగా చెప్పవలసి ఉంది ఇందులోని ప్రధాన నృత్యాలు కథలో చాలా ప్రాముఖ్యం కలవి ''చంద్రుడు-కలవలు'' నృత్యం అతి ముఖ్యమైన కథాఘట్టం అలాగే దేవలోకంలో అప్సరసల నృత్యంకూడానూ ఈ నృత్యాలను పసుమర్తి కృష్ణమూర్తిగారు అత్యంత సమర్థతతో తయారుచేశారు ముఖ్యంగా దేవలోకంలోని నృత్యం చిత్రం ''క్లయిమాక్స్'' తో కలిసివస్తుంది ఇంద్రలోకానికి తగిన విశిష్టతా ''క్లయిమాక్స్'' కు అనుగుణమైన ఉద్వేగమూ, ఇరవై మంది నర్తకులను ఒక తాటిమీద నడిపించే సమర్థతా కృష్ణమూర్తి గారు ప్రదర్శించారు

నటులు

సినిమా నటనలో తెలుగునటులు ఎవరికీ తీసిపోరని 'చంద్రహారం' రుజువుచేస్తుంది ఈ చిత్రంలో మనం చూసే అసంఖ్యాక పాత్రలలో ప్రతి చిన్నిపాత్రకూడా సజీవంగా, సార్థకంగా కనిపిస్తుంది

నాయికానాయకులుగా శ్రీరంజని, రామారావులు తమ పాత్రలను నిర్దుష్టంగా, ప్రతిభావంతంగా, అతి చిన్న విషయాలలోకూడా అత్యంత స్వాభావికంగా, పాత్రోచితంగా నటించారు ధూమకేతుగా రేలంగీ, నిక్షేపరాయుడుగా జోగారావూ అపూర్వమైన పాత్రపోషణ చేశారని చెప్పాలి ఈ పాత్రలరచనలో కవి కలం ఎన్ని నగిషీలు చెక్కిందో అభినయంలో అన్నింటినీ వీరు ప్రదర్శించారు చంచల, అచల పాత్రలు ధరించిన సావిత్రీ, కాంతాదేవీకూడా తమ పాత్రలలోని వ్యత్యాసాన్ని ఆంగికవాచికాభినయాలలో చాలాబాగా వ్యక్తీకరించారు చంచల పాత్రలోని దర్పాన్నీ అసూయాహంకారాలనూ, నిర్లక్ష్యాన్నీ సావిత్రి సమగ్రంగా చిత్రించింది దేవలోకంలో ఈమెచేసిన నృత్యం మరువరానిది మాలి పాత్రలోని నిండుతనాన్నీ గాంభీర్యాన్నీ, పరిపక్వతనూ రంగారావు చాలాబాగా వ్యక్తీరించాడు దొరస్వామీ, ఋష్యేంద్రమణీ గౌరి తండ్రిగానూ సవతితల్లిగానూ నిర్దుష్టమైన నటనను ప్రదర్శించారు బుజ్జాయి హాస్యపాత్రను ధరించికూడా బాలకృష్ణ తాను హాస్యంకొరకు ఉన్నాననే భావం అణుమాత్రమైనా లేకుండా ఆ పాత్రలో లీనమై దాని సహజప్రేరణలనూ, కష్టసుఖాలనూ వంక పెట్టటానికి వీలులేకుండా నటించాడు రాజాగా శ్రీవత్సా, రాణిగా వెంకుమాంబా, కింకరులుగా పద్మనాభం, కె వి యస్ శర్మా, ఆశాదేవిగా సూర్యకాంతం, మరిడన్నగా సి వి వి పంతులూ, బాలచందన్‌గా

అన్నపూర్ణా, రాజగురువుగా మాధవపెద్ది సత్యం, దాసిగా సరళా, ఇంద్రుడుగా, ఇంద్రాణిగా ఆర్ నాగేశ్వరరావు తిలకం ఎంతో తృప్తికరంగా నటించారు

## నిర్మాతలు

వీటన్నిటి వెనుక వెన్నెముకగా ఉండినది కె కామేశ్వరావుగారి దర్శకత్వం, ప్రసాద్‌గారి పర్యవేక్షణ 'చంద్రహారం' లాంటి చిత్రం తయారుకావాలంటే దానికి పునాదిగా ఎంతో భావనా, కూర్పు అవసరం కళాసృష్టిలో ఏదీ యాదృచ్ఛికంగా జరగదు ఒకటి రెండు అంశాలు సంభవమైనా వాటికి మిగిలిన అంశాలతో అన్వయం ఉండదు గొప్ప నిర్మాణం వెనుక గొప్ప ఇంజనీర్లున్నట్టు 'చంద్రహారం' చిత్రాన్ని ఒక ఉత్తమమైన కళావస్తువుగా భావనచేసి రూపకల్పన చేసిన ఖ్యాతి ఈ ఇరువురికీ దక్కుతుంది అందులో కామేశ్వరరావుగారు స్క్రిప్టు రచనలోనూ సహదర్శకత్వంలోనూ దీర్ఘకాలానుభవం కలవారైనా దర్శకత్వానికి రావటం ఇదే ప్రారంభం వారికీ చిత్రం గొప్ప విజయం

చిత్రనిర్మాణానికి దోహదంచేసి దానిని సాధ్యం చేసిన నిర్మాతలు నాగిరెడ్డి, చక్రపాణిగార్లు ఈ జంట నిర్మాతల ఖ్యాతి 1950లో 'షావుకారు' విడుదల అయిన నాటినుండి ఒకొక్క మెట్టే ఎక్కివస్తున్నది వీరి 'పాతాళ భైరవి', 'పెళ్ళిచేసిచూడు' చిత్రాలు దక్షిణభారత చరిత్రలో కొత్త అధ్యాయాలు సృష్టించాయి కాని 'చంద్రహారం' వీటన్నిటినీ తలదన్ని ఒక కొత్తశకాన్ని ప్రారంభించ జాలినదిగా కనిపిస్తోంది

## ప్రయోజనం

'చంద్రహారం' చూసే ప్రేక్షకులు చక్కని ఫోటోగ్రఫీ, అద్భుతమైన సెట్టింగులూ, హాయి గొల్పే పాటలూ, అద్భుతమైన హాస్యమూ, అపూర్వమైన దృశ్యాలూ, ఆనందకరమైన నృత్యాలూ, అసమానమైన నటనా చూసి ఆనందిస్తారు దాని కెటువంటి సందేహమూలేదు కాని థియేటరులోనుంచి బయటికివచ్చాక వారు వెంటబెట్టుకుపోయేదేమిటి?

'అదృష్టవంతుణ్ణి చెడగొట్టలేరు, దరిద్రుణ్ణి బాగుచేయలేరు'' అంటాడు నిక్షేపరాయుడు ''అంతా విధి చేతిలో ఉంది'' అంటాడు మహారాజా కాని చిత్రంలోని నీతి ఇంతకన్నా లోతైనది గా కనిపిస్తుంది మహారాజా విధిని నమ్ముకుని ఉన్నవాడే అయినా యువరాజా పెళ్ళికొరకు యత్నించకపోలేదు నానాదేశ రాజకన్యల పటాలు తెప్పించాడు ఆప్రయత్నం విఫలమయితే కొడుకును దేశయాత్రకు పంపాడు అట్లాగే చందన్‌కూడా తన ఊహాసుందరికోసం చాలా ప్రయాసపడ్డాడు ధూమకేతు సింహాసనం ఎక్కటానికీ, నిక్షేపరాయుడు ధూమకేతు ''బహిరంగమంత్రి'' కావటానికీ నానా అగచాట్లూ పడ్డారు

అంతా విధి విలాసమేనని నిక్షేపరాయుడన్నప్పటికీ విధి విలాసంవల్ల ధూమకేతుకు సింహాసనం రాలేదు గౌరి బుజ్జాయిని పెళ్ళాడలేదు చిత్రంలో చివరకు నైతిక శక్తులే నెగ్గాయి, మంచితనమే జయించింది ఆఖరుకు స్వర్గంలో కూడా దౌష్ట్యం శిక్షించబడింది

'చంద్రహారం' చిత్రం మంచితనాన్ని సమర్థిస్తుంది చిత్రంలో పదవీవ్యామోహమూ, రాజకీయపు టెత్తులూ పరిహసించబడ్డాయి ధూమకేతు వెర్రివెంగళాయిలాగా కనిపిస్తాడు అతను ఆ పదవికి తగనివాడైతే కావచ్చుగాని వెర్రివెంగళాయికాడు నిర్లిప్తంగా చూస్తే అర్హతలే ని పదవికి అర్రులుచాచే వారంతా వెర్రి వెంగళాయిల్లాగే కనిపిస్తారు వీరివల్ల సజ్జనులకూ,

అమాయకులకూ ఎంత ప్రమాదం ఉన్నదీకూడా ఈ చిత్రం నిరూపిస్తుంది ఏ దేవేంద్రుడోవచ్చి ధూమకేతు నిక్షేపరాయుళ్ళ యత్నాలను భగ్నంచేశాడు గనుక ఈ నీతి వాస్తవమైనది కాదనుకో నవసరంలేదు అచల చంచలతో అన్నట్టు, మానవులకు వేరే మహిమలంటూ లేవు, దేవతల మహిమలన్నీ వారివే, దేవేంద్రుడు 'చంద్రహారం' లో ప్రదర్శించే శక్తికితుల్య మైన మానవశక్తులు లేకపోలేదు

అన్నివిధాలా 'చంద్రహారం' ఒక మహత్తర కల్పన, అద్భుత రచన, అపూర్వ నిర్మాణం ఈచిత్రం అన్ని రకాల ప్రేక్షకులకూ, అన్ని అభిరుచులవారికీ అమితమైన ఆనందాన్ని చేకూర్చగలదని విశ్వసిస్తున్నాం *కినిమా, మాసపత్రిక, జనవరి 1954*

# 27. అంతామనవాళ్ళే

వాస్తవికమైన కథతో, అభ్యుదయకరమైన చిత్రం నిర్మించటానికి ఇప్పటిదాకా జరిగిన ప్రయత్నాలలో ఉత్తమ మైనది సారధీవారి ' అంతా మనవాళ్ళే'! సంఘాన్ని దోచుకునే అవకాశాలు చేజిక్కించుకున్న నలుగురు పెద్దలకూ, ఈ దోపిడీని అరికట్టటానికి కృషిచేసే పత్రికకూ మధ్య జరిగే పోరాటం ఈ చిత్రానికి ఇతివృత్తం కథానాయకుడు బంధుత్వరీత్యా మొదటివర్గానికి చెందినవాడై ఉండి, దోపిడీకి గురిఅయి, రెండో వర్గంతో చేరి పోరాటంలో పాల్గొని విజయం సాధించాడు

చచ్చిపోయిన అన్నగారి ఆస్తిని కాజేసి తన కూతురికి మిద్దెలు కట్టించి పసుపు కంపెనీ పెట్టి లోకుల్నిముంచి పరారీ అయిపోయే చిదంబరం మామగార్ని వేటకుక్కలాగా ఉపయోగించు కుని, చచ్చే పెళ్లాం వేలి ముద్రతో ఆమె ఆస్తియావత్తూ తన పేర మార్చుకునే జగన్నాధం, తన పిచ్చికొడుక్కూ, ముక్కుపచ్చలారని మేనకోడలికీ గ్రామఫోను పెళ్ళి చేయించే భద్రాచలం, హరిజన హాస్టల్ మేనేజరు, మెడికల్ షాపు ప్రొప్రయిటరు, మార్వాడీ, కో –ఆపరేటివ్ స్టోర్స్ నౌకరు, గారాబమూ డబ్బూ జాస్తిఅయి దానితో బాటు నవనాగరికతకూడా బలిసి, నిరర్థక జీవితంలోనే ఆనందం చూడటం నేర్చుకున్న గిరిజ, అయిన వాళ్ళను గుడ్డిగా నమ్మినందుకు అనుభవించే రత్తమ్మ–ఇవన్నీ వాస్తవమైన పాత్రలే గాక కొన్ని జీవితసత్యాలకు ప్రాతినిధ్యం వహించేవి కూడాను

అయితే కథనంలో ఈ పాత్రలకు జరగదగినంత న్యాయం జరుగలేదు కథానాయకుడు సత్యం చదువుకుంటున్నవాడై ఉండి కూడా తన పినతండ్రి తన ఆస్తి కొల్లగొట్టి ఆయన కుమార్తె వరలక్ష్మికిచ్చి ఆ సొమ్ముతో కట్టడాలను లేపిస్తుంటే ఆ వరలక్ష్మి ఇంట్లోనే ఉంటూకూడా ఏమీచేయడు ఇదంతా ప్రపంచ జ్ఞానశూన్యత అయినపక్షంలో దానిని ఇతరత్రా కనీసం ఒకటి, రెండు విషయాలలో నిరూపించవలసింది అంతా క్షవరమైపోయి తమ ఇల్లుకూడా పోయేస్థితిలో అతను తల్లిమీద అలగటంలో కొంచెమైనా ఔచితి లేదు, మరుక్షణమే అతను పశ్చాత్తాప పడటం కూడా నటనలా ఉందిగాని నమ్మేట్టులేదు జగన్నాధం కూతురు గిరిజకూ ఈ సత్యానికీ సహజ వ్యత్యాసం చాలా ఉంది ఎంత చిన్న విషయంలోనూవారికి అభిప్రాయాలు కలవ్వు అది చిత్రించటానికిగాను ప్రతి చిన్నదానికీ సత్యం గిరిజను కసురుకోవటం, అసహ్యం మొహం పెట్టటం, ఆమెను చూస్తేనే వాంతివచ్చేవాడిలాగా ప్రవర్తించటం కొంచెమైనా బాగాలేదు తాను గిరిజలాటివాణ్ణి కానని రుజువు చేసుకోవటానికి అతను మామూలు సభ్యతకూడా లేనట్టు

ప్రవర్తించవలసిన అగత్యం ఏమీలేదు మందులషాపువాడు మందివ్వక, వాడితో ఘర్షణపడి, తనను పోలీసులు అరెస్టుచేసి, ఈ సమయంలో తల్లి చావూ, చెల్లెలు పరారీకావటం జరిగినస్థితిలో సత్యం మతిచెడి, తన నిజమైన విరోధులను గుర్తించలేక ''కాగడా'' పత్రికమీద విరుచుకు పడటం చాలా స్వాభావికంగానే ఉంది ఆ సందర్భంలో ''కాగడా'' సంపాదకుడు రావు చెప్పిన హితవచనాలలో కూడా చాలా నిజం ఉంది కానివాటిని ఒకక్షణంలో జీర్ణంచేసుకుని పూర్తిగా పరివర్తనపొందటం చూస్తే, ''పాప్ ఐ'' బచ్చలి ఆకులు తిని క్షణంలో ఒళ్లుపెంచుకుని రాక్షసుడు లాటివాణ్ణి పడగొట్టిన కార్టూన్ ఎఫెక్ట్ జ్ఞాపకం వస్తోంది కథానాయకుడికి గడ్డిమంటల్లాంటి ఉద్రేకాలు అంటగట్టటం ఏమాత్రమూ సబబు కాదు అతిముఖ్యమైన ఈ సత్యం పాత్ర విషయంలో రచయితలూ, దర్శకుడూ కూడా ఇంకా హెచ్చుశ్రద్ధ చూపి ఉండవలసింది

కాగడా పత్రికా సంపాదకుడూ, ఆయన కుమార్తె విమలా కూడా ఆదర్శ పాత్రలుగా కనిపిస్తారు అన్నీ తెలిసి, సమస్తాన్నీ సరిగా అవగాహన చేసుకునే ఈ పాత్రలు మిగిలిన వాస్తవ పాత్రల మధ్య అవాస్తవంగానూ, అంతకన్నా కూడా మిగిలిన ప్రపంచాన్ని ఎక్కడోతప్ప అంటనివిగానూ కనిపిస్తాయి ఇలాటి చిత్రణ తప్పు ఇటువంటి పత్రిక ప్రపంచానికి అత్యంత సన్నిహితంగా ఉండాలి దోపిడీకి గురి అయ్యేవాళ్ళు, పత్రికను బెదిరించటానికి వచ్చేవాళ్ళు, బోలెడంతమంది ఉంటారు ఈ పత్రిక వెంట అటువంటి వాతావరణం లేని కారణంచేత పత్రికాఫీసు ఏదో ముని ఆశ్రమంలాగా తయారయింది కథకులు దీనిపట్ల శ్రద్ధ వహించినట్టయితే ఈ పత్రికాఫీసును అనేక సంఘటనలకు ఆయువు పట్టుగా చేసి ఉండేవారేమో!

ఈచిత్రం చూస్తుంటే రసానుభూతి చాలా కలుగుతుంది కాని అది కావ్యం ఇచ్చే అనుభూతి దృశ్యకావ్యం ఇవ్వదగిన అనుభూతి అంతగా కాదు దీనికి కారణం అనేక ముఖ్యమైన సంఘటనలు చాలా టూకీగా వెళ్ళిపోయాయి సత్యం యిల్లుపోయాక అతను తల్లీచెల్లెళ్ళతో ఇల్లువదలి బండిలో వెళ్ళిపోవటం మూడు నిముషాలపాటు, పాటతో సహా చిత్రించారు కాని వాళ్ళు జగన్నాథం ఇల్లువదలి సత్రంలోచేరాక తల్లిజబ్బు, మరణమూ, చెల్లెలు దారితప్పిపోవటమూ త్రుటిలో జరిగాయి! అదే విధంగా గిరిజ తనకు రోత ఐనసత్యాన్ని వెంబడించి ''ననుకాదని ఎవరనగలరా'' అనే పాట యావత్తూ పాడుతుంది కాని ఆమె ఈ సత్యాన్నే చేసుకోవలసి వస్తుందనే కంగారులో తన ఇష్టుణ్ణి చేసుకుని వచ్చే పెళ్ళి చూపనైనా లేదు పైగా అది రిజిష్టరుపెళ్ళి అని ఆమె చెప్పేమాట పచ్చిఅబద్ధం! అది అబద్ధమని తెలుసుకునే అవకాశం కూడా ప్రేక్షకుడికి లేదు

కథలో ఏసంఘటనను ఎంతగా విస్తరించాలో కథకులకు సరిగా అంచనా దొరకలేదనిపిస్తుంది వారుచూసుకున్నది కథనంలో సౌలభ్యం మాత్రమే సత్యానికీ ''కాగడా'' వాళ్ళకూ మధ్య భేదోపాయం చేస్తానని బయలుదేరిన చిదంబరం పనిపెట్టుకుని గిరిజను తన వెంట పట్టుకుపోతాడు తనతాతా, సత్యం మాట్లాడుకునేమాటలు బయటినుంచి విని గిరిజ పారిపోయి పెళ్లాడి మరీ ఇంటికి వస్తుంది సత్యాన్ని చేసుకోవటం గిరిజకు ఇష్టమో కాదో కనుక్కోకుండా చిదంబరం ఆమెను వెంట బెట్టుకుపోవటం పొరపాటు, అనవసరం కూడా అసలు పరారీ అయిపోయిన చిదంబరం తిరిగి రావటమే పొరపాటుగా కనిపిస్తుంది ఏ చిక్కుల నుండి తప్పించుకోవటానికి అతడు పరారీ అయ్యాడో అవి ఆ కొద్ది కాలంలో సమసిపోయేవి కావు తిరిగివచ్చిన చిదంబరాన్ని జైలుల్లో వేయించటం సత్యానికి అట్టే కష్టమైనపని కాదు

చిత్రంలో ప్రజలు తగినంతగా కనిపించరు కో-ఆపరేటివ్ స్టోర్స్ దగ్గిర కనిపిస్తారు, అంతే ఊరంతనీ దోచేటందుకు ఒకే స్టోర్స్, ఒకే మందుల షాపు, ఒకే మార్వాడీ ఉన్నట్టు చూపటం అంత పెద్ద తప్పుకాదు, కొండంత దాన్ని చిత్రించటానికి కొండంత కాన్వాస్ తీసుకురాం కాని ద్రోహంచేసే వాళ్ళు పరిమితి లోనే ద్రోహానికి గురి అయేవాళ్ళని ఉంచటం భావ్యంకాదు ఎందుకంటే ఈ ద్రోహాలు, ఇతర సాంఘిక చిత్రాల్లోలాగ, వ్యక్తిపరమైనవి కావు సంఘపరమైనవి

చిత్రంలో తీసివేయదగిన సంఘటనలూ, పాత్రలూ ఉన్నాయి సత్యంమేనమామా, భార్యా, కొడుకూ అనవసరం కేవలం గ్రామఫోను పెళ్ళికోసం వీరు తేబడ్డారు సత్యం చెల్లెలు శారద కూడా చాలావరకు అందుకే తేబడింది తల్లి మరణించిన అనంతరం ఆమె తప్పిపోవటం, బిచ్చగత్తె చేరదీయటం, ఆమె తిరిగి దొరకటం, ఆదర్శ బిచ్చగత్తె పాత్ర చిత్రంకి అనవసరం నౌకరు రాఘవులు పాత్ర ఏమీ బాగాలేదు పతనావస్థలో కూడా కథా నాయకుడికి పరివారం ఉన్నదనటానికి తప్పితే ఈ పాత్రవల్ల ప్రయోజనం లేదు – గిరిజ పాత్రను కసురుతూ ఉండటం తప్ప

సినిమా ప్రేక్షకులు చిత్రం చూసి అందులో కొన్ని పాత్రలను ప్రేమించాలి, కొన్నింటిని ద్వేషించాలి నిజమే అందుకై కథకుడూ, దర్శకుడూ కొన్ని పాత్రలను ఎగదోసి, మరికొన్నిటిపై తమ ఆగ్రహాన్ని వెళ్ళబోయనవసరం లేదు గిరిజ పాత్రకు ఇటువంటి పనిచేశారు జగన్నాథం పాత్రకు ఒక వేశ్యను జతచేశారు ఈ పాత్ర చాలా అనవసరం అనవసరపాత్రలూ, సన్నివేశాలూ తీసేసి ఉంటే ముఖ్య సంఘటనలను ఇంకా బాగా విస్తరించటానికి అవకాశం చిక్కేది

ఇటువంటి లోపాలున్నప్పటికీ ఈ చిత్రలో బలమైన కథా, పాత్రలమధ్య వాస్తవమైన సంఘర్షణా, చిత్రం నిండా అసంఖ్యాకమైన జీవితసత్యాలూ ఉండి ఇది గొప్ప తెలుగు చిత్రాల జాబితాలో చేరుతున్నది ఇటువంటి చిత్రాల నిర్మాణానికి లోగడ జరిగిన యత్నాలేవీ ఇంత విజయాన్ని సాధించలేదని చెప్పకతప్పదు

ఈ విజయానికి తోడ్పడ్డవి ఘాటైన సంభాషణలూ, ప్రధాన పాత్రధారుల నటనా, దర్శకత్వంలోని శిల్ప పటుత్వం, చక్కని ఫోటోగ్రఫీ సౌండ్ రికార్డింగ్ అక్కడక్కడా అసంతృప్తికరంగా ఉంది పాటలను చిత్రీకరించటం పేవలంగా ఉంది చిత్రంలో కొన్ని పాటలు సరిఅయిన సన్నివేశాలలో పడలేదు మ్యూజిక్ డైరెక్షన్ ఫరవాలేదు ఈ చిత్రం వెనుక ఉన్న కొండేపూడి లక్ష్మీనారాయణ, చాణిక్యారావు ప్రభృతులూ, నిర్మాత సి వి ఆర్ ప్రసాద్ గారూ అభినందనీయులు *తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 29-1-1954*

# 28. నిరుపేదలు

ఈ నెల 20 న ఆంధ్రలో విడుదలయిన గోకుల్ వారి తొలిచిత్రం 'నిరుపేదలు' పేరుకు తగ్గట్టే నిరుపేదల కష్టాలనూ, సమస్యలనూ చిత్రించే చిత్రం ఇంతవరకూ తెలుగులో వచ్చిన వాస్తవిక చిత్రాలన్నిటిలోనూ మధ్యతరగతివారినీ, ఆ తరగతిలో ఉండి చితికిపోయిన వారినీ, మేధావుల తెగకు చెందినవారినే చిత్రించారు కాని ఈ చిత్రంలో సమస్యగల పాత్రలన్నీ ఫక్తు కష్టజీవులు వీరికి గల ఘర్షణ అంతా జీవితంలోనే

వానలులేక భూవములు బీడుపడిపోగా అసంఖ్యాకులైన కూలిజనం పొట్టలు చేతబట్టుకుపోతూ వుంటే నారాయణ అనేవాడు (నాగేశ్వరావు) కూడా వారివెంట బయలుదేరి వస్తాడు దారిలో తండ్రి పడిపోతాడు ఒంటరిగాడైన నారాయణ బ్రతుకు తెరువు సంపాదించు

కునే యత్నంచేస్తూ ఒకచోట ఆకలికి సొమ్మసిల్లుతాడు రంగన్న అనే ముసలి రిక్షావాడు (పొలడుగు సుబ్బారావు) నారాయణను చూసి తన ఇంటికిచేర్చి ఇంత గంజిపోస్తాడు అతనే నారాయణకు ఒక రిక్షా కూడా అద్దెకు ఇప్పిస్తాడు రిక్షామీదవచ్చే సంపాదనలో కొంత భాగం రిక్షాల యజమాని కెందుకు పోవాలనే ఉద్దేశంతో నారాయణ రాత్రింబగళ్లు ఒళ్ళు హూనం చేసుకుని, డబ్బుచేర్చి సొంతరిక్షా కొనుక్కునే ఉద్దేశంతో తన సంపాదన మిగులు యావత్తూ రిక్షాయజమాని అయిన ధర్మయ్య (ఆర్ నాగేశ్వరావు) దగ్గరే దాచిపెడతాడు సొంత రిక్షాతో వచ్చే సంపాదన యావత్తూ తానే ఖర్చు చేసుకోవచ్చుననీ, రంగన్న కూతురు కమల (జమున) ను పెళ్ళాడ వచ్చుననీ, కమల తమ్ముడు రాముణ్ణి (సుధాకర్) చదివించవచ్చుననీ పగటి కలలు కంటాడు అయిదు నెలలు కష్టపడి దాదాపు నూట యాభై రూపాయలు కూడబెట్టినాక నారాయణ డబ్బు అడగబోయేసరికి, నారాయణ ఆడబ్బుతో సొంతరిక్షా కొనబోతున్నాడని తెలిసి ధర్మయ్య దుర్బుద్ధిలోపడి అది కాస్త అపహరించటానికి ఎత్తు వేస్తాడు , అందరు రిక్షావాళ్లూ సొంతరిక్షాలు కొనుక్కొంటే తాను కూడ రిక్షా లాగవలసి రావచ్చునన్న లోభం ధర్మయ్యచేత ఈ నీచం చేయిస్తుంది

నారాయణకు జరిగిన అన్యాయం తెలియగానే మిగిలిన రిక్షావాళ్ళు ధర్మయ్య ఇంటిమీద పడతారు ధర్మయ్య పోలీసులను రప్పిస్తాడు నారాయణ తనసొమ్ము ధర్మయ్య అపహరించినట్టు నిరూపించలేకపోయాడు నిరుపేదకు సాక్ష్యం ఏముంటుంది? తనకు జరిగిన అన్యాయాన్ని సరిచేసుకోవటానికి మార్గాంతరంలేక నారాయణ ఆ రాత్రి ధర్మయ్య ఇంటికివెళ్ళి బీరువాతెరచి అందులోనుంచి తనసొమ్ము లెక్కపెట్టి పుచ్చుకొని బయటికి పోబోతూ పట్టుబడి చోరీనేరానికి రెండు నెలలు జైలుకు పోతాడు

కమలతండ్రి మంచాన పడతాడు రాముడు బూట్ పాలీష్‌లో రెండణాలు సంపాదించు కునే వాడు, కారుకిందపడి ఆస్పత్రి చేరుకుంటాడు రిక్షావాళ్ళను కొల్లగొట్టే బుల్‌బుల్ అనే వీధి మనిషి (సురభి బాలసరస్వతి) ధర్మయ్యదగ్గరికి వెళ్ళి అడిగితే డబ్బిస్తాడని కమలని ప్రోత్సహిస్తుంది తండ్రి ప్రాణమూ, తమ్ముడిప్రాణమూ ఆడబ్బు మీదే ఆధారపడి ఉండటం మూలాన కమల ధర్మయ్య దగ్గరికి పోతుంది ధర్మయ్య కమలను వలలో వేసుకుందామనే అనుకుంటాడు గాని సమయానికి ఖాసి అనే రిక్షావాడు (ఎ శేషగిరి) అక్కడికి రావటంచేత ఉదారంగా కమలకు పదిరూపాయలిచ్చి పంపుతాడు ఈ డబ్బుతో కమల తండ్రికి పళ్ళూ అవి కొనుక్కుని యింటికిపోయే సరికి తండ్రి ఆమె శీలాన్ని శంకించి ఆవేశం తెచ్చుకుని అట్లాగే మరణిస్తాడు మొదటి నుంచీ నారాయణమీద ఒక కన్ను వేసి ఉన్న బుల్‌బుల్ కమల శీలం గురించి అనుమానాలు గూడెంలో ప్రచారం చేస్తుంది తనకు వచ్చిన కష్టాల మీద ఆ అవమానాన్ని భరించలేక కమల రైలు కిందపడి ఆత్మహత్య చేసుకుందామని యత్నిస్తుంది కానిజైలునుంచి తిరిగివచ్చిన నారాయణ సమయానికి ఆమెను కాపాడతాడు ఎండి మోడైపోయిన నారాయణ జీవితంలో మళ్ళా చిన్న చిగురు కనిపిస్తుంది ఆస్పత్రిలోనుంచి ఒకే కాలుతో బైటికివచ్చే రాముడు, తనమీద కారు తోలిన ధర్మాత్ముడు పరిహారంగా ఇచ్చిన మూడు వందలూ నారాయణ జీవితానికి దోహదంగా ఇచ్చేస్తాడు నారాయణ పగటి కలలు చావు తప్పికన్నులొట్టబోయినాక వాస్తవరూపం ధరిస్తాయి అతను స్వంతరిక్షాతో ఇంటికి చేరుకుంటాడు

వస్తుతహా కథ చాలా కొద్దిపాటిదైనప్పటికీ నిరుపేద పాత్రల జీవితాలలో చిన్న చిన్న విషయాలకుగల ప్రాముఖ్యాన్ని వ్యక్తంచేయటానికి కృషిజరిగింది ఇద్దరు రిక్షావాళ్ళు అన్నం ముగ్గురు పంచుకోవటమూ, నారాయణ రంగన్న కుటుంబంలో కలసిపోయి తన తిండి ఖర్చు తానే భరిస్తూ కూడా తన పగటికలల్లో కమల గాజులూ, తమ్ముడి చదువూ, కమల తండ్రి మందూ కలుపుకోవటమూ, రాముడు సినిమా చూడటానికీ, ఐస్‌క్రీం తినటానికీ తాపత్రయపడటమూ, గుడిదగ్గర రాముడూ, వాడి స్నేహితుడు బోడిగాడూ ఆడుకోవటానికి ప్రయత్నించటమూ, రాముడు ఆస్పత్రిలో ఉంటే రిక్షావాళ్ళంతా తమ టీ డబ్బులు చందావేసుకోవటమూ, నారాయణ కమలల మూగప్రణయం మొదలైనవి కథలోకి చాలా సహజంగా తీసుకురాబడి, పాత్రలకూ, కథకూ నిండుతనాన్ని తెచ్చాయి

రిక్షావాళ్ళ జీవితం తాలూకు డాక్యుమెంటరీ లాంటి ఈ కథలో బోలెడంత 'డ్రామా' ప్రవేశపెట్టటమేగాక, వాస్తవ చిత్రణవెంట ఎన్నోచోట్ల భావచిత్రణకున్నూ అవకాశం ఇచ్చారు రూపాయిల నృత్యమూ, నారాయణకలా, నారాయణడబ్బు ఎగవేసే ముందు ధర్మయ్యకుకలిగే ఆలోచనా సమగ్రంగా చూపించబడ్డాయి

కథలో ఆకర్షవంతమైన సెట్టింగులకుగాని, ఉల్లాసంగొలిపే పాటలకుగాని, వినోదకరమైన నృత్యాలకుగాని ఆస్కారంలేదు వాటికొరకు నిర్మాతలు యత్నించ లేదుకూడా ప్రత్యగాత్మగారి కథా, తాతినేనివారి కథనమూ, దర్శకత్వమూ, రంగాగారి ఫొటోగ్రఫీ ఒకదాని కొకటి బాగాతోడై చిత్రానికి బలంకూర్చాయి చిత్రంలో ముఖ్యపాత్రలు ధరించిన నాగేశ్వరరావు, జమున, పాలడుగు సుబ్బారావు, శేషగిరి, సుధాకర్, ఆర్ నాగేశ్వరరావు, చదలవాడ కుటుంబ రావు, సురభి బాలసరస్వతి తమ పాత్రలకు జీవంపోశారు మిగిలిన నటులుకూడా సహజంగా నటించారు

చిత్రంలో బాక్సాఫీస్ దర్జీకొలతలూ, పడికట్టురాళ్ళూ చాలా తక్కువ అయినప్పటికీ, ఇతివృత్తంలో మన సినిమాప్రేక్షకులకు కొంత నూతనత్వమూ, కథలో ప్రేక్షకుల సానుభూతిని సంపాదించుకునే గుణమూ ఉన్నాయి బ్రహ్మరాక్షసుడులాంటి విలన్ కూడా కథలో లేడు ధర్మయ్య చేసే దుర్మార్గంలో ఒకపాలు ఆత్మరక్షణ కూడా ఉండటంవల్ల కేవలం కర్కోటకం అనిపించదు నిరుపేదలకు వ్యక్తులకన్న పరిస్థితులే ఎక్కువ ఎదురన్నది ఈ చిత్రం బాగా వ్యక్తంచేస్తుంది దీన్ని తెలుగు సినిమా ప్రేక్షకులు చక్కగా ఆదరిస్తారని ఆశిస్తాం

'నిరుపేదలు' చిత్రాన్ని సెన్సార్ చెయ్యటంలో జరిగిన కత్తిరింపుల ఫలితంగా 1018 అడుగుల చిత్రం ఎత్తివేయవలసి వచ్చిందట ఒక షాట్‌లో ఇంగ్లీషు భాషలో ''కీప్ లెఫ్టు'' అని ఉంచబడినట్రాఫిక్ సంకేతాన్ని సెన్సార్ అధికారి తీసివేయించారట కారణం వామపక్షాలను బలపరచవలసిందిగా ప్రజలను ఆ సంకేతం ఉద్బోధిస్తుందని!

నూటికి పదిమంది అక్షరాస్యులుగల ఈ దేశంలో ఇంగ్లీషులో రాసి ఉన్న ట్రాఫిక్ సంకేతంద్వారా వామపక్ష రాజకీయ ప్రచారం జరుగుతుందనుకునేవాళ్ళు నీడలు చూసి దడుచుకునే వాళ్ళయి ఉండాలి అదీకాక ఈ దేశంలో వామపక్ష ప్రచారం చేసుకోవటానికిగాని, వామ పక్షాలను బలపరచమని అడగటానికిగాని చట్ట రీత్యా అవరోధాలేమీ లేవు

*తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 5-3-1954*

# 29. పెద్దమనుషులు

ఈయేడు విడుదల అవుతున్న 6వ తెలుగు చిత్రం, 5వ సాంఘిక చిత్రం వాహినీ వారి 'పెద్దమనుషులు' ఇది కె వి రెడ్డిగారి మొదటి సాంఘిక చిత్రం ఇతివృత్తాలలో 'పెద్దమనుషుల' కూ, సారథీవారి 'అంతా మనవాళ్ళే!' కీ కొద్దిపాటి పోలిక ఉంది రెంటిలోనూ సంఘాన్ని పీక్కుతినే పెద్దల చతుష్టయం ఉంది, వాటిని పత్రికద్వారా ప్రతిఘటించటం ఉంది, ఇలాంటి పెద్దలను దుయ్యబట్టటమే రెండు చిత్రాల ఆశయమూనూ, అయితే ఈ ఆశయాన్ని సాధించే విధానంలో రెండు చిత్రాలకూ చాలావ్యత్యాసం ఉంది

'అంతా మనవాళ్ళే!' లో పెద్దవాళ్ళ దౌష్ట్యానికన్నా వారి దోపిడికి గురి అయినవారి బాధలకు ప్రాముఖ్యం ఇవ్వబడింది బాధితుల ప్రతినిధిగా కథానాయకుడు ప్రతీకారం కోసం యత్నించి పెద్దలను జైలుకు పంపిస్తాడు 'పెద్దమనుషులు' లో ఇది లేనేలేదు ఇందులో కూడా రామదాసు కుంటుంబం పెద్దమనుషుల దౌష్ట్యానికి గురి అవుతుంది కాని ఇది పరిస్థితుల ప్రభావంవల్ల ఏర్పడినది పెద్దమనుషుల నిజస్వరూపం బయటపడటానికి రామదాసు గీటురాయిలా పని చేస్తాడు ఈపాత్ర నిర్వచించటానికి అతను సరి అయిన వ్యక్తి కూడా ఏమంటే అతను ధర్మం పాటించేవాడు, మనుషులలో ఉత్తమ లక్షణాలైన అణకువా, తోటి మానవులపట్ల ఆదరమూ, చేసిన మేలును ఇనుమిక్కిగా భావించి మరిచిపోలేని కృతజ్ఞతా, సంఘశ్రేయస్సుకు తోడ్పడేవారిపట్ల అంతులేని విశ్వాసమూ అతనిలో ఉన్నాయి చైర్మన్ ధర్మారావు నిజంగానే పెద్దమనిషి అనినమ్మి, తనకు ఆయనచేసిన మేలునుబట్టి ఆయనకు కృతజ్ఞుడై ఉండి ఆయనచేసిన హత్యనుకూడా ఉదార బుద్ధితో వీక్షించి ఆ హత్యానేరాన్ని తనమీదవేసు కుంటాడు జైలు నుంచి తిరిగివచ్చాక పెద్దమనుషుల గురించి అతనికి కనువిప్పుకలుగుతుంది చైర్మన్ గారు హత్యానేరానికి అరెస్టయితే సంఘానికి నష్టం జరుగుతుందని నమ్మి మొదట్లో హత్యానేరం తనపైన వేసుకున్న రామదాసు, ఇప్పుడు సంఘంమేలుకోరే పెద్దమనుషుల నిజస్వరూపాలను బయపెడతాడు కాని పెద్దమనుష్యులకు ప్రాయశ్చిత్తం దీనివల్ల కలగదు వారిదోపిడికి గురి అయిన చైర్మన్ తమ్ముడూ, చెల్లెలూ, ఊరిప్రజలూ వేలెత్తి వారిని పట్టిగ్గా విమర్శించరు రహస్యంగా గోతులు తవ్వేపెద్ద మనుషులు తాము తవ్వే గోతిలో తామే పడిపోతారు దైవికంగా జరిగే ఈ సంఘటనలో సాంఘికచైతన్యం ఏమీలేదు, వారి దురాశ యొక్క పరిణామం మాత్రమే ఉంది

పెద్దవాళ్ళు చేసే దురన్యాయాలకు ప్రేరణలు ధనాశా, ధనంతో సంపాదించగల కీర్తి అని ఈ చిత్రం వ్యక్తంచేస్తుంది, ఈ రెండూ సుఖజీవనానికి తోడ్పడేవిగా చూపడంలేదు అంతులేని ధనమూ, కీర్తీ గల చైర్మన్ ఇంటికి వచ్చినప్పుడల్లా చీదరించుకుంటాడు ''బయట పల్లకీల మోతకోసమే ఇంట్లో ఈగలమోతా!'' అంటాడు బయట పల్లకీల మోత కోసమే ఇంట్లో ఈగలమోత తెచ్చిపెట్టుకున్నానన్న జ్ఞానం చైర్మెన్ ప్రదర్శించాడు ఇంట్లో తన తమ్ముడితో, చెల్లెలితో, కొడుకుతో, భార్యతో తనకుండదగిన మానవ సంబంధాలను ధ్వంసం చేసుకున్నాడు ఈయన సంసారం, ఎట్టిప్రేమప్రదర్శనలూ లేకపోయినా, చాలా ముచ్చటగా కనిపిస్తుంది

వస్తుతహా చైర్మన్ మిగిలిన పెద్దమనుషులంత దుర్మార్గుడు కాకపోవచ్చు తనజీవితంలో

ఉండదగినవి కొన్ని లేవన్న జ్ఞానమైనా అతనికుంది రామదాసుకు కనువిప్పుచెయ్యటంలో గల ఇబ్బంది మిగిలిన వాళ్ళకన్న అతను బాగా గ్రహిస్తాడు చివరకైనా అతను తన దుర్మార్గం ఒప్పుకుంటాడు ఇటువంటి వాడుకూడా తాను అనుసరించిన పంథానుబట్టి మిగిలినవాళ్ళకన్న చాలా హెచ్చు దుర్మార్గం – హత్యతో సహా – చేస్తాడు ఈ చైర్మెన్ అసలయిన ''పెద్దమనిషి'' మిగిలినవాళ్ళు ఇతని అండన పెద్దమనుషులైనవారు, ఇతను లేకపోతే వాళ్ళు అంత పైకిరాలేరు వాళ్ళు చేసేసంఘద్రోహం కూడా పరిమితంగా ఉంటుంది అందుకే వాళ్ళు తమకుతామై చైర్మెన్ గారికి ముడుపులు చెల్లించుకుంటారు అందుచేత చిత్రంలో పేరుకు నలుగురు పెద్దమనుషులున్న ప్పటికీ మూలవిరాట్టు ఒకడే అతని నగ్నస్వరూపమే మనకు మరింత స్పష్టంగా చూపబడింది

నినాదాలూ, ఉపన్యాసాలూ లేకుండానే ఈ చిత్రం సంఘంలోని కుళ్ళునూ, సంఘ శత్రువుల ప్రేరణలనూ చక్కగా వ్యక్తంచేస్తుంది వ్యక్తుల మంచిచెడ్డలకూ వారిసాంఘికాశయాల కూ చాలా దగ్గరసంబంధం ఉంది ఈ చిత్రంలోని మంచి పాత్రలు తిక్కశంకరయ్యా, రామదాసూ, రామదాసు కూతురూ, చైర్మన్ కొడుకూ – ఇతరుల మేలుకోరేవారే

చిత్రంలో నరసరాజుగారి సంభాషణలు ధ్వనితో కూడి ఉన్నాయి, సహజంగానూ, పాత్రలకు అనుగుణంగాను ఉన్నాయి సినిమా సంభాషణలను దక్షతతో రాయగలవారు కొద్దిమంది మాత్రమే ఉన్నారు నరసరాజుగారు కూడా వారిలో ఒకరని ఈ చిత్రం రుజువు చేస్తోంది 'నందామయా', 'గణనాధా' పాటలను కొసరాజువారు చాలాఘాటుగా రాశారు ఈ చిత్రంలోని గొప్ప ఆకర్షణలలో ఇదొకటి మిగిలిన పాటలుకూడా బాగానే ఉన్నాయి ఒక్క డాన్సు పాటతప్ప మిగిలినవేవీ కధకు అసందర్భంగా లేవు పాటలసంగీతమూ, నేపధ్యసంగీతమూకూడా దేశవాళీగా, ప్రజారంజకంగా ఉంది

చిన్న పిల్లలుకూడా కధను అర్థంచేసుకునేటట్టు, విషయంలో ఉన్న వ్యంగ్యం పెద్దలు అర్థంచేసుకునేటట్టూ కె వి రెడ్డిగారు చిత్రాన్ని నడిపించి తమకు గల పూర్వఖ్యాతిని మరోసారి బలపరుచుకున్నారు కొండారెడ్డిగారి ఫోటోగ్రఫీ చాలా తృప్తికరంగా ఉంది రాత్రిదృశ్యాలు చాలా సహజంగా ఉన్నాయి

నటులలో రేలంగీ, వంగరా, కుటుంబరావూ, లింగమూర్తీ తమపాత్రలను చాలానేర్పుతో నిర్వహించారు శ్రీరంజనీ, పద్మావతీదేవీ, శేషమాంబా, ఎ వి సుబ్బారావు, రామచంద్రకాశ్యప మొదలైన వారు తమ పాత్రలను చాలా సులువుగా నిర్వహించారు చైర్మన్ పాత్ర ధరించిన జంధ్యాల వారిలో నటనకన్న ఆత్మనిగ్రహం ఎక్కువగాకనిపించింది ఆయన వాచికంకూడా అట్లాగే ఉంది గొప్ప వ్యక్తుల ఇతిహాసాలూ, జానపదకధలూ చిత్రీకరించటంలో అసమాన ప్రతిభ చూపుతూ వచ్చిన కె వి రెడ్డిగారు, ఈనాడు అధిక సంఖ్యలో తయారయే సాంఘిక చిత్ర నిర్మాణంలోకూడా ఘటికులనిపించుకున్నారు ఇది చాలా గొప్ప విషయం 'పెద్దమనుషులు' చిత్రాన్ని ప్రేక్షకలోకం బాగా ఆదరించి తీరుతుంది

*తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 12–3–1954*

# 30: తోడు దొంగలు

నేషనల్ ఆర్ట్ థియేటర్‌వారి తొలిచిత్రం 'తోడుదొంగలు' ఈ నెల 12 తేది సాయంకాలం వాహినీస్టూడియోలో ప్రివ్యూ చూపించారు ఈ రోజుల్లో అనేక చిత్రాలు పత్రికలవారు చూడకుండానే విడుదల అవుతున్నాయి కొద్దిచిత్రాలను విడుదల అనంతరం చూపుతున్నారు కొన్నిటిని అసలు పత్రికలవారికి చూపటమేలేదు అటువంటి సందర్భంలో 'తోడు దొంగలు' చిత్రం విడుదలకుముందే పత్రికలవారి ఎదటికి రావటం నిర్మాతల ఆత్మవిశ్వాసాన్ని సూచిస్తోంది వారి ఆత్మవిశ్వాసాన్ని చిత్రం సమర్థించగలిగి ఉంది కూడానూ

'తోడుదొంగలు' కథ చాలా సరళమైనది అన్నపూర్ణా రైస్‌మిల్స్ యజమానీ, మేనేజరూ తోడుదొంగలు ఒకనాడు రాముడనే పనివాడు మిల్లుకప్పుమీద బల్బు పెడుతూ ఎలెక్ట్రిక్‌షాక్ తగిలి కిందపడి మరణిస్తాడు తోడుదొంగలు గుట్టుచప్పుడుకాకుండా వాడి శవాన్ని కారులోతీసుకుపోయి కొండకింద పడేసి ఏమీ ఎరుగనట్టు వచ్చేస్తారు దీనిమూలంగా మేనేజరు పరమేశంకి గుండెజబ్బు పట్టుకుంటుంది చచ్చిన రాముడు పరమేశం అంతరాత్మను పీడించసాగాడు వైద్యులనూ, జ్యోతిష్కులనూ సంప్రతించి తాను ఒక్క నెలపైన జీవించనని తెలుసుకుని పరమేశం పట్టణం వెళ్ళివినోదంగా బతకాలని చూస్తాడు కాని అక్కడా రాముడు దయ్యమైపట్టి నానాబాధలూ పెడతాడు పట్నంలో ఉండగా పరమేశానికి ఒక ఆదర్శప్రాయుడైన మేనేజరూ, సుఖంగా బతుకుతున్న కార్మికుడూ తటస్థపడతారు యీ అనుభవంతో గుణపాఠం నేర్చుకుని పరమేశం తన యజమానిచేత రాముడి భార్యాబిడ్డలకు రెండువేలు పరిహారం ఇప్పిస్తాడు దీనిమూలంగా పరమేశం గుండె "గుండులాగా" తయారవుతుంది కార్మికులలో ఆయన పలుకుబడి హెచ్చుతుంది ఈ పరిణామాలు తనకు నచ్చకపోయినా వాటిని అడ్డే తాహతులేక మిల్లుయజమాని తాళపుచెవులను పరమేశానికి ఇచ్చేస్తాడు

ఇది ప్రబోధనాత్మకమైన నీతికథలాటిది యిందులో రాముడు పరమేశం అంతరాత్మను పట్టి పీడించటమూ, దీనిమూలంగా అతని నరాలు "తుక్కుతుక్కు" అయిపోయి అతని జీవిత ప్రమాణానికి నెలరోజులు గడువు ఏర్పడటమూ, అతను పట్నంలో ఒక ఆదర్శప్రాయుడైన మిల్లుయజమానినిచూచి తద్వారా స్వస్వరూపజ్ఞానం పొందడమూ, కలలో అతనికి నరకం కనిపించటమూ, తిరిగి అతను రాముడి కుటుంబానికి మేలుచేయగానే వ్యాధియావత్తూ పోవటమూ మొదలైన ముఖ్యకథాంశాలన్నీకూడా ప్రబోధన కొరకు సృష్టించబడినవే ఈ చిత్రంలో, యజమానులకూ, కార్మికులకూ ఉండే సంబంధాలు నైతికదృష్టితో చిత్రించబడ్డాయి కనుకనే పరమేశం అంతరాత్మకు అంత ప్రాముఖ్యం దోపిడీచేసే వర్గంలో ప్రతి ఒక్కడికీ అంతరాత్మ ఉంటుందని ఈచిత్రం చెప్పదు అలాంటి అంతరాత్మ లేనివాడు ఫ్యాక్టరీ యజమాని ఈ చిత్రంలోనే ఉన్నాడు

నైతికదృష్టి ప్రధానంగా పెట్టుకుని తీసినప్పటికీ ఈ చిత్రంలో వర్గపోరాటాన్ని బొత్తిగా తోసి పారెయ్యలేదు ఆఖరున పరమేశాన్ని తిరిగి మేనేజరుగా పెట్టుకోవటానికి యజమాని నిరాకరించినప్పుడు పనివాళ్ళు సమ్మెచేస్తామని బెదరిస్తారు దానితో యజమాని లొంగిపోతాడు

అంతవరకు కార్మికుల చేతిలో సమ్మె అనేది బలవత్తరమైన ఆయుధంగానే చూపబడింది ఐనా వర్గసామరస్యం ఆదర్శంగా పెట్టుకున్నందువల్ల కాబోలు ఈ చిత్రంలో కార్మికుల చైతన్యానికి ఇంతకన్న ప్రాముఖ్యం చూపలేదు (ఉదాహరణకు, పరమేశం పట్నంలో ఉన్న కాలంలో సరిఅయిన 'నాయకత్వం' లేక యజమాని ఫాక్టరీని తలకిందులు చేసుకుని కార్మికులతో ఘర్షణలుపడి ఉండవచ్చు ఈ యజమాని గండకత్తెరలను ఎదుర్కోవటంలో ఏమంత సమర్థుడు గా చూపబడలేదు దీనితోబాటు అతను 'అంతరాత్మ' లేనివాడు కూడా గనక వర్గసంఘర్షణ ఏర్పడటానికి ఎటువంటి అభ్యంతరమూ లేదు )

చిత్రంలో కథ చాలాసాఫీగా నడుస్తుంది ఏ దృశ్యం కూడా అవసరాన్ని మించి సాగినట్టు గా ఉండదు కొన్ని దృశ్యాలు కథనానికి అవసరమైన మటుకే ఉంచబడ్డాయి ఇందువల్ల చిత్రం నిడివి హద్దుల్లో ఉండిపోతోంది కథ వేగంగా గడిచింది

ఈ చిత్రంలో ఉన్నది వాస్తవంగా ఒకేఒక పాత్ర – పరమేశం ఈపాత్ర గురించే మిగిలిన పాత్రలన్నీ ఆయా సందర్భాలలో ఆయా సన్నివేశాలకు వాతావరణంగా ఉపయోగపడతాయి రైస్‌మిల్లులో యజమాని, ఇంటిదగ్గర భార్య, పట్నంలో సుఖజీవనం గడిపే కార్మికుడూ అతని ఇల్లాలు, ఇత్యాది ఉపపాత్రలన్నీ కథకు ఎంచుకోబడ్డాయి

పరమేశం పాత్ర చాలా శ్రద్ధగా తీర్చిదిద్దినట్టు కనిపిస్తుంది ఈ పాత్రలో ముఖ్యమైన విషయం అంతస్సంఘర్షణ స్థూలంగా చూస్తే పరమేశం అంతరాత్మ రాముడి దుర్మరణంతోనే తిరుగుబాటు చేసినట్టు కనిపిస్తుంది కానివాస్తవంగా అది మొదటి నుంచి పనిచేస్తూనే ఉంది ఆ అంతరాత్మ ప్రభోధంతోనే తన యజమాని లాభాలకు కుక్కల్లాగా కాపలాకాస్తూ అతని వ్యవహారాలు నైపుణ్యంతో పట్టుకొచ్చాడు ఈ ప్రయత్నంలోనే కార్మికులకు అన్యాయం చెయ్యటానికి పరమేశం వెనుకాడక పోయింది క్రూరత్వం వల్లకాదు ప్రమాదవశాత్తూ రాముడు చనిపోయినపుడు ఏ మానవుడికి అయినా ఎంత సంభ్రమం కలుగుతుందో పరమేశానికి కూడా అంతా కలుగుతుంది కాని ఆక్షణంలోనే అతనికి ఈ చావు వల్ల మిల్లుదార్లకు కలిగే బాధల్నీ, నష్టాన్నీ మాత్రమే ఆలోచించి వాటినుంచి తప్పుకొనే ఉపాయం అమలు చేస్తుంది అతని అంతరాత్మ ఒకసారి రాముడి మరణం గురించిన అపాయం నుంచి తానూ, తన యజమాని తప్పుకున్నాక పరమేశం అంతరాత్మ తిరుగుబాటు స్వభావాన్ని ప్రకటిస్తుంది ఈ మార్పుకు సాక్ష్యం గా ఆ సాయంకాలం ఆ ఇంటి ఛాయలకు వస్తాడు మొగుడుపోయి ఏడుస్తున్న రాముడి భార్యనూ బిడ్డలనూ చూస్తాడు ఇంటికి పోతాడు బట్టలైనా విప్పకుండా భోజనం అయినా చేయకుండా పడుకుంటాడు షాక్ తగిలి కిందపడి గిలగిలా తన్నుకునే రాముడు కలలోకి వస్తాడు పరమేశం జీవితంలో తుఫాను రేపుతాడు తన అంతరాత్మనుంచి పారిపోదామని చేసే ప్రయత్నాలూ, వేసే వేషాలూ ఫలించకపోగా ప్రేక్షకుడికి జాలి కలిగిస్తాయి ఈ ప్రయత్నం నుంచి విరమించుకుని పరమేశం ఇంటికి తిరిగివచ్చి రాముడి కుటుంబానికి న్యాయం చేసిన మరుక్షణం నుంచి పరమేశం పాత్ర హాస్యపాత్రగా పరిణమించింది. పరమేశంలోని అంతస్సంఘర్షణ అంతం కాగానే ఆ పాత్రలో మార్పు చాలా నేర్పుతో చిత్రించబడింది ఈ మార్పు సంభాషణల ద్వారానూ, నటనద్వారానూ కూడా వ్యక్తం చేయబడింది

మిగిలిన పాత్రలలో అత్యంత వాస్తవికంగా నటించినపాత్ర మిల్లుయజమానిది ఇతని లో అంతరాత్మ అనేది ఏకోశానా లేకపోవటం మినహాగా ఇంకో లోపం కనపడదు స్వార్ధం తప్ప మరొకటి చేతకాదు తోడుదొంగలులో ఇతను జూనియర్ పార్ట్‌నర్ ఇతనిలో ఒక విధమైన అమాయకత్వం ఉంది పరమేశం పాత్ర ఎన్ టి రామారావు ఎంత సామర్ధ్యంతో పోషించాడో, యజమాని పాత్రను గుమ్మడి వెంకటేశ్వరరావు అంత సామర్ధ్యంతోనూ పోషించాడని చెప్పాలి

పరమేశం భార్యా పుత్రులుగా హేమలతా, చలం స్వభావసిద్ధంగా నటించారు రాముడుగా మద్దాలి కృష్ణ మూర్తి , రాముడు భార్యగా కమలాదేవీ, పట్నంలో కార్మికుడుగా పుండరీ కాక్షయ్యా, డాక్టరుగా శివరామకృష్ణయ్య తదితరులూ తమ పాత్రలను చక్కగానే నిర్వహించారు

కథా, డైరక్షన్ యోగానంద్ కావటంచేత కథకీ , డైరెక్షనుకీ మధ్య ఎక్కడా ఘర్షణ కనిపించదు జూనియర్ సముద్రాలగారి సంభాషణలు, చిత్రం రక్తికట్టడానికి అపారంగా తోడ్పడ్డాయి కొన్నిచోట్ల రహమాన్ గారి ఫోటోగ్రఫీ చిత్రానికి జీవం పోసింది పరమేశం పట్నం వచ్చినప్పటి టాక్సీ షాట్స్ పరమేశం ప్రాణానికి పట్నం ఎట్లా కనిపించిందో చిత్రించటానికి చాలా బాగా తోడ్పడ్డాయి స్వర్గ నరకాలను కెమెరా కొత్తరకంగా చిత్రించింది పరమేశం చచ్చిపోవటానికిముందు వెనక వరండాలో కార్మికులు భజన చేస్తూంటే మెరుపులూ, గాలి చక్కని వాతావరణాన్ని కలిగించాయి చిత్రంలోని పాటలు కథకు అనుకూలంగానే ఉన్నాయి రాజాగారి సంగీతం ఇంపుగా ఉంది దేవలోకంలో భరతనాట్యాలు చాలా బాగున్నాయి డాన్స్ మాస్టార్ హీరాలాల్ అభినందనీయుడు

మొత్తం మీద 'తోడు దొంగలు' ఆనందించదగిన చిత్రం కథా వస్తువు సర్వసామాన్యమైనది గా కనిపిస్తున్నా కొత్తదనం కలిగి ఉంది కథలో కరుణ హాస్యాలు ఉన్నాయి ఈ కారణాలచేత ఇది సులభంగా ప్రజాదరణ సంపాదించ కలుగుతుందని, ఆర్ధికంగా విజయవంతం అవుతుంద నీ ఆశిస్తున్నాం

*తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 23-4-1954*

# 31. మనోహర

ఈయేడు విడుదలయిన అన్ని చిత్రాలకన్న 'మనోహర' బాగా నడుస్తున్నట్లు కనిపిస్తున్నది ఏ చిత్రమైనా ప్రజాదరణను అధికంగా పొందినప్పుడు అందులో ప్రేక్షకులను ఆకర్షించే అంశాలేవా అని వితర్కించటం రివాజు ఎందుకంటే బాగాపోయే చిత్రాన్ని సరిగా 'ఎనలైజ్' చేసినట్టయితే ప్రజల అభిరుచులు ఏ స్థాయిలో ఉన్నదీ తెలుస్తుంది, ప్రజలను మెప్పించే చిత్రాలు మరికొన్ని తీయటానికి అవకాశంకూడా దొరుకుతుంది ( అది లేనప్పుడు, కథలో ఇల్లాలు అవ్వగారిని చూసి గారెలు చెయ్యటం నేర్చుకుందామని, ఆవిడ మంగలిని పిలిచి తల తీయించుకున్న పద్ధతికి దిగుతుంది )

మామూలుగా డబ్బు తెచ్చే చిత్రాలలో ఉండాలని భావించే హాస్యం ఇందులో లేదు హాస్యంకోసం పెట్టిన సన్నివేశాలు కూడా ఏమంత హాస్యంగా లేవు ప్రజలకు విజ్ఞానాన్ని కలిగించే

చిత్రాలలో ఉండవలసిన వాస్తవికత కూడా 'మనోహర' చిత్రంలో లేదు కథకు ఆధారభూతంగా ఉన్న 'సెంటిమెంట్స్' నిత్యజీవితానికి సంబంధించినవి కావు రాజా ఉంపుడుగత్తెను ఉంచుకున్నాడని రాణి 18 ఏళ్ల పాటు అతని మొహం చూడదు, తల్లి కత్తి దూయవద్దన్నదని కొడుకు, యువరాజా, ప్రాణాలు పోగొట్టుకోవటానికి సిద్ధపడతాడు

కథనంలో అసందర్భాలు చాలా ఉన్నాయి 18ఏళ్ళ పాటు రాజాగారి పక్కన సింహాసనంమీద రాణిగాని, ఉంపుడుగత్తెగాని కూచోలేదని మనం భావించాలి! యువరాజును చంపించదలచిన ఉంపుడుగత్తె అయితే, రాజా యుద్ధానికివెళ్లేదాకా చూస్తూ ఊరుకుని అప్పుడు హంతకుణ్ణి నియోగిస్తుంది! తన భార్య తన మంత్రితో వ్యభిచరించిందని నమ్మిన రాజా భార్యను ఖైదు చేయించి మంత్రిని ఉపేక్షించి ఊరుకుంటాడు! ఏనాడైనా గడ్డాలు పెట్టుకుని తన యోధులతో రాజ్యంలోకి ప్రవేశించగల ఉంపుడుగత్తె ప్రియుడు ఆఖరుకుగాని ఈపని చేయడు ఒక్క ముక్కలో చెప్పాలంటే, 'మనోహర' చిత్రంలో సన్నివేశాలకోసం కథ నడుస్తుంది గాని కథ నడవటం కోసం సన్నివేశాలు ఏర్పడవు ప్రేక్షకులను ఈవిషయం ఏమంత బాధిస్తున్నట్టు కనబడదు రాజాగారి ఉంపుడుగత్తెమూలంగా కలిగిన అరాచక పరిస్థితి రాజకుటుంబాన్ని తప్పప్రజలను ఏ మాత్రంకూడా బాధించినట్టు ఈచిత్రంలో చూపబడలేదు దానికి కూడా ప్రేక్షకులు అభ్యంతరం చెప్పటంలేదు

'అబ్బో, ప్రేక్షకులు వెనకటిలాగా కాదు, బాగా తెలివిమీరిపోయారు చిత్రాలను భలే విమర్శిస్తున్నారు', అని అందరం అనుకుంటున్నాం 'మనోహర' చిత్రం దీన్ని రుజువు చెయ్యటం లేదు చిన్న పిల్లలచేత కూడా వాళ్ళ కిష్టంలేని వస్తువు తినిపించలేం అవి తినకుండా ఉండటానికి వాళ్ళు బోలెడన్ని కారణాలు చెబుతారు – అది విమర్శకాదు సినిమా ప్రేక్షకులు తమకునచ్చిన చిత్రాన్ని చూసేటప్పుడు అందులో ఉండే లోపాలను విమర్శించలేరన్నది రూఢి అవుతున్నది

ఈ చిత్రం ప్రజాదరణ పొందటానికి కారణం సినిమా ప్రేక్షకుల విమర్శనాశక్తి కాదు, వారిలో గొప్పగా అభివృద్ధిచెందిన అభిరుచికాదు, చిత్రంలో గల గొప్ప వినోద విజ్ఞానాలూ కావు ఈచిత్రానికంతకూ పెద్ద ఆకర్షణ శివాజీ గణేశన్ ధరించిన యువరాజా పాత్ర గొలుసులతో బంధించిన సింహంలాగా, అవకాశం దొరికితే అన్యాయం మీదికి లంఘించి దాన్ని రూపు మాపటానికి గిలగిలా తన్నుకునే ఈ యువకపాత్ర మన ప్రేక్షకులకు గొప్ప సంతృప్తిని ఇవ్వగలిగి ఉన్నది చైతన్య ప్రదర్శనకు తహతహలాడే దేశంలోని యువకశక్తుల కీపాత్ర ప్రతిబింబమనటానికి ఎటువంటి సందేహమూలేదు

చిత్రంలో రెండో ఆకర్షణ ఉద్రేకపూరిత సంభాషణలు, చైతన్యానికి దారితీసే ఉపన్యాసాలు చాలా ఏళ్లుగా మన ప్రజల చైతన్యాన్ని అణగదొక్కే ధర్మపన్నాలు మాత్రమే విని ఉన్నారు మనోహరుడు దర్బారులోచేసే ఉపన్యాసాలు ఎంత ''స్టేజీగా'' ఉన్నా వాటిలో ఎంత ఊకదంపుడు ఉన్నా, అటువంటి సంభాషణల కోసం చవిచచ్చివున్న మన ప్రేక్షకులు అదివిని తన్మయత్వం చెందుతున్నారు

చిత్రాన్ని ప్రేక్షకులకు ఆకర్షవంతంగా చెయ్యటానికి మరొక విషయం తోడ్పడి ఉండవచ్చు ఉంపుడు గత్తెపై రాజాకు గల వ్యామోహమూ, రాజాపై రాణికి గల పతిభక్తీ, రాజకుమారుడి

న్యాయతృష్ణా, ఉంపుడుగత్తెకుగల రాజ్యకాంక్షా మొదలైనవి దేనికది నమ్మేటట్టు నిరూపించ బడలేదు కాని ఈవిధ మైన పాత్రల ఆశయాల మధ్యగల సంఘర్షణ బలంగాచూపబడింది చిత్రంలో ముఖ్య సన్నివేశాలన్నీ ఇటువంటి సంఘర్షణలతో కూడుకున్నవి కావటం చేత చిత్రం మొదటి నుంచి చివరిదాకా ప్రేక్షకులను పట్టేస్తుంది పాత్ర పోషణ కోసం వందలూ వేలూ అడుగుల చిత్రం వ్యర్థం చేసి కథలో సంఘర్షణ తగ్గించుకోవటం కంటె ఎటువంటి కుత్రిమ పాత్ర పోషణనైనా సంఘర్షణకు వినియోగ పరుచుకోవటం ఫలప్రదంగా కనిపిస్తుంది ఈ పని చేయటం వల్ల 'మనోహర' రచయిత బోలెడంత కథను చిత్రంలో ఇరికించగలిగాడు ఎన్నోపాత్రలకు ప్రాముఖ్యం ఇవ్వగలిడు

వస్తుతహ 'మనోహర' స్టంటు చిత్రం అన్నది కూడా గమనించదగిన విషయం ఇందులో ఒక అదృశ్యవ్యక్తి, కథానాయకుడు గొలుసులు తెంచటమూ, అదే కథానాయకుడు చంకలో పిల్లను పట్టుకొని కత్తియుద్ధాలు చేయటమూ, ఎగరటమూ, దూకటమూ, దారుణహత్యలూ అంతకన్నా దారుణ హత్యా ప్రయత్నాలు మొదలైనవి చిత్రాన్ని స్టంటుచిత్రంగా తయారు చేసాయి అయితే కేవలము స్టంటు చిత్రం మాత్రమే కాదు దీనితో పాటు ప్రజలు అర్థం చేసుకోగల అనేక ఆదర్శాలు కూడా ఉన్నాయి ఈ కలగలుపు లాభసాటిగా కనిపిస్తుంది అచ్చమైన తెలుగు చిత్రాన్ని ప్రజలు చూస్తారుగాని కొంచెం ఆదర్శాల రుద్దుడు ఉంటే ఇంకా ఎక్కువమంది చూస్తారు

ఇంకొక సంగతికూడా జ్ఞాపకం వుంచుకోవాలి అదేమిటంటే 'మనోహర' చిత్రం ఇతర విధాల నిండైన చిత్రం అందులో తెలివైన డైరక్షను ఉన్నది, చక్కని ఫోటోగ్రఫీ, సెట్టింగులు, సౌండు రికార్డింగూ సంగీతము మొదలగు హంగులు ఉన్నాయి వీటిలో లోపం కనిపించినట్లయితే ప్రేక్షకులు బహుశా ఈ చిత్రాన్ని ఇంతగా ఆదరించి ఉండరు చిత్రం విజయవంతంగా నడవడానికి ప్రొడక్షన్ విలువలు అవసరం లేదనుకోరాదు

కథా, పాత్ర పోషణా, సన్నివేశాల కూర్పు వీటిలోనే 'మనోహర్' కొత్త పంథా తొక్కుతున్నది మిగిలిన విషయాలలో ఇది కూడా ఖరీదైన ఇతర చిత్రాల వంటిదే నిర్మాతలు ప్రేక్షక హృదయం గురించి యీ చిత్రం ద్వారా కొత్తవిషయాలు నేర్చుకోదలచినా కథకు సంబంధించిన వరకే నేర్చుకోవాలి

*తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 2-7-1954*

గృహప్రవేశం

సాక్షి

శంకరాభరణం

1979 నవంబరు 25న తెనాలి క్లాసిక్ ఫిలిం సొసైటీ వారు శ్రీశ్రీ, కొడవటిగంటి కుటుంబరావులను సన్మానించినప్పటి చిత్రం

# 32. పరివర్తన

జనతావారి 'పరివర్తన' పినిశెట్టిగారి 'అన్నా చెల్లెలు' నాటకం ఆధారంతో తయారుచేసిన చిత్రం ఆ నాటకం ఆంధ్రలో అనేకచోట్ల విజయవంతంగా ప్రదర్శించబడింది ప్రేక్షకులను నమ్మకంగా కదిలించగల నాటకపు ఆయువు పట్టులు కొన్ని ఇందులో ఉన్నాయి

నాట్యంలో నృత్తంలాగా, సంగీతంలో వర్ణాలలాగా, పద్యాలలో భావకవిత్వంలాగా నాటకాలలో ఒక తరగతి నాటకాలు ఇతివృత్తంతో ప్రమేయం లేకుండా కేవలం నడకనుబట్టి రక్తి కడతాయనిపిస్తుంది 'పరివర్తన' లోని నాటకం ఆతరగతికి చెందినదిగా కనిపిస్తుంది

ఈచిత్రంలోని కథలో చెప్పుకోదగిన ప్రత్యేకత ఏమీలేదు ఇది వాస్తవ జీవితాన్ని కూడా అంత సూటిగా ప్రతిబింబించదు ఆదర్శ ప్రాయుడనదగిన జమీందారు ఒకాయన సంతానం లేక అన్నదాన సమాజంలోఉండే ఒక అనాథ శిశువును పెంచుకుంటాడు ఈ కుర్రవాడు, ఆనందరావు (ఎన్ టి రామారావు) పెరిగి పెద్దవాడై పట్నంలో చదువు సంధ్యలు పూర్తిచేసి తిరిగి వచ్చేదాకా ఎస్టేటు మేనేజరు రామయ్య ( దొరస్వామి) జమీందారుగారి ఆస్థిని చూస్తూ, నలుగురికీ ఉపకారం చేస్తూ, ఆస్థిని అభివృద్ధి కూడా చేస్తాడు ఆనందరావు ఇంటికి వచ్చాక ఆస్థినప్ప జెప్పుకుని రామయ్య-సంపాదించుకున్న కీర్తినిచూసి అసూయాగ్రస్తుడవుతాడు అతన్ని రెచ్చగొట్టటానికి ఇద్దరు క్షుద్రులు – సోడాకొట్టు చలపతీ ( రమణా రెడ్డి ) బతికి చెడ్డ పిచ్చయ్యా (చదలవాడ కుటుంబరావు) – గాదెకింది పందికొక్కుల్లాగా ఆనందరావు దగ్గిరచేరి రామయ్య కుటుంబానికి ఎసరు పెడతారు రామయ్య అన్నదాన సమాజానికి చందాలిచ్చేవాడు, ఎస్టేటునౌకర్లకు బోనసులిచ్చేవాడు ఆనందరావు అవన్నీమాన్పించటమేగాక రామయ్య కొడుకు సత్యం (ఎ నాగేశ్వరరావు) పైచదువుకు డబ్బు సహాయం చేయనిరాకరిస్తాడు, రామయ్యను అవమానిస్తాడు మనోవ్యాధితో తండ్రిమంచానపడగా సత్యం ఉద్యోగం కోసం తిరిగి ఆఖరుకు బస్సు కండక్టరు పని సంపాదించుకుని ఆవేషంలో ఇంటికివస్తాడు కలెక్టరు వేషంలో కొడుకును చూద్దామనుకున్న రామయ్య కండక్టరు వేషంలో చూడగానే గుండెపగిలి చస్తాడు తరువాత ఆనందరావు బస్సును కొనేసి సత్యానికి ఆకండక్టరుపనికూడా లేకుండా చేస్తాడు సత్యమూ, అతని చెల్లెలు సుందరమ్మా (సావిత్రి) అతని తమ్ముడూ ( జూనియర్ నాగేశ్వరావు ) తిండికి కూడా లేక బాధపడతారు ఈ స్థితిలో చలపతి సుందరమ్మను అవమానిస్తాడు ఇదివిని సత్యం చలపతినికొట్టి జైలుకు పోతాడు ఆనందరావు రామయ్య ఇంటిని స్వాధీనపరుచుకుని సుందరమ్మనూ, ఆమె తమ్ముణ్ణీ బయిటికి పంపిస్తాడు తమ్ముడు దారితప్పిపోగా సుందరమ్మ అన్నదాన సమాజంచేరి దాన్ని నిర్వహించే సంజీవయ్య ( మిక్కిలినేని) అండన జీవిస్తూంటుంది రామయ్య కుటుంబాన్ని విచ్ఛిత్తి చేశాక చలపతీ, పిచ్చయ్యాచేరి ఆనందరావుకే ఎసరు పెడతారు ఆనందరావు దత్తుపత్రం చలపతి కాజేసి పిచ్చయ్యదగ్గర దాస్తాడు ఆనందరావు ఆస్థిని వారసులు స్వాధీన పరుచుకుంటారు ఆనందరావుకూడా అన్నదానసమాజం చేరతాడు అక్కడ అతనికీ, సుందరమ్మకూ మధ్య అనురాగం ఏర్పడుతుంది సత్యం జైలునుంచి తిరిగి వస్తాడు పిచ్చయ్యవద్దవున్న దత్తుపత్రం సత్యం సంపాదించి ఆనందరావుకిస్తాడు ఆనందరావు తన యావదాస్థినీ అన్నదాన సమాజానికి ఇచ్చేసి పరివర్తన ప్రకటిస్తాడు అతనికీ సుందరమ్మకూ

వివాహం జరుగుతుంది

హృదయ పరివర్తన పొందిన జమీందార్లూ, ఆదర్శాలను నమ్ముకుని దెబ్బతిన్నవాళ్ళూ అన్నదాన సమాజాలకు చేరుకోవటమూ, ఎస్టేటు ఆస్తులు అటువంటి సంస్థలకు చెందటమూ ఒక విధమైన సాంఘిక పరిణామం అనుకోటానికి ఎట్టి ఆధారమూ లేదు రామయ్య జీవితమంతా ఒక జమీందారు ఆస్తికి కుక్క కావలికాయటానికి అంకితమయింది, ''నువ్వు అన్నదాన సమాజంనుంచే వచ్చావు'' అని చెబితే ఆనందరావు ఎక్కడ నొచ్చుకుపోతాడో అని రామయ్య ఆనందరావు ఇవ్వబోయిన సొమ్ముకూడా నిరాకరించి ఇంటికి వచ్చి తాను మంచం ఎక్కడమేగాక తన పిల్లలను భ్రష్టుల్ని చేస్తాడు ఈ రామయ్య పాత్ర ఒక ఆదర్శపాత్రగా ఈకథలో చూపబడింది తిరిగి చిత్రం ఆఖరులో సత్యంకూడా జమీందారు ఆస్తికి తన ప్రాణాలు అడ్డం వెయ్యటానికి సిద్ధపడతాడు! కథలోగల ఇటువంటి అంశాలను సమర్థించటం అసాధ్యం

కాని ఈ చిత్రంలోని సన్నివేశాలు తప్పుగా ఉన్నచోటకూడా బలంగా ఉన్నాయి ప్రేక్షకులను అవే కదిలిస్తాయి ముఖ్యంగా ఆనందరావు దగ్గరికి సత్యంవచ్చే దృశ్యమూ, సుందరమ్మవచ్చే దృశ్యమూ ప్రేక్షకులకు తృప్తినిస్తాయి పిచ్చయ్య కూతురు( బాలసరస్వతి) సత్యానికి తన ప్రేమ వ్యక్తంచేసే దృశ్యమూ, ఆనందరావు ఆస్తికాజేసే చలపతి ( కోడూరు అచ్చయ్య) పిచ్చయ్యా ఒకరినొకరు మోసం చేసుకునే దృశ్యమూ ప్రేక్షకులను ఆనందపరుస్తాయి

ఈ చిత్రంలో పాత్రల ప్రదర్శన చాలావిజయవంతంగా సాగిందనిచెప్పొచ్చు మచ్చుకైనా తొస్సుపోయిన పాత్రలేదు పాత్రలకు నిండుతనం కేవలం కథను బట్టేగాక డైరెక్షనులో కూడా సాధించబడింది చిన్న జమీందారు ఆనందరావులో ఇతరుల కీర్తి ప్రతిష్ఠలపట్ల అసహనమూ, తాను ద్వేషించేవారి పట్ల విడవని పగా , తన దృష్టిలోనే క్షుద్రులుగా కనిపించే వారిని చుట్టూ చేర్చుకునే మనస్తత్వమూ, వారి చెప్పుడు మాటలు వినే దౌర్బల్యమూ చాలా చక్కగా చిత్రించబడ్డాయి

పై రెండూ నాయక, ఉపనాయక పాత్రలై నప్పటికీ వాటికన్న ప్రేక్షకులను బలంగా అకర్షించే పాత్రలు పిచ్చయ్యా, చలపతీ అడుగడుగునా చిత్రంలో రక్తిసాధించటానికి ఈ పాత్రలు చాలా బాగా తోడ్పడతాయి అటువంటి వ్యక్తుల్ని జీవితంలో ఒక్కక్షణం భరించలేం ఆక్షణానికి ఏమీ భంగంరాకుండా, ఆ పాత్రలను చూసి జుగుప్సపడటమే ఒక ఆనందకరమైన అనుభూతిగా ప్రేక్షకుడికి ఉండేటట్టు ఆ పాత్రలను సృష్టించారు సుబ్బులు పాత్రకూడా అటువంటిదే

డైరెక్టరు తాతినేనిగారు ప్రేక్షకుల సంతృప్తికోసం ఈ చిత్రంలో పూర్వం ఎన్నడూ పడనంత శ్రమపడ్డట్టు కనిపిస్తుంది ఈ శ్రమకు ప్రతిఫలం ఉంటుందనటానికి ఎటువంటి సందేహమూ లేదు

నటులలో ఎన్ టి రామారావు, నాగేశ్వరరావు, చదలవాడ, రమణారెడ్డి, దొరస్వామి చాలా సమర్థతో తమ పాత్రలను పోషించారు సావిత్రీ, బాలసరస్వతీ, జూనియర్ నాగేశ్వరరావు, మిక్కిలినేని, జమీందారు నౌకరుగా నటించిన పెరుమాళ్ళూ, బొమ్మలమ్మేవాడుగా నటించిన రామకోటీ తదితరులూ కూడా బాగానే నటించారు

అనిసెట్టిగారి పాటలన్నీ బాగానే ఉన్నాయి ''నందారే'' పాటా, పేకముక్కలడాన్సూ, జైలు ఖైదీల పాటా, ప్రేక్షకులను అపారంగా ఆకర్షించగలవు మోహనదాసు చలపతిరావుగార్ల

సంగీతం చాలా తృప్తికరంగా ఉంది

జనతా పిక్చర్ కొత్త సంస్థఅయినప్పటికీ వారి ఈ తొలిచిత్రంలో భారీయత్నం కనిపిస్తుంది ఇదేవిధంగా ఈసంస్థ బలమైన చిత్రాలను తీయగలదని ఆశించవచ్చు

*తెలుగు స్వతంత్ర, వారపత్రిక 3-9-1954*

# 33. అమర సందేశం

ఒక ప్రణయకథా, రెండు సంగీత కళాసిద్ధాంతాలూ, కొన్ని ఆధునిక అభ్యుదయ నినాదాలూ, కొద్ది వాస్తవికతా, కొంత గారడీ, కొంత స్వకపోలకల్పనా, కొంత అనుకరణా, కొన్ని పాటలూ, కొంత హిందుస్తానీ సంగీతమూ, కొన్ని నృత్యాలూ కలగలిపి సాహిణీవారు మొట్టమొదటిగా తయారుచేసిన తెలుగుచిత్రం 'అమరసందేశం' ఇన్ని అంశాలూ కలిపి ఒక పాకంలోకి లాగగలిగితే ఎలా ఉండేదో చెప్పలేం ఈ అంశాలు చివరిదాకా దేనికదిగా ఉండి పోవటంచేత ఈ చిత్రం యొక్క బాగోగులు నిర్ణయించాలంటే అందులో చేరిన వివిధఅంశాల మంచిచెడ్డలు నిర్ణయించి వెరసి ఏమవుతుందో చూసుకోవలసిందే

ఉదాహరణకి నృత్యాలు – అన్నీపద్మినివే – చాలాబాగున్నాయి, సంగీతం కొన్నిచోట్ల చాలా బాగుంది, మరికొన్నిచోట్ల అంతరక్తిగాలేదు ప్రణయకథ అంతగా రక్తికట్టలేదు స్వకపోల కల్పనగా ఉన్న కథాభాగం బాగులేదు ఈ విధంగా చూసుకుపోవలిసి రావటంచేత ఏ ఇద్దరికీ ఈ చిత్రం ఒకే విధంగా ఉండకపోవచ్చు ప్రజల అభిరుచులకు ఇదొక అగ్నిపరీక్షలాటిది

చిత్రం అరంభం కావటం ఏ హాలీవుడ్ పిక్చరో అన్నట్టుగా భారీసెట్టింగులతో, కామెంటరీతో గంభీరంగా ఆరంభమవుతుంది ఈ కామెంటరీలోనే విక్రమ దేవరాయలవారి కళానిరతి గురించి, శారదా పీఠంయొక్క స్థితినిగురించీ ప్రేక్షకులు ప్రధానాంశాలు తెలుసుకుంటారు శారదాపీఠం నుంచి సుధాకరసూరి నిష్క్రమణచాలా ఉదాత్తంగా చిత్రించబడింది ఇక్కడినుండీ కథ ఆరంభమవుంది సుధాకరసూరి ఇంటికి వచ్చేదారిలో విద్యానాథ్ అనే గాయకయువకుణ్ణి కలుసుకుని ఇంటికి తీసుకురావటమూ, అతను సంగీతం నేర్చుకోవటమూ, అతనికీ సుధాకరసూరి మనుమరాలు శారదకూ మధ్యప్రణయం పెరగటమూ, వాళ్ళిద్దరికీ వివాహం జరగటమూ ముసలాయన విద్యానాథ్‌మీద శారదాపీఠం అధిష్టించే భారంపెట్టి కళ్ళు మూయటమూ, తనమీది మోహంచేత భర్త సంగీతాన్ని తృణీకరిస్తున్నాడని గ్రహించి శారద చచ్చిపోయినట్టు నటించడమూ, ఆమెకోసం పిచ్చివాడై విద్యానాథ్ చెట్లవెంటా, గుట్టలవెంటా పడిపోవటమూదాకా కథ వేగంగా, పొంకంగా, సహజంగా నడిచింది

ఆ తరవాత కథే చెట్టులూ, గుట్టలూ పట్టినట్టయింది విద్యానాథ్ సంగీతం గారడీ ఆరంభమవుతుంది పాడుపడిన దేవాలయంలో అతనిపాటకు శారదాదేవి ప్రత్యక్షమవుతుంది (ముందుజరిగిన కథలో అతనిపాటకు ఎటువంటి ప్రభావమూలేదు ) ఆతరవాత విరిగిపోయిన రాజనర్తకికాలు పాటతో బాగయిపోతుంది శారదాపీఠం విద్యానాథ్‌ని ఎక్కనిస్తుంది అతను పాడుతుంటే వినేవారికి మైకం వచ్చేస్తుంది ( దొంగలుమాత్రం ఏ కారణచేతో ఈ మైకానికి గురికారు ) శారదాదేవిని సాక్షాత్కరింపజేసిన ఆ సంగీతం రాజనర్తకి మెళ్ళోని రత్నహారం కాజెయ్యటానికి మంచిసాధనంగా పనికివస్తుంది! మరికొంత గ్రంథంనడిచాక ఈ సంగీతమే

రాజ్యంలో క్షామాలకు దారితీసినట్టు కూడా మనం తెలుసుకుంటాం ( శ్రీ విక్రమ దేవరాయల పరిపాలనలో చెరువులూ, బావులూ మొదలైనవాటికి రాజు పూడిక తీయిస్తేకద్దు, లేకపోతేలేదు! రైతులు కేవలం నిస్సహాయులు )

పోయినకొద్దీకథ ఇంకా అయోమయంలో పడిపోయింది రాజనర్తకి రత్నహారంతోబాటు శారదకూడా బయట పడుతుంది శారదను చూసి తన్మయుడైన విద్యానాథుడు తనకొడుకును చూడగానే ఆమె శీలాన్ని శంకిస్తాడు ఇద్దరికీ విడాకులవుతాయి శారద తనయింటికి తిరిగివచ్చి కొడుక్కు మట్టిబొమ్మచేత సంగీతం నేర్పిస్తుంది వాడు తన తండ్రి ఎవరో ఎరగకుండా పెరుగుతాడు వాడు –సుధ – ఒకనాడు విద్యానాథుడిపాట వినటానికి బయలుదేరి మధ్యదారిలో అయాచితంగా లభించిన విప్లవానికి నాయకత్వం వహించి, బీదనీ బిక్కినీ వెంటవేసుకుపోయి రాజగృహం ప్రవేశించి విద్యానాథుడు పాడేది పాటేకాదని ఆరోపణ చేస్తాడు ఇద్దరికీ పాటకుస్తీ పెడతారు

ఈ కుస్తీ జరిగేదాకా పాటయొక్క గొప్పతనానికి ప్రమాణం శారదాదేవిగానే ఉంటూ వచ్చింది కాని తండ్రీకొడుకుల పాటలో ఎవరిది మైకం కలిగించేదో, ఎవరిది ప్రజలను చైతన్యవంతులను చేసేదో తేల్చటానికి శారదాదేవి పనికిరాలేదు, స్ఫటికంముక్క అవసరమయింది! అంతతో పోయిందా! లేదు పూర్వం విద్యానాథుడికి శారదాదేవి ఇచ్చిన యోగ్యతా పత్రాన్ని స్ఫటికంముక్క రద్దుచేసేసింది! రద్దుచెయ్యనిచ్చాడు కథకుడు

సంగీత ప్రధానమయిన ఈ చిత్రంలో ఈ పాటకుస్తీ ఒకటిపెట్టి, సంగీతంగురించి నిర్మాతలకుగల ఉద్దేశమే తారుమారు చేసేసుకున్నారు, ఈ పోటీ సంగీతం గురించి జరిగినదైనట్ట యితే సంగీతానికి శిలలు కరగటమో మండటమో పరీక్షపెట్టవచ్చు కాని సంగీతంలో అభ్యుదయ అనాభ్యుదయ విభజన తెచ్చారు ఈ విచక్షణాజ్ఞానం శిలలకుండటం దురూహ్యం పైగా పోటీలో పాల్గొన్న సంగీత యోధులు తమతమ ఆదర్శాల వ్యత్యాసాన్ని నిరూపించుకున్నది మాటలలోగాని పాటలలోకాదు ''రాగభావమున పశువులు శిశువులు పాములు పరవశమొందాలి'' అన్నాడు తండ్రి ''జీవగాన చైతన్యవంతమై భావవేగమున జనగణమనముల ఉడుకునెత్తురే పొంగాలి'' అన్నాడు కొడుకు పాటమటుకు ఇద్దరిదీఒకేబాణిలో–అదైనాఅంత గొప్పబాణీ కాదు– నడిచింది తీరా శిల మాటలకు కరిగి మండినట్టుంది గాని పాటకుకాదు ఒకవేళ పాటకే కరిగి మండితే కొడుకు తండ్రిని మించి గాయకుడని ఋజువయింది తప్ప, కొడుకు చెప్పిన సంగీతప్రయోజనం తండ్రిచెప్పినదానికన్న ఉత్తమమైనదని రుజువుకాలేదు 'అమర సందేశం' కథలో సగంనుంచీ ప్రవేశించిన అయోమయం ఈ ఇమిటేషన్ పాటకుస్తీతో పరాకాష్ఠనందుకున్నది!

ఈ కథలో ఇన్ని అంశాలు ప్రవేశపెట్టి ఏ ఒక్కదానికీ న్యాయం చేకూర్చలేక పోయారు నిర్మాతలు అచ్చంగా సంగీత ప్రధాన చిత్రంగా చూసినట్టయితే ఇందులోని సంగీతం అవసరమైనచోట్ల తగినంత ఉన్నతంగా రాలేకపోయింది విద్యానాథ్‌ను శారదాపీఠం ఎక్కించిన సరిగమ పదనిసల పద్యంగాని, సంగీతపోటీ పాటగాని, రాజనర్తకి కాలు సరిచేసిన ''ఆనతికావలెనా'' అన్న పాటగాని ఉండతగినంత ఉదాత్తంగాలేవు రాజాగొంతులో మాధుర్యమూ, లాలిత్యమూ ఉన్నాయిగాని బలమూ, నిండూ లేవు పాటనేర్చుకునే దశలో విద్యానాథ్ పాడిన ''దయామయి శారదా'' అన్న పాట (శ్రీనివాస్ పాడినట్టున్నది) పై పాటలకన్న

చాలా గంభీరంగా ఉంది శారదా పీఠం ఎక్కడానికి అనర్హుడుగా భావించబడిన సూరి పాడిన శ్లోకాలు కూడా చాలాగంభీరంగా ఉన్నాయి ''మధురం మధురం'' అనేపాట బృందగానానికి శక్తిగా ఉన్నా, దానిలోకూడా బరువు లేకపోవటం కనిపిస్తోంది

మిగిలిన పాటలలో శారద పాత్రకు జిక్కీ పాడిన పాటలుకూడా నప్పలేదు శారద పాత్రలో ఉన్న హుందా శారద నోటపలికిన పాటలలో లేదు అంతకంటె రాజనర్తకి పాడిన ''దిగులు మానరా స్వామీ, బిగువువీడరా!'' అన్నది చాలా నిండుగా ఉంది ''ఏలుకొనుము జగదంబా'' అనేపాట ( భజగోవిందం పాత్రకి మాధవపెద్ది సత్యంఫ్లేబాక్) చాలా రక్తిగా ఉంది బొత్తిగా మాధుర్యమూ, సుఖమూ, నిండూ, లాలిత్యమూ లేని పాట పాణిగ్రాహి సుధ పాత్ర కోసం పాడినది ( ఈ పాటతోనే సుధ తండ్రిని జయించాడు! )

ఈ కధను ప్రణయకధగా తీసుకున్నట్టయితే శారదా విద్యానాధుల ప్రణయానికి న్యాయం చెయ్యటానికిగాను ఇప్పుడు పడిన శ్రమకంటె చాలా హెచ్చు శ్రమపడి ఉండదగును తన భర్త తనపై తప్ప మనస్సును మరి దేనిమీదా కేంద్రీకరించలేకుండా ఉన్నాడంటే శారదకు ఆందోళన మాత్రమే కలుగుతుందా? ఎంత ఆనందం కలగవచ్చు? ఆమెలో ఆందోళనకూ ఆనందానికీగల సంఘర్షణ చిత్రితంకాలేదు అదేవిధంగా చచ్చిపోయిందనుకున్న భార్య తిరిగివచ్చిన ఆనందంలో విద్యానాధుడు ఆమె శీలాన్ని శంకించటానికి ఎంత ఘర్షణపడాలి! ఆమె దోషానికి ఎంత ప్రబల నిదర్శనాలు కావాలి! ఏమిజరిగిందో ఆమెను చెప్పనివ్వనైనా లేదు ఆమె కొడుకు ఎప్పుడు పుట్టాడో తెలుసుకోవటం అసంభవం కాదు ఆ కొడుకు తనకే పుట్టాడన్నది రుజావుకానంత క్లిష్టవిషయంకాదు కాని భార్యను అంతగా ప్రేమించిన విద్యానాధుడు ఏ రుజావూ కోరలేదు ''ఒకసారి చచ్చిపోయినట్టునటించి నన్ను మోసంచేశావు నీమాట నమ్మను'' అనేశాడు, ఆమె బతికివుందని తెలియగానే వచ్చి కౌగిలించుకోబోయిన సంగతి అంతలోనే మరిచిపోయి!

ఈకధలో అన్నిటికన్నా అర్థరహితంగా కృత్రిమంగా కనిపిస్తున్నది— ఆకస్మికంగా ఎవరో ఇరికించినట్టు కనబడే ప్రజలసమస్య ఈ సమస్యతో ప్రజలకు ఆవంత ఉపకారం జరగక పోయినా రాజాపాత్రా, విద్యానాధుడిపాత్రా, సంగీతమూ ఖూనీ కావటం జరిగింది పాటలో గొప్పవాడుగా నిరూపణకావలసిన అర్భకుడికి ప్రజానాయక కిరీటం తగిలించడంజరిగింది అంతా అయిపోయాక రాజుగారిలో కలిగే పరివర్తనా, కుర్రవాడు 'అమరసందేశం' అందజేశాడని నలుగురూ డప్పు వాయించడమూ కేవలం హాస్యాస్పదంగా ఉన్నాయి

సంగీతాన్నీ ప్రజలనూ ముడిపెట్టడానికి ప్రయత్నించగలిగినట్టయితే జానపద సంగీతానికి ఈ చిత్రంలో నిర్మాతలు చోటిచ్చి ఉండవలసింది ప్రజలు పనిచేసుకుంటూ చైతన్యం తెచ్చుకోవటానికి ఉపయోగించేది జానపద సంగీతం అందులో మాటలకు ప్రాధాన్యం ఉన్నది రాళ్లు పగలగొట్టే సంగీతం ''బైజూబావరా'' లోలాగా అచ్చుగా ఆకారంతో నడిచినా నడవవచ్చు అందులో పదభావానికీ పెద్ద స్థానం లేదు

కాని ఒకటి ఒప్పుకోవాలి– ఈలోపాలన్నిటి వెనకా నిర్మాతలు చేసిన పెద్దప్రయత్నం ఒకటి ఉన్నది వారు తమ తొలి చిత్రంలోనే ఇన్ని అంశాలూ ప్రవేశపెట్టటానికి యత్నించక ఏదో ఒక అంశాన్నే పట్టుకుని చిత్రంనిర్మించి ఉంటే ఇన్నిలోపాలు జరగకపోను, అయితే అది ఇంత పెద్ద ప్రయత్నం అనిపించుకోకనూ పోను ఇందులో సగం యత్నంకూడా లేకుండా గొప్ప

చిత్రాలనిపించుకున్నవీ, డబ్బు తెచ్చుకున్నవీ అనేకం లేకపోలేదు సాహిణీవారు చేసిన ఈ ప్రయత్నాన్ని అందరూ కొనియాడి తీరవలసిందే ఈ ప్రయత్నమే నిజంగా ఫలించి ఉంటే 'అమరసందేశం' అమరచిత్రం అయి ఉండును

చిత్రానికి సారథ్యం వహించిన ఆదుర్తివారు చాలా అభినందనీయుడు కథ హైరోడ్డున పోతున్నప్పుడూ మిట్టపల్లాల పడిపోతునప్పుడూ కూడా సారథ్యంలో ఆయన తన చాకచక్యం కనబరిచారు పాత్రపోషణా, సన్నివేశసామరస్యమూ సరిగా ఉన్నట్టయితే ఆయన ప్రతిభ ఈ చిత్రంలో ఇంకా బాగారాణించి ఉండును

రాయ్‌గారి ఫోటోగ్రఫీ, టి ఎస్ క్రిష్ణగారి శబ్దగ్రహణమూ, గొడ్‌గాంకర్ కళా చిత్రం బాగుండటానికి ఎంతగానోతోడ్పడాయి చోప్రా అమర్చి, పద్మిని చేసిన నృత్యాలు చాలా ఆకర్షవంతంగా ఉన్నాయి చిత్రంలోని సంగీతం మామూలు సినిమాపాటల బాణీని జ్ఞాపకం చెయ్యటం లేదన్న కీర్తీ, అక్కడక్కడా 'బైజాబావరా' ను జ్ఞాపకం చేస్తున్నదన్న అపకీర్తికూడా ప్రసాదరావు, కేల్కర్‌గార్లు పంచుకుంటారు

ఈ చిత్రనిర్మాణంలో పాల్గొన్నవారంతా పనిచేసేవారు ఒకరు చేయించారు, ఒకరు చేశారన్న విచక్షణలేదు ఇటువంటివారికి విజయం లభించటంవల్ల పరిశ్రకు లాభం ఉంటుంది అందుచేత ప్రజలు వీరికృషిని ఆదరించటమూ, వీరు తమ తప్పులను తెలుసుకుని వాటిని సవరణ చేసుకోవటమూకూడా అవసరం

సాహిణీవారు ఇదేవిధంగా ప్రయత్నించి ఇంకా మంచి చిత్రాలుతీసి తెలుగుసినిమా పరిశ్రమకు అమూల్యమైన సేవచేస్తారని ఆశించుదాం

*తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 19-11-1954*

# 34. అన్నదాత

అశ్వరాజ్ వారి తొలిచిత్రం 'అన్నదాత' లోని ప్రధాన విషయం భూమికి సంబంధించిన సమస్య బహు ముఖాలు గల ఈ సమస్యకు ఒకవైపున చెమటోడ్చి పనిచెయ్యటానికి సిద్ధంగా ఉన్న పేద రైతులూ, మరొకవైపున రైతులకూ వారి పొలాలకూ మధ్య అడ్డంగా ఉన్న అధికారులూ, ఒకవైపున సముద్రంలో కలిసిపోయే నదీజలాలూ, ఇంకోవైపున ఆ జలం అంటక బీటలువేసే నేలా, కరువులూ, ఆకలి చావులూ, అంతులేని బాధా మొదలైన వన్నీ ఉన్నాయి

బంగారయ్య చదువుకున్న రైతు, ప్రజలకు సన్నిహితుడు, ప్రజల కష్టాలు తనవికాదని అనుకోలేడు కాని అతను భూమికి సంబంధించిన సమస్యను సమగ్రంగా ఒక్కసారిచూడడు ఎక్కడో కాటకం వచ్చి జనం ఆకలితో చస్తున్నారని తెలియగానే వారిని ఆదుకోవాలనే ఆవేశంతో ఊళ్ళో మీటింగు పెడతాడు ఇతరులు తనతో కలిసిరారని అనుమానం తగలగానే, వారితో వాదించే సహనంలేక తనకుగల పొలంకాస్తా అక్కడే తెగనమ్మి గంజి కేంద్రాలు నడవటానికి బయలుదేరుతాడు

గంజి కేంద్రం బంగారయ్యకు కొంత సహనమూ, సమిష్టి కృషియొక్క ఆవశ్యకతా నేర్పినట్టు కనిపిస్తుంది భూమి సమస్యను మరింత లోతుగాకూడా అర్థం చేసుకోగలుగుతాడు నదులకు ఆనకట్టలుకట్టి నదీజలాలను పొలాలకు పారించటానికి, గ్రామాలూ గ్రామాలూ

కలిసి సమిష్టిగా వ్యవసాయంచేసి, పంటలు పండించి ఫలసాయాన్ని సమిష్టిగా అనుభవించటం – అదే బంగారయ్య కన్నకల దీన్ని సఫలం కావించేటందుకు అతను ఆధారపడింది కేవలం ప్రజల ఐకమత్యం మీదా, ప్రజాబలంమీద ఇతర సహాయం వస్తే అతను వద్దనలేదు మహారాజా వద్దకు పోయి 'శాసనం' తెచ్చాడు, ఆర్థికసహాయం స్వీకరించాడు కాని ఉద్యమం మట్టుకు పూర్తిగా ప్రజలది

ఒకప్పుడు తన గ్రామంవాళ్ళను తనవెంట తీసుకురాలేకపోయిన బంగారయ్య చివరకు అన్ని గ్రామాలవాళ్లను తన నాయకత్వం కింద యెట్లా నడిపించగలిగాడు? మొదట్లో బంగారయ్య కాటకంగురించి తనగ్రామంలోవారిని హెచ్చరించినపుడు, తనవెంట నడవటంలోవారికి లాభించేదేమిటో చూపలేకపోయినాడు నిజం చెప్పొద్దూ తన కీర్తి దాహంకోసం తోటివారిని త్యాగం చెయ్యమంటున్నాడా అన్నట్టు కూడా కనబడ్డాడు కాని నాయకత్వంలో పరిణతి పొందిన బంగారయ్య అన్ని ప్రశ్నలకూ సమాధానం చెప్పగలిగాడు గ్రామస్థులు శిస్తులివ్వలేదని వారి యిళ్లూ వాకిళ్ళూ, పొలాలూ జప్తు చేసే రాణేదారులతో, ''పంట పండించ నివ్వండి, శిస్తులు కడతారు'' అన్నాడు ఆ గ్రామంవారి పోరాటంలో జయం సాధించి తద్వారా ఆ గ్రామ ప్రజలను ఏకం చెయ్యగలిగాడు మరి మిగిలిన గ్రామాలను కూడగట్టే దెట్లా? ఒక గ్రామంలో ఫలితాలు కనిపిస్తే మిగిలిన గ్రామాలవారు తమకు తామే వచ్చి కలుస్తారు! చివరకు జరిగేది అదే

ఈ కాలానికితగిన ప్రజానాయకులను సృష్టించటానికి చాలా చిత్రాలలో కృషి జరిగింది ఈ 'అన్నదాత' బంగారయ్య చాలా విజయవంతంగా సరిఅయిన నాయకత్వ సూత్రాలపై సృష్టించిన ప్రజానాయక పాత్రగా కనిపిస్తాడు ఈ పాత్ర సృష్టిలో అసహజత్వంగాని, కృత్రిమత్వంగాని, ఆడంబరత్వంగాని ఏమీలేదు అతను కూడా గొప్ప విప్లవయుతమైన భూసంస్కరణలు గురించీ, ఫలసాయాభివృద్ధి పథకాలను గురించీ, ట్రాక్టర్లను గురించీ మాట్లాడడు, కాని వాటన్నిటికీ అవసరమైన బీజాలు అతను కృషిచేసే విధానంలో—సమిష్టి వ్యవసాయంలో– ఉన్నాయి

ఈ చిత్రంలో ఇంకోసమస్య కూడా బుద్ధి పూర్వకంగా గుప్తంచేయబడింది అది భూస్వాముల సమస్య, చిత్రంలో ఉన్న ఒక్క భూస్వామీ జాతకాల జమీందారు ఆయన కింది అధికారులంతా దుష్టులే అయినా ఈయన మాత్రం బంగారయ్యకు అనుకూలంగానే ప్రవర్తిస్తాడు ఆ తరువాత బంగారయ్యకు కలిగే సమస్యలు కాకతాళీయమైనవి

ఈ జాతకాల జమీందారు భూస్వాములకు సరిఅయిన ప్రతినిధి కాకపోవచ్చుగాని, వారిమీద ఒక చక్కని వ్యాఖ్యానంలాంటివాడు తనది క్షయంపొందే జాతి అని ఆయన ఎరుగును ''వచ్చే జన్మలోనైనా వడిగల ఎద్దుల గట్టుకు మడిదున్నుకు బతికే మామూలురైతుగా'' పుట్టించమని వేణుగోపాలస్వామిని వేడుకొంటాడు తాను ఏ కాగితంమీద సంతకంచేసినా ఎవరో ఒకరికి అన్యాయం జరుగుతుందని ఆయనకు తెలుసు తన పొలాలు ఎంత బీడేసిపోయినా తన దివాణాన్ని మించిన బీడు మరెక్కడా లేదని ఆయన ఎరుగును తన తట్ట తలపాగా, చొక్కాకోటూ, గంతా బొంతా గాడిద బరువూ, తనచుట్టూవున్న నిర్జీవమైన వాతావరణమూ మరిచిపోవటానికని ''జాతకారణ్యం'' ప్రవేశించి అస్తమానమూ మీనమేషాలు లెక్కిస్తూ ఒక ''పిచ్చి''లో కాలం వెళ్ళబుచ్చి చివరకు తన వారసుడుకూడా ఏదోపిచ్చి గలవాడే అయినందుకు

సంతోషిస్తాడు డొక్కలు లాక్కుపోయిన అనాథ ప్రజకు ఏనాటికైనా మోక్షం ఉందిగాని, మూరెడు ఈకతో కూడిన తురాయిగల ఈ జమీందారుకు మోక్షంలేదు ఇది నిజంగా జాలిగొలిపే పాత్ర

ఈ చిత్రంలో నాటకాల నాయుడొక కీలకపాత్ర గుడ్డితనంతో కూడిన దుష్టశక్తి మూర్తీభవించిన పాత్ర ఇది ఇతనికి బుర్ర అనేది లేదు నైతికదృష్టిలేదు అతిక్షుద్రమైన తనవ్యక్తిత్వంలో తనస్వార్థంలో అనుక్షణం ఓలలాడుతూంటాడు ధైర్యసాహసాలు కూడా లేవు నిత్యం తన్నులు తింటూ వడ్డప్పుడు గారెలతట్టలోనూ, లేనప్పుడు మురికి గుంటలలోనూ వడుతుంటాడు ఇతను తనబుద్ధిని ఉపయోగించిచేసే ఒక్కపనీ సానుకూలంకాదు

ఈ నాయుడు బంగారయ్య జీవితానికి చాలా విధాల అడ్డుతగులుతాడు బంగారయ్య భార్య శాంతమీద కన్నువేసి ఆమెకోసం ''కాటకాల నాటకాలు'' ఆడతాడు పోలీసులు వెంటపడ్డప్పుడు శాంత గదిలో ప్రవేశించి ఆమెకూ భర్తకూ ఎడబాటు కలిగిస్తాడు తరవాత తన అనాకారి కూతుర్ని శాంతపిల్ల స్థానంలో ఉంచి శాంత కూతుర్ని తస్కరిస్తాడు చిట్ట చివరలో, ప్రజలు అహోరాత్రాలు కష్టపడి కట్టిన ఆనకట్టను డైనమైట్‌తో పేల్చేటందుకు యత్నం జరగటానికి కూడా కారకుడయేది ఈనాయుడే ఈపాత్రలో గల క్షుద్రత్వం ఎందులో ఉందంటే ఇతను తన స్వార్థంకోసం ఇతరులకు కలిగించే హాని ఇతని స్వార్థంకంటే అనేకవేలరెట్లు విలువైనదిగా ఉంటుంది ఆసంగతి నాయుడుకి తెలిసినట్టు ఏ కోశానా కనబడడు

ఈ చిత్రంలో ప్రధాన పాత్రలన్నీ చాలా సమర్థతతో చిత్రించబడ్డాయి కేవలం ప్రజాహితైషిగా ప్రారంభమై ప్రజానాయకుడుగా పరిణామం పొందబోయే స్థితిలో బంగారయ్య తన భార్యను విడిచేస్తాడు తనకు ప్రియమైన భార్యనూ బిడ్డనూ విడిచిపుచ్చటంవల్ల ఏర్పడిన మనస్థితి అతను ప్రజా నాయకుడుగా పరిణామం చెందటానికి సహాయపడిందనటానకి సందేహంలేదు కాని అంతకంటే ముఖ్యమైనదేమంటే, చిత్రారంభంలో బంగారయ్య క్షణికమైన ఆవేశంలో తనకున్న సర్వస్వమూ తెగనమ్మి ఊరువిడిచి పోవటానికీ, అదేరకమైన ఆవేశంలో అతను తన భార్యనూ, బిడ్డనూ వదిలిపోవటానికీ ఎంతో సామ్యముంది ఈ రెండు సంఘటనలూ అతనిలో రెండురకాల పరిణామాన్ని సాధించటమే కాకుండా వస్తుతహ అతని మనస్తత్వంలో మార్పేమీ లేదని కూడా సూచిస్తాయి తాను తెగనమ్మిన పొలంగురించి చింతించనట్టే తాను విడిచి వచ్చిన భార్యాబిడ్డలను గురించి కూడా అతను చింతించగా మనం చూడం ఇందువల్ల ఈ పాత్ర చాలా వాస్తవికంగా తయారయింది

శాంతకూడా చాలా ఉదారమైన పాత్ర ఆమె గుక్కెడు గంజికోసం గంజి కేంద్రానికి వస్తుంది త్వరలోనే గంజి కేంద్రం నిర్వహణంలోపాల్గొని ఒళ్ళువంచి పనిచేస్తుంది తాను పెరగటం కోసం చదువు నేర్చుకుంటుంది తలవని తలంపుగా బంగారయ్య ప్రేమకి పాత్రురాలై అతనిని వివాహం చేసుకుంటుంది అకారణంగా భర్తలో అనుమానాన్ని రేకెత్తించి అతన్ని పోగొట్టుకున్న క్షణంలోనే భర్తలోని ఉత్తమలక్షణాలు స్మరిస్తుంది '' ఈస్థితిలో ఎవరైనా అలాగే చేస్తారు'', అని భర్తను సమర్థిస్తుంది కూడా తన దుస్థితికి కారకుడైన నాయుణ్ణికూడా పల్లెత్తుమాట అనదు తిరిగి తన భర్త తనకు కనిపించినప్పుడు కూడా, అతను సాగించే మహత్తరమైన ఉద్యమానికీ, తాను అతని చెంతలేక పోవటానికీ గల సంబంధం గ్రహించిన దానిలాగా, అతని కంటపడకుండా

దాక్కుంటుంది!

నాయుడిలో ఉండే నిరర్థకత్వమూ, జాతకాల జమీందారు జాతిలో గల శిథిలత్వమూ కూడా రంగబాబులో ఉన్నాయి వాడిలో ప్రేరణ నాటకాలలో వెకిలి అభినయానికి ప్రేరేపిస్తే విధి వాడినెత్తిన కిరీటం పెడుతుంది పరిగెత్తటానికి రాజలాంఛనాలు అడ్డంగా ఉన్నాయని గ్రహించగానే వాడు వాటిని తీసి అవతల పారేస్తాడు!

ఇతర పాత్రలు – రంగమ్మత్తా, సుబ్బులూ, నల్లపిల్లా, కల్యాణి, కేతన్న మొదలైనవి– బాగానే పోషించబడ్డాయి వీటిలో చాలా చిన్నదైనా మస్తాన్ పాత్ర ఆకర్షణీయమైనది, సజీవమైనది కూడా బంగారయ్య తన పొలం అమ్మిన క్షణంలోనే మస్తాన్ తనజట్కాబండీ అమ్మకానికి పెట్టేసి తన ఉదాత్తతను ప్రదర్శిస్తాడు

ఈ కథా, ఈ పాత్రలూ జతపరిచి అశ్వరాజ్ వారు 'అన్నదాత' తయారు చేయటంలో మొత్తంమీద మంచి చిత్రమే తయారు చేశారని చెప్పాలి కాని కొన్నిలోపాలుకూడా జరిగాయి అనేకచోట్ల సంభాషణలకు ఆధారమూ సంబంధం ఉందన్నట్టు రకరకాల సంభాషణలు వ్యక్తం చేస్తాయి వాటికి చిత్రంలో ఆధారం కనబడదు చిత్రంలో చిల్లరసంఘటనలు అనేకంగా ఉండి ప్రేక్షకుడి దృష్టి ఒక ప్రత్యేక కథాభాగం మీద కేంద్రీకృతం కావటంలేదు అనేకచోట్ల చిన్న చిన్న ఫలితాలు ఆశించి పెద్ద పెద్ద సంఘటనలు పెట్టినట్టు కనిపిస్తుంది – ఉదాహరణకు భార్యాభర్తను విడదీయటానికై గంజికేంద్రం కాలిన అనంతరం బంగారయ్యను ఒంటరిగా అక్కడికి పంపటం, ఆ కేంద్రాన్ని మళ్ళీ పునర్నిర్మించటం వగైరా, మొగుడు తాలూకు భుక్తశేషం భార్యచేత భోజనం పెట్టించటం, శాంతను భర్త అనుమానించేటందుకుగాను చీట్లపేకసీనూ, పోలీసులు రామానాయుణ్ణి తరమటమూ వగైరాలు (నాయుడికి శాంతమీద మోజు ఉండనే ఉంది బంగారయ్య ఊళ్లో లేడనుకుని అతను రాత్రివేళ ఇంటికి వచ్చినా బంగారయ్య అనుమానించడు)

చిత్రంలో కామెరా కదలిక మోతాదు మించివుంది నిజానికి కామెరా కదలికలు అవసరాన్ని బట్టి వినియోగిస్తే కథనానికి ఎంతో తోడ్పడతాయి

చిత్రంలో హాస్యం ఉంది నాటకాలనాయుడు కొంతహాస్యం సృష్టించినదంతా పాత్రతో కలిసివచ్చే హాస్యంకాదు కొంత హాస్యం కృత్రిమంగాకూడా ఉంది, ఇతర చిత్రాలను జ్ఞాపకంచేసే హాస్యమూ, కొన్ని సినిమా చిత్రాలపేర్లు ఏకరువుపెట్టి సాధించిన హాస్యమూ ఈ తరగతికి చెందుతుంది

పాటలలో కొన్ని బాగున్నాయి మరికొన్ని సుమారుగా ఉన్నాయి కొన్ని పాటలకు కూర్చిన మట్లు సందర్భానికీ, పాత్రకూ అనుగుణంగా లేవు 'జయజయవీరా' అని శాంత వేణుగోపాలస్వామి ఎదుట పాడేపాట తాలూకు మట్టు సందర్భశుద్ధిగలదిగా కనబడదు సావిత్రి నాటకంలో పద్యాలు బాగున్నాయి నటులలో నాగేశ్వరరావూ, అంజలీ, రంగారావూ, చలం, డా శివరామకృష్ణయ్య తమ పాత్రలను చక్కగా నిర్వహించి పోషించారు అడుసుమల్లి శేషగిరి, చదలవాడ కుటుంబరావు, కోడూరు అచ్చయ్య సురభికమల, ఛాయాదేవి, అమ్మాజీ, మహంకాళి వెంకయ్య మొదలైనవారి నటనకూడా తృప్తికరంగా ఉంది

'అన్నదాత' ప్రయోజనకరమైన చిత్రం విజయవంతంకాదగిన చిత్రంగూడానూ

*తెలుగుస్వతంత్ర , వారపత్రిక, 24-12-1954*

# 35. విప్రనారాయణ

భరణీవారి 'విప్రనారాయణ' చిత్రానికి హంగులన్నీ బాగానే అమరాయి ఈ కథను ఎవరు తీయదలచినా దేవదేవి పాత్రకు ఈనాటి తారలలో భానుమతే ముందు స్ఫురిస్తుంది భానుమతే దేవదేవి పాత్రధరించింది నాగేశ్వరరావు విషయమే కొందరు సందేహాలు వెలిబుచ్చారు అతనా పాత్రకు పనికేరాడన్నారు కొందరు అటువంటి పాత్రను మోయలేడన్నారు మరికొందరు కాని తీరాచూస్తే అతను ఆ పాత్రకోసం పుట్టినట్టుగా సరిపోయాడు మేకప్ బ్రహ్మాండంగా కుదిరింది విప్రనారాయణలో ఉండవలసిన సాత్వికమూ, భక్తీ నాగేశ్వరరావు బాగా ఒప్పించాడు భానుమతి పక్కన అతను తగినంత పుష్టిగా లేనిమాట నిజమేగాని ఈలోపం 'లైలామజ్నూ' లో ఉంది, 'చక్రపాణి' లోనూ ఉంది భానుమతీ నాగేశ్వర్రావులేనాడూ సరి అయిన జంటకాదు

'విప్రనారాయణ' చిత్రానికి కథరాయాలంటే సముద్రాలకన్న ఎక్కువ అర్హతగల వారెవరూలేరు ఆయనకు వైష్ణవ సంప్రదాయాలు తెలుసు, సాహిత్య పరిజ్ఞానం విశేషంగా ఉంది ఈ చిత్రంలో సెల్వరాజ్ ఫోటోగ్రఫీ, కోటేశ్వరరావు రికార్డింగూకూడా ఎప్పటికన్నా చాలాబాగా ఉన్నాయి భానుమతి నిర్వహించిన నేపథ్య సంగీతం బాగానే ఉన్నప్పటికీ, ఆవిడ పర్యవేక్షణకింద రాజేశ్వరరావు కూర్చిన సంగీతం చాలావరకు శ్రవణానందకరంగా ఉంది, ఈ అంశాలన్నీ కూడా 'విప్రనారాయణ' కు బాగా ఉపయోగించిన విషయాలు వీటికి రామకృష్ణ దర్శకత్వమూ, ఎడిటింగూ తోడ్పడ్డాయి

చిత్రంలో విచారకరమైనదల్లా విప్రనారాయణ పాత్ర ఖూనీ కావటం మహాభారత యుద్ధంలో అభిమన్యుణ్ణి కడతేర్చటానికి ఎంతమంది అతిరథులు చుట్టుముట్టారో, ఈ చిత్రంలో విప్రనారాయణ పాత్రను ఖూనీ చెయ్యటానికి అంతమంది చుట్టుముట్టారు గుండేసి కాల్చిచూపినట్టుగా కాకుండా ఈ పాత్ర స్లోప్రిపరేషన్‌తో చచ్చింది ఇది పెరిగిన విధానం గమనించదగినది ఎందుకంటే చిత్రంలో లోపాలకింద ఎంచదగిన విషయాలన్నా ఈ 'హత్య' తో సన్నిహిత సంబంధం కలవే

విప్రనారాయణ మొట్టమొదట తిన్నపోటు కలంపోటు ఈ విప్రనారాయణ శ్రీరంగ మంతటా పేరుబడిన రంగనాథస్వామి భక్తుడు ఆయన తెచ్చినమాల స్వామివారికి అలంకరించనిదే సేవ ప్రారంభంకాదు అటువంటి మహాభక్తుడు దేవదాసి అయిన దేవదేవి వలలోచిక్కి జారుతాడు, తరవాత విటుడవుతాడు, వేశ్యమాతచేత తీరని పరాభవం పొందుతాడు అతనికి చౌర్యం అంటగడతారు, దర్బారులో విచారణ జరుగుతుంది, దోషిగా నిర్ణయం జరుగుతుంది, అతనిచేతులు ఖండించమని రాజాజ్ఞ జరుగుతుంది – ఇన్ని జరిగినా ఈ పాత్రలో అంతసంఘర్షణ కనబడలేదు మొట్టమొదట ఆలయంలో కనిపించిన విప్రనారాయణే మనకు వేశ్యావాటికలోనూ న్యాయస్థలంలోనూ, వధ్యశాలదగ్గ రా కూడా కనిపిస్తాడు అతని పతనం, అతనిలో జరిగే పరివర్తన, అతనికికలిగిన అనుభవం ప్రేక్షకుడి హృదయం అనుభవించలేకపోతూ వుంది మొదటిసారి దేవదేవి అతని ఆశ్రమానికివచ్చి నమస్కరించినప్పుడు అతను ఏ పరధ్యానంలో చూడకుండా వెళ్లిపోతాడో ఆ పరధ్యానంలోనే అతను తన శిష్యుడు రంగరాజును ఆశ్రమంలో నుంచి వెళ్లిపోనిస్తాడు దేవదేవి వానలో తడుస్తుంది ఎటువంటి కారుణ్యంతోఅతనామెను లోపలికి

తెస్తాడో దాదాపు అలాంటి కారుణ్యంతోనే అతనామెను ఆలింగనం చేసుకుంటాడు కామోద్రేకం కూడా అతని స్తబ్ధత్వాన్ని అట్టే కదిలించినట్టు కనబడదు అతని విరహం ఇంకా వింతగా చిత్రించ బడింది దేవదేవి తల్లినిచూసి వస్తానంటుంది పొమ్మంటాడు ఏమీజరగనట్టు ఆచమనానికి కూచుంటాడు అరచేతిలోని నీళ్ళలో దేవదేవి కనిపిస్తుంది మూట తీసుకొని ఆమెవెంట బయలుదేరుతాడు వేశ్య ఇంట అందరూ తనను గొప్పవాడల్లేచూసి కాళ్లుకడిగి నీళ్ల నెత్తిన చల్లుకుంటే దీనికి నేను తగుదునా, అన్నసంశయం అతనికి కలిగినట్టు కనబడదు వేశ్యమాత బయటికి గెంటిన అనంతరం అతను మండపంలోకూచుని ఆత్మవిమర్శ చేసుకుంటున్నాడా అనిపిస్తుంది గాని అదేమీలేదు అతను దేవదేవి ఇంటికి మచ్చలేని మహాపురుషునిలాగా తిరిగివస్తాడు ఆత్మపరిశోధన ఏ కోశానాలేని ఈ పాత్ర న్యాయస్థానంలో శిక్ష తెలిశాక తాను పతితుడై పోయినట్టు మాట్లాడితే, ''ఇతనికి జ్ఞానోదయం ఎప్పుడయింది?'' అని మనకు ఆశ్చర్యం కలుగుతుంది

విప్రనారాయణ పాత్రను ఖూనీ చెయ్యటానికి రంగరాజు, దేవదేవి పాత్రలను చాలా బాగా ఉపయోగించారు రంగరాజు విప్రనారాయణకన్నా చాలా తక్కువ స్థాయిలో వాడు—పాద రేణువులాంటి వాడు కానీ అతనే దేవదేవిని విప్రనారాయణుడికన్న బాగా అర్థం చేసుకుంటాడు అంతేకాదు రంగరాజు సంభాషణలలో ముందు జరగబోయే విప్రనారాయణ పతనం స్ఫురిస్తూ ఉంటుంది దీనిద్వారా విప్రనాయణ పాత్రకుపెద్దకళంకం ఆపాదించారు

ఇంతకన్న దేవదేవి పాత్ర మరీపెద్ద దెబ్బ తీసింది విప్రనారాయణలో మనం చూస్తామనుకునే అంతస్సంఘర్షణ యావత్తూ దేవదేవిలో చూస్తాం! దేవదేవికి అంతసంఘర్షణ దేనికి? ఆమె విప్రనారాయణున్ని పడగొట్టాలనీ, తనకు జరిగిన అవమానానికి ప్రాయశ్చిత్తం చెయ్యాలనీ అనుకుంది, చేసేసింది కాని ఈ చిత్రంలో మిగిలిన కథయావత్తూ దేవదేవి మీదుగానే నడుస్తుంది విప్రనారాయణ బ్రహ్మచర్యం భంగం చెయ్యగానే దేవదేవికి పశ్చాత్తాపం పట్టుకుంటుంది 'ఒకనైష్ఠికుణ్ణి చెడగొట్టావు' దీనికి ప్రాయశ్చిత్తం అనుభవిస్తావు!' అని అంతరాత్మ చెబుతుంది దేవదేవి పరివర్తన పొందుతుంది విప్రనారాయణుడికి తన శరీరం ద్వారా సుఖమిచ్చి, అతని సాన్నిధ్యంలో తాను తరించుదామని ఆశ్రమంలో ఉండి పోతుంది

ఆశ్రమంలో ఉండిపోయిన దేవదేవిని ఇంటికి రప్పించటానికి అతికీ అతకని సాకులు సృష్టించారు దేవదేవి విప్రనారాయణతో చెప్పకుండా వెళ్ళిపోయినట్టయితే ఆమె కోసం తపించి, వియోగం భరించలేక ఆమెను వెతుక్కుంటూ అతను ఆశ్రమాన్ని విడిచి వెర్రివాడై బయలుదేరటం లో అతని పతనం కనిపించి ఉండేది అదేమీలేదు ప్రేమికులల్లే విప్రనారాయణా దేవదేవీ చెట్టపట్టాలు పట్టుకుని దేవదేవి ఇంటికి వస్తారు!

తరవాత దేవదేవికి తల్లితో సంఘర్షణ ఇల్లు వెళ్ళగొట్టిన విప్రనారాయణ, 'దేవీ దేవీ, దేవ దేవీ!' అని తలుపు కొడుతుంటే, లోపలి గదిలో బందీ అయిన దేవదేవి శోకాలుపెడుతూ 'స్వామీ, స్వామీ!' అని ఏడవటం! దేవదేవి భక్తి'విప్రనారాయణుడి కామాన్ని పూర్తిగా కప్పి పెట్టింది ఈవిధంగా దేవదేవి విప్రనారాయణుల సంబంధం ఉదాత్తత సంపాదించుకోగా, ఆలయంలోని బంగారు పాత్రను స్వామివారే స్వయంగా తెచ్చి వేశ్యమాతకు ఇవ్వగా, ఈ సందర్భంలో రాజభటులు తనను పట్టుకున్నందుకు విప్రనారాయణ తబ్బిబ్బు కావటం సమంజసంగానే ఉందిగాని, న్యాయస్థానంలో విప్రనారాయణ తరఫున సాక్ష్యం ఇస్తూ 'ఆయన

ఏపాపం ఎరగరు నేనే ఆయనను చెడగొట్టాను', అని విచారణ జరిగే అంశం వొదిలేసి తనకూ ఆయనకూగలసంబంధం గురించి చెప్పటం విప్రనారాయణ పాత్రను చాలా చక్కగా ఖూనీ చేసింది తాను చెక్కుచెదరనట్లుగా నిలబడి ఉన్న విప్రనాయణుడికి డామేజ్ కలగటానికి చెప్పిన సాక్ష్యం లాగుంది

విప్రనారాయణ పాత్ర దెబ్బతినడంలో డైరెక్షన్ సహాయపడిన ఘట్టం కనీసం ఒక్కటి ఉన్నది అది దేవదేవి వనకన్యలాగా వేషంవేసుకుని విప్రనారాయణుడి ఆశ్రయం సంపాదించటానికి వచ్చే ఘట్టం అక్కడ దేవదేవి అభినయం ఎంత వెటకారంగా ఉన్నదంటే విప్రనారాయణుడు ఎంతో మతిలేనివాడైతే తప్ప ఆమెచెప్పే మాటలలో ఏ ఒక్కటీ నమ్మి ఉండడు!

'విప్రనారాయణ' లో ఈ విప్రనారాయణ పాత్ర నిర్వహణ తప్పిస్తే మిగతా అన్ని అంశాలూ బాగానే ఉన్నాయి దేవదేవికి విప్రనారాయణపై కలిగిన భావం భక్తిగా ఉద్దేశించబడినా అది ఈ కాలపు ప్రేమకు సన్నిహితంగా ఉంది ప్రేమ అచ్చుగా ఆధునిక యుగానికి చెందినది పూర్వ సాహిత్యంలో కామం, మోహం మాత్రమే కనిపిస్తాయి అయినప్పటికీ ఈ చిత్రంలో ఉండే ప్రేమ ప్రేక్షకులకు అంతగా పట్టివ్వనవసరంలేదు

విప్రనారాయణ పాత్రను నాగేశ్వరరావు చాలా సమర్థతతో నిర్వహించాడనటానికి సందేహంలేదు ఈ నటనలో పూర్వం ఎన్నడూ చూపనంత ప్రౌఢత్వం ప్రదర్శించ్రాడు దేవదేవి పాత్రను భానుమతి తన సర్వశక్తులూ ధారపోసినట్టు నటించింది ఈ పాత్రలో ఈమె చేసిన నటన బహు ముఖాకర్షణతో కూడుకున్నది చక్కని నృత్యాలూ శ్రావ్యమైనపాటలూ, క్రోధం, శాంతం, దైన్యం, అవేదనా, భక్తీ ఈమెపాత్రద్వారా ప్రదర్శించగలిగింది రంగరాజు పాత్ర మృణ్మయపాత్ర, అయినా రేలంగి ఈ పాత్రకు జీవం పోశాడు వేశ్యమాత పాత్ర నిర్వహించటం లో ఋష్యేంద్రమణి చాలా శక్తి సామర్థ్యాలు ప్రదర్శించింది

రచనలో చాలాచోట్ల రమ్యత ఉన్నది ముఖ్యంగా ఒక్క అంశం చాలా చిత్రంగా మారింది మొదటిసారి దేవదేవి తనకు నమస్కరించినప్పుడు విప్రనారాయణుడు నిజంగా పరధ్యానంగానే ఉన్నాడా? ఈ విషయం అనుమానాస్పదమనుకోవటానికి రచయిత ఒక ఆధారం కల్పించాడు ఈ సంఘటన జరిగిన అనంతరం విప్రనారాయణుడు ఆలయానికి వెళ్ళి స్వామివారిని చూసి కంగారుపడతాడు స్వామికి తనమీద అనుగ్రహం తప్పిందని ఆవేదన పడతాడు అతను పరధ్యానంలో కూడా దేవదేవిని గమనించి, తనకే తెలియకుండా ఆమెచేత ఆకర్షించబడి ఉండాలని ఊహించి నట్టయితే ఈ కంగారు అర్థవంతమైనదే నిజంగా దేవదేవికి తన ఆశ్రమంలో స్థానం ఇచ్చినాక విప్రనారాయణుడికి స్వామివారు మామూలుగాను కనిపిస్తారు విప్రనారాయణ పాత్రను సైకో ఎనలైజ్ చేయటానికి ఈ సంఘటన బాగా ఉపకరిస్తుంది

డైరెక్టరు రామకృష్ణ పూర్వంతీసిన చిత్రాలలో కన్న ఇందులో ఎక్కువ సమర్థతా, భావ నైపుణ్యమూ చూపాడు అయినప్పటికీ ఏ ఒక్క సన్నివేశమూ భావసమగ్రతను సాధించలేకపోవటం శోచనీయం చిత్రం మొత్తం మీద ఒక్కసారైనా ప్రేక్షకుడు పాత్రలలోగాని, సన్నివేశాలలోగాని తృప్తిగా లీనమయే అవకాశం కలగనేలేదు పాత్రల మనంఃప్రవృత్తులకు – ముఖ్యంగా విప్రనారాయణ పాత్రయొక్క మనస్తత్వం తాలూకు వివిధ దశలకు – తగినంతపోషణ జరిగివుంటే ఈ లోపం కలగకపోను

తెలుగుస్వతంత్ర, వారపత్రిక, 31-12-1954

# 36. మిస్సమ్మ

విజయవారి 'మిస్సమ్మ' ప్రధానంగా వినోదకరమైన చిత్రం ఈ కథలోని సన్నివేశాలకూ, హాస్యానికీ కూడా కీలకమైనది స్థాన భ్రష్టత్వం జమీందారు పెద్దకూతురు మహాలక్ష్మి తన నాలుగో ఏటనే తప్పిపోయి క్రిష్టియన్‌ల ఇంట మేరీ అనే పేరుతో పెరిగి, హిందూ మతమంటే నిరసన అలవరుచుకుని, తన కన్న తల్లిదండ్రుల వద్దకు మోసంతో వారి నౌకరుగా వస్తుంది, వారు తనను కూతురు లాగా చూసుకుంటుంటే ఏవగించుకుంటుంది వారు పెట్టే 'బాధ' భరించలేక ఉద్యోగానికి స్వస్తి చెప్పి వెళ్ళిపోదామనుకుంటుంది కూడా

మతంలోనూ, మనస్తత్వాలలోనూ కూడా ఎట్టి సామ్యమూలేని రావూ, మేరీ దంపతులు గా నటించడం జరుగుతుంది నౌకర్లు చుట్టాలల్లే చూడబడతారు మందులు నూరుకోవలసిన వాడు పంతులుపని చేస్తాడు ప్రపంచ జ్ఞానం కూడా లేని యువకుడు డిటెక్టివు పని చేస్తాడు బిచ్చగాడు ఇంటి నౌకరవుతాడు ఎలిమెంటరీ స్కూలుకు బియ్యే పంతుళ్లను పెట్టి, కాలేజీ లెక్చరర్ల జీతాలిస్తారు కన్యకు సీమంతం జరుగుతుంది ప్రేమించుకుంటున్న వాళ్లు కీచులాడుకుంటారు ఇటువంటి తారుమారు చిత్రమంతటా కొల్లగా ఉంది

సన్నివేశాలు కల్పించటంలో, పాత్రలను పోషించటంలో, సంభాషణలు నడిపించటంలో చక్రపాణి కలం, 'పెళ్లి చేసి చూడు' లో లాగే, విశృంఖలంగా, వింతగా పనిచేసింది సంభాషణలలో వ్యంగ్యమూ, ధ్వనీ ఉన్నాయి ఉదాహరణకు, పార్కులో రావు, మేరీ డేవిడ్‌ల మధ్య తీర్పు చెప్పేటప్పుడు, 'ఇంతకాలం ఆగనే ఆగావు ఈ రెండు నెల్లూ కూడా ఆగు ఎక్కడికిపోతుంది?' అంటాడు ఈ మాట అన్న రావే మేరీని ఎక్కడికో తీసుకుపోతాడు మేరీ ఎక్కడున్నదీ తెలుసుకోవటానికి డేవిడ్ దొంగతనం కూడా చెయ్యాల్సివస్తుంది జమీందారు మనిషి వాపి కొద్దీ తన సొంత కూతురైన మేరీని 'కూతురులాగా' చూసుకుని మురుస్తాడు మహాలక్ష్మికి ఇరవై ఏళ్లు నిండినప్పుడు జమీందారు భార్య సుశీల తన కూతురికే వేడుకలు చేసుకుంటూ, ఆమెను తలుచుకుని విచారిస్తుంది మేరీకి జమీందారు దగ్గిర స్థానం లేకుండా చెయ్యాలనే దురుద్దేశంతో వచ్చిన డేవిడ్, మేరీ జమీందారు కూతురేనని రుజావు చెయ్యడానికి సహాయపడతాడు

చక్రపాణి రచనా, ప్రసాద్ దర్శకత్వమూ ఎప్పుడూ బాగా మేళవిస్తాయి ఒక మనిషి భావనలాగా రచనలోని అంశాలు చిత్రంలోకి అనువదించబడతాయి ఈ చిత్రంలో మంచి వేగమూ, రక్తీ, చైతన్యమూ సాధించడానికి ప్రసాద్ దర్శకత్వం తోడ్పడింది మొదటి నుంచి చివర దాకా ప్రేక్షకుడు తన్మయుడై చిత్రాన్ని చూస్తాడు

పింగళి నాగేంద్రరావు పాటల రచన ఎప్పటిలాగే, ఇప్పుడు కూడా పాత్రలకూ, సన్నివేశాలకూ అనుగుణంగా, అక్కడక్కడా వ్యంగ్యంగా ఉన్నది రాజేశ్వరరావు సంగీతమూ, రాజా, పి లీలా, సుశీలల గానమూ శ్రావ్యంగా అందరూ సులువుగా పట్టుకునేలాగా ఉన్నాయి మార్కస్ బార్ట్లీ ఛాయాగ్రహణమూ, క్రిష్ణన్ శబ్ద గ్రహణమూ, గోఖలే, కళాధర్ ఆర్టూ తృప్తికరంగా ఉన్నాయి

మేరీపాత్ర ధరించిన సావిత్రి ఈ చిత్రంలో చూపిన నటన అద్వితీయమైనది ఎన్ టి రామా

రావు రావు పాత్రను చాలా దక్షతతో పోషించాడు నాగేశ్వరరావు రాజా పాత్రనూ, రేలంగి దేవయ్య పాత్రనూ సునాయాసంగా నిర్వహించారు జమున సీత పాత్రను పూర్తిగా వాస్తవ వ్యక్తిగా చేసేసింది ఆ పాత్ర తెరమీద చూస్తున్నంతసేపూ అదొక కల్పిత పాత్ర అనిగాని, జమున నటిస్తున్నదనికాని మనకు అనిపించదు జమీందారుగా రంగారావూ, జమీందారు భార్యగా ఋష్యేంద్రమణీ చాలా బాగా నటించారు డేవిడ్‌లోని క్షుద్రత్వం ప్రదర్శించటంలో రమణా రెడ్డి హాస్యం బాగా పోషించాడు రామలింగయ్య పంతులు—వైద్యుడుగా చక్కని హాస్యం ప్రదర్శించటమేగాక చాలా సందడి చేశాడు 'మిస్సమ్మ' ప్రతివారూ చూసి తీరవలసిన చిత్రం

*కినిమా, మాసపత్రిక, ఫిబ్రవరి 1955*

# 37. అర్ధాంగి

ప్రసిద్ధ బెంగాలీ నవల ''స్వయంసిద్ధ'' ఆధారంతో తయారుచేసిన రాగిణీవారి 'అర్ధాంగి' చిత్రం ప్రేక్షకులను బాగా ఆకర్షించుతున్నట్టు తెలుస్తున్నది ఇది కావటానికి సాంఘిక చిత్రమే అయినా జానపద చిత్రాలలో మాత్రమే కనిపించే ఉద్రేక పూరితమైన సన్నివేశాలు కలిగి ఉన్నది దీనికి తోడు కథలోగల వర్గ సంబంధాలు వాస్తవ జీవితాన్ని స్ఫురించేవిగా లేవు రైతులు జమీందారుపట్ల చాలా ప్రేమగా ఉంటారు కాని జమిందారు చిన్న కొడుకును తీవ్రంగా ప్రతిఘటిస్తారు రైతుల పిల్ల అయిన పద్మ ధైర్య సాహసాలు చూసి జమీందారు ఆమెను తన రెండో కొడుక్కు చేసుకుందా మనుకుని భార్య ఒప్పుకోకపోగా పెద్ద కొడుక్కు చేసుకుంటాడు ఆపిల్ల–పద్మావతి –జమీందారు కొడుక్కు చదువు సంధ్యలు నేర్పుతుంది! ఇటు వంటి సంఘట నలు ఈనాటి జమీందారీలో ఊహించడానికి వీలు లేనివి

కాని ఈ చిత్రాన్ని జానపద గాథగా భావించి అయినా ఆనందించవచ్చు ఎందుకంటే వివిధ పాత్రల మధ్య చిత్ర విచిత్రమైన సంఘర్షణ పరంపర చిత్రించబడింది ఉదాహరణకి జమీందారు కుటుంబం తీసుకుంటే అందులో ఏ ఇద్దరి మధ్యా నిజమైన పరస్పరానురాగం లేదు జమీందారు వృద్ధుడు, నిజం తెలుసుకోగలవాడు, మిగిలిన వాళ్లకి హితం చెప్పగలవాడు కాని ఆయన చుట్టూ ఆయనను అర్థం చేసుకోగల వాళ్లెవరూ లేరు రెండో భార్య రాజేశ్వరికి కొంచెమైనా ఇంగితజ్ఞానంలేదు, ఎంతసేపూ తన కొడుకు నాగును పాడుచెయ్యటమూ, భర్త చెప్పే ప్రతిముక్కా పెడచెవిని బెట్టటమూ తప్ప ఆమె కింకేమీ తెలీదు జమీందారు పెద్ద కొడుకు రాఘవేంద్రరావు పిచ్చివాడు, అతనికి ఆయమ్మచాటున దాక్కోవటం తప్ప ఇంకేమీ తెలీదు నాగు అచ్చుపోసిన ఆబోతు అన్న పిచ్చి వాడైన కారణాన జమీందారీకి వారసుడైనాడు, తల్లిమాలిమిలో ఎందుకూ పనికిరానివాడుగా తయారై, తన ప్రతాపమంతా అన్నను కొట్టటం లోనూ, దివాన్ మీద ఎగరటంలోనూ చూపిస్తాడు

పద్మ ఈ మూకమధ్య వచ్చి పడుతుంది జమీందారు కుటుంబంలో వారి కందరికీ ఆమె విరుద్ధమైన వ్యక్తి తన హక్కులూ, తనవాళ్ల హక్కులూ రక్షించుకునే దక్షత ఆమెకున్నది చదువు సంధ్యలున్నాయి ఎటువంటి తీవ్ర పరిస్థితినైనా ఎదుర్కొని నిలబడగల స్థయిర్యం ఉంది ఈ లక్షణాల తోనే ఆమె కొన్ని సమస్యలు పరిష్కరించగలుగుతుంది, కాని దానిమూలంగా ఇతర సమస్యలు ఏర్పడతాయి ఆమె నాగును ఎదిరించి అతని తల్లిని మరింత శత్రువును

చేసుకుంటుంది, తన భర్తను మనుష్య ప్రపంచంలో పడేసి నాగుకు చెందవలసిన జమీందారీ అతనికిచెందే పరిస్థితి కలిగిస్తుంది అయితే ఈ సమస్యలు కూడా ఇంచుమించు ఆమె చేతిమీద గానే పరిష్కారమవుతాయి చిత్రం లోని గొప్ప ఆకర్షణ ఈ పాత్రలమధ్య సంఘర్షణ ఈ సంఘర్షణను చిత్రించటంలో కొద్దిలోపాలు జరిగాయి నాగు దౌష్ట్యం – ముఖ్యంగా బొమ్మల పెళ్లి చేసుకుంటున్న అన్నను కొట్టినప్పుడు జుగుప్సాకరంగా చిత్రించబడింది నాగు తన మనుష్యులను తీసుకుపోయి రైతులను పొలాలలో నుంచి వెళ్లగొట్ట యత్నించినపుడు పద్మ వాళ్లని ''అదరగొట్టటం'' చిత్రంలో అంతగా కనిపించదు జమీందారు పద్మను తనకోడల్ని చేసుకుంటా నన్నపుడు రైతులంతా హర్షించటంలో అర్థం కనబడదు జమీందారు చావు దాదాపు ఆత్మహత్య లాగుంది నాగులో పరివర్తన కన్న రాజేశ్వరిలో కలిగే పరివర్తన ఎక్కువ స్వభావసిద్ధంగా ఉంది

రచనలో పాత్ర చిత్రణ కథకోసం చేసినట్టుగా ఉందిగాని పాత్రలను అనుసరించి కథసాగినట్టులేదు ముఖ్యంగా రఘు, పద్మపాత్రలు ఎక్కువ భాగం మరెవరికోసమో జీవిస్తున్నట్టు కనిపిస్తాయి ఇందు వల్ల కథకు బిగువు వచ్చినా పాత్రల చిత్తవృత్తి కృత్రిమంగా తయారయింది సన్నివేశాల పాటవం ప్రధానంగా పెట్టుకుని రచించే కథలలో ఈ లోటు తప్పకుండా కనిపిస్తుంది అయినా ఈ విధంగా నిర్మించిన సన్నివేశాలు తరచిచూస్తే డొల్లగా కనిపిస్తాయి ఉదాహరణకి రాజేశ్వరి ఇల్లు వదలి వెళ్లిపోతానన్నప్పుడు జమీందారుగారు కంగారు పడకపోతే మేడమెట్ల మీది నుంచి కిందపడిపోడు అదేవిధంగా రఘు ఒక్క తృటిలో తన బాధ్యతలన్నీ వొదిలేసి, ఇల్లు తమ్ముడిపరం చేసి భార్యతో కూడా అత్తవారింటికి పోతాడు, నాగుకు అడిగినంత డబ్బిచ్చి తల్లి పాడుచేసిన మాట నిజమైతే, ఆస్తియావత్తూ తమ్ముడిపేరపెట్టి రఘు నాగును ఇంకా చాలా రెట్లు పాడుచేసినవాడైనాడు ఈ రచనలో పాత్రలను గురించి ప్రేక్షకులేమనుకుంటారో అన్న ఆదుర్దాకంటే ఒక పాత్రను గురించి ఇంకో పాత్ర ఏమనుకుంటుందో అన్న ఆదుర్దా హెచ్చుగా కనిపిస్తుంది నాటకం చాలా భాగం పాత్రలకోసం నడుస్తుంది దీనికి పెద్ద ఉదాహరణ రఘు రాజేశ్వరి పట్ల చూపే అపారమైన పుత్ర ప్రేమ, ''నాగుకన్న నేనెంత మంచికొడుకునో చూసుకో!'' అని రాజేశ్వరితో చెబుతున్నట్టుగా రఘు ప్రవర్తిస్తాడు!

ఈ చిత్రం రక్తికట్టటానికి నటీనటుల నటనా సామర్థ్యమూ, సులువైన సంభాషణలూ, సూటి అయిన దర్శకత్వమూ తోడ్పడ్డాయి పద్మ పాత్రలోని దీక్షా, నిబ్బరమూ, నిరాడంబరత్వమూ సావిత్రి చాలా బాగా వ్యక్తం చేసింది రఘు పాత్రలోని శుక్ల, కృష్ణ పక్షాలను నాగేశ్వరరావు చక్కగా చిత్రించాడు జమీందారు పాత్రలో ఉండే అంతస్సంఘర్షణను గుమ్మడి వెంకటేశ్వర రావూ, నాగు పాత్రలో అంతరాత్మ అనేది లేకపోవటాన్ని జగ్గయ్య ఎంతో సమర్థతతో ప్రదర్శించారు శాంతకుమారీ, సురభి, బాలసరస్వతీ, చదలవాడ, బి ఎస్ ఆర్ , డాక్టరు కామరాజు, డాక్టరు శివరామకృష్ణయ్య, దొరస్వామి, గంగారత్నం, నాగభూషణం మొదలైన వారందరి నటనా ప్రశంసనీయంగా ఉంది

ఫోటోగ్రఫీ, సౌండ్ రికార్డింగ్, సంగీతం, పాటలు, ఎడిటింగ్ మొదలైన వాటిలో వంక పెట్టటానికేమీలేదు రాగిణీవారు ఇప్పటికి తీసిన చిత్రాలన్నిటికన్నా 'అర్థాంగి' ఒక మెట్టు పైగా ఉంది కథా కల్పనలో ఇంకా శ్రద్ధవహించి ఉంటే ఇది అత్యుత్తమ చిత్రాలలో ఒకటనిపించుకుని ఉండేదనటానికి సందేహం ఏమీలేదు

తెలుగు స్వతంత్ర, వారపత్రిక , 18-2-1955

# 38. బంగారు పాప

శ్రీ బి ఎన్ రెడ్డి గారి 'బంగారుపాప' విడుదల అవుతున్నది ఆయన చిత్రం ప్రతీదీ ఒక ప్రముఖ సంఘటన ఈసారి కూడా అంతే పూర్వపు సంఘటనలన్నిటినీ ఇది తలదన్నవచ్చు ఎందుచేతనంటే ఆయన లోగడ తీసిన చిత్రాలన్నిటి కన్నా ఈ 'బంగారుపాప' చాలా విషయాలలో గొప్ప చిత్రం సైలాస్ మార్నర్ అనే 19వ శతాబ్దపు ఇంగ్లీషు నవలను అనుసరించి 'బంగారుపాప' కథ అల్లారు మాతృకలో ఉండే పాత్రలను మరింత ఆకర్షవంతంగానూ, ఉదాత్తంగానూ తయారు చేశారు

కోటయ్య అనే కమ్మరి యువకుడు రామి అనే దాన్ని పెళ్ళాడబోతున్న సమయంలో భజన పార్టీ నాయకుడు గోపాలస్వామి అనేవాడు రామిని బుట్టలో వేసుకుని, జమీందారింట నగలు దొంగిలించి ఆ దొంగతనం కోటయ్యకు అంటగడతాడు జైలు నుంచి తిరిగి వచ్చినాక కోటయ్య, రౌడీగా తాగుబోతుగా తయ్యారై గోపాలస్వామి దొరికితే హతమార్చి తాను ఉరిస్తంభం ఎక్కాలని చూస్తుంటాడు కోటయ్య తనను బతకనివ్వడని భయపడి గోపాలస్వామి తన యిల్లూ వాకిలీ కిరసనాయిలు రామదాసుకు అమ్మి కొంత బయానా పుచ్చుకుని ఊరు విడిచి వెళ్ళిపోతాడు

జమీందారు కొడుకు మనోహర్ పట్నంలో చదువుకునేటప్పుడు ఎవరికీ తెలియకుండా శాంత అనే ఆమెను పెళ్ళాడాడు ఆమెకొక పిల్లకూడా కలిగింది ఇదంతా తెలియక జమీందారు అతనికి పార్వతి అనే పిల్లతో పెళ్ళి ఏర్పాటు చేస్తాడు ఇది విని శాంత తన బిడ్డతో సహా భర్తదగ్గరికి బయలుదేరి వస్తుంది అదే సమయానికి గోపాలస్వామి కూడా, కిరసనాయిలు రామదాసు ఇవ్వాలిసిన సొమ్ము స్వయాన వసూలు చేసుకు పోదామని వస్తాడు ఈ సంగతి తెలిసి కోటయ్య గోపాలస్వామిని స్టేషను నుంచి ఊరికి చేరే దారిలో సఫా చెయ్యటానికి కత్తి తీసుకు బయలు దేరుతాడు అయితే సమయానికి తుఫాను బయలుదేరి అందరి యత్నాలనూ, భావి జీవితాలనూ తారుమారు చేసేస్తుంది స్టేషను నుంచి వానలోపడివస్తున్న శాంత మీద చెట్టొకటి విరిగిపడి చచ్చిపోతుంది దైవికంగా పిల్ల బతికి గట్టిగా ఏడుస్తుంది స్టేషన్‌కు పోతున్న కోటయ్య చెట్టుకింద పడి ఉన్న శాంతను చూస్తాడు, పిల్ల ఏడుపు వింటాడు పిల్లనూ శాంత శవాన్నీ ఇంటికి చేరుస్తాడు శాంతను మనోహర్ తప్ప మరెవరూ గుర్తించరు అయితే అతను సాహసించి నిజం బయటపెట్ట లేకపోతాడు అందుచేత మనోహర్ కూతురు కోటయ్య దగ్గిర పెరగ సాగుతుంది

పాప రావటంతో కోటయ్యలో మళ్ళీ మానవత్వం చిగుర్చుతుంది అతను పూర్తిగా మారిపోతాడు పాప ఆనందం కోసం, సుఖం కోసం బతుకుతాడు మనోహర్ కూడా, తానామె తండ్రినన్నది బయటపడనీయకుండా, పాపకు చెయ్యగలిగినంతా చేస్తాడు జమీందారు కూతురికి శేఖర్ అని కొడుకున్నాడు శేఖర్‌కూ పాపకూ చిన్నతనం నుంచీ స్నేహం ఏర్పడుతుంది వారికి వయసు వచ్చాక అదే ప్రేమగా మారుతుంది శేఖర్‌కు పెద్దవాళ్ళ సంబంధం చూస్తారు శేఖర్ పాపనే పెళ్ళాడతానని పట్టుబడతాడు జమీందారు మనవడు కమ్మరాడి కూతుర్ని పెళ్ళాడటం సాధ్యమయేది కాదు శేఖర్ ఇంట్లోనుంచి వెళ్ళిపోవటానికి సిద్ధపడతాడు వారిద్దరికీ పెళ్లి తప్పదని నిశ్చయించి, జమిందారు కుటుంబం వారు కోటయ్యకు పుష్కలంగా డబ్బిచ్చి ఊరినుంచి పంపేసి

ఆ తరువాత శేఖర్‌కూ పాపకూ పెళ్ళి చేద్దామనుకుంటారు డబ్బు తీసుకోకుండానే కోటయ్య పాప సుఖం కోసం వెళ్ళిపోవటానికి సిద్ధపడతాడు కాని పాప ఒప్పుకోదు – తనతండ్రితో పంచుకోలేని సుఖం తనకు అవసరం లేదంటుంది విధిలేక మనోహర్ పాప తన కూతురేనని బయట పెట్టేస్తాడు శేఖర్‌కూ పాపకూ పెళ్ళవుతుంది

కోటయ్య తాగుబోతు రౌడీగా ఉండగా కథ ప్రారంభమవుతుంది అంతకు పూర్వం జరిగిన సంభాషణలు ఫ్లాష్‌బాక్‌లో చూపబడ్డాయి అందుచేత కథనంలో మంచి పొదుపు ఏర్పడింది కథను కట్టుకు రావటంలో చాలా చక్కని శిల్పం ఉంది పూర్వ గాథకు సంబంధించిన గోపాలస్వామి తిరిగి కథలోకి వచ్చి కోటయ్య దగ్గిర నుంచి గుణపాఠం నేర్చుకుంటాడు కాని రామి పాత్ర మళ్ళీకనిపించదు పూర్వగాథ యావత్తూ ఫ్లాష్‌బాక్‌లో చెప్పించటం వల్ల ఈ రామి పాత్రకూ, కోటయ్య తల్లి పాత్రకూ సులువుగా ఉద్వాసన చెప్పటం వీలయింది

మనం చిత్రంలో చూసే కథకు నడిబొడ్డు తుఫాను ఈ తుఫాను కథలో అనేక పరిణామాలు తీసుకొస్తుంది దీని ఫలితంగా మనోహర్‌కు జరుగనున్న పెళ్ళికి అవాంతరం తొలిగిపోతుంది పాప కోటయ్య చేతపడుతుంది గోపాలస్వామి కోటయ్య చేత చావు తప్పించు కుంటాడు ఇంతేకాక ఈ తుఫాను చాలా పాత్రల మనస్థితికి బాహ్యచిహ్నంగా ఉపయోగించ బడింది తన భర్త తిరిగి పెళ్ళాడతాడని విని శాంత మనస్సులో ఒక తుఫాను చెలరేగుతున్నది గోపాలస్వామి మీద పెంచుకుని ఉంచిన పగ సాధించి ఆ తరవాత ఉరిశిక్ష అనుభవించటానికి సమయం వచ్చిందనే ఉద్దేశ్యంతో కోటయ్య మనస్సులో మరొక తుఫాను చెలరేగుతున్నది నిజం బయట పెట్టలేక, తండ్రి తనకు చేసే పెళ్ళిని నివారించలేక, శాంతకు అన్యాయం చేస్తున్నానని ఆవేదనపడే మనోహర్ మనస్సులో ఇంకొక తుఫాను చెలరేగుతున్నది ఆఖరుకు గోపాలస్వామి మనస్సులో కూడా శాంతి లేదు ఇంటి తాలూకు సొమ్ము కిరసనాయలు రామదాసు దగ్గిర వసూలు చేసుకునే ఆశతో స్టేషనులో దిగాడే గాని కోటయ్య చంపిపోతాడన్న భయం అతన్ని చంపేస్తూనే ఉంది మొత్తం మీద బయటి తుఫాను ఆగిపోయే సమయానికి అందరిని బాధించే సమస్యలూ ఏదో రూపంలో పరిష్కారం అవుతాయి

కథలో మనోహర్ తన వివాహ సమస్యను ఎదుర్కొనే పద్ధతికీ రెండో తరం వాడైన శేఖర్ తన వివాహ సమస్య నెదుర్కొనే పద్ధతికీ వ్యత్యాసం చక్కగా చూపబడింది కృత్రిమమైన తనవంశ సంప్రదాయాలతో మనోహర్ సతమతమవుతాడు గాని, వాటికి శేఖర్ ఎదురు తిరుగుతాడు అదే విధంగా పితృప్రేమ విషయంలో కూడా కోటయ్యకూ, మనోహర్‌కూ వ్యత్యాసం బాగా నిరూపించబడింది పాప సుఖం కోసం కోటయ్య తన సర్వస్వం త్యాగం చెయటానికి సిద్ధపడితే తన ప్రతిష్ట కోసం మనోహర్ పాప సుఖం బలి అవుతున్నా అసహాయుడై చూస్తూ ఊరుకుంటాడు

ఇక పాత్రలలో అత్యంత సమగ్రంగా సృష్టించబడిన పాత్రకోటయ్యది మంచివారిలో మంచి వాడు, చెడ్డవారిలో చెడ్డవాడు కోటయ్య అతనిది పులి పంజా, వెన్న లాంటిహృదయం, ఆత్మాభిమాని, అభిజాత్యాన్ని కూడా కలవాడు తనకు జరిగే అవమానాన్ని దేన్నీ వృథా పోనిచ్చేవాడు కాడు ఈ శక్తి ఈ కథలో కోటయ్యకున్నంతగా మరే ఇతర పాత్రకూ లేకపోవటం గమనించదగిన విషయం

ఇందులో కోటయ్యకు సరిగా విరుద్ధమైన పాత్ర మనోహర్‌ది అతను వ్యక్తి కాడు – నీడ

అతను ఒక స్త్రీని ప్రేమించాడు, ఆమెకు కన్న కుమార్తెను ప్రేమించాడు కాని ఆ ప్రేమలలో సత్త్వంలేదు అవి శుష్క ప్రేమలు అతను తన వివాహం ఎట్లా అయిందీ తెలిసి కూడా, తన మేనల్లుడు శేఖర్ అదే గోతిలో పడుతూంటే చూస్తూ ఊరుకుండిపోతాడు చిట్టచివరలో అతను ప్రదర్శించే ''ధైర్యం'' కూడా అతని దౌర్బల్యాన్నే మరింత స్పష్టం చేసినట్టు కనబడుతుంది

పై రెండు పాత్రలూ కథకు ముఖ్యమైనవిగా ఉంటూ సమగ్రంగా, నేర్పుగా చిత్రించినవి కథకు అట్టే సంబంధం లేకుండానే చాలా చమత్కారంగా సృష్టించిన విచిత్ర పాత్ర కిరసనాయలు రామదాసుది రామదాసు చెడ్డవాడూ కాడు, మంచి వాడూ కాదు పరిమితమైన స్వార్థంతో బతుకుతూ అందుకనుగుణమైనంతవరకే దుర్మార్గం చేస్తూ, ఆ దుర్మార్గాన్ని తన బతుకు తెరువు నుంచి వేరు చెయ్యటానికి ఎట్టి తాత్విక యత్నమూ చెయ్యకుండా , తనకు అనుకూలంగా లేనప్పుడు మంచిగానే పోతూ, ఒకరితో విరోధంగానీ, ఒకరితో వల్లమాలిన స్నేహంగాని లేకుండా నలుగురితో బతుకుతూ కూడా తన బతుక్కు ఒకరు అడ్డం రాకుండా కాలక్షేపం చెయ్యగలవాడు రామదాసు ఇతరుల రక్తం తాగినా కూడా, జలగలాగా అవతలి వాడికి బాధకలగనివ్వడు ఇది చాలా సజీవమైన వాస్తవమైన సాంఘిక ప్రమాణాలు గల పాత్ర

ఈ చిత్రంలో కథనమూ, పాత్ర పోషణా, సంభాషణలూ రక్తి కట్టి విశిష్టంగా ఉండటానికి పాలగుమ్మి పద్మరాజు గారి కృషి చాలా తోడ్పడింది ఆయన ప్రత్యేకత చిత్రంలో అనేక చోట్ల నిరూపణ అవుతున్నది ఇందులోని పాటలు 'మల్లీశ్వరి' పాటలకు ఏ మాత్రమూ తీసిపోవు ఈ చిత్రం శృంగార ప్రధానమైనది కాకపోయినా దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు చాలా చక్కని పాటలు రాశారు

ఈ చిత్రంలో సంగీతానికి ప్రత్యేకత ఉండే అవకాశం లేదు అయినప్పటికీ అద్దేపల్లి రామారావుగారు ప్రతి పాటకూ సందర్భానికనువుగా సంగీతం సమకూర్చారు చిత్రం చివరలో బండీ పాట చాలా నేర్పుతో కూర్చబడింది, చిత్రీకరించబడింది చిత్రంలోని ప్రధానాకర్షణలలో ఒకటి 'మల్లీశ్వరి' కి శిల్పం ద్వారా గొప్ప వాతావరణం సృష్టించిన శేఖర్‌గారు ఈ సారి శిల్ప సహాయం ఏమీ లేకుండానే చాలా గొప్పగా వాతావరణం సమకూర్చారు

ఈ చిత్రానికి దర్శకత్వం వహించిన బి ఎన్ రెడ్డి గారి పనితనం గురించి వేరే చెప్పనవసరం లేదు కథలో ఏ లోపాలున్నా, నటులలో శక్తి సామర్థ్యాలు తక్కువైనవారున్నా కూడా ఆయన తన చిత్రాలకు ఒక ప్రత్యేకతను, విశిష్టతను చేకూర్చుకోగలరు తన సృష్టి సంస్కార ప్రియులకూ, కళాభిమానులకూ, ఉన్నతమైన అభిరుచులుగల వారికీ ఆయన చిత్రాలు సంతృప్తినిస్తాయి ఈ చిత్రం కూడా అంతే

నటులలో కోటయ్యగా ఎస్ వి రంగారావు మరువరాని పాత్ర పోషణ చేశాడు కథకుడు ఆ పాత్రలో ప్రవేశపెట్టిన ప్రతి చిన్న నగిషీనీ రంగారావు తన నటన ద్వారా ప్రదర్శించాడు ఇది రంగారావు నటించిన అత్యుత్తమ పాత్రలలో ఒకటి అనటానికి ఎటువంటి సందేహమూ లేదు

జగ్గయ్య నటించిన మనోహర్ పాత్ర కూడా చాలా కష్టమైన పాత్ర భావ ప్రకటనలో అక్కడక్కడా మోతాదు జాస్తి అయినప్పటికీ ఈ పాత్రను జగ్గయ్య చాలా సమర్థతతో నిర్వహించాడు

కోటయ్య చెల్లెలుగా పి హేమలత అద్భుతంగా నటించింది పాత్ర కథకు అంటీ

అంటకుండా ఉంటుంది పాత్ర యొక్క ప్రాముఖ్యంతో ఏమీ సంబంధం లేకుండా, హేమలత ఈ పాత్రను ఎంతో నేర్పుతో, అత్యంత సహజంగా నిర్వహించింది ఈమెనటనలో ఉన్న సౌలభ్యం వర్ణనాతీతం

రామదాసు పాత్రను రమణారెడ్డి హాస్య ధోరణిలో, చాలా స్వాభావికంగా, రచయిత ఉద్దేశించిన దాని కన్న ఇనుమిక్కిలిగా నటించి గొప్పగా రక్తి కట్టించాడు

గోపాలస్వామిగా వంగర నటన ప్రతిభావంతంగా ఉన్నది

ఇతర పాత్రధారులలో రెండో తరం నాయికా నాయకులుగా కృష్ణకుమారీ, రామశర్మా, జమిందారుగా డా శివరామకృష్ణయ్య, జమీందారు కూతురూ అల్లుడూగా కాంచనా రామన్న పంతులూ, శాంతగా జమునా, కోటయ్య బావమరిదిగా అడుసుమిల్లి శేషగిరీ, కోటయ్య తల్లిగా లీలా, రామిగా జయలక్ష్మి, మనోహర్ భార్య పార్వతిగా విద్యావతీ తృప్తికరంగా నటించారు సత్యం పాడిన జోలపాటా, మల్లిక్ పాడిన హరికథ పాటా, ప్లేబాక్ పాడిన సుశీల పాటా బాగున్నాయి

*తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 18-3-1955*

# 39. రోజులు మారాయి

సారధీ చిత్రం ''రోజులు మారాయి'' గ్రామప్రజల జీవితంలో కలిగిన కొన్ని మార్పులను చిత్రించి తనపేరు సార్థకం చేసుకుంటూ ఉంది కథానాయకుడు వేణు, తనకు నచ్చిన పిల్ల ఊరు వెలివేసిన పిల్ల అయినా పెళ్ళిచేసుకుని, అందువల్ల ఎదురయే చిక్కులను ఎదుర్కొని, జయిస్తాడు అతని చెల్లెలు, పరిస్థితుల ప్రోద్భలంవల్ల ఒక వృద్ధుడికి భార్య అయేదాకా వచ్చికూడా, కానీ కట్నం ఇవ్వకుండా తనకు ఈడుజోడైన గోపాలాన్ని పెళ్ళాడుతుంది కరుడుగట్టిన మధ్యతరగతి రైతుసంస్కృతి అపరావతారమైన వేణు తండ్రి సయితం తనచుట్టు తాను అల్లుకున్న భయంకరమైన గూటిలోనుంచి బయటపడి జ్ఞానోదయం తెచ్చుకుంటాడు ఊళ్ళోని పేదరైతులు బంజర్లు సంపాదించుకుంటారు వీరందరికీ రోజులు మారతాయి ఒకరికొకరు అండగా ఉంటూ ఎంతో దుర్మార్గం సాగించిన కరణం సాంబయ్యా, ధనిక భూస్వామి సాగరయ్యా అడుగంటిపోతారు వారికీ రోజులుమారాయి!

ఇది కూడా 'అంతామనవాళ్ళే' పంథాలో నడిచిన చిత్రమే వాస్తవ జీవితం చిత్రంచటం, ఆ జీవితం తాలూకు నగ్నసత్యాన్ని నిరూపించటం మొదలైన ఆశయాల సాధనకు కృషి ఇందులోనూ జరిగింది అయితే కథనంలోనూ, దర్శకత్వంలోనూ ఈచిత్రం 'అంతా మనవాళ్లే' కంటే చాలా విజయవంతంగా ఉంది కథకుడూ, దర్శకుడూ కూడా ఏదోవిధంగా కథను నడిపించటమే ప్రధానంగా పెట్టుకోకుండా పాత్రల స్వరూపాలను వ్యక్తంచెయ్యటానికి మంచి కృషిచేశారు ఈ చిత్రంలో మరొక విశేషమేమంటే ఇందులో కరుణరసానికి అనవసరమైన ప్రాముఖ్యం ఇవ్వలేదు

కథ ఎత్తుగడ నూర్పిళ్ళతో చాలా చక్కగా ఉంది వెంటనే దుష్టగ్రహాలు కథలో వస్తాయి ఇంటర్వల్ వచ్చేలోపునే ఈ దుష్టగ్రహాల స్వరూప స్వభావాలూ, వీటిపై గ్రామస్థులు సాగించే పోరాటమూ ఒక పరిణామానికి వస్తాయి ఇంటర్వల్ తరవాత వచ్చే కథలో సాగరయ్య

గ్రామస్థుల వర్గ శత్రువు కాడు— కేవలం దుర్మార్గుడు మాత్రమే భారతి పెళ్ళి పడగొట్టటంవల్లా, కాలవగంటి తెగ గొట్టి కోసినపంట ముంచటంవల్లా అతనికి ఒరిగేదేమీలేదు విప్లవసమయాల్లో రష్యా, చైనాలో ప్రజాశత్రువులు ఇలాంటి దుర్మార్గాన్ని ప్రదర్శించిన మాట నిజమేగాని అటువంటి విప్లవవాతావరణం ఈ కథలో లేదు ముఖ్యంగా ఈ కారణంచేతనే ఇంటర్వెల్ తరవాత కథలో ముందున్న బిగువు లేదు

పాత్రలలో కథానాయకుడు తండ్రి పాత్ర కొంత వరకు దుర్బలమైనది ఈపాత్రను మనం మళ్ళీ మళ్ళీ తెరమీద చూశాం, ఇది 'పుట్టిల్లు' లో ఉంది, 'జ్యోతి' లో ఉంది, 'రోజులుమారాయి 'లో మరింత ప్రముఖంగా ఉంది ఇది కావటానికి వాస్తవ పాత్రేగాని, ఈ పాత్రను సంస్కరించ టానికి అభ్యుదయ సినిమా రచయితలు పడుతున్న శ్రమ చాలావరకు అనవసరంగా కనిపిస్తుంది వర్గచైతన్యం దాదాపు సున్నాగా ఉండి, వ్యక్తిచైతన్యం చాలా హెచ్చుగా ఉండే ఈ పాత్రలో గల ఆకర్షణ ఏమిటో తెలియదు

కరణం పాత్రను కామిక్‌విలన్‌గా సృష్టించి పోషించారు వాస్తవ జీవితంలో ఈ పాత్ర ఇంతకన్న చాలా నిబ్బరంగా ఉంటుంది సాంబయ్య తెలుగుదేశపు కరణాలకు సరిఅయిన ప్రతినిధి అనటానికి వీల్లేదు

వేణుపాత్రకు నాయక పాత్రకుండవలసిన లక్షణాలున్నాయిగాని నాయకత్వమే అంతగా కనబడదు నాయకత్వం యొక్క ప్రధాన లక్షణం మామూలు ప్రజలను సమస్యా పరిష్కారోన్ముఖులను చెయ్యటం, వారు తమకు తామై చెయ్యని పనులను ముందు తాను చేసిచూపించి, తనదారిన వారిని నడిపించటం ఈ లక్షణం వేణులో సూక్ష్మంగా మాత్రమే కనిపిస్తున్నది

నాయిక పాత్ర రాధ అనుకోవాలి, ఒక అవివాహిత కడుపునపుట్టి ఒక మాజీసైనికుడు సాకిన ఈపాత్ర మన పల్లెటూళ్ళలో సర్వసాధారణంగా కనబడే పాత్రకాదు ఈ పాత్రకు చిత్రం ఆరంభంలో కొంత ప్రాముఖ్యం ఇచ్చారు గాని, కథలో ఈమెకుగల నిజమైన ప్రాముఖ్యం అంతగా లేదు వేణుచెల్లెలు భారతి కూడా నిస్సహాయపాత్రే

చిత్రంలోకల్లా వాస్తవంగా ఆకర్షవంతంగా కనిపించే పాత్ర వేణు తల్లిది ఆచారవ్యవహారాల ప్రయోజనాల పరిమితిని సులువుగా అర్థం చేసుకోవటం, సిద్ధాంతాలు తెలియకుండానే జీవిత సత్యాన్ని అవగాహన చేసుకోవటం ఈ పాత్రలో ఉండేగొప్పఆకర్షణ

ఈ చిత్రంలో పాటలు చాలావరకు వాతావరణానికి అనుగుణంగా, దక్షత తో రచించబడ్డాయి కొన్ని వాటికి కూర్చిన సంగీతం దృష్టితో చూస్తే కొన్ని పాటలు ఆకర్షవంతగానే ఉన్నాయి ఇదే నృత్యానికికూడా వర్తిస్తుంది ఒకపల్లెటూళ్లో జరిగిన నృత్యమనేమాట మరిచిపోయినట్టయితే నృత్యం చాలా ఆకర్షవంతంగా ఉన్నది

'అంతా మనవాళ్ళే!' లో లాగే ఈచిత్రంలో కూడా సంభాషణలలో మంచి జీవమూ, రక్తీ, గ్రామీణ సంస్కృతీ, వ్యంగ్యమూ, హాస్యమూ, ఉట్టిపడుతున్నాయి

ఫోటోగ్రఫీ చాలా బాగుంది కొన్ని సన్నివేశాల చిత్రీకరణ చాలా సమర్థంగా ఉంది

పాత్రధారులందరూ తమ పాత్రలను అర్థం చేసుకొని నటించారు కథ అన్ని పాత్రలమీదా సమంగానే దొర్లుతుంది అందుచేత ఈచిత్రం రక్తికట్టానికి అందరూ బాగా నటించాలి,

నటించారుకూడా వేణుగా నాగేశ్వరావు నటనా, అతని తల్లిగా సి హేమలత నటనా ఎంతో స్వాభావికంగా ఉంది వేణు తండ్రి గా పెరుమాళ్ళూ, కరణంగా రమణారెడ్డి చూపించిన నటన మోతాదు మించి ఉంది భూస్వామిగా సి ఎస్ అర్, రౌడీగా రేలంగి బాగా నటించారు గాని, ప్రత్యేకంగా హాస్యంలో రాణించగల ఈయిద్దరు ''మిస్ కాస్టు'' అయినట్టుగా కనిపిస్తుంది రాధగా జానకి అంతగా రాణించలేకపోయింది క్లోజప్‌లు తీయటంలో సిద్ధహస్తుడైన కమాల్ ఘోష్ పూనుకున్నప్పటికి జానకికి ఒక్క చెప్పుకోదగిన మంచి క్లోజప్ లభించలేదు ఆమె నటనలోకూడా ఎక్కడా జిగిరాలేదు అమ్మాజి, నరసింహరావు ధరించిన పాత్రలు చిన్నవి, సులువైనవి వాటిని వారు తృప్తికరంగానే నిర్వహించారు

సినిమా చిత్రంలో అడుగడుగునా ఒక్కొక్క ఆ సంఘటన పెట్టుకుంటే ఆ సంఘటనలను పోషించటం కష్టం ఒక సంఘటనను అనేక సన్నివేశాలలో పొదిగినట్టయితే సంఘటనకు ప్రాణంవస్తుంది, అదికలకాలం ప్రేక్షకుల హృదయాలలో మెదులుతూ ఉంటుంది లేనిపక్షంలో చిత్రం సంఘటనల గొలుసు లాగా తయారవుతుంది ఈ చిత్రంలో అనేక సంఘటనలున్నాయి అవి సమగ్రంగా లేని కారణం చేత అతుకుల్లాగా ఉన్నాయి వేణు వేసుకున్న ఇల్లు పీకించటం, సాగరయ్య ఊళ్ళో రైతులకు నారు అందకుండా చెయ్యటం పొరుగూరి నుంచి కూలీలను పిలిపించటం – ఇటువంటి సంఘటనలు ముట్టి వదిలి వేయబడ్డాయి వీటిని సమగ్రంగా పొదిగినట్టుంటే వాటికి కథలో ప్రాముఖ్యం లభించేది ముఖ్యంగా ఇంటర్వెల్ తరువాత సాగరయ్య తెచ్చే పేచీలన్నీ ఆయన జీవితచరిత్ర చిత్రించిచితే చెప్పదగినవిగా ఉన్నాయిగాని కథలోవాటికి ప్రాముఖ్యం ఉన్నట్టు చిత్రించలేదు సాగరయ్య కాలవకి గండి పెట్టటం ఇటువంటి సన్నివేశమే అయినా, దాన్ని సమగ్రంగా చిత్రించి అనేక సన్నివేశాలు దానితో ముడిపెట్టడంవల్ల ఆ సంఘటన యావత్తూ చక్కగా రక్తికట్టింది గోపాలం భారతి మెడలోతాళి కట్టబోతుండగా గండివిషయమై వార్త వస్తుంది పెళ్ళికొడుకు తాళి జేబులో పెట్టుకొని బయలుదేరతాడు అంతా వచ్చి గండి పుడుస్తారు సగం పెళ్ళి అయిన పెళ్ళి కూతురు వాళ్ళతో కలిసి పనిచేస్తుండటం గ్రామప్రజల జీవితం మీదా ఒక సంగ్రహవాఖ్యనం! నిండుచూలాలు రాధ ఈవనిలో ఉండగనే నొప్పులు వస్తాయి గండి పూడినాక మిగతా పెళ్ళి అక్కడే పూర్తిచేసి పెళ్ళికూతురి మెళ్ళో తాళి కట్టిసారు అ పొలాల్లోనే ఇంకోపక్కగా రాధ ప్రసవిస్తుంది!

ఇన్నిసన్ని వేశాలు కలిసి రావటం చేత ఈ సంఘటన ప్రేక్షకుల మనసుల్లో కలకాలం ఉంటుంది చిత్రమంతా ఇదే పద్ధతి మీద తీసినట్టయితే 'రోజులు మారాయి' ఇంకా ఎంతో గొప్ప చిత్రమనిపించుకునేది

చిత్రంలో అనవసరమైన పాటలు చాలా ఉన్నాయి వాటిని తగ్గించి ఉండవచ్చు దాని బదులు టూకీగా పోయిన సంఘటనలను పెంచివుండవలసింది

ఈ చిత్రం ఒకటి మాత్రం నిరూపిస్తుంది సారధీ వారి ''టీమ్'' లో అందరూ సహకరించి పని చేసి ఒక చిత్రం కన్న మరొక చిత్రం మరింత బాగా తయారు చేయగలుగుతున్నారు ఆత్మవిమర్శ ద్వారా వారు ఇదేవిధంగా పని చేస్తూ వెళ్ళినట్టయితే, ఇంకా మంచి చిత్రాలు తీయగలరు

తెలుగు స్వతంత్ర, వారపత్రిక 15-04-1955

# 40. అనార్కలీ

అంజలీ పిక్చర్స్ వారి రెండవ చిత్రం ''అనార్కలీ'' ట్రేడ్ షో ఈ 4వ తేదీ ఉదయం మద్రాసులోని పారగన్ టాకీస్‌లో జరిగింది ఈ చిత్రం చాలావరకు హిందీ ''అనార్కలీ'' చిత్రంపై ఆధారపడి తయారయింది హిందీ చిత్రం చాలా విజయవంతంగా నడిచి ఉండటం చేత అంజలీ పిక్చర్స్ వారు దాన్ని అనుకరించి ఉండాలి

కాని ఈ కథలో గొప్పతనం ఏమీలేదు ప్రేక్షకులను మరీ అమాయకులను చేసి హిందీ అనార్కలీ డబ్బు చేసుకున్నట్టు కనిపిస్తుంది సన్నివేశాలలో ఆట్టే సందర్భంలేదు, పాత్రపోషణ లేదు కథ చక్కని ప్రణయ కథగా ఉండవలసినది, లాలిత్యం గాని రసస్ఫూర్తి గాని లేకుండా కృతిమంగా తయారయింది ఈ లోపాలు తెలుగు చిత్రంలో సవరించబడలేదు

మొదట్లోనే అనార్కలీ ''ప్రియుల వలపు గొలుపు మాటల ఆశ దెలుపు ఆటల జీవితమే సఫలము అనంత ప్రేమ లీలల తరించు ప్రేమ జీవుల జీవితమే సఫలము'' అని, ప్రేమను కాచి వడపోసిన దాని లాగా పాడుతూ ప్రవేశిస్తుంది ఈ పాట అయిపోయిన మరుక్షణం సలీమ్ గుర్రం మీది నుంచి ఎక్కణ్ణుంచో వేగంగా వచ్చిదిగి, పాట చాలాబాగున్నదంటాడు వారి ప్రణయం ఆరంభ మవుతుంది

తరువాత జరిగే సంఘటన వారిద్దరూ అక్బరు కంటపడటం తండ్రి తనను చూసే లోపుగా సలీమ్ పారిపోతాడు ఈ దశలో సలీమ్ తన ప్రియురాలిని గురించి సిగ్గు పడ్డాడో, తాను యువరాజన్న విషయం అనార్కలీకి తెలియరాదని అదుర్దా పడ్డాడో స్పష్టంగా తెలియదు అక్బరు మాత్రం ప్రేమను గురించి తెలిసిన వాడులాగే ప్రవర్తిస్తాడు – ఆయన పరారీ అయిపోయేవాడి ప్రేమను పరిహసిస్తాడు అనార్కలీ సలీమును పాటతో పిలుస్తుంది సలీమ్ వచ్చి చాటున నిలబడి అక్బరుకు తన చెయ్యీ, కాలూ సాక్ష్యం చూపిస్తాడు ఈ సాక్ష్యంతో తృప్తిపడి అక్బరు వెళ్ళిపోతాడు ఈ సన్ని వేశంలో మూడే పాత్రలున్నాయి కాని ఏ ఒక్క పాత్రా రాణించినట్టు కనబడదు

ఆ తరువాత చెప్పుకోదగిన సన్నివేశం సలీమ్ అనార్కలీని బానిసల బజారులో కొని ఇంటికి తీసుకుపోయి మూతికి బట్ట అడ్డంపెట్టుకుని మరొక మనిషిలా నటించటం ప్రేమను గురించి అనార్కలీచేత ఉపన్యాసం ఇప్పించటం తప్ప ఈసన్నివేశంలో ఏమీ కనబడదు సలీమ్ అనార్కలీ ప్రేమ పరీక్షించటానికి మూతి కప్పుకున్నాడా? మూతి కప్పుకున్నంత మాత్రాన అనార్కలీ సలీమ్‌ను – తన ''సిపాయి'' ని – తెలుసుకోలేకపోయిందా? ఈ సన్నివేశం కూడా నాయికా నాయకుల పాత్రలలో ఏ విశిష్ట లక్షణాలనూ బయటపెట్టదు

దీని వెనక వచ్చే సన్నివేశం మరీ అన్యాయంగా ఉంది ప్రేయసిని ప్రియుడు పాటతో జోకొట్టి నిద్రబుచ్చుతాడు ఆ సమయంలో మాన్ సింగు వచ్చి సలీమ్‌ను యుద్ధానికి తీసుకు పోతాడు అతను అనార్కలీని లేపి, తాను వెళుతున్నానని చెప్పటానికి కూడా మాన్‌సింగు అనుమతి నివ్వడు ముందు ముందు ''విప్లవ'' ప్రేమికుడుగా పరిణమించబోయే సలీమ్ మాన్‌సింగు ఆజ్ఞకు బద్ధుడై వెళ్ళిపోతాడు ఈ సన్నివేశం వల్ల మాన్ సింగు పాత్రలో ఏ లక్షణం బయట పడేదీ ఊహకు అందటంలేదు

తరువాత అనార్కలీ అక్బరుకు పుత్ర భిక్షపెట్టే సన్నివేశం వస్తుంది ఇంతవరకూ సలీము ఫలానా అని అనార్కలీకి తెలియకుండా కథను నడుపుకొచ్చారు ఇక్కడ ఆ సంగతి బయటపడిపోతుంది తాను ప్రేమించిన, సిపాయి యువరాజని తెలియగానే అనార్కలీ కుంగిపోతుంది ప్రేమకు హెచ్చుతగ్గులు లేవన్న సిద్ధాంతం అప్పటికింకా ఆమెకు తెలియదను కోవాలి లేకపోతే ఆమె విచారానికి కారణం లేదు పై పెచ్చు సంతోషించటానికి చాలా కారణాలున్నాయి తనను ప్రేమించినవాడు మామూలు సైనికుడుగాక సాక్షాత్తూ పాదుషా కొడుకని బయటపడింది అతను తనను నిజంగా ప్రేమిస్తున్నాడని దేవతల సాక్షిగా రుజువయింది – హకీములంతా ఏమి చెయ్యలేక పోయినప్పుడు తాను పాటపాడి తన ప్రియుడికి స్పృహ తెప్పించింది, పాదుషా, అతని రాణీ తన పట్ల ఎంతో కృతజ్ఞతగలవారై ఉన్నారు అనార్కలీ విచారించవలసిన అగత్యం ఏమీ కనబడదు

తన కొడుకు ప్రణయాన్ని అక్బరు ఎందుకు ప్రతిఘటించవలసి వచ్చింది? అక్బరు ఏకపత్నీ వ్రతుడు కాడు ఆయనకు చాలా మంది భార్యలున్నారు సలీమ్ అనార్కలీని పెళ్ళి చేసుకుంటే ఇంతలో అక్బరు సామ్రాజ్యానికి అడుగు ఊడేదేమీ లేదు అక్బరు అనార్కలీని, ''నువు పట్టపు రాణి కావాలని చూస్తున్నావు'' అంటాడు అసలీమాట అక్బరు అనటమే అతని బుద్ధితక్కువ ఆమె ప్రణయం గురించి ఆయనకు మొదటినుంచీ తెలుసు సలీము యువరాజని తెలియకుండానే అనార్కలీ చాలా కాలం అతన్ని ప్రేమించినట్టు సాక్ష్యం సంపాదించటానికి అక్బరుకు అయిదు నిమిషాలు పట్టదు అక్బరు తెలివితక్కువగా చేసిన ఈ ఆరోపణ అబద్ధమైనదని అనార్కలీ సులువుగానే చూపిస్తుంది

అనార్కలీ పాత్రను మధ్య పెట్టుకుని తండ్రీ కొడుకులు తగాదా పడటమూ, మిగిలిన విషయాలన్నీ పోయి అనార్కలీ తాగివచ్చి నృత్యం చెయ్యటం మహాపరాధం కావటమూ, సలీమ్ తండ్రి మీదికి యుద్ధానికి రావటమూ, కొడుకును యుద్ధంలో చంపబోయిన అక్బర్ కొడుకును ఆహ్వానించి తనను చంపమనటమూ, మహబాగని సలీమ్ తండ్రిని చంపబోతుండగా, గుర్రమెక్కిన వాడికీ ఏను గెక్కిన వాడికీ మధ్య నేలమీద నిలబడి ఉన్న అక్బరు భార్య అడ్డుపడి వారించటమూ, మరుక్షణమే అక్బర్ కొడుకును పట్టించి, ఖైదులో వేయించి, ఉరిశిక్ష విధించటమూ మొదలైన సంఘటనలు జుగుప్సాకరంగా ఉండటమే గాక అక్బరు సలీమ్ పాత్రలకు ఒక నీతీ, ఒక ధర్మమూ, కాస్తంత బుద్ధీ కూడా లేనట్టు నిరూపిస్తున్నాయి

న్యాయంగా అక్బర్ సలీములకు రాజకీయ ఘర్షణ జరిగితే ఒక్కందుకే జరగాలి సలీమ్ అనార్కలీని పెళ్లాడి ఆమెనే పట్టపురాణిని చేస్తానని పట్టుపట్టటం వల్ల కాని అది చిత్రంలో జరగదు

ఆఖరుకు ఆఖరు సన్ని వేశం కూడా నమ్మదగిలేదు అప్పుడే కట్టిన సమాధి దగ్గరకు వచ్చి సలీమ్ సమాధి కేసి తలకొట్టుకోకపోతే చిన్న పలుగు సంపాదించి సులువుగా పగలగొట్టి అనార్కలీని ప్రాణాలతో పైకి తీయవచ్చు ప్రాణాలతో గోడలమధ్య సమాధి చేసిన మనిషి తుపాకీ గుండు పెట్టి కొట్టినట్టు క్షణాల మీద చావదు

సన్నివేశాలలో బలం లేకపోవటమూ, పాత్ర పోషణ అసలే లేకపోవటమూ ఈ చిత్రంలో ప్రధాన లోపాలు ఒక్క పాత్ర కూడా రాణించకపోవటానికివే కారణాలు అనార్కలీగా అంజలి,

సలీమ్‌గా నాగేశ్వరరావు, అక్బర్‌గా రంగారావు, జోధ్ బాయిగా కన్నాంబ, మాన్ సింగుగా నాగయ్య, గుల్నార్‌గా సురభి బాల సరస్వతి – ఇంతకంటే మంచి కాస్టింగ్ ఈ చిత్రానికి ఎవరూ చెయ్యలేరు అందరూ శక్తివంచన లేకుండా నటించారు కాని ఒక పాత్రా చెప్పుకోదగినంతగా రాణించలేదు ఉన్న పాత్రలలో సలీమ్, అనార్కలీ పాత్రలు కొంత బాగున్నాయి

వేదాంతం రాఘవయ్యగారి దర్శకత్వం బాగానే ఉంది కాని అందులో ఉపజ్ఞ ఏమీ కన పడదు సముద్రాల వారి సంభాషణలలో ఇంతగా ఉపన్యాసాలుండటం రివాజు లేదు

సంగీతం విషయంలో కొంత కాకుండా అంతా హిందీ ''అనార్కలీ'' ని అనుకరిస్తే ఇంకా తృప్తికరంగా ఉండేదేమో హిందీ చిత్రంలాగే తెలుగు 'అనార్కలీ'కూడా ప్రేక్షక సామాన్యాన్ని ఆకర్షించి రంజింపజేస్తే ఆశ్చర్యం ఏమీ లేదు

*తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 13–5–1955*

# 41. సంతానం

ఇటీవల విడుదల అయిన సాధనావారి 'సంతానం' చిత్రాన్ని ఆగస్టు 14న మద్రాసు, పారగన్ టాకీస్‌లో పత్రికలవారికీ, పరిశ్రమలో వారికీ ప్రదర్శించి చూపారు సాధనావారి తొలిచిత్రం 'సంసారం' చాలా విజయవంతంగా నడిచింది 'సంతానం' ఈ సంస్థ నిర్మించిన రెండవ చిత్రం

ఇందులో రంగయ్య అనే ఒక ఫ్యాక్టరీ కార్మికుడి కూతురూ, ఇద్దరు కొడుకులూ తల్లిని పోగొట్టుకుని తండ్రిలేచి పోయాక చాలా ఇబ్బందులుపడి, తలాఒక దారీ అయిపోయి, పెద్దవారై ధనికుల పిల్ల ప్రేమ సంపాదించి, ఒకరినొకరు కలుసుకోవడటేమ గాక, చిన్ననాడు లేచిపోయిన తమ తండ్రిని కూడా కలుసుకుంటారు కథ సుఖాంతం

'సంసారం', 'సంతానం'–రెంటినీ పోల్చే పక్షంలో, అనేక అంశాలలో 'సంసారం ' ఎక్కువ బలమైన కథ ఆ కథలో పాత్రలు బలమైనవి అందులోని పాత్రలు అనుభవించే కష్టాలకు ఇతర పాత్రల దోహదం స్పష్టంగా చిత్రించబడింది

'సంతానం' లో కష్టాలూ, సుఖాలుకూడా నైతికంగానే వచ్చినట్టు కనబడతాయి ఫ్యాక్టరీ కార్మికుడు ఎప్పుడూ దరిద్రదేవత పంటికిందనే వున్నాడు అయినా రంగయ్య భార్య పోం టంతోనే కష్టాలు ఆరంభమవుతాయి కోమటికి చాలాబాకీ పడతాడు సైకిలు అమ్ముతాడు కాళ్లు పోగొట్టుకుంటాడు పిల్లల్ని వదిలేసి వెళ్లిపోతాడు ఈ దుస్సంఘటనలు ఏ వరసలో ఎప్పుడు జరిగినా జరగవచ్చు కాని ఒక క్రమంలో జరగటం వల్ల కథ ఒక విధంగా పరిణమించటానికి అవకాశం ఏర్పడింది

ఉండేందుకు ఇల్లుకూడా లేకపోయేసరికి కార్మికుడి కూతురు లక్ష్మి, తన తమ్ములైన రాముా, బాబూలను తీసుకుని రైలెక్కుతుంది ఇది మొదలు ఈ ముగ్గురూ వేరువడి పోయేదాకా నడచిన సంఘటనల పరమార్థం ఈ పాత్రలను వేరు చెయ్యటమే తప్ప మరొకటేమీ లేదు టిక్కెట్టు కలెక్టరు వచ్చి లక్ష్మిని, బాబును దింపేస్తాడు బెంచీకింద పడుకుని నిద్రపోయే రామును లక్ష్మి లేపదు రాముా మరెక్కడికో వెళ్లి నాటకాల కంపెనీలో చేరిపోతాడు

బాబును దొంగలు ఎత్తుకుపోయి లక్ష్మి నుంచి వేరుపడిపోవటం కోసం బాబు మెడలో

ఒక గొలుసూ, లాకెట్ వేయించారు ఇదే తరవాత వారిద్దరూ కలవటానికి ఉపకరిస్తుంది కూడా

ముగ్గురు పిల్లలూ పెద్దవారయేదాకా వారిపరిస్థితులలో మార్పేమీ లేదు – లక్ష్మి లక్షాధికారి ఇంట పనిచేస్తూనే ఉంది, యజమాని కొడుకు ఆమెను ప్రేమిస్తూనే ఉన్నాడు, రాము నాటకాలలో వేషాలు వేస్తూనే ఉన్నాడు, బాబును దొంగలనుంచి ఏ వస్తాదైతే విడిపించాడో ఆ వస్తాదు ఇంట వ్యాయామం చేసుకుంటూనే ఉన్నాడు

విరామం తరువాత మళ్లీ సినిమా ఆరంభమైనట్టుగా పెద్దవాళ్లయ్యాక మళ్లీ వీళ్ల జీవితాలు కదలబారుతాయి లక్ష్మిని ప్రేమించే లక్షాధికారి కొడుకు వైద్యం చదవడానికి లండన్ ప్రయాణం కాగానే లక్ష్మిని ఇంట్లో నుంచి గెంటుతారు నాటకాల కంపెనీ మేనేజరు కూతురుతో పెళ్లి తప్పించుకోవడానికి పారిపోయి, రామూ తనను ప్రేమించబోయే పిల్ల తండ్రి అయిన కోటేశ్వరుడి కూతురి ఇంట దాక్కుంటాడు లక్ష్మిమాజీ యజమాని కూతుర్ని బాబు రౌడీలనుండి రక్షించి ఆమె హృదయాన్ని దొంగిలిస్తాడు

చివరికీ పాత్రలు కలుసుకోవటం కూడా లాకెట్ సహాయం వల్లా, లక్ష్మి చిన్నప్పటి నుంచీ పాడుతూ వచ్చిన ఒక పాటవల్ల కలుసుకుంటారు వారు ఒకరినొకరు గుర్తించని స్థితిలో వారి మధ్య కలిగే 'డ్రామా' కాస్త లక్ష్మి, రామూలు పనిమనిషిఫ్యాక్టరీ యజమాని కావటం ద్వారా ఏర్పడుతుంది చివరలో బాబు తెలియక తన తండ్రినే దోచటంలో మరికొంత డ్రామా ఏర్పడుతుంది కాని వీటి నుంచి చెప్పుకోదగిన పరిణామాలేమీ కలగవు ముందే చెప్పినట్టు, కార్మికుడి సంతానం పొందే కష్టాల్లాగే, చివరకు పొందే లాభాలుకూడా కేవలం దైవికంగా వచ్చినట్టు కనబడతాయి

హాస్యం లోకూడా 'సంతానం', 'సంసారం' చిత్రానికి పోలదు

ఎన్నదలిస్తే కథనంలో చాలా లోపాలున్నప్పటికీ 'సంతానం' ప్రధానంగా కథకుడి చిత్రం కొన్ని చిత్రాలలో బలం డైరెక్షన్‌లో ఉంటుంది, మరికొన్నింట స్క్రిప్టులో ఉంటుంది, ఇంకా కొన్నింట నటనలో ఉంటుంది ఈ చిత్రంలో ఉన్న బలం ప్రధానంగా కథకు సంబంధించినది అంటే, ఈ చిత్రానికి మరొకరు డైరెక్టరుగా ఉన్నా, ఇతర నటులను పెట్టి తీసినా, స్క్రిప్టు మరొక విధంగా రాసినా చిత్రం ఇంతకంటే ఆట్టే బాగుండటానికి గాని, చెడిపోవటానికి గాని ఏమంత అవకాశం లేదు ఇటువంటి చిత్రం మీద మిగిలినవారి ప్రభావం చాలా తక్కువ

ఈ చిత్రంలో డైరెక్షన్, ఫొటోగ్రఫీ, సౌండ్ రికార్డింగ్, మ్యూజిక్, పాత్రధారుల నటన, సంభాషణలూ బాగున్న ఘట్టాలున్నాయి పేలవంగా ఉన్న ఘట్టాలున్నాయి కాని చిత్రమంతటా కథ యొక్క వ్యక్తిత్వం ఒకేవిధంగా ఉన్నది మిగిలిన అన్ని వ్యత్యాసాలనూ కథ మట్టం చేసేసింది

అది సినిమాకు పనికిరాని కథ అనటానికి వీలు లేదు పాత్రలూ, సంఘటనలూ జాస్తిగా ఉండే చిత్రాలు మన ప్రేక్షకులను తృప్తిపరుస్తాయి

చిత్రంలో ఉన్న సన్ని వేశాలలో కొత్త దనమూ ఆకర్షణాగల సన్నివేశం రామూ నిద్రలోనే నాటకం పద్యం పాడేయ్యటం ఈ పాత్రచేత పాడించిన మరి రెండు పద్యాలు కూడా ఇదే విధంగా రక్తికట్టాయి చిత్రం మొత్తంమీద చూసినట్టయితే సంభాషణలు సహజంగానే ఉన్నాయి పాటలలో చక్కని కవిత్వం ఉంది

సంగీతంలో సినిమా సంగీత లక్షణాలు చాలా తక్కువ పాటలకు పెట్టిన మట్లు పాటకు

రి ధోరణిలో ఉన్నాయి జోలపాట – లతామంగేష్కర్‌చేత పాడించినది కేవలం ''సింఫోనిక్'' గా ఉన్నది తెరమీద ఈ పాటను పదేళ్లపిల్ల విజయలక్ష్మి పాడుతుంటే చూసే ప్రేక్షకులకు ఏ భావం కలుగుతుందో ఊహించవచ్చు సినిమా పాటలు పాత్రలకూ, సన్నివేశాలకూ అనుగుణంగా ఉండి తీరాలి ఈ విషయం తృణీకరించి మన సంగీత దర్శకులు పరోక్షపు గాన పాండిత్య ప్రదర్శనాలు చేసి ఆవగింజంత అయినా ప్రయోజనంలేదు ఈ చిత్రంలో పాత్రకు అనుగుణంగా ఉన్న పాటలు రాముా పాత్రచేత పాడించినవి మాత్రమే ఆ పాత్ర స్టేజినటుడిది ఈ పాటలను ఘంటసాల చాలా సమర్థతతో పాడాడు లత, లీల, జిక్కి, జమునా రాణి మొదలైనవారి గానం కూడా బాగానే ఉన్నది

నటులు తమ నటనా ప్రాభవాన్ని గొప్పగా ప్రదర్శించటానికి చిత్రంలో అవకాశాలు తక్కువ అటువంటప్పుడు కూడా రేలంగి బాగానే నటించాడు ఎస్ వి రంగారావు, నాగేశ్వర రావు, సావిత్రి, శ్రీరంజని, మిక్కిలినేని, విజయలక్ష్మి, నాగేశ్వరరావు జూనియర్, రమణారెడ్డి, చలం కూడా బాగా నటించారు చదలవాడ, హేమలత, అల్లురామలింగయ్య, అమరనాథ్ మొదలైనవారికి అవకాశాలు బొత్తిగా తక్కువగా ఉన్నట్లు కనిపించాయి

గొప్ప చిత్రం అనిపించుకునే హంగులు లేకపోయినా, 'సంతానం' ప్రేక్షకులను తృప్తిపరచగల చిత్రం అవును

*తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 19-8-1955*

# 42. శ్రీ 420

ఇది రాజ్‌కపూర్ తయారుచేసిన మరొక 'ఆవారా' చిత్రం ఇందులో ఉండే వాస్తవికత విమర్శనాత్మకమైనదీ, సాంకేతికమైనదీనూ బొంబాయివంటి మహానగరంలో '420' లో – ''చార్ సౌ బీస్'' గాళ్ళు –ఎట్లా విజృంభించేదీ, చదువుకూ, సన్మార్గానికీ ఎట్లాచలామణీ లేనిదీ ఈ చిత్రం నిరూపిస్తుంది

సేట్ సోనాచంద్ ధర్మానంద్ ఒక 'శ్రీ 420', ఇలాంటి ''420'' ల జీవితాలకు ప్రతినిధి మాయా అనే నర్తకి ధనగర్వమూ, వంచనా, కామమూ, హృదయరాహిత్యమూ మొదలైనా ''420'' గుణాలన్నీ ఈమెలో మూర్తీభవించాయి

కథానాయకుడు రాజ్ బొంబాయి చేరుకునేసరికి అతనిదగ్గిర ఉన్నదల్లా బియ్యే సర్టిఫికేట్, సద్వర్తనకు బహుమతి పొందిన ఒక పతకమూ మాత్రమే బొంబాయిలో అడుగుపెడుతూనే అతను తన సద్వర్తనను కుదవపెట్టేసి 40రూ॥ సంపాదిస్తాడు అయితే బొంబాయిలో సద్వర్తనకు ఆపాటి విలువకూడా లేదని నిరూపించటానికేమో, కథకుడు ఆ కాస్త డబ్బూ జేబుదొంగ పాలయేటట్టు చేశాడు

విద్యను పోగొట్టుకోటానికి రాజ్‌కి మరికొంత కాలం పడుతుంది ఈ విద్య అతనికి ఒక మనిషి రూపంలో సాక్షాత్కరిస్తుంది ఆమె పేదది తండ్రి కాళ్ళుపడిపోయినవాడు ఆమె పేదపిల్లలను చేర్చి చదువుచెబుతున్నది ఎడారిలో జలాశయంలాగా బొంబాయిలో రాజ్‌కు ఈ విద్య దొరుకుతుంది ఈమె స్నేహం దొరికినాక రాజ్‌కు భవిష్యత్తు గురించి కలలుకనే అవసరం

ఏర్పడుతుంది అతను ఒక లాండ్రీలో ఇస్త్రీ చేస్తాడు

లాండ్రీ నౌకరుగా ఉండగానే అతనికి మాయతో పరిచయం కలుగుతుంది అంతకన్న మాయకు అతని పరిచయం కలుగుతుందనటం మంచిది— అతను పేకముక్కలు పంచటంలో హస్తలాఘవం ప్రదర్శించటం ఆమె చూసి, అతన్ని మంచి దుస్తులతో క్లబ్బుకు తీసుకుపోయి,''రాజ్ కుమార్''గా అక్కడి వాళ్ళకు పరిచయంచేసి 20 వేలు అతని ద్వారా పేకాటలో సంపాదించి, అతనికి ఒక్క పది రూపాయిల నోటు బక్షీస్ ఇచ్చి, మంచి దుస్తులు లాక్కుని పంపేస్తుంది గిరీశం 'జంఘప్పోచ' ప్రమాణం చెయ్యటానికి ఉపయోగించి నట్టుగా, రాజ్ హస్తలాఘవం 'శ్రీ 420' లో ఒకరినొకరు దోచుకోవటానికి పనికి వచ్చింది

ఈ హస్తలాఘవాన్ని రాజ్ స్వంతానికి వినియోగపరుచుకునే వాడేమో, రోడ్డుప్రక్క జూదం కనపడగానే అతను ఆశతో కూచున్నాడు కాని జేబుకొట్టటంచేత అతనికి డబ్బు చేసుకునే అవకాశం లేకపోయింది ఇంతలో విద్యతో స్నేహమయింది అతనికి పరువుగా డబ్బు సంపాదించా లనిపించింది విద్యను జూదం డబ్బులతో పోషించటం సాధ్యం అయే పనికాదు!

కాని అంతకంటె గత్యంతరం లేదని రాజ్ గ్రహిస్తాడు తాను కూడా ఒక 'శ్రీ 420' కావటానికి నిశ్చయించుకుని లాండ్రీ నుంచి అరువు పుచ్చుకున్న మంచి దుస్తులు తాను ధరించి, విద్యచేత ధరింపజేసి క్లబ్బుకు తీసుకుపోతాడు కాని క్షణంలో విద్య పరాభవించబడి కన్నీళ్ళతో బయటికి వెళ్ళిపోతుంది విద్య ఏనాటికీ 'శ్రీమతి 420' కాబోదని తేలిపోయింది

ఆమె కనీసం 'శ్రీ 420' తో తన జీవితం పంచుకుంటుందన్న ఆశతో రాజ్ ఆమెవద్దకు నోట్లకట్టలతో వస్తాడు— అయితే వాళ్ళు తెలిసి రావటం అతనికి చేతకాలేదు, అందుచేత తప్పతాగి మరీవస్తాడు! రాజ్ అంతస్సంఘర్షణ విద్యలో సంఘర్షణకు కారణమౌతుంది అయితే విద్య ఈ సంఘర్షణ నుండి త్వరగా బయటపడుతుంది

ధనికవర్గ జీవితంలోగల నైచ్యం అతని కళ్ళకు కట్టినట్టుచేసే సంఘటనలు వరసగా జరుగుతాయి ఫుట్‌పాత్ మీద జీవించే రాజ్ ఆప్తులు బిచ్చగాడూ, పళ్ళు అమ్ముకునే గంగాబాయి మొదలైన వారంతా రాజ్‌ను నమ్మి ఇల్లు కట్టించుకొనేందుకు తమ వద్ద ఉన్న డబ్బు చిల్లరతోసహా తెచ్చి అతనికిచ్చేస్తారు '420' లను వదిలెయ్యడానికి రాజ్ నిశ్చయించుకోవటంలో విద్య ఎంత బాధ్యత వహించిందో , గంగాబాయి మొదలైన వాళ్ల అంత బాధ్యతా వహించారనటానికి సందేహంలేదు

పాత్రపోషణ తీసుకొన్నట్లయితే అన్ని పాత్రలూ కొన్ని సాంఘిక లక్షణాలకు ప్రతిబింబాలే కథా నాయకుడు రాజ్ గతంకంటే భవితవ్యం నీరసంగా కనిపించే మధ్యతరగతికి ప్రతిబింబమైన పాత్ర మంచిని ప్రేమించే శక్తీ, 'శ్రీ 420' గా చలామణీఅయే శక్తీకూడా అతనిలో ఉంది అతను ముఖాలు మార్చగలడు రెండు పరస్పర విరుద్ధమైన శక్తులు అతనిలో ఉండటం చేతనే అతనిలో అంతస్సంఘర్షణ ఏర్పడుతుంది అతను బుద్ధిపూర్వకంగా తెచ్చిపెట్టుకున్న ముఖం అలాగే ఘనీభవించిపోయి మరీ నిరాకరిస్తుంది

సేట్ సోనాచంద్, మాయా మొదలైన వారిలో సంఘర్షణ లేకపోవటానికి కారణం వారిది నిష్కల్మషమైన '420' చిత్తవృత్తి మాయచేతిలో పనిముట్టుగా ఉండి రాజ్ తనని దోచినప్పుడు

సోనాచంద్ చలించడు కాని రాజ్ '420' గా తనతో పోటీపడ్డాడని సందేహం కలగగానే రివాల్వర్‌తో రాజ్‌ను ఆరుసార్లు కాలుస్తాడు! 'శ్రీ 420' ల మధ్యగల సఖ్యత ఫుట్‌పాత్ మీద జీవించేవారి సఖ్యత వంటిది కాదు

విద్య పాత్ర చూసినట్టయితే ఆమె రాజ్ సద్వర్తన పతకానికి ప్రాణం వచ్చినట్టుగా కనిపిస్తుంది అంతకంటె ఈ చిత్రంలో ఆమె నిర్వహించేపాత్ర లేకపోవటం ఒకటే ఈ చిత్రంలో పెద్దలోటు చిత్రం ఆరంభంలోనే ఆమె డబ్బుకు యిబ్బంది పడుతూండటం చూస్తాం ఆమె రాజ్‌ను ప్రేమించటం తరవాత చూస్తాం ఆ తరవాత ఆమె అతని ''420'' జీవితంలో పాల్గొన నిరాకరించటం చూస్తాం ఈ మధ్యలో ఆమె జీవితం కనబడదు కనీసం, రాజ్ ''420'' జీవితంలో ప్రవేశించటం ఆమె జీవితాన్ని ఎట్లా తారుమారు చేసిందీ మనం చూడం ఇది చూపించటానికి అసాధ్యం కాదు

నటులందరూ తమపాత్రలను చాలా బాగా నిర్వహించారు రాజ్‌కపూర్ రాజ్ పాత్రలో అన్ని దశలూ చాలా సమర్థతతో ప్రదర్శించాడు నర్గీస్ విద్యపాత్రను చాలా సహజంగా చిత్రించి, సునాయాసంగా పోషించింది సోనాచంద్ పాత్రకు నీమో అడుగడుగునా జీవం పోశాడు మాయ పాత్రకు నదీరా తూచినట్టు సరిపోయింది గంగాబాయి చాలా చిన్నపాత్ర అయినా దాన్ని లలితాపవార్ కలకాలం జ్ఞాపకం ఉండేటట్టు నటించింది

చిత్రంలో రాజ్‌కపూర్ డైరెక్షన్ దాదాపు నిర్దుష్టంగా ఉన్నది శంకర్, జైకిషన్ సంగీతం బాగానే ఉంది ''మేరాజూతాహై జాపానీ'', ''ఈ చకదానా బీచకదానా'', ''ముడ్‌ముడ్కే నదేఖ్'', ''రామయ్యా,వస్తావయ్యా'' పాటలు బాగున్నాయి ఒకటి రెండుపాటలు చిత్రంలో లేకపోయినా అంత ఇబ్బంది లేకపోను

ఆర్టుడైరెక్షన్,ఫొటోగ్రఫీ ఈ చిత్రంలో ప్రత్యేకించి ప్రశంసించదగి ఉన్నాయి కాని అందరి కన్నా ప్రశంసనీయులు కె ఎ అబ్బాస్, వి పి సాఠేలు వీరు ఈ చిత్రానికి పునాదిగా ప్రశంసార్హమైన స్క్రీన్‌ప్లే తయారు చేశారు అయితే వారు ఈ చిత్రంలో సాహిత్యపు విలువల కిచ్చిన ప్రాముఖ్యం రసపోషణకు ఇవ్వలేదేమోననిపిస్తుంది ఈ చిత్రం జన సామాన్యానికి అంతగా పట్టకపోతే దానికి ఇదే కారణం అనుకోవాలి

*తెలుగుస్వతంత్ర, వారపత్రిక, 11-11-1955*

# 43. ఝనక్ ఝనక్ పాయల్ బాజే

రాజకమల్ కళామందిర్ అధిపతి శ్రీ వి శాంతారాంకు రంగులంటే ఇష్టం రైళ్ళనడపాలని బులపాటం ఉన్న చిన్న పిల్లలు బొమ్మరైళ్ళ నడిపినట్టు, శాంతారాం తన రంగుల సరదా తీర్చుకునేటందుకు 'ప్రభాత్' రోజులలోనే ప్రతి చిత్రాన్ని కొంతభాగం రంగు చేయించేవాడు కొన్ని చిత్రాల తాలూకు కొన్ని కాపీలు పూర్తిగా రంగు చేయించాడు కూడా

శాంతారాంకు నృత్యాలంటే కూడా చాలా సరదా శాంతారాం డైరెక్షన్‌లో పాత్రధారులు చేసేది సాధారణంగా నటనకాదు, అభినయం ఆయన కథానాయికలందరూ ఒకటిగానే

అభినయిస్తారు సంతోషం వచ్చినప్పుడు ఆడిపోవడం, బింకం ప్రదర్శించడానికి గుర్రాలల్లే నడవటం, నిలబడి వున్న మనిషి అకస్మాత్తుగా పరుగెత్తిపోవడం, పోయే మనిషి బ్రేక్ వేసినట్టు ఆగడం వగైరా అభినయాలు శాంతారాం డైరెక్షన్‌లో పడికట్టురాళ్లు అన్ని భావాలనూ అయిదారు భంగిమలతో ప్రదర్శించేటట్టు చూస్తాడు శాంతారాం

సినిమా చిత్రాలను ఆత్మసాక్షాత్కారానికి సాధనాలుగా వినియోగించుకునే కొద్దిమంది నిర్మాతలలో శాంతారాం ఒకడు హెచ్చుమంది నిర్మాతలు వ్యాపారధర్మం, పాటించి ప్రజల అభిరుచులనూ ప్రజల ఇష్టాయిష్టాలనూ మాత్రమే చిత్రాలలో ప్రతిబింబించనిస్తారు కాని శాంతారాం తరగతికి చెందినవారు తమ అభిరుచులనూ, సంస్కృతినీ, చిత్రంలో ప్రవేశపెట్టి, తాము ఆదరించే విషయాలనూ, ద్వేషించేవాటినీ ప్రచారం చేస్తారు శాంతారాం ఇటువంటి ప్రచారం ప్రతి చిత్రంలోనూ చేస్తాడు శాంతారాంను కళాకారుడుగా పదిమంది చెప్పుకోవడానికి ముఖ్య కారణం ఇదే ఈ చిత్రంలో కూడా శాంతారాం తన అభిరుచులను బాగా ప్రతిబింబించనిచ్చాడు

ఈ కారణాలన్నిటినీ బట్టి 'ఝనక్ ఝనక్' శాంతారాం సినిమాకళకు సమగ్ర ప్రాతినిధ్యం వహించే చిత్రమని చెప్పాలి కళాకారుడుగా శాంతారాంకు గల శక్తులూ, అసమర్థతా కూడా ఈ చిత్రంలో పరాకాష్ఠ అందుకున్నాయి

ఈ కథలో నాయికా నాయకులు కళాతపస్సు చేసేవారు, కళకోసం జీవించి, కళకోసం బలి అయ్యే బాపతు, వీరివెనక కళాదీక్షబూని, కళాశపథాలు చేసే ముసిలివాడొకడు కథలోని ప్రధాన సమస్య కళారాధనకూ, ప్రేమకూ మధ్య సంఘర్షణ! ప్రేమికులలో కనీసం ఒకరు కళాభిమానులయితే ఆ సంఘర్షణ వాస్తవంగా వుండునేమో, ఇద్దరూ కళాకారులే కావటంతో సమస్య కాస్తయినా విశ్వసనీయంగా లేకుండా పోయింది ఇంతకూ వారిద్దరూ కలిసి నృత్యంచేస్తే గాని నృత్యం రక్తికి రాలేదు గనక చిత్రంలో చూపిన సంఘర్షణలో నేర్చుకునే నీతికూడా లేదు పాత్రల పోషణా, సన్నివేశాల కల్పనా అమిత చౌకబారుగా ఉంది హాస్యం బాగులేదు ఏడుపురావలసిన సంఘటనలు హాస్యాస్పదంగా ఉన్నాయి కథానాయిక ఎక్కడో ఏటి అవతల మండపంలో మీరాబాయి చిత్తరువు పోజులో కూచుని భజన్ పాడుకుంటూంటే నే కథానాయకుడు బెదురెత్తినవాడల్లే పరిగెత్తి, నదిలో దూకి ఈది, మళ్లా పరిగెత్తివచ్చి ఆమెను రాయి తీసుకుని తల పగలగొట్టబోవడమూ, ఆ క్షణంలోనే అతని తండ్రి అతని వెనక ఉండి అడ్డుపడడమూ లాటివి 1955లో ఎవరు చిత్రించినా ఆశ్చర్యపడవలసిందే చిత్రించినది శాంతారాం, మీదుమిక్కిలి టెక్నీకలర్‌లో, కనక మరింత ఆశ్చర్యం చిత్రం చివరలో జరిగే నృత్యపోటీ చిత్రించే పంపిణీ బాక్సింగ్ టోర్నమెంట్‌ని స్ఫురింపజేస్తున్నది

డెబిట్ కింద చెప్పుకోవలసినవాటిల్లో కేశవరావ్ దాతే తప్ప మిగిలినవారందరూ వస్తారు సంధ్య మేకప్‌కూడా బాగాలేదు తాను రంగుల చిత్రం తీస్తున్నట్టు ప్రేక్షకులకు జ్ఞాపకం చెయ్యడానికి శాంతారాం అంతగా ప్రయత్నించవలసిన అవసరం లేదు ఆ ప్రయత్నాలు చౌకబారుగా ఉన్నాయి

క్రెడిట్ కింద చెప్పుకోవలసినవి కూడా చాలా ఉన్నాయి ఇది గొప్ప హిట్ చిత్రం

సినిమాలను విమర్శించేవాడు బాక్సాఫీస్‌ను చూసి మరీ విమర్శించాలి లేకపోతే విమర్శకుడని అనిపించుకోడు!

టెక్నీకలర్ చాలా ఆహ్లాదకరంగా ఉంది ఇన్‌డోర్, ఔట్‌డోర్ దృశ్యాలలో కలర్ డైరెక్షన్ సమాన ప్రతిభతో నిర్వహించబడింది

చిత్రం నడకలో ఎక్కడా నానుడూ, నచ్చూలేదు మొదటి నుంచి చివరదాకా ఒకే వేగంతో నడుస్తుంది అంత వేగం ఉన్నా చిత్రం తల దిమ్ము కలిగించకపోవడం ఒక సుగుణం టేకింగ్, ఎడిటింగ్ సమర్థతతో కూడుకుని ఉన్నాయి

నృత్యాలలో గడసాని ( ఆక్రోబాటిక్స్) లక్షణాలున్నప్పటికీ చూడడానికి బాగా ఉన్నాయి

మొత్తంమీద ఈ చిత్రం ఎక్కువమందిని ఆకర్షించే చిత్రమైనా ఎక్కువకాలం చెప్పుకోదగిన చిత్రంమట్టుకు కాదు

★ ★ ★

గుర్రపు పందాలలోలాగే సినిమా రంగంలో చిత్రాల జయాపజయాలు గ్రహచారాన్ని బట్టి జరుగుతాయా అనిపించేటట్టు కొన్ని తార్కాణాలు కనిపిస్తాంటాయి ఈ యేడు మామూలు చిత్రాలు కూడా బాగా డబ్బు చేస్తుండమూ, చిత్ర నిర్మాణం వెర్రిగా సాగటమూ మనం ఇక్కడ చూస్తున్నాం ఇటువంటి పరిస్థితే హాలీవుడ్‌లో కూడా కనిపిస్తున్నది

టెలివిజన్ తాకిడికి దెబ్బతిని కొంతకాలంగా హాలీవుడ్ చిత్రాల సంఖ్య బాగా పడిపోయింది అక్కడకూడా ఈ యేడు చిత్రాలకు మంచి దశ ఎత్తుకున్నది ఈ యేడు హాలీవుడ్ నుంచి 250 చిత్రాలు వెలువడగలవనీ, ఇది ఈ రోజుల్లో హాలీవుడ్‌లో విడ్డూరంగా చెప్పుకోదగిన సంఖ్య అనీ అమెరికన్ పత్రికలు రాస్తున్నాయి

*తెలుగుస్వతంత్ర, వారపత్రిక, 18-11-1955*

# 44. తులాభారం

డిసెంబరు 25 ఆదివారం ఉదయం మద్రాసు పారగాన్ టాకీస్‌లో శ్రీరాజరాజేశ్వరి వారి 'శ్రీకృష్ణతులాభారం' ట్రేడ్‌షో జరిగింది ఈ చిత్రం ఇంతకు పూర్వమే ఆంధ్రలో విడుదల అయి విజయవంతంగా నడుస్తున్నది అనేక చిత్రాల కన్నా ఈ చిత్రం ప్రజాదరణను సంపాదించుకోవటానికి కారణం ఏమిటో ఊహించే అవకాశం సినిమా కళాకారులకూ, పత్రికల వారికి ఇప్పుడు లభించింది

ముత్తురాజు సుబ్బారావుగారు రచించిన ''తులాభారం'' నాటకం ఎన్నోఏళ్లుగా ఆంధ్రుల ఆదరాభిమానాలను చూరగొంటూ ఉన్నది ఈ నాటకంలో సత్యభామగా రాణించే అవకాశం స్థానం నరసింహారావుకు దక్కినట్టుగా మరొకరికి దక్కక పోయినప్పటికీ శ్రీకృష్ణుడుగా సి యస్ ఆర్ , యడవల్లి సూర్యనారాయణ, మాధవపెద్ది వెంకటరామయ్య, ఇంకా అనేకమంది నటించి రాణించారు అలా రాణించిన వారిలో కె రఘురామయ్య కూడా ఉన్నారు ఇది స్టేజి మీద అపజయం అన్నది ఎరగని నాటకాలలో ఒకటి

రాజరాజేశ్వరీ వారు లోగడ ఒక విజయవంతమైన నాటకాన్ని చిత్రంగా తయారు చేసి ఉన్నారు అది 'సక్కుబాయి' ఆ నాటకాన్ని ఈ సమీక్షకుడు చూడడం పడలేదు కాని తులాభారం నాటకాన్ని నిర్మాతలు సినిమా చిత్రం ఫోటోప్లేగా తీయాలని ప్రయత్నించ లేదు ఇంచుమించు నాటకాల ధోరణిలోనే చిత్రీకరించారు

రెండవ ప్రపంచయుద్ధానికి పూర్వపు రోజుల్లో విజయవంతంగా నడిచిన నాటకాలన్నీ కూడా సంగీత నాటకాలే అంటే కవి పాత్రల యొక్క ప్రధాన మనోభావాలను పద్యాల ద్వారా వ్యక్తికరించే వాడు, వాటికి నటులు సంగీత భావాన్ని జతపరిచి రక్తికట్టించేవారు నాటకాల్లో సంగీతానికి గల ప్రాముఖ్యన్ని వ్యక్తీకరించటానికి పద్యాలు చాలక దాదాపు అన్ని నాటకాలకూ అదనంగా పాటలు కూడా జతపరిచారు 'సావిత్రి'', 'ద్రౌపదీ వస్త్రాపహరణ' మొదలైన నాటకాలకు పాపట్లలక్ష్మీ కాంతయ్యగారు,'సక్కుబాయి' నాటకానికి దైతా గోపాలం గార్గూ, ఇతర నాటకాలకు ఇతరులు రాసిన పాటలు నాటకంలో అంతర్భాగంగా వుండి, అవి లేకపోతే ప్రేక్షకులకు నాటకమే లేదన్న పరిస్థితి నమ్మకంగా ఏర్పడింది

మనకు ఆపెరాలు లేవు వీధి భాగవతాలు వెనకబడ్డ తరవాత మనవాళ్ళు నాటకాలు తప్పవేరు సంగీత రూపకాలెరగరు నాటకాలు వెనకపడి సినిమాలు ముందుకు వచ్చాక క్రమంగా పద్యాలు అంతరించాయి కాని పాటలు పోలేదు, అయితే పాటలను ఉపయోగించే పద్ధతుల్లో క్రమంగా మార్పు వచ్చింది ఈ సినిమా పాటలు పాత్రల మనోభావాలను వ్యక్తం చేయటం మానేసి మానసిక స్థితిని మాత్రమే ప్రతిబింబించసాగాయి ఒక పాత్ర ఉల్లాసంగా ఉంటే ఒక సరదా పాట పాడుతుంది విచారంగా వుంటే ఒక జాలి పాట పాడుతుంది ఘోరమైన విపత్తులో ఉండి పాట పాడదు సినిమాలు వచ్చిన కొత్తలోనే 'హరిశ్చంద్ర' సినిమాలో హితాస్యుడు పోయాక చంద్రమతి పాటపాడితే అందరు ఆక్షేపించారు ''ఇదె వెళ్ళెద నేచెండా డెదన్ అరివారమున్ '' అని సినిమా పాత్రలు పాడటం మానేశాయి ''విడిపింపు తలపోసి వీని మతము'' అని ఒక పాత్ర ఇంకొక పాత్రను హెచ్చరించటం పూర్తిగా వెనక బడింది

రానురాను సినిమాలలో పాటలు ప్రవేశ పెట్టడానికి నిర్మాతలు జాగాలు వెతకవలసి వచ్చింది అసలు కధను పాటలు లేకుండానే రాసుకోవడమూ, కధకు అడ్డం రాకుండా పాటలు ఎట్లా ఇరికించడమా అని అలోచించటమూ ఆనవాయితీ అయిపోయింది దీని ఫలితంగా మనకు ప్రతి చిత్రంలోనూ పాటలుంటూ కూడా ''సంగీత చిత్రాలు'' అనేవి లేకుండా పోయాయి

నిజానికి ఇది లోటే అయింది ఇతర దేశాల వారు ఆపెరాలను చిత్రాలుగా తయారు చేసి ప్రేక్షకులకు సంగీత చిత్రాలు అందచేసారు ఇంకా వాస్తవికత కావాలన్నప్పుడు ఏ కథానాయికను ఆపెరా గాయకురాలిగా చేసి ఆపెరా దృశ్యాలు కథలో ప్రవేశపెట్టి కమ్మని సంగీతానికి తావిచ్చారు ఇంటర జెడ్ మెలోడీ అనేది ఇలాటి చిత్రం ఇందులో ఇలిమోనార్ పార్కర్ పాడిన అనేక అద్భుతమైన పాటలున్నాయి

మన తెలుగు చిత్రాలలో ఎక్కడన్నా రంగస్థలం ప్రవేశ పెడితే హాస్యం కోసం పెట్టారు గాని ప్రజలు ఆదరించే సంగీతం కోసం పెట్టలేదు సంగీత చిత్రాలు తీయాలంటే పాత

నాటకాలను సినిమా చిత్రాలుగా తయారు చేయటం ఒక సులువైన పద్ధతి ఇటువంటి పద్ధతి ప్రజలకు రుచిస్తుందని 'సక్కుబాయి' నిరూపించి వుండని పక్షంలో 'తులాభారం' నమ్మకంగా రుజావు చేసింది ఇప్పుడు తయారవుతున్న 'చింతామణి ', 'హరిశ్చంద్ర' చిత్రాలు కూడా ఇటువంటి విజయాన్నే సాధిస్తాయని ఆశించుదాం

ఇందులో ఇంకొక విశేషం కూడా లేకపోలేదు సినిమాలు వచ్చి నాటకాలను అన్ని విధాలా తమ పొట్టన పెట్టుకున్నాయి నాటకాలలో నటించేవారు, సంగీతం ఇచ్చేవారు, ఆఖరుకు నాటకాలు రాసేవారు కూడా సినిమాలలోకి వచ్చిపడ్డారు కాని వాతాపిలాగా నాటకం సినిమా పొట్టచీల్చుకొని మళ్ళాబయటికి రావటం తులాభారంలో కనిపిస్తుంది

ఎందుచేతనంటే ఇందులో కొన్ని సినిమా లక్షణాలున్నప్పటికీ చాలా లక్షణాలు నాటకానివి నాటకం పద్యాలన్నీ ఇందులో వున్నాయి అంతేగాక ఇందులో పాటలు నాటక ప్రయోజనాన్ని సాధించేవేగాని సినిమా ప్రయోజనాన్ని సాధించేవి కావు ( అదనంగా రాసిన పాటలకూ పద్యాలకూ కూడా ఇదే వర్తిస్తుంది) డైరెక్షనూ, చిత్రీకరణ వగైరాలు కూడా సినిమా ధోరణిలో లేవు ఈ చిత్రంలో ప్రధాన పురుషపాత్రలు ధరించిన రఘురామయ్య, సూరిబాబు సినిమాలలో చాలా కాలం నటించినప్పటికీ వాళ్ళు ప్రధానంగా స్టేజి నటులే వారు స్టేజి మీద రాణించినట్లుగా సినిమాలలో ఏనాడూ రాణించ లేకపోయారు ఈ చిత్రానికి పాటలు ( అదనపు పాటలు రచించిన దైతా గోపాలం గారు కూడా నాటకాలకు పాటలు రాయటంలోనే ప్రసిద్ధులు – సినిమాలకు పాటలు రాయటంలో కాదు

సంగీత నాటకాలలో సంగీతానికి ఒక ప్రత్యేకత ఉన్నది వీటిలో సంగీతం కొంత వరకు నటనకు ప్రత్యామ్నాయంగా ఉంటుంది మామూలు నాటకంలో ( లేక సినిమా కథలో) ఒక పాత్ర శోకం అభినయించ వలసి వస్తే కళ్ళులో అశ్రువులూ, వాచికంలో గాద్గదికం తెచ్చి పెట్టుకోవాలి సంగీత నాటకంలో పాత్ర యొక్క శోకాన్ని సంగీతమే చాలా వరకు వ్యక్తం చేస్తుంది ఇదేవిధంగా క్రోధ, శృంగార, వీర, బీభత్స, భయానక వగైరా రసాలు సంగీతం ద్వారా వ్యక్తం చెయ్యవచ్చు

ఒకప్పుడు ఆంధ్రదేశంలో స్టేజీ సంగీతం గురించి చాలా తర్జన భర్జనలు జరిగాయి పద్యాలు వచనం లాగా చదవాలని కొందరన్నారు పద్యాలు పాడవచ్చుగాని రాగం అట్టే తీయగూడదని మరికొందరన్నారు కాని సంగీత నాటకాలై ఉండి, పద్యాలున్నప్పుడు వాటిని పాడకపోవడంలో అర్థంలేదు పాటను భావప్రకటనకు వినియోగించే వారు పరిమితంగా పాడడమంటే ఏమిటో నిర్ణయించటం కష్టం రాగాలాపనలో కూడా పాత్రయొక్క మానసిక స్థితి, అందులో కలిగే మార్పులూ చూపవచ్చు పద్యం పూర్తికాగానే టక్కున పాడటం ఆపెయ్యాలన్న సిద్ధాంతం సర్వత్రా సమంజసం కాదు 'తులాభారం' లో పద్యాలను విదిలించి పాడారు పద్యాలు ముగిసినాక రాగాలాపన కూడా చేశారు కనీసం కొన్ని పద్యాలోనైనా ఈ ఆలాపన సమర్థనీయంగానే వుంది పద్యభావానికి అవతలి పాత్ర ఏ సంభాషణ ద్వారానో వెంటనే రియాక్షన్ ఇవ్వవలసిన సందర్భాలలో మాత్రమే ఆలాపన సమర్థనీయం కాదు అటువంటి సందర్భాలు 'తులాభారం' లో చాలా తక్కువ

ఇది ఏవిధంగానూ చౌకచిత్రంకాదు ఉత్తమ నిర్మాణానికి అవసరమైన హంగులన్నీ ఈ చిత్రంలో ఉన్నాయి ఇందులో నాగేశ్వరరావు, రామారావు, నాగయ్య, ముక్కామల, భానుమతి, జమున, సురభి బాలసరస్వతి మొదలైన ప్రసిద్ధ నటులున్నారు బోలెడంత సంగీతం– 10 పాటలు, 15 పద్యాలు – ఉంది మంచి, మంచి సెట్టింగులున్నాయి ఇది ''ఖరీదు'' అయిన చిత్రం ఈ చిత్రం పూర్తికాక పూర్వమే రంగా సొంత స్టూడియో నిర్మాణం ప్రారంభించాడు ముందుగా రికార్డింగ్ – ప్రొజెక్షన్ థియేటరు తయారయింది 'తెనాలి రామకృష్ణ' రీ రికార్డింగంతా ఈ కొత్త థియేటర్లోనే జరిగిందట ఒక ఫ్లోర్, లాబ్, ఇతర కట్టడాలూ నిర్మాణంలో ఉన్నాయి రంగా ఈ విధంగా, టెక్నీషియన్ నుంచి నిర్మాతా, స్టూడియోదారు కావటమే గాకుండా చౌక చిత్రాల నుంచి ఉత్తమ తరగతి చిత్రాలకుపోయి అభివృద్ధి ప్రదర్శించటం ప్రశంసనీయమైన విషయం ఈయన ఈసారి తీయ సంకల్పించిన చిత్రం 'ఛత్రపతి శివాజీ' కూడా ఈ విషయాన్ని బలపరుస్తోంది

'తెనాలిరామకృష్ణ' లో కొన్ని జానపదగాథలూ, పుక్కిటి పురాణాలూ, చరిత్రా, కల్పనా సమ్మిళితం చేయబడింది ఈ పాత కొత్త సమ్మేళనం కళాదర్శకత్వంలో, సంగీతంలో, నృత్యాలలో, ఇంకా అనేక అంశాలలో గోచరిస్తుంది కథానాయకుడు రామకృష్ణుడు కవిగా, చాటువుల కర్తగా, రాజకీయ చైతన్యమూ, ప్రభుభక్తీ కలవాడుగా, హాస్యగాడైన వికటకవిగా కూడా చిత్రించబడ్డాడు రామకృష్ణుడే గాక, కృష్ణదేవరాయలూ, అల్లసాని పెద్దన్నా, ముక్కు తిమ్మన్నా, తాతాచార్యులూ, తిరుమలాంబా మొదలలైన పాత్రలన్నీ నిండుగా చిత్రించబడ్డాయి హాస్యం కోసం ఏ పాత్రగాని వెకిలిగా సృష్టించబడలేదు కొన్ని కొన్ని సంఘటనలు సందర్భం మార్చి చిత్రించబడ్డాయి ఉదాహరణకు, 17 ఏనుగులను ముగ్గురు అన్నదమ్ములకు తెలివిగా పంచినవాడు అప్పాజీ అని పుక్కిటి పురాణం అయితే ఈ సంఘటన రామకృష్ణుడికి ఆపాదించబడింది ఇటువంటి మార్పులు చిత్రంయొక్క రక్తికి ఏమాత్రం అడ్డురావు

సాధారణంగా నిర్మాతలు తాము చిత్రం తీసేటప్పుడు ప్రేక్షకుల ''తక్కువ'' అభిరుచులను గురించి చాలా భయపడతారు (వారి భయాలకు అప్పుడప్పుడూ ప్రేక్షకులు సాక్ష్యం యిస్తూంటారు కూడానూ!) అటువంటి సందర్భంలో, ఈ చిత్రంలో ఉత్తమ సాహిత్యానికి చెందిన పద్యాలనే గాక, కవితాగోష్ఠినికూడా ఎంతో సాహసంతో ప్రవేశపెట్టి, ప్రేక్షకుల రసికత్వంలో నిర్మాతకుగల విశ్వాసాన్ని వ్యక్తపరిచారు ఇది అభినందించదగిన విషయం

కృష్ణదేవరాయలు ఆస్థానంలో అష్టదిగ్గజాలూ, కవితా గోష్ఠులూ ముందుంచుకుని, బహమనీ నవాబుల కుట్రలతో కూడిన రాజకీయాలతో నాటకం నడిచింది ఈనాటకంలో పాత్రలుగా ముందు కనకరాజు అనే దేశద్రోహీ, తరవాత కృష్ణసానీ నాటకాన్ని నడిపిస్తారు ఈ కుట్రలను ఛేదించి కృష్ణదేవరాయలకు విజయం చేకూర్చే పాత్రను రామకృష్ణ కవి నిర్వహిస్తాడు

పండితులకు నచ్చేవీ, పామరులకు నచ్చేవీ అయిన సన్నివేశాలు చిత్రంనిండా కుప్ప

తెప్పలుగా ఉన్నాయి  చిత్రంలో నవరసాలకూ స్థానం కల్పించారు  నటనకు చక్కని అవకాశాలు ఉన్నాయి చిత్రం నిండా అన్ని పాటలూ, పద్యాలూ ఉన్నప్పటికీ ఒక్కటికూడా సందర్భశుద్ధి లేకుండా లేదు  ప్రేక్షకుడి ఆసక్తి ఎక్కడా, ఏసందర్భం వల్లకూడా తగ్గదు  మొదటినుంచి చివరిదాకా చిత్రం ఒకే వేగంతో నడుస్తుంది

పాటలు  రక్తిగా ఉండటానికి కారణం సరి అయిన సన్నివేశాలు మాత్రమే కాదు చిత్రంలోని సంగీతం చాలాచక్కగా ఉంది  పాటల ట్యూనులు ఎన్నిసార్లు విన్నా విసుగెత్తదు దానికి తోడు ఆర్  బాలసరస్వతీ, ఘంటసాలా, లీలా, కమలా మొదలైనవారు పాటలను చాలా చక్కగా పాడారు  భానుమతి స్వయాన పాడిన పాటలే ఒకమాదిరిగా ఉన్నాయనిపించాయి చిత్రంలో నేపథ్య సంగీతం కూడా చాల బాగుంది  కొన్ని ఘట్టాలలో అద్భుతంగా కూడా ఉంది

నటులలో అగ్రస్థానం అవలీలగా నాగేశ్వరరావుది  రామకృష్ణ కవికి అవసరమైన వేషభాషలు నాగేశ్వరరావుకు చక్కగా అమరాయి  అతను తాను నిర్వహించే పాత్రను బాగా అర్థం చేసుకోవటమేగాక చాలా సులభంగా ఆ పాత్రను చిత్రించగలిగాడు  లోగడ చిత్రాలన్నిటి కన్నా ఈ చిత్రంలో నాగేశ్వరరావు వాచికం బాగా పదునెక్కినట్టు కనిపిస్తుంది  ఆయా ఘట్టాలు రక్తి కట్టించటానికి అనుగుణంగా అతను వాచికాన్ని అవలంబించి విజయం సాధించగలిగాడు తాతాచార్యులు పాత్ర నిర్వహించటంలో ముక్కామలా, అప్పాజీ పాత్ర నిర్వహించటంలో నాగయ్యాకూడా ఇదే విధమైన సౌలభ్యాన్ని ప్రదర్శించగలిగారు

కృష్ణదేవరాయలుగా ఎన్ టి రామారావు, కృష్ణసానిగా భానుమతీకూడా తమ పాత్రలతో చాలా సంఘర్షణ పడ్డట్టు కనిపిస్తుంది  వారాపాత్రలను అర్థం చేసుకోగలిగారనటానికి సందేహంలేదు  పాత్రలను చిత్రించటంలో ఎంతో శ్రమపడటంకూడా మనకుకనిపిస్తుంది కానివారు తీసుకున్న శ్రమకు పదహారణాల ఫలితం దక్కినట్టు కనబడదు  నటుడికీ పాత్రకూ ఎప్పుడూ సంఘర్షణ ఉంటుంది  అది ప్రతి నటుడూ ఎరిగిన విషయమే  అయితే పాత్ర నటుడికి పూర్తిగా లొంగి రానప్పుడే ఈ సంఘర్షణ ప్రేక్షకుడు గమనించ గలుగుతాడు  ప్రత్యేకించి భానుమతికి కృష్ణసాని పాత్ర కొన్ని చోట్ల ఏమాత్రం లొంగినట్టు కనబడదు  ఇది నిజంగా ఆశ్చర్యకరమైన విషయమే  ఎందుచేతనంటే అది భానుమతి అతి విజయవంతంగా నిర్వహించగల, నిర్వహించదగిన పాత్ర  కొంత లోపం పాత్ర రచనలోనే ఉన్నదేమోననుకోవాలి

రాణీ తిరుమలాంబగా సంధ్యా, రామకృష్ణుడి భార్యగా జమునా, రాధాసానిగా సురభి బాలసరస్వతీ, తాతాచార్ల శిష్యుడిగా వంగరా, కనకరాజుగా మిక్కిలినేనీ మొదలైనవారంతా తమ పాత్రలను చక్కగా నిర్వహించారు

ఫోటోగ్రఫీ, ఎడిటింగు, దర్శకత్వమూ చాలా బాగున్నాయి  నిర్మాతగానేగాక, దర్శత్వం లో కూడా బి ఎన్ రంగా ఉత్తమ కళాకారుడి లక్షణం ఒకటి వ్యక్తం చేసుకున్నాడు  అదేమంటే కళావస్తువులో తన వ్యక్తిత్వాన్ని ప్రతిబింబించటం, కళకూ, కళాకారుడికీ ఒక గాఢమైన సంబంధం

ఉంటుంది ఆ సంబంధాన్ని పురస్కరించుకునే అతను సమాజంతో చెయ్యికలుపుతాడు దానిద్వారానే తన సంస్కృతినికూడా వ్యక్తం చేస్తాడు కేవలం వ్యాపార దృష్టితో తీసిన చిత్రాలలోనూ, ప్రేక్షకుల అభిరుచులను కొలిచి 'ఫార్ములా' ప్రకారం తీసిన చిత్రాలలోనూ దర్శకుడి సాంఘిక, సాంస్కృతిక స్వరూపాలు వ్యక్తం కావు ఈ లోపం 'తెనాలి రామకృష్ణ' లో అంతగా కనిపించదు

సముద్రాల రాఘవాచార్యులుగారి రచనను గురించి రెండు మాటలు చెప్పకుండా ఈ సమీక్ష పూర్తికాదు ఇటువంటి చిత్రానికి రచన చెయ్యటం తేలికైన పనికాదు సాహిత్యంతో అపారమైన పరిచయమూ, ప్రాచీన పాత్రలను భావన చెయ్యగల శక్తి, ఒక్క వాక్యంతో గత సంస్కృతిని స్ఫురింపజేసే సామర్థ్యమూ, సన్నివేశాల వైవిధ్యంతో అనేక రకాల రసాలను పోషించగల సమర్థతా సముద్రాలవారు ఈ చిత్రంలో ప్రదర్శించారు ఈ చిత్రంయొక్క విజయంలో ఆయనకు గల పాలు అనల్పమైనది

★ ★ ★

గడచిన ఏడాదిలో ఒకవైపు చిత్రాలకు డబ్బు బాగా వచ్చినా, రెండోవైపు నిర్మాతలు తమ చిత్రాలు దెబ్బతినకుండా ఉండటానికి చాలా జాగ్రత్తలు తీసుకున్నారు వారు తీసుకున్న జాగ్రత్తలలో ఒకటి, ఇతర భాషలలో విజయవంతంగా నడిచిన చిత్రాలనే తీయటం మరొకటి, పేరు ప్రఖ్యాతులుగల నటీనటులనే బుక్ చెయ్యటం వీటన్నిటినీ మించిన జాగ్రత్త ఏమిటంటే నిర్మాణం ఖర్చు సాధ్యమైనంత తక్కువలో ఉంచటం

దక్షిణదేశంలో సినిమా పరిశ్రమ ఆర్థికంగా దెబ్బతింటున్న రోజుల్లో, జెమినీ వాసన్ మొదలైనవారు వినోదపుపన్ను తగ్గింపు కోసం తీవ్రంగా ఆందోళన చేస్తున్న కాలంలో, సినీ టెక్నీషియనులు– ప్రత్యేకించి కె రామనాథ్ – చిత్రనిర్మాణంలో దుర్వ్యయం చాలా ఉంటున్నదనీ, అది తగ్గితే చిత్రాలు దెబ్బతినవలసిన అవసరం లేదనీ బల్లగుద్ది వాదించారు ఈ వాదన అప్పట్లో నిర్మాతలకు నచ్చలేదు ''ఇది దుర్వ్యయం అని పైవాళ్లు ఎల్లా చెప్పగలరు? ఏ నిర్మాతా కావాలని, బుద్ధిపూర్వకంగా ఒక్క దమ్మిడీకూడా వృథా ఖర్చుచేయడు నీకు దుర్వ్యయంగా కనబడేది నిర్మాత దృష్టిలో అవసరమైన ఖర్చే!'' అన్నారు వారు

వాగ్వాదానికైతే ఇదంతా చాలా బాగుంది గాని, నిర్మాతలు తెలివితక్కువచేతా, కొన్ని సులువులు గ్రహించకపోవటం చేతా దుర్వ్యయం చెయ్యటానికి ఈ వాదనలేవీ అడ్డురాలేదు 1954 నుంచీ ఈ దుర్వ్యయం క్రమంగా తగ్గుతూ వస్తున్నది ఇప్పటికైనా దుర్వ్యయం లేదనలేంగాని, అతి సాధారణ చిత్రానికికూడా ఆరేసి లక్షలు ఖర్చు చేసే రోజులు ముందుండవని చెప్పవచ్చు

నిజానికి చిత్రనిర్మాణంలో పెద్దఖర్చు నటులకు సంబంధించినది పేరుబడ్డ నటులకు ఎక్కువ ఇవ్వాలి కాని అందులో నష్టం ఉండదు ఎందుకంటే అనామకులను తీసుకున్నదానికీ, పేరుపడ్డ వారిని తీసుకున్న దానికీ ఉండేతేడా చిత్రంమీద రాబడిలో అనేక రెట్లుగా కనిపిస్తుంది

అందుచేత పేరుబడ్డ నటులకిచ్చేది దుర్వ్యయమని ఏ నిర్మాతా భావించడు పోతే ఈ పెద్దనటులద్వారా దుర్వ్యయం ఎందుకు జరుగుతుందంటే, వీరు అనేక చిత్రాలలో ఒకేసారి పనిచేస్తూ ఏ చిత్రం షూటింగుకూ సరిగా హాజరు కాలేరు గనక

ఇది నిజంగా పెద్దచిక్కే ఎందుకంటే, మిగిలిన ఖర్చులన్నీ సమంగానే ఉన్నా తీయటానికి ఎక్కువ కాలం పట్టిన చిత్రానికి ఎక్కువ ఖర్చవుతుంది పేరుపడ్డ నటులను చిత్రాలలో వినియోగిస్తూనే నిర్మాతలు ఈ రకమైన ఖర్చును సాధ్యమైనంత వరకూ తగ్గించే యత్నాలు చేశారు దీనికిగాను వారు చాలా పద్ధతులు అవలంబించారు అందులో ఒకటి డబుల్ కాల్ షీట్స్ తీసుకోవటం ఉదయం తొమ్మిదికి ప్రారంభించిన షూటింగు రాత్రి తొమ్మిదిదాకా జరపటం

1955 లో డబుల్ కాల్ షీట్స్ పరిపాటి అయాయి నిజానికి అందులో చాలా సౌకర్యాలున్నాయి వారం రోజుల్లో గాని పూర్తికాని షూటింగు మూడు రోజుల్లో అయిపోతుంది పెద్దనటులు ఎలాగూ రోజుకు రెండేసి కాల్‌షీట్సుకు పని చేస్తూనే ఉన్నారు రెండురకాల మేకప్‌తో రెండు పాత్రలు నటించేకన్న ఒకేపాత్ర నటన, మేకప్‌లో తేడాలేకుండా రెండు కాల్ షీట్స్ చెయటం వారికి చాలా సులువు స్టూడియోవారి లెక్కన కూడా ఒకేసెట్టు ఫ్లోర్ మీద ఎంతోకాలం ఉండదు డిస్ట్రిబ్యూటరు వైపునుంచి చిత్రం దబ్బున రంగు తేలుతుంది

పెద్దనటులు కూడా నిర్మాతలతో సహకరించి వారికి ముందుగా కొన్ని రోజులు కేటాయిస్తున్నారు ఒక నటిగాని, నటుడుగాని లభ్యం కాని రోజున నిర్మాత ఇతరులతో షూటింగు జరుపుకోవచ్చు ఇటువంటి ఏర్పాట్లు నిర్విఘ్నంగా కొనసాగటానికి గాను నిర్మాతలు అచ్చుగా ఒక స్టూడియోకే అంటిపెట్టుకోక, వీలయిన చోటల్లా సెట్ వేసుకుంటున్నారు

ఇటువంటి పద్ధతులు చిత్ర నిర్మాణ వ్యయాన్ని తగ్గించటానికి తోడ్పడుతున్నాయి నిర్మాణ వర్గం తాలూకు వ్యక్తులు ఆసక్తితో, సహకారంతో చురుకుగా పనిచెయ్యటం చిత్రాలకు అంతులేని లాభం చేకూర్చగలుగుతుంది ఇక్కడే ''పెద్ద'' కంపెనీలలో ప్రతి తాఖీదూ ''అడంగు'' నుంచి రావాలి కంపెనీ పెద్దదైన కొద్దీ అందులో పనిచేసేవాళ్ళు ''చిన్నవాళ్ళు'' అయి ఊరుకుంటారు వారు చొరవగా పనిచెయ్యరు చెప్పినది చేసి చేతులు కట్టుకు కూచుంటారు, చెప్పుదెబ్బ లేవైనా ఉంటే శిరసావహించి, ఎప్పటికప్పుడు మరింత ''చిన్న'' వాళ్ళయి పోతుంటారు చిత్రం సృష్టించటంలో తమకుకూడా కొంత బాధ్యత ఉన్నదన్న ''గర్వం'' వారికి ఉండదు ఉండే అవకాశమూలేదు

చిన్న కంపెనీలలో నిర్మాణంలో పాల్గొనే ప్రతి ఒక్కడూ తాను ఏ బాధ్యత నిర్వహిస్తున్నదీ, నిర్మాణానికి ఏవిధంగా తోడ్పడుతున్నదీ తెలిసి పనిచేస్తాడు వాడికా పనిలో నిజమైన ఆనందం లభించే అవకాశం ఉంది అందుకే ''చిన్న'' కంపెనీలు తక్కువ ఖర్చుతో చిత్రాలు తీయగలుగు తున్నాయి, వాటిలోనే కొన్ని మంచి ఆర్థిక విజయంకూడా సంపాదించగలుగుతున్నాయి

''సినిమా ఫీల్డులో మరీ పెద్ద కంపెనీలైనా ఉండాలి, చిన్న కంపెనీలైనా ఉండాలి మధ్యరకం కంపెనీలకు ఇక రోజులులేవు'', అని ఒక ప్రసిద్ధ నిర్మాత రెండేళ్ళ క్రితం జోస్యం చెప్పారు

అయితే ఈనాడు మనం, ''ఇకముందు చిన్న కంపెనీలవే రోజులు'', అనుకోవచ్చు

అంతమాత్రం చేత పెద్దకంపెనీలు దివాలా ఎత్తిపోవాలని కాదు అవికూడా ''చిన్న'' కంపెనీలుగా పనిసాగించవచ్చు ముఖ్యమైనది సౌలభ్యం కథను ఎన్నుకోవటంలో, షూటింగు సాగించటంలో ప్రొడక్షన్ షెడ్యూల్ చేసుకోవటంలో సౌలభ్యానికి అగ్రస్థానం ఇవ్వాలి ''గొప్ప'' చిత్రాలు తీసే పద్ధతులూ, మనస్తత్వమూ దాని వెంట ఉండే స్తనశల్య పరీక్షలూ, ప్రతిషాట్ కూడ తొమ్మిదేసి టేక్ లూ— ఇలాటివన్నీ గిట్టుబాటు కానివే

అయితే, చిత్రనిర్మాణ వ్యయంతగ్గి, ఆర్థికంగా చిత్రాలు దెబ్బతినటం తగ్గిపోయినకొద్దీ ఇంకో కొత్తసమస్య ఏర్పడుతుంది— తయారయే చిత్రాల సంఖ్య పెరుగుతుంది అలా పెరగటంవల్ల పరిస్థితులు బాగున్నట్టు స్పష్టమవుతుందే గాని, అది మంచి పరిస్థితులకు దారితీస్తుందని ఎక్కడాలేదు ఇవాళ చాలా చిత్రాలు నిర్మాణంలో ఉన్నాయి ఇవి ఒకదానిమీద ఒకటివచ్చి పడితే అన్నిటికీ నష్టమే

సాధారణ పరిస్థితులలో ఈ సీజనుకు పోటీ ఉండవలసింది కానీ ఈ సంక్రాంతికి విక్రమ్‌వారి తెనాలి రామకృష్ణ (విడుదల జనవరి1) మాత్రమే బయటికి వచ్చింది దానిమీద పోటీ ఇంతవరకూ చిత్రంలేదు కాని ఇకముందు ఒకదాన్నొకటి తరుముకుంటూ రావచ్చు

*తెలుగు స్వతంత్ర, వారపత్రిక, 27–1–1956*

# 46. దేవదాసు (హిందీ)

శరత్ రచన 'దేవదాసు' ను 1935లో న్యూథియేటర్స్ వారు సినిమా చిత్రంగా తయారు చేశారు అప్పుడది బెంగాలీ, హిందీభాషలలో, పి సి బరువా డైరెక్షన్‌లో తయారయింది తిరిగి1953లో వినోదావారు అదే కథను తెలుగు, తమిళ భాషలలో తయారు చేశారు అది చాలా విజయ వంతంగా నడిచింది, ఇంకా నడుస్తూనే ఉంది ఇంతలోనే బిమల్ రాయ్ ప్రొడక్షన్స్‌వారు, బిమల్ రాయ్ దర్శకత్వంలో 'దేవదాస్' హిందీలో తయారుచేసి ఇటీవలనే విడుదల చేశారు

వినోదావారి 'దేవదాసు' విడుదల అయినప్పుడు కొంతమంది దాన్ని న్యూథియేటర్స్‌వారి చిత్రంతో పోల్చారు కాని ఆ రెంటికీ మధ్యనున్న 20 ఏళ్ళ కాలంలో చిత్రనిర్మాణంలో ప్రతి అంశమూ ఎంతగానో అభివృద్ధి అయింది కథకు సంబంధించిన విషయాలలోకూడా పోలికలేదు అసలు కథ బెంగాలుది దాన్ని చిత్రంగా తయారుచేసిన వారిలో, డైరెక్టుచేసిన వారిలో ఒకరు బెంగాలీలు, రెండోవారు తెలుగువారు ఒకరికి వాస్తవికత అయినది రెండోవారికి ప్రయత్న పూర్వకమైన కల్పన అంచేత న్యూథియేటర్స్ చిత్రాన్ని వినోదావారి చిత్రంతో పోల్చటానికి ఏవిధంగానూ అవకాశం లేదు

అయినా అవతలివాణ్ణి చంపటం ఎప్పుడూ వ్యాపారధర్మమే గనక, వినోదావారి 'దేవదాసు' కు అపోజిషన్‌గా న్యూథియేటర్స్ చిత్రం తెచ్చి ఆడారు న్యూథియేటర్స్ చిత్రం

చిత్తుగా ఓడి పోయినట్టు కనబడింది దేవదాసు పాత్రను సైగల్ ఎంతబాగా నిర్వహించినా, నాగేశ్వరరావులాగా ఆ పాత్రకు సరిపోయే అవకాశంలేదు అసలు వినోదావారి చిత్రంమీదికి ఇక్ష్వాకులనాటి న్యూథియేటర్స్ చిత్రాన్ని పోటీ తెచ్చిన వారిది పొరపాటు

కాని బిమల్ రాయ్‌గారి 'దేవదాస్' సరికొత్త చిత్రం బెంగాలీ కథను బెంగాలువాళ్ళు చిత్రీకరించారు దేవదాసు పాత్రకు యావద్భారత ఖ్యాతిగల దిలీప్ కుమార్‌ను నియోగించారు నిర్మాత, దర్శకుడు, చిత్రకథకుడు, సంగీత దర్శకుడు, సినిమాటోగ్రఫర్, ఆర్ట్ డైరెక్టర్, ఎడిటర్ మొదలైన వారంతా బెంగాలీలే

అందుచేతనే ఈ చిత్రం వినోదావారి చిత్రం కన్న శిల్పంలో ఏమాత్రమూ తీసిపోక, కథకు సంబంధించినంత వరకు వినోదావారి చిత్రంకన్న ఎన్నోరెట్లు బెంగాలీ వాస్తవికతను సాధించగలిగింది పాత్రలు చాలావరకు సజీవమైన బెంగాలీ పాత్రలు వాతావరణంకూడా కథకు అతికినట్టున్నది కథలో ఆట్టే మార్పులు చెయ్యక శరత్‌కు ''న్యాయం'' చేకూర్చారు

అంతా బాగానే ఉందిగాని ''అయిదో తనం'' లేనట్టు ఈ 'దేవదాస్' చిత్రం ఎక్కడా మంచి రక్తికి రాదు ఏ ఒక్క ఘట్టమూ ప్రేక్షకుడి హృదయాన్ని పట్టదు ఏమాటకామాటే చెప్పుకోవాలి, వినోదావారి చిత్రం శరత్ రచనకూ, అందలి పాత్రలకూ ఎంత ''అన్యాయం'' చేసినా ప్రేక్షకులకు చివరంటా రక్తికలిగించింది ఆ చిత్రం చూస్తుంటే ఇంటర్వెల్‌కు ముందు రెండు మూడు చోట్ల మాత్రమే సినిమా చిత్రం చూస్తున్నట్టు జ్ఞాపకం వచ్చింది ఇంటర్వెల్ తరవాత అసలా సంగతే స్ఫురించదు ఈ హిందీ చిత్రం గురించి ఆమాట అనలేం ఇందుకు ప్రబలమైన కారణం ఒకటి ఉన్నట్టు కనబడుతుంది వాస్తవికతవల్ల ఇటువంటి కథ సినిమా చిత్రంగా రక్తికట్టకపోవచ్చు

దేవదాసు కథలోని ప్రధానాంశం ఏమిటంటే కథానాయకుడు తాను ప్రేమించిన స్త్రీని సంఘం ఒప్పుకోకుండా పెళ్ళాడలేడు, సంఘం అనుమతి లేకుండా తనను ప్రేమించిన స్త్రీని చూస్తూ చూస్తూ ప్రేమించలేడు అతను తనకన్న సంఘం నీచమైనదని రుజువు చేస్తాడు

ఈ అంశం చిత్రంలో వ్యక్తంకావాలంటే దేవదాసు పాత్రను నిత్యజీవితంలో కనిపించే పాత్రలాగా చూపించి లాభంలేదు వాస్తవ జీవితంలో ఏ దేవదాసూ పార్వతిని మరిచిపోవటానికి తాగి స్పృహతప్పిపోయే స్థితిలో ఉండడు చంద్రముఖిని ప్రత్యామ్నాయంగా ఆమోదించలేకపోవటం కూడా అంత నమ్మదగినది కాదు చంద్రముఖిని ఆదర్శప్రాయంగా చిత్రించటంతో ఈ చిక్కు మరింత అవుతున్నది

అదీగాక ఈ కాలపు సాహిత్యం మారిపోయింది కేవలం సంఘంలో ఉన్న లోపాలు ఎత్తిచూపటానికి మాత్రమే ఈనాటి రచయితలు సాహిత్యం రాయటంలేదు, ఆ సంఘంమీద వ్యక్తులు చేసే తిరుగుబాటును కూడా చిత్రిస్తున్నారు తమ పెళ్ళికి తన తండ్రి ఒప్పుకోని కారణం చేత తన జీవితాన్నీ, పార్వతి జీవితాన్నీ భ్రష్టుచేసిన దేవదాసు ఈనాడు పెద్ద ''హీరో'' కాడు అందుచేత వాస్తవికత అనేక సమస్యలు తెచ్చిపెడుతుంది చిత్రం చూస్తూంటే, ''ఇదంతా తప్పనిసరి

# 47. ఏది నిజం?

మార్చి 15 గురువారం సాయంకాలం, మద్రాసులోని భరణీ స్టూడియోస్ ప్రివ్యూ థియేటర్‌లో ప్రతిభావారి 'ఏది నిజం?' ప్రెస్ షో జరిగింది కొద్దిరోజుల క్రితమే ఈ చిత్రం ఆంధ్రలో విడుదల అయింది ప్రజాదరణ సంపాదించుకున్నట్టు కూడా తెలిసింది నిరాడంబరంగా, నిశ్శబ్దంగా తయారై నిరట్టహాసంగా విడుదల అయిన ఈచిత్రంలో హిట్ కావడానికి అవసరమైన లక్షణాలన్నీ ఉన్నాయి కథలో కొత్తదనం ఉంది రచనలో పటుత్వం ఉంది దర్శకత్వంలో ప్రతిభ ఉంది నిర్మాణంలో నిండుతనం ఉన్నది నటులందరూ తమ పాత్రలను చాలా బాగా పోషించారు టెక్నీషియనులు అన్నివైపులా చక్కగా సహకరించారు

''ఫ్యూజిటివ్'' అనే ఇటాలియన్ చిత్రం తాలూకు కథ ఆధారంతో ఈ చిత్రాన్ని నిర్మించారట కథను తిరిగరాసుకునేటప్పుడు, ఇది ఒక విదేశీ పాశ్చాత్య చిత్రానికి అనుకరణ అన్నది వీలయినంతవరకు ఎక్కడా స్ఫురించకుండా రాశారు పాత్రలన్నీ చక్కని జాతీయతా, సహజత్వమూ సంపాదించుకున్నాయి కాకపోతే, ఈ కథ జరిగిన ప్రాంతం, ఇతర సాంఘిక చిత్రాలలో లాగా వ్యవసాయ క్షేత్రాలను స్ఫురింపజేయదు అదికూడా మేలే అయింది ఈ చిత్రంలో మనం కొత్తరకం గ్రామీణ శ్రామిక వర్గాన్ని చూస్తాం కథానాయిక తల్లి సీతమ్మ మునసబు గారింట చాకిరీ చేస్తుంది కథానాయకుడు కోటయ్య కట్టెలుకొట్టి జీవిస్తాడు మరొకడు (సీతారాం ధరించిన పాత్ర) గొర్రెలనూ,మేకలనూ మేపుకుని జీవిస్తాడు ఈ సమాజంలో మునసబు పెద్దవాడు, ఆయనకు హంగుదార్లు పూజారీ, వైద్యుడూనూ, కాని అన్ని పాత్రలూ మనం నిత్యజీవితంలో చూసేటంత సహజంగా, వాస్తవికంగా ఉన్నాయి

చిత్రంలో సహజత్వం ఉట్టిపడడానికి మరొక కారణం ప్రకృతినీ, సహజ వాతావరణాన్నీ విరివిగా వినియోగించటం అంతేకాదు, ప్రకృతి ఈ కథలో ఒక ప్రముఖపాత్ర నిర్వహిస్తుంది తిరపతి హత్య అడవిలో జరుగుతుంది జైలునుంచి పారిపోయి వచ్చిన కోటయ్య కొండల్లో దాక్కుంటాడు మునసబును ఆఖరుకు ఆ కొండలమీదనే వేటాడతారు

రచనలో ప్రతిపాత్రకూ ఒక ప్రయోజనమూ, ఒక వ్యక్తిత్వమూ ఉంది ఒకే వర్గానికి చెందిన వాళ్ళు కూడా ఒకరిలాగా ఒకరుండరు కోటయ్య ఒకరకం, పూజారి ఒక రకం, డాక్టరు మరొకరకం శ్రామికులు కాని వారిలో వ్యక్తిత్వం ఒక విధంగా ఉంటుంది వర్గతత్వం మరొక రకంగా ఉంటుంది దీనికి పూజారి మంచి ఉదాహరణ ఈ పూజారికి మునసబు చేసేది తప్పని తెలుసు అటువంటి పనులు చెయ్యటం తప్పనీ ముప్పనీ మునసబును సకాలంలోనే హెచ్చరిస్తుంటాడు కూడా కాని తీరా అన్యాయం జరిగిపోయాక, భీష్మద్రోణులు కౌరవపక్షాన్నే యుద్ధం చేసినట్టు, ఆ అన్యాయంలో భాగం పంచుకుంటాడు

ఈ చిత్రంలో పాత్రల రచనలో మరొక గొప్ప విశేషమేమంటే కొన్ని పాత్రలను మంచిగానూ మరికొన్నింటిని చెడ్డవిగానూ చిత్రించటం కోసం ఆయా పాత్రల జీవితావసరాలకూ, సహజ

ప్రేరణలకూ, ప్రయోజనాలకూ సంబంధించినవి మంచి పనులూ, దుర్మార్గాలూ చేయించటం ఈ చిత్రంలో మనం చూడం కాని అటువంటి పాత్రపోషణ మన సాంఘిక చిత్రాలలో తరుచు ఉంటూంటుంది అది లేకపోవటం ఈ చిత్రంలో విశేషం

బాలచందర్ దర్శకత్వం ప్రతిభావంతంగా ఉన్నది అతను అదివరకే 'పూజిటివ్' చిత్రాన్ని 'ఇది నిజమా' అన్న తమిళ చిత్రంగా తయారు చేశాడట కాని అది అంతగా విజయవంతం కానట్టు తెలుస్తుంది 'ఏది నిజం' విజయవంతం కావటానికి సుంకర సత్యనారాయణ రచించిన సంభాషణలు బాగా తోడ్పడ్డాయనటానికి సందేహం లేదు ఈ సంభాషణలు పాత్రలకు జీవం పోయటమే గాక వాటిని ప్రేక్షకులకు చాలా సన్నిహితం చేశాయి కూడా

నటులలో గుమ్మడి, నాగభూషణం తమ పాత్రలను చాలా సమర్థతతో నిర్వహించి, ఆ పాత్రల తాలూకు మానసిక పరిణామాలన్నిటినీ సమగ్రంగా ప్రదర్శించారు కథానాయిక రామిగా జానకి తృప్తికరంగా నటించింది అక్కడక్కడా ఉచ్చారణలో మార్పులేకపోతే, కొన్ని క్లోజప్‌లలో ''గ్లామర్'' కోసం కెమెరామన్ పాటు పడకపోతే రామిపాత్ర కొండయ్య పాత్రకూ, మునసబు పాత్రకూ ఏమి తీసిపోయి ఉండవలసిన అవసరంలేదు

పూజారి పాత్రకు వంగర పూర్తి న్యాయం చేశాడు రమణారెడ్డి ధరించిన డాక్టరు పాత్ర రచనలో కొద్దిలోపం ఉన్నట్టు కనబడుతుంది ఈ పాత్రను హాస్యానికి వినియోగించుకుని ఉండరాదేమోననిపిస్తుంది ఎందుకంటే చివరలో ఈ పాత్ర చాలా లోతుపాతులు గల పాత్రగా వ్యక్తమవుతున్నది కాని ఉన్న పాత్రను రమణారెడ్డి చాలా ప్రతిభతో నటించాడు చిన్న పాత్రే అయినా, కథానాయిక తల్లి అయిన సీతమ్మ పాత్రకు పి హేమలత ఎంతో నిండుతనం తెచ్చింది తిరుపతి పాత్ర కథకు చాలా ముఖ్యమైనది ఈ పాత్రలో ఉండే సహజ సౌజన్యాన్నీ, అక్రమాలపట్ల ఈ పాత్ర ప్రదర్శించే అసహనాన్నీ జోగారావు చాలా బాగా ప్రదర్శించాడు సీతారాం మొదలుగాగల నటులందరూ తమ పాత్రలను బాగానే నిర్వహించారు గెస్టు ఆర్టిస్టులు జగ్గయ్య, పేకేటి శివరాం కూడా చిత్రానికి చక్కగా సాయపడ్డారు

కథలో హాస్యానికి అంతగా అవకాశాలు లేకపోయినా డాక్టరు పాత్రలోనూ, ప్రదర్శనల తోనూ నిర్మాతలు హాస్యం సాధించారు నృత్యాలూ, పాటలలో కొన్నిటి మట్లు కథ యొక్క వాతావరణానికి విలక్షణంగా ఉన్నాయి అటువంటి చోట్ల మాత్రమే ప్రేక్షకులకు తాము సినిమా చూస్తున్నట్టు జ్ఞాపకం వస్తుంది అలా జ్ఞాపకం రాకుండా నిర్మాతలు చేసి ఉండవచ్చు

చిత్రంలో ఔట్ డోర్ దృశ్యాలు ఆకర్షవంతంగా ఉన్నాయి కొండలమీద మునసబూ, కోటయ్య ఒకరినొకరు తరిమే దృశ్యాలూ, పోట్లాడే దృశ్యాలూ కొంచం పొడుగైనా ప్రేక్షకులకు తృప్తి పరచగలిగి ఉన్నాయి కోటయ్య కట్టెల మోపుతో అడివిలో నడిచే దృశ్యాలు ''రషోమొన్'' జపానీ చిత్రాన్ని జ్ఞాపకం తెస్తున్నాయి చిత్రంలో చక్కని సస్పెన్స్ ఉన్నది

ప్రతిభావారి 'ఏదినిజం' కొత్తరకం చిత్రం మంచి తెలుగు చిత్రాలలో ఒకటి ఇది ఆర్థికంగా విజయం సాధిస్తుంది కూడా

*తెలుగు స్వతంత్ర, వార పత్రిక, 23-3-1956*

# 48. అప్పుచేసి పప్పుకూడు

మన దేశంలో సమగ్ర హాస్య చిత్రాలు చాలా అరుదు విజయావారి ''అప్పుచేసి పప్పుకూడు'' సమగ్ర హాస్య చిత్రం

ఇందులో ఉన్న కథా, సంఘటనలూ బహుకొద్ది సాధారణంగా మనం చిత్రాలలో కథనమూ, దాని తాలూకు సంఘటనలూ, ఈ రెంటికీ సంబంధించిన సన్నివేశాలూ చూస్తాం ఈ చిత్రంలో అదిలేదు ఇందులోని సన్నివేశాలు పాత్ర చిత్రణనుబట్టి ఏర్పడినవి ఈ చిత్రంలోని ప్రధాన శిల్పం వ్యంగ్య హాస్యధోరణితో కూడిన పాత్ర చిత్రణ– కథా చిత్రణకాదు

రాజా అనే ఆస్తిపాస్తులు లేని దేశ సేవకుడు ఒక జమీందారు మనవరాలైన మంజరిని పెళ్ళాడటమూ, రఘు అనే విద్యావంతుడు తన తండ్రియైన రామదాసు ఆలోచనలు త్రోసిపుచ్చి తన భార్య అయిన లీలతో కాపరం చెయ్యటమూ, భజగోవిందుడు అనే నాటకాలడించేవాడు తనే మేనమామ అయిన రామలింగం ప్రయత్నాలనే భగ్నంచేసి ఆయన కూతురు ఉషను పెళ్ళాడటమూ ఈ చిత్రంలోని కథ

కానీ సన్నివేశాలన్నీ ఇతర పాత్రలను పురస్కరించుకుని పుట్టినవే ఈ పాత్రలేవంటే దాసూ, జమీందారు, ముకుందరావూ, రామలింగమూనూ

వ్యంగ ధోరణిలోనే అయినా ఈ పాత్రలు విపులంగా చిత్రించబడ్డాయి ఈ పాత్రలన్నిటి లోనూ ఈనాటి సమాజానికి పనికిరాని, అంశాలున్నాయి వాటిని కడిగివెయ్యటమే ఈ చిత్రం యొక్క సాంఘిక ఆశయంగా కనిపిస్తుంది

ఈ పాత్ర లన్నిటిలోకి ప్రధానమైనది రామదాసు పాత్ర రామదాసు ఒక చెదపురుగు లాటివాడు అప్పుచేసి పప్పుకూడు తినటంలో అందెవేసిన చెయ్యికావటమేగాక, సంఘం కళ్ళలో దుమ్ముకొట్టి ఒక ఘరానా మనిషిలాగా తిరుగుతాడు అతని వల్ల ఏ ఒక్కరికీ ఆవగింజంత సుఖం లేకపోగా అతని ఆశయాలు క్షుద్ర దేవతలలాగా నరబలి కోరుతాయి కళ్ళు పోయిన తన ముసలి తండ్రిని ఖైదీలాగా చూస్తాడు తన వియ్యాలవారి ఆస్తి గుల్లచేసి, కోడల్ని తరిమేస్తాడు తన కొడుక్కెలాగైనా మంజరిని చేసుకుని జమీందారు ఆస్తి అంతా కాజెయ్యాలని ఎత్తువేస్తాడు

రామదాసు తాత్విక, నైతిక దృష్టి అమానుషమైనది దీన్ని నిరూపించే సంభాషణలు చిత్రం నిండా కోకొల్లలుగా ఉన్నాయి ''అప్పు ఎంతున్నా, అప్పులవాళ్ళు ఎక్కువమంది ఉండరాదు వాడికి కావలిసింది అసలూ అన్ని కోర్టులూ తిరిగేసరికల్లా వాళ్ళూ ఉండరు, మనమూ ఉండం'' ఇత్యాది

ఈ పెద్దమనిషి కొడుక్కు సలహా ఇస్తాడు: ''డబ్బుకోసం దాన్ని చేసుకుంటే, ప్రేమకోసం దీన్ని తరవాత చేసుకోవచ్చు కావలిస్తే తరవాత దాన్ని వదిలెయ్యి'' ఇటువంటి పనులు చెయ్యడం రామదాసుకు అవలీల అందుకే అతనికి అంగరక్షకులుగా ఇద్దరు వస్తాదులు!

ముకుందరావు పాత్ర ఆయన ఆలోచనలలాగే చాలా సంకుచితమైనది ఆ మనిషి అసలు

ఈ యుగంలో లేదు రాజ్యాలూ, మహారాజులూ ఏమైపోయాయని ఆశ్చర్యపడతాడు ఆయన దృష్టిలో గణనీయులు రాజాలూ, స్వాములార్లూ వాళ్ళు వేషధారులైనా ఆమోదిస్తాడు, ఆదరిస్తాడు ఈ చిత్రంలో ముకుందరావుకు తటస్థపడేవారు ఒక దొంగరాజా, అనేకమంది దొంగస్వాములార్లూనూ (ఇందులో ''పొయెటిక్ జస్టిస్'' లేకపోలేదు)

రామలింగం బొత్తిగా వీధి పాత్ర పరిస్థితులకు పూర్తిగా బానిస కావటంవల్లా ఎవరికీ చెప్పుకోదగిన హాని చెయ్యలేడు అందుచేతనే రామదాసు ఇంట్లో జీవం ఉన్నది అతని కుటుంబంపైన అతని ప్రభావం ఏమీ లేదు

శెట్టి ఒక క్షుద్రపాత్ర అతనికి జీవితంలో డబ్బు తప్ప ఇంకోటి లేదు తన అవసరానికి సాటివాళ్ళను నెత్తిన కూర్చుండబెట్టుకుంటాడు తన లాభంకోసం అవసరమైతే వాళ్ళను గోతిలోకి తోయగలడు తనకు అపారమైన లాభం వస్తుందని తోచినప్పుడు తనే గోతిలో దూకుతాడు కూడా

ఈ పాత్రలు మినహాయిస్తే మిగిలిన పాత్రలన్నీ '' ఆరోగ్యవంతమైన'' జీవితదృక్పథా లు కలవే ఈ చిత్రంలోని సన్నివేశాలకు సంబంధించినంతవరకూ కీలక పాత్ర భజగోవిందం అతను సన్నివేశాల ''ప్రొడ్యూసర్'' అనవచ్చు ఇతను దాసు కన్న ఘనమైన వ్యక్తి కాదు రఘు కన్న చదువుకున్న వ్యక్తికాడు మంజరితో సమమైన హోదా కలవాడు కాదు అయినప్పటికీ ఇతను ఉభయ పక్షాల వ్యక్తులనూ బాగా అర్థం చేసుకున్నవాడు రాజా ఖైదు నుంచి విడుదలఅయిన మరుక్షణమే అతని ప్రణయ సమస్యనూ, అతని చెల్లెలైన లీల జీవిత సమస్యనూ పరిష్కరించే భారం తనపై వేసుకుని సూత్రధారణ చేస్తాడు ఆ తరువాత మిగిలిన పాత్రలు అతన్ని అనుసరించటం తప్పనిసరి అవుతుంది

ఈ హాస్య నాటకం ఆడించటానికి భజగోవిందానికి రెండు అర్హతలు ఉన్నాయి ఒకటి, అతను అసలు నాటకాలాడించేవాడు ''స్టేజి ఎఫెక్ట్స్'' సులువుగా పుట్టిస్తాడు రెండు, చిట్టచివరిదాకా అతను పనిచేస్తున్నట్టే కనపడుతూనే వుంటాడు అందుచేత అతను వారి నందరినీ ప్రతిపక్షుల పక్షాన సన్యాసులు చేయగలుగుతాడు

భజగోవిందం కింద పనిచేసే నటులలో రాజా ఒక్కడే ఇష్టంలేని నటుడు అతని మనస్తత్వం వస్తుతహా భజగోవిందం ఆడే రకం నాటకాలల్లో పాల్గొనదగినదికాదు భజగోవిందం లేకపోతే అతను తన ప్రణయ సమస్యను మరొక విధంగా పరిష్కరించుకునే వాడు లేదా దానికి ఇన్ని నీళ్ళు వదిలేవాడు అందుచేతనే అతను చీటికీ మాటికీ ''వేషం'' విప్పేసి, రసాభాసకు దిగుతూ ఉంటాడు

రాజాకు సరిగా వ్యతిరేకం రఘు అతను తన ఆనందంకోసం భజగోవిందంతో చేరతాడు (భజగోవిందం సహాయం లేకపోయినా అతను తన సమస్యను సులువుగా పరిష్కరించుకోగల సమర్థుడే) ప్రాంప్టింగ్ అవసరం లేకుండా ''సైడ్ వింగ్స్''లోకి చూడకుండా అవలీలగా నటించేస్తాడు

చిత్రం అంతా అయినాక మనకు మిగిలేది రాజు– మంజరి, రఘు– లీల, భజగోవిందం– ఉష సమస్యలు పరిష్కారం కావటం కానేకాదు రామదాసు, జమీందారు, రామలింగం, చెట్టిపాత్రలను చూసి నవ్వటం ఈ హాస్యం కూడా ప్రతిపిల్లవాడికీ అందుబాటు లో వుండేది – అట్టే గంభీరమైన హాస్యం కాదు చిత్రంలో గాంభీర్యం ఏదైనా వుంటే పాత్ర సృష్టిలోనూ, వాటి వినిమయంలోనూ ఉన్నది

చిత్రంలోని సంభాషణలూ, పాటలూ, దర్శకత్వమూ, ఫోటోగ్రఫీ, ఆర్ట్సూ, సంగీతమూ, గేవా కలర్ నృత్యాలూ చాలా సంతృప్తికరంగా వున్నాయి సి ఎస్ ఆర్ , రేలంగి, రామారావు, సావిత్రి, జగ్గయ్య, జమున, రంగారావు, రమణారెడ్డి, రామలింగయ్య, గిరిజ, శివరావు, ముక్కామల, మిక్కిలినేని, సూర్యాకాంతం, చదలవాడ మొదలైన నటీనటులందరూ చక్కగా తమ పాత్రలను నిర్వహించారు అందరూ చూసి ఆనందించదగిన చిత్రం విజయావారి ''అప్పుచేసి పప్పుకూడు''

*ఆంధ్రప్రభ, వారపత్రిక, 4 2 1959*

# 49. తెలుగు సినిమా చిత్ర నిర్మాణంలో ఒక పెద్దమలుపు 'సాక్షి'

కళలలో వాస్తవికత అనేది బహుముఖంగా ఉంటుందని వేరే చెప్పనవసరంలేదు సినిమా కళలో మరీనూ కథా, సన్నివేశాలు, పాత్రలూ, వాటి స్వభావాలూ, వాటి వేషభాషలూ, వాతావరణమూ, ప్రవర్తనా – ప్రతి ఒక అంశంలోనూ వాస్తవికత అనే దానికి అవకాశం ఉంటుంది సాధారణంగా సినిమాచిత్రాలలో చాలాకొద్ది వాస్తవికతను మాత్రమే మనం ఆశించటం నేర్చుకుని, వాటిని చూసి ఆనందించగలుగుతున్నాం తెరమీద కనిపించే పాత్రలూ, అవి నివసించే ఇల్లు, అవి ధరించే దుస్తులూ, అవి మాట్లాడే భాషా, ప్రకటించే భావాలూ, వాటికి ఏర్పడే సమస్యలూ, ఆ సమస్యలు విడిపోవటానికి తోడ్పడే సన్నివేశాలూ కొంతవరకు కృత్రిమంగా ఉన్నా మనం సరిపెట్టుకుంటున్నాం అది సంప్రదాయమైపోయింది

ఈ సాంప్రదాయాన్ని చాలావరకు పగలగొట్టిన చిత్రం 'సాక్షి' ఇది ఒక హీరో చుట్టూ అల్లిన కథకాదు, ఇంచుమించు వాస్తవమనిపించే ఒక గ్రామానికి సంబంధించిన జీవితం ఇందులో తమయోగక్షేమాలు తాము చూచుకోగల పాత్రలున్నాయి, చూచుకోలేక హీనంగా బతికే పాత్రలూ ఉన్నాయి ఆ హీన పాత్రలన్నింటిలోకీ చంటిపిల్లవాడులాంటివాడు, పిరికివాడు, పిల్ల తెమ్మెరలాగా నిశ్చింతగా, నిష్పూచీగా తిరిగే 'కిట్టిగాడు' ఈ కథకు హీరో హీనుడే అయివుండికూడా, తనసుఖాలకు ఎవరినీ అడ్డంరానీయక, అడ్డం వచ్చినా వాళ్ళను హతంచేసి పారెయ్యడానికి కూడా వెనుదీయక సుడిగాలిలా తిరిగేవాడు విలన్ పకీరు

ప్రతిమనిషిలోనూ – ఆఖరుకు ఫకీరులో కూడా మంచీ చెడూ ఉంటుంది అయితే ఈ కథలో మనం పై అంతస్తువారిలో అంటే స్వార్థం గడుపుకొనే శక్తి సామర్థ్యాలు గల వారిలో కాస్త చెడుపాలు హెచ్చుగా చూస్తాం తక్కువ వాళ్ళలో మంచి పాలు హెచ్చుగా చూస్తాం ఈ

రూలుకు భిన్నంగా పకీరు చాలా పెద్దవాడు  కాని వాడి పెద్దతనానికి అంగరక్ష మునసబూ, కరణమూ, పూజారీ మొదలైన పైతరగతి గ్రామస్తులే  తమస్వార్థానికి దెబ్బ తగిలేదాకా వాళ్ళు పకీరు దౌష్ట్యానికి అడ్డు తగలరు  అప్పుడైనా తమ చేతులు మట్టి కాకుండా మనుషులను ఉపయోగించుకుంటారు  (చస్తే వాళ్ళే చస్తారు)

ఇదే ఈ చిత్రం తాలూకు ఇతివృత్తంలో ఉండే ముఖ్యమైన వాస్తవికత  కాని ఈ ఇతివృత్తాన్నే మామూలు సినిమా చిత్రాల మూసలో తయారుచేసివుంటే ఈ సత్యం వ్యక్తం కాకపోను  ఈ వాస్తవికతను వ్యక్తం చెయ్యటానికి పాత్ర సృష్టీ, రచనా, పోషణా ఎంతవరకు వాస్తవంగా ఉండాలో మనస్తత్వాలను ఎంత నిశితంగా చిత్రించాలో, వాటిచేత ఎట్లా మాట్లాడించాలో, నటులచేత ఎట్లా నటింపచేయాలో నిర్మాతలు తోచినట్టుగా నిర్ణయించారు

మామూలుగా సినిమా చిత్రం గురించి రాసేటప్పుడు నటన బాగుంది, సంభాషణలు బాగున్నాయి అనడం పరిపాటి  'సాక్షి' విషయంలో ''నటనా, సంభాషణలూ సరిగా ఉన్నాయి'' అనటం పెద్ద ప్రశంస అవుతుంది  ఇటువంటి చిత్రాన్ని తలపెట్టడం సాహసం  తయారుచెయ్యటం ప్రతిభ – గొప్పప్రతిభ

'సాక్షి' గొప్ప అభ్యుదయ చిత్రం

*జనశక్తి, ద్వైవారపత్రిక, 2-7-1967*

# 50. సినిమా బాంబు

ఇటీవల దక్షిణదేశంలో పేలిన సినిమా బాంబు ధ్వని బొంబాయిలో కూడా గట్టిగా వినిపించిం( పేలేదాకా బాంబు అమాయకంగానే వుంటుంది  'శంకరాభరణం' సినిమా అమాయకంగానే కనబడింది  అందులో రేప్‌లూ, బూతుపాటలూ, శృంగార సన్నివేశాలూ, యుగళగీతాలూ, నాయికా నాయకులు మైదానాల్లో పొర్లటాలూ, డిషుమ్ డిషుమ్‌లూ మచ్చుకైనా లేవు  ( ఒకే ఒక బలాత్కారమైధునం ఉన్నది గాని అది సినిమా రేప్ జాతికి చెందినది కాదు  ఓ నూరేళ్ళ క్రితం అప్పుడే సమర్తాడిన పిల్లకి గర్భాదానం చేస్తూ పిల్ల అల్లరిపెట్టి మొగుణ్ణి పీకకుండా మంచానికి కట్టేసేవారు  శంకరాభరణం లో వున్నరేప్ ఆ జాతిది )

ఇది నిరపాయంగానూ అమాయకంగానూ కనబడడం చేత దీన్ని కొందరు డిస్ట్రిబ్యూటర్లు తాకక 'ఉంచండి' అన్నారు  కాని ఇది అసలు ఏ జాతికి చెందిన చిత్రం అన్నది దీన్ని చూసిన వ్యక్తులలో కలిగిన రియాక్షన్‌ను బట్టి ఊహించడం సాధ్యమయింది  బాక్సాఫీస్ దృష్టిలో  చూసిన వాళ్ళకు ఇది 'ఫ్లాప్' అవుతుంది అనిపించింది  సంప్రదాయ శాస్త్రీయ సంగీతం కోసం చూసిన వారికి సినిమాలో అదేమీ కనిపించక కొంచెం ఆశాభంగం అయింది కాని కొద్ది మంది దీన్ని చూడగానే పారవశ్యం చెంది, దేవుడితో మాట్లాడి వచ్చినట్టు ఫీలయ్యారు అలాంటి వారిలో భానుమతీ రామకృష్ణ ఒకరు!  తీరా చిత్రం విడుదలయాక డాక్టర్ భానుమతీ రామకృష్ణలాగా ఫీలయే వాళ్ళు దేశంలో  తెలుగుదేశంలోనే కాదు, దక్షిణ భారతంలో కోట్లకొద్దీ

ఉన్నట్టు రుజువయింది

ఇందుకు కారణం ఏమిటి ?

'శంకరాభరణం' సినిమారూపం ధరించిన ఒక వ్యక్తి కల! ఆ వ్యక్తి కాశీనాధుని విశ్వనాథ్ అతనికి శాస్త్రీయ సంగీతం గురించి తెలీదు – తెలిస్తే దాన్ని గురించి కలగనే పనేలేదు అయితే విశ్వనాథ్‌కు శాస్త్రీయ సంగీత మంటే అభిమానం వున్నది అందుకే ఈ చిత్రం ఇందులో శాస్త్రీయ సంగీతం లేదు దాని నీడలు మాత్రమే వున్నాయి సహజంగా ఇది ప్రేక్షక సామాన్యానికి అసలైన శాస్త్రీయ సంగీతం కన్న ఎక్కువ అందుబాటులో వున్నది

శాస్త్రీయసంగీతంతో ఎక్కువ పరిచయంలేని ఒక వ్యక్తి ఆ సంగీతాన్ని స్వయంగా అరిగించుకోలేని కోట్లాది జనం కోసం 'శంకరాభరణం' తీశాడు

సినిమాలలో శాస్త్రీయమైన సంగీతం రాకపోలేదు నాగయ్యగారు ఏనాడో 'త్యాగయ్య' చిత్రం తీశాడు దాన్ని చూసి టైగరు వరదాచారిగారూ, బెంగుళూరు నాగరత్నంగారూ ముగ్ధులయారట 'త్యాగయ్య' చిత్రం చూసిన జనసామాన్యానికి తాము సంప్రదాయ సంగీతం వింటున్నామనిపించలేదు, వారు ముగ్ధులు కానూలేదు సంగీతం అంటే అభిమానం వుండటం చేత కాబోలు గూడవల్లి రామబ్రహ్మంగారు సినిమా చరిత్రలో 'త్యాగయ్య' ఒక పెద్ద మలుపు అనుకున్నాడు కాని ఈనాడు 'శంకరాభరణం' చూస్తున్న కోట్లాది ప్రజలకు తాము అసలైన, సిసలైన కర్ణాటక సంగీతం వింటున్నట్టు భావన కలుగుతున్నది ఈ చిత్రం ఒక ఫాంటసీ – కల!

అందుకే ఇందులో వాస్తవికత లేదు కలలో వాస్తవికత అవసరంలేదు ఒక ఉద్దండ గాయకుడి వెంట ఒక వేశ్య వున్నదని అతని పాటను వినకుండా లేచిపోయేవారు ఎవరూ ఉండరు ప్రజలకు కావలసింది సంగీతం కాదు, గాయకుడి సాంఘిక ప్రవర్తన అన్న దురభిప్రాయం ఈ చిత్రంకలిగిస్తే అందుకు కారణం చిత్రంలో వాస్తవికతకు చోటులేక పోవడమే ఇందులో నాయికా నాయకులు జీవాత్మ పరమాత్మలని ఎవరో అన్నారు అంతే అనుకోవచ్చు ఈ జీవాత్మ ఏడేళ్ళు ఎక్కడున్నది, కొడుకును ఎట్లాపోషించింది అన్న ప్రశ్నలు రానవసరంలేదు

'శంకరాభరణం' సినిమాను ఫాంటసీగా గ్రహించక, ఇది జనాన్ని అభ్యుదయ మార్గంలో ఎట్లా నడిపిస్తుంది, ఇందులో రియాక్షనరీ భావాలున్నాయా, లేవా అంటూ నేలవిడిచి కసరత్తు చేసిన విమర్శకులు చాలా మంది వున్నారు , సినిమాల నిత్య కర్తవ్యం అదే అయినట్టు! ప్రేక్షకులకు ఈ చిత్రం ఏంచేస్తుందని వాళ్ళు ఆలోచించారే తప్ప, సినిమా చరిత్రలో ఈ చిత్రం ఎలాంటి ఉప్పెన తెచ్చిపెట్టిందీ ఆలోచించలేదు

ఇంతకాలమూ ప్రేక్షకుల జేబులు కొట్టటానికి చిత్ర నిర్మాతలు తాము రకరకాలగడ్డి తింటూ, ప్రేక్షకులకు అందిస్తూ వచ్చిన అశుద్ధం ఎంత మాత్రమూ అవసరంలేదని శంకరాభరణం నిరూపించింది రెండోవైపు కళలలో జీవిత వాస్తవికత కోసం పెనగులాడుతున్న కళాకారులు దేశంలో ఉండే జనసామాన్యం తాలూకు అభిరుచులను సరిగా అర్థం చేసుకోలేదని కూడా ఈ చిత్రం నిరూపించింది ( లేకపోతే 'చలిచీమలు' ఇంకా హెచ్చు జనాదరణ పొందదగిన చిత్రం కాదా ? ' ఒక ఊరికథ' సోదిలోకి రాకుండా పోవలసిన చిత్రమా ? 'నిమజ్జనం' ఇంత కాలం అజ్ఞాతవాసం చేయునా? )

ఈనాడు దేశంలో ఉన్న సినిమా కళాభిరుచిలో ఉత్తమ ప్రమాణాలకు 'శంకరాభరణం' గీటురాయి అని ఒప్పుకోవాలి దీని కోసం ప్రేక్షకులు ఎగబడుతున్నారని మాత్రమే కాదు, ప్రజలు అమితంగా కనకవర్షం కురిపించిన చిత్రాలలో ప్రేక్షకుల హీన అభిరుచులకు దాసోహం అయిన చిత్రాలు కూడా డబ్బు తెచ్చాయి 'శంకరాభరణం'లో అలాటి ''మసాలా'' మచ్చుకైనాలేదు ఇది అవాస్తవికమైన కలే, కాని ఉదాత్తమైనకల నల్లమందు భాయిలకు వచ్చే సెక్స్ డ్రీమ్‌లాంటిదికాదు

ఈచిత్రంవల్ల సామాజిక ప్రయోజనంలేదని మనస్ఫూర్తిగా నమ్మిన వాళ్ళు, సమాజానికి అపకారంచేస్తున్న అనేక ''విజయవంతమైన'' చిత్రాలను ఈ చిత్రం ఎలాంటి చావు దెబ్బ కొట్టిందో ఎరగరు

ఈనాడు జీవితాన్ని ఆవరించివున్న అతిశోచనీయమైన కుసంస్కారం నుంచి, ఉదాత్తమైన వాస్తవ జీవితపు విలువలను అందుకోవాలంటే, ఇటాంటి ఉదాత్తమైన ''కలా'' ఖండాలు అవసరమేమో?

జూన్ 8న మద్రాసు కళాసాగర్ వారు ఈ చిత్రానికి, ఇందులో పాల్గొన్న ప్రతి ఒక్కరికీ, కనీవినీ ఎరగని సన్మానం చేసారు డైరక్టరుకీ ప్రధాననటుడికీ, సంగీత దర్శకుడికీ సువర్ణ కంకణాలు ఇచ్చారు – పైవాళ్ళా ఉత్తుత్తి శతదినోత్సవాలను సొంతఖర్చుతో చేసుకుంటూ సన్మాన సభలు ఏర్పాటు చేసుకునే ఈ కాలంలో ఒక సినిమాలో పాల్గొన్న మేకప్ మాన్ దగ్గరనుంచి అందరికీ ప్రత్యేకంగా గౌరవం జరగటమూ, అందులో ఇతర పెద్దలు తమ ఉత్సాహాన్ని బహుకృతుల రూపంలో చూపటమూ – ఇదికూడా దాదాపు కలలాంటి దేనేమో మహాకవుల సన్మానాలు కూడా ఇంత'పార్టిసిపేషన్' తో జరుగవు ఈగౌరవం'శంకరాభరణం' కు దక్కింది

విశ్వనాథ్ తాను గౌరవించే అత్యున్నత సామాజిక విలువలను గురించి కలల లాంటి చిత్రాలు మరి రెండు మూడు తీసి దేశంలో సినిమా పరిశ్రమను నిజంగా పెద్దమలుపు తిప్పి చరిత్ర సృష్టించవచ్చు ఇందుకు తగిన అర్హత విశ్వనాథ్‌లో ఒకటి ఉన్నది అతను ఆత్మవంచన చేసుకోడు ఇతరుల శక్తిని రాబట్టటానికి ఎంత మంకుపట్టయినా పట్టగలడు ఒక కన్ను డిస్ట్రిబ్యూషన్ మీదా, ఇంకోకన్ను ప్రేక్షకుల అతిహీన అభిరుచుల మీద ఉంచి, వ్యక్తిత్వం ఏమీలేకుండా, ఉన్నా పాటించకుండా, చిత్రాలు తీసేవాడు ఇలాటి''కలలు'' కూడా చిత్రాలుగా తయారుచేయలేడు ఇది నిజం!

*విజయచిత్ర, మాసపత్రిక, జూలై 1980*

ఆదుర్తి సుబ్బారావు

బాపు

చాణక్య

ప్రత్యగాత్మ

తాతినేని ప్రకాశరావు

చివరి నోట్ ఈ వ్యాసాలు సకాలంలో దొరకలేదు అందువల్ల కాలక్రమంలో పొందుపరచలేకపోయాం ఇబ్బంది పెట్టినందుకు మన్నించండి వీటిని ఇలా చదువుకోమని మనవి

# I - వెలుగు - నీడ

## 94A - సినిమాలూ - ప్రబంధయుగం

## 94B - నేటి చలనచిత్ర పరిశ్రమ

# 94A. సినిమాలూ - ప్రబంధయుగం

పరిణామం చెందే అన్ని కళలకూ నాలుగు దశలుంటాయి ఈ దశలనే మానవుడు తన జీవితంలోనూ పొందుతాడు

మొదటిది బాల్యదశ పవిత్రతా, విశ్వాసమూ, పెరుగుదలా ఈ దశయొక్క లక్షణాలు తప్పటడుగులూ, అల్ప సంతోషమూ, చిన్న పెద్ద బాలారిష్టాలూ ఈ దశయొక్క అవలక్షణాలు

కళలు ఈ దశలో ఎంతో పవిత్ర భావాలను ప్రదర్శిస్తాయి పురాణాలూ, ధర్మగ్రంధాలూ, నీతి శతకాలూ ఈ యుగంలోనే పుడతాయి కళాసరస్వతి ఆరాధ్య దేవతగా పూజించబడుతుంది

మన సినిమాలకు ఈ దశ గడిచిపోయింది నిజానికి ఈ దశలో అచ్చగా పౌరాణిక చిత్రాలే రాలేదు సాంఘిక చిత్రాలు కూడా వచ్చాయి కాని వాటికి కూడా పవిత్రత ఆపాదించుకున్నది అస్పృశ్యతనైతేనేం, రైతు సమస్యనైతేనేం, తాగుడు సమస్యనైతేనేం స్త్రీ పునర్వివాహ సమస్యనైతేనేం అప్పటి నిర్మాతలు ఎంతో పవిత్ర భావంతో చిత్రించి, సంఘానికి మహోపకారం చేస్తున్నామనుకున్నారు, లేదా అన్నారు, సంఘం విశ్వసించింది

పురాణయుగం వెళ్ళిపోయి, సినిమాలకు ఇప్పుడు ప్రబంధయుగం నడుస్తున్నది మనషిపరంగా చూసినట్టయితే ఇది యౌవనదశ, ఈ దశలో అహంకారమూ, ఉద్రేకమూ, సుఖవాంఛా, సాహసమూ జాస్తి పవిత్ర భావాలు వెనకబడిపోతాయి శృంగారం మీద మోజు పెరుగుతుంది అందమూ, ఆనందమూ అగ్రస్థానం వహిస్తాయి

సాంస్కృతిక రంగంలో ఇది ప్రబంధయుగం శృంగారం ప్రధాన రసం వీరం దానికి తోడవుతుంది ఈ యుగపు సంక్రాంతి పురుషుడు శత్రువులకు యముడు, ప్రియురాలికి నవ మన్మధుడు గాంధర్వం జీవితం మీద తాండవం చేస్తుంది "వాణి నారాణి" అవుతుంది కళాదేవత మోహినీ రూపంలో తప్ప ప్రత్యక్షం కాదు

ఈ లక్షణాలన్నీ మనకు ఈనాడు సినిమాలలో కనబడుతూనే ఉన్నవి బూతుపాటలూ, సంభాషణలూ, శృంగార సన్నివేశాలూ, హత్యాచిత్రాలూ, స్టంటులూ మొదలైనవి ఈ దశకు సంబంధించినవే

సినిమాల జాతకం గుణించలేనివాళ్ళు మన చిత్రాలలో వాస్తవికత లోపించిందనీ, ప్రయోజనం మృగ్యంగా ఉందనీ ఆక్షేపించవచ్చు కాని సినిమాల జాతకం మార్చటం అంత తేలికకాదు వాస్తవిక దృష్టీ, విమర్శనాశక్తీ, కళా ప్రయోజనం పట్ల లక్ష్యమూ ఉండే దశ ఇంకా రాలేదు ఆఖరుదైన విప్లవ దశ ఎక్కడా కనుచూపు మేరలో లేనేలేదు

సినిమాలు పదహారో శతాబ్దంలో ఉండి మనం ఇరవయ్యో శతాబ్దంలో ఉండటంమూలాన సహజంగా కొన్ని చిక్కులు ఏర్పడతాయి మన జీవితానికీ, సినిమా లకూ

లంగరందదు రెండు తిత్తులూ వేరే వేరేగా ఉండటమే చాలా గొప్ప విషయం అని కొందరంటున్నారు కాని కొంచెం ఆలోచిస్తే ఇందువల్ల చాలా నష్టాలున్నాయి

ఒక నష్టం కళాస్వాదనకు సంబంధించినది కళలు ఇచ్చే అనుభూతికీ, జీవితానుభవానికీ ఏమీ సంబంధం లేకపోతే కళలు జీర్ణం కావు. వంటబట్టవు మొట్టమొదటిసారి మనం ఏ పాశ్చాత్య సంగీతమో, మోడర్న్ ఆర్టో అనుభవించినప్పుడిలాగే జరుగుతుంది అది మనకు సంగీతమేననీ, ఆర్టేననీ కూడా అనిపించదు పరిచితమైనా కూడా సర్కసులూ, ఇంద్రజాలాలూ రసానుభూతి నివ్వకపోవటానికి ఇదే కారణం రసానుభూతి లోపించిన కళానుభూతి నల్లమందులాగా ఇన్హిబిషన్ కలిగిస్తుంది కోడలుతో జగడమాడి పురాణం వినటానికి వెళ్ళిన ముసలిది కునికిపాట్లు పడుతుంది ఇన్హిబిషన్ లక్షణం

(నేనీ మాట అంటే ఒక సైకాలజిస్టు ఒప్పుకున్నాడు "మన సినిమాలలో పిల్లలు ఉలిక్కిపడే బాక్ గ్రౌండ్ మ్యూజిక్కూ, పాత్రలు అరవటమూ, ఏడవటమూ, పెద్ద పెట్టున పాటలూ, కోలాహలంగా డాన్సులూ లేని పక్షంలో ఇంటర్వల్ లోపల ప్రేక్షకులలో చాలామంది నిశ్చయంగా నిద్రపోతారు" అంటాడతను అందుచేత మన సినిమాలలో "ధ్వని" జాస్తిగా ఉన్నందుకు విమర్శకులు తప్పు పట్టటం సబబుకాదు షేక్స్పియరంతటివాడే తన యుగానికి సంబంధించని ఇతివృత్తాలతో నాటకాలు రాసి, ప్రేక్షకులు నిద్రపోకుండా ఉండటానికి రెండో అంకంలో పెద్ద పెద్ద చప్పుళ్ళు ఏర్పాటు చేశాడని విమర్శకులన్నారు మన ప్రొడ్యూసర్లనగా ఎంత ?)

ఈనాటి చిత్రాలతో వచ్చిన రెండో ఇబ్బంది సాధారణ మనస్తత్వానికి సంబంధించినది 'తినగ తినగ వేము తియ్యనుండు' నన్నాడు వేమనయోగి ఈ కాలపు సినిమాలలో చూడగా చూడగా, జీవితం అట్లాగే ఉంటుందన్న భ్రమ ఒకటి కలుగుతుంది నిత్య ప్రేక్షకుడికి దీన్నే పవర్ ఆఫ్ సజెశ్చన్ అంటారు

సినిమాలలో మనం చూసే పాత్రలు, అందులోనూ ప్రత్యేకించి ప్రధాన పాత్రలు, కేవలమూ మృణ్మయ పాత్రలు అవి. నిత్య జీవితంలో మనం చేసే పనులు ఏవీ చెయ్యవు కార్లలో తిరగటమూ, సైకిళ్ళమీద అమ్మాయిలను వెంబడించటమూ, డ్యూయెట్లు పాడటమూ, డాన్సులు చెయ్యటమూ, పరిస్థితి విషమిస్తే గంభీరంగా ఉప న్యాసాలు దంచటమూ సినిమా హీరోల సమగ్ర జీవితం హత్యా చిత్రాలయితే హీరో గుర్రపు సవారీ చెయ్యాలి, గంతలు కట్టుకోవాలి, పిస్తోళ్ళు పేల్చాలి, పరిగెత్తాలి, దూకాలి, ఒక్క పోటుతో డజనుమందిని పడగొట్టాలి, హీరోయిన్ను వాటేసుకోవాలి

హీరోయిన్ మామూలు పరిస్థితుల్లో సెక్సు ఒడ్చాలి, అమామూలు స్థితుల్లో కన్నీరు ఒడ్చాలి, బస్

కుర్రకారువాళ్ళు, యువతీయువకులు, ఇదే నిజమైన జీవితం అనుకున్న స్థితికి వచ్చాక వాళ్ళు ఈ ఇరవయ్యో శతాబ్దపు జీవితానికి తట్టుకోలేరు ఆ స్థితి రాకుండా ఉండాలంటే మన ప్రేక్షకులు ఈనాటి సినిమాలను సర్కసులను చూసినట్టు చూడటమూ, "ధ్వని" అంతగా లేనప్పుడు ఒక కునుకు తియ్యటమూ క్షేమం

"మిగిలినవన్నీ అబద్ధమైనా సెక్సు సార్వకాలికం గదా అది పుష్కలం సినిమాలలో ఉంటూనే ఉన్నదాయె" అని ఎవరన్నా అనవచ్చు

ప్రబంధాలలో సెక్సును నమ్మటం ఎంత ప్రమాదమో, ఈ సినిమా సెక్సును నమ్మటం కూడా అంత ప్రమాదమే ప్రబంధాలలో దంత క్షతాలూ, నఖక్షతాలూ పెట్టి సెక్సును రాక్షసంగా చిత్రించారు డ్యూయెట్లూ, మైథున నృత్యాలూ పెట్టి ఈనాటి చిత్రాలలో సెక్సును హాస్యాస్పదం చేస్తున్నారు (స్త్రీలను అర్ధనగ్నంగా చూపటం సెక్సు కిందికి వస్తుందనుకోను మన స్త్రీలు పదేసి మూళ్ళ చీరెల చాటున తమ అందాన్నీ, అనాకారితనాన్నీ కూడా దాచేస్తున్నారు మగవాళ్ళూ, ఆడవాళ్ళూ కూడా తమ శరీరాలను అందంగా ఉంచుకోవలిసిందే సినిమాల ప్రభావం వల్ల మన స్త్రీలు తమ దేహాలను అందంగా ఉంచుకోవటం జరిగితే అంతవరకైనా మనం వాటికి కృతజ్ఞత చూపవచ్చు )

ఇప్పుడు సమస్య ఏమిటంటే, ప్రబంధ యుగంలో ఉన్న ఈ సినిమా చిత్రాలను ఆధునిక యుగంలోకి చేరవేయటం సాధ్యం కాదా ? అది అసాధ్యం కాదు అందుకు "మినిమమ్ కండిషన్" ఏమంటే, సినిమా చిత్రాలు తీసేవాళ్ళు పూర్తిగా ఆధునిక సంస్కృతి కలవాళ్ళయి ఉండాలి వాళ్ళకు సినిమాలు తీయాలనిపించాలి, అన్ని హంగులూ వాళ్ళకు అమరాలి

ఇదంతా సాధ్యమయినా ప్రేక్షకులకు తమ వాస్తవ జీవితంపైన శ్రద్ధా ఆసక్తి లేకపోతే వాటిని వాళ్ళు చూడరు వ్యాపార దృష్ట్యా అటువంటి చిత్రాలు తీయటం ఆత్మహత్య అవుతుంది

నిజానికి సినిమాలకు ప్రత్యేక సమస్య లేదు ఈ దేశంలో కళల కన్నిటికీ ఉన్న సమస్యే సినిమాలలోనూ కొంతవరకు ద్యోతకమవుతున్నది మనది వాస్తవిక దృష్టిగల జాతి కాదు

మనం కార్యవాదులం కాము ఎవరిమటుకు వారు గత కాలంలో ఏదో ఒక ప్రాంతాన జీవిస్తున్నాం అందరూ ఎవరో తోలే వాహనాలలో ప్రయాణం చేస్తున్నారు అనేకమంది తమ రథాల పగ్గాలను తిరుపతి వెంకటేశ్వరుడి చేతిలో ఉంచారు కొందరు బాబాలపైన తమ జీవితభారం వేశారు ఈ జనాభాలో చాలా ఆధునికుల మనుకునేవాళ్ళు సైతం వివిధ రాజకీయ పార్టీలపైనే తమ ఆశలన్నీ పెట్టుకున్నారు తమ జీవితాలను తామే నడుపుకుంటున్న అత్యల్ప సంఖ్యాకులు అక్రమ మార్గాలు తొక్కి బాగుపడుతున్నారు (క్రమ మార్గాల బాగుపడే పథకాలు ఈనాటి జీవితంలో సాధ్యంకావు గనక ) జీవితమే పంచకూళ్ళ కషాయం లాగా, కుక్కల దొడ్డిలాగా, రొచ్చుగుంటలాగా ఉన్నది

దీని ఫలితంగా మన సంస్కృతి ఆధునిక కళారూపాల కేసిపోక, భరతనాట్యం కేసీ, కూచిపూడి భాగోతాల కేసీ, జానపద పాటలకేసీ పోతున్నది మన జాతి ఎంత వెనక్కు పోవటం సాధ్యమో చూడటానికి యత్నిస్తున్నది ఈ ప్రయత్నంలో మన సినిమాలు కూడా ఒక భాగమైతే మనం వాటిని తప్పు పట్టాలా ?

- విజయచిత్ర మాసపత్రిక
ప్రత్యేక సంచిక 1969

# 94B. నేటి చలనచిత్ర పరిశ్రమ

నేటి ప్రపంచంలో ప్రతి వస్తువుకూ ఒక సహజధర్మం ఉన్నది అది దాని స్వభావాన్ని బట్టి ఏర్పడుతుంది ఏ వస్తువు యొక్క ధర్మాన్ని అనుసరించి ఆ వస్తువు యొక్క కర్మ నడిచినట్టయితే లోకయాత్ర సవ్యంగా జరిగిపోతుంది అది జరగనప్పుడే జీవితం తారుమారై, ఒడుదుడుకు లేర్పడేది అలాంటప్పుడే పంటలు పండవలసిన క్షేత్రాలు బీళ్ళుగా ఉండిపోతాయి అప్రయోజకులు అధికారులౌతారు కృత్రిమ దారిద్ర్యమూ, కరువూ ఏర్పడతాయి ఇదే ధర్మగ్లాని, లేక అవ్యవస్థ

సినిమా రంగంలో కూడా అవ్యవస్థ ఉన్నది సినిమా చిత్రాల యొక్క స్వాభావిక ధర్మం సక్రమంగా అమలు జరగడం లేదు సినిమా చిత్రం యొక్క స్వభావం ఏమిటి?

1) అది ప్రజలకు అత్యంత సన్నిహితమైన కళాసాధనం పుస్తకాలలాగా అక్షరాస్యులకే పరిమితమైనది కాదు నాటకాలలాగా ఒక్కసారి కొద్దివందలమంది ప్రేక్షకులు మాత్రమే చూడదగినది కాదు ఒకే ట్రూపుతో ఒకే నాటకాన్ని ఊరూరా ఆడవచ్చు కాని ఏ రెండు ప్రదర్శనాలూ ఒకటిగా వుండవు సినిమా చిత్రం అలా కాదు దాన్ని ఎన్నిచోట్ల ప్రదర్శించి, ఎంత కాలం మీద ఆడి, ఎన్ని కోట్లమంది చూసినా - అందరు చూసేదీ ఒకే ప్రదర్శనం అందులో పాత్రధారణ చేసిన నటులు ముసలివారు కావచ్చు, చనిపోవచ్చు కాని ఆ ప్రదర్శనం శాశ్వతంగా అలాగే నిలబడిపోతుంది నాటకానికీ సినిమాకూ ఈ విషయంలో ఉండే తేడా గ్రహించటానికి ఒక్క ఉదాహరణ చాలు "పరమానందయ్య శిష్యులు" 15 కేంద్రాలలో శతదినోత్సవం చేసుకున్నదంటే రోజుకు రెండాటల చొప్పునే లెక్కకట్టినా 3 వేల ప్రదర్శనాలయాయి ఏ నాటక సమాజమూ నూరు రోజుల లోపుగా 3 వేల ప్రదర్శనాలు 15 ఊళ్ళలో ఇవ్వలేదు

2) సినిమా చిత్రం చూపినంత వాస్తవికతను మరే కళా సాధనమూ చూపలేదు నదులూ, సముద్రాలూ, కొండలూ, కారు ప్రయాణాలూ, గుర్రపు స్వారీలూ, గృహ దహనాలూ- ఒకటేమిటి ? ప్రతిదీ సినిమాలలో ప్రత్యక్షంగా చూపవచ్చు, నాటకం చూసే ప్రేక్షకులు వీటిని ఊహించుకోవలసిందే కాని కళ్ళారా రంగ స్థలాన చూడలేరు

పై రెండు గుణాలను బట్టి సినిమా కళ ప్రజలకు అత్యంత సన్నిహితమైన వాస్తవిక కళగా రూపొందాలి అది దాని ధర్మం ఆ ధర్మం కొనసాగకపోవుటయే సినిమా రంగంలో ఉంటున్న అవ్యవస్థకు కారణం అందుకు కారణం పరిస్థితులు ఈ 35 ఏళ్ల మీదటా పరిస్థితులు ఎంతగానో మారుతూ వచ్చినా, పూర్తిగా సినిమా కళకు అనుకూలంగా ఎన్నడూ మారనేలేదు

గడచిన 35 ఏళ్ళ కాలంలో సినిమారంగంలో పరిస్థితులు ఎలా ఎలా మారుతూ వచ్చినదీ స్థూలంగా జ్ఞాపకం చేసుకుందాం వీటిని గురించి మాట్లాడుకునే ముందు గమనించవలసిన అతి ముఖ్యమైన విషయం ఏమిటంటే ఏ ఇతర కళాసాధనం కన్న కూడా సినిమా అత్యంత అధునాతనమైన సాంకేతిక ప్రావీణ్యతతో కూడుకున్నది సినిమా చిత్రం తయారు చెయ్యటానికి కావలసిన కెమెరాలూ, శబ్ద గ్రహణ యంత్రాలూ, విద్యుత్పరికరాలూ,

దసాగారు వాస్తవ జీవితం దుఃఖభాజనమైనది, సినిమా చిత్రాలు ప్రజలకు ఆ జీవితాన్ని జ్ఞాపకం ఉండకుండా చెయ్యాలి, అది వాటి పరమ ప్రయోజనం

ఈ దృక్పథాన్ని మనం సరిగా పరిశీలించినట్టయితే, సినిమా చిత్రాలు యుద్ధానంతర కాలంలో పొందిన జయాపజయాలు రెండూ అర్థమవుతాయి సినిమాల స్వభావం గురించి మనం మొదట చెప్పుకున్న రెండు అంశాలలో ఒకటి - సినిమాలు ప్రజలకు అత్యంత సన్నిహితమైన కళా సాధనం అనేది - గొప్ప విజయాన్ని సాధించింది ఎందుకంటే అది వ్యాపార దృష్టికి అనుకూలమైనది చిత్రాలకయే వ్యయం పెరిగిన కొద్దీ సినిమాలు చూసేవారి సంఖ్యా, థియేటర్ల సంఖ్యా పెరగాలి, అందుకుగాను అధిక సంఖ్యాకులను ఆకర్షించే చిత్రాలు తీయాలి ఈ ఆశయాలు అమలు జరిగాయి.

కాని సినిమాలకు స్వభావసిద్ధమైన "వాస్తవికత దెబ్బతిని, క్రమంగా మృగ్యమై పోయింది బ్రహ్మ సృష్టికి ప్రతిసృష్టి అన్నట్టుగా సినిమాలలో ఒక కృత్రిమ జీవితమూ, కృత్రిమ సమస్యలూ, కృత్రిమ ప్రణయమూ, కృత్రిమ వ్యక్తి సంబంధాలూ, భయంకరమైన కళా సృష్టి అవతరించాయి

తెర వెనక సినిమాకారుల బాధ్యతలలో కూడా అస్తవ్యస్తం ఏర్పడింది ఇతివృత్తాలకు ప్రాముఖ్యం పోయింది పాత్రల స్థానాన్ని తారలు ఆక్రమించారు, డైరెక్టరు బాధ్యతలు సన్నగిల్లాయి ప్రొడ్యూసరుకు ఏ అనుభవమూ, అర్హతా అవసరం లేకుండా పోయింది చిత్రానికి రూపం ఇచ్చే బాధ్యతను చాలా వరకు నటులే పుచ్చేసుకుని, డైరెక్టరును టెక్నీషియనులకు పెద్దగా ఉంచేశారు దాంతో సహజంగా సినిమా చిత్రాల సాంకేతిక స్వభావం కూడా మారిపోయింది

యుద్ధానికి పూర్వం పౌరాణిక చిత్రాలు తీసేవాళ్ళకన్న సాంఘిక చిత్రాలు తీసేవాళ్ళు హెచ్చు కళాదృష్టి గలవారుగా చలామణీ అయేవారు యుద్ధానంతర కాలంలో అశేష ప్రేక్షక జనాన్ని ఆకర్షించటానికి జానపద చిత్రాలు వచ్చాయి సాంఘిక చిత్రాలలో ఆర్థికంగా దెబ్బతిని, "మాయలోకం" తీసి, అలా చేసినందుకు సిగ్గుపడినవాడు రామబ్రహ్మంగారొక్కడే నాకు కనిపించాడు అటు తరువాత జానపద చిత్రాలు తీసినవాడే మేటి నిర్మాత అయాడు ఖర్చు తగ్గించుకుందామనుకున్నవాడు మాత్రమే సాంఘికం తీశాడు

కాలచక్రం ఒక చుట్టు తిరిగింది పౌరాణిక చిత్రాలు మళ్ళీ పైకి వచ్చాయి ఈనాడు పౌరాణికాలూ, సాంఘికాలూ, జానపదాలూ, అనే తేడా ఆటే లేదు సాంఘిక చిత్రాలలో కూడా పౌరాణిక లక్షణాలు కొల్లలుగా ఉంటున్నాయి కొన్ని సాంఘిక చిత్రాలు కాస్ట్యూమ్స్ లేని జానపదాలలాగా ఉంటున్నాయి

ఈనాడు న్యూనత ఏమైనా ఉంటే అది స్టంటు చిత్రాలకుంటున్నది కాని స్టంటు చిత్రాలు మిగిలిన అన్ని చిత్రాలనూ తలదన్నే సూచనలు కనిపిస్తున్నాయి ఘరానా నిర్మాతలు కొంత కాలంగా ఈ స్టంటు చిత్రాలను కొంచెం ఈసుగా చూస్తున్నారు

- జయశ్రీ మాసపత్రిక
దీపావళి సంచిక 1970

దసాగారు వాస్తవ జీవితం దుఃఖభాజనమైనది, సినిమా చిత్రాలు ప్రజలకు ఆ జీవితాన్ని జ్ఞాపకం ఉండకుండా చెయ్యాలి, అది వాటి పరమ ప్రయోజనం

ఈ దృక్పథాన్ని మనం సరిగా పరిశీలించినట్టయితే, సినిమా చిత్రాలు యుద్ధానంతర కాలంలో పొందిన జయాపజయాలు రెండూ అర్థమవుతాయి సినిమాల స్వభావం గురించి మనం మొదట చెప్పుకున్న రెండు అంశాలలో ఒకటి - సినిమాలు ప్రజలకు అత్యంత సన్నిహితమైన కళా సాధనం అనేది - గొప్ప విజయాన్ని సాధించింది ఎందుకంటే అది వ్యాపార దృష్టికి అనుకూలమైనది చిత్రాలకయ్యే వ్యయం పెరిగిన కొద్దీ సినిమాలు చూసేవారి సంఖ్యా, థియేటర్ల సంఖ్యా పెరగాలి, అందుకుగాను అధిక సంఖ్యాకులను ఆకర్షించే చిత్రాలు తీయాలి ఈ ఆశయాలు అమలు జరిగాయి.

కాని సినిమాలకు స్వభావసిద్ధమైన "వాస్తవికత దెబ్బతిని, క్రమంగా మృగ్యమై పోయింది బ్రహ్మ సృష్టికి ప్రతిసృష్టి అన్నట్టుగా సినిమాలలో ఒక కృత్రిమ జీవితమూ, కృత్రిమ సమస్యలూ, కృత్రిమ ప్రణయమూ, కృత్రిమ వ్యక్తి సంబంధాలూ, భయంకరమైన కళా సృష్టి అవతరించాయి

తెర వెనక సినిమాకారుల బాధ్యతలలో కూడా అస్తవ్యస్తం ఏర్పడింది ఇతివృత్తాలకు ప్రాముఖ్యం పోయింది పాత్రల స్థానాన్ని తారలు ఆక్రమించారు, డైరెక్టరు బాధ్యతలు సన్నగిల్లాయి ప్రొడ్యూసరుకు ఏ అనుభవమూ, అర్హతా అవసరం లేకుండా పోయింది చిత్రానికి రూపం ఇచ్చే బాధ్యతను చాలా వరకు నటులే పుచ్చేసుకుని, డైరెక్టరును టెక్నీషియనులకు పెద్దగా ఉంచేశారు దాంతో సహజంగా సినిమా చిత్రాల సాంకేతిక స్వభావం కూడా మారిపోయింది

యుద్ధానికి పూర్వం పౌరాణిక చిత్రాలు తీసేవాళ్ళకన్న సాంఘిక చిత్రాలు తీసేవాళ్ళు హెచ్చు కళాదృష్టి గలవారుగా చలామణీ అయేవారు యుద్ధానంతర కాలంలో అశేష ప్రేక్షక జనాన్ని ఆకర్షించటానికి జానపద చిత్రాలు వచ్చాయి సాంఘిక చిత్రాలలో ఆర్థికంగా దెబ్బతిని, "మాయలోకం" తీసి, అలా చేసినందుకు సిగ్గుపడినవాడు రామబ్రహ్మంగారొక్కడే నాకు కనిపించాడు అటు తరువాత జానపద చిత్రాలు తీసినవాడే మేటి నిర్మాత అయాడు ఖర్చు తగ్గించుకుందామనుకున్నవాడు మాత్రమే సాంఘికం తీశాడు

కాలచక్రం ఒక చుట్టు తిరిగింది పౌరాణిక చిత్రాలు మళ్ళీ పైకి వచ్చాయి ఈనాడు పౌరాణికాలూ, సాంఘికాలూ, జానపదాలూ, అనే తేడా ఆటే లేదు సాంఘిక చిత్రాలలో కూడా పౌరాణిక లక్షణాలు కొల్లలుగా ఉంటున్నాయి కొన్ని సాంఘిక చిత్రాలు కాస్ట్యూమ్స్ లేని జానపదాలలాగా ఉంటున్నాయి

ఈనాడు న్యూనత ఏమైనా ఉంటే అది స్టంటు చిత్రాలకుంటున్నది కాని స్టంటు చిత్రాలు మిగిలిన అన్ని చిత్రాలనూ తలదన్నే సూచనలు కనిపిస్తున్నాయి ఘరానా నిర్మాతలు కొంత కాలంగా ఈ స్టంటు చిత్రాలను కొంచెం ఈసుగా చూస్తున్నారు

- జయశ్రీ మాసపత్రిక
దీపావళి సంచిక 1970